టచే 'ఉత్ + త్ + థానమ్' = 'ఉత్త్థానమ్' అనియు 'ఉత్ + త్ + తమ్భనమ్' 'ఉత్త్తమ్భనమ్' అనియు రూపము లేర్పడును.

75. ఝయో హోఽన్యతరస్యామ్. 8.4.62

ఝయః పరస్య హస్య వా పూర్వసవర్ణః, నాదస్య, ఘోషస్య, సంవారస్య, మహాప్రాణస్య హస్య తాదృశో వర్గచతుర్థః – వాగ్ఘరిః, వాగ్హరిః.

'ఉదః స్థాస్తమ్భోః పూర్వస్య' 'అనుస్వారస్య యయి పరసవర్ణః' అను సూత్రమునుండి 'పూర్వస్య' 'సవర్ణః' అను పదములు అనువర్తించును. ఝయ్‌కంటె పర మగు హకారమునకు వికల్పముగ పూర్వసవర్ణము ఆదేశ మగును.

వాగ్ఘరిః:- 'వాగ్ + హరిః'. ఇచట 'ఝయ్' అగు గకారముకంటె పర మగు హకారమునకు గకారసవర్ణ మగు వర్ణము రావలెను. గకారమునకు కవర్గమునకు జెందిన ఐదు వర్ణములును సవర్ణములే. కాని 'స్థానేఽన్తరతమః' అను సూత్రము (17) ననుసరించి స్థాని యగు హకారమునకు బాహ్యయత్న సామ్యముచే కూడ సావర్ణ్యము గల వర్ణ మేదైన ఈ ఐదు వర్ణములలో నున్నదా యని పరిశీలించినచో అట్టి వర్ణము ఘకార మొక్కటియే యున్నది. హకారమునకు నాద, ఘోష, సంవారమహాప్రాణయత్నములు. ఘకారమునకు గూడ నవియే యత్నములు. కావున హకారమునకు ఘకారము వచ్చుటచే 'వాగ్ఘరిః' అను రూపము సిద్ధించును. పూర్వసవర్ణాదేశము వైకల్పికము గాన 'వాగ్హరిః' అను ద్వితీయ రూప మగును.

76. శశ్ఛోఽటి. 8.4.63

ఝయః పరస్య శస్య ఛో వాఽటి. 'తద్ + శివః' ఇత్యత్ర దస్య శ్చుత్వేన జకారే కృతే 'ఖరి చ' ఇతి జకారస్య చకారః, తచ్ఛివః; తచ్ శివః.

'ఝయోహోఽన్యతరస్యామ్' నుండి 'ఝయః', 'అన్యతరస్యామ్' అనువర్తించును. 'ఝయ్'కంటె పర మగు శకారమునకు 'అట్' పర మగు నపుడు వికల్పముగ ఛకారము ఆదేశమగును.

తచ్ఛివః:- 'తద్ + శివః' ఇచట మొదట దకారమునకు శ్చుత్వముచే జకారమును, మరల 'ఖరి చ' అను సూత్రముచే (74) చర్త్వము చేయగా జకారమునకు చకార మాదేశమై 'తచ్ + శివః' అను రూపము సిద్ధించును. ఇచట 'ఝయ్' (చ్) కంటె పర మగు శకారమునకు అట్ (ఇ) పర మగుటచే ఈసూత్రముచే ఛత్వము వచ్చును. తచ్ + ఛివః = 'తచ్ఛివః' అను రూపము సిద్ధించును. ఛత్వము రానిచో 'తచ్శివః' అను రూపము సిద్ధించును. (శ్చుత్వ చర్త్వ ఛత్వవిధాయక సూత్రములన్నియు త్రిపాదిలోనివి. అందు ఛత్వవిధాయకసూత్రము పరసూత్ర మగుటచే అసిద్ధము గాన ముందుగనే దకారమునకు శ్చుత్వచర్త్వములు చేసి పిమ్మట శకారమునకు ఛత్వము చేయవలెను).

## 77. మోఽనుస్వారః 8.3.23

మాన్తస్య పదస్యానుస్వారో హలి. హరిం వన్దే.

'పదస్య' అధికృతము. 'హలి సర్వేషామ్' నుండి 'హలి' అనువర్తించును మకారాంత మగు పదమునకు హల్లు పర మగునపుడు అనుస్వారము ఆదేశమగును. 'అలోన్త్యస్య' అను పరిభాషచే (31) ఈ యనుస్వారము అంత్యాక్షర స్థానమున వచ్చును.

'హరింవన్దే':- హరిమ్ + వన్దే. ఇచట 'హరిమ్' అను పదాంతము నందలి మకారమునకు హల్లగు 'వ'కారము పర మగుటచే అనుస్వార మాదేశమై 'హరిం వన్దే' అను ప్రయోగము సిద్ధించినది.

## 78. నశ్చాపదాన్తస్య ఝలి 8.3.24

నస్య మస్య చాఽపదాన్తస్య ఝల్యనుస్వారః. యశాంసి; ఆక్రంస్యతే, ఝలి కిమ్? మన్యసే.

'మోఽనుస్వారః' నుండి 'మః' 'అనుస్వారః' అనువర్తించును. అపదాంత మగు నకారమకారములకు ఝల్ పర మగునపుడు అనుస్వారమాదేశమగును.

యశాంసి:- యశాన్ + సి. ఇచట అపదాన్త మగు నకారమునకు ఝల్ (సకారము) పర మగుటచే అనుస్వారాదేశము వచ్చి 'యశాంసి' అను రూపము సిద్ధించును.

'ఆక్రంస్యతే':- ఆక్రమ్ + స్యతే. ఇచట పదమధ్యస్థ మగు మకార మునకు ఝల్ పర మగుటచే అనుస్వారాదేశము. 'ఆక్రంస్యతే' అను రూపము సిద్ధించును.

'ఝలి' యని యననేల? అట్లనకున్నచో 'మన్యసే' అనుచో దోషము వచ్చును. ఈ పదమున పదమధ్యగత మగు నకారమునకు ఝల్ పరము కాకుండుటచే అనుస్వారము రాలేదు. యకారము ఝల్ కాదు.

79. అనుస్వారస్య యయి పరసవర్ణః 8.4.58

స్పష్టమ్ శాన్తః.

అనుస్వారమునకు యయ్ పర మగునపుడు పరసవర్ణ మగు వర్ణ మాదేశ మగును.

శాన్తః:- క్త ప్రత్యయాంత మగు 'శమ్'ధాతువునందలి పదమధ్యగత మకారమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే అనుస్వారము వచ్చుటచే 'శాం-త అని యుండగా ఈ సూత్రముచే అనుస్వారకు పరసవర్ణము. పర మగు తకారమునకు సవర్ణము లగు ఐదు వర్ణములలో ఆనునాసిక్యసామ్యముచే నకారము అనుస్వారకు అంతరతమము గాన నకారము వచ్చును. 'శాన్ + త' 'శాన్తః' అను రూప మగును.

80. వా పదాన్తస్య. 8.4.59

త్వఙ్కరోషి; త్వంకరోషి.

వెనుకటి సూత్ర మనువర్తించును. పదాంత మగు అనుస్వారకు యయ్ పర మగునపుడు పరసవర్ణము వికల్పముగ వచ్చును.

త్వమ్ + కరోషి:- ఇచట పదాన్తగత మగు 'మ'కారమునకు యయ్పర మగుటచే పరవర్ణ మగు కకారమునకు సవర్ణము, అనునాసికమును నైన ఙకార మాదేశమై 'త్వఙ్కరోషి'అనియు. పరసవర్ణము వైకల్పిక మగుటచే తదభావపక్షమున 'మోనుస్వారః' అను సూత్రముచే (77) అనుస్వార రాగా 'త్వం కరోషి'యనియు ప్రయోగములు సిద్ధించును.

81. మో రాజి సమః క్వౌ. 8.3.25

క్విబన్తే రాజతౌ పరే సమో మస్య మ ఏవ స్యాత్. సమ్రాట్.

'మోనుఽస్వారః' నుండి 'మః' అనువర్తించును. 'సమ్'అను ఉప

సర్గకు క్విప్ప్రత్యయాంత మగు 'రాజ్'ధాతువు పర మగునపుడు (ఉపసర్గాంత మున నున్న)మకారమునకు మకారమే వచ్చును.

ఈ సూత్రము 'మోఽనుస్వారః'అనుదానికి (77) అపవాదము.

సమ్రాట్:- సమ్ + రాట్.'రాట్'అనునది'రాజ్'ధాతువునకు క్విప్ ప్రత్యయము చేర్చుటచే సిద్ధించిన రూపము. ఇదిపరమగునపుడు'సమ్'నందలి మకారము అటులనే యుండి 'సమ్రాట్' అను రూపము సిద్ధించినది.

82. హే మపరే వా. 8.3.26

మపరే హకారే పరే మస్య మో వా.కిమ్ హ్మలయతి, కిం హ్మలయతి.

'మోఽనుస్వారః' 'మో రాజి సమః క్వౌ'అను సూత్రములనుండి'మః' 'మః'అనువర్తించును. మకారము పరముగా గల హకారము పర మగునపుడు మకారమునకు వికల్పముగా మకారము వచ్చును.

కిమ్హ్మలయతి:- ఇచట మకారమునకు మకారపరక మగు హకారము పర మగుటచే ఈ సూత్రముచే వైకల్పికముగ మకారము వచ్చి 'కిమ్హ్మలయతి' అను రూపము, మకారము రాని పక్షమున 'మోఽనుస్వారః'అను సూత్రముచే (77) అనుస్వారము వచ్చి 'కిం హ్మలయతి'అను రూపమును నిష్పన్న మగును.

వా. యవలపరే యవలా వా.

కిఁయ్హ్యః, కింహ్యః, కిఁవ్హ్వలయతి, కింహ్వలయతి కిఁల్ హ్లాదయతి; కింహ్లాదయతి.

మకారమునకు 'యవల'లు పరముగా గల హకారము పర మగునపుడు వికల్పముగ 'యవల'లు వచ్చును.

కిఁయ్హ్యః:- ఇచట హకారమునకు యకారము పరముగ నున్నది. అట్టి హకారము పర మగుటచే మకారమునకు యకారము వచ్చును. స్థాని యగు మకారము అనునాసికవర్ణ మగుటచే యకారము కూడ అనునాసికమే వచ్చి కిఁయ్హ్యః'అను రూపము సిద్ధించును.

'కిమ్ + హ్వలయతి' 'కిమ్ + హ్లాదయతి' అను నుదాహరణములలో గూడ పూర్వోక్త ప్రక్రియనే అనుసరించునది. ఈ మూడు ఉదాహరణములందును

'యవల'లు రాని పక్షమున 'మోఽనుస్వారః'అను సూత్రముచే (77) అనుస్వారము వచ్చి 'కింహ్యః' ఇత్యాదిరూపము లగును.

83. నపరే నః. 8.3.27

నపరే హకారే మస్య నో వా. కిన్హ్నుతే, కింహ్నుతే

'హే మపరే వా' 'మో రాజి సమః క్వౌ, అను సూత్రములనుండి 'హే''వా''మః' అనువర్తించును. నకారము పరముగా గల హకారము పర మగునపుడు మకారమునకు వికల్పముగ నకారము వచ్చును.

కిమ్హ్నుతే:- ఇచట మకారమునకు నకారపరక మగు హకారము పర మగుటచే నకార మాదేశమై 'కిన్ హ్నుతే' అను రూపము, నకారాభావ పక్షమున 'మోఽనుస్వారః'అను (77) అనుస్వారచే 'కింహ్నుతే' అను రూపమును సిద్ధించును.

84. ఆద్యన్తౌ టకితౌ. 1.1.46

టిత్కితౌ యస్యోక్తౌ తస్య క్రమాదాద్యన్తావయవౌ స్తః.

ఇదిపరిభాషాసూత్రము. 'టిత్''కిత్'అనునవి దేనికి ఆగమములుగ విధింపబడినవో దానికి క్రమముగ ఆద్యవయవముగను అన్తావయవముగను వచ్చును. టిత్తు ఆద్యవయవముగను కిత్తు అంతావయవముగను వచ్చును.

85. ఙ్ణోః కుక్ టుక్ శరి 8.3.28

వా స్తః.

'హే మపరే వా' నుండి 'వా' అనువర్తించును. ఙకారణకారములకు శర్ పరమగునపుడు 'కుక్''టుక్'అను నాగమములు వచ్చును.

'కుక్''టుక్'లలోని 'ఉ''క్'లు ఇత్సంజ్ఞకములు. అనగా కకారము మాత్రము శేషించును.

'ప్రాఙ్ + షష్ఠః' 'సుగణ్ + షష్ఠః' ఇచట ఙకారణకారములకు శర్ పరముగ నున్నది గాన ఙకారమునకు 'కుక్'ణకారమునకు 'టుక్'అను ఆగమములు వచ్చును. ఈ రెండును కిత్తులు గాన పూర్వసూత్రము ననుసరించి స్థానికి అన్తావయవముగ వచ్చుటచే 'ప్రాఙ్ + క్ + షష్ఠః' 'సుగణ్ + ట్ + షష్ఠః'అని యుండగా:-

వా. చయో ద్వితీయాః శరి పౌష్కరసాదేరితి వాచ్యమ్

ప్రాఙ్ఖ్షష్ఠః, ప్రాఙ్క్షష్ఠః, ప్రాఙ్ షష్ఠః, సుగణ్ఠ్షష్ఠః సుగణ్ట్షష్ఠః, సుగణ్ షష్ఠః.

శర్ పర మగునపుడు చయ్లం (వర్గప్రథమాక్షరముల) స్థానమున పౌష్కరసాద్యాచార్యుని మతము ననుసరించి (వికల్పముగా) ద్వితీయవర్ణములు ఆదేశము లగు నని చెప్పవలెను.

పై ఉదాహరణములయందు కకారటకారములకు శర్ పరముగా నుండుటచే వికల్పముగ నీ వార్తికముచే ఖకారఠ కారములు వచ్చి 'ప్రాఙ్ఖ్షష్ఠః' 'సుగణ్ఠ్షష్ఠః' అను రూపము లగును. కుక్టుగాగమములు వైకల్పికము లగుటచే 'ప్రాఙ్షష్ఠః' 'సుగణ్షష్ఠః' అను రూపము లుండును. కకారషకారములు సంయుక్తము లగునపుడు 'క్ష'యగును గాన 'ప్రాఙ్ + క్ + షష్ఠః' అనునది 'ప్రాఙ్క్షష్ఠః' అని యైనది.

86. డః సి ధుట్ 8.3.29

డాత్పరస్య సస్య ధుడ్వా. షట్త్సన్తః, షట్సన్తః.

'హే మపరే వా' నుండి 'వా' అనువర్తించును. డకారముకంటె పర మగు సకారమునకు 'ధుట్' అను ఆగమము వచ్చును.

షడ్ + సన్తః-ఇచట డకారోత్తరవర్తి యగు సకారమునకు 'ధుట్' ఆగమము 'టిత్' అగుటచే ('ధుట్'లోని 'ఉ' 'ట్'లు ఇత్సంజ్ఞకములు) ఆద్యవయముగ వచ్చును. 'షడ్ + ధ్ + సన్తః' అని యుండగా 'ఖరిచ' అను సూత్రము (74)చే 'ధ'కారమునకు చర్త్వముచే 'త'కారము. పిమ్మట ఖర్ (తకారము) పర మగుటచే డకారమునకు చర్త్వముచే టకారము వచ్చి 'షట్ + త్ + సన్తః' 'షట్త్సన్తః' అని యగును. 'ధుట్'రాని పక్షమున 'డ'కారమునకు చర్త్వముచే టకారము వచ్చి 'షట్సన్తః' అను రూప మగును.

87. నశ్చ 8.3.30

నాన్తాత్ పరస్య సస్య ధుడ్వా. సన్త్సః; సన్సః

'డః సి ధుట్' 'హే మపరే వా' అను సూత్రములనుండి 'సి' 'ధుట్' 'వా'

అనువర్తించును. నకారాన్తముకంటె పర మగు సకారమునకు వికల్పముగ 'ధుట్' అను ఆగమము వచ్చును.

సన్ + సః-ఇచట నకారముకంటె పర మగు సకారమునకు ఆద్యవయవముగ 'ధుట్'ఆగమము వచ్చుటచే 'సన్ + ధ్ + సః' అని యుండగా ధకారమునకు చర్త్వముచే తకారము వచ్చి 'సన్త్స' అను రూపమును 'ధుట్' రాని పక్షమున 'సన్సః' అను రూపమును సిద్ధించును.

## 88. శి తుక్ 8.3.31

పదాన్తస్య నస్య శే పరే తుగ్ వా. సఞ్ఛమ్భుః, సఞ్చ్ఛమ్భుః, సఞ్చ్శమ్భుః, సఞ్శమ్భుః.

'నశ్చ' 'హే మపరే వా' అను సూత్రములనుండి 'నః' 'వా' అనువర్తించును. 'పదస్య' అధికృతము. పదాంత మగు నకారమునకు శకారము పర మగు నపుడు 'తుక్' అను నాగమము వికల్పముగ వచ్చును. 'తుక్'లోని'ఉ''క్'లు ఇత్సంజ్ఞకములు. ఈఆగమము 'కిత్' అగుటచే స్థానికి అన్తావయవముగ వచ్చును (సూ. 84)

సన్ + శమ్భుః- ఇచట పదాంతనకారమునకు శకారము పర మగుటచే తుగాగమముచే-'సన్ + త్ + శమ్భుః' శ్చుత్వముచే తకారమునకు చకారము— సన్ + చ్ + శమ్భుః; నకారమునకు చకారయోగముచే శ్చుత్వముచే ఞకారాదేశము -'సఞ్ + చ్ + శమ్భుః'; 'శశ్ఛోఽటి' అను సూత్రము (76)చే శకారమునకు ఛకారము—'సఞ్ + చ్ + ఛమ్భుః' ఇచట 'ఝరో ఝరి సవర్ణే' అను సూత్రముచే (73) చకారమునకు లోపము వచ్చిన పక్షమున 'సఞ్ ఛమ్భుః' అనియు, లోపము రాని పక్షమున 'సఞ్చ్ఛమ్భుః' అనియు రెండు రూపములు. తుగాగమము చేసి పైన చూపిన విధమున లోపము చేసినను, తుగాగము రాని పక్షమునను గూడ 'సఞ్ ఛమ్భుః'అనియే రూపము. తుగాగమము చేసి శకారమునకు ఛత్వము చేయని పక్షమున 'సఞ్చ్ శమ్భుః' అను మూడవ రూప మగును. తుగాగమఛత్వములు రెండును జేయని పక్షమున నకారమునకు శ్చుత్వము చేయగా 'సఞ్ శమ్భుః' అను నాల్గవరూపము సిద్ధించును.

ఈ రూపచతుష్టయమును జూపుచు ఈ క్రింది కారిక సిద్ధాంతకౌముదిలో నీయబడినది:-

'ఙచౌ ఙచఛా ఙచశా ఙశావితి చతుష్టయమ్.
రూపాణామిహ తుక్ఛత్వం చఛోపానాం వికల్పనాత్.

89. ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్ 8.3.32

హ్రస్వాత్పరో యో ఙమ్, తదన్తం యత్పదం, తస్మాత్పరస్యాచో ఙముట్, ప్రత్యఙ్ఙాత్మా. సుగణ్ణీశః. సన్నచ్యుతః.

ఙమః, హ్రస్వాత్, అచి, ఙముట్, నిత్యమ్. 'పదస్య'అధికృతము.

హ్రస్వముకంటె పర మగు'ఙమ్' (ఙణన) అంతమందు గల పదమునకు పరముగా నున్న అచ్చునకు 'ఙముట్' (ఙణన)ఆగమమువచ్చును.

ఙముట్'లోని 'ఙమ్' అనునది ఙ్,ణ్,న్,అను మూడు వర్ణముల ప్రత్యాహారము. ఙమ్ అనుదాని చివర నున్న 'ఉట్'అను దానివి ప్రత్యేకవర్ణమునకు సంబంధింపచేయుటచే 'ఙుట్''ణుట్''నుట్'అను నాగమములను చెప్పినట్లగును.

'ఙముట్'లోని 'ఉట్'లు ఇత్సంజ్ఞకములు. ఈ యాగమము టిత్తు గాన అచ్చునకు ఆద్యవయవముగ వచ్చును.

ప్రత్యఙ్ + ఆత్మా-ఇచట హ్రస్వ మగు యకారోత్తరవర్తి యగు ఙకారము పదాన్తమునందున్నది. కావున ఈ పదమునకు పర మగు 'ఆ'అను అచ్చునకు ఙకార మాదేశమై 'ప్రత్యఙ్ఙాత్మా' అను రూపము సిద్ధించినది. ఇట్లే 'సుగణ్ + ఈశః''సన్ + అచ్యుతః'అను నుదాహరణములందు ణకారనకారములకంటెపరమగు 'ఈ'కార'అ'కారములకు ణకారనకారములు ఆద్యవయవాగమములుగ వచ్చుటచే 'సుగణ్ణీశః''సన్నచ్యుతః' అను రూపములు సిద్ధించును. ఇచట ఙకారణకారనకారోత్తరవర్తు లగు అచ్చులకు యథాసంఖ్యసూత్రముచే వరుసగ ఙకారణకారనకారములు వచ్చినవి.

90. సమః సుటి 8.3.5

సమో రుః సుటి.

'మతువసో రు సంబుద్ధౌ' నుండి 'రు' అనువర్తించును. 'సమ్'నకు సుట్ పర మగునపుడు 'రు' వచ్చును.

'అలోన్త్యస్య'అను పరిభాషచే (21) 'సమ్'అను ఉపసర్గయందలి యంత్యవర్ణ మగు మకారమున కీ యాదేశము వచ్చును.

'సమ్' పూర్వకకృఞ్ ధాతువునకు "సంపరిభ్యాం కరోతౌ భూషణే" అను సూత్రముచే (684) 'సుట్' అను ఆగమము విధింపబడినది. కావున 'సమ్ + స్కర్తా' అను నుదాహరణమున 'సుట్' పర మగుటచే 'సమ్' నందలి మకారము నకు 'రు' ఆదేశము వచ్చి 'సరు + కర్తా' అని యుండగా:-

91. అత్రానునాసికః పూర్వస్య తు వా. 8.3.2

అత్ర రుప్రకరణే రోః పూర్వస్యానునాసికో వా.

ఈ రుప్రకరణమున రుకంటె పూర్వమునం దున్న వర్ణమునకు వికల్పముగ అనునాసికము వచ్చును.

ఈ సూత్రముచే 'రు'కు పూర్వమునం దున్న అకారమునకు అనునాసికము వచ్చుటచే 'సఁరు + స్కర్తా' అని యుండును. ఈ అనునాసికము రాని పక్షమున:-

92. అనునాసికాత్పరోఽనుస్వారః. 8.3.4

అనునాసికం విహాయ రోః పూర్వస్మాత్ పరోఽనుస్వారాగమః స్యాత్.

'అత్రానునాసికః పూర్వస్య తు వా' నుండి 'పూర్వస్య' అనువర్తించును. అనునాసికము రాని పక్షమున 'రు'కు పూర్వమునం దున్న వర్ణమునకు పరమై అనుస్వారాగమము వచ్చును.

ఈ సూత్రముచే 'రు'కు పూర్వమునం దున్న అకారమునకు పరమై అనుస్వార వచ్చుటచే 'సంరు + స్కర్తా' అని యుండును. 'రు'లోని ఉకారము ఇత్సంజ్ఞక మగుటచే 'సఁర్ + స్కర్తా' 'సంర్ + స్కర్తా' అని యుండగా:-

93. ఖరవసానయోర్విసర్జనీయః 8.3.15

ఖరి అవసానే చ పదాన్తస్య రేఫస్య విసర్గః

'పదస్య' అధికృతము. "రో రి" నుండి 'రః' అనువర్తించును. పదాంతమునందలి రేఫకు 'ఖర్', లేక, అవసానము పర మగునపుడు విసర్గము వచ్చును.

పై ప్రయోగములలో రేఫకు 'ఖర్' (సకారము) పర మగుటచే విసర్గము రాగా 'సఁః + స్కర్తా' 'సంః + స్కర్తా' అని యగును. ఇచట 'విసర్జనీయస్య సః' అను సూత్రముచే (103) విసర్గకు సకారము వచ్చుటకు అవకాశ

మున్నది గాని దాని కపవాదసూత్ర మగు 'వా శరి' అనుదానిచే (104) వైకల్పిక సకారము వచ్చును. కావున నిత్యసకారసిద్ధికై ఈ క్రింది వార్తికము చెప్పబడు చున్నది:-

వా. సంపుంకానాం సో వక్తవ్యః.

సంస్స్కర్తా, సంస్స్కర్తా.

'సమ్' 'పుమ్' 'కాన్' శబ్దముల విసర్గకు సకారము వచ్చు నని చెప్పవలెను.

ఈ వార్తికముచే విసర్గకు సకార మాదేశమై 'సంస్స్కర్తా' 'సంస్స్కర్తా' అను రూపములు సిద్ధించును.

94. పుమః ఖయ్యమ్పరే 8.3.6

అమ్పరే పుమో రుః. పుంస్కోకిలః, పుంస్కోకిలః.

'పుమ్' అనుదానికి 'అమ్' పరముగా గల ఖయ్ పరమగునపుడు 'రు' వచ్చును.

'అలోऽన్త్యస్య' అను పరిభాషచే (21) రు, అంత్య మగు మకారమున కాదేశమై వచ్చును.

'పుమ్ + కోకిలః':- ఇచట 'పుమ్'నకు 'ఖయ్' ప్రత్యాహారాంతర్గత మగు కకారము పరముగ నున్నది. దానికి ఓకారము పరముగ నుండుటచే అది అమ్పరకము. కావున 'పుమ్'లోని మకారమునకు 'రు' వచ్చుటచే 'పుర్ + కోకిలః' అని యగును. 'అత్రానునాసికః పూర్వస్య తు వా' (91) 'అనునాసికా త్పరోऽనుస్వారః' (92) అను సూత్రములచే అనునాసికానుస్వారములు వచ్చుటచే 'పుఁర్ + కోకిలః' 'పుంర్ + కోకిలః' అని యగును. రేఫకు 'ఖరవసానయో ర్విసర్జనీయః' (93)అను విసర్గ, 'సంపుంకానాం సో వక్తవ్యః' అను వార్తిక ముచే సకారమును వచ్చి 'పుఁస్కోకిలః' 'పుంస్కోకిలః' అను రూపములు సిద్ధించును.

95. నశ్ఛవ్యప్రశాన్ 8.3.7

అమ్పరే ఛవి నాన్తస్య పదస్య రుః.

నః, ఛవి; అప్రశాన్. 'పుమః ఖయ్యమ్పరే' నుండి 'అమ్పరే' 'పదస్య' అధికారసూత్రమును అనువర్తించును. 'ప్రశాన్' అను పదము కంటె

భిన్న మగు నాంత మగు పదమునకు అమ్ పరముగా గల 'ఛవ్' పర మగు నపుడు 'రు' వచ్చును.

'అలోన్త్యస్య' అను పరిభాషచే (21) అన్త్యనకారమున కాదేశ మగును. 'చక్రిన్ + త్రాయస్వ'; ఇచట పదాంతగత మగు నకారమునకు ఛవ్ ప్రత్యాహారాన్తర్గత మగు తకారము పరముగ నున్నది. దానికి అమ్ (రేఫ) పరముగా నున్నది. కావున నకారమునకు రు వచ్చుటచే 'చక్రిర్ + త్రాయస్వ' అని యుండగా పూర్వోదాహరణములందు వలె అనునాసికానుస్వారములు వచ్చుటచే 'చక్రీఁర్ + త్రాయస్వ' 'చక్రింర్ + త్రాయస్వ' అని యగును. పిమ్మట 'ఖరవసానయోర్విసర్జనీయః' అను సూత్రముచే (93) విసర్గము చేసిన పిదప:-

96. విసర్జనీయస్య సః 8.3.34

ఖరి. చక్రింస్త్రాయస్వ. అప్రశాన్ కిమ్? ప్రశాన్ తనోతి. పదాన్తస్యేతి కిమ్? హన్తి.

'ఖరవసానయోర్విసర్జనీయః' నుండి మండూకప్లుతిచే 'ఖర్' అను వర్తించును.

విసర్గమునకు 'ఖర్' పర మగునపుడు సకార మాదేశ మగును. ఈ సూత్రముచే పై లక్ష్యములందలి విసర్గకు సకార మాదేశమై 'చక్రీఁస్త్రాయస్వ' 'చక్రింస్త్రాయస్వ' అను రూపద్వయము సిద్ధించును.

(95 వ సూత్రమున) 'అప్రశాన్' అనకున్నచో ప్రశాన్ + తనోతి' అను చోట 'ప్రశాన్' అనునది కూడ నకారాన్త మగుటచే దీనికి అమ్పరక మగు ఛవ్ పర మగుటచే రుత్వాదులు వచ్చి 'ప్రశాంస్తనోతి' ఇత్యాద్యనిష్టరూపములు కాకుండుటకై 'అప్రశాన్' అని చెప్పబడెను.

'పదాన్తస్య' అనకున్నచో 'హన్ + తి' అను నుదాహరణమున గూడ రుత్వాదులు వచ్చి యుండెడివి. 'పదాన్తస్య' అనుటచే 'హన్' అనునది పదము కాకుండుటచే నీ రుత్వాదులు రావు.

97. నౄన్ పే. 8.3.10

నౄనిత్యస్య రుర్వా పే.

'మతువసో రు సంబుద్ధౌ' 'ఉభయథర్క్షు' అను సూత్రములనుండి 'రు' 'ఉభయథా' అనువర్తించును. 'ఉభయథా' అనగా వికల్పముగా అని యర్థము.

'నౄన్' అను ద్వితీయాంత శబ్దమునకు పకారము పర మగునపుడు వికల్పముగా 'రు' వచ్చును.

'నౄన్ + పాహి'. ఇచట 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే (21) నకారమున కాదేశమై 'రు' వచ్చి 'నౄర్ + పాహి' అని యుండగా అనునాసికాదేశ (91) అనుస్వారాగమ (92) విసర్గలచే (93) 'నౄఀః + పాహి' 'నౄంః + పాహి' అను రూపము లగును. ఇచట 'విసర్జనీయస్య సః' అను సూత్రముచే (96) విసర్గకు సకారము రావలసి యుండగా దాని కపవాదముగ నీ క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

98. కుప్వోః ≍క≍పౌ చ. 8.3.37

కవర్గే పవర్గే చ పరే విసర్గస్య ≍క≍పౌ స్తః. చాద్విసర్గః, నౄఀ≍పాహి, నౄఀఃపాహి, నౄం≍పాహి, నౄంఃపాహి; నౄన్పాహి.

'విసర్జనీయస్య సః' నుండి 'విసర్జనీయస్య' అనువర్తించును. విసర్గకు కవర్గపవర్గములు పర మగునపుడు వరుసగా ≍క.≍ప లు(జిహ్వామూలీయోపధ్మానీయములు) ఆదేశము లగును.

ఈ సూత్రమున 'చ' అను నవ్యయము నుపయోగించుటచే ఈ ≍క≍ప లును, విసర్గము గూడ వచ్చు నని యర్థము చెప్పికొనవలెను.

పై యుదాహరణములలో విసర్గమునకు ≍ప వచ్చినచో 'నౄఀ≍పాహి', 'నౄం≍పాహి' అను రూపములును పక్షాంతరమున విసర్గయే వచ్చుటచే 'నౄఀఃపాహి' 'నౄంఃపాహి' అను రూపములను సిద్ధించును. 'చ'కారబలముచే విసర్గమునకు విసర్గమే వచ్చు ననుటచే నిచట 'విసర్గనీయస్య సః' అను సకారమునకు ప్రసక్తి లేదు. రుత్వము వైకల్పిక మగుటచే రుత్వాభావపక్షమున 'నౄన్పాహి' యను రూప ముండును.

99. తస్య పరమామ్రేడితమ్. 8.1.2

ద్విరుక్తస్య పరం ఆమ్రేడితం స్యాత్.

ఈ సూత్రము 'సర్వస్య ద్వే' అను అధికారసూత్రము క్రింద నుండుటచే 'తస్య' అనుదానికి 'ద్విరుక్తస్య' అని యర్థము. రెండు పర్యాయములు ఉచ్చరింపబడిన దాని రెండవ రూపమునకు 'ఆమ్రేడితమ్' అని పేరు.

'కిమ్'శబ్ద ద్వితీయాబహువచనాంత మగు 'కాన్' అను పదమును 'నిత్య వీప్సయోః' అను సూత్రము (883)చే ఆవృత్తి చేయగా 'కాన్ + కాన్' అని యగును. ఇచట రెండవ 'కాన్' అనుదానికి 'ఆమ్రేడితం' అని పేరు.

## 100. కానామ్రేడితే 8.3.12

కాన్నకారస్య రుః స్యాదామ్రేడితే. కాఁస్కాన్, కాంస్కాన్.

కాన్, ఆమ్రేడితే. 'మతువసో రు సమ్బుద్ధౌ' నుండి 'రు'అనువర్తించును. అలోన్త్యపరిభాష (21) ప్రవర్తించును. 'కాన్' అను పదము నందలి నకారము నకు ఆమ్రేడితము పర మగునపుడు 'రు' ఆదేశ మగును.

'కాన్ + కాన్' అను నపుడు మొదటి 'కాన్' అను పదమునందలి నకారమునకు రు వచ్చుటచే 'కార్ + కాన్' అనియు పిమ్మట, అనునాసిక, అనుస్వారవిసర్గములును, 'సంపుంకానాం సో వక్తవ్యః' అను వార్తికముచే సకారమును వచ్చుటచే 'కాఁస్కాన్' + 'కాంస్కాన్' అను రెండు రూపములు నిష్పన్న మగును.

## 101. ఛే చ 6.1.73

హ్రస్వస్య ఛే పరే తుక్. చివచ్ఛాయా.

'హ్రస్వస్య పితి కృతి తుక్' నుండి 'హ్రస్వస్య'. 'తుక్' అనువర్తించును. 'సంహితాయాం' అధికారము. (సంహితయందు) హ్రస్వమునకు ఛకారము పర మగునపుడు 'తుక్' అను నాగమము వచ్చును.

'శివ + ఛాయా'. ఇచట హ్రస్వ మగు వకారోత్తరవర్తి 'అ'కారమునకు ఛకారము పర మగుటచే తుగాగమము వచ్చును. 'తుక్'లోని 'ఉ' 'క్'లు ఇత్సంజ్ఞకములు. ఇది కిత్తగుటచే 'ఆద్యన్తౌ టకితౌ' అను పరిభాషచే (84) అంతావయవముగ వచ్చును. కావున 'శివ + త్ + ఛాయా' అని యుండగా శ్చుత్వము అసిద్ధ మగుటచే ముందుగ 'ఝలాం జశోన్తే' అను సూత్రముచే (67) జశ్త్వము —'శివద్ + ఛాయా' శ్చుత్వము (62)—శివజ్ + ఛాయా, 'ఖరిచ' అను సూత్రముచే (74) చర్త్వము—శివచ్ + ఛాయా = 'శివచ్ఛాయా' అను రూపము సిద్ధించును.

102. పదాన్తాద్వా 6.1.76

దీర్ఘాత్ పదాన్తాత్ ఛే తుగ్వా, లక్ష్మీచ్ఛాయా. లక్ష్మీఛాయా.

'ఇతిహల్సన్ధిప్రకరణమ్'

"దీర్ఘాత్" అను సూత్రము, 'ఛే చ' నుండి 'ఛే' 'హ్రస్వస్య పితి కృతి తుక్'నుండి 'తుక్' అనువర్తించును. దీర్ఘ మగు పదాన్తముకంటె ఛకారము పర మగునపుడు వికల్పముగ 'తుక్' వచ్చును.

'లక్ష్మీ + ఛాయా'. ఇచట పదాన్తస్థ మగు ఈకారమునకు ఛకారము పర మగుటచే తుగాగమము. లక్ష్మీత్ + ఛాయా, జశ్త్వ, శ్చుత్వ, చర్త్వములచే వెనుకటి వలె వరుసగా దకార, జకార, చకారము లాదేశము లై 'లక్ష్మీచ్ఛాయా' అను రూప మగును. తుగాగమము వైకల్పికము గాన తదభావపక్షమున 'లక్ష్మీఛాయా' అను రూప మగును.

హల్సంధి ప్రకరణము సమాప్తము.

# అథ విసర్గసన్ధి ప్రకరణమ్

103. విసర్జనీయస్య సః 8.3.34

ఖరి విసర్జనీయస్య సః స్యాత్. విష్ణుస్త్రాతా.

ఈ సూత్రము 96 వ సూత్రముగ హల్సంధి ప్రకరణమున వచ్చినది.

'విష్ణుస్త్రాతా':- 'విష్ణుః + త్రాతా'. ఇచట విసర్గకు 'ఖర్' ఐన తకారము పర మగుటచే సకార మాదేశముగ వచ్చి 'విష్ణుస్త్రాతా' అను ప్రయోగము సిద్ధించినది.

104. వా శరి 8.3.36

శరి విసర్గస్య విసర్గో వా స్యాత్. హరిః శేతే. హరిశ్శేతే.

'విసర్జనీయస్య సః' నుండి 'విసర్జనీయస్య' 'శర్పరే విసర్జనీయః' నుండి 'విసర్జనీయః' అనువర్తించును. విసర్గమునకు 'శర్' పర మగునపుడు వికల్పముగ విసర్గ వచ్చును.

ఇది పై సూత్రమున కపవాదము. ఈ సూత్రము ప్రవర్తించని పక్షమున పై సూత్రము ప్రవర్తింపవచ్చును.

'హరిః + శేతే'. ఇచట విసర్గమునకు శర్ ప్రత్యాహారాంతర్గత మగు శకారము పర మగుటచే విసర్గమే వచ్చి 'హరిః శేతే' అను రూప మేర్పడును. ఈ సూత్రము ప్రవర్తించని పక్షమున 'విసర్జనీయస్య సః' అను సూత్రముచే (103) సకారము– 'హరిస్ + శేతే,' ఇచట 'స్తోశ్చునా శ్చుః' అను సూత్రముచే శ్చుత్వము–సకారమునకు శకారము– 'హరిశ్శేతే' అను రూపము సిద్ధించును.

105. ససజుషో రుః. 8.2.66

పదాన్తస్య సస్య సజుషశ్చ రుః స్యాత్.

'పదస్య' అధికృతము. పదాన్తసకారమునకును 'సజుష్' శబ్దమునకును (అలోన్త్యపరిభాషచే (21) 'సజుష్' శబ్దాన్త్యవర్ణమునకు) 'రు' ఆదేశముగ వచ్చును. 'రు'లోని 'ఉ'కార మిత్సంజ్ఞకము.

'శివస్ + అర్చ్యః':–'శివస్' అనునది 'శివ'అను ప్రాతిపదికకు 'సుప్' అను ప్రథమావిభక్త్యేకవచనప్రత్యయమును చేర్చి నపు డేర్పడిన రూపము. ఇచట సకారము పదాన్త మగుటచే ఈసూత్రముచే రుత్వము చేయగా 'శివర్ + అర్చ్యః' అని యుండును.

106. అతో రోరప్లుతాదప్లుతే, 6.1.113

అప్లుతాదతః పరస్య రోరుః స్యాదప్లుతేఽతి. శివోఽర్చ్యః.

'ఋత ఉత్' నుండి 'ఉత్' 'ఏఙః పదాన్తాదతి' నుండి 'అతి' అను వర్తించును. అప్లుత మగు 'అత్'కంటె పర మగు 'రు'కు అప్లుత మగు 'అత్' పర మగునపుడు 'ఉ' ఆదేశముగ వచ్చును.

పై యుదాహరణమున నీ సూత్రముచే 'రు'కు 'ఉ'త్వము వచ్చి 'శివఉ + అర్చ్యః' అనియై, 'ఆద్గుణః' అను సూత్రముచే (27) 'అఉ'లకు గుణ మేకాదేశ మగుటచే 'శివో + అర్చ్యః' అని యై, పిదప 'ఏఙః పదాన్తాదతి'అను సూత్రముచే (43) పూర్వరూపము వచ్చి 'శివోఽర్చ్యః' అను రూప మేర్పడును.

107. హశి చ 6.1.114

తథా. శివో వన్ద్యః.

పై సూత్రమునుండి 'అతః' 'రోః', అప్లుతాత్', 'ఋత ఉత్' నుండి

"ఉత్" అనువర్తించును. అప్లుత మగు అత్‌కంటె పరమగు 'రు'కు 'హశ్' పర మగునపుడు కూడ 'ఉ'కారము ఆదేశముగ వచ్చును.

శివో వన్ద్యః:- 'శివస్ + వన్ద్యః'. 'ససజుషోరుః' అను సూత్రముచే (105) రుత్వము- శివర్ + వన్ద్యః'; ఈ సూత్రముచే 'రు'స్థానమున ఉత్వము- శివఉ + వన్ద్యః; గుణముచే 'శివో + వన్ద్యః' అను రూపము సిద్ధించును.

108. భోభగో అఘోఅపూర్వస్య యోఽశి 8.3.17

ఏతత్పూర్వస్య రోర్యాదేశోఽశి. దేవా ఇహ, దేవాయిహ. భోస్, భగోస్, అఘోస్, ఇతి సాన్తా నిపాతాః, తేషాం రోర్యత్వే కృతే:-

'రోస్సుపి' నుండి 'రోః' అనువర్తించును. భో, భగో, అఘో అను నిపాతములును, అకారమును, పూర్వమునందు గల 'రు'కు 'అశ్' పర మగునపుడు యకార మాదేశ మగును.

'దేవాస్ + ఇహ':- 'ససజుషోరుః' అను సూత్రముచే (105) రుత్వము 'దేవార్ + ఇహ'; ఈ సూత్రముచే అకారపూర్వక మగు 'రు'కు 'అశ్' (ఇకారము) పరముగ నున్నది గాన యకారాదేశము- 'దేవాయ్ + ఇహ' లోపశ్శాకల్యస్య' అను సూత్రముచే (30) యకారమునకు లోపము వచ్చిన పక్షమున 'దేవా ఇహ' అనియు, లోపము రాని పక్షమున 'దేవాయిహ' అనియు రూపద్వయముసిద్ధించును .'లోపశ్శాకల్యస్య' అనునది త్రిపాదీస్థ మగుటచే యకారలోపము అసిద్ధము గాన మొదటి రూపమున గుణప్రసక్తి లేదు.

'భోస్', 'భగోస్', 'అఘోస్' అనునవి సకారాన్త నిపాతములు. 'భోస్ + దేవాః' 'భగోస్ + నమస్తే' 'అఘోస్ + యాహి' అను నుదాహరణములందు నిపాతాంతసకారములకు 'ససజుషోరుః' అను సూత్రముచే (105) రుత్వమును ఈ సూత్రముచే (108) యకారమును చేసిన పిదప 'భోయ్ + దేవాః' 'భగోయ్ + నమస్తే' 'అఘోయ్ + యాహి' అని యుండగా:-

109. హలి సర్వేషామ్. 8.3.22

భో, భగో, అఘో, అపూర్వస్య యస్య లోపః స్యాద్ధలి. భో దేవాః. భగో నమస్తే. అఘో యాహి.

పై సూత్రమునుండి 'భో భగో అఘో అపూర్వస్య' అను పదము, 'లోపః శాకల్యస్య' నుండి 'లోపః', 'వ్యోర్లఘు ప్రయత్నతరః శాకటాయనస్య'

నుండి 'వ్యోః' పదైకదేశ మగు యకారమును అనువర్తించును. భో, భగో, అ,ఘో,అ,పూర్వక మగు యకారమునకు హల్ పర మగునపుడు సర్వాచార్యులమతమునందును (నిత్యముగా) లోపము వచ్చును.

ఈ సూత్రముచే పై యుదాహరణములందు భోభగోఅఘోపూర్వక మగు యకారమునకు హల్లు పర మగుటచే నిత్యముగ లోపము వచ్చి 'భో దేవాః' 'భగో నమస్తే' 'అఘో యాహి' అను ప్రయోగములు సిద్ధించును.

'భో', 'భగో', 'అఘో', అనునవి క్రమముగా 'భవత్' 'భగవత్' 'అఘవత్' అను శబ్దములకు సంబంధించిన సంబోధన వాచకావ్యయములు. కావున 'భో' అనునది సామాన్య సంబోధన వాచకము. 'భగో' అనునది ఆదర పూర్వక సంబోధనవాచకము. అఘో అనునది నీచసంబోధన వాచకము.

## 110. రోఽసుపి. 8.2.69

అహ్నో రేఫాదేశో న తు సుపి. అహరహః. అహర్గణః.

'అహన్' అను సూత్రము అనువర్తించును. అహన్ శబ్దమునకు రేఫాదేశము వచ్చును; సుప్ ప్రత్యయము పర మగునపుడు మాత్రము రాదు.

అలోఽన్త్య పరిభాషచే (21) అహన్ శబ్దాంత్యవర్ణమున కీ యాదేశము వచ్చును. 'అహన్ + అహః' ఇచట నకారమునకు రేఫ ఆదేశముగ వచ్చుటచే అహర్ + అహః = 'అహరహః' అను రూప మేర్పడును. అట్లే 'అహన్ + గణః' అను స్థలమున నకారమునకు రేఫాదేశము వచ్చి 'అహర్గణః' అను ప్రయోగమ సిద్ధించును.

## 111. రో రి 8.3.14

రేఫస్య రేఫే పరే లోపః.

'ఢో ఢే లోపః' నుండి 'లోపః' అనువర్తించును. రేఫకు రేఫ పర మగునపుడు లోపము వచ్చును.

## 112. ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః 6.3.111

ఢరేఫయోర్లోపనిమిత్తయోః పూర్వస్యాణోదీర్ఘః. పునా రమతే. హరీ రమ్యః, శమ్భూ రాజతే. అణః కిమ్? తృఢః. వృఢః.

'ఢశ్చ రశ్చ ఢ్రౌ, ఢ్రౌ లోపయతీతి ఢ్రలోపః' అను విగ్రహముచే 'ఢ్రలోపః' అను పదమునకు ఢకారరేఫల లోపమునకు కారణభూత మైనది అని

యర్థము. ఢకారమునకు ఢకారము పర మగునపుడు 'ఢో ఢే లోపః' అను సూత్ర ముచే (553) లోపము వచ్చును. అట్లే రేఫకు రేఫ పర మగునపుడు 'రో రి' అను సూత్రముచే (111) లోపము వచ్చును. కావున ఢకారరేఫల లోపమునకు నిమిత్త మగు వర్ణము లనగా ఢకారరేఫ లని యర్థము.

ఢకారరేఫల లోపమునకు నిమిత్త మగు ఢకారరేఫలు పర మగునపుడు పూర్వమం దున్న 'అణ్'కు దీర్ఘము వచ్చును.

పునారమతే:- 'పునర్ + రమతే'; ఇచట రేఫకు రేఫ పరముగా నుండుటచే 'రో రి' అను సూత్రముచే (111) మొదటి రేఫకు లోపము. 'పున + రమతే'- ఈ సూత్రముచే రేఫ పూర్వవర్తి యగు అణ్‌నకు (అకారమునకు) దీర్ఘము. 'పునా రమతే' అను రూపము సిద్ధించును.

హరీరమ్యః:- 'హరిస్ + రమ్యః'-'ససజుషోరుః' అను సూత్రముచే రుత్వము. 'హరిర్ + రమ్యః'-వెనుకటి యుదాహరణమందు వలె రేఫలోప ఇకారదీర్ఘములు – 'హరీ రమ్యః'.

శమ్భూరాజతే - 'శమ్భుస్ + రాజతే' రుత్వ,-రలోప-దీర్ఘములు వెనుకటి యుదాహరణమునందు వలె వచ్చును.

'అణః' అని యన నేల? 'అణః' అని కాక 'అచః' అని చెప్పి యున్నలో 'తృఢః' 'వృఢః' అను క్తప్రత్యయాంత పదము లందలి ఋకారమునకు కూడ దీర్ఘము వచ్చి యుండెడిది.

తృఢః (కొట్టబడిన):- 'తృఢ్ + ఢః'. ఇచట 'ఢో ఢే లోపః' అను సూత్రముచే మొదటి ఢకారమునకు లోపము. 'తృ + ఢః'. ఈ సూత్రమున 'అణ్'కు మాత్రమే దీర్ఘము విధింపబడుటచే తద్భిన్న మగు ఋకారమునకు దీర్ఘము రాలేదు. 'తృఢః' అను రూపము సిద్ధించినది. వృఢః (సన్నద్ధుడు) దీని రూపమును 'తృఢః'వలె నెరుగునది.

'మనస్ రథః' ఇత్యత్ర రుత్వే కృతే 'హశి చ' ఇత్యుత్వే 'రో రి' ఇతి లోపే చ ప్రాప్తే-

113. విప్రతిషేధే పరం కార్యమ్. 1.4.2

తుల్యబలవిరోధే పరం కార్యం స్యాత్. ఇతి లోపే ప్రాప్తే 'పూర్వత్రాసిద్ధమ్' ఇతి 'రో రి' ఇత్యస్యాసిద్ధత్వాదుత్వమేవ. మనోరథః.

మనోరథః:- 'మనస్ + రథః'- ఇచట 'ససజుషోరుః' అని రుత్వము చేయగా 'మనర్ + రథ' అని యుండగా 'హశి చ' అను సూత్రముచే (107) ఉత్వము వచ్చుట కవకాశ మున్నది. 'రో రి' అను సూత్రముచే (111) రేఫ లోపము కూడ రావలసి యున్నది. కావున ఏ సూత్రము ప్రవర్తించవలెనో నిర్ణయము చేయ వలసి యుండుటచే ఈ సూత్రము (113) చెప్పబడుచున్నది. తుల్యబలవిరోధము కలిగి నపుడు పర మైన కార్యము రావలెను.

విప్రతిషేధ మనగా తుల్యబలవిరోధము. అనగా ఇతర స్థలములందు చరితార్థము లగు రెండు శాస్త్రములకు ఒక లక్ష్యమునందు సమావేశము. (అన్యత్ర లబ్ధావకాశయోః శాస్త్రయోరేకస్మిన్ లక్ష్యే సమావేశః తుల్యబలవిరోధః.) ఉదాహరణకు—'రో రి' సూత్రము 'పునా రమతే' ఇత్యాదిస్థలములందు చరితార్థమైనది. ఇచట 'హశి చ' సూత్రమునకు అవకాశము లేదు. అట్లే 'హశి చ' సూత్రము 'శివో వన్ద్యః' ఇత్యాది స్థలములందు చరితార్థము. ఇచట 'రో రి' సూత్రమున కవకాశము లేదు. ఇప్పు డీ రెండు సూత్రములును 'మనర్ + రథః' అను స్థలమున ప్రవర్తించుచున్నవి. ఇట్టి విప్రతిషేధము వచ్చునపుడు పరశాస్త్రమును (అష్టాధ్యాయీ క్రమానుసారముగ) చేయవలెను గాని పూర్వ శాస్త్రమును చేయరాదని ఈ సూత్రము నియమించుచున్నది.

ఈ సూత్రము ననుసరించి షష్ఠాధ్యాయగత మగు 'హశి చ' సూత్రము కంటె అష్టమాధ్యాయస్థ మగు 'రో రి' సూత్రము పర మగుటచే 'రో రి' సూత్రమే ప్రవర్తించి రేఫలోపము రావలసి యున్నది. కాని 'పూర్వత్రాసిద్ధమ్' అను సూత్రము (31) ననుసరించి 'హశి చ' సూత్రము దృష్టిలో 'రో రి' సూత్రము అసిద్ధము కావున 'హశి చ' సూత్రమే ప్రవర్తించు నని నిర్ణయము. దీనిచే 'విప్రతిషేధే పరం కార్యమ్' అనునది సపాదసప్తాధ్యాయీగత సూత్రముల బలాబలవిచారణ విషయముననే ఉపయోగించు నని తేలినది. 'హశి చ' అను సూత్రముచే (107) ఉత్వము చేయగా 'మనఉ + రథః'—పిమ్మట గుణముచే 'మనోరథః' అను రూపము సిద్ధించును.

114. ఏతత్తదోస్సులోపోఽకోరనఞ్సమాసే హలి 6.1.132

అకకారయోరేతత్తదోర్యః సుస్తస్య లోపో హలి, న తు నఞ్సమాసే ఏష విష్ణుః, స శమ్భుః. అకోః కిమ్? ఏషకో రుద్రః, అనఞ్సమాసే కిమ్? అసః శివః, హలి కిమ్? ఏషోఽత్ర.

కకారరహితము లగు ఏతచ్ఛబ్దతచ్ఛబ్దములు 'సు'కు హల్ పర మగు నపుడు లోపము వచ్చును; నఞ్ సమాసమునందు మాత్రము రాదు.

'ఏషసు + విష్ణుః' 'ససు + శమ్భుః' — ఇచట ప్రథమైకవచన ప్రత్యయ మగు 'సు'అనునది కకారరహితము లగు ఏతచ్ఛబ్దతచ్ఛబ్దములకు సంబంధించి యున్నది. దీనికి హల్లు పరముగ నున్నది. ఇది నఞ్ సమాసము కాదు. కావున అది లోపించుటచే 'ఏష విష్ణుః' 'స శమ్భుః' అను రూపములు సిద్ధించును.

పై శబ్దములు కకారసహితము లైనచో సులోపము రాకుండుటకై 'అకోః' అను నది చేర్చబడినది. కావుననే 'ఏష కసు + రుద్రః' అనునపుడు ఏతచ్ఛబ్ద మున కకారముండుటచే ఈ సూత్రమున కవకాశము లేదు. 'ససజుషో రుః' అను సూత్రముచే (105) రుత్వము, 'హశి చ' సూత్రముచే (107) 'రు'కు ఉత్వము, 'ఆద్గుణః' సూత్రముచే (27) గుణము వచ్చి 'ఏషకో రుద్రః' అను ప్రయోగము సిద్ధించినది. 'ఏషకః' అనునది ఏతచ్ఛబ్దమునకు స్వార్థమున 'అకచ్' ప్రత్య యము చేర్చుటచే సిద్ధించిన రూపము.

'అనఞ్సమాసే' అని యననేల? అట్లనుటచే నఞ్ సమాసమున ఈ సూత్రము ప్రవర్తించదు. కావుననే 'అససు + శివః' అను స్థలమున నఞ్ సమాస మగుటచే సులోపము రాలేదు. రుత్వవిసర్గాదులచే 'అసః శివః' ఇత్యాది రూపములు సిద్ధించును.

'హలి' యనుటచే అచ్చు పర మగునపుడు ఈ సూత్రము ప్రవర్తించదు. 'ఏషసు + అత్ర' ఇచట 'సు'కు అచ్చు పర మగుటచే లోపము లేదు. కావున సకారమునకు రుత్వము, 'అతో రో రప్లుతాదప్లుతే' అను సూత్రముచే (106) ఉత్వము, గుణము, 'ఏఙః పదాన్తాదతి' సూత్రముచే (43) పూర్వరూపమును వచ్చి 'ఏషోఽత్ర' అను రూప మేర్పడినది.

### 115. సోఽచి లోపే చేత్పాదపూరణమ్ 6.1.134

స ఇత్యస్య సోర్లోపః స్యాదచి, పాదశ్చేల్లోపే సత్యేవ పూర్యేత. సేమామవిడ్ఢి ప్రభృతిం య ఈశిషే. సైష దాశరథీ రామః.

ఇతి విసర్గసన్ధిః.

ఇతి పఞ్చసన్ధి ప్రకరణమ్.

వెనుకటి సూత్రమునుండి 'సు', 'లోపః' అనువర్తించును. 'స' అను దాని 'సు'ప్రత్యయమునకు అచ్చు పర మగునపుడు లోపము వచ్చును; ఇట్లు లోపము చేసిననే పాదపూర్తి యగు నను సందర్భము లందే ఈ లోపము వచ్చును.

'సేమామవిడ్ఢి ప్రభృతిం య ఈశిషే' అనునది వైదికజగతీఛందఃపాదము, ఇచట 'సను + ఇమామ్' అని యుండగా 'సు'కు లోపము 'స + ఇమామ్' అని యుండగా గుణముచే 'సేమామ్' అను రూపము సిద్ధించినది. జగతీఛందమున ప్రతిపాదమునందును పండ్రెండు అక్షరము లుండును. పై విధముగ సులోపము చేసిననే పండ్రెండు అక్షరము లుండును కాని లోపము చేయనిచో పదమూడక్షరము లుండి ఛందోభంగ మగును. కావున సులోపము చేయబడినది. 'సైష దాశరథీ రామః' అను అనుష్టుప్ఛందఃపాదమున పూర్వోక్తవిధముగ సులోపము చేసి వృద్ధి చేయుటచే 'సైష' అను రూప మేర్పడినది. అనుష్టుప్ఛందమున పాదమునకు ఎనిమిది అక్షరము లుండును. సులోపము చేయకున్నచో 'స ఏష దాశరథీ రామః' అని యుండి తొమ్మిది వర్ణము లుండుటచే ఛందోభంగము వచ్చి యుండెడిది.

విసర్గసంధి ప్రకరణము సమాప్తము.

పంచసంధి ప్రకరణము సమాప్తము.



# అథ సుబన్తాః

## అథ అజన్తపుంలిఙ్గప్రకరణమ్.

116. అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్. 1.2.45

ధాతుం ప్రత్యయం పత్యయాన్తఞ్చ వర్జయిత్వా అర్థవచ్ఛబ్ద స్వరూపం ప్రాతిపదికసంజ్ఞం స్యాత్.

ఇది సంజ్ఞాసూత్రము. ధాతుభిన్నము, ప్రత్యయభిన్నము, ప్రత్యయాంత భిన్నమును నగు అర్థవంత మగు (అర్థము గల) శబ్దస్వరూపము ప్రాతిపదిక సంజ్ఞ కలది యగును.

ఇచట సూత్రమునందలి 'అప్రత్యయః' అను పదమునకు 'అప్రత్యయః' 'అప్రత్యయాన్తః' అను నర్థద్వయము వివక్షితము. 'అధాతుః' అని యన కున్నచో 'అహన్' అను హనధాతులఙ్ ప్రథమపురుష ఏకవచనరూపమున 'హన్' అను భాగము అర్థవంత మగు శబ్దస్వరూప మగుటచేతను, ప్రత్యయాం తము కాకుండుటచేతను (ఇచట ఏకవచన ప్రత్యయము లోపించినది) ప్రాతి పదికసంజ్ఞ కలిగి 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రము (180) చే నలో పాదులు రావలసి యుండును. తన్నివారణార్థమై 'అధాతుః' అను పదము ప్రయుక్తమైనది. 'హన్' ధాతువు గాన ప్రాతిపదికసంజ్ఞ లేదు.

'అప్రత్యయః' 'అప్రత్యయాన్తః' అని యనకున్నచో 'హరిషు' 'కరోషి' ఇత్యాదులలోని 'సు' 'సి' అను ప్రత్యయములకును 'హరిషు' 'కరోషి' అను ప్రత్యయాన్తములకును గూడ ప్రాతిపదికసంజ్ఞ వచ్చి మరల సుప్ప్రత్యయాదులు వచ్చుట మొదలగు అనిష్టకార్యములు వచ్చును. తన్నివారణకై 'అప్రత్యయః' అను పదము ప్రయుక్తము.

'డిత్థ'; 'రామ' మొదలగు శబ్దస్వరూపము ఉదాహరణములు. ఇవి యర్థవంతములు, ప్రత్యయప్రత్యయాన్త, ధాతు భిన్నములు. కావున నిట్టి పద ములకు ప్రాతిపదికసంజ్ఞ లభించును.

వ్యాకరణమున వ్యుత్పత్తి వాదము అవ్యుత్పత్తి వాదము అను రెండు వాదములు గలవు. సాధారణముగ ప్రతిశబ్దమునకును అవయవార్థ ముండు

ననియు, కావున నా శబ్దము ధాత్వాదులకు కొన్ని విశిష్టార్థములలో ప్రత్యయము లను జేర్చుటచే నేర్పడిన దనియు చెప్పెడి వాదము వ్యుత్పత్తివాదము. ప్రతి శబ్దమునకును సముదాయరూపముగనే అర్థ బోధకత్వ ముండు ననియు, ఆ శబ్దము నకు అవయవార్థమును బరిశీలింపవలసిన యావశ్యకత లేద నియు చెప్పెడి వాదము అవ్యుత్పత్తివాదము. మొదటి వాదము ప్రకారము 'రామ' అను శబ్దము 'రము క్రీడాయామ్' అనెడు ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము చేర్చుటచే ఏర్పడిన దనియు, కావున 'రమన్తే యోగినః అత్ర' అనునది దీని యవయవార్థ మనియు చెప్పుదురు. రెండవ వాదము ప్రకారము ఈ శబ్దమున కా యవయవార్థ మేమియు నుండదు. ఈ శబ్దస్వరూపమునకు దశరథపుత్రు డగు నొక వ్యక్తి యని యర్థము. ఈ రెండు వాదములలో మొదటి వాదము ననుసరించిన యెడల 'రామ' అనునది ప్రత్యయాంతము గాన ఈ సూత్రమున కుదాహరణము కాజాలదు. డిత్థాదులే ఈ సూత్రమున కుదాహరణము 'డిత్థ' అనునది అవయవార్థ శూన్యము, ఒక ఎద్దు నకు నామధేయముగ వాడబడుచున్నది. 'రామ' అనుదానికి రాబోవు సూత్ర ముచే (117) ప్రాతిపదికత్వము సంపాదనీయము.

117. కృత్తద్ధితసమాసాశ్చ. 1.2.46

కృత్తద్ధితాన్తౌ సమాసాశ్చ తథా స్యుః.

పూర్వసూత్రమునుండి 'ప్రాతిపదికమ్' అనువర్తించును. కృత్ప్రత్య యాంతములు, తద్ధితప్రత్యయాంతములు, సమాసములును గూడ ప్రాతిపదిక సంజ్ఞము లగును.

'కృదతిఙ్' అను అధికారసూత్రము క్రింద తృతీయాధ్యాయమున విధింపబడిన ప్రత్యయములు (ధాతువులకు చేర్పబడునవి) కృత్ప్రత్యయములు. కర్తృ, కారక, కార్య, రామ, ఇత్యాదులు కృత్ప్రత్యయాంతములు. 'తద్ధితాః' అను నధికారసూత్రము క్రింద చతుర్థాధ్యాయమున విహితము లగు ప్రత్యయ ములు (సాధారణముగ నామాదివాచకములకు చేర్చబడునవి) తద్ధితప్రత్యయ ములు. దాశరథి, పాణినీయ, మాలీయ మొదలగునవి తద్ధితప్రత్యయాన్తములు.

రెండు లేక అంతకంటె నధికసంఖ్యాకము లగు పదముల కలయికకు సమాస మని పేరు. 'రాజపురుష', 'దుఃఖాతీత' మొదలగునవి సమాసములు. పై మూడు విధము లగు శబ్దస్వరూపములకును నీ సూత్రముచే ప్రాతిపదికసంజ్ఞ లభించును.

118. స్వౌజసమౌట్ఛష్టాభ్యామ్భిస్ జేభ్యామ్భ్యస్ ఙసిభ్యామ్భ్యస్ ఙసోసామ్ ఙ్యోస్సుప్. 4.1.2

సు,ఔ,జస్ ఇతి ప్రథమా; అమ్,ఔట్,శస్ ఇతి ద్వితీయా; టా,భ్యామ్,భిస్ ఇతి తృతీయా; ఙే,భ్యామ్,భ్యస్, ఇతి చతుర్థీ; ఙసి, భ్యామ్,భ్యస్ ఇతి పంచమీ. ఙస్,ఓస్,ఆమ్ ఇతి షష్ఠీ; ఙీ,ఓస్,సుప్, ఇతి సప్తమీ.

ప్రతి ప్రాతిపదికమును ఏడు విభక్తులలో ప్రయోగించవచ్చును. ప్రతి విభక్తికిని ఏకవచన, ద్వివచన బహువచనము లను మూడు వచనము లుండును. కావున విభక్తిప్రత్యయములు మొత్తము ఇరువదియొకటి. ఆ ఇరువదియొక్క ప్రత్యయములును పై సూత్రమున విధింపబడినవి.

119. ఙ్యాప్ప్రాతిపదికాత్. 4.1.1

120. ప్రత్యయః 3.1.1

121. పరశ్చ. 3.1.2

ఇత్యధికృత్య. ఙ్యన్తాదాబన్తాత్ ప్రాతిపదికాచ్చ పరే స్వాదయః ప్రత్యయాః స్యుః.

ఈ మూడు సూత్రములును అధికారసూత్రములు. ఈ సూత్రములతో చేర్చి పై సూత్రమును వ్యాఖ్యానింపవలెను.

ఙ్యంతముకంటెను, ఆబంతముకంటెను ప్రాతిపదికముకంటెను పరములై స్వాది ప్రత్యయములు వచ్చును.

ప్రథమైకవచన ప్రత్యయ మగు 'సు' అనుదానిని సప్తమీ బహువచన ప్రత్యయ మగు 'సుప్' నందలి 'ప్' అనుదానితో కలుపగా 'సుప్' అను ప్రత్యాహార మగును. ఇది స్వాదు లగు ఇరువదియొక్క ప్రత్యయములకును గ్రాహకము.

ఇచట 'ఙీ' అనునది 'ఙీప్' 'ఙీష్' 'ఙీన్' అను స్త్రీప్రత్యయములను 'ఆప్' అనునది 'టాప్','డాప్','చాప్' అను స్త్రీప్రత్యయములను గ్రహింమను.

122. సుపః. 1.4.103

సుపస్త్రీణి త్రీణి వచనాన్యేకశ ఏకవచన-ద్వివచన-బహువచన-సంజ్ఞాని స్యుః.

'తిఙస్త్రీణి త్రీణి ప్రథమమధ్యమోత్తమాః'నుండి' త్రీణి త్రీణి,'తాన్యేకవచన ద్వివచన బహువచనాన్యేకశః'నుండి 'ఏకవచన ద్వివచనబహువచనాని', 'ఏకశః,' అనువర్తించును. 'సుప్'ల మూడు మూడు వచనములు ప్రత్యేకముగ ఏకవచన, ద్వివచన, బహువచనసంజ్ఞము లగును.

సుప్ప్రత్యయములను మూడు మూడు వచనములుగ (త్రికములుగ) విభజింపవలెను. అందు ఒక్కొక్క త్రికమునందలి ప్రత్యయములు వరుసగా ఏకవచన, ద్వివచన, బహువచనసంజ్ఞము లగును.

| | | ఏకవచనము. | ద్వివచనము. | బహువచనము. | | |
|---|---|---|---|---|---|---|
| మొదటి/త్రికము. | | సు | ఔ | జస్ | ప్రథమా/విభక్తిః | |
| రెండవ | ,, | అమ్ | ఔట్ | శస్ | ద్వితీయా | ,, |
| మూడవ | ,, | టా | భ్యామ్ | భిస్ | తృతీయా | ,, |
| నాల్గవ | ,, | ఙే | భ్యామ్ | భ్యస్ | చతుర్థీ | ,, |
| ఐదవ | ,, | ఙసి | భ్యామ్ | భ్యస్ | పంచమీ | ,, |
| ఆరవ | ,, | ఙస్ | ఓస్ | ఆమ్ | షష్ఠీ | ,, |
| ఏడవ | ,, | ఙి | ఓస్ | సుప్ | సప్తమీ | ,, |

123. ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే. 1.4.22

ద్విత్వైకత్వయోరేతే స్తః.

ద్విత్వైకత్వములయందు (క్రమముగా) ద్వివచనైకవచనములు వచ్చును.

ద్విత్వమును చెప్పదలచి నపుడు ద్వివచనమును, ఏకత్వమును చెప్ప దలచి నపుడు ఏకవచనమును వచ్చును. ఉదాహరణకు:- ఒక రాముని గూర్చి చెప్పవలసినప్పుడు సందర్భానుసారముగా సు,అమ్, మొదలగు ఏకవచన ప్రత్యయములు వచ్చును. ఇద్దరు రాములను గూర్చి చెప్పవలసినప్పుడు ద్వివచనప్రత్యయము లగు ఔ,ఔట్; మొదలగు ప్రత్యయములు వచ్చును. ఇట్లే అన్ని స్థలములందును తెలిసికొనవలెను.

కొన్ని స్థలములలో ఏకత్వద్విత్వాదివివక్ష లేకున్నను సామాన్యరూపమున ఏకవచన ప్రత్యయమును జేర్చి, పదముగ నిర్మించిన పిదపనే ప్రయోగింపవలెను. కావుననే 'ఏకవచన ముత్సర్గతః కరిష్యే' అని భాష్యకారవాక్యము. అట్లు

సుబన్తముగ చేయబడనిదానిని ప్రయోగింపరా దని 'అపదం న ప్రయుఞ్జీత' అను ప్రసిద్ధవైయాకరణోక్తి చెప్పుచున్నది.

124 విరామోఽవసానమ్. 1 4.110

వర్ణానామభావోఽవసానసంజ్ఞః స్యాత్. రుత్వవిసర్గౌ-రామః.

వర్ణముల అభావము అవసానసంజ్ఞక మగును.

ఏ వర్ణమును ఉచ్చరించిన పిదప అవ్యవహితోత్తరక్షణమున అన్యవర్ణ మేదియు నుచ్చరింపబడదో ఆ వర్ణమునకు అవసాన మని పేరు. ఉదాహరణకు:- 'శివ' అనుచో వకారోత్తరవర్తి యగు అకార ముచ్చరించిన పిదప ఏ వర్ణమును ఉచ్చరింపబడుట లేదు గాన నా 'అ'కారమునకు విరామ మని పేరు.

రుత్వవిసర్గములు చేయగా 'రామః' అను రూపము సిద్ధించును. 'రామ' అనునది 'రమ్' ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము చేర్చుటచే నిష్పన్నమైనది గాన కృత్ప్రత్యయాంత మగుటచే 'కృత్తద్ధితసమాసాశ్చ' అను సూత్రముచే (117) దీనికి ప్రాతిపదికసంజ్ఞ వచ్చును. అవ్యుత్పత్తి పక్షమున 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' అను సూత్రము (116)చే ప్రాతిపదికత్వము. 'స్వౌజసమౌట్' అను సూత్రము(118)చే సుప్ప్రత్యయములు వచ్చును. అందు 'ఒక్క రాముడు' అను రామైకత్వవివక్షయందు ప్రథమైకవచనప్రత్యయ మగు 'సు' అనునది; చేర్చగా ['ద్వ్యేకయోః' అను సూత్రముచే (123)] రామ + సు' అని యుండును. 'ఉపదేశేఽజనునాసిక ఇత్' అను సూత్రముచే (28) 'సు'లోని 'ఉ'కు ఇత్సంజ్ఞయు, 'తస్య లోపః' అను సూత్రము(3)చే దానికి లోపము రాగా'రామ + స్' అని యుండును. ఇపుడు 'ససజుషో రుః'అను సూత్రముచే (105) రుత్వము (ఉకార మిత్సంజ్ఞకము) చేయగా 'రామ + ర్' అని యుండును. ఇచటి చివరి 'ర్' అనుదానికి విరామ మని సంజ్ఞ యగుటచే దానికి 'ఖరవసానయోర్విసర్జనీయః' అను సూత్రముచే (93) విసర్గ చేయగా 'రామః' అను రూపము సిద్ధించును.

125. సరూపాణామేకశేష ఏకవిభక్తౌ. 1.2.64

ఏకవిభక్తౌ యాని సరూపాణ్యేవ దృష్టాని తేషామేక ఏవ శిష్యతే.

'వృద్ధో యూనా తల్లక్షణశ్చేదేవ విశేషః'నుండి 'ఏవ' అపకృష్టము.

ఒక విభక్తి పర మగునపుడు సమానరూపమే కలిగిన అనేక శబ్దస్వరూపము లలో ఒక్కటి శేషించును.

ఒక రాముడు అను నర్థమున 'రామ' అనుదానిని ఒక పర్యాయమే ఉచ్చరించినను ఇద్దరు రాము లనునపుడు 'రామ రామ' అని రెండు పర్యాయ ములును, ముగ్గు రనునపుడు 'రామ రామ రామ' అనియు, ఇట్లే సంఖ్యానుసార ముగా 'రామ' అనుదానిని ఉచ్చరించవలసి యుండగా నీ సూత్రము చెప్పబడు చున్నది. 'ఔ','జస్' మొదలగు ద్వివచనబహువచన విభక్తి ప్రత్యయములు పర మగునపుడు సంఖ్యానుసారముగా ఆవృత్తము లగు సమానరూపము లగు పదములలో ఒక్కరూపము మాత్రమే శేషించును. ఉదాహరణకు— ద్వివచన ప్రత్యయ మగు 'ఔ' పర మగునపుడు 'రామ' అనుదానిని రెండు పర్యాయములు ఆవృత్తి చేయగా 'రామ రామ ఔ' అని యుండును. ఇచట నీ సూత్రముచే ఒక్క 'రామ' అనునది పరిశిష్టమై 'రామ + ఔ' అని యుండును, ఇట్లే యన్ని స్థలములందును చూచుకొనవలెను. ఇట్లు పరిశిష్ట మగు రూపమే 'యః శిష్యతే స లుప్యమానార్థాభిధాయీ' అను న్యాయముచే లుప్తరూపముల యర్థమును గూడ దెలుపును.

రామశబ్ద ప్రథమాద్వివచనమున నీ సూత్రముచే నేకశేషము చేయ 'రామ + ఔ' అని యుండగా—

126. ప్రథమయోః పూర్వసవర్ణః 6.1.102

అకః ప్రథమాద్వితీయయోరచి పూర్వసవర్ణదీర్ఘ ఏకాదేశః స్యాత్- ఇతి ప్రాప్తే.

'అకః సవర్ణే దీర్ఘః' నుండి 'అకః', 'దీర్ఘః', 'ఇకో యణచి' నుండి 'అచి', 'ఏకః పూర్వపరయోః' అను నధికారసూత్రమును అనువర్తించును.

'అక్'నకు ప్రథమ ద్వితీయ విభక్తి ప్రత్యయావయ మగు అచ్చు పర మైనచో పూర్వసవర్ణదీర్ఘ మేకాదేశ మగును. ఈ సూత్రముచే మకారోత్తర వర్తి యగు అకారము (అక్) కంటె 'ఔ'అను ప్రథమావిభక్త్యవయవ మగు అచ్చు పర మగుటచే పూర్వసవర్ణదీర్ఘ మగు 'ఆ'అనునది ఏకాదేశమై రావలసి యుండగా ('రామా' అను రూపము కావలసి యుండగా):-

127. నాదిచి. 6.1.104

ఆదిచి న పూర్వసవర్ణదీర్ఘః. 'వృద్ధిరేచి' - (33) రామౌ.

న,ఆత్,ఇచి. పై సూత్రమునుండి 'పూర్వసవర్ణః' అనువర్తించును.

అవర్ణముకంటె 'ఇచ్' పర మగునపుడు పూర్వసవర్ణదీర్ఘము రాదు. 'రామ + ఔ' అనునపుడు అవర్ణముకంటె 'ఇచ్'అగు 'ఔ' పర మగుటచే నీ సూత్రముచే పూర్వసవర్ణదీర్ఘ నిషేధము. కావున 'వృద్ధిరేచి' అను సూత్రముచే (33) వృద్ధివచ్చి 'రామౌ' అను రూపము సిద్ధించును.

128. బహుషు బహువచనమ్. 1.4.21

బహుత్వవివక్షాయాం బహువచనం స్యాత్.

ప్రాతిపదికార్థముల బహుత్వమును వివక్షించు నపుడు బహువచనము వచ్చును.

'చాలమంది రాములు' అను నర్థమును చెప్పవలసినపుడు ప్రథమవిభక్తి బహువచనప్రత్యయ మగు 'జస్' అనుదానిని 'రామ' యను ప్రాతిపదికకు చేర్చగా 'రామ + జస్' అని యుండును.

129. చుటూ. 1.3.7

ప్రత్యయాద్యౌ చుటూ ఇతౌ స్తః.

'ఉపదేశేఽజనునాసిక ఇత్' 'షః ప్రత్యయస్య' 'ఆదిర్ఞిటుడవః' అను సూత్రములనుండి 'ఇత్', 'ప్రత్యయస్య' 'ఆదిః' అను పదములు అనువర్తించును. ప్రత్యయమున కాదియందున్న చవర్గటవర్గములు ఇత్సంజ్ఞకము లగును. ఈ సూత్రముచే 'జస్' ప్రత్యయాదియందున్న జకార మిత్సంజ్ఞకమై లోపించుటచే 'రామ + అస్' అని యుండును.

'జస్'లోని అంత్యసకారమునకు 'హలన్త్యమ్' అను సూత్రముచే (1) ఇత్సంజ్ఞ రావలసి యుండ—

130. విభక్తిశ్చ. 1.4.104

సుప్తిఙౌ విభక్తిసంజ్ఞౌ స్తః.

'సుపః' అనుసూత్రము, 'తిఙస్త్రీణిత్రీణి ప్రథమమధ్యమోత్తమాః' నుండి 'తిఙః' అనువర్తించును.

సుప్ప్రత్యయతిఙ్ప్రత్యయములు విభక్తిసంజ్ఞ కలవి యగును 'సుప్' ప్రత్యాహారమును వెనుక చూచి యున్నాము. 'తిఙ్' అనునది గూడ ప్రత్యాహారమే. ఇవి ధాతువులకు చేర్పబడును. ఈ రెండువిధము లగు ప్రత్యయములకును నీ సూత్రముచే విభక్తిసంజ్ఞ విధింపబడుచున్నది.

### 131. న విభక్తౌ తుస్మాః. 1.3.4

**విభక్తిస్థాః తవర్గసమాః నేతః. ఇతి సస్య నేత్వమ్. రామాః.**

**"ఉపదేశేఽజనునాసిక ఇత్"** నుండి 'ఇత్' అనువర్తించును.

విభక్తియందలి తవర్గసకారమకారములు ఇత్సంజ్ఞకములు కావు. 'జస్' నందలి సకారము విభక్తిస్థము గాన నీ సూత్రముచే నిత్సంజ్ఞ నిషేధింపబడినది. కావున 'రామ + అస్' అనునపుడు 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము–'రామాస్'. ఇచట సకారమునకు 'ససజుషోరుః' (105). 'ఖరవసానయోర్విసర్జనీయః' (93) అను సూత్రములచే రుత్వవిసర్గములు చేయ 'రామాః' అను రూపము నిష్పన్నమగును. ఇట్లు రామః, రామౌ, రామాః, అను ప్రథమవిభక్తిరూపములు సిద్ధించినవి.

### 132. ఏకవచనం సమ్బుద్ధిః 2.3.49

**సమ్బోధనే ప్రథమాయా ఏకవచనం సమ్బుద్ధిసంజ్ఞం స్యాత్.**

'ప్రాతిపదికార్థలిఙ్గవచనమాత్రే ప్రథమా' 'సమ్బోధనేచ' అను సూత్రములనుండి 'ప్రథమా' 'సమ్బోధనే' అనువర్తించును. సమ్బోధనప్రథమయందలి ఏకవచనమునకు సమ్బుద్ధి యని పేరు.

సంబోధనమందు కూడ ప్రథమవిభక్తినే ఉపయోగించుటచే దీనికి సంబోధనప్రథమ యని పేరు. దీనియందు ఏకవచనమున కొంచెము భేదము గాని ద్వివచనబహువచనరూపములు ప్రథమయందువలెనే యుండును. దీని ఏకవచనమునకు సమ్బుద్ధి యను ప్రత్యేకసంజ్ఞ ఈ సూత్రముచే విధింపబడుచున్నది.

'హేరామ + సు' అని యుండగా.

### 133. యస్మాత్ప్రత్యయవిధిస్తదాది ప్రత్యయేఽఙ్గమ్. 1.4.13

**యః ప్రత్యయో యస్మాత్ క్రియతే తదాది శబ్దస్వరూపం తస్మిన్నఙ్గం స్యాత్.**

దేనికంటె ప్రత్యయము విధింపబడునో అది ప్రారంభమునగల (దానితో ఆరంభ మగు) శబ్దస్వరూపమునకు, అది (ఆ ప్రత్యయము) పర మగునపుడు, అఙ్గ మని పేరు.

**ఉదాహరణము:–** భూధాతులడు త్తమపురుషైకవచనమున 'భూ' అను దానికి 'మిప్' ప్రత్యయము చేయగా 'భూ + మి' అని యుండగా వాటి మధ్య 'శప్' (అ)

వచ్చుటచే భూ + అ + మి అని యుండగా గుణావాదేశములచే 'భవ + మి' అని యుండగా నీ సూత్రముచే అఙ్గసంజ్ఞ వచ్చును. ఎట్లన—భూ ధాతువుకంటె 'మి'అను ప్రత్యయము విధింపబడినది గాన ఆ మిప్రత్యయము పరముగ నున్న పుడు భూధాతువునకే కాక భూధాతువుతో ప్రారంభ మగు శబ్దస్వరూపమున కంతకును- 'భవ' అనుదానికి- అఙ్గసంజ్ఞ వచ్చును. ఈ సంజ్ఞ యుండుటచే 'అతో దీర్ఘో యఞి' అను సూత్రముచే (192) అదంతాంగమునకు దీర్ఘము వచ్చి 'భవామి' యను రూపము సిద్ధించును,

ప్రకృతలక్ష్యమున 'రామ' అనుదానికంటె 'సు'ప్రత్యయము చేయ బడినది. కావున అది పర మగునపుడు 'రామ' అనుదానితో ప్రారంభ మగు శబ్దస్వరూపమునకు—వ్యపదేశివద్భావముచే ఇచట 'రామ' అనునదే 'రామ'తో ప్రారంభ మగు శబ్దస్వరూపము- అఙ్గసంజ్ఞ లభించినది.

134. ఏఙ్ హ్రస్వాత్సమ్బుద్ధేః. 6.1.69

ఏఙన్తాత్ హ్రస్వాన్తాచ్చాఙ్గాత్ హల్లుప్యతే, సంబుద్ధేశ్చేత్. హేరామ, హేరామౌ, హేరామాః.

హల్ఙ్యాబ్భ్యోదీర్ఘాత్ సుతిస్యపృక్తం హల్' 'లోపో వ్యోర్వలి' అను సూత్రములనుండి'హల్''లోపః'అనువర్తించును. ఏఙన్తమును హ్రస్వాంతమును అగు అంగముకంటె పర మగు సంబుద్ధికి చెందిన హల్లు లోపించును

ఇచట 'రామ' అనునది హ్రస్వాన్త మగు అంగము గాన దానికంటె పరమైన సమ్బుద్ధ్యవయవమగు హల్లు లోపింప 'హేరామ' అను రూప మేర్పడి నది. ద్వివచనబహువచనములందు ప్రథమవిభక్తియందు వలెనే రూపనిష్పత్తి యుండును.

ద్వితీయవిభక్తియందు ఏకవచనమున 'రామ + అమ్' అని యుండగా- 'అకః సవర్ణే దీర్ఘః' అను సూత్రముచే (42) ప్రాప్త మగు సవర్ణదీర్ఘమును 'అతో గుణే' (274) అను పరరూపము బాధించును. కాని దానిని కూడ బాధించి 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను (126) పూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తించుచుండ-

135. అమి పూర్వః. 6.1.107

అకోఽమ్యచి పూర్వరూపమేకాదేశః స్యాత్. రామమ్. రామౌ.

'అకః స్సవర్ణే దీర్ఘః' 'ఇకో యణచి' నుండి 'అకః', 'అచి', 'ఏకః పూర్వపరయోః' అను అధికారసూత్రము అనువర్తించును. అక్కడనకు 'అమ్' నకు సంబంధించిన అచ్ పర మగునపుడు పూర్వరూప మేకాదేశ మగును.

ఈ సూత్రముచే పూర్వరూపము చేయగా 'రామమ్' అను రూపము సిద్ధించును.

ద్వివచనమున 'రామ + ఔట్' అనునపుడు టకారము 'హలన్త్యమ్' అను (1) సూత్రముచే ఇత్సంజ్ఞకము. వృద్ధి రాగా 'రామౌ' అను రూపము సిద్ధించును.

బహువచనమున 'రామ + శస్' అని యుండగా—

## 136. లశక్వతద్ధితే. 1.3.8

తద్ధితవర్జప్రత్యయాద్యాః లశకవర్గాః ఇతః స్యుః.

'ఉపదేశేఽజనునాసిక ఇత్' 'ఆదిర్ఞిటుడవః' 'షః ప్రత్యయస్య' అను సూత్రములనుండి 'ఇత్' 'ఆదిః' 'ప్రత్యయస్య' అనువర్తించును. తద్ధితప్రత్యయ భిన్న ప్రత్యయముల ఆదియందున్న లకారశకారకవర్గములు ఇత్సంజ్ఞకము లగును.

ఈ సూత్రముచే 'శస్'లోని శకారమునకు ఇత్సంజ్ఞచే లోపము. 'నవిభక్తౌ తుస్మాః' అను సూత్రముచే (131) నిషిద్ధము గాన సకారమునకు 'హలన్త్యమ్' అను సూత్రముచే (1) ఇత్సంజ్ఞ రాదు. 'రామ + అస్' అని యుండగా "ప్రథమయోః పూర్వసవర్ణః" అను సూత్రముచే (126) పూర్వసవర్ణము చేయగా 'రామాస్' అని యుండును. ఇపుడు—

## 137. తస్మాచ్ఛసో నః పుంసి. 6.1.103

పూర్వసవర్ణదీర్ఘాత్పరో యః శసః సస్తస్య నః స్యాత్పుంసి.

'తస్మాత్' అనునది పూర్వసూత్రోక్తపూర్వసవర్ణదీర్ఘమును పరామర్శించును. పూర్వసవర్ణదీర్ఘముకంటె పర మగు 'శస్' ప్రత్యయ సకారమునకు పుంలిఙ్గమున నకార మాదేశ మగును.

ఈ సూత్రముచే సకారమునకు నకార మాదేశమై 'రామాన్' అను రూపము సిద్ధించును.

ఇచట నకారమునకు ణకార మాశంకించి పరిహరింపబడుచున్నది.

138. అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి. 8.4.2

అట్, కవర్గ, పవర్గ, ఆఙ్, నుమ్ఏతై ర్వ్యస్తైః సమస్తైర్యథా సమ్భవం మిలితైశ్చ వ్యవధానేఽపి రషాభ్యాం పరస్య నస్య ణః సమాన పదే. ఇతిప్రాప్తే:-

'రషాభ్యాం నో ణః సమానపదే' అను సూత్రము అనువర్తించును. అట్,కవర్గ,పవర్గ,ఆఙ్,నుమ్ అనువాటితో ప్రత్యేకముగ గాని, వీటి యన్నిటితో గాని లేక యథాసంభవముగ కలసిన వీటిలోని కొన్నిటితో గాని వ్యవధాన మున్నను రేఫ షకారములకంటె పర మగు నకారమునకు ణకార మాదేశ మగును.

'రామాన్' అనునపుడు రేఫముంటె నకారము పరముగ నున్నది. రేఫ నకారముల నడుమ 'ఆమ్ఆ' అను మూడక్షరములున్నవి. అందు అట్ ప్రత్యాహారములోనిది. 'మ్'పవర్గమునకు చెందినది. వీటితో వ్యవధాన మున్నను పై సూత్రముచే ణత్వము రావలసి యుండగా:-

139. పదాన్తస్య. 8.4.37

నస్య ణో న. రామాన్.

'రషాభ్యాం నో ణః సమానపదే' అను సూత్రము, 'నమాభూపూర్వ..గ మిప్యాయీవేపామ్' నుండి 'న' అనువర్తించును.

(రేఫషకారములకంటె పరమైనను) పదాన్తనకారమునకు ణకారమురాదు. ఈ సూత్రముచే ణత్వము నిషిద్ధము గాన 'రామాన్' అను రూపము సిద్ధించును. ఈ విధముగ ద్వితీయవిభక్తిలో 'రామం, రామౌ, రామాన్' అను రూపములు సిద్ధించును.

తృతీయవిభక్త్యేకవచనమున 'రామ + టా' అని యుండగా-

140. టాఙసిఙసామినాఽఽత్స్యాః. 7.1.12

అదన్తాత్ టాదీనాం ఇనాదయః స్యుః. ణత్వమ్. రామేణ.

'అఙ్గస్య' అధికారము. 'అతో భిస ఐస్' నుండి 'అతః' అనువర్తించును. అదన్తాంగముకంటె పర మగు టా,ఙసి,ఙస్ అను ప్రత్యయములకు (క్రమముగా) ఇన,ఆత్,స్య అను నాదేశములు వచ్చును.

ఇచట అదంతాంగ మగు 'రామ' అను దానికంటె పరముగ నున్న 'టా'కు 'ఇన' వచ్చుటచే 'రామ + ఇన'- గుణసంధిచే 'రామేన'- పిదప 'అట్'

కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి' అను సూత్రముచే (138) ణత్వము చేయగా 'రామేణ' అను రూపము సిద్ధించును.

రామశబ్దమునకు తృతీయాద్వివచనప్రత్యయ మగు 'భ్యామ్' అనునది పర మగునపుడు 'రామ + భ్యామ్' అని యుండగా:-

141. సుపి చ. 7.3.102

యఞాదౌ సుపి పరే అతోఽఙ్గస్య దీర్ఘః. రామాభ్యామ్.

'అతో దీర్ఘో యఞి' అను సూత్రము అనువర్తించును. అదన్త మగు అంగమునకు యఞాది యగు సుప్ప్రత్యయము పర మగునపుడు దీర్ఘము వచ్చును.

ఇచట అదన్తాంగ మగు 'రామ' అనుదానికి యఞ్ప్రత్యాహారాన్తర్గత మగు భకార మాదియందు గల సుప్ పర మగుటచే హ్రస్వ మగు 'అ'కారము నకు (అలోన్త్యపరిభాషచే 21) దీర్ఘము వచ్చి 'రామాభ్యామ్' అను రూపము సిద్ధించును.

'న విభక్తౌ తుస్మాః' అని (131) నిషేధించుటచే మకారమున కిత్సంజ్ఞ లేదు.

తృతీయాబహువచనవిభక్తిప్రత్యయ మగు 'భిస్'ను జేర్చుటచే 'రామ + భిస్' అని యుండ:-

142. అతో భిస ఐస్. 7.1.9

'అనేకాల్ శిత్ సర్వస్య' (45)-రామైః,

'అఙ్గస్య' అధికారము. అదంతాంగముకంటె పర మగు 'భిస్'నకు 'ఐస్' ఆదేశముగ వచ్చును.

ఈ 'ఐస్' అను నాదేశము అనేకాల్- అనగా అనేకాక్షరము అగుటచే 'అనేకాల్ శిత్ సర్వస్య' అను పరిభాషచే (45) సర్వాదేశమై -అనగా మొత్తము 'భిస్' అనుదాని స్థానమున- వచ్చును. రామ + ఐస్ అని యుండగా 'వృద్ధిరేచి' అని (33) వృద్ధిచేయ సకారమునకు రుత్వవిసర్గములును, చేయగా 'రామైః' అను రూపము సిద్ధించును. 'భిస్' 'ఐస్'లలోని సకారమునకు ఇత్సంజ్ఞ 'న విభక్తౌ తుస్మాః' అను సూత్రముచే (131) నిషిద్ధము.

ఇట్లు తృతీయవిభక్తియందు 'రామేణ-రామాభ్యామ్-రామైః' అను రూపములు సిద్ధించినవి.

రామశబ్ద చతుర్థవిభక్త్యేకవచనమున 'రామ + ఙే' అని యుండగా-

143. ఙేర్యః. 7.1.13

అతోఽఙ్గాత్పరస్య ఙేర్యాదేశః.

'అఙ్గస్య' అధికృతము. 'అతో భిస ఐస్' అనుసూత్రమునుండి 'అతః' అను పద మనువర్తించును. అదంతాంగముకంటె పర మగు 'ఙే' అనుదానికి 'య' అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే అదంతాంగ మగు 'రామ' అనుదానికంటె పర మగు 'ఙే'కు (ఙేలోని ఙకారమునకు 'లశక్వతద్ధితే' అను సూత్రముచే (136) ఇత్సంజ్ఞ) 'య' వచ్చుటచే 'రామ + య' అని యుండును. ఇచట 'సుపి చ' అను సూత్రముచే (141) దీర్ఘము చేయవలసి యున్నది. కాని 'ఙే' అనునది 'సుప్' ఐనను దాని స్థానమున వచ్చిన 'య'అనునది 'సుప్' కాదు గాన 'సుపి చ' అను సూత్రము ప్రవర్తించు నవకాశము లేదను శంకను తొలగించుటకై క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

144. స్థానివదాదేశోఽనల్విధౌ. 1.1.56

ఆదేశః స్థానివత్ స్యాత్, న తు స్థాన్యలాశ్రయవిధౌ. ఇతి స్థానివత్త్వాత్ 'సుపి చ' (141) ఇతి దీర్ఘః- రామాయ, రామాభ్యామ్.

ఆదేశము స్థానితో సమాన మైనది యగును; కాని స్థాని యగు 'అల్' (అక్షరము)ను ఆశ్రయించి ఏదైన కార్యము చేయవలసి యున్నప్పుడు మాత్రము స్థానితో సమానము కాదు.

ఇచట 'అనల్విధౌ' అనునపుడు 'అలః (స్థానే) విధిః' 'అలా విధిః', 'అలి (పరతః) విధిః', 'అలః (పరస్మాత్) విధిః'అను విగ్రహముల నంగీకరించుటచే అల్లు స్థానమునగాని,అల్లు నిమిత్తముగ జేసికొని గాని,అల్లు పరముగా నుండు నపుడు గాని, అల్లుకంటె పర మగునపుడు గాని కార్యము వచ్చినపుడు ఈ స్థానివద్భావము రాదు అను నర్థము సిద్ధించును.

ఈ సూత్రముచే 'ఙే' స్థానమున వచ్చిన 'య'కూడ 'ఙే'తో సమాన మైన దగుటచే దాని ధర్మము లన్నియు దీనికిని సంక్రమించును. కావున నిది కూడ సుప్ప్రత్యయమే గాన 'సుపి చ'అను సూత్రము ప్రవర్తించి దీర్ఘము వచ్చుటచే 'రామాయ'అను రూపము సిద్ధించును.

చతుర్థీద్వివచనమున కూడ 'రామాభ్యామ్'అను రూపము తృతీయా ద్వివచనమునందువలెనే నిష్పన్న మగును.

145. బహువచనే ఝల్యేత్. 7.3.103

ఝలాదౌ బహువచనే సుపి అతోఽఙ్గస్యైకారః. రామేభ్యః, సుపి కిమ్? పచధ్వమ్.

'అతో దీర్ఘో యఞి' 'సుపి చ'అను సూత్రముల నుండి 'అతః','సుపి' అనువర్తించును. 'అఙ్గస్య' అధికారము. ఝలాది యగు బహువచనసుప్ప్రత్యయము పర మగునపుడు అదంతాంగమునకు ఏకారము ఆదేశ మగును.

'రామ'శబ్దమునకు చతుర్థీబహువచనప్రత్యయ మగు 'భ్యస్' అనునది పర మగునపుడు 'రామ + భ్యస్'అని యుండగా ఈ సూత్రము ప్రవర్తించును. అకారాన్త మగు అంగమైన 'రామ'అనుదానికి ఝల్ ప్రత్యాహారాంతర్గత మగు భకారము ఆదియందు గల 'భ్యస్'అను ప్రత్యయము పర మగుటచే 'అ'కారమునకు 'ఏ'కార మాదేశమై 'రామేభ్యస్'అని యగును. పిదప సకారమునకు రుత్వవిసర్గములు చేయ 'రామేభ్యః' అను రూపము సిద్ధించును.

'సుపి'అననేల? అట్లనకున్నచో 'పచ + ధ్వమ్'అను నపుడు అదన్తాంగ మగు 'పచ'అనుదానికి ఝలాదిబహువచనప్రత్యయ మగు 'ధ్వమ్' అనునది పరముగ నుండుటచే ఏత్వము వచ్చి యుండెడిది. 'సుపి'యనుటచే నిది ఝలాది బహువచనప్రత్యయ మైనను 'తిఙ్'గాన, (సుప్ కాదు గాన) ఏత్వము రాదు. 'పచధ్వమ్'అనునది పచధాతులోణ్మధ్యమపురుషబహువచన రూపము.

రామశబ్దమునకు పంచమ్యేకవచనమున 'ఙసి'అను ప్రత్యయమును జేర్చగా 'రామ + ఙసి'అని యుండును. ఇపుడు 'టాఙసి ఙసామినాత్స్యాః'అను సూత్రముచే (140) 'ఆత్'అనునది అనేకాల్ కావున సర్వాదేశముగ (సూ.45) వచ్చును-'రామ + ఆత్',సవర్ణదీర్ఘసంధిచే 'రామాత్'అను రూపము సిద్ధించును. పిదప 'ఝలాంజశోన్తే'అను సూత్రముచే (67) జశ్త్వము వచ్చి 'రామాద్'అను రూపము సిద్ధించగా:-

146. వావసానే. 8.4.56

అవసానే ఝలాం చరో వా.రామాత్, రామాద్, రామాభ్యాం, రామేభ్యః.

'ఝలాం జశ్ ఝశి' 'అభ్యాసే చర్చ'అను సూత్రములనుండి 'ఝలాం' 'చర్' అనువర్తించును. అవసానమునందలి ఝల్‌లకు చర్‌లు వికల్పముగ వచ్చును.

'రామాద్'అనునపుడు 'ద'కారము అవసానము గాన వైకల్పికముగ చర్త్వముచే తకార మాదేశమై 'రామాత్' అనియు, చర్త్వము రాని పక్షమున 'రామాద్' అనియు రెండు రూపము లుండును.

ద్వివచన బహువచనములలో 'రామాభ్యామ్' 'రామేభ్యః' అను రూపములు చతుర్థియందు వలెనే నిష్పన్నము లగును.

షష్ఠ్యేకవచనమున 'ఙస్'ప్రత్యయము చేర్చగా 'రామ + ఙస్'అని యున్నది. ఇట 'టాఙసిఙసామినాత్స్యాః'అను సూత్రముచే (140) 'స్య'అనునది 'ఙస్ కు ఆదేశముగ వచ్చి 'రామస్య'అను రూపము సిద్ధించును.

షష్ఠీద్వివచనమున 'రామ'శబ్దమునకు 'ఓస్'ప్రత్యయమును జేర్చగా 'రామ + ఓస్'అని యుండ,

147. ఓసి చ. 7.3.104.

(ఓసి పరే) అతోఽఙ్గస్యైకారః. రామయోః.

'అఙ్గస్య' అధికారము. 'అతో దీర్ఘో యఞి' 'బహువచనే ఝల్యేత్' అను సూత్రముల నుండి 'అతః' 'ఏత్' అనువర్తించును.

అదంతాంగమునకు ఓస్ పర మగునపుడు ఏకార మాదేశ మగును.

అలోఽన్త్యపరిభాషచే (21) అకారమునకు ఏకార మాదేశమై 'రామే + ఓస్'అని యుండ 'ఏచోయవాయావః'అను సూత్రముచే (22) అయాదేశము, సకారమునకు రుత్వవిసర్గములును వచ్చి 'రామయోః' అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున రామశబ్దమునకు 'ఆమ్'ప్రత్యయమును జేర్చుటచే 'రామ + ఆమ్'అని యుండ సవర్ణదీర్ఘము ప్రాప్తింపగా:-

148. హ్రస్వనద్యాపో నుట్ 7.1.54

హ్రస్వాన్తాత్ నద్యన్తాత్ ఆబన్తాచ్చాఙ్గాత్పరస్యామో నుడాగమః.

'అఙ్గస్య' అధికారము. 'ఆమి సర్వనామ్నః సుట్' నుండి 'ఆమి' అనువృత్తమై విభక్తివిపరిణామముచే 'ఆమః' అని యగును. హ్రస్వాంతము,

అబంతము నగు అంగముకంటె పర మగు 'ఆమ్'కు 'నుట్'అను నాగమము వచ్చును.

'నుట్'లోని 'ఉ''ట్'లు ఇత్సంజ్ఞకములు ఇది టిత్తు గాన 'ఆమ్'కు ఆద్య వయవముగ వచ్చును.

'రామ + ఆమ్'అనునపుడు 'ఆమ్'అనునది హ్రస్వాంతమగు అంగము కంటె పర మగుటచే నుడాగమము ఆద్యవయవముగ వచ్చి 'రామ + నామ్' అని యుండగా-

149. నామి 6.4.3

(నామి పరే) అజన్తాఙ్గస్య దీర్ఘః. రామాణామ్. రామే,రామయోః. ఏత్వే కృతే—

'అఙ్గస్య' అధికారము. 'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి'దీర్ఘః' అనువర్తించుచు 'అచశ్చ'అను పరిభాష ననుసరించి [1] 'అచః' అను పదము లభించును. 'నామ్'పర మగునపుడు అజన్తాఙ్గమునకు దీర్ఘము వచ్చును.

ఈ సూత్రముచే 'రామ'అను అజన్తాంగమునకు నామ్ పర మగుటచే అలోఽన్త్యపరిభాషచే (సూ.21) దీర్ఘము చివరి అకారమునకు వచ్చును. 'రామా + నామ్' అని యుండగా 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేపి' అను సూత్ర ముచే (138) ణత్వము 'రామాణామ్' అను రూపము సిద్ధించును. ఈ విధముగ షష్ఠి యందు 'రామస్య, రామయోః, రామాణామ్' అను రూపములు సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'రామ'శబ్దమునకు 'ఙి'ప్రత్యయమును జేర్చగా 'రామ + ఙి'అని యుండును. 'లశక్వతద్ధితే' అను సూత్రముచే (136) ఙకార మునకిత్సంజ్ఞ—'రామ + ఇ'. 'ఆద్గుణః'అను సూత్రముచే (27) గుణము- 'రామే' అను రూపము సిద్ధించును.

సప్తమీద్వివచనమున 'షష్ఠీ' ద్వివచనమునందు వలె 'రామయోః'అను రూపము సిద్ధించును.

---

1. అచశ్చ. 1.2.28. హ్రస్వదీర్ఘ ప్లుతశబ్దైర్యత్ర అజ్విధీయతే తత్ర అచ ఇతి షష్ఠ్యన్తం పదముపతిష్ఠతే (సి. కౌ.). (ఇది పరిభాషా సూత్రము) హ్రస్వదీర్ఘప్లుతశబ్దోచ్చారణపూర్వకముగ నెచట అచ్ విధింపబడునో అచట 'అచః'అను షష్ఠ్యంతపద ముపస్థిత మగును.

సప్తమీ బహువచనమున రామశబ్దమునకు 'సుప్' అను ప్రత్యయమును జేర్చ 'రామ + సుప్'అని యుండును. పకారమునకు హలన్త్యసూత్రముచే (1) ఇత్సంజ్ఞ-'రామ + సు', 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) 'అ'కారమునకు 'ఏ'కారము-'రామే + సు'అని యుండగా.

## 150. ఆదేశప్రత్యయయోః 8.3.59

ఇణ్కుభ్యాం పరస్యాపదాన్తస్యాదేశః ప్రత్యయావయవశ్చ యః సస్తస్య మూర్ధన్యాదేశః. ఈషద్వివృతస్య సస్య తాదృశ ఏవ షః, రామేషు. ఏవం కృష్ణాదయోఽప్యదన్తాః.

'అపదాన్తస్య మూర్ధన్యః' 'ఇణ్కోః' అనునధికార సూత్రములును. 'సహేః సాడః సః'నుండి 'సః' అను పదమును అనువర్తించును. ఇణ్ కవర్గములకంటె పరమును, అపదాన్తమును, ఆదేశము గాని,ప్రత్యయావయవము గాని,యగు సకారమునకు మూర్ధన్యవర్ణ మాదేశ మగును.

ఇచట ఇణ్(ఏకారము) కంటె పర మగు సకారము ప్రత్యయావయవమైనది. పదాన్తము కాదు. కావున నీ సూత్రముచే మూర్ధన్యము వచ్చును. సకారము ఈషద్వివృతము గాన దానికి మూర్ధన్యవర్ణములలో ఈషద్వివృత యత్నము కల దగు షకార మాదేశ మై 'రామేషు'అను రూపము సిద్ధించును.

ఇట్లు సప్తమవిభక్తియందు 'రామే, రామయోః, రామేషు' అను రూపములు సిద్ధించినవి 'కృష్ణ'మొదలగు అకారాంతశబ్దము లన్నియు నిట్లే సిద్ధించును.

## 151. సర్వాదీని సర్వనామాని 1.1.27.

సర్వాదులకు (సర్వాదిగణపఠితము లగు శబ్దములకు) సర్వనామములని పేరు.

సర్వనామ మనగా అన్నిటికిని నామ మని యర్థము, అనగా ఈ గణమునందలి పదము లన్నియు ప్రత్యేకముగ నొక వ్యక్తి లేక వస్తువు విషయమున గాక ప్రసంగానుసారముగ ఏవ్యక్తిని లేక వస్తువును గూర్చి యైనను ప్రయుక్తము లు కావచ్చును. ఉదాహరణకు 'సర్వః' 'త్వం''అహమ్' మొదలగు వాటిని సందర్భానుసారముగ నే వ్యక్తులను లేక వస్తువులను గూర్చియైనను ప్రయోగించవచ్చును. సర్వాదిగణము ఈ క్రింద చూపబడుచున్నది.

సర్వ, విశ్వ, ఉభ, ఉభయ, డతర, డతమ, అన్య, అన్యతర
ఇతర, త్వత్, త్వ, నేమ, సమ, సిమ. (గణసూత్రము) పూర్వపరాఽ
వరదక్షిణోత్తరాఽపరాధరాణి వ్యవస్థాయామసంజ్ఞాయామ్. (గ. సూ.)
స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్. (గ.సూ.) అన్తరం బహిర్యోగోపసంవ్యా
నయోః. త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి
యుష్మద్, అస్మద్, భవతు, కిమ్.

'సర్వ' మొదలు 'కిమ్'వరకును గల పదములకు సర్వాదిగణ మని పేరు. సర్వ = సమస్తము. విశ్వ = సమస్తము. ఉభ = రెండు. ఉభయ = రెండింటి సముదాయము. 'డతర', 'డతమ' అనునవి ప్రత్యయములు. కావున తదంతములకు సర్వనామత్వము, అన్య = ఇతర మైనది. అన్యతర = రెంటింటిలో నొకటి. ఇతర = ఇతర మైనది. త్వత్, త్వ = అన్యమైన. నేమ = సగము. సమ = సమస్తమైన. సిమ = సమస్తమైన.

'పూర్వపర' మొదలగు మూడు సూత్రములును గణపాఠమధ్యమునందుండుటచే వీటికి గణసూత్రము లని పేరు. 'పూర్వ'మొదలగు నేడు శబ్దములును వ్యవస్థయందును, సంజ్ఞావాచకములు కాని యప్పుడును మాత్రమే ఈ గణమున చేర్చబడును. వ్యవస్థ యనగా స్వాభిధేయాపేక్షావధి నియమము, అనగా తన వాచ్యార్థముచే నపేక్షితమగు అవధియొక్క నియమము. ఉదా-'పూర్వః' యనగనే దేనికంటె? అను నాకాంక్ష తప్పక కలుగును. ఈ విధముగ నియతముగ అవధిసాపేక్ష మగు అర్థమును బోధించునపుడు మాత్రమే పూర్వాదులకు సర్వనామసంజ్ఞ. మరియు ఈ పూర్వాదులు సంజ్ఞావాచకములుగ నుండరాదు. అటులైనయడలనే వాటికి సర్వనామసంజ్ఞ. ఉదాహరణకు-'పూర్వః'అనునది దేనికైన నామధేయముగ నుపయుక్త మైనచో దానికి సర్వనామసంజ్ఞ యుండదు.

పూర్వ = మొదటి. పర = రెండవ (ఇతరమైన.) అపర = పశ్చిమము. దక్షిణ = దక్షిణము. ఉత్తర = ఉత్తరము. అపర = పశ్చిమము. అధర = క్రిందనున్న.

బంధువు,ధనము అను నర్థములకంటె భిన్నము లగు నర్థములందు 'స్వ'శబ్దము సర్వనామసంజ్ఞక మగును.

బాహ్యము అను నర్థమునందును, అధోవస్త్ర మను నర్థమందును మాత్రమే 'అంతర' శబ్దము సర్వనామసంజ్ఞ మగును.

త్యద్ = అది,ఆ. తద్ = అది,ఆ. యద్ = ఏదైతే. ఏతద్ = ఇది. ఇదమ్ = ఇది,ఈ. అదస్ = అది,ఆ. ఏక = ఒక. ద్వి = రెండు. యుష్మద్ = నీవు అస్మద్ = నేను. భవతు = తమరు. కిమ్ = ఎవరు, ఏది.

ఈ సర్వాదిగణమున మొదటి శబ్ద మగు సర్వశబ్దమునకు జస్,ఙే ఙసి, ఆమ్,ఙి అను నైదు విభక్తిప్రత్యయములు పర మగునపుడు తక్క ఇతరరూపము లన్నియు 'రామ'శబ్ద రూపముల వలెనే యుండును. కావున ప్రథమైకవచన ద్వివచనములందు 'సర్వః','సర్వౌ'అను రూపము లగును. బహువచనమున 'సర్వ + జస్'అని యుండగా పూర్వసవర్ణదీర్ఘము రావలసియుండ.

152. జసః శీ 7 1.17

అదన్తాత్ సర్వనామ్నో జసః శీ స్యాత్.అనేకాల్త్వాత్ సర్వాదేశః. సర్వే.

'అతో భిస ఐస్' 'సర్వనామ్నః స్మై'నుండి 'అతః''సర్వనామ్నః' అను వర్తించును. అదంత మగు సర్వనామముకంటె పర మగు 'జస్'కు 'శీ అను నది ఆదేశ మగును.

'శీ'అనునది అనేకాల్ అగుటచే సర్వాదేశమై వచ్చును. 'శీ'యనునది గూడ స్థానివద్భావముచే ప్రత్యయము గాన 'లశక్వతద్ధితే'అను సూత్రముచే (136) శకార మిత్సంజ్ఞక మగును. 'సర్వ + ఈ'-'ఆద్గుణః' (27) 'సర్వే' అను రూపము సిద్ధించును. ద్వితీయతృతీయ విభక్తులలో రామశబ్దమునకు వలెనే రూపము లుండును. చతుర్థ్యేకవచనమున 'సర్వ + ఙే' అని యుండ.

153 .సర్వనామ్నః స్మై 7.1.14

అతః సర్వనామ్నో ఙేః స్మై. సర్వస్మై.

'అతో భిస ఐస్' 'ఙేర్యః'నుండి 'అతః' 'ఙే' అనువర్తించును. అదన్త సర్వనామముకంటె పర మగు 'ఙే'ప్రత్యయమునకు 'స్మై' అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఙే'కు 'స్మై'అను నాదేశము చేయ 'సర్వస్మై' అను రూపము సిద్ధించును.

పంచమ్యేకవచనమున 'సర్వ + ఙసి'అని యుండగా-

154. ఙసిఙ్యోః స్మాత్స్మినౌ 7.1.15

అతః సర్వనామ్నో ఙసిఙ్యో రేతౌ స్తః. సర్వస్మాత్.

'అతో భిస ఐస్' 'సర్వనామ్నః స్మై'నుండి 'అతః''సర్వనామ్నః' అనువర్తించును. అదంతసర్వనామముకంటె పర మగు 'ఙసి''ఙి'అను సుప్ ప్రత్యయములకు (క్రమముగా) 'స్మాత్''స్మిన్'అను నాదేశములు వచ్చును.

ఈ సూత్రముచే 'ఙసి'కి 'స్మాత్'అను నాదేశము చేయగా 'సర్వస్మాత్' అను రూపము సిద్ధించును.

షష్ఠీ బహువచనమున 'సర్వ + ఆమ్' అని యుండగా-

155. ఆమి సర్వనామ్నః సుట్ 7.1.52.

అవర్ణాన్తాత్ పరస్య, సర్వనామ్నో విహితస్యామః సుడాగమః స్యాత్. ఏత్వషత్వే - సర్వేషామ్. సర్వస్మిన్. శేషం రామవత్. ఏవం విశ్వాదయోప్యదన్తాః.

'అఙ్గస్య' అధికారము. 'ఆజ్జసేరసుక్'నుండి 'ఆత్' అనువర్తించును. అవర్ణాంత మగు అంగముకంటె పరమును, సర్వనామముకంటె (పరముగ) విధి పబడినదియు నగు 'ఆమ్'కు 'సుట్'అను నాగమము వచ్చును.

'సుట్'నందలి 'ఉ''ట్'లు ఇత్సంజ్ఞకములు. టిత్‌గాన 'ఆమ్'నకు ఆద్యవయవముగ వచ్చును. ఈ సుడాగమముచే 'సర్వ + సామ్'అని యుండ 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) ఝలాది బహువచనము పరముగ నున్నది గాన వెనుక నున్న అకారమునకు ఏకారము వచ్చి 'సర్వేసామ్' అని యుండగా'ఆదేశప్రత్యయయోః'(150) అను సూత్రముచే'సామ్'ప్రత్యయావయవ మగు సకారమునకు షత్వము చేయ 'సర్వేషామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'సర్వ + ఙి'అని యుండగా-'ఙసిఙ్యోః స్మాత్స్మినౌ'అను సూత్రముచే (154) 'ఙి'ప్రత్యయమునకు 'స్మిన్' అను నాదేశము వచ్చుటచే 'సర్వస్మిన్'అను రూపము సిద్ధించును. ఇతర రూపము లన్నియు రామశబ్ద రూపముల వలె ఉండును. సర్వనామశబ్దములలో చేర్పబడిన 'విశ్వ' మొదలగు అదన్తశబ్దము లన్నియును సర్వశబ్దమువలెనే యుండును.

ఉభశబ్దో నిత్యం ద్వివచనాన్తః. ఉభౌ-2. ఉభాభ్యామ్-3. ఉభయోః-2. తస్యేహ పాఠ అకజర్థః.

ఉభశబ్దమునకు 'రెండును' లేక 'ఇరువురును' అని యర్థము. కావున దీనికి ద్వివచనాంతరూపములే గాని ఏకవచన బహువచనాంతరూపము లుండవు. ప్ర వి-ఉభౌ; ద్వి-ఉభౌ; తృ-ఉభాభ్యామ్; చ-ఉభాభ్యామ్; పం-ఉభాభ్యామ్; ష-ఉభయోః; స-ఉభయోః; అను రూపము లుండును.

సర్వశబ్దమునందు చూచిన విధమున సర్వనామసంజ్ఞాప్రయుక్తము లగు విశేషకార్యము లన్నియు ఏకవచన బహువచనములందు మాత్రమే యుండుటచే నిత్యద్వివచన మగు 'ఉభ' శబ్దమును సర్వనామశబ్దములలో పఠించుటవలని ప్రయోజన మేమని సందేహము కలుగవచ్చును. దానికి సర్వనామత్వ ముండుటచే 'అవ్యయ సర్వనామ్నామకచ్ ప్రాక్టేః' అను సూత్రముచే (1232) టికి పూర్వము 'అకచ్' ప్రత్యయము వచ్చును. ఇదియే దాని సర్వనామత్వమునకు ప్రయోజనము.

ఉభయశబ్దస్య ద్వివచనం నాస్తి. డతరడతమౌ ప్రత్యయౌ. 'ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణమ్' ఇతి తదన్తా గ్రాహ్యాః, నేమ ఇత్యర్ధే. సమః సర్వపర్యాయః. తుల్యపర్యాయస్తు న. 'యథాసంఖ్య మనుదేశః సమానామ్' ఇతి జ్ఞాపకాత్.

ఉభయశబ్దమునకు రెండు అవయవములు కలది అని అర్థము. దీనికి ద్వివచనమున ప్రయోగము లేదు. ఏకవచన బహువచనములలో సర్వశబ్దమునకు వలె రూపము లుండును.

ఈ గణమున పఠితము లగు 'డతర' 'డతమ' అనునవి ప్రత్యయములు. 'న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః' అను న్యాయముచే ఈ ప్రత్యయములకు స్వతంత్రప్రయోగ ముండదు. 'ప్రత్యయగ్రహణే తదన్తా గ్రాహ్యాః' అను న్యాయమున 'డతర' 'డతమ' ప్రత్యయములు సర్వనామసంజ్ఞకము లనగా 'డతర' 'డతమ' ప్రత్యయాంతములు సర్వనామసంజ్ఞము లగు నని యర్థము. కావున ఈ ప్రత్యయములను జేర్చుటచే సిద్ధించిన కతర, కతమ, యతర, యతమ, తతర, తతమ, ఏకతర, ఏకతమ అను ఎనిమిది శబ్దములును సర్వనామసంజ్ఞములై సర్వశబ్దమువలె నుండును. నేమశబ్దమునకు సగము, అని యర్థము.

సమశబ్దమునకు సమస్తము,సమానము,అను రెండర్థములు కలవు. అందు సమస్తము అను నర్థమునందు మాత్రమే దీనికి సర్వనామసంజ్ఞ యుండును గాని 'సమానము'అను నర్థమున నుండదు. 'యథాసఙ్ఖ్యమనుదేశస్సమానామ్'అను సూత్రమున పాణిని 'సమానామ్'అని ప్రయోగించుటయే ఇందులకు ప్రమాణము. సమానార్థక మగు సమశబ్దమునకు గూడ సర్వనామసంజ్ఞయుండుచో పాణిని షష్ఠీబహువచనమున 'సమేషామ్'అని ప్రయోగించి యుండెడివాడు.

156. పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయా మసంజ్ఞాయామ్ 1.1.34

ఏతేషాం వ్యవస్థాయామసంజ్ఞాయాం సర్వనామసంజ్ఞా గణసూత్రాత్ సర్వత్ర యా ప్రాప్తా సా జసి వా స్యాత్. పూర్వే, పూర్వాః. అసంజ్ఞాయాం కిమ్?ఉత్తరాః కురవః. స్వాభిధేయాపేక్షావధినియమో వ్యవస్థా. వ్యవస్థాయాం కిమ్? దక్షిణా గాథకాః. కుశలా ఇత్యర్థః.

'విభాషా జసి'అను సూత్రము, 'సర్వాదీని సర్వనామాని'నుండి 'సర్వనామాని' అనువర్తించును. పూర్వాదిపదములకు వ్యవస్థయందును, అసంజ్ఞావాచకత్వమునందును గణసూత్రముచే నిత్యముగ లభించిన సర్వనామసంజ్ఞ 'జస్' పర మగునపుడు వికల్పముగ నుండును.

'పూర్వ + జస్'అనునపుడు ఈ సూత్రముచే పూర్వశబ్దమునకు సర్వనామసంజ్ఞ వైకల్పికము గాన సర్వనామసంజ్ఞయున్నపుడు 'జసః శీ'(152)ఇత్యాదులు ప్రవర్తించుటచే 'పూర్వే' యనియు, లేని పక్షమున 'రామాః'వలె 'పూర్వాః' అనియు రెండు రూపములు సిద్ధించును.

'అసంజ్ఞాయామ్'అన నేల?అట్లనుటచే ఈశబ్దములు సంజ్ఞావాచకములుగ నుపయుక్తము లైనపుడు సర్వనామసంజ్ఞ యుండదు. 'ఉత్తరాః కురవః'అను చోట 'ఉత్తరాః'అనునది ఒక దేశమునకు నామధేయముగ నుపయుక్త మైనది గాన దీనికి సర్వనామసంజ్ఞ లేదు. కావుననే 'ఉత్తరే'యను రూపము కాక 'ఉత్తరాః'అను రూపము సిద్ధించినది. (వ్యవస్థాపదార్థము గణసూత్రవ్యాఖ్యానమునచూపబడినది) 'వ్యవస్థాయామ్'అని యననేల?వ్యవస్థ లేనిచో సర్వనామసంజ్ఞ రాకుండుటకై ఈ పదము చేర్చబడినది. కావుననే 'దక్షిణా గాథకాః'అనుచో 'దక్షిణాః' అనుదానికి 'నేర్పరులు' అను నర్థమగుటచే (వ్యవస్థ లేదు గాన)

సర్వనామసంజ్ఞ లేదు. దిగ్వాచకమైనపుడే దేనికి ఉత్తరము, దేనికి దక్షిణము అను అవధ్యపేక్ష యుండును గాన, ఉత్తరదక్షిణశబ్దము లపుడు సర్వనామసంజ్ఞకము లగును.

### 157. స్వమజ్ఞాతి ధనాఖ్యాయామ్ 1.1.35

జ్ఞాతిధనాన్యవాచినః స్వశబ్దస్య ప్రాప్తా సంజ్ఞా జసి వా. స్వే, స్వాః. ఆత్మీయా ఆత్మాన ఇతి వా. జ్ఞాతిధనవాచినస్తు స్వాః జ్ఞాతయోర్థా వా.

అనువృత్తులను పూర్వసూత్రమునందు వలె గ్రహింపవలెను. జ్ఞాతిధనాన్య వాచి యగు స్వశబ్దమునకు ప్రాప్త మగు సర్వనామసంజ్ఞ 'జస్'పర మగునపుడు వికల్పముగ నుండును,

స్వశబ్దమునకు ఆత్మ (తాను), ఆత్మీయము, జ్ఞాతి,ధనము అను నాలు గర్థములు గలవు. 'స్వో జ్ఞాతా వాత్మని స్వంత్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అని యమరుడు. అందు మొదటి రెండర్థములందు మాత్రమే స్వశబ్దమునకు సర్వనామత్వము. ఆ సర్వనామత్వము 'జస్' పర మగునపుడు వైకల్పిక మని యీ సూత్రము చెప్పుచున్నది గాన ప్రథమాబహువచనమున 'స్వే''స్వాః'అను రెండు రూపములు సిద్ధించును. 'స్వే', 'స్వాః' అనుదానికి 'ఆత్మీయులు' లేక 'తాము'అని యర్థము. ఇది జ్ఞాతిధనవాచక మగునపుడు సర్వనామము కాదు గాన 'స్వాః' అను నొక్కరూపము మాత్రమే యుండును.

### 158. అన్తరం బహిర్యోగో పసంవ్యానయోః 1.1.36

బాహ్యే పరిధానీయే చార్థేఽన్తరశబ్దస్య ప్రాప్తా సంజ్ఞా జసి వా. అన్తరే, అన్తరాః వా గృహాః; బాహ్యా ఇత్యర్థః. అన్తరే, అన్తరా వా శాటకాః- పరిధానీయా ఇత్యర్థః.

అనువృత్తులను పూర్వసూత్రమందు వలె గ్రహింపవలెను. బాహ్యము, పరిధానీయము అను నర్థములందు 'అంతర' శబ్దమునకు సంప్రాప్త మగు 'సర్వనామసంజ్ఞ 'జస్'పర మగునపుడు వికల్పముగ నగును

సర్వనామసంజ్ఞ యున్న పక్షమున 'జసఃశీ'ఇత్యాదులు ప్రవర్తించుటచే 'అన్తరే' అనియు తదభావపక్షమున 'అన్తరాః' అనియు రెండు రూపము లగును. మూలములోని మొదటి యుదాహరణమున 'అన్తర' శబ్దము బాహ్య

మను నర్థమందును, రెండవ యుదాహరణమున అధోవస్త్ర మను నర్థమందును ప్రయుక్త మైనది. కావున సర్వనామత్వము.

159. పూర్వాదిభ్యో నవభ్యో వా. 7.1.16

ఏభ్యో ఙసిఙ్యోః స్మాత్ స్మినౌ వా స్తః, పూర్వస్మాత్, పూర్వాత్ పూర్వస్మిన్, పూర్వే. ఏవం పరాదీనామపి. శేషం సర్వవత్.

'ఙసిఙ్యోః స్మాత్స్మినౌ' అను సూత్ర మనువర్తించును.
'పూర్వ' మొదలగు తొమ్మిది శబ్దముల కంటెను పరమగు ఙసి, ఙి, అను ప్రత్యయములకు 'స్మాత్' 'స్మిన్' ఆదేశములు వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే వైకల్పికముగ 'స్మాత్' 'స్మిన్'లు వచ్చు పక్షమున 'పూర్వస్మాత్' పూర్వస్మిన్' అను రూపములును, ఇవి రాని పక్షమున రామశబ్దమునకు వలె 'పూర్వాత్' 'పూర్వే' అను రూపములును సిద్ధించును. 'పర' మొదలగు మిగిలిన ఎనిమిది శబ్దములకును నిట్లే రూపము లగును. శిష్ట రూపములు సర్వశబ్దమునకు వలె నుండును.

160. ప్రథమచరమ తయాల్పార్ధకతిపయనేమాశ్చ 1.1.33

ఏతే జసి ఉక్తసంజ్ఞా వా స్యుః. ప్రథమే. ప్రథమాః. తయః ప్రత్యయః-ద్వితయే. ద్వితయాః. శేషం రామవత్ నేమే. నేమాః. శేషం సర్వవత్.

'సర్వాదీని సర్వనామాని' నుండి 'సర్వనామాని', 'విభాషా జసి' అను సూత్రమును, అనువర్తించును. ప్రథమచరమశబ్దములు, తయప్రత్యయాన్త శబ్దములు, అల్ప, అర్ధ, కతిపయ, నేమశబ్దములును 'జస్'పర మగునపుడు వికల్పముగ సర్వనామసంజ్ఞము లగును.

సర్వనామత్వపక్షమున 'జసః శీ' ఇత్యాదిసూత్రములు ప్రవర్తించుటచే ప్రథమే' 'ద్వితయే' 'నేమే' ఇత్యాది రూపములును, తదభావపక్షమున ప్రథమాః', 'ద్వితయాః', 'నేమాః' ఇత్యాదిరూపములును సిద్ధించును.

సూత్రమందున్న 'తయ' అనుదానికి 'తయప్'ప్రత్యయ మని యర్థము. ప్రత్యయగ్రహణే తదన్తా గ్రాహ్యాః' అను నియమముచే నిచట తయప్ ప్రత్యయాంతము లగు ద్వితయ, ద్వయ, త్రితయ, త్రయ, చతుష్టయ. పంచతయ

మొదలగు శబ్దములు గ్రహింపబడును. ఇతరరూపము లన్నియు సర్వశబ్దరూపముల వలె నుండును.

వా. తీయస్యా ఙిత్సు వా.

ద్వితీయస్మై, ద్వితీయాయ ఇత్యాది. ఏవం తృతీయః.

'తీయ' ప్రత్యయాంతము లగు పదములకు 'ఙిత్'లగు ప్రత్యయములు (ఙే, ఙసి, ఙస్, ఙి)పర మగునపుడు సర్వనామసంజ్ఞ వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే తీయప్రత్యయాన్త మగు ద్వితీయ శబ్దమునకు సర్వనామత్వము వైకల్పికము గాన 'ఙే'పర మగునపుడు 'ద్వితీయస్మై', 'ద్వితీయాయ', అనియు, 'ఙసి'పర మగునపుడు 'ద్వితీయస్మాత్', 'ద్వితీయాత్', అనియు, 'ఙి'పర మగునపుడు 'ద్వితీయస్మిన్', 'ద్వితీయే', అనియు రెండేసి రూపము లగును.'ఙస్'పర మగునపుడు సర్వనామత్వప్రయుక్త విశేష మేమియు లేదు గాన 'ద్వితీయస్య' అనియే రూపము సిద్ధించును. కాని స్త్రీలింగమున దీనికి. గూడ ప్రయోజనముండును. 'తృతీయ'శబ్దమునకు కూడ నిట్లే రూపము లుండును.

అకారాంత మగు నిర్జరశబ్దమునకు ప్రథమైకవచనమున 'నిర్జరః'అను రూప మగును. ద్వివచనమున 'నిర్జర + ఔ'అని యుండగా-

161. జరాయా జరసన్యతరస్యామ్ 7.2.101

అజాదౌ విభక్తౌ.

'అన్యతరస్యామ్'అను పదమునకు వికల్పముగా అని యర్థము. 'అచి ర ఋతః' 'అష్టన ఆ విభక్తౌ'నుండి 'అచి' 'విభక్తౌ'అనువర్తించును. అజాది విభక్తి పర మగునపుడు జరాశబ్దమునకు వికల్పముగ 'జరస్'అను నాదేశము వచ్చును.

నిర్జరశబ్దము 'నిర్గతః జరాయాః'అను నర్థమున 'నిర్' అను ఉపసర్గకును జరాశబ్దమునకును సమాసముచేయుటచే నిష్పన్న మైనది. ఇందు జరాశబ్ద మున్నను ఇది 'నిర్జర' శబ్దము కాని 'జరా' శబ్దము కాదు గావున నీ సూత్రమున కిచట ప్రసంగము లేదను సందేహమును తొలగించుటకై క్రింది పరిభాష చూపబడుచున్నది.

పరి. పదాఙ్గాధికారే తస్య చ తదన్తస్య చ.

పదాధికారమునందును అఙ్గాధికారమునందును విధింపబడిన ఆదేశము ఏ పదమునకు విహిత మైనదో దానికిని, అది యంతమునందు గల సముదాయ మునకును వచ్చును.

ఈ పరిభాష ననుసరించి ఈ జరసాదేశము అంగాధికారములోనిది గాన జరాశబ్దమునకే కాక జరాశబ్ద మంతమున గల నిర్జరశబ్దమునకు గూడ రావచ్చును. కాని ఈ యాదేశము అనేకాల్ కావున 'అనేకాల్శిత్సర్వస్య' అను సూత్రముచే (45) 'నిర్జర' అనుదానికి సర్వాదేశముగ రావలసి యుండ-

పరి. నిర్దిశ్యమానస్యాదేశా భవన్తి

ఆదేశవిధాయకశాస్త్రమున షష్ఠ్యంతపదముచే నేది నిర్దిష్ట మగునో దానిస్థానమున మాత్రమే ఆదేశము వచ్చును.

'జరాయా జరసన్యతరస్యామ్' అను సూత్రమున (161) 'జరా' శబ్దము మాత్రమే షష్ఠ్యంతపదముచే నిర్దిష్టమై యున్నది. కావున జరసాదేశము 'నిర్జర' శబ్దమునందలి 'జర'అను భాగమునకు మాత్రమే వచ్చును.

కాని పై సూత్రమున 'జరా' శబ్దమునకు 'జరస్' ఆదేశము విహితము కాని 'జర' శబ్దమునకు కాదు. 'నిర్జర' శబ్దమున నున్నది 'జర' శబ్దము కాని 'జరా' శబ్దము కాదు. అట్టిచో నిచట జరసాదేశమెట్లు వచ్చును? అను సందేహము కలుగును. తన్నివృత్త్యర్థమై లోకసిద్ధ మగు నీ క్రింది న్యాయము చూప బడుచున్నది.

పరి. ఏకదేశవికృతమనన్యవత్.

ఏదైన యొక అవయవమున వికారము కలిగినను ఒక వస్తువు మరియొక వస్తువు కాజాలదు. ఉదాహరణకు- కుక్కకు తోక తెగినను కుక్కయే యగును గాని మరియొక జంతువు కాజాలదు. అట్లే 'జరా'లోని దీర్ఘము పోయి హ్రస్వము వచ్చినను దానిని 'జరా'శబ్దముగ పరిగణింపవచ్చును. కావున నీ సూత్రముచే జరసాదేశము వచ్చుటలో సందేహము లేదు.

ఇట్లు జరసాదేశము చేయగా 'నిర్జరసౌ' అను రూపము సిద్ధించును.

ఈ విధముగ అజాదులగు (ఇద్వర్ణములు లోపించినపిదప) ఔ, జస్, అమ్, ఔ, శస్, టా, ఙే, ఙసి, ఙస్, ఓస్, ఆమ్, ఙి, ఓస్, ప్రత్యయములు పర మగు నపుడు వైకల్పిక జరసాదేశముచే "నిర్జరసౌ, నిర్జరసః, నిర్జరసమ్, నిర్జ

రసౌ, నిర్జరసః, నిర్జరసా, నిర్జరసే, నిర్జరసః, నిర్జరసః, నిర్జరసోః, నిర్జరసామ్, నిర్జరసి, నిర్జరసోః" అను రూపములు సిద్ధించును. జరసాదేశము రాని పక్షమున ఈ అజాదివిభక్తులు పర మగునపుడును, హలాది విభక్తులు పర మగునపుడును గూడ రామశబ్దమునందు వలె రూపములు సిద్ధించును. అనగా అజాదివిభక్తులందు రెండేసి రూపములును హలాదివిభక్తులందు ఒక్కొక్క రూపమును ఉండును.

ఆకారాంత మగు 'విశ్వపా' శబ్దమునకు ప్రథమైకవచనమున 'విశ్వపా + సు' అని యుండగా రుత్వవిసర్గలచే 'విశ్వపాః' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'విశ్వపా + ఔ' అని యుండగా 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తింప-

### 162. దీర్ఘాజ్జసి చ. 6.1.105

దీర్ఘాజ్జసి ఇచి చ పరే న పూర్వసవర్ణదీర్ఘః. వృద్ధిః—విశ్వపౌ విశ్వపాః, హేవిశ్వపాః, విశ్వపామ్, విశ్వపౌ.

'ప్రథమయోః పూర్వ సవర్ణః' నుండి 'పూర్వసవర్ణః' 'నాదిచి' అను సూత్రమును అనువర్తించును. దీర్ఘముకంటె జస్ప్రత్యయము ,ఇచ్, పర మగునపుడు పూర్వసవర్ణదీర్ఘము రాదు.

ఇట్లు పూర్వసవర్ణదీర్ఘము రాకుండుటచే 'వృద్ధిరేచి' అను సూత్రముచే (33) వృద్ధి చేయగా 'విశ్వపౌ' అను రూపము సిద్ధించును

బహువచనమున 'విశ్వపా + (జ)అస్' అని యుండ పై సూత్రముచే పూర్వసవర్ణదీర్ఘము నిషిద్ధము గాన 'అకః సవర్ణే దీర్ఘః' అను సూత్రముచే (42) సవర్ణదీర్ఘమును, రుత్వవిసర్గములును జేయ 'విశ్వపాః' అను రూపము సిద్ధించును. సంబోధనప్రథమారూపములు గూడ ఇట్లే ఉండును.

ద్వితీయైకవచనమున 'విశ్వపా + అమ్' అని యుండ 'అమి పూర్వః' అను సూత్రముచే (135) పూర్వరూపము చేయగా 'విశ్వపామ్' అను రూపము సిద్ధించును.

ద్వివచనరూప మగు 'విశ్వపౌ' అనునది ప్రథమాద్వివచనమువలె నిష్పన్నమగును.

ద్వితీయాబహువచనమున 'విశ్వపా + (శ)అస్' అని యుండగా-

163. సుడనపుంసకస్య. 1.1.43

స్వాదిపఞ్చవచనాని సర్వనామస్థానసంజ్ఞాని స్యురక్లీబస్య.

'శి సర్వనామస్థానమ్' నుండి 'సర్వనామస్థానమ్' అనువర్తించును. 'సుట్' అనునది 'సు,ఔ,జస్,అమ్,ఔట్'ల ప్రత్యాహారము. నపుంసకలింగము కాని ప్రాతిపదికకంటె పర మగు సుమొదలగు ఐదు వచనములకు సర్వనామస్థాన మని పేరు.

164. స్వాదిష్వసర్వనామస్థానే. 1.4.17

కప్రత్యయావధిషు స్వాదిష్వసర్వనామస్థానేషు పూర్వం పదం స్యాత్.

'సుప్తిఙన్తం పదమ్' నుండి 'పదమ్' అనువర్తించును. కప్రత్యయము వరకు నున్నట్టియు, సర్వనామస్థాన భిన్నములును అగు స్వాది ప్రత్యయములు పర మగునపుడు వెనుక నున్నది పదసంజ్ఞ మగును.

ఇచట 'కప్రత్యయావధిషు స్వాదిషు' అని చెప్పుటచే చతుర్థపంచమాధ్యాయగతము లగు ప్రత్యయము లన్నియు గ్రహింపబడినవి.

165. యచి భమ్. 1.1.18

యాదిషు అజాదిషు చ కప్ప్రత్యయావధిషు స్వాదిష్వసర్వనామస్థానేషు పూర్వం భసంజ్ఞం స్యాత్.

పై సూత్రము అనువర్తించును యకారము గాని అచ్ గాని ఆదియందు కలిగినవియు, సర్వనామస్థానభిన్నములును కప్ప్రత్యయావధులును అగు స్వాదిప్రత్యయములు పర మగునపుడు పూర్వశబ్దస్వరూపము భసంజ్ఞ మగును.

పై యుదాహరణమున 'విశ్వపా' అనుదానికి సర్వనామస్థానభిన్న మగు 'శస్' అను ప్రత్యయము పరముగ నున్నది గాన 'స్వాదిషు...'అను సూత్రముచే (164) పదసంజ్ఞయు, ఈప్రత్యయము అజాది గాన ఈ సూత్రముచే భసంజ్ఞయు (రెండును) రావలసి యుండ-

166. ఆకడారాదేకాసంజ్ఞా 1.4.1

ఇత ఊర్ధ్వం ''కడారాః కర్మధారయే'' ఇత్యతః ప్రాగేకస్యైకైవ సంజ్ఞా జ్ఞేయా, యా పరాఽనవకాశా చ.

ఈ సూత్రము (ప్రథమాధ్యాయ చతుర్థపాద ప్రథమసూత్రము) మొదలు 'కడారాః కర్మధారయే' అను ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమునందలి ముప్పది నాల్గవ సూత్రమువరకును ఒక దానికి ఒక్క సంజ్ఞయే యుండును. అందును ఒక లక్ష్యమున రెండు సంజ్ఞల కవకాశము లభించినపుడు ఆ రెండింటిలో నేది పర మైనదో, ఏది నిరవకాశమో యా సంజ్ఞ వచ్చును. ప్రకృత స్థలమున భసంజ్ఞ పర మైనది. ఈ భసంజ్ఞ కవకాశ మున్న ప్రతిస్థలమునందును పదసంజ్ఞా సూత్రము ప్రవర్తించును గాన, అది ప్రవర్తించుచో భసంజ్ఞాసూత్రము నిరవ కాశ మగును. కావున పదసంజ్ఞను బాధించి భసంజ్ఞ ప్రవర్తించును.

ఇట్లు 'విశ్వపా + శస్' అనునపుడు 'విశ్వపా' అనునది భసంజ్ఞక మై యుండ—

### 167. ఆతో ధాతోః. 6.4.140

ఆకారాన్తో యో ధాతుః, తదన్తస్య భసంజ్ఞకాఙ్గస్య లోపః. "అలోన్త్యస్య"(21) విశ్వపః, విశ్వపా, విశ్వపాభ్యామ్ ఇత్యాది. ఏవం శఙ్ఖధ్మాదయః, ధాతోః కిమ్? హాహాన్ హాహా, హాహై. హాహాః, హాహౌః, హాహామ్, హాహే.

'అఙ్గస్య' 'భస్య' అని అధికారసూత్రములు. ఆకారాంతధాతువు అంత మందు గల భసంజ్ఞక మగు అంగమునకు లోపము వచ్చును.

'విశ్వపా' అనునది 'విశ్వం పాతి' అను నర్థమున 'పా'ధాతువునకు 'విచ్'ప్రత్యయము చేర్చుటచే సిద్ధించిన రూపము. 'విశ్వపా + అస్'అనునపుడు 'విశ్వపా'అనునది ఆకారాంతధాతువు అంతమందు గల భసంజ్ఞ మగు అంగము. కావున నీ సూత్రము ప్రవర్తించును. 'అలోన్త్యస్య' అను పరిభాషచే (21) లోపము అంత్యవర్ణమునకు వచ్చును. 'విశ్వప్ + అస్' అని యుండ సకారము నకు రుత్వవిసర్గములచే 'విశ్వపః' అను రూపము సిద్ధించును.

అజాది ప్రత్యయములు పర మగునపుడు ఈ విధముగనే ఆకారలోపము గలుగును. హలాది ప్రత్యయము పర మగునపుడు విశేషకార్య మెద్దియు నుండదు. కావున తృతీయాదివిభక్తులలో:—

తృ. విశ్వపా, విశ్వపాభ్యామ్, విశ్వపాభిః: చ. విశ్వపే, విశ్వ పాభ్యామ్, విశ్వపాభ్యః; పం. విశ్వపః, విశ్వపాభ్యామ్. విశ్వపాభ్యః;

ష. విశ్వపః, విశ్వపోః, విశ్వపామ్; స. విశ్వపి, విశ్వపోః, విశ్వపాసు; అను రూపములు సిద్ధించును. 'శఙ్ఖధ్మా' మొదలగు శబ్దములు గూడ ఇట్లే ఉండును.

'ధాతోః' అన నేలః అట్లనుటచే 'హాహా + (శ)అస్' అనుచో 'హాహా' అనునది ఆకారాంత మైనను ఆకారాంతధాత్వంతము కాకుండుటచే ఆకారలోపము రాదు.

"ప్రథమయోః పూర్వసవర్ణః" అను సూత్రముచే (126) పూర్వసవర్ణ దీర్ఘము, 'తస్మాచ్ఛసో నః పుంసి' అను సూత్రముచే (137) సకారమునకు నకారమును వచ్చి 'హాహాన్' అను రూపము సిద్ధించును.

హాహా:- టా పర మగునపుడు సవర్ణదీర్ఘముచే నీ రూపము సిద్ధించును.
హాహై:- ఙే పర మగునపుడు వృద్ధిచే నీ రూపము నిష్పన్న మైనది.
హాహాః:- 'ఙసి,ఙస్'లు పర మగునపుడు సవర్ణదీర్ఘసంధిచే నీ రూపము లగును.
హాహౌః:-'ఓస్' పర మగునపుడు వృద్ధి, రుత్వవిసర్గలచే నీ రూపము సిద్ధించును.
హాహామ్:- 'ఆమ్' పర మగునపుడు సవర్ణదీర్ఘముచే నీ రూప మగును.
హాహే:- 'ఙి' పర మగునపుడు గుణము వచ్చుటచే నీ రూప మగును.

హలాదిప్రత్యయములు పర మగునపుడు 'విశ్వపా' శబ్దమునకు వలె రూపము లుండును. 'హాహా' అనునది ఒక గంధర్వుని పేరు.

హరిశబ్ద ప్రథమైకవచనమున 'హరి + సు' అనునపుడు సకారమునకు రుత్వవిసర్గములచే 'హరిః' అను రూప మగును.

ద్వివచనమున 'హరి + ఔ' అని యుండగా ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము వచ్చి (ఇకారసవర్ణదీర్ఘ మగు ఈకార మేకాదేశ మగుటచే) 'హరీ' అను రూపము నిష్పన్న మగును.

బహువచనమున 'హరి + (జ)అస్' అని యుండగా:-

### 168. జసి చ. 7.3.109

హ్రస్వాన్తస్యాఙ్గస్య గుణః. హరయః.

'హ్రస్వస్య గుణః' అను సూత్రము 'అఙ్గస్య' అను నధికారసూత్రమును అనువర్తించును. హ్రస్వాంత మగు అంగమునకు జస్ పర మగునపుడు గుణము వచ్చును.

ఈ సూత్రముచే గుణము-హరే + అస్; అయాదేశము—'హరయస్';
—సకారమునకు రుత్వవిసర్గములు— 'హరయః' అను రూపము సిద్ధించును.

సంబోధనప్రథమైకవచనమున హేహరి + స్ అని యుండగా:-

169. హ్రస్వస్య గుణః 7.3.108

సమ్బుద్ధౌ. హేహరే, హరిమ్, హరీ, హరీన్.

'సమ్బుద్ధౌ చ' నుండి 'సమ్బుద్ధౌ' అనువర్తించును. సంబుద్ధి (సమ్బోధనప్రథమైకవచనము) పర మగునపుడు హ్రస్వాంతాంగమునకు గుణము వచ్చును.

ఈ సూత్రముచే అలోన్త్యపరిభాషానుసారముగ (సూ.21) ఇకారమునకు గుణము వచ్చి 'హేహరే + స్'అని యుండగా 'ఏఙ్హ్రస్వాత్ సమ్బుద్ధేః' అను సూత్రముచే (134) సంబుద్ధి యగు 'స్'కు లోపము- 'హేహరే' అను రూపము సిద్ధించినది.

ద్వితీయైకవచనమున 'హరి + అమ్'అని యుండ 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపముచేయ 'హరిమ్' అని యగును.

ద్వివచనరూప మగు 'హరీ' ప్రథమాద్వివచనమునందు వలె సిద్ధించును. బహువచనమున 'హరి + అస్'అని యుండ 'ప్రథమయోః'-అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘముచే 'హరీస్'అని యై పిదప 'తస్మాచ్ఛసో నః పుంసి' అనుసూత్రముచే (137) సకారమునకు నకారము వచ్చి 'హరీన్' అను రూప మగును.

తృతీయైకవచనమున 'హరి + (టా) ఆ'అని యుండగా-

170. శేషో ఘ్యసఖి 1.4.7

శేష ఇతి స్పష్టార్థమ్, అనదీసంజ్ఞౌ హ్రస్వౌ యావిదుతౌ తదన్తం సఖివర్జం ఘి సంజ్ఞమ్.

'యూ స్త్ర్యాఖ్యౌ నదీ'నుండి 'యూ' (ఇకారఉకారము లని యర్థము) 'ఙితి హ్రస్వశ్చ'నుండి 'హ్రస్వః' అనువర్తించును. నదీసంజ్ఞ లేని హ్రస్వము లగు ఇకారఉకారము లంతమున గలదియు, సఖిశబ్దభిన్నమును, నగు శబ్దము ఘి సంజ్ఞక మగును.

'ఙితి హ్రస్వశ్చ'అను సూత్రము (222)చే స్త్రీలింగమున ఇకారఉకారాంతశబ్దములకు ఙిత్తు లగు ప్రత్యయములు పర మగునపుడు వికల్పముగ

నదీసంజ్ఞ విధింపబడినది. 'అట్టి నదీసంజ్ఞ లేని పదములు'అను నర్థమున 'శేషః'అను పదము ప్రయుక్తమైనది. కాని ఘిసంజ్ఞావిధాయక మగు నీ సూత్రము సామాన్యశాస్త్రము. నదీసంజ్ఞావిధాయక సూత్రము (222) విశేష శాస్త్రము. 'ఉత్సృజ్యాపవాద విషయం సామాన్యం ప్రవర్తతే'అను న్యాయముచే నదీసంజ్ఞాప్రాప్తి లేని స్థలములందు మాత్రమే ఘిసంజ్ఞావిధాయకశాస్త్రము ప్రవర్తించును. అంతే కాక 'ఆకడారాదేకా సంజ్ఞా'అను (166) నియమ ముండుటచే రెండు సంజ్ఞలొకదానికి ఉండజాలవు. కావున 'నదీసంజ్ఞ లేని ఇకారఉకారాంతపదములకు ఘిసంజ్ఞ యుండును'అను నర్థము అర్థాత్ సిద్ధమగుచున్నను మరల 'శేషః'అను పదమును ప్రయోగించుట అర్థస్పష్టత్వార్థమే అని తెలిసికొనవలెను. హరిశబ్దమునకు నదీసంజ్ఞావకాశము లేదు గాన ఘిసంజ్ఞ రావచ్చును.

### 171. ఆఙో నాఽస్త్రియామ్ 7.3.120

ఘేః పరస్యాఽఽఙో నా స్యాదస్త్రియామ్. ఆఙితి టాసంజ్ఞా. హరిణా, హరిభ్యామ్, హరిభిః.

'అచ్చ ఘేః' నుండి 'ఘేః' అనువర్తించును. ఘిసంజ్ఞకముకంటె పర మగు 'ఆఙ్'కు 'నా' ఆదేశము వచ్చును. స్త్రీలింగమున మాత్రము రాదు.

'ఆఙ్'అనునది 'టా'ప్రత్యయమునకు ప్రాచీనాచార్యుల సంజ్ఞ. ఈ సూత్రముచే 'టా'కు 'నా'ఆదేశము పిదప 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి' అను సూత్రముచే (138) ణత్వము వచ్చి 'హరిణా'అను రూపము సిద్ధించును.

ద్వివచనబహువచనప్రత్యయము లగు 'భ్యామ్' 'భిస్'ప్రత్యయములను చేర్చినపుడు 'హరిభ్యామ్' 'హరిభిః' అను రూపములు నిష్పన్న మగును.

చతుర్థ్యేకవచనమున 'హరి+(ఙే) ఏ'అని యుండగా-

### 172. ఘేర్ఙితి 7.3.111

ఘిసంజ్ఞకస్య ఙితి గుణః. హరయే.

'సుపి చ' 'హ్రస్వస్య గుణః'నుండి 'సుపి' 'గుణః'అనువర్తించును. ఘిసంజ్ఞమునకు 'ఙిత్'అగు సుప్ప్రత్యయము పర మగునపుడు గుణము ఆదేశ మగును.

ఈ సూత్రముచే గుణము వచ్చి'హరే+ఏ'అని యుండ 'ఏచోయవాయావః'అను సూత్రముచే (22) అయాదేశము వచ్చి 'హరయే'అనురూపము

సిద్ధించును. ద్వివచనబహువచనములందు 'హరిభ్యామ్' 'హరిభ్యః' అను రూపము లగును. పంచమీషష్ఠ్యేకవచనములందు 'హరి + (ఙసి)అస్' 'హరి + (ఙస్) అస్'అని యుండ 'ఘేర్ఙితి'అను సూత్రముచే గుణము 'హరే + అస్' అని యుండగా-

173. ఙసిఙసోశ్చ 6.1.110

ఏఙో ఙసిఙసోరతి పూర్వరూపమేకాదేశః. హరేః-2. హర్యోః. హరీణామ్.

'ఏఙః పదాన్తాదతి' 'అమిపూర్వః' నుండి 'ఏఙః', 'అతి', 'పూర్వః', 'ఏకః పూర్వపరయోః' అను నధికారసూత్రమును అనువర్తించును. ఏఙ్‌నకు 'ఙసి''ఙస్'ల హ్రస్వఅకారము పర మగునపుడు పూర్వరూప మేకాదేశ మగును.

ఇచట రేఫోత్తరవర్తి యగు ఏకారమునకు 'ఙసి''ఙస్'ల అకారము పర మగుటచే పూర్వరూపము వచ్చి 'హరేస్' అని యుండగా సకారమునకు రుత్వవిసర్గలచే 'హరేః' అను రూపము సిద్ధించును.

పంచమీద్వివచనబహువచనరూపములు చతుర్థియందు వలె ఉండును. షష్ఠీద్వివచనమున 'హరి + ఓస్' అని యుండ యణాదేశము 'హర్యోస్'; సకారమునకు రుత్వవిసర్గములచేయ 'హర్యోః' అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'హరి + ఆమ్' అనునపుడు 'హ్రస్వనద్యాపోనుట్' అను సూత్రముచే (148) ఆమ్‌నకు నుడాగమము- పిదప 'నామి' సూత్రముచే (149)దీర్ఘమును వచ్చుటచే 'హరీనామ్' అని యుండ-'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి'అను సూత్రముచే (138) నకారమునకు ణత్వమును రాగా 'హరీణామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'హరి + ఙి' అని యుండగా-

174. అచ్చ ఘేః. 7.3.119

ఇదుద్భ్యాముత్తరస్య ఙేరౌత్ స్యాత్; ఘేరత్. హరౌ, హర్యోః, హరిషు. ఏవం కవ్యాదయః.

'ఙేరామ్నద్యామ్నీభ్యః' నుండి 'ఙేః','ఇదుద్భ్యామ్' 'ఔత్'అను సూత్రములను అనువర్తించును. హ్రస్వము లగు ఇకారఉకారములకంటె పర మగు

'జి'కి ఔకార మాదేశ మగును; ఘిసంజ్ఞకమునకు (అలోన్త్యపరిభాషచే (సూ-21) దాని యంత్యాక్షరమునకు) హ్రస్వ మగు 'అ'కార మాదేశ మగును.

ఈ సూత్రముచే ఇకారమునకు అకారాదేశమును. 'జి' ప్రత్యయమునకు ఔకారమును నాదేశముగ వచ్చిన పిదప 'హర + ఔ' అని యుండ 'వృద్ధిరేచి' అను సూత్రముచే (33) వృద్ధి-'హరౌ' అను రూపము సిద్ధించును.

ద్వివచనమున షష్ఠీద్వివచనమునందు వలె రూపము సిద్ధించును. బహు వచనమున 'హరిసు' అని యుండ 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) సకారమునకు షత్వ మాదేశమై 'హరిషు' అను రూపము సిద్ధించును. 'కవి'మొదలగు శబ్దముల రూపములను గూడ నిట్లే సాధింపవలెను.

'సఖి'శబ్దప్రథమైకవచనమున 'సఖి + సు' అని యుండగా-

175. అనఙ్ సౌ 7.1.93

సఖ్యురఙ్గస్యానఙాదేశః అసమ్బుద్ధౌ సౌ.

'సఖ్యురసమ్బుద్ధౌ' అను సూత్రము, 'అఙ్గస్య' అను అధికారసూత్ర మును అనువర్తించును. సమ్బుద్ధిభిన్నమగు 'సు'పర మగునపుడు సఖిశబ్దాంగ మునకు 'అనఙ్' ఆదేశముగ వచ్చును.

'అనఙ్'నందలి 'అ''ఙ్'లు ఇత్సంజ్ఞకములు. 'ఙిత్' కావున 'ఙిచ్చ' అను సూత్రముచే (46) అంతాదేశముగ (ఇకారస్థానమున) వచ్చును. 'సఖన్ + స్' అని యుండగా-

176. అలోన్త్యాత్ పూర్వ ఉపధా. 1.1.65

అన్త్యాదలః పూర్వో వర్ణ ఉపధాసంజ్ఞః.

అంత్య మగు వర్ణముకంటె పూర్వమునందున్న వర్ణమునకు 'ఉపధ' యని పేరు.

ఈ సూత్రముచే 'సఖన్'లోనిఅంత్యవర్ణ మగు నకారముకంటె పూర్వ మునందున్న 'అ'కారమునకు ఉపధ యని పేరు.

177. సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ. 6.4.8

నాంతస్య ఉపధాయా దీర్ఘోఽసమ్బుద్ధౌ సర్వనామస్థానే.

'నోపధాయాః' అను సూత్రము అనువర్తించును. సమ్బుద్ధిభిన్న మగు

సర్వనామస్థానము పర మగునపుడు నకారాంత మగు అంగముయొక్క ఉపధకు దీర్ఘము వచ్చును.

ఇచట నకారాంతాంగము 'సఖన్'. దీనికి 'స్' అను సర్వనామస్థానము పరముగ నున్నది. ఇది(స్)సంబోధనప్రథమైకవచనము కాదు. కావున దీని యుపధ యగు 'అ'కారమునకు దీర్ఘము వచ్చుటచే 'సఖాన్ + స్'అని యున్నది:-

178. అపృక్త ఏకాల్ ప్రత్యయః. 1.2.41

ఏకాల్ ప్రత్యయో యః, సోఽపృక్తసంజ్ఞః స్యాత్.

ఏకాల్‌రూప మగు ప్రత్యయమునకు అపృక్త మని పేరు. ఈ సూత్ర ముచే 'స్'కు అపృక్తసంజ్ఞ లభించినది.

179. హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్ సుతిస్యపృక్తం హల్. 6.1.68

హలన్తాత్పరం, దీర్ఘౌ యౌ ఙ్యాపౌ తదన్తాచ్చ పరం 'సు' 'తి' 'సి' ఇత్యేతదపృక్తం హల్ లుప్యతే,

'లోపో వ్యోర్వలి' నుండి 'లోపః'అనువర్తించును. హలంతముకంటెను, దీర్ఘము లగు 'ఙీ''ఆప్' ప్రత్యయము లంతమునందు కలదానికంటెను, పర మగు 'సు''తి''సి'ల అపృక్తహల్లు లోపించును. 'తి''సి' అనునవి 'తిఙ్'ప్రత్య యములు. వీటి ఇకారము 'ఙిత్'లగు 'లఙ్'మొదలగు లకారములందు 'ఇతశ్చ' అనుసూత్రముచే(426)లోపించుటచే 'త్''స్' అనుహల్లులు మాత్రము మిగులును. 'ఙీ'అనుదానిచే ఙీప్, ఙీష్, ఙీన్ అను స్త్రీప్రత్యయములును, 'ఆప్' చే టాప్, డాప్, చాప్' అను స్త్రీ ప్రత్యయత్రయమును గ్రహింపబడును.

హలన్త మగు 'సఖాన్'కంటె పర మగు 'స్'ఈ సూత్రముచే లోపింప 'సఖాన్' అని యుండును.

180. న లోపః ప్రాతిపదికాన్తస్య. 8.2.7

ప్రాతిపదికసంజ్ఞకం యత్ పదం తదన్తస్య నస్య లోపః. సఖా.

న, లోపః, ప్రాతిపదిక, అన్తస్య-(న, ప్రాతిపదిక, అనునవి లుప్తషష్ఠ్యంత పదములు). 'పదస్య' అధికారము. ప్రాతిపదికసంజ్ఞ గల పదముయొక్క అంత మున నున్న నకారమునకు లోప మగును.

'సఖాన్'అనుచో, 'సుప్'లోపించినను 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' (ప్రత్యయము లుప్త మైనను తత్ప్రయుక్త మగు కార్యము వచ్చును). అను

నియమ ముండుటచే 'సుప్తిఙన్తం పదమ్' (14) అను పదసంజ్ఞ యుండును. ఇందలి నకారము పదాన్తస్థ మైనది. 'సఖాన్' అనునది ప్రాతిపదికము గాన నిది ప్రాతిపదికసంజ్ఞ మగు పదము. కావున నకారము లోపించ 'సఖా' అను రూపము సిద్ధించినది.

ద్వివచనమున 'సఖి + ఔ' అని యుండగా:-

181. సఖ్యురసమ్బుద్ధౌ. 7.1.92

సఖ్యురఙ్గాత్పరం సమ్బుద్ధివర్జం సర్వనామస్థానం ణిద్వత్,

'అఙ్గస్య' అధికారసూత్రము. 'ఇతోఽత్సర్వనామస్థానే' 'గోతోణిత్' నుండి 'సర్వనామస్థానే' 'ణిత్' అనువర్తించును. సఖిశాబ్దాంగముకంటె పర మగు సంబుద్ధి భిన్న మగు సర్వనామస్థానము 'ణిత్'వంటి దగును_అనగా ణిత్ అగు ప్రత్యయము పర మగునపుడు ఎట్టి కార్యములు వచ్చునో అట్టి కార్యములు వచ్చును.

182. అచో ఞ్ణితి 7.2.115

అజన్తాఙ్గస్య వృద్ధిః, ఞితి ణితి పరే. సఖాయౌ, సఖాయః. హేసఖే, సఖాయమ్, సఖాయౌ, సఖీన్, సఖ్యా, సఖ్యే.

'మృజేర్వృద్ధిః'నుండి 'వృద్ధిః', 'అఙ్గస్య' అను అధికారసూత్రము అనువర్తించును. 'ఞిత్' 'ణిత్'అగు ప్రత్యయము పర మగునపుడు అజన్తాంగము నకు వృద్ధి వచ్చును.

ఇచట సఖిశబ్దముకంటె పర మగు'ఔ'అను సర్వనామస్థానమునకు పూర్వ సూత్రముచే (181) ణిద్వద్భావము లభించుటచే ఈ సూత్రముచే సఖిశబ్దాంతము నందలి ఇకారమునకు (అలోన్త్యపరిభాషచే_21) వృద్ధి చేయగా'సఖై + ఔ'అని యుండ 'ఏచోయవాయావః'అను సూత్రముచే (22) అయాదేశము_'సఖాయౌ' అను రూపము సిద్ధించును.

ప్రథమాబహువచనమున 'సఖి + అస్'అని యుండ ద్వివచనమునందు వలె ణిద్వద్భావ, వృద్ధి, అయాదేశములును, సకారమునకు రుత్వవిసర్గములను జేయ 'సఖాయః' అను రూపము సిద్ధించినది.

సంబోధనైకవచనమున హరిశబ్దమునందు వలె 'హ్రస్వస్య గుణః'అను సూత్రముచే (169) గుణము, 'ఏఙ్హ్రస్వాత్సమ్బుద్ధేః'అను సూత్రముచే (134) సంబుద్ధిలోపమును వచ్చుటచే 'హేసఖే'అను రూపము సిద్ధించినది.

సంబోధనద్వివచన,బహువచనరూపములు ప్రథమయందు వలె నుండును. ద్వితీయైకవచనమున ణిద్వద్భావ, వృద్ధి, ఆయాదేశములచే 'సఖాయమ్' అను రూపము సిద్ధించును.

ద్వితీయాద్వివచనమున ప్రథమాద్వివచనమునందు వలె రూపము సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'సఖి + (శ)అస్'అని యుండ 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము-'సఖీస్'అని యుండగా 'తస్మాచ్ఛసో నః పుంసి (137) అను సూత్రముచే సకారమునకు నకారాదేశము-'సఖీన్'అను రూపము సిద్ధించును. 'శస్'సర్వనామస్థానము కాదు గాన ణిద్వద్భావము రాదు.

సఖిశబ్దమునకు ఘిసంజ్ఞ లేకుండుటచే తత్ప్రయుక్తము లగు 'ఆఙోనా స్త్రియామ్' మొదలగు (సూ.171,172,174) కార్యములుండవు. కావున తృతీయై కవచనమున 'సఖి + ఆ'అని యుండ యణాదేశముచే 'సఖ్యా'అనియు, ద్వివచన బహుపచనములందు 'సఖిభ్యామ్' 'సఖిభిః' అనియు రూపము లగును.

చతుర్థియందు ఏకవచనమున 'సఖి + ఏ'అని యుండ యణాదేశముచే 'సఖ్యే'అనియు ద్వివచనబహువచనములందు 'సఖిభ్యామ్''సఖిభ్యః'అనియు రూపములు సిద్ధించును.

పంచమ్యేకవచన షష్ఠ్యేకవచనములందు 'సఖి + అస్' అనునపుడు యణా దేశముచే 'సఖ్యస్'అని యుండగా-

### 183. ఖ్యత్యాత్పరస్య 6.1.112

ఖితిశబ్దాభ్యాం, ఖీతీశబ్దాభ్యాం కృతయణాదేశాభ్యాం పరస్య ఙసిఙసోరత ఉః.

'ఏఙః పదాన్తాదతి' 'ఙసిఙసోశ్చ' 'ఋత ఉత్'అను సూత్రములనుండి 'అతి' 'ఙసిఙసోః''ఉత్'అను పదము లనువర్తించును. యణాదేశము చేసిన 'ఖి,తి,ఖీ,తీ'శబ్దములకంటె (అనగా యణాదేశము చేయుటచే నిష్పన్న మగు 'ఖ్య' 'త్య' అను వాటికంటె) పర మగు ఙసిఙస్‌ల అకారమునకు 'ఉ' వచ్చును.

ఈ సూత్రముచే 'అస్'లోని అకారమునకు 'ఉ' వచ్చుటచే 'సఖ్యుస్' అని యై సకారమునకు రుత్వవిసర్గములచే 'సఖ్యుః'అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'సఖి + ఙి'అని యుండగా-

184. ఔత్ 7.3.118

ఇదుతోః పరస్య ఙేరౌత్ స్యాత్. 'సఖ్యౌ'. శేషం హరివత్.

'ఇదుద్భ్యామ్'అను సూత్రము 'ఙేరామ్నద్యామీభ్యః'నుండి 'ఙేః' అను వర్తించును. హ్రస్వము లగు ఇకారఉకారములకంటె పర మగు 'ఙి'కి 'ఔ' అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఙి'కి 'ఔ'ఆదేశము వచ్చి 'సఖి + ఔ'అని యై యణాదేశముచే 'సఖ్యౌ' అను రూపము సిద్ధించును. ఇచట చూపబడని రూపము లన్నియు హరిశబ్దరూపముల వలె సిద్ధించును.

185. పతిస్సమాస ఏవ 1.4.8

ఘిసంజ్ఞః. పత్యా. పత్యే. పత్యుః2. పత్యౌ. శేషం హరివత్. సమాసే తు భూపతయే. కతిశబ్దో నిత్యం బహువచనాన్తః.

'శేషోఘ్యసఖి'నుండి 'ఘి'అనువర్తించును. పతిశబ్దము సమాసమునందు మాత్రమే ఘిసంజ్ఞక మగును.

పతిశబ్దమును ప్రత్యేకముగ ప్రయోగించినపుడు ఘిసంజ్ఞ లేకుండుటచే ఘిసంజ్ఞాప్రయుక్తము లగు కార్యము లుండవు. అనగా 'టా'కు 'ఆఙో నాఽస్త్రియామ్'అను సూత్రముచే (171) 'నా'ఆదేశము, ఙే ఙసి ఙస్‌లు పర మగునపుడు 'ఘేర్ఙితి'అను సూత్రముచే (172) గుణము, ఙి పర మగునపుడు 'అచ్చ ఘేః'అను సూత్రముచే (174) ఇకారమునకు అకారము, ఙికి ఔకారమును రావు గాన (సఖిశబ్దమునకు వలె) పత్యా, పత్యే, పత్యుః, పత్యుః, పత్యౌ అను రూపములు సిద్ధించును ఇతరరూపము లన్నియు హరిశబ్దమునందు వలెనే యుండును. సమాసమునందు పతిశబ్దమునకు ఘిసంజ్ఞ యుండును గాన తృతీయాదులందు ఘిసంజ్ఞాప్రయుక్తకార్యములు వచ్చుటచే 'భూపతి'శబ్దము హరిశబ్దము వలె నుండును.

'కిమః సంఖ్యాపరిమాణే డతి చ'అను సూత్రముచే కిమ్‌శబ్దమునకు 'డతి' ప్రత్యయము చేర్చుటచే 'కతి'శబ్ద మేర్పడినది. ఇది నిత్యబహువచనాంతము. 'కతి + (జ)స్'అని యుండగా:-

186. బహుగణవతుడతి సఙ్ఖ్యా 1.1.23

బహుశబ్ద గణశబ్దములు, వతుప్రత్యయాంతము, డతిప్రత్యయాంతమున 'సంఖ్యా' సంజ్ఞకము లగును.

187. డతి చ 1.1.25

డత్యన్తా సఙ్ఖ్యా షట్సంజ్ఞా స్యాత్.

పై సూత్రము నుండి 'సఙ్ఖ్యా'అను పదమును, 'ష్ణాన్తాషట్'నుండి 'షట్' అను పదమును అనువర్తించును. డత్యంత మగు సంఖ్యాసంజ్ఞకము షట్సంజ్ఞకము కూడ అగును.

కతిశబ్దము డతిప్రత్యయాంతము గాన పై రెండు సూత్రములచే దీనికి 'సంఖ్యా' సంజ్ఞయు, 'షట్'సంజ్ఞయు కూడ లభించును. ఈ సంజ్ఞాసూత్రములు 'ఆకడారాదేకా సంజ్ఞా'అను అధికారసూత్రము (166) క్రింద నున్నవి కాదు కావున రెండు సంజ్ఞలును ఉండవచ్చును.

188. షడ్భ్యో లుక్ 7.1.22

జశ్శసోః.

'జశ్శసోః శిః'నుండి 'జశ్శసోః'అనువర్తించును. షట్సంజ్ఞకముల కంటె పర మగు'జస్', శస్'లకు లుక్‌వచ్చును.

189. ప్రత్యయస్య లుక్‌శ్లులుపః 1.1.61

లుక్, శ్లు,లుప్‌శబ్దైః కృతం ప్రత్యయాదర్శనం క్రమాత్ తత్తత్సంజ్ఞం స్యాత్.

'అదర్శనం లోపః'నుండి 'అదర్శనమ్' అనువర్తించును. 'లుక్, శ్లు, లుప్‌పదములచే చేయబడిన ప్రత్యయాదర్శనమునకు క్రమముగా 'లుక్','శ్లు', 'లుప్'అను పేర్లు.

ప్రకృతమున 'కతి' యనునది షట్సంజ్ఞకము గాన దానికంటె పరమగు 'జస్'కు 'లుక్' (అదర్శనము) వచ్చుటచే 'కతి'యను రూపము సిద్ధించినది.

190. ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్ 1.1.62

ప్రత్యయే లుప్తే తదాశ్రితం కార్యం స్యాత్. ఇతి జసి చేతి గుణే ప్రాప్తేః-

ప్రత్యయము లుప్తమైనను దాని నాశ్రయించి వచ్చెడు కార్యము వచ్చును.

ఈ సూత్రముచే 'కతి'అనునపుడు పరముగ నుండెడు 'జస్'ప్రత్యయము లోపించినను, దానిని ఆధారముగ చేసికొని ప్రవర్తించెడు 'జసి చ'అను సూత్రముచే (168) గుణము రావలసి యుండగా-

191. న లుమతాఽఙ్గస్య 1.1.63

లుమతా శబ్దేన లుప్తే తన్నిమిత్తమఙ్గకార్యం న స్యాత్.

పూర్వసూత్ర మనువర్తించును. 'లు'కల శబ్దముచే (అనగా లుక్, శ్లు లుప్ అను పదములచే) ప్రత్యయము లుప్తమైనపుడు తత్ప్రయుక్త మగు అంగకార్యము రాదు.

ఇచట 'కతి'కంటె పర మగు 'జస్', 'లుక్'అను లుమత్ అగుశబ్దముచే లుప్తమైనది గాన 'జస్'ప్రయుక్త మగు అంగకార్యము- అనగా గుణము రాజాలదు. కావున 'కతి'అనియే యుండును.

ద్వితీయాబహువచనమున గూడ 'కతి + శస్'అని యుండ 'షడ్భ్యోలుక్' అను సూత్రముచే (188) 'శస్'కు లుక్ వచ్చుటచే 'కతి' అను రూప మగును. తృతీయాది విభక్తులందు హరిశబ్దమునందువలె రూపములు.

యుష్మదస్మత్షట్సంజ్ఞకాః త్రిషు సరూపాః.

యుష్మదస్మచ్ఛబ్దములును, షట్సంజ్ఞకము లగు శబ్దములును మూడు లింగము లందును సమానరూపములుగ నుండును. 'కతి'శబ్దము షట్సంజ్ఞము గాన మూడు లింగములందును తుల్యముగనే యుండును.

త్రిశబ్దో నిత్యం బహువచనాన్తః. త్రయః, త్రీన్, త్రిభిః, త్రిభ్యః-2.

త్రిశబ్దము, నిత్యబహువచనాంతము ప్రథమాబహువచనమున 'త్రి + అస్'అని యుండగా-'జసి చ'అను సూత్రముచే (168) ఇకారమునకు గుణము, 'ఏచోయవాయావః'అను సూత్రముచే (22) అయాదేశమును వచ్చి 'త్రయః' అను రూపము సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'త్రి + అస్'అని యుండ 'ప్రథమయోః పూర్వసవర్ణః'అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము, 'తస్మాచ్ఛసో నః

పుంసి' అను సూత్రముచే (137)సకారమునకు నకారమును వచ్చుటచే 'త్రీన్' అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'త్రి + ఆమ్'అని యుండగా-

192. త్రేస్త్రయః 7.1.53

త్రిశబ్దస్య త్రయాదేశః స్యాదామి. త్రయాణామ్. త్రిషు. గౌణత్వేఽపి-ప్రియత్రయాణామ్.

'ఆమి సర్వనామ్నః సుట్'నుండి 'ఆమి' అనువర్తించును. త్రిశబ్దమునకు 'ఆమ్'పర మగునపుడు 'త్రయ'అను నాదేశము వచ్చును.

త్రిశబ్దమునకు 'త్రయ'ఆదేశము వచ్చుటచే 'త్రయ + ఆమ్'అని యుండగా 'హ్రస్వనద్యాపో నుట్'అను సూత్రముచే(148) నుడాగమము, 'నామి' (149)అను దీర్ఘము, ణత్వము వచ్చుటచే 'త్రయాణామ్'అను రూపము సిద్ధించును. 'త్రిషు'అను రూపము 'హరిషు' వలె సిద్ధించును.

బహువ్రీహ్యాదులలో త్రిశబ్దము గౌణమైనపుడు గూడ నీ త్రయాదేశము వచ్చును. కావున 'ప్రియత్రి'శబ్దషష్ఠీబహువచనమునందు కూడ 'త్రయాదేశము' వచ్చుటచే 'ప్రియత్రయాణామ్'అను రూపము సిద్ధించును.

193. త్యదాదీనామః 7.2.102

ఏషామకారో విభక్తౌ, ద్విపర్యన్తానామేవేష్టిః. ద్వౌ-2, ద్వాభ్యామ్-3, ద్వయోః-2.

త్యదాదీనాం, అః. 'అష్టన ఆ విభక్తౌ'నుండి 'విభక్తౌ'అనువర్తించును. త్యదాదులకు విభక్తి పర మగునపుడు అకార మాదేశముగ వచ్చును. అలోన్త్య పరిభాషచే (21) అంతాదేశ మగును. 'ద్విపర్యన్తానాం' ఇత్యాదివాక్యముచే భాష్యకారులు 'త్యద్' మొదలు 'ద్వి'వరకును గల ఎనిమిది శబ్దములకు మాత్రమే ఈ అకారము రావలె నని నియమించిరి.

ద్విశబ్దము నిత్యద్వివచనము. దీనికి 'ఔ'మొదలగు విభక్తులుపర మగునపుడు అకార మంతాదేశ మగుటచే 'ద్వ'అని యగును. ఏడు విభక్తులందును రూపములు 'సర్వ'శబ్దమునందు వలె నుండును.

పాతి లోకమితి పపీః సూర్యః-'దీర్ఘాజ్జసి చ'-పప్యౌ-2 పప్యః, హేపపీః, పపీమ్, పపీన్, పప్యా, పపీభ్యామ్-3, పపీభిః, పప్యే,

పపీభ్యః-2. పప్యః-2 పప్యోః,దీర్ఘత్వాన్న నుట్, పప్యామ్, ఙౌ తు సవర్ణ దీర్ఘః-పపీ, పప్యోః,పపీషు. ఏవం వాతప్రమ్యాదయః,

'పాతి లోకం'అను నర్థమున పాధాతువునకు ఔణాదిక మగు'ఈ' ప్రత్యయమును చేర్చుటచే పపీశబ్దము సిద్ధించును. దీనికి ప్రథమైకవచనమున 'పపీ + స్'అని యుండగా సకారమునకు రుత్వవిసర్గములచే 'పపీః'అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వివచనమున 'పపీ + ఔ'అని యుండ 'ప్రథమయోః-'అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము రావలసి యుండగా 'దీర్ఘాజ్జసి చ' అను సూత్రముచే (162) అది నిషేధింపబడుటచే 'ఇకో యణచి'అను సూత్రముచే (15) యణాదేశము వచ్చి 'పప్యౌ'అను రూపము సిద్ధించును.

ఇట్లే ప్రథమాబహువచనమునందు కూడ పూర్వసవర్ణదీర్ఘము నిషిద్ధము గాన యణాదేశరుత్వవిసర్గములచే 'పప్యః'అను రూపము సిద్ధించును.

సంబోధనైకవచనమున 'హే పపీ + స్'అని యుండ రుత్వవిసర్గములచే 'హేపపీః'అను రూపము సిద్ధించును. 'పపీ'యనునది హ్రస్వాంతము కాదు కావున 'ఏఙ్హ్రస్వాత్సమ్బుద్ధేః'అను సూత్రముచే (134) 'స్'కు లోపప్రసక్తి లేదు.

ద్వితీయైకవచనమున 'పపీ + అమ్'అని యుండ 'ప్రథమయోః'అను సూత్రమును (126) బాధించి 'అమిపూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము చేయ 'పపీమ్'అను రూపము సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'పపీ+(శ)అస్'అని యుండగా 'ప్రథమయోః-'అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము, 'తస్మాచ్ఛసోనః పుంసి'అను సూత్రముచే (137) సకారమునకు నకారమును వచ్చుటచే 'పపీన్' అను రూపము సిద్ధించును.

తృతీయైకవచనమున 'పపీ + ఆ'లని యుండగా యణాదేశముచే 'పప్యా' అను రూపము సిద్ధించును.

తృతీయాబహువచనమున 'పపీ + భిస్'అనునపుడు సకారమునకు రుత్వవిసర్గములచే 'పపీభిః'అను రూపము సిద్ధించును.

పంచమీషష్ఠ్యేకవచనములందు 'పపీ + అస్'అని యుండగా యణాదేశరుత్వవిసర్గములచే 'పప్యః'అను రూపము సిద్ధించును.

షష్ఠీసప్తమీద్వివచనములందు 'పపీ + ఓస్'అనునపుడు యణాదేశరుత్వ విసర్గములచే 'పప్యోః'అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'పపీ + ఆమ్'అనునపుడు 'పపీ'అనునది హ్రస్వాంతము కాదు గాన 'హ్రస్వనద్యాపో నుట్'అను సూత్రముచే (148) నుడాగమము రాదు. ఇది స్త్రీలింగము కాదు కావున నదీసంజ్ఞ కూడ లేదు. యణాదేశముచే 'పప్యామ్'అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'పపీ + ఇ'అని యుండ సవర్ణదీర్ఘముచే 'పపీ' అను రూపము సిద్ధించును.

సప్తమీబహువచనమున 'పపీ + సు'అనునపుడు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) సకారమునకు షత్వము చేయ 'పపీషు'అనియగును.

'వాతప్రమీ' మొదలగు శబ్దములు గూడ ఇట్లే యుండును.

బహ్వ్యః శ్రేయస్యో యస్య సః బహుశ్రేయసీ.

'బహ్వ్యః శ్రేయస్యః యస్య సః'అను నర్థముగల 'బహుశ్రేయసీ'శబ్దమునకు ప్రథమైకవచనమున 'బహుశ్రేయసీ + స్'అని యుండ 'శ్రేయసీ'శబ్దము 'ఙీప్ ప్రత్యయాంత మగుటచే 'హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్-'అను సూత్రముచే (179) 'స్' లోపింప 'బహుశ్రేయసీ'అను రూప మగును.

ద్వివచనబహువచనములందు 'పపీ'శబ్దమునందు వలె ప్రక్రియయుండును. సంబోధనప్రథమైకవచనమున 'హే బహుశ్రేయసీ + స్'అని యుండగా:-

194. యూ స్త్ర్యాఖ్యౌ నదీ 1.4.3

ఈదూదన్తౌ నిత్యస్త్రీలిఙ్గౌ నదీసంజ్ఞౌ స్తః.

ఈశ్చ ఊశ్చ యూ. నిత్యస్త్రీలింగములగు ఈకారాంతఊకారాంత శబ్దములు నదీసంజ్ఞకము లగును.

ఈ సూత్రముచే 'బహుశ్రేయసీ' శబ్దమునందలి 'శ్రేయసీ' అను ఈకారాంతపదమునకు నదీసంజ్ఞ లభించును. కాని 'శ్రేయసీ'అనునది నిత్యస్త్రీలింగమైనను 'బహుశ్రేయసీ'అను బహువ్రీహిసమాసమునందలి 'శ్రేయసీ' పుంలింగమగుటచే నదీత్వ ముండదు అను సందేహమును దీర్చుటకై క్రింది వార్త్తికము చెప్పబడుచున్నది.

వా. ప్రథమలింగగ్రహణఞ్చ.

పూర్వం స్త్ర్యాఖ్యస్యోపసర్జనత్వేఽపి నదీత్వం వక్తవ్యమిత్యర్థః.

నదీసంజ్ఞావిషయమున ప్రథమలింగమును గూడ గ్రహింపవలెను. అనగా మొదట స్త్రీలింగమునం దున్న శబ్ద మిపుడు ఉపసర్జ నమైనను (అప్రధానమై లింగాంతరమునం దున్నను) నదీసంజ్ఞ చెప్పవలె నని యర్థము.

ఈవార్తికము ననుసరించి 'బహుశ్రేయసీ'అను చోట నదీత్వముం డును గాన-

195. అమ్బార్థనద్యోర్హ్రస్వః 7.2.107

సమ్బుద్ధౌ. హే బహుశ్రేయసి.

'సమ్బుద్ధౌ చ' నుండి 'సమ్బుద్ధౌ' అనువర్తించును. అంబార్థక శబ్దముల కును నద్యంతశబ్దములకును సంబుద్ధి పర మగునపుడు హ్రస్వము వచ్చును.

అలోన్త్యపరిభాషచే (21) అంత్యాచ్చునకు హ్రస్వము వచ్చుటచే 'హే బహుశ్రేయసి + స్'అని యుండ 'ఏఙ్‌హ్రస్వాత్‌సంబుద్ధేః'అను సూత్రముచే (134) సంబుద్ధిలోపము. 'హేబహుశ్రేయసి'అను రూపము నిష్పన్న మగును.

చతుర్థ్యేకవచనమున 'బహుశ్రేయసీ + (ఙే)ఏ'అని యుండగా:-

196. ఆణ్నద్యాః 7.3.112

నద్యన్తాత్పరేషాం ఙితామాడాగమః

'అఙ్గస్య' అధికారము. 'ఘేర్ఙితి'నుండి 'ఙితి'అనువర్తించును. నద్యం తాంగముకంటె పర మగు ఙిత్తులకు 'ఆట్'అను నాగమము వచ్చును.

'ఆట్' లోని టకారము ఇత్సంజ్ఞకము. టిత్తు గాన ఆద్యవయవముగ (సూ.84) వచ్చును. 'బహుశ్రేయసీ + ఆ + ఏ'అని యుండ:-

197. ఆటశ్చ 6.1.190

ఆటోఽచి పరే వృద్ధిరేకాదేశః. బహుశ్రేయస్యై. బహు శ్రేయస్యాః, నద్యన్తత్వాత్ నుట్-బహుశ్రేయసీనామ్.

'ఇకో యణచి' 'వృద్ధిరేచి'నుండి 'అచి' 'వృద్ధిః' అనువర్తించును. 'ఏకః పూర్వపరయోః'అధికారము. 'ఆట్'కు అచ్చు పర మగు నపుడు వృద్ధి యేకాదేశముగ వచ్చును. దానిచే 'ఆఏ'లకు వృద్ధి యేకాదేశ మగుటచే 'బహు శ్రేయసీ + ఐ' అనియై, యణాదేశముచే 'బహుశ్రేయస్యై'అను రూపము సిద్ధించును.

పంచమీషష్ఠ్యేకవచనములందు 'బహుశ్రేయసీ + అస్'అని యుండ ఆడాగమ, వృద్ధి, యణాదేశ, రుత్వ, విసర్గలచే 'బహుశ్రేయస్యాః'అను రూపము నిష్పన్న మగును.

షష్ఠీబహువచనమున 'బహుశ్రేయసీ + ఆమ్'అని యుండ ఇది నద్యంతముగాన 'హ్రస్వనద్యాపో నుట్'అను సూత్రముచే (148) నుడాగమము చేయ 'బహుశ్రేయసీనామ్' అనురూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'బహుశ్రేయసీ + ఙి అని యుండగా-

198. ఙేరామ్నద్యామ్నీభ్యః 7.3.116

నద్యన్తాత్, ఆబన్తాత్, నీశబ్దాత్ పరస్య ఙేరామ్. బహుశ్రేయస్యామ్. శేషం పపీవత్

ఙేః, ఆమ్, నద్యామ్నీభ్యః, (ఆప్ + నీ = ఆమ్నీ).నద్యంతముకంటెను, ఆబన్తముకంటెను, నీశబ్దముకంటెను పర మగు 'ఙి'ప్రత్యయమునకు 'ఆమ్' ఆదేశమగును.

ఇచట నద్యంతముకంటె పర మగుటచే 'ఙి'కి 'ఆమ్'ఆదేశము వచ్చి బహుశ్రేయసి + ఆమ్' అనియై, యణాదేశముచే 'బహుశ్రేయస్యామ్' అను రూపము సిద్ధించును. ఇచట చూపబడని రూపము లన్నియు పపీశబ్దమునందు వలె సిద్ధించును.

అజ్యన్తత్వాన్న సులోపః, అతిలక్ష్మీః, శేషం బహుశ్రేయసీవత్. ప్రధీః.

'లక్షేర్ముట్ చ'అను ఉణాది సూత్రముచే లక్షధాతువునకు ఈప్రత్యయము ముడాగమములు వచ్చుటచే నిష్పన్న మగు లక్ష్మీశబ్దమునకు 'అతి'తో సమాసము చేయుటచే 'అతిలక్ష్మీ'శబ్దము సిద్ధించినది. 'అతిక్రాన్తః లక్ష్మీమ్'అని యర్థము. ఇది 'ఙీ'ప్రత్యయాంతము కాదు కావున 'అతిలక్ష్మీ + స్'అను ప్రథమైకవచనమున 'హల్ఙ్యాబ్భ్యః-'అను సూత్రముచే (179) సులోపము రాదు. రుత్వవిసర్గములు చేయగా 'అతిలక్ష్మీః'అను రూపము సిద్ధించును.ఇతర రూపములు బహుశ్రేయసీశబ్ద రూపముల వలె నుండును.

'ప్రధ్యాయతి'అను నర్థమున ప్రపూర్వక మగు "ధ్యై చిన్తాయామ్"అను ధాతువునకు 'క్విప్'ప్రత్యయము చేర్చుటచే 'ప్రధీ' యనునది నిష్పన్న మైనది. దీనికి ప్రథమైకవచనమున 'ప్రధీ + స్'అని యుండ రుత్వవిసర్గములచే 'ప్రధీః'

అను రూపము సిద్ధించును. ఇది నిత్యస్త్రీలింగశబ్దము కాకుండుటచే నదీసంజ్ఞయు (సూ 194), తత్ప్రయుక్త మగు సులోపమును రావు.

ప్రథమాద్వివచనమున 'ప్రధీ + ఔ' అని యుండగా:-

199. అచి శ్నుధాతుభ్రువాంయ్వోరియఙువఙౌ 6.4.77

శ్నుప్రత్యయాన్తస్య, ఇవర్ణోవర్ణాన్తస్య ధాతోః భ్రూ ఇత్యస్య చాఽఙ్గస్య ఇయఙువఙౌ స్తోఽజాదౌ ప్రత్యయే పరే. ఇతిప్రాప్తే.

'అఙ్గస్య' అధికారము. శ్నుప్రత్యయాంతమునకును, ఇవర్ణోవర్ణాన్తధాతువునకును, భ్రూ రూపమగు అంగమునకును అజాదిప్రత్యయము పరమగునపుడు 'ఇయఙ్' 'ఉవఙ్' అను నాదేశములు వచ్చును.

ఇకారమునకు 'ఇయఙ్' ఉకారమునకు 'ఉవఙ్'.

ఇచట 'ధీ'యను ఈకారాంతధాతువునకు అజాదిప్రత్యయ మగు 'ఔ'పర మగుటచే ఈకారమునకు 'ఇయఙ్'ఆదేశము రావలసి యుండ-

200. ఏరనేకాచోఽసంయోగపూర్వస్య 6.4.82

ధాత్వవయవసంయోగపూర్వో న భవతి య ఇవర్ణః, తదన్తో యో ధాతుః తదన్తస్యానేకాచోఽఙ్గస్య యణ్ స్యాదజాదౌ ప్రత్యయే. ప్రధ్యౌ. ప్రధ్యమ్, ప్రధ్యః. ప్రధ్యి, శేషం పపీవత్. ఏవంగ్రామణీః. ఙ్యాతు-గ్రామణ్యామ్, అనేకాచః కిమ్? నీః, నియౌ, నియః, ఙేరామ్- నియామ్, అసంయోగపూర్వస్య కిమ్? సుశ్రియౌ,యవక్రియౌ.

'ఇకోయణచి'నుండి 'యణ్', పూర్వసూత్రమునుండి 'ధాతు' 'అచి', 'అఙ్గస్య'అను అధికారసూత్రమును అనువర్తించును. ధాత్వవయవ మగు సంయోగము పూర్వమునందు లేని ఇవర్ణము అంతమున గల ధాతువు అంతమందు కలదియు, అనేకాచ్చును అగు అంగమునకు అజాదిప్రత్యయము పర మగునపుడు యణ్ వచ్చును.

పూర్వసూత్రమును బాధించి ఈ సూత్రముచే యణ్ చేయగా 'ప్రధ్యౌ' అను రూపము సిద్ధించును.

అజాదిప్రత్యయము లగు జస్, అమ్. శస్, టా, ఙే, ఙసి, ఙస్ ఓస్, ఆమ్, ఙి, ఓస్,లు పర మగునపుడు 'ఇయఙ్'ను బాధించి యణాదేశము చేయుటచే "ప్రధ్యః, ప్రధ్యమ్, ప్రధ్యః, ప్రధ్యా, ప్రధ్యే, ప్రధ్యః, ప్రధ్యః,

ప్రధ్యోః, ప్రధ్యామ్, ప్రధ్యి, ప్రధ్యోః" అను రూపము లగును. ఇతర రూపములు పపీశబ్దమునందు వలె ఉండును.

'ప్రధ్యౌ' 'ప్రధ్యా'మొదలగు నుదాహరణములందు 'ఇకో యణచి' అను సూత్రముచేతనే (15) యణాదేశము రావచ్చును.కాని 'అచిశ్ను'-అను సూత్రము (199) దానిని బాధించును దానిని కూడ బాధించి 'ఏరనేకాచః-'అను సూత్రము (200) ప్రవర్తించును.

గ్రామణీశబ్దము కూడ నిట్లే యుండును. కాని సప్తమ్యేకవచనమున 'గ్రామణీ + ఙి'అని యుండగా ఈ ఙిప్రత్యయము'నీ'శబ్దమునకంటె పర మగుటచే 'ఙేరామ్నద్యామ్నీభ్యః' అను సూత్రముచే (198) ఆమ్ వచ్చి 'గ్రామణ్యామ్' అను రూపము సిద్ధించును.

అనేకాచః అననేల?ఏకాచ్ ఐనచో ఈ యణ్ రాకుండుటకై ఈ పదము చేర్చబడినది. కావుననే 'నీ'శబ్దమున అజాదివిభక్తులు పర మగునపుడు 'ఇయఙ్' వచ్చును.

'నీ'శబ్ద ప్రథమైకవచనమున 'నీ + స్'అని యుండగా సకారమునకు రుత్వవిసర్గలచే 'నీః'అను రూప మగును.

ప్రథమాద్వివచనమున 'నీ + ఔ'అని యుండ 'ఇకో యణచి' అను (15) యణ్‌ను బాధించి 'ప్రథమయోః-'అను (126) పూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తించును. కాని 'దీర్ఘాజ్జసి చ'అను సూత్రము (162) పూర్వసవర్ణదీర్ఘమును నిషేధించుటచే తిరిగి యణ్ రావలసి యుండ దానిని బాధించి 'అచి శ్ను-'అను సూత్రముచే (199) ఇయఙ్ ఆదేశము (ఙిత్ అగుటచే అంత్యాదేశముగ) వచ్చి 'నియౌ'అను రూప మగును.

'నీ'శబ్దమునకు 'అమ్' 'శస్'లు పర మగునపుడు క్రమముగా 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము, 'ప్రథమయోః-'అను సూత్రముచే (126) పూర్వసవర్ణ దీర్ఘమును రావలసి యున్నవి. కాని పరశాస్త్ర మగుటచే 'ఇయఙ్' ఆ రెండింటిని బాధించును గాన 'నియమ్''నియః' అను రూపము లగును. అజాదిప్రత్యయములు (టా,ఙేమొదలగునవి) పర మగునపుడు ఈ విధముగనే ఇయఙాదేశము వచ్చి 'నియా' 'నియే' 'నియః''నియోః''నియామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును. సప్తమ్యేకవచనమున 'ఙేరామ్నద్యామ్నీభ్యః'

అను సూత్రముచే (198) 'ఙి'కి'ఆమ్' రాగా పిదప అజాదిప్రత్యయము పర మగుటచే ఇయజాదేశము వచ్చి 'నియామ్'అను రూపము సిద్ధించును.

'అసంయోగపూర్వస్య' అననేల? అట్లనుటచే 'సుశ్రీ' 'యవక్రీ'శబ్దము లందు ఇవర్ణము సంయోగపూర్వ మగుటచే యణ్ రాదు. 'ఇయఙ్'వచ్చుటచే 'నీ'శబ్దమునందు వలె రూపము లగును. కాని సప్తమ్యేకవచనమున 'సుశ్రీ + ఙి' 'యవక్రీ + ఙి'అని యుండగా 'ఙి'కి'ఆమ్'వచ్చు నవకాశము (సూ.198) లేదు గాన 'ఇయఙ్'మాత్రము వచ్చుటచే 'సుశ్రియి''యవక్రియి'అను రూపము లగును

## 201. గతిశ్చ 1.4.60

ప్రాదయః క్రియాయోగే గతిసంజ్ఞాః స్యుః. గతికారకేతర పూర్వపదస్య యణ్ నేష్యతే. శుద్ధధియౌ

'ప్రాదయః' అధికారసూత్రము, 'ఉపసర్గాః క్రియాయోగే'నుండి 'క్రియా యోగే'అనువర్తించును. ప్రాదులు క్రియాయోగ మున్నపుడు గతిసంజ్ఞకములు గూడ అగును.

దేని పూర్వపదము గతిసంజ్ఞము గాని కారకసంజ్ఞము కాని కాదో అట్టి దానికి యణ్ అంగీకరింపబడదు.

'శుద్ధా ధీః యస్య సః'అను నర్థము గల 'శుద్ధధీ'శబ్దమునకు ప్రథమైక వచనమున 'శుద్ధధీః'అను రూప మగును. ప్రథమాద్వివచనమున 'శుద్ధధీ + ఔ' అని యుండగా 'ఇకో యణచి'అను సూత్రముచే (15) యణాదేశము రావలసి యుండ దానిని బాధించి 'ప్రథమయోః-'అను సూత్రముచే (126) పూర్వసవర్ణ దీర్ఘము రావలసి యున్నది. దానిని బాధించి 'అచి శ్నుధాతు-'అను సూత్రముచే (199) 'ఇయఙ్' వచ్చుచుండగా దానిని బాధించి 'ఏరనేకాచః-'అను సూత్రముచే (200) యణ్ రావలసి యున్నది. కాని ఈ వార్తికము గతిసంజ్ఞకము కాని, కారకము కాని పూర్వపదము కాకున్నచో యణ్ రాకూడ దని చెప్పుచున్నది. ఇచట 'శుద్ధ'అను పదము గతిసంజ్ఞకము కాని కారకసంజ్ఞకము కాని కాదు. కావున యణ్ రాదు 'ఇయఙ్' ఆదేశము వచ్చుటచే 'శుద్ధధియౌ'అను రూప మేర్పడును. ఇట్లే ఇతర రూపము లన్నియు 'నీ'శబ్దమునందు వలె నుండును. సప్తమ్యేకవచనమునందు మాత్రము 'ఆమ్'కు అవకాశము లేదు గాన 'శుద్ధధియి' అను రూప మగును.

సుధీశబ్దమునకు అజాదిప్రత్యయములు పర మగునపుడు 'ఏరనేకాచః-' అను సూత్రముచే (200) యణాదేశము రావలసి యుండ;-

202. న భూసుధియోః 6.1.85

ఏతయోరచి సుపి యణ్ న. సుధియౌ, సుధియః ఇత్యాది.

'అచిశ్ను-'నుండి 'అచి', 'ఓః సుపి'నుండి 'సుపి' 'ఇకో యణచి' నుండి 'యణ్', అనువర్తించును. భూశబ్దసుధీ శబ్దములకు అజాదిప్రత్యయము పర మగునపుడు 'యణ్' రాదు.

ఈ సూత్రముచే యణ్ నిషేధింపబడినది గాన 'అచిశ్ను-'అను సూత్రముచే (199) ఇయజాదేశము వచ్చి 'శుద్ధధీ'శబ్దమునందు వలె రూపము లగును.

సుఖమిచ్ఛతీతి సుఖీః, సుతమిచ్ఛతీతి సుతీః, సుఖ్యౌ, సుత్యౌ, సుఖ్యుః, సుత్యుః. శేషం ప్రధీవత్. శమ్భుర్హరివత్. ఏవం భాన్వాదయః.

'సుఖం ఆత్మనః ఇచ్ఛతి' 'సుతం ఆత్మనః ఇచ్ఛతి'అను నర్థమున 'సుఖ''సుత'శబ్దములకు 'సుప ఆత్మనః క్యచ్'అను సూత్రముచే (723) 'క్యచ్' ప్రత్యయము. 'క్యచి చ'అను సూత్రముచే (725) ఈత్వము. పిమ్మట 'క్విప్' చేర్చగా అలోపయలోపములచే సిద్ధించిన 'సుఖీ''సుతీ'శబ్దములకు అజాదిప్రత్యయములు పర మగునపుడు 'ఏరనేకాచః'అను సూత్రముచే (200) యణ్ వచ్చును. సుతీః, సుత్యౌ, సుత్యః, సుఖీః, సుఖ్యౌ, సుఖ్యః, ఇత్యాది రూపములు ప్రధీశబ్దమునందు వలె నిష్పన్న మగును. కాని పంచమీషష్ఠ్యేకవచనములందు 'సుతీ + అస్' 'సుఖీ + అస్'అని యుండ యజాదేశముచే 'సుత్యస్','సుఖ్యస్' అనియు, పిదప 'ఖ్యత్యాత్పరస్య'అను సూత్రముచే (183) 'ఙసి''ఙస్'ల అకారమునకు ఉకారాదేశము సకారమునకు రుత్వవిసర్గలు వచ్చి 'సుత్యుః' 'సుఖ్యుః' అను రూపములు సిద్ధించును.

శమ్భుశబ్దము హరిశబ్దము వలె నుండును. 'భాను'మొదలగు శబ్దములును ఇటులనే యుండును. 'శంభు'శబ్దము 'ఉ'కారాంత మగుటచే 'శేషో ఘ్యసఖి'అను సూత్రముచే (170) ఘిసంజ్ఞ యుండును గాన ఘిసంజ్ఞాప్రయుక్తము లగు కార్యము లన్నియు వచ్చును. 'హరి'శబ్దమున ప్రథమాబహువచనాదులందు అయాదేశము రాగా ఈ శబ్దమునకు అవాదేశము వచ్చును. ఇదియే భేదము.

203 తృజ్వత్ క్రోష్టుః 7.1.95

అసమ్బుద్ధౌ సర్వనామస్థానే పరే క్రోష్టుశబ్దస్య స్థానే క్రోష్టృశబ్దః ప్రయోక్తవ్య ఇత్యర్థః.

'ఇతోఽత్సర్వనామస్థానే', 'సఖ్యురసమ్బుద్ధౌ' నుండి 'సర్వనామస్థానే' 'అసమ్బుద్ధౌ' అనువర్తించును. సంబుద్ధి (సంబోధనప్రథమైకవచన) భిన్న మగు సర్వనామస్థానము (స్వాదిపంచవిభక్తులు) పర మగునపుడు క్రోష్టు (అను ఉకారాంత) శబ్దము తృచ్ప్రత్యయాంతము వలె నగును. అనగా క్రోష్టుశబ్ద స్థానమున 'క్రోష్టృ' శబ్దము ప్రయోగింపబడును.

క్రోష్టుశబ్ద' ప్రథమైకవచనమున ఈ సూత్రముచే తృజ్వద్భావము చేసిన పిమ్మట 'క్రోష్టృ + స్ అని యుండగా:-

204. ఋతో ఙిసర్వనామస్థానయోః 7.3.110

ఋతోఽఙ్గస్య గుణో ఙౌ సర్వనామస్థానే చ. ఇతి ప్రాప్తే-

'అఙ్గస్య' అధికారము. 'హ్రస్వస్య గుణః' నుండి 'గుణః' అనువర్తించును. ఋకారాంత మగు అంగమునకు ఙిప్రత్యయము గాని, సర్వనామస్థానము గాని పర మగునపుడు గుణము వచ్చును.

ఈ సూత్రముచే నిచట ఋకారమునకు గుణము రావలసి యుండ-

205 ఋదుశనస్పురుదంసోఽనేహసాం చ 7.1.94

ఋదన్తానాముశనసాదీనాం చానఙ్ స్యాదసమ్బుద్ధౌ సౌ.

'అఙ్గస్య' అధికారము. 'సఖ్యురసమ్బుద్ధౌ' 'అనఙ్ సౌ' నుండి 'అసమ్బుద్ధౌ' 'అనఙ్' అనువర్తించును. ఋకారాంతములకును, 'ఉశనస్' పురుదంసస్, అనేహస్ అను శబ్దములకును సంబుద్ధిభిన్న మగు 'సు' పర మగునపుడు 'అనఙ్' ఆదేశము వచ్చును.

అనఙ్, ఙిత్ గాన అంత్యాదేశముగ వచ్చును. ఇచట అంత్యవర్ణ మగు ఋకారస్థానమున వచ్చుటచే 'క్రోష్టన్ + స్' అని యుండగా-

206. అప్-తృన్-తృచ్-స్వసృ-నప్తృ-నేష్టృ-త్వష్టృ-క్షత్తృ హోతృ-పోతృ-ప్రశాస్తౄణామ్ 6.1.11

అబాదీనాముపధాయాః దీర్ఘోఽసమ్బుద్ధౌ సర్వనామస్థానే. క్రోష్టా, క్రోష్టారౌ, క్రోష్టారః, క్రోష్టారం, క్రోష్టౄన్.

'నోపధాయాః' నుండి 'ఉపధాయాః' 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' నుండి 'సర్వనామస్థానే' 'అసమ్బుద్ధౌ' అనువర్తించును.

సంబుద్ధిభిన్న మగు సర్వనామస్థానము పర మగునపుడు అప్శబ్ద, తృన్నంతశబ్ద, తృజంతశబ్ద, స్వసృ, నప్తృ, నేష్టృ, త్వష్టృ, క్షత్తృ, హోతృ, పోతృ ప్రశాస్తృశబ్దముల ఉపధకు దీర్ఘము వచ్చును.

'క్రోష్టృ'శబ్దము తృజంతము గాన సర్వనామస్థాన మగు 'సు'పర మగునపుడు దాని యుపధకు దీర్ఘము వచ్చుటచే 'క్రోష్టాన్స్'అని యుండ 'హల్ఙ్యాబ్భ్యః-'అను సూత్రముచే (179) సకారమునకును,'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే(180)నకారమునకును లోపము వచ్చి'క్రోష్టా' అను రూపము సిద్ధించినది.

ప్రథమాద్వివచనమున 'క్రోష్టృ + ఔ'అని యుండగా 'ఋతో ఙిసర్వనామస్థానయోః'అను సూత్రముచే (204) గుణము ('ఉరణ్ రపరః' అనుసూత్రముచే (29) రపరమగు అకారము) వచ్చును. 'క్రోష్టర్ + ఔ'- ఇచట 'అప్తృన్'-ఇత్యాది సూత్రముచే (206) ఉపధాదీర్ఘము వచ్చి 'క్రోష్టారౌ' అను రూపము సిద్ధించును.

ప్రథమాబహువచనమున 'క్రోష్టృ + అస్'అని యుండగా వెనుకటి వలెనే గుణోపధాదీర్ఘములును, సకారమునకు రుత్వవిసర్గములును వచ్చి 'క్రోష్టారః' అను రూపము సిద్ధించినది.

సంబోధనప్రథమైకవచనమున తృజ్వద్భావము లేకుండుటచే 'శమ్భు' శబ్దమునకు వలె 'హే క్రోష్టో' అను రూపము సిద్ధించును. ఇతరవచనములందు ప్రథమయందు వలె రూపము లుండును.

ద్వితీయైకవచనమున 'క్రోష్టృ + అమ్'అని యుండ (204,206 సూత్రములచే) గుణోపధాదీర్ఘములు వచ్చి 'క్రోష్టారమ్'అను రూపము సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'శస్'సర్వనామస్థానము కాదు గాన'శమ్భూన్' వలె 'క్రోష్టూన్'అను రూపము సిద్ధించును.

207. విభాషా తృతీయాదిష్వచి. 7.1,97

అజాదిషు తృతీయాదిషు క్రోష్టుర్వా తృజ్వత్. క్రోష్ట్రా, క్రోష్ట్రే.

'తృజ్వత్క్రోష్టుః' నుండి 'తృజ్వత్' అనువర్తించును. అజాదులగు తృతీయాది విభక్తులు (అనగా టా,ఙే ఙసి,ఙస్,ఓస్,ఆమ్,ఙి) పర మగునపుడు క్రోష్టుశబ్దము వికల్పముగ తృజంతము వలె నగును.

తృజ్వద్భావపక్షమున:- తృతీయైకవచనమున 'క్రోష్టృ + ఆ' అని యుండగా 'ఇకో యణచి' అను సూత్రముచే (15) ఋకారమునకు, రేఫ యణాదేశముగ వచ్చి 'క్రోష్ట్రా' అను రూపము సిద్ధించును.

చతుర్థ్యేకవచనమున 'క్రోష్టృ + ఏ' అనునపుడు వెనుకటి వలె యణాదేశముచే 'క్రోష్ట్రే' అను రూపము సిద్ధించినది.

పంచమీషష్ఠ్యేకవచనములందు 'క్రోష్టృ + అస్' అని యుండ-

208. ఋత ఉత్ 6.1.111

ఋతో ఙసిఙసోరతి ఉత్ ఏకాదేశః రపరః.

'అఙ్గస్య' 'ఏకఃపూర్వపరయోః' అధికారములు. 'ఏఙః పదాన్తాదతి' 'ఙసిఙసోశ్చ' నుండి 'అతి' 'ఙసిఙసోః' అనువర్తించును. ఋదన్తాంగమునకు ఙసిఙస్ప్రత్యయముల 'అత్' పర మగునపుడు హ్రస్వ మగు ఉకార మేకాదేశ మగును.

ఈ ఉకారము ఋకారస్థానమున వచ్చుచున్నది. గాన 'ఉరణ్ రపరః' అను సూత్రముచే (29) రేఫపరకమై వచ్చును. క్రోష్ట్ + ఉర్ + స్ = 'క్రోష్టుర్స్' అని యుండగా :-

209. రాత్సస్య 8.2.24

రేఫాత్సంయోగాన్తస్య సస్యైవ లోపః నాన్యస్య. రస్య విసర్గః. క్రోష్టుః, క్రోష్టోః.

ఇది నియమ సూత్రము. 'సంయోగాన్తస్య లోపః' అను సూత్రము అనువర్తించును.

రేఫకంటె పర మగు సంయోగాంత సకారమునకు మాత్రమే లోపము వచ్చును, మరి యేవర్ణమునకు రాదు. అనగా రేఫకంటె పర మగు వర్ణమునకు సంయోగాంతలోపము చేయవలసి యున్నచో అట్టి లోపము సకారమునకు మాత్రమే వచ్చును.

ఇచట 'క్రోష్టుర్స్' అనునపుడు రేఫకంటె పర మగు సంయోగాంతవర్ణ

ము సకారమే కావున ఈ సూత్రముచే లోపము చేసి.పిదప రేఫకు విసర్గము చేయుటచే 'క్రోష్టుః' అను రూపము సిద్ధించినది.

షష్ఠీద్వివచనమున 'క్రోష్టృ + ఙస్' అని యుండ ఋకారమునకు యణా దేశముచే రేఫయు,సకారమునకు షత్వవిసర్గములను జేయ 'క్రోష్ట్రోః' అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'క్రోష్టు + ఆమ్' అని యుండగా 'ఆమ్' అనునది అజాదివిభక్తి యగుటచే 'విభాషా తృతీయాదిష్వచి' అను సూత్రముచే (207) తృజ్వద్భావము రావలసి యున్నది. అట్లే 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముచే (148)నుడాగమము రావలసి యున్నది. ఈ రెండును తుల్యబలము లగు శాస్త్రములు. అనగా 'ఆమ్'భిన్నము లగు అజాదిప్రత్యయములు పర మగునపుడు చరితార్థ మగు తృజ్వద్భావమునకును, క్రోష్టుశబ్దభిన్నము లగు శంభ్వాదిశబ్దము లందు చరితార్థ మగు 'నుట్'కును ఈలక్ష్యమునందు సమావేశ మేర్పడినది. కావున 'విప్రతిషేధే పరం కార్యమ్' అను సూత్రముచే (113) పరశాస్త్ర మగు తృజ్వద్భావశాస్త్రము ప్రవర్తింపవలసి యున్నది. ఇట్లు పూర్వశాస్త్రమును బాధించి పరశాస్త్రమును చేయుటకు పరవిప్రతిషేధ మని పేరు. కాని ఇచట పూర్వవిప్రతిషేధముచే-అనగా పరశాస్త్రమును బాధించి పూర్వశాస్త్రమును ప్రవర్తింపచేయుటచే నుడాగమమే వచ్చు నని ఈ క్రింది వార్తికము చెప్పుచున్నది.

వా. నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వవిప్రతిషేధేన.

'ఇకోఽచి విభక్తౌ' అను సూత్రముచే (245)విధింపబడిన 'నుమ్' కంటెను, 'అచి ర ఋతః' అను సూత్రముచే (225)విహిత మగు రభావము కంటెను,'విభాషా తృతీయాదిష్వచి'అను సూత్రముచే (207) విహిత మగు తృజ్వద్భావముకంటెను, ముందుగ పూర్వవిప్రతిషేధముచే 'ఆమ్'కు నుడాగమము వచ్చును.

ఈ వార్తికము ననుసరించి 'ఆమ్'కు నుడాగమమును, 'నామి' అను సూత్రముచే (149) దీర్ఘమును వచ్చుటచే 'క్రోష్టూనామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'క్రోష్టృ + ఇ'అని యుండగా 'ఋతో ఙిసర్వనామస్థానయోః'అను సూత్రముచే (204) ఋకారమునకు గుణము 'అర్' వచ్చి 'క్రోష్టర్ + ఇ' 'క్రోష్టరి'అను రూపము సిద్ధించును.

తృతీయాద్యజాదివిభక్తులు పర మగునపుడు తృజ్వద్భావము వైకల్పికము గాన తృజ్వద్భావము లేని పక్షమునను,హలాదివిభక్తులు పర మగునపుడును 'శమ్భు'శబ్దమునందు వలె రూపము లుండును.

హూహూః, హూహ్వౌ, హూహ్వః, హూహూన్ ఇత్యాది.

హూహూశబ్దము ఊకారాంతము. (ఒకగంధర్వునిపేరు). ఈ శబ్దమునకు అజాదివిభక్తులు పర మగునపుడు 'ఇకో యణచి'అను సూత్రముచే (15) యణా దేశము వచ్చును. 'అమ్''శస్'లు పర మగునపుడు మాత్రము 'అమి పూర్వః' అను సూత్రముచే (135) పూర్వరూపము చేయగా 'హూహూమ్'అను రూపము, 'ప్రథమయోః పూర్వసవర్ణః' (126) 'తస్మాచ్ఛసో నః పుంసి' (137) అను సూత్రములచే 'హూహూన్'అను రూపమును నిష్పన్న మగును.హలాదివిభక్తు లందు విశేషకార్య మేదియు లేదు. సకార మున్నచోట్ల రుత్వవిసర్గములు వచ్చును. సప్తమీబహువచనమున 'సు'కు 'ఆదేశప్రత్యయయోః'అను సూత్ర ముచే (150) మూర్ధన్యాదేశము వచ్చి 'హూహూషు' అను రూప మగును.

అతిచమూశబ్దే తు నదీకార్యం విశేషః. హే అతిచము, అతి చమ్వై. అతిచమ్వాః. అతిచమూనామ్. అతిచమ్వామ్. ఖలపూః.

'అతి'యను నవ్యయమునకు ఊకారాంతస్త్రీలింగశబ్ద మగు చమూశబ్ద ముతో 'అతిక్రాన్తః చమూమ్'అను నర్థమున సమాసము చేయ 'అతిచమూ' శబ్దము నిష్పన్న మైనది. ఇచట చమూశబ్దము స్త్రీలింగము కాకున్నను 'ప్రథమ లింగగ్రహణం చ'అను వార్తికమును (సూ.194) అనుసరించి నదీసంజ్ఞ లభించును. కావున సంబుద్ధియందు హ్రస్వము, 'ఙే','ఙసి','ఙస్'లకు ఆడాగ మము, ఆమ్‌కు నుడాగమము, ఙికి 'ఆమ్'ఆదేశము అను నాలు నదీసంజ్ఞా ప్రయుక్తకార్యములు వచ్చును. ఇతర విభక్తులందు 'హూహూ'శబ్దమునందువలె రూపము లుండును.

సంబోధనప్రథమైకవచనమున 'హే అతి చమూ+స్'అని యుండ 'అమ్బార్థనద్యోర్హ్రస్వః' (165) అను సూత్రముచే హ్రస్వము, 'ఏఙ్ హ్రస్వాత్ సమ్బుద్ధేః' అను సూత్రముచే (134) 'స' లోపము - 'హేఅతిచము',

చతుర్థ్యేకవచనమున 'అతిచమూ + ఙే' అని యుండగా 'ఆణ్నద్యాః' అను సూత్రముచే (196) ఆడాగమము. 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధియు, యణాదేశమును, వచ్చుటచే 'అతిచమ్వై' అను రూప మగును.

పంచమీషష్ఠ్యేకవచనములందు 'అతిచమూ + ఙసి' 'అతిచమూ + ఙస్' అని యుండ వెనుకటి వలెనే ఆడాగమవృద్ధి యణాదేశములును, సకారమునకు రుత్వ విసర్గములును వచ్చి 'అతిచమ్వాః' అను రూపము సిద్ధించినది.

షష్ఠీబహువచనమున 'అతిచమూ + ఆమ్' అని యుండ 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముచే (148) నుడాగమము-'అతిచమూనామ్'.

సప్తమ్యేకవచనమున 'అతిచమూ + ఙి' అని యుండగా 'ఙేరామ్నద్యామ్నీభ్యః' అను సూత్రముచే (198) 'ఙి'కి 'ఆమ్' వచ్చిన పిదప యణాదేశము చేయుటచే 'అతిచమ్వామ్' అను రూపము సిద్ధించును.

'ఖలం పునాతి ఇతి ఖలపూః'- కళ్లమును ఊడ్చువాడు. ప్రథమైకవచనమున సకారమునకు రుత్వవిసర్గలచే 'ఖలపూః' అని యగును.

ప్రథమాద్వివచనమున 'ఖలపూ + ఔ' అని యుండగా 'అచి శ్నుధాతు' ఇత్యాది సూత్రముచే (199) ఉవఙాదేశము రావలసి యుండ:-

### 210. ఓః సుపి 6.4.83

ధాత్వవయవసంయోగపూర్వో న భవతి య ఉవర్ణః, తదన్తో యో ధాతుః, తదన్తస్యానేకాచోఽఙ్గస్య యణ్ స్యాదచి సుపి. ఖలప్వౌ, ఖలప్వః, ఏవం 'సులూః' ఆదయః. స్వభూః, స్వభువౌ, స్వభువః, వర్షాభూః.

'ఓః' అను పదమునకు-'ఏరనేకాచోఽసంయోగపూర్వస్య' అను సూత్రము, 'అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ' 'ఇకో యణచి' నుండి 'అచి' 'యణ్' అనువర్తించును. 'అఙ్గస్య' అధికారము. ధాత్వవయవ మగు సంయోగము పూర్వమందుగలది కాని ఉవర్ణము అంతమున గల ధాతువు అంతమందు గలదియు, అనేకాచ్కమును నగు అంగమునకు అజాదిసుప్ పర మగునపుడు యణ్ వచ్చును.

'ఉవఙ్'ను బాధించి ఈ సూత్రముచే యణాదేశము వచ్చుటచే 'ఖలప్వౌ' అను రూప మేర్పడినది. అజాదివిభక్తులు పర మగునపు డీ సూత్రముచే యణా

దేశము వచ్చి ఖలప్వః, ఖలప్వం, ఖలప్వౌ, ఖలప్వః, ఖలప్వా, ఇత్యాది రూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు. 'సుష్ఠు లునాతీతి సులూః'ఇత్యాదిశబ్దములు గూడ ఇట్లే యుండును.

స్వభూశబ్దప్రథమైకవచనమున 'స్వభూ + స్'అని యుండ—సకారమునకు రుత్వవిసర్గములచే 'స్వభూః' అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వివచనమున 'స్వభూ + ఔ'అని యుండగా'ఇకో యణచి' (15) అను సూత్రముచే వచ్చు 'యణ్'ను బాధించి 'ప్రథమయోః పూర్వసవర్ణః" అను సూత్రముచే (126) రావలసియున్నపూర్వసవర్ణదీర్ఘమును 'దీర్ఘాజ్జసిచ' అను సూత్రము (162) నిషేధించును. ఇపుడు యణ్ రావలసి యుండగా 'అచి శ్ను'-అను (199) ఉవఙాదేశము దానిని బాధించును. ఉవఙాదేశమును గూడ బాధించి 'ఓః సుపి'అను సూత్రముచే (210) రావలసి యున్న యణా దేశము 'న భూసుధియోః'అను సూత్రముచే (202) బాధింపబడినది. కావున 'అచిశ్ను'-అను సూత్రముచే ఉవఙాదేశము వచ్చి 'స్వభువౌ' అను రూపము సిద్ధించును. ఇట్లు అజాదిప్రత్యయములు పర మగునపుడు ఉవఙాదేశము వచ్చుటచే 'స్వభువః, స్వభువం, స్వభువౌ, స్వభువః, స్వభువా' ఇత్యాదిరూపము లగును. హలాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు కాన 'స్వభూభ్యామ్, స్వభూభిః, స్వభూభ్యః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

'వర్షాభూ'శబ్దమునకు ప్రథమైకవచనమున వర్షాభూః అను రూప మగును. 'ఔ'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'ఓః సుపి'అను సూత్రము (210)చే రావలసి యున్న యణాదేశమును 'నభూసుధియోః'అను సూత్రము (202) నిషేధించుచున్నది గాన స్వభూశబ్దమునందు వలె ఉవఙాదేశము రావలసి యుండగా:-

### 211 వర్షాభ్వశ్చ 6.4.84

అస్య యణ్ స్యాదచి సుపి. వర్షాభ్వౌ ఇత్యాది.

'ఓః సుపి' అను సూత్రము,'అచి శ్ను'ఇత్యాది సూత్రము నుండి 'అచి,' 'ఇకో యణచి' నుండి 'యణ్' అనువర్తించును. 'వర్షాభూ'శబ్దమునందలి ఊకారమునకు అజాదిసుప్ప్రత్యయము పర మగునపుడు యణాదేశము వచ్చును.

ఈ సూత్రముచే యణాదేశము వచ్చి 'వర్షాభ్వౌ' ఇత్యాది రూపములు 'ఖలపూ' శబ్దమునందు వలె నగును.

దృన్భూ, కరభూ, పునర్భూశబ్దములందు అజాదివిభక్తులు పర మగునపుడు 'ఓః సుపి' అను సూత్రముచే (210) రావలసి యున్న యణాదేశము 'న భూసుధియోః' అను సూత్రముచే (202) నిషేధింపబడి యుండగా-

వా. దృన్, కర, పునఃపూర్వస్య భువో యణ్ వక్తవ్యః.

దృన్భ్వౌ. ఏవం కరభూః. ధాతా, హేధాతః. ధాతారౌ, ధాతారః.

దృన్, కర, పునఃశబ్దములు పూర్వమునందు గల భూశబ్దమునకు అజాది సుప్పులు పర మగునపుడు యణాదేశము వచ్చును.

ఈ వార్తికముచే యణాదేశము వచ్చుటచే ఈ మూడు శబ్దములందును వర్షాభూశబ్దమునందు వలె రూపము లుండును.

ధాధాతువునకు 'తృచ్' ప్రత్యయము చేర్చుటచే ధాతృశబ్దము నిష్పన్నమైనది. ప్రథమైకవచనమున 'ధాతృ + స్' అని యుండగా 'ఋదుశనస్'-ఇత్యాది సూత్రముచే (205) అనజాదేశము-'ధాతన్ + స్;' 'అప్తృన్' ఇత్యాది సూత్రముచే (206) ఉపధాదీర్ఘము-'ధాతాన్స్;' 'హల్ఙ్యాభ్భ్యః'-ఇత్యాది సూత్రముచే (179) సకారమునకును, 'నలోపః'-ఇత్యాది సూత్రముచే (180) నకారమునకును లోపము-'ధాతా' అను రూపము సిద్ధించును.

సంబోధనప్రథమైకవచనమున 'హేధాతృ + స్' అని యుండగా 'ఋతో ఙి'-ఇత్యాది సూత్రముచే (204) ఋకారమునకు గుణము ('అర్') వచ్చి 'హేధాతర్స్' అని యుండ 'హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్'-ఇత్యాది సూత్రముచే (179) సులోపము, రేఫకు విసర్గము-ఉ 'హే ధాతః' అను రూపము సిద్ధించును.

'ఔ', 'జస్' 'అమ్'లు పర మగునపుడు 'ఋతో ఙి'-ఇత్యాది సూత్రముచే (204) గుణము, 'అప్తృన్'-ఇత్యాది సూత్రముచే (206) ఉపధాదీర్ఘమును వచ్చి 'ధాతారౌ, ధాతారః, ధాతారం' అను రూపము లగును.

'శస్' పర మగునపుడు 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము, 'తస్మాచ్ఛసో నః పుంసి' అను సూత్రముచే (137) నకారము. వచ్చుటచే 'ధాతౄన్' అను రూపము నిష్పన్న మగును.

'టా', 'ఙే', ఙస్' ప్రత్యయములు పర మగునపుడు యణాదేశముచే ధాత్రా, ధాత్రే, ధాత్రోః, అను రూపము లగును. 'ఙసి', 'ఙస్', ప్రత్యయములు

పర మగునపుడు 'ఋత ఉత్' అను సూత్రముచే (208) ఋకారమునకు 'ఉర్' ఆదేశమును పిదప 'రాత్సస్య' అను సూత్రముచే (209) రేఫోత్తరవర్తి సకారము నకు లోపము, రేఫకు విసర్గము వచ్చి 'ధాతుః' అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'ధాతృ + ఆమ్' అని యుండగా 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముచే (148) నుడాగమము, 'నామి' అను సూత్రముచే (149) దీర్ఘమును వచ్చి 'ధాతౄనామ్' అని యుండ:-

వా. ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్.

ధాతౄణామ్. ఏవం నప్త్రాదయః.

ఋవర్ణముకంటె పర మగు నకారమునకు ణత్వము చెప్పదగినది. ఈ వార్తికముచే నకారమునకు ణత్వము వచ్చి 'ధాతౄణామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'ధాతృ + ఙి' అని యుండగా 'ఋతో ఙిసర్వ నామస్థానయోః' అను సూత్రముచే (204) గుణము వచ్చి 'ధాతరి' అను రూపము సిద్ధించును, బహువచనమున 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) సకారమునకు మూర్ధన్యాదేశము—'ధాతృషు' అను రూపము సిద్ధించును.

హలాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు గాన "ధాతృభ్యామ్, ధాతృభిః" ఇత్యాదిరూపములు సిద్ధించును.

నప్త్రాదిశబ్దములు గూడ ఇట్లే యుండును. అనగా 'అప్తృన్తృచ్' అను సూత్రమున (206) నిర్దిష్టము లగు నప్తృ, నేష్టృ, త్వష్టృ, క్షత్తృ, హోతృ, పోతృ, ప్రశాస్తృశబ్దములు గూడ ధాతృశబ్దమువలెనేయుండును.

అష్టాధ్యాయిలో "తృన్" "ణ్వుల్తృచౌ" అను సూత్రములచే కర్త్రర్థము నందు 'తృన్' 'తృచ్' ప్రత్యయములు విధింపబడినవి. ఉణాదులలో "తృన్తృచౌ శంసిక్షదాదిభ్యః సంజ్ఞాయాం చానిటౌ" 'బహులమన్యత్రాపి' అను సూత్రముచే 'తృన్' 'తృచ్' ప్రత్యయములను విధించి "నప్తృనేష్టృత్వష్టృహోతృపోతృ భ్రాతృజామాతృమాతృపితృదుహితృ" అను సూత్రముచే నప్త్రాదిశబ్దములు నిప తింపబడినవి. కావున సంజ్ఞాశబ్దము లన్నియు ఔణాదికతృన్తృజంతము లని తెలియుచున్నది. ఇపుడు "అప్తృన్తృచ్"-ఇత్యాదిసూత్రమునందు (206) 'తృన్తృచ్' గ్రహణముచేతనే 'నప్తృ' మొదలగునవి గ్రహింపబడుచుండ మరల వాటిని చెప్ప నేల? యను ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది:-

నప్త్రాదిగ్రహణం వ్యుత్పత్తిపక్షే నియమార్థమ్. తేనేహ న. పితా, పితరౌ, పితరః, పితరమ్. శేషం ధాతృవత్. ఏవం జామాత్రాదయః.

'ఉణాదయో వ్యుత్పన్నాని ప్రాతిపదికాని' అను చోట 'వ్యుత్పన్నాని,' అనియు 'అవ్యుత్పన్నాని' అనియు పదచ్ఛేదము చేయుటచే వ్యుత్పత్తిపక్షము, అవ్యుత్పత్తిపక్షము అను రెండు పక్షము లున్నవి. వివిధధాతువులకు ఉణాది వివిధప్రత్యయములను జేర్చుటచే రూపములు సిద్ధించును అనునది వ్యుత్పత్తి పక్షము. ఈ ధాతు ప్రత్యయవిభాగము కాల్పనికమే కాని వాస్తవమైనది కాదు. కావున ఉణాదిశబ్దములకు వ్యుత్పత్తి లేదు అను వాదము రెండవది. ఈ వాదము ననుసరించి 'నప్తృ' మొదలగు శబ్దములు తృన్తృజాద్యంతములు కాదు కావున వాటిని ప్రత్యేకముగ నిర్దేశించుట ఆవశ్యకమే. కావున పై ప్రశ్న వ్యుత్పత్తి పక్షమునందే ఉదయించును. దీనికి సమాధాన మేమనగా—ఈ సూత్రమునందలి 'తృన్', 'తృచ్' పదములచే ఉణాదితృన్నంతతృజంతము లన్నియు గ్రహింప బడవు——ఈ నప్తృ, నేష్టృ, త్వష్టృ, క్షత్తృ, హోతృ, పోతృ, ప్రశాస్తృ అను ఏడు తృన్నంతతృజంతశబ్దములు మాత్రమే గ్రహింపబడును—అను నియమమునకై యీ పదములు నిర్దిష్టము లైనవి. ఈ నియమ ముండుటచే తృన్నంతతృజం తము లైనను (ఔణాదికము లగు) పితృ, భ్రాతృ, జామాతృ మొదలగు శబ్దములకు ఉపధాదీర్ఘము రాదు.

పితృశబ్దము ఋకారాంత మగుటచే అనజాదులు వచ్చినను పైన జూపిన నియమముచే సర్వనామస్థానములు పర మైనను ఉపధాదీర్ఘము రాదు గాన 'పితా, పితరౌ, పితరః, హే పితః, పితరమ్' ఇత్యాదిరూపము లగును. ద్వితీయాబహు వచనమునుండి ధాతృశబ్దమునకు వలె రూపము లుండును. 'జామాతృ' మొద లగు ఔణాదికశబ్దములు ఇట్లే యుండును.

'నృ' శబ్దము పితృశబ్దమువలె నుండును. కాని షష్ఠీబహువచనమున 'నృ + ఆమ్' అని యుండ నుడాగమము-'నృ + నామ్'-ఇచట 'నామి' అను సూత్రముచే (149) ఋకారమునకు దీర్ఘము నిత్యముగ రావలసి యుండ:-

212. నృ చ. 6.4.6

అస్య నామి వా దీర్ఘః. నౄణామ్, నృణామ్.

'ఛన్దస్యుభయథా' 'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి 'ఉభయథా' 'దీర్ఘః'అను పదములును. 'నామి'అను సూత్రమును అనువర్తించును. నృశబ్దమునకు'నామ్'పర మగునపుడు దీర్ఘము వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే దీర్ఘము వికల్పముగ వచ్చును. 'ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్'అను వార్తికముచే ణత్వము చేయగా-'నౄణామ్,నృణామ్'అను రెండు రూపము లుండును.

ఓకారాంత మగు గోశబ్దమునకు ప్రథమైకవచనమున 'గో+స్'అని యుండగా-

## 213. గోతో ణిత్. 7.1.90

ఓకారాద్విహితం సర్వనామస్థానం ణిద్వత్.గౌః, గావౌ, గావః.

'ఇతోఽత్సర్వనామస్థానే' నుండి 'సర్వనామస్థానే' అనువర్తించును. ఓకారాంతశబ్దముకంటె విహిత మగు సర్వనామస్థానము'ణిత్'వంటిది యగును.

ఇచట 'గోతః'అని యుండుటచే 'గోశబ్దముకంటె పర మగు'అను నర్థము చెప్పవలెను. కాని 'ఓతో ణిదితి వాచ్యమ్','విహితవిశేషణఞ్చ'అను వార్తికము ననుసరించి 'సుద్యో'శబ్దాదులందు గూడ ఈ కార్యము ప్రవర్తించుటకై వృత్తికారుడు'ఓకారాద్విహితమ్'అని వ్యాఖ్యానించెను.

ఈ సూత్రము ననుసరించి ఓకారాంత మగు గోశబ్దముకంటె పరముగ విహిత మగు 'సు'ప్రత్యయమునకు ణిద్వద్భావము వచ్చుటచే 'అచో ఞ్ణితి' అను సూత్రముచే (182) గోశబ్దమునందలి ఓకారమునకు వృద్ధి'గా+స్'అని యుండగా-సకారమునకురుత్వవిసర్గములువచ్చి,'గౌః'అను రూపము సిద్ధించును.

'ఔ''జస్'లు పర మగునపుడు ణిద్వద్భావముచే వృద్ధియు,అవాదేశాదులును వచ్చుటచే'గావౌ' 'గావః'అను రూపము లగును.

ద్వితీయైకవచనబహువచనములందు 'గో+అమ్''గో+(శ)అస్'అని యుండగా:-

## 214. ఔతోఽమ్శసోః 6.1.93

ఓతోఽమ్శసోరచి పరే ఆకార ఏకాదేశః.గామ్,గావౌ,గాః,గవా, గవే.గోః-2ఇత్యాది.

ఆ, ఓతః, అమ్శసోః. 'ఇకో యణచి'నుండి'అచి', ఏకః పూర్వప

అను అధికారసూత్రమును అనువర్తించును. ఓకారమునకు 'అమ్''శస్'ల అచ్ పర మగునపుడు 'ఆ'కార మేకాదేశ మగును.

ఈ సూత్రముచే పై లక్ష్యములందలి ఓకారఅకారములకు ఆకార మేకాదేశ మగుటచే 'గామ్''గాః'అను రూపములు సిద్ధించినవి.

అజాదు లగు టా,ఙే,ఓస్,ఙి,ప్రత్యయములు పర మగునపుడు అవాదేశముచే గవా,గవే గవోః గవి,అను రూపము లగును. 'ఙసి','ఙస్'లు పర మగునపుడు 'ఙసిఙసోశ్చ'అను సూత్రముచే (173) పూర్వరూపము వచ్చి 'గోః'అను రూపము సిద్ధించును. హలాదివిభక్తులు పర మగు నపుడు విశేషకార్యము లేవియును లేకపోవుటచే 'గోభ్యామ్','గోభిః' ఇత్యాదిరూపము లగును.

## 215. రాయో హలి 7.2.85

అస్యాకారాదేశో హలి విభక్తౌ. రాః, రాయౌ, రాయః, రాభ్యామ్. గ్లౌః, గ్లావౌ, గ్లావః, గ్లౌభ్యామ్ ఇత్యాది.

ఇతి అజన్తపుంల్లిఙ్గప్రకరణం సమాప్తమ్.

'అష్టన' 'ఆ విభక్తౌ' నుండి 'ఆవిభక్తౌ' అనువర్తించును. రై శబ్దమునకు హలాదివిభక్తిప్రత్యయము పర మగునపుడు ఆకార మాదేశ మగును.

ప్రథమైకవచనమున 'రై + సు'అని యుండ ఈ సూత్రముచే ఆకార మాదేశ మగును. 'రా + స్' అని యుండ సకారమునకు రుత్వవిసర్గములచే 'రాః'అనురూప మగును.

ద్వివచనమున 'రై + ఔ'అని యుండగా 'ఆయ్'ఆదేశము వచ్చుటచే 'రాయౌ'అను రూపము సిద్ధించును. ఇట్లే అజాదివిభక్తులు పర మగునపుడు ఆయాదేశము వచ్చి రాయః,రాయా,రాయే, మొదలగు రూపము లగును. హలాదివిభక్తులు పర మగునపుడు 'రాయో హలి'అను సూత్రముచే (215) ఆకారము వచ్చుటచే 'రాభ్యామ్' 'రాభిః'ఇత్యాదిరూపములు సిద్ధించును.

గ్లౌశబ్దము ఔకారాంతము. ఈ శబ్దమున విశేషకార్యము లేవియు లేవు. ప్రథమైకవచనమున సకారమునకు రుత్వవిసర్గములు వచ్చుటచే 'గ్లౌః' అను రూపము సిద్ధించును. ఇట్లే హలాదివిభక్తిప్రత్యయములు పర మగునపుడు ప్రాతిపదికరూపమున నెట్టి మార్పును ఉండదు గాన గ్లౌభ్యామ్,గ్లౌభిః, ఇత్యాది

రూపము లగును. అజాదిప్రత్యయములు పర మగు నపుడు మాత్రము 'ఏచోఽయవాయావః' అను సూత్రముచే(22) 'ఆవా' దేశమువచ్చి 'గ్లావౌ' 'గ్లావః' 'గ్లావా' ఇత్యాదిరూపములు సిద్ధించును.

అజంతపుంలింగప్రకరణము సమాప్తము.



# అథ అజన్తస్త్రీలిఙ్గ ప్రకరణమ్

రమా.

'రమ్' ధాతువునకు 'రమతే' అను నర్థమున 'అచ్' ప్రత్యయము చేర్చుటచే నిష్పన్న మగు 'రమ' శబ్దమునకు స్త్రీత్వవివక్షయందు 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) టాప్ ప్రత్యయము చేయగా 'రమా' అని యగును. ఇపుడిది ఆబంతము గాన 'ఙ్యాప్ప్రాతిపదికాత్' అను సూత్రముచే(119) స్వాదిప్రత్యయములు వచ్చును. ప్రథమైకవచనమున 'రమా + స్' అని యుండ 'హల్ఙ్యాబ్భ్యో' అను సూత్రముచే (179) ఆబన్తముకంటె పర మగు 'స్' లోపింప 'రమా' అను రూపము సిద్ధించును.

ద్వివచనమునందు 'రమా + ఔ' అని యుండగా:-

216. ఔఙ ఆపః 7.1.18

ఆబన్తాదఙ్గాత్పరస్యౌఙః శీ స్యాత్. 'ఔఙ' ఇతి ఔకారవిభక్తేః సంజ్ఞా. రమే, రమాః.

'అఙ్గస్య' అధికారము. 'జసః శీ' నుండి 'శీ' అనువర్తించును. ఆబన్త మగు అంగముకంటె పర మగు 'ఔఙ్' కు 'శీ' ఆదేశ మగును.

'ఔఙ్' అనునది ఔ కారవిభక్తికి-అనగా 'ఔ' 'ఔట్' లకు సంజ్ఞ.

ఈ సూత్రముచే 'ఔ' కు 'శీ' ఆదేశ మగును. 'శీ' లోని శకారము 'లశక్వతద్ధితే' అను సూత్రముచే (136) ఇత్సంజ్ఞకము, 'రమా + ఈ' అని యుండ గుణ మేకాదేశ మగుటచే 'రమే' అను రూపము సిద్ధించును.

బహువచనమున 'రమా + అస్'అని యుండ 'అకస్సవర్ణే దీర్ఘః'అను సూత్రముచే (42) సవర్ణదీర్ఘము, సకారమునకు రుత్వవిసర్గములును వచ్చుటచే 'రమాః'అను రూపము నిష్పన్న మగును.

సంబోధనప్రథమైకవచనమున 'హే రమా + సు'అని యుండగా:-

217. సమ్బుద్ధౌ చ 7.3.106

ఆప ఏకారః స్యాత్ సమ్బుద్ధౌ. 'ఏఙ్ హ్రస్వాత్'ఇతి సమ్బుద్ధి లోపః, హేరమే, హేరమే, హేరమాః, రమామ్, రమే, రమాః.

'ఆఙి చాపః' 'బహువచనే ఝల్యేత్'అను సూత్రములనుండి 'ఆపః' 'ఏత్'అను పదములు అనువర్తించును. 'ఆప్'కు సంబుద్ధి పర మగునపుడు ఏకార మాదేశ మగును.

ఈ సూత్రముచే ఆకారమునకు ఏకార మాదేశ మగుటచే 'హేరమే + స్' అని యుండగా'ఏఙ్ హ్రస్వాత్సమ్బుద్ధేః'అనుసూత్రముచే(134)సంబుద్ధిలోపము- 'హేరమే'అను రూపము సిద్ధించును. దాని ద్వివచనబహువచనములు ప్రథమ యందు వలె నుండును. ద్వితీయైకవచనమున 'రమా + అమ్'అని యుండ 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము చేయగా 'రమామ్' అను రూపము సిద్ధించును. ద్వివచనబహువచనరూపములు ప్రథమయందు వలె నుండును. ఇది స్త్రీలింగశబ్దమగుటచే 'శస్'ప్రత్యయసకారమునకు 'తస్మాచ్ఛసో నః పుంసి'అను సూత్రముచే (137) నకారము రాదు.

తృతీయైకవచనమున 'రమా + టా'అని యుండగా:-

218. ఆఙి చాపః 7.3.105

ఆఙి ఓసి చాపః ఏకారః, రమయా, రమాభ్యామ్, రమాభిః.

'అఙ్గస్య'అధికారము. 'ఓసి చ'నుండి'ఓసి', 'బహువచనే ఝల్యేత్'నుండి 'ఏత్'అనువర్తించును. 'ఆప్'కు (ఆబంతాంగమునకు) 'ఆఙ్'(టా) లేక 'ఓస్' పర మగునపుడు ఏకారము వచ్చును

ఈ సూత్రముచే 'రమా'యందలి ఆకారమునకు ఏకారము-'రమె + ఆ'- అయాదేశముచే 'రమయా'అను రూపము సిద్ధించును.

'భ్యామ్' 'భిస్' 'భ్యస్'లు పర మగునపుడు విశేషకార్యము లేవియులేవు. రమాభ్యామ్' 'రమాభిః' 'రమాభ్యః' అను రూపము లగును.

చతుర్థ్యేకవచనమున 'రమా + ఙే' అని యుండగా:-

219. యాడాపః 7.3.113

ఆపో ఙితో యాట్. వృద్ధిః-రమాయై, రమాభ్యామ్, రమాభ్యః, రమాయాః-2, రమయోః-2, రమాణామ్, రమాయామ్. రమాసు. ఏవం దుర్గామ్బికాదయః.

'ఘేర్ఙితి' నుండి 'ఙితి' అనువర్తించును, 'అఙ్గస్య' అధికారము. ఆబన్తాంగమునకు పరమగు ఙిత్ అగు సుప్ప్రత్యయమునకు 'యాట్' అను నాగమము వచ్చును.

'యాట్' టిత్ అగుటచే ఆద్యవయవముగ వచ్చి 'రమా + యా + ఏ' అని యుండ ఆకారఏకారములకు వృద్ధిచే ఐకారము వచ్చి 'రమాయై' అను రూపము సిద్ధించును.

పంచమీషష్ఠ్యేకవచనములందు కూడ 'రమా + ఙసి' 'రమా + ఙస్' అని యుండగా యాడాగమసవర్ణదీర్ఘములచే 'రమాయాస్' అని యై సకారమునకు రుత్వవిసర్గములచే 'రమాయాః' అను రూపము సిద్ధించును.

షష్ఠీసప్తమీ ద్వివచనములందు 'రమా + ఓస్' అని యుండగా 'ఆఙి చాపః' అను సూత్రముచే (218) ఆకారమునకు ఏకారము వచ్చి 'రమే + ఓస్'; అయాదేశముచే 'రమయోః' అను రూపము సిద్ధించును.

షష్ఠీ బహువచనమున 'రమా + ఆమ్' అని యుండ 'రమా' అనునది ఆబంతము గాన 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముచే (148) నుడాగమము 'రమానామ్', 'అట్కుప్వాఙ్-' అను సూత్రముచే (138) నకారమునకు ణకారము 'రమాణామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'రమా + ఙి అని యుండ 'ఙేరామ్నద్యామ్నీభ్యః' అను సూత్రముచే (198) 'ఙి'కి ఆమ్, 'రమా + ఆమ్'; 'యాడాపః' అను సూత్రముచే (219) యాడాగమము-'రమాయామ్' అను రూపము సిద్ధించును. బహువచనమున 'రమాసు' అను రూపము. 'దుర్గా' 'అమ్బికా' మొదలగు శబ్దములు గూడ ఇటులనే యుండును.

సర్వనామస్త్రీలింగశబ్దమగు సర్వాశబ్దము చాలవఱకు రమాశబ్దము వలెనుండును. కాని ఙే, ఙసి, ఙస్, ఆమ్, ఙి. ప్రత్యయములు పరమగునపుడు విశేషకార్యము లగును.

220. సర్వనామ్నః స్యాడ్ఢ్రస్వశ్చ 7.3.114

ఆబన్తాత్సర్వనామ్నో ఙితః స్యాట్ స్యాత్, ఆపశ్చ హ్రస్వః, సర్వస్యై, సర్వస్యాః, సర్వాసామ్, సర్వస్యామ్. శేషం రమావత్. ఏవం విశ్వాదయ ఆబన్తాః.

'యాడాపః' 'ఘేర్ఙితి'నుండి 'ఆపః' 'ఙితి'అనువర్తించును. ఆబంతమగు సర్వనామశబ్దముకంటె పరములగు ఙిత్ ప్రత్యయములకు 'స్యాట్'అను నాగమము వచ్చును. 'ఆప్'కు హ్రస్వము వచ్చును.

'స్యాట్' టిత్ అగుటచే ఆద్యవయవ మగును. చతుర్థ్యేకవచనమున 'సర్వా + ఙే'అని యుండ ఈ సూత్రముచే 'ఙే'కు స్యాడాగమమును 'ఆప్'కు హ్రస్వమును వచ్చుటచే 'సర్వ + స్యా + ఏ'అని యుండ ఆకారఏకారములకు 'వృద్ధిరేచి' అను సూత్రముచే (33) 'ఐ'ఏకాదేశమై 'సర్వస్యై'అను రూపము సిద్ధించును.

పంచమీషష్ఠ్యేకవచనములందు 'సర్వా + ఙస్'అని యుండ స్యాడాగమ హ్రస్వ సవర్ణదీర్ఘములచే 'సర్వస్యాః'అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'సర్వా + ఆమ్'అని యుండగా 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే (155) సుడాగమము చేయగా 'సర్వాసామ్' అను రూపము సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'సర్వా + ఙి'అని యుండ 'ఙేరామ్నద్యామ్నీభ్యః' అను సూత్రముచే (180) 'ఙి'కి 'ఆమ్'- 'సర్వా + ఆమ్', స్యాడాగమహ్రస్వముల 'సర్వస్యామ్'అను రూపము సిద్ధించును. విశ్వా మొదలగు ఆబన్త సర్వనామశబ్దము లన్నియు ఇటులనే యుండును.

221. విభాషా దిక్సమాసే బహువ్రీహౌ 1.1.28

సర్వనామతా వా. ఉత్తరపూర్వస్యై, ఉత్తరపూర్వాయై.

'సర్వాదీని సర్వనామాని'నుండి 'సర్వనామాని'అనువర్తించును. బహువ్రీహి యందలి దిక్సమాసమునందు సర్వనామ సంజ్ఞ వికల్పముగ నుండును.

'ఉత్తరస్యాః పూర్వస్యాశ్చదిశోర్యదన్తరాలం ఉత్తరపూర్వా'అను నర్థమున 'దిఙ్నామాన్యన్తరాలే'అను సూత్రముచే 'ఉత్తరపూర్వా'అను సమాసమేర్పడినది. ఇట్టి పదములకు సర్వనామత్వము వైకల్పికము. కావున ఙే, ఙసి,

జస్, ఆమ్, ఙీ విభక్తులు పర మగునపుడు సర్వనామసంజ్ఞా ప్రయుక్తము లగు కార్యములు వికల్పముగ వచ్చుటచే 'ఉత్తరపూర్వస్యై' మొదలగు రూపము లును, సర్వనామసంజ్ఞ లేని పక్షమున 'ఉత్తరపూర్వాయై' ఇత్యాదిరూపములును సిద్ధించును ఇతరవిభక్తులందు రమాశబ్దమునందు వలె రూపము లుండును.

తీయస్యేతి వా సర్వనామసంజ్ఞా-ద్వితీయస్యై. ద్వితీయాయై. ఏవం తృతీయా.

'తీయ'ప్రత్యయాంత మగు ద్వితీయాశబ్దమునకు 'ఙిత్' లగు విభక్తులు పర మగునపుడు 'తీయస్య ఙిత్సు వా'అను వార్తికముచే సర్వనామసంజ్ఞ వైకల్పికము గాన చతుర్థీ,పంచమీ, షష్ఠీసప్తమ్యేకవచనములందు సర్వనామకార్యము లగు స్యాడాగమాదులు వచ్చినచో ద్వితీయస్యై, ద్వితీయస్యాః-2, ద్వితీయస్యామ్ అను రూపములు సిద్ధించును. సర్వనామసంజ్ఞ లేని పక్షమునను, ఇతర విభక్తులందును 'రమా'శబ్దమునందువలె రూపము లుండును. వైకల్పికసర్వనామసంజ్ఞ ఙిద్విభక్తులు పర మగునపుడే గాని 'ఆమ్' పర మగునపుడు లేదు గాన 'ద్వితీయస్యామ్'అను రూపముండదు. తృతీయాదిశబ్దములు గూడ నిట్లే.

'అమ్బార్థ-'ఇతి హ్రస్వః-హే అమ్బ, హే అక్క, హే అల్ల.

తల్లి యను నర్థము గల అమ్బా, అక్కా, అల్లా. అను శబ్దములు రమాశబ్దము వలె నుండును. కాని సంబోధనైకవచనమున 'అమ్బార్థనద్యోర్హ్రస్వః'అను సూత్రముచే(195)హ్రస్వము వచ్చి,'ఏఙ్హ్రస్వాత్'-అనుసూత్రముచే (134) సులోపము వచ్చుటచే'హే అమ్బ' 'హే అక్క' 'హే అల్ల' అను రూపము లగును.

జరా, జరసౌ ఇత్యాది. పక్షే హలాదౌ చ రమావత్. గోపా విశ్వపావత్. మతిః. మత్యా.

జరాశబ్దమునకు అజాదిప్రత్యయములు పర మగునపుడు 'జరాయా జరసన్యతరస్యామ్'అను సూత్రముచే (161) వికల్పముగ 'జరస్'అను నాదేశము వచ్చుటచే జరసౌ, జరసః, జరసా, జరసే. జరసః. జరసామ్. జరసి, అను రూపములును, జరసాదేశము లేని పక్షమునను, హలాది విభక్తులు పర మగునపుడును రమాశబ్దము వలెను రూప ములగును.

'గాం పాతి'అను నర్థమున పాధాతువునకు 'విచ్'ప్రత్యయము చేర్చుటచే 'గోపా'శబ్దము నిష్పన్నమైనది. స్త్రీలింగ మగు నీ శబ్దము విశ్వపాశబ్దము వలె నుండును. కాని 'గోపస్య స్త్రీ'అను నర్థమున గోపశబ్దమునకు 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే(1248)టాప్ప్రత్యయము చేయుటచే నిష్పన్న మగు 'గోపా' శబ్దము రూపములు 'రమా'శబ్దరూపముల వలె నుండును.

మతిశబ్దరూపములు చాలవరకు హరిశబ్దమునందు వలె నుండును. 'శస్' మొదలగు విభక్తులు పర మగునపుడు కొన్ని విశేషము లుండును.

'మతి + (శ)అస్'అని యుండగా పూర్వసవర్ణదీర్ఘముచే 'మతీస్'అని యుండ సకారమునకు రుత్వవిసర్గములచే 'మతీః'అను రూపము సిద్ధించును. ఇది స్త్రీలింగశబ్ద మగుటచే 'తస్మాచ్ఛసో నః పుంసి'అను సూత్రముచే (137) నత్వము రాదు.

తృతీయయైకవచనమున 'మతి + (టా)ఆ'అని యుండగా 'అస్త్రియామ్' అను నిషేధ ముండుటచే 'ఆఙో నాఽస్త్రియామ్'అను సూత్రముచే (171) 'నా' ఆదేశము రాదు. యణాదేశముచే 'మత్యా'అను రూపము సిద్ధించును.

చతుర్థ్యేకవచనమున 'మతి + ఙే'అని యుండ:-

## 222. ఙితి హ్రస్వశ్చ 1.4.6

ఇయఙువఙ్స్థానౌ స్త్రీశబ్దభిన్నౌ నిత్యస్త్రీలిఙ్గౌ యీదూతౌ, హ్రస్వౌ చ ఇవర్ణోవర్ణౌ స్త్రియాం వా నదీసంజ్ఞౌ స్తో ఙితి. మత్యై, మతయే, మత్యాః-2. మతేః-2.

'యూ స్త్ర్యాఖ్యౌ నదీ' 'నేయఙువఙ్స్థానావస్త్రీ' 'వాఽమి'అను సూత్రముల నుండి 'నదీ' 'ఇయఙువఙ్స్థానౌ' 'వా'అనువర్తించును. 'ఇయఙ్''ఉవఙ్' ఆదేశములు వచ్చుటకు యోగ్యములును, స్త్రీశబ్దభిన్నములును, నిత్యస్త్రీలింగ ములును నగు ఈకారఊకారములును (ఈకారాన్తఊకారాంతములును) హ్రస్వము లగు ఇవర్ణోవర్ణములును (ఇకారాంతఉకారాంతములును) స్త్రీలింగ మున 'ఙిత్'అగు విభక్తి ప్రత్యయములు పర మగునపుడు వికల్పముగ నదీసంజ్ఞకము లగును.

ఇచట మతిశబ్దము ఇకారాంతస్త్రీలింగశబ్దమగుటచే 'ఙిత్'లగు విభక్తులు పర మగునపుడు ఈ సూత్రముచే నదీసంజ్ఞ వికల్పముగ లభించును. నదీసంజ్ఞ

యున్న పక్షమున 'అణ్నద్యాః' అను సూత్రముచే (196) అడాగమము, 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధియు వచ్చుటచే 'మతి + ఐ' అని యుండ, యణా దేశముచే 'మత్యై' అను రూపము సిద్ధించును.

జసి, జస్, ఙ పర మగునపుడు ఆడాగమ, వృద్ధి, యణాదేశ, రుత్వ, విసర్గ ములు వచ్చి 'మత్యాః' అను రూపము సిద్ధించును. నదీసంజ్ఞ లేని పక్షమున 'మతయే' 'మతేః' అను రూపములు హరిశబ్దమునందు వలె నుండును.

సప్తమ్యేకవచనమున మతి + ఙి అని యుండగా:-

223. ఇదుద్భ్యామ్ 7.3.117

ఇదుద్భ్యాం, నదీసంజ్ఞకాభ్యాం పరస్య ఙేరామ్. మత్యామ్, మతౌ. శేషం హరివత్. ఏవం బుద్ధ్యాదయః.

'ఙేరామ్నద్యామ్నీభ్యః' నుండి 'ఙేః' 'ఆమ్' అనుపదములును, 'నదీ' అను సమాసైకదేశమును అనువర్తించును. నదీసంజ్ఞకము లగు 'ఇత్' 'ఉత్' లకంటె పర మగు 'ఙి' ప్రత్యయమునకు 'ఆమ్' అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఙి' కి 'ఆమ్' వచ్చును. 'మతి + ఆమ్' - 'ఇకోయణచి' (15) 'మత్యామ్' అను రూపము సిద్ధించును. నదీసంజ్ఞాభావపక్షమున 'హరౌ' వలె 'మతౌ' అను రూప ముండును. 'బుద్ధి' శబ్దము మొదలగువాటి రూపములు గూడ ఇటులనే యుండును.

224. త్రిచతురోః స్త్రియాం తిసృచతసృ 7.2.99

స్త్రీలిఙ్గయోరేతయోరేతౌ స్తః విభక్తౌ.

'అష్టన ఆ విభక్తౌ' నుండి 'విభక్తౌ' అనువర్తించును. స్త్రీలింగము లగు 'త్రి' శబ్ద 'చతుర్' శబ్దములకు విభక్తి పర మగునపుడు 'తిసృ' 'చతసృ' అను నాదేశము లగును.

త్రిశబ్దము నిత్యబహువచనము. దాని ప్రథమాద్వితీయాబహువచనము లందు 'త్రి + అస్' అని యుండ ఈ సూత్రముచే 'తిసృ' ఆదేశము. 'తిసృ + అస్' అని యుండ:-

225. అచి ర ఋతః 7.2.100

'తిసృ' 'చతసృ' ఏతయోః ఋకారస్య రేఫాదేశః స్యాదచి. గుణ దీర్ఘోత్వానామపవాదః. తిస్రః, తిస్రః, తిసృభిః, తిసృభ్యః, తిసృభ్యః. ఆమి నుట్ :—

పై సూత్రమునుండి 'తిసృచతసృ' అను వర్తించును. 'తిసృ' 'చతసృ'ల ఋకారమునకు అచ్ పర మగునపుడు రేఫాదేశము వచ్చును. ఈ రేఫాదేశము 'జస్' పర మగునపుడు రావలసి యున్న 'ఋతో ఙి సర్వనామస్థానయోః' అను (204) గుణమును, 'శస్' పర మగునపుడు 'ప్రథమయోః పూర్వసవర్ణః' అను సూత్రముచే (128) రావలసి యున్న పూర్వసవర్ణదీర్ఘమును, 'ఙసి' 'ఙస్' లకు 'ఋత ఉత్' అను సూత్రముచే (208) రావలసి యున్న ఉత్వమును బాధించును.

ఈ సూత్రముచే 'తిసృ'నందలి ఋకారమునకు రేఫ అదేశ మగుటచే 'తిస్ర్ + అస్;' సకారమునకు రుత్వవిసర్గములు-'తిస్రః' అను రూపము సిద్ధించును.

హలాదివిభక్తు లగు 'భిస్' 'భ్యస్' లు పర మగునపుడు 'తిసృ' ఆదేశము వచ్చిన పిమ్మట 'తిసృభిః' 'తిసృభ్యః' అను రూపము లగును.

షష్ఠీబహువచనమున త్రిశబ్దమునకు తిస్రాదేశము చేసిన పిమ్మట 'తిసృ + ఆమ్' అని యుండగా 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముచే (148) నుడాగమమును బాధించి పర మగుటచే 'అచి ర ఋతః' అను సూత్రముచే రాదేశము రావలసి యున్నది. కాని 'నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వ విప్రతిషేధేన' అను వార్తికముచే ప్రబలము గాన నుడాగమమే వచ్చును. 'తిసృ + నామ్' అని యుండగా 'నామి' అను సూత్రముచే (149) దీర్ఘము రావలసి యుండగా:-

### 226. న తిసృ చతసృ 6.4.4

ఏతయోర్నామి దీర్ఘో న. తిసృణామ్. తిసృషు.

"ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః" నుండి 'దీర్ఘః' అను పదము, 'నామి' అను సూత్రమును అనువర్తించును. 'తిసృ' 'చతసృ' శబ్దములకు నామ్ పర మగునపుడు దీర్ఘము రాదు. ఈ సూత్రముచే దీర్ఘము నిషేధింపబడినది గాన 'తిసృనామ్' అని యుండగా 'ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్' అను వార్తికముచే (సూ. 211) ణత్వము-'తిసృణామ్' అను రూపము సిద్ధించును.

సప్తమీబహువచనమున 'ఆదేశప్రత్యయోః' అను సూత్రముచే (150) షత్వము వచ్చి 'తిసృషు' అను రూపము సిద్ధించును.

ద్వౌ, ద్వౌ, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వయోః, ద్వయోః.

నిత్యద్వివచనాంత మగు ద్విశబ్దమునకు విభక్తి ప్రత్యయములు పర మగు నపుడు 'త్యదాదీనామః' అను సూత్రముచే (193) అకార మాదేశమై 'ద్వ'అని యుండ స్త్రీత్వవివక్షయందు 'అజాద్యతష్టాప్'అను సూత్రముచే (1247) 'టాప్' (అ)ప్రత్యయమును చేర్చి సవర్ణదీర్ఘ సంధి చేయుటచే 'ద్వా'అని యుండును. పిమ్మట 'ఔ'మొదలగు ప్రత్యయములు పర మగునప్పుడు 'శీ'మొదలగు కార్య ములు వచ్చుటచే రమాశబ్దమునందు వలె రూపము లగును.

గౌరీ, గౌర్యౌ, గౌర్యః, హేగౌరి, గౌర్యై, ఇత్యాది. ఏవం నద్యాదయః.

గౌరశబ్దమునకు స్త్రీత్వవివక్షయందు 'షిద్గౌరాదిభ్యశ్చ'అను సూత్రముచే (1251) 'ఙీష్'ప్రత్యయము చేయగా గౌరీశబ్దము నిష్పన్న మైనది. ప్రథమైక వచనమున 'గౌరీ + స్'అని యుండగా, 'గౌరీ'అనునది ఙ్యంతము గాన 'హల్ఙ్యాద'సూత్రముచే (179) సకారమునకు లోపము-'గౌరీ' అను రూపము సిద్ధించును.

ద్వివచనబహువచనములందు 'గౌరీ + ఔ' 'గౌరీ + అస్'అని యుండగా 'ప్రథమయోః-'అను సూత్రముచే (128) ప్రాప్తించుచున్న పూర్వసవర్ణదీర్ఘము 'దీర్ఘాజ్జసి చ'అను సూత్రముచే (162) నిషేధింపబడినది గాన యణాదేశముచే 'గౌర్యౌ' 'గౌర్యః'అను రూపములు సిద్ధించును.

సంబుద్ధియందు 'అమ్బార్థనద్యోర్హ్రస్వః'అను సూత్రముచే (195) హ్రస్వము, 'ఏఙ్ హ్రస్వాత్సమ్బుద్ధేః'అను సూత్రముచే (134) సమ్బుద్ధి సకా రమునకు లోపము-'హేగౌరి'అను రూపము సిద్ధించును.

ద్వితీయైకవచనమున 'గౌరీ + అమ్'అని యుండ 'అమి పూర్వః'అను సూత్రముచే (135)పూర్వ రూపము'గౌరీమ్.'బహువచనమున'గౌరీ + అస్'అని యుండ 'ప్రథమయోః-'అను సూత్రముచే (128)పూర్వసవర్ణదీర్ఘము-'గౌరీః'. తృతీయైకవచనమున యణాదేశముచే 'గౌరీ + ఆ'='గౌర్యా'అను రూపము.

చతుర్థ్యేకవచనమున 'గౌరీ + ఙే'అని యుండ 'అణ్నద్యాః'అను సూత్ర ముచే (196) ఆడాగమము, 'ఆటశ్చ'అను సూత్రముచే (197) వృద్ధి, యణా దేశము వచ్చుటచే 'గౌర్యై'అను రూపము సిద్ధించును

ఇట్లే 'ఙసి''ఙస్'లు పర మగునపుడు ఆడాగమ, వృద్ధి యణాదేశములచే 'గౌర్యాః'అను రూపము సిద్ధించును.

'ఆమ్'పర మగునపుడు నద్యంతమునకు౦ పై పరముగ నుండుటచే నుడాగ మాదేశము-'గౌరీణామ్'.

సప్తమ్యేకవచనమున 'ఙేరామ్నద్యామ్నీభ్యః'అను సూత్రముచే (198) 'ఙే'కి ఆమ్-'గౌరీ + ఆమ్', యణాదేశము-'గౌర్యామ్'అను రూపము సిద్ధించును.

'నదీ'మొదలగు ఈకారాంతశబ్దము లన్నియు నిట్లే యుండును.

లక్ష్మీః. శేషం గౌరీవత్, ఏవం తరీతన్త్ర్యాదయః, స్త్రీ, హే స్త్రి.

లక్ష్మీశబ్దము ఈకారాంతస్త్రీలింగశబ్ద మైనను 'ఙీ'ప్రత్యయాంతము కాదు కావున ప్రథమైకవచనమున 'హల్ఙ్యాబ్భ్యోదీర్ఘాత్'-అను సూత్రముచే (179) సకారలోపము రాదు. సకారమునకు రుత్వవిసర్గములచే 'లక్ష్మీః' అను రూపము సిద్ధించును. ఇతరరూపము లన్నియు గౌరీశబ్దమునందు వలె నుండును. తరీ, తన్త్రీ, మొదలగు (ఙీబంతములు కాని) శబ్దములకు గూడ సులోపము రాదని ఈ క్రింది కారిక చెప్పుచున్నది.

"అవీతన్త్రీతరీలక్ష్మీధీహ్రీశ్రీణా ముణాదిషు
సప్తస్త్రీలింగశబ్దానాం న సులోపః కదాచన".

స్త్రీశబ్దము 'ఙీప్' ప్రత్యయాంతము. ప్రథమైకవచనమున సులోపముచే (సూ.179) 'స్త్రీ'అను రూపము సిద్ధించును. సంబోధనైకవచనమున 'హే స్త్రీ + స్'అని యుండగా 'అమ్బార్థనద్యోర్హ్రస్వః'అను సూత్రముచే (195) హ్రస్వము 'ఏఙ్హ్రస్వాత్'అను సూత్రముచే (134) సంబుద్ధిలోపము వచ్చుటచే 'హే స్త్రి' అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వివచనమున 'స్త్రీ + ఔ'అని యుండగా:-

## 227. స్త్రియాః 6.4.79

**అస్యేయఙ్ స్యాదజాదౌ ప్రత్యయే పరే. స్త్రియౌ, స్త్రియః.**

'అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ'నుండి 'అచి' 'ఇయఙ్' అనువర్తించును. స్త్రీశబ్దమునకు అజాదిప్రత్యయము పర మగునపుడు 'ఇయఙ్' ఆదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఇయఙ్'స్త్రీశబ్దమున కంతాదేశముగ వచ్చుటచే 'స్త్రియౌ'అను రూపము సిద్ధించును. 'జస్'పర మగునపుడు గూడ ఇయఙాదేశము వచ్చుటచే 'స్త్రియః'అను రూపము సిద్ధించును.

'అమ్''శస్'లు పర మగునపుడు గూడ ఈ సూత్రముచే ఇయజాదేశము నిత్యముగ రావలసి యుండగా:-

228. వాఽమ్శసోః 6.4.80

అమి శసి చ స్త్రియా ఇయఙ్ వా స్యాత్, స్త్రియమ్, స్త్రీమ్, స్త్రియః, స్త్రీః, స్త్రియా, స్త్రియై, పరత్వాన్నుట్-స్త్రీణామ్, స్త్రీషు, శ్రీః, శ్రియౌ, శ్రియః.

పై సూత్రము, 'అచిశ్నుధాతుభ్రువాంయ్వోరియఙువఙౌ'నుండి 'ఇయఙ్' అనువర్తించును. స్త్రీశబ్దమునకు 'అమ్''శస్'లు పర మగునపుడు 'ఇయఙ్' ఆదేశము వికల్పముగా వచ్చును.

'అమ్'పర మగునపుడు 'ఇయఙ్'వచ్చిన పక్షమున 'స్త్రియమ్'అనియు, రాని పక్షమున 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము వచ్చి 'స్త్రీమ్'అనియు రూపము లగును. ఇట్లే 'శస్'పర మగునపుడు ఇయఙా దేశముచే 'స్త్రియః'అనియు, ఇయఙ్ రాని పక్షమున 'ప్రథమయోః పూర్వ సవర్ణః'అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము వచ్చి 'స్త్రీః'అనియు రూపము లగును.

'టా'పర మగునపుడు 'స్త్రియాః'అను సూత్రముచే (227) ఇయఙా దేశము చేయ 'స్త్రియా'అను రూపము సిద్ధించును.

'ఙే'పర మగునపుడు 'స్త్రీ + ఏ'అని యుండగా 'ఆణ్నద్యాః'అను సూత్రముచే (196) ఆడాగమము, 'ఆటశ్చ'అను సూత్రముచే (197) వృద్ధియు వచ్చి'స్త్రీ + ఐ'అని యుండును. ఇపుడు 'స్త్రియాః'అను సూత్రముచే (227) ఇయఙాదేశము వచ్చి 'స్త్రియై'అను రూపము సిద్ధించును.

'ఙసి''ఙస్'లు పర మగునపుడు పైన చూపిన విధముగ ఆడాగమ, వృద్ధి ఇయఙాదేశములచే 'స్త్రియాః'అను రూపము సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'స్త్రీ + ఆమ్'అని యుండగా 'ఇయఙ్' 'నుట్' ఈ రెండింటికిని అవకాశ మున్నది. కాని నుడాగమము పర మగుటచే 'ఇయఙ్'ను బాధించును. 'స్త్రీ + నామ్'అని యుండగా 'అట్కుప్వాఙ్-'అను సూత్రముచే (138) ణత్వము-'స్త్రీణామ్'అను రూపము సిద్ధించును.

'ఙి'పర మగునపుడు 'ఙేరామ్నద్యామ్నీభ్యః'అను సూత్రముచే (198) 'ఙి'కి 'ఆమ్'వచ్చిన పిదప ఇయఙాదేశము చేయగా 'శ్రియామ్'అను రూపము సిద్ధించును.

'సుప్'పర మగునపుడు 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) సకారమునకు షత్వము చేయగా 'శ్రీషు'అను రూపము సిద్ధించును.

శ్రిధాతువునకు 'క్విబ్వచి ప్రచ్ఛ్యాయతస్తు కటప్రుజుశ్రీణాందీర్ఘోఽసంప్రసారణఞ్చ'అను వార్తికముచే క్విప్రత్యయమును జేర్చి దీర్ఘము చేయుటచే 'శ్రీ'అను శబ్ద మేర్పడినది. 'శ్రయతి హరిమ్'అని యర్థము. ఇది ఙీప్రత్యయాంతము కాదు కావున ప్రథమైకవచనప్రత్యయ మగు 'స్'కు 'హల్ఙ్యాబ్భ్యః-' అను సూత్రముచే (179) లోపము రాదు. 'శ్రీః'అను రూపము సిద్ధించును.

'ఔ''జస్''శస్'లు పర మగునపుడు 'అచిశ్నుధాతు-'అను సూత్రముచే (193) ఇయఙాదేశము వచ్చి 'శ్రియౌ' 'శ్రియః'అను రూపములు సిద్ధించును.

229. నేయఙువఙ్స్థానావస్త్రీ 1.4.4

ఇయఙువఙోః స్థితిః యయోస్తావీదూతౌ నదీసంజ్ఞౌ న స్తః,న తు స్త్రీ. హే శ్రీః, శ్రియై, శ్రియే, శ్రియాః-2, శ్రియః-2.

'యూస్త్ర్యాఖ్యౌ నదీ'నుండి 'యూ''నదీ'అనువర్తించును. 'ఇయఙ్' 'ఉవఙ్'ఆదేశములు వచ్చుటకు యోగ్యము లగు ఈకారఊకారములు నదీసంజ్ఞకములు కావు. స్త్రీశబ్దమునకు మాత్ర మీ నిషేధము వర్తింపదు.

శ్రీశబ్దము అజాదిప్రత్యయములు పర మగునపుడు 'ఇయఙ్'వచ్చుటకు యోగ్య మైనది గాన నిది ఇయఙ్స్థానము కావున నీ సూత్రముచే నదీసంజ్ఞ నిషేధింపబడినది. అందుచే సంబుద్ధియందు 'అమ్బార్థనద్యోర్హ్రస్వః'అను సూత్రముచే (195) హ్రస్వము రాదు. హ్రస్వము లేకుండుటచే 'ఏఙ్హ్రస్వాత్సమ్బుద్ధేః'అను సూత్రముచే (134) సంబుద్ధిలోపము రాదు. సకారమునకు రుత్వవిసర్గములచే 'హే శ్రీః'అను రూపము సిద్ధించును.

'టా'పర మగునపుడు ఇయఙాదేశముచే 'శ్రియా'అను రూప మగును.

చతుర్థ్యేకవచనమున 'శ్రీ + ఙే'అని యుండగా 'ఙితి హ్రస్వశ్చ'అను సూత్రముచే (222) వికల్పముగ నదీసంజ్ఞ వచ్చును. నదీసంజ్ఞాపక్షమున

ఆడాగమ, వృద్ధి, ఇయఙాదేశములచే 'శ్రియై' అనియు నదీసంజ్ఞాభావ పక్షమున ఇయఙాదేశమాత్రము వచ్చి 'శ్రియే' అనియు రూపములు సిద్ధించును. ఇట్లే 'ఙసి', 'ఙస్', 'ఙి' లు పర మగునపుడు నదీసంజ్ఞాపక్షమున స్త్రీశబ్దమునందు వలె రూపములు సిద్ధించును. తదభావపక్షమున ఇయఙ్మాత్రముచే 'శ్రియః. 'శ్రియి' అను రూపములును సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'శ్రీ + ఆమ్' అని యుండగా:-

230. వాఽమి 1.4.5

ఇయఙువఙ్స్థానౌ స్త్ర్యాఖ్యౌ యూ ఆమి వా నదీసంజ్ఞౌ స్తః, న తు స్త్రీ. శ్రీణామ్. శ్రియామ్. శ్రియామ్, శ్రియి. ధేనుర్మతివత్.

'యూ స్త్ర్యాఖ్యౌ నదీ' అను సూత్రము 'నేయఙువఙ్స్థానావస్త్రీ' నుండి 'న' లేక మిగిలిన పదములను అనువర్తించును. 'ఇయఙ్' 'ఉవఙ్' లు వచ్చుటకు యోగ్యములును, నిత్యస్త్రీలింగములును, స్త్రీశబ్దభిన్నములును అగు ఈకారఊకారములు 'ఆమ్' పర మగునపుడు వికల్పముగ నదీసంజ్ఞకము లగును.

ఈ సూత్రముచే నదీసంజ్ఞ వైకల్పికము గాన నదీసంజ్ఞాపక్షమున 'హ్రస్వనద్యాపోనుట్' అను సూత్రముచే (148) నుడాగమము. 'అట్కుప్వాఙ్-' అను సూత్రముచే (178) ణత్వమును వచ్చుటచే 'శ్రీణామ్' అనియు నదీసంజ్ఞాభావపక్షమున 'ఇయఙ్' చే 'శ్రియామ్' అను రూపమును సిద్ధించును.

ఉకారాంతస్త్రీలింగశబ్ద మగు ధేనుశబ్దము ప్రక్రియ మతిశబ్దమునందు వలె నుండును.

231. స్త్రియాం చ 7.1.96

స్త్రీవాచీ క్రోష్టుశబ్దస్తృజన్తవద్రూపం లభతే.

'తృజ్వత్క్రోష్టుః' అను సూత్రము అనువర్తించును. స్త్రీవాచి యగు క్రోష్టుశబ్దము తృజన్తము వలె రూపమును పొందును. అనగా 'క్రోష్టు' శబ్దము స్త్రీలింగమున తృజ్వద్భావమును పొంది 'క్రోష్టృ' అని యగును.

232. ఋన్నేభ్యో ఙీప్ 4.1.5

ఋదన్తేభ్యో నాన్తేభ్యశ్చ స్త్రియాం ఙీప్. క్రోష్ట్రీ గౌరీవత్. భ్రూః శ్రీవత్. స్వయమ్భూః పుంవత్.

'స్త్రియామ్'అధికార సూత్రము. 'ఙ్యాప్ప్రాతిపదికాత్' నుండి 'ప్రాతిపదికాత్'అనువర్తించును. స్త్రీలింగమున ఋకారనకారాంతము లగు ప్రాతిపదికమునకంటె 'ఙీప్'వచ్చును.

'ఙీప్'నందలి ఙకారపకారములకు 'లశక్వతద్ధితే' (136) 'హలన్త్యమ్' (1) సూత్రములచే ఇత్సంజ్ఞ యుండుటచే 'ఈ'అనునది శేషించును. 'క్రోష్టృ + ఈ'అని యుండ యణాదేశముచే 'క్రోష్ట్రీ' అను శబ్దము ఏర్పడును. ఈ శబ్దము ప్రక్రియ గౌరీశబ్దప్రక్రియవలె నుండును.

భ్రూ (కనుబొమ్మ) శబ్దప్రక్రియ శ్రీశబ్దప్రక్రియవలె నుండును స్వయంభూశబ్దము స్త్రీలింగమునందు గూడ పుంలింగమునందు వలె నుండును.

233. న షట్స్వస్రాదిభ్యః 4.1.10

ఙీప్టాపౌ న స్తః.

స్వసా తిస్రశ్చతస్రశ్చ ననాన్దా దుహితా తథా
యాతా మాతేతి సప్తైతే స్వస్రాదయ ఉదాహృతాః.

స్వసా, స్వసారౌ. మాతా పితృవత్. శసి మాతౄః.ఇతి ఋదన్తాః. ద్యౌర్గోవత్ రాః పుంవత్. నౌర్గ్లౌవత్.

ఇతి అజన్తస్త్రీలిఙ్గప్రకరణమ్.

'ఋన్నేభ్యో ఙీప్' నుండి 'ఙీప్' 'టాబృచి'నుండి 'టాప్'అనువర్తించును. 'షట్'సంజ్ఞకము లగు శబ్దములకంటెను, స్వసృ'మొదలగు ఋకారాంత శబ్దములకంటెను 'ఙీప్','టాప్'ప్రత్యయములు రావు.

'పఞ్చన్''సప్తన్'మొదలగు షట్సంజ్ఞకశబ్దములు నకారాంతములగుటచేతను, 'స్వసృ'మొదలగునవి ఋకారాంతము లగుటచేతను 'ఋన్నేభ్యో ఙీప్' అను సూత్రముచే రావలసి యున్న 'ఙీప్' ఈ సూత్రముచే నిషేధింపబడినది. కావున స్వసృ(సోదరి)శబ్దమునకు 'ఙీప్'రాదు. 'అప్తృన్తృచ్స్వసృ-'అను సూత్రమున (206) 'స్వసృ'శబ్దము గూడ పఠింపబడినది గాన ఉపధాదీర్ఘము వచ్చుటచే స్వసృశబ్దరూపములు ధాతృశబ్దరూపముల వలె నుండును. 'శస్' పర మగునపుడు మాత్రము ఇది స్త్రీలింగశబ్ద మగుటచే 'తస్మాచ్ఛసోనఃపుంసి'అను సూత్రముచే (137) సకారమునకు నకారము రాదు గాన, రుత్వవిసర్గములచే 'స్వసౄః'అను రూపము సిద్ధించును

స్వస్రాదిగణమున స్వసృ, తిసృ, చతసృ, ననాన్దృ (ఆడపడచు), దుహితృ (పుత్రిక), యాతృ (తోటికోడలు) మాతృ అను ఏడుశబ్దములు పఠింప బడినవి.

మాతృశబ్దము పితృశబ్దము వలె నుండును. 'శస్'పర మగునపుడు మాత్రము పుంస్త్వప్రయుక్తనకారము లేకుండుటచే 'మాతౄః'అను రూప ముండును. ఓకారాంత మగు ద్యో (అకాశము,స్వర్గము) శబ్దము గోశబ్దము వలె నుండును.

ఐకారాంత మగు 'రై'శబ్దము (ధనము), పుంలింగమునందు వలెనే యుండును. ఔకారాంతమగు 'నౌ'(నావ)శబ్దము 'గ్లౌ'(చంద్రుడు)శబ్దము వలె నుండును..

అజంత స్త్రీలింగప్రకరణము సమాప్తము

# అథ అజన్తనపుంసకలిఙ్గప్రకరణమ్

## 234. అతోఽమ్ 7.1.24

అతోఽఙ్గాత్ క్లీబాత్ స్వమోరమ్. 'అమి పూర్వః-'జ్ఞానమ్. 'ఏఙ్హ్రస్వాదితి'హల్లోపః-హేజ్ఞాన.

'స్వమోర్నపుంసకాత్'అను సూత్రము,'అఙ్గస్య'అను నధికార సూత్ర మును.అనువర్తించును. నపుంసకలింగ మగు అదంతాంగముకంటె పరము లగు 'సు''అమ్'అను ప్రత్యయములకు 'అమ్'వచ్చును.

అకారాంతనపుంసకలింగ మగు జ్ఞానశబ్దము ప్రథమైకవచనమున 'జ్ఞాన+సు'అని యుండ ఈ సూత్రముచే 'అమ్'వచ్చుటచే'జ్ఞాన+అమ్'అని యగును. పిదప 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము- 'జ్ఞానమ్'అను రూపము సిద్ధించును.

సమ్బుద్ధియందు వెనుక చూపిన విధముగ 'హేజ్ఞానమ్'అని యైన పిమ్మట 'ఏఙ్హ్రస్వాత్సమ్బుద్ధేః'అను సూత్రముచే (134) హ్రస్వమగు అకా

రముకంటె పరమగు సంబుద్ధ్యవయవ మైన మకారమునకు లోపము చేయ 'హేజ్ఞాన'అను రూపము సిద్ధించును

ప్రథమాద్వివచనమున 'జ్ఞాన + ఔ'అని యుండగా:-

235. నపుంసకాచ్చ 7.1.19

క్లీబాదౌఙః శీ స్యాత్. భసంజ్ఞాయామ్:-

'జసః శీ''ఔఙ ఆపః'అను సూత్రములనుండి 'శీ''ఔఙః' అనువర్తించును. నపుంసకలింగశబ్దముకంటె పర మగు ఔఙ్'కు (ఔకారవిభక్తికి) 'శీ' వచ్చును.

ఈ సూత్రముచే 'ఔ'కు (శీ) 'ఈ'ఆదేశము చేయగా 'జ్ఞాన + ఈ'అని యుండును. ఇచట అజాదిప్రత్యయము పర మగుటచే 'జ్ఞాన'అనునది భసంజ్ఞకము. (నపుంసకలింగమున సర్వనామసంజ్ఞ యుండదు. సూ. 163) ఇపుడు:-

236. యస్యేతి చ 6.4.148

ఈకారే తద్ధితే చ పరే భస్యేవర్ణావర్ణయోర్లోపః. ఇత్యల్లోపే ప్రాప్తే.

యస్య,ఈతి,చ. ఇశ్చ అశ్చ తయోః సమాహారః యమ్. అనగా-'ఇ' వర్ణ 'అ'వర్ణము లని యర్థము 'భస్య''అఙ్గస్య'అధికార సూత్రములు.'నస్తద్ధితే' నుండి 'తద్ధితే'అనువర్తించును. ఈకారము, తద్ధితప్రత్యయము పర మగు నపుడు భసంజ్ఞక మగు అంగముయొక్క ఇవర్ణావర్ణములకు లోపము వచ్చును.

ఈ సూత్రముచే జ్ఞాన'శబ్దమునందలి అకారమునకు లోపము చేయవలసి యుండ-

వా. ఔఙః శ్యాం ప్రతిషేధో వాచ్యః.

జ్ఞానే.

'ఔఙ్'స్థానమున ఆదేశముగ వచ్చిన 'శీ'ప్రత్యయము పర మగునపుడు ఈ లోపమునకు నిషేధము చెప్పదగినది. ఈ వార్తికముచే అకారలోపము నిషిద్ధము గాన 'ఆద్గుణః'అను సూత్రముచే (27) గుణము చేయ 'జ్ఞానే'అను రూపము.

237. జశ్శసోః శిః 7.1.20.

క్లీబాదనయోః శిః స్యాత్.

'స్వమోర్నపుంసకాత్'నుండి'నపుంసకాత్'అనువర్తించును. నపుంసకలింగ శబ్దముకంటె పర మగు 'జస్','శస్'లకు 'శి'అను నాదేశము వచ్చును. ప్రథమా ద్వితీయాబహువచనములందు జస్,శస్‌లకు పై సూత్రముచే 'శి'అను నాదేశము చేయ 'జ్ఞాన + శి'అని యుండగా.

238. శి సర్వనామస్థానమ్ 1.1.42

శి ఇత్యేతత్ ఉక్తసంజ్ఞం స్యాత్.

'శి'అనునది సర్వనామస్థానసంజ్ఞ మగును.

239. నపుంసకస్య ఝలచః 7.1.72

ఝలన్తస్యాఽజన్తస్య చ క్లీబస్య నుమ్ స్యాత్ సర్వనామస్థానే.

'అఙ్గస్య'అధికారసూత్రము. 'ఇదితోనుమ్‌ధాతోః''ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః'అను సూత్రములనుండి 'నుమ్''సర్వనామస్థానే'అనువర్తించును. ఝలంతమును,అజంతమును అగు నపుంసకలింగశబ్దాంగమునకు సర్వనామస్థానము పర మగునపుడు 'నుమ్'అను నాదేశము వచ్చును.

240. మిదచోఽన్త్యాత్పరః 1.1.47

అచాం మధ్యే యోఽన్త్యః, తస్మాత్ పరస్తస్యైవాన్తావయవో మిత్ స్యాత్. ఉపధాదీర్ఘః-జ్ఞానాని. పునస్తద్వత్. శేషం పుంవత్.ఏవం ధనవనఫలాదయః.

'ఆద్యన్తవదేకస్మిన్'నుండి 'అంత' అనువర్తించును. మకారేత్సంజ్ఞక మగు ఆగమము,అచ్చులలో నేది అంత్యమో దానికంటె పరమై దానికి అంతావయవమై వచ్చును.

ఇచట అజన్తాంగ మగు 'జ్ఞాన' అనుదానికి సర్వనామస్థాన మగు 'శి' (ఇ) పర మగుటచే వచ్చిన'నుమ్' ఆదేశము ('ఉ','మ్'లు ఇత్సంజ్ఞకములు)పై సూత్రముచే అంత్యాచ్ అగు అకారమునకు అన్తావయవముగ వచ్చుటచే 'జ్ఞానన్ + ఇ'అని యుండును. ఇపుడు 'సర్వనామస్థానే చాఽసమ్బుద్ధౌ'అను సూత్రముచే(177)'జ్ఞానన్'అను నకారాంతాంగమునందలి ఉపధ యగు 'అ'కారమునకు దీర్ఘము వచ్చి'జ్ఞానాని' అను రూపము సిద్ధించినది.

ద్వితీయవిభక్తియందు కూడ ప్రథమవిభక్తియందు వలెనే రూపములు సిద్ధించును. తృతీయాదివిభక్తి రూపములు రామశబ్దమునందు వలె నుండును. ధన,వన,ఫలాదులగు అకారాంతనపుంసకలింగశబ్దము లన్నియు ఇటులనే యుండును.

241. అద్డ్ డతరాదిభ్యః పఞ్చభ్యః 7.1.25

ఏభ్యః క్లీబేభ్యః స్వమోరద్డ్ ఆదేశః స్యాత్.

'స్వమోర్నపుంసకాత్'అనుసూత్రము అనువర్తించును. నపుంసకము లగు డతరాదిపంచశబ్దములకంటె (డతరడతమప్రత్యయాంతములు,అన్య,అన్యతర,ఇతర శబ్దములకంటె) పర ములగు 'సు' అమ్'లకు 'అద్డ్'ఆదేశము వచ్చును.

కతరశబ్దప్రథమాద్వితీయైకవచనములందు 'కతర + సు' 'కతర + అమ్' అని యుండగా ఈ సూత్రముచే 'అద్డ్'ఆదేశము చేయుటచే(డకారము ఇత్) 'కతర + అద్'అని యుండును. ఇచట-

242. టేః 6.4.143

డితి భస్య టేర్లోపః.కతరత్.కతరద్,కతరే,కతరాణి. హేకతరత్. శేషంపుంవత్.ఏవమ్-కతమత్,ఇతరత్,అన్యత్,అన్యతరత్,అన్యతమస్య తు అన్యతమమిత్యేవ.

'అల్లోపోऽనః''తివింశతేర్డితి'అను సూత్రములనుండి 'లోపః' 'డితి'అను వర్తించును.'భస్య'అధికారసూత్రము. 'డిత్'పర మగునపుడు భసంజ్ఞక మగు దాని 'టి'కి లోపము వచ్చును. ఇచట'డిత్ అగు 'అద్'అనునది పర మగుటచే భసంజ్ఞక మగు 'కతర'అను శబ్దమునందలి 'టి' (అ) లోపించును. కతర్ + అద్ = కతరద్.'వావసానే'అను సూత్రముచే (146) దకారమునకు చర్త్వ వికల్పముచే తకారము-'కతరత్'. తదభావపక్షమున'కతరద్'.

ద్వివచనబహువచనములందు సర్వశబ్దమునకు వలె 'కతరే','కతరాణి' అను రూపములు సిద్ధించును.

సంబోధనప్రథమైకవచనమున ప్రథమయందు వలె అద్డాదేశటిలోపములచే 'కతర్ + అద్'అని యుండగా 'కతర్'అను అంగము హ్రస్వాంతము కాదు కావునను,'అద్'లోని 'అ'కారము ఆదేశమునకు సంబంధించినదే కాని

అంగమునను సంబంధించినది కాదు కావునను 'ఏఙ్ హ్రస్వాత్-'అను సూత్రముచే (134) సంబుద్ధిలోపము రాదు. ప్రథమయందు వలెనే 'హేకతరత్' 'హే కతరద్'అను రెండు రూపము లుండును. మిగిలిన రూపము లన్నియు పుంలింగమునందు వలెనే యుండును. కతమత్, ఇతరత్, అన్యత్, అన్యతరత్ అను శబ్దములు గూడ కతరశబ్దము వలె ఉండును. 'అన్యతమ'శబ్దము డతరాదిపంచశబ్దములలో చేరినది కాదు. అవ్యుత్పన్నప్రాతిపదిక మగుటచే డతమప్రత్యయాంతము కాదు. కావున ఇది పూర్తిగ సర్వశబ్దము వలెనే యుండును.

'ఏకతర'శబ్దము 'డతర'ప్రత్యయాంత మగుటచే అద్డాదేశము రావలసి యుండగా—

వా. ఏకతరాత్ ప్రతిషేధో వక్తవ్యః.

ఏకతరమ్

ఏకతరశబ్దముకంటె పర మగు 'సు' 'అమ్'లకు 'అద్ద్'ఆదేశనిషేధము చెప్ప తగినది

ఈ వార్తికముచే అద్డాదేశము నిషిద్ధము గాన సర్వశబ్దమునందు వలె 'ఏకతరమ్' ఇత్యాదిరూపము లుండును.

243. హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య 1.2.47

అజన్తస్యేత్యేవ. శ్రీపం జ్ఞానవత్.

ఇచట హ్రస్వము విధింపబడుచున్నదిగాన 'అచశ్చ'అను పరిభాష ననుసరించి 'అచః' అను పదము అనువర్తించును. నపుంసకలింగమున అజన్తప్రాతిపదికకు హ్రస్వము వచ్చును.

'శ్రియం పాతి'అను నర్థమున 'విచ్'లేక 'క్విప్'ప్రత్యయమును జేర్చుటచే 'శ్రీపా'శబ్దము నిష్పన్న మైనది. నపుంసకలింగమున పై సూత్రముచే దీని దీర్ఘాకారమునకు హ్రస్వము వచ్చుటచే 'శ్రీప అని యగును. ఇపు డిది అకారాంతము గాన జ్ఞానశబ్దము వలె నుండును. తృతీయాబహువచనాదులందు నకారమునకు ణత్వము 'అట్కుప్వాఙ్-'అను సూత్రముచే (138) కాక (ఏలనన 'శ్రీప' అనునది ఏకపదము కాదు) 'ఏకాజుత్తరపదేణః'అను రాబోవు సూత్రముచే(287) వచ్చును.

244. స్వమోర్నపుంసకాత్ 7.1.23

లుక్ స్యాత్. వారి.

'షడ్భ్యో లుక్' నుండి 'లుక్' అనువర్తించును. నపుంసకలింగశబ్దము కంటె పర మగు 'సు' 'అమ్'లకు లుక్ వచ్చును.

వారిశబ్దప్రథమైకవచనమున 'వారి + సు'అని యుండగా ఈ సూత్రముచే 'సు'కు లోపము వచ్చి 'వారి'అను రూపము సిద్ధించును.

ద్వివచనమున 'వారి + ఔ'అని యుండ 'నపుంసకాచ్చ'అను సూత్రముచే (235) 'ఔ'కు'శీ'-వారి + (శ్) 'ఈ'అని యుండ —

245. ఇకోఽచి విభక్తౌ 7.1.73

ఇగన్తస్య నుమ్ అచి విభక్తౌ. వారిణీ, వారీణి. 'నలుమతా' ఇత్యస్య అనిత్యత్వాత్ పక్షే సమ్బుద్ధినిమిత్తో గుణః-హేవారే, హేవారి, ఆఙో నా - వారిణా, 'ఘేర్ఙితి'ఇతి గుణే ప్రాప్తే:-

'ఇదితో నుమ్ ధాతోః' 'నపుంసకస్యఝలచః' అను సూత్రముల నుండి 'నుమ్' 'నపుంసకస్య'అను పదములును, 'అఙ్గస్య'అను అధికారసూత్రమును అనువర్తించును. ఇగన్తాంగమునకు అజాది విభక్తి పర మగునపుడు 'నుమ్' ఆగమము వచ్చును.

ఈ సూత్రముచే ఇగన్తాంగ మగు 'వారి'అనుదానికి 'నుమ్' ('ఉ''మ్'లు ఇత్సంజ్ఞకములు) 'మిదచోఽన్త్యాత్పరః'అను నియమముచే(240) అంతాదేశమై వచ్చును-'వారిన్ + ఈ' 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేపి' అనుసూత్రముచే (138) ణత్వము-'వారిణీ'అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వితీయాబహువచనములందు 'వారి + జస్' 'వారి + శస్' అని యుండ 'జశ్శసోశ్శిః'అను సూత్రముచే (237) 'శి'ఆదేశము. 'శిసర్వనామస్థానమ్' అను సూత్రముచే (238) సర్వనామస్థానసంజ్ఞ యున్నది గాన 'నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము-'వారిన్ + ఇ'; 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) నాన్తోపధకు దీర్ఘము. 'అట్కుప్-'అను సూత్రముచే (138) ణత్వము-'వారీణి'అను రూపము సిద్ధించును.

సంబుద్ధియందు 'హేవారి + సు' అని యుండ 'స్వమోర్నపుంసకాత్' అను సూత్రముచే (244) 'సు'కు లోపము. ఇచట సుప్రత్యయము లోపించినను 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' అను పరిభాష ననుసరించి 'సమ్బుద్ధౌ చ' అను సూత్రముచే (217) గుణము రావచ్చును. కాని 'న లుమతాఙ్గస్య' అను సూత్రముచే (191) లుక్, శ్లు, లుప్ శబ్దములచే ప్రత్యయము లోపించినపుడు తత్ప్రయుక్త మగు అంగకార్యము నిషిద్ధమైనది గాన సంబుద్ధిప్రయుక్త మగు గుణము కూడ రాదు. అందుచే 'హేవారి' అనియే రూపము నిష్పన్నము కావలసి యున్నది కాని 'న లుమతాఙ్గస్య' అను నిషేధము అనిత్యము గాన ఆ నిషేధము లేని పక్షమున గుణము చేయగా 'హేవారే' అను రూపము గూడ ఉండును.

'న లుమతా-' అను నిషేధము అనిత్య మని చెప్పుటకు ప్రకృతసూత్రము నందు 'అచి' అను పదమును ప్రయోగించుట జ్ఞాపకము. 'భ్యామ్' మొద లగు హలాదివిభక్తులు పర మగునపుడు నుమాగమము రాకుండుట 'అచి' యని చెప్పుటకు ప్రయోజన మని చెప్పవలెను. కాని హలాదివిభక్తులు పర మగునపుడు 'నుమ్' వచ్చినను "న లోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) ఆ నకారము లోపించును గాన 'నుమ్' వచ్చినను దోషము లేదు. ఇక సంబోధన ప్రథమైకవచనమున సంబుద్ధి లోపించిన పిమ్మట 'నుమ్' చేయగా 'న ఙిసమ్బుద్ధ్యోః' అను సూత్రముచే (281) నిషిద్ధ మగుటచే "నలోపః-" అను సూత్రముచే (180) నకారలోపము వచ్చు నవకాశము లేదు గాన అచట 'నుమ్' రాకుండుటకై 'అచి' అను పదము ప్రయుక్త మైన దని చెప్పవలసి యుండును. కాని అచట గూడ 'నలుమతాఙ్గస్య' అను సూత్రముచే (191) నిషిద్ధము గాన లుప్త సంబుద్ధిని నిమిత్తముగ చేసికొని నుమ్ వచ్చుటకు అవకాశము లేదు. ఈ విధముగ హలాదివిభక్తిప్రత్యయములు పరములుగ నుండగ 'నుమ్' రాకుండ చేయ నుద్దిష్ట మగు, 'అచి' అను పదము వ్యర్థము కావలసి వచ్చుచున్నది. కావున 'న లుమతా-' అనునది అనిత్య మని అంగీకరింపబడినది. అది అనిత్య మైనచో ఇపుడు లుప్తసంబుద్ధినిమిత్తక మగు 'నుమ్' వచ్చుటకు వీలున్నది గాన తన్నివారణార్థమై 'అచి' పదగ్రహణము సార్థక మగును.

తృతీయైకవచనమున 'ఆఙో నా஽స్త్రియామ్' అను సూత్రముచే (171) 'టా'కు 'నా' ఆదేశము, ణత్వము చేయ 'వారిణా' అను రూపము సిద్ధించును.

ఙిత్ప్రత్యయము లగు 'ఙే', 'ఙసి', 'ఙస్' ప్రత్యయములు పర మగునపుడు 'ఘేర్ఙితి' అను సూత్రముచే (172) గుణము రావలసి యుండగా-

వా. వృద్ధ్యౌత్వతృజ్వద్భావగుణేభ్యో నుమ్ పూర్వవిప్రతిషేధేన.

వారిణే. వారిణః, వారిణః, వారిణోః. 'నుమచిర-' ఇతినుట్. వారీణామ్, వారిణి. హలాదౌ హరివత్.

వృద్ధి, ఔత్వ, తృజ్వద్భావ, గుణములకంటె ముందుగ పూర్వవిప్రతిషేధముచే 'నుమ్' వచ్చును. అనగా తుల్యబలవిరోధము కలిగి నపుడు పరము లైనను వృద్ధ్యాదులను పూర్వవిప్రతిషేధముచే 'నుమ్' బాధించును.

ఈ వార్తికము ననుసరించి గుణముకంటె ముందుగనే 'నుమ్' ఆగమము వచ్చుటచే 'వారిణే' 'వారిణః' 'వారిణః'అను రూపములు సిద్ధించినవి. షష్ఠీద్వివచనమునందు కూడ నుమాగమముచే 'వారిణోః'అను రూపము. బహువచనమున 'వారి + ఆమ్'అని యుండగా 'ఇకోఽచి-'అను సూత్రముచే (245) నుమాగమము వచ్చుటకును, 'హ్రస్వనద్యాపో నుట్'అను సూత్రముచే (148) నుడాగమము వచ్చుటకును గూడ అవకాశ మున్నది. కాని ఇచట 'నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వవిప్రతిషేధేన' అనువార్తికము ననుసరించి నుమ్‌ను బాధించి 'నుట్'వచ్చును. పిమ్మట 'నామి'అను సూత్రముచే (149) దీర్ఘము, ణత్వము చేయగా 'వారీణామ్'అను రూపము సిద్ధించును.

ఇచట 'నుమ్ వచ్చినను, 'నుట్ వచ్చినను ప్రకృతిప్రత్యయముల నడుమ నకారమే వచ్చును. కాని 'నుమ్' చేసినచో అది 'మిత్'గాన (సూ.240) అంగావయవమై వచ్చును. అపుడు 'నామ్'లేదు గాన 'నామి'అను సూత్రముచే దీర్ఘము వచ్చుటకు అవకాశ ముండదు. 'నుట్' ఐనచో అది టిత్ గాన 'ఆమ్'కు ఆద్యవయవముగ వచ్చుటచే (సూ 88) 'నామ్' ఉండును.

సప్తమ్యేకవచనమున 'వారి + ఙి'అని యుండ 'అచ్చ ఘేః' అను సూత్రముచే (174) ఔత్వాదులు రావలసి యుండ పై వార్తికముచే ఔత్వమును 'నుమ్' బాధించును. కావున 'వారిణి'అను రూపము సిద్ధించును. హలాది విభక్తులు పర మగునపుడు హరిశబ్దరూపములవలె నుండును.

దధి శబ్దరూపములు ప్రథమా, సంబోధనప్రథమా, ద్వితీయల యందు 'వారి'శబ్దమునందు వలె నుండును. తృతీయాద్యజాది విభక్తులు పర మగునపుడు

246. అస్థిదధిసక్థ్యక్ష్ణామనఙుదాత్తః 7.1.75

ఏషామనఙ్ స్యాత్ టాదావచి.

'తృతీయాదిషు భాషితపుంస్కంపుంవద్గాలవస్య' "ఇకోఽచి విభక్తౌ"అను సూత్రములనుండి 'తృతీయాదిషు' 'అచి'అనువర్తించును. అస్థి, దధి, సక్థి,అక్షి అను శబ్దములకు 'టా'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'అనఙ్' ఆదేశము వచ్చును. అది యుదాత్త మగును.

'దధి+(టా)ఆ', 'దధి+(ఙే)ఏ' 'దధి+(ఙ)అస్', 'దధి+ఓస్' అని యుండగా పై సూత్రముచే అనఙాదేశము 'ఙిత్' గాన అంతాదేశముగ వచ్చి 'దధన్+ఆ' ఇత్యాది విధముల నుండగా:-

247. అల్లోపోఽనః 6.4.134

అఙ్గావయవోఽసర్వనామస్థాన యజాదిస్వాదిపరో యోఽన్ తస్యాకారస్య లోపః. దధ్నా, దధ్నే, దధ్నః-2. దధ్నోః-2.

అత్, లోపః, అనః. 'అఙ్గస్య''భస్య' అధికారసూత్రములు 'అసర్వనామస్థాన యజాదిస్వాదిపరః'అనునది. 'భస్య' అనుదాని వివరణము. అంగావయవమును, సర్వనామస్థానభిన్నయకారాజాది స్వాదిప్రత్యయపరకమును అగు 'అన్' లోని అకారము లోపించును.

ఈ సూత్రముచే 'దధన్'లోని అకారము లోపింప 'దధ్నా', దధ్నే' 'దధ్నః', 'దధ్నోః' అను రూపములు సిద్ధించినవి.

248. విభాషా ఙిశ్యోః 6.4.136

అఙ్గావయవోఽసర్వనామస్థానపరో యోఽన్ తస్యాఽకారస్య లోపో వా స్యాత్, ఙిశ్యోః పరయోః. దధ్ని, దధని. శేషం వారిత్ ఏవమస్థి, సక్థి, అక్షి.

అల్లోపోఽనః' 'అఙ్గస్య' 'భస్య'అను సూత్రములు అనువర్తించును. అంగావయవమును, సర్వనామస్థానభిన్నప్రత్యయపరకమును నగు 'అన్'లోని అకారమునకు 'ఙి','శి'లు పర మగునపుడు లోపము వికల్పముగ వచ్చును.

'దధి+ఙి' అనునపుడు అనాదేశముచే 'దధన్+ఙి'అని యుండగా పై సూత్రముచే అకారలోపము వైకల్పికముగాన 'దధ్ని' 'దధని' అను రెండు

రూపములు సిద్ధించును. మిగిలిన రూపము లన్నియు వారి శబ్దమునందు వలె నుండును. 'అస్థి', 'సక్థి', 'అక్షి'శబ్దములు గూడ ఇట్లే యుండును.

249. తృతీయాదిషు భాషితపుంస్కం పుంవద్ గాలవస్య 7.1.74

ప్రవృత్తినిమిత్తైక్యే భాషితపుంస్కమిగన్తం క్లీబం పుంవద్ వా టాదావచి. సుధియా, సుధినా ఇత్యాది. మధు, మధునీ, మధూని, హేమధు. సులు, సులునీ, సులూని, సులునేత్యాది. ధాతృ, ధాతృణీ, ధాతౄణి, హేధాతః, హేధాతృ, ధాత్రా, ధాతృణా, ధాతౄణామ్. ఏవం 'జ్ఞాతృ'ఆదయః.

'ఇకోఽచి విభక్తౌ' 'నపుంసకస్య ఝలచః'అను సూత్రములనుండి 'ఇకః' 'అచి' 'నపుంసకస్య'అనువర్తించును. ఒకే అర్థము కలిగి యుండి పుంవాచకముగా గూడ నున్న నపుంసకలింగ మగు ఇగన్తశబ్దము అజాదు లగు తృతీయాదివిభక్తులందు) వికల్పముగ పుంవద్భావము కలిగి యుండును. ('గాలవ' అనునది ఒక ఆచార్యుని పేరు).

పుంలింగ నపుంసకలింగములు రెండింటియందును ఒకే అర్థమును బోధించు శబ్దమునకు భాషితపుంస్క మని పేరు. "భాషితః పుమాన్ యేన ప్రవృత్తినిమిత్తేన తత్ భాషితపుంస్కమ్-ప్రవృత్తి నిమిత్తమ్; భాషితపుంస్కం అస్యాస్తీతి భాషితపుంస్కం - శబ్దస్వరూపమ్"శబ్దముల ప్రవృత్తికి-ప్రయోగమునకు కారణభూత మైనది అర్థము గాన దానికి ప్రవృత్తినిమిత్త మని పేరు. అట్టి ప్రవృత్తినిమిత్తము ఒక్కటి మాత్రమే కలిగి యుండి పుంలింగ నపుంసకలింగములం దున్న శబ్దము భాషితపుంస్కము ఉదాహరణకు-సుధీ శబ్దము పుంనపుంసకలింగములందు రెండిటియందును నుండును.రెండు లింగములందును ఈ పదమునకు 'మంచిబుద్ధి గల' అను నొకే యర్థ ముండును. కావున నిది భాషితపుంస్కము. ఇట్లే 'మృదు'శబ్దాదులు. పీలు శబ్దము రెండు లింగములందును నుండును. కాని పుంలింగమున దాని యర్థము పీలువృక్షము. నపుంసకలింగమున పీలుఫలము.కావున నర్థభేద మున్నది గాన నిది అభాషితపుంస్కము. 'మధు'శబ్దమునకు పుంలింగమున వసంతర్తు వనియు, నపుంసకమున 'తేనె' యనియు అర్థములు.కావున నిట్టి పదములు అభాషితపుంస్కములు.

పుంలింగమున ఈకారాంతమగు 'సుధీ'శబ్దము నపుంసకలింగమున 'హ్రస్వో నపుంసకే'అను సూత్రముచే (243) హ్రస్వము చేయ 'సుధి'యగును.

పైన చూపబడిన విధముగ సుధీశబ్దము భాషితపుంస్కముకావున తృతీయాద్యజాది విభక్తులందు పై సూత్రముచే వికల్పముగ పుంవద్భావము వచ్చుటచే 'అచి శ్నుధాతు-'అను సూత్రముచే (199) 'ఇయఙ్' చేయగా 'సుధియా' ఇత్యాదిరూపములును, పుంవద్భావము రాని పక్షమున వారిశబ్దమునందు వలె 'సుధినా'ఇత్యాదిరూపములును నిష్పన్నము లగును. ప్రథమాసంబోధనప్రథమా ద్వితీయలందు వారిశబ్దము వలె నుండును.

మధుశబ్దము అభాషితపుంస్కము. ప్రథమద్వితీయైకవచనములందు 'మధు + సు' 'మధు + అమ్'అని యుండగా 'స్వమోర్నపుంసకాత్'అను సూత్రముచే (244) 'సు''అమ్'లకు లోపము. 'మధు'అను రూపము సిద్ధించును.

'ఔ'పర మగునపుడు 'నపుంసకాచ్చ'అను సూత్రముచే (235) 'శీ', 'ఇకోచి విభక్తౌ' అను సూత్రముచే (245) నుమాగమము రాగా 'మధునీ' అను రూపము సిద్ధించును.

'జస్','శస్'లు పర మగునపుడు 'జశ్శసోః శిః'అను సూత్రముచే(237)'శి', 'నపుంసకస్య ఝలచః'అనుసూత్రముచే(239)'నుమ్','సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము చేయగా 'మధూని'అను రూపము సిద్ధించును. సంబుద్ధియందు వారిశబ్దమునందు వలె గుణవికల్పముచే 'హేమధో' 'హేమధు'అను రూపములు సిద్ధించును. తృతీయాదులందు గూడ వారిశబ్దము నందు వలె ప్రక్రియ యుండును. ఇది భాషితపుంస్కము కాదు కావున పుంవద్భావము లేదు.

'సుష్ఠు లునాతి'అను నర్థము గల 'సులూ'శబ్దమునకు నపుంసకలింగమున 'హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య'అను సూత్రముచే (243)హ్రస్వము-'సులు'-మధుశబ్దమునందు వలె ప్రక్రియ యుండును. ఇది భాషితపుంస్కము గాన వైకల్పికపుంవద్భావముచే తృతీయాది అజాది విభక్తులందు 'ఓః సుపి'అను సూత్రముచే (210) 'యణ్'చేయగా పుంలింగమునందు వలె 'సుల్వా'ఇత్యాది రూపములు గూడ సిద్ధించును.

ఋకారాంతనపుంసకలింగశబ్ద మగు 'ధాతృ'శబ్దమునకు పుంలింగనపుంసక లింగములందు 'పోషించువాడు' 'పోషించునది'అను ఒకే యర్థ మున్నది గాన నిది భాషితపుంస్కము.

ప్రథమాద్వితీయైక వచనములందు 'సు' 'అమ్'లకు లోపము చేయ 'ధాతృ' అను రూప మగును. ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశము, నుమ్, ణత్వములు వచ్చుటచే 'ధాతృణీ'అను రూప మగును. బహువచనమునందు 'జస్' 'శస్'లకు 'శి'ఆదేశము, నుమ్, సర్వనామస్థానసంజ్ఞాప్రయుక్త మగు ఉపధాదీర్ఘము ణత్వము వచ్చుటచే 'ధాతౄణి'అను రూపము సిద్ధించును.

సంబుద్ధియందు 'హే ధాతృ + సు' అని యుండగా 'స్వమోర్నపుంసకాత్' అను సూత్రముచే (241) 'సు'కు లుక్ చేసిన పిదప 'నలుమతా-'అనునిషేధము (191) అనిత్య మను పక్షమున సంబుద్ధినిమిత్తకగుణాదులచే పుంలింగమునందు వలె 'హే ధాతః'అను రూపము సిద్ధించును. నిషేధము ప్రవర్తించు పక్షమున 'హే ధాతృ'అను రూప మగును.

తృతీయాది అజాదివిభక్తులందు పుంవద్భావపక్షమున పుంలింగమునందు వలె 'ధాత్రా'ఇత్యాదిరూపములును, తదభావపక్షమున 'ఇకోఽచి విభక్తౌ'అను సూత్రముచే (24 ) నుమాగమము వచ్చి 'ధాతృణా'ఇత్యాది రూపములును సిద్ధించును.

షష్ఠీబహువచనమున పుంవద్భావము లేని పక్షమునందు కూడ 'నుమచిర' అను వార్తికముచే (సూ.209) 'నుట్', 'నుమ్'ను బాధించును గాన 'ధాతౄణామ్'అను రూపము సిద్ధించును.

### 250. ఏచ ఇగ్ఘ్రస్వాదేశే 1.1.48

ఆదిశ్యమానేషు హ్రస్వేషు మధ్యే ఏచః ఇగేవ స్యాత్. ప్రద్యు, ప్రద్యునీ. ప్రద్యూని, ప్రద్యునేత్యాది. ప్రరి. ప్రరిణీ. ప్రరీణి. ప్రరిణా. ఏకదేశవికృతమనన్యవత్- ప్రరాభ్యామ్. సును. సునునీ, సునూని, సునునా ఇత్యాది.

ఇతి అజన్తనపుంసకలిఙ్గప్రకరణమ్.

ఏచః ఇక్. హ్రస్వాదేశే.

హ్రస్వాదేశము విధింపబడినప్పుడు 'ఏచ్'స్థానమున 'ఇక్' వచ్చును. 'ప్రకృష్టా ద్యౌః యస్మిన్ దినే'అను విగ్రహమున నిష్పన్న మగు 'ప్రద్యో'శబ్దమునకు నపుంసకలింగమున 'హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య'అను సూత్రముచే (243) హ్రస్వము రావలసి యున్నది. కాని 'ఏ ఓ ఐ ఔ'లకు హ్రస్వము

లేదు గాన ఈ సూత్రము చెప్పబడినది ఈ సూత్రము ననుసరించి ఓకారస్థాన మున 'ఇక్'అగు ఉకారము (ఆంతరతమ్యముచే) వచ్చి'ప్రద్యు'అని యగును. దీని రూపము లిపుడు మధుశబ్దరూపముల వలె నుండును.

'ప్రకృష్టః రాః యస్య తత్'అను నర్థమున ఐకారాంతనపుంసకలింగశబ్ద మగు 'ప్రరై'శబ్దమునకు హ్రస్వము చేయగా ఇకారము వచ్చి 'ప్రరి'యని యగును. ఇపుడు దీని రూపములు వారిశబ్ద రూపములవలె నుండును. కాని'భ్యామ్' మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు 'రాయో హలి'అను సూత్రముచే (215) ఆత్వము వచ్చి 'ప్రరాభ్యామ్' ఇత్యాదిరూపము లగును. 'రై' యందలి ఐకారము 'ఇ'కారముగ మారుటచే నిది 'రి'శబ్దము కాని 'రై'శబ్దము కాదు గాన ఈ సూత్ర మట్లు ప్రవర్తించును? అను సందేహము కలుగవచ్చును. కాని ఒక ప్రదేశమున వికారము వచ్చినను ఒక వస్తువు మరి యొక వస్తువుగ మార జాలదు. తోక తెగిన కుక్క, కుక్కయే గాని గార్దభము కాజాలదు కదా? కావున నిది గూడ "రై"శబ్దముగనే పరిగణింపబడును. అందుచే సూత్రము నిర్బాధముగ ప్రవర్తించును.

'శోభనా నౌః యస్య తత్'అను నర్థమున ఔకారాంతనపుంసకలింగశబ్ద మగు 'సునౌ'శబ్దమునకు హ్రస్వము చేయ 'సును'అగును. ఇపు డీ శబ్దరూప ములు మధుశబ్దరూపముల వలె ఉండును.

అజంతనపుంసకలింగ ప్రకరణము సమాప్తము.

# అథ హలన్తపుంలింగప్రకరణమ్

హకారాంత మగు 'లిహ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'లిహ్ + స్' అని యుండ 'హల్ఙ్యాప్-'అను సూత్రముచే (179) సకారము లోపించి 'లిహ్' అని యుండగా:-

251. హో ఢః 8.2.31

హస్య ఢః స్యాద్ ఝలి పదాన్తే చ. లిట్, లిడ్, లిహౌ, లిహః, లిడ్భ్యామ్, లిట్త్సు-లిట్సు.

'పదస్య' అధికారము. 'ఝలో ఝలి సవర్ణే' 'స్కోః సంయోగాద్యో రన్తే చ'అను సూత్రములనుండి 'ఝలి''అన్తే' అనువర్తించును. హకారమునకు 'ఝల్'పర మగునపుడును, పదాంతమునందును (పదాంతమున నున్న హకారమునకు) ఢకార మాదేశ మగును.

ఈ సూత్రముచే పదాంతమునం దున్న హకారమునకు ఢకారము చేయగా 'లిఢ్'అని యుండును. 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే (67) ఢకారమునకు డకారము-'లిడ్', డకారమునకు 'వాఽవసానే' అను సూత్రముచే (146) చర్త్వవికల్పముచే టకారము; తదభావపక్షమున డకారము 'లిట్''లిడ్' అను రూపములు సిద్ధించును.

'ఔ, జస్, అమ్, ఔ, శస్, టా'లు పర మగునపుడు విశేషకార్యమేదియును లేదు-'లిహౌ, లిహః, లిహమ్, లిహౌ, లిహః, లిహా'అను రూపము లగును.

తృతీయాద్వివచనమున 'లిహ్ + భ్యామ్'అని యుండ ఝల్ పరముగ నుండుటచే హకారమునకు ఢకారము-'లిఢ్ + భ్యామ్'. 'స్వాదిష్వసర్వనామస్థానే' అను సూత్రముచే (164) 'లిఢ్'అనునది పదసంజ్ఞకము గాన 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే (67) జశ్త్వము-'లిడ్భ్యామ్'అను రూపము సిద్ధించును. 'లిడ్భిః' 'లిడ్భ్యః' అను రూపములందు గూడ నిదియే ప్రక్రియ.
ఏ','ఙస్','ఓస్','ఙి'లు పర మగునపుడు విశేషకార్యము లేవి యును లేవు
హః','లిహోః','లిహి' అను రూపములు సిద్ధించును.

సప్తమీబహువచనమున 'లిహ్ + సు' అని యుండగా ఢత్వ,జశ్త్వములచే 'లిడ్ + సు' అని యుండ 'డః సి ధుట్' అను సూత్రముచే (84) ధుడాగమము- 'లిడ్ + ధ్సు'-'ఖరి చ' అను సూత్రముచే (74) చర్త్వము-'లిడ్ + త్సు', డకారమునకు మరల చర్త్వముచే టకారము 'లిట్త్సు' అను రూపము. ధుడాగమము రాని పక్షమున 'లిడ్ + సు' అని యుండ 'ఖరి చ' అను (74) చర్త్వముచే టకారము చేయ 'లిట్సు' అను రూపము సిద్ధించును.

హలంతశబ్దములందు అజాదివిభక్తిప్రత్యయములు పర మగునపుడు రుత్వవిసర్గాదిసాధారణకార్యములు తక్క విశేషకార్యము లేవియు సాధారణముగ నుండవు. 'భ్యామ్', 'భిస్', 'భ్యస్'లు పర మగునపుడు గూడ జశ్త్వ,చర్త్వ, విసర్గసంధ్యాదికార్యములు వచ్చుచుండును. ఈ మూడుప్రత్యయములు పర మగునపుడు ప్రక్రియ ఒకే విధముగ నుండును.

హకారాంతపుంలింగశబ్ద మగు 'దుహ్'శబ్దము (పిదుకువాడు) ప్రథమైకవచనమున హల్ఙ్యాదిసూత్రముచే (179) 'స్'లోపింప 'దుహ్'అని యుండగా-

252. దాదేర్ధాతోర్ఘః 8.2.32

ఝలి పదాన్తే చోపదేశే దాదేర్ధాతోర్హస్య ఘః.

'ఝలో ఝలి సవర్ణే' 'స్కోః సంయోగాద్యోరన్తే చ' 'హో ఢః'అను సూత్రములనుండి 'ఝలి' 'అన్తే' 'హః' అనువర్తించును. 'పదస్య' అధికారము. ఉపదేశమునందు దకారాదిగ నుండు ధాతువు హకారమునకు 'ఝల్'పర మగునపుడును, పదాంతమునందును ఘకారము వచ్చును.

ఈ సూత్రముచే 'ఘ'కారాదేశము చేయగా 'దుఘ్'అని యుండగా-

253. ఏకాచో బశో భష్ ఝషన్తస్య స్ధ్వోః 8.2.37

ధాత్వవయవస్యైకాచో ఝషన్తస్య బశో భష్, సే, ధ్వే పదాన్తే చ.

'పదస్య'అధికారము. పై సూత్రము నుండి 'ధాతోః'అను పదము. 'స్కోః సంయోగాద్యోరన్తే చ' నుండి 'అన్తే' అనువర్తించును. ధాత్వవయవమును, ఏకాచ్కమును,ఝషంతమును అగు శబ్దముయొక్క 'బశ్'కు సకార'ధ్వ'శబ్దములు పర మగునపుడును, పదాంతమునందును 'భష్'ఆదేశ మగును.

ఇచట 'దుఘ్'అనునది ధాతువు. ఐనను 'రాహోః శిరః'ఇత్యాది స్థలము లందు వలె వ్యపదేశివద్భావముచే ఇదియే ధాత్వవయవము. ఇది ఏకాచ్కము, ఝషంతము. కావున 'దీని' 'బశ్'అగు 'ద'కారమునకు ఆంతరతమ్యముచే 'ధ' కారరూప మగు 'భష్'ఆదేశముగ వచ్చినది. 'ధుఘ్'అని యుండ అంత్యఘ కారమునకు 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే (67) జశ్త్వము.'వావసానే' అను సూత్రముచే (146) వికల్పముగ చర్త్వమును చేయుటచే 'ధుక్''ధుగ్' అను రూపములు నిష్పన్నమైనవి. అజాదివిభక్తులు పరమగునపుడు విశేష కార్యములు లేవు 'భ్యామ్', 'భిస్', 'భ్యస్'లు పర మగునపుడు 'ఝల్'పర మగుటచే హకారమునకు ఘకారము (సూ. 252), దకారమునకు భష్భావము, (సూ. 253). జశ్త్వముచే ఘకారమునకు గకారమును చేయగా 'ధుగ్భ్యామ్' 'ధుగ్భిః''ధుగ్భ్యః'అను రూపములు సిద్ధించును.

సప్తమీబహువచనమున 'దుహ్ + సు'అని యుండగా ఘత్వభష్భావము లచే 'ధుఘ్ + సు'అని యుండును. ఘకారమునకు జశ్త్వముచే గకారము-'ధుగ్ + సు','ఖరి చ'అను సూత్రముచే (74) గకారమునకు చర్త్వముచే కకారము, 'ధుక్ + సు', 'సు'కవర్గీయవర్ణముకంటె పరముగ నుండుటచే 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము. కకారషకారములు కలసినపుడు క్షకార మగును గాన 'ధుక్షు'అను రూపము సిద్ధించును.

254. వా ద్రుహ,ముహ,ష్ణుహ్ష్ణిహామ్. 8.2.33

ఏషాం హస్య వా ఘో ఝలి పదాన్తే చ. ధ్రుక్, ధ్రుగ్; ధ్రుట్, ధ్రుడ్ ద్రుహౌ, ద్రుహః, ధ్రుగ్భ్యామ్, ధ్రుడ్భ్యామ్, ధ్రుక్షు, ధ్రుట్త్సు, ధ్రుట్సు. ఏవం ముక్, ముగ్ ఇత్యాది.

'దాదేర్ధాతోర్ఘః'అను సూత్రమునుండి 'ఘః'అను పదము,ఆ సూత్రము నందు వలె 'ఝలి', 'పదస్య' 'అన్తే'అను పదములను అనువర్తించును. ద్రుహ్, ముహ్, ష్ణుహ్, ష్ణిహ్ధాతువుల హకారమునకు ఝల్ పర మగునపుడును. పదాంతమునందును వికల్పముగ ఘకార మాదేశ మగును.

ప్రథమైకవచనమున 'ద్రుహ్ + సు'అని యుండగా హల్ఙ్యాదిలోపము (సూ. 179) 'ద్రుహ్',ఇప్పటి సూత్రముచే ఘకారము చేయగా-'ద్రుఘ్',దకార మునకు భష్భావముచే (253) ధకారము-'ధ్రుఘ్'. ఇచట జశ్త్వ-వైకల్పిక చర్త్వములచే 'ధ్రుక్' 'ధ్రుగ్'అను రూపములు సిద్ధించును. ఘత్వాభావపక్ష

మున ధత్వము చేసిన (251) పిమ్మట ఝషంతము గాన భష్భావముచే ధకా రము:ధకారమునకు జశ్త్వ,వైకల్పికచర్త్వములచే 'ధ్రుట్', 'ధ్రుడ్' అను రూపములు సిద్ధించును.

హలాదివిభక్తులు పర మగునపుడు పైన చూపిన విధమున 'లిహ్' 'ద్రుహ్'శబ్దములందు వలె రూపములు సిద్ధించుటచే (ఘకార ధకారవిక ల్పము) రెండేసి రూపము లుండును ఇట్లే 'ముహ్'శబ్దాదులకు గూడ 'ముక్' 'ముగ్''ముట్''ముడ్'ఇత్యాదిరూపములు సిద్ధించును.

255 ధాత్వాదేః షః సః 6.1.64

స్నుక్, స్నుగ్, స్నుట్, స్నుడ్. ఏవం స్నిక్, స్నిగ్, స్నిట్, స్నిడ్ ఇత్యాది. విశ్వవాట్-విశ్వవాడ్. విశ్వవాహౌ, విశ్వవాహః; విశ్వవాహమ్, విశ్వవాహౌ.

ధాత్వాదియం దున్న షకారమునకు సకార మాదేశ మగును.

'ష్ణుహ్' 'ష్ణిహ్'ధాతువుల ఆదియం దున్న షకారమునకు ఈ సూత్రముచే సకార మాదేశ మగును. షకార మున్నపుడు 'రషాభ్యాంనో ణః సమానపదే' అను సూత్రముచే (267) నకారమునకు ణత్వము వచ్చినది. ఆ షకారము పోయినతోడనే "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః" (నిమిత్తము తొలగ గనే దాని నాధారముగ చేసికొని వచ్చిన కార్యము కూడ తొలగును) అను న్యాయము ననుసరించి ణత్వము గూడ పోవును. 'స్నుహ్', 'స్నిహ్'అను రూప ములు శేషించును. ఇవు డీశబ్దములు ఘత్వధత్వవికల్పముచే 'ద్రుహ్'శబ్దము వలె నుండును.

విశ్వం వహతిఅను నర్థము గల 'విశ్వవాహ్'శబ్దము ప్రథమైకవచనమున లిట్ఛబ్దమునందు వలె 'విశ్వవాట్, విశ్వవాడ్,అను రూపములు సిద్ధించును. 'ఔ', జస్', 'అమ్', 'ఔట్'లు పర మగునపుడు 'విశ్వవాహౌ, విశ్వవాహః, విశ్వవాహమ్, విశ్వవాహౌ'అను రూపములు సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'విశ్వవాహ్ + శస్'అని యుండ:-

256. ఇగ్యణః సంప్రసారణమ్ 1.1.45

యణః స్థానే ప్రయుజ్యమానః య ఇక్ స సంప్రసారణసంజ్ఞః స్యాత్.

'యణ్'స్థానమున ప్రయోగింపబడు 'ఇక్'సంప్రసారణ సంజ్ఞక మగును.

257 వాహ ఊఠ్ 6.4.32

భస్య వాహః సంప్రసారణం ఊఠ్.

'భస్య'అధికారము. 'వసోస్సంప్రసారణమ్' నుండి 'సంప్రసారణం'అను వర్తించును. భసంజ్ఞక మగు 'వాహ్'కు సంప్రసారణముగ ఊఠ్, వచ్చును.

'ఊఠ్'లోని 'ఠ్'ఇత్సంజ్ఞకము. 'వాహ్'కు 'ఊఠ్' అని మాత్రము చెప్పినచో అలోన్త్యపరిభాషచే (సూ. 21) హకారమునకు రావలసి యుండును. కావున సంప్రసారణమగు విధమున (అనగా 'యణ్'స్థానమున) వచ్చు నని చెప్పుటచే ఈ 'ఊఠ్' 'వాహ్'నందలి వకారస్థానమున వచ్చును. ఇట్లు 'ఊఠ్' చేయగా 'విశ్వఊఆహ్ + శస్'అని యుండును. ఇపుడు-

258 సమ్ప్రసారణాచ్చ 6.1.108

సంప్రసారణాదచి పూర్వరూపమేకాదేశః. వృద్ధిః-'విశ్వౌహః'-ఇత్యాది.

'ఇకో యణచి' 'అమి పూర్వః'అను సూత్రములనుండి 'అచి' 'పూర్వః' అను పదములను 'ఏకః పూర్వపరయోః'అను నధికారసూత్రమును అనువర్తించును. సంప్రసారణముకంటె అచ్చు పర మగునపుడు పూర్వరూపము ఏకాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే 'ఊ' 'ఆ'లకు పూర్వరూపముచే 'విశ్వఊహ్ + అస్' అని యుండ 'ఏత్యేధత్యూఠ్సు'అను సూత్రముచే (34) అకార ఊకారములకు వృద్ధియు,సకారమునకు రుత్వవిసర్గములను చేయ 'విశ్వౌహః'అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు పై విధముగనే ఊఠ్,పూర్వరూప,వృద్ధులచే 'విశ్వౌహా' 'విశ్వౌహే'ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాది విభక్తులందు లిట్పృబ్దమునందు వలె రూపనిష్పత్తి యుండును.

'అనడుహ్' (ఎద్దు) శబ్దమునకు ప్రథమైకవచనమున 'అనడుహ్ + సు' అని యుండగా:-

259 చతురనడుహోరాముదాత్తః 7.1.98

అనయోరామ్ స్యాత్ సర్వనామస్థానే పరే;స చోదాత్తః --

ఇతోఽత్సర్వనామస్థానే' నుండి 'సర్వనామస్థానే' అనువర్తించును.

'చతుర్'శబ్ద'అనడుహ్'శబ్దములకు సర్వనామస్థానము పర మగునపుడు 'ఆమ్' ఆగమము వచ్చును; అది యుదాత్త మగును.

'ఆమ్' మిత్ గాన 'మిదచో న్త్యాత్పరః'అను పరిభాషాసూత్రము (240) ననుసరించి 'అనడుహ్'లోని అంత్యాచ్ అగు ఉకారమునకు పరముగ వచ్చును- 'అనడు + ఆహ్ + స్', యణాదేశము- 'అనడ్వాహ్ + స్'అని యుండగా:-

260 సావనడుహః 7.1.82

అస్య నుమ్ స్యాత్ సౌ పరే. అనడ్వాన్.

'ఆచ్ఛీనద్యోర్నుమ్' నుండి 'నుమ్'అనువర్తించును. అనడుహ్ శబ్దమునకు 'సు'పర మగునపుడు 'నుమ్'ఆగమము వచ్చును.

'నుమ్'(న్)మిత్ గాన 'అనడ్వాహ్'అను శబ్దమునందలి అంత్యాచ్ అగు 'ఆ'కు పరముగ వచ్చుటచే 'అనడ్వాన్హ్ + స్'అని యుండును. 'హల్ఙ్యాబ్భ్యః' అను సూత్రముచే (179) 'స్'లోపించును. 'సంయోగాన్తస్య లోపః' అను సూత్రముచే (20) హకారము లోపించును. 'అనడ్వాన్'అను రూపము సిద్ధించును. సంబుద్ధియందు 'హే అనడుహ్ + సు'అని యుండగా-

261 అమ్ సమ్బుద్ధౌ 7.1.99

హే అనడ్వన్; అనడ్వాహౌ, అనడ్వాహః. అనడుహః, అనడుహా.

'చతురనడుహోరాముదాత్తః' నుండి 'చతురనడుహోః' అనువర్తించును. 'చతుర్' 'అనడుహ్'శబ్దములకు సంబుద్ధి పర మగునపుడు 'అమ్' ఆగమము వచ్చును.

'అమ్'మిత్ గాన వెనుకటి వలెనే అంత్యాచ్కంటె పరముగ వచ్చి యణాదేశముచే 'హే అనడ్వహ్ + స అని యుండ నుమాగమము (సూ. 260)- 'హేఅనడ్వన్హ్ + స్', సకారహకారములకు పూర్వమునందు వలె లోపము 'హేఅనడ్వన్'అను రూపము సిద్ధించును. ఇచట 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నలోపమును శంకింప రాదు. నలోపశాస్త్రదృష్టిలో 'సంయోగాన్తస్య లోపః'అను శాస్త్రము (20) అసిద్ధము గాన హకార మచట ఉన్నటులనే గోచరించుచు నుండును.

సర్వనామస్థానసంజ్ఞకము లగు మిగిలిన నాలుగు విభక్తులందును (ఔ, జస్, అమ్, ఔట్) ఆమాగమము వచ్చుటచే 'అనడ్వాహౌ' అనడ్వాహః, అనడ్వాహమ్, అనడ్వాహౌ'అను రూపములు సిద్ధించును. 'శస్' మొదలగు అజాదివిభక్తులందు విశేషకార్య మేమియు లేదు గాన-'అనడుహ్ + అస్'- 'అనడుహః'ఇత్యాదిరూపము లగును.

'భ్యామ్' మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు—

262 వసుస్రంసుధ్వంస్వనడుహాం దః 8.2.72

సాన్తవస్వన్తస్య స్రంసాదేశ్చ దః స్యాత్ పదాన్తే. అనడుద్భ్యామ్ ఇత్యాది. సాన్తేతి కిమ్? విద్వాన్. పదాన్తే కిమ్? స్రస్తమ్. ధ్వస్తమ్.

'ససజుషోరుః' నుండి 'స'అను లుప్తషష్ఠీకపదము, 'పదస్య'అను నధికారసూత్రమును అనువర్తించును. 'వసు'అనునది ప్రత్యయము గాన 'ప్రత్యయగ్రహణే తదన్తా గ్రాహ్యాః'అను నియమముచే వసుప్రత్యయాన్త మను నర్థము వచ్చును. సకారాంత మగు వసుప్రత్యయాంతశబ్దమునకును, స్రంస్, ధ్వంస్,అనడుహ్ అను శబ్దములకును పదాంతమున దకార మాదేశ మగును. (స్రంస్,ధ్వంస్‌లు ధాతువులు).

'అనడుహ్ + భ్యామ్'ఇత్యాదిస్థలములందు హలాదివిభక్తులు పర మగుటచే 'స్వాదిష్వసర్వనామస్థానే'అను సూత్రముచే (164) 'అనడుహ్'అను దానికి పదసంజ్ఞ యున్నది గాన ఈ సూత్రముచే హకారమునకు దకార మాదేశముగవచ్చి 'అనడుద్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును. సప్తమీబహువచనమున 'ఖరి చ'అను సూత్రముచే చర్త్వము (74) చేయగా 'అనడుత్సు'అను రూపము సిద్ధించును.

వసుప్రత్యయాంతము సకారాంతముగనే యుండునుకదా? 'సాన్తస్య' అను విశేషణ మెందులకు? 'విద్వాన్'అనునపుడు ఈ సూత్రము ప్రవర్తించకుండుటకు. 'వసు' ప్రత్యయాంత మగు 'విద్వస్' శబ్దప్రథమైకవచనమున 'విద్వాన్' అని యగును. ఇది వసుప్రత్యయాంతమే కాని సకారాంతము కాదు. కావుననే ఈ సూత్రముచే ఇచట దకారాదేశము రాలేదు. 'పదాన్తే' అననేల?- 'స్రస్తమ్', 'ధ్వస్తమ్'అను స్రంస్' 'ధ్వంస్' ధాతువుల క్తప్రత్యయాంతరూప

ములందు సకారమునకు దకారము రాకుండుట దీని ప్రయోజనము. ఇందలి సకారము పదాంతగతము కాదు గాన దకారాదేశము రాదు.

'తురాసాహ్' (దేవేంద్రుడు) శబ్దప్రథమైకవచనమున 'తురాసాహ్ + స్'అనునపుడు సులోప, ఢత్వ, జశ్త్వములచే 'తురాసాద్'అని యుండ-

263 సహేస్సాడః సః 8.3.56

సాడ్రూపస్య సహేః సస్య మూర్ధన్యాదేశః. తురాషాట్, తురాషాడ్. తురాసాహౌ, తురాసాహః. తురాషాడ్భ్యామ్ ఇత్యాది.

'అపదాన్తస్య మూర్ధన్యః'నుండి 'మూర్ధన్యః'అను వర్తించును. 'సాట్' అను రూపమున నున్న సహధాతువు సకారమునకు మూర్ధన్య మగు షకారమాదేశ మగును.

ఇచట 'సహ్'ధాతువు 'సాట్'అను రూపమున నున్నది గాన ఈ సూత్రముచే షకారము. 'తురాషాట్', 'తురాషాడ్.' అజాదివిభక్తులు పర మగునపుడు 'సాహ్'అను రూపమే కాని 'సాట్'అను రూపము లేదు గాన షత్వము రాదు. ఢత్వమున కవకాశ మున్న ఝలాదివిభక్తులు ('భ్యామ్'మొదలగునవి) పర మగునపుడు షత్వము వచ్చుటచే 'తురాషాడ్భ్యామ్'ఇత్యాదిరూపము లగును. ప్రక్రియ లిట్పృష్ఠమునందు వలె ఉండును.

వకారాన్త మగు 'సుదివ్'శబ్దము (శోభనా ద్యౌః యస్య సః) ప్రథమైకవచనమున 'సుదివ్ + స్'అని యుండగా :-

264 దివ ఔత్ 7.2.84

దివ ఇతి ప్రాతిపదికస్య 'ఔత్'స్యాత్ సౌ. సుద్యౌః, సుదివౌ.

'సావనడుహః' నుండి 'సౌ'అనువర్తించును. దివ్ అను ప్రాతిపదికకు 'సు'పర మగునడు 'ఔత్' ఆదేశముగ వచ్చును.

'ఔత్' నందలి 'త'కార ముచ్చారణార్థము అలోన్త్యపరిభాషచే (21) ఔకారము అన్త్యవర్ణ మగు వకారస్థానమున వచ్చును-'సుది + ఔ + స్', యణాదేశము; సకారమునకురుత్వవిసర్గములు-'సుద్యౌః'. అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియును లేవు. 'భ్యామ్' మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు పదసంజ్ఞ యున్నది గాన:-

265 దివ ఉత్ 6.1.131

దివోఽన్తాదేశః ఉకారః స్యాత్ పదాన్తే. సుద్యుభ్యామ్-ఇత్యాది. చత్వారః;చతురః,చతుర్భిః, చతుర్భ్యః 2.

'ఏజఃపదాన్తాదతి' నుండి పదాన్తాత్'అను పద మనువర్తించును. 'దివ్' శబ్దమునకు పదాంతమున ఉకార మంతాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే వకారమునకు ఉకార మాదేశమై యణాదేశము చేయుటచే-'సుద్యుభ్యామ్' ఇత్యాది రూపములు సిద్ధించును.

నిత్యబహువచనాంత మగు 'చతుర్'శబ్దప్రథమాబహువచనమున 'చతుర్ + జస్'అని యుండగా 'చతురనడుహో రాముదాత్తః'అను సూత్రముచే (259) 'ఆమ్'ఆగమము. మిత్ కావున 'మిదచోఽన్త్యాత్పరః' అనుసూత్రముచే (240) అంత్యాచ్చునకు పరముగ వచ్చి చతు + ఆ + ర్ + అస్'అని యుండును. యణాదేశమును,సకారమునకు రుత్వవిసర్గములును చేయ 'చత్వారః' అను రూపము సిద్ధించును.

తృతీయాబహువచనమున 'చతుర్ + అస్' = చతురస్, సకారమునకు రుత్వవిసర్గములు-చతురః. 'శస్'కు సర్వనామస్థానసంజ్ఞ లేదు గాన 'ఆమ్' ఆగమము రాదు. తృతీయా, చతుర్థీ, పంచమీబహువచనములందు విశేషకార్యము లేవియును లేవు. షష్ఠీబహువచనమున 'చతుర్ + ఆమ్'అని యుండగా-

266 షట్చతుర్భ్యశ్చ 7.1.55

ఏభ్య ఆమో నుడాగమః.

'ఆమి సర్వనామ్నః సుట్' 'హ్రస్వనద్యాపో నుట్' అను సూత్రముల నుండి 'ఆమి' 'నుట్' అనువర్తించును. షట్సంజ్ఞకములకంటెను 'చతుర్' శబ్దముకంటెను బర మగు 'ఆమ్'కు నుడాగమము వచ్చును.

'చతుర్ + నామ్' అని యుండగా:-

267 రషాభ్యాం నో ణః సమానపదే 8.4.1

అచో రహాభ్యాం ద్వే (60)-చతుర్ణ్ణామ్, చతుర్ణా .

ఏకపదమునందున్న రేఫషకారములకంటె పర మగు నకారమునకు ణకారము వచ్చును.

ఈ సూత్రముచే నకారమునకు ణకారము. 'చతుర్ + ణామ్'అని యుండగా 'అచో రహాభ్యాంద్వే'అను సూత్రముచే (60) ద్విత్వవికల్పము 'చతుర్ణ్ణామ్''చతుర్ణామ్'అను రెండు రూపములు సిద్ధించును.

సప్తమీబహువచనమున 'చతుర్ + సు'అని యుండగా 'ఖరవసానయోర్విసర్జనీయః'అను సూత్రముచే రేఫకు ఖర్ పర మగుటచే విసర్గము రావలసియుండ:-

## 268. రోః సుపి 8.3.16

రోరేవ విసర్గః సుపి. షత్వమ్. షస్య ద్విత్వే ప్రాప్తే.

'ఖరవసానయోర్విసర్జనీయః' నుండి 'విసర్జనీయః' అనువర్తించును. 'సుప్' (సప్తమీబహువచనప్రత్యయము) పర మగునపుడు 'రు'కు మాత్రమే విసర్గము వచ్చును (అన్యరేఫకు కాదు).

ఇచట 'చతుర్'లోని రేఫ సహజము గాన(రుసంబంధమైనది కాదు గాన) ఈ నియమముచే విసర్గము రాదు. 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వము-'చతుర్షు'. ఇచట 'అచో రహాభ్యాం ద్వే' అను సూత్రముచే (60) తకారోత్తరవర్తి యగు 'అచ్'కంటె పర మగు రేఫకంటె పర మైన షకారమునకు ద్విత్వము రావలసి యుండగా:-

## 269. శరోఽచి 8.4.49

అచి పరే శరో న ద్వే స్తః. చతుర్షు.

'అచో రహాభ్యాం ద్వే' "నాదిన్యాక్రోశేపుత్రస్య" అను సూత్రముల నుండి 'ద్వే''న'అనువర్తించును. అచ్ పర మగునపుడు 'శర్'కు ద్విత్వము రాదు.

ఇచట షకారమునకు ఉకారరూప మగు అచ్ పరముగ నున్నది గాన ఈ సూత్రముచే ద్విత్వము నిషిద్ధ మైనది. 'చతుర్షు'అను రూపము సిద్ధించును.

మకారాంత మగు 'ప్రశామ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'ప్రశామ్ + స్'అని యుండ 'హల్ఙ్యాదిలోపము (సూ.179)-'ప్రశామ్'అని యుండగా:-

## 270 మో నో ధాతోః 8.2.64

ధాతోర్మస్య నః స్యాత్ పదాన్తే. ప్రశాన్.

పదాంతమునందు ధాతువు మకారమునకు నకార మాదేశ మగును.

ఈ సూత్రముచే మకారమునకు నకారాదేశము రాగా 'ప్రశాన్'అను రూపము సిద్ధించును.అజాదివిభక్తులు పరః మగునపుడు 'ప్రశామౌ''ప్రశామః'ఇత్యాది రూపము లగును. 'భ్యామ్'మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు 'స్వాదిష్వసర్వనామస్థానే'అను సూత్రముచే (164) పదసంజ్ఞ యున్నది గాన మకారమునకు నకారాదేశము వచ్చి 'ప్రశాన్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును.

మకారాంత మగు 'కిమ్'శబ్దమునకు స్వాదిప్రత్యయములను చేర్చగా:-

## 271. కిమః కః 7.2.103

కిమః కః స్యాద్విభక్తౌ. కః కౌ, కే, ఇత్యాది. శేషం సర్వవత్,

'అష్టన ఆ విభక్తౌ'నుండి 'విభక్తౌ'అనువర్తించును. 'కిమ్'శబ్దమునకు విభక్తిప్రత్యయము పరః మగునపుడు 'క'అను నాదేశము వచ్చును.

ఇట్లు 'క' ఆదేశము వచ్చుటచే 'కిమ్'శబ్దము అకారాంత మైనది గాన దీనికి సర్వశబ్దమునందు వలె 'కః,కౌ,కే,' ఇత్యాదిరూపములు సిద్ధించును.

మకారాంత మగు 'ఇదమ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'ఇదమ్ + సు' అని యుండ 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) మకారమునకు అకారము రావలసి యుండగా:-

## 272. ఇదమో మః 7.2.108

సౌ. త్యదాద్యత్వాపవాదః.

'తదోః సః సావనన్త్యయోః' నుండి 'సౌ'అనువర్తించును. 'ఇదమ్' శబ్దమునకు 'సు'పర మగునపుడు మకారము వచ్చును. అలోన్త్యపరిభాషచే (21) ఈ మకారము అంత్యవర్ణ మగు మకారము స్థానమున వచ్చును. అనగా మకారము మకారముగనే యుండును గాని 'త్యదాదీనామః' అను సూత్రముచే (193) అకారము రాదని యర్థము.

## 273. ఇదోఽయ్ పుంసి 7.2.111

ఇదమ ఇదోఽయ్ సౌ పుంసి. అయమ్. త్యదాద్యత్వే-

'యః సౌ'నుండి 'సౌ', వెనుకటి సూత్రమునుండి 'ఇదమః'అనువర్తించును. 'సు'పర మగునపుడు 'ఇదమ్'నందలి 'ఇద్'అను దానికి 'అయ్'అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఇద్'కు 'అయ్'ఆదేశము వచ్చి అయ్ + అమ్ + స్ = 'అయమ్స్'అని యుండ హల్ఙ్యాబిలోపముచే (179) 'అయమ్'అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వివచనమున 'ఇదమ్' + ఔ'అని యుండ 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) మకారమునకు అత్వము-'ఇద + అ + ఔ' అని యుండ:-

274. అతో గుణే 6.1.97

అపదాన్తాదతో గుణే పరరూపమేకాదేశః.

'ఉస్యపదాన్తాత్' 'ఏఙి పరరూపమ్'అను సూత్రములనుండి 'అపదాన్తాత్' 'పరరూపమ్'అను పదములను, 'ఏకః పూర్వపరయోః'అను అధికారసూత్రమును అనువర్తించును. అపదాంత మగు 'అత్'కు (హ్రస్వ'అ'కారమునకు) గుణము (అ,ఏ,ఓ లు) పర మగునపుడు పరరూప మేకాదేశ మగును.

ఈ సూత్రముచే దకారోత్తరవర్తి యగు 'అ'కారమునకును దానికి పర మగు అకారమునకును పరరూపమగు అకార మేకాదేశమై వచ్చి 'ఇద + ఔ' అని యుండ:-

275. దశ్చ 7.2.109

ఇదమో దస్య మః స్యాద్విభక్తౌ.ఇమౌ,ఇమే. త్యదాదేః సమ్బోధనం నాస్తీత్యుత్సర్గః.

'అష్టన ఆ విభక్తౌ' నుండి మండూకప్లుతిచే 'విభక్తౌ'అను పదము, 'ఇదమో మః'అను సూత్రమును అనువర్తించును. విభక్తి ప్రత్యయము పర మగునపుడు 'ఇదమ్'లోని దకారమునకు మకార మాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే దకారమునకు మకారాదేశము,పిదప వృద్ధియు, వచ్చుటచే 'ఇమౌ'అను రూపము సిద్ధించును

ప్రథమాబహువచనమున 'ఇదమ్ + జస్'అని యుండ పైన చూపిన విధముగ అత్వ,పరరూప,మకారాదేశములు చేయ 'ఇమ + జస్'అని యుండును. 'జసఃశీ'అను సూత్రముచే (152) 'జస్'కు 'శీ'(ఈ) ఆదేశము. గుణసంధి- 'ఇమే'అను రూపము సిద్ధించును.

త్యదాదిశబ్దములకు సంబోధనప్రథమ యుండ దని సామాన్య నియమము. ఓవీడా! ఓవాడా!అని పిలచుట యుండదు కదా?

ద్వితీయవిభక్తియందు అత్వ, పరరూప,మకారాదేశములు చేసిన పిదప 'ఇమ'అని యుండుటచే సర్వశబ్దమునందు వలె 'ఇమమ్, ఇమౌ, ఇమాన్' అను రూపములు సిద్ధించును.

276. అనాప్యకః 7.2.112

అకకారస్యేదమః ఇదోఽన్ ఆపి విభక్తౌ. ఆబితి ప్రత్యాహారః. అనేన.

అన్, ఆపి, అకః. 'ఇదమో మః' 'ఇదోఽయ్ పుంసి' 'అష్టన ఆ విభక్తౌ'అను సూత్రములనుండి 'ఇదమః' 'ఇదః' 'విభక్తౌ'అనువర్తించును. కకారము లేని 'ఇదమ్'శబ్దమునందలి 'ఇద్'కు 'ఆప్'విభక్తి పర మగునపుడు 'అన్'అను నాదేశము వచ్చును.

'ఆప్'అనునది తృతీయైకవచన విభక్తి యగు 'టా'లోని 'ఆ'మొదలు 'సుప్'లోని పకారము వరకును ప్రత్యాహారము. కావున తృతీయాదివిభక్తు లని యర్థము.

అనేన:- 'ఇదమ్ + టా'అని యుండ 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) అత్వము, 'అతో గుణే'అను సూత్రముచే (271) పరరూపము చేయగా 'ఇద + టా'అని యుండును. ఇపుడు 'దశ్చ'అను సూత్రమును (275) బాధించి ఈ సూత్రముచే 'ఇద్'అనుదానికి 'అన్'అను నాదేశము-'అన + టా','టాఙసి-' అను సూత్రముచే (140) 'టా'కు 'ఇన'ఆదేశము-'అన + ఇన'- గుణము- 'అనేన'అను రూపము సిద్ధించును.

ద్వివచనమున అత్వ,పరరూపములచే 'ఇద + భ్యామ్'అని యుండగా 'దశ్చ'అను సూత్రముచే (275) మకారాదేశమును బాధించి 'అనాప్యకః'అను సూత్రముచే (276) 'ఇద్'కు 'అన్' రావలసి యుండగా:-

277. హలి లోపః 7.2.113

అకకారస్యేదమ ఇదో లోప ఆపి హలాదౌ.

'ఇదమో మః' 'ఇదోఽయ్ పుంసి' 'అష్టన ఆ విభక్తౌ' 'అనాప్యకః' అను సూత్రములనుండి 'ఇదమః' 'ఇదః' 'విభక్తౌ' 'ఆపి' 'అకః' అనువర్తించును. హలాది యగు 'ఆప్' విభక్తులు పర మగునపుడు కకారరహిత మగు 'ఇదమ్'లోని 'ఇద్'కు లోపము వచ్చును.

ఈ సూత్రముచే ఇచట హలాది విభక్తిప్రత్యయము పరముగ నున్నదిగాన 'ఇద్'కు లోపము వచ్చును.కాని అలోన్త్యపరిభాషచే (21) 'ఇద్'లో అంత్యవర్ణ మగు 'ద్'కు మాత్రము లోపము రావలసి యుండగా:-

(పరిభాష) నానర్థకేఽలోన్త్యవిధిరనభ్యాసవికారే.

అభ్యాసవికారవిషయమున తక్క ఇతరస్థలములందు అర్థశూన్య మగు వర్ణసంఘాతవిషయమున అలోన్త్యవిధి ప్రవర్తించదు.

'ఇదమ్'అనునది అర్థవంతము కాని 'ఇదమ్'లోని 'ఇద్'అర్థశూన్యము గాన దాని విషయమున పై పరిభాషచే అలోన్త్యపరిభాషా ప్రవృత్తి నిషిద్ధమైనది. కావున పై సూత్రముచే 'ఇద్ అను వర్ణసంఘాతమునకంతకును లోపము. (ధాత్వాదులను ఆవృత్తి చేసినపుడు మొదటి రూపమునకు అభ్యాస మని పేరు. దానికి విధించు కార్యముల విషయమున నీ పరిభాష ప్రవర్తించదు).

'అ+భ్యామ్'అని యుండగా 'సుపి చ'అను సూత్రముచే (141) దీర్ఘము 'ఆభ్యామ్'అను రూపము సిద్ధించును.కాని ఇచట 'అ+భ్యామ్'అని యుండగా 'అ'అనునది అకారమే గాని అదన్తాంగము కాదు గాన అదంతాంగము నకు విహిత మగు దీర్ఘ మెట్లు వచ్చును? అను సందేహము కలుగును. అందులకై ఈ క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

278. ఆద్యన్తవదేకస్మిన్ 1.1.21

ఏకస్మిన్ క్రియమాణం కార్యమాదావివాన్త ఇవ స్యాత్. 'సుపి చ' ఇతి దీర్ఘః-ఆభ్యామ్-3.

ఒకదాని విషయమున చేయబడు కార్యము తదాదియందు వలె తదంతము నందు వలె అగును.అనగా తదాదితదంతములకు (ఏదైన అక్షరము మొదలగు నది ఆదియందు కలదానికి గాని అంతమందు కలదానికి గాని) చేయబడు కార్యము తదాదితదంతములకు వలె అవి (అక్షరాదికము) ఆద్యంతములందు గాక స్వతంత్రముగ నున్నపుడు గూడ ప్రవర్తించును అని యర్థము.

ఇచట 'అ'అనునది ఏ అంగమునకును అంతమునందు లేక ఏకవర్ణ రూపముననే ఉన్నను అదర్ణాంతముగ పరిగణింపబడును.కావున 'సుపి చ'అను సూత్రముచే దీర్ఘము వచ్చుటకు అవకాశ మున్నది గాన 'ఆభ్యామ్'అను రూపము సిద్ధించును. ఈ సూత్రముచే ప్రతిపాదిత మగు కార్యమునకు వ్యపదేశ

వద్భావ మని పేరు. 'దేవదత్తస్య ఏకః పుత్రః-స ఏవ జ్యేష్ఠః,స ఏవ కనిష్ఠః' అను లౌకికన్యాయము ననుసరించి ఆవశ్యకతానుసారముగ అకారమే అకారాంతముగను అకారాదిగను, కేవలఅకారముగను పరిగణింపబడును.

తృతీయాబహువచనమున 'ఇదమ్ + భిస్'అని యుండగా త్యదాద్యత్వ, పరరూపములను 'హలి లోపః'అను సూత్రముచే (278) 'ఇద్'కు లోపమును చేయగా 'అ + భ్యామ్'అని యుండును. ఇచట 'అ'అనునది వ్యపదేశివద్భావముచే అదన్తాంగము గాన 'అతో భిస ఐస్'అను సూత్రముచే (142) 'భిస్'కు 'ఐస్' రావలసి యుండగా:-

279. నేదమదసోరకోః 7.1.11

అకకారయోరిదమదసోర్భిస ఐస్ న. ఏభిః, అస్మై. ఏభ్యః-2, అస్మాత్, అస్య, అనయోః-2, ఏషామ్, అస్మిన్, ఏషు.

'అతో భిస ఐస్' నుండి 'భిసః''ఐస్' అనువర్తించును. కకారరహితము లగు 'ఇదమ్' 'అదస్' శబ్దములకంటె పర మగు 'భిస్'కు 'ఐస్ అను నాదేశము రాదు.

ఈ సూత్రముచే 'ఐస్'నిషిద్ధ మైనది గాన 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) అకారమునకు ఏకారాదేశము, సకారమునకు రుత్వవిసర్గములు చేయ 'ఏ భిః'అను రూపము సిద్ధించును.

అస్మై:- 'ఇదమ్ + ఙే'అని యుండగా త్యదాద్యత్వపరరూపములచే 'ఇద + ఙే'అని యుండును. ఇపుడు అదంతాంగముకంటె పరముగా నుండుటచే 'ఙే'కు 'సర్వనామ్నః స్మై' అను సూత్రముచే (153) స్మై ఆదేశము. పిమ్మట 'హలి లోపః'అను సూత్రముచే (278) 'ఇద్'అను భాగము లోపింప 'అస్మై' అను రూపము సిద్ధించినది.

ఏభ్యః:- 'ఇదమ్ + భ్యస్'అని యుండ 'ఏభిః'అను రూపమునందు వలె ప్రక్రియ చూచుకొనవలెను.

అస్మాత్:- 'ఇదమ్ + ఙసి'- త్యదాద్యత్వపరరూపములు, 'ఙసి'కి 'స్మాత్'అను నాదేశము, 'ఇద్'కు లోపము వచ్చుటచే 'అస్మాత్'అను రూపము సిద్ధించును.

అస్య:- 'ఇదమ్ + జస్'అని యుండగా త్యదాద్యత్వపరరూపములు, 'జస్'కు 'స్య'ఆదేశము, 'ఇద్'కు లోపము చేయగా 'అస్య'అను రూపము సిద్ధించినది.

అనయోః:- 'ఇదమ్ + ఓస్'అని యుండగా త్యదాద్యత్వపరరూపములు 'ఇద + ఓస్'అని యుండ 'అనాప్యకః'అను సూత్రముచే (276) 'ఇద్'కు 'అన్' ఆదేశము చేయ 'అన + ఓస్'అని యుండగా 'ఓసి చ'అను సూత్రముచే (147) అకారమునకు ఏకారాదేశము,పిదప అయాదేశము-'అనయోః'అను రూపము సిద్ధించినది.

ఏషామ్:- 'ఇదమ్ + ఆమ్'అని యుండగా త్యదాద్యత్వపరరూపములు- 'ఇద + ఆమ్';ఇపుడు అద న్తాంగముకంటె పర మగుటచే 'ఆమ్'కు 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే (151) సుడాగమము, 'ఇద + సామ్'అని యుండ హలాదివిభక్తి పర మగుటచే 'హలి లోపః'అను సూత్రముచే (278) 'ఇద్'కు లోపము, 'అ + సామ్'అని యుండ 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) ఏకారాదేశము-'ఏ + సామ్', 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) సకారమునకు షత్వము-'ఏషామ్' అను రూపము సిద్ధించును.

అస్మిన్:- 'ఇదమ్ + ఙి'అని యుండ త్యదాద్యత్వపరరూపములు. 'ఙి'కి 'స్మిన్'ఆదేశము,'ఇద్'కు లోపము-'అస్మిన్'అను రూపము సిద్ధించినది.

ఏషు:- 'ఇదమ్ + సు'అని యుండగా త్యదాద్యత్వ,పరరూప,ఇద్ లోపః ఏత్వ, షత్వములచే 'ఏషు'అను రూపము సిద్ధించినది.

## 280. ద్వితీయాటౌస్స్వేనః 2.4.34

ఇదమేతదో రన్వాదేశే.కిఞ్చిత్ కార్యం విధాతుముపా త్తస్య కార్యాన్తరం విధాతుం పునరుపాదానం అన్వాదేశః. యథా-అనేన వ్యాకరణమధీతమ్, ఏనం ఛన్దోఽధ్యాపయ; అనయోః పవిత్రం కులమ్, ఏనయోః ప్రభూతం స్వమ్-ఇతి. ఏనమ్. ఏనౌ, ఏనాన్, ఏనేన, ఏనయోః-2. రాజా.

ద్వితీయాటౌస్సు(టా + ఓస్సు), ఏనః. 'ఇదమోఽన్వాదేశేఽశనుదాత్త స్తృతీయాదౌ' నుండి 'ఇదమః' 'అన్వాదేశే'అను పదములు, 'ఏతదస్త్రతసోః' నుండి 'ఏతదః'అను పదమును అనువర్తించును. అన్వాదేశమునందు 'ఇదమ్'

'ఏతద్'శబ్దములకు ద్వితీయ యందును 'టా''ఓస్'లు పర మగునపుడును. 'ఏన' అను నాదేశము వచ్చును.

ఏదైన నొక విషయమును చెప్పుటకు గ్రహింపబడినదానిని మరల మరి యొక విషయమును చెప్పుటకు పరిగ్రహించుటకు అన్వాదేశ మని పేరు. 'ఈతనిచే వ్యాకరణశాస్త్రము పఠింపబడినది,ఈతనిని చందశ్శాస్త్రము ఛదవింపుము. వీరి కులము పవిత్ర మైనది, వీరికి అధిక మగు ధనము గలదు. ఈ యుదాహరణములందు వ్యాకరణము పఠించి నట్లు చెప్పుటకై ఎవ్వడు గ్రహింపబడెనో యాతనికే ఛందశ్శాస్త్రము బోధింపవలె నని పునర్గ్రహణ మున్నది గాన దానికి అన్వాదేశ మని పేరు. ఇట్లే రెండవ యుదాహరణము. ఈవిధముగ, రెండవసారి పరిగ్రహింపబడిన ఇదమ్ శబ్దమునకు పై యాదేశములు వచ్చును. ఈ సూత్రముచే అన్వాదేశమున 'ఏన'అను నాదేశము జేయ'అమ్, ఔ, శస్,టా, ఓస్' విభక్తిప్రత్యయములు పర మగునపుడు రామశబ్దమునందు వలె 'ఏనమ్' ఇత్యాదిరూపములు సిద్ధించును.

నకారాంత మగు 'రాజన్' శబ్దమునకు ప్రథమైకవచనమున 'రాజన్ + స్'అని యుండగా, 'స్'కు హల్జ్యాదిలోపము (179) 'రాజన్'. 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము, నకారమునకు 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) లోపము. 'రాజా' అను రూపము సిద్ధించును.

281. న ఙిసమ్బుద్ధ్యోః. 8.2.8

నస్య లోపో న ఙౌ సమ్బుద్ధౌ చ. హే రాజన్.

'న లోపః ప్రాతిపదికాన్తస్య'నుండి 'న', 'లోపః' అనువర్తించును. ఙి, సంబుద్ధులు పర మగునపుడు నకారమునకు లోపము రాదు సంబుద్ధియందు 'హే రాజన్ + స్' అని యుండ హల్జ్యాదిసూత్రముచే (179) సకారలోపము చేసిన పిదప 'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నకారలోపము రావలసి యుండ నీ సూత్రముచే నది నిషిద్ధ మైనది. కావున 'హే రాజన్' అను రూపము సిద్ధించును.

వా. ఙావుత్తరపదే ప్రతిషేధో వక్తవ్యః.

బ్రహ్మనిష్ఠః. రాజానౌ, రాజానః, రాజ్ఞః.

ఉత్తరపదము పరముగా గల 'ఙి'పర మగునపుడు ఈ నిషధమునకు.

నకారలోపనిషేధమునకు— నిషేధము చెప్పవలెను. అనగా నకారలోపము వచ్చును. సమాసమునందలి రెండవ పదమునకు ఉత్తరపద మనియు మొదటి పదమునకు పూర్వపద మనియు పేర్లు. 'బ్రహ్మనిష్ఠః' అనునది వ్యధికరణపదబహువ్రీహి సమాసము. అలౌకికవిగ్రహవాక్యమున 'బ్రహ్మన్ + ఙి + నిష్ఠా + సు' అని యుండగా నిది సమాసము గాన 'కృత్తద్ధితసమాసాశ్చ'యను సూత్రముచే (117) ప్రాతిపదికసంజ్ఞకము. కావున 'సుపోధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే (724) ప్రాతిపదికావయవము లగు 'ఙి' 'సు' అను 'సుప్' లకు లోపము- 'బ్రహ్మన్ + నిష్ఠా' అని యుండును. ఇచట 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' అను సూత్రము (190) ననుసరించి 'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను (180) లోపము చేయవలసి యుండ 'న ఙి సమ్బుద్ధ్యోః' అను సూత్రము (281) ఈ నలోపమును నిషేధించుచున్నది. కావున ఈ వార్త్తికము చెప్పబడినది. దీని ననుసరించి ఇచట 'ఙి'అనుదానికి 'నిష్ఠా' అను నుత్తరపదము పరముగా నున్నది గాన నకారలోపనిషేధమునకు (281) నిషేధము. కావున నకారలోపము వచ్చుటచే 'బ్రహ్మనిష్ఠః' అను రూపము సిద్ధించినది.

'ఔ,జస్,అమ్,ఔట్'లు పర మగునపుడు 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177)'రాజన్'అను శబ్దమునందలి ఉపధకు దీర్ఘము వచ్చుటచే 'రాజానౌ' 'రాజానః' 'రాజానమ్' 'రాజానౌ' అను రూపములు సిద్ధించును.

శస్ పర మగునపుడు 'రాజన్ + అస్'అని యుండ 'అల్లోపోఽనః'అను సూత్రముచే (247)'అన్'లోని అకారమునకు లోపము- 'రాజ్న్ + అస్';నకారమునకు శ్చుత్వముచే 'ఞ'కారము. 'జ'కార 'ఞ'కారములు కలసినపుడు 'జ్ఞ' యగును గాన 'రాజ్ఞః' అను రూపము సిద్ధించును.

తృతీయైకవచనమున 'రాజన్ + ఆ'అని యుండ వెనుకటి వలె అల్లోప శ్చుత్వములచే 'రాజ్ఞా' అను రూపము సిద్ధించును. అజాదివిభక్తు లగు 'ఙే' 'ఙసి''ఙస్''ఓస్''ఆమ్'లు పర మగునపుడు ప్రక్రియ నిట్లే యెరుంగునది.

'భ్యామ్','భిస్','భ్యస్','సు'లు పర మగునపుడు 'స్వాదిష్వసర్వనామస్థానే' అను సూత్రముచే (164) పదసంజ్ఞ యున్నది గాన 'రాజన్'లోని నకారమునకు 'న లోపః ప్రాతిపదికాంతస్య' అను సూత్రముచే (180) లోపము. పిదప 'రాజ + భ్యామ్' 'రాజ + భిస్' 'రాజ + భ్యస్' 'రాజ + సు'అని యుండగా మొదటి లక్ష్యమున 'సుపి చ' అను సూత్రముచే (141) అకారమునకు దీర్ఘము;

రెండవ లక్ష్యమున 'అతో భిస ఐస్' అను సూత్రముచే (142) 'ఐస్' ఆదేశము; మూడు నాలుగు లక్ష్యములందు 'బహువచనే ఝల్యేత్' అను సూత్రముచే (145) అకారమునకు ఏకారము రావలసి యుండగా-

282. నలోపః సుప్స్వరసంజ్ఞాతుగ్విధిషు కృతి 8.2.2

సువ్విధౌ, స్వరవిధౌ, సంజ్ఞావిధౌ, కృతి, తుగ్విధౌ చ నలోపోఽసిద్ధః; నాఽన్యత్ర రాజాశ్వ ఇత్యాదౌ. ఇత్యసిద్ధత్వాత్ ఆత్వం, ఏత్వం, ఐస్త్వం చ న. రాజభ్యామ్. రాజభిః, రాజభ్యః—2. రాజ్ఞి-రాజని-రాజసు. యజ్వా. యజ్వానౌ. యజ్వానః.

'పూర్వత్రాసిద్ధమ్' నుండి 'అసిద్ధమ్' అనువర్తించును. సుప్ప్రత్యయవిధి, స్వరవిధి, సంజ్ఞావిధి తుగ్విధులందును, కృత్ ప్రత్యయము పర మగునపుడును మాత్రమే నలోప మసిద్ధ మగును; 'రాజాశ్వః' మొదలగు నితరస్థలములందు అసిద్ధము కాదు.

'పూర్వత్రాసిద్ధమ్' అను సూత్రముచేతనే (31) నలోపమున కసిద్ధత్వము సిద్ధించుచుండ మరల ఈ సూత్రము 'సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి' అను న్యాయముచే 'నకారలోపము అసిద్ధ మగుచో వెనుక చూపిన స్థలములందే యగును గాని ఇతరస్థలములందు కాదు' అను నియమమునకై చెప్పబడినది. కావుననే 'రాజాశ్వః' అను షష్ఠీసమాసమున 'రాజన్ + అశ్వ' అను నపుడు వచ్చిన నకారలోపము 'అకః సవర్ణే దీర్ఘః' అను సూత్రముచే (22) సవర్ణదీర్ఘము చేయవలసి నపుడు 'పూర్వత్రాసిద్ధమ్' అను సామాన్యశాస్త్రముచే (31) అసిద్ధము కావలసి యున్నది. అట్లసిద్ధ మైనచో సవర్ణదీర్ఘశాస్త్రదృష్టికి నకారము కనబడుచుండుటచే దీర్ఘము రాకుండును. కాని ఈ సూత్రముచే పూర్వోక్తనియమము సిద్ధించినది గాన నిచట నకారలోపము అసిద్ధము కాదు. కావున సవర్ణదీర్ఘముచే 'రాజాశ్వః' అను రూపము సిద్ధించును.

ప్రకృతమున (ఆత్వ) దీర్ఘ, ఐస్త్వ, ఏత్వములు సుబ్విధులు గాన (సుబాశ్రితవిధి గాని సుప్స్థానికవిధి గాని సుబ్విధి యనబడును) నలోపము అసిద్ధ మైనది. అదంతాంగము లేక పోవుటచే ఆత్వాదులు రావు. 'రాజభ్యామ్' 'రాజభిః' 'రాజభ్యః' 'రాజసు' అను రూపములు సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'రాజన్ + ఙి' అని యుండ 'విభాషా ఙిశ్యోః' అను సూత్రముచే (248) 'అ' లోపము వైకల్పికము గాన లోపపక్షమున 'రాజ్ఞి' అనియు, తదభావపక్షమున 'రాజని' అనియు రూపములు సిద్ధించును.

యజ్వన్‌శబ్దమున (యాగముచేసినవాడు) మొదటి ఐదు రూపములును రాజన్ శబ్దమునందు వలె నుండును. సంబోధన ప్రథమైకవచనమునగూడ 'హేరాజన్'వలె 'హేయజ్వన్' అని యగును. 'శస్' పర మగునపుడు 'యజ్వన్ + శస్' అని యుండగా 'అల్లోపోఽనః' అను సూత్రముచే అల్లోపము రావలసి యుండ-

## 284. న సంయోగాద్వమన్తాత్. 6.4.137

వమన్తసంయోగాద్ అనోఽకారస్య లోపో న. యజ్వనః, యజ్వనా, యజ్వభ్యామ్. బ్రహ్మణః, బ్రహ్మణా.

'అల్లోపోఽనః' అను సూత్రము అనువర్తించును. "వకారమకారాంత సంయోగముకంటె పర మగు 'అన్'లోని అకారమునకు లోపము రాదు."

'యజ్వన్'లోని 'అన్' వకారాంతసంయోగముకంటె పరముగా నున్నది గాన దీని అకారమునకు లోపము రాదు. 'యజ్వనః' అను రూపము సిద్ధించును. ఇతర విభక్తులందు గూడ రాజన్‌శబ్దమునందు వలె రూపము లుండును. 'అన్' లోని అకారము లోపించ కుండుట మాత్రమే విశేషము. యజ్వనా, యజ్వభ్యామ్, యజ్వనే, ఇత్యాది రూపములు సిద్ధించును.

'బ్రహ్మన్' శబ్దమునందలి 'అన్' మకారాంతసంయోగముకంటె పరముగా నున్నది గాన ఈ సూత్రముచే అకారలోపనిషేధము. యజ్వన్‌శబ్దము నందు వలె రూపము లుండును.

'వృత్రహన్'శబ్ద (దేవేంద్రుడు) ప్రథమైకవచనమున 'వృత్రహన్ + స్' అని యుండగా 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) ఉపధా దీర్ఘము రావలసి యుండ-

## 285. ఇన్‌హన్‌పూషార్యమ్ణాం శౌ. 6.4.12

ఏషాం శావేవోపధాయా దీర్ఘో,నాన్యత్ర. ఇతి నిషేధే ప్రాప్తే.

'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' 'నోపధాయాః' అను సూత్రములనుండి 'దీర్ఘః' 'ఉపధాయాః' అనువర్తించును. "ఇన్, హన్, పూషన్, అర్యమన్

శబ్దముల ఉపధకు 'శి'పర మగునపుడు మాత్రమే దీర్ఘము వచ్చును, ఇతర విభక్తులు పర మగునపుడు రాదు "

'శిసర్వనామస్థానమ్' అను సూత్రముచే (238) సర్వనామస్థానసంజ్ఞక మగు 'శి'పర మగునపుడు 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచేతనే (177) ఉపధాదీర్ఘమున కవకాశ ముండగా ఈ సూత్రము 'సిద్ధే సత్యారభ్య మాణో విధిర్నియమాయ భవతి' అను న్యాయమున నియమార్థమై చెప్పబడినది. కావున 'శి'పర మగునపుడు మాత్రమే దీర్ఘము వచ్చు నను నర్థము లభించినది. ఈ సూత్రముచే నిచట ఉపధాదీర్ఘము నిషిద్ధమై యుండ:-

286. సౌ చ 6.4.13

ఇన్నాదీనాముపధాయా దీర్ఘోఽసమ్బుద్ధౌ సౌ. వృత్రహా. హేవృత్రహన్.

'నోపధాయాః' 'ఢ్రలోపే' 'పూర్వస్యదీర్ఘోఽణః' 'సర్వనామస్థానే చాసంబుద్ధౌ'అను సూత్రములనుండి 'ఉపధాయాః' 'దీర్ఘః' 'అసమ్బుద్ధౌ'అను పదములును,పై సూత్రమునుండి 'ఇన్‌హన్‌పూషార్యమ్ణాం'అను పదములును అనువర్తించును."ఇన్,హన్,పూషన్,అర్యమన్‌శబ్దముల ఉపధకు సమ్బుద్ధిభిన్న మగు 'సు'పర మగునపుడు దీర్ఘము వచ్చును".

ఈ సూత్రముచే ఉపధాదీర్ఘము, హల్ఙ్యాది లోప (179)న లోపములు (180) చేయ 'వృత్రహా'అను రూపము సిద్ధించును.

సంబుద్ధియందు ఉపధాదీర్ఘము లేకుండుటచేతను, 'నఙిసమ్బుద్ధ్యోః'అను సూత్రముచే (281) నకారలోపము నిషిద్ధ మగుటచేతను 'హే వృత్రహన్' అను రూపము సిద్ధించును.

'ఔ'పర మగునపుడు 'ఇన్‌హన్'అను సూత్రముచే (285) ఉపధా దీర్ఘము నిషిద్ధ మైనది గాన 'వృత్రహనౌ'అని యుండగా:-

287. ఏకాజుత్తరపదే ణః 8.4.12

ఏకాజుత్తరపదం యస్య,తస్మిన్ సమాసే పూర్వపదస్థాన్నిమిత్తా త్పరస్య ప్రాతిపదికాన్తనుమ్విభక్తిస్థస్య నస్య ణః. వృత్రహణౌ.

'పూర్వపదాత్సంజ్ఞాయామ్' నుండి 'పూర్వపదాత్', 'రషాభ్యాం నో ణః సమానపదే','ప్రాతిపదికాన్తనుమ్విభక్తిషు చ'అను సూత్రములను అనువర్తిం

చును. "ఏకాచ్క మగు ఉత్తరపదము గల సమాసమునందు పూర్వపదస్థ మగు నిమిత్తము (రషల) కంటె పరమును ప్రాతిపదికాన్త,నుమ్, విభక్తులందున్నది యగు నకారమునకు ణకార మాదేశ మగును".

'వృత్రహన్'అనునపుడు 'హన్'అనునది ఏకాచ్క మగు ఉత్తరపదము. ణకారమునకు నిమిత్త మగు రేఫ పూర్వపద మగు 'వృత్ర'అను పదమునందున్నది.కావున దానికంటె పర మగు (అవ్యవహితపరమగుట ఆవశ్యకముకాదు) ప్రాతిపదికాంత నకారమునకు ణకారము.'వృత్రహణౌ'అను రూపము సిద్ధించును.ఇట్లే ణత్వము చేయ 'జస్''అమ్'లు పర మగునపుడు 'వృత్రహణః' 'వృత్రహణమ్'అను రూపములు సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'వృత్రహన్ + శస్'అని యుండగా 'అల్లోపోఽనః'అను సూత్రముచే (247) అకారలోపము-'వృత్రహ్న్ + అస్' అని యుండ—

## 288. హో హన్తేర్ఞ్ణిన్నేషు 7.3.54

ఞితి,ణితి ప్రత్యయే నకారే చ పరే హన్తేర్హకారస్య కుత్వమ్. వృత్రఘ్నః, ఏవమ్—శార్ఙ్గిన్; యశస్విన్, అర్యమన్; పూషన్.

'చజోఃకు ఘిణ్ణ్యతోః'నుండి 'కు'అనువర్తించును. "ఞకారేత్సంజ్ఞకము, ణకారేత్సంజ్ఞకము నగు ప్రత్యయము,నకారమును, పర మగునపుడు 'హన' ధాతువు హకారమునకు కుత్వము వచ్చును."

ఇచట నకారము పర మగుటచే సంవార, నాద, అఘోష, మహాప్రాణ యత్న మగు హకారమునకు ఆ యత్నములు గల ఘకార మాదేశమై 'వృత్రఘ్నః'అను రూపము సిద్ధించును.అజాది ప్రత్యయములు పర మగునపుడు అల్లోపము కుత్వము చేయ పై విధముగనే 'వృత్రఘ్నా' 'వృత్రఘ్నే' ఇత్యాదిరూపములు సిద్ధించును హలాది విభక్తులు పర మగునపుడు 'న లోపః ప్రాతిపదికాన్తస్య'అను సూత్రముచే (180) నలోపము చేయ 'వృత్రహభ్యామ్' ఇత్యాదిరూపము లగును. 'ఙి' పర మగునపుడు 'విభాషా ఙిశ్యోః'అను సూత్రముచే (248) అల్లోపము వైకల్పికము గాన 'వృత్రఘ్ని' 'వృత్రహణి' అను రెండు రూపములు సిద్ధించును.

శార్ఙ్గిన్,యశస్విన్, అర్యమన్, పూషన్,ఇత్యాదిశబ్దముల ప్రక్రియ ఈ విధముగనే ఉండును.

289. మఘవా బహులమ్ 6.4.128

మఘవన్శబ్దస్య వా తృ ఇత్యన్తాదేశః. ఋ ఇత్.

'అర్వణస్త్రసావనఞః' నుండి 'తృ'అను పద మనువర్తించును. "మఘవన్శబ్దమునకు వికల్పముగ 'తృ'అనునది అంతాదేశ మగును" 'తృ'లోని ఋకారము ఇత్సంజ్ఞము.

మహ్యతే-పూజ్యతే,అను నర్థమున 'కని'ప్రత్యయము చేర్చుటచే 'మఘవన్'శబ్దము (ఇంద్రుడు) నిష్పన్న మైనది.అందలి నకారమునకు పై సూత్రముచే వికల్పముగ తకారాదేశము-'మఘవత్'అని యై ప్రథమైకవచనమున 'మఘవత్ + సు'అని యుండగా—

290. ఉగిదచాం సర్వనామస్థానేऽధాతోః 7.1.70

అధాతోరుగితః నలోపినోऽఞ్చతేశ్చ 'నుమ్' స్యాత్ సర్వనామస్థానే పరే. మఘవాన్, మఘవన్తౌ, మఘవన్తః, హే మఘవన్, మఘవద్భ్యామ్. తృత్వాభావే-మఘవా. సుటి రాజవత్.

'ఇదితో నుమ్ ధాతోః' నుండి 'నుమ్'అనువర్తించును. ధాతుభిన్న మగు ఉగిత్తునకును (ఉక్-ఉ,ఋ,ఌ-ఇత్సంజ్ఞకముగా గలది) లుప్తనకార మగు అఞ్చ ధాతువునకును సర్వనామస్థానము పర మగునపుడు 'నుమ్'ఆగమము వచ్చును.

'తృ లోని ఋకారము ఇత్సంజ్ఞక మగుటచే 'మఘవత్' అనునది ఉగిత్. దీనికి సర్వనామస్థాన మగు 'స్'పరముగ నున్నది గాన 'నుమ్'ఆగమము ('ఉ' 'మ్'లు ఇత్‌లు). 'మిదచోऽన్త్యాత్పరః'అను పరిభాష (240) ననుసరించి 'అంత్యాచ్'అగు వకరోత్తరవర్తి అకారమునకు పరముగ వచ్చి 'మఘవన్త్స్' అని యగును.సకారమునకు హల్ఙ్యాదిలోపము (179). 'సంయోగాన్తస్యలోపః' అను సూత్రముచే (20) తకారమునకు లోపము. 'సర్వనామస్థానే-'అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము. సంయోగాన్తలోప మసిద్ధ మగుటచే 'నలోపః-'అను సూత్రముచే (180) నకారలోపము రాదు. 'మఘవాన్' అను రూపము సిద్ధించును.

'ఔ'మొదలగు సర్వనామస్థానములు పర మగునపుడు పై సూత్రముచే నుమాగమము చేయ 'మఘవన్తౌ','మఘవన్తః','మఘవన్తమ్','మఘవన్తౌ' అను రూపములు నిష్పన్న మగును. సంబుద్ధి యందు సులోప, సంయోగాన్త

(తకార)లోపములు చేసిన పిమ్మట 'హే మఘవన్'అను రూప మగును. సంబుద్ధియందు నిషిద్ధముగాన (281) ఉపధాదీర్ఘము రాదు. 'మఘవన్తౌ' ఇత్యాది రూపములందు నకారమునకు మొదట 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) అనుస్వారము పిదప 'అనుస్వారస్య యయిపరసవర్ణః'అను సూత్రముచే (79) పరసవర్ణము చేయ మరల నకారము వచ్చును.

'శస్' మొదలగు విభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు గాన 'మఘవతః' 'మఘవద్భ్యామ్'ఇత్యాదిరూపము లగును.ఇవి 'తృ' అను నాదేశము వచ్చిన పక్షమున నుండు రూపములు. తృత్వము చేయని పక్షమున సర్వనామస్థానములు (స్వాదిపంచప్రత్యయములు) పర మగునపుడు రాజన్‌శబ్దమునందు వలె మఘవా, మఘవానౌ, మఘవానః, మఘవానమ్, మఘవానౌ,అను రూపములు సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'మఘవన్ + అస్'అని యుండగా 'అల్లోపోఽనః'అను సూత్రముచే (247) అల్లోపము రావలసి యుండ--

291. శ్వయువమఘోనామతద్ధితే 6.4.133

అన్నన్తానాం భానామేషామతద్ధితే సమ్ప్రసారణమ్. మఘోనః, మఘవభ్యామ్, ఏవమ్-శ్వన్, యువన్.

'భస్య'అధికారము. 'వసోఃసమ్ప్రసారణమ్' నుండి 'సమ్ప్రసారణమ్' అనువర్తించును 'అల్లోపోఽనః' నుండి 'అనః' అపకర్షింపబడును 'అన్'అను అంతమునగలవియు. భసంజ్ఞకములును అగు శ్వన్, యువన్, మఘవన్ శబ్దములకు తద్ధితభిన్న మగు ప్రత్యయము పర మగునపుడు సంప్రసారణము వచ్చును. (ఇగ్యణఃసమ్ప్రసారణమ్ 256)

ఈ సూత్రముచే వకారమునకు సంప్రసారణము చేయ (ఉకారము)-'మఘఉఅన్ + అస్'అని యుండ 'న్'కు వెనుక నున్న అకారమునకు 'సమ్ప్రసారణాచ్చ'అను సూత్రముచే (258) పూర్వరూపము చేయ, 'మఘఉన్ + అస్' అనియై గుణరుత్వవిసర్గలచే 'మఘోనః'అను రూపము సిద్ధించును. అజాది ప్రత్యయములు పర మగునపుడు ఇటులనే 'మఘోనా' 'మఘోనే'ఇత్యాది రూపములు సిద్ధించును. హలాది విభక్తులు పర మగునపుడు రాజన్‌శబ్దమునందు వలె రూపము లుండును.

(తకార)లోపములు చేసిన పిమ్మట 'హే మఘవన్'అను రూప మగును. సంబుద్ధియందు నిషిద్ధముగాన (281) ఉపధాదీర్ఘము రాదు. 'మఘవన్తౌ' ఇత్యాది రూపములందు నకారమునకు మొదట 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) అనుస్వారము పిదప 'అనుస్వారస్య యయిపరసవర్ణః'అను సూత్రముచే (79) పరసవర్ణము చేయ మరల నకారము వచ్చును.

'శస్' మొదలగు విభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు గాన 'మఘవతః' 'మఘవద్భ్యామ్'ఇత్యాదిరూపము లగును.ఇవి 'తృ' అను నాదేశము వచ్చిన పక్షమున నుండు రూపములు. తృత్వము చేయని పక్షమున సర్వనామస్థానములు (స్వాదిపంచప్రత్యయములు) పర మగునపుడు రాజన్‌శబ్దమునందు వలె మఘవా, మఘవానౌ, మఘవానః, మఘవానమ్, మఘవానౌ,అను రూపములు సిద్ధించును.

ద్వితీయాబహువచనమున 'మఘవన్ + అస్'అని యుండగా 'అల్లోపోఽనః'అను సూత్రముచే (247) అల్లోపము రావలసి యుండ—

291. శ్వయువమఘోనామతద్ధితే 6.4.163

అన్నన్తానాం భానామేషామతద్ధితే సమ్ప్రసారణమ్. మఘోనః, మఘవభ్యామ్, ఏవమ్-శ్వన్, యువన్.

'భస్య'అధికారము. 'వసోఃసమ్ప్రసారణమ్' నుండి 'సమ్ప్రసారణమ్ అనువర్తించును 'అల్లోపోఽనః' నుండి 'అనః' అపకర్షింపబడును 'అన్'అను నది అంతమునగలవియు. భసంజ్ఞకములును అగు శ్వన్, యువన్, మఘవన్ శబ్దములకు తద్ధితభిన్న మగు ప్రత్యయము పర మగునపుడు సంప్రసారణము వచ్చును. (ఇగ్యణఃసమ్ప్రసారణమ్ 256 )

ఈ సూత్రముచే వకారమునకు సంప్రసారణము చేయ (ఉకారము)- 'మఘఉఅన్ + అస్'అని యుండ 'న్'కు వెనుక నున్న అకారమునకు 'సమ్ప్రసారణాచ్చ'అను సూత్రముచే (258) పూర్వరూపము చేయ, 'మఘఉన్ + అస్'అనియై గుణరుత్వవిసర్గలచే 'మఘోనః'అను రూపము సిద్ధించును. అజాది ప్రత్యయములు పర మగునపుడు ఇటులనే 'మఘోనా''మఘోనే'ఇత్యాది రూపములు సిద్ధించును. హలాది విభక్తులు పర మగునపుడు రాజన్‌శబ్దమునందు వలె రూపము లుండును.

శ్వన్, యువన్ శబ్దరూపములు గూడ ఇటులనే సిద్ధించును. 'శ్వన్' శబ్దమునకు సర్వనామస్థానములు పర మగునపుడును, హలాదివిభక్తులందును రాజన్ శబ్దమునకు వలె రూపము లుండును. శసాద్యజాదివిభక్తులు పర మగునపుడు సంప్రసారణపూర్వరూపములచే 'శునః' 'శునా' 'శునే' ఇత్యాదిరూపములు సిద్ధించును.

స్వాదిపంచవిభక్తులందును 'యువన్' శబ్దరూపములు 'రాజన్' శబ్దమునందు వలె నుండును. 'శస్' పర మగునపుడు 'యువన్ + అస్' అని యుండగా పై సూత్రముచే (291) వకారమునకు సంప్రసారణముచే ఉకారము-'యుఉఅన్ + అస్' అని యుండును. ''సంప్రసారణాచ్చ' అను (258) పూర్వరూపముచే 'యుఉన్ + అస్'. ఉకారములకు సవర్ణదీర్ఘముచే 'యూనస్' అని యై సకారమునకు రుత్వవిసర్గలచే 'యూనః' అను రూపము సిద్ధించును కాని ఇచట వకారమునకు సంప్రసారణము చేసిన పిదప యకారము కూడ సంప్రసారణము వచ్చుటకు అర్హత కలది గాన దానికి గూడ సంప్రసారణము వచ్చునా అను సందేహ ముదయించును. తన్నివృత్తికై క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

292. న సమ్ప్రసారణే సమ్ప్రసారణమ్ 6.1.37

సమ్ప్రసారణే పరతః పూర్వస్య యణః సంప్రసారణం న స్యాత్. ఇతి యకారస్య నేత్వమ్. అత ఏవ జ్ఞాపకాదన్త్యస్య యణః పూర్వం సమ్ప్రసారణమ్. యూనః, యూనా, యువభ్యామ్. ఇత్యాది. అర్వా, హేఅర్వన్.

సంప్రసారణము పర మగునపుడు పూర్వ'యణ్'కు సంప్రసారణము రాదు.

ఈ సూత్రముచే నిషిద్ధము గాన యకారమునకు సంప్రసారణముచే ఇకారాదేశము రాదు.

'శ్వయువ'- అను సూత్రముచే (291) 'యువన్' శబ్దమునకు సంప్రసారణము విధింపబడినది. కాని మొదటనే ('యువ' శబ్దమునందలి వకారమునకు సంప్రసారణము చేయుటకు పూర్వమే) యకారమునకు సంప్రసారణ మేల చేయరాదు? అను సందేహమునకు అవకాశము లేదు. ఏల యన ఈ సూత్రము సంప్రసారణము పర మగునపుడు మరి యొక సంప్రసారణము చేయరాదని చెప్పుచున్నది. మొదట యకారమునకే సంప్రసారణము చేసి యున్నచో ఈ

సూత్రమునకు అవకాశమే యుండదు గదా। కావున ఏతత్సూత్రారంభసామర్థ్యముచే మొదట వకారమునకే సంప్రసారణము చేయవలె నని సూచిత మగుచున్నది. వకారమునకు మొదట సంప్రసారణము చేయ సంప్రసారణ పరక మగు వెనుక నున్న 'యణ్'కు సంప్రసారణము చేయరాదు అను నిషేధము సార్థక మగును.

పై విధముగనే అజాదివిభక్తులు పర మగునపుడు 'యూనా', 'యూనే' 'యూనః' ఇత్యాదిరూపములును, హలాదివిభక్తులు పర మగునపుడు పదసంజ్ఞ యుండుటచే నకారలోపము చేయ 'యువభ్యామ్' ఇత్యాదిరూపములును సిద్ధించును.

నకారాంత మగు 'అర్వన్' శబ్దమునకు (గుఱ్ఱము) 'సు'పర మగునపుడును, సంబుద్ధి పర మగునపుడును రాజన్‌శబ్దమునందు వలె 'అర్వా' 'హే అర్వన్' అను రూపములు సిద్ధించును.

293. అర్వణస్త్రసావనఞః. 6.4.127

నఞా రహితస్య 'అర్వన్' ఇత్యస్యాఙ్గస్య 'తృ' ఇత్యన్తాదేశో న తు సౌ. అర్వన్తౌ. అర్వద్భ్యామ్ ఇత్యాది.

అర్వణః, తృ, అసౌ, అనఞః. 'అంగస్య' అధికారము. 'నఞ్'రహిత మగు 'అర్వన్'అను అంగమునకు 'తృ'అనునది అంతాదేశముగ వచ్చును. 'సు'పర మగునపుడు మాత్రము రాదు. 'తృ'లోని 'ఋ'కారము ఇత్సంజ్ఞకము. నకారస్థానమున 'త్' వచ్చుటచే 'అర్వత్' శబ్ద మగును. ఇపు డిది 'ఉగిత్' (ఋకారేత్సంజ్ఞకము) గాన సర్వనామస్థానములు పర మగునపుడు 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః' అను సూత్రముచే (290) నుమాగమము చేయగ 'అర్వన్తౌ', 'అర్వన్తః', 'అర్వన్తమ్', 'అర్వన్తౌ', అను రూపము లగును శసాదులు పర మగునపుడు విశేషకార్యము లేవియును లేవు- 'అర్వతః', 'అర్వతా', 'అర్వద్భ్యామ్' ఇత్యాది రూపములు సిద్ధించును.

294. పథిమథ్యృభుక్షామాత్. 7.1.85

ఏషామాకారోఽన్తాదేశః స్యాత్ సౌ పరే.

'సావనడుహః' నుండి 'సౌ' అనువర్తించును. పథిన్ (మార్గము), మథిన్ (కవ్వము), ఋభుక్షిన్ (ఇంద్రుడు). అను పదములకు 'సు'పర మగునపుడు ఆకార మంతాదేశముగ వచ్చును.

'పథిన్ + సు' అని యుండగా ఈ సూత్రముచే నకారమునకు అకారాదేశము చేయ 'పథిఅ + సు' అని యుండగా:-

295. ఇతోఽత్ సర్వనామస్థానే. 7.1.86

పథ్యాదేరికారస్యాఽకారః సర్వనామస్థానే పరే.

వెనుకసూత్రము నుండి 'పథిమథ్యృభుక్షామ్'అను పద మనువర్తించును. సర్వనామస్థానము పర మగునపుడు 'పథిన్', 'మథిన్', 'ఋభుక్షిన్' శబ్దముల ఇకారమునకు అకారాదేశము వచ్చును.

ఈ సూత్రముచే ఇకారమునకు అకారాదేశము వచ్చుటచే 'పథఅ + స్' అని యుండగా:-

296. థో న్థః. 7.1.87

పథిమథోస్థస్య న్థాదేశః సర్వనామస్థానే. పన్థాః, పన్థానౌ, పన్థానః.

'పథి...'అను సూత్రము (294) నుండి 'పథిమథి' అను సమాసైకదేశమును పై సూత్రమునుండి 'సర్వనామస్థానే' అనువర్తించును. సర్వనామస్థానము పర మగునపుడు 'పథిన్' 'మథిన్' శబ్దముల థకారమునకు 'న్థ'అనునాదేశము వచ్చును.

ఈ సూత్రముచే న్థాదేశము- సవర్ణదీర్ఘసంధి,- సకారమునకు రుత్వ విసర్గములును చేయ 'పన్థాః' అను రూపము సిద్ధించును.

పన్థానౌ:- 'పథిన్ + ఔ'అని యుండ ఇకారమునకు అకారాదేశము (295), థకారమునకు 'న్థ'ఆదేశము (296) చేయ 'పన్థన్ + ఔ' అని యుండ 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము— 'పన్థానౌ'అను రూపము సిద్ధించును. 'పన్థానః' 'పన్థానమ్' అను రూపముల నిష్పత్తి కూడ ఈ విధముగనే యుండును. 'శస్'పర మగునపుడు 'పథిన్ + అస్' అని యుండగా:-

297. భస్య టేర్లోపః. 7.1.88

భస్య పథ్యాదేష్టేర్లోపః. పథః, పథా, పథిభ్యామ్. ఏవం మథిన్. ఋభుక్షిన్.

'పథిమథ్యృభుక్షామాత్' నుండి 'పథిమథ్యృభుక్షామ్' అనువర్తించును. భసంజ్ఞకము లగు పథిన్, మథిన్, ఋభుక్షిన్ శబ్దముల 'టి'కి లోపమువచ్చును.

ఈ సూత్రముచే 'టి'యగు 'ఇన్' లోపింప 'పథః' అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు 'టి'లోపముచే పై విధముగనే 'పథా' 'పథే' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'భ్యామ్' మొదలగు హలాది విభక్తులు పర మగునపుడు 'న లోపః-' అను సూత్రముచే (180) నలోపము చేయ 'పథిభ్యామ్' ఇత్యాదిరూపములు నిష్పన్న మగును.

'మథిన్', 'ఋభుక్షిన్' శబ్దములందు కూడ ప్రక్రియ ఈ విధముగనే యుండును.

### 298. ష్ణాన్తాః షట్. 1.1.24

షాన్తా నాన్తా చ సఙ్ఖ్యా షట్సంజ్ఞా స్యాత్. పఞ్చన్‌శబ్దో నిత్యం బహువచనాన్తః. పఞ్చ, పఞ్చ, పఞ్చభిః, పఞ్చభ్యః, పఞ్చభ్యః. నుట్-

'బహుగణవతుడతిసఙ్ఖ్యా'నుండి 'సఙ్ఖ్యా' అనువర్తించును. షకారాంత నకారాంత మగు సంఖ్యావాచకపదము షట్సంజ్ఞక మగును.

'పఞ్చన్' శబ్దము నిత్యబహువచనాంతము. ఇది నకారాంతసంఖ్యావాచక మగుటచే షట్సంజ్ఞకము. 'జస్','శస్'లు పర మగునపుడు 'పఞ్చన్ + జస్' 'పఞ్చన్ + శస్' అని యుండ 'షడ్భ్యో లుక్'అను సూత్రముచే (188) 'జస్', 'శస్'లకు లోపము. 'న లోపః...'అను సూత్రముచే (180) నకార లోపము— 'పఞ్చ','పఞ్చ' అను రూపములు సిద్ధించును. 'భిస్' 'భ్యస్'లు పర మగునపుడు నలోపము (సూ.180). 'పఞ్చభిః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'పఞ్చన్ + ఆమ్'అని యుండ 'షట్చతుర్భ్యశ్చ' అను సూత్రముచే (266) నుడాగమము చేయ 'పఞ్చన్ + నామ్'అని యుండగా-

### 299. నోపధాయాః. 6.4.7

నాన్తస్యోపధాయా దీర్ఘో నామి. పఞ్చానామ్. పఞ్చసు.

'ఢ్రలోపేపూర్వస్యదీర్ఘోఽణః' నుండి 'దీర్ఘః'అను పదము, 'నామి'అను సూత్రమును అనువర్తించును. 'అఙ్గస్య' అధికారసూత్రము. 'నామ్'పర మగునపుడు నకారాన్త మగు అంగము (యొక్క) ఉపధకు దీర్ఘము వచ్చును.

ఈ సూత్రముచే ఉపధాదీర్ఘము చేయ 'పఞ్చాన్ + నామ్'అని యుండును. 'నామ్'అను హలాదిప్రత్యయము పర మగుటచే 'పఞ్చాన్'అనువానికి 'స్వాదిష్వ

సర్వనామస్థానే అను సూత్రముచే (164) పదసంజ్ఞ కలదు గాన 'న లోపః—' అను సూత్రముచే (180) నకారలోపము— 'పఞ్చానామ్' అను రూపము సిద్ధించును.

పఞ్చసు:- నకారలోపముచే (సూ.180) ఈ రూపము సిద్ధించినది.

300. అష్టన ఆ విభక్తౌ. 7.2.84

హలాదౌ వా స్యాత్.

'రాయో హలి' నుండి 'హలి' అపకర్షింపబడును. 'అష్టన్' శబ్దమునకు హలాదివిభక్తి పర మగునపుడు ఆకారము వికల్పముగ వచ్చును.

301. అష్టాభ్య ఔశ్. 7.1.21

కృతాకారాదష్టనః జశ్శసోః ఔశ్. 'అష్టభ్యః' ఇతి వక్తవ్యే కృతాత్వనిర్దేశో జశ్శసోర్విషయే ఆత్వం జ్ఞాపయతి. అష్టౌ, అష్టౌ, అష్టాభిః, అష్టాభ్యః, అష్టాభ్యః, అష్టానామ్, అష్టాసు. ఆత్వాభావే 'అష్ట' పఞ్చవత్. ఇతి నకారాన్తాః.

'జశ్శసోః శిః' నుండి 'జశ్శసోః' అనువర్తించును. చేయబడిన ఆకారము గల 'అష్టన్' శబ్దముకంటె పర మగు 'జశ్' 'శస్'లకు 'ఔశ్' అను నాదేశము వచ్చును.

నిత్యబహువచన మగు అష్టన్‌శబ్దమునకు 'జస్''శస్'లు పర మగునపుడు 'అష్టన్ + అస్' అని యుండ ఇచట పర మగు విభక్తి హలాది కాదు కావున 'అష్టన ఆ విభక్తౌ' అను సూత్రముచే (300) ఆకారము వచ్చుటకు అవకాశము లేదు. కాని 'అష్టాభ్య ఔశ్' అను సూత్రమున 'అష్టభ్యః' అనియే చెప్పుటకు అవకాశ ముండ 'అష్టాభ్యః'అని సదీర్ఘ నిర్దేశము చేయుటచే 'జస్', 'శస్'లు పర మగునపుడు గూడ ఆత్వము వచ్చుననియు, అట్లు ఆత్వము చేయగా 'అష్టా'అని యైన పిమ్మట ఇపుడు 'జస్', 'శస్'లకు 'ఔశ్' వచ్చు ననియు, సూచింపబడుచున్నది. అనగా 'అష్టాభ్యః' అనునది కృతాత్వ మగు అష్టన్ శబ్దమునకు అనుకరణము కావున 'అష్టనః-' అను సూత్రముచే (300) అలోన్త్య పరిభాష (21) ననుసరించి నకారమునకు ఆకారాదేశము, సవర్ణదీర్ఘము చేయ 'అష్టా + అస్'అని యుండ 'అష్టాభ్య ఔశ్'అను సూత్రముచే 'జస్', 'శస్'లకు 'ఔశ్' ఆదేశము శిత్ కావున "అనేకాల్ శిత్సర్వస్య" అను సూత్రముచే (45)

సర్వాదేశమై వచ్చును- 'అష్టా + ఔ' వృద్ధి చేయ 'అష్టౌ' అను రూపము సిద్ధించును.

'భిస్', 'భ్యస్', 'సు'లు పర మగునపుడు ఇవి హలాదివిభక్తులు గాన ఆత్వము చేయ 'అష్టాభిః' 'అష్టాభ్యః' 'అష్టాసు' అను రూపములు సిద్ధించును. 'ఆమ్'పర మగునపుడు గూడ మొదట 'షట్చతుర్భ్యశ్చ'అను సూత్రముచే (266) నుడాగమము చేసిన పిమ్మట 'నామ్' అనునది హలాదివిభక్తి యగుటచే ఆత్వము చేయగా 'అష్టానామ్'అను రూపము సిద్ధించినది. 'అష్టన ఆవిభక్తౌ'అను సూత్రముచే (300) ఆత్వము వైకల్పికము గాన ఆత్వము రాని పక్షమున 'పఞ్చన్' శబ్దమునందు వలె రూపము లుండును.

302. ఋత్విగ్-దధృక్-స్రగ్-దిగ్-ఉష్ణిగఞ్చు-యుజి-క్రుఞ్చాం చ. 3.2.59

ఏభ్యః క్విన్. అఞ్చేః సుప్యుపపదే, యుజిక్రుఞ్చోః కేవలయోః క్రుఞ్చేర్నలోపాభావశ్చ నిపాత్యతే. కనావితౌ.

'స్పృశోఽనుదకే క్విన్' నుండి 'క్విన్' అనువర్తించును. ఋత్విక్ (ఋతుపూర్వక యజ్ధాతువు), ధృష్ (దధృష్), సృజ్ (స్రగ్), దిశ్ (దిగ్), ఉత్పూర్వకష్ణిహ్ (ఉష్ణిగ్), అఞ్చ్, యుజ్, క్రుఞ్చ్, ధాతువులకంటె పరముగ 'క్విన్'ప్రత్యయము వచ్చును.

ఈ 'క్విన్'ప్రత్యయము 'అఞ్చ్'ధాతువునకు సుబంతము ఉపపద మగునపుడు- అనగా దీని వెనుక సుబంత మున్నపుడు మాత్రమే వచ్చును. 'ప్రాఙ్' 'ప్రత్యఙ్' ఇత్యాదు లుదాహరణము. 'యుజ్', 'క్రుంచ' ధాతువులకు కేవలములకే- అనగా ఉపపదాదిరహితములకు- వచ్చును. 'క్రుఞ్చ్' ధాతువిషయమున 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' అను సూత్రముచే (335) ప్రాప్త మగు నకారలోపమున కభావము గూడ నిపతింపబడుచున్నది. (కార్యవిధాయక శాస్త్ర మేదియు లేకుండగనే కార్యమును జూపి లక్ష్యమును నిర్దేశించుటకు నిపాతన మని పేరు. ప్రకృతమున 'క్రుఞ్చ్'ధాతువులోని నకారమునకు 'అనిదితాం___'అను సూత్రముచే రావలసి యున్న నకారలోపమును నిషేధించు శాస్త్ర మేదియును లేదు. ఐనను నకారలోపమును జేయక 'క్రుఞ్చ్' అని నిర్దేశింపబడినది గాన నిది నకారలోపాభావనిపాతనము.)

'క్విన్' ప్రత్యయమునందు చివరకు ఏ అక్షరమును శేషించదు. కకారము 'లశక్వతద్ధితే' అను సూత్రము (136) చేతను, నకారము 'హలన్త్యమ్' అను సూత్రముచేతను (1) ఇత్సంజ్ఞకము. ఇకారము ఉచ్చారణార్థము. రాబోవు సూత్రముచే వకారము లోపించును.

303. కృదతిఙ్. 3.2.93

అత్ర ధాత్వధికారే 'తిఙ్'భిన్నః ప్రత్యయః కృత్సంజ్ఞః స్యాత్.

'ధాతోః' అని యధికారసూత్రము. ధాత్వధికారమున తిఙ్భిన్న మగు ప్రత్యయము కృత్సంజ్ఞక మగును.

'క్విన్'ప్రత్యయము ధాత్వధికారమునందు విహిత మగు ప్రత్యయము గావున దీనికి కృత్ప్రత్యయమని పేరు. ఈ పదములు కృత్ప్రత్యయాంతములు గాన 'కృత్తద్ధితసమాసాశ్చ' అను సూత్రముచే (117) ప్రాతిపదికత్వము లభించినది.

304. వేరపృక్తస్య. 6.1.67

అపృక్తస్య వస్య లోపః.

'లోపో వ్యోర్వలి' నుండి 'లోపః' అనువర్తించును. ('క్విప్' 'క్విన్' ప్రత్యయాదులకు చెందిన) అపృక్త మగు వకారమునకు లోపము వచ్చును.

ఇచట 'క్విన్'ప్రత్యయమునందు శేషించిన వకారము 'అపృక్త ఏకాల్ ప్రత్యయః' అను సూత్రముచే (178) అపృక్తసంజ్ఞకము గాన ఈ సూత్రముచే అది లోపించును. ఈ విధముగా 'క్విన్'ప్రత్యయము పూర్తిగా లోపించినది. పూర్వోక్తవిధమున ప్రాతిపదికసంజ్ఞ యున్నది గాన స్వాదివిభక్తులు చేర్చబడును.

ఋతుశబ్దపూర్వక మగు యజధాతువునకు 'క్విన్'ప్రత్యయము చేర్చగా 'ఋతు + యజ్ + క్విన్' అని యుండ 'వచిస్వపియజాదీనాం కితి'అను సూత్రముచే (449) యకారమునకు సంప్రసారణము; 'సంప్రసారణాచ్చ'అను సూత్రముచే (258) పూర్వరూపము చేయ 'ఋతు + ఇజ్' 'ఋత్విజ్' (క్విన్ సర్వలోపి) యగును. పిదప ప్రథమైకవచనమున 'ఋత్విజ్ + సు' అని యుండ హల్ఙ్యాదిలోపముచే (179) 'ఋత్విజ్'అని యుండగా:-

305. క్విన్ ప్రత్యయస్య కుః 8.2.62

క్విన్ప్రత్యయో యస్మాత్, తస్య కవర్గోఽన్తాదేశః పదాన్తే.

'పదస్య'అధికారసూత్రము. 'ఝలాం జశోఽన్తే'నుండి 'అన్తే' అను వర్తించును. క్విన్ప్రత్యయము దేనికంటె పరముగ విధింపబడినదో దానికి పదాన్తమున కవర్గ మంతాదేశ మగును.

ఈ సూత్రముచే జకారమునకు కుత్వము రావలసి యున్నది.కాని త్రిపాదిలోని సూత్రములలో గూడ పూర్వసూత్రము దృష్టియందు పరసూత్రము అసిద్ధ మగును గాన ఈ సూత్రముకంటె పూర్వసూత్ర మగు 'చోః కుః' అను సూత్రము (307) దృష్టియందు ఈ సూత్ర మసిద్ధము. కావున 'చోః కుః'అను సూత్రముచే కుత్వము వచ్చును.జకారస్థానమున గకారము చేయ 'ఋత్విగ్' అనియు, 'వావసానే'అను సూత్రముచే (146) వికల్పముగ చర్త్వము చేయ 'ఋత్విక్'అనియు రెండు రూపములు సిద్ధించును.ఈ స్థలమున 'చోః కుః' అను సూత్రముచే కుత్వము చేసినను,పై సూత్రముచే కుత్వము చేసినను విశే మేదియు లేదు గాని 'చోః కుః'అను సూత్రమునకు అవకాశము లేని యు (యున్) ప్రాఙ్ (ప్రాన్) ఇత్యాదిస్థలములందు కుత్వము విధించుటకై పై సూత్రము చరితార్థ మగును.

అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు. 'ఋత్విజౌ' 'ఋత్విజః'ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు 'స్వాదిష్వసర్వనామస్థానే'అను సూత్రముచే (164) పదసంజ్ఞ యుండును గాన 'చోఃకుః'అను సూత్రముచే (307) కుత్వము చేయగా 'ఋత్విగ్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును.సప్తమీబహువచనమున 'ఋత్విజ్ + సు'అని యుండగా కుత్వము, 'ఖరి చ'అను సూత్రముచే (74)చర్త్వము, 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) సకారమునకు షత్వము చేయ 'ఋత్విక్షు' అను రూపము సిద్ధించును.

'యుజ్'శబ్దప్రథమైకవచనమున 'యుజ్ + సు'అని యుండి హల్ఙ్యాది లోపముచే (179) 'యుజ్'అని యుండగా:-

306. యుజేరసమాసే 7.1.71

యుజేః సర్వనామస్థానే నుమ్ స్యాద్ అసమాసే.సంయోగాన్త

లోపః, కుత్వేన నస్య ఙః-యుఙ్. అనుస్వారపరసవర్ణౌ-యుఞ్జౌ. యుఞ్జః, యుగ్భ్యామ్.

'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః' 'ఇదితో నుమ్ ధాతోః'అను సూత్రములనుండి 'సర్వనామస్థానే' 'నుమ్'అనువర్తించును. యుజ్ధాతువునకు సర్వనామస్థానము పర మగునపుడు 'నుమ్'అను ఆగమము వచ్చును;సమాసమునందు మాత్రము రాదు.

'నుమ్'లోని ఉకారమకారములు ఇత్సంజ్ఞకములు.ఇది 'మిత్'గాన అంత్యాచ్చునకు పరముగ వచ్చును. 'యున్జ్+స్'అని యుండగా 'స్'కు హల్ఙ్యాది లోపము (179) జకారమునకు 'సంయోగాన్తస్య లోపః'అను సూత్రముచే (20) లోపము-'యున్'అని యుండగా "క్విన్ప్రత్యయస్యకుః"అను సూత్రముచే (305) కుత్వము చేయగా అనునాసికత్వసామ్యముచే నకారస్థానమున 'ఙ'కారము వచ్చి 'యుఙ్' అను రూపము సిద్ధించును.

ద్వివచనమున 'యుజ్+ఔ' అని యుండ 'యుజేరసమాసే'అను సూత్రముచే నుమాగమము-యున్జ్+ఔ', 'నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే (78) నకారమునకు అనుస్వారము.పిదప అనుస్వారమునకు "అనుస్వారస్య యయి పరసవర్ణః"అను సూత్రముచే (79) పరసవర్ణ మగు ఞకారమాదేశముగ వచ్చి 'యుఞ్జౌ' అను రూపము సిద్ధించును. 'జస్''అమ్'లు పర మగునపుడు గూడ రూపము లిట్లే సిద్ధించును.శసాదివిభక్తులు పర మగునపుడు 'ఋత్విక్'శబ్దమునందు వలె రూపము లగును.

'సుయుక్'శబ్దము సమాసరూపము గాన'యుజేరసమాసే'అను సూత్రముచే (306) నుమాగమము రాదు కావున ప్రథమైకవచనమున 'సుయుజ్+స్'అని యుండ హల్ఙ్యాదిలోపముచే (179) 'సుయుజ్' అని యుండగా—

307. చోః కుః 8.2.30

చవర్గస్య కవర్గః స్యాద్ ఝలి,పదాన్తే చ. సుయుక్,సుయుగ్, సుయుజౌ. సుయుగ్భ్యామ్, ఖన్, ఖఞ్జౌ, ఖన్భ్యామ్.

చవర్గమునకు 'ఝల్'పర మగునపుడును, పదాంతమునందును కవర్గము వచ్చును.

ఈ సూత్రముచే కవర్గము చేయ 'సుయుక్'అను రూపముసిద్ధించును.

ఈ విధముగ 'సుయుజ్'శబ్దరూపములు 'ఋత్విజ్'శబ్దరూపముల వలె నిష్పన్న మగును.

ఖజ్ (జి)ధాతువునకు 'క్విప్'ప్రత్యయము (సర్వలోపి) చేర్చిన పిదప 'ఇదితో నుమ్ ధాతోః'అను సూత్రముచే (465) నుమాగమము,నకారమునకు ఝల్ అగు జకారము పరముగ నుండుటచే అనుస్వారము,అనుస్వారమునకు పర సవర్ణమగు ఞకారమునువచ్చుటచే 'ఖఞ్జ్'శబ్దము నిష్పన్న మైనది.దాని ప్రథమైక వచనమున 'ఖఞ్జ్ + స్'అనియుండ సకారమునకు హల్ఙ్యాదిలోపము (179), జకారమునకు సంయోగాన్తలోపము (20). ఇచట నకారమునకు అనుస్వారాదేశము వచ్చుటకు జకారము కారణము.అట్టి జకారము లోపించగనే 'నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః'అను న్యాయముచే (కారణము పోయినవెంటనే దాని కార్యము గూడ పోవును) అనుస్వారాదికము పోయి 'ఖన్'అను రూపము సిద్ధించును.ఇట్లే హలాదివిభక్తులు పర మగునపుడు సంయోగాన్తలోపముచే జకారము లోపింప మరల నకారమే యుండుటచే 'ఖన్భ్యామ్'ఇత్యాదిరూపము లగును. అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్య మేదియు లేకుండుటచే 'ఖఞ్జౌ' 'ఖఞ్జః'ఇత్యాదిరూపములు నిష్పన్న మగును.

'రాజ్'శబ్దప్రథమైకవచనమున 'రాజ్ + స్' అని యుండగా హల్ఙ్యాది లోపము (179) 'రాజ్'అని యుండగా:-

308. వ్రశ్చ, భ్రస్జ. సృజ, మృజ, యజ, రాజ, భ్రాజ, చ్ఛశాం షః 8.2.36

ఝలి పదాన్తే చ. జశ్త్వచర్త్వే-రాట్, రాడ్, రాజౌ, రాజః. రాడ్భ్యామ్. ఏవమ్-విభ్రాట్, దేవేట్, విశ్వసృట్.

ఝల్ పర మగునపుడును, పదాంతమునందును వ్రశ్చ, భ్రస్జ, సృజ, మృజ, యజ, రాజ, భ్రాజధాతువులకును ఛకారశకారాంతపదములకును షకార మంతాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే జకారమునకు షత్వము-'రాష్'అని యుండగా 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే (67) షకారమునకు జశ్త్వము చేయ మూర్ధస్థాన సామ్యముచే డకారము వచ్చును-'రాడ్',పిదప 'వాఽవసానే'అను సూత్రముచే (146) చర్త్వవికల్పముచే 'రాట్' 'రాడ్'అను రెండు రూపములు సిద్ధించును.

ఇట్లే హలాదివిభక్తులు పర మగునపుడు షత్వజశ్త్వములు చేయ 'రాడ్భ్యామ్' 'రాడ్భిః' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్' ప్రత్యయము పర మగునపుడు మాత్రము 'రాజ్ + సు' అని యుండ షత్వజశ్త్వములు-'రాడ్ + సు' అని యుండగా 'డః సి ధుట్' అను సూత్రముచే (86) వైకల్పికధుడాగమము. 'ఖరి చ' అను సూత్రముచే (74) ధకారమునకును డకారమునకును చర్త్వము చేయ 'రాట్త్సు' అను రూపమును, ధుడాగమము రాని పక్షమున చర్త్వముచే 'రాట్సు' అను రూపమును సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు విశేష కార్యము లేవియును లేవు. 'రాజౌ' 'రాజః' ఇత్యాది రూపములు సిద్ధించును.

'విభ్రాట్' 'దేవేట్' 'విశ్వసృట్' ఇత్యాదిశబ్దముల రూపము లిట్లే సిద్ధించును.

వా. పరౌ వ్రజేః షః పదాన్తే.

పరావుపపదే వ్రజేః క్విప్ స్యాత్ దీర్ఘశ్చ, పదాన్తే షత్వమపి. పరివ్రాట్-డ్, పరివ్రాజౌ.

వ్రజధాతువునకు 'పరి' అనునది ఉపపదముగ నున్నపుడు అనగా 'పరి' యను నుపసర్గ పూర్వమునందు చేర్చినపుడు-'క్విప్' ప్రత్యయము వచ్చును; దీర్ఘము, పదాంతమున షత్వము గూడ వచ్చును.

పరిపూర్వకవ్రజధాతువున కీ వార్తికముచే 'క్విప్' ప్రత్యయము చేయ ('క్విప్' సర్వలోపి) దీర్ఘము గూడ వచ్చుటచే 'పరివ్రాజ్' అని యుండును. ఇప్పుడిది కృత్ప్రత్యయాంతము గాన ప్రాతిపదికసంజ్ఞక మగుటచే స్వాది విభక్తులు చేర్చబడును. రాట్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

309. విశ్వస్య వసురాటోః. 6.3.128

విశ్వశబ్దస్య దీర్ఘోఽన్తాదేశః స్యాద్ వసౌ రాట్శబ్దే చ పరే. విశ్వారాట్. విశ్వారాడ్, విశ్వరాజౌ. విశ్వారాడ్భ్యామ్.

'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి 'దీర్ఘః' అనువర్తించును. విశ్వ శబ్దమునకు 'వసు, రాట్' అనునవి పరముగ నున్నపుడు దీర్ఘ మంతాదేశముగ వచ్చును.

'రాజ్' శబ్దము పదాంతమునందు మాత్రమే—అనగా 'సు' ప్రత్యయ మును ఇతర హలాదివిభక్తిప్రత్యయములును పర మగునపుడు- వెనుక చూపిన

విధమున షత్వ, జశ్త్వ, చర్త్వములచే 'రాట్' అని యగును. అట్టి 'రాట్' అను నది పర మగునపుడు- అనగా పైన చెప్పిన ప్రత్యయములు పర మగునపుడు- మాత్రమే విశ్వశబ్దమునకు దీర్ఘము వచ్చు నని సూచించుటకై సూత్రమున 'రాట్' అను రూపము నిర్దిష్ట మైనది. కావున అజాదివిభక్తులు పర మగునపుడు దీర్ఘము రాదు. విశ్వారాట్ - విశ్వరాజౌ - విశ్వరాజః - విశ్వరాజమ్ - విశ్వరాజౌ - విశ్వరాజః - విశ్వరాజా - విశ్వారాడ్భ్యామ్ - విశ్వారాడ్భిః- ఇత్యాది రూపములు సిద్ధించును.

'భృస్జ్' శబ్ద ప్రథమైకవచనమున 'భృస్జ్ + స్' అని యుండ హల్ఙ్యాది లోపము (179) 'భృస్జ్' ఇచట 'సంయోగాన్తస్యలోపః' అను సూత్రముచే (20) జకారమునకు లోపము రావలసి యుండ తదపవాదముగ క్రింది సూత్రము చెప్పబడుచున్నది

310. స్కోః సంయోగాద్యోరన్తేచ. 8.2.29

పదాన్తే ఝలి చ యః సంయోగః తదాద్యోః స్కోర్లోపః. భృట్; భృడ్. సస్య శ్చుత్వేన శః, 'ఝలాం జశ్ ఝశి' ఇతి శస్య జః- భృజ్జౌ, భృడ్భ్యామ్. ఇతి జకారాన్తాః.

'పదస్య' అధికారసూత్రము. 'ఝలో ఝలి' 'సంయోగాన్తస్య లోపః' అను సూత్రములనుండి 'ఝలి' 'లోపః' అనువర్తించును. పదాంతమునందలి లేక 'ఝల్' పరముగా గల, సంయోగమున ఆదియందున్న సకారకకారములకు లోపము వచ్చును.

ఈ సూత్రముచే పదాంత గతమగు 'స్జ' అను సంయోగమునందలి ఆదివర్ణ మగు సకారమునకు లోపము చేయ 'భృజ్' అని యగును. 'వ్రశ్చభ్రస్జ-' అను సూత్రముచే (308) జకారమునకు షత్వము. 'ఝలాం జశోఽన్తే' అను సూత్ర ముచే (67) జశ్త్వము - డత్వము. 'వావసానే' అను (146) చర్త్వవికల్పముచే 'భృట్', 'భృడ్' అను రెండు రూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు 'రాట్' శబ్దమునందు వలె రూపము లుండును.

'ఔ', 'అస్' మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు సకారమునకు శ్చుత్వముచే శకారము; పిదప 'ఝలాం జశ్ ఝశి' అను సూత్రముచే (19) శకారమునకు తాలుస్థానసామ్యముచే జకారము. 'భృజ్జౌ' 'భృజ్జః' ఇత్యాది రూపములు సిద్ధించును.

311. తదోః సః సావనన్త్యయోః. 7.2.106

త్యదాదీనాం తకారదకారయోరనన్త్యయోః సః స్యాత్ సౌ. స్యః, త్యౌ, త్యే; సః, తౌ, తే; యః, యౌ, యే. ఏషః, ఏతౌ, ఏతే, ఏతమ్. అన్వాదేశే— ఏనమ్, ఏనౌ, ఏనాన్, ఏనేన, ఏనయోః.

తదోః, సః, సౌ, అనన్త్యయోః. 'త్యదాదీనామః'నుండి 'త్యదాదీనాం' అనువర్తించును. 'సు'పర మగునపుడు త్యదాదిశబ్దముల అంత్యభిన్న మగు తకారదకారములకు సకార మాదేశముగ వచ్చును.

'త్యద్'శబ్దప్రథమైకవచనమున 'త్యద్ + స్'అని యుండగా 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) దకారమునకు అకారము. 'అతోగుణే' అను సూత్రముచే (275) పరరూపము చేయ 'త్య + స్'అని యుండ ఈ సూత్రముచే సకారము చేయగా 'స్య + స్'అని యుండును. సకారమునకు రుత్వవిసర్గములచే 'స్యః' అను రూపము సిద్ధించును. ఇట్లే 'తద్' 'ఏతద్'శబ్దములందు ప్రక్రియ ఉండును. 'ఏతద్'శబ్దమున సకారము చేసిన పిమ్మట 'ఏస'అని యుండ 'ఆదేశప్రత్యయోః'అను సూత్రముచే (150) షత్వము వచ్చుట విశేషము. 'యద్'శబ్దమున గూడ త్యదాద్యత్వపరరూపములచే 'యః' మొదలగు రూపములు సిద్ధించును. ఈ విధముగ 'త్యద్''తద్''యద్''ఏతద్'శబ్దములు సహజముగ దకారాంతము లైనను 'త్యదాదీనామః'అను సూత్రముచే అత్వము చేయుటచే అకారాంతము లగును గాన 'సర్వ'శబ్దమునందు వలె వీటి రూపము లుండును. ఏతచ్ఛబ్దమునందు అన్వాదేశమున 'అమ్',ఔట్,శస్,టా,ఓస్,ఓస్,లు పర మగునపుడు 'ద్వితీయాటౌస్స్వేనః'అను సూత్రముచే (280) ఏనాదేశము వచ్చుటచే 'ఇదమ్'శబ్దమునందు వలె 'ఏనమ్', 'ఏనౌ', 'ఏనాన్'. 'ఏనేన', 'ఏనయోః' 'ఏనయోః'అను రూపములు గూడ నిష్పన్న మగును.

'యుష్మద్' 'అస్మద్' శబ్దముల ప్రథమైకవచనమున 'యుష్మద్ + సు' 'అస్మద్ + సు'అని యుండగా:-

312. ఙే ప్రథమయోరమ్. 7.1.28

యుష్మదస్మద్భ్యాం పరస్య 'ఙే'ఇత్యేతస్య ప్రథమాద్వితీయయోశ్చాఽమాదేశః.

'యుష్మదస్మద్భ్యాం ఙసోఽశ్'నుండి 'యుష్మదస్మద్భ్యామ్' అనువర్తిం

చును. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'జే' ప్రత్యయమునకును, ప్రథమ ద్వితీయవిభక్తి ప్రత్యయములకును 'అమ్'అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'సు'కు 'అమ్'అను నాదేశము వచ్చుటచే 'యుష్మద్ + అమ్' 'అస్మద్ + అమ్' అని యుండగా:-

313. త్వాఽహౌ సౌ. 7.2.94

అనయోర్మపర్యన్తస్య త్వాహౌ ఆదేశౌ స్తః.

'మపర్యన్తస్య' అధికారము. 'యుష్మదస్మదోరనాదేశే'నుండి 'యుష్మదస్మదోః' అనువర్తించును. 'సు'పర మగునపుడు 'యుష్మద్''అస్మద్'శబ్దముల మకారపర్యంతమును ఉన్న భాగమునకు వరుసగా 'త్వ''అహ' అను నాదేశములు వచ్చును.

ఇట్లు 'త్వ''అహ' ఆదేశములు చేయగా 'త్వఅద్ + అమ్' 'అహఅద్ + అమ్'అని యుండును. 'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపము. 'త్వద్ + అమ్''అహద్ + అమ్'అని యుండగా:-

314. శేషే లోపః. 7.2.90

ఏతయోష్టిలోపః. త్వమ్, అహమ్.

'అష్టన ఆ విభక్తౌ'నుండి 'విభక్తౌ' అనువర్తించును. (ఆత్వయత్వములకునిమిత్త మగు విభక్తులకంటె భిన్న మగు విభక్తి పర మగునపుడు) ఈశబ్దముల 'టి' లోపించును.[1]

ఈ సూత్రముచే 'అద్'అను 'టి'లోపింప త్వ + అమ్ = 'త్వమ్' అహ + అమ్ = 'అహమ్' అను రూపములు సిద్ధించును.

ద్వివచనమున 'త్వద్ + ఔ' 'అస్మద్ + ఔ'అని యుండ 'ఙే ప్రథమయోరమ్'అను సూత్రముచే (312) 'అమ్'చేయగా 'త్వద్ + అమ్' 'అస్మద్ + అమ్' అని యుండగా-

---

1. ఈ ప్రక్రియ సిద్ధాంతకౌముదీప్రక్రియకంటె భిన్నముగా నున్నది. ఈ సూత్రముచే విహిత మగు లోపము అలోన్త్యపరిభాషచే అంత్యవర్ణ మగు దకారమునకు వచ్చు ననియు, పిదప 'అమిపూర్వః'అను పూర్వ రూపముచే 'త్వమ్' 'అహమ్'అను రూపములు సిద్ధించు ననియు సిద్ధాంతకౌముది మతము.

315. యువావౌ ద్వివచనే. 7.2.92

ద్వయోరుక్త్యో రనయోర్మపర్యన్తస్య యువావౌ స్తో విభక్తౌ.

ద్విత్వసంఖ్యావిశిష్ట మగు అర్థమును బోధించు ఈ శబ్దముల మపర్యంత భాగములకు విభక్తి పర మగు నపుడు వరుసగా 'యువ' 'ఆవ' అను ఆదేశములు వచ్చును. (ఈ యాదేశములు ఏడు విభక్తుల ద్వివచనమునందును వచ్చును.)

ఈ సూత్రముచే 'యువ' 'ఆవ' ఆదేశములు చేయుటచే 'యువఅద్ + అమ్' 'ఆవఅద్ + అమ్' అనియు, పిమ్మట 'అతో గుణే' అను (274) పరరూపముచే 'యువద్ + అమ్' 'ఆవద్ + అమ్' అనియు ఉండగా-

316. ప్రథమాయాశ్చ ద్వివచనే భాషాయామ్. 7.2.88

ఔఙ్యేతయోరాత్వం లోకే. యువామ్. ఆవామ్.

'అష్టన ఆ విభక్తౌ' నుండి 'ఆ' అనువర్తించును. ప్రథమాద్వివచనప్రత్యయము పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు లౌకికభాషయందు ఆత్వము వచ్చును.

అలోన్త్యపరిభాషచే (21) నీఆత్వము అంత్య మగు దకారమునకు రాగా 'యువ ఆ + అమ్' 'ఆవ ఆ + అమ్' అని యుండ మొదట వకారోత్తరవర్తి అకారఆకారములకును, పిదప ఆకారఅకారములకును సవర్ణదీర్ఘము చేయ 'యువామ్' 'ఆవామ్' అను రూపములు సిద్ధించును.

ప్రథమాబహువచనమున 'యుష్మద్ + జస్' 'అస్మద్ + జస్' అని యుండ 'ఙేప్రథమయోరమ్' అను సూత్రముచే (312) 'అమ్' ఆదేశము చేయగా 'యుష్మద్ + అమ్' 'అస్మద్ + అమ్' అని యుండును. ఇచట-

317. యూయవయౌ జసి. 7.2.93

అనయోర్మపర్యన్తస్య. యూయమ్. వయమ్.

'జస్' పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యన్తభాగమునకు 'యూయ' 'వయ' అను ఆదేశములు వచ్చును.

ఈ సూత్రముచే మపర్యంతభాగమునకు యూయవయాదేశములు చేయ 'యూయద్ + అమ్' 'వయద్ + అమ్' అని యుండ 'శేషే లోపః' అను సూత్రముచే (314) దలోపము- 'యూయమ్' 'వయమ్' అను రూపములు నిష్పన్న మగును.

318. త్వమావేకవచనే. 7.2.97

ఏకస్యోక్తౌ అనయోర్మపర్యన్తస్య త్వమౌ స్తః విభక్తౌ.

ఏకత్వసంఖ్యావిశిష్టార్థమును బోధించు యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యంత
కు విభక్తి పర మగునపుడు 'త్వ' 'మ' అను నాదేశములు వచ్చును.
ద్వితీయెకవచనమున 'యుష్మద్ + అమ్' 'అస్మద్ + అమ్' అని యుండ
త్రముచే 'త్వ' 'మ' ఆదేశములు. 'త్వఅద్ + అమ్' 'మఅద్ + అమ్'-
ంణే' అను సూత్రముచే (274) పరరూపము. 'త్వద్ + అమ్' 'మద్ +
ని యుండగా:-

319. ద్వితీయాయాం చ. 7.2.87

అనయోరాత్ స్యాత్. త్వామ్. మామ్.

ద్వితీయవిభక్తి పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు ఆకార
శముగ వచ్చును.

ఈ సూత్రముచే దకారస్థానమున అత్వము చేయగా 'త్వఅ + అమ్'
అమ్' అని యై సవర్ణదీర్ఘసంధిచే 'త్వామ్' 'మామ్' అను రూపములు
ను. ద్వితీయాద్వివచనరూపములు గూడ ప్రథమాద్వివచనమునందు వలె
). బహువచనమున 'యుష్మద్ + శస్' 'అస్మద్ + శస్' అని యుండగా
ంయో రమ్' అను సూత్రముచే(312)'శస్'కు 'అమ్' ఆదేశము రావలసి

320. శసో న. 7.1.28

ఆభ్యాం శసో న స్యాత్. అమోఽపవాదః. 'ఆదేః పరస్య'-
'గాన్తలోపః- యుష్మాన్, అస్మాన్.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'శస్'కు నకార మాదేశమగును.
మ్'కు అపవాదము. ఈ నకారము పర మగుదానికి విధింపబడినది గాన
పరస్య' అను పరిభాషచే (72) పరమైనదాని ఆద్యక్షరమున కాదేశముగ
దీనిచే 'అస్'లోని అకారమునకు నకారాదేశము రాగా 'యుష్మద్ +
అస్మద్ + న్స్' అని యగును. పిదప 'ద్వితీయాయాం చ' అను సూత్రముచే
దకారమున కాత్వము చేయ సవర్ణదీర్ఘముచే 'యుష్మాన్స్' 'అస్మాన్స్'

అని యై, సంయోగాన్తలోపముచే సకారము లోపింప 'యుష్మాన్' 'అస్మాన్' అను రూపములు సిద్ధించును.

తృతీయైకవచనమున 'యుష్మద్ + ఆ' 'అస్మద్ + ఆ'అని యుండ 'త్వమావేకవచనే'అను సూత్రముచే (318) మపర్యంతభాగమునకు 'త్వ''మ' ఆదేశములును, 'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపమును జేయ 'త్వద్ + ఆ' 'మద్ + ఆ'అని యుండగా:-

321· యోఽచి 7.2.89

అనయోర్యకారాదేశః స్యాత్,అనాదేశేఽజాదౌ పరతః. త్వయా. మయా.

'యుష్మదస్మదోరనాదేశే'అను సూత్రము, అష్టన ఆ విభక్తౌ' నుండి 'విభక్తౌ'అనువర్తించును. ఆదేశము కాని అజాదివిభక్తి పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు యకారాదేశ మగును.

అలోన్త్యపరిభాషచే (21) ఈ యకారము దకారమున కాదేశ మగును. 'త్వయా' 'మయా'అను రూపములు సిద్ధించును.

'భ్యామ్'పర మగునపుడు 'యువావౌ ద్వివచనే'అను సూత్రముచే(314) మపర్యంతభాగమునకు 'యువ''ఆవ'ఆదేశములు చేసి పిదప 'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపము చేయ 'యువద్ + భ్యామ్' 'ఆవద్ + భ్యామ్' అని యుండగా:-

322. యుష్మదస్మదోరనాదేశే 7.2.86

అనయోరాత్ స్యాత్ అనాదేశే హలాదౌ విభక్తౌ. యువాభ్యామ్ ఆవాభ్యామ్, యుష్మాభిః, అస్మాభిః.

అష్టన ఆ విభక్తౌ' నుండి 'ఆ' 'విభక్తౌ'అను పదములును, 'రాయో హలి' నుండి 'హలి'అను పదమును అనువర్తించును. ఆదేశము కాని హలాది విభక్తి పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు ఆకార మాదేశ మగును.

అలోంత్యపరిభాషచే దకారమున కాదేశముగ ఆకారము వచ్చిన పిదప సవర్ణదీర్ఘసంధిచే 'యువాభ్యామ్' 'ఆవాభ్యామ్'అను రూపములు సిద్ధించును.

బహువచనమున 'యుష్మద్ + భిస్' 'అస్మద్ + భిస్'అని యుండగా 'యుష్మదస్మదోరనాదేశే'అను సూత్రముచే (322) దకారమునకు ఆకారాదేశ

మును,సవర్ణదీర్ఘసంధియు చేయ 'యుష్మాభిః''అస్మాభిః'అను రూపములు సిద్ధించును.

చతుర్థ్యేకవచనమున 'యుష్మద్ + ఙే' 'అస్మద్ + ఙే'అని యుండగా 'ఙేప్రథమయోరమ్'అను సూత్రముచే (312) 'ఙే'కు 'అమ్'ఆదేశము చేయ 'యుష్మద్ + అమ్' 'అస్మద్ + అమ్'అని యుండగా-

## 323. తుభ్యమహ్యౌ ఙయి 7.2.95

అనయోర్మపర్యన్తస్య టిలోపః. తుభ్యమ్, మహ్యమ్.

'ఙే'పర మగునపుడు 'యుష్మద్''అస్మద్'శబ్దముల మపర్యంతభాగమునకు 'తుభ్య''మహ్య'అను నాదేశములు వచ్చును.

ఈ సూత్రముచే 'తుభ్య''మహ్య'ఆదేశములు చేసిన పిదప 'తుభ్యఅద్ + అమ్' 'మహ్య అద్ + అమ్'అని యుండ 'అతోగుణే'అనుసూత్రముచే (274) పరరూపము, 'శేషే లోపః'అను సూత్రముచే (314) టిలోపము చేయ 'తుభ్యమ్''మహ్యమ్'అను రూపములు సిద్ధించును. చతుర్థీపంచమీద్వివచనములందు తృతీయయందు వలె 'యువాభ్యామ్' 'ఆవాభ్యామ్'అను రూపములేర్పడును.

బహువచనమున 'యుష్మద్ + భ్యస్' 'అస్మద్ + భ్యస్'అన యుండగా-

## 324. భ్యసోఽభ్యమ్ 7.1.30

ఆభ్యాం పరస్య. యుష్మభ్యమ్. అస్మభ్యమ్.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'భ్యస్'కు 'అభ్యమ్'అను నాదేశము వచ్చును.

'యుష్మద్ + అభ్యమ్' 'అస్మద్ + అభ్యమ్'అని యుండ, 'శేషే లోపః' అను సూత్రముచే (314) 'టి'కి (అద్‌కు) లోపము చేయ 'యుష్మ్ + అభ్యమ్- 'అస్మ్ + అభ్యమ్' 'యుష్మభ్యమ్''అస్మభ్యమ్'అను రూపము లేర్పడును.

పంచమ్యేకవచనమున 'యుష్మద్ + ఙసి' 'అస్మద్ + ఙసి'అని యుండ 'త్వమావేకవచనే' అను సూత్రముచే (318) మపర్యంతభాగమునకు 'త్వ''మ' ఆదేశములను 'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపమును జేయ 'త్వద్ + ఙసి' 'మద్ + ఙసి'అని యుండగా-

318. త్వమావేకవచనే. 7.2.97

ఏకస్యోక్తౌ అనయోర్మపర్యన్తస్య త్వమౌ స్తః విభక్తౌ.

ఏకత్వసంఖ్యావిశిష్టార్థమును బోధించు యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యంత భాగమునకు విభక్తి పర మగునపుడు 'త్వ' 'మ' అను నాదేశములు వచ్చును.

ద్వితీయైకవచనమున 'యుష్మద్ + అమ్' 'అస్మద్ + అమ్' అని యుండ ఈ సూత్రముచే 'త్వ' 'మ' ఆదేశములు. 'త్వఅద్ + అమ్' 'మఅద్ + అమ్'- 'అతో గుణే' అను సూత్రముచే (274) పరరూపము. 'త్వద్ + అమ్' 'మద్ + అమ్' అని యుండగా:-

319. ద్వితీయాయాం చ. 7.2.87

అనయోరాత్ స్యాత్. త్వామ్. మామ్.

ద్వితీయవిభక్తి పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు ఆకార మంతాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే దకారస్థానమున ఆత్వము చేయగా 'త్వఆ + అమ్' 'మఆ + అమ్' అని యై సవర్ణదీర్ఘసంధిచే 'త్వామ్' 'మామ్' అను రూపములు సిద్ధించును. ద్వితీయాద్వివచనరూపములు గూడ ప్రథమాద్వివచనమువందు వలె నుండును. బహువచనమున 'యుష్మద్ + శస్' 'అస్మద్ + శస్' అని యుండగా 'జే ప్రథమయో రమ్' అను సూత్రముచే (312) 'శస్' కు 'అమ్' ఆదేశము రావలసి యుండ.

320. శసో న. 7.1.28

ఆభ్యాం శసో న స్యాత్. అమోఽపవాదః. 'ఆదేః పరస్య'- సంయోగాన్తలోపః- యుష్మాన్, అస్మాన్.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'శస్' కు నకార మాదేశమగును. ఇది 'అమ్' కు అపవాదము. ఈ నకారము పర మగుదానికి విధింపబడినది గాన 'ఆదేః పరస్య' అను పరిభాషచే (72) పరమైనదాని ఆద్యక్షరమున కాదేశముగ వచ్చును దీనిచే 'అస్' లోని అకారమునకు నకారాదేశము రాగా 'యుష్మద్ + న్స్' 'అస్మద్ + న్స్' అని యగును. పిదప 'ద్వితీయాయాం చ' అను సూత్రముచే (219) దకారమున కాత్వము చేయ సవర్ణదీర్ఘముచే 'యుష్మాన్స్' 'అస్మాన్స్'

325. ఏకవచనస్య చ 7.1.32

ఆభ్యాం ఙసేరత్. త్వత్, మత్.

'పంచమ్యా అత్'అను సూత్ర మనువర్తించును. "యుష్మదస్మచ్ఛబ్దముల పంచమ్యేకవచనప్రత్యయమునకు 'అత్'అను నాదేశము వచ్చును".

'త్వద్ + అత్' 'మద్ + అత్ అని యుండగా 'శేషే లోపః'అను సూత్రముచే (314) 'టి'కి లోపము చేయగా 'త్వ్ + అత్ = 'త్వత్' 'మ్ + అత్ — 'మత్'అను రూపములు సిద్ధించును.

బహువచనమున 'యుష్మద్ + భ్యస్' 'అస్మద్ + భ్యస్'అని యుండ:-

326. పఞ్చమ్యా అత్ 7.1.31

ఆభ్యాం పఞ్చమ్యా భ్యసోఽత్ స్యాత్. యుష్మత్, అస్మత్.

'భ్యసోఽభ్యమ్' నుండి 'భ్యసః'అనువర్తించును. యుష్మదస్మచ్ఛబ్దముల కంటె పర మగు పంచమీబహువచనప్రత్యయ మగు 'భ్యస్'కు 'అత్'అను నాదేశము వచ్చును.

'యుష్మద్ + అత్' 'అస్మద్' + అత్'అని యుండ 'శేషే లోపః' అను సూత్రముచే (314) టిలోపము-'యుష్మ్ + అత్ = 'యుష్మత్'' అస్మ్ + అత్ = అస్మత్'అను రూపములు సిద్ధించును.

షష్ఠ్యేకవచనమున 'యుష్మద్ + ఙస్ 'అస్మద్ + ఙస్ అని యుండగా-

327. తవమమౌ ఙసి 7.2.96

అనయోర్మపర్యన్తస్య తవమమౌ స్తో ఙసి.

'ఙస్' పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యంతభాగమునకు 'తవ' 'మమ'అను నాదేశములు వచ్చును.

ఈ యాదేశములు చేసిన పిదప పరరూపముచే 'తవద్ + ఙస్' 'మమద్ + ఙస్'అని యుండగా-

328. యుష్మదస్మద్భ్యాం ఙసోఽశ్ 7.2.97

తవ, మమ, యువయోః, ఆవయోః.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'ఙస్'కు 'అశ్'ఆదేశము వచ్చును.

'అశ్'శిత్ గాన 'అనేకాల్ శిత్సర్వస్య'అను సూత్రము (45) ననుసరించి 'జస్'స్థానమున సర్వాదేశముగ వచ్చును. 'తవద్ + అ' మమద్ + అ' అని యుండ 'శేషే లోపః' అను సూత్రముచే (314) టిలోపము- 'తవ్ + అ = తవ' 'మమ్ + అ = మమ'అను రూపములు సిద్ధించును.

ద్వివచనమున 'యుష్మద్ + ఓస్' 'అస్మద్ + ఓస్'అని యుండగా 'యువావౌద్వివచనే'అను సూత్రముచే (315) మపర్యంతభాగమునకు 'యువ' 'ఆవ' ఆదేశములును 'అతో గుణే'అను సూత్రము (274) చే పరరూపమును చేయ 'యువద్ + ఓస్' 'ఆవద్ + ఓస్'అని యుండ 'యోఽచి'అను సూత్రముచే (321) దకారమునకు యకారాదేశము-'యువయ్ + ఓస్ = యువయోస్' 'ఆవయ్ + ఓస్ = ఆవయోస్';సకారమునకురుత్వవిసర్గములుచేయ'యువయోః' 'ఆవయోః'అను రూపము లగును.

షష్ఠిబహువచనమున 'యుష్మద్ + ఆమ్' 'అస్మద్ + ఆమ్' అని యుండ-

## 329 సామ ఆకమ్ 7.1.33

ఆభ్యాం పరస్య సామః 'ఆకమ్' స్యాత్. త్వయి, మయి, యువయోః, ఆవయోః, యుష్మాసు, అస్మాసు.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె పర మగు 'సామ్'అనుదానికి (షష్ఠీబహువచనప్రత్యయమునకు) 'ఆకమ్'అను నాదేశము వచ్చును.

'ఆమ్'అనుదానికి 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే (155) సుడాగమము జేయగా 'సామ్' అని యగును.అట్టి 'సామ్'కు 'ఆకమ్' వచ్చునని ఈ సూత్రము చెప్పుచున్నది వాస్తవమున 'యుష్మద్' 'అస్మద్'శబ్దములు హలంతములు గాన - అకారాంతములు కావుగాన - 'ఆమ్'కు 'సుట్'వచ్చు నవకాశమే లేదు కాని 'శేషే లోపః' అను సూత్రమునకు (314) రెండు విధములగువ్యాఖ్యానము గలదు.మొదటి వ్యాఖ్యానము ప్రకారము 'టి'కి - 'అద్'అన భాగమునకు- లోపము వచ్చును. రెండవ వ్యాఖ్యానము ప్రకారము అంత్యవర్ణము (ద్)కు లోపము వచ్చును.రెండవ వ్యాఖ్యానము ప్రకారము దకారమునకులోపము చేసిన పిమ్మట అకారాంతశబ్దము లగును గాన 'ఆమ్'కు, లేదా దాని స్థానమున వచ్చిన 'ఆకమ్'అను దానికి సుడాగమము వచ్చు నవకాశ మున్నది గాన భావి

సుడాగమనివృత్తికై సుడాగమసహిత మగు 'ఆమ్' నిర్దేశింపబడినది ప్రథమ వ్యాఖ్యానపక్షమున సుడాగమసహితనిర్దేశమునకు ప్రయోజన ముండదు.

ఈ సూత్రముచే 'ఆకమ్'ఆదేశము చేయ 'యుష్మద్ + ఆకమ్' 'అస్మద్ + ఆకమ్'అని యుండ 'శేషే లోపః'అను సూత్రముచే (314)టిలోపము చేయగా 'యుష్మ్ + ఆకమ్ = 'యుష్మాకమ్' 'అస్మ్ + ఆకమ్ 'అస్మాకమ్' అను రూపము లగును. అంత్యవర్ణలోపపక్షమున యుష్మ + ఆకమ్' 'అస్మ + ఆకమ్'అని యుండ సవర్ణదీర్ఘసంధిచే 'యుష్మాకమ్' 'అస్మాకమ్' అను రూపములు సిద్ధించును.

సప్తమ్యేకవచనమున 'యుష్మద్ + (ఙి)ఇ' 'అస్మద్ + (ఙి)ఇ'అని యుండగా 'త్వమావేకవచనే' అను సూత్రముచే (318) మపర్యంతభాగమునకు 'త్వ' 'మ'ఆదేశములను పరరూపమును జేయ 'త్వద్ + ఇ' 'మద్ + ఇ' అని యుండగా 'యోఽచి'అను సూత్రముచే (321) దకారమునకు యకారము. 'త్వయ్ + ఇ = త్వయి' 'మయ్ + ఇ = మయి'అను రూపము లగును. ద్వివచనమున షష్ఠియందు వలె రూపనిష్పత్తి యుండును

బహువచనమున 'యుష్మద్ + సు' 'అస్మద్ + సు'అని యుండగా 'యుష్మదస్మదోరనాదేశే'అను సూత్రముచే (322) దకారమునకు ఆకారాదేశమును, సవర్ణదీర్ఘమును చేయ 'యుష్మాసు' 'అస్మాసు'అను రూపములు సిద్ధించును.

330. యుష్మదస్మదోః షష్ఠీచతుర్థీద్వితీయాస్థయోర్వాంనావౌ 8.1.20

పదాత్పరయోః అపాదాదౌ స్థితయోః షష్ఠ్యాదివిశిష్టయోః యుష్మదస్మదోః 'వామ్' 'నౌ' ఇత్యాదేశౌ స్తః.

'పదస్య' 'పదాత్' 'అనుదాత్తంసర్వమపాదాదౌ'అను అధికార సూత్రముల క్రింద 330-333 సూత్రములు చెప్పబడినవి.

పదముకంటె పరములను, శ్లోకపాదాదియందు ఉండనివియు, షష్ఠ, చతుర్థ, ద్వితీయ విభక్తి ప్రత్యయములతో కూడినవియు అగు యుష్మదస్మచ్ఛబ్దములకు 'వామ్''నౌ'అను ఆదేశములు వచ్చును.అవి యనుదాత్తములుగ కూడ నుండును.

ఈ సూత్రముచే 'వామ్''నౌ'అను నాదేశములు షష్ఠ్యాదివిభక్తుల మూడు వచనములందును, రావలసి యున్నను ఏకవచనబహువచనములందు ఏతదపవాద ముగ 'వస్''నస్'మొదలగు రూపములు విధింపబడనున్నవి గాన ద్వివచనము నందు మాత్రమే వచ్చును. ఈ విధముగ ద్వితీయాద్వివచనమున 'యువామ్' 'వామ్' 'ఆవామ్' 'నౌ' అను రెండేసి రూపములును, చతుర్థీద్వివచనమున 'యువాభ్యామ్' 'వామ్' 'ఆవాభ్యామ్' 'నౌ'అను రెండేసి రూపములును, షష్ఠీద్వివచనమున 'యువయోః' 'వామ్' 'ఆవయోః' 'నౌ'అను రెండేసి రూపములును ఉండును.

331. బహువచనస్య వస్నసౌ 8.1.21

ఉక్తవిధయోరనయోః షష్ఠ్యాదిబహువచనాన్తయోర్వస్నసౌ స్తః.

పదముకంటె పరములును, శ్లోకపాదాదియందు ఉండనివియు, షష్ఠీ, చతుర్థీద్వితీయాబహువచనప్రత్యయములతో కూడిన వియు అగు యుష్మదస్మచ్ఛబ్దములకు 'వస్' 'నస్' అను నాదేశములు వచ్చును.

సకారమునకు రుత్వవిసర్గములు చేయుటచే 'వః' 'నః' అను రూపము లగును. ఈ సూత్రముచే వెనుక జూపిన రూపములే కాక షష్ఠీ, చతుర్థీ,ద్వితీయా బహువచనములందు 'వః' 'నః'అను రూపములుగూడ ఉండును.

332. తే మయావేకవచనస్య 8.1.22

ఉక్తవిధయోరనయోః షష్ఠీచతుర్థ్యేకవచనాన్తయోస్తేమేఏతౌ స్తః.

రాబోవు సూత్రముచే ద్వితీయవిభక్తి విషయమున విశేషకార్యము విధింప బడ నున్నది గాన 'యుష్మదస్మదోః...'అను సూత్రము (330) నుండి 'షష్ఠీ చతుర్థీ'అను సమాసైకదేశ మనువర్తించును. 'పదముకంటె పరములును, శ్లోక పాదాదియం దుండనివియు షష్ఠీచతుర్థ్యేకవచనప్రత్యయములతో కూడిన వియు నగు యుష్మదస్మచ్ఛబ్దములకు 'తే' 'మే'అను నాదేశములు వచ్చును.

333. త్వామౌ ద్వితీయాయాః 8.1.23

ద్వితీయైకవచనాన్తయోస్త్వా మా ఇత్యాదేశౌ స్తః.

పదముకంటె పరములును, శ్లోకపాదాదియం దుండనివియు, ద్వితీయైక వచన ప్రత్యయాంతములును అగు యుష్మదస్మచ్ఛబ్దములకు 'త్వా' 'మా' అను నాదేశములు వచ్చును.

ఈ విధముగ ద్వితీయాచతుర్థీషష్ఠులందు యుష్మదస్మచ్ఛబ్దములకు రెండేసి రూపము లుండును. ఈ 'త్వా' 'మా' ఇత్యాదిద్వితీయరూపములను ఏదైన ఒక పదమునకు తరువాతనే ప్రయోగించవలెను-అనగా వాక్యప్రారంభమున ఉపయోగింపరాదు. శ్లోకపాదప్రారంభమున గూడ నుపయోగింప రాదు. ఈ క్రింది శ్లోకములలో నీద్వితీయరూపముల కుదాహరణములు చూపబడుచున్నవి:-

శ్రీశస్త్వాఽవతు మా పీహ దత్తాత్ తే మేఽపి శర్మ సః
స్వామీ తే మేఽపి స హరిః, పాతు వామపి నౌ విభుః.
సుఖం వాం నౌ దదాత్వీశః, పతిర్వామపి నౌ హరిః
సోఽవ్యాత్ వో నః శివం వో నో దద్యాత్సేవ్యోఽత్ర వః స నః.

పై శ్లోకములలో రేఖాచిహ్నితపదములు ద్వితీయరూపముల కుదాహరణములు. అర్థము ననుసరించి వాటి విభక్తులను గుర్తింపవచ్చును.

వా. ఏకవాక్యే యుష్మదస్మదాదేశా వక్తవ్యాః.

ఏకతిఙ్ వాక్యమ్. తేనేహ న-ఓదనం పచ; తవ భవిష్యతి. ఇహ తు స్యాదేవ, శాలీనాం తే ఓదనం దాస్యామి.

(ద్వితీయైకవచనాదులందు విహితము లగు) ఈ యుష్మదస్మదాదేశములు ఏకవాక్యమునందే వచ్చును. (రెండువాక్యముల నుపయోగించినపుడు రావు) ఒకే తిఙన్తము గల దానికి వాక్య మని పేరు. కావున 'ఓదనం పచతవ భవిష్యతి' అనునపుడు 'పచ' 'భవిష్యతి' అను రెండు తిఙంతము లున్నవి గాన 'ఓదనం పచ' అనునది ఒక వాక్యము: 'తవ భవిష్యతి' అనునది రెండవ వాక్యము. కావున 'తవ' అనుదానికి బదులుగా 'తే' అని ఉపయోగింపరాదు. 'శాలీనాం తే ఓదనం దాస్యామి' అనునపుడు ఒకే తిఙన్త మున్నది గాన నిది యొక వాక్యము. కావున ఇచట 'తే' అనుదానిని ప్రయోగించ వచ్చును.

వా. ఏతే వాంనావాదయోఽనన్వాదేశే వా వక్తవ్యాః.

అన్వాదేశే తు నిత్యం స్యుః. (అనన్వాదేశే) ధాతా తే భక్తోఽస్తి, ధాతా తవ భక్తోఽస్తి వా. (అన్వాదేశే) తస్మై తే నమః. సుపాత్, సుపాద్, సుపాదౌ.

'వామ్' 'నౌ' మొదలగు ఈ ఆదేశములు అన్వాదేశము లేనపుడు వికల్పముగ వచ్చును అన్వాదేశ మున్నపుడు మాత్రము నిత్యముగ వచ్చును. కావున

లేని 'ధాతా తే భక్తో౽స్తి'ఇత్యాదిస్థలములందు వివక్షానుసారముగ
ని 'తే'అని గాని ప్రయోగింపవచ్చును.కాని అన్వాదేశమున 'తస్మై
త్యాదిస్థలములందు తచ్ఛబ్దప్రతిపాదితుడే మరల యుష్మచ్ఛబ్దముచే
మన్నాడు గాన 'తే'అనియే యుండవలయును గాని 'తుభ్యం'యని
రాదు.

ాద్' శబ్దప్రథమైకవచనమున 'సుపాద్ + స్' అని యుండగా
త్రముచే (179) 'స్'లోపించును. దకారమునకు 'వావసానే' అను
(146) చర్త్వవికల్పము_'సుపాత్' 'సుపాద్' అను రూపములు
ను.ద్వివచనబహువచనములందును, ద్వితీయైకవచన ద్వివచనము
షకార్య మేదియు లేదు కావున 'సుపాదౌ,సుపాదః,సుపాదమ్,
ను రూపములు సిద్ధించును.ద్వితీయాబహువచనమున 'సుపాద్ +
ండ—

334. పాదః పత్ 6.4.130

చ్ఛబ్దాన్తం యదఙ్గం భం తదవయవస్య పాచ్ఛబ్దస్యపదాదేశః.
పాద్భ్యామ్. ఇతి దకారాన్తాః.

' 'అఙ్గస్య' అని యధికృతములు. "పాచ్ఛబ్దాంతమును భసంజ్ఞక
అంగమున కవయవ మగు పాద్శబ్దమునకు 'పద్'అను నాదేశము

ప్రత్యయములు పర మగునపుడు భసంజ్ఞ యుండును గాన ఈ
'పద్'అను నాదేశము చేయ 'సుపద్ + అస్'- రుత్వవిసర్గములచే
ను రూపము సిద్ధించును. అజాదివిభక్తులందు ఈ విధముగనే
సుపదే'ఇత్యాదిరూపములును హలాది విభక్తులు పర మగునపుడు
రాదు గాన 'సుపాద్భ్యామ్'ఇత్యాదిరూపములును సిద్ధించును.

ిమత్,అగ్నిమథ్,అగ్నిమథౌ,అగ్నిమథః.ఇతి థకారాన్తాః.
న్త మగు 'అగ్నిమథ్'శబ్దమునకు ప్రథమైకవచనమున సులోపము
'వావసానే'అను సూత్రముచే (146) థకారమునకు చర్త్వ
తకారము చేయ 'అగ్నిమత్' 'అగ్నిమథ్ః' అను రూపద్వయ
జాది విభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు
మథౌ' 'అగ్నిమథః'ఇత్యాదిరూపము లగును. 'భ్యామ్'మొదలగు

అన్వాదేశము లేని 'ధాతా తే భక్తోఽస్తి'ఇత్యాదిస్థలములందు వివక్షానుసారముగ 'తవ'అని గాని 'తే'అని గాని ప్రయోగింపవచ్చును. కాని అన్వాదేశమున 'తస్మై తే నమః'ఇత్యాదిస్థలములందు తచ్ఛబ్దప్రతిపాదితుడే మరల యుష్మచ్ఛబ్దముచే నిర్దేశింపబడుచున్నాడు గాన 'తే'అనియే యుండవలయును గాని 'తుభ్యం'యని ప్రయోగింపరాదు.

'సుపాద్' శబ్దప్రథమైకవచనమున 'సుపాద్ + స్' అని యుండగా హల్ఙ్యాదిసూత్రముచే (179) 'స్'లోపించును. దకారమునకు 'వావసానే' అను సూత్రముచే (146) చర్త్వవికల్పము-'సుపాత్' 'సుపాద్' అను రూపములు నిష్పన్న మగును. ద్వివచనబహువచనములందును, ద్వితీయైకవచన ద్వివచనము లందును విశేషకార్య మేదియు లేదు కావున 'సుపాదౌ, సుపాదః, సుపాదమ్, సుపాదౌ' అను రూపములు సిద్ధించును. ద్వితీయాబహువచనమున 'సుపాద్ + అస్'అని యుండ—

## 334. పాదః పత్ 6.4.130

పాచ్ఛబ్దాన్తం యదఙ్గం భం తదవయవస్య పాచ్ఛబ్దస్యపదాదేశః. సుపదా, సుపాద్భ్యామ్. ఇతి దకారాన్తాః.

'భస్య' 'అఙ్గస్య' అని యధికృతములు. "పాచ్ఛబ్దాంతమును భసంజ్ఞక మును నగు అంగమున కవయవ మగు పాద్‌శబ్దమునకు 'పద్'అను నాదేశము వచ్చును.

అజాదిప్రత్యయములు పర మగునపుడు భసంజ్ఞ యుండును గాన ఈ సూత్రముచే 'పద్'అను నాదేశము చేయ 'సుపద్ + అస్'- రుత్వవిసర్గములచే 'సుపదః'అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులందు ఈ విధముగనే 'సుపదా', 'సుపదే'ఇత్యాదిరూపములును హలాది విభక్తులు పర మగునపుడు పదాదేశము రాదు గాన 'సుపాద్భ్యామ్'ఇత్యాదిరూపములును సిద్ధించును.

అగ్నిమత్, అగ్నిమథ్, అగ్నిమథౌ, అగ్నిమథః. ఇతి థకారాన్తాః.

థకారాన్త మగు 'అగ్నిమథ్'శబ్దమునకు ప్రథమైకవచనమున సులోపము చేసిన పిమ్మట 'వావసానే'అను సూత్రముచే (146) థకారమునకు చర్త్వ వికల్పముచే తకారము చేయ 'అగ్నిమత్' 'అగ్నిమథ్' అను రూపద్వయ ముండును. అజాది విభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు గాన 'అగ్నిమథౌ' 'అగ్నిమథః'ఇత్యాదిరూపము లగును. 'భ్యామ్'మొదలగు

హలాదివిభక్తులు పర మగునపుడు 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే(67) జశ్త్వముచే దకారము వచ్చి 'అగ్నిమద్భ్యామ్'ఇత్యాది రూపములు సిద్ధించును. 'సు'పర మగునపుడు మాత్రము 'ఖరి చ'అను సూత్రముచే (74) థకారమునకు చర్త్వముచే తకార మాదేశమై 'అగ్నిమత్సు'అను రూపము సిద్ధించును.

ప్రపూర్వక 'అన్చ్'ధాతువునకు 'ఋత్విగ్దధృక్' ఇత్యాదిసూత్రముచే ([illegible]3) 'క్విన్'ప్రత్యయము చేయ 'ప్రాన్చ్' (ప్రాఙ్చ్)అను శబ్ద మేర్పడినది.

335. అనిదితాం హల ఉపధాయాః క్ఙితి 6.4 24

హలన్తానామనిదితామఙ్గానాముపధాయా నస్య లోపః కితి ఙితి. నుమ్, సంయోగాన్తలోపః. నస్య కుత్వేన ఙః, ప్రాఙ్. ప్రాఞ్చౌ, ప్రాఞ్చః.

'అఙ్గస్య'అధికారము. 'శ్నాన్నలోపః' నుండి 'న' 'లోపః' అను పదములు అనువర్తించును. హ్రస్వేకారేత్సంజ్ఞకములు కానివియు,హలన్తములును అగు అంగముల ఉపధాభూతమగు నకారమునకు 'కిత్', 'ఙిత్',అగు ప్రత్యయము పర మగునపుడు లోపము వచ్చును.

'క్విన్'ప్రత్యయము 'కిత్' గాన 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' అను సూత్రము (190) ననుసరించి 'ప్రాన్చ్' అనుదాని ఉపధానకారమునకు లోపము చేయ 'ప్రాచ్'అని యుండును.ప్రథమైకవచనమున 'సు' పర మగునపుడు 'ప్రాచ్ + స్'అని యుండ 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః' అను సూత్రముచే (290) (అఞ్చుధాతువు ఉగిత్ గాన) నుమాగమము. ఇది 'మిత్' గాన అంత్యాచ్ కంటె పరముగ ( 'మిదచోన్త్యాత్పరః' 240 ) వచ్చును. 'ప్రాన్చ్ + స్'.సకారమునకుహల్ఙ్యాదిలోపము-(179)'ప్రాన్చ్'. 'సంయోగాన్తస్య లోపః'అను సూత్రముచే (20) చకారలోపము-'ప్రాన్' 'క్విన్ప్రత్యయస్య కుః'అను సూత్రముచే (305)నకారమునకు కుత్వముచే ఙకారాదేశము-'ప్రాఙ్' అను రూపము సిద్ధించును.

'ఔ','జస్','అమ్','ఔట్'లు గూడ సర్వనామస్థానసంజ్ఞకము లగుటచే లుప్తనకార మగు 'ప్రాచ్'అనుదానికి 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః'అను సూత్రముచే (290) నుమాగమము; ఆ నకారమునకు 'స్తోశ్చునా శ్చుః'అను

సూత్రముచే (62) స్తుత్వముచే ఞకారమును జేయ 'ప్రాఞ్చౌ' 'ప్రాఞ్చః' 'ప్రాఞ్చమ్' 'ప్రాఞ్చౌ'అను రూపము లగును.

'శస్'మొదలగు అజాదివిభక్తులు పరముగా నుండగా:-

336. అచః 6.4.138

లుప్తనకారస్యాఞ్చతేర్భస్యాఽకారస్య లోపః.

'భస్య'అధికారము. 'అల్లోపో నః' నుండి 'అల్లోపః'అనువర్తించును. 'అచః'అనునది 'అనిదితాం...'అను సూత్రముచే (335) లుప్తనకార మగు 'అఞ్చ్'ధాతువు షష్ఠీరూపము. "లుప్తనకారమును, భసంజ్ఞకమును అగు 'అఞ్చ్' ధాతువు అకారమునకు లోపము వచ్చును."

'ప్రఅచ్ + అస్'అని యుండ ఈ సూత్రముచే 'అచ్'లోని అకారము నకు లోపము. 'ప్రచ్ + అస్'అని యుండగా-

337. చౌ 6.3.139

లుప్తాకారనకారేఽఞ్చతౌ పరే పూర్వస్యాణో దీర్ఘః. ప్రాచః, ప్రాచా, ప్రాగ్భ్యామ్.

'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి 'పూర్వస్య' 'దీర్ఘః' 'అణః' అనువర్తించును. అఞ్చ్ధాతువునందలి నకార అకారములు లోపింపగా మిగిలిన చకారమునకు 'చౌ'అనునది సప్తమ్యేకవచననిర్దేశము. "నకార అకారములు లోపించిన 'అఞ్చ్'ధాతువు పర మగునపుడు పూర్వమగు 'అణ్'కు దీర్ఘము వచ్చును."

ఈ సూత్రముచే 'ప్ర'యందలి అకారమునకు దీర్ఘము చేయ 'ప్రాచః' 'ప్రాచా'ఇత్యాదిరూపములు సిద్ధించును.

'భ్యామ్'మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు భసంజ్ఞాభావముచే అకారలోపాణ్దీర్ఘములు లేకపోయినను సవర్ణదీర్ఘముచే 'ప్రాచ్'అని యై 'ఝలాంజశోఽన్తే' అను సూత్రముచే (67) చకారమునకు జకారము, పిదప 'చోః కుః'అను సూత్రముచే (307) గకారమును జేయ 'ప్రాగ్భ్యామ్'ఇత్యాది రూపము లగును. 'సు'పర మగునపుడు గకారమునకు చర్త్వముచే కకారము చేసిన పిదప 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము చేయ 'ప్రాక్షు'అను రూపము సిద్ధించును.

ప్రతిపూర్వక 'అఞ్చ్'ధాతువునకు 'క్విన్'ప్రత్యయము చేర్చుటచే నేర్పడిన ప్రత్యక్ఛబ్దమునకు 'సు','ఔ','జస్','అమ్','ఔట్',లందు ప్రాక్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును. 'శస్ మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'ప్రతిఅచ్ + అస్'అని యుండ మొదట 'అచః'అను సూత్రముచే(336) అకారలోపమును, పిమ్మట 'చౌ' అను సూత్రముచే (337) ఇకారరూప మగు 'అణ్'కు దీర్ఘమును చేయ 'ప్రతీచః' 'ప్రతీచా'ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు ప్రాక్ఛబ్దమునందు వలె రూపసిద్ధి యుండును.

'ఉద్'పూర్వక మగు 'అఞ్చ్'ధాతువునకు 'క్విన్'ప్రత్యయము చేర్చుటచే నేర్పడిన ఉదక్ఛబ్దమునకు 'సు','ఔ','జస్','అమ్','ఔట్'లు పర మగునపుడు ప్రాక్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును. 'శస్'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు:-

## 338. ఉద ఈత్. 6.4.139

ఉచ్ఛబ్దాత్పరస్య లుప్తనకారస్యాఞ్చతేర్భస్యాకారస్య **ఈత్.** ఉదీచః, ఉదీచా, ఉదగ్భ్యామ్.

'భస్య'అధికారము. 'అల్లోపోఽనః'నుండి 'అత్' అనువర్తించును. 'ఉద్'కంటె పరమును, లుప్తనకారమును, భసంజ్ఞకమును అగు 'అఞ్చ్'ధాతువు అకారమునకు ఈకార మాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే 'అచ్'లోని అకారమునకు ఈకారాదేశము వచ్చుటచే 'ఉదీచః' 'ఉదీచా'ఇత్యాదిరూపము లగును.హలాదివిభక్తులు పర మగునపుడు ప్రాక్ఛబ్దమునందు వలె రూపము లుండును.

'సమ్'పూర్వక మగు 'అఞ్చ్'ధాతువునకు 'క్విన్' చేర్చుటచే నేర్పడిన 'సమ్అఞ్చ్'అను శబ్దమునకు విశేషకార్యము విధింపబడుచున్నది.

## 339. సమః సమి 6.3.93

వప్రత్యయాన్తే అఞ్చతౌ. సమ్యఙ్; సమ్యఞ్చౌ. సమీచః. సమ్యగ్భ్యామ్.

'విష్వగ్దేవయోశ్చటేరద్ర్యఞ్చతావప్రత్యయే' నుండి 'అఞ్చతావప్రత్యయే' అనువర్తించును. వప్రత్యయాంత మగు అఞ్చ్,ధాతువు పర మగునపుడు 'సమ్' అను ఉపసర్గకు 'సమి'అను నాదేశము వచ్చును.

('అఞ్చతావప్రత్యయే' అనునపుడు 'అఞ్చతౌ + అప్రత్యయే' అని పదచ్ఛేదము చేసి 'అవిద్యమానః ప్రత్యయః యస్మాత్ సః' అను విగ్రహముచే 'అప్రత్యయే' అనుదానికి ఎన్నడును వినబడని (సర్వలోపి యగు) 'క్విన్' మొదలగు ప్రత్యయములు పరమగునపుడు అనునర్థము చెప్పవలెను. కావున మూలము ఫలితార్థకథనపరము.)

ఇచట 'సమ్‌అఞ్చ్'అనునపుడు 'అఞ్చ్'అనునది 'క్విన్' ప్రత్యయాంతము గాన అది పర మగునపుడు 'సమ్'కు 'సమి'అనునది ఆదేశముగ వచ్చి 'సమ్యఞ్చ్' (యణాదేశముచే) అను శబ్దము సిద్ధించును. 'సు', 'ఔ', 'జస్', 'అమ్', 'ఔట్'లు పర మగునపుడు రూపనిష్పత్తి ప్రాక్ఛబ్దమునందు వలె నుండును. 'శస్' మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'అచః'అను సూత్రముచే (336) అకారలోపము, 'చౌ' అను సూత్రముచే (337) 'సమి' యందలి ఇకారమునకు దీర్ఘము వచ్చుటచే 'సమీచః' 'సమీచా'ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాది విభక్తులందు ప్రాక్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

'సహ అఞ్చతి,గచ్ఛతి'అను నర్థమున 'అఞ్చ్'ధాతువునకు 'క్విన్' ప్రత్యయము చేర్చుటచే 'సహ అఞ్చ్' అని యుండ-

340. సహస్య సధ్రిః 6.3.95

తథా. సధ్ర్యఙ్.

అప్లే. అనగా-వప్రత్యయాంత మగు 'అఞ్చ్'ధాతువు పర మగునపుడు 'సహ'అనుదానికి 'సధ్రి'అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'సహ'అనుదానికి 'సధ్రి'ఆదేశమువచ్చుటచే'సధ్ర్యఙ్' 'సధ్ర్యఞ్చౌ'ఇత్యాదిరూపములు సమ్యక్ఛబ్దమునందువలె నిష్పన్న మగును.

'తిరస్‌అఞ్చ్' (క్విన్‌ప్రత్యయకరణానన్తరము) అని యుండ-

341. తిరసస్తిర్యలోపే 6.3.94

అలుప్తాకారేఽఞ్చతౌ వప్రత్యయాన్తే తిరసస్తిర్యాదేశః. తిర్యఙ్ తిర్యఞ్చౌ, తిరశ్చః. తిర్యగ్భ్యామ్.

తిరసః, తిరి; అలోపే. అకారము లోపింపనిదియు,వప్రత్యయాంతమును నగు 'అఞ్చ్'ధాతువు పర మగునపుడు 'తిరస్'అనుదానికి 'తిరి'అను నాదేశము వచ్చును.

'శస్'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'అచః'అను సూత్రముచే (336) 'అఞ్చ్'లోని అకారమునకు లోపము విధింపబడినది గాన ఈ 'తిరి'అను నాదేశము సర్వనామస్థానములందును, హలాదివిభక్తులు పర మగునపుడును మాత్రమే వచ్చును. తిర్యఙ్, తిర్యఞ్చౌ, తిర్యగ్భ్యామ్,ఇత్యాది రూపములు సిద్ధించును. రూపనిష్పత్తి 'ప్రాఙ్'ఇత్యాదులందు వలె నుండును. శసాదులు పర మగునపుడు అకారము లోపించుటచే తిర్యాదేశము రాదు. తిరశ్చః [తిరస్+చ్+అస్-శ్చుత్వ, రుత్వవిసర్గాదులచే] ఇత్యాదిరూపము లగును.

342. నాఞ్చేః పూజాయామ్ 6.4.30

పూజార్థస్యాఞ్చతేరుపధాయా నస్యలోపో న. ప్రాఙ్, ప్రాఞ్చౌ. నలోపాభావాత్ అలోపో న. ప్రాఞ్చః. ప్రాఙ్క్షు. ఏవం ప్రత్యఙ్ఙాదయః.

'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' నుండి 'ఉపధాయాః','క్ఙితి'అను పదములు, 'శ్నాన్నలోపః' నుండి 'నలోపః' అనియు అనువర్తించును. పూజార్థక మగు 'అఞ్చ్'ధాతువు ఉపధానకారమునకు లోపము రాదు.

'అఞ్చు'ధాతువునకు గతి,పూజ అను రెండర్థములు గలవు. అందు 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి'అను సూత్రముచే [335] నకారలోపము గత్యర్థమునందే కాని పూజార్థమున రాదు అని భావము.

ప్రాఙ్:- ప్రథమైకవచనమున 'ప్రాఞ్చ్+స్'అని యుండ 'హల్ఙ్యాది [179] లోపము. 'సంయోగాన్తస్యలోపః'అను సూత్రముచే [20] చకారమునకు లోపము రాగా 'నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః'అను న్యాయముచే చకారమునకు వెనుక నున్న 'ఞ'కారము తన పూర్వరూప మగు నకారత్వమును పొందుటచే 'ప్రాన్'అని యుండును. 'ప్రాన్చ్'అనునపుడు సహజముగ నున్న నకారము 'నశ్చాపదాన్తస్య ఝలి' 'అనుస్వారస్య యయి పరసవర్ణః'అను సూత్రములచే [78,79] 'ఞ'కారముగ మారినది. 'క్విన్ప్రత్యయస్యకుః' అను సూత్రముచే [05] నకారమునకు కుత్వము వచ్చి 'ప్రాఙ్' అను రూపము సిద్ధించును.అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేవియు లేవు. శసాది విభక్తులు పర మగునపుడు కూడ పై సూత్రముచే [342] నలోపము నిషిద్ధము గాన 'ప్రాఞ్చః' 'ప్రాఞ్చా'ఇత్యాదిరూపములు సిద్ధించును.హలాది విభక్తులు పర మగునపుడు మాత్రము పదసంజ్ఞ యుండుటచే చకారమునకు

సంయోగాంతలోపము, నకారమునకు కుత్వముచే ఙకారము, చేయ 'ప్రాఙ్భ్యామ్' 'ప్రాఙ్భిః'ఇత్యాదిరూపములు సిద్ధించును.

ప్రాఙ్క్షు:- 'సుప్'పర మగునపుడు 'ప్రాఞ్చ్ + సు'అని యుండ పైన జూపిన విధమున చకారలోపము, నకారమునకు ఙకారము చేయ ప్రాఙ్ + సు' అని యుండును.ఇచట 'ఙ్ణోః కుక్ టుక్ శరి'అను సూత్రముచే [116] కుగాగమము, 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) సకారమునకు షకారము చేయ 'ప్రాఙ్క్షు'అను రూపము సిద్ధించును. 'చయోద్వితీయాః శరి పౌష్కరసాదే రితి వాచ్యమ్'అను వార్తికముచే [సూ.85] కకారస్థానమున వికల్పముగ ఖకారము వచ్చి 'ప్రాఙ్ఖ్షు'అను రూపము కూడ సిద్ధించును. కుగాగమము వైకల్పికము గాన తదభావపక్షమున 'ప్రాఙ్షు'అను రూపము సిద్ధించును. ఇట్లు సప్తమీబహువచనమున మూడు రూపము లుండును.

పూజార్థకము లగు 'ప్రత్యఙ్'మొదలగు శబ్దముల రూపములు కూడ ఈ విధముగనే సిద్ధించును.

క్రుఙ్, క్రుఞ్చౌ. క్రుఙ్భ్యామ్.

"ఋత్విగ్"ఇత్యాదిసూత్రముచే [302] 'క్రుఞ్చ్'శబ్దము [క్రౌంచపక్షి] 'క్విన్'ప్రత్యయాన్తముగ నిపతింపబడినది.నిపాతబలముచే ఇందలి నకారమునకు 'అనిదితాం' అను సూత్రముచే [335] లోపము రాదు.కావున 'క్రుఞ్చ్ శబ్దరూపములు పూజార్థక'ప్రాఞ్చ్'శబ్దరూపముల వలె సిద్ధించును.

పయోముక్, పయోముగ్, పయోముచౌ. పయోముగ్భ్యామ్.

మేఘార్థక మగు 'పయోముచ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'పయోముచ్ + సు'అని యుండ హల్ఙ్యాదిలోపము [179]. 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే [67] చకారమునకు జకారము. 'చోః కుః' అను సూత్రముచే [307] జకారమునకు గకారము, పిమ్మట 'వావసానే' అను సూత్రముచే [146]. చర్త్వ [కకార] వికల్పము. 'పయోముక్''పయోముగ్'అను రూపములు సిద్ధించును.

అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యములు లేకుండుటచే 'పయోముచౌ' 'పయోముచా'ఇత్యాది రూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు 'ఝలాం జశోఽన్తే' [67] 'చోః కుః' [307] అను సూత్ర

ములచే జశ్త్వకుత్వములు చేయ 'పయోముగ్భ్యామ్' 'పయోముగ్భిః'ఇత్యాది రూపములు సిద్ధించును. సప్తమీబహువచనమున 'పయోముచ్ + సు'అని యుండ 'ఝలాంజశోఽన్తే' [67] 'చోః కుః' [307], 'ఖరి చ' (74)అను సూత్రములచే జశ్త్వ, కుత్వ, చర్త్వములును, సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వమును చేయ 'పయోముక్షు'అను రూపము సిద్ధించును,

ఉగిత్త్వాన్నుమ్-

343. సాన్తమహతః సంయోగస్య 6.4.10

సాన్తసంయోగస్య మహతశ్చ యో నకారః తస్యోపధాయా దీర్ఘోఽసమ్బుద్ధౌ సర్వనామస్థానే. మహాన్, మహాన్తౌ, మహాన్తః, హే మహన్. మహద్భ్యామ్.

'సర్వనామస్థానే చాఽసమ్బుద్ధౌ' 'నోపధాయాః'అను సూత్రములును, 'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి 'దీర్ఘః'అనువర్తించును.

'వర్తమానే పృషన్మహద్బృహజ్జగచ్ఛతృవచ్చ'అను ఉణాదిసూత్రముచే నిపాతిత మగు మహచ్ఛబ్దమునకు శతృవద్భావము కూడ విధింపబడినది. అనగా 'మహత్'శబ్దము 'శతృ'ప్రత్యయాన్తశబ్దమువంటి దగును. 'శతృ'లోని 'ఋ' ఇత్సంజ్ఞకము గాన అది ఉగిత్తు. కావున సర్వనామ స్థానములందు 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః'అను సూత్రముచే (270) నుమాగమము వచ్చును. ప్రథమైకవచనమున నుమాగమము చేసిన పిమ్మట 'మహన్త్ + సు' అని యుండ హల్ఙ్యాదిలోపము (179). 'మహన్త్' అని యుండగా సంయోగాంత లోపముచే (20) 'మహన్'అని యుండును. ఇపుడు-

'సంబుద్ధిభిన్న మగు సర్వనామస్థానము పర మగునపుడు సకారాంత సంయోగము, మహచ్ఛబ్దనకారము-వీటి ఉపధకు దీర్ఘము వచ్చును.' ఈ సూత్రముచే నకారపూర్వవర్తి యగు అకారమునకు దీర్ఘము చేయగా 'మహాన్' అను రూపము సిద్ధించును. ఇట్లే 'ఔ','జస్','అమ్','ఔట్'లు పర మగునపుడు నుమాగమోపధాదీర్ఘములచే 'మహాన్తౌ,' 'మహాన్తః,' 'మహాన్తమ్' 'మహాన్తౌ'అను రూపములు సిద్ధించును. సంబుద్ధియందు ఉపధాదీర్ఘము రాదుగాన 'హేమహన్'అని యుండును 'శస్' మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు నుమాగమోపధాదీర్ఘముల ప్రసక్తి లేదు గాన 'మహతః', 'మహతా'ఇత్యాది

రూపములుండును హలాది విభక్తులు పర మగునపుడు 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే (67) జశ్త్వము వచ్చి 'మహద్భ్యామ్' ఇత్యాదిరూపము సిద్ధించును. 'సుప్' పర మగునపుడు జశ్త్వము చేసినను 'ఖరి చ' అను సూత్రముచే (74) మరల చర్త్వముచే తకారమే యుండును గాన 'మహత్సు' అను రూపము సిద్ధించును.

ధీశబ్దమునకు 'తదస్యాస్త్యస్మిన్నితి మతుప్' అను సూత్రముచే (1181) 'మతుప్' ప్రత్యయము-'ధీమత్' అను శబ్దము నిష్పన్నమైనది ('మతుప్'లోని ఉకారపకారములు ఇత్సంజ్ఞకములు) దానికి ప్రథమైకవచనమున 'ధీమత్ + సుప్' అని యుండ 'ఉగిదచాం ..' (270) 'హల్ఙ్యాబ్భ్యః' (179) 'సంయోగాన్తస్య లోపః (20) అను సూత్రములచే నుమ్, సులోప, తకారలోపములచే 'ధీమన్' అని యుండును-ఇచట సంయోగాన్తలోపము అసిద్ధము గాన 'సర్వనామస్థానే...' (177) అను సూత్రముచే దీర్ఘ ప్రసక్తి లేదు.

### 344. అత్వసన్తస్య చాఽధాతోః 6.4.14

అత్వన్తస్యోపధాయా దీర్ఘో ధాతుభిన్నాసన్తస్య చాఽసమ్బుద్ధౌ సౌ పరే. ఉగిత్వాన్నుమ్. ధీమాన్, ధీమన్తౌ, ధీమన్తః, హే ధీమన్, శసాదౌ మహద్వత్.

అతు;అసన్తస్య;చ;అధాతోః.'నోపధాయాః' 'సర్వనామస్థానేచాసంబుద్ధౌ' 'సౌ చ' 'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' అను సూత్రములనుండి 'ఉపధాయాః' 'అసంబుద్ధౌ' 'సౌ','దీర్ఘః'అను పదములు అనువర్తించును. సంబుద్ధిభిన్నమగు 'సు'పర మగునపుడు 'అతు'అనునది అంతమందు కలదాని ఉపధకును,ధాతుభిన్నమగు 'అస్'అనునది అంతమందు కలదాని ఉపధకును దీర్ఘము వచ్చును.

ఇచట 'అతు'అనుదానిచే 'మతుప్','వతుప్','డవతు' మొదలగు 'అతు' యుక్తము లగు ప్రత్యయములు నిర్దేశింపబడుచున్నవి. 'ధీమన్' అనునపుడు సుప్రత్యయము లోపించినను "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్'అను పరిభాషచే (190)'సు' పరముగ నున్నట్లే భావింపబడును గాన ఉపధాదీర్ఘమువచ్చి'ధీమాన్' అను రూపము సిద్ధించును. ఇతరసర్వనామస్థానములందు నుమాగమము మాత్రము వచ్చి 'ధీమన్తౌ' 'ధీమన్తః' 'ధీమన్తమ్',అనురూపము లగును.

సంబుద్ధియందు దీర్ఘము నిషిద్ధము గాన 'హేధీమన్' అని యుండును. శసాది విభక్తులందు మహచ్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

భాతేర్డవతుః.డిత్వసామర్థ్యాదభస్యాపి టేర్లోపః. భవాన్; భవన్తౌ, భవన్తః. శత్రన్తస్య-భవన్.

'భా దీప్తౌ'అను ధాతువునకు 'భాతేర్డవతుః' అను ఉణాదిసూత్రముచే డవతు ప్రత్యయము చేర్చుటచే 'భా + అవత్'అని యుండును. 'డవతు'లోని డకారమునకు 'చుటూ'అను సూత్రముచే (129) ఇత్సంజ్ఞ. ఉకారము కూడ ఇత్సంజ్ఞకము. ఈ ప్రత్యయము తృతీయాధ్యాయములోనిది. చతుర్థపంచమాధ్యాయప్రత్యయములు పర మగునపుడు మాత్రమే, 'యచి భమ్'అను సూత్రముచే (165)భసంజ్ఞ యుండును. కావునఇచట'టేః'అనుసూత్రముచే (242) భసంజ్ఞక మగుదానికి విధింపబడిన టిలోపము వచ్చుటకు అవకాశము లేదు. కాని టిలోపము రాని పక్షమున 'డవతు'లో ఇత్సంజ్ఞక డకారమును జేర్చుట వ్యర్థము కావలసి వచ్చును. కావున డిత్త్వసామర్థ్యముచే, ఇచట మాత్రము, భసంజ్ఞ లేకున్నను టిలోప మంగీకరింపబడినది. ఇట్లు 'టి'యగు 'ఆ' లోపించుటచే 'భ్ + అవత్' = 'భవత్'అను శబ్దము నిష్పన్న మైనది. ఇపు డీ శబ్దమునందు రూపములు ధీమచ్ఛబ్దమునందు వలె సిద్ధించును.

భూధాతువునకు 'శతృ'(అత్) ప్రత్యయము చేర్చుటచే నిష్పన్న మగు 'భవత్'శబ్దము అత్వంతము ('అతు' అనునది అంతమున గలది) కాదు కావున 'అత్వసన్తస్య'-ఇత్యాది సూత్రముచే (344) ప్రథమైకవచనమున దీర్ఘమురాదు. "సంయోగాన్తస్య లోపః" అను (20) తకారలోపము అసిద్ధము గాన 'సర్వనామస్థానే చాసంబుద్ధౌ (177) అను దీర్ఘము కూడ రాదు. 'భవన్' అను రూపము సిద్ధించును. ఇతర రూపములలో భేదము లేదు.

### 345. ఉభే అభ్యస్తమ్ 6.1.5

షాష్ఠద్విత్వప్రకరణే యే ద్వే విహితే తే ఉభే సముదితే అభ్యస్తసంజ్ఞే స్తః.

'ఏకాచో ద్వే ప్రథమస్య' నుండి 'ద్వే'అనువర్తించును. ఆరవ అధ్యాయమునందలి ద్విత్వప్రకరణమున విహితము లగు రెండు రూపములును కలిసి అభ్యస్తసంజ్ఞకము లగును.

### 346 నాభ్యస్తాచ్ఛతుః 7.1.78

అభ్యస్తాత్పరస్య శతుర్నుమ్ న. దదత్, దదద్, దదతౌ, దదతః.

'ఇదితో నుమ్ ధాతోః' నుండి 'నుమ్' అనువర్తించును. అభ్యస్తము కంటె పర మగు శతృప్రత్యయమునకు 'నుమ్' రాదు.

'దాఞ్'ధాతువుకంటె పర మగు 'లట్'కు శతృప్రత్యయము చేర్చిన పిదప 'శప్'వచ్చును. దానికి 'జుహోత్యాదిభ్యః శ్లుః'అను సూత్రముచే (607) శ్లు-అనగా లోపము. 'శ్లౌ'అను సూత్రముచే (608) ద్విత్వము, అభ్యాసహ్రస్వాదులు చేయుటచే 'దదత్'అను శబ్దము నిష్పన్న మైనది. ఇపుడు 'సుప్'లు చేర్చిన పిదప 'ఉగిదచాం సర్వనామస్థానే ఽధాతోః'అను సూత్రముచే (290) నుమాగమము రావలసి యున్నది. కాని ఈ ద్విత్వము షష్ఠాధ్యాయగత మగుటచే అభ్యస్తసంజ్ఞ యుండును గాన ఈ సూత్రముచే నుమాగమనిషేధము. కావున 'దదత్'ఇత్యాదిరూపములు సిద్ధించును. ప్రథమైకవచనమున హల్ఙ్యాది సూత్రముచే (179) 'సు' లోపించిన పిదప 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే(67) జశ్త్వము,'వాఽవసానే'అను సూత్రముచే (146) చర్త్వవికల్పము చేయ 'దదత్' 'దదద్'అను రెండు రూపము లుండును. ఇతర విభక్తులందు ప్రత్యేక విశేషకార్యము లేవియు లేవు.

### 347 జక్షిత్యాదయః షట్ 6.1.6

షట్ ధాతవోఽన్యే జక్షితిశ్చ సప్తమః; ఏతే అభ్యస్తసంజ్ఞాః స్యుః. జక్షత్, జక్షతౌ, జక్షతః. ఏవం జాగ్రత్, దరిద్రత్, శాసత్, చకాసత్. గుప్, గుబ్; గుపౌ. గుబ్భ్యామ్.

'ఉభే అభ్యస్తమ్' నుండి 'అభ్యస్తమ్' అనువర్తించును. 'జక్ష్'ధాతువు, దాని అనంతరమున నున్న ఆరుధాతువులు, ఈ ఏడు ధాతువులును అభ్యస్త సంజ్ఞకములు."

ఈ ధాతువులకు అభ్యస్తసంజ్ఞ యుండుటచే 'నాభ్యస్తాచ్ఛతుః'అను సూత్రముచే (346) 'నుమ్'నిషిద్ధము గాన దదచ్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

'జక్షి,జాగృ,దరిద్రా,శాస్,దీధీఙ్,వేవీఙ్,చకాసృ చ
అభ్యస్తసంజ్ఞంవిజ్ఞేయం ముక్తం ధాతుసప్తకమ్'

అను కారికలో చెప్పబడినవి జక్షిత్యాదులు. ఇందు దీధీఙ్, వేవీఙ్ ధాతువులు వేదమందు మాత్ర ముపయు క్తములు.

రక్షకుడు అను నర్థము గల పకారా న్త 'గుప్'శబ్దమునకు ప్రథమైకవచనమున హల్జ్యాదిలోపము, (179), 'ఝలాం జశోఽ న్తే' అను సూత్రముచే (67) జ శ్త్వము,'వావసానే'అను సూత్రముచే (146) చ ర్త్వవికల్పము చేయుటచే 'గుప్','గుబ్'అను రెండు రూపములు సిద్ధించినవి. హలాదివిభ క్తులు పరమగునపుడు పదసంజ్ఞ యుండును గాన 'ఝలాం జశో న్తే'అను సూత్రముచే (67) జ శ్త్వముచేయ 'గుబ్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును.

368 త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్చ 3.2.60

త్యదాదిషూపపదేషు అజ్ఞానార్థాత్ దృశేః కఞ్,చాత్ క్విన్.

త్యదాదిపదములు ఉపపదములుగ నున్నపుడు జ్ఞానార్థకము కాని 'దృశ్' ధాతువునకు 'కఞ్'ప్రత్యయము కూడ వచ్చును. 'కూడ'అనుటచే 'క్విన్'ప్రత్యయముమ వచ్చును.

తద్ + దృశ్అని యుండ ఈ సూత్రముచే 'క్విన్'ప్రత్యయము. ఈ ప్రత్యయము సర్వలోపి. 'తద్' 'దృశ్'లకు ఉపపదసమాసము చేసిన పిమ్మట.

349 ఆ సర్వనామ్నః 6.3.91

సర్వనామ్నః ఆకారోఽ న్తాదేశః స్యాద్ దృగ్దృశ్వతుషు.తాదృక్, తాదృగ్, తాదృశౌ, తాదృశః, తాదృగ్భ్యామ్.

'దృగ్దృశవతుషు'అను సూత్ర మనువ ర్తించును. "సర్వనామశబ్దమునకు దృగ్,దృశ్,వత్,అనునవి పర మగునపుడు ఆకారము అన్తాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే దకార స్థానమునఆకారము వచ్చి 'త + ఆ + దృశ్' అని యుండ సవర్ణదీర్ఘసంధిచే 'తాదృశ్'అను శబ్ద మేర్పడును. దీని ప్రథమైకవచనమున హల్జ్యాది సూత్రముచే (179) సులోపము. 'వ్రశ్చ'ఇత్యాది సూత్రముచే (308) పదా న్తశకారమునకు షత్వము. 'ఝలాం జశోఽ న్తే'అను సూత్రముచే (67) షకారమునకు మూర్ధస్థానసామ్యముచే డకారము. డకారమునకు 'క్విన్ప్రత్యయస్య కుః' అను సూత్రముచే (306) కుత్వము చేయగా గకారము. గానికి "వాఽవసానే"అను(146)చ ర్త్వవికల్పముచే'తాదృక్','తాదృగ్' అను రెండు రూపములు సిద్ధించును. అజాది విభ క్తులు పర మగునపుడు విశేష

కార్యములు లేవు. హలాది విభక్తులు పర మగునపుడు పైన చూపిన విధమున షత్వ,జశ్త్వ,కుత్వములచే 'తాదృగ్భ్యామ్' ఇత్యాది రూపములు సిద్ధించును. 'సుప్'పర మగునపుడు మాత్రము జశ్త్వగకారమునకు 'ఖరి చ'అను సూత్రముచే (74) చర్త్వకకారము, సకారమునకు "ఆదేశప్రత్యయయోః"అను సూత్రముచే (150) షకారమును వచ్చుటచే 'తాదృక్షు' అను రూపము సిద్ధించును. యాదృశ్, ఏతాదృశ్,త్వాదృశ్,యుష్మాదృశ్,మాదృశ్, అస్మాదృశ్, భవాదృశ్, కీదృశ్,ఈదృశ్,ఇత్యాది 'దృశ్'శబ్దాన్త శబ్దములను, 'ఘృతస్పృశ్' మొదలగు 'క్విన్'ప్రత్యయాంతశబ్దములను ఈ విధముగనే సిద్ధించును.

'వ్రశ్చ' ఇతి షః, జశ్త్వచర్త్వే — విట్, విడ్, విశౌ, విశః, విడ్భ్యామ్.

'విశ్'శబ్దమున'వ్రశ్చ'-ఇత్యాది సూత్రముచే (308) శకారమునకు షకారము. 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే (67) షకారమునకు డకారము. 'వాఽవసానే'అను సూత్రముచే (146)డకారమునకు చర్త్వవికల్పము. కావున ప్రథమైకవచనమున విట్,విడ్, అను రెండు రూపములుండును. 'విశ్'శబ్దము 'క్విప్'ప్రత్యయాంతము కాని క్విన్ ప్రత్యయాంతము కాదు. కావున 'క్విన్ ప్రత్యయస్య కుః'అను సూత్రముచే (305) డకారమునకు కుత్వప్రసక్తి లేదు ఇదియే 'తాదృశ్' 'విశ్'శబ్దముల భేదము. అజాదివిభక్తులందు విశేషకార్య మేమియు లేదు హలాదివిభక్తులు పర మగునపుడు షత్వజశ్త్వములచే 'విడ్భ్యామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్'పర మగునపుడు 'డః సి ధుట్'అను సూత్రముచే (86) వికల్పముగ ధుడాగమము చేసిన పిమ్మట డకారధకారములకు 'ఖరి చ'అను సూత్రముచే (74) చర్త్వము చేయగా 'విట్త్సు' అనియు, ధుడాగమాభావపక్షమున 'విట్సు' అనియు రెండు రూపములు సిద్ధించును.

### 350 నశేర్వా 8.2.63

నశేః కవర్గోఽన్తాదేశో వా పదాన్తే. నక్,నగ్,నట్,నడ్,నశౌ, నశః, నగ్భ్యామ్. నడ్భ్యామ్.

'క్విన్ప్రత్యయస్య కుః' 'స్కోః సంయోగాద్యోరన్తే చ' అను సూత్రములనుండి 'కుః' 'అన్తే' అనువర్తించును. 'పదస్య'అని అధికార సూత్రము.

"నశ్ధాతువునకు పదాన్తమునందు వికల్పముగ కవర్గము అన్తాదేశముగ వచ్చును."

'నశ్'శబ్దమునకు ఈ సూత్రముచే కుత్వము వచ్చిన పక్షమున 'తాదృశ్' శబ్దమునందు వలెను, కుత్వాఽభావపక్షమున 'విశ్'శబ్దమునందు వలెను రూప నిష్పత్తి యుండును.

351 స్పృశోఽనుదకే క్విన్ 3.2.58

అనుదకే సుప్యుపపదే స్పృశేః క్విన్. ఘృతస్పృక్, ఘృతస్పృగ్, ఘృతస్పృశౌ, ఘృతస్పృశః, దధృక్, దధృగ్, దధృషౌ, దధృగ్భ్యామ్, రత్నముట్, రత్నముడ్, రత్నముషౌ; రత్నముడ్భ్యామ్. షట్, షడ్, షడ్భిః, షడ్భ్యః2. షణ్ణామ్. షట్సు.

'సుపి స్థః' నుండి 'సుపి'అను పదము అనువర్తించును. 'ఉదక'భిన్నమగు సుబన్తము ఉపపదముగా నుండ 'స్పృశ్'ధాతువునకు 'క్విన్' ప్రత్యయము వచ్చును,

'ఘృతం స్పృశతి'అను నర్థమున ఈ సూత్రముచే 'క్విన్' ప్రత్యయము. పిదప 'ఉపపదమతిఙ్'అను సూత్రముచే (957) ఉపపదసమాసము. ఈ 'ఘృతస్పృశ్'శబ్దరూపముల నిష్పత్తి 'తాదృశ్'శబ్దమునందు వలె నుండును.

'దధృష్'శబ్దము (తిరస్కరించువాడు) "ఋత్విగ్దధృక్...' ఇత్యాది సూత్రముచే (302) 'క్విన్'ప్రత్యయము చేర్చుటచే నిష్పన్నమైనది. 'క్విన్' ప్రత్యయాంతముగాన హలాదివిభక్తులందు 'తాదృశ్'శబ్దమునందు వలె రూపములు సిద్ధించును. అజాదివిభక్తులందు విశేషకార్యములేవియు లేక పోవుటచే 'దధృషౌ' 'దధృషః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

'రత్నముష్'శబ్దప్రథమైకవచనమున హల్ఙ్యాది సూత్రముచే (179) 'సు' లోపించిన పిమ్మట జశ్త్వముచే డకారము, చర్త్వముచే టకారవికల్పము. రత్నముట్-రత్నముడ్ అను రెండు రూపములు సిద్ధించును. 'రత్నముష్' శబ్దము క్విప్ప్రత్యయాంతము. 'క్విన్'ప్రత్యయాంతము కాదు. కావున 'క్విన్ప్రత్యయస్య కుః'అను సూత్రముచే (305) కుత్వప్రసక్తి లేదు. అజాదివిభక్తులందు విశేషకార్యమేమియు లేదు- 'రత్నముషౌ' ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాదివిభక్తులందు 'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే (67) జశ్త్వము

చేయగా 'రత్నముడ్భ్యామ్'ఇత్యాదిరూపములు నిష్పన్నమగును. 'సుప్'పర మగునపుడు వైకల్పిక ధుడాగమము, 'ఖరి చ' అను సూత్రముచే (74) చర్త్వము వచ్చుటచే 'రత్నముట్త్సు' 'రత్నముట్సు'అను రెండు రూపములు సిద్ధించును.

షకారాంత మగు'షష్'శబ్దము నిత్యబహువచనాంతము. "ష్ణాన్తాఃషట్' అను సూత్రముచే (298) షట్సంజ్ఞ. 'షడ్భ్యో లుక్' (188) అను సూత్రముచే 'జస్', 'శస్'లకు లోపము. 'ఝలాం జశోఽన్తే' (67) 'వావసానే' (146) అను సూత్రములచే జశ్త్వ,వైకల్పికచర్త్వములచే 'షట్' 'షడ్' అను రెండు రూపములు సిద్ధించును.

షష్ఠీబహువచనమున 'షష్ + ఆమ్'అని యుండగా'షట్చతుర్భ్యశ్చ' అను సూత్రముచే (266) నుడాగమము-షష్ + నామ్, 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే (67) షకారమునకు జశ్త్వముచే డకారము 'ష్టునాష్టుః' అను సూత్రముచే (64) 'నామ్' లోని నకారమునకు 'ణ'కారము:- 'షడ్ + ణామ్' ఇపుడు 'ప్రత్యయే భాషాయాం నిత్యమ్'అను వార్తికముచే (సూ.68) డకారమునకు ణకారము. 'షణ్ణామ్'అను రూపము సిద్ధించును. ఇతరవిభక్తులందు రూపములు రత్నముట్ఛబ్దమునందు వలె సిద్ధించును.

షకారాన్త మగు 'పిపఠిష్ శబ్దముప్రథమైకవచనమున హల్ఙ్యాది సూత్రముచే (179) సు'లోపించిన పిదప:-

రుత్వం ప్రతి షత్వస్యాఽసిద్ధత్వాత్ 'స సజుషో రుః'ఇతి రుత్వమ్.

'పిపఠిష్'అను పదమునందలి షకారము సకారస్థానమున 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే వచ్చినది. 'స సజుషో రుః'అను సూత్ర (105) దృష్టి'ఆదేశప్రత్యయయోః'అను సూత్రము (150) అసిద్ధము. దాని కచట సకారమే గోచరించుచుండును. కావున ష(స)కారమునకు రుత్వము, వచ్చి 'పిఠిర్'అని యుండగా:-

352 ర్వోరుపధాయా దీర్ఘ ఇకః 8.2.76

రేఫవాన్తయోరుపధాయా ఇకో దీర్ఘః పదాన్తే. పిపఠీః,పిపఠిషౌ. పిపఠీర్భ్యామ్. చికీః; చికీర్షౌ; చికీర్భ్యామ్. చికీర్షు.

'సిపిధాతోరుర్వా' నుండి 'ధాతోః': 'స్కోః సంయోగాద్యోర న్తే చ" నుండి 'అ న్తే' అనువర్తించును. 'పదస్య' అధికారము. "పదా న్తమునందు రేఫ వకారాంత ధాతువుల ఉపధ యగు 'ఇక్'కు దీర్ఘము వచ్చును.

ఈ సూత్రముచే రేఫకు వెనుక నున్న ఇకారరూప మగు'ఇక్'కు దీర్ఘము,'ఖరవసానయోర్విసర్జనీయః" అను సూత్రముచే (93) రేఫకు విసర్గము చేయగా 'పిపఠీః'అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులందు విశేషకార్యములు లేకుండుటచే 'పిపఠిషౌ'ఇత్యాది రూపములును, హలాదివిభక్తులందు ఉపధాదీర్ఘముచే 'పిపఠీర్భ్యామ్'ఇత్యాది రూపములును సిద్ధించును.

'సుప్'ప్రత్యయము పర మగునపుడు 'పిపఠిష్ + సు'అని యుండ వెనుక చూపిన విధముగ రుత్వవిసర్గములచే 'పిపఠీః + సు'అని యగును. 'వా శరి' అను సూత్రముచే (104) విసర్గమునకు వైకల్పికవిసర్గము, తదభావపక్షమున "విసర్జనీయస్య సః'అను సూత్రముచే (203) విసర్గస్థానమున సకారమును చేయుటచే 'పిపఠీఃసు' 'పిపఠీస్సు'అను రెండు రూపము లుండగా:-

353 నుమ్విసర్జనీయశర్వ్యవాయేఽపి 8.3.58

ఏతైః ప్రత్యేకం వ్యవధానేఽపి ఇణ్కుభ్యాం పరస్య సస్య మూర్ధన్యాదేశః, ష్టుత్వేన పూర్వస్య షః. పిపఠీష్షు, పిపఠీఃషు.

'ఇణ్కోః' 'అపదా న్తస్య మూర్ధన్యః'అను సూత్రము లనువర్తించును. "'ఇణ్'కవర్గములకంటె పర మగు సకారమునకు 'నుమ్'.విసర్గ,'శర్'లలో ఏ ఒక్కదానితో నైన వ్యవధాన మున్నను షత్వము వచ్చును."

ఈ సూత్రముచే 'సు'లోని సకారమునకు షత్వము. వెనుక నున్న సకారమునకు ష్టుత్వముచే షత్వము. 'పిపఠీష్షు పిపఠీఃషు' అను రెండు రూపములు సిద్ధించును.

'చికీర్ష్'ప్రథమైకవచనమున 'చికీర్ష్ + స్'అని యుండగా హల్ఙ్యాదిలోపము (179). షత్వ మసిద్ధమగుటచే (అచట సకారమే అగుపడుచుండును గన) 'రాత్సస్య'అను సూత్రముచే (209) సకారలోపము. 'ఖరవసానయోర్విసర్జనీయః' అను సూత్రముచే (93) రేఫకు విసర్గము. 'చికీః'అను రూపము సిద్ధించున. అజాదివిభక్తులందు విశేషకార్యములు లేవు. హలాదివిభక్తులందు'రాత్సస్య'అను సూత్రముచే (209) ష (స) కారలోపముచే "చికీర్భ్యామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును.

'సుప్‌'పర మగునపుడు 'చికీర్ష్+సు' అని యుండగా వెనుకటి వలె షకారలోపము-చికీర్+సు,'రోః సుపి'అను నియమ సూత్రముచే (268) 'ఖర వసానయోర్విసర్జనీయః' (93)అను విసర్గ నిరుద్ధము. అనగా ఇచటి 'రేఫ', 'రు కు సంబంధించినది కాదుకావున విసర్గము రాదు. "ఆదేశప్రత్యయయోః"అను సూత్రముచే (150) (రేఫ 'ఇణ్' కావున) సకారమునకు షత్వముచే 'చికీర్షు' అను రూపము సిద్ధించును.

విద్వాన్. విద్వాంసౌ, హే విద్వన్.

'విద'ధాతువుకు చేర్చిన కర్త్రర్థక 'శతృ'ప్రత్యయమునకు 'విదేఃశతు ర్వసుః'అను సూత్రముచే (836)'వసు' అను నాదేశము చేయుటచే 'విద్వస్'అను సకారాన్తశబ్దము నిష్పన్న మైనది. 'వసు'లోని ఉకారము ఇత్సంజ్ఞకము గాన సర్వనామస్థానములు పర మగునపుడు 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః' అను సూత్రముచే (290) నుమాగమము వచ్చును.

ప్రథమైకవచనమున 'విద్వస్+స్'అని యుండ నుమాగమము 'విద్వన్స్ +స్'.హల్ఙ్యాదిలోపము (179)-విద్వన్స్. 'సాన్తమహతః సంయోగస్య' అను సూత్రముచే (343) నకారోపధ యగు అకారమునకు దీర్ఘము. పిదప సకారము నకు 'సంయోగాన్తస్య లోపః'అను సూత్రముచే(20) లోపము. 'విద్వాన్'అను రూపముసిద్ధించును. సంయోగాన్తలోప మసిద్ధ మగుటచే 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ'అను సూత్రముచే (177) దీర్ఘప్రసక్తి లేదు గాన 'సాన్తమహతః-' అను సూత్రముచే (343) దీర్ఘము చేయబడినది.

సంబుద్ధియందు దీర్ఘము నిషిద్ధము గాన 'విద్వన్'అను రూపము సిద్ధించును. 'ఔ'పర మగునపుడు వెనుకటి వలెనే నుమ్-దీర్ఘములు వచ్చును. 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (84) నకారమునకు అనుస్వారము 'విద్వాంసౌ'అను రూపము సిద్ధించును. 'జస్','అమ్'. 'ఔట్'లు పర మగునపుడు గూడ రూపనిష్పత్తి యిటులనే యుండును.

ద్వితీయాబహువచనమున 'విద్వస్+శస్'అని యుండగా:-

354. వసోః సమ్ప్రసారణమ్ 6.4.131

వస్వన్తస్య భస్య సమ్ప్రసారణం స్యాత్. విదుషః.'వసుస్రంసు' ఇతి దః-విద్వద్భ్యామ్.

'భస్య' అధికారము. "భసంజ్ఞకమును 'వసు' అనునది అంతమున గలదియు నగు శబ్దమునకు సంప్రసారణము వచ్చును."

అజాదివిభక్తి పర మగునపుడు పూర్వశబ్దము భసంజ్ఞకము గాన 'విద్వస్' లోని రెండవ వకారమునకు సంప్రసారణముచే ఉకారము. 'విద్ + ఉ + అస్ + అస్' అని యుండును. 'సంప్రసారణాచ్చ' అను సూత్రముచే (258) అకారమునకు పూర్వరూపము-'విదుస్ + అస్'. ఇందలి మొదటి సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వము. రెండవ సకారమునకు రుత్వవిసర్గములు. 'విదుషః' అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు రూపసిది ఇట్లే ఉండును. హలాదివిభక్తులు పర మగునపుడు 'వసుస్రంసుధ్వంస్వనడుహాం దః' అను సూత్రముచే (262) సకారమునకు దకార మాదేశ మగుటచే 'విద్వద్భ్యామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును.

355. పుంసోఽసుఙ్ 7.1.89

సర్వనామస్థానే వివక్షితేఽసుఙ్ స్యాత్. పుమాన్, హే పుమన్. పుమాంసౌ, పుంసః, పుమ్భ్యామ్, పుంసు, 'ఋదుశనస్'-ఇత్యనఙ్-ఉశనా, ఉశనసౌ.

'ఇతోఽత్సర్వనామస్థానే' నుండి 'సర్వనామస్థానే' అనువర్తించును. "సర్వనామస్థానము వివక్షిత మగునపుడు 'పుంస్' అను శబ్దమునకు 'అసుఙ్' అను నాదేశము వచ్చును."

'పుంస్' శబ్దము 'పూఞో డుమ్సున్' అను సూత్రముచే 'పూఞ్' ధాతువునకు 'డుమ్సున్' ప్రత్యయము చేర్చుటచే ఏర్పడినది. 'డుమ్సున్' ఉదిత్ కాన ఉదిత్కార్యము లభించును దీని ప్రథమైకవచనమున 'పుంస్ + సు' అని యుండ ఈ సూత్రముచే 'అసుఙ్' ఆదేశము. ఇందలి ఉకార ముచ్చారణార్థము. ఙకారము ఇత్సంజ్ఞకము. 'ఙిత్' కావున 'ఙిచ్చ' అను సూత్రముచే (46) అంత్యవర్ణ మగు సకారముస్థానమున వచ్చును. 'నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః' అను న్యాయముచే అనుస్వారనిమిత్త మగుసకారము పోవుటచే అనుస్వారము తన పూర్వరూప మగు మకారత్వమును పొంది 'పుమ్ + అస్ + సు' అని యుండును. 'ఉగిదచాం-' అను సూత్రముచే (290) నుమాగమము-'పుమన్స్ + స్' హల్ఙ్యాది లోపము (179) పుమన్స్. 'సాన్తమహతః సంయోగస్య' అను సూత్రముచే (343) ఆకారదీర్ఘము-'పుమాన్స్' సకారమునకు సంయోగాన్తలోపము (20)-

'పుమాన్' అను రూపము సిద్ధించును. సంబుద్ధియందు దీర్ఘము నిషిద్ధము గాన 'హేపుమన్' అను రూపము. ఇతరసర్వనామస్థానములందు కూడ అసుఙాదేశ, నుమాగమోపధాదీర్ఘములును. 'నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే (78) నకారమునకు అనుస్వారమును వచ్చుటచే 'పుమాంసౌ', 'పుమాంసః', 'పుమాంసమ్' అను రూపములు సిద్ధించును. 'శస్' మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్య మేదియు లేక పోవుటచే 'పుంసః', 'పుంసా' ఇత్యాదిరూపము లగును. హలాదివిభక్తులు పర మగునపుడు సంయోగాన్తలోపముచే (20) సకారము లోపించిన పిదప 'నిమిత్తాపాయే-' అను న్యాయమున అనుస్వారము మకారముగ మార్పు చెందిన పిదప దానికి 'మోనుస్వారః' అను సూత్రముచే (77) అనుస్వారము, 'అనుస్వారస్య యయి పరసవర్ణః' అను సూత్రముచే (79) దానికి పరసవర్ణ మగు మకారమును, వచ్చి 'పుమ్భ్యామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్' పర మగునపుడు 'పుంస్ + సు' అని యుండ మొదటి సకారమునకు సంయోగాన్తలోపము (20). అనుస్వారము మకారముగ మారిన పిదప దానికి మరల 'మోఽనుస్వారః' అనుసూత్రముచే (77) అనుస్వారమువచ్చుటచే 'పుంసు' అను రూపము సిద్ధించును.

'ఉశనస్' (శుక్రుడు) శబ్దప్రథమైకవచనమున 'ఉశనస్ + సు' అని యుండ 'ఋదుశనస్పురుదంసోఽనేహసాఞ్చ' అను సూత్రముచే (204) అనఙాదేశము. 'ఙిచ్చ' అను సూత్రముచే (46) అన్త్యసకారమున కాదేశముగ వచ్చును- ఉశన + అన్ + స్. 'సర్వనామస్థానేచాఽసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) దీర్ఘము; పిదప సవర్ణదీర్ఘము-'ఉశనాన్ + స్' అని యుండ హల్ఙ్యాదిసూత్రముచే (179) అపృక్తసకారలోపము. 'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నకారలోపము. 'ఉశనా' అను రూపము సిద్ధించును. 'ఔ' మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యములు లేవు. 'ఉశనసౌ' ఇత్యాది రూపములు సిద్ధించును.

సంబుద్ధి పర మగునపుడు 'హే ఉశనస్ + సు' అని యుండగా:-

వా. అస్య సమ్బుద్ధౌ వాఽనఙ్, నలోపశ్చ వాచ్యః.

హే ఉశన, హేఉశనన్, హేఉశనః, హేఉశనసౌ, ఉశనోభ్యామ్, ఉశనస్సు. అనేహా, అనేహసౌ, హేఅనేహః. వేధాః, వేధసౌ, హే వేధః, వేధోభ్యామ్.

ఈ ఉశనశ్శబ్దమునకు సంబుద్ధి పర మగునపుడు 'అనఙ్' వికల్పముగ వచ్చును నకారలోపము గూడ వికల్పముగ వచ్చును.

ఈ వార్తికముచే 'అనఙ్' వైకల్పికము గాన 'అనఙ్'వచ్చిన పక్షమున 'హేఉశన + అన్ + స్'అని యుండగా సంబుద్ధియందు దీర్ఘము నిషిద్ధమగుటచే 'అతో గుణే'అను సూత్రముచే (275) పరరూపము సకారమునకు హల్ఙ్యాది లోపము. నకారలోపము కూడ వైకల్పికము గాన లోపపక్షమున 'హే ఉశన' అనియు,లోపాభావపక్షమున 'హేఉశనన్'అనియు, అనఙాదేశము కూడ రాని పక్షమున హల్ఙ్యాదిలోపానంతరము ప్రాతిపదికావయవసకారమునకు రుత్వవిసర్గములచే 'హేఉశనః'అనియు మూడు రూపములు సిద్ధించును.హలాదివిభక్తులు పర మగునపుడు ప్రాతి పదికాన్త్యసకారమునకు రుత్వము, 'హశి చ'అను సూత్రముచే(107)'రు'కు ఉత్వము; పిమ్మట గుణము చేయుటచే 'ఉశనోభ్యామ్' ఇత్యాదిరూపములు నిష్పన్న మగును.

'సుప్'పర మగునపుడు 'ఉశనస్ + సు' అని యుండ రుత్వవిసర్గములు. పిదప 'విసర్జనీయస్య సః'అను సూత్రముచే (103) రానున్న సకారమును బాధించి 'వా శరి'అను సూత్రముచే (104) విసర్గకు వికల్పముగ విసర్గయే వచ్చుటచే 'ఉశనఃసు'అనియు, తదభావపక్షమున సకారము వచ్చి (103) 'ఉశనస్సు'అనియు రెండు రూపము లుండును.

'అనేహస్'(కాలము) శబ్దప్రథమైకవచనమున 'ఋదుశనస్'-అనుసూత్రముచే (205) 'అనఙ్' వచ్చును గాన ఉశనశ్శబ్దప్రథమైకవచనమునందువలె రూపనిష్పత్తి యుండును.సంబుద్ధి పర మగునపుడు అనఙాదేశము నిషిద్ధము గాన హల్ఙ్యాదిలోపానన్తరము ప్రాతిపదికావయవసకారమునకు రుత్వవిసర్గములచే 'హేఅనేహః'అను రూపము సిద్ధించును.మిగిలిన రూపము లన్నియు ఉశనశ్శబ్దమునందు వలె సిద్ధించును.

'వేధస్' (బ్రహ్మ)శబ్దప్రథమైకవచనమున 'వేధస్ + స్'అని యుండగా 'వేధస్' అనునది ధాతుభిన్నాసంతముగాన 'అత్వసన్తస్య చాఽధాతోః' అను సూత్రముచే (344)ఉపధాదీర్ఘము-'వేధాస్ + స్'.హల్ఙ్యాదిలోపము చేసినపిమ్మట ప్రాతిపదికావయవసకారమునకు రుత్వవిసర్గములచే 'వేధాః'అను రూపము సిద్ధించును. సంబుద్ధియందు ఉపధాదీర్ఘము నిషిద్ధము గాన 'హే వేధః' అని యుండును.ఇతరరూపము లన్నియు ఉశనశ్శబ్దమునందు వలె నుండును.

356. అదస ఔ సులోపశ్చ 7.2.107

అదస ఔత్ స్యాత్ సౌ పరే,సులోపశ్చ. 'తదోః సః-' ఇతి సః, అసౌ, త్యదాద్యత్వమ్. పరరూపత్వమ్, వృద్ధిః.

'తదోః స సావనన్త్యయోః'నుండి 'సౌ' అనువర్తించును.

'అదస్'శబ్దమునకు 'సు'పర మగునపుడు ఔకారము ఆదేశముగ వచ్చును. మరియు 'సు' లోపించును.

ప్రథమైకవచనమున 'అదస్ + సు' అని యుండగా 'త్యదాదీనామః' అను సూత్రముచే (193) రానున్న అకారాదేశమును బాధించి ఈ సూత్రముచే సకార స్థానమున (అలోన్త్యపరిభాషచే 21) ఔకారము వచ్చును. 'సు' లోపించును. 'అద + ఔ' అని యుండగా వృద్ధిచే 'అదౌ'అని యగును.పిమ్మట 'తదోః సః సావనన్త్యయోః'అను సూత్రముచే (311) దకారమునకు సకారాదేశము చేయ 'అసౌ' అను రూపము సిద్ధించును.

ప్రథమాద్వివచనమున 'అదస్ + ఔ'అని యుండగా 'త్యదాదీనామః' అను సూత్రముచే (193) సకారమునకు అకారము. 'అద + అ + ఔ'అని యుండగా 'అతో గుణే'అను సూత్రముచే (275) పరరూపము. 'అద + ఔ', ఇచట 'వృద్ధిరేచి'అను సూత్రముచే (33) రావలసి యున్న వృద్ధిని బాధించి 'ప్రథమయోః పూర్వసవర్ణః'అను సూత్రముచే (126) పూర్వసవర్ణదీర్ఘము రావలసి యున్నది కాని 'నాదిచి'అను సూత్రముచే (117) అది నిషిద్ధము గాన వృద్ధి వచ్చి 'అదౌ'అని యుండగా:-

357. అదసోఽసేర్దాదు దోమః 8.2.80

అదసోఽసాన్తస్య దాత్పరస్య ఉదూతౌ, దస్య మశ్చ. ఆన్తరతమ్యాత్ హ్రస్వస్య ఉః, దీర్ఘస్య ఊః. అమూ. జసః శీ.గుణః.

అదసః, అసేః, దాత్,ఉ, దః, మః. 'ఉ''ఊ'లకు సమాహారద్వంద్వము చేయుటచే 'ఉ'అని యైనది. "సకారాన్తము కాని అదశ్శబ్దమున దకారమునకంటె పర మగు వర్ణమునకు ఉకారమును, ఊకారమును వచ్చును;దకారమునకుమకారమాదేశమగును. మాత్రా (ప్రమాణ) సామ్యము ననుసరించి దకారోత్తరవర్తి వర్ణము హ్రస్వ మగుచో హ్రస్వోకారమును,దీర్ఘమగుచో దీర్ఘోకారమును వచ్చును.

ఈ సూత్రముచే 'అదౌ'అను చోట దకారోత్తరవర్తి యగు ఔకారము నకు ఊకారమును, దకారమునకు మకారమును ఆదేశము లగుటచే 'అమూ' అను రూపము సిద్ధించినది.

ప్రథమాబహువచనమున 'అదస్ + జస్'అని యుండగా త్యదాద్యత్వపర రూపములచే 'అద + జస్'అని యగును. 'జసః శీ'అను సూత్రముచే (152) 'జస్'కు 'శీ'ఆదేశము-'అద + ఈ ; గుణము-'అదే'అని యుండగా:-

358. ఏత ఈద్ బహువచనే 8.1.81

అదసో దాత్పరస్యైత ఈద్,దస్య చ మో బహ్వర్థోక్తౌ. అమీ.

వెనుకటి సూత్రమునుండి 'అదసః', 'దాత్', 'దః', 'మః',అను పదము లనువర్తించును. "బహువచనమున అదశ్శబ్దదకారముకంటె పర మగు ఏకారము నకు ఈకారమును, దకారమునకు మకారమును ఆదేశ మగును."

ఈ సూత్రముచే 'అదే'అనునది 'అమీ' యగును.

'పూర్వత్రాసిద్ధమ్;'ఇతి విభక్తికార్యం ప్రాక్, పశ్చాదుత్వ మత్వే.అముమ్, అమూ అమూన్. ముత్వే కృతే ఘిసంజ్ఞాయాం నాభావః.

'అదసోఽసేర్దాదు దోమః'అను సూత్రము త్రిపాదీస్థము గాన సపాద సప్తాధ్యాయీస్థము లగు విభక్తికార్యములు చేయనున్నపుడు అది అసిద్ధమగును. కావున ముందుగ విభక్తికార్యములు చేసిన పిదప ఉత్వమత్వములు వచ్చును. ద్వితీయైకవచనమున 'అదస్ + అమ్'అని యుండ త్యదాద్యత్వపరరూపములు అద + అమ్. 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము-'అదమ్'. ఇపుడు 'అదసో సేర్దాదు దోమః'అను సూత్రముచే (357) ఉత్వమత్వములు చేయ 'అముమ్'అను రూపము సిద్ధించును.బహువచనమున 'అదస్ + శస్' అని యుండగా త్యదాద్యత్వపరరూపములు-'అద + అస్'. 'ప్రథమయోః పూర్వ సవర్ణః'అను సూత్రముచే పూర్వసవర్ణదీర్ఘము.పిదప సకారమునకు 'తస్మాచ్ఛసో నః పుంసి'అను సూత్రముచే (137) నత్వము-'అదాన్' ఇపుడు ఊత్వమత్వము లచే 'అమూన్' అను రూపము సిద్ధించినది.

తృతీయైకవచనమున 'అదస్ + టా'అని యుండగా త్యదాద్యత్వ పర రూపములచే 'అద + టా'అని యుండును.పిదప ఉత్వమత్వముల (ముత్వము)చే 'అము + టా'అని యుండును. 'అము'అనునది హ్రస్వోకారాంతము గాన

'శేషోఘ్యసఖి'అను సూత్రముచే (170) ఘిసంజ్ఞయు, తత్ప్రయుక్తమై 'ఆఙో నాఽస్త్రియామ్'అను సూత్రముచే (171) 'టా'కు 'నా'ఆదేశమును వచ్చుటచే 'అమునా'అను రూపము సిద్ధించును.

కాని 'ఆఙోనా-'అను సూత్రము (171) దృష్టిలో 'అదసో సేః-'అను సూత్రము (357) అసిద్ధ మగుటచే ఉకారాంతత్వప్రయుక్త మగు ఘిసంజ్ఞ యుండదు గాన 'నా'భావమెట్లు వచ్చును?వచ్చినను మత్వము అసిద్ధ మగుటచే 'అద'అను అకారాంతాంగము కనబడుచుండుటచే 'సుపి చ'అను సూత్రముచే (141) దీర్ఘ మేల రాకూడదు?అను సందేహములు కలుగ వచ్చును.తన్నివృత్తికై క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

359. న ము నే 8.2.3

నాభావే కర్తవ్యే కృతే చ ముభావో నాఽసిద్ధః. అమునా,అమూభ్యామ్, అమీభిః, అముష్మై, అమూభ్యామ్, అమీభ్యః, అముష్మాత్, అముష్య, అముయోః, అమీషామ్, అముష్మిన్, అమీషు.

అతి హలన్తపుంలిఙ్గప్రకరణమ్.

'పూర్వత్రాఽసిద్ధమ్' నుండి'అసిద్ధమ్' అనువర్తించును.'నా'త్వము చేయ వలసి యున్నను, చేసిన పిమ్మటను గూడ 'ము'భావము అసిద్ధము కాదు.

ఈ సూత్రముచే ముత్వము అసిద్ధము కాదు కావున పై యాశంకలకు అవకాశము లేదు.

'భ్యామ్ పర మగునపుడు త్యదాద్యత్వపరరూపములచే 'అదభ్యామ్'అని యుండగా 'సుపి చ'అను సూత్రముచే (141) అదన్తాంగమునకు దీర్ఘము-'అదాభ్యామ్.ఆకారము దీర్ఘము గాన దాని స్థానమున ఊకారము,దకారస్థానమున మకారము-'అమూభ్యామ్'అను రూపము సిద్ధించును.

'భిస్'పర మగునపుడు త్యదాద్యత్వపరరూపములు-'అదభిస్'. అదన్తాంగముకంటె పర మగు 'భిస్'కు 'అతో భిస ఐస్'అను సూత్రముచే(142)రావలసి యున్న ఐస్త్వము 'నేదమదసోరకోః'అను సూత్రముచే (280) నిషిద్ధము గాన 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (115) ఏకారాదేశము వచ్చి 'అదేభిః' అని యగును.పిమ్మట 'ఏత ఈద్బహువచనే' అను సూత్రముచే (358) ఈత్వమత్వములచే 'అమీభిః'అను రూపము సిద్ధించినది. 'భ్యస్ పర మగునపుడు గూడ రూపనిష్పత్తి యిటులనే యుండును.

చతుర్థ్యేకవచనమున త్యదాద్యత్వపరరూపములు చేసిన పిమ్మట 'అద + ఙే'అని యుండ 'సర్వనామ్నః స్మై'అను సూత్రముచే 'ఙే'కు 'స్మై' ఆదేశము. పిదప 'అదసో సేః-' అను సూత్రముచే (357) ముత్వము. 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) 'స్మై'యందలి సకారమునకు (స్థానివద్భావముచే ప్రత్యయము గాన) షత్వము-'అముష్మై'అను రూపము సిద్ధించును.

పంచమ్యేకవచనమున త్యదాద్యత్వపరరూపములు-'అద + ఙసి'అని యుండగా 'ఙసిఙ్యోః స్మాత్స్మినౌ'అను సూత్రముచే (154) 'ఙసి'కి 'స్మాత్' ఆదేశము; 'ద'కు ముత్వము.సకారమునకు షత్వము-'అముష్మాత్' అను రూపము సిద్ధించినది.

షష్ఠ్యేకవచనమున త్యదాద్యత్వపరరూపానంతరము 'అద + ఙస్'అని యుండగా 'టాఙసిఙసామినాత్స్యాః'అను సూత్రముచే (140) 'ఙస్'కు స్యాదేశము,ముత్వము;సకారమునకు 'ఆదేశప్రత్యయయోః'అనుసూత్రముచే (150) షత్వము. 'అముష్య'అను రూపము సిద్ధించును.

ద్వివచనమున త్యదాద్యత్వపరరూపములు చేసిన పిమ్మట 'అద + ఓస్' అని యుండగా 'ఓసి చ'అను సూత్రముచే (147) అంత్యాకారమునకు ఏకారాదేశము;పిదప అయాదేశము-'అదయోస్'అని యుండగా ముత్వముచే 'అముయోః'అను రూపము నిష్పన్న మైనది.

బహువచనమున అత్వపరరూపానంతరము 'అద + ఆమ్'అని యుండ 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే (155) 'ఆమ్'కు'సుట్'ఆగమము. 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) అకారమునకు ఏకారాదేశము. 'అదేసామ్'. 'ఏత ఈద్బహువచనే'అను సూత్రముచే (358) ఏకారదకారములకు ఈకారమకారము లాదేశములగును.సకారమునకుషత్వము-'అమీషామ్' అను రూపము సిద్ధించినది.

సప్తమ్యేకవచనమున 'ఙసిఙ్యోఃస్మాత్స్మినౌ'అను సూత్రముచే (154) 'ఙి'కి 'స్మిన్' ఆదేశము. శేషప్రక్రియ పంచమ్యేకవచనమునందు వలె నుండును.

బహువచనమున త్యదాద్యత్వపరరూపములు-'అద + సు', 'బహువచనే ఝల్యేత్'అను సూత్రముచే (145) ఏత్వము-'అదేసు'. 'ఏత ఈద్ బహువచనే' అను సూత్రముచే (358) మీత్వము,సకారమునకు షత్వము-'అమీషు' అను రూపము సిద్ధించును.

హలన్తపుంలింగప్రకరణము సమాప్తము.

# అథ హలన్తస్త్రీలిఙ్గ ప్రకరణమ్

360 నహో ధః 8.2.34

నహో హస్య ధః స్యాద్ ఝలి పదాన్తే చ.

'హో ఢః', 'స్కోః సంయోగాద్యోరన్తే చ' 'ఝలో ఝలి' అను సూత్రములనుండి 'హః' 'అన్తే' 'ఝలి' అను పదములను, 'పదస్య'అను అధికార సూత్రమును అనువర్తించును. "'ఝల్' పర మగునపుడును, పదాంత మునందును 'నహ్' ధాతుహకారమునకు ధకార మాదేశముగ వచ్చును."

361 నహి, వృతి, వృషి, వ్యధి, రుచి, సహి, తనిషు క్వౌ 6.3.116

క్విబన్తేషు పూర్వపదస్య దీర్ఘః. ఉపానద్, ఉపానహౌ. ఉపానత్సు.

'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః' నుండి 'దీర్ఘః' అనువర్తించును. "'క్విప్' ప్రత్యయాంతము లగు నహ్, వృత్, వృష్, వ్యధ్, రుచ్, సహ్, తన్ ధాతువులు పర మగునపుడు పూర్వపదమునకు దీర్ఘము వచ్చును."

'ఉప'పూర్వక మగు నహధాతువునకు క్విప్ప్రత్యయము చేర్చిన పిదప ఈ సూత్రముచే 'ఉప'యందలి అకారమునకు దీర్ఘము-'ఉపానహ్' (పాదుక) అను శబ్దము నిష్పన్న మైనది. ప్రథమైకవచనమున 'ఉపానహ్ + సు'అవి యుండగా హల్ఙ్యాదిలోపము (79)- 'ఉపానహ్',ఇపుడు హకారము పదాన్తగతము గాన పూర్వ సూత్రముచే ధకారము-'ఉపానధ్'. 'ఝలాం జశోఽన్తే' అను సూత్రముచే(67) జశ్త్వమున దకారము:'వావసానే'అను సూత్రముచే(146) చర్త్వవికల్పము—'ఉపానత్','ఉపానద్' అను రెండు రూపములు సిద్ధించును.

అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్య మేమియు లేదు కావున "ఉపానహౌ", 'ఉపానహః' ఇత్యాదిరూపములును,హలాదివిభక్తులందు ధత్వ జశ్త్వములచే 'ఉపానద్భ్యామ్' ఇత్యాదిరూపములును,'సుప్' పర మగునపుడు 'ఖరి చ'యను సూత్రమున (74) చర్త్వముచే 'ఉపానత్సు'అను రూపమును సిద్ధించును.

క్విన్ప్రత్యయాన్తత్వాత్ కుత్వేన ఘః_ఉష్ణిక్, ఉష్ణిహౌ, ఉష్ణిగ్భ్యామ్.

'ఉష్ణిహ్' శబ్దము (ఒక వైదిక ఛందస్సు) 'ఋత్విగ్దధృక్' ఇత్యాది సూత్రముచే (302) నిపాతిత మగు క్విన్ప్రత్యయాన్తము. కావున హలాదివిభక్తులు పర మగునపుడు 'క్విన్ప్రత్యయస్య కుః' (305) అను సూత్రముచే కుత్వము వచ్చును. ప్రథమైకవచనమున 'ఉష్ణిహ్ + సు' అని యుండ హల్ఙ్యాదిలోపము (179). కుత్వముచే హకారమునకు ఘకారము-'ఉష్ణిఘ్'; జశ్త్వముచే ఘకారమునకు గకారము. చర్త్వవికల్పముచే 'ఉష్ణిక్' 'ఉష్ణిగ్' అను రెండు రూపము లుండును. హలాదిప్రత్యయములు పర మగునపుడు కుత్వజశ్త్వములచే 'ఉష్ణిగ్భ్యామ్' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్' పర మగునపుడు 'ఖరి చ' అను సూత్రముచే (74) గకారమునకు నిత్యముగ చర్త్వము (క్), సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రమున (150) షత్వము చేయ 'ఉష్ణిక్షు' అను రూపము సిద్ధించును.

ద్యౌః, దివౌ, దివః, ద్యుభ్యామ్, గీః, గిరౌ, గిరః. ఏవం పూః. చతస్రః, చతసృణామ్. కా; కే; కాః. సర్వావత్.

వకారాన్త 'దివ్' శబ్దప్రథమైకవచనమున 'దివ్ + సు' అని యుండగా 'దివ ఔత్' అను సూత్రముచే (264) ఔకార మంతాదేశముగ వచ్చును-'ది + ఔ + స్'. యణాదేశము; సకారమునకు రుత్వవిసర్గములు-'ద్యౌః' అను రూపము సిద్ధించును. ఈ విధముగ దివ్‌శబ్దరూపము లన్నియు పుంలింగ 'సుదివ్' శబ్దరూపముల వలెనే సిద్ధించును.

రేఫాన్త మగు 'గిర్' శబ్దప్రథమైకవచనమున 'గిర్ + సు' అని యుండగా 'ర్వోరుపధాయాదీర్ఘ ఇకః' అను సూత్రముచే (352) ఉపధ యగు ఇకారమునకు దీర్ఘము హల్ఙ్యాదిలోపము (179); రేఫకు విసర్గము-'గీః' అను రూపము సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యము లేదు. 'గిరౌ' 'గిరః' ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాదివిభక్తులందు మాత్రము ఉపధాదీర్ఘముచే 'గీర్భ్యామ్' ఇత్యాదిరూపము లగును. సప్తమీబహువచనమున ఉపధాదీర్ఘము, సకారమునకు షత్వము. 'రోః సుపి' అను (168) నియమసూత్రముండుటచే ప్రత్యయావయవ మగు రేఫకు విసర్గము రాదు. 'పుర్' మొదలగు ఇతర రేఫాంతశబ్దముల సిద్ధి గూడ ఇటులనే యుండును.

రేఫాన్త మగు 'చతుర్'శబ్దమునకు 'త్రిచతురోః స్త్రియాం తిసృ చతసృ'అను సూత్రముచే (224) 'చతసృ'అను నాదేశము వచ్చును. కావున ఈ శబ్దమున రూపనిష్పత్తి స్త్రీలింగ'త్రి'శబ్దమునందు వలె నుండును.

మకారాన్త మగు 'కిమ్' శబ్దమునకు 'కిమః కః'అను సూత్రముచే(271) కాదేశము విధింపబడినది గాన ఇది అకారాంత మైనది. స్త్రీత్వమున 'అజాద్యత ష్టాప్'అను సూత్రముచే (1248)'టాప్' చేయుటచే 'కా'అనిదైనది. కావున దీని రూపములు 'సర్వా'శబ్దరూపముల వలె సిద్ధించును.

362 యః సౌ 7.2.110

ఇదయో దస్య యః. ఇయమ్, త్యదాద్యత్వమ్, పరరూపత్వమ్. టాప్; 'దశ్చ'ఇతి మః-ఇమే. ఇమాః. ఇమామ్, అనయా, హలి లోపః ఆభ్యామ్. ఆభిః, అస్యై.అస్యాః, అనయోః, ఆసామ్. అస్యామ్. ఆసు. త్యదాద్యత్వమ్;టాప్-స్యా, త్యే, త్యాః.ఏవమ్-తద్, ఏతద్.వాక్, వాగ్, వాచౌ,వాగ్భ్యామ్,వాక్షు.అప్ శబ్దో నిత్యం బహువచనాన్తః. "అప్తృన్"- ఇతి దీర్ఘః-ఆపః,అపః.

'ఇదమో మః' 'దశ్చ'అను సూత్రములనుండి 'ఇదమః' 'దః' అనువర్తించును. "'సు' పర మగునప్పుడు 'ఇదమ్'శబ్దదకారమునకు యకార మాదేశ మగును".

స్త్రీలింగమున ఇదమ్శబ్దప్రథమైకవచనమున ఈ సూత్రముచే దకారమునకు యకారాదేశము-'ఇయమ్ + సు'.'సు'కు హల్ఙ్యాదిలోపము(179)-'ఇయమ్' అను రూపము సిద్ధించును. ఇచట త్యదాద్యత్వము రావలసి యున్నను దానిని బాధించి 'ఇదమో మః'అను సూత్రముచే మకారమునకు మకారమే ఆదేశముగ వచ్చును.

ద్వివచనమున 'ఇదమ్ + ఔ'అని యుండ త్యదాద్యత్వపరరూపములు- 'ఇద + ఔ'. స్త్రీలింగ మగుటచే 'అజాద్యతష్టాప్'అను సూత్రముచే (1248) 'టాప్'ప్రత్యయము. సవర్ణదీర్ఘముచే'ఇదా + ఔ','దశ్చ'అనుసూత్రముచే(275) దకారమునకు మకారము-'ఇమా + ఔ','ఔఙ ఆపః'అను సూత్రముచే (216) 'ఔ'కు శీ (ఈ) ఆదేశము. గుణముచే 'ఇమే'అను రూపము నిష్పన్న మగును. 'జస్', 'అమ్', 'ఔట్', 'శస్'లు పర మగునపుడు ఈ విధముగనే 'ఇమాః'

'ఇమామ్', 'ఇమే', 'ఇమాః'అను రూపములు నిష్పన్న మగును. త్యదాద్యత్వ పరరూప'టాప్'ప్రత్యయములు చేసిన పిదప సర్వాశబ్దమువలె 'ఇదా'యని యగును గాన ప్రక్రియ సర్వాశబ్దమునందు వలె నందును.'టా','ఓస్'లు పరమగు నపుడు 'అనాప్యకః'అను సూత్రముచే (276) 'ఇద్'అనుదానికి 'అన్'అను నాదే శము వచ్చి 'అనయా', 'అనయోః'అను రూపములు సిద్ధించును. హలాది విభక్తులు పర మగునపుడు 'హలి లోపః'అను సూత్రముచే (277) 'ఇద్' లోపింప 'అ'అనునది మాత్రము శేషించుటచే 'ఆభ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును. 'ఙే', 'ఙసి' 'ఙస్','ఙి'లకు 'సర్వనామ్నః స్యాడ్ఢ్రస్వశ్చ' (220) అను సూత్రముచే స్యాడాగమము,'ఆమ్'కు 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే సుడాగమము వచ్చి అవి హలాదివిభక్తు లగును గాన 'హలి లోపః' అను సూత్రముచే (277) 'ఇద్'లోపింపగా 'అస్యై' ఇత్యాదిరూపము లగును.

త్యద్, తద్, ఏతద్, శబ్దములకు త్యదాద్యత్వపరరూపములు చేసిన పిమ్మట స్త్రీత్వవివక్షయందు 'టాప్'చేర్చుటచే 'త్యా'.'తా','ఏతా',అను ఆకారాన్త శబ్దములు నిష్పన్న మగును గాన సర్వాశబ్దమునందు వలె రూపనిష్పత్తి యగును. 'సు'పర మగునపుడు 'తదోః సః సావనన్త్యయోః'అను సూత్రముచే (311) తకారమునకు 'స'కారాదేశము మాత్రము విశేషము. 'ఏసా'అనునపుడు సకారము 'ఇణ్'కంటె పర మగుటచే 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము వచ్చి 'ఏషా'అను రూపము సిద్ధించును.

చకారాన్త మగు 'వాచ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'వాచ్సు'అని యుండ 'సు'కు హల్ఙ్యాదిలోపము (179). చకారమునకు జశ్త్వముచే జకారము. 'చోః కుః'అను సూత్రముచే (307) కుత్వముచే జకారమునకు గకారము. 'వావసానే'అను సూత్రముచే (146) చర్త్వవికల్పముచే 'వాక్','వాగ్'అను రూపద్వయము సిద్ధించును. అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్య మేదియు లేదు; 'వాచౌ','వాచః'ఇత్యాదిరూపములు సిద్ధించును. హలాదివిభక్తులు పర మగునపుడు జశ్త్వకుత్వములచే 'వాగ్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్'పర మగునపుడు జశ్త్వకుత్వములు చేసిన పిమ్మట గకారమునకు 'ఖరి చ' అనుసూత్రముచే (74) చర్త్వము (కకారము); సకారమునకు షత్వము (సూ.150) చేయ 'వాక్షు'అను రూపము సిద్ధించును.

పకారాన్త మగు 'అప్'శబ్దము (ఉదకము) నిత్యబహువచనాన్తము.

ప్రథమాబహువచనమున 'అప్ + జస్'అని యుండగా 'జస్' సర్వనామస్థాన మగుటచే 'అప్తృన్తృచ్-'అను సూత్రముచే (266) ఉపధ యగు అకారమునకు దీర్ఘము. ప్రత్యయాన్త సకారమునకు రుత్వవిసర్గములు. 'ఆపః' అను రూపము సిద్ధించును. ద్వితీయాబహువచనప్రత్యయ మగు 'శస్'కు సర్వనామస్థానసంజ్ఞ లేకుండుటచే ఉపధాదీర్ఘము లేదు-'అపః'అను రూపము సిద్ధించును. తృతీయాబహువచనమున 'అప్ + భిస్'అని యుండగా:-

363. అపో భి 7.4.48

అప స్తకారో భాదౌ ప్రత్యయే. అద్భిః అద్భ్యః-2అపామ్. అప్సు, దిక్, దిగ్, దిశః దిగ్భ్యామ్. 'త్యదాదిషు-' ఇతి దృశేః 'క్విన్' విధానాత్ అన్యత్రాపి కుత్వమ్-దృక్, దృగ్, దృశౌ, దృగ్భ్యామ్. త్విట్, త్విడ్, త్విషౌ, త్విడ్భ్యామ్.

"అచ ఉపసర్గాత్తః' నుండి 'తః' అనువర్తించును. 'అప్'శబ్దమునకు భకారాదిప్రత్యయము పర మగునపుడు తకారాదేశము వచ్చును."

అలోన్త్యపరిభాషచే (21) అంత్యాదేశముగ వచ్చును. తకారమునకు జశ్త్వముచే దకారము-అద్భిఃఅను రూపము సిద్ధించును. 'భ్యస్' పర మగునపుడు 'అద్భ్యః'అని యగును. 'అపామ్''అప్సు'అనునపుడు విశేషకార్య మేదియు లేదు.

'దిశ్'శబ్దము 'ఋత్విగ్దధృక్'-ఇత్యాదిసూత్రముచే (302) 'క్విన్'ప్రత్యయాన్తము. కావున దీని రూపములు పుంలింగ 'తాదృక్'శబ్దమునందు వలె సిద్ధించును.

'దృశ్'ధాతువునకు క్విప్ప్రత్యయము చేర్చుటచే 'దృశ్'శబ్దము నిష్పన్నమైనది ఇది 'క్విన్'ప్రత్యయాన్తము కాదు గాన 'క్విన్ప్రత్యయస్యకుః' అను సూత్రముచే (305) కత్వమున కవకాశము లేదు. కాని త్యదాదులు ఉపపదముగ నున్నపుడు దృశ్ధాతువునకు 'త్యదాదిషు దృశోనాలోచనే కఞ్చ'అను సూత్రముచే (368) 'క్విన్'ప్రత్యయము విధింపబడినది. ఇచట 'క్విన్ప్రత్యయః యస్మాత్ సః'అను బహువ్రీహిసమాసము నాశ్రయించుటచే కేవల'దృశ్'శబ్దము కూడ 'క్విన్ప్రత్యయము'అగును గాన కుత్వము అంగీకరింపబడినది. కావున స్త్రీలింగ'దృశ్'శబ్దరూపములు పుంలింగ 'తాదృశ్'శబ్దమునందు వలె నుండును.

షకారాన్త 'త్విష్'శబ్దప్రథమైకవచనమున హల్ఙ్యాదిలోపము (179)చేసిన పిమ్మట పదాన్త్యషకారమునకు 'ఝలాం జశోఽన్తే' 'వావసానే'అను సూత్రములచే (78.146) జశ్త్వ, వైకల్పిక చర్త్వములచే 'త్విట్','త్విడ్'అను రూపద్వయము సిద్ధించును. ఈ విధముగ 'త్విష్'శబ్దరూపములు పుంలింగ 'రత్నముష్'శబ్దరూపముల వలె ఉండును.

'ససజుషోరుః'ఇతిరుత్వమ్ - సజూః, సజుషౌ, సజూర్భ్యామ్, సజూఃషు, సజూష్షు. ఆశీః, ఆశిషౌ, ఆశీర్భ్యామ్.

'సజుష్'శబ్దప్రథమైకవచనమున 'సజుష్ + సు'అని యుండగా హల్ఙ్యాది లోపము (179) షకారమునకు 'ససజుషోరుః'అను సూత్రముచే (105)రుత్వము పిమ్మట 'ర్వోరుపధాయా దీర్ఘ ఇకః'అను సూత్రముచే (352) ఉపధాదీర్ఘము. రేఫకు విసర్గము-'సజూః'అను రూపము సిద్ధించినది.అజాదివిభక్తులు పర మగునపుడు విశేషకార్యములు లేవు హలాదివిభక్తులు పర మగునపుడు రుత్వోపధాదీర్ఘములచే 'సజూర్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును.

'సుప్' పర మగునపుడు రుత్వోపధాదీర్ఘములు-'సజూర్సు', 'ఖరవసానయోర్విసర్జనీయః'అను సూత్రముచే (8) విసర్గము చేసిన పిదప 'విసర్జనీయస్య సః'అను సూత్రముచే (86) విసర్గము రావలసి యుండగా దానిని బాధించి 'వా శరి'అను సూత్రముచే (104) వైకల్పికవిసర్గము. 'సజూఃసు' తదభావపక్షమున పై సూత్రముచే సకారము-'సజూస్సు' 'నుమ్ విసర్జనీయశర్వ్యవాయేఽపి'అను సూత్రముచే (353) రూపద్వయమునందును ప్రత్యయావయవసకారమునకు షకారము.రెండవరూపమున ష్టుత్వముచే మొదటి సకారస్థానమున గూడ షకారము-'సజూఃషుసజూష్షు'అను రెండు రూపములుండును.

అజ్పూర్వక 'క్విప్'ప్రత్యయాన్త 'శాస్'ధాతువునందలి సకారమునకు 'శాసివసిఘసీనాం చ'అను సూత్రముచే (557) షకారాదేశము చేయగా(ఉపదేశ్యముచే) 'ఆశిష్' శబ్దము సిద్ధించినది. దీని ప్రథమైకవచనమున హల్ఙ్యాదిలోపము (179) చేసినపిమ్మట 'ఆశిష్'అని యుండగా షత్వము అసిద్ధము గాన (సకారముండుటచే) 'ససజుషోరుః'అను సూత్రముచే (105) రుత్వము."ర్వోరుపధాయా దీర్ఘ ఇకః' అను సూత్రముచే (352) ఉపధాదీర్ఘము. రేఫకు విసర్గము- 'ఆశీః' అను రూపము సిద్ధించినది. హలాదివిభక్తులందీవిధముగనే రుత్వోపధాదీర్ఘములచే

'ఆశీర్భ్యామ్' ఇత్యాదిరూపమును, అజాదివిభక్తులు పర మగునపుడు విశేష కార్యము లేదు గాన 'ఆశిషౌ' ఇత్యాదిరూపములును ఉండును. 'సుప్'పర మగునపుడు 'సజుష్'శబ్దమునందు వలె 'ఆశీఃషు' 'ఆశీష్షు' అను రూపద్వయము సిద్ధించును.

అసౌ, ఉత్వమత్వే- అమూ, అమూః, అముయా, అమూభిః, అముష్యై, అమూభ్యః, అముష్యాః, అముయోః, అమూషామ్, అముష్యామ్, అమూషు.

## ఇతి హలన్తస్త్రీలిఙ్గప్రకరణమ్.

స్త్రీలింగాదశ్శబ్దప్రథమైకవచనమున పుంలింగమునందు వలె 'అసౌ' అను రూపము సిద్ధించును. ఇతరవిభక్తులందు త్యదాద్యత్వపరరూపములు, స్త్రీత్వప్రయుక్త మగు 'టాప్'ప్రత్యయము, సవర్ణదీర్ఘమును వచ్చుటచే 'అదా' అని యుండును గాన 'సర్వా'శబ్దమునందు వలె విభక్తికార్యములు వచ్చును.

ప్రథమాద్వివచనమున 'అదా + ఔ'అని యుండ వృద్ధి- 'అదౌ', పిమ్మట 'అదసోఽసేర్దాదు దో మః' అను సూత్రముచే (357)(ఔకారము దీర్ఘము గాన) ఊత్వమత్వములచే 'అమూ'అను రూపము సిద్ధించినది.

బహువచనమున 'అదా + అస్'అని యుండగా "ప్రథమయోః పూర్వసవర్ణః"అను సూత్రముచే (126)పూర్వసవర్ణదీర్ఘము-సకారమునకు విసర్గము- 'అదాః'. ఊత్వమత్వములచే 'అమూః'అను రూపము సిద్ధించును. ద్వితీయ విభక్తియందు గూడ రూపనిష్పత్తి యిటులనే యుండును.

తృతీయైకవచనమున 'అదా + టా'అని యుండగా 'ఆఙి చాపః' అను సూత్రముచే (218) అకారమునకు ఏకారాదేశము, అయాదేశము చేసిన పిమ్మట ముత్వముచే 'అముయా' అను రూపము సిద్ధించును.

'అదా + భిః' 'అదా + భ్యః' అని యుండగా ఊత్వమత్వములచే 'అమూభిః' 'అమూభ్యః' అను రూపములు సిద్ధించును.

చతుర్థ్యేకవచనమున 'అదా + ఙే(ఏ) అని యుండగా "సర్వనామ్నఃస్యాడ్ఢ్రస్వశ్చ"అను సూత్రముచే (220) స్యాడాగమహ్రస్వములు; 'అదస్యా + ఏ' వృద్ధి—అదస్యై. ముత్వ, షత్వ ("ఆదేశప్రత్యయయోః" 150)ములు— 'అముష్యై' అను రూపము సిద్ధించినది.

పంచమీషష్ఠ్యేకవచనములందు గూడ స్యాడాగమ, ముత్వ,షత్వములచే 'అముష్యాః'అను రూపము సిద్ధించును.

షష్ఠీసప్తమీద్వివచనములందు 'అదా + ఓస్' అని యుండగా 'ఆజీచాపః' అను సూత్రముచే (218) అకారమునకు ఏకారాదేశము, అయాదేశము వచ్చుటచే 'అదయోః'అని యుండగా ముత్వముచే 'అముయోః'అను రూపము సిద్ధించును. బహువచనమున 'ఆమి సర్వనామ్నః సుట్'అను సూత్రముచే (155) 'ఆమ్'కు సుడాగమము చేయగా 'అదాసామ్'అని యుండ ఊత్వమత్వషత్వములచే 'అమూషామ్'అను రూపము సిద్ధించినది.

సప్తమ్యేకవచనమున 'సర్వనామ్నః స్యాడ్ఢ్రస్వశ్చ'(220) "ఙేరామ్నద్యామ్నీభ్యః' (198) అను సూత్రములచే 'అదస్యామ్'అని సిద్ధించిన పిదప ముత్వషత్వములచే 'అముష్యామ్'అను రూపము సిద్ధించును.

ఇట్లే 'సుప్'పర మగునపుడు 'అదాసు'అని యుండగా మూత్వషత్వములచే 'అమూషు'అను రూపము సిద్ధించును.

హలన్తస్త్రీలిఙ్గప్రకరణము సమాప్తము.

# అథ హలన్త నపుంసకలిఙ్గ ప్రకరణమ్

స్వమోర్లుక్, దత్వమ్-స్వనడుత్, స్వనడుద్, స్వనడుహీ, "చతురనడుహోః—" ఇత్యాత్వమ్ - స్వనడ్వాంహి, పునస్తద్వత్, శేషం పుంవత్.

"శోభనాః అనడ్వాహః యస్య తత్ (కులం)" అను నర్థము గల నపుంసకలింగ 'స్వనడుహ్' శబ్దప్రథమైకవచనమున 'స్వనడుహ్ + సు'అని యుండ 'స్వమోర్నపుంసకాత్'అను సూత్రముచే (244) 'సు'కులోపము; హకారమునకు 'వసుస్రంసుధ్వంస్వనడుహాం దః'అను సూత్రముచే (262) దకారము; దానికి 'వాఽవసానే'అను సూత్రముచే (146) చర్త్వవికల్పముచే 'స్వనడుత్' 'స్వనడుద్' అను రూపద్వయ ముండును.

ద్వివచనమున 'ఔ'కు 'నపుంసకాచ్చ' అను సూత్రముచే (235) 'శీ' (ఈః) ఆదేశముచే 'స్వనడుహీ'అను రూపము సిద్ధించును.

బహువచనమున 'జశ్శసోః శిః'అను సూత్రముచే (237) 'శి'(ఇ) ఆదేశము "శి సర్వనామస్థానమ్"అను సూత్రముచే (238) ఇది సర్వనామ స్థాన సంజ్ఞకము గాన 'చతురనడుహోరాముదాత్తః'అను సూత్రముచే (259) 'మిదచోన్త్యాత్పరః'అను పరిభాష (240) ననుసరించి ఉకారమునకు పరముగ 'ఆ'కారము; యణాదేశము- 'అనడ్వాహ్ + ఇ' "నపుంసకస్య ఝలచః" అను సూత్రముచే (239) 'అంత్యాచ్'అగు ఆకారమునకు పరముగ నుమాగమము. నకారమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) అనుస్వారము- 'స్వనడ్వాంహి' అను రూపము సిద్ధించినది.

ద్వితీయవిభక్తియందు 'అమ్''శస్'లకు గూడ లోప 'శి'ఆదేశములు వచ్చును గాన ప్రథమయందు వలె రూపనిష్పత్తి యుండును. ఇతరవిభక్తులందు పుంలింగ మగు 'అనడుహ్'శబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

వాః, వారీ, వారి. వార్భ్యామ్. చత్వారి. కిమ్, కే. కాని. ఇదమ్, ఇమే. ఇమాని.

రేఫాన్తవార్ శబ్ద ప్రథమైకవచనమున 'స్వమోర్నపుంసకాత్'అను సూత్రముచే (214) 'సు'కు లోపము. రేఫకు విసర్గము- 'వాః'అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశముచే 'వారీ'అను రూపము సిద్ధించును. బహువచనమున 'జస్'కు'శి' ఆదేశముచే 'వారి' అను రూపము సిద్ధించును. ఈ విధముగ నపుంసకలింగమున సాధారణముగ 'సు' 'అమ్' లకు లోపము, 'ఔ'కు 'శీ'ఆదేశము, 'జస్''శస్'లకు 'శి'ఆదేశమును వచ్చి రూపములు సిద్ధించుచుండును. తృతీయాదివిభక్తులందు నపుంసకలింగత్వకృత మగు విశేషకార్యమేదియు లేదు.

నిత్యబహువచనాంత మగు రేఫాన్త 'చతుర్'శబ్దమున 'జస్''శస్'లకు 'శి'ఆదేశము వచ్చిన పిదప అది సర్వనామస్థానసంజ్ఞకము గాన (238) 'చతురనడుహోరాముదాత్తః' అను సూత్రముచే (259) ఆకారాదేశముచే 'చత్వారి' అను రూపము సిద్ధించినది. తృతీయాదివిభక్తి రూపములు పుంలింగమునందు వలె నుండును.

మకారాన్తనపుంసకలింగ 'కిమ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'కిమ్ + సు'అని యుండగా 'సు'కు లోపము. 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్'అను సూత్రము (190) ననుసరించి విభక్తిప్రత్యయము పరముగా నున్నది గాన 'కిమః

కః'అను సూత్రముచే (271) కాదేశము రావలసి యున్నది గాని 'నలుమతాఙ్గస్య' అను సూత్రముచే (191) ప్రత్యయలక్షణము నిషిద్ధము గాన రాదు. 'కిమ్' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశము చేసిన పిదప 'కిమః కః' అను సూత్రముచే (271) 'కిమ్'కు కాదేశము; గుణము- 'కే'అను రూపము సిద్ధించినది. బహువచనమున 'జస్'కు 'శి'ఆదేశము. 'కిమ్'కు కాదేశము. "నపుంసకస్య ఝలచః"అను సూత్రముచే (239) నుమాగమము. "సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ" అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము- 'కాని' అను రూపము సిద్ధించును. ద్వితీయవిభక్తియందు గూడ రూపము లిట్లే యుండును. తృతీయాదివిభక్తి రూపములు పుంలింగమునందు వలె నుండును.

వా. అన్వాదేశే నపుంసకే ఏనద్వక్తవ్యః.

ఏనత్, ఏనద్, ఏనే. ఏనాని. ఏనేన, ఏనయోః. అహః. 'విభాషాఙిశ్యోః—అ'హ్నీ, అహనీ, అహాని.

'ఇదమ్' ప్రథమైకవచనమున 'సు'లోపముచే 'ఇదమ్' అను రూపము సిద్ధించును. 'న లుమతాఙ్గస్య' అను సూత్రముచే (191) ప్రత్యయలక్షణము నిషిద్ధము గాన విభక్తి పరముగ లేకుండుటచే త్యదాద్యత్వము రాదు. ద్వివచన బహువచనములందు త్యదాద్యత్వపరరూపములు చేసిన పిమ్మట నపుంసకసర్వ శబ్దమునందు వలె 'ఇమే' 'ఇమాని' అను రూపములు సిద్ధించును. 'దశ్చ'అను సూత్రముచే (275) దకారమునకు మకారాదేశము గూడ వచ్చినది- ద్వితీయా రూపములు గూడ ఇట్లే యుండును. తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలెనే యుండును.

'ద్వితీయాటౌస్స్వేనః'అను సూత్రముచే (280) ఏనాదేశము రావలసి యుండగా వార్తికము చెప్పబడుచున్నది: "ఇదమ్శబ్దైతచ్ఛబ్దములకు నపుంసక లింగమున (ఏకవచనమున) 'ఏనత్'అను నాదేశము వక్తవ్యము." ఈ వార్తికమున ఏనాదేశము వచ్చునని సామాన్యరూపమున చెప్పబడినది. కాని భాష్యమున 'ఏనదితి నపుంసకైకవచనే వక్తవ్యమ్'అని చెప్పి. "కుణ్డమానయ ప్రక్షాలయైనత్'అను నుదాహరణము నిచ్చుటచే ఏనదాదేశము ద్వితీయైకవచనమునందు మాత్రమే వచ్చునని సూచింపబడినది.

'అమ్'లోపానన్తరము 'ఇదమ్'కు ఏనదాదేశము. చర్త్వవికల్పముచే

'ఏనత్' 'ఏనద్' అను రెండు రూపములు సిద్ధించును. ఇతరస్థలములందు 'ఏన'ఆదేశము వచ్చుటచే 'ఏనే, ఏనాని, ఏనేన, ఏనయోః'అను రూపములు సిద్ధించినవి. రూపనిష్పత్తి నపుంసకసర్వశబ్దమునందు వలె నెరుంగునది.

నకారాన్త 'అహన్'శబ్ద ప్రథమైకవచనమున 'సు'లోపించిన పిమ్మట 'రోఽసుపి'అను సూత్రముచే (110) నకారమునకు రేఫాదేశము; విసర్గము- 'అహః' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశము. 'విభాషా ఙిశ్యోః'అను సూత్రముచే (248) 'అన్'లోని అకారమునకు లోపవికల్పముచే 'అహ్నీ' 'అహనీ' అను రూపద్వయము సిద్ధించును. బహువచనమున 'జస్'కు 'శి'ఆదేశము. ఇది సర్వనామస్థానసంజ్ఞకము గాన ఉపధాదీర్ఘము 'అహాని' అను రూపము సిద్ధించును. ద్వితీయారూపము లిట్లే యుండును.

'టా'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'అల్లోపోఽనః' అను సూత్రముచే (247) అకారలోపము- 'అహ్నా' ఇత్యాదిరూపములు సిద్ధించును.

'భ్యామ్'మొదలగు హలాది విభక్తులు పర మగునపుడు:-

### 364. అహన్. 8.2.68

'అహన్'ఇత్యస్య రుః పదాన్తే. అహోభ్యామ్. దణ్డీ.

'పదస్య'అధికారము. 'ససజుషోరుః' 'స్కోః సంయోగాద్యోరన్తే చ' అను సూత్రములనుండి 'రుః' 'అన్తే' అనువర్తించును. పదాన్తమున 'అహన్' అనుదానికి 'రు'అను నాదేశము వచ్చును. ఈ సూత్రముచే నకారమునకు రుత్వము. 'హశి చ'అను సూత్రముచే (107) ఉత్వము- 'అహోభ్యామ్'ఇత్యాది రూపములు సిద్ధించును.

'ఙి'పర మగునపుడు 'విభాషా ఙిశ్యోః'అను సూత్రముచే (248) అలోపము వైకల్పికము గాన 'అహ్ని' 'అహని' అను రూపద్వయ ముండును. 'సుప్'పర మగునపుడు 'వా శరి' అను సూత్రముచే (104) 'అహఃసు' 'అహస్సు' అను రూపద్వయ ముండును.

'దణ్డిన్'ప్రథమైకవచనమున 'సు'లోపము. 'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నకారలోపము- 'దణ్డీ' అను రూపము సిద్ధించును.

సంబుద్ధియందు 'హే దణ్డిన్+సు'అని యుండగా సులోపము, నలోపము (180) నిత్యముగ రావలసి యుండ:-

వా. సమ్బుద్ధౌ నపుంసకానాం నలోపో వా వాచ్యః.

హే దణ్డిన్; హేదణ్డి, దణ్డినీ. దణ్డీని, దణ్డినా, దణ్డిభ్యామ్.

"నపుంసకలింగశబ్దములకు సంబుద్ధి పర మగునపుడు నకారలోపము వికల్పముగ చెప్పవలెను". కావున 'హేదణ్డిన్' 'హేదణ్డి'అను రూపద్వయ ముండును. ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశము- 'దణ్డినీ'అను రూపము సిద్ధించును. బహువచనమున 'శి' సర్వనామస్థానసంజ్ఞకము గాన 'సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ'అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము- 'దణ్డీని'అను రూపము సిద్ధించినది. ద్వితీయారూపములు కూడ ఇట్లే. తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలె రూపము లుండును.

సుపథి, భస్య టేర్లోపః— సుపథీ. సుపన్థాని. ఊర్క్, ఊర్జీ. ఊన్ర్జి. నరజానాం సంయోగః. తత్, తే, తాని. యత్, యే, యాని. ఏతత్, ఏతే; ఏతాని.

'సుపథిన్ శబ్దప్రథమైకవచనమున 'సు'లోప, ప్రాతిపదికాన్తనకారలోపములచే 'సుపథి'అను రూపము సిద్ధించినది. ద్వివచనమున 'ఔ'కు 'శీ' (ఈ) ఆదేశము. నపుంసకలింగ మగుటచే సర్వనామసంజ్ఞ లేదు. 'యచి భమ్' అను సూత్రముచే (165) భసంజ్ఞ. కావున 'భస్య టేర్లోపః'అను సూత్రముచే (297) టిలోపము- 'సుపథీ'అను రూపము సిద్ధించినది.

బహువచనమున 'జస్'కు 'శి'ఆదేశము. ఇది సర్వనామస్థానసంజ్ఞకము గాన "ఇతోఽత్సర్వనామస్థానే"అను సూత్రముచే (295) ఇకారమునకు అకారాదేశము- 'సుపథిన్ + శి'. 'థో న్థః'అను సూత్రముచే (296) 'న్థ'ఆదేశము- "సుపన్థన్ + ఇ" 'సర్వనామస్థానేచాసమ్బుద్ధౌ'అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము. 'సుపన్థాని'అను రూపము సిద్ధించినది. ద్వితీయవిభక్తి రూపములుకూడ ఈ విధముగనే సిద్ధించును. "సమ్బుద్ధౌ నపుంసకానాం నలోపో వా వాచ్యః" అను వార్తికముచే (సూ. 364) నకారలోపము వైకల్పికము గాన 'హేసుపథిన్', 'హే సుపథి అను రూపద్వయ ముండును. తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలె రూపములు సిద్ధించును.

జకారాన్త మగు 'ఊర్జ్'శబ్దమునకు ప్రథమైకవచనమున 'ఊర్జ్ + సు' అని యుండగా సులోపము. 'చోః కుః'అను సూత్రముచే (307) కుత్వముచే

జకారమునకు గకారాదేశము. చర్త్వవికల్పముచే 'ఊర్క్' 'ఊర్గ్' అను రెండు రూపములు సిద్ధించును.

'ఔ'కు 'శీ'అదేశము చేయగా 'ఊర్జీ'అను రూపము. బహువచనమున 'జస్'కు 'శి'ఆదేశము. 'శి'సర్వనామసంజ్ఞకము గాన '"నపుంసకస్య ఝలచః' అను సూత్రముచే (239) వచ్చు నుమాగమము 'మిత్'గాన అన్త్యాచ్ అగు (వ్యపదేశివద్భావముచే) ఉకారమునకు పరముగ వచ్చును. 'ఊన్ర్జి' అను రూపము సిద్ధించినది. ఇచట నకారరేఫజకారములకు సంయోగము.

'తద్', 'యద్', 'ఏతద్'శబ్దముల ప్రథమైకవచనమున 'సు'లోపముచే 'తత్', 'యత్', 'ఏతత్' (చర్త్వవికల్పముచే) 'తద్', 'యద్', 'ఏతద్' అను రూపములు సిద్ధించును. విభక్తిలోపానన్తరము 'న లుమతాఙ్గస్య' అను సూత్రముచే (191) ప్రత్యయలక్షణము నిషిద్ధము గాన త్యదాద్యత్వ, సత్వాదులు రావు. 'తే'; 'తాని'; 'యే', 'యాని'. 'ఏతే', 'ఏతాని' అను రూపములు త్యదాద్యత్వపరరూపములు చేసిన పిమ్మట ఈ శబ్దములు అకారాంతము లగును. గాన 'సర్వే', 'సర్వాణి'వలె నిష్పన్న మగును. ఇతరవిభక్తులందు గూడ పుంలింగమునందు వలె రూపము లుండును.

గవాక్, గోచీ, గవాఞ్చి. పునస్తద్వత్. గోచా. గవాగ్భ్యామ్. శకృత్, శకృతీ, శకృన్తి. దదత్, దదతీ.

'అఞ్చు'ధాతువునకు 'గో'శబ్దము ఉపపదముగ నున్నపుడు 'ఋత్విక్— ఇత్యాదిసూత్రముచే (302) 'క్విన్'ప్రత్యయము చేర్చగా 'గోఅఞ్చు'అను శబ్దము నిష్పన్న మైనది. ప్రథమైకవచనమున 'గోఅఞ్చు+సు'అని యుండ "అనిదితాం హల ఉపధాయాః క్ఙితి"అను సూత్రముచే (335) (ఞకారరూపములో నున్న) నకారమునకు లోపము. 'సు'కు లోపము. 'అవఙ్ స్ఫోటాయనస్య'అను సూత్రముచే (47) అవఙాదేశము– 'గవ+అచ్', సవర్ణదీర్ఘముచే 'గవాచ్' అని యుండ —'ఝలాం జశోఽన్తే'అను సూత్రముచే (67) జశ్త్వముచే జకారము. జకారమునకు 'క్విన్ప్రత్యయస్య కుః'అను సూత్రముచే (305)కుత్వమున గకారము.'వాఽవసానే'అను సూత్రముచే(146)చర్త్వవికల్పము–గవాక్, గవాగ్ అను రెండు రూపములు సిద్ధించును. అవఙాదేశము వైకల్పికము గాన 'సర్వత్ర విభాషా గోః' అను సూత్రముచే (44) వైకల్పికప్రకృతిభావముచే 'గోఅక్'

'గోఅగ్'అను రూపములును. ప్రకృతిభావము లేని పక్షమున 'ఏజః పదాన్తాదతి' అను సూత్రముచే (43) పూర్వరూపముచే 'గోక్', 'గోగ్'అను రూపములును గూడ ఉండును.

ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశము— 'గోఅఞ్చ్ఈ', 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి'అను సూత్రముచే (335)నకారలోపము. 'అచః'అను సూత్రముచే (336) అకారలోపము— 'గోచీ' అను రూపము.

బహువచనమున 'గోఅఞ్చ్ + శి'అని యుండ నకారలోపము. 'శి'సర్వనామస్థానము గాన 'అచః'అను సూత్రముచే (336) అకారలోపము రాదు. ఓకారమునకు అవఙాదేశము. సవర్ణదీర్ఘము. 'నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము. నకారమునకు అనుస్వారపరసవర్ణములచే 'గవాఞ్చి'అను రూపము సిద్ధించినది. ద్వితీయయందు గూడ ఇటులనే రూపసిద్ధి యగును. 'టా'మొదలగు అజాదివిభక్తులు పర మగునపుడు 'అచః'అను సూత్రముచే (336) అకారలోపము వచ్చి 'గోచా' 'గోచే' ఇత్యాదిరూపములును 'భ్యామ్' మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు అవఙాదేశసవర్ణదీర్ఘములును, చకారమునకు జశ్త్వ (జకార)కుత్వము (గకారము)లును చేయ 'గవాగ్భ్యామ్'ఇత్యాదిరూపములును సిద్ధించును. 'సుప్'పర మగునపుడు జశ్త్వ, కుత్వ చర్త్వషత్వములచే 'గవాక్షు'అను రూపము సిద్ధించును.

ఋకారాన్త మగు 'శకృత్'శబ్దము ప్రథమైకవచనమున సులోపము చేసిన పిమ్మట,జశ్త్వ,వైకల్పికచర్త్వములచే 'శకృత్''శకృద్'అను రూపద్వయము సిద్ధించును ద్వివచనమున 'ఔ'కు 'శీ'ఆదేశముచే 'శకృతీ'అను రూపము సిద్ధించును.బహువచనమున 'జస్'కు 'శి'ఆదేశము.-'శకృత్ + ఇ','నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము.'నశ్చాపదాన్తస్య ఝలి' (78) అను స్వారస్య యయి .పరసవర్ణః' (79) అను సూత్రములచే నకారమునకు అనుస్వారపరసవర్ణములు చేయగా 'శకృన్తి'అను రూపము సిద్ధించును. ద్వితీయయందు గూడ ఇట్లే రూపనిష్పత్తి యుండును. తృతీయాదివిభక్తులందు పుంలింగమహచ్ఛబ్దమునందు వలె రూపము లుండును.

దాధాతువునకు శతృప్రత్యయము చేయుటచే నేర్పడిన తకారాన్తదదచ్ఛబ్దమున 'దదత్','దదతీ'అను రూపములు వెనుకటి వలె సిద్ధించును.బహువచన

మున 'శీ' చేసిన పిదప వెనుకటి వలె నిత్యముగ నుమాగమము రావలసి యుండ:-

365. వా నపుంసకస్య 7.1.79

అభ్యస్తాత్పరః యః శతా,తదన్తస్య క్లీబస్య వా నుమ్ సర్వనామస్థానే. దదన్తి, దదతి. తుదత్.

'నాభ్యస్తాచ్ఛతుః' 'ఇదితో నుమ్ ధాతోః 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః'అను సూత్రముల నుండి 'అభ్యస్తాత్' 'శతుః' 'నుమ్' 'సర్వనామస్థానే' అనువర్తించును. "అభ్యస్తముకంటె పర మగు శతృప్రత్యయము అంతమున గల నపుంసకలింగశబ్దమునకు సర్వనామస్థానము పర మగునపుడు 'నుమ్'వికల్పముగ వచ్చును."

ఇచట 'దా'ధాతువును ఆవృత్తి చేయుటచే (ద్విత్వముచే) నేర్పడిన 'దద'అనునది 'ఉభే అభ్యస్తమ్'అను సూత్రముచే (346) అభ్యస్తసంజ్ఞము గాన ఇచటి నుమాగమవికల్పముచే 'దదన్తి''దదతి'అను రూపద్వయము సిద్ధించును.ద్వితీయయందు కూడ రూపము లిట్లే యుండును.తృతీయాదివిభక్తులందు పుంలింగమహచ్ఛబ్దమునందు వలె రూపములు సిద్ధించును.

తుదాదిగణములోని 'తుద'ధాతువునకు 'లట్'పరముగా నుండగా 'తుదాదిభ్యః శః'అను సూత్రముచే(614)'శ' (అ)ప్రత్యయము. 'లట్'స్థానమున శతృ (అత్)ప్రత్యయము. 'తుద్ + అ + అత్'అనియుండ 'అతో గుణే'యని(274) పరరూపముచే రెండు అకారముల స్థానమున 'అ'కార మాదేశముగ వచ్చి 'తుదత్ అను శబ్దము నిష్పన్న మైనది. దీని ప్రథమైకవచనమున 'సు'లోపముచే 'తుదత్'అను రూపము సిద్ధించును.

ద్వివచనమున 'ఔ'కు 'శీ' ఆదేశము చేసిన పిమ్మట 'తుదత్ + ఈ'అని యుండ:-

366. ఆచ్ఛీనద్యోర్నుమ్ 7.1.80

అవర్ణాన్తాదఙ్గాత్ పరో యః శతురవయవః, తదన్తస్య అఙ్గస్య నుమ్ వా శీనద్యోః. తుదన్తీ, తుదతీ, తుదన్తి.

'నాభ్యస్తాచ్ఛతుః' 'వా నపుంసకస్య'అను సూత్రముల నుండి 'శతుః' 'వా' అనువర్తించును. 'అఙ్గస్య'అధికారము. 'పరస్య'అని అధ్యాహారము. "అవర్ణాంత మగు అంగముకంటె పర మగు శతృప్రత్యయావయవము అంత

మున గల అంగమునకు 'శీ'పర మగునపుడును నదీసంజ్ఞకవర్ణము పర మగు నపుడును 'నుమ్' వికల్పముగ వచ్చును.

'తుదత్'అనునపుడు 'తుద'అనునది అవర్ణాన్తాంగము.దానికంటె పరముగ నున్న తకారము శతృప్రత్యయావయవము.తదన్తాంగ మగు 'తుదత్' అను దానికి 'శీ' పరముగ నున్నది గాన వికల్పముగ నుమాగమము వచ్చిన పక్షమున 'తుదన్తీ'అనియు, తదభావపక్షమున 'తుదతీ'అనియు రెండు రూపములు సిద్ధించును.బహువచనమున 'శకృన్తి' వలె 'తుదన్తి' యను రూప మగును. ఇట్లే ద్వితీయవిభక్తి రూపములు. తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలె రూపము లుండును.

'పచ్'ధాతువు భ్వాదులలోనిది గాన శతృప్రత్యయము చేర్చిన పిదప ధాతువునకు 'కర్తరిశప్'అను సూత్రముచే (389) 'శప్'(అ)ప్రత్యయము వచ్చి 'పచత్'అను శబ్దము సిద్ధించును. దాని ప్రథమైకవచనమున 'సు' లోపముచే 'పచత్'అను రూపము సిద్ధించును.ద్వివచనమున 'పచత్ + శీ'అనియుండ—

367. శప్శ్యనోర్నిత్యమ్ 7.1.81

శప్శ్యనోరాత్పరో యః శతురవయవః, తదన్తస్య నిత్యం 'నుమ్'శీనద్యోః. పచన్తీ, పచన్తి. దీవ్యన్తీ, దీవ్యన్తి. ధనుః, ధనుషీ. 'సాన్త-'ఇతి దీర్ఘః, 'నుమ్విసర్జనీయ-'ఇతి షః-ధనూంషి, ధనుషా, ధనుర్భ్యామ్. ఏవమ్-చక్షుర్హవిరాదయః.

వెనుకటిసూత్రము (366). 'నాభ్యస్తాచ్ఛతుః' నుండి 'శతుః'అనువర్తించును. 'శప్','శ్యన్'ప్రత్యయముల అకారముకంటె పర మగు 'శతృ' ప్రత్యయావయవము అంతమున గల అంగమునకు 'శీ'నదులు పర మగునపుడు నిత్యముగ నుమాగమము వచ్చును."

ఇచట శతృప్రత్యయావయవ మగు తకారము శప్ప్రత్యయాకారముకంటె పరముగ నున్నది గాన తదంత మగు 'పచత్'అను దానికి నిత్యముగ నుమాగమము వచ్చి 'పచన్తీ' అను రూపము సిద్ధించినది. 'జస్','శస్'లు పర మగునపుడు 'శి'ఆదేశము,'నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే(239)నుమాగమము చేయ 'పచన్తి' అను రూప మగును.తృతీయాదులందు పుంలింగమునందు వలె రూపనిష్పత్తి యుండును.

'దివ్'ధాతువునకు 'దివాదిభ్యః శ్యన్' అను సూత్రముచే (632) 'శ్యన్'ప్రత్యయము,'లట్'కు శతృప్రత్యయము చేర్చగా నిష్పన్న మగు'దీవ్యత్' శబ్దమునకు ప్రథమైకవచనమున 'సు'లోపముచే 'దీవ్యత్'అను రూపము సిద్ధించును.'ఔ'పర మగునపుడు ఇచట శతృప్రత్యయావయవతకారము శ్యన్ప్రత్యయాకారముకంటె పరముగ నున్నదిగాన నిత్యముగ నుమాగమము వచ్చి 'దీవ్యన్తీ' అను రూప మగును బహువచనమున 'పచన్తి' వలె 'దీవ్యన్తి' అను రూపముండును. ద్వితీయయందును ఇట్లే.తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలె రూపములు ఉండును.

'అర్తిపృావపి'ఇత్యాద్యుణాదిసూత్రముచే 'ధన్'ధాతువునకు 'ఉస్'ప్రత్యయము చేర్చి సకారమునకు 'ఆదేశప్రత్యయోః'అను సూత్రముచే (150) షత్వము చేయ 'ధనుష్'శబ్ద మేర్పడినది. ప్రథమైకవచనమున 'సు'లోపము. షత్వము అసిద్ధ మగుటచే 'ససజుషోరుః'అను సూత్రముచే(105)రుత్వము. పిదప 'ఖరవసానయోర్విసర్జనీయః'అను సూత్రముచే (93) విసర్గము-'ధనుః' అను రూపము సిద్ధించినది. 'ధనుర్'అను నపుడు రేఫ ధాత్వవయవము కాదు గాన 'ర్వోరుపధాయా దీర్ఘ ఇకః'అను సూత్రముచే (352) దీర్ఘప్రసక్తి లేదు. ద్వివచనమున 'శీ'ఆదేశముచే 'ధనుషీ'అను రూపము.

బహువచనమున 'జస్'కు 'శి' ఆదేశము-'ధనుష్ + ఇ','నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము-'ధనున్ స్ + ఇ','సాన్తమహతః సంయోగస్య'అను సూత్రముచే (343) ఉకారమునకు దీర్ఘము. నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే(78)నకారమునకు అనుస్వారము.'ధనూంసి' అవి యుండగా-'నుమ్విసర్జనీయశర్వ్యవాయేఽపి'అను సూత్రముచే (353) షత్వము-'ధనూంషి'అను రూపము సిద్ధించినది.ద్వితీయయందు గూడ ఇట్లే రూపములు సిద్ధించును 'భ్యామ్'మొదలగు హలాదివిభక్తులు పర మగునపుడు రుత్వముచే 'ధనుర్భ్యామ్'ఇత్యాదిరూపములు సిద్ధించును. 'సుప్'పర మగునపుడు 'వా శరి'యను సూత్రముచే(104)విసర్గము వైకల్పికము గాన 'ధనుఃషు' 'ధనుష్షు'అను రూపద్వయము. చక్షుష్', 'హవిష్'ఇత్యాదిశబ్దములు గూడ ఇటులనే యుండును.

పయః, పయసీ, పయాంసి, పయసా, పయోభ్యామ్. సుపుమ్, సుపుంసీ, సుపుమాంసి,

సకారాన్తపయశ్శబ్దప్రథమద్వితీయైకవచనములందు 'సు''అమ్'లు లోపించిన పిదప సకారమునకు రుత్వవిసర్గములు' పయః'అను రూపము సిద్ధించినది. 'ఔ'కు 'శీ'ఆదేశముచే ద్వివచనమున 'పయసీ'అను రూపము. బహువచనమున 'జస్','శస్'లకు 'శి'ఆదేశము. 'నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము. 'సాన్తమహతః సంయోగస్య'అను సూత్రముచే (343) నకారోపధకు దీర్ఘము. 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) నకారమునకు అనుస్వారము-'పయాంసి'అను రూపము సిద్ధించును. తృతీయాదివిభక్తులందు వేధశ్శబ్దమునందు వలె రూపసిద్ధి యుండును

'సుపుంస్'శబ్దప్రథమాద్వితీయైకవచనములందు 'సు''అమ్'లు లోపించిన పిదప సంయోగాన్తలోపముచే (20) సకారమునకు లోపము.ఇచట సకారము వెనుక నున్నది అనుస్వారమే యైనను అది మకారస్థానమున 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) వచ్చిన దగుటచే 'సంయోగాన్తస్యలోపః'అను సూత్రము (20) దృష్టిలో అసిద్ధము గాన దానికి మకారమే కనబడుచుండును. కావున లోపము వచ్చును. సకారము లోపించిన పిదవ 'నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః'అను న్యాయముచే అనుస్వారము పోయి మకారమే వచ్చును గాన 'సుపుమ్'అను రూపము సిద్ధించినది.'ఔ'కు 'శీ'ఆదేశము చేయ 'సుపుంసీ'యను రూపము. 'జస్''శస్'లకు వచ్చిన 'శి'ఆదేశము సర్వనామస్థానసంజ్ఞకము గాన 'పుంసోఽసుఙ్' అను సూత్రముచే (355) అసుఙాదేశము. ఙిత్ గాన సకారస్థానమున వచ్చును-'సుపుమస్ + ఇ','నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము-'సుపుమన్స్ఇ','సాన్తమహతః సంయోగస్య'అను సూత్రముచే (343) ఉపధాదీర్ఘము-నకారమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) అనుస్వారము.'సుపుమాంసి'అను రూపము సిద్ధించును.తృతీయాది విభక్తులందు పుంలింగమునందు వలె రూపము లుండును.

అదః, విభక్తికార్యమ్, ఉత్వమత్వే-అమూ, అమూని. శేషం పుంవత్.

ఇతి హలన్తనపుంసకలిఙ్గప్రకరణమ్.

ఇతి షడ్లిఙ్గప్రకరణమ్

'అదస్'శబ్దమున 'సు','అమ్'లు లోపించిన పిదప సకారమునకు రుత్వవిసర్గములు-'అదః'అను రూపము సిద్ధించును ఇది సాన్త మగుటచే 'అదసోసేర్దాదు దో మః అను సూత్రముచే (356) ముత్వము రాదు.

'ఔ'కు 'శీ' ఆదేశము చేసిన పిదప త్యదాద్యత్వ,పరరూపగుణములచే 'అదే'అని యుండ 'అదసోఽసేః-'అను సూత్రముచే ఊత్వమత్వములు. 'అమూ'అను రూపము సిద్ధించును. బహువచనమున 'జస్''శస్'లకు 'శి'ఆదేశము.త్యదాద్యత్వపరరూపములు. 'నపుంసకస్య ఝలచః'అను సూత్రముచే (239) నుమాగమము 'సర్వనామస్థానేచాసమ్బుద్ధౌ'అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము-'అదాని'అని యుండగా ఊత్వమత్వములు-'అమూని'అను రూపము సిద్ధించును.తృతీయాదివిభక్తులందు పుంలింగమునందు వలె రూపసిద్ధి యుండును.

హలంతనపుంసకలింగప్రకరణము సమాప్తము.
షడ్లింగప్రకరణము సమాప్తము

# అథ అవ్యయ ప్రకరణమ్

## 368 స్వరాదినిపాతమవ్యయమ్ 1.1.37

స్వరాదయో నిపాతాశ్చావ్యయసంజ్ఞాః స్యుః.

'స్వర్'మొదలగు శబ్దములును, నిపాతములును అవ్యయసంజ్ఞకములు. లింగవచనవిభక్త్యాదికృత మగు మార్పు ఏదియు లేని పదమునకు అవ్యయ మని పేరు. 'నవ్యేతి ఇతి అవ్యయమ్-'అనగా మార్పు చెందనిది అని అవ్యయనామధేయము సార్థకము ఈక్రింద స్వరాదులు వఠింపబడుచున్నవి వాటి తెలుగు అర్థములు కుండలికలలో చూపబడుచున్నవి.

స్వర్[1](స్వర్గము); అన్తర్ (లోపల ; ప్రాతర్(ప్రాతఃకాలము);పునర్(మరల); సనుతర్(అంతర్ధానముచెందుట); ఉచ్చైస్(ఎత్తైన); నీచైస్(క్రిందిదైన); శనైస్(మెల్లిగా); ఋధక్ (సత్యముగా;వియోగ,శైఘ్ర్య;సామీప్య,లాఘవార్థములు గూడ నని కొందరు); ఋతే(మినహాయించి;లేకుండగా); యుగ

1. 'స్వర్' మొదలగు ఐదు అవ్యయములును రేఫాన్తములు.కావున 'స్వర్యాతి' ఇత్యాదులందు 'హశి చ'అనుసూత్రముచే [107] 'రు'కు విహిత మగు ఉత్వము రాదు.

సకృత్(ఒక్క మారుగా): ఆరాత్(దూరముగా.లేక)దగ్గరగా: పృథక్(వేరుగా): హ్యస్(నిన్న): శ్వస్(రేపు): దివా(పగటియందు): రాత్రౌ(రాత్రియందు): సాయమ్(సాయంకాలమున): చిరమ్(చాలకాలము): మనాక్(కొంచెము): ఈషత్(కొంచెము):జోషమ్(సుఖముగా;మౌనముగా): తూష్ణీమ్(మౌనముగా): బహిస్(వెలుపల):అవస(వెలుపల):అధస్(క్రింద): సమయా(దగ్గర): నికషా(దగ్గర): స్వయమ్(తనంతతాను): వృథా (వ్యర్థముగా): నక్తమ్ (రాత్రియందు) న(లేదు, కాదు): నఞ్ (నిషేధము): [1]హేతౌ( కారణమున ): ఇద్ధా( స్పష్టముగా ): అద్ధా(స్ఫుటముగా;నిశ్చితముగా;తత్త్వము,అతిశయము అని కొందరు);సామి(సగము; జుగుప్సితము):(గ.సూ)[2]వత్(వలె): బ్రాహ్మణవత్;(బ్రాహ్మణునివలె);క్షత్రియవత్(క్షత్రియునివలె);సనా(నిత్యము);సనత్(నిత్యము):సనాత్(నిత్యము): ఉపధా(భేదము): తిరస్[2] (దాగికొనుట; పరాభవము;అడ్డముగా): అన్తరా(మధ్యయందు; లేకుండగా)అన్తరేణ(మినహాయించి; లేకుండగా);జ్యోక్(చాలకాలము; ప్రశ్నార్థకము శీఘ్రముగా; ఇప్పుడు(;కమ్)జల,శిరో,నిందాసుఖార్థకము): శమ్(సుఖము): సహసా(హఠాత్తుగా;ఆలోచించకుండగా);వినా(లేకుండగా);నానా(అనేకము;లేకుండగా); స్వస్తి (మంగలము): స్వధా(పితృహవిర్దానము):. అలమ్ (భూషణము, చాలును;సామర్థ్యము;నిషేధము;నివారణము) ;వషట్;వౌషట్;శ్రౌషట్; (దేవతాహవిర్దానము): అన్యత్(వేరైన): అస్తి(ఉన్నది): ఉపాంశు(అస్పష్టోచ్చారణము; రహస్యము): క్షమా(ఓర్పు): విహాయసా (ఆకాశము): దోషా(రాత్రి): మృషా(అసత్యము): మిథ్యా(అసత్యము): ముధా (వ్యర్థముగా): పురా (పూర్వమున; అసమాప్తము: ఆసన్నభవిష్యత్తు): మిథో; మిథస్ (పరస్పరము; రహస్యమున): ప్రాయస్(బహుశా;తరుచుగా)ముహుస్(మాటిమాటికి): ప్రవాహుకమ్;ప్రవాహికా;(ఒక్కుమ్మడిగా;పైకి): ఆర్యహలమ్ (బలాత్కారముగా): అభీక్ష్ణమ్ (మాటిమాటికి): సాకమ్;సార్ధమ్(కూడా)! నమస్(నమస్కారము): హిరుక్(విడచి,

1. "తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః"
అను కారిక ననుసరించి ఇది ఆరు అర్థములం దుపయోగింపబడును.సాధారణముగ సమాసమునందే వచ్చును గాని స్వతంత్రముగ ప్రయోగింపబడదు.
2. ఇది స్వతంత్రముగ ప్రయోగింపబడదు. 'బ్రాహ్మణవత్','క్షత్రియవత్'అనునవి ఉదాహరణములు
3. ఇది స్వతంత్రముగ గాక 'కృ','ధా'ధాతువులతోడనే ప్రయోగింపబడును.

మినహాయించి): ధిక్(ఛీ): అథ(ప్రారంభము;అటుపిమ్మట): అమ్ (శీఘ్రము; అల్పము); ఆమ్(ఔను): ప్రతామ్(వాడిపోవుట); ప్రశామ్(సమానము): మా; మాఙ్(నిషేధము): ఆకృతిగణోఽయమ్.

ఈ స్వరాదిగణము ఆకృతిగణము. కావున నిట్టి పదములు ప్రయోగములో నున్న యెడల ఈ గణమున జేర్చవచ్చును. ఉదాహరణకు ఈ క్రింది శబ్దము లను ఈ గణమున చేర్చవచ్చును:-

కామమ్(స్వేచ్ఛగా); ప్రకామమ్ (అధికముగా): భూయస్ (మరల); సాంప్రతమ్(యుక్తము:న్యాయ్యము): పరమ్(కాని): సాక్షాత్(ప్రత్యక్షముగా): సాచి(అడ్డముగా): సత్యమ్ (అర్ధాంగీకారము); మఙ్క్షు;ఆశు;ఝటితి;ఝగితి (శీఘ్రముగా); సంవత్(సంవత్సరము);అవశ్యమ్(తప్పకుండగ);సపది(వెంటనే) బలవత్(అధికముగా): ప్రాదుస్;ఆవిస్(ప్రకాశమగుట): అనిశమ్;నిత్యమ్;సదా; అజస్రమ్;సన్తతమ్(ఎల్లప్పుడు): సుష్ఠు(బాగుగా): వది(కృష్ణపక్షము): సుది (శుక్లపక్షము); ఉషా(రాత్రి): రోదసి(భూమ్యాకాశములు): ఓమ్(అంగీకారార్థకము;బ్రహ్మ); ద్రాక్;తరసా(శీఘ్రముగా); దుష్ఠు(చెడ్డ): సు(పూజార్థకము); ఆః (ఆశ్చర్యార్థకము); కు (కుత్సితము;అల్పము): అఞ్జసా (తత్త్వము;శీఘ్రముగా); మిథు(ద్వయము); అస్తమ్(వినాశము): స్థానే(యుక్తము): తాజక్ (శీఘ్రముగా): చిరాయ;చిరరాత్రాయ;చిరస్య;చిరమ్;చిరేణ;చిరాత్(చిరకాలము); వరమ్(కొంచెముమంచిది); అనుషక్(ఆనుపూర్వ్యము; క్రమానుసారము). అనుషక్ (ఊహించుట): అమేనః(శీఘ్రముగా;ఇప్పుడే); ఇత్యాదులు. ఈ క్రింద చూపబడిన చాదులు నిపాతములు:-

చ(మరియు): వా(లేక-సందేహార్థకము): హ (ప్రసిద్ధ్యర్థకము); అహ (ఆశ్చర్యము;ఖేదము); ఏవ(ఏ-అవధారణము); ఏవమ్(ఇట్లు); నూనమ్(నిశ్చయముగా): శశ్వత్(ఎల్లప్పుడును); యుగపత్(ఒక్కమారుగా): భూయస్(మరల; ఆధిక్యము); కూపత్(ప్రశ్న,ప్రశంస): కువిత్(చాలా;ప్రశంస): నేత్(శంకా, ప్రతిషేధ-విచారసముచ్చయములు;అట్లుకాకపోయినచో): చేత్(అట్లైతే); చణ్ (అట్లైతే): యత్ర (ఎక్కడైతే: నింద;అమర్షము); కచ్చిత్ (ఇష్టప్రశ్న): నహ (నిషేధపూర్వకప్రారంభము)హన్త(హర్షము;విషాదము;అహా!);మాకిః;మాకిమ్; నకిః;నకిమ్(విడచి;మినహాయించి): మాఙ్;నఞ్(నిషేధము);యావత్(ఎంతైతే) తావత్(అంత): త్వై;న్వై;ద్వై (వితర్కము): రై(దానము;అనాదరము);

[1]శ్రౌషట్;వౌషట్;స్వాహా (దేవతాహవిర్దానము); స్వధా (పితృహవిర్దానము); వషట్(దేవతాహవిర్దానము); తుమ్(నీవు); తథాహి(అది యుక్తమే కదా); ఖలు (నిషేధవాక్యాలంకార,నిశ్చయములు);కిల(అట-ప్రసిద్ధి;ఇవార్థము,వృత్తాంతము); అథో: అథ (మంగలానన్తరారంభ, ప్రశ్న, కార్త్స్న్యాధికార, ప్రతిజ్ఞా, సముచ్చయార్థకము); సుష్ఠు(బాగుగనున్న); స్మ(భూతకాలము); ఆదహ(ప్రారంభము; హింస; కుత్సనము)।

గ.సూ. ఉపసర్గవిభక్తిస్వరప్రతిరూపకాశ్చ.

ఉపసర్గలవలె నుండునవియు,తిఙ్సుబ్విభక్త్యంతముల వలె నుండునవియు స్వరముల వలె నుండునవియు నగు శబ్దములు చాదిగణాంతర్గతములు. కావున అవి కూడ నిపాతసంజ్ఞకములై అవ్యయము లగును.

అవదత్తమ్, అహంయుః, అస్తిక్షీరా.

'అవదత్తమ్'-దీనియందలి 'అవ'అనునది ఉపసర్గసదృశమే గాని ఉపసర్గము కాదు.కావుననే 'అచ ఉపసర్గాత్తః'అను సూత్రముచే తాదేశము రాదు. తాదేశము వచ్చినచో 'అవత్తమ్'అను రూపము సిద్ధించియుండెడిది.

'అహంయుః'లోని 'అహం'అనునది అహంకారార్థక మగు సుబన్తప్రతిరూపకావ్యయము కాని సుబన్తము కాదు.సుబన్తమైయున్నచో "అహంశుభమోర్యుస్"అను సూత్రముచే (1195) విహిత మగు 'యుస్' ప్రత్యయము పర మగునపుడు 'ప్రత్యయోత్తరపదయోశ్చ'అను సూత్రముచే (1082)మపర్యంతభాగమునకు మదాదేశము వచ్చి 'మద్యుః'అను రూపము సిద్ధించెడిది.

'అస్తిక్షీరా'అనునపుడు 'అస్తి'అనునది తిఙన్తప్రతిరూపకావ్యయము కావుననే 'అస్తి క్షీరం యస్యాస్సా'అను నర్థమున క్షీరశబ్దముతో సమసించినది. తిఙన్తమైనచో సమాసము అసంభవ మయ్యెడిది.

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఏ, ఐ, ఓ, ఔ.

ఇవి స్వరప్రతిరూపకావ్యయములు—నిపాతములు. వీటికి ప్రత్యేకార్థములు గలవు. 'అ'సంబోధన, నిషేధతిరస్కారార్థకము, 'ఆ'వాక్యస్మరణార్థకము.

---

1 స్వరాదిగణమున పఠింపబడిన కొన్ని పదములు మరల ఈ చాదినిపాతలలో స్వరభేదము నిమిత్తము పఠింపబడినవి. స్వరాదిగణమునందలి యవ్యయములు అర్థవాచకములు.చాదినిపాతములు విభిన్నార్థసూచకములు.

'ఇ'సంబోధనజుగుప్సావిస్మయార్థకము. మిగిలిన ఏడును సంబోధనార్థసూచకములు.

పశు(బాగుగా); శుకమ్(శీఘ్రముగా); యథాకథాచ(ఏదియో విధముగా, అనాదరము); పాట్; ప్యాట్; అఙ్గ; హై; హే; భోః; అయే (సంబోధనసూచకములు); ద్య(హింస; ప్రాతికూల్యము); విషు(అనేకవిధమైన); ఏకపదే(ఒక్కమారు: అకస్మాత్తుగా); యుత్(కుత్స-నింద); ఆతః(ఇందువలన);

చాదిరప్యాకృతిగణః.

ఛాదిగణము కూడ ఆకృతిగణమే. కావున ఇట్టి పోలిక గల శబ్దములు ప్రయోగమున నున్నచో ఇందు చేర్చవచ్చును. ఉదాహరణకు:-

యత్ (ఏకారణమువలన); తత్ (ఆకారణమువలన); ఆహోస్విత్(లేక-అట్లుకాక); వ. (సమానత్వము); అద్యత్వే (ఈరోజులలో); సకృత్ (ఒకపర్యాయము); అసకృత్ (మాటిమాటికి); ప్రేత్య (పరలోకము); అముత్ర (పరలోకమున); అహ్నాయ(శీఘ్రముగా); సత్వరం(శీఘ్రముగా); జాతు(ఎప్పుడైనను); అహో(ఆశ్చర్యము); ఉతాహో(వికల్పము); కిముత(వికల్పము; చెప్పనేల?); ప్రసహ్య(బలాత్కారముగా); కించ(మరియు); ఇతి(సమాప్తి); పశ్చాత్(వెనుక); భృశమ్(అత్యంతము); ఉరరీ, ఊరీ(అంగీకారము); అతః(ఈకారణమువలన); పూర్వేద్యుః(నిన్న); అద్య(నేడు); పరశ్వః(ఎల్లుండి); పరేద్యవి(మరునాడు); పరుత్(నిరుడు); పరారి(ముందటేడు); ఐషమః(ఈసంవత్సరమున); సమ్(అంతటను); సుకమ్(అతిశయము); చటు. చాటు(ప్రియవాక్యము); హుమ్(జడిపించుట); ఇవ(సాదృశ్యము);

స్వరాదిచాదులు రెండును ఆకృతిగణములే యైనను నిపాతస్వరము కావలసిన పదములను చాదిగణమునందును, ఇతరశబ్దములను స్వరాదిగణమునందును చేర్చవలెను.

369. తద్ధితశ్చాసర్వవిభక్తిః 1.1.38

యస్మాత్సర్వా విభక్తిర్నోత్పద్యతే స తద్ధితాన్తోఽవ్యయం స్యాత్.

'స్వరాదినిపాతమవ్యయమ్'నుండి 'అవ్యయమ్' అనువర్తించును. "దేనికంటె సంపూర్ణ విభక్తి-అనగా వచనక్రియాత్మక మగు విభక్తి పుట్టదో (రాదో) అట్టి తద్ధిత ప్రత్యయాంతము కూడ అవ్యయ మగును".

'అసర్వవిభక్తిః'అనుదానికి 'సర్వవిభక్తులుపుట్టని'అను అర్థము చెప్ప వలసి యున్నది. కాని అవ్యయములకంటె గూడ అన్ని విభక్తులును అంగీకరింప బడియున్నవి కావున ఆ యర్థము యుక్తము కాదు. కాని అవ్యయములకంటె కేవలము ఏకవచనవిభక్తి ప్రత్యయములు మాత్రమే చేర్చబడు నని భాష్యము నందు సూచింపబడుటచే 'సంపూర్ణ విభక్తి పుట్టని'అను నర్థము చెప్పబడినది.

పరిగణనం కర్తవ్యమ్-తసిలాదయః ప్రాక్పాశపః, శస్ప్రభృతయః ప్రాక్సమాసాన్తేభ్యః, అమ్, ఆమ్, కృత్వోర్థాః; తసివతీ, నానాఞౌ. ఏతదన్తమవ్యయమ్: అత ఇత్యాది.

ఇట్టి తద్ధితప్రత్యయాంతశబ్దములలో గూడ కొన్ని 'పచతి రూపమ్', 'పచతి కల్పమ్'ఇత్యాదులకు అవ్యయత్వము సమ్మతము కాదు గాన అవ్యయత్వ సంపాదకము లగు ప్రత్యయముల పరిగణనము చేయవలెను. 'పఞ్చమ్యాస్తసిల్' 5-3-7 అను సూత్రము (1199) మొదలు 'యాప్యేపాశప్' 5-3-47అను సూత్ర మునకు ముందు విధింపబడిన ప్రత్యయములు, "బహ్వల్పార్థాచ్ఛస్కారకాదన్య తరస్యామ్" 5-4-42 సూత్రము (1238) మొదలు 'సమాసాన్తాః' 5-4-68 సూత్రమునకు ముందు విధింపబడినప్రత్యయములు. 'అముచ ఛన్దసి' 5-4-11 అను సూత్రముచే విహిత మగు 'అమ్'ప్రత్యయము; "కిమేత్తిఙవ్యయఘాదామ్వ ద్రవ్యప్రకర్షే' 4-4-11 అను సూత్రముచే విధింపబడిన 'ఆమ్'ప్రత్యయము-, 'సఙ్ఖ్యాయాః క్రియాభ్యావృత్తిగణనే కృత్వసుచ్' 'ద్విత్రిచతుర్భ్యస్సుచ్' 'విభాషా బహోర్ధా'అను సూత్రత్రయముచే విహితము లగు 'కృత్వసుచ్' 'సుచ్', 'ధా' ప్రత్యయములు. 'తసిశ్చ'అను సూత్రముచే విధింపబడిన 'తసి'ప్రత్యయము 'తేన తుల్యం క్రియా చేద్వతిః' (1149) 'తత్ర తస్యేవ'(1150)అను సూత్రములచే విహితమగు 'వతి'ప్రత్యయము; 'వినఞ్భ్యాం నానాఞౌ న సహ'అను సూత్రముచే విహితము లగు 'నా' 'నాఞ్'ప్రత్యయములు- ఈ తద్ధిత ప్రత్యయములంతమందు గల 'అతః'ఇత్యాదిపదములు అవ్యయము లగును.

### 370. కృన్మేజన్తః 1.1.39

కృద్యో మాన్త ఏజన్తశ్చ తదన్తమవ్యయం స్యాత్. స్మారం స్మారం. జీవసే. పిబధ్యై.

కృత్, మేజన్తః (మ్ + ఏజన్తః). మకారాన్తమును ఏజంతమును (ఏ, ఓ, ఐ, ఔలు అంతమున గలది) అగు కృత్ప్రత్యయము అంతమున గల పదము అవ్యయసంజ్ఞక మగును.

'స్మారంస్మారమ్' అనునది 'అభీక్ష్ణే ణముల్' అను సూత్రముచే (888) విహిత మగు ణముల్ (అమ్) ప్రత్యయమును చేర్చుటచే సిద్ధించినది. ఇది మాన్తకృత్ప్రత్యయాంతము గాన అవ్యయము. 'జీవసే' 'పిబధ్యై' అనునవి 'జీవ్' 'పా' ధాతువులకు 'తుమర్థే సేసేన్-' ఇత్యాదిసూత్రముచే విధింపబడిన 'సే' 'శధ్యై' ప్రత్యయములను చేర్చుటచే నేర్పడినవి. ఈ కృత్ప్రత్యయములు ఏజన్తములు గాన ఈ పదములకు అవ్యయత్వము, ఇట్లే మాన్త మగు తుమున్ (తుమ్) ప్రత్యయము చేర్చుటచే నిష్పన్నము లగు 'కర్తుమ్' 'గన్తుమ్' ఇత్యాది శబ్దముల కవ్యయత్వము సిద్ధించును.

### 371. క్త్వాతోసున్కసునః 1.1.40

ఏతదన్తమవ్యయమ్. కృత్వా, ఉదేతోః, విసృపః.

'క్త్వా' ప్రత్యయాన్త, 'తోసున్' ప్రత్యయాన్త 'కసున్' ప్రత్యయాన్తశబ్దములు అవ్యయసంజ్ఞక లగును.

'కృత్వా' అనునది 'క్త్వా' ప్రత్యయాంతము గాన అవ్యయ మైనది. క్త్వా ప్రత్యయము 'సమానకర్తృకయోః పూర్వకాలే' (882) 'అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా' (881) అను సూత్రములచే విధింపబడినది.

తుమున్నర్థకము లగు 'తోసున్' 'కసున్' అను వైదిక ప్రత్యయములు 'ఈశ్వరే తోసున్కసునౌ' అను సూత్రముచే విధింపబడినవి. 'ఉదేతోః' అనునది ఉత్పూర్వక మగు 'ఇణ్' ధాతువునకు తోసున్ (తోస్) ప్రత్యయము చేర్చుటచే నిష్పన్న మైన రూపము. 'విసృపః' అనునది విపూర్వకసృప్ధాతువునకు 'కసున్' (అస్) ప్రత్యయము చేర్చుటచే నేర్పడినది. ఈ సూత్రముచే ఈ రెంటికిని అవ్యయత్వము సిద్ధించినది.

### 371. అవ్యయీభావశ్చ 1.1.41

అధిహరి.

అవ్యయీభావసమాసము కూడ అవ్యయ మగును.

'అవ్యయం విభక్తి'-ఇత్యాదిసూత్రముచే (911) 'అధి', 'హరి' అను పదములకు అవ్యయీభావసమాసము. కావున 'అధిహరి' అనునది ఈ సూత్రముచే అవ్యయ మైనది.

అభవిష్యః, అభవిష్యతమ్, అభవిష్యత;
అభవిష్యమ్. అభవిష్యావ, అభవిష్యామ.

సువృష్టిశ్చేదభవిష్యత్,తదా సుభిక్షమభవిష్యత్ ఇత్యాది జ్ఞేయమ్.

'భవిష్యతి మర్యాదావచనే' నుండి 'భవిష్యతి'అనువర్తించును. 'హేతుహేతుమతోర్లిజ్'ఇత్యాదిసూత్రములచే హేతుహేతుమద్భావాద్యర్థమున 'లిజ్' విధింపబడినది గాన హేతుహేతుమద్భావాదికము లిజ్జుకు నిమిత్తము. 'యది విద్యార్థినః సమ్యక్ పఠేయుః పరీక్షాయాం ఉత్తీర్ణా భవేయుః' (విద్యార్థులు బాగుగ చదివినచో పరీక్షలలో నుత్తీర్ణు లగుదురు) ఇత్యాదివాక్యములందు 'బాగుగా చదువుట'అను క్రియ 'ఉత్తీర్ణులగుట అను క్రియకు హేతువు. 'ఉత్తీర్ణ లగుట అనునది 'హేతుమత్.ఇట్లు ఒక క్రియ హేతువుగను మరియొక క్రియ హేతుమత్‌గను ఉండుటను 'హేతుహేతుమద్భావము'అందురు.

లిజ్‌నిమిత్త మగు హేతుహేతుమద్భావాదికము గమ్య మగునపుడు భవిష్యదర్థమున ధాతువుకంటె 'లృజ్'వచ్చును.ఇందు క్రియ జరుగ కుండుట కూడ సూచిత మగును.

'సువృష్టిశ్చేదభవిష్యత్ తదా సుభిక్షమభవిష్యత్'ఇత్యాదిక ముదాహరణము. 'మంచి వర్షము వచ్చినచో సుభిక్షముగ నుండెడిది'అని యర్థము. సుభిక్షభవమునకు సువృష్టిభవనము హేతువు గాన నిచట హేతుహేతుమద్భావమున్నది. 'సువృష్టియును లేదు సుభిక్షమును లేదు'అనునది కూడ సూచిత మగుచున్నది.కావున హేతుహేతుమత్క్రియలు రెంటికిని 'ల్ఋజ్' చేర్చబడినది,

భూధాతువునకు పై యర్థమున లృజ్ చేర్చిన పిమ్మట 'అట్'ఆగమము (సూ.425). లకారమునకు 'తిజ్'ప్రత్యయములు.ప్రథమైకవచనమున 'అభూ + తి'అని యుండగా ఇకారలోపము (సూ.426) 'శప్'ను బాధించి 'స్యతాసీ లృలుటోః'అను సూత్రముచే (405) 'స్య'ప్రత్యయము-'అభూ + స్య + త్'. 'స్య'అనునది వలాద్యార్ధధాతుకము గాన 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః'అను సూత్రముచే (403) ఇడాగమము. 'సార్వధాతుకార్ధధాతుకయోః'అను సూత్రముచే (190) గుణము,పిమ్మట అవాదేశము, 'అభవిస్య + త్'అని యుండగా 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) సకారమునకు మూర్ధన్యషకారము-'అభవిష్యత్'అను రూపము సిద్ధించును

ఇతరరూపములందు గూడ 'అభవిష్య'వరకును రూపనిష్పత్తి ఇటులనే యుండును. ప్రథమపురుషద్వివచనమున 'తస్'కు 'తామ్'ఆదేశము (సూ.416) చేయ 'అభవిష్యతామ్' అను రూపము సిద్ధించినది. బహువచనమున 'అభవిష్యన్తి' అని యుండగా ఇకారలోప (426) సంయోగాంతలోప (తకారలోప) ములచే 'అభవిష్యన్'అను రూపము నిష్పన్న మగును.

మధ్యమపురుషైకవచనమున 'అభవిష్య+సి'అని యుండగా ఇకార లోప (సూ.426) రుత్వవిసర్గములచే 'అభవిష్యః'అని యగును. ద్వివచన బహువచనములందు 'అభవిష్య+థస్' 'అభవిష్య+థ'అని యుండగా 'తమ్' 'త'ఆదేశములు వచ్చుటచే (సూ.416) 'అభవిష్యతమ్' 'అభవిష్యత' అను రూపము లేర్పడును.

ఉత్తమపురుషైకవచనమున 'మి'కి 'అమ్' ఆదేశము చేయుటచే (సూ.416) 'అభవిష్యమ్'అను రూపము సిద్ధించును. ద్వివచనబహువచనము లందు 'అభవిష్య+వస్' 'అభవిష్య+మస్'అని యుండగా 'అతో దీర్ఘో యఞి'అను సూత్రముచే (392) దీర్ఘము, 'నిత్యం ఙితః'అను సూత్రముచే (423) సకారలోపము వచ్చుటచే 'అభవిష్యావ' 'అభవిష్యామ'అను రూపము లేర్పడినవి.

అత సాతత్యగమనే (2). అతతి.

**అత**ధాతువునకు అవిచ్ఛిన్నముగా నడచుట అని యర్థము లట్టు చేర్చిన పిదప శప్ప్రత్యయాదులు చేరి ప్రక్రియ యంతయు భూధాతువునందు వలెనే యుండును.

| | | |
|---|---|---|
| అతతి, | అతతః, | అతన్తి; |
| అతసి, | అతథః, | అతథ; |
| అతామి, | అతావః, | అతామః |

445. అత ఆదేః 7.4.70

అభ్యాసస్యాదేరతో దీర్ఘః స్యాత్.

| | | |
|---|---|---|
| ఆత, | ఆతతుః, | ఆతుః, |
| ఆతిథ, | ఆతథుః, | ఆత, |
| ఆత, | ఆతివ, | ఆతిమ. |
| అతితా. | అతిష్యతి. | అతతు. |

'అత్ర లోపోఽభ్యాసస్య' 'దీర్ఘ ఇణః'అను సూత్రములనుండి 'అభ్యాసస్య' 'దీర్ఘః' అనువర్తించును. "అభ్యాసాదియందలి 'అ'కారమునకు దీర్ఘము వచ్చును."

'అత'ధాతువు లిట్టునందు తిబాదులు-తిబాదులకు 'పరస్మైపదానాం ణలతుసుస్థలథుసణల్వమాః'అను సూత్రముచే (394) 'ణల్'మొదలగు ఆదేశములు. ప్రథమపురుషైకవచనమున 'అత్ + అ'అని యుండగా 'అత్'కు 'లిటిధాతోరనభ్యాసస్య'అను సూత్రముచే (396) ద్విత్వము (అత్అత్ + అ,) 'హలాది శ్శేషః'అను సూత్రముచే (398) హలాదిశేషము చేసిన పిదప 'అఅత్ + అ' అని యుండగా 'అతో గుణే' అను సూత్రముచే (274) రెండు అకారముల స్థానమున 'అ'కారము రావలసి యుండ దానిని బాధించుటకై పై సూత్రము చెప్పబడినది. ఇచట మొదటి 'అ', అభ్యాసాది యందలి (వ్యపదేశివద్భావముచే) అకారము. కావున దీనికి దీర్ఘము చేసిన పిమ్మట ఆకారఅకారములకు సవర్ణదీర్ఘము చేయగా (అ + అత్ + అ = ఆత్ + అ) 'ఆత' అను రూపము సిద్ధించును. ఇతరరూపములందు గూడ ఇట్లే ప్రక్రియ ఎరుగవలెను. మధ్యమపురుషైకవచన, ఉత్తమపురుషద్వివచనబహువచనములందు 'థ'మొదలగునవి ఆర్ధధాతుకములు అగుటచే 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః'అను సూత్రముచే(403) ఇడాగమము వచ్చుట విశేషము-'ఆతిథ', 'ఆతివ'ఇత్యాదిరూపములు సిద్ధించును [illegible]

లుట్, లృట్ లోట్టులందు భూధాతువునందు వలె ప్రక్రియ యుండును. ఈ క్రింది రూపము లేర్పడును-

లుట్:- అతితా, ఆతితారౌ, ఆతితారః;
ఆతితాసి, అతితాస్థః, ఆతితాస్థ;
అతితాస్మి, ఆతితాస్వః, అతితాస్మః;

లృట్:- అతిష్యతి, అతిష్యతః, అతిష్యన్తి;
అతిష్యసి, అతిష్యథః, అతిష్యథ;
అతిష్యామి, అతిష్యావః, అతిష్యామః;

లోట్:- అతతు-అతతాత్, అతతామ్, అతన్తు
అత-అతతాత్, అతతమ్, అతత,
అతాని, అతావ, అతామ.

## 446. ఆడజాదీనామ్ 6.4.72

అజాదేరఙ్గస్యాట్ లుఙ్లఙ్లృఙ్క్షు. ఆతత్. అతేత్. అత్యాత్, అత్యాస్తామ్.

'లుఙ్లఙ్లృఙ్క్ష్వడుదాత్తః'నుండి 'లుఙ్లఙ్లృఙ్క్షు' అనువర్తించును. 'అఙ్గస్య'అధికారము. "లుఙ్లఙ్లృఙ్లులు పర మగునపుడు అజాది యగు అంగమునకు 'ఆట్' ఆగమము వచ్చును." ఈ సూత్రము 'లుఙ్లఙ్...'ఇత్యాది సూత్రమునకు (425) అపవాదము.

అతధాతువునకు లఙ్నందు ఈ సూత్రముచే ఆడాగమము 'ఆ + అత్ + లఙ్' 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధి -'ఆత్ + లఙ్'అని యుండ భూధాతువునందు వలెనే ప్రక్రియ యుండును

| | | | |
|---|---|---|---|
| లఙ్:- | ఆతత్ | ఆతతామ్ | ఆతన్ |
| | ఆతః | ఆతతమ్ | ఆతత |
| | ఆతమ్ | ఆతావ | ఆతామ. |

విధ్యాశీర్లిఙ్లందు గూడ భూధాతువునందు వలెనే ప్రక్రియ యుండును.

| | | | |
|---|---|---|---|
| విధిలిఙ్:- | అతేత్, | అతేతామ్ | అతేయుః |
| | అతేః | అతేతమ్ | అతేత |
| | అతేయమ్ | అతేవ | అతేమ. |
| ఆశీర్లిఙ్:- | అత్యాత్ | అత్యాస్తామ్ | అత్యాసుః |
| | అత్యాః | అత్యాస్తమ్ | అత్యాస్త |
| | అత్యాసమ్ | అత్యాస్వ | అత్యాస్మ. |

లుఙి సిచి ఇడాగమే కృతే-

'లుఙ్'నందు ఆడాగమము (సూ.446): 'చ్లి'ప్రత్యయము (సూ.439), 'చ్లి'కి 'సిచ్'ప్రత్యయము (స్); 'సిచ్'వలాద్యార్ధధాతుకమగుటచే ఇడాగమము (403);-'తి'యందలి ఇకారమునకు లోపము (సూ.426)-'ఆత్ఇస్త్'అని యుండగా-

## 447. అస్తిసిచోఽపృక్తే 7.3.96

విద్యమానాత్ సిచః అస్తేశ్చ పరస్యాపృక్తస్య హలః ఈడాగమః.

'బ్రువ ఈట్' నుండి 'ఈ౯'అనువర్తించును: "ఉన్న (లోపించకుండ గానున్న) 'సిచ్'కంటెను 'అస్'ధాతువుకంటెను పర మగు అపృక్తహల్లుకు, 'ఈట్' అను ఆగమము వచ్చును." ఈ సూత్రముచే 'సిచ్' (స్) కంటె పర మగు తకారరూపాపృక్తహల్లునకు ఈటాగమము చేయ 'ఆత్ ఇస్ ఈత్'అని యుండగా:-

## 448. ఇట ఈటి 8.2.28

ఇటః పరస్య సస్య లోపః స్యాద్ ఈటి పరే.

'రాత్సస్య' 'సంయోగాన్తస్య లోపః' అనుసూత్రములనుండి 'సస్య' 'లోపః' అనువర్తించును. "'ఇట్'కంటె పర మగు సకారమునకు 'ఈట్' పర మగునపుడు లోపము వచ్చును."

ఈ సూత్రముచే సకారము లోపించిన పిదప 'ఆత్ఇ+ఈత్'అని యుండగా ఇకారమునకును ఈకారమునకును సవర్ణదీర్ఘము రావలసి యున్నది. కాని 'అకస్సవర్ణేదీర్ఘః' (6.1.101) అను సూత్రము దృష్టిలో 'ఇట ఈటి' (8.2.28) అను సూత్రము అసిద్ధము గాన మధ్య సకార ముండుటచే సవర్ణ దీర్ఘము వచ్చుట కవకాశము లేకున్నది.అందుకై ఈ క్రింది వార్తికము చెప్ప బడుచున్నది.

వా. సిజ్లోప ఏకాదేశే సిద్ధో వాచ్యః.

ఆతీత్, ఆతిష్టామ్.

ఏకాదేశము చేయవలసి యున్నపుడు 'సిచ్'యొక్క లోపము సిద్ధమని చెప్పవలెను.

ఈ వార్తికము ననుసరించి 'ఇట ఈటి'అను సిజ్లోపము అసిద్ధము కాదు కావున సవర్ణదీర్ఘసంధిచే 'ఆతీత్'అను రూపము సిద్ధించినది.

ఆతిష్టామ్:- ద్వివచనమున 'తస్'కు 'తామ్' ఆదేశము (సూ.416); సకారమునకు 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) మూర్ధన్యష కారము,ష్టుత్వముచే తకారమునకు టకారము-పై రూపము సిద్ధించినది.

బహువచనమున 'ఆత్ఇస్+ఝి అని యుండగా:-

## 449. సిజభ్యస్త విదిభ్యశ్చ 3.4.109

సిచః అభ్యస్తాద్ విదేశ్చ పరస్య జిత్సంబన్ధినో ఝేః జుస్.

అతిషుః, అతీః, అతిష్టమ్, అతిష్ట; అతిషమ్. అతిష్వ, అతిష్మ, అతిష్యత్. షిధ గత్యామ్ (3).

'ఝేర్జుస్' అను సూత్రము, 'నిత్యంఙితః' నుండి 'ఙితః' అను పదము అనువర్తించును. "సిచ్‌కంటెను, అభ్యస్తముకంటెను 'విద్' ధాతువుకంటెను పరమును ఙిత్సంబంధియు నగు 'ఝి'కి 'జుస్' అను నాదేశము వచ్చును." ఇచట 'ఝి', 'సిచ్'కంటె పర మగుటచే జుసాదేశము. వెనుకటి వలె షత్వము- 'అతిషుః' అను రూపము సిద్ధించినది. మధ్యమపురుషైకవచనమున 'అత్ ఇస్ + సి(స్)' అని యుండ ఈడాగమ (సూ 447), సలోప (సూ. 448), సవర్ణదీర్ఘ, రుత్వవిసర్గములచే 'అతీః' అను రూపము. 'అతిష్టమ్' ఇత్యాదులందు గూడ ప్రక్రియ భూధాతువునందు వలెనే యుండును. సకారమునకు షత్వము, ష్టుత్వము విశేషకార్యములు.

'ల్యఙ్' రూపనిష్పత్తి భూధాతువునందు వలె ఉండును.

| ల్యఙ్ | అతిష్యత్ | అతిష్యతామ్ | అతిష్యన్ |
|---|---|---|---|
| | అతిష్యః | అతిష్యతమ్ | అతిష్యత |
| | అతిష్యమ్ | అతిష్యావ | అతిష్యామ. |

షిధధాతువునకు 'గమనము' అని యర్థము. 'ధాత్వాదేః షః సః' అను సూత్రముచే (255) షకారమునకు సకార మాదేశ మగుటచే ప్రయోగమున సకారమే కనబడును. లట్ ప్రథమపురుషైకవచనమునందు 'తిప్' ప్రత్యయము. 'కర్తరి శప్' అను సూత్రముచే (389) ధాతువుకంటె పరముగ 'శప్' ప్రత్యయము. 'సిధ్ + అ + తి' అని యుండగా 'సిధ్' అనునది ఇగన్తాంగము కాకుండుటచే 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను (390) గుణము వచ్చుటకు అవకాశము లేదు గాన గుణవిధాయకమగు సూత్రాంతరమును (453) చెప్పుటకు మొదట లఘ్వాది సంజ్ఞలను చెప్పుచున్నాడు.

450. హ్రస్వం లఘు 1.4.10

హ్రస్వము లఘుసంజ్ఞ కలది యగును.

451. సంయోగే గురు 1.4.11

సంయోగే పరే హ్రస్వం గురుసంజ్ఞం స్యాత్.

పై సూత్రమునుండి 'హ్రస్వం' అను పద మనువర్తించును. సంయోగము పర మగునపుడు హ్రస్వము గురుసంజ్ఞక మగును.

### 452. దీర్ఘం చ 1.4.12

గురు స్యాత్.

పై సూత్రమునుండి 'గురు' అను పద మనువర్తించును. దీర్ఘము కూడ గురుసంజ్ఞ కలది యగును.

### 453. పుగన్తలఘూపధస్య చ 7.3.86

పుగన్తస్యలఘూపధస్య చ అఙ్గస్యేకో గుణః సార్వధాతుకార్ధధాతుకయోః. 'ధాత్వాదేః'-ఇతి సః-సేధతి. షత్వమ్. సిషేధ.

'అఙ్గస్య'అధికారము. 'మిదేర్గుణః' నుండి 'గుణః'అను పదము, 'సార్వధాతుకార్ధధాతుకయోః'అను సూత్రము, అనువర్తించును. 'ఇకో గుణవృద్ధీ' అను పరిభాషచే 'ఇకః' అను పదము లభించును. "'పుక్' అను ఆగమము అంతమున గలదియు, లఘు వగు ఉపధ కలదియు వగు అంగముయొక్క 'ఇక్'కు సార్వధాతుకార్ధధాతుకములు పర మగునపుడు గుణము వచ్చును.

ఈ సూత్రముచే లఘూపధ మగు 'సిధ్'అనుదాని ఇకారమునకు గుణము చేయగా 'సేధతి'అను రూపము సిద్ధించును.ఇతరరూపములు గూడ భూధాతువు నందు వలె సిద్ధించును.

లిట్ ప్రథమపురుషైకవచనమున 'తిప్'కు ణలాదేశము (సూ.394) :ధాతువుకు ద్విత్వము (సూ.396) హలాదిశేషము (సూ.398): గుణము (453)- 'సిసేధ' అని యుండగా ఇకారరూప మగు ఇణ్‌కంటె పర మగు 'సే' యందలి సకారమునకు 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) మూర్ధన్యాదేశము- 'సిషేధ'అను రూపము సిద్ధించినది.

### 454. అసంయోగాల్లిట్ కిత్ 1.2.5

అసంయోగాత్పరోఽపిత్ లిట్ కిత్ స్యాత్.

సిషిధతుః, సిషిధుః, సిషేధిథ, సిషిధథుః. సిషిధ, సిషేధ, సిషిధివ, సిషిధిమ. సేధితా, సేధిష్యతి, సేధతు, అసేధత్, సేధేత్, సిధ్యాత్, అసేధీత్, అసేధిష్యత్. ఏవం 'చితీ సంజ్ఞానే' (4) 'శుచ శోచనే' (5) గద వ్యక్తాయాం వాచి (6)

'సార్వధాతుకమపిత్' అను సూత్రమునుండి 'అపిత్' అను పద మను

వర్తించును. సంయోగముకంటె పరము కానిదియు,పకారేత్ కానిదియు నగు లిట్'కిత్' అగును.

మూడు ఏకవచనప్రత్యయములును ('తిప్', 'సిప్', 'మిప్') పకారేత్సంజ్ఞకములు.ఇవి కాక మిగిలిన లిడాదేశప్రత్యయము లన్నియు సంయోగము కంటె పరము కానిచో ఈ సూత్రము ననుసరించి కిత్తులుగ భావింపబడును.కావున 'క్ఙిజితి చ'అను సూత్రముచే (435) నిషేధింపబడుటచే గుణము రాదు.ద్వివచన బహువచనములందు 'సిషిధతుః' 'సిషిధుః' ఇత్యాది గుణరహిత రూపము లుండును. ఇతరరూపముల నిష్పత్తి కూడ భూధాతువునందు వలె ఉండును. లుట్-'సేధితా'ఇత్యాదిరూపములు-లృట్-'సేధిష్యతి'ఇత్యాదిరూపములు. లోట్-'సేధతు' ఇత్యాదిరూపములు. లఙ్-'అసేధత్' ఇత్యాదిరూపములు. విధిలిఙ్-'సేధేత్' ఇత్యాదిరూపములు. ఆశీర్లిఙ్-యాసుట్ కిత్తు గాన (సూ.434) గుణము లేకుండుటచే 'సిధ్యాత్'ఇత్యాదిరూపములు. లుఙ్-'అసేధీత్', 'అసేధిష్టాం'ఇత్యాదిరూపములు. అతధాతువునందు వలె సిద్ధించును.లృఙ్-'అసేధిష్యత్'ఇత్యాదిరూపములు.

'చితీ' (త్) అనుధాతువునకు 'తెలివితెచ్చుకొనుట'అని యర్థము. 'శుచ్' ధాతువుకు శోకించుట అనియర్థము. ఈ ధాతువుల రూపములు గూడ 'షిధ' ధాతువునందు వలె నిష్పన్న మగును.

చిత్-చేతతి, చిచేత, చేతితా, చేతిష్యతి, చేతతు, అచేతత్.

చేతేత్. చిత్యాత్, అచేతీత్, అచేతిష్యత్.

శుచ్:- శోచతి. శుశోచ. శోచితా. శోచిష్యతి. శోచతు. అశోచత్.

శోచేత్. శుచ్యాత్. అశోచీత్. అశోచిష్యత్.

గదధాతువునకు 'స్పష్టముగ మాటలాడుట'అని యర్థము. లట్టునందు 'గదతి'ఇత్యాదిరూపములు పూర్వోక్తవిధముగ సిద్ధించును.

455. నేర్గద,నద,పత,పద,ఘు,మా,స్యతి,హన్తి,యాతి,వాతి,ద్రాతి,
ప్సాతి,వపతి,వహతి,శామ్యతి,చినోతి,దేగ్ధిషు చ 8.4.17

ఉపసర్గస్థాత్ నిమిత్తాత్ పరస్య నేర్ణో గదాదిషు పరేషు. ప్రణిగదతి.

'రషాభ్యాం నో ణః సమానపదే'అను సూత్రము, 'ఉపసర్గాదసమాసేపి' నుండి 'ఉపసర్గాత్'అనువర్తించును. ఉపసర్గమునందున్న నిమిత్తముకంటె (రేఫషకారములకంటె) పర మగు 'ని'యందలి నకారమునకు గద్,నద్,పత్ పద్, ఘుసంజ్ఞక,మా,షో (దైవాదికము),హన్,యా,వా,ద్రా, ప్సా,వప్,వహ్,శమ్,చి. దిహ్ ధాతువులు పర మగునపుడు ణత్వము వచ్చును.

'ప్ర + ని + గదతి'అని యుండగా రేఫనకారములు ఏకపదస్థములు కాకుండుటచే 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి'అను సూత్రమునకు (138) అవకాశము లేదుగాన ఈ సూత్రముచే 'ని'యందలి నకారమునకు ణత్వము. 'ని' అనునది "ప్ర'అను ఉపసర్గలో నున్న రేఫకంటె పరముగా నున్నది.దీనికి పరముగ 'గద్'ధాతు వున్నది.

'లిట్'ప్రథమపురుషైకవచనమున ద్విత్వ, ఆదిహల్ శేషములు చేసిన పిమ్మట (సూ.396.398) 'గగద్ + అ'అని యుండగా-

456. కుహోశ్చుః 7.4.62

అభ్యాసకవర్గహకారయోశ్చవర్గాదేశః.

'అత్ర లోపోఽభ్యాసస్య' నుండి 'అభ్యాసస్య' అనువర్తించును. "అభ్యాసకు సంబంధించిన కవర్గహకారములకు చవర్గ మాదేశముగ వచ్చును."

కవర్గాక్షరములైదింటికిని వరుసగా చవర్గాక్షరములు వచ్చును. హకారమునకు ఆంతరతమము గాన ఝకార మాదేశముగ వచ్చును. ఈ సూత్రముచే కవర్గతృతీయాక్షర మగు 'గ'కారమునకు చవర్గతృతీయాక్షర మగు జకార మాదేశ మగుటచే 'జగద్ + అ' అని యుండగా.

457. అత ఉపధాయాః 7.2.116

ఉపధాయా అతో వృద్ధిః స్యాత్ ఞితి ణితి చ ప్రత్యయే పరే. జగాద, జగదతుః, జగదుః, జగదిథ, జగదథుః, జగద.

'మృజేర్వృద్ధిః' 'అచోఞ్ణితి'అను సూత్రములనుండి 'వృద్ధిః' 'ఞ్ణితి, అనువర్తించును. "'ఞిత్'లేక 'ణిత్'అగు ప్రత్యయము పర మగునపుడు ఉపధయగు అకారమునకు వృద్ధి వచ్చును."

'ణల్' 'ణిత్'గాన ఈ సూత్రముచే ఉపధావృద్ధి చేయ 'జగాద్ + అ-' జగాద'అను రూపము సిద్ధించినది. 'జగదతుః'ఇత్యాదులందు గూడ ప్రక్రియ పై విధముగనే యుండును.

ఉత్తమపురుషైకవచనమునందు 'ణల్' ప్రత్యయము 'ణిత్' గాన పై సూత్రముచే (457) వృద్ధి నిత్యముగ రావలసి యుండ:-

458. ణలుత్తమో వా. 7.1.91

ఉత్తమో ణల్ వా ణిత్ స్యాత్.

జగాద, జగద, జగదివ, జగదిమ. గదితా. గదిష్యతి. గదతు. అగదత్. గదేత్. గద్యాత్.

'గోతో ణిత్' నుండి 'ణిత్' అనువర్తించును. ఉత్తమపురుష యగు 'ణల్' వికల్పముగ 'ణిత్' అగును.

ఈ సూత్రముచే ణిత్త్వము వైకల్పికము గాన ణిత్త్వపక్షమున ఉపధా వృద్ధిచే 'జగాద' అనియు, లేని పక్షమున 'జగద' అనియు రూపద్వయము సిద్ధించును. లుట్ మొదలగు లకారములందు పూర్వమునందు వలె రూపసిద్ధి యుండును

లుఙ్నందు ఏకవచనమున అడాగమము, (సూ.425). తి(ప్), ఇకార లోపము (సూ.426) 'చ్లి' ప్రత్యయము (సూ.439), సిజాదేశము (సూ.440), 'సిచ్'కు ఇడాగమము (సూ.403), తకారమునకు ఈడాగమము (సూ.447) చేసిన పిమ్మట 'అగద్ + ఇస్ + ఈత్' అని యుండగా-

459. అతో హలాదేర్లఘోః. 7.2.7

హలాదేర్లఘోరకారస్య వృద్ధిర్వా ఇడాదౌ పరస్మైపదే సిచి. అగాదీత్, అగదీత్. అగదిష్యత్. ణద అవ్యక్తే శబ్దే (7)

'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రము, 'నేటి' 'ఊర్ణోతేర్విభాషా' అను సూత్రముల నుండి 'ఇటి' 'విభాషా' అనువర్తించును. 'ఇట్' ఆదియందు గల పరస్మైపద'సిచ్' పర మగునపుడు హలాద్యంగావయవమగు లఘువైన అకారమునకు వికల్పముగ వృద్ధి వచ్చును.

ఇచట 'గద్'అనునది హలాద్యంగము. దానికి ఇడాదిపరస్మైపద'సిచ్' పరముగ నున్నది కాన వృద్ధి వికల్పము. సకారమునకు లోపము (సూ.448) సవర్ణదీర్ఘము 'అగాదీత్' అని యగును.

లుఙ్:- అగాదీత్ అగాదిష్టామ్ అగాదిషుః

| | | |
|---|---|---|
| అగాదీః | అగాదిష్టమ్ | అగాదిష్ట |
| అగాదిషమ్ | అగాదిష్వ | అగాదిష్మ |

అను రూపములు వృద్ధి వచ్చిన పక్షమున ఉండును.

వృద్ధి రాని పక్షమున:-

| | | |
|---|---|---|
| అగదీత్, | అగదిష్టామ్ | అగదిషుః |
| అగదీః, | అగదిష్టమ్ | అగదిష్ట |
| అగదిషమ్ | అగదిష్వ | అగదిష్మ |

అను రూపము లగును.

ల్ఱఙ్‌నందు భూధాతువునందు వలె 'అగదిష్యత్' ఇత్యాదిరూపములు సిద్ధించును.

'ణద'ధాతువునకు అవ్యక్తశబ్ద మని యర్థము.

### 460. ణో నః 6.1.65

ధాత్వాదేః ణస్య నః "ణోపదేశా_స్త్వనర్ద్నాటినాథ్ నాధ్ నన్ద్ నక్క నౄన్నృతః".

"ధాత్వాదేః షః సః"నుండి 'ధాత్వాదేః' అనువర్తించును. "ధాత్వాది యందున్న ణకారమునకు నకార మాదేశ మగును.

ఈ సూత్రము ననుసరించి ణకారాదిధాతువు లన్నియు నకారాదు లగును. కావున ఏ ధాతువులు ణకారాదులో ఏ ధాతువులు నకారాదులో తెలియుటకై పై శ్లోకార్థము చెప్పబడినది. అనగా 'నర్ద శబ్దే', 'నట అవస్కన్దే', 'నాథృ నాధృ యాచ్ఞోపతాపైశ్వర్యాశీఃషు', 'టునది సమృద్ధౌ', 'నక్క నాశనే', 'నౄ నయే', 'నృతీగాత్రవిక్షేపే' అను ధాతువులు తక్క ప్రయోగమున నకారాదిగ కనబడు ధాతువులన్నియు ణోపదేశములు. ఈ సూత్రము ననుసరించి ణకారమునకు నకారాదేశము వచ్చుటచే 'నదతి' ఇత్యాదిరూపము లగును.

### 461. ఉపసర్గాదసమాసేఽపి ణోపదేశస్య 7.4.14

ఉపసర్గస్థాత్ నిమిత్తాత్ పరస్య ణోపదేశస్య ధాతోర్నస్య ణః, ప్రణదతి. ప్రణినదతి. నదతి. ననాద.

'రషాభ్యాం నో ణః సమానపదే'నుండి 'రషాభ్యామ్', 'నః', 'ణః'అనువర్తించును. 'సమాసేఽఙ్గులేఃసఙ్గః' నుండి 'సమాసే'అనువర్తించి సమాసము

నందు మాత్రమే ఈ ణత్వము వచ్చు నను సంశయమును వారించుటకై 'అస మాసేఽపి' అని చెప్పబడినది. ఉపసర్గమునం దున్న నిమిత్తము (రేఫషకార ముల) కంటె పర మగు ణోపదేశధాతువుయొక్క నకారమునకు సమాసము కాకున్నను (సమాస మైనను గూడ) ణత్వము వచ్చును.

నదధాతువు ణోపదేశము గాన దీని నకారము 'ప్ర' అను ఉపసర్గయందలి రేఫ కంటె పర మగునపుడు ణత్వము వచ్చుటచే 'ప్రణదతి' అను రూపము సిద్ధించినది. 'ప్రణినదతి' అనునపుడు 'నేర్గదనద' ఇత్యాది సూత్రముచే (455) నియందలి నకారమునకు ణత్వము. ధాత్వాదినకారము ఉపసర్గస్థరేఫషకారముల కంటె పరముగ లేదు గాన (మధ్యయందు ని ఉండుటచే) దానికి ణత్వము రాలేదు. లట్టునందు భూధాతువునందు వలె రూపనిష్పత్తి యుండును.

లిట్ ప్రథమపురుషైకవచనమున ణలాదేశము (సూ. 394) ద్విత్వా (సూ-396) భ్యాసకార్య (సూ-398) ఉపధావృద్ధులచే (సూ-457) 'ననాద' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'నద్‌నద్ అతుస్' అని యుండగా:-

462. అత ఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి 6.4.120

లిణ్నిమిత్తాదేశాదికం న భవతి యదఙ్గం, తదవయవస్యా సంయుక్తహల్మధ్యస్థస్యాత ఏత్వమ్, అభ్యాసలోపశ్చ కితి లిటి. నేదతుః, నేదుః.

'ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ' 'గమహనజనఖనఘసాం లోపః క్ఙిత్యనఙి' అను సూత్రములనుండి 'ఏత్' 'అభ్యాసలోపః' 'కితి' అను పదము లనువర్తిం చును. లిట్టునందు ఙిత్వము అసంభావ్యము గాన 'క్ఙితి'లో భాగమైన 'కితి' అనునది మాత్రమే అనువర్తించినది. 'అఙ్గస్య' అధికారము. కిత్తగు లిట్టు పర మగునపుడు లిట్టు నిమిత్తముగా గల ఆదేశము ఆదియందు కలది కాని అంగము నకు అవయవమును, అసంయుక్తము లగు హల్లుల మధ్యయం దున్నదియు నగు హ్రస్వాకారమునకు ఏకారమాదేశముగ వచ్చును; అభ్యాసము కూడ లోపించును.

ఇచట 'అతుస్' అనునది పకారేత్కము కాదు కావున 'అసంయోగాల్లిట్ కిత్' అను సూత్రముచే (454) కిత్తు ఐనది. రెండవ 'నద్' అను అంగమునందలి అకారము నకారదకారరూపము లగు రెండు అసంయుక్త హల్లులకు మధ్య మున్నది. దీని యాదియందు లిట్టును నిమిత్తముగ చేసికొని ఆదేశ మేదియు

రాలేదు. 'ణో నః' అను (సూ-460) నకారాదేశము లిట్టును నిమిత్తముగ చేసి కొని వచ్చినది కాదు. కావున ఈ సూత్రము ప్రవర్తించును. అభ్యాస మగు మొదటి 'నద్' లోపించును. రెండవ 'నద్'లోని అకారమునకు ఏకారము. 'నేదతుః' అను రూపము సిద్ధించును. 'పిపిధతుః' ఇత్యాదులందు అకారము లేదు. 'రరాస' ఇత్యాదులందు దీర్ఘాకార మున్నది కాని హ్రస్వము లేదు. 'తత్స రతుః' ఇత్యాదులందలి అకారము సంయుక్తాసంయుక్తహల్లుల మధ్య నున్నది. 'జగాద' ఇత్యాదులందు లిట్‌ను నిమిత్తముగ జేసికొని చుత్వాదేశము వచ్చినది. కావున పై నాల్గు ఉదాహరణములందును ఈ సూత్రము ప్రవర్తింపదు. బహు వచనమున 'నేదుః' అను రూపము కూడ వెనుకటివలెనే ఏత్వాభ్యాసలోపాదులచే సిద్ధించును మధ్యపురుషైకవచనమున 'నద్‌నద్‌థ' అని యుండగా 'థ'అనునది 'సిప్' స్థానమున వచ్చినది గాన పకారేత్క మగుటచే 'కిత్' అగుటకు (సూ. 454) అవకాశము లేదు, కిత్త్వము లేకపోవుటచే ఏత్వాదులు పై సూత్ర ముచే రాజాలవు కాన క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

## 463. థలి చ సేటి 6.4.121

ప్రాగుక్తం స్యాత్. నేదిథ, నేదథుః, నేద; ననాద-ననద, నేదివ, నేదిమ. నదితా, నదిష్యతి. నదతు. అనదత్. నదేత్. నద్యాత్. అనాదీత్. అనదీత్. అనదిష్యత్. టునది సమృద్ధౌ. (8)

సేట్ ('ఇట్'తో కూడినది) అగు థల్ పర మగునపుడు గూడ పై సూత్రమున చెప్పిన కార్యములు వచ్చును.

ఈ సూత్రముచే ఏత్వాభ్యాసలోపములు చేయగా 'నేదిథ' అను రూపము సిద్ధించినది. 'నేదథుః' ఇత్యాదులందు వెనుకటి సూత్రముచే (462) ఏత్వాభ్యాస లోపములు వచ్చును. ఉత్తమపురుషైకవచనమున 'ణల్' మిప్ స్థానమున వచ్చి నది గాన పకారేత్క మగుటచే 'కిత్' (సూ-454) కాజాలదు. కావున ఏత్వాదులు లేవు. 'ణలుత్తమో వా' అను సూత్రముచే (458) ణిత్త్వము వైకల్పికము గాన 'అత ఉపధాయాః' అను (457) ఉపధావృద్ధి వచ్చిన పక్షమున 'ననాద' అనియు, రాని పక్షమున 'ననద' అనియు రూపద్వయ ముండును. 'నదితా' ఇత్యాదులప్రక్రియ వెనుకటివలెనే యుండును. లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'అతో హలాదేర్లఘోః' అను సూత్రముచే (459) వైకల్పికవృద్ధి- 'అనా

క్రీత్', 'అనదీత్' అను రూపద్వయ ముండును. ఇట్లే (గదధాతువునందువలె) ద్వివచనాదులందు గూడ వృద్ధిసహితవృద్ధిరహిత రూపములు రెండేసి ఉండును.

'టునది' ధాతువునకు సమృద్ధి యని యర్థము. ఇచట సమృద్ధి యనగా ప్రజాపశ్వాదిసంపత్తి యని యర్థము. ఇట్టి సమృద్ధిచే ఆనందము కలుగును గాన ఈ ధాతువు ఆనందార్థమున ప్రసిద్ధము.

464. ఆదిర్ఞిటుడవః 1.3.5

ఉపదేశే ధాతోరాద్యా ఏతే ఇతః స్యుః.

'భూవాదయో ధాతవః' అను సూత్రమునుండి అనువర్తించిన 'ధాతవః' అనునది షష్ఠ్యంతముగ మారును. 'ఉపదేశేఽజనునాసిక ఇత్'నుండి 'ఉపదేశే' 'ఇత్' అనువర్తించును. "ఉపదేశమున ధాత్వాదియం దున్న ఞి, టు, డు, అను నవి ఇత్సంజ్ఞకము లగును.

ఈ సూత్రముచే 'టు'అనునది ఇత్సంజ్ఞకము. ఈ ఇత్సంజ్ఞకు 'ట్వితోఽథుచ్'అను సూత్రముచే (862) అథుచ్ ప్రత్యయము వచ్చుట ప్రయోజనము. 'నది'యందలి ఇకారము గూడ ఇత్సంజ్ఞకము. 'నద్' అనునది మిగిలినది.

465. ఇదితో నుమ్ ధాతోః 7.1.58

నన్దతి. ననన్ద. నన్దితా. నన్దిష్యతి. నన్దతు. అనన్దత్. నన్దేత్. నన్ద్యాత్. అనన్దీత్. అనన్దిష్యత్. అర్చ పూజాయామ్ (9) అర్చతి.

ఇకారము ఇత్సంజ్ఞకముగా గల ధాతువునకు 'నుమ్' అను నాగమము వచ్చును.

'నుమ్'లోని ఉకారమకారము లిత్సంజ్ఞకములు. 'మిత్' గాన ఇది 'మిదచోఽన్త్యాత్పరః' (240) అనుపరిభాష ననుసరించి అంత్యాచ్చగు అకారముకంటె పరముగ (ఇతరకార్యములన్నింటికంటె ముందుగ) వచ్చును. 'నన్ద్'అనియుండగా 'తిప్'శబాదులచే లట్టునందు 'నన్దతి' 'నన్దతః' ఇత్యాదిరూపములు సిద్ధించును. లిట్టునందు నుమాగమము చేసిన పిమ్మట 'న్ద్' అనునది సంయుక్తహల్లు గాన 'అత ఏకహల్మధ్యేఽనాదేశాదిర్లిటి'అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపాదులు వచ్చుటకు అవకాశము లేదు. కావున 'ననన్ద' 'ననన్దతుః'. 'ననన్దుః', 'ననన్దిథ', 'ననన్దథుః' 'ననన్ద', 'ననన్ద', 'ననన్దివ', 'ననన్దిమ', అను రూపములు సిద్ధించును. దీని ప్రథమోత్తమపురుషైకవచనములందు రెండవ నకారముపై నున్న అకారము ఉపధ కాదు కావున ఉపధావృద్ధి (సూ-457) రాలేదు.

'లజ్' నందు నకారోత్తరవర్తి యగు అకారము సంయోగపరక మగుటచే గురువు గాన 'అతో హలాదేర్లఘోః' అను సూత్రముచే (459) వైకల్పిక వృద్ధి వచ్చుటకు అవకాశము లేదు. 'అనన్దీత్' ఇత్యాదివృద్ధిరహితరూపములు మాత్రమే యుండును. ఇతరరూపముల నిష్పత్తి వెనుకటి వలెనే యుండును.

అర్చ ధాతువుకు పూజించుట యని యర్థము. 'లట్' రూపములు వెనుకటి వలెనే సిద్ధించును.

లిట్ ప్రథమపురుషైకవచనమున 'తిప్'కు 'ణల్' చేసిన పిమ్మట (సూ-394) ద్విత్వాభ్యాసకార్యములు (సూ-396, 398) వచ్చి 'అఅర్చ్అ' అని యుండగా "అత ఆదేః" అను సూత్రముచే (445) అభ్యాసమునందలి అకారమునకు దీర్ఘము- 'ఆఅర్చ్అ' అని యుండగా:-

466. తస్మాన్నుడ్ద్విహలః 7.4.71

ద్విహలో దీర్ఘీభూతాద్ అకారాత్ పరస్య నుట్ స్యాత్. ఆనర్చ. ఆనర్చతుః. అర్చితా. అర్చిష్యతి. అర్చతు. ఆర్చత్. అర్చేత్. అర్చ్యాత్. ఆర్చీత్. ఆర్చిష్యత్.

"రెండు హల్లులు గల ధాతువుయొక్క అట్టి (అనగా 'అత ఆదేః' అను సూత్రముచే దీర్ఘము వచ్చి యున్న) అకారముకంటె పర మగుదానికి 'నుట్' అను నాగమము వచ్చును."

ఇచట 'అర్చ్' ధాతువు రెండు హల్లులు కలది గాన (ఇచట రెండు అనగా 'ఒకటికంటె ఎక్కువ' అని యర్థము.) ఈ సూత్రముచే ఆకారముకంటె పర మగు అకారమునకు 'నుట్'(న్) ఆగమము 'టిత్' అగుటచే ఆద్యవయవముగ వచ్చును- 'ఆనర్చ' అను రూపము సిద్ధించును. లిట్‌లోని ఇతర రూపములందు గూడ నుడాగమము వచ్చుటచే 'ఆనర్చతుః, ఆనర్చుః' ఇత్యాదిరూపములు వెనుకటివలెనే సిద్ధించును. లుడాదులందు ప్రత్యేకవిశేష మేమియు లేదు. ఙిత్తులందు మాత్రము ఈ ధాతువు అజాది యగుటచే 'ఆడజాదీనామ్ అను సూత్రము (446) ననుసరించి ఆడాగమము, 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధియు వచ్చును. 'ఆర్చత్ (లఙ్)' 'ఆర్చీత్' (లుఙ్) ఇత్యాదిరూపములు సిద్ధించును.

వ్రజ గతౌ 10. వ్రజతి. వవ్రాజ. వ్రజితా. వ్రజిష్యతి. వ్రజతు అవ్రజత్. వ్రజేత్. వ్రజ్యాత్.

వ్రజధాతువునకు వెళ్ళుట యని యర్థము. లుజ్‌నందు తక్క ఇతర లకారములందు రూపనిష్పత్తి వెనుకటి వలెనే యుండును. లిట్‌నందు అకారము అసంయుక్తహల్మధ్యస్థము కాదు కావున ఏత్వాభ్యాసములోపములు (సూ-462) రావు. ప్రథమపురుషైకవచనమున ఉపధావృద్ధి (సూ-457) ఉత్తమపురుషైకవచనమున వైకల్పికవృద్ధి (458) వచ్చును. వవ్రాజ, వవ్రజతుః, వవ్రజుః, వవ్రజిథ. వవ్రజథుః, వవ్రజ; వవ్రాజ - వవ్రజ, వవ్రజివ, వవ్రజిమ; అను రూపము లుండును.

లుజ్‌నందు ప్రథమపురుషైకవచనమున అడాగమము (సూ-425); తిప్; ఇకారలోపము (సూ-426); చ్లిప్రత్యయము (సూ-429); సిజాదేశము (సూ-440); సకారమునకు ఇడాగమము (403); తకారమునకు ఈడాగమము (సూ-447); 'అవ్రజ్ ఇస్ ఈత్' అని యుండగా:-

467. వదవ్రజహలన్తస్యాచః 7.2.3

ఏషామచో వృద్ధిః సిచి పరస్మైపదేషు. అవ్రాజీత్. అవ్రజిష్యత్.

'అఙ్గస్య' అధికారము. 'సిచివృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రము అనువర్తించును. పరస్మైపదధాతువులందు 'సిచ్' పర మగునపుడు వద, వ్రజ, ధాతువులయొక్కయు హలన్తాంగముయొక్కయు అచ్చుయొక్క స్థానమున వృద్ధి వచ్చును.

'వద్' 'వ్రజ్' ధాతువులు కూడ హలన్తధాతువులే కాన వాటిని ప్రత్యేకముగ చెప్ప నవసరము లేదు. కాని 'అతో హలాదేర్లఘోః'అను సూత్రముచే (459) వైకల్పికవృద్ధి రావలసి యున్నది. దానిని బాధించుటకై ఈ ధాతువులీ సూత్రమున ప్రత్యేకముగ నిర్దేశింపబడినవి.

ఈ సూత్రముచే రేఫోత్తరవర్తి యగు అకారమునకు వృద్ధి చేసిన పిమ్మట 'అవ్రాజ్ఇస్ఈత్'అని యుండగా సకారలోప (సూ-448) సవర్ణదీర్ఘములచే 'అవ్రాజీత్' అను రూపము సిద్ధించినది. ఇట్లే ఇతరరూపములు గూడ సిద్ధించును.

కటేవర్షావరణయోః. 11. కటతి, చకాట. చకటతుః, కటితా. కటిష్యతి. కటతు, అకటత్, కటేత్, కట్యాత్.

'కటే'ధాతువునకు వర్షించుట, కప్పుట అను రెండర్థములు. ఇందలి ఏకారము ఇత్సంజ్ఞకము. రూపనిష్పత్తి వెనుకటి ధాతువులందు వలెనే ఉండును.

లిట్టునందు "కుహోశ్చుః" అను సూత్రముచే (456) అభ్యాసకకారమునకు చకారము. ఈ విధముగ లిణ్ణిమిత్తకాదేశము వచ్చి యున్నది గాన కిద్వచనము లందును, 'థల్'పర మగునపుడును ఏత్వాభ్యాసలోపములు (సూ-462) రాకుండుటచే— "చకాట, చకటతుః —చకటుః. చకటిథ,చకటథుః. చకట: చకాట — చకట, చకటివ. చకటిమ". అను రూపములు సిద్ధించును. కటితా, కటిష్యతి, అకటిష్యత్, ఇత్యాదిరూపముల ప్రక్రియ వెనుకటివలెనే ఉండును.

'లుఙ్'నందు 'అతో హలాదేర్లఘోః'అను సూత్రముచే (459) వైకల్పికవృద్ధి రావలసి యుండగా:-

468. హ్మ్యన్త, క్షణ, శ్వస, జాగృణి, శ్వ్యేదితామ్ 7.2.5

హమయాన్తస్య క్షణాదేర్ణ్యన్తస్య శ్వయతేరేదితశ్చ వృద్ధిర్నేడాదౌ సిచి. అకటీత్. అకటిష్యత్. గుపూ రక్షణే (12)

"సిచివృద్ధిః పరస్మైపదేషు"నుండి 'సిచి' 'వృద్ధిః' 'నేటి' అను సూత్రము అనువర్తించును. 'ణి'అనుటచే 'ప్రత్యయగ్రహణే తదాన్తాగ్రాహ్యాః' —ఏదైన ప్రత్యయమును గ్రహించి నపుడు 'ఆ ప్రత్యయము అంతమునందు గలది'అను నర్థము గ్రహింపవలెను—అనెడు పరిభాష ననుసరించి ణ్యన్తధాతువులు అని అర్థము. 'హ్మ్యన్తము'అనగా హకారమకారయకారములలో నేదైన అంతమునందు గల ధాతు వని అర్థము.

"హకారాంతమకారాంతయకారాంతధాతువులకును, క్షణ, శ్వస, జాగృ ధాతువులకును, ణిజంతధాతువులకును, శ్విధాతువునకును, ఏకారము ఇత్సంజ్ఞకముగా గల ధాతువులకును, ఇట్ ఆదియందు గల 'సిచ్'పర మగునపుడు వృద్ధి రాదు".

ఈ 'కటే'ధాతువు ఏకారేత్కము గాన ఈ సూత్రముచే వృద్ధి నిషేధింపబడుటచే 'అకటీత్', 'అకటిష్టామ్', 'అకటిషుః', ఇత్యాదిరూపములు సిద్ధించును.

గుపూధాతువునకు రక్షించుట అని అర్థము. ఇందు ఊకారము ఇత్సంజ్ఞము.

469. గుపూధూపవిచ్ఛిపణిపనిభ్య ఆయః 3.1.28

ఏభ్య ఆయప్రత్యయః స్యాత్ స్వార్థే.

విచ్ఛే

గుపూ, ధూప, విచ్ఛి, పణి, పని ధాతువులకంటె పరముగ, స్వార్థము నందు 'ఆయ' ప్రత్యయము వచ్చును.

ఈ ప్రత్యయము ప్రత్యేకముగ ఏదియో ఒక అర్థమున వచ్చు నని చెప్ప కుండుటచే, ఇది స్వార్థమున వచ్చు నని చెప్పబడుచున్నది. అనగా ఈ ప్రత్య యము చేర్చినను (ప్రకృత్యర్థము) ధాత్వర్థ మేమియు మార్పు చెంద దని అర్థము. స్వార్థికప్రత్యయము నిర్నిమిత్తము గాన సర్వప్రథమముగ ధాతువునకు చేర్చ బడును. 'గుప్ + ఆయ'అని యుండగా "ఆర్ధధాతుకం శేషః" అను సూత్రము (406)ననుసరించి 'ఆయ'అనునది ఆర్ధధాతుకము గాన, అది పరముగ నున్నపుడు, 'పుగన్తలఘూపధస్య చ'అను సూ(453)చే గుణము. 'గోపాయ' అని యుండును. 'గుప్'అనునది ధాతు వైనను 'గోపాయ' అనునది ధాతువు కాకుండుటచే లడా దులు వచ్చుటకు అవకాశము లేనందున ఈ క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

470. సనాద్యన్తా ధాతవః 3.1.32

సనాదయః కమేర్ణిఙన్తాః ప్రత్యయాః అన్తే యేషాం-తే ధాతు సంజ్ఞకాః, ధాతుత్వాల్లడాదయః. గోపాయతి,

'గుప్తిజ్కిద్భ్యః సన్'అను సూత్రము మొదలు 'కమేర్ణిఙ్'అను సూత్ర మువరకును కొన్ని ప్రత్యయములను విధించిన పిమ్మట ఈ సూత్రము చెప్ప బడినది. 'సన్'మొదలగు ప్రత్యయములు అంతమునందు కలవి ధాతుసంజ్ఞకము లగును.

సనాదిప్రత్యయములు పండ్రెండును—

సన్క్యచ్కామ్యచ్క్యఙ్క్యషోఽథాచారక్విబ్ణిజ్యఙౌ తథా,

యగాయ ఈయఙ్ ణిఙ్ చేతి ద్వాదశామీ సనాదయః॥

అను శ్లోకమునందు సంగ్రహింపబడినవి. ఇచట 'గోపాయ'అనునది ఆయప్రత్య యాంతము గాన ఈ సూత్రముచే ధాతుసంజ్ఞ. పిమ్మట "లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః"అను సూత్రముచే (375) లకారములు చేర్చబడును.

వర్తమానమున వచ్చిన లట్టు స్థానమున తిబాద్యాదేశములు. "కర్తరి శప్"అను సూత్రముచే (389) 'శప్' ప్రత్యయము. 'గోపాయ + అ + తి'అని యుండగా"అతో గుణే" అను సూత్రముచే (274) యకారోత్తరవర్తి యగు అకారమునకును 'శప్'లోని అకారమునకును పరరూపము చేయగా 'గోపాయతి, గోపాయతః, గోపాయన్తి' ఇత్యాదిరూపములు సిద్ధించును.

గుపూధాతువునకు అపరోక్షభూతార్థమున లిట్టు చేర్చవలసి యున్నది. అపుడు ఆయాదేశము నిత్యముగ రావలసి యుండగా (469)

471. ఆయాదయ ఆర్ధధాతుకే వా 3.1.31

ఆర్ధధాతుకవివక్షాయామాయాదయో వా స్యుః,

'ఆర్ధధాతుకే' అనునది విషయసప్తమి. ఆర్ధధాతుకప్రత్యయము విషయ మగునపుడు; అనగా ఆర్ధధాతుకప్రత్యయము చేర్చ వలసి యున్నపుడు అని అర్థము. ఆర్ధధాతుకప్రత్యయము వివక్షిత మగునపుడు 'ఆయ'మొదలగు ప్రత్యయములు వికల్పముగ వచ్చును."

'గుపూధూపవిచ్ఛిపణిపనిభ్య ఆయః''ఋతేరీయఙ్''కమేర్ణిఙ్'అను సూత్రములచే ఆయ, ఈయఙ్, ణిఙ్ ప్రత్యయములు క్రమముగ విధింపబడినవి గాన ఈ మూడు ప్రత్యయములకును ఆయాదు లని పేరు. 'లిట్ చ'అను సూత్రముచే (402) లిట్టు ఆర్ధధాతుకము గాన, అది చేర్చనున్నపుడు గుపూధాతువునకు ఇచట ఆయాదేశము వికల్పముగ వచ్చును. ఆయాదేశపక్షమున గుణముచే 'గోపాయ' అని యుండగా' సనాద్యన్తా ధాతవః'అను సూత్రముచే (470) ధాతుసంజ్ఞ.పిమ్మట లిట్ చేర్చబడును. 'గోపాయ+లిట్'అని యుండగా:-

వా. కాస్యనేకాచ ఆమ్ వక్తవ్యః

అప్‌కాసోరామ్‌విధానాత్ మస్య నేత్వమ్

"కాస్ ధాతువునకును అనేకాచ్కమగు ధాతువునకును లిట్టు పర మగు నపుడు 'ఆమ్' ప్రత్యయము చెప్పదగినది''

వాస్తవమున పై వార్తికము "కాస్యనేకాజ్‌గ్రహణం కర్తవ్యమ్''అను వార్తికమునకు అర్థతోనువాదము. "కాస్‌ప్రత్యయాదామమన్త్రే లిటి" అను సూత్రముచే (3-1-35) కాస్‌ధాతువునకును ప్రత్యయాంతములకును లిట్టు పర మగునపుడు 'ఆమ్' విధింపబడి యుండగా 'కాస్యనేకాజ్‌గ్రహణం కర్తవ్యమ్' అను వార్తికము కాస్‌ధాతువునకును అనేకాచ్కధాతువులకును 'ఆమ్' వచ్చు నని చెప్పవలె నని మార్పును సూచించినది. పై సూత్రమును "కాస్యనేకాచ ఆమమన్త్రే లిటి"అని మార్చవలె నని దీని యర్థము. ఈ యర్థమునే లఘుకౌముదీ కారుడు "కాస్యనేకాచ ఆమ్ వక్తవ్యః" అను వార్తికరూపవాక్యమున ప్రతిపాదించి యున్నాడు,

'గోపాయ' అనునది అనేకాచ్క మగు ధాతువు గాన ఈ వార్తికముచే 'ఆమ్' వచ్చును. ఈ 'ఆమ్‌లోనున్న మకారము ఇత్సంజ్ఞకమా కాదా యని సందేహము. కాని 'ఆస్' 'కాస్' ధాతువులకు 'ఆమ్'ను విధించిన సామర్థ్యముచే మకారమునకు ఇత్సంజ్ఞ లేదు

'ఆమ్'లోని మకారము ఇత్సంజ్ఞక మైన పక్షమున "మిదచో న్త్యాత్పరః" అను సూత్రముచే(240)అంత్యాచ్చుకు పరముగ రావలసి యుండును. పైన చూపిన సూత్రముచే (3-1-35) 'కాస్' ధాతువునకును, 'దయాయాసశ్చ'అను సూత్రముచే (539) 'ఆస్'ధాతువునకును, 'ఆమ్'విధింపబడి యున్నది. 'ఆమ్'లోని మకారము ఇత్సంజ్ఞక మైన పక్షమున మిగిలిన ఆకారము 'కాస్' 'ఆస్'లలోని సకారమునకు వెనుక నున్న ఆకారమునకు పరముగ చేర్చవలసి యుండును. అపుడు 'కా + ఆ + స్' 'ఆ + ఆ + స్'అని యుండగా సవర్ణదీర్ఘ సంధిచే మరల 'కాస్' 'ఆస్' అనియే యుండును. అట్లైనచో 'ఆమ్' విధించుట వ్యర్థమే కదా? ఇది వ్యర్థము కాకుండవలె నన్నచో మకారము ఇత్సంజ్ఞము కాకూడదు. ఇపుడు 'ఆమ్' అనునది ధాతువునకును లిట్టునకు నడుమ వచ్చును. "గోపాయ + ఆమ్ + లిట్" అని యుండగా:-

472. అతో లోపః 6.4.48

ఆర్ధధాతుకోపదేశకాలే యదదన్తం తస్యాతో లోప ఆర్ధధాతుకే.

"అనుదాత్తోపదేశవనతి........."అను సూత్రమునుండి (6-4-37) 'ఉపదేశ'పదము అనువర్తించును. 'ఆర్ధధాతుకే'అనునది అధికారసూత్రము. ఇది అవర్తింపబడును. ఆర్ధధాతుకోపదేశకాలమునందు ఏది అదంతమో దాని హ్రస్వ అకారమునకు ఆర్ధధాతుకము పర మగునపుడు లోపము వచ్చును.

"ఆర్ధధాతుకం శేషః" అను సూత్రముచే(406) 'ఆమ్'అనునది కూడ ఆర్ధధాతుక సంజ్ఞకము. అందుచే ఇచట'ఆమ్'ను కాని 'లిట్'ను కాని ఆర్ధధాతుకముగ గ్రహించ వచ్చును. ఈ ఆర్ధధాతుకోపదేశకాలమున 'గోపాయ' అనునది అదంతముగ నున్నది. కావున అందలి అకారమునకు లోపము. "గోపాయ్ + ఆమ్ + లిట్" అని యుండగా:-

473. ఆమః 2.1.81

ఆమః పరస్య లుక్.

"మన్త్రేఘసహ్వరణశవృదహాద్వృచ్కృగమిజనిభ్యోలేః" నుండి

(2-4-80) 'లేః', (లిట్‌నకు అని అర్థము) "ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః" నుండి 'లుక్' అనువర్తించును. ఆమ్‌కంటె పర మగు లిట్‌కు లుక్ (లోపము) వచ్చును. దీనిచే లిట్ లోపించిన పిమ్మట 'గోపాయ్+ఆమ్' అని యుండగా:-

474. కృఞ్ చానుప్రయుజ్యతే లిటి 3.1.40

ఆమన్తాత్ లిట్‌పరాః కృభ్వస్తయోఽనుప్రయుజ్యన్తే. తేషాంద్విత్వాది.

'కృభ్వస్తియోగే సమ్పద్యకర్తరి చ్విః' అను సూత్రమునందలి (5-4-50) 'కృ'అనుదానికి "కృఞ్ ద్వితీయతృతీయశమ్బబీజాత్కృషౌ" అను సూత్రము (5-4-58) నందలి 'ఞ్'అనుదానితో ప్రత్యాహారము చేయుటచే ఇచట 'కృఞ్' అనుదానికి 'కృ', 'భూ', 'అస్' ధాతువు లని అర్థము. 'కాస్ప్రత్యయాదామమన్త్రే లిటి"అను సూత్రమునుండి 'ఆమ్'అను పదము అనువర్తించి పంచమ్యంతముగ మార్చబడును. "ప్రత్యయగ్రహణే తదన్తాగ్రాహ్యాః" అను పరిభాషచే 'ఆమంతముకంటె' అను నర్థము వచ్చును. ఆమంతముకంటె లిట్టు పరముగా గల 'కృ' 'భూ' 'అస్' ధాతువులు అనుప్రయుక్తము లగును-అనగా ఆమంతముతో కలిపి ప్రయోగింపబడును.

ఈ సూత్రమును అనుసరించి 'గోపాయాం'అను ఆమంతమునకు పరముగ లిట్పరక మగు కృధాతువును ప్రయోగించినపుడు 'గోపాయామ్ + కృలిట్' అని యుండగా "లిటి ధాతోరనభ్యాసస్య" అను సూత్రముచే (396) కృధాతువునకు ద్విత్వము. గోపాయామ్ + కృకృలిట్"అని యగును. లిట్టునకు యథాక్రమముగ. 'తిప్'ప్రత్యయములు, వీటికి 'ణ'లాదులు.

475. ఉరత్ 7.4.66

అభ్యాసఋవర్ణస్యాఽత్ స్యాత్.

వృద్ధిః, గోపాయాఞ్చకార. ద్విత్వాత్ పరత్వాద్ యణి ప్రాప్తే.

ఉః, అత్. 'ఉః' అనునది 'ఋ'అనుదాని షష్ఠ్యేకవచనరూపము. 'అత్ర లోపోఽభ్యాసస్య'నుండి 'అభ్యాసస్య' అనుపదము 'అఙ్గస్య'అను అధికారసూత్రము అనువర్తించును. "అంగసంజ్ఞ ప్రత్యయము పరముగా నున్ననే వచ్చును గాన "ప్రత్యయము పరముగా నుండగా" అను నర్థము వచ్చును. అభ్యాసఋవర్ణ

మునకు ప్రత్యయము పర మగునపుడు హ్రస్వ మగు అకారము ఆదేశముగ వచ్చును. ('ప్రత్యయే పరే' అని సిద్ధాంతకౌముదీవృత్తి).

"ఉరణ్ రపరః"అను సూత్రముచే (29) ఈ అకారము రేఫపరకముగ (అర్) వచ్చును. "గోపాయామ్ + కర్ + కృ + అ" అని యుండగా 'హలాదిశ్శేషః'అను సూత్రముచే (398) రేఫకు లోపము. "గోపాయామ్ + క + కృ + అ". "అత ఉపధాయాః" అను సూత్రముచే (427) ఋకారమునకువృద్ధి. 'కుహోశ్చుః' అను సూత్రముచే (426) కకారమునకు చకారాదేశము "గోపాయామ్ + చ + కార్ + అ". "నశ్చాపదాన్తస్యఝలి" అను సూత్రముచే (78) మకారమునకు అనుస్వారము. అనుస్వారమునకు "అనుస్వారస్య యయి పరసవర్ణః"అను సూత్రముచే (79) పరసవర్ణ మగు ఞకారము'గోపాయాఞ్చకార' అను రూపము ప్రథమపురుషైకవచనమున సిద్ధించును.

ప్రథమపురుషద్వివచనమున లిట్టునకు 'అతుస్'ఆదేశము చేసిన పిమ్మట 'గోపాయామ్కృ + అతుస్ అని యుండగా "లిటి ధాతోరనభ్యాసస్య"అను సూత్రముచే (196) 'కృ'అనుదానికి ద్విత్వము వచ్చుటకును, 'కృ'లోని ఋకారమునకు "ఇకో యణచి"అను సూత్రముచే (15) యణాదేశము వచ్చుటకును అవకాశ మున్నది. కాని "విప్రతిషేధే పరం కార్యమ్"అను సూత్రము ననుసరించి ద్విత్వమును బాధించి, పర మగుటచే ముందుగ యణాదేశము రావలసి యుండగా:-

476. ద్వివ్రచనేఽచి. 1.1 59

ద్విత్వనిమిత్తేఽచి అచ ఆదేశో న ద్విత్వే కర్తవ్యే.

గోపాయాఞ్చక్రతుః, గోపాయాఞ్చక్రుః.

'అచః పరస్మిన్పూర్వవిధౌ' 'స్థానివదాదేశోనల్విధౌ' "నపదాన్తద్విర్వచనవరేయలోపస్వరదీర్ఘజశ్చర్విధిషు" అను సూత్రములనుండి 'అచః', 'ఆదేశః', 'న' అనువర్తించును. "ద్విర్వచనే" అను పదము ఆవర్తింపబడును, ఒక "ద్విర్వచనే" అనుదానికి 'ద్విరుచ్యతే అనేన (పరనిమిత్తేన)' అను విగ్రహముచే ద్విత్వమునకు కారణభూత మగునది అని అర్థము. రెండవదానికి ద్విత్వము చేయవలసి యున్నపుడు అని యర్థము. ద్విత్వము చేయవలసి యున్నప్పుడు, ద్విత్వమునకు నిమిత్త మగు అచ్చు పరమగుటచే వచ్చు అజాదేశము రాదు.

ఇచట 'అతుస్' అనునది లిట్టుస్థానమున వచ్చి యున్నది గాన స్థానివద్భావముచే లిట్టుగ పరిగణింపబడి 'లిటి ధాతోరనభ్యాసస్య' (396) అను ద్విత్వమునకు నిమిత్తమైనది. ఈ 'అతుస్'లో నున్న అకారమును నిమిత్తముగ గొని ఋకారమునకు యణాదేశము రావలసి యున్నది. అట్టి యణాదేశము ఈ సూత్రముచే నిషేధింపబడుచున్నది. ఈ సూత్రముచే యణాదేశమును నిషేధింపకున్నచో మొదటనే యణాదేశము వచ్చి 'గోపాయాంకృఅతుస్'అనునది "గోపాయాం కర్ + అతుస్" (ఋకారమునకు యణాదేశమురేఫ) అని యగుటచే అపుడు 'కర్' అనునది ఏకాచ్కము కాదు గాన "లిటిధాతోరనభ్యాసస్య" అను సూత్రముచే (396) ద్విత్వమున కవకాశ ముండెడిది కాదు. ఇపుడు యణాదేశము నిషేధింపబడుటచే ద్విత్వము వచ్చుటకు అవకాశ ముండును. ఏకవచనమునందు వలె అత్త్వచుత్త్వాదులచే 'గోపాఞ్చకృ + అతుస్' అని యుండగా ఇపుడు యణాదేశము వచ్చి 'గోపాయాఞ్చక్రతుః' అను రూపము సిద్ధించును.

ప్రథమపురుషబహువచనమున లిట్టునకు 'ఉస్'ఆదేశము. 'గోపాయాఞ్చక్రుః' అను రూపము పూర్వమునందు వలెనే నిష్పన్న మగును.

మధ్యమపురుషైకవచనమున లిట్టునకు థ (ల్)ఆదేశము. అభ్యాసాది కార్యములు వెనుకటి వలెనే యుండును. "గోపాయాఞ్చకృ + థ"అని యుండగా 'థ'అనునది 'వలాద్యార్ధధాతుకము' గాన "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః"అను సూత్రముచే (403) ఇడాగమము రావలసి యుండగా:-

477. ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్ 7.2.10

ఉపదేశే యో ధాతురేకాచ్ అనుదాత్తశ్చ తత ఆర్ధధాతుకస్యేట్ న.

"ఆత ఇద్ధాతోః" 'నేడ్వశికృతి'అను సూత్రములనుండి 'ధాతోః' 'న' 'ఇట్'అను పదములు అనువర్తించును. ఇడాగమము ఆర్ధధాతుకమునకుమాత్రమే విధింపబడినదిగాన 'ఆర్ధధాతుకస్య'అనునది అర్థాత్సిద్ధము. ఉపదేశమునందు ఏకాచ్కము అనుదాత్తము నగు ధాతువుకంటె పర మగు ఆర్ధధాతుకమునకు ఇడాగమము రాదు.

ఇచట 'కృ'ధాతువు ఉపదేశమున (ఉపదేశ మనగా ఆద్యోచ్చారణము— ఇచట పాణినికృత మగు ధాతుపాఠము అని యర్థము) ఏకాచ్కము—ఒక్క అచ్చు మాత్రమే కలిగి యున్నది; మరియు అనుదాత్తము. అందుచే దీనికంటె పర మగు 'థ'కు ఇడాగమము ఈ సూత్రముచే నిషేధింపబడినది,

ధాతుపాఠోపదిష్టము లగు ధాతువులలో ఏవి ఏకాచ్కములో సులభముగ తెలిసికొనవచ్చును గాని ఏవి అనుదాత్తములో తెలిసికొనుటకు తగు ఆధారము లేవియు లేవు. ప్రస్తుతము మనకు లభ్య మగు ధాతుపాఠమున ఈ ధాతువులు అనుదాత్తము లనెడు వచనములుగాని, అట్టి చిహ్నాదికములు గాని ఏవియు లేవు. కావున ఏ ధాతువులు అనుదాత్తములో తెలిసికొనవలె నన్నచో భాష్యకారాదివచనములపై ఆధారపడవలసి యున్నది. అందుచే అనుదాత్తధాతువులు ఈ క్రింద పఠింపబడుచున్నవి.

అనుదాత్తము లనగా అనుదాత్తేత్తు లని అర్థము కాదు. అనుదాత్తములు వేరు అనుదాత్తేత్తులు వేరు. వాటి ప్రయోజనము కూడ వేరు. ధాతువు అనుదాత్తమైనచో ఇడాగమము రాకుండుట ప్రయోజనము. అనుదాత్తేత్కమైనచో "అనుదాత్తఙిత ఆత్మనేపదమ్" అను సూత్రముచే (381) ఆత్మనేపదిత్వము ప్రయోజనము. ఉదాహరణమునకు 'శక్ల్' ధాతువు అనుదాత్తము. కాని అనుదాత్తేత్తు కాదు. అందుచే దీనికి ఇడాగమ నిషేధము వర్తించును గాని ఆత్మనేపదము రాదు. 'ఏధ్' ధాతువు అనుదాత్తేత్కము; కాని ఇది అనుదాత్తము కాదు. కావున ఇడాగమ నిషేధము వర్తింపదు.

ఊదృూదన్తై ర్యౌతిరుక్ష్ణుశీఙ్స్నునుక్షుశ్విడీఙ్శ్రిభిః,
వృఙ్వృఞ్భ్యాం చవినైకాచోఽజన్తేషునిహతాఃస్మృతాః.

అజంతము లగు ఏకాచ్కధాతువులలో ఊకారాంతఋూకారాంతధాతువులును, యు, రు, క్ష్ణు, శీఙ్. స్ను, ను, (టు) క్షు, (టుఓ) శ్వి, డీఙ్, శ్రిఞ్, వృఙ్, వృఞ్ ధాతువులును తక్క ఇతరధాతువు లన్నియు అనుదాత్తములు.

ఇక హలంతధాతువులలో కకారాంతాదిక్రమమున అనుదాత్తధాతువులు ఈ దిగువ చూపబడుచున్నవి.

కాన్తేషు శక్ల్ఏకః, చాన్తేషు పచ్, ముచ్, రిచ్, వచ్, విచ్,సిచః షట్. ఛాన్తేషు పృచ్ఛిః ఏకః. జాన్తేషు త్యజ, నిజిర్, భజ, భఞ్జ్. భుజ్, భ్రస్జ్, మస్జ్, యజ్, యుజ్, రుజ్, రఞ్జ్, విజిర్, స్వఞ్జ్,సఞ్జ్, సృజః, పఞ్చదశ. దాన్తేషు అద్, క్షుద్. ఖిద్, ఛిద్, తుద్, నుద్, పద్య, భిద్, విద్యతి వినద్, విన్ద్, శద్, సద్, స్విద్య, స్కన్ద్, హదః షోడశ ధాన్తేషు క్రుధ్, క్షుధ్, బుధ్, బన్ధ్, యుధ్, రుధ్, రాధ్.

వ్యధ్, శుధ్, సాధ్, సిధ్యా ఏకాదశ. నాన్తేషుమన్య, హనౌ, ద్వౌ. పాన్తేషు, ఆప్, క్షుప్, క్షిప్, తప్, తిప్, తృప్య, దృప్య, లిప్, లుప్, వప్, శప్, స్వప్, సృపః త్రయోదశ. భాన్తేషు యభ్, రభ్, లభః, త్రయః. మాన్తేషు గమ్, నమ్, యమ్, రమః చత్వారః. శాన్తేషు క్రుశ్, దంశ్, దిశ్, దృశ్, మృశ్, రిశ్, రుశ్, లిశ్, విశ్, స్పృశః దశ. పాన్తేషు కృష్, త్విష్, తుష్, ద్విష్, దుష్, పుష్య, పిష్, విష్, శిష్, శుష్, శ్లిషః ఏకాదశ. సాన్తేషు ఘస్ వసతీ ద్వౌ. హాన్తేషు దహ్,దిహ్, దుహ్, నహ్, మిహ్, రుహ్, లిహ్, వహః అష్టౌ.

అనుదాత్తా హలన్తేషు ధాతవస్త్ర్యధికం శతమ్.

కకారాంతధాతువులలో 'శక్'అను ఒక ధాతువు, చకారాంతధాతువులలో 'పచ్ మొదలగు ఆరు ధాతువులు ఈ విధముగ హలంతధాతువులలో మొత్తము నూటమూడు అనుదాత్తధాతువులు గలవు. ఈ దాతువుల అర్థాదికము ఈ దిగువ చూపబడుచున్నది:- అజంతధాతువులలో:-

1. యు మిశ్రణే అమిశ్రణే చ (అదాది) కలుపుట వేరుచేయుట. 2. రు శబ్దే (అదాది) శబ్దము చేయుట. 3. క్ష్ణు తేజనే (అదాది) వాడి కలదానినిగ చేయుట. 4. శీఙ్ స్వప్నే (అదాది)-నిద్రించుట. 5. స్ను ప్రస్రవణే (అదాది) పాఘు చేపుట. 6 ను స్తుతౌ (అదాది)- స్తోత్రముచేయుట. 7. టు క్షు శబ్దే (అదాది) తుమ్ముట. 8. టు ఓశ్వి గతివృద్ధ్యోః— (భ్వాది) వెళ్ళుట, వృద్ధి పొందుట. 9. డీఙ్ విహాయసాగతౌ (దివాది) ఎగురుట. 10. శ్రిఞ్ సేవాయాం (భ్వాది) సేవచేయుట. 11. వృఙ్ సంభక్తౌ (క్ర్యాది) సేవచేయుట. 12. వృఞ్ వరణే (స్వాది; చురాది) వరించుట. హలంతధాతువులలో:- 1. శకశక్తౌ(స్వాది) సమర్థుడగుట. 2. పచ్ పాకే (భ్వాది) వండుట. 3. ముచ్ మోక్షణే (తుదాది) విడచుట. 4. రిచ్ విరేచనే (రుధాది) శూన్య మగుట. 5. వచ్ పరిభాషే(అదాది) వించించుట. 6. విచ్ పృథగ్భావే (రుధాది) వేరగుట. 7. సిచ్ క్షరణే (తుదాది) తడుపుట 8. ప్రచ్ఛ జ్ఞీప్సాయాం (తుదాది) ప్రశ్నించుట. 9. త్యజహానౌ (భ్వాది) విడచుట. 10 నిజిర్ శౌచపోషణయోః (జుహోత్యాది) శుద్ధముచేయుట, పెంచుట. 11. భజ సేవాయామ్ (భ్వాది) సేవించుట 12 భఞ్జ ఆమర్దనే (రుధాది) విరచుట. 13. భుజ్ పాలనాభ్యవహారయోః (రుధాది) పాలించుట,

భుజించుట. 14. భ్రస్జ పాకే (తుదాది) వేచుట, 15 మస్జ శుద్ధౌ (తుదాది) పరిశుద్ధముచేయుట, మునుగుట 16. యజ దేవపూజాదిషు (భ్వాది) యజ్ఞము చేయుట. 17. యుజ యోగే (రుధాది) కలుపుట. యుజ సమాధౌ (దివాది) ధ్యానము చేయుట. 18. రుజ భంగే (తుదాది) విరచుట; రోగినిగా చేయుట. 19. రంజ్ రాగే (దివాది, భ్వాది) రంగు వేయుట, అనురక్తుడగుట. 20. విజిర్ పృథగ్భావే (జుహోత్యాది) వేరగుట. 21. ష్వజ్ఞ్ పరిష్వఙ్గే (భ్వాది) కౌగలించుకొనుట. 22 సఞ్జ సఙ్గే (భ్వాది) కలియుట. 23. సృజ్ విసర్గే (దివాది, తుదాది) విడచుట. 24. అద భక్షణే (అదాది) తినుట. 25 క్షుద్ సంపేషణే (రుధాది) నలిపివేయుట. 26 ఖిద్ దైన్యే (దివాది) ఖేదమును పొందుట. 27 ఛిద ద్వైధీభావే (రుధాది) ఖండించుట. 28. తుద్ వ్యథనే (తుదాది) పీడించుట. 29. నుద్ ప్రేరణే (తుదాది) ప్రేరేపించుట. 30. పద గతౌ (దివాది) నడచుట 31. భిద్ విదారణే (రుధాది) భేదించుట. 32. విద్ సత్తాయాం (దివాది) ఉండుట. 33. వినద్ విచారణే (తుదాది) విచారణము చేయుట. 34. విన్ద్ లాభే (తుదాది) పొందుట. 35. శద్ శాతనే (భ్వాది) నశించుట. 36. సద్ విశరణాదిషు(భ్వాది) నశించుట, వెళ్లుట మొ. 37, స్విద్ గాత్రప్రక్షరణే (దివాది) చెమటపట్టుట. 38. స్కన్ద్ గతిశోషణయోః (భ్వాది) నడచుట, ఎండబెట్టుట. 39. హద పురీషోత్సర్గే (భ్వాది) మలత్యాగము చేయుట. 40. క్రుధ్ క్రోధే (దివా<sub></sub>) కోపించుట. 41. క్షుద్ బుభుక్షాయామ్ (దివాది) ఆకలికొనుట. 42. బుధ్ అవగమనే (దివాది) తెలిసికొనుట. 43. బన్ధ్ బన్ధనే (క్ర్యాది) బంధించుట. 44. యుధ్ సంప్రహారే (దివాది) యుద్ధము చేయుట. 45. రుధ్ ఆవరణే (రుధాది) అడ్డగించుట. 46. రాధ్ సంసిద్ధౌ (దివాది) సిద్ధము చేయుట. 47. వ్యధ తాడనే (తుదాది) కొట్టుట. 48. శుధ్ శౌచే (దివాది) శుద్ధ మగుట. 49. సాధ్ సంసిద్ధౌ (దివాది) సిద్ధము చేయుట. 50. సిధ్ద సంరాద్ధౌ (దివాది) సిద్ధ మగుట. 51. మన జ్ఞానే (దివాది) తెలిసికొనుట; అంగీకరించుట. 52. హన హింసాగత్యోః (అదాది) చంపుట; నడచుట. 53. ఆప్ వ్యాప్తౌ (స్వాది) పొందుట. 54. క్షుప స్పర్శే (తుదాది) స్పృశించుట. 55. క్షిప్ ప్రేరణే (తుదాది) విసరివేయుట. 56. తప్ సన్తాపే (భ్వాది) తపించుట. 57. తిప్ క్షరణార్థే (భ్వాది) బొట్లు బొట్లుగ కారుట. 58. తృప్ ప్రీణనే (దివాది) తృప్తి చెందుట లేక తృప్తిపరచుట. 59. దృప్ దృప్తౌ (దివాది) గర్వపడుట. 60. లిప్ ఉపదేహే (తుదాది)

పూయుట. 61. లుప్ ఛేదనే (తుదాది) ఛేదించుట. లోపమును చేయుట. 62. వప్ బీజసన్తానే (భ్వాది) విత్తులు చల్లుట. 63. శప్ ఉపాలమ్భే (భ్వాది) శపించుట. ఒట్టు బెట్టుట. 64. స్వప్ శయే (అదాది) నిద్రించుట. 65. సృప్ గతౌ (భ్వాది) నడచుట. 66. యభ మైథునే (భ్వాది) మైథునము చేయుట. 67. రభ్ రాభస్యే (భ్వాది) ప్రారంభించుట, 68. లభ ప్రాప్తౌ (భ్వాది) పొందుట. 69. గమ్ గతౌ (భ్వాది) నడచుట, వెళ్ళుట. 70. నమ్ ప్రహ్వత్వే శబ్దే చ (భ్వాది) వంగుట; శబ్దము చేయుట. 71. యమ ఉపరమే (భ్వాది) శాంతించుట. 72. రము క్రీడాయామ్ (భ్వాది) క్రీడించుట. 73. క్రుశ్ ఆక్రోశే (భ్వాది) బిగ్గరగ ఏడ్చుట; అరచుట. 74. దంశ్ దశనే (భ్వాది) కరచుట. 75. దిశ్ అతిసర్జనే (తుదాది) దానము చేయుట. 76. దృశిర్ ప్రేక్షణే (భ్వాది) చూచుట. 77. మృశ్ ఆమర్శనే (తుదాది) స్పృశించుట; తెలిసికొనుట. 78; 79. రిశ్, రుశ్ హింసాయామ్ (తుదాది) హింస చేయుట. 80. లిశ్ అల్పీభావే (తుదాది) తరిగిపోవుట. 81. విశ్ ప్రవేశనే (తుదాది; దివాది) ప్రవేశించుట. 82. స్పృశ్ సంస్పర్శే (తుదాది) స్పృశించుట. 83. కృష్ విలేఖనే (భ్వాది, తుదాది) దున్నుట, లాగుట. 84. త్విష కాన్తౌ (భ్వాది) ప్రకాశించుట. 85. తుష్ తృప్తౌ (దివాది) సంతోషించుట. 86. ద్విష అప్రీతౌ (దివాది) ద్వేషించుట. 87. దుష్ వైకృత్యే (దివాది) వికృత మగుట. 88. పుష్ పుష్టౌ (దివాది) పుష్టి చెందుట. 89. పిష్ సంచూర్ణనే (రుధాది) చూర్ణముచేయుట. 90. విష సేచనే (భ్వాది) తడుపుట. విష విప్రయోగే (క్ర్యాది) వేరుపడుట. విష వ్యాప్తౌ (జుహోత్యాది) వ్యాపించుట. 91. శిష్ అసర్వోపయోగే (రుధాది) మిగులుట. 92. శుష్ శోషణే (దివాది) ఎండుట. 93. శ్లిష్ ఆలిఙ్గనే (దివాది) కౌగలించుకొనుట. 94. ఘస అదనే (భ్వాది) తినుట. 95. వస్ నివాసే (భ్వాది) నివసించుట. 96. దహ్ భస్మీకరణే (భ్వాది) కాల్చుట. 97. దిహ్ ఉపచయే (అదాది) వృద్ధి పొందుట. 98. దుహ్ ప్రపూరణే (అదాది) పిదుకుట. 99. నహ్ బన్ధనే (దివాది) బంధించుట. 100. మిహ సేచనే (భ్వాది) తడుపుట. 101. రుహ్ బీజప్రాదుర్భావే (భ్వాది) మొలచుట. 102. లిహ్ ఆస్వాదనే (అదాది) నాకుట. 103. వహ్ ప్రాపణే (భ్వాది) పొందించుట.

ఈ విధముగ హలంతధాతువులలో నూటమూడు ధాతువులు అనుదాత్తములు. కావున వీటికి ఇడాగమము రాదు. ఈ ధాతువులు కంఠస్థము చేయుటకు అనువగు శ్లోకముల రూపమున సిద్ధాంతకౌముదిలో ఈయబడినవి:—

శక్ పచ్ ముచ్ రిచ్ వచ్ విచ్ సిచ్ ప్రచ్ఛి త్యజి నిజి ర్భజః,
భఞ్జ్ భుజ్ భ్రస్జ్ మస్జి యజ్ యుజ్ రుజ్ రఞ్జ్ విజిర్ స్వఞ్జి
సఞ్జ్ సృజః॥
అద్ క్షుద్ ఖిద్ ఛిద్ తుది నుదః పద్య భిద్విద్యతి ర్వినద్
శద్ సదీ స్విద్యతి స్కన్ది హదీ క్రుధ్ క్షుధి బుద్ధ్యతీ॥
బన్ధి ర్యుధి రుధీ రాధి వ్యధ్ శుధః సాధి సిధ్యతీ,
మన్య హన్నాప్ క్షిప్ ఛుపి తప్ తిప స్తృప్యతి దృప్యతీ॥
లిప్ లుప్ వప్ శప్ స్వప్ సృపి యభ్ రభ్ లభ్ గమ్ నమ్ యమో రమిః
క్రుశి ర్దంశి దిశి దృశ్ మృశ్ రిశ్ రుశ్ లిశ్ విశ్ స్పృశః కృషిః॥
త్విష్ తుష్ ద్విష్ దుష్ పుష్య పిష్ విష్ శిష్ శుష్ శ్లిష్యతయో ఘసిః,
వసతిర్దహ్ దిహి దుహో నహ్ మిహ్ రుహ్ లిహ్ వహి స్తథా॥
అనుదాత్తా హలన్తేషు ధాతవో ద్వ్యధికం శతమ్.

లఘుకౌముదీకారుడు 'విన్ద్'ధాతువును కూడ చేర్చి యుండుటచే వీటి సంఖ్య నూటమూడు అయినది.

| | | |
|---|---|---|
| గోపాయాఞ్చకర్థ, | గోపాయాఞ్చక్రథుః, | గోపాయాఞ్చక్ర; |
| గోపాయాఞ్చకార- | గోపాయాఞ్చకర, | గోపాయాఞ్చకృవ, |
| గోపాయాఞ్చకృమ. | గోపాయామ్బభూవ. | గోపాయామాస. |
| జుగోప, | జుగుపతుః, | జుగుపుః. |

గోపాయాఞ్చకర్థ:- ఇచట అజన్తము ఏకాచ్కము నగు కృధాతువు 'ఊదృదన్తైః'అను పూర్వోదాహృతశ్లోకమున పరిగణితము లగు ధాతువులలో చేరి యుండలేదు గాన ఇది అనుదాత్తధాతువగుచున్నది. కావున" ఏకాచ ఉప దేశేఽనుదాత్తాత్"అను సూత్రము (477) ప్రవర్తించి ఇడాగమము నిషేధింపబడి నది గాన 'గోపాయాఞ్చకృ + థ' అని యుండగా గుణము వచ్చుటచే (సూ-390) 'గోపాయాఞ్చకర్థ' అను రూపము సిద్ధించినది.

గోపాయాఞ్చక్రథుః:- 'గోపాయాఞ్చకృ + అథుస్'అని యుండగా- 'అథుస్'అనునది 'అపిత్'అగు లిట్ అగుటచే "అసంయోగాల్లిట్ కిత్" అను సూత్రముచే (454) కిత్తు గాన ఋకారమునకు గుణము రాదు- "క్ఙితి చ" అను సూత్రముచే (135) గుణము నిషేధింపబడినది. ఇక యణాదేశముచే ఋకా రమునకు రేఫాదేశము- 'గోపాయాఞ్చక్రథుః' అను రూపము సిద్ధించును.

గోపాయాఞ్చక్ర:- మధ్యమపురుషబహువచనమున 'గోపాయాఞ్చకృ + అ' అని యుండగా పైన చూపిన విధముగ కిత్వగుణనిషేధాదులు ప్రవర్తించును. యణాదేశముచే పై రూపము సిద్ధించును.

ఉత్తమపురుషైకవచనమున 'గోపాయాఞ్చకృణల్(అ)' అని యుండగా "ణలుత్తమో వా" అను సూత్రముచే (458) వైకల్పికణిత్త్వమువచ్చినపక్షమున "అచోఞ్ణితి" అను సూత్రముచే (182) వృద్ధిచేయగా 'గోపాయాఞ్చకార' అనియు, ణిత్త్వాభావపక్షమున గుణముచే (సూ-390) 'గోపాయాఞ్చకర' అనియు రెండు రూపములు సిద్ధించును. 'ణల్' 'పకారేత్'గాన కిత్త్వగుణాదినిషేధ ప్రసక్తి లేదు. ద్వివచనబహువచనములందు 'వ', 'మ'లు అపిత్తులు గాన కిత్త్వ గుణనిషేధాదులు ప్రవర్తించును. 'గోపాయాఞ్చకృవ' 'గోపాయాఞ్చకృమ' అను రూపములు సిద్ధించును.

"కృఞ్చానుప్రయుజ్యతే లిటి" అను సూత్రముచే (474) 'భూ' 'అస్' ధాతువులు కూడ అనుప్రయుక్తములగును గాన "గోపాయాం" అనుదానికి భూ ధాతులిడ్రూపములను చేర్చుటచే "గోపాయామ్బభూవ" "గోపాయామ్బభూవతుః" ఇత్యాదిరూపము లగును. అసధాతులిడ్రూపములు అతధాతులిడ్రూపముల వలె నుండును. వాటిని చేర్చినపుడు:-

| | | |
|---|---|---|
| గోపాయామాస | గోపాయామాసతుః | గోపాయామాసుః |
| గోపాయామాసిథ | గోపాయామాసథుః | గోపాయామాస |
| గోపాయామాస | గోపాయామాసివ | గోపాయామాసిమ |

అను రూపములు సిద్ధించును.

ఆర్ధధాతుకవివక్షయందు ఆయాదేశము వైకల్పికముగాన (సూ-471) పైన చూపిన లిడ్రూపము లన్నియు ఆయాదేశము చేసిన పక్షమున సిద్ధించినవి. ఆయాదేశము రాని పక్షమున 'జుగోప'ఇత్యాదిరూపములు సిద్ధించును.

జుగోప:- 'గుప్ + అ'అని యుండగా ద్విత్వము (సూ-396): అభ్యాస కార్యము (సూ-398) చుత్వము (సూ-456), లఘూపధగుణము (సూ-403) వచ్చుటచే ప్రథమపురుషైకవచనమున పై రూపములు సిద్ధించినవి.

ప్రథమపురుషద్వివచనబహువచనములందు 'అసంయోగాల్లిట్కిత్' అను సూత్రముచే (454) కిత్త్వము వచ్చును గాన గుణము నిషిద్ధ మగును. 'జుగుపతుః' 'జుగుపుః' అను రూపములు సిద్ధించును.

'థల్' (మధ్యమపురుషైకవచనము) 'వ' 'మ'లు (ఉత్తమపురుషద్వివచన బహువచనములు) పర మగునపుడు "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః" అను సూత్రముచే (403) నిత్యముగ ఇడాగమము రావలసి యుండః-

478. స్వరతి, సూతి, సూయతి, ధూఞూదితో వా. 7.2.44

స్వరత్యాదేరూదితశ్చ పరస్య వలాదేరార్ధధాతుకస్యేడ్వా. జుగోపిథ—జగోప్థ.

'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' అను సూత్రము అనువర్తించును. 'ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే'అను పరిభాష ననుసరించి ఇచట 'స్వృ' మొదలగు ధాతువులు 'తి'ప్రత్యయముతో నిర్దేశింపబడుచున్నవి. 'స్వృ' 'షూఙ్' (అదాది), 'షూఙ్' (దివాది) 'ధూఞ్'ధాతువులకంటెను ఊకారము ఇత్సంజ్ఞకముగా గల ధాతువులకంటెను పర మగు వలాద్యార్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగ వచ్చును.

'గుపూ'ధాతువు ఊదిత్తు గాన ఈ సూత్రముచే ఇడాగమము వైకల్పికము. ఇడాగమపక్షమున 'జుగోపిథ' అనియు, తదభావపక్షమున 'జుగోప్థ' అనియు రెండు రూపములు సిద్ధించును. అట్లే 'వ' 'మ' లు పర మగునపుడు గూడ 'జుగుపివ' 'జుగుప్వ' 'జుగుపిమ' జుగుప్మ' అను రూపములు సిద్ధించును. ఈ విధముగ 'ఆమ్ లేని పక్షమున. జుగోప, జుగుపతుః, జుగుపుః; జుగోపిథ- జుగోప్థ, జుగుపథుః, జుగుప, జుగోప, జుగుపివ- జుగుప్వ, జుగుపిమ, జుగుప్మ అను రూపములు సిద్ధించును.

గోపాయితా, గోపితా, గోప్తా: గోపాయిష్యతి, గోపిష్యతి, గోప్స్యతి; గోపాయతు, అగోపాయత్, గోపాయేత్, గోపాయ్యాత్, గుప్యాత్, అగోపాయీత్.

లుట్ లృట్టులు పర మగునపుడు "స్యతాసీ లృలుటోః"అను సూత్రముచే (405) క్రమముగ 'తాస్' 'స్య'ప్రత్యయములు వచ్చును. ఇవి ఆర్ధధాతుకములు. కావున ఆయాదేశము వైకల్పికము (సూ 471) ఆయాదేశము వచ్చినపక్షమున 'గోపాయ'అనునది ధాతు వగును. ఇపు డిది అనేకాచ్కము గాన "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్"(477)అను ఇడాగమనిషేధము దానికి వర్తింపదు. లుట్టునందు ఇడాగమము నిత్యముగ వచ్చిన పిమ్మట యకారోత్తరవర్తి యగు అకారమునకు

'అతో లోపః' అను సూత్రముచే (472) లోపము:- "గోపాయితా - గోపాయితారౌ - గోపాయితారః; గోపాయితాసి - గోపాయితాస్థః - గోపాయితాస్థ; గోపాయితాస్మి- గోపాయితాస్వః- గోపాయితాస్మః అను రూపములు సిద్ధించును. అట్లే లృట్టునందు "గోపాయిష్యతి - గోపాయిష్యతః - గోపాయిష్యన్తి; గోపాయిష్యసి- గోపాయిష్యథః- గోపాయిష్యథ; గోపాయిష్యామి- గోపాయిష్యావః -గోపాయిష్యామః" అను రూపము. లుండును.

ఆయాదేశము రాని పక్షమున 'గుపూ'అనునదియే ధాతువు. ఇది ఊకారేత్కము గాన ఇడాగమవికల్పము (సూ-478). ఇడాగమపక్షమున 'భవితా' 'భవిష్యతి' ఇత్యాదిరూపముల వలె "గోపితా" "గోపిష్యతి" ఇత్యాదిరూపములు సిద్ధించును. ఇడాగమము రాని పక్షమున లుట్టునందు "గోప్తా - గోప్తారౌ- గోప్తారః; గోప్తాసి- గోప్తాస్థః- గోప్తాస్థ; గోప్తాస్మి- గోప్తాస్వః- గోప్తాస్మః" అను రూపములును, లృట్టునందు గోప్స్యతి- గోప్స్యతః- గోప్స్యన్తి; గోప్స్యసి - గోప్స్యథః - గోప్స్యథ; గోప్స్యామి - గోప్స్యావః - గోప్స్యామః" అను రూపములును సిద్ధించును.

లోట్, లఙ్, విధిలిఙ్లందు ఆయాదేశము నిత్యము. భూధాతువునందు వలె "గోపాయతు-తాత్, గోపాయతాం, గోపాయన్తు" (లోట్), అగోపాయత్, అగోపాయతాం, అగోపాయన్" (లఙ్) "గోపాయేత్, గోపాయేతాం, గోపాయేయుః" (విధిలిఙ్) ఇత్యాదిరూపము లుండును.

ఆశీర్లిఙ్ ఆర్ధధాతుకము (సూ-433) గాన ఆయాదేశము వికల్పముగ వచ్చును, 'యాసుట్' వలాది కాదు గాన ఇడాగమప్రసక్తి లేదు. ఆయాదేశపక్షమున యకారోత్తరవర్తి యగు అకారము "అతోలోపః" అను సూత్రముచే (472) లోపింపగా "గోపాయ్యాత్- గోపాయ్యాస్తాం- గోపాయ్యాసుః" (భూధాతువునందు వలె) అను రూపములు సిద్ధించును. ఆయాదేశము రాని పక్షమున "గుప్యాత్, గుప్యాస్తాం, గుప్యాసుః" ఇత్యాదిరూపము లుండును. "కిదాశిషి"అను సూత్రముచే (434) ఆశీర్లిఙ్ఙనందలి 'యాసుట్' కిత్తు గాన గుణము రాదు. ఆయప్రత్యయము వచ్చినపుడు అది ఆర్ధధాతుకము గాన తన్నిమిత్తక మగు గుణము వచ్చుటకు అభ్యంతర ముండదు.

లుఙ్లునందు గూడ ఆయప్రత్యయము వైకల్పికము. ఆయప్రత్యయము వచ్చిన పక్షమున 'అతోలోపః' అను సూత్రముచే (472) యకారోత్తరవర్తి యగు అకారమునకు లోపము. ఇతరప్రక్రియ యంతయు అతధాతులుఙ్లునందు వలె ఉండును. ''అగోపాయీత్, అగోపాయిష్టామ్, అగోపాయిషుః''ఇత్యాది రూపములు సిద్ధించును.

ఆయాదేశము రాని పక్షమున ''అగుప్ + స్ + త్'' అని యుండగా ఆర్ధధాతుక మగు సిచ్చునకు (స్) వికల్పముగ ఇడాగమము. 'అగుప్ + ఇస్' అని యుండగా ''వదవ్రజహలన్తస్యాచః''అను సూత్రముచే(467) ఉకారమునకు వృద్ధి రావలసి యుండగా అది నిషేధింపబడుచున్నది:-

479. నేటి 7.2.4

ఇడాదౌ సిచి హలన్తస్య వృద్ధిర్న. అగోపీత్, అగౌప్సీత్.

ఈ సూత్రము 'వదవ్రజహలన్తస్యాచః' (7-2-3) అను సూత్రమునకు సమనంతరముననే పఠింపబడినది. కావున 'ఇడాది యగు సిచ్ పర మగునపుడు హలన్తధాతువునకు వృద్ధి రాదు'' అను అర్థము సిద్ధ మగుచున్నది. (పైసూత్రమున వదవ్రజధాతువులను ప్రత్యేకముగ చెప్పి యుండుటచే ఈ నిషేధము హలంతధాతువులకు మాత్రమే వర్తించును).

ఈ సూత్రముచే వృద్ధి నిషిద్ధము గాన లఘూపధలక్షణ మగు గుణము వచ్చుటచే ''అగోపీత్- అగోపిష్టాం- అగోపిషుః; అగోపీః- అగోపిష్టం- అగోపిష్ట; అగోపిషం- అగోపిష్వ- అగోపిష్మ'' అను రూపములు సిద్ధించును. ప్రక్రియ అతధాతువులుఙ్లునందు వలెనే యుండును. ఇడాగమము రాని పక్షమున 'ఇట ఈటి' అను సూత్రముచే (448) 'సిచ్'కు లోపము వచ్చు నవకాశము లేదు. ఇచట ఇడాది 'సిచ్' లేకుండుటచే 'నేటి' (సూ-479)అను వృద్ధి నిషేధము కూడ ప్రవర్తింపదు. వృద్ధి వచ్చి లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'అగౌప్సీత్' అను రూపము సిద్ధించును. ఇతరప్రక్రియ యంతయు వెనుకటి వలెనే ఉండును.

ద్వివచనమున 'అగౌప్స్తామ్' అని యుండగా:-

480. ఝలో ఝలి 8.2.26

ఝలః పరస్య సస్య లోపో ఝలి.

అగౌప్తామ్, అగౌప్త; అగౌప్సీః, అగౌప్తమ్, అగౌప్త; అగౌప్సమ్, అగౌప్స్వ, అగౌప్స్మ. అగోపాయిష్యత్, అగోపిష్యత్, అగోప్స్యత్.

'సంయోగాన్తస్య లోపః' 'రాత్సస్య' అను సూత్రములనుండి 'లోపః' 'సస్య' అనుసరించును. "ఝల్ కంటె పర మగు సకారమునకు ఝల్ పర మగునపుడు లోపము వచ్చును.

ఈ సూత్రముచే పకారోత్తరవర్తి సకారము లోపింప "అగౌప్తామ్" అను రూపము సిద్ధించును. మధ్యమపురుషద్వివచనబహువచనములందు గూడ ఈ విధముగనే సకారము లోపించును. ఇతర రూపము లన్నియు అతధాతువునందు వలె సిద్ధించును;

లృఙ్ నందు 'స్య' అనునది ఆర్ధధాతుకము గాన ఆయాదేశవికల్పము. ఆయాదేశపక్షమున 'గోపాయ' అనునదియే ధాతువు (సూ-470). ఇది ఉకారాంతము కాదు గాన ఇడాగమము నిత్యముగ వచ్చును. 'అభవిష్యత్' ఇత్యాదిరూపముల వలె "అగోపాయిష్యత్" ఇత్యాదిరూపములు సిద్ధించును. ఆయాదేశము రాని పక్షమున నిది ఊకారాంతధాతువు గాన ఇడాగమము వైకల్పికము (సూ. 478). ఇడాగమ పక్షమున "అగోపిష్యత్- అగోపిష్యతామ్- అగోపిష్యన్" ఇత్యాదిరూపములును, తదభావపక్షమున "అగోప్స్యత్- అగోప్స్యతామ్- అగోప్స్యన్" ఇత్యాదిరూపములును సిద్ధించును.

క్షి క్షయే, 13. క్షయతి, చిక్షాయ- చిక్షియతుః-చిక్షియుః, 'ఏకాచః' ఇతి నిషేధే ప్రాప్తే—

'క్షి' ధాతువునకు క్షీణించుట అని యర్థము. ఇకారాంతధాతువు గాన దీని ప్రక్రియ లట్టునందు భూధాతువునందు వలె నుండును. భూధాతువునందు అవాదేశము రాగా ఈ ధాతువునందు అయాదేశము వచ్చును. ఇదియే భేదము. క్షయతి- క్షయతః- క్షయన్తి; క్షయసి- క్షయథః- క్షయథ; క్షయామి- క్షయావః క్షయామః' అను రూపము లగును.

లిట్ ప్రథమపురుషైకవచనమున లకారమునకు ణలాగమము (సూ-394) ద్విత్వము (సూ-396); 'క్ష' అనునది కకారషకారసంయోగరూపము గాన 'హలాదిశ్శేషః' అను సూత్రముచే (398) కకారము మాత్రము శేషించును. దానికి

చుత్వముచే (సూ-456) చకారము. 'చిక్షిఅ'అని యుండగా అకారపూర్వవర్తి యగు ఇకారమునకు "అచోఞ్ణితి"అను సూత్రముచే (182) వృద్ధి — 'చిక్షై అ'; ఆయాదేశము — 'చిక్షాయ'అను రూపము సిద్ధించును. ద్వివచనబహువచనము లందు 'అతుస్' 'ఉస్'అనునవి పరముగ నుండునపుడు అవి 'అసంయోగాల్లిట్ కిత్'అను సూత్రముచే (454) కిత్తులు గాన గుణనిషేధము (సూ-435) 'చిక్షి' అతుస్' 'చిక్షి ఉస్'అని యుండగా "అచిశ్నుధాతుభ్రువాంయ్వోరియఙువఙౌ" అను సూత్రముచే (199) ఇయఙాదేశము చేయగా 'చిక్షియతుః' 'చిక్షియుః' అను రూపములు సిద్ధించును. మధ్యమపురుషైకవచనమున 'చిక్షి థ'అని యుండగా క్షిధాతువు ఏకాచ్కమగు అనుదాత్తధాతువు గాన "ఏకాచఉపదేశేఽనుదాత్తాత్" అను సూత్రముచే (477) ఇడాగమనిషేధము ప్రాప్తింప దీనికి గూడ ఇడాగమము వచ్చుటకు వీలగునట్లు నియమసూత్రము చెప్పబడుచున్నది.

481. కృ, సృ, భృ, వృ, స్తు, ద్రు, స్రు శ్రువో లిటి 7.2.13

క్రాదిభ్య ఏవ లిట ఇట్ న స్యాత్; అన్యస్మాదనిటోఽపి స్యాత్.

'నేడ్వశికృతి'నుండి 'న' 'ఇట్ అనువర్తించును. సప్తమ్యంతమగు 'లిటి'అనుదానికి షష్ఠ్యంతార్థము చెప్పుకొనవలెను. కృ, సృ, భృ, వృ, స్తు, ద్రు, స్రు, శ్రు, ధాతువులకంటె పర మగు లిట్టునకు ఇడాగమము రాదు అని అర్థము. పై ధాతువులన్నియు ఏకాచ్కములగు అనుదాత్తధాతువులు. అందుచే "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్" అను సూత్రముచేతనే (477) వీటి లిట్టుకు ఇడాగమ నిషేధము సిద్ధించుచుండ మరల ఈ సూత్రముచే నిషేధింప పని లేదు. కావున "సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి" (అనగా ఏదైన ఒక శాస్త్రముచే (సూత్రముచే) ఒక కార్యము సిద్ధించుచుండగా మరల ఆకార్యమునే విధించుచు మరి యొక శాస్త్రమును చెప్పినచో అది నియమార్థ మని గ్రహింపవలెను) అను పరిభాష ననుసరించి ఈ సూత్రము నియమసూత్ర మని చెప్పవలెను. అందుచే "ఏకాచ ఉపదేశేనుదాత్తాత్"అను సూత్రముచే (477) లిట్టునందు ప్రాప్తించు ఇడాగమనిషేధము కృమొదలగు పై ధాతువులకు మాత్రమే వర్తించును; తద్భిన్నము లగు ధాతువులు అనిట్కము లైనను వాటి లిట్టునకు ఇడాగమము రావచ్చును"అని ఈ సూత్రమునకు అర్థము తేలినది. ప్రస్తుతము క్షిధాతువు 'ఊదృదన్తైః'ఇత్యాదిపూర్వోక్తశ్లోకమునందలి ధాతువులలో చేరని ఏకాచ్క ధాతు వగుటచే అనుదాత్త మగు అనిడ్ధాతువే యైనను ఈ నియమసూత్రము

ననుసరించి దీని లిట్టునందలి వలాద్యార్ధధాతుకములకు (థల్, వ, మ)ఇడాగమము రావలసి యున్నది. కాని 'థల్'విషయమున మూడు సూత్రములు చెప్పబడు చున్నవి.

## 482. అచస్తాస్వత్ థల్యనిటో నిత్యమ్ 7.2.61

ఉపదేశేఽజన్తో యోధాతుః తాసౌ నిత్యానిట్ తతః పరస్య థల ఇట్ న.

'థల్'అనునది ధాతువునకు మాత్రమే చేర్చబడును గాన 'ధాతోః'అనునది ఆక్షిప్తమగును. 'ఉపదేశేఽత్వతః'అను ఉత్తరసూత్రమునుండి 'ఉపదేశే'అను పదము అపకర్షింపబడును. 'తాసి చ క్లృపః' ''గమేరిట్ పరస్మైపదేషు'' 'న వృద్భ్యశ్చతుర్భ్యః'అను సూత్రములనుండి 'తాసి' 'ఇట్' 'న' అనువర్తించును. తాస్‌నందు నిత్యముగ అనిట్ అగునదియు, ఉపదేశమున అజంతము నగు ధాతువు కంటె పర మగు 'థల్'కు 'తాస్' నందు వలెనే (తాస్వత్) ఇడాగమము రాదు.

క్షిధాతువు ఉపదేశమున అజంతము. ఇది అనుదాత్త మగుటచే ''ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్''అను సూత్రముచే (477) 'తాస్'కు ఇడాగమము నిత్యముగ నిషిద్ధ మైనది. కావున ప్రకృతసూత్రముచే 'థల్' పర మగునపుడు ఇడాగమము నిషిద్ధము కావలసి యున్నది. అనగా వెనుకటి నియమసూత్రము ననుసరించి దీనికి రావలసిన ఇడాగమము రాకూడదు. (కాని దీనికి 'థల్'పర మగునపుడు వికల్పముగ ఇడాగమము వచ్చు నని ముందు తెలియగలదు).

## 483. ఉపదేశేఽత్వతః 7.2.62

ఉపదేశేఽకారవతః తాసౌ నిత్యానిటః పరస్య థల ఇట్ న స్యాత్.

ఇతరపదములు వెనుకటి సూత్రమునందు వలెనే అనువర్తించును. ఉపదేశమునందు (హ్రస్వ) అకారము కలదియు 'తాస్'నందు నిత్యానిట్ అగు ధాతువుకంటె పర మగు 'థల్'కు ఇడాగమము రాదు. ఇది కూడ ఇడాగమనిషేధసూత్రము. దీనికి 'పపక్థ'అనునది ఉదాహరణము. 'పచ్' ధాతువు ఉపదేశమునందు అకారము కలది. దీనికి 'తాస్'నందు ఇడాగమాభావము నిత్యము. కావున దీనికి 'థల్'పర మగునపుడు ఈ సూత్రముచే ఇడాగమము నిషిద్ధ మగుటచే 'పపక్థ'అను రూపము సిద్ధించినది. పచ్ధాతువు అజంతము కాదు గాన వెనుకటిసూత్రము ప్రవర్తింపకుండుటచే ఈ సూత్రము చెప్పవలసి వచ్చినది.

484. ఋతో భారద్వాజస్య 7.2.63

తాసౌ నిత్యానిటః ఋదన్తాదేవ థలో నేడ్ భారద్వాజస్య మతేన. తేన అన్యస్య స్యాదేవ. అయమత్ర సఙ్గ్రహః:—

అజన్తోఽకారవాన్వా యస్తాస్యనిట్ థలి వేడయమ్
ఋదన్త ఈదృఙ్నిత్యానిట్ క్రాద్యన్యో లిటి సేడ్భవేత్.

అను వృత్తు లన్నియు పూర్వసూత్రమునందు వలె చూచుకొనవలెను.

'తాస్'నందు నిత్యానిట్క మగు ఋకారాంతధాతువుకంటె మాత్రమే పర మగు 'థల్'కు భారద్వాజు డనెడు వ్యాకరణాచార్యుని మతమున, ఇడాగమము రాదు. ఋదన్తభిన్నధాతువులకంటె పర మగు 'థల్'కు ఇడాగమము రావచ్చును.

'తాస్'నందు నిత్యానిట్టగు ఏ అజంతధాతువుకంటెను పర మగు 'థల్'కు ఇడాగమము రాదని పాణిని అభిప్రాయము (సూ-482). కాని భారద్వాజు డను ఆచార్యుని మతమున ఈ నిషేధము ఋకారాంతధాతువులకు మాత్రమే వర్తించును. ఈ విధముగ ఋకారాంతధాతువులకంటె పర మగు 'థల్'కు ఇడాగమము రాకుండుట సర్వసమ్మతము. ఇతర అజంతధాతువులలో కూడ ఇడాగమము రాదని పాణిన్యాదులును, వచ్చు నని భారద్వాజాదులును అభిప్రాయపడుచున్నారు. అనగా వాటి విషయమున ఇడాగమము వైకల్పిక మని తేలినది. ఈ నిషేధము ప్రవర్తించుటకు ఆధాతువు 'తాస్'నందు నిత్యానిట్టుగ నుండ వలెనను విషయము మాత్రము సర్వాంగీకార్యమే. ఈ సూత్రము ప్రతిపాదించు నియమమును భారద్వాజనియమ మందురు. 'కృసృభృ'ఇత్యాదిసూత్రసూచిత మగు నియమమునకు క్రాదినియమ మని పేరు. ఈ నాల్గు సూత్రముల పరినిష్ఠితార్థము పై కారికలో సంగ్రహింపబడినది.

'తాస్'నందు అనిట్టును, అజంతము గాని లేక హ్రస్వాకారము కలది గాని యగు ధాతువునకు 'థల్' పర మగునపుడు ఇడాగమము వికల్పముగ వచ్చును ఆట్టి ధాతువు ఋకారాంత మైనచో ('థల్'నందు గూడ) నిత్యానిట్టు అగును. క్రాది (కృ,సృ,మొదలగు ధాతువులు) భిన్న మగు అనిడ్ధాతువు గూడ లిట్టునందు (వ,మ,) సేట్టుగ నుండును.

క్రాదినియమము ననుసరించి, వెనుక సూచించిన విధముగ, 'కృ' 'సృ' మొదలగు ఎనిమిదిధాతువులను తక్క, అనుదాత్తములును అనిట్టులును అగు అన్ని ధాతువులకును లిట్టునందు వలాద్యార్ధధాతుకము (థల్, వ, మ) పర మగు

నపుడు ఇడాగమము నిత్యముగ రావలసి యున్నది. కాని 'థల్'విషయమున మూడు విశేషసూత్రములు (482-84) చెప్పబడినవి పాణిని ('తాస్'నందు అనిట్కము లగు) అన్ని అజంతధాతువులకును, హలంతధాతువులలో అకారము గల ధాతువులకును 'థల్' పర మగునపుడు ఇడాగమమును నిషేధింప, భారద్వాజుడు ఋదంతధాతువులకు మాత్రమే ఇడాగమమును నిషేధించెను. ఈ మతభేదము ననుసరించి ఋదంతధాతువులకు 'థల్'సంధు, ఇడాగమాభావము నిత్యమనియు, అన్యాజంతధాతువులకును హలంతధాతువులలో అకారవంతము లగు ధాతువులకును ఇడాగమము వికల్పముగ వచ్చుననియు ఫలితార్థము తేలినది. ఈ నిర్ణయము 'థల్'కుమాత్రము సంబంధించినది. ఇక మిగిలినవి వ, మ, అనునవి. ఇచట క్రాదినియమము ప్రవర్తించును. అనగా 'కృ'మొదలగు ఎనిమిది ధాతువులు తక్క ఇతరము లగు అనిడ్ధాతువుల 'వ' 'మ లకు ఇడాగమము నిత్యముగ వచ్చును.

ఇడాగమవిషయమున ఈ క్రింది విషయములను జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఏ ధాతువైనను అనేకాచ్కమైనచో అది సేట్కము. అనగా 'జాగృ' 'చకాసృ'ఇత్యాదు లగు అనేకాచ్కధాతువులకు నిస్సంశయముగ ఇడాగమము చేయవచ్చును. ఇట్లే 'సన్' 'యఙ్' 'ణిచ్' మొదలగు ప్రత్యయములను చేర్చిన పిమ్మట 'సనాద్యన్తా ధాతవః'అను సూత్రముచే (470) తత్సహిత మగు వాటికే ధాతుసంజ్ఞ గాన అవి యన్నియు అనేకాచ్కములై 'సేట్'లగును ధాతువు ఏకాచ్కమైనచో అది ఉదాత్తమా అనుదాత్తమా అను విషయమును మొదట పరిశీలింపవలెను. 'ఊదృదన్తై ః'అను శ్లోకము సహాయముతో ఈ విషయమును తెలిసికొనవచ్చును. అది అనుదాత్తమై 'అనిట్'అను విషయము తేలిన పిమ్మట లిట్టు విషయము పరిశీలింపవలెను. ('సేట్' అయినచో ఇడాగమము చేయుటలో సందేహము లేదు). ఆధాతువు 'కృ' మొదలగు ఎనిమిది ధాతువులలో చేరినచో దానికి లిట్టునందు (థ, వ, మ) ఇడాగమము పూర్తిగ నిషిద్ధము (సూ-481). ఋకారాంతధాతు వైనచో 'థల్'నందు ఇడాగమము పూర్తిగ నిషిద్ధము. ఋకారభిన్నాజన్తము గాని, హలంతమై అకారసహితము (ఉపదేశమున) గాని ఐనచో థల్‌నందు ఇడాగమము వికల్పముగ చేయవలెను. ఏతద్భిన్న మైనచో అనగా హలంతమై యుండి అకారరహిత మైనచో—ఇడాగమము (థల్‌నందుగూడ) నిత్యముగ చేయవలెను. 'కృ'మొదలగు ఎనిమిది ధాతువులు కాక మిగిలిన అనిడ్ధాతువులన్నిటికిని 'వ' 'మ'లు పర మగునపుడు ఇడాగము నిత్యము.

ప్రకృతమున 'క్షి'ధాతువు అజంత మగు అనిడ్ధాతువు. కావున భారద్వాజ నియమము ననుసరించి థల్‌నందు ఇడాగమము వికల్పముగ వచ్చును. 'వ', 'మ'లు పర మగునపుడు క్రాదినియమానుసారము నిత్యముగ వచ్చును.

చిక్షయిథ - చిక్షేథ, చిక్షియథుః. చిక్షియ
చిక్షాయ - చిక్షయ, చిక్షియివ, చిక్షియిమ
క్షేతా, క్షేష్యతి. క్షయతు, అక్షయత్. క్షయేత్.

ఇడాగమపక్షమున 'చిక్షి ఇథ' అని యుండగా గుణఅయాదేశములచే 'చిక్షయిథ'అను రూపము సిద్ధించును. ఇడాగమము రాని పక్షమున కేవలగణముచే 'చిక్షేథ' అను రూపము. ద్వివచనబహువచములందు 'చిక్షి + అథుస్' 'చిక్షి + ఉస్' అని ఉండగా 'అసంయోగాల్లిట్‌కిత్'అను సూత్రముచే (454) కిత్వము వచ్చును గాన గుణము రాదు. "అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ"అను సూత్రముచే (199) ఇయఙాదేశము. 'చిక్షియథుః' 'చిక్షియుః' అను రూపములు సిద్ధించినవి. ఉత్తమపురుషైకవచనమున 'చిక్షి + అ(ణల్)' అని యుండగా "ణలుత్తమో వా"అను సూత్రముచే (458) 'ణల్'కు ణిత్త్వము వైకల్పికము గాన "అచోఞ్ణితి"అను సూత్రముచే (182) వృద్ధియు, ఆయాదేశము చేసిన పక్షమున 'చిక్షాయ' అనియు, ణిత్త్వాభావపక్షమున గుణఅయాదేశములచే 'చిక్షయ' అనియు రెండు రూపములు సిద్ధించును. ద్వివచనబహువచనములందు నిత్యముగ ఇడాగమము (క్రాదినియమము ననుసరించి), ఇయఙాదేశము (సూ-199) చేయ 'చిక్షియివ' 'చిక్షియిమ'అను రూపములుసిద్ధించినవి.

లుట్టు, లృట్టులందు తాస్', 'స్య'లు పరముగ నుండగ రావలసి యున్న ఇడాగమము "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్"అను సూత్రముచే (477) నిషేధింపబడినది. కావున 'సార్వధాతుకార్ధధాతుకయోః'అను సూత్రముచే (390) గుణము మాత్రము చేయగా "క్షేత్తా- క్షేత్తారౌ- క్షేత్తారః; క్షేత్తాసి-క్షేత్తాస్థః- క్షేత్తాస్థ; క్షేత్తాస్మి- క్షేత్తాస్వః- క్షేత్తాస్మః;" అనియు, "క్షేష్యతి-క్షేష్యతః-క్షేష్యన్తి; క్షేష్యసి- క్షేష్యథః- క్షేష్యథ; క్షేష్యామి- క్షేష్యావః- క్షేష్యామః" అను రూపములును సిద్ధించును.

లోట్, లఙ్; విధిలిఙ్‌లందు భూధాతువునందు వలె "క్షయతు" 'అక్షయత్', "క్షయేత్"ఇత్యాదిరూపములు సిద్ధించును. భూధాతువుకు అవాదేశము రాగా ఇచట అయాదేశము వచ్చుట ఒక్కటియే విశేషము

ఆశీర్లిఙ్ నందు 'యాసుట్' చేరిన పిమ్మట 'క్షియాత్'అని యుండగా:-

485. అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః 7.4.25

అజన్తాఙ్గస్య దీర్ఘో యాదౌ ప్రత్యయే; న తు కృత్సార్వధాతుకయోః. క్షీయాత్

'అఙ్గస్య'అధికారము. ప్రత్యయ మున్ననే గాని అంగసంజ్ఞ యనునది ఉండదు గాన 'ప్రత్యయే'అనునది ఆక్షిప్తము. 'అయఙ్యి క్ఙితి'నుండి 'యి' అనువర్తించును. 'అచశ్చ'అను పరిభాషాసూత్రము ననుసరించి 'అచః' అను పదము లభించును. ("హ్రస్వదీర్ఘప్లుతశబ్దములచే ఎచ్చట అచ్ విధింపబడునో అచట 'అచః'అను షష్ఠ్యంతపదము ఉపస్థిత మగును" అని ఈ సూత్రమున కర్థము. దీనిని లఘుకౌముదిలో ఈయలేదు). యకారాది యగు ప్రత్యయము పర మగునపుడు అజంత మగు అంగమునకు దీర్ఘము వచ్చును. యకారాదిప్రత్యయము కృత్ప్రత్యయము గాని సార్వధాతుకసంజ్ఞకము గాని యైనచో దీర్ఘము రాదు:

'లిఙాశిషి'అను సూత్రముచే (433) ఇచట నున్న యాసుట్ (యా)ఆర్ధధాతుకసంజ్ఞకము. కృత్సార్వధాతుకభిన్న మగు యకారాదిప్రత్యయము పరముగ నున్నది గాన 'క్షి'యందలి ఇకారమునకు దీర్ఘము 'క్షీయాత్' అను రూపము సిద్ధించును. 'క్షీయాస్తామ్' 'క్షీయాసుః' ఇత్యాదిరూపములందు గూడ ఇట్లే దీర్ఘము వచ్చును.

లుఙ్నందు 'క్షి + లుఙ్'; 'లుఙ్ కు ప్రథమపురుషైకవచనమున 'తిప్'- 'క్షి + తి'. అడాగమము (సూ-425) 'అక్షి + తి', 'ఇతశ్చ'అను సూత్రముచే (426) 'తి'లోని ఇకారమునకు లోపము—'అక్షి + త్', 'చ్లి లుఙి' (సూ-439) "చ్లేః సిచ్" (సూ-440)—'అక్షిస్త్'. ఈడాగమము (సూ-447) 'అక్షి స్ ఈత్'; షత్వము (సూ-150)-'అక్షి షీత్' ("ఏకాచ ఉపదేశేనుదాత్తాత్"అను సూత్రముచే (477) 'సిచ్'కు ఇడాగమము నిషిద్ధము). ఇపుడు 'క్షి' యందలి ఇకారమునకు గుణము రావలసి యుండగా:-

486. సిచి వృద్ధిః పరస్మైపదేషు 7.2.1

ఇగన్తాఙ్గస్య వృద్ధిః స్యాత్ పరస్మైపదే సిచి. అక్షైషీత్, అక్షేష్యత్.

'అజ్గస్య' అధికారము. 'ఇకో గుణవృద్ధీ'అను పరిభాషాసూత్రముచే 'ఇకః'అను పదము ఉపస్థిత మగును. ("గుణవృద్ధిశబ్దములను ఉచ్చరించి గుణ వృద్ధులను విధించినపుడు 'ఇకః' అను షష్ఠ్యంతపదము ఉపస్థితమగును' అని యీ పరిభాషాసూత్రమున కర్థము.) పరస్మైపదమునందు 'సిచ్' పర మగునపుడు ఇగంతాంగమునకు వృద్ధి వచ్చును.

ఈ సూత్రముచే వృద్ధి చేయగా 'అక్షైషీత్' 'అక్షైష్టామ్' 'అక్షైషుః' ఇత్యాదిరూపములు సిద్ధించును. ల్ఱృఙ్‌నందు గుణము చేయగా' అక్షేష్యత్- అక్షే ష్యతాం- అక్షేష్యన్' ఇత్యాదిరూపము లగును.

తప సన్తాపే. తపతి. తతాప, తేపతుః, తేపుః, తేపిథ. తతప్థ. తప్తా, తప్స్యతి, తపతు, అతపత్, తపేత్, తప్యాత్. అతాప్సీత్, అతప్స్యత్. క్రము పాదవిక్షేపే.

'తప్'ధాతువునకు తపించుట, దహించుట, అని అర్థము. ఇది పకారాన్తా నుదాత్తధాతువులలో పఠింపబడినది గాన "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్" అను సూత్రముచే (477)ఇడాగమనిషేధము. లట్టునందు శబాదులు చేరిన పిమ్మట'అత' ధాతువునందు వలె 'తపతి, తపతః, తపన్తి' ఇత్యాదిరూపము లగును లిట్టు ప్రథమపురుషైకవచమున 'తిప్'కు ణలాదేశము చేసిన పిమ్మట 'తప్ + అ' అని యుండగా ద్విత్వ (సూ-396), అభ్యాసకార్యములు చేసిన పిమ్మట 'తతప్ + అ' అని యుండగా "అతఉపధాయాః" అను సూత్రముచే (457) ఉత్తరఖండము నందలి అకారమునకు దీర్ఘము చేయుటచే 'తతాప'అను రూపము సిద్ధించినది. లిట్టునందలి ఏకవచనములు తక్క ఇతరవచనము లన్నియు 'అపిత్' అగుటచే వాటికి 'అసంయోగాల్లిట్ కిత్'అను సూత్రముచే (454) కిత్సంజ్ఞ యుండును. కావున"అతఏకహల్మధ్యేఽదేశానాదేర్లిటి"అను సూత్రముచే(462)అకారమునకు ఏత్వము, అభ్యాసలోపము వచ్చుటచే నదధాతువునందు వలె 'తేపతుః, తేపుః' ఇత్యాదిరూపము లగును. మధ్యమపురుషైకవచనమునందు "తప్ + థ" అని యుండగా భారద్వాజనియమముచే ఇడాగమము వైకల్పికము. ఇడాగమము వచ్చిన పక్షమున "థలి చ సేటి"అను సూత్రముచే (463) ఏత్వాభ్యాసలోపములచే "తేపిథ"అను రూప మగును. ఇడాగమము రాని పక్షమున "థలి చ సేటి" అను సూత్రము ప్రవర్తించదు గాన 'తతప్థ'అను రూప మగును. ఉత్తమపురు షైకవచనమున 'ణలుత్తమో వా'అను సూత్రముచే (458) ణిత్వము వై

కము గాన "అచో ఞ్ణితి" (182)అను వృద్ధి వచ్చినచో 'తతాప' అనియు, అది రాని పక్షమున 'తతప' అనియు రూపద్వయ ముండును. ఇట్లు ఇతరవచనము లందలి రూపములు గూడ నదధాతువునందు వలె నుండును. ఇట్లు లుడాద్యార్ధ ధాతుకములందు 'తప్తా,' 'తప్స్యతి' మొదలగు ఇడాగమరహితరూపములు సిద్ధించును. విశేషకార్యము లేవియును లేవు. లోట్, లఙ్. విధిలిఙ్ లందు గూడ భూధాతువునందు వలె రూపనిష్పత్తి యుండును.

'లుఙ్'నందు 'వదవ్రజహలన్తస్యాచః' అను సూత్రముచే (467) వృద్ధి వచ్చుటచే 'అతాప్సీత్- అతాప్తాం- అతాప్సుః; అతాప్సీః- అతాప్తమ్- అతాప్త; అతాప్సమ్- అతాప్స్వ- అతాప్స్మ'అను రూపము లగును. 'అతాప్తామ్'ఇత్యాదులందు "ఝలో ఝలి" అను సూత్రముచే (480) సకారలోపము ('అగౌప్తామ్' ఇత్యాదులందు వలె వచ్చును.

'క్రమ్'ధాతువునకు పాదములను కదల్చుట—అనగా నడచుట—అని యర్థము. ఇది అనుదాత్తధాతుమధ్యమున పఠింపబడకుండుటచే సేట్కము.

488. వా భ్రాశ,భ్లాశ.భ్రము,క్రము,క్లము.త్రసి,త్రుటి,లషః 3.1.70

ఏభ్యః శ్యన్వా కర్త్రర్థే సార్వధాతుకే పరే. పక్షే శప్.

'దివాదిభ్యః శ్యన్', 'కర్తరి శప్', 'సార్వధాతుకే యక్'అను సూత్రముల నుండి 'శ్యన్' 'కర్తరి' 'సార్వధాతుకే' అను పదములు అనువర్తించును. కర్త్రర్థ మగు సార్వధాతుకము పర మగునపుడు భ్రాశ్. భ్లాశ్, భ్రమ్, క్రమ్, క్లమ్, త్రస్, త్రుట్, లష్. ధాతువులకంటె పరముగ 'శ్యన్' వికల్పముగ వచ్చును.

ఈ ధాతువు లన్నియు భ్వాదిగణములోనివి గాన ఈ సూత్రముచే 'శ్యన్' రాని పక్షమున 'శప్' వచ్చును. 'శ్యన్' కూడ శిత్ అగుటచే "తిఙ్శిత్సార్వ ధాతుకమ్" అను సూత్రముచే (388) సార్వధాతుకసంజ్ఞకము. అట్టునందు ఈ శ్యన్ చేర్చినపుడు 'క్రమ్ యతి' అని యుండగా:-

489. క్రమః పరస్మైపదేషు 7.3.76

క్రమో దీర్ఘః పరస్మైపదే శితి. క్రామ్యతి, క్రామతి, చక్రామ, క్రమితా, క్రమిష్యతి, క్రామ్యతు, క్రామతు, అక్రామ్యత్, అక్రామత్, క్రామ్యేత్, క్రామేత్, క్రామ్యాత్,అక్రమీత్.అక్రామిష్యత్. పా పానే 16.

'శమామష్టానాం దీర్ఘః శ్యని', 'ష్ఠివు క్లము చమాం శితి' అను సూత్రముల నుండి 'దీర్ఘః' 'శితి' అనువర్తించును. పరస్మైపదములు పర మగునపుడు, క్రమ్‌ధాతువునకు 'శిత్'అగు ప్రత్యయము పరమై యుండగా దీర్ఘము వచ్చును.

ఈ సూత్రముచే అకారమునకు దీర్ఘము చేసిన పిమ్మట 'క్రామ్యతి'అను రూప మగును. 'శ్యన్' రాని పక్షమున శప్‌దీర్ఘములచే 'క్రామతి'అను రూపము సిద్ధించును. ఈ విధముగ ఇతర సార్వధాతుకములందు (లోట్, లఙ్, విధిలిఙ్ లందు) గూడ వైకల్పిక శ్యనాదేశము, దీర్ఘము చేయుటచే "క్రామ్యతు - క్రామతు- అక్రామ్యత్- అక్రామత్, క్రామ్యేత్- క్రామేత్" ఇత్యాదిరూప ద్వయములు సిద్ధించును. ఈ ధాతువు సేట్కము గాన ఆర్ధధాతుకములందు ఇడాగమము వచ్చును. లిట్:- చక్రామ- చక్రమతుః- చక్రముః, చక్రమిథ- చక్రమథుః- చక్రమ, చక్రామ, చక్రమ- చక్రమివ- చక్రమిమ. ఇతే ఇతరలకారములందు గూడ విశేషకార్యమేదియును రాదు. లుఙ్‌నందు మాత్రము 'వద వ్రజ హలన్తస్యాచః' అను సూత్రముచే (467) రావలసి యున్న వృద్ధి, ఈ ధాతువు మకారాంతము గాన "హ్మ్యన్త క్షణ శ్వస జాగృణి శ్వ్యేదితామ్" అను సూత్రముచే (468) నిషేధింపబడుటచే "అక్రమీత్- అక్రమిష్టామ్- అక్రమిషుః" ఇత్యాదిరూపము లుండును.

'పా'ధాతువునకు త్రాగుట యని అర్థము లిట్ ప్రథమపురుషైకవచనమందు 'శప్'చేర్చిన పిమ్మట 'పా + అ + తి' అని యుండగా:-

491. పా, ఘ్రా, ధ్మా, స్థా, మ్నా, దాణ్, దృశ్యర్తి, సర్తి, శద, సదాం, పిబ, జిఘ్ర, ధమ, తిష్ఠ, మన, యచ్ఛ, పశ్యర్ఛ, ధౌ, శీయ, సీదాః. 7.3.78

పాదీనాం పిబాదయః స్యుః ఇత్సంజ్ఞ- శాదౌ ప్రత్యయే పరే.
పిబాదేశోఽదన్తః, తేన న గుణః. పిబతి.

'ష్ఠివు క్లము చమాం శితి'నుండి 'శితి'అనువర్తించును. ఇత్సంజ్ఞకశకారము ఆదియందు గల ప్రత్యయము పర మగునపుడు 'పా'మొదలగు ధాతువులకు యథాక్రమముగ 'పిబ'ఇత్యాద్యాదేశములు వచ్చును.

ఈ యాదేశములు ఈ క్రింద చూపిన విధముగ వచ్చును. పా-పిబ; ఘ్రా-జిఘ్ర; ధ్మా-ధమ; స్థా-తిష్ఠ; మ్నా-మన; దాణ్-యచ్ఛ; దృశ్-పశ్య; ఋ-ఋచ్ఛ; సృ-ధౌ; శద శీయ; సద-సీద.

ఈ సూత్రముచే 'పా'కు పిబాదేశము చేసిన పిమ్మట 'పిబ + అ + తి' అని యుండగా, ఈ 'పిబ' ఆదేశము అకారాంతమగుటచే బకారము ఉపధ గాని ఇకారము కాదు. అందుచే 'పుగన్తలఘూపధస్య చ' అను సూత్రముచే (453) గుణము వచ్చెడు ప్రసక్తి లేదు. ''అతో గుణే'' అను సూత్రముచే (274) పరరూపము వచ్చి 'పిబతి' అను రూపము సిద్ధించును. ఇట్లు సార్వధాతుకములందన్నిటియందును 'శప్' వచ్చును గాన ఈ పిబాదేశము చేయగా ''పిబతు'' (లోట్) ''అపిబత్'' (లఙ్) 'పిబేత్' (విధిలిఙ్) ఇత్యాదిరూపము లగును. 'పిబన్తి'ఇత్యాదులందు బకారోత్తరవర్తి అకారమునకును 'శప్'అకారమునకును మొదట పరరూపము జేసి పిదప ఆ అకారమునకును ప్రత్యయావయవాకారమునకును మరల పరరూపము చేయవలెను.

లిట్టుప్రథమపురుషైకవచనమున 'పా + ణల్' అని యుండగా:-

## 491. ఆత ఔ ణలః 7.1.34

ఆదన్తాత్ ధాతోః ణలః ఔకారాదేశః స్యాత్. పపౌ.

ఆకారాంతధాతువుకంటె పర మగు 'ణల్'కు ఔకారాదేశము వచ్చును

ఈ సూత్రముచే ఔకారము చేసిన పిమ్మట 'పా + ఔ'అని యుండగా, ద్విత్వ (సూ-396), హ్రస్వములు (సూ-399) చేసిన పిమ్మట 'పపా + ఔ'అని యుండగా వృద్ధిచే 'పపౌ'అను రూపము సిద్ధించును.

ద్వివచనబహువచనములందు ద్విత్వహ్రస్వములు చేసిన పిమ్మట 'పపా + అతుస్' ''పపా + ఉస్'' అని యుండగా:-

## 492. ఆతో లోప ఇటి చ 6.4.64

అజాద్యోరార్ధధాతుకయోః క్ఙిదిటోః పరయోరాతో లోపః.

పపతుః, పపుః, పపిథ- పపాథ, పపథుః, పప, పపౌ, పపివ, పపిమ. పాతా. పాస్యతి. పిబతు. అపిబత్. పిబేత్.

'ఆర్ధధాతుకే'అని అధికారము. ''దీఙో యుడచి క్ఙితి''నుండి 'అచి''క్ఙితి' అనువర్తించును. ఆర్ధధాతుకము లగు అజాది 'కిత్' 'ఙిత్' ప్రత్యయమును (ఆర్ధ

ధాతుక మగు) ఇడాగమమును పరముగ నుండునపుడు దీర్ఘాకారమునకు లోపము వచ్చును.

ఆర్ధధాతుకమునకు ఆద్యవయవముగ వచ్చు ఇడాగమము గూడ ''యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే'' (''ఏది దేనికి ఆగమముగ వచ్చునో అది దానికి అంగమై దానిని గ్రహించినపుడు అది కూడ గ్రహింపబడును) అను పరిభాష ననుసరించి ఆర్ధధాతుకసంజ్ఞ మే యగును.

'అసంయోగాల్లిట్ కిత్' అను సూత్రముచే (454) పిద్భిన్నము లగు లిడాదేశప్రత్యయము లన్నియు కిత్తులు గాన, ఈ సూత్రముచే ఆకారము లోపింప 'పపతుః' 'పపుః' అను రూపములు సిద్ధించును. పాధాతువు అజంత మగు ఏకాచ్క-ధాతువు గాన అనుదాత్త మగుటచే అనిట్. కావున 'థల్' పర మగునపుడు భారద్వాజనియమముచే వికల్పముగను, 'వ' 'మ'లు పర మగునపుడు క్రాదినియమముచే నిత్యముగను ఇడాగమము వచ్చును. ఇడాగమము వచ్చినపుడు ఆకారలోపముచే (పై సూ.) 'పపిథ'అనియు, రాని పక్షమున 'పపాథ'అనియు రూపములు. 'వ' 'మ'లు పర మగునపుడు ఇడాగమము నిత్యము గాన ఆకార లోపముచే 'పపివ' 'పపిమ' అను రూపము లగును.

లుట్, ల్ృట్ మొదలగు ఆర్ధధాతుకములందు (ఇడాగమము రాదు గాన) 'పాతా- పాతారౌ- పాతారః,' ''పాస్యతి- పాస్యతః- పాస్యన్తి'' ఇత్యాది రూపము లగును.

ఆశీర్లిఙ్‌నందు యాసుడాగమము చేసిన పిమ్మట 'పాయాత్' అని యుండగా:-

## 493. ఏర్లిఙి 6.4.67

ఘుసంజ్ఞకానాం మాస్థాదీనాం చ ఏత్వం స్యాత్, ఆర్ధధాతుకే కితి లిఙి. 'పేయాత్' 'గాతి-స్థా-'. ఇతి సిచో లుక్- అపాత్; అపాతామ్.

ఏః, లిఙి. 'ఆర్ధధాతుకే' అధికారము. ''ఘుమాస్థాగాపాజహాతిసాం హలి'' నుండి 'ఘుమాస్థాగాపాజహాతిసాం' ''దాణో యుడచిక్ఙితి'' నుండి 'క్ఙితి' అనువర్తించును. కాని ఆర్ధధాతుకలిఙ్‌కు క్విత్త్వమే కాని (సూ-431) ఙిత్త్వము అసంభావ్యము గాన 'క్ఙితి'లోని 'కితి' అనునది మాత్రమే అనువర్తించును. ఆర్ధధాతుకమును, కిత్తును అగు 'లిఙ్'పర మగునపుడు, ఘుసంజ్ఞకము లగు ధాతువులకును, మా, స్థా- గా, పా, హా ధాతువులకును ఏకారము వచ్చును.

ఈ సూత్రముచే ఏకారము చేయగా "పేయాత్ - పేయాస్తామ్ - పేయాసుః" ఇత్యాదిరూపములు సిద్ధించును.

'లుఙ్'లో 'చ్లి'కి ఆదేశముగ వచ్చిన 'సిచ్'కు "గాతిస్థాఘుపాభూభ్యః సిచః పరస్మైపదేషు" అను సూత్రముచే (441) లోపము. 'సిచ్'లోపించుటచే "అస్తి సిచోఽపృక్తే" అను సూత్రముచే (447) 'త్'కు ఈడాగమము వచ్చు ప్రసక్తి లేదు. "అపాత్- అపాతామ్" ఇత్యాదిరూపములు సిద్ధించును.

లుఙ్ ప్రథమపురుషబహువచనమున 'అపాస్‌ఝి 'అని యుండగా సిజ్లోపము- 'అపా ఝి' అని యుండగా స్థానివద్భావముచే 'సిచ్'ఉన్నది గాన దానికంటె పర మగు 'ఝి'కి "సిజభ్యస్తవిదిభ్యశ్చ"అను సూత్రముచే (449) 'జుస్' ఆదేశము వచ్చును. లుప్త మగు సిచ్‌కు స్థానివద్భావము చేసి 'జుస్' ఆదేశము చేయుట ప్రస్తుతమున అభీష్టమే కాని 'భూ'మొదలగు ధాతువులలో కూడ నిట్లు స్థానివద్భావము చేసి జుసాదేశము చేయుటకు అవకాశ ముండును. తత్పరిహారార్థమై ఈ క్రింది నియమసూత్రము చెప్పబడుచున్నది.

494. ఆతః 3.4.110

సిజ్లుకి ఆదన్తాదేవ ఝేర్జుస్.

"ఝేర్జుస్'అను సూత్ర మనువర్తించును.". ఆతః సిజ్లుగన్తాదితి వక్తవ్యమ్" అను భాష్యపఠితవార్తికము ననుసరించి 'సిజ్లుకి' అనునది లభించును. 'సిచ్'కు లుక్ వచ్చినపుడు ఆదన్తధాతువుకంటె పర మగు 'ఝి'కి మాత్రమే 'జుస్' వచ్చును.

పైన చూపినట్లు 'సిజభ్యస్తవిదిభ్యశ్చ' అను సూత్రముచేతనే (449) జుసాదేశము వచ్చుచుండ ఈ సూత్రమును చెప్పుటచే ఇది నియమార్థ మని తెలియుచున్నది. "సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి." సిజ్లుక్ చేసిన పిమ్మట 'ఝి'కి 'జుస్' చేయవలసి యున్నచో ఆదన్తధాతువుకంటెపర మగు దానికి మాత్రమే వచ్చు నని యభిప్రాయము. అందుచే 'భూ'మొదలగు ధాతువుల 'ఝి'కి 'జుస్' రాదు.

ఈ సూత్రముచే జుస్ (ఉస్) చేసిన పిమ్మట 'అపా+ఉస్' అని యుండగా:-

### 497. ఉస్యపదాన్తాత్ 6.1.96

అపదాన్తాదకారాత్ ఉసి పరరూపమేకాదేశః. అపుః. అపాస్యత్.

'ఏకః పూర్వపరయోః' అని అధికారము. 'ఆద్ గుణః' 'ఏఙి పరరూపమ్' అను సూత్రములనుండి 'ఆద్' 'పరరూపమ్' అను పదములు అనువర్తించును. అపదాంత మగు అకారమునకంటె 'ఉస్' పర మగునపుడు పరరూపము ఏకాదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే పరరూపము చేయగా 'అపుః' అను రూపము నిష్పన్న మగును. లృఙ్‌నందు (ఇడాగమము రాదు గాన) 'అపాస్యత్-అపాస్యతామ్-అపాస్యన్' ఇత్యాదిరూపము లగును.

గ్లై హర్షక్షయే. గ్లాయతి.

'గ్లై'ధాతువునకు హర్షనాశ మని యర్థము. 'లట్'కు తిబాద్యాదేశములు చేసిన పిమ్మట 'శప్' వచ్చును. పిమ్మట ఆయాదేశము చేయగా 'గ్లాయతి-గ్లాయతః- గ్లాయన్తి' ఇత్యాదిరూపములు నిష్పన్న మగును.

### 496. ఆదేచ ఉపదేశేఽశితి 6.4.45

ఉపదేశే ఏజన్తస్య ధాతోరాత్వం, నతు శితి. జగ్లౌ. గ్లాతా. గ్లాస్యతి. గ్లాయతు. అగ్లాయత్. గ్లాయేత్.

'ధాతోః'అధికారము. ఉపదేశమునందు ఏజంత మగు ధాతువునకు ఆత్వము వచ్చును, శిత్ పర మగునపుడు మాత్రము రాదు.

'గ్లై'ధాతువు ఉపదేశమున ఐకారాంతము గాన దానికి లిడాద్యార్ధధాతుకములందు ఆత్వము వచ్చును. లిట్టునందు ప్రథమపురుషైకవచనమున ఆత్వము చేసిన పిమ్మట 'గ్లా + అ' అని యుండగా 'ణల్'కు ఔత్వము (సూ-491), ద్విత్వము, అభ్యాసకార్యము, గకారమునకు చుత్వముచే జకారము, ఆకారౌకారములకు వృద్ధి చేయగా 'జగ్లౌ'అను రూపము సిద్ధించినది. ఇతరరూపములు గూడ పాధాతులిడ్రూపముల వలె నుండును. గ్లాధాతువు అనిట్కము గాన 'లుట్' 'లృట్'లందు ఇడాగమము రాకుండుటచే 'గ్లాతా' 'గ్లాస్యతి' ఇత్యాదిరూపము లగును. లోట్, లఙ్, విధిలిఙ్‌లందు ఐకారశప్అకారములకు ఆయాదేశము వచ్చి 'గ్లాయతు' 'అగ్లాయత్' 'గ్లాయేత్'ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిఙ్‌నందు 'గ్లై యాత్' అని యుండగా నిత్యముగ ఆత్వము (సూ-496) వచ్చి 'గ్లాయాత్'అని యుండగా:-

497. వాన్యస్య సంయోగాదేః 6.4.68

ఘుమాస్థాదేరన్యస్య సంయోగాదేరాత ఏత్వం వార్ధధాతుకే కితి లిఙి.

ఈ సూత్రము 'ఘుమాస్థాగాపాజహాతిసాం హలి' అను సూత్రమునకు పిమ్మట వచ్చినది. కావున 'అన్యస్య' అనగా ఘుసంజ్ఞకధాత్వాదిభిన్న మని యర్థము. 'ఆర్ధధాతుకే' అని అధికారము. ఏర్లిఙి'అను సూత్రము, "అతోలోప ఇటిచ" "దీఙోయుడచిక్ఙితి" అను సూత్రములనుండి 'ఆతః' 'కితి' అను పదము లనువర్తించును. సంయోగాది యగు ఘుమాస్థాదిభిన్న ధాతువు ఆకారమునకు 'కిత్'అగు ఆర్ధధాతుక లిఙ్ పర మగునపుడు ఏత్వము వికల్పముగ వచ్చును ప్రకృతమున గ్లై ధాతువు సంయోగాది గాన దీని ఆకారమునకు, కిత్ అగు ఆశీర్లిఙ్ పరముగ నుండుటచే, ఏకారము వికల్పముగ వచ్చిన పక్షమున 'గ్లేయాత్ గ్లేయాస్తామ్ గ్లేయాసుః' ఇత్యాదిరూపములును, ఏకారము రాని పక్షమున 'గ్లాయాత్, గ్లాయాస్తామ్, గ్లాయాసుః' ఇత్యాదిరూపములును సిద్ధించును.

'లుఙ్'నందు ఆత్వము చేసిన పిమ్మట (సూ-496) "అగ్లాస్ ఈత్"అని యుండగా:-

498. యమరమనమాతాంసక్ చ 7.2.73

ఏషాం సక్ స్యాత్, ఏభ్యః సిచ ఇట్ స్యాత్ పరస్మైపదేషు. అగ్లాసీత్, అగ్లాస్యత్ హ్వౄ కౌటిల్యే. హ్వరతి.

ఈ సూత్రమునందలి 'చ'కారముచే "ఇడత్యర్తివ్యయతీనామ్" "స్తుసు ధూఞ్భ్యః పరస్మైపదేషు" "అఞ్చేః సిచి"అను సూత్రములనుండి 'ఇట్' 'పర స్మైపదేషు' 'సిచి' అను పదములు ఆకృష్టమగును. యమ్, రమ్, నమ్ ధాతు వులకును ఆకారాంతధాతువులకును 'సక్'అను నాదేశము వచ్చును. వీటి 'సిచ్'కు ఇడాగమము కూడ వచ్చును. 'సక్'లోని అకారకకారములు ఇత్సంజ్ఞకములు.

ఈ సూత్రముచే 'సక్ ఆదేశము కిత్తు గాన ధాతువునకు అంతావయవ ముగ వచ్చును. గ్లాధాతువు అనిడ్ధాతు వైనను ఈ సూత్రముచే ఇడాగమము విధింపబడినది గాన 'అగ్లాస్ ఇస్ ఈత్' అని యుండగా 'ఇట ఈటి' అను సూత్ర ముచే (448) 'సిచ్'సకారమునకు లోపము,- సవర్ణదీర్ఘము- 'అగ్లాసీత్' అను

రూపము సిద్ధించును. ప్రథమపురుషద్వివచనాదులందు కూడ 'సక్'ఇడాగమాదులు చేయుటచే 'అగ్లాసిష్టామ్' అగ్లాసిషుః' ఇత్యాదిరూపములు సిద్ధించును. 'ఝి'కి 'సిజభ్య స్తవిదిభ్యశ్చ' అను సూత్రముచే (421) జుసాదేశము. లృఙ్'నందు 'అగ్లాస్యత్' 'అగ్లాస్యతామ్' 'అగ్లాస్యన్' ఇత్యాదిరూపములు అగును. ప్రక్రియాదివిశేష మేదియును లేదు.

'హ్వౄ'ధాతువునకు కుటిల ప్రవర్తనము చేయుట అని అర్థము. 'లట్'నందు శప్ చేర్చిన పిమ్మట 'సార్వధాతుకార్ధధాతుకయోః'అను సూత్రముచే (390) గుణముచేయగా ('అర్'వచ్చి) 'హ్వారతి, హ్వారతః, హ్వారన్తి' ఇత్యాది రూపములు సిద్ధించును.

'లిట్'ప్రథమపురుషైకవచనమునందు 'తిప్'కు ణల్ ఆదేశము. ద్విత్వము (సూ-396); 'హ్వౄహ్వౄఅ', అభ్యాసకార్యము (సూ-398) 'హ్వౄ హ్వౄఅ'. 'ఉరత్' అను సూత్రముచే (475) ప్రథమఋవర్ణమునకు రపరమగు అకారము 'హర్ హ్వౄఅ' 'హలాదిఃశేషః' (సూ-398)చే రేఫలోపము. మొదటి హకారమునకు "కుహోశ్చుః''అను సూత్రముచే (456) చవర్గాదేశము. ఆంతరతమ్యముచే హకారమునకు మొదట ఝకారము; దానికి 'అభ్యాసే చర్చ' అను సూత్రముచే (401) జశ్త్వముచే జకారము. 'జహ్వౄ+అ', ఇపుడు ''అచో ఞ్ణితి'' అను సూత్రముచే(182)ఋకారమునకు వృద్ధి రావలసి యుండగా:-

499. *ఋతశ్చసంయోగాదేర్గుణః* 7.4.10

ఋదన్తస్య సంయోగాదేరఙ్గస్య గుణో లిటి. ఉపధాయా వృద్ధిః; జహ్వార, జహ్వరతుః, జహ్వరుః, జహ్వర్థ, జహ్వరథుః, జహ్వర, జహ్వార-జహ్వర, జహ్వరివ, జహ్వరిమ. హ్వర్తా.

'దయతేర్దిగి లిటి'నుండి 'లిటి'అనువర్తించును. ఋదంతమును సంయోగాదియు నగు అంగమునకు లిట్ పర మగునపుడు గుణము వచ్చును.

ఈ సూత్రముచే ఋకారమునకు గుణము చేయగా 'అర్' వచ్చుటచే 'జహ్వర్+అ' అని యుండగా ''అత ఉపధాయాః''అను సూత్రముచే (457)ఉపధావృద్ధి వచ్చుటచే 'జహ్వార' అను రూపము సిద్ధించినది. వాస్తవమున ఇచట 'అచో ఞ్ణితి'అను సూత్రముచే (182) వృద్ధి చేసినను 'జహ్వార' అను రూపము సిద్ధించును గాన మొదట గుణము చేసి, పిమ్మట ఉపధావృద్ధి చేయ వలసిన ఆవశ్యకత లేదు కాని'తిప్' 'సిప్''మిప్' భిన్నము లగు ప్రత్యయములు పర

మగునపుడు 'లిట్' కిత్ అగును గాన అచట "సార్వధాతుకార్ధధాతుకయోః"(390) అను గుణము రాకుండుటచే ఆ స్థలములందు గుణము వచ్చుటకై ఈ సూత్రము చెప్పబడినది. ఈ సూత్రము 'అచోఞ్ణితి' అను సూత్రమును గూడ బాధించును. అందుచే మొదట దానిచే గుణము చేసి పిమ్మట ఉపధావృద్ధి చేయవలసి వచ్చినది

'థల్'పర మగునపుడు, ఇది ఋదంతధాతువు గాన పాణినిమతమున 'అచస్తాస్వత్ థల్యనిటోనిత్యమ్' అను సూత్రముచేతను (482) భారద్వాజమతమున "ఋతోభారద్వాజస్య" అను సూత్రముచేతను (484) ఇడాగమము నిషిద్ధము గాన గుణము మాత్రము (సూ-499) చేయగా 'జహ్వర్థ' అను రూపము సిద్ధించినది. ఉత్తమపురుషైకవచనమున 'ణలుత్తమో వా'అను సూత్రముచే(458) ణిత్త్వము వైకల్పికము గాన ఉపధావృద్ధి వచ్చినపుడు 'జహ్వార' అనియు, గుణము మాత్రమే వచ్చినపుడు 'జహ్వర' అనియు రూపద్వయ ముండును. 'వ','మ'లు పర మగునపుడు క్రాదినియమముచే ఇడాగమము. పై సూత్రముచే గుణము చేయగా 'జహ్వరివ' 'జహ్వరిమ' అను రూపము లగును.

'హ్వౄ'ధాతువు అనుదాత్తధాతువు. ("ఊదృదన్తైః" అను శ్లోకము నందు పరిగణితము లగు ధాతువులలో చేరలేదు.) అందుచే 'లుట్'నందు 'తా' పర మగునపుడు ఇడాగమము నిషిద్ధము గాన (సూ-477) "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే (390) గుణము మాత్రము వచ్చి 'హ్వర్తా' 'హ్వర్తారౌ' 'హ్వర్తారః' ఇత్యాదిరూపము లగును.

లృట్‌నందు గూడ 'స్య' పర మగునపుడు పైన చూపిన విధముగ ఇడాగమనిషేధము ప్రవర్తించుచుండగా:-

500. ఋద్ధనోః స్యే 7.2.70

ఋతో హన్తేశ్చ స్యస్యేట్. హ్వరిష్యతి. హ్వరతు. అహ్వరత్, హ్వరేత్.

'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః'నుండి 'ఇట్'అనువర్తించును. హ్రస్వఋకారాంతధాతువునకును హనధాతువునకును పర మగు 'స్య' అనుదానికి ఇడాగమము వచ్చును.

ఈ సూత్రముచే 'స్య'కు ఇడాగమము, ఋకారమునకు గుణము (సూ-458) చేయగా 'హ్వరిష్యతి' ఇత్యాదిరూపము లగును.

'లోట్', 'లఙ్', 'విధిలిఙ్'లలో విశేషకార్యము లేవియు లేవు. 'ఆశీర్లిఙ్'నందు యాసుడాగమము చేసిన పిమ్మట 'హ్వృయాత్' అని యుండగా, 'కిదాశిషి' (434) అను సూత్రము ననుసరించి 'యాసుట్' 'కిత్' గాన 'క్ఙితి చ' అను సూత్రముచే (435) గుణము నిషేధింపబడినది గాన మరియొక గుణవిధాయకసూత్రము చెప్పబడుచున్నది.

## 501. గుణోఽర్తిసంయోగాద్యోః 7.4.29

అర్తేః సంయోగాదేః ఋదన్తస్య చ గుణః స్యాత్; యకి యాదావార్ధధాతుకే లిఙి చ. హ్వార్యాత్, అహ్వార్షీత్, అహ్వారిష్యత్. శ్రు శ్రవణే. 19.

'అఙ్గస్య' అధికారము. 'రీఙృతః'నుండి 'ఋతః' అనియు, 'రిఙ్శగ్లిఙ్క్షు'నుండి 'యకి' 'లిఙి' అనియు, 'అయఙ్ యి క్ఙితి' నుండి 'యి'అనియు అనువర్తించును. 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః'నుండి అసార్వధాతుకపదము అనువర్తించును. అనగా 'ఆర్ధధాతుకే' అని అర్థము. ఋధాతువునకును, సంయోగాది యగు ఋకారాంతధాతువునకును, యక్, యకారాదిఆర్ధధాతుకలిఙ్ పరముగ మన్నపుడు గుణము వచ్చును.

'లిఙాశిషి'అను సూత్రముచే (433) ఆశిర్లిఙ్ ఆర్ధధాతుకసంజ్ఞము గాన ఈ సూత్రముచే గుణము చేయగా 'హ్వార్యాత్' ఇత్యాదిరూపము లగును.

లుఙ్ ప్రథమపురుషైకవచనమున అడాగమము (సూ-425) ఇకారలోపము (సూ-426), చ్లి (సూ-439), సిచ్ (సూ-440), తకారమునకు ఈడాగమము (సూ-447) చేసిన పిమ్మట, 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రముచే (486) ఋకారమునకు వృద్ధియు (ఆర్) సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వము చేయగా 'అహ్వార్షీత్'అను రూపము సిద్ధించును. ద్వివచనాదులందు గూడ వెనుకటి వలెనే 'అహ్వార్ష్టామ్' 'అహ్వార్షుః' ఇత్యాదిరూపము లగును.

లృఙ్నందు 'ఋద్ధనోః స్యే' అను సూత్రముచె (500) ఇడాగమము వచ్చి 'అహ్వారిష్యత్' ఇత్యాదిరూపము లగును.

502. శ్రువః శృ చ 3.1.74

శ్రువః శృ ఇత్యాదేశః స్యాత్; శ్నుప్రత్యయశ్చ. శృణోతి.

శ్రుధాతువునకు వినుట అని అర్థము.

చకారముచే 'స్వాదిభ్యః శ్నుః'అను సూత్రమునందలి 'శ్నుః' అనునది అనువర్తించును. శ్రుధాతువునకు 'శృ'అనునాదేశము 'శ్ను'ప్రత్యయము కూడ వచ్చును.

ఈ శ్నుప్రత్యయము 'శప్'కు అపవాదముగ విధింపబడినది గాన ఈ 'శ్ను'ప్రత్యయ'శృ'ఆదేశములు 'శప్'వచ్చుటకు అవకాశము గల లట్, లోట్, లఙ్, విధిలిఙ్‌లందు మాత్రమే వచ్చును. శ్నుప్రత్యయమునందలి శకారము ఇత్సంజ్ఞకము గాన ఇది సార్వధాతుకసంజ్ఞకము.'లట్'ప్రథమపురుషైకవచనమున 'శ్రు + తి' అని యుండగా శప్‌ను బాధించి ఈ సూత్రముచే 'శ్ను'ప్రత్యయము, ధాతువునకు 'శృ'ఆదేశము. 'శృ ను తి'అని యుండగా నకారోత్తరవర్తి యగు ఉకారమునకు 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రముచే (390) గుణము- 'శృనోతి'; 'ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్' అను వార్తికముచే నకారమునకు ణకారము- 'శృణోతి'. రాబోవు సూత్రముచే (503) 'శ్ను' ప్రత్యయమునకు ఙిద్వద్భావము చెప్పబడ నున్నది గాన అది 'ఙిత్'వంటి దగుటచే 'సార్వధాతుకార్ధధాతుకయోః'అను సూత్రముచే (390) 'ఋ'కారమునకు రావలసి యున్న గుణము "క్ఙితి చ" అను సూత్రముచే (435) నిషేధింపబడినది.

503. సార్వధాతుకమపిత్ 1.2.4

అపిత్ సార్వధాతుకం ఙిద్వత్. శృణుతః.

'గాఙ్కుటాదిభ్యో ఞ్ణిన్ఙిత్'నుండి 'ఙిత్'అనువర్తించును. వాస్తవమున ఙకారేత్కము కానిది ఙిత్తు కాజాలదు గాన ఙిత్తు అగును అనగా 'ఙిత్'వంటిది అగు నని అర్థము.

పకారేత్కము కాని సార్వధాతుకము ఙిత్‌వంటి దగును. ఇచట 'శ్ను' అనునది సార్వధాతుకము. కాని పకారేత్కము కాదు. అందుచే దానికి ఈ సూత్రముచే ఙిద్వద్భావము వచ్చును గాన ఋకారమునకు గుణము రాదు. ప్రథమపురుషద్వివచనప్రత్యయము లగు 'తస్'మొదలగునవి కూడ అపిత్సార్వధాతుకము లగుటచే ఙిద్వద్భావము వచ్చి నకారోత్తరవర్తి ఉకారమునకు గుణము రాదు. అందుచే గుణరహితము లగు 'శృణుతః'ఇత్యాదిరూపము లగును.

ప్రథమపురుషబహువచనమున 'ఝి'కి అన్తాదేశము (సూ-391) చేసిన పిమ్మట 'శృణు అ న్తి' అని యుండగా 'అ న్తి' అనునది అపిత్సార్వధాతుకము గాన జిద్వద్భావముచే గుణము రాదు. ఇక ''అచి శ్నుధాతుభ్రువాం య్వోరియ జువజౌ''అను సూత్రముచే (199) ఉవజాదేశము రావలసి యుండ:-

504. హుశ్నువోః సార్వధాతుకే 6.4.87

హ్ను శ్నువోరనేకాచోఽసంయోగపూర్వస్యోవర్ణస్య యణ్ స్యాదచి సార్వధాతుకే. శృణ్వన్తి, శృణోషి, శృణుథః, శృణుథ, శృణోమి.

'ఇణో యణ్'నుండి 'యణ్'అనుపదము, ''అచిశ్నుధాతుభ్రువాంయ్వోరియజువజౌ''నుండి 'అచి' అను పదము, ''ఏరనేకాచోఽసంయోగపూర్వస్య'' నుండి 'అనేకాచః' ''అసంయోగపూర్వస్య''అను పదములు, 'ఓః సుపి'నుండి 'ఓః'అను పదము అనువర్తించును. హుధాతువుయొక్కయు, అనేకాచ్క మగు 'శ్ను'ప్రత్యయాంతాంగము యొక్కయు అసంయోగపూర్వక మగు ఉవర్ణమునకు అజాదిసార్వధాతుకము పర మగునపుడు 'యణ్'వచ్చును.

ఇచట 'శృణు' అనునది శ్నుప్రత్యయాంత మగు అనేకాచ్కాంగము. దీని వెనుక సంయోగము లేదు. అ న్తి అను అజాదిసార్వధాతుకము పరముగ నున్నది. అందుచే యణాదేశము చేయగా 'శృణ్వన్తి' అను రూపము సిద్ధించినది. శృణోషి-'శృణోతి' యందు వలెనే ప్రక్రియ యుండును. 'శృణుథః శృణుథ:- 'థస్', 'థ'లు అపిత్సార్వధాతుకములు గాన జిద్వద్భావముచే ఉకారమునకు గుణము రాలేదు. 'శ్ను'కూడ అపిత్సార్వధాతుక మగుటచే జిద్వద్భావముచే ఋకారమునకు గుణము రాలేదు. 'శృణోమి' యందు కూడ 'శృణోతి' యందు వలెనే ప్రక్రియ యుండును.

'వస్' 'మస్'లు పర మగునపుడు 'శృ'ఆదేశశ్నుప్రత్యయాదులు చేసిన పిమ్మట 'శృణువస్' 'శృణుమస్'అని యుండగా:-

505. లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః 6.4.107

అసంయోగపూర్వస్య ప్రత్యయోకారస్య లోపో వా మ్వోః పరయోః.

శృణ్వః, శృణువః, శృణ్మః, శృణుమః. శుశ్రావ, శుశ్రువతుః, శుశ్రువుః, శుశ్రోథ, శుశ్రువథుః, శుశ్రువ; శుశ్రావ-శుశ్రవ; శుశ్రువ,

శుశ్రుమ. శ్రోతా. శ్రోష్యతి, శృణోతు - శృణుతాత్, శృణుతామ్, శృణ్వన్తు.

ఈ సూత్రము "ఉతశ్చప్రత్యయాదసంయోగపూర్వాత్"అను సూత్రము తరువాత వచ్చుచున్నది గాన 'అస్య' అను పదము ఉకారమును పరామర్శించు చున్నది. 'అఙ్గస్య'అధికారము. ప్రత్యయావయవము, అసంయోగపూర్వము నగు ఉకారము అంతమునందు గల అంగమునకు మకారవకారములు పరముగ నున్న పుడు వికల్పముగ లోపము వచ్చును.

'అలోఽన్త్యస్య'అను సూత్రము(21)ననుసరించి ఈ లోపము అంగమునకు అంతమునం దున్న ఉకారమునకు వచ్చును. ఈ సూత్రముచే లోపము వైకల్పికము గాన శృణ్వః, శృణువః; శృణ్మః, శృణుమః అను రూపద్వయము సిద్ధించును.

'శృ'ఆదేశశ్నుప్రత్యయములు సార్వధాతుకములందే వచ్చును గాన లిట్టు నందు రావు. ప్రథమపురుషైకవచనమున తిప్, ణలాదేశ, ద్విత్వ, అభ్యాసకార్య, వృద్ధి, ఆవాదేశములచే 'శుశ్రావ' అను రూపము సిద్ధించును. ద్వివచనబహు వచనములందు "అచిశ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ"అను సూత్రముచే (199) ఉవఙాదేశము చేయగా 'శుశ్రువతుః' 'శుశ్రువుః'అను రూపములగును.

"కృసృభృవృస్తుద్రుస్రుశ్రువో లిటి"అను సూత్రముచే (481) శ్రుధాతువునకు లిట్టునందు ఇడాగమము నిషేధింపబడినది గాన 'థల్' పర మగునపుడు గుణముచే 'శుశ్రోథ' అను రూప మగును. 'థల్'పిత్ గాన "సార్వధాతుకమపిత్"అను సూత్రముచే (503) ఙిద్వద్భావము లేదు. ఉత్తమపురుషైకవచనమున "ణలుత్తమో వా" అను సూత్రముచే (458) ణిత్త్వము వైకల్పికము గాన వృద్ధి, గుణ, ఆవాదేశ, అవాదేశములచే 'శుశ్రావ' 'శుశ్రవ'అను రూపద్వయము సిద్ధించును. ఇతరస్థలములందు ఉవఙాదేశము. లుట్, లృట్టులందు 'తాస్' 'స్య' ప్రత్యయములు చేర్చిన పిమ్మట 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రముచే (390) గుణము. 'శ్రోతా, శ్రోష్యతి' ఇత్యాదిరూపము లగును.

'శృణోతు', శృణుతాత్':- లోట్టునందు 'శప్'ను బాధించి శ్నుప్రత్యయము. 'శృ'ఆదేశము వచ్చును ప్రథమపురుషైకవచనమున 'తిప్', 'పిత్' గాన ఙిద్వద్భావము లేకుండుటచే, ఉకారమునకు గుణము చేయగా 'శృణోతు'

అనియు 'తాతఙ్' ఙిత్తు గాన గుణము నిషిద్ధమగుటచే 'శృణుతాత్' అనియు రూపద్వయము సిద్ధించును.

శృణుతామ్:. 'తస్'అపిత్సార్వధాతుకము గాన ఙిద్వద్భావముచే గుణ నిషేధము. బహువచనమున ఉవఙాదేశమును బాధించి 'హుశ్నువోః సార్వ ధాతుకే'అను సూత్రముచే (504) యణ్‌వచ్చుటచే "శృణ్వన్తు" అను రూపము సిద్ధించును.

మధ్యమపురుషైకవచనమున 'శ్ను'ప్రత్యయ 'శృ'ఆదేశములు చేసిన పిమ్మట 'శృణుసిప్'అని యుండగా 'సిప్'కు 'హి' ఆదేశము (సూ-417) 'శృణుహి'అని యుండగా:-

506. ఉతశ్చ ప్రత్యయాదసంయోగపూర్వాత్ 6.4.106

అసంయోగపూర్వాత్ ప్రత్యయాత్ ఉతో హేర్లుక్. శృణు, శృణు తాత్, శృణుతమ్, శృణుత.

'అతో హేః' 'చిణో లుక్'అను సూత్రములనుండి 'హేః' 'లుక్'అను వర్తించును. సంయోగము పూర్వమునందు లేనిదియు ప్రత్యయావయవమును అగు ఉకారముకంటె పరమైన 'హి'కి లుక్ వచ్చును.

ఈ సూత్రముచే 'హి'లోపింపగా 'శృణు' అను రూపము సిద్ధించును. ద్వివచనబహువచనములందు అపిత్సార్వధాతుకము గాన ఙిద్వద్భావముచే గుణ నిషేధము. 'శృణుతమ్' 'శృణుత'అను రూపములు సిద్ధించును.

గుణావాదేశౌ- శృణవాని శృణవావ, శృణవామ.

అశృణోత్ - అశృణుతామ్ - అశృణ్వన్

అశృణోః - అశృణుతమ్- అశృణుత

అశృణవమ్ - అశృణ్వ, అశృణువ- అశృణ్మ, అశృణుమ.

శృణుయాత్ - శృణుయాతామ్ - శృణుయుః

శృణుయాః - శృణుయాతమ్ - శృణుయాత

శృణుయామ్ - శృణుయావ - శృణుయామ.

శ్రూయాత్. అశ్రౌషీత్. అశ్రోష్యత్. గమ్లగతౌ 20.

లోట్ ఉత్తమపురుషైకవచనమున 'మేర్నిః' అను సూత్రముచే (419) 'మి'కి 'ని'ఆదేశము. 'ఆడుత్తమస్య పిచ్చ'అను సూత్రముచే (420) ఆడాగమము. ఈ ఆడాగమమునకు పిత్త్వము కూడ అతిదిష్టమైనది గాన 'వ' 'మ' లకు గూడ "సార్వధాతుకమపిత్"అను సూత్రముచే (503) జిద్వద్భావము లేదు గాన ఉత్తమపురుషరూపములం దన్నిటియందును "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే (390) గుణము అవాదేశము చేయుటచే శృణవాని, శృణవావ, శృణవామ'అను రూపములు సిద్ధించును.

అశృణోత్:- లజ్ ప్రథమపురుషైకవచనమున గుణము చేయగా 'అశృణోత్'అను రూపము: 'అశృణుతామ్':- ద్వివచనమున జిద్వద్భావము ండుటచే గుణము నిషిద్ధము. 'అశృణ్వన్':- బహువచనమున 'హుశ్నువోః సార్వధాతుకే'అను సూత్రముచే (504) యణ్ వచ్చినది. అశృణోః 'సిప్' పకారేత్కమగుటచే జిద్వద్భావము లేదు గాన గుణము. సకారమునకు రుత్వవిసర్గలు. అశృణవమ్:- ఉత్తమపురుషైకవచనమున 'మిప్'స్థానమున వచ్చిన 'అమ్' పకారేత్కము గాన జిద్వద్భావగుణనిషేధములు లేకుండుటచే గుణావాదేశములు చేయగా 'అశృణవమ్' అను రూపము. ద్వివచనబహువచనములందు "లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః" అను సూత్రముచే (505) ఉకారలోపము వైకల్పికము గాన "అశృణ్వ, అశృణువ;" 'అశృణ్మ;' అశృణుమ' అను రూపద్వయము.

'విధిలిజ్'నందు "యాసుట్ పరస్మైపదేషూదాత్తో జిచ్చ"అను సూత్రముచే (428) విహిత మగు 'యాసుట్' జిత్తు గాన గుణము రాకుండుటచే 'శృణుయాత్' ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిజ్‌నందు "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః"అను సూత్రముచే (485) దీర్ఘము "శ్రూయాత్. శ్రూయాస్తామ్, శ్రూయాసుః" ఇత్యాదిరూపము లగును

లృజ్‌నందు "సిచి వృద్ధిః పరస్మైపదేషు" అను సూత్రముచే (486) వృద్ధి చేయగా "అశ్రౌషీత్- అశ్రౌష్టామ్-, అశ్రౌషుః; అశ్రౌషీః-అశ్రౌష్టమ్- అశ్రౌష్ట, అశ్రౌషమ్- అశ్రౌష్వ- అశ్రౌష్మ" అను రూపము లగును.

'లృఙ్'నందు విశేషకార్యము లేవియు లేవు. "అశ్రోష్యత్', 'అశ్రోష్యతామ్', 'అశ్రోష్యన్' ఇత్యాదిరూపము లుండును.

గమ్‌ధాతువునకు నడచుట, వెళ్ళుట అని అర్థము.

507. ఇషు,గమి,యమాం ఛః 7.3.77

ఏషాం ఛః స్యాత్ శితి. గచ్ఛతి. జగామ.

'ష్ఠివుక్లమిచమాం శితి'నుండి 'శితి'అనువర్తించును. 'ఇష్', 'గమ్', 'యమ్'ధాతువులకు 'శిత్'అగు ప్రత్యయము పరమగునపుడు ఛకారము వచ్చును

గమ్‌ధాతువునకు 'లట్'నందు 'శప్'చేర్చిన పిదప 'శప్' శిత్తు గాన ఈ సూత్రముచే ఛకారము. 'అలోన్త్యస్య'అను సూత్రముచే (21) అంత్యమగు మకారమునకు ఆదేశముగ వచ్చును. 'గఛ్అతి' అని యుండగా "ఛే చ" అను సూత్రముచే (101) గకారోత్తరవర్తి యగు అకారమునకు తుగాగమము. పిమ్మట ఆ తకారమునకు శ్చుత్వముచే చకారము. 'గచ్ఛతి' అను రూపము సిద్ధించును. ఇతరరూపములందు గూడ ప్రక్రియ ఈ విధముగనే ఉండును. లిట్టునందు ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాసకార్యచుత్వఉపధావృద్ధులచే 'జగామ' అను రూపము సిద్ధించినది. ద్వివచనబహువచనములందు "జగమ్అతుస్" 'జగమ్ఉస్'అని యుండగా:-

508. గమ, హన, జన, ఖన, ఘసాం, లోపః, క్ఙిత్యనఙి 6.4.98

ఏషాముపధాయా లోపోఽజాదౌ క్ఙితి, న త్వఙి. జగ్మతుః, జగ్ముః. జగమిథ-జగన్థ, జగ్మథుః, జగ్మ, జగామ - జగమ, జగ్మివ, జగ్మిమ. గన్తా.

"ఊదుపధాయా గోహః"నుండి 'ఉపధాయాః'అనువర్తించును. 'అఙ్గస్య' అధికారము. 'అచిశ్నుధాతుభ్రువాంయ్వోరియఙువఙౌ'నుండి అనువర్తించిన 'అచి' అనుదానిని అఙ్గాక్షిప్తమగు "ప్రత్యయే" అనుదానికి విశేషణముగ చేయుటచే 'అజాదౌ ప్రత్యయే'అని లభించినది. గమ్, హస్, జన్, ఖన్, ఘస్ ధాతువుల ఉపధకు 'అఙ్'భిన్నమగు 'కిత్' లేక 'ఙిత్' అగు అజాదిప్రత్యయము పరమగునపుడు లోపము వచ్చును.

'అసంయోగాల్లిట్‌కిత్' అను సూత్రముచే పిద్భిన్నము లగు లిడాదేశము లన్నియు కిత్తులు గాన ఇచట అజాదులును, కిత్తులును అగు 'అతుస్' 'ఉస్'లు

పరముగ నుండుటచే 'జగమ్'లోని ఉపధ యగు గకారో త్తరవర్తి అకారమునకు లోపము. 'జగ్మతుః' 'జగ్ముః'అను రూపములు సిద్ధించినవి. 'థల్'పర మగు నపుడు- 'ఉపదేశేత్వతః'అను సూత్రముచే (483) భారద్వాజనియమము ననుసరించి ఇడ్వికల్పము. 'ఇట్' వచ్చిన పక్షమున 'జగమిథ' అనియు; రాని పక్షమున 'జగమ్థ' అని యుండగా, ''నశ్చాపదాన్తస్య ఝలి''అను సూత్రముచే (78) మకారమునకు అనుస్వారము, దానికి ''అనుస్వారస్య యయి పరసవర్ణః'' అను సూత్రముచే (79) పరసవర్ణ మగు నకారము వచ్చుటచే 'జగన్థ' అను రూపము సిద్ధించును. ద్వివచనబహువచనములందు ఉపధాలోపము. ఉత్తమపురుషైకవచనమునందు 'ణలుత్తమో వా'అను సూత్రముచే (458) ణిత్త్వవికల్పము గాన వృద్ధిభావాభావములచే 'జగామ' 'జగమ'అను రూపద్వయము సిద్ధించును. వ, మ,లు పర మగునపుడు క్రాదినియమమునే ఇడాగమము నిత్యముగ వచ్చును. ఇవి కూడ 'అసంయోగాల్లిట్ కిత్'అను సూత్రముచే (454) కిత్తులు గాన ఉపధాలోపముచే 'జగ్మివ' 'జగ్మిమ'అను రూపములు సిద్ధించినవి. లుట్‌నందు 'ఇట్' రాదు గాన 'గన్తా' 'గన్తారౌ' 'గన్తారః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

### 509. *గమేరిట్ పరస్మైపదేషు* 7.2.58

గమేః పరస్య సాదేరార్ధధాతుకస్య 'ఇట్' స్యాత్ పరస్మైపదేషు. గమిష్యతి. గచ్ఛతు. అగచ్ఛత్. గచ్ఛేత్. గమ్యాత్

'సేఽసిచి, కృత, చృత, ఛృద, తృద, నృతః' నుండి 'సే', ''ఆర్ధధాతుకస్యేడ్వలాదేః''నుండి 'ఆర్ధధాతుకస్య' అనువర్తించును. గమ్‌ధాతువుకంటె పరమైన సకారాది యగు ఆర్ధధాతుకమునకు, పరస్మైపదమునందు ఇడాగమము వచ్చును

ల్ఋట్‌నందు 'స్య'అనునది సకారాది యగు ఆర్ధధాతుకము గాన, దానికి ఈ సూత్రముచే ఇడాగమము చేయగా 'గమిష్యతి' ఇత్యాదిరూపము లగును. సార్వధాతుకము లగు లోట్, లఙ్, విధిలిఙ్ లందు ఛత్వ, తుగాగమ, శ్చుత్వములచే 'గచ్ఛతు' ''అగచ్ఛత్'' 'గచ్ఛేత్'ఇత్యాదిరూపము లగును. ఆశీర్లిఙ్‌నందు 'శప్' లేదు గాన ఛత్వము రాదు. యాసుడాగమము చేయగా 'గమ్యాత్' 'గమ్యాస్తామ్' 'గమ్యాసుః'ఇత్యాదిరూపములు సిద్ధించును.

510. పుషాదిద్యుతాద్య్లృదితః పరస్మైపదేషు 3.1.55

శ్యన్వికరణపుషాదేః, ద్యుతాదేః, ఌదితశ్చ పరస్య చ్లేరఙ్ పరస్మైపదేషు. అగమత్. అగమిష్యత్.

ఇతి పరస్మైపదినః.

'చ్లేః సిచ్'నుండి 'చ్లేః' "అస్యతి, వక్తి, ఖ్యాతిభ్యోఽఙ్"నుండి 'అఙ్' అనువర్తించును. శ్యన్వికరణమునందలి పుషాదిధాతువులకంటెను, ద్యుతాదిధాతువులకంటెను, 'ఌకారము ఇత్సంజ్ఞకముగా గల ధాతువులకంటెను పర మగు 'చ్లి'కి పరస్మైపదములందు 'అఙ్' ఆదేశముగ వచ్చును.

లుఙ్నందు 'చ్లి'ప్రత్యయము చేసిన పిమ్మట 'చ్లేః సిచ్' అను సూత్రముచే (440) సిజాగమము రావలసి యుండగా, 'గమ్'ధాతువు ఌకారేత్కము గాన, 'సిచ్'ను బాధించి 'అఙ్' వచ్చుటచే "అగమ్ + అ + త్" 'అగమత్' 'అగమతామ్,' 'అగమన్' ఇత్యాదిరూపములు నిష్పన్న మైనవి.

'లృఙ్'నందు "గమేరిట్ పరస్మైపదేషు" అను సూత్రముచే (509) ఇడాగమము చేయగా "అగమిష్యత్" ఇత్యాదిరూపము లగును.

ఇంతవరకును భ్వాదిగణములోని కొన్ని పరస్మైపదధాతువులు చెప్పబడినవి.

అథ ఆత్మనేపదినో ధాతవః.

ఏధ వృద్ధౌ. 1.

'ఏధ'ధాతువుకు వృద్ధి పొందుట అని అర్థము. ఏధధాతువునందలి అకారము అనుదాత్తము, ఇత్సంజ్ఞకము. అందుచే "అనుదాత్తఙిత ఆత్మనేపదం" అను సూత్రముచే (381) దానికి ఆత్మనేపదప్రత్యయములు చేర్చబడును. 'తిప్, తస్, ఝి—' సూత్రమునందలి (377) 'త'మొదలు 'మహిఙ్' వరకును గల తొమ్మిది ప్రత్యయములను "తఙానావాత్మనేపదమ్"అను సూత్రముచే (379) ఆత్మనేపద సంజ్ఞకములు.

లట్ప్రథమపురుషైకవచనమున లకారమునకు 'త'ప్రత్యయము. 'శప్' చేర్చిన పిదప 'ఏధ్ అ త' అని యుండగా:-

511. టిత ఆత్మనేపదానాం టేరే 3.4.79

టితో లస్యాత్మనేపదానాం టేరేత్వమ్. ఏధతే.

టితః, ఆత్మనేపదానాం, టేః. ఏ 'లస్య'అని అధికారము. "ఆదేశానామ్"అని అధ్యాహారము టిత్ అగు లకారమునకు ఆదేశముగ వచ్చిన ఆత్మనేపదప్రత్యయముల 'టి'కి ఏకారము వచ్చును.

ఇచట 'త'టిత్తగు లట్స్థానమున వచ్చిన ఆత్మనేపదప్రత్యయము గాన దాని 'టి'అగు అకారమునకు ('అచోన్త్యాది టి'-39). ఏత్వము చేయగా 'ఏధతే' అను రూపము సిద్ధించినది.

ద్వివచనమున 'ఏధ ఆతామ్'అని యుండగా 'ఆమ్'అనునది టిసంజ్ఞకము గాన దానికి ఏత్వము చేయగా 'ఏధ ఆతే' అని యున్నది. 'ఆతామ్'అనుదానికి 'సార్వధాతుకమపిత్'అను సూత్రముచే (503) ఙిద్వద్భావ మున్నది. ఇట్లుండగా-

## 512. ఆతో ఙితః 7.2.81

అతః పరస్య ఙితామాకారస్య ఇయ్ స్యాత్. ఏధేతే. ఏధన్తే.

"అతోయేయః"నుండి 'అతః' 'ఇయః' అనువర్తించును. హ్రస్వ మగు అకారముకంటె పరమును, ఙిత్ అగు ప్రత్యయమునకు అవయవమును అగు ఆకారమునకు 'ఇయ్' అను నాదేశము వచ్చును

ఈ సూత్రముచే 'ఆతే'లోని అకారమునకు 'ఇయ్'ఆదేశము చేయగా 'ఏధ – ఇయ్తే'—గుణము—ఏధేయ్తే – "లోపోవ్యోర్వలి"అను సూత్రముచే (431) యకారలోపము—"ఏధేతే"అను రూపము సిద్ధించును. బహువచనమున 'ఝోఽన్తః'అను సూత్రముచే (391) ఝకారమునకు అన్తాదేశము, అకారమునకు ఏత్వము (సూ-511) చేయగా 'ఏధన్తే'అను రూపము సిద్ధించును.

మధ్యమపురుషైకవచనమునందు 'ఏధథాస్' అని యుండగా:-

## 513. థాసః సే 3.4.80

టితో లస్య థాసః సే స్యాత్. ఏధసే, ఏధేథే, ఏధధ్వే, 'అతో గుణే'—ఏధే, ఏధావహే. ఏధామహే.

'లస్య'అధికారము. 'టిత ఆత్మనేపదానాం టేరే'నుండి 'టితః'అను వర్తించును. 'టిత్'అగు లకారము స్థానమున వచ్చిన 'థాస్'కు 'సే'ఆదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'సే'ఆదేశము వచ్చి 'ఏధసే'అను రూపము సిద్ధించినది. ద్వివచనమున 'ఏధ+ఆథామ్' అని యుండగా 'టి'సంజ్ఞకముగు 'ఆమ్'కు

ఏత్వము. ఏధఆథే, ఆకారమునకు ఇయ్, గుణము, యకారలోపము చేయగా "ఏధేథే" అను రూపము సిద్ధించినది. బహువచనమున —'ఏధ + ధ్వమ్'. టిసంజ్ఞక మగు 'అమ్'కు ఏత్వము చేయుటచే 'ఏధధ్వే' అను రూపము సిద్ధించును.

ఉత్తమపురుషైకవచనమున 'ఏధ + ఇ(ట్)'అని యుండగా ఇకారమునకు ఏత్వము (సూ-511)— 'ఏధ + ఏ'అని యుండగా "అతోగుణే" అను సూత్రముచే (274) పరరూపము- 'ఏధే' అను రూపము నిష్పన్న మగును. ద్వివచనబహువచనములందు 'ఏధ + వహి' "ఏధమహి"అని యుండగా ఇకారమునకు ఏత్వము- 'ఏధవహే' "ఏధమహే"- 'అతో దీర్ఘో యఞి' అను సూత్రముచే (392) ధకారోత్తరవర్తి యగు- అకారమునకు దీర్ఘము. "ఏధావహే" "ఏధామహే" అను రూపములు సిద్ధించినవి.

514. ఇజాదేశ్చ గురుమతోఽనృచ్ఛః 3.1.36

ఇజాదిర్యో ధాతుర్గురుమాన్ ఋచ్ఛత్యన్యః తతః ఆమ్ స్యాల్లిటి.

"ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్" నుండి 'ధాతోః' అనుపదము, "కాస్ప్రత్యయాదామమన్త్రే లిటి"నుండి 'ఆమ్' 'లిటి' అను పదములను అనువర్తించును. ఇచ్ ఆదియందు కలదియు, గురువు కలదియు ఋచ్ఛ ధాతుభిన్నమైనదియు అగు ధాతువునకు 'లిట్' పర మగునపుడు 'ఆమ్' ప్రత్యయము వచ్చును.

ఇచట 'ఏధ్'ధాతువునకు ఏకారరూప మగు 'ఇచ్'ఆదియం దున్నది. ఏకారము గురువర్ణము గాన ఈ ధాతువు 'గురుమత్'. కావున దీనికి 'లిట్'నందు 'ఆమ్' వచ్చినది. 'ఆమ్' వచ్చిన పిమ్మట 'ఆమః' అను సూత్రముచే (473) ఆమ్‌కంటె పర మగు 'లిట్'కు లోపము. 'ఏధామ్'అని యుండగా "కృఞ్చాను ప్రయుజ్యతే లిటి"అను సూత్రముచే (474) లిట్‌పరకము లగు కృ, భూ, అస్, ధాతువులు అనుప్రయుక్తము లగును. అందు 'కృఞ్' ధాతువు 'ఞిత్'గాన 'స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే"అను సూత్రముచే (381) క్రియాఫలము కర్తకు చెందునపుడు మాత్ర మే ఆత్మనేపదము వచ్చును. పరునకు చెందునపుడు పరస్మైపదము వచ్చును. కావున ఈ అనుప్రయుక్తకృఞ్ధాతువునకు ఆత్మనేపదమే కాక పరస్మైపదము కూడ రావలసి యుండ నియమవిధాయకసూత్రము చెప్పబడుచున్నది:-

515. ఆమ్ప్రత్యయవత్ కృఞోఽనుప్రయోగస్య 1.3.63

ఆమ్ప్రత్యయో యస్మాదితి అతద్గుణసంవిజ్ఞానో బహువ్రీహిః, ఆమ్ప్రకృత్యా తుల్యమనుప్రయుజ్యమానాత్ కృఞోప్యాత్మనేపదమ్.

"అనుదాత్తఙితఆత్మనేపదమ్"నుండి 'ఆత్మనేపదమ్' అనువర్తించును. 'ఆమ్ప్రత్యయవత్' అనుదానికి "ఆమ్ప్రత్యయః యస్మాత్ సః ఆమ్ప్రత్యయః-ఆమ్ప్రత్యయస్యేవ ఆమ్ప్రత్యయవత్" అని విగ్రహము. దేనికంటె పరముగ ఆమ్ప్రత్యయము చేర్చబడినదో దానివలె అని అర్థము.

అనుప్రయుక్త మగు కృఞ్'ధాతువునకు, ఆమ్ప్రత్యయము ఏ ధాతువునకు చేర్చబడినదో ఆ ధాతువునకు వలె ఆత్మనేపదము వచ్చును. అనగా ఆమ్ప్రత్యయము చేర్చిన ప్రకృతిధాతువు ఏ పదమునందు (ఆత్మనేపదము గాని పరస్మైపదము గాని) ఉండునో అనుప్రయుక్త మగు కృధాతువు కూడ ఆ పదమునందు మాత్రమే ప్రయోగింపబడును అను భావార్థమును గ్రహింపవలెను. అందుచేతనే 'గుపూ'ధాతువు పరస్మైపదధాతువు గాన 'గోపాయాఞ్చకార'ఇత్యాది పరస్మైపదరూపములు మాత్రమే ఉన్నవి గాని 'గోపాయాఞ్చక్రే'ఇత్యాదిఆత్మనేపదరూపము లుండవు.

ప్రకృతమున ఆమ్ప్రత్యయము 'ఏధ'ధాతువుకు చేర్చబడినది గాన ఇది ప్రకృతిధాతువు. ఇది ఆత్మనేపదమునందున్నది కావున అనుప్రయుక్త మగు కృధాతువు కూడ ఆత్మనేపదమునందు మాత్రమే ప్రయోగింపబడును.

తద్గుణసంవిజ్ఞానము, అతద్గుణసంవిజ్ఞానము అని బహువ్రీహి రెండు విధములు. బహువ్రీహియందు సాధారణముగ అన్యపదార్థము ప్రధానముగ నుండును. ప్రయుక్తము లగు పదముల అర్థము దానికి విశేషణముగ నుండును. ప్రధాన మగు అన్యపదార్థముతో పాటు దానికి విశేషణములుగ నున్న ప్రయుక్త పదార్థములకు గూడ క్రియాన్వయ మున్నచో తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి యని పేరు. వాటికా విధముగ క్రియాన్వయము లేకున్నచో అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. "తస్య- ప్రధానీభూతస్య అన్యపదార్థస్య, గుణాః- విశేషణాని, సంవిజ్ఞాయన్తే- క్రియాన్వయితయా జ్ఞాయన్తే, యత్ర సః తద్గుణసంవిజ్ఞానః బహువ్రీహిః, తద్భిన్నః అతద్గుణసంవిజ్ఞానః," ఉదాహరణమునకు:- 'పీతామ్బరం ఆనయ' అనునపుడు "పీతవస్త్రమును ధరించిన వ్యక్తిని తీసికొనిరమ్ము" అని అర్థము. పీతాంబరమును ధరించిన వ్యక్తిని (అన్యపదార్థము) తీసికొని వచ్చ

నపుడు ఆతనికి విశేషణముగ నున్న- అనగా సంబంధించి యున్న- పీతవస్త్రము కూడ, ఆతనితో పాటు తీసికొని రాబడుచున్నది. ఈ విధముగ విశేషణభూత మగు పీతవస్త్రమునకు గూడ ఆనయనక్రియతో సంబంధ మున్నది గాన ఇచట "పీతామ్బరమ్" అనునది తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. ఇట్లే "చిత్రగుం ఆనయ" -అనగా చిత్రవర్ణములగు గోవులు కలవానిని తీసికొని రమ్ము- అనునపుడు ఆ వ్యక్తియే తీసికొనిరాబడును, గోవులు తీసికొని రాబడవు. అవి వాని ఇంటివద్దనే యుండును. ఈ విధము లగు పురుషవిశేషణభూతము లగు గోవులకు ఆనయ క్రియతో సంబంధము లేదు గాన 'చిత్రగుం' అనునది అతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి.

ప్రకృతసూత్రమునందలి 'ఆమ్ప్రత్యయ' అనునది అతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి. ఆమ్ప్రత్యయము దేనికంటె పరముగ వచ్చునో ఆ ధాతువు అన్య పదార్థము. ఆ ధాతువునకు మాత్రమే 'ఆత్మనేపదము వచ్చుట'అను క్రియతో సంబంధ మున్నది గాని దానికి విశేషణభూత మగు 'ఆమ్'ప్రత్యయమునకులేదు. ఏలయనగా, 'ఆమ్'ప్రత్యయము చేర్చిన పిదప కృఞ్'మొదలగు ధాతువులు అను ప్రయుక్తము లగుటకు అవకాశ మున్నది కాని ఆమ్ప్రత్యయమునకు ఆత్మనే పదపరస్మైపదములను చేర్చు ప్రసక్తి లేదు. ఈ అర్థమే స్పష్టముగ తెలియు టకు వృత్తిలో 'ఆమ్ప్రకృత్యా'- అనగా ఆమ్అను ప్రత్యయమునకు ఏ ధాతువు ప్రకృతియో దానితో- అని అర్థము వ్రాయబడినది. ఈ విధముగ ఇచట కృధా తువు కేవలము ఆత్మనేపదమునందు మాత్రమే ప్రయుక్త మగు నని ఫలితార్థము

'లిట్'ప్రథమపురుషైకవచనమున 'ఏధామ్ కృ త' అని యుండగా:-

516. లిటస్తఝయోరేశిరేచ్ 3.4.81

లిడాదేశయోస్తఝయోః 'ఏశ్' 'ఇరేచ్' ఏతౌ స్తః.

ఏధాఞ్చక్రే, ఏధాఞ్చక్రాతే, ఏధాఞ్చక్రిరే, ఏధాఞ్చకృషే, ఏధా ఞ్చక్రాథే.

లిట్టుకు ఆదేశముగ వచ్చిన 'త' 'ఝ'లకు క్రమముగ 'ఏశ్' 'ఇరేచ్' అను ఆదేశములు వచ్చును;

'ఏశ్'లోని శకారము ఇత్సంజ్ఞకము. శిత్తుగాన సర్వాదేశముగ వచ్చును. 'ఏధామ్ కృ ఏ'అని యుండగా ద్విత్వము (సూ-396); ఋకారమునకు అకారము (సూ-475), చుత్వము (సూ-456), యణ్, 'మోనుస్వారః' అను

సూత్రముచే (77) మకారమునకు అనుస్వారము. "అనుస్వారస్య యయి పరసవర్ణః" అను సూత్రముచే (79) పరసవర్ణ మగు ఞకారము, 'ఏధాఞ్చక్రే' అను రూపము సిద్ధించును. ద్వివచనమునందు 'ఏధామ్కృఆమ్' అని యుండగా ద్విత్వాదికార్యములు చేసిన పిమ్మట 'టి'యగు 'ఆమ్'కు ఏత్వము వచ్చి 'ఏధాఞ్చక్రాతే'అను రూపము సిద్ధించినది. ఇట్లే 'ఇరేచ్'అనునది. 'అనేకాల్' గాన 'ఝ'కు సర్వాదేశముగ వచ్చును. 'ఏధాఞ్చక్రిరే' అను రూపము సిద్ధించును.

మధ్యమపురుషైకవచనమున 'ఏధాఞ్చకృథాస్'అని యుండగా 'థాస్'కు 'సే'ఆదేశము (సూ-513). 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వము. 'కృ, సృ, భృ, వృ, స్తు, ద్రు, స్రు, శ్రువో, లిటి'అను సూత్రముచే (481) ఇడాగమము నిషిద్ధము. "ఏధాఞ్చకృషే"అను రూపము సిద్ధించినది. మధ్యమపురుషద్వివచనమున "ఏధాఞ్చకృఆథామ్"అని యుండగా 'ఆమ్కు' ఏత్వము (సూ-511) "ఏధాఞ్చక్రాథే" అను రూపము సిద్ధించినది. బహువచనమున ఏత్వము చేసిన పిమ్మట "ఏధాఞ్చకృధ్వే" అని యుండగా:-

517. ఇణః షీధ్వంలుఙ్లిటాంధోఽఙ్గాత్ 8.3.78

ఇణ్ణన్తాదఙ్గాత్పరేషాం షీధ్వంలుఙ్లిటాం ధస్య ఢః స్యాత్. ఏధాఞ్చకృఢ్వే. ఏధాఞ్చక్రే. ఏధాఞ్చకృవహే. ఏధాఞ్చకృమహే. ఏధామ్బభూవ. ఏధామాస. ఏధితా, ఏధితారౌ, ఏధితారః, ఏధితాసే, ఏధితాసాథే.

'అపదాన్తస్య. మూర్ధన్యః'అని అధికారము. ఇణ్ణంత మగు అంగము కంటె పర మగు షీధ్వమ్, లుఙ్, లిట్టుల ధకారమునకు మూర్ధన్యమగు ఢకారము ఆదేశ మగును.

ఘోషసంవారనాదమహాప్రాణప్రయత్నసామ్యముచే ధకారమునకు ఆదేశముగ రావలసిన మూర్ధన్యము ఢకారము. ఈ సూత్రముచే 'ధ్వే'యందలి ధకారమునకు ఢకారము ఆదేశ మగుటచే "ఏధాఞ్చకృఢ్వే"అను రూపము సిద్ధించును.

ఉత్తమపురుషైకవచనమున 'ఇట్'కు ఏకారము, యణాదేశము. 'ఏధాఞ్చక్రే'అను రూపము సిద్ధించినది. 'వహి', 'మహి'లకుఏత్వము. 'ఏధాఞ్చకృవహే' 'ఏధాఞ్చకృమహే' అను రూపములు సిద్ధించినవి.

'అసంయోగాల్లిట్కిత్'అను సూత్రముచే (454) లిట్ కిత్తు గాన ఎచ్చటను గుణము రాలేదు.

'భూ' 'అస్'ధాతువులు అనుప్రయుక్తము లైనపుడు 'ఏధామ్బభూవ' 'ఏధామాస' ఇత్యాదిరూపము లగును.

'లుట్' ప్రథమపురుషయందు పరస్మైపదధాతువులకు వలెనే 'తాస్' ప్రత్యయము (సూ-405) 'లుటః ప్రథమస్య డారౌరసః' అను సూత్రముచే (407) 'డా', 'రౌ', 'రస్'అను నాదేశములును, 'తాస్'కు ఇడాగమము చేయగా 'ఏధితా, ఏధితారౌ, ఏధితారః' అను రూపము లగును. మధ్యమపురుషైకవచనమున 'ఏధితాస్ థాస్'అవి యుండగా 'థాస్'కు 'థాసః సే' అను సూత్రముచే (513) 'సే'ఆదేశము. 'ఏధితాస్ సే'- 'తాసస్త్యోర్లోపః' అను సూత్రముచే (408) సకార లోపము- 'ఏధితాసే' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'ఆథామ్'లోని 'ఆమ్'కు ఏత్వము (సూ-511) 'ఏధితాసాథే' అను రూపము. బహువచనమున 'ధ్వమ్'లోని 'అమ్'కు ఏత్వము చేసిన పిమ్మట ఏధితాస్ధ్వే' అని యుండగా:-

518. ధి చ 8.2.25

ధాదౌ ప్రత్యయే పరే సస్యలోపః. ఏధితాధ్వే.

'అఙ్గస్య'అధికారము. 'తాసస్త్యోర్లోపః' "సః స్యార్ధధాతుకే" అను సూత్రములనుండి 'లోపః' 'సః'అను పదములు అనువర్తించును. అఙ్గసంజ్ఞచే 'ప్రత్యయే'అనునది ఆక్షిప్తము. ధకారాదిప్రత్యయము పర మగునపుడు సకారమునకు లోపము కల్గును.

ఈ సూత్రముచే సకారము లోపింప 'ఏధితాధ్వే' అను రూపము సిద్ధించినది.

ఉత్తమపురుషైకవచనమున 'ఏధితాస్ ఇ' అని యుండగా ఇకామునకు ఏకారము- 'ఏధితాస్ఏ':-

519. హ ఏతి 7.4.52

తాసస్త్యోః సస్య హః స్యాదేతి పరే. ఏధితాహే. ఏధితాస్వహే, ఏధితాస్మహే. ఏధిష్యతే, ఏధిష్యేతే, ఏధిష్యన్తే; ఏధిష్యసే, ఏధిష్యేథే, ఏధిష్యధ్వే; ఏధిష్యే, ఏధిష్యావహే, ఏధిష్యామహే.

'సః స్యార్ధధాతుకే', "తాసస్త్యోర్లోపః" అను సూత్రములనుండి 'సః' "తాసస్త్యోః" అనువర్తించును. ఏకారము పరముగ నున్నపుడు 'తాస్'అస్ధాతువుల సకారమునకు హకార మాదేశముగ వచ్చును

ఈ సూత్రముచే సకారమునకు హకారము చేయగా "ఏధితాహే" అను రూప మగును. 'వహి' 'మహి'ల ఇకారమునకు ఏత్వము "ఏధితాస్వహే, ఏధితాస్మహే" అను రూపము లగును.

ల్‌ృట్‌నందు "స్యతాసీ లృలుటోః"అను సూత్రముచే (405) 'స్య'ప్రత్యయము, దానికి ఇడాగమము. మిగిలిన ప్రక్రియ యంతయు లట్‌నందు వలె ఉండును.

'లోట్'ప్రథమపురుషయందు లట్టునందు వలె ఏత్వాదులు చేసిన పిమ్మట 'ఏధతే' "ఏధేతే", "ఏధన్తే" అని యుండగా:-

520. ఆమేతః 3.4.90

లోట ఏకారస్య ఆమ్ స్యాత్. ఏధతామ్, ఏధేతామ్, ఏధన్తామ్.

'లోటో లఙ్వత్' నుండి 'లోటః'అనువర్తించును. లోట్టుకు సంబంధించిన ఏకారమునకు 'ఆమ్'వచ్చును.

ఈ సూత్రముచే పై రూపముల ఏకారమునకు 'ఆమ్'చేయగా "ఏధతామ్ ఏధేతామ్, ఏధన్తామ్" అను రూపము లగును.

మధ్యమపురుషైకవచనమున "ఏధథాస్" అని యుండగా 'థాస్'కు 'సే' ఆదేశము సూ-(513) 'ఏధసే' అని యుండగా:-

521. సవాభ్యాం వామౌ 3.4.91

సవాభ్యాం పరస్య లోడేతః క్రమాత్ వామౌ స్తః. ఏధస్వ. ఏధేథామ్, ఏధధ్వమ్.

'లోటో లఙ్వత్' 'ఆమేతః'అను సూత్రములనుండి 'లోటః', 'ఏతః' అనువర్తించును. సకారవకారములకంటె పర మగు 'లోట్'ఏకారమునకు క్రమముగ 'వ', 'అమ్'అనునవి ఆదేశముగ వచ్చును.

ఇది 'ఆమేతః'అనుదానికి అపవాదము.

ఈ సూత్రముచే ఏకారమునకు 'వ'అను నాదేశము రాగా 'ఏధస్వ'అను రూప మగును. ద్వివచనమున లట్టునందు వలె ఏత్వాదులచే 'ఏధేథే' అను రూపము నిష్పన్న మైన పిమ్మట 'ఆమేతః' అను సూత్రముచే (520) 'ఆమ్' ఆదేశము రాగా 'ఏధేథామ్' అను రూపము సిద్ధించినది. బహువచనమున

'ఏధధ్వే' అని యుండగా ఇచటి ఏకారము వకారమునకుపరము గాన 'అమ్' ఆదేశముచే 'ఏధధ్వమ్' అను రూపము.

ఉత్తమపురుషలో ఏత్వాదులచే లట్టునందు వలె "ఏధే, ఏధావహే, ఏధామహే" అని యుండగా:-

## 522. ఏత ఐ 3.4.93

లోడుత్తమస్య ఏతః ఐ స్యాత్.

ఏధై, ఏధావహై, ఏధామహై. 'ఆటశ్చ'— ఐధత, ఐధేతామ్, ఐధన్త; ఐధథాః, ఐధేథామ్, ఐధధ్వమ్; ఐధే, ఐధావహి, ఐధామహి.

'లోటో లఙ్వత్' 'ఆడుత్తమస్యపిచ్చ' అను సూత్రములనుండి 'లోటః' "ఉత్తమస్య" అనువర్తించును. లోడుత్తమపురుషకు సంబంధించిన ఏకారమునకు ఐకారము వచ్చును. ఇది 'ఆమేతః'అను సూత్రమునకు అపవాదము.

ఈ సూత్రముచే ఐకారము చేయగా "ఏధై, ఏధావహై, ఏధామహై" అను రూపము లగును.

ఏధధాతువు అజాదిధాతువు గాన లఙ్లనందు 'ఆడజాదీనామ్'అను సూత్రముచే (446) 'ఆట్'ఆగమము. 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధి— 'ఐధత' ఇత్యాదిరూపము లగును. ప్రథమమధ్యమపురుషద్వివచనములందు లట్టునందు వలె 'ఇఙ్' గుణ, యకారలోపాదులచే 'ఐధేతామ్' "ఐధేథామ్" అను రూపములు సిద్ధించును. 'వహి', 'మహి'లు పర మగునపుడు "అతో దీర్ఘో యఞి"అను సూత్రముచే (381) అకారమునకు దీర్ఘము. 'ఐధావహి' "ఐధామహి"అను రూపము లగును. ఇతరరూపములందు విశేషకార్యము లేవియు లేవు.

## 523. లిఙః సీయుట్ 3.4.102

లిఙాత్మనేపదస్య సీయుడాగమః స్యాత్.

సలోపః- ఏధేత, ఏధేయాతామ్.

లిఙ్స్థానమున వచ్చిన అత్మనేపదప్రత్యయములకు 'సేయుట్'అను ఆగమము వచ్చును.

'సీయుట్'లో 'ఉట్' ఇత్సంజ్ఞకము. 'విధిలిఙ్'ప్రథమపురుషైకవచనమున 'త'కు సీయుడాగమము; 'శప్'ప్రత్యయము వచ్చిన పిమ్మట 'ఏధ సీఇ్ త' అని యుండగా 'లిఙస్సలోపోఽనన్త్యస్య' అను సూత్రముచే (429) సకారము

నకు లోపము. అకారఈకారములకు గుణము- 'ఏధేయ్ త' అని యుండగా "లోపో వ్యోర్వలి" అను సూత్రముచే (431) యకారలోపము- 'ఏధేత' అను రూపము సిద్ధించును. ద్వివచనమున 'సీయుట్', సకారలోపగుణములచే 'ఏధేయాతామ్' అను రూపము. బహువచనము సీయుడాగమసలోపగుణాదులు చేసిన పిమ్మట 'ఏధేయ్ ఝ'అని యుండగా:-

524. ఝస్య రన్ 3.4.105

లిఙో ఝస్య రన్స్యాత్. ఏధేరన్. ఏధేథాః, ఏధేయాథామ్. ఏధేధ్వమ్.

"లిఙః సీయుట్"నుండి 'లిఙః'అనువర్తించును. లిఙ్గుయొక్క 'ఝ'కు 'రన్'అను ఆదేశము వచ్చును. 'ఏధేయ్ రన్ అని యుండగా "లోపో వ్యోర్వలి"అను సూత్రముచే (431) యకారమునకు లోపము. 'ఏధేరన్'అను రూపము సిద్ధించును.

మధ్యమపురుషయందు గూడ సీయుడాగమ, సకారలోప, గుణములు వచ్చును. 'థాస్' 'ధ్వమ్'లు పర మగునపుడు మాత్రము యకారలోపము కూడ వచ్చును. ఏధేథాః, ఏధేయాథామ్, ఏధేధ్వమ్ అను రూపములు సిద్ధించును.

ఉత్తమపురుషైకవచనమున సీయుడాగమాదులు చేసిన పిమ్మట 'ఏధేయ్ ఇ'అని యుండగా:-

525. ఇటోఽత్ 3.4.106

లిఙాదేశస్య ఇటోఽత్ స్యాత్. ఏధేయ- ఏధేవహి, ఏధేమహి.

'లిఙః సీయుట్'నుండి 'లిఙః'అనువర్తించును. లిఙాదేశ మగు 'ఇట్'కు హ్రస్వ మగు అకారము ఆదేశముగ వచ్చును.

ఇకారమునకు అకారము ఆదేశ మగుటచే 'ఏధేయ' అను రూపము సిద్ధించును. 'వహి' 'మహి'లు పర మగునపుడు సీయుడాగమ, సకారలోప, గుణ, యకారలోపములచే 'ఏధేవహి' 'ఏధేమహి' అను రూపములుసిద్ధించును.

526. సుట్ తిథోః 3.4.107

లిఙస్తథోః సుట్. యలోపః; ఆర్ధధాతుకత్వాత్ సలోపో న. ఏధిషీష్ట, ఏధిషీయాస్తామ్, ఏధిషీరన్; ఏధిషీష్ఠాః, ఏధిషీయాస్థామ్, ఏధిషీధ్వమ్; ఏధిషీయ, ఏధిషీవహి, ఏధిషీమహి. ఐధిష్ట, ఐధిషాతామ్.

'లిజః సీయుట్'నుండి 'లిజః'అనువర్తించును. లిఙ్యొక్క తకారథకారములకు 'సుట్' ఆగమము వచ్చును.

ఆశీర్లిఙ్ఙనందు సీయుడాగమ చేసిన పిమ్మట "ఏధ్ సీయ్ త" అని యుండగా ఆర్ధధాతుకము గాన 'సీయుట్'కు ఇడాగమము. 'ఏధ్ ఇసీయ్ త' అని యుండగా, ఈ సూత్రముచే తకారమునకు 'సుట్'(స్) ఆగమము. 'ఏధి సీయ్ స్త' అని యున్నది. ఆశీర్లిఙ్ ఆర్ధధాతుకము గాన 'లిజః సలోపో న న్త్యస్య' అను సూత్రముచే (429) సకారములకు లోపము రాదు. 'లోపో వ్యోర్వలి'అను సూత్రముచే (431) యకారలోపము. ఇచట నున్న రెండు సకారములును 'ఇణ్'కంటె పరముగ నున్న ప్రత్యయావయవసకారములు గాన 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము. తకారమునకు ష్టుత్వముచే టకారము. 'ఏధిషీష్ట'అను రూపము సిద్ధించును. (పై సూత్రముచే సుడాగమము విధిలిఙ్ఙనందు కూడ ప్రవర్తించును కాని"లిజస్సలోపోన న్త్యస్య"అను సూత్రముచే (429)ఆ సకారము లోపించును గాన విధిలిఙ్ఙనందు చూపబడలేదు). ద్వివచనమున సీయుట్, ఇడాగమ, సుడాగమ, షత్వములచే 'ఏధిషీయాస్తామ్'అనియు, బహువచనమున 'ఝ'కు 'రన్' ఆదేశము చేసిన పిమ్మట (సూ-524) యకారలోపముచే 'ఏధిషీరన్' అను రూపమును అగును. మధ్యమపురుషైకవచనమున 'థాస్'నందలి థకారమునకు సుడాగమము, షత్వము, ష్టుత్వముచే థకారమునకు ఠకారము చేయగా 'ఏధిషీష్ఠాః'అను రూపము సిద్ధించినది. ద్వివచవమునందు కూడ వెనుకటి వలెనే సీయుట్, ఇడాగమ సుడాగమములు వచ్చి 'ఏధిషీయాస్థామ్'అను రూప మగును. 'ఏధిషీధ్వమ్':- ఇచట "ఇణః షీధ్వం లుఙ్ లిటాం ధోఒఙ్గాత్"అను సూత్రముచే (517) 'ధ్వమ్'లోని ధకారమునకు ఢకారము వచ్చుటకు అవకాశము లేదు. 'షీధ్వమ్' అనునది 'ఇణ్'కంటె పరముగ నున్నది కాని ఇణ్ణంతాంగముకంటె పరముగ లేదు. ఇచట 'సీయుట్' అనునది ఏధధాతువుకు చేర్చబడినది. కావున ఇచట 'షీధ్వమ్' అనగా "యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్య న్తే" అను న్యాయముచే 'ఇషీధ్వమ్'అను ఇడాగమసహిత మగునదియే గ్రహింపబడును. 'ఏధ్'అనునది మాత్రమే అంగము. కావున ధకారమునకు ఢత్వము రాదు.

'ఏధిషీయ':- 'ఏధ్ ఇసీయ్ఇ' అని యుండగా సకారమునకు 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము. 'ఇటోఒత్' అను సూత్రముచే (525) చివరి ఇకారమునకు అత్వము.

ఐధిష్ట:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున ఆడాగమము (సూ-446), వృద్ధి (సూ-197) చ్లి, సిచ్, ఇడాగమ, షత్వష్టుత్వములు. ద్వివచనమునందు కూడ షత్వమువరకును గల కార్యములు పై విధముగనే వచ్చును.

ప్రథమపురుషబహువచనమున 'ఐధిష్ ఝ' అని యుండగా:-

## 527. ఆత్మనేపదేష్వనతః 7.1.5

అనకారాత్ పరస్య ఆత్మనేపదేషు ఝస్య 'అత్' ఇత్యాదేశః స్యాత్. ఐధిషత; ఐధిష్ఠాః, ఐధిషాథామ్, ఐధిఢ్వమ్; ఐధిషి, ఐధిష్వహి, ఐధిష్మహి. ఐధిష్యత, ఐధిష్యేతామ్, ఐధిష్యన్త, ఐధిష్యథాః, ఐధిష్యేథామ్, ఐధిష్యధ్వమ్; ఐధిష్యే, ఐధిష్యావహి, ఐధిష్యామహి. కము కాన్తౌ. 2.

'ఝోన్తః'నుండి 'ఝః' 'అదభ్యస్తాత్'నుండి 'అత్', అనువర్తించును. అకారభిన్న మగుదానికంటె పర మగు ఆత్మనేపదావయవ మైన ఝకారమునకు 'అత్'అను ఆదేశము వచ్చును.

ఇచట ఝకారము షకారముకంటె పరముగ నున్నది గాన "అత్"ఆదేశముగ వచ్చుటచే 'ఐధిషత' అను రూపము సిద్ధించినది.

ఐధిష్ఠాః:- ఇచట 'థాస్' లోని థకారమునకు ష్టుత్వముచే ఠకారము.

ఐధిఢ్వమ్:- ఆడాగమ, వృద్ధి, చ్లి, సిచ్, ఇడాగమములు చేసిన పిమ్మట మధ్యమపురుషబహువచనమున 'ఐధ్ ఇస్ ధ్వమ్'అని యుండగా 'ధి చ' అను సూత్రముచే (518) సకారలోపము. 'ధ్వమ్'అను ప్రత్యయము పర మగునపుడు 'సిచ్'సహిత మగు ధాతువునకే అంగసంజ్ఞ గాన ఇచట ఏధి అనునది ఇణ్ణంతాంగము లభించినది. దానికంటె పర మగు ధకారమునకు "ఇణః షీధ్వం లుఙ్ లిటాం ధోఽఙ్గాత్"అను సూత్రముచే (517) ఢత్వము, 'ఐధిఢ్వమ్'అను రూపము సిద్ధించినది. ఉత్తమపురుషరూపములలో విశేషకార్యము లేవియు లేవు.

ల్ఋఙ్ నందు ప్రక్రియ ల్ఋట్ నందు వలె ఉండును. 'ల్ఋఙ్' టిత్తు కాదు గాన 'టి'కి ఏత్వము (సూ-511) రాదు. ఆడాగమవృద్ధులు అధికము.

'కమ్'ధాతువునకు ఇచ్ఛ యని అర్థము.

## 528. కమేర్ణిఙ్ 3.1.30

స్వార్థే. ఙిత్త్వాత్ తఙ్—కామయతే,

కమ్ధాతువునకు 'ణిఙ్'ప్రత్యయము వచ్చును. విశేషార్థ మేదియు నిర్దే శింపబడలేదు గాన ఈ ణిఙ్ ప్రత్యయము స్వార్థమునందు వచ్చును.

'ణిఙ్'లోని ణకారఙకారములు ఇత్సంజ్ఞకములు. ఇకారము మాత్రము మిగులును. కముధాతువునకు దానిని చేర్చగా 'కమ్ + ఇ'అని యుండును. 'అత ఉపధాయాః' అను సూత్రముచే (457) ఉపధావృద్ధి. ఇపుడు 'కామి' అనునది "సనాద్యన్తాధాతవః'అను సూత్రముచే (470) ధాతుసంజ్ఞకము. ఇది ఙిత్తు గాన 'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' అను సూత్రముచే (381) ఆత్మనేపదప్రత్యయ ములు చేర్చబడును. ప్రథమపురుషైకవచనమున 'త'ప్రత్యయ, శప్, అను చేర్చిన పిమ్మట గుణఅయాదేశములు. 'త'యందలి 'టి'కి ఏత్వము (సూ-511). ''కామయతే" అను రూపము సిద్ధించును. ఈ విధముగనే ఇతర రూపములు గూడ ఏధధాతువునందు వలె నిష్పన్న మగును.

## 529. అయ్ఆమన్తాల్వాయ్యేత్న్విష్ణుషు 6.4.55

ఆమ్, అన్త, ఆలు, ఆయ్య, ఇత్ను, ఇష్ణు ఏషుణేరయాదేశః స్యాత్. కామయాఞ్చక్రే. 'అయాదయ' ఇతి ణిఙ్ వా. చకమే, చక మాతే, చకమిరే; చకమిషే, చకమాథే, చకమిధ్వే; చకమే; చకమి వహే, చకమిమహే. కామయితా - కమితా; కామయితాసే. కామయి ష్యతే - కమిష్యతే. కామయతామ్, అకామయత, కామయేత. కామ యిషీష్ట.

'ణేరనిటి'నుండి 'ణేః' అనువర్తించును. ఆమ్, అన్త, ఆలు; ఆయ్య, ఇత్ను, ఇష్ణు, అను ప్రత్యయములు పరముగ నున్నపుడు ణికి అయాదేశము వచ్చును.

లిట్టునందు ణిఙ్ప్రత్యయయోపధావృద్ధులు చేసిన పిమ్మట 'కామి లిట్' అని యుండగా ''కాస్యనేకాచ ఆమ్వక్తవ్యః'' అను వార్తికముచే (సూ-471). 'ఆమ్' ఆదేశము. 'ఆమః' అను సూత్రముచే (473) లిట్‌కు లోపము. పై సూత్రముచే 'ణి'కిఅయాదేశము. 'కామయ్ఆమ్'అని యుండగా 'కృఞ్చానుప్ర యుజ్యతే లిటి' అను సూత్రముచే (474). లిట్పరక, కృఞ్, భూ, అస్, ధాతు వుల అనుప్రయోగముచే "కామయాఞ్చక్రే" "కామయామ్బభూవ, కామ యామాస" ఇత్యాదిరూపములు ఏధధాతువునందు వలె నిష్పన్న మగును.

'ఆయాదయ ఆర్ధధాతుకే వా' అను సూత్రముచే (471) ఆర్ధధాతుకము పర మగునపుడు 'ణిజ్' వికల్పముగ వచ్చును గాన, అది రాని పక్షమున "చకమే" ఇత్యాది రూపములు సిద్ధించును. 'కమ్' ధాతువు సేట్ గాన ఆర్ధ ధాతుకము లన్నిటియందును ఇడాగమము వచ్చును. లిట్టునందు 'ఏశ్' ఇరేచ్, ఏత్వాదులు కృధాతువునందు వలె వచ్చును.

లుట్, ల్ఋట్లందు కూడ 'ణిజ్' వికల్పముచే "కామయితా"- 'కమితా' - 'కామయిష్యతే'-'కమిష్యతే' ఇత్యాది రూపద్వయములు సిద్ధించును. సార్వ ధాతుకములందు ణిజ్ నిత్యముగ వచ్చును గాన లోట్, లజ్. విధి లిజ్లందు 'కామయతామ్', 'అకామయత', కామయేత' ఇత్యాది రూపము లగును. విశేషకార్యము లేవియు లేవు.

ఆశీర్లిజ్నందు ణిజ్వికల్పముచే 'కామయిషీష్ట' "కమిషీష్ట" ఇత్యాది రూపము లగును. ప్రక్రియ ఏధధాతువునందు వలె నుండును. 'ధ్వమ్' పర మగునపుడు మాత్రము విశేషకార్యము చెప్పబడుచున్నది.

530. విభాషేటః 8.3.79

ఇణః పరో య ఇట్ తతః పరేషాం షీధ్వం లుజ్లిటాం ధస్య వా ఢః. కామయిషీఢ్వమ్ - కామయిషీధ్వమ్. కమిషీష్ట, కమిషీధ్వమ్.

'ఇణః షీధ్వంలుజ్లిటాం ధోఽజ్గాత్' నుండి 'ఇణః', 'షీధ్వంలుజ్లిటామ్' అను పదములును, 'అపదాన్తస్య మూర్ధన్యః' నుండి 'మూర్ధన్యః' అను పదము అనువర్తించును. ఇణ్కంటె పరమగు 'ఇట్'కంటె పరమైన 'షీధ్వం', 'లుజ్', 'లిట్'లకు సంబంధించిన ధకారమునకు వికల్పముగ మూర్ధన్యాదేశము (ఢత్వము) వచ్చును. దానిచే వైకల్పిక ఢత్వము చేయగా "కామయిషీఢ్వమ్ - కామయిషీధ్వమ్" అను రూపద్వయ ముండును. 'ణిజ్' రాని పక్షమున 'ఏధిషీధ్వమ్' వలె 'కమిషీధ్వమ్' అను ఢత్వరహిత రూపము మాత్రమే యుండును,

లుజ్నందు ణిజ్ ఆదేశము చేసిన పక్షమున 'కామి లుజ్' అని యుండగా 'చ్లి లుజ్' అను సూత్రముచే 'చ్లి' ఆదేశము. 'కామి చ్లి లుజ్' అని యుండగా.

351. ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరి చఙ్. 3.1.48

ణ్యన్తాత్ శ్ర్యాదిభ్యశ్చ చ్లేశ్చఙ్ స్యాత్ కర్త్రర్థే లుఙి పరే. 'కామి అ త' ఇతి స్థితే.

'చ్లిలుఙి' 'చ్లేః సిచ్' అను సూత్రములనుండి 'లుఙి' 'చ్లేః' అనువర్తించును. కర్త్రర్థక మగు 'లుఙ్' పర మగు నపుడు ణ్యంతధాతువుల కంటెను, శ్రి ద్రు, స్రు ధాతువుల కంటెను 'చ్లి'కి 'చఙ్' అను ఆదేశము వచ్చును.

'చఙ్' లోని చకార ఙకారములు ఇత్సంజ్ఞకములు. ప్రథమపురుషైక వచనమున అడాగమము చేసిన పిమ్మట 'అకామి అ త' అని యుండగా :-

532. ణేరనిటి 6.4.51

అనిడాదావార్ధధాతుకే పరే ణేర్లోపః స్యాత్,

'ఆర్ధధాతుకే' అని అధికారము. 'అతో లోపః' నుండి 'లోపః' అను వర్తించును. 'ఇట్' ఆదియందు లేని ఆర్ధధాతుకము పరముగ నున్నపుడు 'ణి'కి లోపము వచ్చును.

ఇచట ఆర్ధధాతుక మగు 'అ' (చఙ్) పరముగ నున్నది గాన 'ణి'కి (ఇకారమునకు) లోపము ''అకామ్ అ త'' అని యుండగా :-

533. ణౌచఙ్యుపధాయా హ్రస్వః. 7.4. 1.

చఙ్పరే ణౌ యదఙ్గం తస్యోపధాయా హ్రస్వః స్యాత్.

'చఙ్' పరమునందు గల ణి ప్రత్యయమునకు ఏది అంగమో దాని ఉపధకు హ్రస్వము వచ్చును.

ఇచట 'కామ్' అనునది చఙ్పరక మగు 'ణి'కి అంగము గాన దీని ఉపధా ఆకారమునకు హ్రస్వము- 'అకమ్అత' అని యుండగా :-

534. చఙి. 6.1 11

చఙి పరే అనభ్యాసస్య ధాత్వవయవస్యైకాచః ప్రథమస్య ద్వే స్తః, అజాదేర్ద్వితీయస్య.

'ఏకాచో ద్వే ప్రథమస్య' 'అజాదేర్ద్వితీయస్య' అని అధికారము. 'లిటి ధాతో రనభ్యాసస్య' నుండి 'ధాతోః' ''అనభ్యాసస్య'' అనువర్తించును. 'చఙ్'

పర మగునపుడు అభ్యాసము లేని — అనగా ద్విత్వము చేయని - ధాతువునకు అవయవ మైన ఏకాచ్క మగు మొదటి సముదాయమునకు ద్విత్వము వచ్చును. అజాదిధాతువైనచో దాని ఏకాచ్క మగు ద్వితీయ సముదాయమునకు ద్విత్వము వచ్చును.

ఇచట 'కమ్' అనునది వ్యపదేశివ ద్భావముచే ఏకాచ్క మగు ప్రథమ సముదాయము. దానికి 'చఙ్' పరముగ నున్నది గాన దీనికి ద్విత్వము "అకమ్ కమ్ అ త" అని యుండగా 'హలాదిః శేషః' అను సూత్రముచే (398) అభ్యాస మకార లోపము. 'కుహోశ్చుః' అను సూత్రముచే (456) చుత్వము- "అచకమ్ అ త" అని యుండగా :-

535. సన్వల్లఘుని చఙ్పరేఽనగ్లోపే 7. 4. 93

చఙ్పరే ణౌ యదఙ్గం తస్య యోఽభ్యాసః లఘుపరః తస్య సనీవ కార్యం స్యాత్, ణౌ వగ్లోపేఽసతి.

'చఙ్' పరముగా గల 'ణి' ప్రత్యయమునకు ఏ అంగము గలదో, దాని లఘుపర మగు ఏ అభ్యాసము ఉన్నదో దానికి, 'సన్' ప్రత్యయము పర ముగ నున్నయెడల ఏ కార్యము వచ్చునో ఆ కార్యము (సన్వద్భావము)వచ్చును, కాని 'ణి' నిమిత్తక మగు అగ్లోపము ('అక్'కు లోపము) వచ్చినచో ఈ సన్వ ద్భావము రాదు.

ఇచట 'అచకమ్ అ త' అనునపుడు స్థానివద్భావముచే చఙ్ పరక మగు ణి ఉన్నది. దాని అంగము 'చకమ్' అనునది. దాని అభ్యాసము 'చ'. ఇదిలఘు పరకము. (దీనికి పరమున నున్న 'క' అనునది లఘువగు అకారముతో కూడి వది గాన లఘువుగ పరిగణింపబడును). ఇచట 'ణి'ని నిమిత్తముగ చేసికొని 'అక్'కు లోప మేమియు చేసి యుండలేదు. అందుచే ఈ సూత్రముచే సన్వ ద్భావము వచ్చును. కావున రాబోవు సూత్రములచే ఇత్వదీర్ఘములు వచ్చును.

536. సన్యతః 7. 4. 79

అభ్యాసస్యాతః ఇత్స్యాత్ సని.

'అత్రలోపోఽభ్యాసస్య' 'భృఞామిత్' అను సూత్రములనుండి 'అభ్యా సస్య' 'ఇత్' అను పదము అనువర్తించును. 'సన్' పరముగా నున్నపుడు హ్రస్వ అకారమునకు హ్రస్వ ఇకారము వచ్చును.

537. దీర్ఘో లఘోః 7.4.94

లఘోరభ్యాసస్య దీర్ఘః స్యాత్ సన్వద్భావవిషయే. అచీకమత.

ణిజభావపక్షే:- అత్ర లోపోఽభ్యాసస్య నుండి 'అభ్యాసస్య' అనియు "సన్వల్లఘుని చఙ్పరేఽనగ్లోపే" నుండి 'లఘుని' 'చఙ్పరే', 'అనగ్లోపే' అను పదములను అనువర్తించును. దీని ఫలితార్థము-

సన్వద్భావ విషయమున - అనగా, సన్వద్భావము వచ్చెడు స్థలమున- లఘువైన అభ్యాసమునకు దీర్ఘము వచ్చును.

ప్రకృతమున 'అచకమత' అనునపుడు అభ్యాస అకారమునకు ఇత్వ, దీర్ఘములు వచ్చి 'అచీకమత' అను రూపము సిద్ధించినది. ఇతర రూపము లందు గూడ 'అచీకమ్' వరకు ప్రక్రియ ఇట్లే యుండును. ఏధధాతువునందు వలె అచీకమత, అచీకమేతామ్, అచీకమన్త; అచీకమథాః, అచీకమేథామ్; అచీకమధ్వమ్. అచీకమే, అచీకమావహి, అచీకమామహి'' అను రూపము లుండును.

'ఆయాదయ ఆర్ధధాతుకే వా' అను సూత్రము (471) ననుసరించి 'ణిఙ్' వైకల్పికము గాన అది రాని పక్షమున 'ణిశ్రి' సూత్రముచే (531) 'చ్లి' కి 'చఙ్' వచ్చుటకు అవకాశము లేదు గాన వార్తికము చెప్పబడుచున్నది-

నాకమేశ్చ్లేశ్చఙ్ వాచ్యః

అచకమత. అయ గతౌ. 3. అయతే

కమ్ధాతువుకు సంబంధించిన 'చ్లి'కి చఙ్ వచ్చు నని చెప్పవలెను. ఈ వార్తికముచే 'చఙ్' వచ్చిన పిమ్మట 'చఙి' అను సూత్రముచే (534) ద్విత్వము. అభ్యాసకార్యచుత్వములచే 'అచకమత' అచకమేతామ్, అచకమన్త'' ఇత్యాది రూపము లగును. ఇచట 'ణి' లేకపోవుటచే సన్వద్భావ, ఇత్వ దీర్ఘములు లేవు.

ల్ఋఙ్లనందు 'ణి' చేర్చిన పక్షమున ఉపధాదీర్ఘ, ఆయాదేశములచే (సూ. 529) 'అకామయిష్యత' ఇత్యాది రూపములును, 'ణి' చేర్చని పక్షమున 'అకమిష్యత' ఇత్యాధి రూపములను సిద్ధించును.

అయధాతువునకు నడచుట, వెళ్ళుట అని అర్థము. 'శప్' ప్రత్యయము,

'టి'కి ఏత్వము చేయగా 'అయతే' అను రూపము. ఇట్లే ఇతర రూపములు గూడ ఏధధాతువునందు వలె నుండును.

538. ఉపసర్గస్యాఽయతౌ 8.2.19

అయతి పరస్యోపసర్గస్య యో రేఫః తస్య లత్వం స్యాత్. ప్లాయతే, పలాయతే.

ఉపసర్గస్య, అయతౌ. 'కృపో రో లః' నుండి 'రః, లః' అను పదములు అనువర్తించును. అయధాతువు పరమునందు గల ఉపసర్గయొక్క రేఫకు లకారము వచ్చును.

అయధాతువుకు 'ప్ర' 'పర' అను ఉపసర్గలను చేర్చినపుడు ఈ సూత్రముచే రేఫకు లకారము — 'ప్లాయతే, పలాయతే' అని యగును.

539. దయాఽయాఽఽసశ్చ 3.1.37

దయ్, అయ్, ఆస్, ఏభ్యః ఆమ్ స్యాత్ లిటి. అయాఞ్చక్రే, అయితా, అయిష్యతే, అయతామ్, ఆయత. అయేత, అయిషీష్ట. విభాషేటః - అయిషీఢ్వమ్ - అయిషీధ్వమ్, ఆయిష్ట, ఆయిఢ్వమ్- ఆయిధ్వమ్, ఆయిష్యత.

'కాస్ప్రత్యయాదామమన్త్రే లిటి' నుండి 'ఆమ్' 'లిటి' అనువర్తించును. దయ, అయ్, ఆస్ ధాతువులకు 'లిట్' పరమగునపుడు 'ఆమ్' వచ్చును.

లిట్టునందు ఈ 'ఆమ్' ప్రత్యయము చేర్చిన పిమ్మట 'ఆమః' అను సూత్రముచే (473) 'లిట్'కు లోపము. 'కృఞ్చానుప్రయుజ్యతే లిటి' అను సూత్రముచే (474) కృ. భూ. అస్. ధాతువులు అనుప్రయుక్తము లగును. "అయాఞ్చక్రే", 'అయామ్బభూవ' 'అయామాస' ఇత్యాది రూపము లగును.

'లట్' 'ల్రుట్' మొదలగు వాటియందు కూడ ఏధధాతువునందు వలెనే ప్రక్రియ యుండును. 'ఆశీర్లిఙ్' 'లుఙ్' లందు 'ధ్వమ్' అనుదాని ధకారమునకు 'విభాషేటః' అను సూత్రముచే (510) ఢత్వము వికల్పముగ వచ్చుటచే 'అయిషీఢ్వమ్' అయిషీధ్వమ్'' 'ఆయిఢ్వమ్', 'ఆయిధ్వమ్' అను రూపద్వయ ముండును.

లుట్ :- అయితా. అయితారౌ. అయితారః. అయితాసే. అయితాసాథే, అయితాధ్వే, అయితాహే. అయితాస్వహే, అయితాస్మహే

లృట్ :- అయిష్యతే - అయిష్యేతే - అయిష్యన్తే. మొ. లోట్ అయతామ్ - అయేతామ్ - అయన్తామ్, అయస్వ - అయేథామ్ - అయధ్వమ్, అయై - అయావహై - అయామహై. లఙ్ :- ఆయత - ఆయేతామ్ ఆయన్త, ఆయథాః - ఆయేథామ్ - ఆయధ్వమ్, ఆయే - ఆయావహి - అయామహి. విధిలిఙ్ ;- అయేత - అయేయాతామ్ - అయేరన్. అయేథాః- అయేయాథామ్ - అయేధ్వమ్, అయేయ - అయేవహి - అయేమహి.

ఆశీర్లిఙ్ :- అయిషీష్ట - అయిషీయాస్తామ్ - అయిషీరన్, అయిషీష్ఠాః- అయిషీయాస్థామ్ - అయిషీఢ్వమ్ - అయిషీధ్వమ్, అయిషీయ- అయిషీవహి - అయిషీమహి. లుఙ్ :- ఆయిష్ట - ఆయిషాతామ్ - ఆయిషత, ఆయిష్ఠాః- ఆయిషాథామ్ - ఆయిఢ్వమ్, ఆయిధ్వమ్. ఆయిషి - ఆయిష్వహి; ఆయిష్మహి. లృఙ్ :- ఆయిష్యత - ఆయిష్యేతామ్ - ఆయిష్యన్త. మొ.

ద్యుత దీప్తౌ 4. ద్యోతతే.

540. ద్యుతిస్వాప్యోః సంప్రసారణమ్ 7.4.67

అభ్యాసస్య. దిద్యుతే

ద్యుత్ ధాతువునకు ప్రకాశించుట అని అర్థము. లట్‌నందు శబాదులచే ఏధధాతువునందు వలె 'ద్యోతతే' ఇత్యాది రూపము లుండును. లిట్‌నందు ద్విర్వచనము అభ్యాసకార్యము చేసిన పిమ్మట "ద్యు ద్యుత్‌లిట్" అని ఉండగా ఈ సూత్రముచే అభ్యాసయకారమునకు సంప్రసారణము విధింపబడుచున్నది.

'అత్ర లోపోఽభ్యాసస్య'' నుండి "అభ్యాసస్య'' అనువర్తించును; 'ద్యుత్', 'స్వప్' ధాతువుల అభ్యాసమునకు సంప్రసారణము వచ్చును. ఈ సూత్రముచే సంప్రసారణము (యకారస్థానమున 'ఇ'), చేయగా 'ద్ ఇ ఉ ద్యుత్ లిట్' అని యుండును. ''సంప్రసారణాచ్చ'' అను సూత్రముచే (258) ఉకారమునకు పూర్వరూపము చేసిన పిమ్మట 'దిద్యుత్ లిట్' అని యుండగా ప్రథమపురుషైకవచనమున లిడాదేశమగు 'త'కు 'ఏశ్' ఆదేశముచే (సూ-516) 'దిద్యుతే' అను రూపము సిద్ధించును. ఇతరరూపములందు కూడ వెనుకటి వలె ప్రక్రియ యుండును. సంప్రసారణ పూర్వరూపములు మాత్రమే

విశేషము. లుట్ - ద్యోతితా; లృట్ - ద్యోతిష్యతే; లోట్ - ద్యోతతామ్; లఙ్ - అద్యోతత; విధిలిఙ్ - ద్యోతేత; ఆశీర్లిఙ్ - ద్యోతిషీష్ట.

541. ద్యుద్భ్యో లుఙి 1.3.91

ద్యుతాదిభ్యః లుఙః పరస్మైపదం వా స్యాత్. పుషాది - ఇత్యఙ్ - అద్యుతత్, అద్యోతిష్ట. అద్యోతిష్యత.

'శేషాత్కర్తరి పరస్మైపదమ్' నుండి "పరస్మైపదమ్" అనువర్తించును. 'ద్యుత్' మొదలగు ధాతువులకంటె పర మగు 'లుఙ్'కు పరస్మైపదము వికల్పముగ వచ్చును.

'ద్యుత్' ధాతువు మొదలు 'ఘట చేష్టాయామ్' అను ధాతువు వరకును గల ఇరువదిరెండు ధాతువులు ద్యుతాదులు. ఈ సూత్రము ననుసరించి లుఙ్ నందు వైకల్పిక మగు పరస్మైపదము వచ్చునపుడు "పుషాదిద్యుతాద్యృదితః పరస్మైపదేషు" అను సూత్రముచే (510) 'చ్లి'కి 'అఙ్' వచ్చి "అగమత్" ఇత్యాది రూపముల వలె "అద్యుతత్" ఇత్యాది రూపములగును. 'అఙ్' ఙిత్ గాన గుణము రాలేదు.

పరస్మైపదము రాని పక్షమున ఆత్మనేపదమున 'సిచ్' ఇడాగమ, షత్వ, ష్టుత్వాదులచే 'అద్యోతిష్ట' ఇత్యాదిరూపము లగును. లృఙ్‌నందు విశేషకార్యము లేవియు లేవు. 'అద్యోతిష్యత' ఇత్యాది రూపములు సిద్ధించును.

ఏవం శ్వితా వర్ణే 5 ఞిమిదా స్నేహనే. 6. ఞిష్విదా స్నేహనమోచనయోః. 7. మోహనయోః ఇత్యేకే. ఞిక్ష్విదా చేత్యేకే. రుచ దీప్తౌ అభిప్రీతౌ చ. 8. ఘుట పరివర్తనే. 9. శుభ దీప్తౌ. 10. క్షుభ సంచలనే. 11. ణభ హింసాయామ్ 12. తుభ హింసాయామ్ 13. స్రంసు, భ్రంసు, ధ్వంసు అవస్రంసనే. 14 - 16. ధ్వంసు గతౌ చ 17. స్రమ్భు విశ్వాసే. 18. వృతు వర్తనే 19. వర్తతే; వవృతే, వర్తితా.

'శ్వితా' మొదలు 'వృత్' వరకును గల ధాతువులు ద్యుతాదిగణము లోనివి. అందుచే వీటి ప్రక్రియ చాలవరకు ద్యుతధాతువునందు వలె ఉండును. వీటి అన్ని లకారములకును మొదటి రూపములు ఈ దిగువ చూపబడుచున్నవి ఇతర రూపములను ఊహించుకొనవచ్చును.

5. శ్వితాధాతువునకు తెల్లగ చేయుట అని అర్థము. శ్వేతతే, శిశ్విte, శ్వేతితా, శ్వేతిష్యతే, శ్వేతతామ్, అశ్వేతత, శ్వేతేత, శ్వేతిషీష్ట, అశ్వితత్- అశ్వేతిష్ట, అశ్వేతిష్యత.

6. ఞి మిదా (మిద్) ధాతువునకు నున్న నగుట లేక నున్నగాచేయుట అని యర్థము. మేదతే, మిమిదే, మేదితా. మేదిష్యతే. మేదతామ్, అమేదత, మేదేత, మేదిషీష్ట, అమిదత్- అమేదిష్ట, అమేదిష్యత. 7. ఞి ష్విదా (స్విద్) (ధాత్వాదేః షః సః 255) ధాతువునకు చెమర్చుట, విడచుట అని యర్థము. దానికి మోహము చెందుట అను నర్థమును గూడ కొందరు చెప్పుచున్నారు. కొందరు 'ఞి ష్విదా' అనుటకు బదులు 'ఞిక్ష్విదా' అను పాఠమును అంగీకరించిరి :- స్వేదతే, సిష్విదే, స్వేదితా, స్వేదిష్యతే, స్వేదతామ్. అస్వేదత, స్వేదేత, స్వేదిషీష్ట, అస్విదత్ - అస్వేదిష్ట. అస్వేదిష్యత, 'క్ష్విద్' ధాతువైనచో "క్ష్వేదతే", "చిక్ష్విదే" ఇత్యాదిరూపము లగును.

8. రుచ్ ధాతువునకు ప్రకాశించుట, ఇష్ట మగుట అని అర్థము. రోచతే, రురుచే, రోచితా, రోచిష్యతే, రోచతామ్, అరోచత. రోచేత, రోచిషీష్ట, అరుచత్ - అరోచిష్ట, అరోచిష్యత.

9. ఘుట ధాతువునకు తిరుగుట అని అర్థము;- ఘోటతే. జుఘుటే. ఘోటితా. ఘోటిష్యతే. ఘోటతామ్. అఘోటత. ఘోటేత. ఘోటిషీష్ట. అఘుటత్- అఘోటిష్ట. అఘోటిష్యత.

10. శుభ ధాతువునకు ప్రకాశించుట అని అర్థము. శోభతే, శుశుభే ఇత్యాదిరూపము లుండును.

11. క్షుభ ధాతువునకు చలించుట అని అర్థము. క్షోభతే. చుక్షుభే, అక్షుభత్- అక్షోభిష్ట, ఇత్యాదిరూపము లగును.

12. ణభధాతువునకు హింస యని అర్థము. 'ణో నః' అను సూత్రముచే (460) ణకారమునకు నకారము. నభతే. ఆత్మనేపదమున లిడాదేశములన్నియు 'అసంయోగాల్లిట్ కిత్' అను సూత్రముచే (454) కిత్తులుగాన 'అతఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి" అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపములచే "నేభే. నేభాతే, నేభిరే" ఇత్యాదిరూపము లగును, లుఙ్నందు 'అనభత - అనభిష్ట' ఇత్యాదిరూపద్వయము.

13. తుభ ధాతువునకు హింసించుట అని యర్థము తోభతే, తుతుభే, తోభితా. అతుభత్- అతోభిష్ట ఇత్యాదిరూపము లగును.

14-16. స్రంస్, భ్రంస్, ధ్వంస్ధాతువులకు జారిపోవుట అని అర్థము. ఇవి నకారోపధములు. అనగా వీటిస్వరూపము 'స్రన్స్', 'భ్రన్స్', 'ధ్వన్స్' అని యుండును. ఈ నకారమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే (78) అనుస్వారము చేయబడినది. స్రంసతే, సస్రంసే (లిట్టునందు "హలాదిః శేషః"అను సూత్రముచే అనుస్వారరూపమున నున్న నకారము కూడ లోపించినది). స్రంసితా. స్రంసిష్యతే, స్రంసతామ్. అస్రంసత. స్రంసేత, స్రంసిషీష్ట. అస్రసత్ (ఇచట అఙ్ జిత్తు గాన "అనిదితాం హల ఉపధాయాః క్ఙితి" అను సూత్రముచే (335) నకార (అనుస్వార)లోపము. అస్రంసిష్ట, అస్రంసిష్యత. భ్రంసతే, బభ్రంసే. అభ్రసత్- అభ్రంసిష్ట, ఇత్యాదులు. ధ్వంసతే, దధ్వంసే. అధ్వసత్- అధ్వంసిష్ట. ఇత్యాదులు. ధ్వంస్ధాతువునకు గమన మని కూడ అర్థము.

17. స్రమ్భు ధాతువునకు విశ్వసించుట అని అర్థము. స్రమ్భతే. సస్రమ్భే, స్రమ్భితా. అస్రభత్-అస్రమ్భిష్ట, 'స్రమ్భు'ధాతువుకూడ నకారోపధము. 'స్రన్భ్' అని యుండగా "నశ్చాపదాన్తస్యఝలి" (78) "అనుస్వారస్యయయిపరసవర్ణః" (79) అను సూత్రములచే అనుస్వారపరసవర్ణములు చేయగా "స్రమ్భ" అయినది. కావున పరస్మైపదలుఙ్లునందు 'అఙ్' చేసినపుడు నకారలోపము వచ్చినది.

19. వృత్ధాతువునకు ఉండుట అని అర్థము. లట్టునందు శప్, గుణములు చేయగా 'వర్తతే- వర్తేతే- వర్తన్తే' ఇత్యాదిరూపము లగును. లిట్టునందు ప్రథమపురుషైకవచనమున 'వృత్ + లిట్'అని యుండగా ద్విత్వము (సూ-396) అభ్యాసకార్యము 'వృవృత్ లిట్' అని యుండగా 'ఉరత్' అను సూత్రముచే (475). మొదటి ఋకారమునకు అకారము "లిటస్తఝయోరేశిరేచ్" అనుసూత్రముచే ( ) తకారమునకు ఏకారము. 'వవృతే'అను రూపము సిద్ధించినది. ఇట్లే లిట్టునందలి ఇతరరూపముల ప్రక్రియ యుండును. లిట్టునందు 'అసంయోగాల్లిట్ కిత్' అను సూత్రముచే (454) కిత్త్వము వచ్చును గాన గుణప్రసక్తి లేదు. వాస్తవమున కిత్త్వవిధాయకసూత్రముకంటె 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రము (390) పరము గాన దానిని బాదించి మొదట గుణము రావలసి యున్నది. గుణము వచ్చిన పిమ్మట 'వర్త్'అని యగును గాన. 'సంయోగపర

మగుటచే కిత్త్వప్రసక్తి యుండదు. ఐనను "ఋదుపధేభ్యో లిటః కిత్త్వం గుణాత్పూర్వవిప్రతిషేధేన" అను వార్తికము ననుసరించి పూర్వవిప్రతిషేధముచే గుణమును బాధించి కిత్త్వమే వచ్చును. అపుడు 'క్ఙితి చ'అను సూత్రముచే(435) గుణము నిషేధింపపడును. 'విప్రతిషేధే పరంకార్యమ్'అను సూత్రమునకు కొన్ని స్థలములందు లక్ష్యానుసారముగా 'విప్రతిషేధే అపరం' అని పదచ్ఛేదము చేయుటచే తుల్యబలవిరోధము కలిగినపుడు అపరకార్యము- అనగా పూర్వకార్యము వచ్చునని అర్థము చెప్పబడును. దీనికి పూర్వవిప్రతిషేధ మనిపేరు. ఇచట కిత్వసూత్రము'పూర్వము, గుణసూత్రము పరము. "ఋకారము ఉపధగా గల ధాతువులలో పూర్వవిప్రతిషేధముచే గుణమును బాధించి కిత్త్వము వచ్చును" అని పై వార్తికమునకు అర్థము. లుట్టునందు ఇడాగమగుణాదులచే 'వర్తితా' ఇత్యాదిరూపము లగును.

542. వృద్భ్యః స్యసనోః 1.3.92

వృతాదిభ్యః పఞ్చభ్యః వా పరస్మైపదం స్యాత్ స్యే సని చ.

'శేషాత్కర్తరి పరస్మైపదమ్' 'వా క్యషః' అను సూత్రములనుండి 'పరస్మైపదమ్' 'వా, అనువర్తించును. 'స్య' 'సన్'ప్రత్యయములు పర మగునపుడు 'వృత్' మొదలగు ఐదు ధాతువులకును వికల్పముగా పరస్మైపదము వచ్చును.

వృత్, వృధ్, శృధ్, స్యన్ద్. కృప్,ధాతువులు వృతాదులు. ల్ఋట్, ల్ఋఙ్లందు 'స్య'ప్రత్యయము చేర్చబడును గాన ఇవి పర మగునపుడు పరస్మైపదప్రత్యయములు వికల్పముగ వచ్చును.

543. న వృద్భ్యశ్చతుర్భ్యః 7.2.59

వృతు, వృధు, శృధు, స్యన్దూభ్యః సకారాదేరార్ధధాతుకస్యేణ్ న స్యాత్ తఙానయోరభావే. వర్త్స్యతి- వర్తిష్యతే. వర్తతామ్. అవర్తత. వర్తేత. వర్తిషీష్ట. అవృతత్- అవర్తిష్ట. అవర్త్స్యత్-అవర్తిష్యత. దద దానే. 20. దదతే,

'సేఽసిచికృతచృతఛృదతృదనృతః'నుండి 'సే', 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః'నుండి "ఆర్ధధాతుకస్య" 'ఇట్' అను పదములను అనువర్తించును. 'గమేరిట్ పరస్మైపదేషు'నుండి 'పరస్మైపదేషు'అనువర్తించును. దానికి 'తఙ్ 'ఆన' అనునవి రానప్పుడు అని అర్థము స్వీకరింపబడినది. వృత్,వృధ్,శృధ్,

స్యన్ధాతువుల సకారాద్యార్ధధాతుకమునకు 'తఙ్'ప్రత్యయములు గాని 'ఆన'ప్రత్యయము గాని ('శానచ్', 'కానచ్') పరముగ లేనపుడు ఇడాగమము రాదు.

ల్‌ృట్, ల్‌ృఙ్‌ల పరస్మైపదరూపములందు ఈ సూత్రముచే ఇడాగమము నిషిద్ధము గాన 'వర్త్స్యతి' 'అవర్త్స్యత్' ఇత్యాదిరూపము లగును. ఆత్మనేపదప్రత్యయములు చేర్చి నపుడు ఈ నిషేధము వర్తించదు గాన ఇడాగమము వచ్చి 'వర్తిష్యతే' 'అవర్తిష్యత' ఇత్యాదిరూపము లగును. 'లోట్' మొద లగు లకారములందు ప్రక్రియయందు విశేష మేదియును లేదు. లుఙ్నందు 'ద్యుద్భ్యో లుఙి'అను సూత్రముచే (541) పరస్మైపదము వైకల్పికము గాన 'అవృతత్' ఇత్యాదిపరస్మైపదరూపములును, 'అవర్తిష్ట' ఇత్యాదిఆత్మనేపద రూపములు గూడ ఉండును.

544. *న శస, దద, వాదిగుణానామ్* 6.4.126

శసేర్దదేర్వకారాదీనాం, గుణశబ్దేన విహితో యోఽకారః తస్య చ ఏత్వాభ్యాసలోపౌ న. దదదే- దదదాతే- దదదిరే. దదితా. దదిష్యతే. దదతామ్. అదదత. దదేత. దదిషీష్ట. అదదిష్ట. అదదిష్యత.

దదధాతువునకు ఇచ్చుట అని అర్థము. లట్‌నందు శబాదులచే దదతే - దదేతే-దదన్తే ఇత్యాదిరూపము లగును.

లిట్టునందు 'అత ఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి'అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపములు రావలసి యుండ తన్నిషేధార్థమై ఈ సూత్రము చెప్పబడినది. 'అత ఏకహల్మధ్యేనాదేశాదేర్లిటి'నుండి 'అతః' 'ఘసోరేద్ధావభ్యాసలోపశ్చ' నుండి 'ఏత్' 'అభ్యాసలోపః' అనువర్తించును. శస్, దద్, ధాతువులకును, వకారాదిధాతువులకును, గుణశబ్దముచే విహిత మగు అకారమునకును ఏత్వాభ్యాసలోపములు రావు.

ఈ సూత్రముచే ఏత్వాభ్యాసలోపములు నిషేధింపబడినవి గాన "దదదే- దదదాతే- దదదిరే" ఇత్యాదిరూపము లగును. ఇతరలకారములందు ప్రక్రియా విశేష మేదియును లేదు.

త్రపూష్ లజ్జాయామ్. 21. త్రపతే.

545. *తౄ, ఫల, భజ, త్రపశ్చ* 6.4.122

ఏషామత ఏత్వమభ్యాసలోపశ్చ స్యాత్ కితి లిటి సేటి థలి చ.

త్రేపే. త్రపితా- త్రప్తా. త్రపిష్యతే- త్రప్స్యతే. త్రపతామ్. అత్రపత. త్రపేత, త్రపిషీష్ట-త్రప్సీష్ట. అత్రపిష్ట- అత్రప్త. అత్రపిష్యత-అత్రప్స్యత. ఇత్యాత్మనేపదినః.

'త్రప్'ధాతువునకు సిగ్గుపడుట అని అర్థము. ఇందలి ఊకారషకారములు ఇత్సంజ్ఞకములు. లట్టునందు 'త్రపతే'ఇత్యాది రూపము లగును. ఈ ధాతువు ఏకహల్ధాతువు కాదు గాన లిట్టునందు "అత ఏకహల్మధ్యేనాదేశాదేర్లిటి" అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపములు వచ్చుటకు అవకాశము లేకపోవుటచే ఈ సూత్రము చెప్పబడినది. "అత ఏకహల్మధ్యేఽనాదేశదేర్లిటి"నుండి 'అతః' 'లిటి'అనుపదములు, "ఘసోరేద్ధావభ్యాసలోపశ్చ"నుండి 'ఏత్' 'అభ్యాసలోపశ్చ' అనుపదములు, "గమ హన జన ఖన ఘసాం లోపః క్జిత్యనఙి" నుండి 'క్తి' అనుపదము, 'థలి చ సేటి' అను సూత్రము అనువర్తించును. కిత్తగు లిట్టు, సేట్కమగు 'థల్'పర మగునపుడు తౄ, ఫల, భజ, త్రప్‌ధాతువులకు ఏత్వము అభ్యాసలోపము వచ్చును.

ఆత్మనేపదమున లిట్టు (అన్ని ప్రత్యయములును) కిత్తు గాన ఈ సూత్రముచే ఏత్వాభ్యాసలోపములు చేయగా "త్రేపే, త్రేపాతే, త్రేపిరే" ఇత్యాది రూపము లగును.

ఈ ధాతువు 'ఊదిత్'గాన "స్వరతి సూతి సూయతి ధూఞూదితో వా" అను సూత్రముచే (478) ఇడ్వికల్పము గాన లుట్, ల్రుట్, ఆశీర్లిఙ్, లుఙ్, ల్రుఙ్‌లందు రూపద్వయ ముండును. లోడాదిసార్వధాతుకములందు ప్రక్రియ వెనుకటి వలెనే యుండును. లుఙ్‌నందు ఇడాగమపక్షమున 'అత్రపిష్ట'ఇత్యాది రూపము లుండును. ఇడాగమము రాని పక్షమున ఝలాదిప్రత్యయములు పర మగునపుడు 'ఝలో ఝలి'అను సూత్రముచే (480) సకారలోపము-'అత్రప్త' ఇత్యాదిరూపము లగును.

అథ ఉభయపదినః:- శ్రిఞ్ సేవాయామ్. 1. శ్రయతి-శ్రయతే, శిశ్రాయ-శిశ్రియే, శ్రయితా. శ్రయిష్యతి-శ్రయిష్యతే. శ్రయతు-శ్రయతామ్. అశ్రయత్-అశ్రయత. శ్రీయాత్-శ్రయిషీష్ట. చఙ్-అశిశ్రియత్-అశిశ్రియత, అశ్రయిష్యత్-అశ్రయిష్యత.

'శ్రిఞ్'ధాతువునకు సేవించుట అని అర్థము. ఇది ఞిత్తుగాన "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే"అను సూత్రము (381) ననుసరించి క్రియా

ఫలము కర్తకు చెందిన పక్షమున ఆత్మనేపదము, పరునకు చెందినచో పరస్మై పదము ప్రయోగించవలెను. ఉభయపదిధాతువు లిట్లు సాధారణముగ ఞిత్తులుగ గాని స్వరితేత్తులుగ గాని యుండును.

లట్టునందు 'శప్'గుణాయాదేశాదులచే పరస్మైపదమున 'శ్రియతి'ఇత్యాది రూపములును, ఆత్మనేపదమున 'శ్రయతే' ఇత్యాదిరూపములును సిద్ధించును.

'ఊదృదన్తైః- అను కారిక ననుసరించి 'శ్రి'ధాతువు ఉదాత్తము కావున వలాద్యార్ధధాతుకములు పర మగునపుడు ఇడాగమము వచ్చును. "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్" అను (477) నిషేధము ప్రవర్తింపదు. లిట్టు పరస్మై పదరూపములలో ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట 'ణల్' ణిత్తుగాన వృద్ధి ఆయాదేశములచే 'శిశ్రాయ' అను రూపము సిద్ధించును. మధ్యమపురుషైకవచనమున గుణఅయాదేశములచే 'శిశ్రయిథ'అను రూపము, ఉత్తమపురుషైకవచనమున 'ణలుత్తమో వా'అను సూత్రముచే (458) ణిత్త్వము వైకల్పికము గాన వృద్ధిఆయాదేశములు వచ్చిన పక్షమున 'శిశ్రాయ' అనియు గుణఅయాదేశములు వచ్చిన పక్షమున 'శిశ్రయ' అనియు రూపము లగును పరస్మైపదరూపములందలి ఇతరప్రత్యయములందు లిట్టునకు కిత్త్వము వచ్చును గాన గుణము నిషిద్ధ మగుటచే "అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ" అను సూత్రముచే (199) ఇయఙాదేశముచే 'శిశ్రియతుః'ఇత్యాదిరూపము లుండును. ఆత్మనేపదమున లిడాదేశము లన్నియు కిత్తులే గాన ఇయఙాదేశముచే 'శిశ్రియే, శిశ్రియాతే, శిశ్రియిరే' ఇత్యాదిరూపము లగును. లుట్, ల్రుట్, లోట్, లఙ్, విధిలిఙ్లులందు విశేషకార్యము లేవియు లేవు. ఆశీర్లిఙ్లునందు(క్షి ధాతువునకు వలె) 'అకృత్సార్వధాతుకయోః'అను సూత్రముచే (485) దీర్ఘము చేయగా 'శ్రీయాత్, శ్రీయాస్తామ్, శ్రీయాసుః'ఇత్యాదిపరస్మైపదరూపము లగును. ఆత్మనేపదరూపములలో విశేషము లేదు.

లుఙ్లునందు "ణి శ్రి ద్రు స్రుభ్యః కర్తరి చఙ్"అను సూత్రముచే (531) 'చఙ్' వచ్చును. 'చఙి' అను సూత్రముచే (534) ద్విత్వము. అభ్యాసకార్యము. 'చఙ్' ఙిత్తు గాన గుణనిషేధము. ఇయఙాదేశము వచ్చి పరస్మైపదమున 'అశిశ్రియత్'అనియు, ఆత్మనేపదమున 'అశిశ్రియత'అనియు రూపములు సిద్ధించును

భృఞ్ భరణే. 2. భరతి-భరతే. బభార, బభ్రతుః, బభ్రుః; బభర్థ, బభృవ, బభృమ బభ్రే. బభృషే. భర్తాసి- భర్తాసే, భరిష్యతి-భరిష్యతే. భరతు-భరతామ్, అభరత్-అభరత, భరేత్-భరేత.

'భృ' ధాతువునకు మోయుట అని అర్థము. లట్టునందు 'శప్' గుణములచే 'భరతి' 'భరతే' ఇత్యాదిరూపములు.

బభార:- 'లిట్' ప్రథమపురుషైకవచనమున ద్విత్వము- 'భృభృఅ' 'ఉరత్' (475)- 'భభృఅ', 'అచోఞ్ణితి' అను సూత్రముచే (182) వృద్ధి— 'భభార్అ' 'అభ్యాసేచర్చ' అను సూత్రముచే (401) జశ్త్వము- 'బభార' అను రూపము సిద్ధించినది.

బభ్రతుః:-'కృ సృ భృ వృ స్తు ద్రు స్రు శ్రువో లిటి' అను సూత్రముచే (481) ఇడాగమము నిషేధింపబడినది, కిత్త్వముచే గుణము నిషిద్ధము. అభ్యాసమునందలి ఋకారమునకు అకారము. రెండవ ఋకారమునకు యణాదేశముచే రేఫ—'బభ్రతుః' అను రూపము సిద్ధించినది.

బభర్థ:- 'థల్' స్థానివద్భావముచే పిక్కముగాన కిత్త్వము లేదు. గుణముచే 'బభర్థ' అను రూపము సిద్ధించినది. ఆత్మనేపదమున అన్ని ప్రత్యయములును కిత్తులే గాన గుణప్రసక్తి లేదు. ఋకారమునకు అజాదిప్రత్యయము పర మగునపుడు గుణము వచ్చును. హల్ పర మగునపుడు మార్పు లేదు. బభ్రే-బభ్రాతే-బభ్రిరే; బభృషే-బభ్రాథే-బభృద్వే, బభ్రే-బభృవహే-బభృమహే. ఇది అనిడ్ధాతువు గాన లుట్టునందు 'భర్తా', 'భ రాసి'-'భర్తాసే' ఇత్యాది రూపము లగును.

ఇది ఋదంతధాతువు గాన 'లృట్' లృఙ్' లందు 'ఋద్ధనోః స్యే' అను సూత్రముచే (560) ఇడాగమము. 'భరిష్యతి-భరిష్యతే' "అభరిష్యత్-అభరిష్యత" ఇత్యాదిరూపము లగును. లోట్, లఙ్, విధిలిఙ్ లందు విశేషకార్య మేదియును లేదు.

'ఆశీర్లిఙ్' పరస్మైపదమున యాసుడాదులు చేసిన పిమ్మట "భృయాత్" అని యుండగా:-

546. రిఙ్ శ యగ్ లిఙ్క్షు 7.4.28

శే యకి యాదావార్ధధాతుకే లిఙి చ ఋతో రిఙ్ ఆదేశః స్యాత్. రీఙి ప్రకృతే రిఙ్విధానసామర్థ్యాత్ దీర్ఘో న. భ్రియాత్.

'అయఙ్ యి క్ఙితి' నుండి 'యి' 'రీఙృతః' నుండి 'ఋతః', "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః" నుండి 'అసార్వధాతుక' అను భాగము అనువర్తించును.

'అఙ్గస్య' అధికారము. 'శ' అనునదియు, 'యక్' అనునదియు, యకారాది యగు ఆర్ధధాతుకలిఙ్ను, పరముగ నున్నపుడు ఋకారాంతాంగమునకు 'రిఙ్' అను నాదేశము వచ్చును.

'రిఙ్' ఙిత్తు గాన అంతాదేశము. ఈ సూత్రముచే 'భృ' యందలి ఋకారమునకు రిఙాదేశము చేయగా 'భ్రియాత్' అను రూపము సిద్ధించినది. ఇచట రేఫోత్తరవర్తి యగు ఇకారమునకు 'అకృత్సార్వధాతుకయోః' అను సూత్రముచే (485) దీర్ఘము రాదు. ఇట్లు దీర్ఘము వచ్చి 'భ్రీయాత్' ఇత్యాదిరూపములు అభీష్టమైనచో 'రీఙృతః' అను వెనుకటి సూత్రమునుండి 'రీఙ్' అను పదము అనువర్తించుచుండగా మరల ఈ సూత్రమున 'రిఙ్' అని చెప్ప పని లేదు. దీర్ఘము వచ్చి ఇది కూడ చివరకు 'రీ'గనే మారును గాన పూర్వసూత్రమునుండి 'రీఙ్' అనుదానినే అనువృత్తి చేసికొని యుండవచ్చును. అట్లు చేయక 'రిఙ్' అని ప్రత్యేకముగ చెప్పుటచే దీనికి దీర్ఘము రాదని సూచింపబడుచున్నది. 'భ్రియాత్-భ్రియాస్తామ్-భ్రియాసుః' ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిఙ్ ఆత్మనేపదరూపములందు ప్రథమపురుషైకవచనమున 'సీయుట్' (సూ-523) సుట్ (సూ-526) ఆగమములు చేసిన పిమ్మట 'భృ సీ స్ త' అని యుండునపుడు ఋకారమునకు గుణము (సూ-390) రావలసి యుండగా:-

547. ఉశ్చ 1.2.12

ఋవర్ణాత్పరౌ ఝలాదీ లిఙ్ సిచౌ కితౌ స్తస్తఙి. భృషీష్ట-భృషీయాస్తామ్. అభార్షీత్.

'లిఙ్ సిచావాత్మనేపదేషు' అను సూత్రము, 'ఇకోఝల్'నుండి 'ఝల్' అనువర్తించును. "అసంయోగాల్లిట్ కిత్'నుండి 'కిత్'అనువర్తించును. ఋవర్ణముకంటె పరములును, ఝలాదులును అగు 'లిఙ్ సిచ్'లు తఙ్ పర మగునపుడు కిత్తు లగును.

ఇచట 'లిఙ్'కు ఆద్యవయవముగ వచ్చిన 'సీయుట్' లిఙ్గా పరిగణింపబడును. అది ఝలాదికము. అందుచే ఈ సూత్రముచే కిత్త్వము వచ్చుటచే గుణము రాదు. 'భృషీష్ట' (షత్వష్టుత్వములచే) అను రూపము సిద్ధించును. ఇతరరూపములందు ప్రక్రియ ఏధధాతువునందు వలె ఉండును.

'లుఙ్'పరస్మైపదరూపములందు 'చ్లి'కి 'సిచ్' చేసిన పిమ్మట "సిచి వృద్ధిః పరస్మైపదేషు"అను సూత్రముచే (486) ఋకారమునకు వృద్ధి (ఆర్).

సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షత్వము. "అభార్షీత్-అభార్ష్టామ్-అభార్షుః, అభార్షీః-అభార్ష్టమ్-అభార్ష్ట, అభార్షమ్-అభార్ష్వ, అభార్ష్మ' అను రూపము లగును. ఆత్మనేపదమున ప్రథమపురుషైకవచనమున 'చ్లి'కి 'సిచ్' చేసిన పిమ్మట 'అభృ స్ త' అని యుండగా,-

548. హ్రస్వాదఙ్గాత్ 8.2.27

సిచో లోపో ఝలి. అభృత, అభృషాతామ్. అభరిష్యత్-అభరిష్యత.

"ఝలో ఝలి" 'సంయోగాన్తస్యలోపః' అను సూత్రములనుండి 'ఝలి' 'లోపః' అనువర్తించును. 'సిచః' అనుపదము భాష్యకారునివ్యాఖ్యానము ననుసరించి గ్రహింపబడినది. హ్రస్వాన్త మగు అంగమునకంటె పర మగు 'సిచ్'కు 'ఝల్' పర మగునపుడు లోపము వచ్చును.

ఈ సూత్రముచే సకారము లోపింపగా 'అభృత' అను రూపము సిద్ధించినది. ఇట్లే "అభృషాతామ్ -అభృషత, అభృథాః-అభృషాథామ్-అభృఢ్వమ్" ("ఇణః షీధ్వం లుఙ్‌లిటాం ధోఽఙ్గాత్" అనుసూత్రముచే 517ఢత్వము) అభృషి-అభృష్వహి-అభృష్మహి' 'ఉశ్చ' అను సూత్రముచే (547) 'సిచ్' కిత్తు గాన లుఙ్లునందెచటను గుణము రాలేదు.

హృఞ్ హరణే. 3. హరతి-హరతే, జహార, జహర్థ, జహ్రివ, జహ్రిమ; జహ్రే, జహ్రిషే; హర్తా, హరిష్యతి- హరిష్యతే హరతు- హరతామ్, అహరత్- అహరత, హరేత్- హరేత, హ్రియాత్ - హృషీష్ట, హృషీయాస్తామ్, అహార్షీత్- అహృత, అహరిష్యత్- అహరిష్యత.

'హృ' ధాతువునందు ప్రక్రియ యంతయు 'భృ' ధాతువునందు వలెనే యుండును. లిట్టునందు 'వహి' 'మహి' ప్రత్యయములు పర మగునపుడు క్రాది నియమముచే ఇడాగమము వచ్చుట ఒక్కటియే విశేషము. 'జహ్రివ' 'జహ్రిమ' అను రూపము లగును. ఇచట అభ్యాస హకారమునకు 'కుహోశ్చుః' అను సూత్రముచే (456) చుత్వము చేయగా ఆంతరతమ్యముచే మొదట ఝకారము, దానికి 'అభ్యాసే చర్చ' అను సూత్రముచే (401) జశ్త్వముచే జకారము వచ్చినది.

భృఞ్ ధారణే 4. భరతి-భరతే. ణీఞ్ ప్రాపణే 5. నయతి-నయతే. డుపచష్పాకే 6. పచతి-పచతే, పపాచ. పేచిథ-పపక్థ, పేచే, పక్తా. భజసేవాయామ్ 7. భజతి-భజతే, బభాజ- భేజే, భక్తా, భక్ష్యతి-భక్ష్యతే, అభాక్షీత్- అభక్త అభక్షాతామ్. యజదేవపూజాసంగతికరణదానేషు, 8. యజతి-యజతే.

4. 'భృ' ధాతువునకు ధరించుట అని అర్థము దాని రూపము లన్నియు హృధాతురూపముల వలెనే యుండును.

5. 'నీ' ధాతువునకు చేర్చుట, తీసికొని వెళ్ళుట యని అర్థము. లట్టునందు శప్, గుణ, అయాదేశములచే 'నయతి' 'నయతే' ఇత్యాది రూపము లగును. లిట్టునందు ప్రథమపురుషైకవచనమున ద్విత్వము, హ్రస్వము (సూ 899) 'అచో ఞ్ణితి' అను సూత్రముచే (182) వృద్ధి, అయాదేశము- 'నినాయ' అను రూపము సిద్ధించును. పిద్భిన్నము లగు ప్రత్యయముల్లందు కిత్త్వము వచ్చును గాన గుణము లేదు. 'అతుస్' మొదలగు అజాదిప్రత్యయములు పర మగునపుడు యణాదేశముచే 'నిన్యతుః' ఇత్యాది రూపము లగును. ఇది అజన్త మగు అనిడ్ధాతువు గాన 'థల్' పర మగునపుడు వికల్పముగను, 'వ' 'మ' లు పర మగునపుడు నిత్యముగను ఇడాగమము వచ్చుటచే 'నినయిథ-'నినేథ' 'నిన్యివ', 'నిన్యిమ' అను రూపము లగును. ఉత్తమపురుషైకవచనమున ణిత్త్వ వికల్పముచే 'నినాయ', 'నినయ' అను రూపద్వయ ముండును. నినాయ - నిన్యతుః - నిన్యుః, నినయిథ, నినేథ - నిన్యథుః - నిన్య; నినాయ. నినయ - నిన్యివ - నిన్యిమ. ఆత్మనేపదమున క్రాది నియమముచే 'ధ్వమ్' 'వహి' మహి' అనునవి పర మగునపుడు నిత్యముగ ఇడాగమము. నిన్యే-నిన్యాతే-నిన్యిరే; నిన్యిషే-నిన్యాథే-నిన్యిధ్వే; నిన్యే-నిన్యివహే-నిన్యిమహే. లుట్- నేతా, లృట్ నేష్యతి; నేష్యతే. లోట్ - నయతు, నయతామ్. లఙ్ అనయత్ - అనయత. విధిలిఙ్ - నయేత్, నయేత. ఆశీర్లిఙ్- నీయాత్-నేషీష్ట. లుఙ్:- అనైషీత్ - అనైష్ట. లృఙ్ - అనేష్యత్ - అనేష్యత. పై ఐదు ధాతువులును ఞిత్తులు గాన ఉభయ పదు లైనవి. ఇక రాబోవు ధాతువులు స్వరితేత్తు లగుటచే ఉభయ పదులు.

6. 'పచ్' ధాతువునకు వండుట యని యర్థము. లట్టునందు విశేష కార్యము లేవియును లేవు. ''పేచిథ, పపక్థ'' :- 'థల్' నందు 'ఉపదేశేఽ

త్వతః' అను సూత్రమును, (483) భారద్వాజ నియమమును అనుసరించి ఇడా గమ వికల్పము ఇడాగమపక్షమున "థలి చ సేటి" అను సూత్రముచే (463) ఏత్వాభ్యాస లోపములు వచ్చి 'పేచిథ' అను రూపము, ఇడాగమాభావపక్ష మున "చోః కుః" అను సూత్రముచే (307) చకారమునకు కకారము వచ్చు టచే "పపక్థ' అనియు రూపము లగును. 'వ' 'మ'లకు క్రాదినియమముచే ఇడా గమము నిత్యము. "పపాచ - పేచతుః - పేచుః; పేచిథ, పపక్థ - పేచ థుః - పేచ, పపాచ, పపచ - పేచివ - పేచిమ"

'కిత్'అగు లిట్టునందు "అత ఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి" అను సూత్రముచే(462)ఏత్వాభ్యాస లోపములు,క్రాదినియమముచే యథాస్థానముగా ఇడా గమము వచ్చుటచే "పేచే - పేచాతే - పేచిరే; పేచిషే -పేచాథే-పేచిధ్వే; పేచే - పేచివహే - పేచిమహే" అను రూపము లగును.

లుట్ :- పక్తా, ల్ృట్- పక్ష్యతి. పక్ష్యతే. లోట్- పచతు, పచ తామ్ లఙ్- అపచత్, అపచత. విధిలిఙ్- పచేత్, పచేత. ఆశీర్లిఙ్- పచ్యాత్. పక్షీష్ట, 'చోః కుః' అను సూత్రముచే (307) చకారమునకు కకా రము, సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అనుసూత్రముచే (150) షత్వము రాగా కకారషకారముల యోగముచే క్షకార మేర్పడినది.

లుఙ్గునందు - అపాక్షీత్ - అపాక్తామ్ - అపాక్షుః, అపాక్షీః - అపాక్తమ్ - అపాక్త, అపాక్షమ్ - అపాక్ష్వ - అపాక్ష్మ. ఇచట "వద వ్రజ హలన్తస్యాచః" అను సూత్రముచే (467) వృద్ధి వచ్చినది. 'అపాక్తామ్' 'అపాక్తమ్' 'అపాక్త' అను రూపములందు 'ఝలో ఝలి' అను సూత్రముచే (480) సకారలోపము వచ్చినది. ఆత్మనేపదిరూపములు :- "అపక్త - అపక్షాతామ్ - అపక్షత, అపక్థాః - అపక్షాథామ్ - అపగ్ధ్వమ్; అపక్షి - అపక్ష్వహి - అపక్ష్మహి"

ఇచట 'త', 'థాస్', 'ధ్వమ్'లు పరముగ నున్నపుడు సకారమునకు "ఝలో ఝలి" అను సూత్రముచే (480) లోపము; ఇతర స్థలమునందు "ఆదేశప్రత్యయయోః" అను సూత్రముచే (150) షత్వము వచ్చినది. ల్ృఙ్- అపక్ష్యత్-అపక్ష్యత.

7. భజ ధాతువునకు సేవించుట అని అర్థము. దీని రూపములు పూర్తిగ పచధాతురూపముల వలె నుండును. పచధాతు చకారమునకు 'ణల్' పర మగు నపుడు ''చోః కుః'' అను సూత్రముచే (307) ककారము వచ్చును. భజధాతు జకారమునకు మాత్రము మొదట పై సూత్రముచే గకారము, పిదప దానికి 'ఖరి చ' అను సూత్రముచే (74) కకారము వచ్చును; ఇదియే భేదము.

8. యజధాతువునకు దేవపూజ చేయుట, కలుపుట, ఇచ్చుట అని అర్థములు. ఇది కూడ అనిడ్ధాతువు, లట్టునందు 'యజతి' 'యజతే' ఇత్యాది రూపము లగును.

లిట్ పరస్మైపద ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాస కార్య వృద్ధ్యాదులచే 'యయాజ్ అ' అని యుండగా :-

549. లిట్యభ్యాసస్యోభయేషామ్. 6.1.17

వచ్యాదీనాం గ్రహ్యాదీనాం చాభ్యాసస్య సంప్రసారణం లిటి. ఇయాజ

'ష్యజః సమ్ప్రసారణమ్' నుండి 'సమ్ప్రసారణమ్' అనువర్తించును. 'లిట్' పర మగునపుడు వచ్యాదులయొక్కయు, గ్రహ్యాదులయొక్కయు అభ్యాసమునకు సంప్రసారణము వచ్చును.

'వచి, స్వపి, యజాదీనాం కితి' అను సూత్రమునందు చెప్పబడిన ధాతువులు వచ్యాదులు. ''గ్రహి జ్యా వయి వ్యధి వష్టి విచతి వృశ్చతి పృచ్ఛతి భృజ్జతానాం జీతి చ'' అను సూత్రమునందు చెప్పబడిన ధాతువులు గ్రహ్యాదులు. 'యజ దేవపూజా-' అను ధాతువు మొదలు ''టు ఓ శ్వి గతివృద్ధ్యోః'' అను ధాతువు వరకును గల తొమ్మిది ధాతువులును యజాదులు.

''యజిర్వపిర్వహిశ్చైవ వసిర్వేఞ్ వ్యేఞ ఇత్యపి
హ్వేఞ్ వదీ శ్వయతిశ్చేతి యజాద్యాః స్యురిమే నవ.''

ప్రకృతమున ఈ సూత్రముచే యకారమునకు సంప్రసారణము ''ఇఅయాజ్ అ'' అని యుండగా ''సంప్రసారణాచ్చ'' అను సూత్రముచే (258) అకారమునకు పూర్వరూపము - 'ఇయాజ' అను రూపము సిద్ధించినది.

550. వచిస్వపియజాదీనాం కితి 6.1.15

వచిస్వపోర్యజాదీనాఞ్చ సమ్ప్రసారణం స్యాత్ కితి.

ఈజతుః, ఈజుః ఇయజిథ, ఇయష్ఠ, ఈజే, యష్టా.

'ష్యఙః సమ్ప్రసారణమ్' నుండి 'సమ్ప్రసారణం' అనువర్తించును.

వచ్, స్వప్ ధాతువులకును, యజాదులకును 'కిత్' పర మగునపుడు సంప్రసారణము వచ్చును.

లిట్టునందలి ద్వివచన బహువచన ప్రత్యయము లన్నియు కిత్తులు గాన ప్రథమపురుష ద్వివచనమున 'యజ్ అతుస్' అని యుండగా "లిటి ధాతోర నభ్యాసస్య" అను సూత్రముచే (396) ద్విత్వము రావలసి యున్నది. కాని దానికంటె పర మగుటచే దానిని బాధించి ఈ సూత్రముచే సంప్రసారణము, పిమ్మట పూర్వరూపము. 'ఇజ్ అతుస్' అని యుండగా ఇపుడు ద్విత్వ అభ్యాస కార్యములు- 'ఇఇజ్ + అతుస్'-సవర్ణదీర్ఘముచే 'ఈజతుః' అను రూపము సిద్ధించును. కిత్తులందు ప్రక్రియ ఈ విధముగనే ఉండును. 'థల్' పర మగునపుడు భారద్వాజ నియమముచే ఇడాగము వికల్పము. 'లిట్యభ్యాసస్యో భయేషామ్' అను సూత్రముచే (549) అభ్యాసకు సంప్రసారణము. ఇడాగమ పక్షమున 'ఇయజిథ' అను రూప మగును. ఇడాగమాభావపక్షమున 'వ్రశ్చ, భ్రస్జ, సృజ, మృజ, యజ, రాజ, భ్రాజ, ఛ్ఛశాం షః' అను సూత్రముచే (308) జకారమునకు షత్వము, పిమ్మట థకారమునకు ష్టుత్వముచే ఠకారము చేయగా 'ఇయష్ఠ' అను రూపము సిద్ధించును. 'వ' 'మ'లకు క్రాది నియమముచే నిత్యముగ ఇడాగమము. ఇయాజ, ఈజతుః, ఈజుః, ఇయజిథ-ఇయష్ఠ ఈజథుః, ఈజ, ఇయాజ-ఇయజ, ఈజివ, ఈజిమ.

ఆత్మనేపదమునందు లిట్ కిత్తు గాన ద్విత్వమును బాధించి మొదట సంప్రసారణము, పిమ్మట ద్విత్వాభ్యాసలోపాదులును చేయగా:-"ఈజే-ఈజాతే-ఈజిరే, ఈజిషే - ఈజాథే-ఈజిధ్వే, ఈజే - ఈజివహే— ఈజిమహే" అను రూపము లగును.

లుట్టునందు "వ్రశ్చ—" అను సూత్రముచే (308) జకారమునకు షత్వము, తకారమునకు ష్టుత్వము చేయగా "యష్టా-యష్టారౌ- యష్టారః" ఇత్యాదిరూపము లగును.

లృట్నందు జకారమునకు షత్వము చేసిన పిమ్మట "యష్స్యతి" "యష్స్యతే" అని యుండగా:-

551. షఢోః కః సి 8.2.41

యక్ష్యతి. యక్ష్యతే. ఇజ్యాత్, యక్షీష్ట. అయాక్షీత్, అయష్ట.

షకారఢకారములకు సకారము పర మగునపుడు కకారము వచ్చును.

ఈః సూత్రముచే షకారమునకు కకారము. 'స్య'యందలి సకారమునకు 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షకారము; కషయోర్యోగే క్షః- 'యక్ష్యతి—యక్ష్యతే' ఇత్యాదిరూపము లగును.

లోట్:- యజతు, యజతామ్. లఙ్:-అయజత్,అయజత. విధిలిఙ్:- యజేత్,యజేత. ఆశీర్లిఙ్:- పరస్మైపదమునందు ''కిదాశిషి''అను సూత్రముచే (434)'యాసుట్' కిత్తు గాన 'వచి, స్వపి, యజాదీనాం కితి' అనుసూత్రముచే(550) సంప్రసారణము చేయగా 'ఇజ్యాత్, ఇజ్యాస్తామ్, ఇజ్యాసుః'ఇత్యాదిరూపము లగును. ఆత్మనేపదమున ప్రథమపురుషైకవచనమున 'సీయుట్' చేర్చిన పిదప 'వ్రశ్చ—'సూత్రముచే (308) జకారమునకు షకారము. దానికి 'షఢోః కః సి'అను సూత్రముచే (551) కకారము. 'సీయుట్'సకారమునకు షత్వము. సుడాగమసకారమునకు షత్వము; తకారమునకు ష్టుత్వము- 'యక్షీష్ట' అను రూపము సిద్ధించును. "యక్షీష్ట, యక్షీయాస్తామ్, యక్షీరన్: యక్షీష్ఠాః, యక్షీయాస్థామ్, యక్షీఢ్వమ్; యక్షీయ, యక్షీవహి, యక్షీమహి." లుఙ్:- (పరస్మైపది) అయాక్షీత్-అయాష్టామ్ - అయాక్షుః; అయాక్షీః - అయాష్టమ్—అయాష్ట; అయాక్షమ్-అయాక్ష్వ-అయాక్ష్మ.

అయాక్షీత్:- సిచ్, 'వదవ్రజహలన్తస్యాచః'అను సూత్రముచే(467) వృద్ధి, ఈడాగమము (447), జకారమునకు షకారము. దానికి కకారము, సకారమునకు మూర్ధన్యషకారము. 'అయాష్టామ్'ఇత్యాదులందు ష్టుత్వముచే తకారమునకు టకారము. లుఙ్ ఆత్మనేపదరూపములు:- అయష్ట - అయక్షాతామ్ - అయక్షత; అయష్ఠాః-అయక్షాథామ్-అయడ్ఢ్వమ్: అయక్షి-అయక్ష్వహి— అయక్ష్మహి. లృఙ్:- అయక్ష్యత్-అయక్ష్యత.

వహ ప్రాపణే. 9. వహతి, వహతే. ఉవాహ, ఊహతుః, ఊహుః ఉవహిథ.

'వహ'ధాతువునకు పొందించుట, మోయుట అని అర్థము. లట్టునందు 'వహతి' 'వహతే'ఇత్యాదిరూపము లగును.

లిట్టునందు ప్రక్రియ యజధాతువునందు వలె నుండును. 'ణల్', 'థల్' ప్రత్యయములు పర మగునపుడు కిత్త్వము లేదు గాన "లిట్యభ్యాసస్యోభయేషామ్" అను సూత్రముచే (549) అభ్యాసకు సంప్రసారణము చేయగా వకారస్థానమున

సంప్రసారణము ఉకారము గాన 'ఉవాహ' అను రూపము ప్రథమపురుషైకవచనమునం దగును. ఉత్తమపురుషైకవచనమున ణిత్త్వవికల్పముచే 'ఉవాహ' 'ఉవహ'అను రూపద్వయ మగును. కిత్స్థలములందు ద్విత్వమును బాధించి ముందుగ ''వచి, స్వపి, యజాదీనాం కితి''అను సూత్రముచే (550) సంప్రసారణము వచ్చును. పిమ్మట ద్విత్వపరసవర్ణ దీర్ఘాదులచే 'ఊహతుః', 'ఊహుః' ఇత్యాదిరూపము లగును. 'థల్'కు భారద్వాజనియమముచే వైకల్పిక ఇడాగమము చేయగా 'ఉవహిథ'అను రూప మగును ఇడాగమము రాని పక్షమున 'ఉవహ్థ'అని యుండగా 'హో ఢః'అను సూత్రముచే (251) హకారమునకు ఢకారము.

552. ఝష స్తథోర్ధోఽధః 8.2.40

ఝషః పరయోః తథోర్ధః స్యాత్, న తు దధాతేః.

'ఝష్'కంటె పరమైనవియు, ధాధాతుసంబద్ధములు కానివియు అగు తకార థకారములకు ధకారాదేశము వచ్చును.

ఈ సూత్రముచే ఢకారరూప మగు 'ఝష్'కంటె పర మగు థకారమునకు ధకారము. 'ఉవఢ్ధ' అని యుండగా, ష్టుత్వముచే ధకారమునకు ఢకారము—'ఉవఢ్ఢ'అని యుండగా:-

553. ఢో ఢే లోపః 8.3.13

ఢో లోపః స్యాత్ ఢే పరే.

ఢకారము పరముగ నున్నపుడు ఢకారమునకు లోపము వచ్చును. ఈ సూత్రముచే మొదటి ఢకారము లోపింపగా 'ఉవఢ' అని యున్నది.

554. సహివహోరోదవర్ణస్య 6.3.112

అనయోరవర్ణస్య ఓత్ స్యాత్ ఢలోపే. ఉవోఢ, ఊహే, వోఢా.

| | | |
|---|---|---|
| అవాక్షీత్ | అవోఢామ్ | అవాక్షుః |
| అవాక్షీః | అవోఢమ్ | అవోఢ |
| అవాక్షమ్ | అవాక్ష్వ | అవాక్ష్మ. |
| అవోఢ | అవక్షాతామ్ | అవక్షత |
| అవోఢాః | అవక్షాథామ్ | అవోఢ్వమ్ |
| అవక్షి | అవక్ష్వహి | అవక్ష్మహి |

అవక్ష్యత్, అవక్ష్యత.

ఇతి భ్వాదయః.

'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః'నుండి 'ఢ్రలోపే'అనువర్తించును. ఢకార లోపము కలిగినపుడు సహవహధాతువుల అవర్ణమునకు ఓకారము వచ్చును.

ఈ సూత్రముచే ఓకారము చేయగా 'ఉవోఢ' అను రూపము సిద్ధించినది. ఆత్మనేపదమున లిట్టు కిత్తు గాన ద్విత్వమును బాధించి మొదట సంప్రసారణ పూర్వరూపములు పిదప ద్విత్వసవర్ణదీర్ఘములు రాగా- ఊహే, ఊహాతే, ఊహిరే; ఊహిషే, ఊహాథే, ఊహిఢ్వే; ఊహే, ఊహివహే, ఊహిమహే-అను రూపము లగును. ఇచట 'ధ్వమ్', 'వహి', 'మహి' లకు క్రాదినియమముచే ఇడాగమము వచ్చినది.

లుట్టు ప్రథమపురుషైకవచనమున'వహ్తా'అని యుండగా'హో ఢః'(251) అను సూత్రముచే హకారమునకు ఢకారము. తకారమునకు ధకారము (సూ-552) ష్టుత్వముచే దానికి ఢకారము. మొదటి ఢకారమునకు లోపము (సూ-553). అకారమునకు ఓత్వము (సూ-554). 'వోఢా' అను రూపము సిద్ధించును. ఇట్లే వోఢారౌ, వోఢారః; వోఢాసి-వోఢాసే, ఇత్యాదిరూపములు సిద్ధించును.

లృట్‌నందు హకారమునకు ఢత్వము; ఢకారమునకు కకారము(సూ-551), సకారమునకు షత్వము చేయగా 'వక్ష్యతి,' 'వక్ష్యతే' ఇత్యాదిరూపము లగును. లోట్:- 'వహతు-వహతామ్' లఙ్:- 'అవహత్-అవహత' విధిలిఙ్:- 'వహేత్-వహేత' ఆశీర్లిఙ్:- 'ఉహ్యాత్' 'వక్షీష్ట'. ఇచట పరస్మైపదమునందు 'యాసుట్' కిత్తు గాన వకారమునకు సంప్రసారణ వచ్చినది. (సూ-550). ఆత్మనేపదమున సీయుడాగమము చేసిన పిదప ఢత్వ, కత్వ, షత్వములు వచ్చినవి.

లుఙ్ఙనందు అజాదిప్రత్యయము పర మగునపుడు 'సిచ్' లోపింపదు. ఢత్వ, కత్వ, షత్వములు వచ్చును. కషయోర్యోగే క్షః. తకారథకారధకారాది ప్రత్యయములు పర మగునపుడు 'ఝలో ఝలి'అను సూత్రముచే (480) సిచ్ లోపించును. హకారమునకు ఢత్వము, తకారాదులకు ధకారము (సూ-552), ష్టుత్వముచే ఢకారము, ప్రథమఢకారమునకు లోపము, ధాత్వవయవ మగు అకారమునకు ఓకారము వచ్చును. మూలమునందు చూపిన రూపములు సిద్ధించును. పరస్మైపదమున 'వద, వ్రజ, హలన్తస్యాచః' అను సూత్రముచే (467) వృద్ధి వచ్చును.

లృఙ్:- అవక్ష్యత్-అవక్ష్యత.

భ్వాదులు సమాప్తమైనవి.

# అథ అదాదిగణః

అద భక్షణే. 1.

## 555. అదిప్రభృతిభ్యః శపః 2.4.72

లుక్ స్యాత్. అత్తి, అత్తః, అదన్తి; అత్సి, అత్థః, అత్థ; అద్మి, అద్వః, అద్మః.

అదధాతువునకు భక్షించుట అని యర్థము. ఇది సాధారణముగ రాక్షసాదుల విషయమున ప్రయోగింపబడును. ఇది అనిట్కము.

"ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః"నుండి 'లుక్'అనువర్తించును. అద్ మొదలగు ధాతువులకంటె పర మగు 'శప్'కు లుక్ వచ్చును.

అత్తి:- అదధాతువునకు లట్టునందు 'తిప్'మొదలగు నాదేశములు చేర్చిన పిమ్మట 'కర్తరి శప్'అను సూత్రముచే (389) 'శప్' దానికి ఈ సూత్రముచే లోపము. 'అద్ + తి'అని యుండగా 'ఖరి చ'అను సూత్రముచే (74) దకారమునకు తకారము. 'అత్తి' అను రూపము సిద్ధించినది. 'ఝోఽన్తః' అను సూత్రముచే (391) ఝకారమునకు 'అన్త్'ఆదేశము చేయగా ప్ర.బ.వ.మున 'అదన్తి'అను రూప మగును. ఉ.పు మున 'ఖర్' పరముగ లేకుండుటచే దకారమునకు చర్త్వము రాదు. 'అద్మి' ఇత్యాదిరూపము లుండును.

## 556. లిట్యన్యతరస్యామ్ 2.4.40

అదో ఘస్లృ వా స్యాత్ లిటి. జఘాస. ఉపధాలోపః.

'అదో జగ్ధిర్ల్యప్తికితి''లుఙ్సనోర్ఘస్లృ'అను సూత్రములనుండి'అదః''ఘస్లృ' అనువర్తించును. అదధాతువునకు లిట్టు పర మగునపుడు 'ఘస్లృ'ఆదేశము వికల్పముగ వచ్చును.

ఌకారము ఇత్సంజ్ఞకము. 'ఘస్' ఆదేశము చేసిన పిమ్మట ద్విత్వము, అభ్యాసకార్యము, 'ఘ ఘస్ అ'అని యుండగా 'కుహోశ్చుః' అను సూత్రముచే (456) ఘకారమునకు ఝకారము. దానికి "అభ్యాసే చర్చ" అను సూత్రముచే (401) జశ్త్వము చేయగా జకారము. 'అత ఉపధాయాః'అను సూత్రముచే (457) అకారమునకు వృద్ధి 'జఘాస'అను రూపము (ప్ర.పు.ఏ.వ.) సిద్ధించును.

'అతుస్'పరముగ నున్నపుడు 'జఘస్ అతుస్' అని యుండగా, 'అతుస్ కిత్తు గాన "గమహనజనఖనఘసాం లోపః క్ఙిత్యనఙి"అను సూత్రముచే (508) ఉపధాఅకారమునకు లోపము. "జఘ్స్ అతుస్"అని యుండగా:-

557. శాసి,వసి,ఘసీనాఞ్చ 8.3.60

ఇణ్కుభ్యాం పరస్యైషాం సస్య షః స్యాత్. ఘస్య చర్త్వమ్- జక్షతుః. జక్షుః; జఘసిథ, జక్షథుః, జక్ష; జఘాస-జఘస, జక్షివ, జక్షిమ. ఆద, ఆదతుః, ఆదుః.

'సహేః సాడః సః' "అపదాన్తస్యమూర్ధన్యః" అను సూత్రములనుండి 'సః' 'మూర్ధన్యః' అనుపదములు, 'ఇణ్కోః' అను సూత్రము అనువర్తించును.

ఇణ్ కంటెను కవర్గముకంటెను పరమును, శాస్, వస్, ఘస్ ధాతువుల అవయవమును అగు సకారమునకు షకారము వచ్చును.

ఈ సూత్రముచే సకారమునకు షత్వము, ఘకారమునకు "ఖరి చ" అను సూత్రముచే (74) చర్త్వము (కకారము). 'జక్షతుః' అను రూపము సిద్ధించినది. 'కిత్' అగు లిట్టు పర మగునపుడు ఈ విధముగనే ఉపధాలోప, షత్వ, చర్త్వములు వచ్చును.

జఘసిథ:- అద్ధాతువునకు 'ఘస్'ఆదేశము లిట్,లుఙ్‌లందు మాత్రమే వచ్చును గాన దానికి 'తాస్'నందు ప్రయోగము లేదు. కావున ఇది 'తాస్'నందు 'నిత్యానిట్' అను ప్రసక్తి లేదు. అందుచే "అజన్తోకారవాన్వాయస్తాస్యనిట్ థలి వేదయమ్"అనునది దీని విషయమున వర్తించదు గాన క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చి 'జఘసిథ' అను రూప మగును. 'వ' 'మ'లు పర మగునపుడు గూడ ఈ విధముగనే నిత్యేడాగమముచే 'జఘసివ,జఘసిమ' అను రూపము లగును.

'ఘస్' ఆదేశము రాని పక్షమున ద్విత్వ, అభ్యాసకార్య, సవర్ణదీర్ఘాదులచే "ఆద, ఆదతుః, ఆదుః" ఇత్యాదిరూపము లగును. 'థల్'కు భారద్వాజనియమముచే ఇడాగమము వికల్పముగ రావలసి యుండగా:-

558. ఇడత్త్యర్తివ్యయతీనామ్ 7.2.66

అద్, ఋ, వ్యేఞ్, ఏభ్యస్థలో నిత్యమిట్ స్యాత్. ఆదిథ, అత్థ, అత్స్యతి, అత్తు-అత్తాత్, అత్తామ్, అదన్తు.

'అచస్తాస్వత్థల్యనిటోనిత్యమ్'నుండి 'థలి'అనువర్తించును. అద్, ఋ, వ్యేఞ్, ధాతువుల 'థల్'కు నిత్యముగ ఇడాగమము వచ్చును. దీనిచే నిత్యముగ ఇడాగమము వచ్చి 'ఆదిథ'అను రూప మగును.

అత్తా:— లుట్‌నందు ఇడాగమము రాదు గాన దకారమునకు చర్త్వముచే తకారాదేశము వచ్చి 'అత్తా'అను రూప మైనది. ఇట్లే లృట్‌నందు 'అత్స్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్టునందు 'శప్'కు 'లుక్' దకారమునకు యథాప్రాప్తముగ చర్త్వము చేయగా "అత్తు-అత్తాత్, అత్తామ్, అదన్తు." ఇత్యాదిరూపము లగును. మధ్యమపురుషైకవచనమున 'అద్ హి' అని యుండగా:-

## 559. హుఝల్భ్యో హేర్ధిః 6.4.101

హోర్ఝలన్తేభ్యశ్చ హేర్ధిః స్యాత్. అద్ధి-అత్తాత్, అత్తమ్, అత్త. అదాని, అదావ, అదామ.

'హు'ధాతువుకంటెను, ఝలన్తధాతువులకంటెను పర మైన 'హి'కి 'ధి' వచ్చును.

'అద్' అనునది ఝలన్త ధాతువు గాన ఈ సూత్రముచే 'హి'కి 'ధి' ఆదేశము చేయగా 'అద్ధి'అను రూప మైనది. ఉత్తమపురుషమున "ఆడుత్తమస్య పిచ్చ" అను సూత్రముచే (420) ఆడాగమము చేయగా "అదాని అదావ అదామ" అను రూపము లైనవి.

అదధాతువు అజాదిధాతువు గాన లఙ్ లుఙ్ లృఙ్‌లందు "ఆడజాదీనామ్" అను సూత్రముచే (446) ఆడాదేశము, లఙ్ ప్రథమపురుషైకవచనమున "ఆద్త్" అని యుండగా:-

## 560. అదః సర్వేషామ్ 7.3.100

అదః పరస్య అపృక్తసార్వధాతుకస్య అట్ స్యాత్ సర్వమతేన. ఆదత్. ఆత్తామ్, ఆదన్; ఆదః, ఆత్తమ్, ఆత్త; ఆదమ్, ఆద్వ, ఆద్మ. అద్యాత్, అద్యాతామ్, అద్యుః. అద్యాత్ - అద్యాస్తామ్ - అద్యాసుః.

'గుణోఽపృక్తే' 'తురుస్తుశమ్యమః సార్వధాతుకే' "అడ్ గార్గ్యగాలవయోః"అను సూత్రమునుండి 'అపృక్తే' 'సార్వధాతుకే' 'అట్' అనువర్తిం

చును. 'గార్గ్యగాలవయోః'అనునది అనువర్తింపకుండుటకై 'సర్వేషామ్' అని చెప్పబడినది. అందరి మతమునందును, 'అద్'రంతె పర మగు అపృక్తసార్వధాతుకమునకు 'అట్'అను నాగమము వచ్చును.

ఇచట 'త్'అనునది అపృక్తసార్వధాతుకము గాన ('అపృక్తఏకాల్ప్రత్యయః' 178) టిత్తగు అడాగమము ఆద్యవయవముగ వచ్చుటచే 'ఆదత్' అను రూపము సిద్ధించినది. ఆదన్:- 'ఝి'కి అన్తాదేశము వచ్చుటచే సిద్ధించినది. ఆదః:- 'సిప్'లోని సకారము మాత్రము శేషించును గాన పై సూత్రముచే అడాగమము చేయగా 'ఆదః' అను రూపము సిద్ధించినది. ఇతరస్థలములలో అపృక్తసార్వధాతుకము ఉండదు గాన అడాగమము వచ్చుటకు అవకాశము లేదు.

విధిలిఙ్గనందు 'లిఙః స్సలోపోఽనన్త్యస్య' అను సూత్రముచే (429) యాసుట్ లోని సకారమునకు లోపము వచ్చును. 'శప్' లోపించుటచే 'అత్' లేదు గాన 'అతో యేయః' అను సూత్రముచే (430) ఇయాదేశప్రసక్తి లేదు. "అద్యాత్, అద్యాతామ్, అద్యుః; అద్యాః, అద్యాతమ్, అద్యాత; అద్యామ్, అద్యావ, అద్యామ"అను రూపము లగును.

'ఆశీర్లిఙ్' ఆర్ధధాతుకము గాన 'యాసుట్' సకారమునకు 'లిఙః సలోపో నన్త్యస్య" అను సూత్రముచే (429) లోపము రాదు. ప్రథమపురుషైకవచనమునందు మాత్రము "స్కోః సంయోగాద్యోరన్తే చ" అను సూత్రముచే (310) సకారలోపము వచ్చును. ఈ విధముగ "అద్యాత్, అద్యాస్తామ్, అద్యాసుః, అద్యాః, అద్యాస్తమ్, అద్యాస్త! అదాసమ్, అదాస్వ, అద్యాస్మ" అను రూపము లగును.

## 561. లుఙ్సనోర్ఘస్ల 2.4.37

**అదో ఘస్లస్యాత్ లుఙి సని చ. ఇదిత్వాదఙ్. అఘసత్.అత్స్యత్. హన హింసాగత్యోః. 2. హన్తి.**

'అదో జగ్ధిర్ల్యప్తి కితి'నుండి 'అదః'అనువర్తించును. 'లుఙ్' 'సన్'లు పర మగునపుడు అద ధాతువునకు 'ఘస్ల'అను నాదేశము వచ్చును.

దీనియందలి ఇకారము ఇత్సంజ్ఞకము. 'అఘస్ చ్లి త్' అని యుండగా "పుషాదిద్యుతాద్యలృదితః పరస్మైపదేషు" అను సూత్రముచే (510) 'చ్లి'కి అఙా

దేశము. 'అఘసత్' అను రూప మగును. అఘసత్, అఘసతామ్, అఘసన్; అఘసః, అఘసతమ్, అఘసత; అఘసమ్. అఘసావ, అఘసామ.

'లృఙ్'నందు ఆడాగమాదులు వచ్చి 'ఆత్స్యత్' ఇత్యాదిరూపము లగును.

2. హన ధాతువునకు హింసించుట నడచుట అని అర్థము. ప్రథమపురుషైకవచనమునందు 'శప్'కు లుక్ వచ్చి 'హన్తి' అను రూపము సిద్ధించును.

562. అనుదాత్తోపదేశ, వనతి, తనోత్యాదీనామనునాసిక లోపో ఝలిక్ఙితి 6.4.37

అనునాసికాన్తానామేషాం వనతేశ్చ లోపః స్యాత్; ఝలాదౌ కితి ఙితి పరే.యమి, రమి, నమి, గమి, హని, మన్యతయోఽనుదాత్తోపదేశాః. "తను,క్షణు, క్షిణు, ఋణు,తృణు,ఘృణు, వను, మను' తనోత్యాదయః.హతః, ఘ్నన్తి, హంసి, హథః, హథ; హన్మి, హన్వః, హన్మః. జఘాన, జఘ్నతుః, జఘ్నుః.

'అనునాసిక' అనునది లుప్తషష్ఠ్యంతమగుపదము. అనునాసికాంతము లగు అనుదాత్తోపదేశధాతువులకును, వనధాతువునకును, తనోత్యాదులకును ఝలాది యగు కిత్తు గాని ఙిత్తు గాని యైన ప్రత్యయము పర మగునపుడు లోపము వచ్చును.

అలోన్త్యపరిభాషచే (21) ఈలోపము అంత్య మగు అనునాసికవర్ణమునకు వచ్చును. అనుదాత్తోపదేశధాతువులు వెనుక "ఊదృదన్తైః-" ఇత్యాది వాక్యములచే చూపబడినవి. వాటిలో అనునాసికాంతములు యమ్, రమ్, నమ, గమ్, హన్, మన్ధాతువులు, తన్,క్షణ్, క్షిణ్, ఋణ్, తృణ్, ఘృణ్, వన్, మన్ అనునవి తనోత్యాదులు. ప్రకృతమున 'హన్'ధాతువు అనునాసికాంతమగు అనుదాత్తోపదేశధాతువు. 'తిప్', 'సిప్', 'మిప్'భిన్నము లగు ప్రత్యయము లన్నియు "సార్వధాతుకమపిత్"అను సూత్రముచే (503) ఙిత్తులు. అందుచే ప్రథమపురుషద్వివచనమున 'హన్ తస్'అని యుండగా నకారమునకు లోపము-'హతః'అను రూపము సిద్ధించినది.

ప్రథమపురుషబహువచనమున హన్ అన్తి'అని యుండగా "గమ,హన,జన,ఖన.ఘసాం,లోపః క్ఙిత్యనఙి"అను సూత్రముచే (508) ఉపధా అకారమునకు లోపము-'హ్న్ అన్తి'."హో హన్తేర్ఞిన్నేషు"అను సూత్రముచే(288)

ఇచట హకారమునకు నకారము పరముగ నున్నది గాన కవర్గము-ఆంతరతమ్య
ముచే ఘకారము-వచ్చి 'ఘ్నన్తి' అను రూపము సిద్ధించును. 'హంసి':- 'హన్
సి' అని యుండగా "నశ్చాపదాన్తస్య ఝలి" అను సూత్రముచే (78) నకారమునకు
అనుస్వారము వచ్చినది. హథః, హథ-ఝలాదిజిత్ప్రత్యయములు పరముగ
నున్నవి గాన అనునాసికవర్ణలోపము. జఘాన:-లిట్, తిప్, ణల్, ద్విత్వ.
అభ్యాసకార్యములుచేసిన. పిదప "హ హన్ అ" అని యుండగా 'కుహోశ్చుః'
అను సూత్రముచే (456) అభ్యాసహకారమునకు ఝకారము: దానికి "అభ్యాసే
చర్చ" అను సూత్రముచే (401) జశ్త్వముచే జకారము-'జహన్ అ', ణిత్తు
అగు 'ణల్' (అ) పరముగ నున్నది గాన "హో హన్తేర్ఞ్ణిన్నేషు" అను సూత్ర
ముచే (288) హకారమునకు కవర్గీయ ఘకారము; 'అత ఉపధాయాః' అను సూత్ర
ముచే (457) ఉపధాభూత మగు అకారమునకు వృద్ధి-'జఘాన' అను రూపము
సిద్ధించినది.

"జఘ్నతుః", "జఘ్నుః"- అభ్యాసహకారమునకు 'కుహోశ్చుః'
అను సూత్రముచే (456) చుత్వము చేయగా ఝకారము. దానికి "అభ్యాసే
చర్చ" అను సూత్రముచే (401) జశ్త్వము-జకారము. "గమహనజనఖనఘసాం
లోపః క్ఙిత్యనఙి" అను సూత్రముచే (508) ఉపధాలోపము- 'జహ్న్ అతుస్'
అని యుండగా "హో హన్తేర్ఞ్ణిన్నేషు" అను సూత్రముచే (288) హకారము
నకు కుత్వముచే ఘకారము-"జఘ్నతుః" అను రూప మగును. ఇట్లే 'జఘ్నుః'
అను దాని ప్రక్రియ కూడ ఉండును.

'థల్'కు భారద్వాజనియమముచే ఇడాగమము వికల్పముగ వచ్చును.
'జహన్ ఇ థ' 'జహన్ థ' అని యుండగా.

563 అభ్యాసాచ్చ 7.3.55

అభ్యాసాత్ పరస్య హన్తేః హస్య కుత్వం స్యాత్. జఘనిథ-
జఘన్థ-జఘ్నథుః, జఘ్న; జఘాన-జఘన, జఘ్నివ, జఘ్నిమ. హన్తా.
హనిష్యతి. హన్తు-హతాత్, హతామ్, ఘ్నన్తు.

"హో హన్తేర్ఞ్ణిన్నేషు", "చజోః కు ఘిణ్యతోః" అను సూత్రముల
నుండి 'హః' 'హన్తేః' 'కు' అనువర్తించును. అభ్యాసముకంటె పర మగు
హనధాతుహకారమునకు కుత్వము వచ్చును.

ఈ సూత్రముచే హకారమునకు కుత్వముచే ఘకారము- 'జఘనిథ' 'జఘన్థ'అను రూపము లగును.

'జఘాన'-'జఘన':- 'ణలు త్తమో వా'అను సూత్రముచే (458) ణిత్త్వము వైకల్పికము గాన ణిత్త్వపక్షమున 'అచో ఞ్ణితి'అను సూత్రముచే (182) వృద్ధి. 'హో హన్తేర్ఞ్ణిన్నేషు'అను సూత్రముచే (288) రెండవ హకారమునకు కుత్త్వముచే ఘకారము ణిత్త్వాభావపక్షమున పై సూత్రము ప్రవర్తింపదు గాన 'అభ్యాసాచ్చ'అను సూత్రముచే (563) కుత్త్వము.

'వ' 'మ'లు పర మగునపుడు క్రాదినియమముచే ఇడాగమము నిత్యము. హన్తా:- లుట్ ప్రథమపురుషైకవచనమున 'హన్ తా'అని యుండగా 'నశ్చాప దాన్తస్య ఝలి'అను సూత్రముచే (78) నకారమునకు అనుస్వారము. దానికి మరల "అనుస్వారస్య యయి పరసవర్ణః"అను సూత్రముచే (79) పరసవర్ణ మగు నకారము. 'హన్తా'అను రూపము సిద్ధించినది. ఇచట "ఏకాచ ఉపదేశే ఽనుదాత్తాత్"అను సూత్రముచే (477) ఇడాగమనిషేధము.

లృట్ లృఙ్లందు "ఋద్ధనోః స్యే"అను సూత్రముచే (500) ఇడాగమము. 'హనిష్యతి' 'అహనిష్యత్' ఇత్యాదిరూపము లగును.

'హన్తు':- లోట్ ప్రథమపురుషైకవచనమున 'హన్తా' అనునపుడువలె అనుస్వారపరసవర్ణములు. 'హతాత్','హతామ్':- 'తాతఙ్' 'తామ్'లు పర మగునపుడు 'హన్ తాత్' "హన్ తామ్"అని యుండగా 'అనుదాత్తోపదేశ-' ఇత్యాది సూత్రముచే (562) నకారలోపము. ఘ్నన్తు:- ఉపధాలోపకుత్వాదులు 'ఘ్నన్తి'యందు వలె నుండును.

మధ్యమపురుషైకవచనమున 'హన్ సి'అని యుండగా "సేర్హ్యపిచ్చ" అను సూత్రముచే (417) 'హి'ఆదేశము. 'హన్ హి'అని యుండగా:-

### 564 హన్తేర్జః 6.4.36

హౌ పరే.

'శాహౌ' నుండి 'హౌ'అనువర్తించును. హన్ధాతువునకు 'హి'పర మగునపుడు 'జ'అనునది ఆదేశముగ వచ్చును.

దానిచే 'హన్'కు 'జ' ఆదేశము రాగా 'జహి' అను రూపము సిద్ధించినది.

565 అసిద్ధవదత్రాభాత్ 6.4.22

ఇత ఊర్ధ్వం ఆపాదసమాప్తేరాభీయమ్. సమానాశ్రయే తస్మిన్ కర్తవ్యే తదసిద్ధమ్. ఇతి జస్యాసిద్ధత్వాన్న హేర్లుక్. జహి-హతాత్, హతమ్, హత; హనాని, హనావ, హనామ. అహన్, అహతామ్, అఘ్నన్; అహన్, అహతమ్, అహత; అహనమ్, అహన్వ, అహన్మ. హన్యాత్.

'భస్య' అను భాధికారము షష్ఠాధ్యాయ చతుర్థపాదాంతము వరకు నుండును. కావున ఈ సూత్రము మొదలు ఈపాదాంతమువరకును ఆభీయ మని పేరు. ఒక కార్యము చేసిన పిమ్మట మరి యొక సమానాశ్రయకార్యము (అత్ర) చేయవలసి యుండ (ఆ) మొదటి కార్యము అసిద్ధము వంటి దగును.

ఇచట 'హి'పరక మగు 'హన్'ధాతువునకు 'జ'అను నాదేశము చేయ బడినది. ఇపుడు 'జహి' అని యుండగా 'అతో హేః' (6.4.105) అను సూత్రముచే 'హి'కి లోపము రావలసి యున్నది. 'జ'ఆదేశము వచ్చుటకు 'హన్'అను ప్రకృతియు, 'హి' అను ప్రత్యయమును ఆశ్రయము(నిమిత్తము). 'హి'లోపము వచ్చుటకు గూడ ఈ ప్రకృతి ('జ'అను అదన్తాంగము) ప్రత్యయములే నిమిత్తము. కావున ఈ సూత్రముచే మొదట వచ్చిన 'జ' ఆదేశము రెండవ దగు 'హి'లోపరూప మైన ఆభీయకార్యము చేయునపుడు అసిద్ధతుల్య మగును. అనగా 'హి'లోపవిధాయక సూత్రమునకు 'హన్'అనునదియే కనబడు చుండును గాన హిలోపము రాదు. 'జహి' అనియే యుండును.

'తాత్'మొదలగు ప్రత్యయములు పర మగునపుడు నకారలోపము, (సూ-562). ఉత్తమపురుషమునందు "ఆడుత్తమస్య పిచ్చ" అను సూత్రముచే(420) ఆడాగమము-'హనాని' ఇత్యాదిరూపము లగును.

'అహన్':- లఙ్లునకుతిబాదేశము, అడాగమము, 'శప్' ఇకారములకు లోపము- 'అహన్ త్'అని యుండగా "హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్సుతిస్యపృక్తంహల్" అను సూత్రముచే (179)గాని "సంయోగాన్తస్యలోపః" అను సూత్రముచేగాని (20) తకారమునకు లోపము- 'అహన్' రూపము సిద్ధించినది.

'తామ్'మొదలగు తకారాదిప్రత్యయములు పర మగునపుడు "అనుదాత్తోపదేశ-" ఇత్యాదిసూత్రముచే (562) నకారలోపము. 'అహతామ్' ఇత్యాది రూపము లగును.

'అఘ్నన్':- 'అహన్ అన్త్'అని యుండగా గమహనిత్యాదిసూత్రముచే (508) ఉపధాలోపము. 'అహన్ అన్త్' ఇపుడు హకారమునకు నకారము పర ముగ నున్నది గాన "హోహన్తేర్ఞ్ణిన్నేషు"అను సూత్రముచే (288) కుత్వము (ఘకారము). తకారమునకు సంయోగాన్తలోపము. 'అఘ్నన్' అను రూపము సిద్ధించును.

మధ్యమపురుషైకవచనమున 'సిప్'పర మగునపుడు గూడ 'తిప్' పరమై నపుడు వలె రూపసిద్ధి యగును. ఉత్తమపురుషమున విశేషకార్య మేదియు లేదు.

విధిలిఙ్:- హన్యాత్, హన్యాతామ్, హన్యుః; హన్యాః, హన్యాతమ్, హన్యాత; హన్యామ్, హన్యావ, హన్యామ.

566. ఆర్ధధాతుకే 2.4.35

ఇత్యధికృత్య.

567. హనోవధలిఙి 2.4.42

హనో వధ ఇత్యాదేశః స్యాత్ ఆర్ధధాతుకే లిఙి.

568. లుఙి చ 2.4.43

వధాదేశోఽదన్తః. ఆర్ధధాతుకే ఇతి విషయసప్తమీ. తేనార్ధధాతుకోపదేశే అదన్తత్వాత్ అతో లోపః- వధ్యాత్, వధ్యాస్తామ్. అవధీత్, అహనిష్యత్.

'ఆర్ధధాతుకే'అధికారము. హనధాతువునకు ఆర్ధధాతుకలిఙ్ విషయమగు నపుడు అనగా హనధాతువునకు ఆర్ధధాతుకలిఙ్ చేర్చవలసి యున్నపుడు—వధ అను నాదేశము వచ్చును. (568) ఆర్ధధాతుక మగు లుఙ్ చేర్చవలసి యున్న పుడు గూడ వధాదేశము వచ్చును. ఇచట విహిత మగు 'వధ' ఆదేశము అదంతము. అనగా చివరి అకారము ఇత్సంజ్ఞము కాదు.

'ఆర్ధధాతుకే' అనునపుడు సప్తమి విషయసప్తమి. అధికరణసప్తమి కాదు. అధికరణసప్తమి యైనచో ఆర్ధధాతుకలిఙ్ లేక లుఙ్ పర మగునపుడు వధాదేశము వచ్చును అను నర్థము చెప్పవలసి యుండును. అనగా ఈ ఆర్ధధాతుకము చేర్చిన పిమ్మటనే వధాదేశము వచ్చును గాన అది చేర్చు సమయమునకు అచట 'వధ' అనునది ఉండదు. 'హన్' అనునదియే యుండును, అట్లు కాక విషయసప్తమిని గ్రహించి ఆర్ధధాతుకము విషయమైనపుడు—అనగా ఆర్ధధాతుక

మును చేర్చవలసి యున్నపుడు, దానిని చేర్చుటకు పూర్వమే—వధాదేశము వచ్చు నని అర్థము గ్రహించినచో ఆర్ధధాతుకము చేర్చు నరికి 'వధ' ఆదేశము వచ్చి యుండును. కావున ఇపుడు ఆర్ధధాతుకోపదేశకాలమున అదంత మగు 'వధ'అనునది ఉన్నది గాన దాని అకారమునకు 'అతో లోపః' అను సూత్రముచే (472) లోపము చేయుటకు వీలగును.

'వధ' ఆదేశము అకారాంత మని. అంగీకరించి, దానికి 'అతో లోపః' అను సూత్రముచే (472) లోపము వచ్చుటకై 'ఆర్ధధాతుకే' అనునది విషయ సప్తమి యని వ్యాఖ్యానించునావశ్యకత లేకుండుటకై 'వధ'అనుదానిలోని చివరి అకారము ఇత్సంజ్ఞక మని గ్రహించినను గ్రహింపవచ్చును. అట్లు చేయుటచే ఆశీర్లిఙ్నందు దోష మేదియును ఉండదు. కాని 'లుఙ్'నందు చిక్కు వచ్చును. అపుడు 'వధ్'అనునదియే ఆదేశ మగును గాన 'అతో హలాదేర్లఘోః' అను సూత్రముచే (459) ఉపధా అకార మగు వకారోత్తరవర్తి అకారమునకు వైకల్పికవృద్ధి రావలసి యుండును. తన్నివృత్తికై 'వధ' అనుదానిని అకారాంత మని అంగీకరించి దానికి లోపము చేసినచో వృద్ధి సూత్రము ప్రవర్తింపవలసి నపుడు అకారలోపమునకు "అచః పరస్మిన్ పూర్వవిధౌ"అను సూత్రముచే(699) స్థానివద్భావము చేయుటచే వకారోత్తరవర్తి అకారము ఉపధ కాదు గాన వృద్ధి రాదు. 'వధ' అనునది అకారాంతదేశ మని చెప్పుటకు ఇదియే ప్రయోజనము.

ఆశీర్లిఙ్నందు వధాదేశము చేయుటచే "వధ్యాత్, వధ్యాస్తామ్, వధ్యాసుః" ఇత్యాదిరూపము లగును.

లుఙ్నందు వధాదేశము, సిచ్, అకారలోపము—"అవధ్ స్ త్"అని యుండగా 'వధ్'అనునది ఇపుడు ఏకాచ్కమైనను ఉపదేశకాలమున అనేకాచ్కము గాన "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్"అను, ఇడాగమనిషేధము ప్రవర్తింపదు గాన 'సిచ్'కు ఇడాగమము వచ్చును. పైన చూపిన విధముగ అకారలోపమునకు స్థానివద్భావముచే వృద్ధి రాదు. "అవధీత్, అవధిష్టామ్, అవధిషుః, అవధీః, అవధిష్టమ్, అవధిష్ట; అవధిషమ్, అవధిష్వ, అవధిష్మ" అను రూపము లగును.

యు మిశ్రణామిశ్రణయోః. 3.

569. ఉతో వృద్ధిర్లుకి హలి 7.3.89

లుగ్విషయే ఉతో వృద్ధిః పితి హలాదౌ సార్వధాతుకే, న త్వభ్య

స్తస్య. యౌతి, యుతః, యువన్తి; యౌషి, యుథః, యుథ; యౌమి, యువః, యుమః, యుయావ, యవితా. యవిష్యతి యౌతు-యుతాత్. అయౌత్, అయుతామ్. అయువన్, యుయాత్- ఇహ ఉతో వృద్ధిర్న; భాష్యే "జిచ్చ పిన్న; పిచ్చ జిన్న". ఇతి వ్యాఖ్యానాత్. యుయాతామ్, యుయుః, యూయాత్, యూయాస్తామ్, యూయాసుః. అయావీత్. అయవిష్యత్.

'యు'ధాతువునకు కలియునట్లు చేయుట, విడదీయుట అని యర్థములు.

"నాభ్యస్తస్యాచి సార్వధాతుకే"నుండి "అచి' అనునది తప్ప మిగిలిన పదములు అనువర్తించును. 'లుక్' అనునది అభావరూపము గాన, అది పర మగుట అసంభావ్యము గాన, 'లుకి' అనుదానికి 'లుక్' విషయమైనపుడు అను అర్థము. పకారేత్కమును, హలాదియు నగు సార్వధాతుకము పర మగునపుడు, లుగ్విషయమున, (లుక్ వచ్చెడు సందర్భమున) ఉకారమునకు వృద్ధి వచ్చును. అభ్యస్తసంజ్ఞక మగు ధాతువునకు మాత్రము రాదు.

తిప్, సిప్, మిప్,లు పిత్సార్వధాతుకములు గాన యుధాతువునకు ఇవి పర మగునపుడు, గుణమ్మును బాధించి ఈ సూత్రముచే వృద్ధి వచ్చును. ఇతరప్రత్యయములకు జిద్వద్భావముచే అచట కూడ గుణము రాదు. 'యౌతి' 'యుతః' ఇత్యాదిరూపము లైనవి 'యువన్తి' అనునపుడు "అచి శ్నుధాతుభ్రువాంయ్వో రియఙువఙౌ"అను సూత్రముచే (199) ఉవఙాదేశము.

'లిట్'ప్రథమపురుష 'ణల్' పర మగునపుడు వృద్ధి ఆవాదేశములచే 'యుయావ'అను రూపము, ఉత్తమపురుష 'ణల్'నందు ణిత్త్వము వైకల్పికము గాన తదభావపక్షమున గుణఅవాదేశములు వచ్చుటచే 'యుయావ' 'యుయవ' అను రూపద్వయమును ఉండును. 'కిత్' ప్రత్యయములందు గుణనిషేధము ప్రవర్తించుటచే ఉవఙాదేశము వచ్చును. ఈ ధాతువు 'ఊదృదన్తైః' అను శ్లో. మున సంగ్రహింపబడినది గాన ఉదాత్తోపదేశము- సేట్కము. కావున 'థల్', 'వ', 'మ'లయందు ఇడాగమము వచ్చును. "యుయావ, యుయువతుః, యుయువుః; యుయువిథ, యుయువథుః, యుయువ; యుయావ- యుయవ, యుయువివ, యుయువిమ,"అను రూపము లగును.

లుట్, లృట్' లందు ఇడాగమ, గుణ, అవాదేశాదులచే 'యవితా' 'యవిష్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్టునందు "యౌతు-యుతాత్, యుతామ్, యువన్తు, యుహి-యుతాత్, యుతమ్, యుత; యవాని, యవావ, యవామ" అను రూపము లగును.

'యౌతు':- ప్రథమపురుషైకవచనమున 'తు' ఉన్నపుడు అది పకారేత్కము గాన వృద్ధి వచ్చినది. 'తాతఙ్' ఆదేశము ఙిత్తు గాన వృద్ధి లేదు. 'యుతాత్'అను రూప మైనది. యుహి:- 'సిప్' స్థానమున వచ్చిన 'హి', 'అపిత్' గాన పై సూత్రముచే వృద్ధి రాలేదు. "సార్వధాతుకమపిత్" అను సూత్రముచే (503) ఙిద్వద్భావము వచ్చుటచే గుణము కూడ రాదు. ఉత్తమ పురుషమున "ఆడుత్తమస్య పిచ్చ" అను సూత్రముచే (420) ఆడాగమము వచ్చినది. దానికి పిత్త్వ మున్నను, అది హలాది కాదు గాన వృద్ధి రాదు. గుణ అవాదేశములచే 'యవాని' ఇత్యాదిరూపములు వచ్చినవి.

'లఙ్'నందు 'తిప్' 'సిప్'లు పర మగునపుడు వృద్ధి వచ్చును. 'మిప్' 'అమ్' ఆదేశము చేసిన పిమ్మట అది అజాది యైనది గాన వృద్ధి రాదు. "అయౌత్, అయుతామ్, అయువన్: అయౌః, అయుతమ్, అయుత; అయవమ్ (గుణావాదేశములు), అయువ, అయుమ".

విధిలిఙ్నందు యుయాత్, యుయాతామ్, యుయుః: యుయాః, యుయాతమ్, యుయాత; యుయామ్, యుయావ, యుయామ" అను రూపము లగును. యాసుట్ 'తిప్'కు ఆగమముగ వచ్చినను దానికి ఙిత్త్వము విధింపబడుటచే ఆ ఙిత్త్వముపిత్త్వమును బాధించును. అనగా ఇచట తిప్, సిప్, మిప్,లకు ఙిత్త్వమే గాని పిత్త్వ ముండదు. ఈ విషయమునే భాష్యకారులు "ఙిచ్చపిన్న, పిచ్చ ఙిన్న" ('ఙిత్' 'పిత్' కాదు, 'పిత్' 'ఙిత్' కాదు) అని స్పష్టీకరించి యున్నారు. అందుచే తిబాదులందు పై సూత్రముచే వృద్ధి రాదు.

ఆశీర్లిఙ్నందు 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః' అను సూత్రముచే (485) దీర్ఘము వచ్చి యూయాత్, యూయాస్తామ్, యూయాసుః, యూయాః, యూయాస్తమ్, యూయాస్త; యూయాసమ్, యూయాస్వ, యూయాస్మ"అను రూపము లగును.

లఙ్లునందు "సిచి వృద్ధిః పరస్మైపదేషు" అను సూత్రముచే (486) వృద్ధియు, ఆవాదేశము వచ్చి "అయావీత్, అయావిష్టామ్, అయావిషుః, అయావీః, అయావిష్టమ్, అయావిష్ట; అయావిషమ్, అయావిష్వ, అయావిష్మ"అను రూపము లగును.

లృఙ్లునందు ఇడాగమ, గుణ, అవాదేశములచే "అయవిష్యత్" ఇత్యాది రూపము లగును.

యా ప్రాపణే. 4. యాతి, యాతః, యాన్తి. యయౌ. యాతా, యాస్యతి. యాతు. అయాత్, అయాతామ్.

'యా'ధాతువునకు పొందించుట (వెళ్ళుట) అని అర్థము. 'లట్'నందు శబ్లుక్‌చే "యాతి, యాతః, యాన్తి; యాసి, యాథః, యాథ; యామి, యావః, యామః"అను రూపము లగును.

లిట్:- యయౌ, యయతుః యయుః; యయిథ-యయాథ, యయథుః, యయ; యయౌ, యయివ, యయిమ.

యయౌ;- ద్విత్వఅభ్యాసకార్యహ్రస్వములు (సూ-339) చేసిన పిమ్మట 'యయా అ' అని యుండగా 'ఆత ఔ ణలః'అను సూత్రముచే (491) 'ణల్‌కు' ఔకారము. వృద్ధి- 'యయౌ'అను రూపము సిద్ధించినది. 'అతుస్' మొదలగు అజాదిప్రత్యయములు పర మగునపుడు "ఆతో లోప ఇటి చ" అను సూత్రముచే (492) ఆకారలోపము వచ్చును. అనిట్టు అగు అజంతధాతువు గాన భారద్వాజ నియమముచే 'థల్'నందు ఇడ్వికల్పము—'యయిథ-యయాథ' అను రూప ద్వయ మగును. ఇడాగమము వచ్చినపుడు "ఆతో లోప ఇటి చ" అను సూత్ర ముచే (492) ఆకారలోపము. ఇడభావపక్షమున 'థల్'హలాదిగ నుండును గాన లోపప్రసక్తి లేదు.

ఇది అనిడ్ధాతువు గాన 'లుట్, 'లృట్', లందు 'యాతా' 'యాస్యతి' ఇత్యాదిరూపము లగును. 'లోట్'నందు శబ్లుక్ చేసిన పిమ్మట 'యాతు - యాతాత్, యాతామ్, యాన్తు' ఇత్యాదిరూపము లగును.

లఙ్లునందు అడాగమాదులు చేసిన పిమ్మట "అయాత్, అయాతామ్" ఇత్యాదిరూపము లగును. ప్రథమపురుషబహువచనమున 'అయా ఝి' అని యుండగా;-

570. లఙః శాకటాయనస్యైవ 3.4.111

ఆదన్తాత్ పరస్య లఙో ఝేర్జుస్ వా స్యాత్. అయుః, అయాన్:
యాయాత్, యాయాతామ్, యాయుః, యాయాత్, యాయాస్తామ్,
యాయాసుః. అయాసీత్. అయాస్యత్.

'ఝేర్జుస్' 'ఆతః' అను సూత్రములు అనువర్తించును. ఆదంతధాతువు
కంటె పర మగు లఙ్‌కు ఆదేశ మైన 'ఝి'కి 'జుస్' వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే 'జుస్' ఆదేశము చేసిన పిమ్మట, "ఉస్యపదాన్తాత్"
అను సూత్రముచే (495) పరరూపము చేయగా 'అయుః' అను రూపము. 'జుస్'
రాని పక్షమున, అన్తాదేశము, ఇకారలోపము, సంయోగాన్తలోపము చేయుటచే
'అయాన్'అను రూపము సిద్ధించును. మధ్యమపురుషాదులలో విశేషకార్య మేది
యును లేదు.

విధిలిఙ్:- యాయాత్, యాయాతామ్, యాయుః: యాయాః, యాయా
తమ్. యాయాత; యాయామ్. యాయావ, యాయామ.

ఆశీర్లిఙ్:- యాయాత్, యాయాస్తామ్ యాయాసుః; యాయాః, యాయా
స్తమ్. యాయాస్త; యాయాసమ్, యాయాస్వ, యాయాస్మ.

'లుఙ్'నందు 'యమరమనమాతాం సక్చ'అను సూత్రముచే (498) ధాతువు
నకు 'సక్'ఆగమము, 'సిచ్'కు ఇడాగమము వచ్చి 'సిచ్'లోపాదులచే 'అగ్లాసీత్'
ఇత్యాదిరూపముల వలె 'అయాసీత్' ఇత్యాదిరూపము లగును. 'ఌఙ్'నందు
'అయాస్యత్' ఇత్యాదిరూపము లగును.

వా గతి గన్ధనయోః. 5. భా దీప్తౌ. 6. ష్ణా శౌచే. శ్రా పాకే 8.
ద్రా కుత్సాయాం గతౌ. 9. ప్సా భక్షణే 10. రా దానే. 11. లా ఆదానే.
12. దాప్ లవనే. 13. పా రక్షణే. 14. ఖ్యా ప్రకథనే 15. అయం ఆర్ధ
ధాతుక ఏవప్రయోక్తవ్యః. విద జ్ఞానే. 16.

'వా'మొదలగు ఆకారాంతధాతువుల రూపములు యాధాతురూపముల వలె
నుండును.

5. వా ధాతువునకు నడచుట, సూచించుట అని అర్థములు. వాతి. వవౌ,
వాతా. వాస్యతి. వాతు. అవాత్, అవుః-అవాన్. వాయాత్. వేయాత్,
అవాసీత్. అవాస్యత్.

6. 'భా'ధాతువునకు ప్రకాశించుట అని అర్థము భాతి. బభౌ. భాతా, భాస్యతి. భాతు. అభాత్. అభుః-అభాన్. భాయాత్. భాయాత్. అభాసీత్, అభాస్యత్.

7. 'ష్ణా' ధాతువునకు స్నానముచేయుట అని అర్థము. "ధాత్వాదేః షః సః" అను సూత్రముచే (255) షకారమునకు సకారము. షకారము పోవుటతో "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః"అను న్యాయముచే తన్నిమిత్తక మగు ణత్వము కూడ పోయి 'స్నా' అనునది యుండును. ఇది సంయోగాదిధాతువు గాన ఆశీర్లిఙ్గునందు 'వాన్యస్య సంయోగాదేః' అను సూత్రముచే (497) ఏత్వ వికల్పముచే 'స్నేయాత్' "స్నాయాత్" అను రూపద్వయము సిద్ధించును. 'శ్రా', 'ద్రా', 'ప్సా' ధాతువులందు కూడ ఇట్లే రూపద్వయ ముండును. స్నాతి. సస్నౌ. స్నాతా. స్నాస్యతి స్నాతు. అస్నాత్, స్నాయాత్ స్నేయాత్-స్నాయాత్, అస్నాసీత్, అస్నాస్యత్.

8. 'శ్రా'ధాతువునకు వండుట అని అర్థము శ్రాతి. శశ్రౌ, శ్రాతా, శ్రాస్యతి. శ్రాతు, అశ్రాత్. శ్రాయాత్. శ్రేయాత్ - శ్రాయాత్. అశ్రాసీత్. అశ్రాస్యత్.

9. 'ద్రా' ధాతువునకు చెడ్డగ ప్రవర్తించుట అని యర్థము. ద్రాతి. దద్రౌ, ద్రాతా. దాస్యతి. ద్రాతు. అద్రాత్. ద్రాయాత్. ద్రేయాత్ - ద్రాయాత్. అద్రాసీత్. అద్రాస్యత్.

10. 'ప్సా' ధాతువునకు తినుట అని అర్థము ప్సాతి, పప్సౌ, ప్సాతా. ప్సాస్యతి, ప్సాతు, అప్సాత్, ప్సాయాత్, ప్సేయాత్ - ప్సాయాత్, అప్సాసీత్. అప్సాస్యత్.

11. 'రా' ధాతువునకు ఇచ్చుట అని అర్థము. రాతి, ररౌ, రాతా, రాస్యతి. రాతు, అరాత్, రాయాత్, రాయాత్, అరాసీత్, అరాస్యత్.

12. 'లా' ధాతువునకు దీసికొనుట యని అర్థము. లాతి, లలౌ, లాతా, లాస్యతి, లాతు, అలాత్, లాయాత్, లాయాత్, అలాసీత్, అలాస్యత్.

13. 'దాప్' ధాతువునకు ఖండించుట అని అర్థము. దాతి, దదౌ, దాతా, దాస్యతి, దాతు, అదాత్, దాయాత్, దాయాత్, అదాసీత్, అదాస్యత్

'దాధాఘ్వదాప్' అను సూత్రమున (626) 'దాప్' ధాతువునకు ఘుసంజ్ఞ నిషిద్ధము గాన ఆశీర్లిఙ్‌నందు 'ఏర్లిఙి' అను సూత్రముచే (493) ఏత్వము రాలేదు.

14. 'పా' ధాతువునకు రక్షించుట అని అర్థము. 'ఏర్లిఙి' అను సూత్రమునందును (493) ''గాతిస్థాఘుపాభూభ్యః పరస్మైపదేషు''అను సూత్రమునందును (441) భ్వాదిగణమునందలి పాధాతువును మాత్రమే గ్రహించుటచే ఆశీర్లిఙ్ఙనందు ఏత్వము, లుఙ్ఙనందు 'సిచ్'కు లోపము రాదు. పాతి, పపౌ, పాతా, పాస్యతి, పాతు, అపాత్, పాయాత్, పాయాత్, అపాసీత్. అపాస్యత్.

15. 'ఖ్యా' ధాతువునకు చెప్పుట అని అర్థము. ఇది సార్వధాతుకములందు మాత్రమే (లట్, లోట్, లఙ్, విధిలిఙ్) ప్రయోగింపబడును. ఖ్యాతి, ఖ్యాతు, అఖ్యాత్, ఖ్యాయాత్.

16. 'విద' ధాతువునకు తెలిసికొనుట అని అర్థము. అనిడ్ధాతువులలో గణింపబడిన ధాతువు దివాదిగణమునకు చెందిన దగుటచే ఇది సేట్కము.

571. విదో లటో వా 3.4.83

వేత్తేర్లటః పరస్మైపదానాం ణలాదయో వా స్యుః. వేద, విదతుః, విదుః; వేత్థ, విదథుః, విద; వేద, విద్వ, విద్మ, పక్షే, వేత్తి. విత్తః, విదన్తి.

''పరస్మైపదానాం ణలతుసుస్థలథుసణల్వమాః'' అను సూత్రము అనువర్తించును. విదధాతువుకంటె పరమైన లట్టునకు ఆదేశముగ వచ్చిన పరస్మైపదప్రత్యయములకు 'ణల్'మొదలగు ఆదేశములు వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే ణలాద్యాదేశములు చేర్చగా 'వేద' ఇత్యాదిరూపములగును. ఇచ్చట తిబాదులకు ణలాదులు వచ్చినను ఇది లిట్టు కాకుండుటచే ద్విత్వాభ్యాసకార్యాదులకు గాని, ఆర్ధధాతుకముకాకుండుటచే ఇడాగమమునకు గాని ప్రసక్తి లేదు. ణలాదులు రాని పక్షమున ''వేత్తి, విత్తః విదన్తి; వేత్సి, విత్థః, విత్థ; వేద్మి, విద్వః, విద్మః''అను రూపము లగును.

572. ఉషవిదజాగృభ్యోన్యతరస్యామ్ 3.1.38

ఏభ్యో లిటి ఆమ్ వా స్యాత్. విదేరదన్తప్రతిజ్ఞానాత్ ఆమి న గుణః. విదాఞ్చకార. వివేద. వేదితా. వేదిష్యతి.

"కాస్ప్రత్యయాదామమన్త్రే లిటి"నుండి 'ఆమ్' 'లిటి' అనువర్తించును. ఉష్. విద్, జాగృధాతువులకంటె లిట్టు పరమైనపుడు 'ఆమ్' వికల్పముగ వచ్చును.

ఈ ఆమ్ప్రత్యయము చేర్చిన పిదప "కృఞ్చానుప్రయుజ్యతే లిటి" అను సూత్రముచే (474) 'కృభ్వస్' ధాతువులు అనుప్రయుక్తము లగును. 'ఆమ్' చేర్చిన పిమ్మట 'పుగన్తలఘూపధస్య'చ' అను సూత్రముచే(453)గుణము రావలసి యున్నది. కాని 'విద'ధాతువును అకారాంతముగ అంగీకరించి ఆ అకారమునకు "అతో లోపః"అను సూత్రముచే (472) లోపము చేయుటచే లుప్తమగు ఆ అకారమునకు స్థానివద్భావముచే 'విద్'లోని ఇకారము లఘూపధము కాదు గాన గుణము రాదు. 'విదాఞ్చకార' 'విదామ్బభూవ' 'విదామాస' ఇత్యాదిరూపము లగును. 'ఆమ్' రాని పక్షమున 'వివేద, వివిదతుః, వివిదుః; వివేదిథ, వివిదథుః, వివిద; వివేద, వివిదివ, వివిదిమ'అను రూపము లగును. లుట్, ల్రుట్టులందు 'వేదితా', 'వేదిష్యతి' ఇత్యాదిరూపము లగును.

• 573. విదాఙ్కుర్వన్త్విత్యన్యతరస్యామ్ 3.1.41

వేత్తేర్లోటి ఆమ్, గుణాభావో, లోటో లుక్, లోడన్తకరోత్యనుప్రయోగశ్చ వా నిపాత్యతే. పురుషవచనే న వివక్షితే.

ఈ సూత్రము 'విదాఙ్కుర్వన్తు'అను రూపమును వికల్పముగ నిపాతించుచున్నది. 'విదాంకుర్వన్తు' అనునది ప్రథమపురుషబహువచనరూపమైనను ఇట్టి 'ఆమ్'ప్రత్యయాదులతో గూడిన రూపము ప్రథమపురుషబహువచనమునందు మాత్రమే వచ్చునను నియమము లేదు. అనగా లోట్టునందు అన్ని పురుషములందును, అన్ని వచనములందును ఇట్టి రూపము ఉండును.

విద్ధాతువునకు లోట్టు పరమగునపుడు, 'ఆమ్' గుణమురాకుండుట, 'లోట్'కు లోపము, 'లోట్'అంతమునందు గల 'కృఞ్'ధాతువునకు అనుప్రయోగము ఈ సూత్రముచే నిపతింపబడుచున్నవి.

ఈ విధముగ ప్రథమపురుషైకవచనమున "విదామ్కృతి"అని యుండునపుడు 'శప్' రావలసి యుండగా:-

574. తనాదికృఞ్భ్య ఉః 3.1.79

తనాదేః కృఞశ్చ ఉః ప్రత్యయః స్యాత్ శపోఽపవాదః. విదాఙ్కరోతు.

తనాదులకును 'కృఞ్'ధాతువునకును 'ఉ'ప్రత్యయము వచ్చును.

ఇది 'శప్'కు అపవాదము గాన దానిని బాధించి వచ్చును. 'విదామ్ కృ ఉ తి'అని యుండగా 'ఉ'అనునది ఆర్ధధాతుకము గాన అది పరముగ నున్నపుడు ఋకారమునకును, 'తి' సార్వధాతుకము గాన అది పరముగా గల ఉకారమునకు 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రముచే(390)గుణము.'ఏరుః'అను సూత్రముచే (413) 'తి'యందలి ఇకారమునకు ఉకారము. ''విదామ్ కరోతు'' అని యుండగా 'నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే (78) మకారమునకు అనుస్వారము; 'అనుస్వారస్య యయి పరసవర్ణః' అను సూత్రముచే (79) అనుస్వారమునకు పరసవర్ణ మగు ఞకారము వచ్చి 'విదాఙ్కరోతు' అను రూపము సిద్ధించును.

'తు'కు 'తాతఙ్' ఆదేశము చేసిన పక్షమున 'విదాఙ్కరుతాత్' అని యుండగా:-

575. అత ఉత్ సార్వధాతుకే 6.4.10

ఉప్రత్యయాన్తస్య కృఞోఽత ఉత్సార్వధాతుకే క్ఙితి. విదాఙ్కరుతాత్, విదాఙ్కరుతామ్, విదాఙ్కుర్వన్తు; విదాఙ్కరు: విదాఙ్కరవాణి. అవేత్, అవిత్తామ్, అవిదుః.

'ఉతశ్చ ప్రత్యయాదసంయోగపూర్వాత్'నుండి 'ఉతః' 'ప్రత్యయాత్' అనువర్తించును. 'కిత్' గాని 'ఙిత్' గాని అయిన సార్వధాతుకము పర మగునపుడు ఉప్రత్యయాంత మగు 'కృఞ్'ధాతువునకు సంబంధించిన హ్రస్వఅకారమునకు హ్రస్వఉకారము ఆదేశముగ వచ్చును.

ఇచట 'తాతఙ్' 'ఙిత్' అగు సార్వధాతుకము గాన కకారోత్తరవర్తి యగు అకారమునకు ఉకార మాదేశముగ వచ్చి "విదాఙ్కరుతాత్"అను రూప మగును.'తామ్'మొదలగునవి కూడ"సార్వధాతుకమపిత్"అను సూత్రముచే(503) ఙిత్తులుగాన ఈ సూత్రముచే ఉకారము వచ్చి 'విదాఙ్కరుతామ్' 'విదాఙ్కుర్వన్తు' ఇత్యాదిరూపము లగును. 'విదాఙ్కరు అన్తు' అని యుండగా యణాదేశము వచ్చినది.

'సేర్హ్యపిచ్చ'అను సూత్రముచే (417) 'సిప్' స్థానమున వచ్చిన 'హి' 'అపిత్' గాన 'ఙిత్'అగును. అందుచే ఉకారము వచ్చును. 'ఉతశ్చ ప్రత్యయా

దసంయోగపూర్వాత్"అను సూత్రముచే (506) 'హి'కి లోపము. 'విదాఙ్కురు' అను రూపము సిద్ధించును.

ఉత్తమపురుషమున "ఆడుత్తమస్య పిచ్చ" అను సూత్రముచే (420) వచ్చిన ఆడాగమము 'పిత్' గాన దానికి 'సార్వధాతుకమపిత్' అను సూత్రముచే (503) ఙిత్త్వము లేదు అందుచే అకారమునకు ఉకారము రాదు. 'విదాఙ్కరు ఆని' అని యుండగా ఉకారమునకు గుణము, అవాదేశము చేయ 'విదాఙ్కరవాణి' అను రూప మగును. ఇట్లే ద్వివచనబహువచనములందు ప్రక్రియ యుండును.

'ఆమ్'ప్రత్యయాదులు రాని పక్షమున అదధాతువునందు వలె "వేత్తు - విత్తాత్, విత్తామ్- విదన్తు; విద్ధి-విత్తాత్, విత్తమ్- విత్త; వేదాని, వేదావ, వేదామ" అను రూపము లగును.

ఉత్తమపురుషమునందు 'ఆడుత్తమస్య పిచ్చ' అను సూత్రముచే (420) వచ్చిన ఆడాగమము 'పిత్' గాన (ఙిత్త్వము లేకుండుటచే) "పుగన్తలఘూపధస్య చ" అను సూత్రముచే (463) గుణము వచ్చినది.

అవేత్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున 'అవేద్ త్' అని యుండగా "హల్ఙ్యాది"సూత్రముచే (179) 'త్'కు లోపము. దకారమునకు 'వావసానే' అను సూత్రముచే (146) వైకల్పికచర్త్వము చేయగా 'అవేత్' 'అవేద్'అను రూపద్వయము సిద్ధించును.

అవిత్తామ్:- ద్వివచనమున అపిత్సార్వధాతుకము గాన ఙిద్వద్భావముచే గుణము రాలేదు

అవిదుః:- "సిజభ్యస్తవిదిభ్యశ్చ" అను సూత్రముచే (449) 'ఝి'కి 'జుస్' ఆదేశము చేయగా 'అవిదుః'అను రూపము సిద్ధించినది.

మధ్యమపురుషైకవచనమున 'అవేద్ స్'అని యుండగా హల్ఙ్యాదిసూత్రముచే (179) సకారలోపము చేసిన పిమ్మట 'అవేద్' అని యుండగా:-

576. దశ్చ 8.2.75

ధాతోర్దస్య పదాన్తస్య సిపి పరే రుర్వా. అవేః-అవేత్. విద్యాత్. విద్యాతామ్; విద్యాస్తామ్. అవేదీత్, అవేదిష్యత్. అస భువి 17. అస్తి.

'పదస్య'అధికారము. "సిపిధాతోరుర్వా" అను సూత్రము అనువర్తించును. 'సిప్' పర మగునపుడు పదాంతము నందలి ధాత్వవయవదకారమునకు 'రు'వికల్పముగ వచ్చును.

ఇచట లుప్త మగు 'సిప్' స్థానివద్భావముచే పరముగ నున్నది గాన దకారమునకు రుత్వము వికల్పముగ వచ్చి 'అవేః' అను రూపము, అది రాని పక్షమున 'అవేత్' అను రూపము సిద్ధించును. ఈ విధముగ లఙ్‌నందు— "అవేత్-ద్, అవిత్తామ్, అవిదుః; అవేః-అవేత్, అవిత్తమ్, అవిత్త; అవేదమ్, అవిద్వ, అవిద్మ" అను రూపము లగును.

విధిలిఙ్:- విద్యాత్, విద్యాతామ్, విద్యుః; విద్యాః, విద్యాతమ్, విద్యాత; విద్యామ్, విద్యావ, విద్యామ. ఆశీర్లిఙ్:- విద్యాత్, విద్యాస్తామ్, విద్యాసుః; విద్యాః, విద్యాస్తమ్, విద్యాస్త; విద్యాసమ్, విద్యాస్వ, విద్యాస్మ. లుఙ్:- అవేదీత్, అవేదిష్టామ్, అవేదిషుః; అవేదీః, అవేదిష్టమ్, అవేదిష్ట; అవేదిషమ్, అవేదిష్వ, అవేదిష్మ. లృఙ్ఞనందు 'అవేదిష్యత్' ఇత్యాదిరూపము లగును.

17. 'అస్'ధాతువునకు ఉండుట అని అర్థము. లట్ ప్రథమపురుషైకవచనమున 'శప్'కు లుక్ చేసిన పిమ్మట 'అస్తి'అను రూపము సిద్ధించును.

577. శ్నసోరల్లోపః 6.4.111

శ్నస్య అస్తేశ్చ అతో లోపః సార్వధాతుకే కితి, ఙితి, స్తః, సన్తి; అసి, స్థః, స్థ; అస్మి, స్వః, స్మః.

'అత ఉత్ సార్వధాతుకే' నుండి "సార్వధాతుకే" "గమహనజనఖనఘసాం లోపః క్ఙిత్యనఙి" నుండి 'క్ఙితి'అనువర్తించును. 'కిత్'గాని 'ఙిత్'గాని యగు సార్వధాతుకము పర మగునపుడు 'శ్నమ్'ప్రత్యయ, 'అస్' ధాతువులకు చెందిన అకారమునకు లోపము వచ్చును.

'శ్నమ్'ప్రత్యయాకారలోపమునకు 'రున్ధః'ఇత్యాదులు ఉదాహరణము. ప్రకృతమున ద్వివచనబహువచనప్రత్యయము లన్నియు "సార్వధాతుకమపిత్" అను సూత్రముచే (503) ఙిత్తులు గాన 'స్తః' 'సన్తి' 'స్థః' 'స్థ' ఇత్యాది రూపములు సిద్ధించినవి. మధ్యమపురుషైకవచనమున 'అస్ సి' అని యుండగా "తాసస్త్యోర్లోపః" అను సూత్రముచే (408) అస్ధాతుసకారమునకు లోపము వచ్చుటచే 'అసి' అను రూపము సిద్ధించినది.

578. ఉపసర్గప్రాదుర్భ్యామస్తిర్యచ్పరః 8.3.87

ఉపసర్గేణః ప్రాదుసశ్చాస్తేః సస్య షో యకారేఽచి చ పరే. నిష్యాత్. ప్రనిషన్తి. ప్రాదుఃషన్తి. యచ్పరః కిమ్? అభిస్తః.

'అపదాన్తస్య మూర్ధన్యః'నుండి 'మూర్ధన్యః', 'ఇణ్కోః'నుండి 'ఇణ్' 'సహేః సాడః సః'నుండి 'సః'అనువర్తించును. ఉపసర్గావయవ మగు ఇణ్ కంటెను, 'ప్రాదుస్' అనుదానికంటెను పరమైన అస్‌ధాతువుయొక్క సకారము నకు యకారముగాని అచ్చు గాని పరముగ నున్నపుడు షత్వము (మూర్ధన్యము) వచ్చును.

ఉదా:- నిష్యాత్. 'స్యాత్'అనునది అసధాతువిధిలిఙ్ రూపము. ఇచట ఉపసర్గేణ్ ఇకారము దీనికంటె పరముగ నున్న సకారమునకు యకారము పరముగ నున్నది గాన షత్వము వచ్చి 'నిష్యాత్' అను రూపము అయినది. 'ప్రనిషన్తి'అను రెండవ ఉదాహరణమున సకారమునకు అచ్చగు అకారము పరముగ నున్నది. 'ప్రాదుఃషన్తి'—ఇచట 'ప్రాదుస్' అను అవ్యయమునకు పరముగ నున్న అసధాతు సకారమునకు అచ్చు పరముగ నున్నది గాన షత్వము వచ్చినది.

'యచ్పరః' అని చెప్పుటచే—అనగా యకారము గాని 'అచ్' గాని సకారమునకు పరముగ నుండవలె నని చెప్పుటచే—"అభిస్తః" అనునపుడు సకారమునకు యకారము గాని, 'అచ్' గాని పరముగ లేదు గాన షత్వము రాలేదు.

579. అస్తేర్భూః 2.4.52

ఆర్ధధాతుకే. బభూవ భవితా. భవిష్యతి. అస్తు-స్తాత్; స్తామ్, సన్తు.

'సః స్యార్ధధాతుకే'నుండి 'ఆర్ధధాతుకే'అనువర్తించును. ఆర్ధధాతుకము పర మగునపుడు 'అస్'ధాతువునకు 'భూ'అను ధాతువు ఆదేశముగ వచ్చును.

ఈ సూత్రము ననుసరించి లిట్. లుట్, లృట్, ఆశీర్లిఙ్, లుఙ్, లృఙ్ఙు లందు అసధాతురూపములు భూధాతురూపముల వలె నుండును. అనగా ఈ లకారములలో అసధాతువునందు భూధాతురూపములే ప్రయోగింపబడును.

లోట్టునందు ప్రథమపురుషైకవచనమున శబ్ లుక్కుచే 'అస్తు' అను రూపము. తాతఙ్ ఆదేశము వచ్చిన పక్షమున, అది ఙిత్తు గాన అకారలోపము (సూ-577) 'స్తాత్' అను రూప మగును. ఇట్లే ప్రథమపురుషద్వివచనబహువచనములందును, మధ్యమపురుషద్వివచనబహువచనములందును 'సార్వధాతుకమపిత్'అను సూత్రముచే (503) ఙిత్త్వము వచ్చును గాన అకారలోపము. 'స్తాత్' 'సన్తు' 'స్తమ్' 'స్త' ఇత్యాదిరూపము లగును.

మధ్యమపురుషైకవచనమున 'సిప్'కు 'హి'ఆదేశము చేసిన పిదప 'అస్ హి' అని యుండగా "హుఝల్భ్యో హేర్ధిః" అను సూత్రముచే (559) 'హి'కి 'ధి' రావలసి యున్నది. కాని రాబోవు సూత్రము పర మగుటచే దానిని బాధించి ముందుగ ప్రవర్తించును.

580. ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ 6.4.119

ఘోరస్తేశ్చ ఏత్వం స్యాద్ హౌ పరే అభ్యాసలోపశ్చ. ఏత్వస్య అసిద్ధత్వాద్ హేర్ధిః. శ్నసోరిత్యల్లోపః, తాతఙ్ పక్షే ఏత్వం న, పరేణ తాతఙా బాధాత్. ఏధి-స్తాత్, స్తమ్. స్త. అసాని, అసావ అసామ. ఆసీత్, ఆస్తామ్, ఆసన్. స్యాత్, స్యాతామ్. స్యుః, భూయాత్. అభూత్, అభవిష్యత్.

ఇణ్ గతౌ 18. ఏతి, ఇతః

ఘు సంజ్ఞక ధాతువులకును, అసధాతువునకును 'హి' పర మగునపుడు ఏకారము, అభ్యాసలోపము వచ్చును.

ఈ సూత్రముచే ఏత్వము, అలోన్త్య పరిభాషననుసరించి (సూ-21) అంత్య సకారమునకు వచ్చును. 'అ ఏ హి' అని యుండగా ఈ సూత్రముచే విహిత మగు ఏకారము 'అసిద్ధవదత్రాభాత్' అను సూత్రముచే (565) అసిద్ధము గాన 'హి' అనునది సకారరూపఝల్లుకంటె పరముగ నుండును. అందుచే 'హి' కి 'ధి' ఆదేశము. 'హి' అపిత్ గాన, 'సార్వధాతుకమపిత్' అను సూత్రముచే (503) ఙిత్త్వము సిద్ధించును గాన, 'శ్నసోరల్లోపః' అను సూత్రముచే (577) అకారలోపము - 'ఏధి' అనురూపము సిద్ధించును.

ఏత్వవిధాయకసూత్రముకంటె (580) "తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్" అను సూత్రము (414) పరము గాన 'హి'కి ముందుగ తాతఙాదేశము వచ్చును. అది వచ్చిన పిదప 'హి' లేదు గాన ఏత్వము రాదు. 'స్తాత్' అను రూపమే యగును.

ఉత్తమపురుషమున "ఆడుత్తమస్య పిచ్చ" అను సూత్రముచే (420) విహితమగు ఆడాగమము 'పిత్' గాన ఙిత్త్వము లేదు. అందుచే అకారలోపము రాదు. 'అసాని, అసావ, అసామ' అను రూపములు సిద్ధించును.

లఙ్ ప్రథమపురుష మధ్యమపురుషైక వచనములందు 'అ అస్ త్'

'ఆ అస్ స్' అని యుండగా 'త్' 'స్' అను నవి అపృక్తహల్లులు గాన "అస్తి సిచో పృక్తే" అను సూత్రముచే (447) ఈడాగమము చేయగా 'ఆసీత్' 'ఆసీః' అను రూపములు సిద్ధించినది. ద్వివచనాదులందు ధాత్వకారము "శ్నసోర ల్లోపః" అను సూత్రముచే (557) లోపించినను ఆడాగమసంబంధి యగు అకార ముండును. "ఆసీత్, ఆస్తామ్, ఆసన్; ఆసీః, ఆస్తమ్, ఆస్త; ఆసమ్, ఆస్వ. ఆస్మ."

విధిలిఙ్‌నందు యాసుడాగమము జిత్తు గాన అకారలోపము వచ్చి "స్యాత్, స్యాతామ్, స్యుః, స్యాః స్యాతమ్, స్యాత. స్యామ్. స్యావ స్యామ" అను రూపము లగును.

18. 'ఇణ్' ధాతువునకు వెళ్ళుట అని యర్థము. ణకారము ఇత్సంజ్ఞకము. పిత్త్వము గల తిప్, సిప్, మిప్‌లు పర మగునపుడు శబ్‌లుక్ చేసినపిమ్మట 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రముచే (390) గుణము వచ్చి 'ఏతి, 'ఏషి'. 'ఏమి' అను రూపము లగును. ద్వివచనాదులందు జిత్త్వముచే గుణము రాదు. 'ఇతః' ఇత్యాది రూపము లగును.

ప్రథమపురుష బహువచనమున 'ఇ అన్తి' అని యుండగా "అచిశ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ" అను సూత్రముచే (199) ఇయఙాదేశము రావలసి యుండ :-

581. ఇణో యణ్ 6.4.81

అజాదౌ ప్రత్యయే పరే. యన్తి

'అచిశ్నుధాతుభ్రువాం...' నుండి 'అచి' అనువర్తించును. అజాది ప్రత్యయము పర మగునపుడు 'ఇణ్' ధాతువునకు యణాదేశము వచ్చును.

ఇది ఇయఙాదేశమునకు అపవాదము. దానిచే ఇకారమునకు యకారాదేశము చేయగా 'యన్తి' అను రూపము సిద్ధించినది. ఇతరరూపములలో కార్యవిశేష మేదియును లేదు. ఏతి, ఇతః, యన్తి. ఏషి, ఇథః, ఇథ, ఏమి, ఇవః. ఇమః. లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వాదులు చేసిన పిమ్మట 'ఇ ఇ అ' అని యుండగా రెండవ ఇకారమునకు 'అచో ఞ్ణితి' అను సూత్రముచే (182) వృద్ధి; ఆయాదేశము- 'ఇ ఆయ్అ' అని యుండగా

582 అభ్యాసస్యాసవర్ణే 6.4.78

అభ్యాసస్యేవర్ణోవర్ణయో రియఙువఙౌ స్తోఽసవర్ణేఽచి. ఇయాయ.

"అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ' నుండి 'అచి' 'య్వోః' "ఇయఙువఙౌ" అనువర్తించును. అభ్యాసకు చెందిన ఇవర్ణోవర్ణములకు అసవర్ణమగు 'అచ్' పర మగునపుడు 'ఇయఙ్' 'ఉవఙ్' ఆదేశములు వచ్చును.

ఇచట 'ఇ' అనునది అభ్యాసకు సంబంధించిన ఇకారము, దానికి 'ఆ' అను అసవర్ణమగు అచ్చు పరముగ నున్నది. కావున ఈ సూత్రముచే ఇయఙా దేశము చేయగా 'ఇయాయ' అనురూపము సిద్ధించినది. ప్రథమపురు ద్వివచనమున ద్విత్వాదులు చేసిన పిమ్మట 'ఇ ఇ అతుస్' అని యుండగా "అసంయోగాల్లిట్ కిత్" అను సూత్రముచే (454) కిత్త్వము వచ్చును గాన గుణము రాదు. 'ఇణో యణ్' అను సూత్రముచే (581) యణాదేశము 'ఇయ్ అతుస్' అని యుండగా :-

583 దీర్ఘ ఇణః కితి 7.4.69

ఇణోఽభ్యాసస్య దీర్ఘః స్యాత్ కితి లిటి. ఈయతుః, ఈయుః ఇయయిథ-ఇయేథ. ఏతా. ఏష్యతి. ఏతు. ఐత్, ఐతామ్. ఆయన్ ఇయాత్. ఈయాత్.

'అత్రలోపోఽభ్యాసస్య' 'వ్యథో లిటి' అను సూత్రములనుండి 'అభ్యాసస్య' 'లిటి' అనువర్తించును. కిత్తు అగు లిట్టు పర మగునపుడు ఇణ్ ధాత్వభ్యాసమునకు దీర్ఘము వచ్చును.

పైన చూపిన విధముగ ద్వివచనబహువచనములందు లిట్టు కిత్తు గాన దీర్ఘము వచ్చును. 'ఈయతుః' 'ఈయుః' అను రూపములు సిద్ధించును.

మధ్యమపురుషైకవచనమున 'ఇ ఇ థ' అని యుండగా 'థల్' 'పిత్'గాన గుణము వచ్చి 'ఇ ఏథ'అని యున్నది. ఇణ్ ధాతువు అజంత మగు అనిడ్ధాతువు గాన భారద్వాజనియమముచే 'థల్'కు వైకల్పిక ఇడాగమము వచ్చును ఇడాగమ పక్షమున 'ఇ ఏ ఇథ' అని యుండగా ఏకారమునకు అయాదేశము — 'ఇ అయ్ ఇథ' — అభ్యాసఇకారమునకు ఇయఙాదేశము (సూ-582)- 'ఇయయిథ'అను రూపము సిద్ధించును. 'ఇట్'రానిపక్షమున 'ఇ ఏ థ'అని యుండగా ఇయఙా దేశముచే 'ఇయేథ' అను రూప మగును. ద్వివచనబహువచనములందు 'యణ్'దీర్ఘములచే 'ఈయథుః' 'ఈయుః'అను రూపము లగును. ఉత్తమ పురుషైకవచనమున 'ణల్'కు ణిత్త్వవికల్పముచే వృద్ధిఆయాదేశములు, గుణ అయాదేశములు చేయగా 'ఇయాయ' 'ఇయయ' అను రూపద్వయము సిద్ధిం

చును. 'వ' 'మ'లకు క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చి 'ఈయివ' 'ఈయిమ' అను రూపము లగును. లుట్‌లృట్టులందు 'ఏతా' 'ఏష్యతి'ఇత్యాది రూపము లగును. విశేషకార్యము లేవియు లేవు.

లోట్:- ఏతు-ఇతాత్, ఇతామ్, యన్తు; ఇహి-ఇతాత్, ఇతమ్- ఇత; అయాని, అయావ, అయామ. 'తాతఙ్' ఙిత్తు గాన అది పర మగునపుడు గుణము రాలేదు; అట్లే 'హి' 'అపిత్' గాన ఙిద్వద్భావ ముండుటచే గుణము రాలేదు. ఉత్తమపురుషమునందు వచ్చిన ఆడాగమము 'పిత్' గాన గుణనిషేధము వర్తింపదు. గుణము, అయాదేశము చేయగా 'అయాని' 'అయావ' 'అయామ' అను రూపములు సిద్ధించినవి.

ఐత్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున ఆడాగమముఇకారలోపాదులు చేసిన పిమ్మట 'ఆ ఇ త్' అని యుండగా 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధి—'ఐత్'అను రూపము సిద్ధించినది. ద్వివచనమున పై విధముననే 'ఐతామ్'అను రూపము సిద్ధించును. బహువచనమున 'ఝి'కి 'అన్తి' ఆదేశము చేసిన పిమ్మట 'ఇ అన్తి'అని యుండగా 'ఇణో యణ్'అను సూత్రముచే (581) యణాదేశము. 'య్ అన్తి'అని యుండగా 'అసిద్ధవదత్రాభాత్ అను సూత్రముచే (565) ఈ యణాదేశము అసిద్ధము గాన నిది అజాదిధాతు వగుటచే ఆడాగమము వచ్చును. సంయోగాన్తలోపముచే తకారము లోపింప 'ఆయన్' అను రూపము సిద్ధించును. ఉత్తమపురుషైకవచనమునందు గూడ అజాది ప్రత్యయము పరముగ నున్నది గాన 'ఆయన్'అను దానియందు వలెనే ప్రక్రియ యుండును- 'ఆయమ్' అను రూపము సిద్ధించును. ఇతరరూపములందు గూడ ప్రక్రియ పూర్వోక్తవిధముగనే యుండును. "ఐత్, ఐతామ్ ఆయన్; ఐః, ఐతమ్, ఐత; ఆయమ్, ఐవ, ఐమ.

విధిలిఙ్గునందు 'యాసుట్'ఙిత్తు గాన గుణము లేదు. "ఇయాత్, ఇయాతామ్, ఇయుః; ఇయాః, ఇయాతమ్, ఇయాత; ఇయామ్, ఇయావ, ఇయామ" అను రూపము లగును.

ఆశీర్లిఙ్గునందు "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః"అను సూత్రముచే (485) దీర్ఘము వచ్చి "ఈయాత్, ఈయాస్తామ్, ఈయాసుః; ఈయాః, ఈయాస్తమ్, ఈయాస్త; ఈయాసమ్, ఈయాస్వ, ఈయాస్మ" అను రూపము లగును.

584. ఏతేర్లిఙి 7.4.24

ఉపసర్గాత్ పరస్య ఇణోఽణో హ్రస్వ ఆర్ధధాతుకే కితి లిఙి. నిరియాత్. "ఉభయత ఆశ్రయణే నాన్తాదివత్"—అభీయాత్. అణః కిమ్? సమేయాత్.

'ఉపసర్గాద్ధ్రస్వఊహతేః'నుండి 'ఉపసర్గాత్' 'హ్రస్వః', 'కేఽణః'నుండి 'అణః'. 'అయఙ్ యిక్ఙితి'నుండి కితి'అనుపదైకదేశము అనువర్తించును. "ఆర్ధధాతుకే" అను పదము ఈ సూత్రములోనికి అనువర్తించుటకు అవకాశము లేకుండుటచేతను, 'కిత్ లిఙ్'అనుటచేతనే ఆర్ధధాతుకలిఙ్ అను నర్థము వచ్చుచుండుటచేతను వృత్తియందు 'ఆర్ధధాతుకే'అను పాఠము ప్రామాదికమని బాలమనోరమాకారుడు వ్రాసి యున్నాడు. 'కిత్' అగు 'లిఙ్' పర మగునపుడు ఉపసర్గకంటె పరమును 'ఇణ్'ధాతుసంబంధియు అగు 'అణ్'కు హ్రస్వము వచ్చును.

'నిర్ + ఈయాత్'-నిరీయాత్ అని యుండగా, 'కిదాశిషి'అను సూత్రము (434)ననునరించి 'ఆశీర్లిఙ్' కిత్తు గాన, అది పరముగ నున్నపుడు 'నిర్'అను ఉపసర్గకంటె పరముగ నున్న ఈకారమునకు హ్రస్వము వచ్చి 'నిరియాత్' అను రూపము సిద్ధించును.

'అభి + ఈయాత్' అని యుండగా సవర్ణదీర్ఘసంధిచే 'అభీయాత్' అని యగును. అనగా, ఉపసర్గకు సంబంధించిన ఇకారమునకును, ఇణ్ధాతువునకు సంబంధించిన ఈకారమునకును ఏకాదేశముగ ఈకారము వచ్చి యున్నది. కావున 'అన్తాదివచ్చ' అను సూత్రము(41)ననుసరించి ఈ ఏకాదేశరూపఈకారమును 'అభి'అను ఉపసర్గకు అంతావయవముగను 'ఇణ్'ధాతువునకు ఆద్యవయవముగను గ్రహించుటకు అవకాశ మున్నది. ఇచట పూర్వాంతవద్భావమును మాత్రము గ్రహించినచో 'అభీ' అనునది ఉపసర్గ యగును. అపుడు ఇణ్ ధాతు సంబంధి యగు 'అణ్' ఉండదు, పరాదివద్భావమును మాత్రము గ్రహించినచో 'ఈయాత్'అనునది ఆశీర్లిఙ్రూప మైనది. మిగిలిన 'అభీ'అనునది ఉపసర్గ కాజాలదు. అందుచే పూర్వాంతవద్భావమును పరాదివద్భావమును రెండింటిని గ్రహించి 'అభీ'అను ఉపసర్గకంటె పర మగు 'ఈయాత్' లోని ఇణ్ధాత్వవయవ ఈకారమునకు హ్రస్వము వచ్చు నని చెప్పవలసి యుండును. కాని "పూర్వాన్తవద్భావము పరాదివద్భావము రెండును గ్రహింప వలసి యున్నపుడు అంతాదివద్భావము ప్రవర్తించదు" అను పరిభాష ననుసరించి ఇట్టి స్థలములలో అంతా

దివద్భావసూత్రమును ప్రవర్తింపచేయకూడదు. అందుచే 'అధీయాత్' అను నపుడు హ్రస్వము రాదు.

హ్రస్వము 'అణ్'కు వచ్చు నని చెప్పబడినది. అందుచే "సమ్ + ఆ + ఈయాత్" అనునపుడు ఆకార ఈకారములకు గుణముచే 'సమేయాత్' అని యుండగా, ఇచట 'సమ్' అను ఉపసర్గకంటె పర మైన ఏకారము 'అణ్' కాదు గాన దానికి హ్రస్వము (ఇకారము) రాలేదు. గ్రహణకసూత్రము తక్క ఇతరస్థలములలో అణ్ ప్రత్యాహారము మొదటి ణకారముతోడనే అని వెనుకచెప్పబడినది. అందుచే ఏకారము అణ్ కాదు.

585. ఇణో గా లుఙి 2.4.45

'గాతిస్థా'-ఇతి సిచో లుక్ - అగాత్. ఐష్యత్. శీఙ్ స్వప్నే. 18.

'లుఙ్' పర మగునపుడు 'ఇణ్' ధాతువునకు 'గా' అను నాదేశము వచ్చును.

'ఆడజాదీనామ్' అను సూత్రముచే (446) ఆడాగమము చేయుటకు పూర్వమే 'గా' ఆదేశము వచ్చును. అపుడు అజాదిధాతువు లేదు గాన అడాగమము మాత్రమే వచ్చును. ప్రథమపురుషైకవచనమున 'అగాస్త్' అని యుండగా 'గాతిస్థా' ఇత్యాది సూత్రముచే (441) 'సిచ్'కు లోపము. 'అగాత్' అను రూపము సిద్ధించును. ఈ విధముగ సిజ్‌లోపముచే "అగాత్, అగాతామ్, అగుః; అగాః, అగాతమ్, అగాత; అగామ్, అగావ, అగామ" అను రూపము లగును.

ప్రథమపురుషబహువచనమున 'ఆతః' అను సూత్రముచే (491) 'ఝి'కి 'జుస్' ఆదేశము; 'ఉస్యపదాన్తాత్' అను సూత్రముచే (495) ఆకారమునకు పరరూపము చేయగా 'అగుః' అను రూపము సిద్ధించినది.

లృఙ్ :- ఐష్యత్, ఐష్యతామ్, ఐష్యన్; ఐష్యః, ఐష్యతమ్. ఐష్యత; ఐష్యమ్, ఐష్యావ, ఐష్యామ

18. 'శీఙ్' ధాతువునకు నిద్రించుట అని అర్థము. ఇది సేట్కము. ఙిత్తు గాన ఆత్మనేపదము. అందుచే 'త' మొదలగు ఆత్మనేపదప్రత్యయములు చేర్చబడును అవి అపిత్ సార్వధాతుకములు గాన ఙిత్త్వము వచ్చుటచే గుణము వచ్చుటకు అవకాశము లేకుండుటచే క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

586. శీఙః సార్వధాతుకే గుణః 7.4.21

'క్ఙితి చ' ఇత్యస్యాపవాదః. శేతే, శయాతే.

సార్వధాతుకప్రత్యయములు పర మగునపుడు శీఙ్ ధాతువునకు గుణమ వచ్చును.

ఇది 'క్ఙితి చ'అను సూత్రమునకు అపవాదము గాన దానిని బాధిం గుణము వచ్చును. ప్రథమపురుషైకవచనమున శప్‌లుక్ చేసిన పిమ్మట ఈ సూత్రముచే గుణము చేయగా 'శేతే' అను రూపము సిద్ధించినది.

ద్వివచనమున 'శీ ఆతామ్' అని యుండగా ఈకారమునకు గుణము అయాదేశము 'శయాతామ్'అని యుండగా 'ఆమ్'రూప మగు టికి "టిత ఆత్మ నేపదానాం" టేరే" అను సూత్రముచే (511) ఏత్వము— 'శయాతే' అను రూపము సిద్ధించినది.

బహువచనమున 'ఝ'కు 'ఆత్మనేపదేష్వనతః'అను సూత్రముచే(527 అత్ ఆదేశము. టికి ఏకారము. ధాతువునకు గుణము (సూ-586)- "శే అతే" అని యుండగా:-

587. శీఙో రుట్ 7.1.7

శీఙః పరస్య ఝాదేశస్య అతో రుడాగమః స్యాత్.

శేరతే; శేషే, శయాథే. శేధ్వే; శయే. శేవహే, శేమహే. శిశ్యే, శిశ్యాతే, శిశ్యిరే. శయితా. శయిష్యతే. శేతామ్, శయాతామ్, శేరతామ్. అశేత, అశయాతామ్, అశేరత. శయీత, శయీయాతామ్, శయీరన్. శయిషీష్ట. అశయిష్ట. అశయిష్యత.

'ఝోన్తః' 'అదభ్యస్తాత్' అను సూత్రములనుండి 'ఝః' 'అత్' అను వర్తించును. 'శీఙ్'ధాతువుకంటె పరమును 'ఝ'కు ఆదేశముగ వచ్చినదియు నగు అకారమునకు రుడాగమము వచ్చును.

రుడాగమము టిత్తు గాన అకారమునకు ఆద్యవయవముగ వచ్చి 'శేరతే' అను రూపము సిద్ధించినది. ఇతరరూపములందు విశేషకార్యము లేవియు లేవు.

శిశ్యే:- 'లిటస్తఝయోరేశిరేచ్' అను సూత్రముచే (516) లిట్టుకు ఏశ్, ధాతువుకు ద్విత్వము. 'శీ శీ ఏ' అని యుండగా, అభ్యాసకుహ్రస్వము

(సూ-399); రెండవ ఈకారమునకుయణాదేశము- 'శిశ్యే'అను రూపము సిద్ధించినది. ఇతరరూపములందు గూడ విశేషకార్యము లేవియు లేవు. "శిశ్యే, శిశ్యాతే, శిశ్యిరే. శిశ్యిషే, శిశ్యాథే, శిశ్యిధ్వే—ఢ్వే; శిశ్యే, శిశ్యివహే, శిశ్యిమహే".

ఈ ధాతువు సేట్కము గాన లుట్, లృట్టులందు ఇడాగమ, గుణ, అయాదేశాదులు వచ్చి 'శయితా' 'శయిష్యతే' ఇత్యాదిరూపము లగును.

లోట్, లఙ్ విధిలిఙ్లలందు లట్టునందు వలె గుణము (సూ-586), ఝాదేశాకారమునకు రుడాగమము వచ్చును. "శేతామ్, శయాతామ్, శేరతామ్; శేష్వ, శయాథామ్, శేధ్వమ్, శయై, శయావహై, శయామహై,". లఙ్:- "అశేయత, అశయాతామ్, అశేరత: అశేథాః, అశయాథామ్, అశేధ్వమ్. అశయి, అశేవహి, అశేమహి". విధిలిఙ్:- శయీత, శయీయాతామ్, శయీరన్, శయీథాః, శయీయాథామ్, శయీధ్వమ్, శయీయ, శయీవహి, శయీమహి.

ఇట్లే ఆశీర్లిఙ్, లుఙ్, లృఙ్లలందు గూడ విశేషకార్యము లేవియు లేవు. "శయిషీష్ట", 'అశయిష్ట' "అశయిష్యత" ఇత్యాదిరూపము లగును

ఇఙ్ అధ్యయనే. 19. ఇఙికావధ్యుపసర్గతో న వ్యభిచరతః. అధీతే, అధీయాతే, అధీయతే.

19. ఇఙ్ధాతువునకు చదువుట అని అర్థము. 'ఇఙ్' 'ఇక్' ధాతువులు 'అధి' అను ఉపసర్గతోడనే ప్రయోగింపబడును గాని స్వతంత్రముగ ప్రయోగింపబడవు. ఙిత్తు గాన ఆత్మనేపది.

అధీతే:- సవర్ణదీర్ఘసంధిచే 'అధీతే'అను రూపము సిద్ధించినది. 'ఆతే' 'అతే' మొదలగు అజాదిప్రత్యయములు పర మగునపుడు "అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ" అను సూత్రముచే (199) ఇయఙాదేశము వచ్చును. అపిత్ సార్వధాతుకమునకు ఙిద్వద్భావము వచ్చును గాన గుణప్రసక్తి లేదు మొదట ప్రక్రియ యంతయు పూర్తియై "ఇతే, ఇయాతే, ఇయతే" అను రూపములు నిష్పన్నమైన పిమ్మటనే 'అధి' ఉపసర్గ చేరును. "అధీతే, అధీయాతే, అధీయతే, అధీషే, అధీయాథే, అధీధ్వే, అధీయే, అధీవహే, అధీమహే,"

588 గాఙ్ లిటి 2.4.49

ఇఙో గాఙ్ స్యాత్ లిటి. అధిజగే, అధిజగాతే, అధిజగిరే. అధ్యేతా, అధ్యేష్యతే, అధీతామ్, అధీయాతామ్, అధీయతామ్, అధీష్వ, అధీయాథామ్, అధీధ్వమ్, అధ్యయై అధ్యయావహై, అధ్యయామహై, అధ్యైత, అధ్యైయాతామ్, అధ్యైయత; అధ్యైథాః; అధ్యైయాథామ్, అధ్యైధ్వమ్, అధ్యైయి. అధ్యైవహి, అధ్యైమహి. అధీయీత, అధీయీయాతామ్, అధీయీరన్, అధ్యేషీష్ట.

'ఇ జ శ్చ' నుండి 'ఇఙః' అను పదము అనువర్తించును. లిట్టు వివక్షిత మగునపుడు–అనగా లిట్టు చేర్చనున్నపుడు– 'ఇఙ్' ధాతువునకు 'గాఙ్' అను ఆదేశము వచ్చును.

అధిజగే :– 'గాఙ్' ఆదేశము చేసిన పిమ్మట ద్విత్వము, అభ్యాసకు హ్రస్వము చత్వము (సూ-456); 'ఆతో లోప ఇటి చ' అను సూత్రముచే (492) ఆకార లోపము. 'త'కు 'ఏశ్' ఆదేశము (సూ-516) 'అధిజగే' అను రూపము సిద్ధించినది.

ఏశ్, ఇరేచ్, ఆతే ఇత్యాది ప్రత్యయములును, క్రాదినియమము ననుసరించి ఇడాగమము వచ్చుటచే సే, ధ్వమ్ మొదలగునవియు అజాదు లగును. ఈ విధముగ అన్ని ప్రత్యయములను అజాదు లగుటచే ఆకారలోపము వచ్చును. "అధిజగే, అధిజగాతే, అధిజగిరే, అధిజగిషే, అధిజగాథే. అధిజగిధ్వే, అధిజగే, అధిజగివహే, అధిజగిమహే."

ఈ ధాతువు అనిట్కము గాన లుట్ లృట్టులందు 'అధ్యేతా' 'అధ్యేష్యతే' ఇత్యాది రూపము లగును.

లోట్టునందు అజాదిప్రత్యయములు పర మగునపుడు 'ఇయఙ్' ఆదేశ మగును. పిమ్మట 'అధి' ఉపసర్గేకారముతో సవర్ణదీర్ఘసంధి యగును. 'అధీతామ్' ఇత్యాది రూపము లగును. ఉత్తమపురుషైకవచనమున 'అధి ఇ ఇ' అని యుండగా 'ఇట్'కు ఏత్వము (సూ-511)– 'అధి ఇ ఏ'– ఆడాగమము (సూ-429). 'అధి ఇ ఆ ఏ'– ఏకారమునకు ఐకారము (సూ-522)– "అధి ఇ ఆ ఐ'–ఆకారఐకారములకు వృద్ధి–'అధి ఇ ఐ'. ఇకారమునకు గుణము–'అధి ఏ ఐ' అయాదేశము – 'అధి అయై'. యణాదేశము – అధ్యయై అను రూపము సిద్ధించును.

ద్వివచన బహువచనములందు గూడ గుణ, అయాదేశ యణాదేశాదు లచే 'అధ్యయావహై' 'అధ్యయామహై' అను రూపములు నిష్పన్న మగును.

అధ్యైత :- లఙ్ ప్రథమపురుషైక వచనమున ఆడాగమము చేసిన పిమ్మట ఆడాగమసంబంధి యగు ఆకారమునకును ధాత్వవయవ మగు ఇకారము నకును 'ఆటశ్చ' అను సూత్రముచే(197)వృద్ధి. పిమ్మట ఉపసర్గయందలి ఇకారము నకు యణాదేశము. 'అధ్యైత' అను రూపము సిద్ధించినది.

'ఆతామ్' అను అజాది ప్రత్యయములు పర మగునపుడు పరకార్య మగు టచే మొదట ఇయఙాదేశము చేసిన పిమ్మట "అధి ఆ ఇయ్ ఆ తామ్"-ఇపుడు 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధి - "అధి ఐయ్ ఆతామ్"- యణా దేశము - 'అధ్యైయాతామ్' అను రూప మగును. అజాది ప్రత్యయములు పర మగునపుడు రూపసిద్ధి ఇట్లే యుండును.

'అధీయీత' విధిలిఙ్ ప్రథమపురుషైక వచనమున 'అధి ఇ త' అని యుండగా 'లిఙః సీయుట్' అను సూత్రముచే (523) సీయుడాగమము. 'సుట్ తిథోః' అను సూత్రముచే (526) తకారమునకు సుడాగమము. వీటి సకారములకు లోపము (సూ-429). 'లోపో వ్యోర్వలి' అను సూత్రముచే (431) యకారమునకు లోపము.'అధి ఇ ఈత' అని యుండగా 'సీయుట్' అపిత్సార్వ ధాతుకము గాన ఙిద్వద్భావ ముండుటచే ఇయఙాదేశము చేయగా 'అధీయీత' అను రూపము సిద్ధించినది.

అజాది ప్రత్యయములు పర మగునపుడు మాత్రము 'సీయుట్ యకా రమునకు 'వల్' పరముగ లేకుండుటచే లోపము రాదు. "అధీయీయాతామ్" ఇత్యాది రూపము లగును. "అధీయీత, అధీయీయాతామ్, అధీయీరన్, అధీయీథాః, అధీయీయాథామ్, అధీయీధ్వమ్, అధీయీయ. అధీ యీవహి, అధీయీమహి.

'అధ్యేషీష్ట :- ఆశీర్లిఙ్ ప్రథమపురుషైక వచనమున సీయుట్, సుడాగమ యలోప ఆర్ధధాతుకగుణ, షత్వ, ష్టుత్వ యణాదేశాదులచే "అధ్యే షీష్ట" అను రూప మగును. ఇతరరూపములందు గూడ ఇట్లే ప్రక్రియ యుండును. అజాదిప్రత్యయములు పర మగునపుడు యాసుట్ యకారమునకు లోపము రాదు. "అధ్యేషీష్ట, అధ్యేషీయాస్తామ్, అధ్యేషీరన్, అధ్యేషీష్ఠాః అధ్యేషీయాస్థామ్, అధ్యేషీఢ్వమ్, అధ్యేషీయ, అధ్యేషీవహి, అధ్యేషీ మహి.

589 విభాషా లుఙ్ లృఙోః 2.4.50

ఇఙో గాఙ్ వా స్యాత్.

'ఇఙశ్చ' "గాఙ్ లిటి" అను సూత్రములనుండి 'ఇఙః' 'గాఙ్' అను వర్తించును. లుఙ్, లృఙ్లు చేర్చవలసి యున్నపుడు ఇఙ్ధాతువునకు 'గాఙ్' ఆదేశము వికల్పముగ వచ్చును.

'లుఙ్' చేర్చనున్నపుడు ఈ సూత్రముచే 'గాఙ్' ఆదేశము చేసి పిమ్మట లుఙ్ 'చ్లి' 'సిచ్'లు చేర్చగా 'అగాస్ త' అని యుండగా-

590 గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ఙిత్ 1.2.1.

గాఙాదేశాత్ కుటాదిభ్యశ్చ పరేఽఞ్ణితః ప్రత్యయాః ఙితః స్యుః.

గాఙ్కుటాదిభ్యః, అఞ్ణిత్, ఙిత్. 'గాఙ్' ఆదేశము కంటెను. (తుదాది గణమునందలి) కుటాదిధాతువులకంటెను పర మగు ఞిత్ ణిత్ భిన్న మగు ప్రత్యయము ఙిత్ అగును.

ఇచట 'గా' ఆదేశముకంటె పర మగు సిచ్ (స్) ఞిత్ కాని 'ణిత్' కాని కాదు అందుచే ఇది ఙిత్ అగును.

591 ఘు మా స్థా గా పా జహాతిసాం హలి 6.4.66

ఏషామాతః ఈత్ స్యాత్ హలాదౌ క్ఙితి ఆర్ధధాతుకే, అధ్యగీష్ట-అధ్యైష్ట, అధ్యగీష్యత—అధ్యైష్యత.

'ఆర్ధధాతుకే' అని అధికారము. 'ఆతో లోప ఇటి చ', 'ఈద్యతి', "అనుదాత్తోపదేశ వనతి తనోత్యాదీనా మనునాసికలోపో ఝలి క్ఙితి" అను సూత్రములనుండి 'ఆతః' 'ఈత్' 'క్ఙితి' అనువర్తించును. హలాదియు, కిత్తు గాని ఙిత్తుగాని అయిన ఆర్ధధాతుకము పర మగునపుడు ఘుసంజ్ఞకము లగు ధాతువులయొక్కయు, మా స్థా, గా, పా, హా (ఓహాక్) స (షోఽన్తకరణే) ధాతువుల యొక్కయు ఆకారమునకు ఈకారము వచ్చును.

ఈ సూత్రముచే 'గా' యందలి ఆకారమునకు ఈకారము వచ్చుటచే "అధ్యగీష్ట. అధ్యగీషాతామ్. అధ్యగీషత, అధ్యగీష్ఠాః. అధ్యగీషాథామ్, అధ్యగీఢ్వమ్, అధ్యగీషి, అధ్యగీష్వహి, అధ్యగీష్మహి' అనురూపము లగును.

అధ్యైష్ట :- గాఙాదేశము రాని పక్షమున 'అధి ఆ ఇస్ త' అని యుండగా ఇకారమునకు గుణము, పిమ్మట 'ఆటశ్చ' అను సూత్రముచే (197) వృద్ధి, షత్వ ష్టుత్వములు యణాదేశము చేయగా 'అధ్యైష్ట' అను రూపము సిద్ధించినది. "అధ్యైష్ట, అధ్యైషాతామ్, అధ్యైషత, అధ్యైష్ఠాః, అధ్యైషాథామ్. అధ్యైఢ్వమ్, అధ్యైషి, అధ్యైష్వహి-అధ్యైష్మహి.

లృఙ్‌నందు గాఙాదేశము చేసిన పక్షమున ఙిత్త్వ (సూ-590) ఈత్వముల (సూ-591) చే- అధ్యగీష్యత, అధ్యగీష్యేతామ్, అధ్యగీష్యన్త, అధ్యగీష్యథాః, అధ్యగీష్యేథామ్, అధ్యగీష్యధ్వమ్, అధ్యగీష్యే, అధ్యగీష్యావహి, అధ్యగీష్యామహి" అను రూపము లగును.

'గాఙ్' ఆదేశము రాని పక్షమున "అధ్యైష్యత, అధ్యైష్యేతామ్, అధ్యైష్యన్త, అధ్యైష్యథాః, అధ్యైష్యేథామ్, అధ్యైష్యధ్వమ్, అధ్యైష్యే, అధ్యైష్యావహి, అధ్యైష్యామహి" అను రూపము లగును.

దుహ ప్రపూరణే 20. దోగ్ధి, దుగ్ధః దుహన్తి, ధోక్షి. దుగ్ధే, దుహాతే, దుహతే, ధుక్షే, దుహాథే, ధుగ్ధ్వే: దుహే, దుహ్వహే, దుహ్మహే. దుదోహ, దుదుహే. దోగ్ధా. ధోక్ష్యతి, ధోక్ష్యతే. దోగ్ధు-దుగ్ధాత్, దుగ్ధామ్, దుహన్తు, దుగ్ధి-దుగ్ధాత్, దుగ్ధమ్ దుగ్ధ; దోహాని, దోహావ, దోహామ .దుగ్ధామ్, దుహాతామ్, దుహతామ్, ధుక్ష్వ, దుహాథామ్, ధుగ్ధ్వమ్, దోహై, దోహావహై, దోహామహై. అధోక్, అదుగ్ధామ్, అదుహన్, అదోహమ్, అదుగ్ధ, అదుహాతామ్, అదుహత, అధుగ్ధ్వమ్, దుహ్యాత్, దుహీత.

20. దుహ్ ధాతువునకు పూర్ణత్వమును తగ్గించుట, అనగా నిండుగా నున్న పొదుగును తగ్గించుట (పితుకుట) అని యర్థము. ఇది స్వరితేత్కము గాన ఉభయపది. ఈ ధాతువునకు సంబంధించిన వివిధరూపముల సిద్ధికై యథావకాశముగ "దాదేర్ధాతోర్ఘః" (252)'ఝలాం జశ్ ఝశి' (19). ఝషస్తథోర్ధోఽధః' (552) 'ఏకాచో బశో భష్ ఝషన్తస్య స్ధ్వోః" (253) అను సూత్రములు ప్రవర్తించును. అనగా తకారదకారాది ప్రత్యయములు పర మగునపుడు హకారమునకు ఘకారము, దానికి గకారము. తకార థకారములకు ధకా

రము వచ్చును. సకారాది ప్రత్యయము పరమగునపుడు హకారమునకు ఘత్వము, భష్ భావముచే దకారమునకు ధకారము, ఘకారమునకు చర్త్వముచే కకారము, సకారము మూర్ధన్యషకారము వచ్చును. 'ధ్వమ్' పరమగునపుడు హకారమునకు ఘకారము. దానికి గకారము, దకారమునకు భష్భావముచే ధకారము వచ్చుచుండును.

లట్ : పరస్మైపదము :- దోగ్ధి, దుగ్ధః, దుహన్తి, ధోక్షి, దుగ్ధః, దుగ్ధ, దోహ్మి, దుహ్వః, దుహ్మః. ఆత్మనేపదము :- దుగ్ధే ఇత్యాది రూపములు మూలమునందు చూపిన విధముగ నుండును.

లిట్టునందు 'దుదోహ, దుదుహే' ఇత్యాది రూపము లగును.

లుట్టునందు రెండు పదములందును 'తాస్' వచ్చును గాన అది పరమగునపుడు హకారమునకు ఘత్వగత్వములు, తకారమునకు ధకారము వచ్చి 'దోగ్ధా, దోగ్ధారౌ, దోగ్ధారః' ఇత్యాది రూపము లగును.

లృట్టునందు 'స్య' చేర్చిన పిమ్మట సకారాది ప్రత్యయము పరముగ నున్నది గాన హకారమునకు ఘత్వము; భష్ భావముచే దకారమునకు ధకారము ఘకారమునకు చర్త్వముచే కకారము, సకారమునకు షత్వము (కషయోర్యోగే క్షః) చేయటచే 'ధోక్ష్యతి, ధోక్ష్యతే' ఇత్యాది రూపము లగును.

రెండు పదముల యందును లోట్రూపములు మూలమున చూపబడినవి. లఙ్; పరస్మైపదమున 'అధోక్, అదుగ్ధామ్, అదుహన్, అధోక్, అదుగ్ధమ్, అదుగ్ధ, అదోహమ్, అదుహ్వ, అదుహ్మ" ప్రథమ మధ్యమపురుషైకవచనములందు తకార సకారములకు హల్ఙ్యాది లోపము (179) వచ్చినది.

ఆత్మనేపదమున :- "అదుగ్ధ, అదుహాతామ్, అదుహత, అదుగ్ధాః అదుహాథామ్, అదుగ్ధ్వమ్, అదుహి, అదుహ్వహి, అదుహ్మహి.

విధిలిఙ్ పరస్మైపదమున :- "దుహ్యాత్, దుహ్యాతామ్, దుహ్యుః' ఇత్యాది రూపములును, ఆత్మనేపదమున "దుహీత, దుహీయతామ్, దుహీరన్" ఇత్యాది రూపము లగును

ఆశీర్లిఙ్ పరస్మైపదమున :- 'దుహ్యాత్, దుహ్యాస్తామ్, దుహ్యాసుః" ఇత్యాది రూపము లగును. ఆత్మనేపదమున 'సీయుట్' సుడాగమములు చేసిన పిమ్మట ప్రథమపురుషైక వచనమున 'దుహ్ సీ స్ త' అని యుండగా:-

592 లిఙ్సిచావాత్మనేపదేషు 1,2.11

ఇక్సమీపాద్ హలః పరౌ ఝలాదీ లిఙ్సిచౌ కితౌ స్తః, తఙి, ధుక్షీష్ట.

'ఇకో ఝల్' 'హలన్తాచ్చ' అను సూత్రములు అనువర్తించును. "అసంయోగాల్లిట్ కిత్" అను సూత్రమునుండి 'కిత్' అను పదము అనువర్తించును.

ఇక్కునకు సమీపమునందున్న హల్‌కంటె పరమైనవియు, 'ఝల్' ఆదియందు కలవియు నగు లిఙ్ సిచ్‌లు 'తఙ్'లు కిత్తులు అగును.

పరమగునపుడు విధిలిఙ్‌నందుకూడ సీయుడాగమము వచ్చినను సకారము లోపించుటచే ఝలాదిలిఙ్ లేదు కావునను, పరస్మైపదమున యాసుడాగమము ఝలాది కాకుండుటచేతను ఈ సూత్రము ప్రవర్తింపదు. కేవలము అనిడ్ధాతువుల ఆత్మనేపద ఆశీర్లిఙ్లులందు మాత్రమే ఈ సూత్రము ప్రవర్తించును.

ఈ సూత్రముచే కిత్త్వము వచ్చినది గాన గుణము రాదు. హకారమునకు ఘకారము, దానికి చర్త్వముచే కకారము, దకారమునకు భష్ భావముచే ధకారము, సకారములకు షత్వము, ష్టుత్వము చేయగా 'ధుక్షీష్ట' అనురూపమైనది. "ధుక్షీష్ట, ధుక్షీయాస్తామ్, ధుక్షీరన్, ధుక్షీష్ఠాః, ధుక్షీయాస్థాం, ధుక్షీధ్వమ్, ధుక్షీయ, ధుక్షీవహి, ధుక్షీమహి."

593 శల ఇగుపధాదనిటః క్సః 3.1.45

ఇగుపధో యః శలన్తః తస్మాదనిటః చ్లేః క్స ఆదేశః స్యాత్. అధుక్షత్.

"ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్" నుండి 'ధాతోః', 'చ్లేః సిచ్' నుండి 'చ్లేః' అనువర్తించును. ఇక్ ఉపధగా కలదియు శల్ అంతమునందు కలదియు నగు ధాతువుకంటె పరమైన అనిట్ అగు 'చ్లి'కి 'క్స' అను నాదేశము వచ్చును.

'దుహ్' అనుదానికి ఉకార రూపమగు 'ఇక్' ఉపధగా నున్నది. దీని చివర హకార రూపమగు 'శల్' ఉన్నది. లుఙ్‌నందు దీనికంటె పరముగనున్న 'చ్లి' అనిట్ గాన దీనికి 'క్స' అను నాదేశము వచ్చును. 'క్స' యందలి కకారము ఇత్సంజ్ఞకము. పరస్మైపద ప్రథమపురుషైక వచనమున "అదుహ్ చ్లి

త్" అని యుండగా 'క్స' ఆదేశము. 'అదుహ్ స త్' అని యుండగా ఘత్వ, చర్త్వ, భష్ భావ, షత్వాదులచే "అధుక్షత్" అను రూప మగును. అధుక్షత్, అధుక్షతామ్, అధుక్షన్, అధుక్షః, అధుక్షతమ్, అధుక్షత, అధుక్షమ్, అధుక్షావ, అధుక్షామ.

ఆత్మనేపదమునందు ప్రథమపురుషైకవచనమున 'అదుహ్ చ్లి త' అని యుండగా 'చ్లి'కి పై సూత్రముచే 'క్స' ఆదేశము 'అదుహ్ స త'.

594 *లుగ్వా దుహదిహలిహగుహామాత్మనేపదే దన్త్యే 7.3.73*

ఏషాం క్సస్య లుగ్వా స్యాత్; దన్త్యే తఙి అదుగ్ధ-అధుక్షత.

'క్సస్యాచి' నుండి 'క్సస్య' అనువర్తించును. దంత్య మగు అత్మనేపద ప్రత్యయము పర మగునపుడు దుహ్, దిహ్, లిహ్, గుహ్ ధాతువుల క్సప్రత్యయమునకు వికల్పముగ లుక్ వచ్చును.

ఈ సూత్రముచే క్సలోపము వచ్చిన పక్షమున 'అదుగ్ధ' అనియు, లోపాభావపక్షమున 'అధుక్షత' అనియు రూపద్వయ మగును.

ఆత్మనేపద ప్రత్యయములలో 'త' 'థాస్' 'ధ్వమ్' 'వహి' అనునవి దంత్యాదులు. ఇవి పరముగ నున్నపుడు 'క్స' వికల్పముగ లోపించిన పక్షమున లఙ్ నందువలె రూపము లగును.

595 *క్సస్యాచి 7.3.72*

అజాదౌ తఙి క్సస్య లోపః 'అలోన్త్యస్య' ఇత్యకారలోపః. అధుక్షాతామ్, అధుక్షన్త, అదుగ్ధాః - అధుక్షథాః, అధుక్షాథామ్, అధుగ్ధ్వమ్ - అధుక్షధ్వమ్, అధుక్షి, అదుహ్వహి - అధుక్షావహి, అధుక్షామహి అధోక్ష్యత్, అధోక్ష్యత.

'ఘోర్లోపో లేటి వా'నుండి 'లోపః' అనువర్తించును. "లుగ్వాదుహ-" ఇత్యాదిసూత్రమునుండి (594) 'ఆత్మనేపదే'అపకర్షింపబడును. అజాది యగు ఆత్మనేపదప్రత్యయము పర మగునపుడు 'క్స'కు లోపము వచ్చును.

అలోన్త్యపరిభాషచే (21) ఈ లోపము అకారమునకు వచ్చును. ప్రథమ పురుష ద్వివచనమున 'అధుక్ష ఆతామ్'అని యుండగా 'ఆతో ఙితః'అను సూత్రముచే (512) ఇయాదేశము రావలసి యుండగా ఈ సూత్రముచే అకారలోపము. 'అధుక్షాతామ్'అను రూపము సిద్ధించును.

అధుక్షన్త:- మొదట 'ఝ'కు అన్తాదేశము చేసిన పిమ్మట ఇపుడు అజాదిప్రత్యయము పరముగ నున్నది గాన 'క్స'యందలి అకారమునకు లోపము.

ఈ విధముగ 'త, థాస్, ధ్వమ్, వహి'ప్రత్యయములు పర మగునపుడు 'క్స'లోపలోపాభావములచే రూపద్వయమును, ఇతరప్రత్యయములందు ఒక్కొక్క రూపమును అగును. లృఙ్‌నందు పరస్మైపదమున 'అధోక్ష్యత్' ఇత్యాదిరూపములును, ఆత్మనేపదమున 'అధోక్ష్యత'ఇత్యాదిరూపములును అగును.

ఏవం దిహ ఉపచయే. 21. లిహ ఆస్వాదనే. 22. లేఢి, లీఢః, లిహన్తి; లేక్షి, లీఢే. లిహాతే, లిహతే; లిక్షే, లిహాథే, లీఢ్వే. లిలేహ -లిలిహే. లేఢాసి-లేఢాసే. లేక్ష్యతి-లేక్ష్యతే. లేఢు, లీఢామ్, లిహన్తు; లీఢి; లేహాని. లీఢామ్. అలేట్-అలేడ్. అలిక్షత్. అలిక్షత-అలీఢ. అలేక్ష్యత్-అలేక్ష్యత. బ్రూఞ్ వ్యక్తాయాంవాచి. 23.

21. దిహ్ ధాతువునకు వృద్ధి పొందుట అని అర్థము. ఉభయపది. దాని ప్రక్రియ యంతయు దుహధాతుప్రక్రియ వలె ఉండును.

22. లిహ్ ధాతువునకు నాకుట అని యర్థము. ఉభయపది.

లేఢి:- ప్రథమపురుషైకవచనమున శబ్లుక్ చేసిన పిమ్మట 'లిహ్ తి' అని యుండగా 'హో ఢః'అను సూత్రముచే (251) హకారమునకు ఢకారము- 'లిఢ్ తి'. 'ఝషస్తథోర్ధోఽధః' అను సూత్రముచే (552) తకారమునకు ధకారము. దానికి ష్టుత్వముచే ఢకారము "ఢో ఢే లోపః" అను సూత్రముచే (553) మొదటి ఢకారమునకు లోపము. ఇకారమునకు గుణము. 'లేఢి'అను రూపము సిద్ధించినది.

లీఢః: 'లిహ్‌తస్' అని యుండగా ఢలోపము వరకును పై వలెనే ప్రక్రియ యుండును. ఇది అపిత్సార్వధాతుకము గాన "ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః" అను సూత్రముచే (112) ఇకారమునకు దీర్ఘము చేయగా 'లీఢః' అను రూపము సిద్ధించును.

ఈ ధాతువునం దంతటను తకారాదిప్రత్యయములు పరముగ నున్నపుడు యథాసంభవముగ గుణదీర్ఘములు వచ్చుచు ప్రక్రియ ఈ విధముగనే యుండును. అజాదిప్రత్యయములు పర మగునపుడు విశేషకార్య మేదియును ఉండదు. ప్రథమపురుషబహువచనమున 'లిహ్ + అన్తి' 'లిహన్తి'అను రూపము ఉండును.

లేక్షి:- మధ్యమపురుషైకవచనమున 'లిహ్ సి' అని యుండగా హకారమునకు ఢకారము. దానికి 'షఢోః కః సి' అను సూత్రముచే (551) కత్వము. సకారమునకు 'ఇణ్కోః' "ఆదేశప్రత్యయోః" అను సూత్రములచే (150) షత్వము ఇకారమునకు గుణము- 'లేక్షి'అను రూపము సిద్ధించినది. సకారాది ప్రత్యయములు పర మగునపుడు ఈ విధముగనే ఢత్వకత్వషత్వములు వచ్చుచుండును. మకారవకారాదిప్రత్యయములు పర మగునపుడు విశేషకార్యము లుండవు. పరస్మైపది లట్:-:- లేఢి, లీఢః, లిహన్తి; లేక్షి, లీఢః, లీఢ, లేహ్మి, లిహ్వః లిహ్మః. ఆత్మనేపదమున:- లీఢే, లిహాతే, లిహతే; లిక్షే, లిహాథే, లీఢ్వే; లిహే, లిహ్వహే, లిహ్మహే. 'లీఢ్వే'అనునపుడు 'ధ్వమ్' ధకారమునకు ష్టుత్వముచే ఢత్వము వచ్చినది. ఢలోపదీర్ఘాదులు వెనుకటి వలెనే వచ్చినవి.

లిట్‌నందు పరస్మైపదమున "లిలేహ, లిలిహతుః, లిలిహుః; లిలేహిథ, లిలిహథుః, లిలిహ" ఇత్యాదిరూపములును ఆత్మనేపదమున "లిలిహే, లిలిహాతే, లిలిహిరే" ఇత్యాదిరూపములును ఉండును.

లుట్టునందు రెండుపదములందును 'తాస్' వచ్చును గాన హత్వ.ఢత్వ, ఢకారలోపాదులచే "లేఢా, లేఢారౌ, లేఢారః" లేఢాసి (ప) లేఢాసే (ఆ) ఇత్యాదిరూపము లగును లృట్‌నందు 'లేక్ష్యతి' 'లేక్ష్యతే' ఇత్యాదిరూపము లగును.

లోట్ పరస్మైపది:- లేఢు-లీఢాత్, లీఢామ్, లిహన్తు; లీఢి-లీఢాత్. లీఢమ్, లీఢ; లేహాని, లేహావ, లేహామ. లీఢి:- మధ్యమపురుషైకవచనమున 'సి'కి 'హి' ఆదేశము చేసిన పిమ్మట 'లిహ్ హి'అని యుండగా 'హుఝల్భ్యో హేర్ధిః' అను సూత్రముచే (559) 'హి'కి 'ధి'. ఆదేశము. పిమ్మట ఢత్వ, ష్టుత్వ, ఢలోపదీర్ఘములు. ఉత్తమపురుషమున ఆడాగమము పిత్ గాన గుణము వచ్చి 'లేహాని' ఇత్యాదిరూపము లైనవి.

ఆత్మనేపదమున:- లీఢామ్, లిహాతామ్, లిహతామ్, లిక్ష్వ, లిహాథామ్, లీఢ్వమ్; లేహై, లేహావహై, లేహామహై.

లఙ్ (పరస్మైపది):- అలేట్-అలేడ్. అలీఢామ్, అలిహన్; అలేట్-అలేడ్, అలీఢమ్, అలీఢ; అలేహమ్, అలిహ్వ, అలిహ్మ. ప్రథమమధ్యమ

పురుషైకవచనములందు 'అలేహ్ త్'–'అలేహ్ స్' అని యుండగా "హల్ఙ్యాది" సూత్రముచే (179) తకారాసకారములకు లోపము. హకారమునకు ఢత్వము చేసిన పిమ్మట చర్త్వవికల్పముచే 'అలేట్' 'అలేడ్' అను రూపద్వయ మగును. ఆత్మనేపదము:– 'అలీఢ, అలిహాతామ్, అలిహత; అలీఢాః, అలిహాథామ్, అలీఢ్వమ్; అలిక్షి, అలిహ్వహి, అలిహ్మహి.

విధిలిఙ్ పరస్మైపదమున:– "లిహ్యాత్, లిహ్యాతామ్, లిహ్యుః" ఇత్యాదిరూపములును ఆత్మనేపదమున "లిహీత, లిహీయాతామ్, లిహీరన్" ఇత్యాదిరూపములును అగును.

ఆశీర్లిఙ్ పరస్మైపదమున:– "లిహ్యాత్, లిహ్యాస్తామ్, లిహ్యాసుః; లిహ్యాః, లిహ్యాస్తమ్, లిహ్యాస్త; లిహ్యాసమ్, లిహ్యాస్వ, లిహ్యాస్మ" అను రూపము లగును. ఆత్మనేపదమున 'లిక్షీష్ట, లిక్షీయాస్తామ్, లిక్షీరన్' ఇత్యాది రూపములును అగును.

లుఙ్ పరస్మైపదరూపములు:–అలిక్షత్, అలిక్షతామ్, అలిక్షన్, అలిక్షః, అలిక్షతమ్, అలిక్షత; అలిక్షమ్, అలిక్షావ, అలిక్షామ. ఆత్మనేపదమునదంత్య ప్రత్యయములు పర మగునపుడు 'క్స'లోపవికల్పము (సూ–594) అలిక్షత–అలీఢ, అలిక్షాతామ్, అలిక్షన్త; అలిక్షథాః–అలీఢాః, అలిక్షాథామ్, అలిక్షధ్వమ్–అలీఢ్వమ్; అలిక్షి, అలిక్షావహి–అలిహ్వహి, అలిక్షామహి.

లృఙనందు 'అలేక్ష్యత్' (ప) 'అలేక్ష్యత' ఇత్యాదిరూపము లగును. ఈ విధముగ లిహధాతుప్రక్రియ చాలవరకు దుహధాతుప్రక్రియ వలె ఉండును.

23. బ్రూఞ్ ధాతువునకు వ్యక్తమైన వాక్కు అనగా స్పష్టముగ మాట లాడుట అని యర్థము. ఞిత్తు గాన ఉభయపది.

596. బ్రువః పఞ్చానామాదిత ఆహో బ్రువః 3.4.88

బ్రువో లట స్తిబాదీనాం పఞ్చానాం ణలాదయః పఞ్చ వా స్యుః, బ్రువశ్చాహాదేశః. ఆహ, ఆహతుః, ఆహుః.

'పరస్మైపదానాం ణలతుస్' ఇత్యాదిసూత్రము ఈ సూత్రమునకు వెనుక నున్నది. 'విదో లటో వా' నుండి 'లటః' 'వా' అనువర్తించును. బ్రూఞ్ ధాతువు కంటె పర మగు లట్ స్థానమున వచ్చిన తిబాదిప్రత్యయము లైదింటికిని క్రమ

ముగ ణలాదులు ఐదును (ణల్' అతుస్, ఉస్, థల్, అథుస్) అను నాదేశము లును, బ్రూధాతువునకు 'ఆహ'అను నాదేశమును వికల్పముగ వచ్చును.

ప్రథమపురుషయందు ఈ సూత్రముచే తిప్, తస్, ఝి లకు క్రమముగా 'ణల్' 'అతుస్' 'ఉస్'లును, 'బ్రూ'అనుదానికి 'ఆహ' అనునదియు ఆదేశ ముగ వచ్చుటచే "ఆహ, ఆహతుః, ఆహుః"అను రూపము లగును. మధ్యమ పురుషైకవచనమున 'సిప్'కు థలాదేశము చేసిన పిమ్మట 'ఆహ థ'అని యుం డగా థత్వము రావలసి యుండ:-

597. ఆహస్థః 8.2.35

ఝలి పరే. చర్త్వమ్ - ఆత్థ, ఆహథుః.

'ఝలోఝలి' నుండి 'ఝలి' అనువర్తించును. 'ఝల్' పర మగునపుడు 'ఆహ'కు థకార మాదేశముగ వచ్చును. అలో న్త్యపరిభాషచే (21) ఈ ఆదే శము అంత్య మగు హకారమునకు వచ్చును. 'ఆథ్ థ' అని యుండగా 'ఖరి చ' అను సూత్రముచే (74) చర్త్వము- 'ఆత్థ' అను రూపము సిద్ధించును. ద్వివచనమున అథుస్ ఆహాదేశములచే 'ఆహథుః' అను రూపము సిద్ధించును.

ణలాద్యాదేశములు రాని పక్షమున ప్రథమపురుషైకవచనమున శబ్లుక్ చేసిన పిమ్మట 'బ్రూ తి'అని యుండగా:-

598. బ్రువ ఈట్ 7.3.93

బ్రువః పరస్య హలాదేః పితః ఈట్ స్యాత్. బ్రవీతి-బ్రూతః, బ్రువన్తి. బ్రూతే, బ్రువాతే, బ్రువతే.

"నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే"నుండి 'పితి', "ఉతోవృద్ధిర్లుకి హలి" నుండి 'హలి'అను పదము అనువర్తించును. బ్రూఞ్ధాతువుకంటె పర మగు హలాదియు, 'పిత్'ను అగు ప్రత్యయమునకు ఈడాగమము వచ్చును.

'ఈట్' టిత్తు గాన 'తి'ప్రత్యయమునకు ఆద్యవయవముగ వచ్చి 'బ్రూ ఈతి'అని యుండగా "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే (390) గుణము, అవాదేశము చేయగా 'బ్రవీతి'అను రూపము సిద్ధించును. 'పిత్'లగు 'సిప్' 'మిప్'లు పర మగునపుడు గూడ ఈ విధముగనే 'బ్రవీషి' 'బ్రవీమి' అను రూపము లగును. బహువచనమున 'బ్రూ అన్తి' అని యుండగా "అచి శ్ను ధాతుభ్రువాం య్వోరియఙువఙౌ" అను సూత్రముచే (193) ఉవఙాదేశము—

'బ్రువన్తి' అను రూప మగును. ఇతరప్రత్యయములు పర మగునపుడు విశేష కార్యము లేవియును లేవు. "బ్రవీతి, బ్రూతః, బ్రువన్తి; బ్రవీషి, బ్రూథః, బ్రూథ; బ్రవీమి, బ్రూవః, బ్రూమః". ఆత్మనేపదమునందు అజాదిప్రత్యయములు పర మగునపుడు ఉవజాదేశము వచ్చును. ఇతరప్రత్యయములందు విశేష కార్య మేదియును లేదు.

బ్రూతే, బ్రువాతే, బ్రువతే; బ్రూషే, బ్రువాథే, బ్రూధ్వే; బ్రువే, బ్రూవహే, బ్రూమహే.

599. బ్రువో వచిః 2.4.53

ఆర్ధధాతుకే. ఉవాచ, ఊచతుః, ఊచుః; ఉవచిథ-ఉవక్థ, ఊచే. వక్తా, వక్ష్యతి, వక్ష్యతే. బ్రవీతు-బ్రూతాత్, బ్రూతామ్, బ్రువన్తు! బ్రూహి; బ్రవాణి, బ్రూతామ్, బ్రవై. అబ్రవీత్; అబ్రూత, బ్రూయాత్, బ్రువీత. ఉచ్యాత్, వక్షీష్ట.

'ఆర్ధధాతుకే' అధికారము. బ్రూఞ్ధాతువునకు ఆర్ధధాతుకప్రత్యయము పర మగునపుడు 'వచ్' అను నాదేశము వచ్చును.

ఉవాచ:- లిట్ ఆర్ధధాతుకము గాన అది పర మగునపుడు 'వచ్' ఆదేశము చేసిన పిమ్మట ప్రథమపురుషైకవచనము 'వచ్ అ' అని యుండగా ద్విత్వాభ్యాసకార్యములు- 'వవచ్ అ', అభ్యాసవకారమునకు 'లిట్యభ్యాసస్యోభయేషామ్' అను సూత్రముచే (549) సంప్రసారణము, 'సంప్రసారణాచ్చ' అను సూత్రముచే (258) పూర్వరూపము- 'ఉవచ్ అ'. 'అత ఉపధాయాః' అను సూత్రముచే (457) వృద్ధి- 'ఉవాచ' అను రూపము సిద్ధించినది.

ఊచతుః :- 'అతుస్' మొదలగు కిత్ ప్రత్యయములు (అసంయోగాల్లిట్ కిత్ 454) పర మగునపుడు "సంప్రసారణం తదాశ్రయంచ కార్యం బలవత్" అను పరిభాష ననుసరించి ద్విత్వము చేయుటకంటె ముందుగనే 'వచిస్వపియజాదీనాం కితి' అను సూత్రముచే (550) సంప్రసారణము, పూర్వరూపము వచ్చును. పిమ్మట 'ఉచ్ అతుస్' అని యుండగా ద్విత్వాభ్యాసకార్య సవర్ణదీర్ఘాదులచే 'ఊచతుః' ఇత్యాది రూపము లగును. ఆత్మనేపదమున అన్ని ప్రత్యయములును కిత్తులే గాన ఈ విధముగ మొదట సంప్రసారణపూర్వరూపములు, పిమ్మట ద్విత్వాదులు వచ్చును.

'ఉవచిథ-ఉవక్థ' :- 'వచ్' ధాతువు 'తాస్' నందు నిత్యానిట్ కావున అకారము కలది కావునను 'థల్' నందు ఇడాగమము వైకల్పికము. ఇడాగమ పక్షమున 'ఉవచిథ' అనియు, రాని పక్షమున 'చోః కుః' అను సూత్రముచే (307) కుత్వము చేయగా 'ఉవక్థ' అనియు రూపద్వయ మగును. "ఉవాచ ఊచతుః, ఊచుః, ఉవచిథ-ఉవక్థ, ఊచథుః, ఊచ, ఉవాచ-ఉవచ, ఊచివ, ఊచిమ". ఆత్మనేపదమున ఊచే, ఊచాతే, ఊచిరే, ఊచిషే, ఊచాథే, ఊచిధ్వే, ఊచే, ఊచివహే, ఊచిమహే.

లుట్ నందు పరస్మైపదమున "వక్తా, వక్తారౌ, వక్తారః, వక్తాసి" ఇత్యాది రూపములును ఆత్మనేపదమున "వక్తా, వక్తారౌ, వక్తారః, వక్తాసే" ఇత్యాది రూపములును అగును.

లృట్ నందు చకారమునకు 'చోః కుః' అను సూత్రముచే (307) కుత్వము 'స్య' యందలి సకారమునకు 'ఇణ్కోః' "ఆదేశప్రత్యయయోః" అను సూత్ర ములచే (150) షత్వము చేయగా 'వక్ష్యతి', 'వక్ష్యతే' ఇత్యాది రూపము లగును.

లోట్టునందు పరస్మైపదమున తిప్ నకు మాత్రమే ఈడాగమము (సూ-598) వచ్చును. 'సిప్'కు ఆదేశముగ వచ్చిన 'హి' అపిత్ కావునను 'మిప్'కు ఆదేశము చేయుటచే హలాది కాకుండుటచేతను ఈడాగమము రాదు. 'ఝి'కి అన్తాదేశము చేసిన పిమ్మట ఉవజాదేశము వచ్చును. ఉత్తమపురుషమున ఆడా గమము 'పిత్'గాన గుణావాదేశములు వచ్చును. బ్రవీతు- బ్రూతాత్, బ్రూ తామ్, బ్రువన్తు, బ్రూహి- బ్రూతాత్, బ్రూతమ్, బ్రూత. బ్రవాణి, బ్రవావ, బ్రవామ,

ఆత్మనేపదమున అజాది ప్రత్యయములు పర మగునపుడు ఉవజాదేశము వచ్చును. ఉత్తమ పురుషమున ఆడాగమము 'పిత్' గాన జిత్త్వము లేకుం డుటచే గుణావాదేశములు వచ్చును. "బ్రూతామ్, బ్రువాతామ్, బ్రువతామ్, బ్రూష్వ, బ్రువాథామ్, బ్రూధ్వమ్, బ్రవై, బ్రవావహై, బ్రవామహై"

లఙ్ పరస్మైపదమునందు 'తిప్', 'సిప్'లు పిత్సార్వధాతుకములు గావ ఈడాగమము, 'ఝి'కి అన్తాదేశము చేసిన పిమ్మట ఉవజాదేశము వచ్చును. 'మిప్'కు 'అమ్' ఆదేశము చేసిన పిమ్మట అది అజాది గాన ఈడాగమము

రాదు. "అబ్రవీత్, అబ్రూతామ్, అబ్రువన్, అబ్రవీః, అబ్రూతమ్, అబ్రూత, అబ్రవమ్, అబ్రూవ, అబ్రూమ." ఆత్మనేపదమున అజాది ప్రత్యయములు పరమగునపుడు ఉవజాదేశము. అబ్రూత, అబ్రువాతామ్, అబ్రువన్త, అబ్రూథాః, అబ్రువాథామ్, అబ్రూధ్వమ్, అబ్రువి, అబ్రూవహి అబ్రూమహి.

విధిలిఙ్ : పరస్మైపది :- బ్రూయాత్, బ్రూయాతామ్, బ్రూయుః; బ్రూయాః, బ్రూయాతమ్, బ్రూయాత, బ్రూయామ్, బ్రూయావ, బ్రూయామ, ఆత్మనేపది :- 'లిఙః సీయుట్' అను సూత్రముచే (523) సీయుడాగమము చేసిన పిమ్మట "లిఙః సలోపోఽనన్త్యస్య" అను సూత్రముచే (429) సకారము లోపింప ఇపుడు అజాది ప్రత్యయ ముండును గాన ఉవజాదేశము వచ్చి "బ్రువీత, బ్రువీయాతామ్, బ్రువీరన్, బ్రువీథాః, బ్రువీయాథామ్, బ్రువీధ్వమ్, బ్రువీయ, బ్రువీవహి, బ్రువీమహి" అను రూపము లగును

ఆశీర్లిఙ్ ఆర్ధధాతుకము గాన 'వచ్' ఆదేశము. పరస్మైపదమున 'యాసుట్' "కిదాశిషి" అను సూత్రముచే (434) 'కిత్' గాన "వచిస్వపియజాదీనాం కితి" అను సూత్రముచే (550) సంప్రసారణము వచ్చును. ఉచ్యాత్, ఉచ్యాస్తామ్, ఉచ్యాసుః, ఉచ్యాః, ఉచ్యాస్తమ్, ఉచ్యాస్త, ఉచ్యాసమ్, ఉచ్యాస్వ, ఉచ్యాస్మ. ఆత్మనేపదమున 'సీయుట్' 'కిత్' కాదు కాన సంప్రసారణము లేదు. చకారమునకు కుత్వముచే కకారము, సకారమునకు షత్వము చేయగా- "వక్షీష్ట, వక్షీయాస్తామ్, వక్షీరన్, వక్షీష్ఠాః, వక్షీయాస్థామ్, వక్షీధ్వమ్, వక్షీయ, వక్షీవహి, వక్షీమహి" అను రూపము లగును.

లుఙ్లనందు వచ్యాదేశము చేసిన పిమ్మట పరస్మైపదమున "అవచ్ చ్లి తి" అనియు, ఆత్మ నేపదమున 'అవచ్ చ్లి త' అనియు ఉండగా :-

600 అస్యతివక్తిఖ్యాతిభ్యోఽఙ్ 3.1.55

ఏభ్యశ్చ్లేరఙ్ స్యాత్.

'చ్లేః సిచ్' నుండి 'చ్లేః' అనువర్తించును. 'అస్' (దైవాదికము) 'వచ్' 'ఖ్యా' ధాతువులకంటె పర మగు 'చ్లి'కి 'అఙ్' ఆదేశము వచ్చును. ఙకారము ఇత్సంజ్ఞకము. 'అవచ్ అ త్' 'అవచ్ అ త' అని యుండగా

601 వచ ఉమ్ 7.4.20

అజి పరే. అవోచత్. అవోచత. అవక్ష్యత్, అవక్ష్యత.

'ఋదృశోఽజి గుణః' నుండి 'అజి' అనువర్తించును. వచ్ ధాతువునకు 'అఙ్' పర మగునపుడు 'ఉమ్' అను నాదేశము వచ్చును.

'ఉమ్'లోని మకారము ఇత్సంజ్ఞకము. మిత్తుగాన "మిదచోఽన్త్యాత్పరః" అను సూత్రముచే (226) అంత్యాచ్చు అగు వకారోత్తరవర్తి అకారముకంటె పరముగ వచ్చును. "అవ ఉచ్ అత్" 'అవ ఉచ్ అత' అని యుండగా గుణముచే 'అవోచత్' 'అవోచత' అను రూపములు సిద్ధించును. ఈ విధముగ పరస్మైపదమున అవోచత్, అవోచతామ్, అవోచన్, అవోచః, అవోచతమ్, అవోచత; అవోచమ్, అవోచావ,| అవోచామ" అనియు, ఆత్మనేపదమున "అవోచత, అవోచేతామ్, అవోచన్త; అవోచథాః, అవోచేథామ్, అవోచధ్వమ్, అవోచే. అవోచావహి. అవోచామహి" అను రూపములును అగును.

లృఙ్‌నందు 'అవక్ష్యత్. అవక్ష్యత' ఇత్యాది రూపము లగును.

చర్కరీతం చ (గణసూత్రము)

చర్కరీతమ్మితి యఙ్‌లుగన్తమ్. తదదాదౌ బోధ్యమ్. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. 24.

ఇది అదాది ధాతుపాఠమునందలి గణసూత్రము. యఙ్‌లుగంతమునకు చర్కరీత మని ప్రాచీన వైయాకరణుల సంజ్ఞ. యఙ్‌లుగంతములు అదాది గణములో చేరినవిగ గ్రహింపవలెను అని దీని యర్థము. అందుచే యఙ్‌లుగంతమునందు కేవలము 'శప్' మాత్రమే చేర్చబడును (శ్యనాదులు చేర్చబడవు). దానికి లుక్ కూడ వచ్చును. ఈ సూత్రము పరస్మైపద ధాతు ప్రకరణమున నున్నది. అందుచే యఙ్‌లుగంతములు పరస్మైపదమునందు మాత్రమే యుండునని కూడ చెప్పినట్లయినది.

ఊర్ణుధాతువునకు ఆచ్ఛాదనము చేయుట అని యర్థము. ఞిత్తుగాన ఉభయపది. సేట్కము.

602 ఊర్ణోతేర్విభాషా 7.3.90

వా వృద్ధిః స్యాత్ హలాదౌ పితి సార్వధాతుకే. ఊర్ణౌతి-ఊర్ణోతి. ఊర్ణువన్తి. ఊర్ణుతే-ఊర్ణువాతే. ఊర్ణువతే.

'ఉతోవృద్ధిర్లుకి హలి' 'నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే' అను సూత్రములనుండి (630) 'వృద్ధిః' 'హలి' 'పితి' 'సార్వధాతుకే' అనువర్తించును. హలాది యగు పిత్సార్వ ధాతుకము పర మగునపుడు ఊర్ణు ధాతువునకు వృద్ధి వికల్పముగ వచ్చును.

అలోన్త్య పరిభాషచే (21) చివరి అక్షరమగు ఉకారమునకు వృద్ధి వచ్చును. 'తిప్' 'సిప్' 'మిప్'లు హలాది పిత్సార్వధాతుకము లగుటచే అవి పర మగునపుడు ఈ సూత్రముచే వికల్పముగ వృద్ధి వచ్చును. వృద్ధ్యభావ పక్షమున ''సార్వధాతుకార్ధధాతుకయోః'' అను సూత్రముచే (490) గుణము. ఇతర ప్రత్యయములు జిత్తులు గాన గుణవృద్ధులు రావు. అజాది ప్రత్యయములు పరమగునపుడు ఉవజాదేశము వచ్చును. ఆత్మనేపద ప్రత్యయము లన్నియు 'అపిత్'లు గాన జిద్వద్భావ ముండును. గుణవృద్ధులు రావు. యథావకాశముగ ఉవజాదేశము వచ్చుచుండును.

లట్ (పరస్మైపది):- ఊర్ణౌతి-ఊర్ణోతి, ఊర్ణుతః, ఊర్ణువన్తి; ఊర్ణౌషి-ఊర్ణోషి, ఊర్ణుథః, ఊర్ణుథ; ఊర్ణౌమి-ఊర్ణోమి, ఊర్ణువః, ఊర్ణుమః. ఆత్మనేపది. ఊర్ణుతే, ఊర్ణువాతే, ఊర్ణువతే; ఊర్ణుషే, ఊర్ణువాథే, ఊర్ణుధ్వే; ఊర్ణువే, ఊర్ణువహే, ఊర్ణుమహే. 'ఊర్ణుపతే' అనునపుడు 'ఝ'అకారముకంటె పరముగ లేదు గాన 'ఆత్మనేపదేష్వనతః'అను సూత్రముచే (527) 'అత్' ఆదేశము వచ్చినది.

ఊర్ణుధాతువునకు ఊకారరూప మగు ఇచ్ ఆదియందున్నది. ఊకారము గురువు గాన ఇది గురుమత్. కావున లిట్టునందు "ఇజాదేశ్చ గురుమతోఽనృచ్ఛః" అను సూత్రముచే (514) 'ఆమ్' రావలసి యుండగా:-

వా. ఊర్ణోతేరామ్ నేతి వాచ్యమ్.

ఊర్ణుధాతువునకు ఆమ్ రాదని చెప్పవలెను ఈ వార్తికముచే నిషేధింపబడినది గాన ఆమాదేశము రాలేదు. ఇక 'ఊర్ణు' అనునది అజాది ధాతువు గాన 'లిటి ధాతోరనభ్యాసస్య' అను సూత్రముచే (396) రెండవ ఏకాచ్కసమదాయ మగు 'ర్ణు' అనురేఫసహిత మగు దానికి ద్విత్వము రావలసి యుండగా:-

603. నన్ద్రాః సంయోగాదయః 6.1.3

అచః పరాః సంయోగాదయో నదరా ద్విర్న భవన్తి. నుశబ్దస్య ద్విత్వమ్. ఊర్ణునావ. ఊర్ణునువతుః, ఊర్ణునువుః.

న, న్ద్రాః, సంయోగాదయః. 'ఏకాచో ద్వే ప్రథమస్య' 'అజాదేర్ద్వితీయస్య' అను సూత్రములనుండి 'ద్వే' 'అజాదేః'అనువర్తించినవి. అచ్చుకంటె పర మైనవియు, సంయోగాదియం దున్నవియు నగు నకార, దకార, రేఫలకు ద్విత్వము రాదు.

ఈ సూత్రముచే రేఫకు ద్విత్వము నిషేధింపబడినది గాన మిగిలిన 'ణు' అను సముదాయమునకు మాత్ర మే ద్విత్వము వచ్చును. ధాతుపాఠమున; స్వభావ సిద్ధ మగు నకారమునకు "రషాభ్యాం నో ణః సమానపదే" అను సూత్రముచే (267) ణత్వము చేసి 'ఊర్ణుఞ్' అని పఠింపబడినది. ఈ ణత్వము అసిద్ధము గాన 'ను' అను సముదాయమునకు ద్విత్వము వచ్చును.

ధాతువులలో రేఫకంటె పర మగు ణకార మెచ్చట ఉన్నను అది నకార స్థానముననే వచ్చిన దని గ్రహింపవలెను. ఇట్లే ఝల్పరకమ లగు అనుస్వార పంచమవర్ణములు నకారజన్యములు; షకారము సకారజన్యము. షకారముకంటె పర మగు టవర్గము తవర్గజన్యము:-

నకారజావనుస్వారపఞ్చమౌ ఝలి ధాతుషు
సకారజః షకారశ్చ షాట్టవర్గ స్తవర్గజః.

ఈ విధముగ నుకు ద్విత్వము చేయుటచే లిట్ ప్రథమపురుషైకవచనమున 'ఊర్ నునుఅ' అని యుండగా అభ్యాసనకారమునకు రేఫసంబంధ ముండుటచే ణత్వము. 'అచో ఞ్ణితి' అను సూత్రముచే (182) చివరి ఉకారమునకు వృద్ధి; ఆవాదేశము- 'ఊర్ణునావ' అను రూపము సిద్ధించును.

ఊర్ణునువతుః; ఊర్ణునువుః:- 'అపిత్' లిట్ కిత్తు గాన ఉకారమునకు గుణము రాలేదు. ఉవఙాదేశము వచ్చినది.

604. విభాషోర్ణోః 1.2.3

ఇడాదిప్రత్యయో వా ఙిత్ స్యాత్. ఊర్ణునువిథ - ఊర్ణునవిథ. ఊర్ణువితా-ఊర్ణవితా, ఊర్ణువిష్యతి-ఊర్ణవిష్యతి. ఊర్ణౌతు-ఊర్ణోతు. ఊర్ణవాని, ఊర్ణవై.

ఊర్ణుధాతువు అనేకాచ్కము గాన సేట్కము. దీనికి 'థల్'నందు ఇడా గమము చేసిన పిమ్మట 'ఊర్ణును ఇథ' అని యుండగా, ఈ సూత్రము ప్రవర్తించును.

'గాఙ్కుటాదిభ్యోఞ్ణిన్ఙిత్' "విజ ఇట్"అను సూత్రములనుండి 'ఙిత్' 'ఇట్' అనువర్తించును. ఊర్ణుధాతువుకంటె పర మగు ఇడాదిప్రత్యయము వికల్పముగ 'ఙిత్' అగును.

ఙిత్త్వపక్షమున గుణము రాదు గాన ఉవఙాదేశము వచ్చి "ఊర్ణునువిథ" అను రూపము, తదభావపక్షమున గుణావాదేశములచే 'ఊర్ణనవిథ' అను రూపమును సిద్ధించును.

లిట్-పరస్మైపది:- ఊర్ణునావ, ఊర్ణునువతుః, ఊర్ణునువుః; ఊర్ణునువిథ-ఊర్ణునవిథ, ఊర్ణునువథుః, ఊర్ణునువ: ఊర్ణునావ-ఊర్ణునవ, ఊర్ణునువివ-ఊర్ణునవివ, ఊర్ణునువిమ-ఊర్ణునవిమ. ఆత్మనేపది:- ఊర్ణునువే, ఊర్ణునువాతే, ఊర్ణునువిరే; ఊర్ణునువిషే-ఊర్ణునవిషే, ఊర్ణునువాథే, ఊర్ణునువిధ్వే-ఊర్ణునవిధ్వే; ఊర్ణునువే, ఊర్ణునువివహే-ఊర్ణునవివహే. ఊర్ణునువిమహే-ఊర్ణునవిమహే.

లుట్లు ల్ఋట్లులందు రెండు పదములందును 'తా' 'స్య'లు వచ్చి వీటికి ఇడాగమము వచ్చును గాన ఙిత్త్వవికల్పముచే ఉవఙాదేశ, గుణావాదేశములచే ఊర్ణువితా-ఊర్ణవితా, ఊర్ణువితారౌ, ఊర్ణవితారౌ, ఊర్ణువితారః ఊర్ణవితారః; (ల్ఋట్) ఊర్ణువిష్యతి-ఊర్ణవిష్యతి; ఊర్ణువిష్యతే-ఊర్ణవిష్యతే, ఇత్యాది రూపములగును.

లోట్ ప్రథమపురుషైకవచనమున (పరస్మైపదమున) వృద్ధివికల్పముచే (సూ-602) ఊర్ణౌతు-ఊర్ణోతు అను రూపద్వయ ముండును. ఊర్ణౌతు-ఊర్ణోతు-ఊర్ణుతాత్, ఊర్ణుతామ్, ఊర్ణువన్తు; ఊర్ణుహి-ఊర్ణుతాత్, ఊర్ణుతమ్-ఊర్ణుత! ఊర్ణవాని, ఊర్ణవావ, ఊర్ణవామ. ఆత్మనేపది:- ఊర్ణుతామ్, ఊర్ణువాతామ్, ఊర్ణువతామ్; ఊర్ణుష్వ-ఊర్ణువాథామ్-ఊర్ణుధ్వమ్. ఊర్ణవై, ఊర్ణవావహై, ఊర్ణవామహై.

లఙ్ పరస్మైపదప్రథమమధ్యమపురుషైకవచనములందు ఆడాగమము, 'ఆటశ్చ' (197) అను వృద్ధియు చేసిన పిమ్మట 'ఔర్ణుత్' "ఔర్ణుస్" అ

యుండగా 'త్' 'స్' అనునవి హలాదిపిత్సార్వధాతుకములు గాన వికల్పముగ వృద్ధి రావలసి యుండ (సూ-602) తదపవాదముగ గుణము విధింపబడు చున్నది.

605. *గుణోఽపృక్తే* 7.3.91

ఊర్ణోతేర్గుణోఽపృక్తే హలాదౌ పితి సార్వధాతుకే. వృద్ధ్యపవాదః. ఔర్ణోత్, ఔర్ణోః, ఊర్ణుయాత్, ఊర్ణుయాః, ఊర్ణువీత. ఊర్ణూయాత్, ఊర్ణువిషీష్ట-ఊర్ణవిషీష్ట.

'హలాదేః', 'పితి', 'సార్వధాతుకే' అను పదములు 'ఊర్ణోతేర్విభాషా' అను సూత్రమునందు వలెనే (602) అనువర్తించును. హలాదియు, అపృక్త రూపమును అగు పిత్సార్వధాతుకము పర మగునపుడు ఊర్ణుధాతువునకు గుణము వచ్చును.

ఇది వృద్ధికి అపవాదము. లఙ్ (పరస్మైపది):- ఔర్ణోత్, ఔర్ణుతామ్, ఔర్ణువన్; ఔర్ణోః, ఔర్ణుతమ్, ఔర్ణుత; ఔర్ణవమ్, ఔర్ణువ, ఔర్ణుమ. ఆత్మనేపది:- ఔర్ణుత, ఔర్ణువాతామ్, ఔర్ణువత, ఔర్ణుథాః, ఔర్ణువాథామ్, ఔర్ణుధ్వమ్, ఔర్ణువి, ఔర్ణువహి, ఔర్ణుమహి.

విధిలిఙ్ పరస్మైపదమున "ఊర్ణుయాత్, ఊర్ణుయాతామ్, ఊర్ణుయుః" ఇత్యాదిరూపములును, ఆత్మనేపదమున "ఊర్ణువీత, ఊర్ణువీయాతామ్, ఊర్ణువీరన్" ఇత్యాదిరూపములును ఉండును.

"ఊర్ణుయాః" అను మధ్యమపురుషైకవచనమున 'సిప్' 'పిత్' గాన వైకల్పికవృద్ధి రావలసి యున్నది (సూ-602). కాని 'ఙిచ్చ పిన్న' (ఙిత్తు 'పిత్' కాజాలదు- ఇచట యాసుట్ ఙిత్) అను భాష్యకారవచనముచే పిత్త్వము లేదు గాన వృద్ధి రాదు.

ఆశీర్లిఙ్ (పరస్మైపదమున) నందు "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః" అను సూత్రముచే (485) దీర్ఘము వచ్చును గాన 'ఊర్ణూయాత్, ఊర్ణూయాస్తామ్, ఊర్ణూయాసుః' ఇత్యాదిరూపము లగును. ఆత్మనేపదమున 'సీయుట్'కు ఇడాగమము చేసిన పిమ్మట దానికి ఙిత్త్వము వికల్పముగ లభించుటచే (సూ-304) ఙిత్త్వపక్షమున ఉవఙాదేశముచే "ఊర్ణువిషీష్ట, ఊర్ణువిషీయాస్తామ్, ఊర్ణువిషీరన్" ఇత్యాదిరూపములును, ఙిత్త్వాభావపక్షమున గుణావాదేశములచే

ఊర్ణ విషీష్ట, ఊర్ణవిషీయాస్తామ్, ఊర్ణ విషీరన్" ఇత్యాదిరూపములును అగును.

606. ఊర్ణోతేర్వ్విభాషా 7.2.6

ఇడాదౌ పరస్మైపదే పరే సిచి వా వృద్ధిః. పక్షే గుణః. ఔర్ణావీత్-ఔర్ణువీత్-ఔర్ణవీత్. ఔర్ణావిష్టామ్-ఔర్ణువిష్టామ్-ఔర్ణవిష్టామ్. ఔర్ణువిష్ట-ఔర్ణవిష్ట, ఔర్ణువిష్యత్-ఔర్ణవిష్యత్. ఔర్ణువిష్యత-ఔర్ణవిష్యత.

ఇ త్య దా ది ప్ర క ర ణ మ్.

'సిచివృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రము, 'నేటి'నుండి 'ఇటి' అను పదము అనువర్తించును. పరస్మైపదమున ఇడాదిసిచ్ పర మగునపుడు ఊర్ణు ధాతువునకు వృద్ధి వికల్పముగా వచ్చును.

లుఙ్ పరస్మైపదమున ఇడాదిప్రత్యయమునకు ఙిత్త్వము వైకల్పికము గాన ఙిత్త్వపక్షమున ఉవఙాదేశము, తదభావపక్షమున ఈ సూత్రముచే (606) వికల్పకముగ వృద్ధి, వృద్ధి రాని పక్షమున గుణము వచ్చి- "ఔర్ణావీత్, ఔర్ణావిష్టామ్, ఔర్ణావిషుః" "ఔర్ణువీత్, ఔర్ణువిష్టామ్, ఔర్ణువిషుః" "ఔర్ణవీత్, ఔర్ణవిష్టామ్, ఔర్ణవిషుః" ఇత్యాదిత్రివిధరూపము లుండును.

ఆత్మనేపదమున ఉవఙాదేశగుణవికల్పముచే "ఔర్ణువిష - ఔర్ణవిష్ట" ఇత్యాదిరూపద్వయము లుండును.

లృఙ్‌నందు కూడ ఙిత్త్వవికల్పముచే రెండు పదములందును రెండేసి రూపము లుండును.

అ దా ది గ ణ ము స మా ప్త ము.

# అథ జుహోత్యాది గణః

హు దానాదనయోః. 1

607. జుహోత్యాదిభ్యః శ్లుః 2.4.75

శపః శ్లుః స్యాత్.

హు ధాతువునకు దానముచేయుట (హోమముచేయుట) తినుట అని యర్థములు. ఇది అజంతమగు ఏకాచ్కధాతువు కావున అనిట్. ఈ ధాతువునకు కర్త్రర్థసార్వధాతుకములందు శప్ప్రత్యయము వచ్చును. ఆ 'శప్'కు శ్లు (లోపము) విధింపబడుచున్నది.

'అదిప్రభృతిభ్యః శపః'నుండి 'శపః'అనువర్తించును. జుహోత్యాదుల కంటె- అనగా హుధాతువు మొదలగు వాటికంటె పరమగు 'శప్'కు శ్లు వచ్చును.

'హు'ధాతువునకు ప్రథమపురుషైకవచనమున 'హు శప్ తి'అని యుండగా ఈ సూత్రముచే 'శప్'కు లోపము. 'హు తి'అని యుండును.

608. శ్లౌ 6.1.10

ధాతోర్ద్వే స్తః. జుహోతి, జుహుతః.

'లిటి ధాతోరనభ్యాసస్య'నుండి 'ధాతోః', "ఏకాచోద్వే ప్రథమస్య"నుండి 'ద్వే', అనువర్తించును. శ్లువిషయమున- అనగా శ్లు వచ్చెడు సందర్భములలో ధాతువునకు ద్విత్వము వచ్చును.

ఈ సూత్రముచే ధాతువునకు ద్విత్వము చేయగా 'హు హు తి' అని యుండును. హకారమునకుచుత్వముచే (సూ-456) ఝకారము. దానికి "అభ్యాసేచర్చ"అను (401) జశ్త్వము చేయగా జకారము. రెండవ ఉకారమునకు గుణము (సూ-390)- 'జుహోతి' అను రూపము సిద్ధించును. ద్వివచనప్రత్యయమగు 'తస్' "సార్వధాతుకమపిత్" అని (503) ఙిత్తు గాన గుణము రాదు. 'జుహుతః' అను రూపము సిద్ధించును

బహువచనమున 'ఝి'కి అన్తాదేశము రావలసి యుండగా:-

609. అదభ్యస్తాత్ 7.1.4

ఝస్యాఽత్ స్యాత్. 'హుశ్నువోః' ఇతి యణ్-జుహ్వతి.

'ఘ్వోర్నః'నుండి 'ఋః'అనువర్తించును. అభ్యస్తముకంటె పర మగు 'ఋ'కు 'అత్'ఆదేశము వచ్చును.

'శ్లౌ' అను ద్విత్వవిధాయకసూత్రము (608) షష్ఠాధ్యాయము లోనిది గాన 'ఉభే అభ్యస్తమ్' అను సూత్రముచే (345) 'హుహు'అనుదానికి అభ్యస్త సంజ్ఞ యుండును. దానికంటె పర మగు ఋకారమునకు ఈ సూత్రముచే(609) 'అత్' ఆదేశము వచ్చి చుత్వాదులు చేసిన పిమ్మట 'జుహు అత్ ఇ' అని యుండగా ఉవజాదేశము (సూ-199) రావలసి యున్నది. దానిని బాధించి "హుశ్నువోః సార్వధాతుకే" అను (504) యణాదేశము వచ్చి 'జుహ్వతి' అను రూప మగును. ఇతరరూపములు:-—జుహోషి, జుహుథః, జుహుథ; జుహోమి, జుహువః, జుహుమః.

610. భీహ్రీభృహువాం శ్లువచ్చ 3.1.39

ఏభ్యో లిటి ఆమ్ వా స్యాత్; ఆమి శ్లావివ కార్యఞ్చ,

జుహవాఞ్చకార-జుహావ. హోతా. హోష్యతి. జుహోతు-జుహుతాత్, జుహుతామ్, జుహ్వతు; జుహుధి, జుహవాని. అజుహోత్, అజుహుతామ్.

'కాస్ప్రత్యయాదామమన్త్రేలిటి'నుండి 'ఆమ్' 'లిటి' అనువర్తించును. భీ, హ్రీ, భృ, హుధాతువులకంటె లిట్టు పర మగునపుడు 'ఆమ్' ఆగమము వచ్చును. ఆమ్ పర మగునపుడు శ్లు వచ్చినపు దే కార్యములు వచ్చినవో ఆ కార్యములు కూడ వచ్చును.

హుధాతువునకు లిట్ పర మగునపుడు 'ఆమ్' ఆదేశము చేసిన పిమ్మట 'హు ఆమ్ లిట్'అని యుండగా శ్లువద్భావముచే ద్విత్వాభ్యాసకార్యగుణావాదేశాదులు కూడ వచ్చి 'జుహవామ్ లిట్' అని యుండగా 'ఆమః'అను సూత్రముచే (173) లిట్టు లోపించిన పిదప 'కృఞ్చానుప్రయుజ్యతే లిటి' అను సూత్రముచే (474) లిట్పరము లగు 'కృఞ్', 'భూ', 'అస్' ధాతువు లనుప్రయుక్తములై "జుహవాఞ్చకార'; 'జుహవామ్బభూవ', 'జుహవామాస' ఇత్యాదిరూపము లగును.

ఆమ్ రాని పక్షమున ద్విత్వాభ్యాసకార్యాదులచే "జుహావ, జుహువతుః, జుహువుః: జుహవిథ-జుహోథ, జుహువథుః, జుహువ; జుహావ,

జుహావ, జుహువివ, జుహువిమ" అను రూపములగును. అజాది ప్రత్యయములు పర మగునపుడు ఉవఙ్ వచ్చినది. 'థల్' పర మగునపుడు భారద్వాజనియమముచే ఇడ్వికల్పము. లుట్, లృట్టులందు 'హోతా' 'హోష్యతి' ఇత్యాదిరూపము లగును. విశేషకార్యము లేవియు లేవు.

లోట్టునందు లట్టునందు వలె 'శప్'కు శ్లుమొద లగు కార్యములు వచ్చును. ప్రథమపురుషైకవచనమునందును, ఉత్తమపురుషయందలి అన్ని వచనములందును పిత్త్వ మున్నది గాన గుణము వచ్చును. మధ్యమపురుషైకవచనమున 'హుఝల్భ్యోహేర్ధిః' అను సూత్రముచే (559) సిప్ స్థానమున వచ్చిన 'హి'కి 'ధి' ఆదేశము చేయగా 'జుహుధి'అను రూపము సిద్ధించినది. "జుహోతు-జుహుతాత్, జుహుతామ్, జుహ్వతు. జుహుధి-జుహుతాత్, జుహుతమ్, జుహుత; జుహవాని, జుహవావ, జుహవామ" 'జుహ్వతు' అనునపుడు ఝకారమునకు అదాదేశము, 'యణ్' వచ్చినవి.

లఙ్ ప్రథమపురుషైకవచనద్వివచనములందు "అజుహోత్" 'అజుహుతామ్' అను రూపము లగును. కార్యవిశేష మేదియును లేదు. బహువచనమున 'ఝి'కి "సిజభ్యస్తవిదిభ్యశ్చ" అను (4[illegible]) 'జుస్' ఆదేశము చేసిన పిమ్మట "అజుహు ఉస్" అని యుండగా 'ఝి' అపిత్ గాన జిద్వద్భావముచే గుణము వచ్చుటకు అవకాశము లేదు గాన 'ఉవఙ్' రావలసి యున్నది. దానిని బాధించి "హుశ్నువోఃసార్వధాతుకే"అను సూత్రముచే (504) యణాదేశము రావలసి యుండగా:-

611. జుసి చ 7.3.83

ఇగన్తాఙ్గస్య గుణః అజాదౌ జుసి. అజుహవుః. జుహుయాత్. హూయాత్. అహౌషీత్. అహోష్యత్. ఞిభీ భయే. 2. బిభేతి,

'అఙ్గస్య' అధికారము. 'మిదేర్గుణః' 'క్సస్యాచి'నుండి 'గుణః' 'అచి' అనువర్తించును. 'ఇకోగుణవృద్ధీ'అను పరిభాషచే 'ఇకః'లభించును. అజాది యగు జుస్ పరమగునపుడు ఇగన్తాంగమునకు గుణము వచ్చును.

ఈ సూత్రముచే ఉకారమునకు గుణము; అవాదేశము; 'అజుహవుః' అను రూపములు సిద్ధించును. ఇతరరూపములు:- 'అజుహోః, అజుహుతమ్, అజుహుత; అజుహవమ్, అజుహువ, అజుహుమ'. విధిలిఙ్నందు "జుహు

యాత్, జుహుయాతామ్, జుహుయుః'' ఇత్యాదిరూపము లగును. ఆశీర్లిఙ్ నందు "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః" అను సూత్రముచే (485) దీర్ఘము వచ్చి "హూయాత్, హూయాస్తామ్, హూయాసుః'' ఇత్యాదిరూపము లగును.

లుఙ్నందు "సిచి వృద్ధిః పరస్మైపదేషు" అను సూత్రముచే (486)వృద్ధి వచ్చి 'అహౌషీత్, అహౌష్టామ్, అహౌషుః' ఇత్యాదిరూపములును, లృఙ్ నందు "అహోష్యత్, అహోష్యతామ్, అహోష్యన్'' ఇత్యాదిరూపములును అగును.

2. భీధాతువునకు భయపడుట అని అర్థము, అనిట్కము. ప్రథమపురుషైకవచనమున 'శప్'కు శ్లు చేసిన పిమ్మట ద్విత్వ, అభ్యాసహ్రస్వ (సూ-399) గుణములచే 'బిభేతి' అను రూపము సిద్ధించును. ద్వివచనమున ద్విత్వాభ్యాస కార్యాదులు చేసిన పిమ్మట 'బిభీతస్' అని యుండగా:-

## 612. భియోఽన్యతరస్యామ్ 6.4.115

ఇకారో వా స్యాత్ హలాదౌ క్ఙితి సార్వధాతుకే.

బిభితః—బిభీతః, బిభ్యతి. బిభయాఞ్చకార, బిభాయ. భేతా. భేష్యతి. బిభేతు—బిభితాత్-బిభీతాత్. అబిభేత్, బిభియాత్-బిభీయాత్, భీయాత్. అభైషీత్. అభేష్యత్.

'ఇద్దరిద్రస్య' "గమహనజనఖనఘసాంలోపః క్ఙిత్యనఙి" "ఈహల్యఘోః" "అతఉత్సార్వధాతుకే" అను సూత్రములనుండి 'ఇత్' 'క్ఙితి' 'హలి' 'సార్వధాతుకే' అనువర్తించును. హలాదియు, కిత్తు గాని ఙిత్తు గాని యైన సార్వధాతుకము పర మగునపుడు భీధాతువునకు ఇకారము ఆదేశముగ వచ్చును.

అలోన్త్యపరిభాషచే (21) ఈకారమునకు ఈ సూత్రముచే ఇకారాదేశము వచ్చి 'బిభితః' అనియు, ఇకారము రాని పక్షమున 'బిభీతః' అనియు రూపద్వయ మగును. థస్, థ, వస్, మస్‌లు కూడ ఙిత్తు లగు హలాదిసార్వధాతుకము లగుటచే రెండేసి రూపము లగును. బిభేతి, బిభితః-బిభీతః, బిభ్యతి, బిభేషి, బిభిథః-బిభీథః, బిభిథ; బిభీథ- బిభేమి, బిభివః-బిభీవః, బిభిమః-బిభీమః.

లిట్టునందు వికల్పముగ ఆమాదేశము వచ్చుటచే (సూ-610) 'బిభయా ఞ్చకార'; 'బిభయామ్బభూవ', 'బిభయామాస' ఇత్యాదిరూపములును, 'ఆమ్' రాని పక్షమున "బిభాయ, బిభ్యతుః" (యణాదేశము), బిభ్యుః; బిభయిథ — బిభేథ, బిభ్యథుః, బిభ్య, బిభాయ - బిభయ, బిభ్యివ, బిభ్యిమ" అను రూపములును అగును. థల్ నందు భారద్వాజనియమముచే ఇడాగమము వికల్పముగ వచ్చినది. 'వస్', 'మస్' లకు క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము.

లుట్, ల్బట్టులందు 'భేతా, భేష్యతి' ఇత్యాదిరూపము లగును. లోట్టు నందు హలాదిప్రత్యయములు పర మగునపుడు ఇత్వవికల్పముచే రూపద్వయము సిద్ధించుచుండును. ప్రథమపురుషైకవచనమునందును, ఉత్తమపురుషయందును (ఆడాగమమునకు) పిత్త్వ ముండుటచే గుణము వచ్చును. బిభేతు-బిభితాత్-బిభీతాత్, బిభితామ్-బిభీతామ్, బిభ్యతు; బిభిహి-బిభీహి, బిభితాత్-బిభీతాత్, బిభితమ్-బిభీతమ్, బిభిత-బిభీత; బిభయాని, బిభయావ, బిభయామ.

లఙ్:-అబిభేత్, అబిభితామ్-అబిభీతామ్, అబిభయుః; అబిభేః, అబిభితమ్-అబిభీతమ్, అభిభిత-అభిభీత; అభిభయమ్, అబిభివ- అబిభీవ, అబిభిమ-అబిభీమ.

విధిలిఙ్నందు జిత్తగు 'యాసుట్' పరముగ నుండుటచే అన్ని పురుష వచనములందును "బిభియాత్-బిభీయాత్, బిభియాతామ్-బిభీయాతామ్" ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిఙ్నందు "భీయాత్, భీయాస్తామ్, భీయాసుః" ఇత్యాదిరూపము లగును. లుఙ్నందు వృద్ధి (సూ-486) "అభైషీత్, అభైష్టామ్, అభైషుః" ఇత్యాదిరూపము లగును. ల్బఙ్నందు "అభేష్యత్, అభేష్యతామ్" ఇత్యాది రూపము లగును.

హ్రీ లజ్జాయామ్. 3. జిహ్రేతి, జిహ్రీతః, జిహ్రియతి. జిహ్రయాఞ్చకార, జిహ్రాయ, హ్రేతా, హ్రేష్యతి. జిహ్రేతు. అజిహ్రేత్. జిహ్రీయాత్. హ్రీయాత్. అహ్రైషీత్. అహ్రేష్యత్.

3. హ్రీధాతువునకు సిగ్గుపడుట అని అర్థము ఇది కూడ అనిడ్ధాతువు. దీని ప్రక్రియ చాలవరకు భీధాతుప్రక్రియ వలెనే ఉండును. అజాదిప్రత్యయములు పర మగునపుడు ఇయఙాదేశము (సూ-199) వచ్చును. 'జిహ్రీ'యందలి ఈకారము సంయోగపూర్వము గాన "ఏరనేకాచోఽసంయోగపూర్వస్య" అను (200) యణాదేశము రాదు. లిట్టునందు వికల్పముగ ఆయాదేశము వచ్చును (సూ-610). లట్ప్రథమపురుషబహువచన, (లిట్ప్రథమపురుషద్వివచనాదులందు) భీధాతువునకు యణాదేశము రాగా ఈ ధాతువునకు ఇయఙాదేశము వచ్చి 'జిహ్రియతి' 'జిహ్రియతుః' ఇత్యాదిరూపము అగును. ఇది ఒక్కటియే విశేషము. హ్రస్వఇకారము భీధాతువునకు మాత్రమే విధింపబడినది గాన (సూ-612) దీనియందలి రూపములు ఈకారసహితముగనే యుండును.

పౄపాలన పూరణయోః. 4.

613. అర్తిపిపర్త్యోశ్చ 7.4.77

అభ్యాసస్య ఇకారోఽన్తాదేశః స్యాత్ శ్లౌ. పిపర్తి,

పౄధాతువునకు పాలించుట, నింపుట అని అర్థములు ఇది ౠదంతము గాన సేట్కము. "అత్రలోపోఽభ్యాసస్య" 'భృఞామిత్' "నిజాంత్రయాణాం గుణః శ్లౌ" అను సూత్రములనుండి 'అభ్యాసస్య' 'ఇత్' 'శ్లౌ' అనువర్తించును. శ్లు విషయమున ఋ, పౄధాతువుల అభ్యాసకు ఇకారము అన్తాదేశముగ వచ్చును.

లట్ప్రథమపురుషైకవచనమున శప్కు శ్లు, ద్విత్వము చేసిన పిమ్మట 'పౄ పౄ తి'అని యుండగా ఈ సూత్రముచే అభ్యాసయందలి ౠకారమునకు రపరమగు (38) ఇకారము—'పిర్ పౄతి'. 'హలాదిశ్శేషః' (398) అని రేఫలోపము. గుణముచే ౠకారమునకు 'అర్'—'పిపర్తి' అను రూపము సిద్ధించినది. ఉకారవిధాయక మగు రాటోవు సూత్రముకంటె గుణవృద్ధిశాస్త్రములు పరములు గాన ఉకారమును బాధించి గుణవృద్ధులే వచ్చుచుండును.

ద్వివచనమున 'పిపౄతస్' అని యుండగా:-

614. ఉదోష్ఠ్యపూర్వస్య 7.1.102

అఙ్గావయవౌష్ఠ్యపూర్వో య ౠత్, తదన్తస్యాఙ్గస్య ఉత్ స్యాత్.

"ౠత ఇద్ధాతోః"నుండి 'ౠతః'అనువర్తించును. 'అఙ్గస్య'అధికారము ఆవర్తింపబడును. అంగావయవ మగు ఓష్ఠ్యవర్ణము పూర్వమునందు గల ఏ

ఋకారము కలదో, అది అంతమునందు గల అంగమునకు హ్రస్వ ఉకారము ఆదేశముగ వచ్చును.

ఇచట 'పిపౄ' అను అంగమున ఋకారమునకు వెనుక ఓష్ఠ్య మగు పకార మున్నది. కావున ఋకారాంత మగు అంగమునకు ఉకారము వచ్చును. అలోన్త్యసూత్రముచే (21) ఈ ఉకారము ఋకారస్థానమున రపరమై వచ్చును —'పిపుర్ తః'అని యుండగా:—

615. హలి చ 8.2.77

రేఫవాన్తస్య ధాతోరుపధాయా ఇకో దీర్ఘో హలి. పిపూర్తః, పిపురతి. పపార,

'ర్వోరుపధాయా దీర్ఘ ఇకః'అను సూత్రము, 'సిపి ధాతోరుర్వా'నుండి 'ధాతోః' అనువర్తించును.

హల్లు పర మగునపుడు రేఫవకారాంతధాతువు ఉపధకు చెందిన 'ఇక్'కు దీర్ఘము వచ్చును.

ఇచట 'పిపుర్ తః' అనునపుడు 'పిపుర్' అనునది రేఫాన్త మగు ధాతువు. దానికి హల్లు (తకారము) పరముగ నున్నది. అందుచే ఉపధ యగు ఉకారమునకు దీర్ఘము వచ్చి 'పిపూర్తః' అను రూపము సిద్ధించును. బహువచనమున 'ఝి'యందలి ఝకారమునకు అదాదేశము (సూ-609). 'పిపౄఅతి' అని యుండగా ఋకారమునకు 'ఉర్' ఆదేశము (సూ-614) —'పిపురతి' అను రూపము సిద్ధించును. ఇట్లే- పిపర్షి, పిపూర్థః, పిపూర్థ; పిపర్మి, పిపూర్వః, పిపూర్మః అను రూపములు సిద్ధించును.

లిట్ప్రథమపురుషైకవచనమున 'పౄపౄఅ' అని యుండగా అభ్యాస ఋకారమునకు అర్ (సూ-475)- 'పర్పౄఅ'. 'హలాదిః శేషః' (398)- 'పపౄఅ'. ఉత్వమును (సూ-614) బాధించి పరము గాన వృద్ధి (సూ-182) 'పపార' అను రూపము సిద్ధించును.

ద్వివచనమున 'పపౄ అతుస్' అని యుండగా.—

616. శౄదృప్రాం హ్రస్వో వా 7.4.12

ఏషాం కితి లిటి హ్రస్వో వా స్యాత్. పప్రతుః.

'దయతేర్దిగి లిటి' నుండి 'లిటి' అనువర్తించును. పూర్వసూత్రములలో ఎచ్చటను 'కితి' అనునది లేదు. ఐనను ఈ సూత్రము 'ఋచ్ఛత్యౄతామ్'అను

(617) గుణమునకు అపవాదము గావునను, ఆ సూత్రము, గుణము వచ్చుటకు అవకాశము లేని కిత్ ప్రత్యయములు పర మగునపుడు విధింపబడినది కావునను, ఈ సూత్రము కూడ 'కిత్' అగు లిట్టునందే ప్రవర్తించును.

శ్రా, ద్రా, ప్రాధాతువులకు కిత్తగు లిట్ పర మగునపుడు హ్రస్వము వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే ఋకారమునకు హ్రస్వము చేసిన పిమ్మట "పప్ృ అతుస్" అని యుండగా యణాదేశముచే 'పప్రతుః' అను రూపము సిద్ధించును.

హ్రస్వము రాని పక్షమున 'పప్రా అతుస్' అని యున్నపుడు తిప్,సిప్, మిప్ భిన్నము లగు ప్రత్యయము లన్నియు కిత్తులు గాన గుణము (సూ-390) వచ్చుటకు అవకాశము లేకుండుటచే గుణము విధింపబడుచున్నది.

## 617. ఋచ్ఛత్యృతామ్ 7.4.11

తౌదాదికఋచ్ఛేః ఋధాతోః ఋతాం చ గుణో లిటి. పపరతుః, పపరుః.

'దయతేర్దిగి లిటి' 'ఋతశ్చ సంయోగాదేర్గుణః' అను సూత్రములనుండి 'లిటి' 'గుణః' అనువర్తించును. ఋచ్ఛతిశ్చ, ఋశ్చ, ఋత్ చ 'ఋచ్ఛత్యృతః' అని విగ్రహము.

లిట్టు పర మగునపుడు తుదాదిగణమునందలి ఋచ్ఛధాతువునకును ఋధాతువునకును, ఋకారాంతధాతువులకును గుణము వచ్చును. 'కిత్'కాని లిట్టు పర మగునపుడు "సార్వధాతుకార్ధధాతుకయోః"అను సూత్రమే (390) ప్రవర్తించును గాన కిత్ అగు లిట్టునందు కూడ గుణము వచ్చుటకై ఈ సూత్రము చెప్పబడినది.

ఈ సూత్రముచే గుణము చేయగా 'పపరతుః' అను రూపము సిద్ధించినది. 'కిత్'ప్రత్యయములందు ఈ విధముగ రెండేసి రూపము లుండును. పపార, పప్రతుః-పపరతుః, పప్రుః-పపరుః; పపరిథ, పప్రథుః-పపరథుః, పప్ర-పపర; పపార-పపర, పప్రివ-పపరివ, పప్రిమ-పపరిమ.

లుట్, లృట్టులందు 'తాస్' 'స్య' ప్రత్యయములకు ఇడాగమము, ఋకారమునకు గుణము వచ్చిన పిమ్మట 'పరితా' 'పరిష్యతి' ఇత్యాదిరూపము లుండగా:-

### 618. వృతో వా 7 2.38

వృఙ్వృఞ్భ్యాం ఋదన్తాచ్చేటో దీర్ఘో వా స్యాత్, న తు లిటి. పరీతా-పరితా. పరీష్యతి-పరిష్యతి, పిపర్తు. అపిపః, అపిపూర్తామ్, అపిపరుః, పిపూర్యాత్. పూర్యాత్. అపారీత్.

'వృతః' అనునది 'వృ ఋతః' అను వాటికి సమాహారద్వంద్వము. 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' నుండి అనువర్తించిన 'ఇట్' అనునది షష్ఠ్యంతముగ మార్చబడును. "గ్రహోఽలిటి దీర్ఘః" నుండి 'అలిటి' 'దీర్ఘః' అనువర్తించును. వృఙ్, వృఞ్ ధాతువులకంటెను ఋదంతధాతువులకంటెను పర మగు 'ఇట్'కు వికల్పముగ దీర్ఘము వచ్చును; లిట్టుపరముగ నున్నపుడు మాత్రము రాదు.

ఈ సూత్రముచే ఇకారమునకు వికల్పముగ దీర్ఘము వచ్చి "పరీతా-పరితా" "పరీష్యతి-పరిష్యతి" ఇత్యాదిరూపములు రెండేసి యుండును. లోట్-పిపర్తు-పిపూర్తాత్, పిపూర్తామ్, పిపురతు; పిపూర్హి-పిపూర్తాత్, పిపూర్తమ్, పిపూర్త: పిపరాణి, పిపరావ, పిపరామ

ఇచట తాత్, తామ్, హి, తమ్, త, ప్రత్యయములు జిత్తులు గాన గుణము రాలేదు. 'ఉదోష్ఠ్యపూర్వస్య' అని (614) 'ఉర్' వచ్చి, ఊకారము నకు 'హలి చ' అను (616) దీర్ఘము వచ్చును. 'ఋ'కి అదాదేశము చేసిన పిమ్మట 'ఉర్' వచ్చినను, హల్లు పరముగ లేకుండుటచే దీర్ఘము రాలేదు. 'తిప్' ప్రత్యయము, ఉత్తమపురుషయందు వచ్చిన ఆడాగమమును 'పిత్'లు గాన గుణము వచ్చును.

అపిపః:- లఙ్ ప్రథమపురుషైకవచనమున 'అపిపర్ త్' అని యుండగా అపృక్తహల్లగు తకారమునకు హల్ఙ్యాదిసూత్రముచే (179) లోపము. రేఫకు విసర్గముచేయగా 'అపిపః' అను రూపము సిద్ధించినది. మధ్యమపురుషైకవచన మునందు గూడ అపృక్తహల్లగు సకారము లోపింప ఈ రూపమే సిద్ధించును. ఉత్తమపురుషైకవచనమున 'అమ్' పిత్ గాన గుణము వచ్చి 'అపిపరమ్'అను రూప మగును. ఇతరప్రత్యయము లన్నియు జిత్తులు గాన గుణము రాదు. ఋకా రమునకు 'ఉర్' ఆదేశము. హలాదిప్రత్యయములు పర మగునప్పుడు ఉకారము నకు దీర్ఘము వచ్చును. ప్రథమపురుషబహువచనమున 'సిజభ్యస్తవిదిభ్యశ్చ'అని (445) జుస్ ఆదేశము. 'జుసిచ' అను (611) గుణము (అర్) వచ్చి

అపిపరుః' అను రూప మగును. అపిపః, అపిపూర్తామ్, అపిపరుః; అపిపః, అపిపూర్తమ్, అపిపూర్త; అపిపరమ్, అపిపూర్వ, అపిపూర్మ.

విధిలిఙ్నందలి 'యాసుట్' ఙిత్తు గాన గుణము రాదు. 'ఉర్' ఆగమ దీర్ఘములచే "పిపూర్యాత్, పిపూర్యాతామ్, పిపూర్యుః: పిపూర్యాః, పిపూర్యాతమ్, పిపూర్యాత; పిపూర్యామ్, పిపూర్యావ, పిపూర్యామ" అను రూపము లగును.

అశీర్లిఙ్:- పూర్యాత్, పూర్యాస్తామ్, పూర్యాసుః: పూర్యాః, పూర్యాస్తమ్, పూర్యాస్త; పూర్యాసమ్, పూర్యాస్వ, పూర్యాస్మ.

లుఙ్నందు వృద్ధి (సూ-486) వచ్చును. అపారీత్, అపారిష్టామ్, అపారిషుః; అపారీః, అపారిష్టమ్, అపారిష్ట; అపారిషమ్, అపారిష్వ, అపారిష్మ".

'అపారిష్టామ్' ఇత్యాదులందు 'వౄతోవా' అను సూత్రముచే (618) ఇట్కు వికల్పముగ దీర్ఘము రావలసి యుండగా:-

619. సిచి చ పరస్మైపదేషు 7.2.40

అత్ర ఇటో న దీర్ఘః. అపారిష్టామ్, అపరీష్యత్ - అపరిష్యత్. ఓహాక్ త్యాగే. 5. జహాతి.

'వలిజి'నుండి 'న'అనువర్తించును. పరస్మైపదపరక మగు సిచ్ పర మగునపుడు ఇట్కు 'వౄతో వా' అను సూత్రముచే విహిత మగు దీర్ఘమురాదు.

ఈ సూత్రముచే దీర్ఘము నిషిద్ధము గాన 'అపారిష్టామ్' ఇత్యాదిదీర్ఘ రహితరూపములు మాత్రమే యుండును. లృఙ్నందు దీర్ఘవికల్పముచే 'అపరీష్యత్' 'అపరిష్యత్' ఇత్యాదిరూపము లగును.

5. 'ఓహాక్'ధాతువునకు విడచుట అని యర్థము. ఓకారకకారములు ఇత్సంజ్ఞకములు. ఇది అనిట్ ధాతువు. ప్రథమపురుషైకవచనమున ద్విత్వ, అభ్యాసహ్రస్వ, చుత్వ, జశ్త్వములచే 'జహాతి' అను రూపము సిద్ధించును.

620. జహాతేశ్చ 6.4.116

ఇద్ వా స్యాత్ హలాదౌ క్ఙితి సార్వధాతుకే. జహితః,

'ఇద్దరిద్రస్య', 'భియోఽన్యతరస్యామ్' "గమహనజనఖనఘసాంలోపః క్ఙిత్యనఙి", "అతఉత్సార్వధాతుకే", "ఈహల్యఘోః" అను సూత్రములనుండి

'ఇత్' 'అన్యతరస్యామ్' 'క్ఙితి' 'సార్వధాతుకే' 'హలి' అనువర్తించును. హలాదియు, కిత్తు గాని ఙిత్తు గాని అయిన సార్వధాతుకము పర మగునపుడు హిధాతువునకు హ్రస్వఇకారము వికల్పముగ వచ్చును.

'తస్'మొదలగు ఙిత్తులైన హలాదిప్రత్యయములు పర మగునపుడు ఈ సూత్రముచే (అలోన్త్యపరిభాషచే) 'హా' యందలి ఆకారమునకు వికల్పముగ ఇకారము వచ్చి 'జహితః' ఇత్యాదిరూపము లగును.

621. ఈ హల్యఘోః 6 4.113

**శ్నాభ్యస్తయోరాత ఈత్స్యాత్ సార్వధాతుకే క్ఙితి హలి,న తు ఘోః. జహీతః.**

'శ్నాభ్యస్తయోరాతః' అనువర్తించును. 'క్ఙితి' 'సార్వధాతుకే' అను పదముల అనువృత్తి పై సూత్రమునందు వలె గ్రహింపవలెను. హలాదికము, కిత్తు గాని ఙిత్తు గాని యైన సార్వధాతుకము పర మగునపుడు శ్నా ప్రత్యయముయొక్కయు, అభ్యస్తముయొక్కయు ఆకారమునకు ఈకారము వచ్చును, ఘుసంజ్ఞక మగుదాని ఆకారమునకు మాత్రము రాదు.

'తస్'మొదలగు హలాదిఙిత్ప్రత్యయములు పర మగునపుడు "జహాతేశ్చ"అను సూత్రముచే (620) ఇకారము రాని పక్షమున ఈ సూత్రముచే ఆకారమునకు ఈకారము వచ్చి జహీతః, ఇత్యాదిరూపము లగును.

622 శ్నాభ్యస్తయోరాతః 6.4.112

**అనయోరాతో లోపః క్ఙితి సార్వధాతుకే. జహతి, జహౌ, హాతా హాస్యతి, జహాతు-జహితాత్-జహీతాత్.**

'గమహన' ఇత్యాది సూత్రము నుండి (చూ. సూ. 620) లోపః, 'క్ఙితి' అనుపదములను 'అత ఉత్సార్వధాతుకే' నుండి 'సార్వధాతుకే' అనువర్తించును. కిత్ గాని ఙిత్ గాని యైన సార్వధాతుకము పర మగునపుడు శ్నాప్రత్యయముయొక్కయు, అభ్యస్తముయొక్కయు ఆకారమునకు లోపము వచ్చును.

హలాదిప్రత్యయములు పర మగునపుడు 'ఈ హల్యఘోః' అని (621) ఈకారము విధింపబడినది గాన ఈ సూత్రము అజాదిఙిత్సార్వధాతుకములందు మాత్రమే ప్రవర్తించును.

ప్రథమపురుష బహువచనమున 'అదభ్యస్తాత్' అనుసూత్రముచే (609) ఝకారమునకు అదాదేశము చేసిన పిమ్మట, అభ్యస్తసంజ్ఞక మగు 'జహా' అను

దాని ఆకారమునకు ఈ సూత్రముచే లోపము-'జహతి' అను రూపము సిద్ధించి నది. లట్-జహాతి, జహితః-జహీతః, జహతి; జహాసి, జహిథః-జహీథః, జహిథ-జహీథ; జహామి, జహివః-జహీవః, జహిమః-జహీమః.

ఇది ఆకారంతధాతువు గాన లిట్టునందు పాధాతువునకు వలె ప్రక్రియ యుండును. జహౌ, జహతుః, జహుః; జహిథ_జహాథ, జహథుః, జహ; జహౌ, జహివ, జహిమ. లుట్, లృట్టులందు విశేషకార్య మేది యును లేదు. 'హాతా' 'హాస్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్టునందు 'తాతఙ్' మొదలగు హలాది జిత్ప్రత్యయములు పర మగు నపుడు ఆకారమునకు ఇకార ఈకారములు వచ్చి రెండేసి రూపము లగును.

మధ్యమపురుషైకవచనమున 'జహాహి'అని యుండగా:-

623 ఆ చ హౌ 6.4.117

జహాతేర్హౌ పరే ఆ స్యాత్; చాత్ ఇత్ ఈతౌ. జహాహి-జహిహి, జహీహి అజహాత్, అజహుః.

'జహాతేశ్చ' నుండి 'జహాతేః' అనువర్తించును. హాధాతువునకు 'హి' పర మగునపుడు ఆకారము కూడ వచ్చును. 'ఆకారముకూడ' అనుటచే ఇకార ఈకారములు కూడ వచ్చు నని యర్థము.

ఈ సూత్రముచే ఆకారమునకు ఆకారమే విధింపబడినది గాన 'జహాహి' అనురూపము, వికల్పముగ ఇకారము వచ్చుటచే 'జహిహి' అను రూపము, అది రాని పక్షమున ఈకారము వచ్చి 'జహీహి' అను రూపమును, ఈ విధ ముగ రూపత్రయము సిద్ధించును. లోట్:_ జహాతు, జహితాత్_జహీతాత్, జహితామ్-జహీతామ్, జహతు; జహాహి-జహిహి-జహీహి, జహితమ్-జహీతమ్, జహిత-జహీత; జహాని, జహావ, జహామ. లఙ్:_ అజహాత్, అజహితామ్ అజహీతామ్, అజహుః; అజహాః, అజహితమ్, అజహీతమ్, అజహిత. హీత; అజహామ్, అజహివ_అజహీవ, అజహిమ_అజహీమ.

'అజహుః' అనునపుడు 'ఝికి' 'జుస్' చేసినపిమ్మట "శ్నాభ్యస్తయో రాతః" అను సూత్రముచే (622) ఆకారలోపము వచ్చినది.

624 లోపో యి 6.4.118

జహాతేరాలోపో యాదౌ సార్వధాతుకే. జహ్యాత్, ఏర్లిజి—హేయాత్, అహాసీత్, అహాస్యత్.

'జహాతేశ్చ', 'అతఉత్సార్వధాతుకే', 'శ్నాభ్య స్తయోరాతః' అను సూత్రములనుండి 'జహాతేః' 'సార్వధాతుకే' 'ఆతః' అనువర్తించును. యకారాది యగు సార్వధాతుకము పర మగునపుడు హాధాతువు ఆకారమునకు లోపము వచ్చును.

విధిలిఙ్‌నందు 'యాసుట్' చేర్చిన పిమ్మట యకారాద్యార్ధధాతుకము పర ముగ నుండును గాన ఈ సూత్రముచే ఆకారము లోపించి 'జహ్యాత్, జహ్యాతామ్, జహ్యుః' ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిఙ్గునందు 'ఏర్లిజి'అను సూత్రముచే (493) ఆకారమునకు ఏకారాదేశము చేయగా--"హేయాత్, హేయాస్తామ్, హేయాసుః" ఇత్యాది రూపము లగును.

ఇది ఆకారాంతధాతువు గాన లుఙ్గునందు "యమరమనమాతాం సక్చ" అను సూత్రముచే (498) 'సక్'ఇడాగమములు చేయగా 'గ్లై' ధాతువునందు వలె "అహాసీత్, అహాసిష్టామ్, అహాసిషుః" ఇత్యాదిరూపము లగును. లృఙ్‌నందు విశేషకార్య మేదియును లేదు 'అహాస్యత్' ఇత్యాది రూపములగును.

మాఙ్ మానే శబ్దే చ. 6.

625. భృఞామిత్ 7.4.76

భృఞ్, మాఙ్, ఓహాఙ్-ఏషాం త్రయాణాం అభ్యాసస్య ఇత్ స్యాత్ శ్లౌ, మిమీతే, మిమాతే, మిమతే, మమే, మాతా, మాస్యతే, మిమీతామ్, అమిమీత, మిమీత, మాసీష్ట, అమాస్త, అమాస్యత.

మాఙ్‌ధాతువునకు కొలచుట, శబ్దము చేయుట అని అర్థము. అనిట్, ఙిత్తు గాన ఆత్మనేపది.

'భృఞాం' అని బహువచనమును ప్రయోగించుటచే 'భృఞ్' మొదలగునవి అను నర్థము. 'అత్రలోపోఽభ్యాసస్య' "నిజాంత్రయాణాం గుణః శ్లౌ"అను సూత్రములనుంచి "అభ్యాసస్య" 'త్రయాణాం' 'శ్లౌ' అనువర్తించును. భృఞ్,

మాఙ్, ఓహాఙ్ అను మూడుధాతువుల అభ్యాసమునకు శ్లు విషయ మగునపుడు హ్రస్వఇకారము వచ్చును.

మాధాతుప్రథమపురుషైకవచనమున ద్విత్వాదులు చేసిన పిమ్మట 'మామాతే'అని యుండగా ఈ సూత్రముచే అభ్యాస ఆకారమునకు ఇకారము— మిమాతే. రెండవ ఆకారమునకు ఈకారము (సూ. 621) "మిమీతే" అను రూపము సిద్ధించినది.

మిమాతే:- 'ఆతామ్'పర మగునపుడు 'శ్నాభ్యస్తయోరాతః' అను సూత్రముచే (622) ఆకారమునకు లోపము. మిమతే:- ఝకారమునకు "అదభ్యస్తాత్"అను సూత్రముచే (609) అదాదేశము చేసిన పిమ్మట అకారలోపము. ఈ విధముగ హలాదిప్రత్యయములు పర మగునపుడు అభ్యస్త ఆకారమునకు ఈకారము వచ్చును. అజాది ప్రత్యయములు పర మగునపుడు ఆకారలోపము వచ్చును. మిమీతే, మిమాతే, మిమతే; మిమీషే, మిమాథే, మిమీధ్వే; మిమే, మిమీవహే, మిమీమహే.

లిట్టునందు అజాదిప్రత్యయములు పర మగునపుడు "ఆతో లోప ఇటిచ' అను సూత్రముచే (49?) ఆకారలోపము వచ్చును. మమే, మమాతే, మమిరే, మమిషే, మమాథే, మమిధ్వే; మమే, మమివహే, మమిమహే. లుట్, లృట్టులందు 'మాతా' 'మాస్యతే' ఇత్యాదిరూపము లగును. లోట్:- మిమీతామ్, మిమాతామ్, మిమతామ్; మిమీష్వ, మిమాథామ్, మిమీధ్వమ్; మిమై, మిమావహై, మిమామహై. లఙ్:- అమిమీత, అమిమాతామ్, అమిమత; అమిమీథాః, అమిమాథామ్, అమిమీధ్వమ్; అమిమే, అమిమీవహి, అమిమీమహి. విధిలిఙ్:- మిమీత, మిమీయాతామ్, మిమీరన్; మిమీథాః, మిమీయాథామ్, మిమీధ్వమ్; మిమీయ, మిమీవహి, మిమీమహి. ఆశీర్లిఙ్ నందు సీయుట్ సుడాగమములచే-మాసీష్ట, మాసీయాస్తామ్, మాసీరన్; మాసీష్ఠాః; మాసీయాస్థామ్, మాసీధ్వమ్; మాసీయ, మాసీవహి-మాసీమహి.

లుఙ్:- అమాస్త, అమాసాతామ్, అమాసత; అమాస్థాః, అమాసాథామ్, అమాధ్వమ్; అమాసి, అమాస్వహి, అమాస్మహి. లృఙ్ఙనందు 'అమాస్యత ఇత్యాది రూపకములగును.

ఓహాఙ్ గతౌ. 7. జిహీతే. జిహాతే, జిహతే. జిహే. హాతా. హాస్యతే. జిహీతామ్. అజిహీత. జిహీత హాసీష్ట. అహాస్త అహాస్యత,

7. ఓహాఙ్ ధాతువునకు వెళ్ళుట అని యర్థము. ఓకారఙకారములు ఇత్సంజ్ఞకములు. ఙిత్తుగాన ఆత్మనేపదము. అనిట్కము. దాని రూపములు మాధాతువునందు వలె నుండును.

డు భృఞ్ ధారణపోషణయోః. 8. బిభర్తి, బిభృతః, బిభ్రతి; బిభృతే. బిభ్రాతే, బిభ్రతే, బభ్రే. బిభరాఞ్చకార. బభార; బభర్థ, బభృవ. బిభరాఞ్చక్రే. భర్తా. భరిష్యతి-భరిష్యతే. బిభర్తు; బిభరాణి. బిభృతామ్. అబిభః; అబిభృతామ్. అబిభరుః. అబిభృత. బిభృయాత్. బిభ్రీత. భ్రియాత్, భృషీష్ట. అభార్షీత్ అభృత. అభరిష్యత్, అభరిష్యత,

డు భృఞ్ ధాతువునకు ధరించుట పోషించుట అని అర్థములు. ఞిత్తుగాన ఉభయపది. అనిట్కము.

బిభర్తి:- ప్రథమపురుషైకవచనమున శప్‌కు శ్లు, ద్విత్వము, మొదటి ఋకారమునకు 'ఉరత్' అను సూత్రముచే (475) అకారము- 'భర్ భృతి' అని యుండగా 'హలాదిశ్శేషః'- (398) 'భభృతి', 'భృఞామిత్' అను సూత్రముచే (625) అభ్యాసఅకారమునకు ఇకారము; తిప్ పిత్‌గాన ఋకారమునకు గుణము- "బిభర్తి" అను రూపము సిద్ధించినది.

అపిత్‌లగు హలాదిప్రత్యయములు పర మగునపుడు ఙిద్వద్భావ ముండును గాన గుణము రాదు. అపిత్‌లగు అజాదిప్రత్యయములు పర మగునపుడు యణాదేశముచే ఋకారమునకు రేఫ వచ్చును. బిభర్తి, బిభృతః, బిభ్రతి; బిభర్షి, బిభృథః, బిభృథ; బిభర్మి, బిభృవః, బిభృమః.

ఆత్మనేపదమున అన్ని ప్రత్యయములును ఙిత్తులే గాన గుణ మెచ్చటను రాదు. అజాదిప్రత్యయములు పర మగునపుడు యణాదేశము వచ్చును. బిభృతే, బిభ్రాతే, బిభ్రతే; బిభృషే, బిభ్రాథే, బిభృధ్వే; బిభ్రే, బిభృవహే, బిభృమహే.

లిట్టునందు 'భీహ్రీభృహువాం శ్లువచ్చ' అను (610) సూత్రముచే వికల్పముగ ఆమ్ శ్లువద్భావములు వచ్చుటచే బిభరాఞ్చకార-బిభరాఞ్చక్రే-బిభరామ్బభూవ-బిభరామాస ఇత్యాదిరూపములును. ఆమాదికము రాని పక్షమున 'బభార' ఇత్యాదిరూపములు పరస్మైపదమునందును, 'బభ్రే' ఇత్యాదిరూపములు ఆత్మనేపదమునందును ఉండును. థల్, వ, మ, అను పరస్మైపదప్రత్యయ

ములు పర మగునపుడును సే, ధ్వే, వహి, మహి, అను ఆత్మనేపద ప్రత్యయములు పర మగునపుడును "కృసృభృవృస్తుద్రుస్రుశ్రువో౽లిటి" అను సూత్రముచే (481) ఇట్ నిషేధింపబడినది గాన ఇడాగమము రాదు. 'బభర్థ, బభృవ, బభృషే' ఇత్యాదిరూపము లగును

లుట్‌నందు 'భర్తా,' 'భర్తారౌ' ఇత్యాదిరూపము లగును. అనిట్ ధాతువు గాన ఇడాగమము రాదు.

లృట్ లృఙ్‌లందు 'ఋద్ధనోః స్యే' అను సూత్రముచే (500) ఇడాగమము వచ్చుటచే 'భరిష్యతి' 'భరిష్యతే' ఇత్యాదిరూపములును 'అభరిష్యత్' 'అభరిష్యత' ఇత్యాదిరూపములును అగును.

లోట్:- (ప) బిభర్తు-బిభృతాత్, బిభృతామ్, బిభ్రతు; బిభృహి-బిభృతాత్, బిభృతమ్, బిభృత; బిభరాణి, బిభరావ, బిభరామ. (ఆత్మ):- బిభృతామ్, బిభ్రాతామ్, బిభ్రతామ్; బిభృష్వ, బిభ్రాథామ్, బిభృధ్వమ్; బిభరై, బిభరావహై, బిభరామహై.

లఙ్ పరస్మైపదమున ప్రథమమధ్యమపురుషైకవచనములందు 'అబిభర్త్' 'అబిభర్స్' అని యుండగా అపృక్తహల్లు లగు తకారసకారములకు హల్ఙ్యాది సూత్రముచే (179) లోపము; రేఫకు విసర్గము వచ్చి 'అబిభః' అను రూప మగును. అబిభః, అబిభృతామ్, అబిభరుః: అబిభః, అబిభృతమ్, అబిభృత; అబిభరమ్, అబిభృవ, అబిభృమ. ఆత్మనేపదమున:- అబిభృత, అబిభ్రాతామ్, అబిభ్రత, అబిభృథాః, అబిభ్రాథామ్, అబిభృధ్వమ్; అబిభ్రి, అబిభృవహి, అబిభృమహి.

విధిలిఙ్ పరస్మైపదమున:- "బిభృయాత్, బిభృయాతామ్, బిభృయుః" ఇత్యాదిరూపములును, ఆత్మనేపదమున:- "బిభ్రీత, బిభ్రీయాతామ్, బిభ్రీరన్" ఇత్యాదిరూపములును అగును.

ఆశీర్లిఙ్ పరస్మైపదమున, ఆర్ధధాతుక మగుటచే "రిఙ్ శయగ్లిఙ్క్షు" అను సూత్రముచే (516) రిఙాదేశము వచ్చి 'భ్రియాత్, భ్రియాస్తామ్, భ్రియాసుః' ఇత్యాదిరూపము లగును. ఆత్మనేపదమున:- 'భృషీష్ట, భృషీయాస్తామ్, భృషీరన్' ఇత్యాదిరూపము లగును, 'ఉశ్చ' అను సూత్రముచే (547) 'సీయుట్' కిత్ గాన గుణము రాలేదు.

లుఙ్ పరస్మైపదమున 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రముచే (486) వృద్ధి (ఆర్) వచ్చి "అభార్షీత్, అభార్ష్టామ్, అభార్షుః; అభార్షీః, అభార్ష్టమ్ అభార్ష్ట; అభార్షమ్, అభార్ష్వ. అభార్ష్మ" అను రూపము లగును. అనిడ్ధాతువు గాన సిచ్‌కు ఇడాగమము రాలేదు.

ఆత్మనేపదమున ఝలాదు లగు త, థాస్, ధ్వమ్ ప్రత్యయములు పర మగునపుడు 'హ్రస్వాదఙ్గాత్' అను సూత్రముచే (548) సిచ్‌కు లోపము వచ్చును. అభృత, అభృషాతామ్, అభృషత; అభృథాః, అభృషాథామ్, అభృ ధ్వమ్; అభృషి, అభృష్వహి, అభృష్మహి.

డుదాఞ్ దానే. 9. దదాతి, దత్తః, దదతి. దత్తే. దదాతే, దదతే. దదౌ; దదే, దాతాసి, దాతాసే. దాస్యతి. దాస్యతే. దదాతు.

దా ధాతువునకు ఇచ్చుట అని యర్థము. ఞిత్తు గాన ఉభయపది. అనిట్.

దదాతి:- లట్ (పర) ప్రథమపురుషైకవచనమున శ్లు. ద్విత్వ, అభ్యాసహ్రస్వములు చేయగా 'దదాతి' అను రూపము సిద్ధించినది.

దత్తః:- 'తస్'కు ఙిద్వద్భావమున్నది గాన 'దదాతస్' అని యుండగా 'శ్నాభ్యస్తయోరాతః' అను సూత్రముచే (622) ఆకారలోపము. 'దద్‌తస్'అని యుండగా రెండవ దకారమునకు చర్త్వముచే తకారము- 'దత్తః'

దదతి:- ఝకారమునకు అదాదేశము (సూ-609); ఆకారమునకు లోపము. 'దదతి' అను రూపము సిద్ధించినది. ఇట్లే "దదాసి, దత్థః, దత్థ; దదామి, దద్వః దద్మః" అను రూపములు సిద్ధించును.

ఆత్మనేపదమున అన్ని ప్రత్యయములును ఙిత్తులే గాన ఆకారలోపము అన్నిటియందును వచ్చును. దత్తే, దదాతే, దదతే, దత్సే, దదాథే, దద్ధ్వే, దదే, దద్వహే, దద్మహే.

ఇది ఆకారాంతధాతువు గాన లిట్టు పరస్మైపదరూపములు 'పా'ధాతురూపముల వలె నుండును. థల్‌నందు భారద్వాజనియమముచే ఇడ్వికల్పము. వ, మ, లు పర మగునపుడు 'సే'మొదలగు ఆత్మనేపదప్రత్యయములు పరమగునపుడును క్రాదినియమముచే ఇడాగమము వచ్చును. ఆత్మనేపదరూపములు:- దదే, దదాతే, దదిరే; దదిషే, దదాథే, దదిధ్వే; దదే, దదివహే, దదిమహే. లుట్

లృట్టులందు 'దాతా; దాస్యతి-దాస్యతే' ఇత్యాదిరూపము లగును. లోట్టు ప్రథమ పురుషమునందు 'దదాతు-దత్తాత్, దత్తామ్, దదతు' అను రూపము లగును.

626. దాధా ఘ్వదాప్ 1.1.20

దారూపా ధారూపాశ్చ ధాతవో ఘుసంజ్ఞాః స్యుః, దాప్దైపౌ వినా. 'ఘ్వసోః' ఇత్యేత్వమ్- దేహి. దత్తమ్. అదదాత్; అదత్త. దద్యాత్, దదీత. దేయాత్, దాసీష్ట. అదాత్, అదాతామ్, అదుః.

దాధా, ఘు, అదాప్. డాప్, దైప్ ధాతువులు తక్క 'దా' రూపము లగు ధాతువులును, ధారూపధాతువులును ఘుసంజ్ఞకము లగును. డుదాఞ్ దానే (జుహోత్యాదిగణము), దాణ్ దానే (భ్వాది): దో అవఖణ్డనే (దివాది), దేఙ్ రక్షణే (భ్వాది); ఈధాతువులు దారూప ధాతువులు. వీటిలో మొదటి రెండును స్వభావతః దారూపము లైనవి; చివరి రెండును లాక్షణికములు —అనగా వాటికి శాస్త్రముచే అత్వము వచ్చును. డుధాఞ్ ధారణపోషణయోః (జుహోత్యాదిగణము) 'ధేట్' పానే (భ్వాదిగణము); ఇవి ధారూపధాతువులు. మొదటిది స్వాభావికము, రెండవది లాక్షణికము.

(1) "ఘుమాస్థా గా పాజహాతిసాం హలి" అను సూత్రముచే (591) ధాత్వవయవ మగు ఆకారమునకు ఈకారము వచ్చుట (2) లోట్ మధ్యమపురుషైక వచనమునందు 'హి' పరమగునపుడు "ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ" అను సూత్రముచే (580) ధాత్వవయవ మగు ఆకారమునకు ఏకారాదేశము, అభ్యాసలోపము వచ్చుట (3) ఆశీర్లిఙ్గునందు "ఏర్లిఙి" అను సూత్రముచే (493) ఆకారమునకు ఏకారాదేశము వచ్చుట (4) పరస్మైపద లుఙ్గునందు "గాతిస్థాఘుపా భూభ్యః సిచః పరస్మైపదేషు" అను సూత్రముచే (441) సిచ్కు లోపము వచ్చుట. ఈ నాల్గు కార్యములును ఘుసంజ్ఞా ప్రధాన ప్రయోజనములు.

ప్రకృతమున దాధాతువు ఘుసంజ్ఞకము గాన లోట్ మధ్యమపురుషైక వచనమున 'దదాహి' అనియుండగా ఆకారమునకు ఏత్వము, అభ్యాసలోపము వ 'దేహి' అను రూపము సిద్ధించును. దేహి-దత్తాత్, దత్తమ్, దత్త; దః దదావ, దదామ. ఆత్మనేపదమున ప్రత్యయములకిన్నిటికిని జిద్వద్భావ ముండుటచే "శ్నాభ్యస్తయోరాతః" అను సూత్రముచే (622) ఆకారము వచ్చును.

దత్తామ్, దదాతామ్, దదతామ్, దత్స్వ, దదాథామ్, దద్ధ్వమ్; దదై, దదావహై, దదామహై.

లఙ్లనందు (ప) తిప్, సిప్ భిన్నము లగు ప్రత్యయములు ఙిత్తులు గాన ఆకారలోపము వచ్చును. 'సిజభ్య స్త విదిభ్యశ్చ' అను సూత్రముచే (449) 'ఝి'కి 'జుస్' ఆదేశము వచ్చును. అదదాత్, అదదాతామ్, అదదుః, అదదాః, అదత్తమ్, అదత్త; అదదమ్, అదద్వ, అదద్మ.

ఆత్మనేపదమున అంతటను ఆకారలోపము వచ్చును. అదత్త, అదదాతామ్, అదదత; అదత్థాః, అదదాథామ్, అదద్ధ్వమ్, అదది, అదద్వహి, అదద్మహి.

విధిలిఙ్ (పరస్మైపదము) :— 'దద్యాత్, దద్యాతామ్, దద్యుః' ఇత్యాది రూపము లగును. ఇచట 'యాసుట్' ఙిత్తు గాన ఆకారలోపము వచ్చినది. ఆత్మనేపదము :- దదీత, దదీయాతామ్, దదీరన్, దదీథాః, దదీయాథామ్, దదీధ్వమ్, దదీయ, దదీవహి, దదీమహి.

ఆశీర్లిఙ్ పరస్మైపదమున 'ఏర్లిఙి' అను సూత్రముచే (493) ఆకారమునకు ఏత్వము. 'దేయాత్ దేయాస్తామ్, దేయాసుః' ఇత్యాది రూపము లగును. ఆత్మనేపదము :- 'దాసీష్ట, దాసీయాస్తామ్, దాసీరన్' ఇత్యాది రూపములు.

లుఙ్ పరస్మైపదమున "గాతిస్థాఘు పాభూభ్యః పరస్మైపదేషు" అను సూత్రముచే (441) సిచ్‌కు లోపము వచ్చి "అదాత్, అదాతామ్, అదుః; అదాః, అదాతమ్, అదాత; అదామ్, అదావ, అదామ" అను రూపము లగును. 'అదుః'- అనునపుడు సిజ్లోపము, ఝికి జుస్ ఆదేశము చేసిన పిమ్మట 'అదాఉస్' అని యుండగా 'ఉస్యపదాన్తాత్' అను సూత్రముచే (49౨) ఆకారమునకు పరరూపము వచ్చినది.

627. స్థాఘ్వోరిచ్చ 1.2.17

అనయోః ఇత్ అన్తాదేశః, సిచ్చ కిత్ స్యాత్ ఆత్మనేపదే. అదిత. అదాస్యత్, అదాస్యత.

'అసంయోగాల్లిట్ కిత్' 'హన స్సిచ్' అను సూత్రములనుండి 'కిత్' 'సిచ్' అనువర్తించును. పరస్మైపదమున 'గాతిస్థా-' అను సూత్రముచే

(441) సిచ్ లోపించును గాన ఈ సూత్రము ఆత్మనేపదప్రత్యయములు పర మగునపుడు మాత్రమే ప్రవర్తించును.

ఆత్మనేపద ప్రత్యయములు పర మగునపుడు స్థాధాతు, ఘుసంజ్ఞక ధాతువులకు హ్రస్వఇకారము అంతాదేశ మగును; సిచ్ కిత్ అగును.

అదిత :- ప్రథమపురుషైక వచనమున 'అదాస్ త' అని యుండగా ఈ సూత్రముచే అకారమునకు ఇకారము- 'అదిస్త'. తకారరూప మగు ఝల్ పరముగ నున్నది గాన "హ్రస్వాదఙ్గాత్" అను సూత్రముచే (502) సకార లోపము- 'అదిత' అను రూపము సిద్ధించును. 'త' ప్రత్యయము అపిత్సార్వ ధాతుకము గాన జిద్వద్భావముచే గుణము రాలేదు.

'సిచ్'కు కిత్త్వము విధించుటకు ప్రయోజనము 'ఆతామ్' మొదలగు ప్రత్యయములు పర మగునపుడు ఉండును. అచట 'సిచ్' లోపించదు గాన దానికి కిత్త్వ ముండుటచే ఇకారమునకు గుణము రాకుండుటయే కిత్త్వ ప్రయోజనము. అదిత, అదిషాతామ్, అదిషత; అధిథాః, అదిషాథామ్, అదిధ్వమ్. అదిషి, అదిష్వహి, అదిష్మహి.

ల్ఋఙ్నందు 'అదాస్యత్, అదాస్యత' ఇత్యాది రూపము లగును.

డుధాఞ్ ధారణపోషణయోః 10. దధాతి

ధాఞ్ ధాతువునకు ధరించుట పోషించుట అని అర్థము, ఉభయపది. అనిట్, ప్రథమపురుషైక వచనమున ద్విత్వాదులు చేసిన పిమ్మట 'ధధాతి' అని యుండగా 'అభ్యాసేచర్చ' అను సూత్రముచే (401) మొదటి ధకారమునకు జశ్త్వము (దకారము)- 'దధాతి' అను రూపము సిద్ధించినది.

ద్వివచనమున ద్విత్వజశ్త్వాకార లోపాదులు (సూ. 622) చేసిన పిమ్మట 'దధ్ తస్' అని యుండగా—

628. దధస్తథోశ్చ 8.2.38

ద్విరుక్తస్య ఝషన్తస్య ధాఞో బశో భష్ స్యాత్, తథోః పరయోః, స్ధ్వోశ్చ పరతః.

"ఏకాచో బశో భష్ ఝషన్తస్య స్ధ్వోః" నుండి 'బశః', 'భష్' 'ఝషన్తస్య' అను పదములు అనువర్తించును. 'చ' అనుటచే 'స్ధ్వోః' అనది కూడ గ్రహింపబడును. ద్విరుక్తమును ఝషంతమును అగు ధాధాతువున

సంబంధించిన బశ్‌కు తకారథకారములును, సకారము; 'ధ్వ' అనునదియు పర మగునపుడు 'భష్' వచ్చును.

ఇచట 'దధ్' అనునది కృతద్విత్వమును, ఝషంతమును అగు ధాతు రూపము. దానికి తకారము పరముగా నున్నది. కాన దీని బశ్‌కు - మొదటి దకారమునకు - ధకారము వచ్చును. 'ధధ్ తస్' అని యుండగా రెండవ ధకారమునకు చర్త్వముచే తకారము. 'ధత్తః' అను రూపము సిద్ధించును.

'కృతద్విత్వ మగు ధాతువు' అని చెప్పుటచే ఈ సూత్రము ద్విత్వము వచ్చుటకు అవకాశము గల సార్వధాతుక లకారములందు (లట్, లోట్, లఙ్, విధిలిఙ్) లందు మాత్రమే ప్రవర్తించును. తకార, థకార, సకార, ధ్వమ్‌లు ఆదియందు గల ప్రత్యయములు పర మగునడుపు కూడ "శ్నాభ్యస్తయోరాతః" అను సూత్రముచే (622) ఆకారలోపము ఎచ్చట వచ్చునో అచట మాత్రమే ఝషంత మగును గాన ఈ సూత్రము ప్రవర్తించును. విధిలిఙ్‌నందు ఆకార లోపము వచ్చినను ప్రత్యయమునకు ధాతువునకును మధ్య 'యాసుట్' ఉండును గాన (తకారాదు లాదియందు గల ప్రత్యయములు లభింపవు గాన) ఈసూత్రము ప్రవర్తింపదు. ఈ విధముగ జిత్తు లగు తకార థకార సకారాది ప్రత్యయము లును, 'ధ్వ' అనునదియు పరముగ నున్నపుడు భష్‌భావము వచ్చుట ఒక్క టియే ఈ ధాతువునందు విశేషకార్యము. ఇతర ప్రక్రియ యంతయు దా ధాతువు నందు వలె నుండును.

ణిజిర్ శౌచపోషణయోః 11.

ఇర ఇత్సంజ్ఞా వాచ్యాః.

ణిజిర్ ధాతువునకు పరిశుద్ధము చేయుట, పోషించుట అని అర్థములు. 'ఇర్' ఇత్సంజ్ఞకము. 'ణిజ్' లోని ణకారమునకు 'ణోనః' అను సూత్రముచే (460) నకారము. ఇది స్వరితేత్ అందుచే ఉభయపది.

ప్రథమపురుషైక వచనమున శప్‌కు శ్లు, ద్విత్వము, రెండవ ఇకారము నకు లఘూపధ గుణము చేసిన పిమ్మట 'నినేజ్ తి' అని యుండగా :-

629. ణిజాం త్రయాణాం గుణః శ్లౌ 7.4.75

ణిజ్, విజ్, విషామభ్యాసస్య గుణః స్యాత్ శ్లౌ. నేనేక్తి, నేనిక్తః, నేనిజతి. నినేజ, నినిజే. నేక్తా. నేక్ష్యతి - నేక్ష్యతే. నేనేక్తు. నేనిగ్ధి.

'అత్రలోపోఽభ్యాసస్య'నుండి 'అభ్యాసస్య' అనువర్తించును. ణిజ్, విజ్, విష్, అను మూడు ధాతువుల అభ్యాసమునకు శ్లు విషయ మగునపుడు గుణము వచ్చును.

ఈ సూత్రముచే అభ్యాసఇకారమునకు గుణము చేసిన పిమ్మట 'నేనేజ్ తి' అని యుండగా 'చోః కుః' అను సూత్రముచే (307) జకారమునకు గకారము. దానికి చర్త్వముచే కకారము 'నేనేక్తి' అను రూపము సిద్ధించినది.

నేనిక్తః:- 'తస్' జిత్తు గాన గుణము రాలేదు. 'శ్లు'నిమిత్తక మగు అభ్యాసగుణమునకు 'క్ఙితి చ' అను (435) నిషేధము ప్రవర్తించదు.

నేనిజతి:- 'అదభ్యస్తాత్' అను సూత్రముచే (609) ఝకారమునకు అదాదేశము.

మధ్యమపురుషైకవచనమున 'నేనేజ్ సి' అని యుండగా జకారమునకు కుత్వముచే గకారము. దానికి చర్త్వముచే కకారము. సకారమునకు షత్వము. 'నేనేక్షి' అను రూపము సిద్ధించును. ఇతరరూపములు:- నేనిక్థః, నేనిక్థ; నేనేజ్మి, నేనిజ్వః, నేనిజ్మః. (ఆత్మ): నేనిక్తే, నేనిజాతే, నేనిజతే; నేనిక్షే, నేనిజాథే, నేనిగ్ధ్వే; నేనిజే, నేనిజ్వహే, నేనిజ్మహే. లిట్:— పరస్మైపది:— నినేజ, నినిజతుః, నినిజుః; నినేజిథ, నినిజథుః, నినిజ; నినేజ, నినిజివ, నినిజిమ. (ఆత్మ):- "నినిజే, నినిజాతే, నినిజిరే; నినిజిషే" ఇత్యాదిరూపములు. నిజ్ధాతువు అనిట్ గాన క్రాదినియమముచే లిట్‌నందు ఇడాగమము వచ్చినది.

లుట్, లృట్‌లందు 'నేక్తా' ఇత్యాదిరూపములును, 'నేక్ష్యతి' 'నేక్ష్యతే' ఇత్యాదిరూపములును అగును.

లోట్:- (పరస్మైపది):- నేనేక్తు-నేనిక్తాత్, నేనిక్తామ్, నేనిజతు, నేనిగ్ధి-నేనిక్తాత్, నేనిక్తమ్, నేనిక్త." నిజ్ధాతువు ఝలంతము గాన "హుఝల్భ్యో హేర్ధిః" అను సూత్రముచే (559) 'హి'కి 'ధి' ఆదేశము వచ్చినది.

ఉత్తమపురుషమున ఆడాగమము చేసిన పిమ్మట, అది పిత్ గాన ఙిద్భావము లేకుండుటచే రెండవ ఇకారమునకు గూడ లఘూపధ గుణము రావల యుండ:-

630. నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే 7.3.87

లఘూపధగుణో న స్యాత్. నేనిజాని. నేనిక్తామ్. అనేనేక్, అనేనిక్తామ్, అనేనిజుః; అనేనిజమ్. అనేనిక్త. నేనిజ్యాత్. నిజ్యాత్. నేనిజీత. నిక్షీష్ట.

'మిదేర్గుణః' 'పుగన్తలఘూపధస్య చ' అను సూత్రములనుండి 'గుణః' 'లఘూపధస్య' అనువర్తించును. అజాది యగు పిత్సార్వధాతుకము పర మగునపుడు అభ్యస్తమునకు లఘూపధగుణము రాదు.

'ఆని' ఇత్యాదులు అజాదిపిత్సార్వధాతుకములు గాన ఈ సూత్రముచే గుణము నిషేధింపబడుటచే "నేనిజాని, నేనిజావః, నేనిజామః" అను రూపము లగును.

ఆత్మనేపదమున:- నేనిక్తామ్, నేనిజాతామ్, నేనిజతామ్; నేనిక్ష్వ, నేనిజాథామ్, నేనిగ్ధ్వమ్. నేనిజై, నేనిజావహై, నేనిజామహై.

లఙ్ (పర):- అనేనేక్, అనేనిక్తామ్, అనేనిజుః; అనేనేక్, అనేనిక్తమ్, అనేనిక్త; అనేనిజమ్, అనేనిజ్వ, అనేనిజ్మ. 'అనేనిజమ్' అనునపుడు పై సూత్రముచే గుణము నిషేధింపబడినది.

ఆత్మనేపది:-అనేనిక్త, అనేనిజాతామ్, అనేనిజత; అనేనిక్థాః, అనేనిజాథామ్, అనేనిగ్ధ్వమ్; అనేనిజి, అనేనిజ్వహి, అనేనిజ్మహి.

విధిలిఙ్ పరస్మైపదమున:- 'నేనిజ్యాత్, నేనిజ్యాతామ్, నేనిజ్యుః' ఇత్యాదిరూపములును ఆత్మనేపదమున 'నేనిజీత' నేనిజీయాతామ్, నేనిజీరన్' ఇత్యాదిరూపములును అగును.

ఆశీర్లిఙ్ పరస్మైపదమున 'నిజ్యాత్, నిజ్యాస్తామ్, నిజ్యాసుః' ఇత్యాది రూపములును, ఆత్మనేపదమున "నిక్షీష్ట, నిక్షీయాస్తామ్, నిక్షీరన్" ఇత్యాది రూపములును అగును. ఆత్మనేపదమున "లిఙ్సిచావాత్మనేపదేషు" అను సూత్రముచే (592)ఝలాదిలిఙ్ కిత్తు గాన గుణము రాదు.

631. ఇరితో వా 3.1.57

ఇరితో ధాతోశ్చ్లేరఙ్ వా పరస్మైపదేషు. అనిజత్; అనైక్షీత్. అనిక్త. అనేక్ష్యత్. అనేక్ష్యత.

ఇతి జుహోత్యాదయః

'ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్', 'చ్లేః సిచ్' 'అస్యతి వక్తిఖ్యాతిభ్యోఽఙ్' 'పుషాదిద్యుతాద్యృదితః పరస్మైపదేషు'' అను సూత్రములనుండి 'ధాతోః' 'చ్లేః' 'అఙ్' ''పరస్మైపదేషు'' అనువర్తించును. పరస్మైపదప్రత్యయములు పర మగునపుడు 'ఇర్' ఇత్సంజ్ఞగా గల ధాతువునకంటె పరమైన చ్లికి అఙ్ ఆదేశము వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే లుఙ్ (పరస్మైపదమున) నందు చ్లికి వికల్పముగ అఙ్ ఆదేశము చేయుటచే ''అనిజత్, అనిజతామ్. అనిజన్'' ఇత్యాదిరూపము లగును. 'అఙ్' ఙిత్తు గాన గుణము గాని వృద్ధిగాని రాలేదు. 'అఙ్' రాని పక్షమున 'వదవ్రజహలన్తస్యాచః' అను సూత్రముచే (467) వృద్ధి చేయగా—
''అనైక్షీత్. అనైక్తామ్, అనైక్షుః; అనైక్షీః, అనైక్తమ్, అనైక్త; అనైక్షమ్, అనైక్ష్వ, అనైక్ష్మ'' అను రూపము లగును. ఇచట ఝలాది ప్రత్యయములు పర మగునపుడు 'ఝలో ఝలి' అను సూత్రముచే(480) 'సిచ్'కు లోపము వచ్చినది. ఆత్మనేపదమునందు గూడ ఇట్లే రూపము వచ్చును.

ఆత్మనేపదరూపములు:- అనిక్త, అనిక్షాతామ్, అనిక్షత; అనిక్థాః, అనిక్షాథామ్, అనిగ్ధ్వమ్; అనిక్షి. అనిక్ష్వహి, అనిక్ష్మహి.

ల్ఋఙ్‌నందు 'అనేక్ష్యత్, అనేక్ష్యత' ఇత్యాదిరూపము లగును.

జుహోత్యాదిగణము సమాప్తము.

# అథ దివాదిగణః

దివుక్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాన్తి, గతిషు. 1.

632. *దివాదిభ్యః శ్యన్* 3.1.69

శపోఽపవాదః. 'హలి చ' ఇతి దీర్ఘః- దీవ్యతి. దిదేవ. దేవితా. దేవిష్యతి. దీవ్యతు. అదీవ్యత్. దీవ్యేత్. దీవ్యాత్, అదేవీత్. అదేవిష్యత్. ఏవం షివు తన్తుసన్తానే. 2.

'దివు'ధాతువునకు క్రీడించుట, జయేచ్ఛ కలిగి యుండుట (జూదమాడుట) వ్యవహరించుట, ప్రకాశించుట, స్తుతించుట, సంతసించుట, మదించుట, నిద్రించుట, ఇచ్ఛయించుట, నడచుట అని అర్థములు. ఉకారము ఇత్సంజ్ఞకము. సేట్

దివాదులకంటె (కర్త్రర్థక సార్వధాతుకము పర మగునపుడు) 'శ్యన్' ప్రత్యయము వచ్చును. ఇది 'శప్'కు అపవాదము. ఇందలి శకారనకారములు ఇత్సంజ్ఞంకములు. శిత్తు గాన సార్వధాతుకము. కాని అపిత్సార్వధాతుకము గాన జిద్వద్భావ ముండుటచే ఇది పర మగునపుడు సార్వధాతుకత్వప్రయుక్త మగు గుణము రాదు.

ప్రథమపురుషైకవచనమున 'దివ్ యతి' అని యుండగా ఇది వకారాంతము గాన, ''హలిచ'' అను సూత్రముచే (616) ఉపధాభూత మగు ఇక్‌కు దీర్ఘము. 'దీవ్యతి' అను రూపము సిద్ధించును. 'దీవ్యతః, దీవ్యన్తి' ఇత్యాది రూపములు గూడ ఈ విధముగనే సిద్ధించును.

లిట్;- దిదేవ, దిదివతుః, దిదివుః; దిదేవిథ, దిదివథుః, దిదివ, దిదేవ, దిదివివ, దిదివిమ. ఇది సేట్‌ధాతువు గాన వలాద్యార్ధధాతుకముల కన్నిటికిని ఇడాగమము వచ్చినది. లుట్, ౡట్‌లందు 'దేవితా' 'దేవిష్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్, లఙ్, విధిలిఙ్లందు గూడ శ్యన్‌ప్రత్యయము చేసిన పిమ్మట ఇకారమునకు దీర్ఘము వచ్చును ఇతరప్రక్రియ యంతయు భూధాతువునందు వలె ఉండును. ''దీవ్యతు-దీవ్యతాత్' 'అదీవ్యత్' 'దీవ్యేత్' ఇత్యాది రూపము లగును.

ఆశీర్లిఙ్‌నందు 'హలి చ' అను సూత్రముచే( 616) దీర్ఘ ము వచ్చి ''దీవ్యాత్, దీవ్యాస్తామ్, దీవ్యాసుః'' ఇత్యాదిరూపము లగును.

లుఙ్‌నందు ''అదేవీత్, అదేవిష్టామ్, అదేవిషుః'' ఇత్యాదిరూపములును, ౡఙ్‌నందు 'అదేవిష్యత్' ఇత్యాదిరూపములును అగును.

(2) 'షివు'ధాతువునకు దారములను నేయుట అని అర్థము. బట్టలను కుట్టుట అనునర్థమున దీనికి ప్రయోగము కనబడుచున్నది. దీని రూపములు కూడ దివు ధాతురూపముల వలె నుండును. ''ధాత్వాదేః షః సః''అను సూత్రముచే (255) షకారమునకు సకారము వచ్చి 'సీవ్యతి' ఇత్యాదిరూపము లగును

నృతీ గాత్ర విక్షేపే 3. నృత్యతి. ననర్త. నర్తితా.

'నృత్' ధాతువునకు అవయవములను చలింపచేయుట అని అర్థము. నృత్యతి :- 'శ్యన్'కు ఙిద్వద్భావ మున్నది గాన గుణము రాలేదు. ఇట్లే నృత్యతః ఇత్యాది రూపము లగును. సార్వధాతుకము లన్నిటి యందును (లోట్, లఙ్, విధిలిఙ్ లందు) ఈవిధముగనే గుణము రాదు. ఇతర ప్రక్రియ భూధాతువునందు వలె నుండును.

లిట్టునందు తిప్, సిప్, మిప్ లందు కిత్త్వము లేదు గాన గుణమువచ్చును. ద్వివచనాదులందు 'అసంయోగాల్లిట్ కిత్' అను సూత్రముచే (454) కిత్త్వము వచ్చును గాన గుణము రాదు. "ననర్త, ననృతతుః, ననృతుః, ననర్తిథ" ఇత్యాది రూపము లగును. ఈ ధాతువు సేట్ గాన వలాద్యార్ధధాతుకములకు నిత్యముగ ఇడాగమము వచ్చును. లుట్ :- "నర్తితా, నర్తితారౌ, నర్తితారః" ఇత్యాది రూపములు.

63౩. సేసిచి కృత, చృత, ఛృత, తృద, నృతః 7.2.57

ఏభ్యః పరస్య సిజ్భిన్నస్య సాదేరార్ధధాతుకస్యేడ్వా. నర్తిష్యతి-నర్త్స్యతి, నృత్యతు, అనృత్యత్, నృత్యేత్-నృత్యాత్, అనర్తీత్. అనర్తిష్యత్-అనర్త్స్యత్.

'ఉదితో వా' 'ఆర్ధధాతుకస్యే డ్వలాదేః' అను సూత్రములనుండి 'వా' 'ఆర్ధధాతుకస్య' 'ఇట్' అనువర్తించును. కృత్, చృత్, ఛృత్, తృద్, నృత్ ధాతువులకంటె పర మైన 'సిజ్' భిన్న మైన సకారాది యగు ఆర్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగ వచ్చును.

లృట్ నందు 'స్య' చేర్చిన పిదప ఈ సూత్రముచే ఇడాగమము వైకల్పికము గాన ఇడాగమపక్షమున 'నర్తిష్యతి' ఇత్యాది రూపములును, తదభావ పక్షమున 'నర్త్స్యతి' ఇత్యాది రూపములును అగును.

ఆశీర్లిఙ్ :- "నృత్యాత్, నృత్యాస్తామ్, నృత్యాసుః" ఇత్యాది రూపములు.

లుఙ్ :- 'అనర్తీత్, అనర్తిష్టామ్, అనర్తిషుః' ఇత్యాదిరూపములు. లృఙ్నందు స్య వచ్చును గాన ఇడాగమవికల్పముచే 'అనర్తిష్యత్', 'అనర్త్స్యత్' ఇత్యాది ద్వివిధరూపము లుండును.

త్రసీ ఉద్వేగే. 4. "వాభ్రాశ" ఇతి శ్యన్ వా. త్రస్యతి-త్ర
తత్రాస. శో తనూకరణే. 5.

'త్రస్' ధాతువునకు భయపడుట అని అర్థము. సేట్ "వా భ్రాశ
భ్రము, క్రముక్లము త్రసిత్రుటి లషః" అను సూత్రముచే (488) '
ప్రత్యయము వికల్పముగ వచ్చును. 'శ్యన్' రాని పక్షమున శప్ వచ్చును
విధముగ లట్, లోట్, లఙ్, విధిలిఙ్ అందు "త్రస్యతి-త్రసతి" 'త్రస
త్రసతు' "అత్రస్యత్-అత్రసత్" "త్రస్యేత్-త్రసేత్" ఇత్యాది ది
రూపము లుండును. ప్రక్రియ భూధాతువునందు వలె ఉండును.

తత్రాస :- లిట్ ప్రథమపురుషైక వచనమున ద్విత్వ, అభ్యాస
వృద్ధ్యాదులచే ఈ రూపము సిద్ధించినది.

634. వా జౄ భ్రము త్రసామ్ 6.4.124

ఏషాం కితి లిటి సేటి థలి చ ఏత్వాభ్యాసలోపౌ వా. 'త్రేస
తత్రసతుః'; త్రేసిథ - తత్రసిథ, త్రసితా.

'అత ఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి' 'థ్వసో రేద్ధావభ్యాస లోః
"గమహన జన ఖన ఘసాం లోపః క్ఙిత్యనఙి" అను సూత్రములనుండి '
'ఏత్' "అభ్యాసలోపః" 'కితి' అను పదములు, 'థలి చ సేటి' అను స
మును అనువర్తించును. జౄ, భ్రమ్, త్రస్ ధాతువులకు కిత్ అగు లిట్, '
అగు థల్ ను పర మగునపుడు ఏత్వాభ్యాసలోపములు వికల్పముగ వచ్చును.
సూత్రముచే ఏత్వాభ్యాసలోపములు వచ్చు పక్షమున "త్రేసతుః" ఇ
రూపములును, రాని పక్షమున 'తత్రసథుః' ఇత్యాది రూపములును అగు
తత్రాస, త్రేసతుః-తత్రసతుః, త్రేసుః-తత్రసుః, త్రేసిథ-తత్రసి
త్రేసథుః,-తత్రసథుః, త్రేస - తత్రస; తత్రాస - తత్రస, త్రేసి
తత్రసివ, త్రేసిమ - తత్రసిమ. లుట్ - త్రసితా. లృట్ - త్రసిష్య
ఆశీర్లిఙ్- త్రస్యాత్, త్రస్యాస్తామ్, త్రస్యాసుః. లుఙ్:- 'అతో హ
దేర్లఘోః' అను సూత్రముచే (459) వృద్ధి వికల్పముచే 'అత్రాసీ
అత్రాసిష్టామ్, అత్రాసిషుః' "అత్రసీత్, అత్రసిష్టామ్, అత్రసిషు
ఇత్యాది ద్వివిధరూపము లగును. లృఙ్ :- అత్రసిష్యత్.

శో ధాతువునకు సూక్ష్మమగునట్లు చేయుట అని అర్థము. అనిట్.

### 635. ఓతః శ్యని 7.3.71

**లోపః స్యాత్ శ్యని. శ్యతి, శ్యతః, శ్యన్తి. శశౌ, శశతుః. శాతా. శాస్యతి.**

'ఘోర్లోపో లేటి వా' నుండి 'లోపః' అనువర్తించును. శ్యన్ పరమగు నపుడు ఓకారమునకు లోపము వచ్చును. శ్యతి :- 'శో యతి' అని యుండగా ఈ సూత్రముచే ఓకారమునకు లోపము. ఇట్లే 'శ్యతః. శ్యన్తి, శ్యసి, శ్యథః, శ్యథ, శ్యామి, శ్యావః. శ్యామః' అను రూపము లగును.

లోట్, లఙ్, విధిలిఙ్లందు గూడ ఈ విధముగనే ఓకారలోపము వచ్చుటచే "శ్యతు-శ్యతాత్, శ్యతామ్, శ్యన్తు" "అశ్యత్, అశ్యతామ్, అశ్యన్" "శ్యేత్. శ్యేతామ్, శ్యేయుః" ఇత్యాది రూపము లగును.

లిట్ మొదలగు ఆర్ధధాతుకములు పర మగునపుడు "ఆదేచ ఉపదేశేఽశితి" అను సూత్రముచే (496) ఓకారమునకు ఆకారాదేశ మగును. కావున వాటి రూపములు ఆకారాంతధాతురూపముల వలె నుండును. లిట్ :- శశౌ, శశతుః శశుః; శశిథ, శశాథ, శశథుః, శశ; శశౌ, శశివ, శశిమ. లుట్ :- 'శాతా' మొ. లృట్ :- 'శాస్యతి' మొ. ఆశీర్లిఙ్ :- "శాయాత్, శాయాస్తామ్, శాయాసుః" మొ.

### 636. విభాషా ఘ్రాధేట్ శాచ్ఛాసః 2.4.78

ఏభ్యః సిచో లుగ్వా స్యాత్ పరస్మైపదే పరే. అశాత్, అశాతామ్. అశుః. ఇట్సకౌ-అశాసీత్, అశాసిష్టామ్.

"ణ్యక్షత్రియార్ష ఞితో యూని లుగణిఞోః" నుండి 'లుక్' అనుపదము, "గాతిస్థాఘు పాభూభ్యః సిచః పరస్మైపదేషు" నుండి 'సిచః' పరస్మైపదేషు' అను పదములను అనువర్తించును. ఘ్రా గన్ధోపాదానే; ధేట్ పానే; శో తనూకరణే; ఛో ఛేదనే, షో అన్తకర్మణి - అను ధాతువులకంటె పరమైన సిచ్కు పరస్మైపదము పర మగు నపుడు వికల్పముగ లుక్ వచ్చును.

ఈ సూత్రముచే 'సిచ్'కు లుక్ చేసిన పక్షమున లుఙ్నందు "అశాత్, అశాతామ్. అశుః" ఇత్యాది రూపము లగును. 'సిచ్'కు లోపము రాని పక్షమున 'యమరమనమాతాం సక్చ'' అను సూత్రముచే (498) ధాతువునకు 'సక్'

ఆగమము. సిచ్‌కు ఇడాదేశము వచ్చుటచే - "అశాసీత్, అశాసిష్టామ్ అశాసిషుః" ఇత్యాది రూపము లగును. ల్బఙ్‌నందు 'అశాస్యత్' ఇత్యాది రూపము లగును.

ఛో ఛేదనే. 6. ఛ్యతి. షో అన్తకర్మణి. 7. స్యతి. ససౌ. దో అవఖణ్డనే. 7. ద్యతి. దదౌ. దేయాత్. అదాత్. వ్యధ తాడనే. 8.

6. ఛో ధాతువునకు ఛేదించుట అని అర్థము 7. షో ధాతువునకు నశింపచేయుట అని అర్థము. 'ధాత్వాదేః షః సః' అను సూత్రముచే (255) సకారము వచ్చును. 8. 'దో' ధాతువునకు ఖండించుట అని అర్థము. ఓకారాంతము లగు ఈ మూడు ధాతువుల ప్రక్రియ చాలవరకు 'శో' ధాతుప్రక్రియ వలె ఉండును. 'సో' 'దో' ధాతువులకు ఆశీర్లిఙ్‌నందు 'ఏర్లిఙి' అను సూత్రముచే (493) ఏకారము వచ్చి 'సేయాత్, సేయాస్తామ్, సేయాసుః' "దేయాత్, దేయాస్తామ్, దేయాసుః" ఇత్యాదిరూపము లగును. 'దో'ధాతువునకు లుఙ్నందు "గాతిస్థాఘుపాభూభ్యః సిచః పరస్మైపదేషు" అను సూత్రముచే (441) 'సిచ్' నిత్యముగ లోపించి "అదాత్, అదాతామ్, అదుః" ఇత్యాది రూపము లగును 'ఛో'. 'సో', ధాతువులు గూడ పై సూత్రమున (636) గ్రహింపబడినవి గాన వాటి లుఙ్ రూపములు శోధాతురూపముల వలె రెండేసి యుండును.

వ్యధ్ ధాతువునకు కొట్టుట అని అర్థము.

637. *గ్రహి, జ్యా, వయి, వ్యధి, వష్టి, విచతి, వృశ్చతి, పృచ్ఛతి, భృజ్జతీనాం, ఙితి చ* 6.1.16

ఏషాం సంప్రసారణం కితి ఙితి చ. విధ్యతి. వివ్యాధ, వివిధతుః, వివిధుః, వివ్యధిథ - వివ్యద్ధ. వ్యద్ధా. వ్యత్స్యతి. విధ్యేత్. విధ్యాత్. అవ్యాత్సీత్.

'ష్యఙః సంప్రసారణమ్' నుండి "సంప్రసారణమ్" అనువర్తించును. చకారముచే "వచిస్వపియజాదీనాం కితి"లోని 'కితి' సముచ్చిత మగును. గ్రహ్, జ్యా, వేఞ్, వ్యధ్, వశ్, వ్యచ్, వ్రశ్చ్, ప్రచ్ఛ్, భ్రస్జ్ ధాతువులకు కిత్తుగాని ఙిత్తుగాని అయిన ప్రత్యయము పర మగునపుడు సంప్రసారణము వచ్చును.

'సార్వధాతుకమపిత్' అను సూత్రముచే (503) శ్యన్ కిత్తు గాన అది పరముగ నున్నపుడు 'వ్యధ్'లోని యకారమునకు సంప్రసారణము (ఇకారము), 'సంప్రసారణాచ్చ' అని (258) పూర్వరూపము చేయగా లట్టునందు 'విధ్యతి, విధ్యతః, విధ్యన్తి' ఇత్యాదిరూపము లగును.

లిట్టునందు ఏకవచనప్రత్యయము లన్నియు 'పిత్'లు గాన ''లిట్యభ్యాసస్యోభయేషామ్''అను సూత్రముచే (549) అభ్యాసయకారమునకు సంప్రసారణము వచ్చి 'వివ్యాధ' ''వివ్యధిథ-వివ్యద్ధ'' ''వివ్యాధ-వివ్యధ'' అను రూపము లగును. 'అతుస్' మొదలగు ఇతరప్రత్యయము లన్నియు కిత్తులు గాన ద్విత్వము చేయుటకు పూర్వమే ''సమ్ప్రసారణం తదాశ్రయం చ కార్యం బలవత్'' అను పరిభాష ననుసరించి 'గ్రహిజ్యా-' అను సూత్రముచే (637) సంప్రసారణము వచ్చును. పిమ్మట ద్విత్వాదులు వచ్చి 'వివిధతుః, వివిధుః' ఇత్యాదిరూపము లగును. 'థల్'కు భారద్వాజనియమముచే ఇడాగమము వికల్పముగ వచ్చును. ఇడాగమపక్షమున 'వివ్యధిథ' అనియు, ఇడభావపక్షమున 'ఝషస్తథోర్ధోఽధః' అను సూత్రముచే (552) థకారమునకు ధకారము, ధాతుధకారమునకు జశ్త్వముచే దకారము చేయగా 'వివ్యద్ధ' అను రూపమును అగును.

లుట్టునందు 'తాస్' తకారమునకు ధకారము, ధాతుధకారమునకు జశ్త్వముచే దకారము చేయగా ''వ్యద్ధా, వ్యద్ధారౌ, వ్యద్ధారః'' ఇత్యాదిరూపము లగును.

ల్ఋట్టునందు 'స్య' పర మగునపుడు ధకారమునకు చర్త్వముచే తకారము. 'వ్యత్స్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్, లఙ్, విధిలిఙ్లందు సంప్రసారణము వచ్చి 'విధ్యతు' 'అవిధ్యత్' 'విధ్యేత్' ఇత్యాదిరూపము లగును.

ఆశీర్లిఙ్ఙనందు 'కిదాశిషి' అను సూత్రముచే (434) 'యాసుట్' కిత్ గాన సంప్రసారణము వచ్చి 'విధ్యాత్, విధ్యాస్తామ్, విధ్యాసుః' ఇత్యాది రూపము లగును.

లుఙ్ఙనందు ''వదవ్రజహలన్తస్యాచః'' అను సూత్రముచే (467) వృద్ధి వచ్చును. తకారథకారాదిప్రత్యయములు పర మగునపుడు సిచ్ లోపించును. అపుడు ప్రత్యయావయవతకారథకారములకు ధకారము, ధాత్వయవధకారమునకు

జ_శ్త్వము వచ్చును. ''అవ్యాత్సీత్, అవ్యాద్ధామ్, అవ్యాత్సుః; అవ్యాత్సీః, అవ్యాద్ధమ్. అవ్యాద్ధ; అవ్యాత్సమ్, అవ్యాత్స్వ, అవ్యాత్స్మ. ల్ఋఙ్‌నందు ''అవ్యత్స్యత్'' ఇత్యాదిరూపము లగును.

''పుషపుష్టౌ.''10. పుష్యతి. పుపోష, పుపోషిథ. పోష్టా. పోక్ష్యతి, ''పుషాది_'' ఇత్యఙ్_ అపుషత్. శుష శోషణే. 11. శుష్యతి. శుశోష. అశుషత్. ణశఅదర్శనే. 12. నశ్యతి. ననాశ, నేశతుః.

పుష్ ధాతువునకు వృద్ధి పొందుట అని అర్థము. అనిట్. పుష్యతి:_ శ్యన్‌కు జిద్వద్భావముచే లఘూపదగుణము రాలేదు. పుపోష:_ లిట్ ప్రథమ పురుషైకవచనము 'పిత్' గాన గుణము వచ్చినది.

పుపోషిథ:_ థల్‌నందు క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చును. లుట్‌నందు ష్టుత్వమువచ్చి ''పోష్టా, పోష్టారౌ, పోష్టారః''ఇత్యాది రూపము లగును. ల్ఋట్‌నందు ధాత్వవయవషకారమునకు 'షఢోః కః సి' అను సూత్రముచే (551) కకారము. 'స్య'యందలి సకారమునకు మూర్ధన్య షకారము—— 'ప్రోక్ష్యతి' ఇత్యాదిరూపము లగును. లోట్, లఙ్, విధిలిఙ్‌లందు 'పుష్యతు' 'అపుష్యత్' ''పుష్యేత్'' ఇత్యాదిరూపము లగును. ఆశీర్లిఙ్‌నందు 'పుష్యాత్, పుష్యాస్తామ్, పుష్యాసుః' ఇత్యాదిరూపము లగును. లుఙ్‌నందు ''పుషాదిద్యుతాద్య్లృదితః పరస్మైపదేషు''అను సూత్రముచే (510) 'చ్లి'కి 'అఙ్' ఆదేశము చేయగా ''అపుషత్'' ఇత్యాదిరూపములు సిద్ధించును.

11. శుష్‌ధాతువునకు ఎండుట అని అర్థము. అనిట్. ఇదికూడ పుషాది గణములో చేరినది గాన దీని ప్రక్రియ యంతయు పుషధాతుప్రక్రియ వలె నుండును

ణశ్ ధాతువునకు కనబడకుండపోవుట (నశించుట) అని యర్థము. 'ణో నః' అను సూత్రముచే (460) ణకారమునకు నకారము వచ్చును. అనిట్. లిట్‌నందు విశేషకార్య మేదియు లేదు.

లిట్టునందు 'అతుస్'మొదలగు కిత్ప్రత్యయములందు ''అత ఏకహల్మధ్యే ఽనాదేశాదేర్లిటి''అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపములు వచ్చి 'నేశతుః, నేశుః' ఇత్యాదిరూపము లగును.

## 638. రధాదిభ్యశ్చ 7.2.45

రధ్, నశ్, తృప్, దృప్, ద్రుహ్, ముహ్, ష్ణుహ్, ష్ణిహ్- ఏభ్యో వలాద్యార్ధధాతుకస్య వేట్ స్యాత్. నేశిథ.

'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' అను సూత్రము, "స్వరతిసూతిసూయతిధూఞూదితో వా" నుండి 'వా'అనువర్తించును. రధ్ మొదలగు ధాతువుల వలాద్యార్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగ వచ్చును.

'థల్'కు ఈ సూత్రముచే ఇడాగమము వచ్చు పక్షమున "థలి చ సేటి" అను సూత్రముచే (463) ఏత్వాభ్యాసలోపములు వచ్చి 'నేశిథ' అను రూపము సిద్ధించును. ఇడాగమము రాని పక్షమున "ననశ్థ" అని యుండగా-

## 639. మస్జినశోర్ఝలి 7.1.60

నుమ్స్యాత్. ననంష్ఠ, నేశివ-నేశ్వ; నేశిమ-నేశ్మ. నశితా-నంష్టా. నశిష్యతి-నఙ్క్ష్యతి. నశ్యతు. అనశ్యత్. నశ్యేత్, నశ్యాత్, అనశత్.

'ఇదితో నుమ్ ధాతోః' నుండి 'నుమ్' అనువర్తించును. మస్జ్, నశ్ ధాతువులకు ఝల్ పర మగునపుడు 'నుమ్' ఆగమము వచ్చును.

'నుమ్'లోని ఉకారమకారమ్ములు ఇత్సంజ్ఞకములు. మిత్తు గాన 'మిదచోన్త్యాత్పరః'అను సూత్రము (240) ననుసరించి అంత్యాచ్చుకు పరముగ వచ్చును. ఇచట రెండవ నకారముపై నున్న అకారమునకు పరముగ వచ్చును. 'ననన్శ్థ' అని యుండగా, ఈ నకారమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి' అను సూత్రముచే (78) అనుస్వారము వచ్చును. 'ననంశ్థ'. "వ్రశ్చభ్రస్జ—" ఇత్యాది సూత్రముచే (308) శకారమునకు షకారము- 'ననంష్థ'- ష్టుత్వముచే థకారమునకు ఠకారము- 'ననంష్ఠ' అను రూపము సిద్ధించును. ఇట్లే వ, మలు పర మగునపుడు ఇడ్వికల్పముచే 'నేశివ-నేశ్వ' "నేశిమ-నేశ్మ"అను రూపద్వయమగును

లుట్‌నందు ఇడాగమపక్షమున 'నశితా' ఇత్యాదిరూపములును. ఇడాగమము రాని పక్షమున నుమాగమానుస్వారష్టుత్వాదులచే 'నంష్టా' ఇత్యాదిరూపములును అగును. లృట్‌నందు ఇడాగమపక్షమున 'నశిష్యతి' ఇత్యాదిరూపములగును. ఇడభావపక్షమున 'నశ్స్యతి' అని యుండగా నుమాగమము (సూ-6 9) నకారమునకు అనుస్వారము, శకారమునకు వ్రశ్చాదిసూత్రముచే (308) షకా

రము, 'షఢోః కః సి' అను సూత్రముచే (551) షకారమునకు కకారము, సకారమునకు షకారము, అనుస్వారకు పరసవర్ణము (సూ-79) రాగా 'నఙ్క్ష్యతి' ఇత్యాదిరూపము లగును.

లోట్, లఙ్, విధిలిఙ్, ఆశీర్లిఙ్లందు కార్యవిశేష మేదియును లేదు. ఇది కూడ పుషాదిగణములోనిది గాన లుఙ్నందు 'అఙ్' వచ్చుటచే 'అనశత్' ఇత్యాదిరూపము లగును. లృఙ్నందు ఇడ్వికల్పముచే 'అనశిష్యత్' అనఙ్క్ష్యత్' ఇత్యాదిద్వివిధరూపము లుండును.

షూఙ్ ప్రాణిప్రసవే. 13. సూయతే. క్రాదినియమాత్ ఇట్. సుషువిషే; సుషువివహే, సుషువిమహే. సోతా-సవితా. దూఙ్ పరితాపే. 14. దూయతే. దీఙ్ క్షయే 15. దీయతే.

13. షూఙ్ధాతువునకు ప్రాణుల ప్రసవము—కనుట—అని యర్థము. ఙిత్తుగాన ఆత్మనేపది. లట్- 'సూయతే-సూయేతే' మొ. లిట్టునందు క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చి— 'సుషువిషే;' 'సుషువివహే' 'సుషువిమహే' అను రూపము లగును. లుట్ మొదలగు వాటియందు 'స్వరతిసూతిసూయతిధూఞూదితోవా' అను సూత్రముచే (478) ఇడాగమ వికల్పము. లుట్:- సోతా-సవితా. లృట్:- సోష్యతే-సవిష్యతే. లోట్:- సూయతామ్. లఙ్:- అసూయత. విధిలిఙ్:- సూయేత. ఆశీర్లిఙ్:- సోషీష్ట-సవిషీష్ట. లుఙ్:- అసోష్ట-అసవిష్ట. లృఙ్:- అసోష్యత-అసవిష్యత.

14. దూఙ్ధాతువునకు పరితపించుట అని అర్థము. ఆత్మనేపది. దీర్ఘ ఊకారాంతము గాన సేట్. దీని రూపములు షూఙ్ ధాతురూపముల వలెనుండును. ఇడ్వికల్పముమాత్రము ఉండదు. లుట్టు మొదలగువాటిలో ఒక్కొక్క రూపము మాత్రమే యుండును.

15. దీఙ్ ధాతువునకు క్షీణించుట అని యర్థము. ఆత్మనేపది. అనిట్ లట్నందు 'దీయతే' మొ.

### 640. *దీఙో యుడచి క్ఙితి* 6.4.63

దీఙః పరస్యాజాదేః క్ఙిత ఆర్ధధాతుకస్య యుట్.

'ఆర్ధధాతుకే' అధికారము. దీఙ్ధాతువుకంటె పరమైన అజాదియును, కిత్గాని ఙిత్తుగాని ఐన ఆర్ధధాతుకమునకు యుడాగమము వచ్చును.

వా. పుగ్యుటావువఙ్యణోస్సిద్ధౌవ క్తవ్యౌ.

16. దిదీయే.

ఉవఙ్ యణాదేశములు చేయవలసి యున్నపుడు పుక్, యుట్ ఆగమములు సిద్ధము లని—అనగా అసిద్ధములు కావని—చెప్పవలెను.

దిదీయే:- లిట్ ప్రథమపురుషైకవచనమున 'త'కు ఏశ్ ఆదేశము. ద్విత్వాదులు చేసిన పిమ్మట ''దిదీఏ'' అని యుండగా పై సూత్రముచే ఏకారమునకు 'యుట్' ఆగమము. ఉకారటకారములు ఇత్సంజ్ఞకములు. టిత్తు గాన ఆద్యవయవముగ వచ్చును. 'దిదీయే' అను రూపము సిద్ధించినది. కాని ఈ యుడాగమము ''అసిద్ధవదత్రాభాత్'' అను సూత్రముచే (564) అసిద్ధము గాన ''ఏరనేకాచోఽసంయోగపూర్వస్య'' అను సూత్రముచే (200) యణాదేశము రావలసి యున్నది. అందుచే పై వార్తికము యుటాగమము అసిద్ధము కాదని చెప్పుచున్నది. కావున యణాదేశము రాదు క్రాదినియమముచే లిట్టునందు వలాది ప్రత్యయములకు ఇడాగమము వచ్చును ఈ విధముగ అన్ని ప్రత్యయములును అజాదులే గాన అంతటను యుటాగమము వచ్చును. దిదీయే, దిదీయాతే, దిదీయిరే; దిదీయిషే, దిదీయాథే, దిదీయిధ్వే; దిదీయే, దిదీయివహే, దిదీయిమహే.

641. మీనాతి, మినోతి, దీఙాం ల్యపి చ. 6.1.50

ఏషామాత్వం స్యాత్ల్యపి; చాద్ అశిత్యేజ్నిమిత్తే. దాతా. దాస్యతి.

'ఆదేచ ఉపదేశేఽశితి' నుండి 'ఆత్' అనువర్తించును. 'చ' అనుటచే "ఏచః (నిమిత్తే) అశితి" కూడ అనువర్తించును. ల్యప్ పర మగునపుడును, ఏచ్‌కు నిమిత్త మగు శిత్‌భిన్న మగు ప్రత్యయము పర మగునపుడును ఈధాతువులకు ఆకారము వచ్చును.

తాస్,స్య మొదలగునవి శిత్‌లు కావు. ఇవి గుణవృద్ధ్యాదులకు నిమిత్త మగుటచే ఏజ్నిమిత్తములు. కావున ఇవి పర మగునపుడు 'దా'యందలి ఈకారమునకు (అలోన్త్యపరిభాషచే 21) ఆకారము వచ్చును. లుట్:- దాతా. లృట్:- దాస్యతే. లోట్:- దీయతామ్ లఙ్:-అదీయత. విధిలిఙ్:-దీయేత. ఆశీర్లిఙ్:- దాసీష్ట. దీఙ్‌ధాతువు దాదూప మైనది గాన ఘుసంజ్ఞకము. అందుచే లుఙ్‌నందు "స్థాఘ్వోరిచ్చ" అను (627) ఇకారాదేశము రావలసి యుండగా:-

వా. స్థాఘ్వోరిత్వే దీఙః ప్రతిషేధః. అదాస్త.

ఘుసంజ్ఞకధాతువులకు స్థాఘ్వోరిచ్చ అను ఇత్వము చేయు సందర్భమున దీఙ్ ధాతువునకు నిషేధము చెప్పవలెను.

ఈ వార్త్తికముచే ఇత్వము నిషేధింపబడినది గాన లుఙ్ నందు "అదాస్త, అదాసాతామ్, అదాసత" ఇత్యాదిరూపము లగును.

డీఙ్ విహాయసాగతౌ 16 డీయతే. డిడ్యే. డయితా. పీఙ్ పానే. 17. పీయతే. పేతా. అపేష్ట. మాఙ్ మానే 18. మాయతే. మమే. జనీ ప్రాదుర్భావే, 19.

16. డీఙ్ ధాతువునకు ఎగురుట అని అర్థము. 'ఊదౄదన్తైః' ఇత్యాది శ్లోకమునందు పరిగణింపబడుటచే ఇది సేట్. దాని రూపములు సార్వధాతుకము లందు దీఙ్ ధాతురూపములవలె ఉండును. లిట్:- యణాదేశముచే 'డిడ్యే' ఇత్యాదిరూపములగును. లుట్:- డయితా. ల్ఋట్:- డయిష్యతే. ఆశీర్లిఙ్:- డయిషీష్ట. లుఙ్:- అడయిష్ట. ల్ఋఙ్:- అడయిష్యత.

17. పీఙ్ ధాతువునకు త్రాగుట అని యర్థము. అనిట్. పీయతే. పిప్యే పేతా. పేష్యతే. పీయతామ్. అపీయత. పీయేత. పేషీష్ట. అపేష్ట. అపేష్యత.

18. మా ధాతువునకు కొలుచుట అని అర్థము. అనిట్:- మాయతే. మమే. మాతా. మాస్యతే. మాయతామ్. అమాయత. మాయేత. మాసీష్ట అమాస్త. అమాస్యత.

19. జన్ ధాతువునకు పుట్టుట అని యర్థము. సేట్.

642. జ్ఞాజనోర్జా 7.2.79

అనయోర్జాదేశః స్యాత్ శితి. జాయతే, జజ్ఞే, జనితా, జనిష్యతే.

'ష్ఠివుక్లముచమాం శితి' నుండి 'శితి' అనువర్త్తించును. శిత్ అగు ప్రత్యయము పర మగునపుడు 'జ్ఞా' 'జన్' ధాతువులకు 'జా' అను నాదేశము వచ్చును.

'శ్యన్' శిత్తు గాన సార్వధాతుకలకారములందు ఈ సూత్రముచే జాదేశము వచ్చును. లట్:- జాయతే. లోట్:- జాయతామ్. లఙ్: అజాయత. విధిలిఙ్:- జాయేత.

జజ్ఞే:- లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వ అభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట 'జజన్ ఏ' అని యుండగా "గమహనజనఖనఘసాం లోపః క్ఙిత్యనఙి" అను సూత్రముచే (508) ఉపధాలోపము. 'జజ్ న్ ఏ' అని యుండగా- శ్చుత్వముచే నకారమునకు ఞకారము జకారఞకారములు కలిసిన 'జ్ఞ' అగును. 'జజ్ఞే' అను రూపము సిద్ధించును. జజ్ఞే, జజ్ఞాతే, జజ్ఞిరే, జజ్ఞిషే, జజ్ఞాథే, జజ్ఞిధ్వే; జజ్ఞే, జజ్ఞివహే, జజ్ఞిమహే. లుట్:- జనితా. లృట్:-జనిష్యతే, ఆశీర్లిఙ్:- జనిషీష్ట.

643. *దీపజనబుధపూరితాయిప్యాయిభ్యోఽన్యతరస్యామ్* 3.1.61

ఏభ్యశ్చ్లేశ్చిణ్ వా స్యాత్, ఏకవచనే తశబ్దే పరే.

'చ్లేః సిచ్' 'చిణ్ తే పదః' అను సూత్రముల నుండి 'చ్లేః' 'చిణ్' 'తే' అనువర్తించును. దీపాదులు అత్మనేపదులు గాన వాటికంటె పర మగు 'త' అనగా ఏకవచనప్రత్యయముగనే యుండును. ఏకవచన మగు తశబ్దము పర మగునపుడు, దీప్, జన్, బుధ్, పూరీ, తాయ్, ప్యాయ్ ధాతువులకంటె పర మగు 'చ్లి'కి 'చిణ్' ఆదేశము వికల్పముగ వచ్చును.

'చిణ్'లోని చకారణకారములు ఇత్సంజ్ఞకములు. ఈ సూత్రముచే 'చ్లి'కి చిణ్ చేసిన పిమ్మట "అజన్ ఇత" అని యుండగా:-

644. *చిణో లుక్.* 6 4.104

చిణః పరస్య తశబ్దస్య లుక్ స్యాత్.

చిణ్ కంటె పరముగ నుండునది తప్రత్యయమే గాన 'తశబ్దస్య' అనునది అర్థబలలభ్యము. చిణ్ కంటె పర మగు తశబ్దమునకు లుక్ వచ్చును,

ఈ సూత్రముచే 'త'కు లుక్ చేయగా 'అజని' అని యుండును. ఇపుడు 'చిణ్' ణిత్తు గాన "అత ఉపధాయాః" అను సూత్రముచే (457) వృద్ధి రావలసి యుండ:-

645 *జనివధ్యోశ్చ.* 7.3.35

అనయోరుపధాయా వృద్ధిర్న స్యాత్, చిణి ఞ్ణితి కృతి చ. అజని, అజనిష్ట, దీపీ దీప్తౌ. 20. దీప్యతే, దిదీపే. అదీపి. అదీపిష్ట పదగతౌ. 21. పద్యతే. పేదే. పత్తా. పత్సీష్ట.

'అత ఉపధాయాః', 'మృజేర్వృద్ధిః', "నోదాత్తోపదేశస్య మాన్తస్యా నాచమేః", "ఆతో యుక్ చిణ్కృతోః" "అచో ఞ్ణితి"అను సూత్రములనుండి 'ఉపధాయాః', 'వృద్ధిః', 'న', 'చిణ్కృతోః' 'ఞ్ణితి'అనువర్తించును. 'చిణ్' అనునదియు, ఞిత్తు గాని ణిత్తు గాని అయిన కృత్ప్రత్యయమును పరముగ నున్నపుడు జన్,వధ్ధాతువుల ఉపధకు వృద్ధి రాదు.

ఈ సూత్రముచే నిషేధింపబడుటచే వృద్ధి రాలేదు. ఈ విధముగ 'చిణ్' చేసిన పక్షమున 'అజని' అనియు, తదభావపక్షమున 'సిచ్'చేయుటచే 'అజనిష్ట' అనియు లుఙ్ప్రథమపురుషైకవచనమున రూపద్వయ ముండును. ద్వివచనాదు లందు "అజనిషాతామ్, అజనిషత" ఇత్యాదిరూపము లగును. లృఙ్:- అజనిష్యత.

20. దీప్ ధాతువునకు ప్రకాశించుట అని అర్థము. సేట్. దాని రూపములు కూడ జనీధాతురూపముల వలె నుండును. లుఙ్ప్రథమపురుషైకవచనము నందు చిణ్ వికల్పముచే 'అదీపి' 'అదీపిష్ట' అను రూపద్వయ ముండును. దీప్యతే, దిదీపే, దీపితా, దీపిష్యతే, దీప్యతామ్, అదీప్యత, దీపేత, దీపిషీష్ట, అదీపి-అదీపిష్ట, అదీపిష్యత.

21. పదధాతువునకు నడచుట, వెళ్ళుట అని అర్థము. అనిట్, పద్యతే, పేదే, పత్తా, పత్స్యతే, పద్యతామ్, అపద్యత, పద్యేత, పత్సీష్ట.

లుఙ్ప్రథమపురుషైకవచనమున 'అపద్ చ్లి త' అని యుండగా:-

646. చిణ్ తే పదః 3.1.60

పదశ్చ్లేశ్చిణ్ స్యాత్ తశబ్దే పరే. అపాది, అపత్సాతామ్, అపత్సత.

'చ్లేస్సిచ్' నుండి 'చ్లేః' అనువర్తించును. 'త'పరముగ నున్నపుడు పద ధాతువుకంటె పరమైన 'చ్లి'కి 'చిణ్' ఆదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'చిణ్' చేసిన పిమ్మట 'అపద్ ఇ త' అని యుండగా తకారమునకు లుక్ (సూ. 641). ఉపధావృద్ధి 'అపాది' అను రూపము సిద్ధించినది. అపాది, అపత్సాతామ్, అపత్సత; అపత్థాః, అపత్సాథామ్, అపద్ధ్వమ్; అపత్సి, అపత్స్వహి, అపత్స్మహి. లృఙ్:- అపత్స్యత'.

విద సత్తాయామ్ 22. విద్యతే, వేత్తా, అవిత్త. బుధ అవగమనే. 23. బుధ్యతే, బోద్ధా, భోత్స్యతే, భుత్సీష్ట, అబోధి, అబుద్ధ, అభుత్సాతామ్.

విద ధాతువునకు ఉండుట అని అర్థము. అనిట్ విద్యతే, వివిదే, వేత్తా, వేత్స్యతే, విద్యతామ్, అవిద్యత, విద్యేత, విత్సీష్ట, అవిత్త, అవిత్సాతామ్, అవిత్సత. అవేత్స్యత.

ఆశీర్లిఙ్‌నందు "లిఙ్‌సిచావాత్మనేపదేషు" అను సూత్రముచే (592) 'సీయుట్' కిత్తు గాన గుణము రాలేదు.

23. బుధ్ ధాతువునకు తెలిసికొనుట అని అర్థము. అనిట్. స్య, సీయుట్ సిచ్ మొదలగు వాటి సకారము పర మగునపుడు "ఏకాచో బశో భష్ ఝష న్తస్య స్ధ్వోః" అను సూత్రముచే (253) బకారమునకు భష్ భావముచే భకారము వచ్చును. బుధ్యతే, బుబుధే. బోద్ధా, భోత్స్యతే, బుధ్యతామ్. అబుధ్యత, బుధ్యేత, భుత్సీష్ట.

లుఙ్ఙనందు ప్రథమపురుషైక వచనమున చిణ్ వికల్పముచే (సూ-643) 'అబోధి' 'అబుద్ధ' అను రూపద్వయ ముండును. 'ధ్వమ్' పరమగునపుడు గూడ భష్ భావము వచ్చును. (సూ-253). అబోధి-అబుద్ధ, అభుత్సాతామ్. అభుత్సత, అబుద్ధాః, అభుత్సాథామ్. అభుద్ధ్వమ్; అభుత్సి అభుత్స్వహి, అభుత్స్మహి. ల్ఱఙ్ :- అభోత్స్యత.

యుధ సంప్రహారే. 24. యుధ్యతే, యుయుధే, యోద్ధా, అయుద్ధ. సృజ విసర్గే. 25, సృజ్యతే. ససృజే, ససృజిషే.

24. యుధ్ ధాతువునకు యుద్ధము చేయుట అని యర్థము. అనిట్:లట్-యుధ్యతే. లిట్- యుయుధే. వలాద్యార్ధ ధాతుకములకు క్రాదినియమముచే ఇడాగమము వచ్చి 'యుయుధిషే, యుయుధిధ్వే' ఇత్యాది రూపము లగును. లుట్ :- యోద్ధా లఘూపధగుణము "ఝష స్తథోర్ధోఽధః" అను సూత్రముచే (552) తకారమునకు ధకారము. ధాతుధకారమునకు జశ్త్వము. ల్ఱట్-యోత్స్యతే. లోట్- యుధ్యతామ్. లఙ్ :- అయుధ్యత. విధిలిఙ్ :- యుధ్యేత. ఆశీర్లిఙ్ :- యుత్సీష్ట, యుత్సీయాస్తామ్, యుత్సీరన్.

లుఙ్‌నందు 'త' పర మగునపుడు సిచ్ కు 'ఝలో ఝలి' అను సూత్ర ముచే (480) లోపము- అయుద్ధ, అయుత్సాతామ్, అయుత్సత; అయుద్ధాః, అయుత్సాథామ్, అయుద్ధ్వమ్, అయుత్సి, అయుత్స్వహి, అయుత్స్మహి. ౡఙ్ :- అయోత్స్యత.

25. సృజ్ ధాతువునకు విడచుట అని అర్థము. అనిట్. లిట్ :- సృజ్యతే. లిట్ :- ససృజే. వలాద్యార్ధధాతుకములకు క్రాదినియమముచే ఇడాగమము చేయగా 'ససృజిషే' 'ససృజిధ్వే' 'ససృజివహే' ససృజిమహే' అను రూపము లగును.

647. సృజిదృశోర్ఝల్యమకితి 6.1.58

అనయోః అమ్ ఆగమః స్యాద్ ఝలాదౌ అకితి. స్రష్టా. స్రక్ష్యతే. సృక్షీష్ట, అసృక్షాతామ్.

సృజిదృశోః, ఝలి, అమ్, అకితి. ఝలాది యగు కిత్ కాని ప్రత్యయము పరముగా నున్నపుడు సృజ్; దృశ్ ధాతువులకు 'అమ్' అను నాగమము వచ్చును.

'తా' 'స్య' మొదలగు ఝలాదు లగు ప్రత్యయములు కిత్తులు కావు. కావున ఈ సూత్రముచే అమాదేశము వచ్చును. 'అమ్' మిత్తు గాన అంత్యమగు ఋకారరూప మగు అచ్చుకు పరముగ వచ్చును. లుట్ ప్రథమపురుషైకవచనమున 'సృ అజ్ తా' అని యుండగా యణాదేశము-'స్రజ్ తా'; "వ్రశ్చ-" ఇత్యాది సూత్రముచే (308) జకారమునకు షత్వము. తకారమునకు ష్టుత్వము -'స్రష్టా' అను రూపము సిద్ధించును. 'స్రష్టారౌ' 'స్రష్టారః' ఇత్యాది రూపములు గూడ ఇట్లే సిద్ధించును.

ౡట్‌నందు 'స్య' పరమగునపుడు 'సృజ్ స్య' అని యుండగా అమాగమ యణాదేశములు – 'స్రజ్‌స్య'. జకారమునకు వ్రశ్చాది సూత్రముచే (308) షకారము. ఆ షకారమునకు 'షఢోః కః సి' అను సూత్రముచే (551) కకారము. స్య యందలి సకారమునకు షత్వము. 'స్రక్ష్యతే' ఇత్యాది రూపములు సిద్ధించును. లోట్ :- సృజ్యతామ్ లఙ్ :- అసృజ్యత. విధిలిఙ్ :- సృజ్యేత. ఆశీర్లిఙ్నందు సీయుడాగమము కిత్తు గాన (సూ-592) అమాగమము రాదు సృక్షీష్ట, సృక్షీయాస్తామ్. సృక్షీరన్, సృక్షీష్ఠాః, సృక్షీయాస్థామ్, సృక్షీధ్వమ్, సృక్షీయ, సృక్షీవహి, సృక్షీమహి.

# అథ స్వాదిగణః

షుఞ్ అభిషవే. 1.

షుఞ్ ధాతువునకు స్నానము చేయుట అని అర్థము. పిండుట మొదలగు అర్థములందు గూడ ఇది ప్రయోగింపబడుచున్నది. ఞిత్తు గాన ఉభయపది. అనిట్. 'ధాత్వాదేః షస్సః' అను సూత్రముచే (255) షకారమునకు సకారము.

648. స్వాదిభ్యః శ్నుః 3.1.73

శపోఽపవాదః, సునోతి, సునుతః 'హుశ్నువోః-' ఇతియణ్- సున్వన్తి, సున్వః-సునువః. సునుతే, సున్వాతే, సున్వతే; సున్వహే- సునువహే, సుషావ; సుషువే. సోతా. సును; సునవాని; సునవై. సునుయాత్. సూయాత్.

స్వాదులకంటె (కర్త్రర్థసార్వధాతుకమున) శ్నుప్రత్యయము వచ్చును. ఇది 'శప్'కు అపవాదము. శ్నులోని శకారము ఇత్సంజ్ఞకము. ను మిగులును. శ్ను శిత్తు గాన సార్వధాతుకము. అపిత్సార్వధాతుకము గాన జిద్వద్భావ ముండుటచే ఇది పరముగ నున్నపుడు గుణము రాదు.

సునోతి:-' లట్ ప్రథమపురుషైకవచనమున 'తిప్' పిత్సార్వధాతుకము గాన అది పరముగ నుండుటచే 'ను' లోని ఉకారమునకు గుణము, 'సునోతి' అను రూపము సిద్ధించినది. సునుతః:- 'తస్'కు జిద్వద్భావ ముండుటచే ను లోని ఉకారమునకు కూడ గుణము రాలేదు. బహువచనమున 'సును అన్తి'అని యుండగా ''అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ'' అను (199) ఉవఙాదేశ మును బాధించి "హుశ్నువోః సార్వధాతుకే" అను సూత్రముచే (468) యణా దేశము- 'సున్వన్తి' ఇట్లే ''సునోషి. సునుథః, సునుథ; సునోమి''అను రూపము లగును. 'వస్' 'మస్'లు పర మగునపుడు "లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః" అను సూత్రముచే (505) ఉకారమునకు వికల్పముగ లోపము వచ్చిన పక్షమున 'సున్వః' 'సున్మః' అను రూపములును. ఉకారలోపము రాని పక్షమున 'సునువః' 'సునుమః' అను రూపములును అగును.

లిట్టులో (పరస్మైపదమున) కిత్ ప్రత్యయములు పర మగునపుడు "అత ఏకహల్మధ్యేఽ నాదేశాదేర్లిటి'' అను సూత్రముచే (462) ఏత్వాభ్యాసలోపములు వచ్చును. "ననాహ, నేహతుః, నేహుః". 'థల్'కు భారద్వాజ నియమముచే ఇడాగమ వికల్పము: ఇడాగమ పక్షమున "థలి చ సేటి'' అను సూత్రముచే (463) ఏత్వాభ్యాసలోపములు వచ్చి 'నేహిథ' అను రూప మగును. ఇడాగమము రాని పక్షమున ద్విత్వాభ్యాస కార్యములు చేసిన పిమ్మట 'ననహ్ థ' అని యుండగా 'నహో ధః' అను సూత్రముచే (360) హకారమునకు ధకారము. 'ఝష స్తథోర్ధోఽధః' అను సూత్రముచే (552) థకారమునకు ధకారము. పూర్వధకారమునకు జ_శ్త్వముచే దకారము- 'ననద్ధ' అను రూపము సిద్ధించును. నేహిథ - ననద్ధ, నేహథుః, నేహ; ననాహ-ననహ, నేహివ, నేహిమ. ఆత్మనేపదమున అన్ని అత్యయములును కిత్తులే గాన ఏత్వాభ్యాస లోపములచే "నేహే, నేహాతే, నేహిరే" ఇత్యాది రూపము లగును. వలాది ప్రత్యయములకు క్రాదినియమముచే ఇడాగమము వచ్చి 'నేహిషే, నేహిధ్వే' ఇత్యాది రూపము లగును. లుట్ :- నద్ధా (ప్రక్రియ 'ననద్ధ' అనునపుడువలె నుండును). లృట్ :- నత్స్యతి, నత్స్యతే ధకార చ_ర్త్వములు. ఆశీర్లిఙ్ :- "నహ్యాత్, నహ్యాస్తామ్, నహ్యాసుః" "నత్సీష్ట, నత్సీయాస్తామ్, నత్సీరన్". లుఙ్ :- (ప) అనాత్సీత్, అనాద్ధామ్, సిజ్లోపము, హకార తకారములకు ధకారములు, పూర్వధకారమునకు జ_శ్త్వముచే దకారము అనాత్సుః, అనాత్సీః, అనాద్ధమ్, అనాద్ధ; అనాత్సమ్. అనాత్స్వ, అనాత్స్మ. (ఆ) అనద్ధ, (సిచ్లోప ధకార, ధకార జ_శ్త్వములు), అనత్సాతామ్, అనత్సత, అనద్ధాః, అనత్సాథామ్, అనద్ధ్వమ్, అనత్సి, అనత్స్వహి, అనత్స్మహి. లృఙ్ :- అనత్స్యత్, అనత్స్యత.

దివాది ప్రకరణము సమాప్తము.

# అథ స్వాదిగణః

షుఞ్ అభిషవే. 1.

షుఞ్ ధాతువునకు స్నానము చేయుట అని అర్థము. పిండుట మొదలగు అర్థములందు గూడ ఇది ప్రయోగింపబడుచున్నది. ఞిత్తు గాన ఉభయపది. అనిట్. 'ధాత్వాదేః షస్సః' అను సూత్రముచే (255) షకారమునకు సకారము.

648. స్వాదిభ్యః శ్నుః 3.1.73

శపోఽపవాదః, సునోతి, సునుతః 'హుశ్నువోః-' ఇతియణ్- సున్వన్తి, సున్వః-సునువః. సునుతే, సున్వాతే, సున్వతే; సున్వహే- సునువహే, సుషావ; సుషువే. సోతా. సును; సునవాని; సునవై. సునుయాత్. సూయాత్.

స్వాదులకంటె (కర్త్రర్థసార్వధాతుకమున) శ్నుప్రత్యయము వచ్చును. ఇది 'శప్'కు అపవాదము. శ్ను లోని శకారము ఇత్సంజ్ఞకము. ను మిగులును. శ్ను శిత్తు గాన సార్వధాతుకము. అపిత్సార్వధాతుకము గాన ఙిద్వద్భావ ముండు టచే ఇది పరముగ నున్నపుడు గుణము రాదు.

సునోతి:-' లట్ ప్రథమపురుషైకవచనమున 'తిప్' పిత్సార్వధాతుకము గాన అది పరముగ నుండుటచే 'ను' లోని ఉకారమునకు గుణము, 'సునోతి' అను రూపము సిద్ధించినది. సునుతః:- 'తస్'కు ఙిద్వద్భావ ముండుటచే ను లోని ఉకారమునకు కూడ గుణము రాలేదు. బహువచనమున 'సును అన్తి'అని యుండగా ''అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ'' అను (199) ఉవఙాదేశ మును బాధించి "హుశ్నువోః సార్వధాతుకే" అను సూత్రముచే (468) యణా దేశము- 'సున్వన్తి' ఇట్లే ''సునోషి. సునుథః, సునుథ; సునోమి''అను రూపము లగును. 'వస్' 'మస్'లు పర మగునపుడు "లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః" అను సూత్రముచే (505) ఉకారమునకు వికల్పముగ లోపము వచ్చిన పక్షమున 'సున్వః' 'సున్మః' అను రూపములును. ఉకారలోపము రాని పక్షమున 'సునువః' 'సునుమః' అను రూపములును అగును.

సునుతే:- ఆత్మనేపదప్రత్యయముల కన్నిటికిని జిద్వద్భావ ముండును గాన ప్రత్యయోకారమున కెచటను గుణము రాదు. ప్రథమపురుషైకవచనమున సునుతే' అను రూప మగును. సున్వాతే:- 'సును ఆతే' అని యుండగా 'హు శ్నువోః సార్వధాతుకే' అను సూత్రముచే(468)యణాదేశము 'సున్వతే':-ఆత్మ నేపదేష్వనతః' అను సూత్రముచే (527) ఝకారమునకు అత్, ఆదేశము. యణాదేశము (సూ-468) ఇట్లే ''సునుషే, సున్వాథే, సునుధ్వే, సున్వే, సున్వహే-సునువహే, సున్మహే-సునుమహే.

లిట్టునందు ద్విత్వఅభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట రెండవ సకారము నకు- ఇది ఆదేశరూపమైనది గాన- షత్వము వచ్చును. (పర.) 'సుషావ, సుషువతుః, సుషువుః; సుషవిథ, సుషోథ, సుషువథుః, సుషువ, సుషావ, సుషవ, సుషువివ, సుషువిమ'.'థల్'కు భారద్వాజనియమముచే వికల్పముగను, వ, మ, లకు క్రాదినియమముచే నిత్యముగను ఇడాగమము వచ్చినది. (ఆత్మ.) సుషువే, సుషువాతే, సుషువిరే; సుషువిషే, సుషువాథే, సుషువిధ్వే; సుషువే, సుషువివహే, సుషువిమహే. వలాదిప్రత్యయములకు క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చినది. అజాదిప్రత్యయములు పర మగునపుడు ఉవఙాదేశము వచ్చినది.

లుట్:- సోతా, ల్రుట్:- సోష్యతి,సోష్యతే. లోట్: పరస్మైపదప్రథమ పురుష- సునోతు-సునుతాత్, సునుతామ్, సున్వన్తు. మధ్యమపురుషైకవచన మున'సునుహి' అని యుండగా "ఉతశ్చప్రత్యయాదసంయోగపూర్వాత్" అను సూత్రముచే (506) 'హి'కి లోపము. చిను-చినుతాత్ చినుతమ్-చినుత.

లోడుత్తమపురుషమున ప్రత్యయములకు పిత్ అగు ఆడాగమము చేరును గాన అది పర మగునపుడు ప్రత్యయోకారమునకు గుణము. అవాదేశము వచ్చి 'సునవాని, సునవావ, సునవామ' అను రూపము లగును. ఆత్మనేపదమున- సునుతామ్, సున్వాతామ్, సున్వతామ్, సునుష్వ, సున్వాథామ్, సునుధ్వమ్ సునవై, సునవావహై, సునవామహై. ఇచటగూడ ఉత్తమపురుష మున ఆట్ పరమగునపుడు గుణము అవాదేశము వచ్చినవి.

లఙ్. (పర.) అసునోత్, అసునుతామ్, అసున్వన్; అసునోః, అసునుతమ్, అసునుత, అసునవమ్, అసున్వ - అసునువ, అసున్మ-

అసునుమ. (ఆత్మ) అసునుత. అసున్వాతామ్, అసున్వత; అసునుథాః, అసున్వాథామ్, అసునుధ్వమ్; అసున్వి, అసున్వహి - అసునువహి, అసున్మహి-అసునుమహి.

విధిలిఙ్:- (పర.) సునుయాత్, సునుయాతామ్, సునుయుః. మొ. (ఆత్మ) 'సున్వీత, సున్వీయాతామ్, సున్వీరన్'. మొ.

ఆశీర్లిఙ్ (పర.)- 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః' అని (485) దీర్ఘము. సూయాత్, సూయాస్తామ్, సూయాసుః, సూయాః, సూయాస్తమ్, సూయాస్త; సూయాసమ్, సూయాస్వ, సూయాస్మ, ఆత్మనేపది:— 'సోషీష్ట, సోషీయాస్తామ్, సోషీరన్'. మొ.

649. స్తు సు ధూఞ్భ్యః పరస్మైపదేషు 7.2.72

ఏభ్యః సిచ ఇట్ స్యాత్ పరస్మైపదేషు. అసావీత్, అసోష్ట.

'ఇడత్యర్తివ్యయతీనామ్' "అఞ్జేస్సిచి" అను సూత్రములనుండి 'ఇట్' 'సిచి' అనువర్తించును. పరస్మైపదప్రత్యయములు పర మగునపుడు స్తు, సు, ధూఞ్ధాతువులకంటె పరమైన 'సిచ్'కు ఇడాగమము వచ్చును.

లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'అసుస్త్' అని యుండగా ఈ సూత్రముచే సిచ్‌కు ఇడాగమము. అపృక్తతకారమునకు ఈడాగమము (సూ-417); సకారమునకు లోపము (సూ-448); ఇట్ ఈట్‌లకు సవర్ణదీర్ఘము- 'అసు ఈత్' అని యుండగా 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను సూత్రముచే (486) వృద్ధి: ఆవాదేశము—'అసావీత్' అను రూపము సిద్ధించును. అసావీత్, అసావిష్టామ్, అసావిషుః; అసావీః, అసావిష్టమ్, అసావిష్ట; అసావిషమ్, అసావిష్వ, అసావిష్మ. ఆత్మనేపది:- అసోష్ట, అసోషాతామ్, అసోషత; అసోష్ఠాః, అసోషాథామ్, అసోఢ్వమ్; అసోషి, అసోష్వహి, అసోష్మహి. లృఙ్:- అసోష్యత్, అసోష్యత.

చిఞ్ చయనే. 2. చినోతి; చినుతే.

2. చిఞ్ ధాతువునకు ఏరుట, ప్రోవుచేయుట అని యర్థము. ఉభయపది. అనిట్. లట్టునందు సుధాతువునందు వలె 'చినోతి' 'చినుతే' ఇత్యాదిరూపము లగును.

650. విభాషా చేః 7.3.58

అభ్యాసాత్ పరస్య చిఞః కుత్వం వా స్యాత్ సని లిటి చ. చికాయ-చిచాయ, చిక్యే-చిచ్యే, అచైషీత్, అచేష్ట,

'చజోః కుఘిణ్యతోః' 'అభ్యాసాచ్చ' 'సన్లిటోర్జేః' అనుసూత్రములనుండి 'కు' 'అభ్యాసాత్' 'సన్‌లిటోః' అనువర్తించును. సన్ ప్రత్యయము కాని, లిట్ కాని పర మగునపుడు అభ్యాసముకంటె పరమైన చిఞ్ ధాతుచకారమునకు వికల్పముగ కుత్వము వచ్చును. ఈ విధముగ లిట్టునందు రెండేసి రూపము లుండును.

లిట్:- (పర):- చికాయ-చిచాయ, చిక్యతుః-చిచ్యతుః, చిక్యుః-చిచ్యుః; చికేథ-చికయిథ, చిచేథ-చిచయిథ, చిక్యథుః-చిచ్యథుః, చిక్య-చిచ్య; చికాయ-చికయ-చిచాయ-చిచయ, చిక్యివ-చిచ్యివ, చిక్యిమ-చిచ్యిమ: 'థల్'కు భారద్వాజనియమముచే వికల్పముగను 'వ' 'మ'కు క్రాది నియమముచే నిత్యముగను ఇడాగమము వచ్చినది. (ఆత్మ):- చిక్యే-చిచ్యే,. చిక్యాతే-చిచ్యాతే, చిక్యిరే-చిచ్యిరే ఇత్యాదిరూపము లగును. క్రాదినియమముచే వలాద్యార్ధధాతుకములందు ఇడాగమము వచ్చును. లుఙ్ తక్క ఇతర లకారములలో రూపములు 'సు'ధాతువునందు వలె నుండును. పరస్మైపదమున ఈధాతువునందు (లుఙ్) సిచ్‌కు ఇడాగమము రాదు గాన 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను (486) వృద్ధిమాత్రము వచ్చి 'అచైషీత్' ఇత్యాదిరూపములు అగును. ఆత్మనేపదమున సుధాతువునందు వలె 'అచేష్ట' ఇత్యాదిరూపము లగును.

స్తృఞ్ ఆచ్ఛాదనే. 3. స్తృణోతి, స్తృణుతే.

స్తృఞ్ ధాతువునకు ఆచ్ఛాదించుట అని అర్థము. ఉభయపది. అనిట్. లట్:- స్తృణోతి స్తృణుతే. "ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్" అను వార్తికముచే (సూ-211) నకారమునకు ణకారము వచ్చినది.

లిట్టునందు ప్రథమపురుషైకవచనమున ద్విత్వము, అత్వము (సూ-475) చేసిన పిమ్మట 'స్తర్ స్తృఅ' అని యుండగా 'హలాదిః శేషః' అను సూత్రముచే (398) తకారరేఫలులోపించి సకారము శేషింప వలసి యుండ:-

651. శర్ పూర్వాః ఖయః 7.4.61

అభ్యాసాత్ శర్పూర్వాః ఖయః శిష్యన్తే; అన్యే హలో లుప్యన్తే. తస్తార, తస్తరతుః, తస్తరే. "గుణోర్తి-" ఇతి గుణః- స్తర్యాత్.

'అత్రలోపోఽభ్యాసస్య' 'హలాదిః శేషః' అనుసూత్రములనుండి 'అభ్యాసస్య' 'శేషః' అనువర్తించును. అభ్యాసముయొక్క శర్పూర్వకము లగు ఖయ్‌లు శేషించును. ఇచట 'స్తృ' అనుదానియందు తకారము ఖయ్; దాని వెనుక శర్ (సకారము) ఉన్నది. కావున ఆ 'ఖయ్' శేషించును. ఇచట తకారము శేషించి సకారము లోపింపగా 'త స్తృ అ' అని యుండ "ఋతశ్చసంయోగాదేర్గుణః"అను సూత్రముచే (499) గుణము, ఉపధావృద్ధి చేయ 'తస్తార' అను రూపము సిద్ధించినది. 'అతుస్' మొదలగు ప్రత్యయములు పర మగునపుడు గూడ గుణము (సూ-499) వచ్చును. తస్తార, త స్తరతుః, త స్తరుః, త స్తర్థ, త స్తరథుః, త స్తర; తస్తార-త స్తర, త స్తరివ, త స్తరిమ. ఇది ఋదన్తధాతువు గాన 'థల్'కు ఇడాగమము రాలేదు. వ, మలకు క్రాదినియమముచే నిత్యముగ వచ్చినది. ఆత్మనేపదమునందు గూడ గుణము (సూ-499) వచ్చును- త స్తరే, త స్తరాతే, త స్తరిరే; త స్తరిషే, త స్తరాథే, త స్తరిధ్వే; త స్తరే, త స్తరివహే, త స్తరిమహే.

లుట్:- స్తర్తా. లృట్:- స్తరిష్యతి; స్తరిష్యతే. "ఋద్ధనోః స్యే" అని (500) ఇడాగమము వచ్చినది. లోట్:- స్తృణోతు, స్తృణుతామ్,లఙ్:- అ స్తృణోత్, అ స్తృణుత,విధిలిఙ్:-స్తృణుయాత్, స్తృణ్వీత. ఆశీర్లిఙ్:- ఇది సంయోగాదిధాతువు గాన "గుణోఽర్తిసంయోగాద్యోః" అని (501) గుణము వచ్చి "స్తర్యాత్, స్తర్యాస్తామ్, స్తర్యాసుః" ఇత్యాదిరూపములు పరస్మైపదమున సిద్ధించును.

652. ఋతశ్చ సంయోగాదేః 7.2.43

ఋదన్తాత్ సంయోగాదేః పరయోర్లిఙ్‌సిచోరిడ్ వా స్యాత్ తఙి. స్తరిషీష-స్తృషీష్ట. అ స్తరిష్ట-అ స్తృత,

'లిఙ్‌సిచోరాత్మనేపదేషు' అను సూత్రము 'ఇట్ సని వా'నుండి 'ఇట్' 'వా' అనువర్తించును. ఋదంతము సంయోగాదియు నగు ధాతువుకంటె పరమైన లిఙ్ సిచ్చులకు ఆత్మనేపదము పర మగునపుడు ఇడాగమము వికల్పముగ వచ్చును. ఆశీర్లిఙ్ ఆత్మనేపదమున, ఈ సూత్రముచే ఇడాగమము వచ్చిన పక్షమున 'స్తృఇసీస్త'అని యుండగా ఆర్ధధాతుకగుణము-'స్తరిసీస్త'-షత్వష్టుత్వములు- 'స్తరిషీష్ట'. ఈ విధముగ ఇడాగమపక్షమున స్తరిషీష్ట, స్తరిషీయా

స్తామ్, స్తరిషీరన్' ఇత్యాదిరూపము లగును. ఇడభావపక్షమున "స్తృషీష్ట స్తృషీయాస్తామ్, స్తృషీరన్" ఇత్యాదిరూపము లగును. 'ఉశ్చ'అను సూత్రముచే (547) లిజ్ కిత్తు గాన గుణము రాలేదు.

లుఙ్ : (పర) :- 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అను (486) వృద్ధి వచ్చి 'అస్తార్షీత్, 'అస్తార్ష్టామ్, అస్తార్షుః' ఇత్యాది రూపము లగును. ఆత్మనేపదమున ఇడ్వికల్పముచే (సూ. 652) అస్తరిష్ట-అస్తృత ఇత్యాది ద్వివిధ రూపము లుండును. ఇట్ వచ్చిన పక్షమున గుణము వచ్చును. ఇట్ రాని పక్షమున 'ఉశ్చ' అను సూత్రముచే (547) కిత్ అగును గాన గుణము రాదు. 'అస్తృత' ఇత్యాదులందు 'హ్రస్వాదఙ్గాత్' అని (548) సకారలోపము.

లృఙ్ :- అస్తరిష్యత్, అస్తరిష్యత "బుద్ధనోః స్యే" అని(500) ఇడాగమము.

**ధూఞ్** కమ్పనే 4 ధూనోతి; ధూనుతే, దుధావ. "స్వరతి-" ఇతి వేట్-దుధవిథ-దుధోథ.

ధూఞ్ ధాతువునకు కంపింపచేయుట అని అర్థము. ఉభయపది. లట్టునందు ధూనోతి, ధూనుతే ఇత్యాది రూపములు సిద్ధించును. 'స్వరతిసూతి సూయతి ధూఞూదితో వా' అను సూత్రముచే (478) ఈ ధాతువు వేట్కము గాన వలాద్యార్ధధాతుకములందు రెండేసి రూపము లుండును, లిట్ :- దుధావ, దుధువతుః, దుధువుః, దుధవిథ-దుదోథ, దుధువథుః, దుధువ; దుధవ-దుధవ, దుధువివ, దుధువిమ. అజాది ప్రత్యయములు పర మగునపుడు 'ఉవఙ్' (199) వచ్చును.

653. శ్ర్యుకః కితి 7.2.11

శ్రిఞః, ఏకాచః, ఉగన్తాచ్చ గిత్ కితోరిణ్ న.

పరమపి స్వరత్యాది వికల్పం బాధిత్వా పురస్తాత్ ప్రతిషేధకాణ్డారమ్భ సామర్థ్యాత్ అనేన నిషేధే ప్రాప్తే క్రాదినియమాత్ నిత్యమిట్. దుధువే. అధావీత్; అధవిష్ట-అధోష్ట. అధవిష్యత్-అధోష్యత్, అధవిష్యతామ్-అధోష్యతామ్, అధవిష్యత-అధోష్యత.

ఇతి స్వాదయః

'అజ్గస్య' అధికారము. 'ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్' నుండి 'ఏకాచః' అనువర్తించును. గ్ చ క్ చ క్నౌ; తౌ ఇతౌ యస్య సః క్నిత్. శ్రిఞ్ ధాతుపుకంటెను, ఏకాచ్క మగు ఉగన్తాంగము కంటెను పర మగు గిత్ కిత్ లకు ఇణ్ రాదు.

ఈ సూత్రముకంటె "స్వరతి సూతి" ఇత్యాది సూత్రము (478)పరము గాన అది దానిని బాధించుటచే, వ, మ, మొదలగు వాటికి ద్వితీయవికల్పమే రావలయును. కాని అట్లయినచో ఈ నిషేధమునకు అవకాశము లేకుండ పోవును. అందుచే పూర్వపఠిత మైనను ఈ నిషేధశాస్త్రము పర మగు స్వరతీత్యాది సూత్రమును గూడ బాధించునని అంగీకరింపవలెను. ఐనను క్రాదినియమముచే వ, మ మొదలగు వాటికి నిత్యముగ ఇడాగమము వచ్చును. ఆత్మనే పదమున "దుధువే, దుధువాతే, దుధువిరే, దుధువిషే" ఇత్యాది రూపములగును. లుట్ :- ధవితా, ధోతా లృట్ :- ధవిష్యతి, ధోష్యతి, ధవిష్యతే-ధోష్యతే. లోట్ :- ధూనోతు; ధూనుతామ్. లఙ్ :- అధూనోత్, అధూనుత విధిలిఙ్ :- ధూనుయాత్; ధున్వీత. ఆశీర్లిఙ్ :- ధూయాత్; ధవిషీష్ట-ధోషీష్ట. లుఙ్గనందు పరస్మైపదమున 'స్వరతి' ఇత్యాది సూత్రముచే (478) ఇడాగమము వికల్పముగ రావలసి యుండ, దానిని బాధించి 'స్తుసుధూఞ్భ్యః పరస్మైపదేషు" అని (649) నిత్యముగ ఇడాగమము. పిమ్మట ఈడాగమము. వృద్ధి ఆవాదేశము చేయగా "అధావీత్, అధావిష్టామ్, అధావిషుః" ఇత్యాది రూపము లగును ఆత్మనేపదమున ఇడ్వికల్పము అధవిష్ట - అధోష్టమొ. లృఙ్ :- అధవిష్యత్-అధోష్యత్, అధవిష్యత-అధోష్యత,

స్వాదిగణము

సమాప్తము

# అథ తుదాదిగణః

తుద వ్యథనే.

654. తుదాదిభ్యః శః 3.1.77

శపోఽపవాదః. తుదతి. తుతోద; తుతోదిథ. తుతుదే. తోత్తా. అతౌత్సీత్. అతుత్త.

తుద్ ధాతువునకు పీడించుట అని యర్థము. ఉభయపది. అనిట్.

తుదాదులకంటె (కర్త్రర్థసార్వధాతుకము పర మగునపుడు) 'శ' ప్రత్యయము వచ్చును.

ఇది 'శప్'కు అపవాదము, శిత్తు గాన సార్వధాతుకము. 'అపిత్' గాన ఙిద్వద్భావ ముండుటచే ఇది పర మగునపుడు గుణము రాదు.

లట్:- తుదతి; తుదతే. లిట్:- "తుతోద; తుతుదతుః, తుతుదుః, తుతోదిథ...తుతుదివ, తుతుదిమ". క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము, (ఆత్మ):- 'తుతుదే, తుతుదాతే, తుతుదిరే'. మొ. లుట్:— తోత్తా. దకారమునకు చర్త్వము. ల్ఋట్:- తోత్స్యతి-తోత్స్యతే. లోట్:- తుదతు; తుదతామ్. విధిలిఙ్:- తుదేత్; తుదేత. ఆశీర్లిఙ్:- తుద్యాత్; తుత్సీష్ట.

లుఙ్ పరస్మైపదము:- 'సిచి వృద్ధిః పరస్మైపదేషు' అని (486) వృద్ధి. అతౌత్సీత్, అతౌత్తామ్. ('ఝలోఝలి' అని (448) సకారలోపము), అతౌత్సుః; అతౌత్సీః, అతౌత్తమ్, అతౌత్త! అతౌత్సమ్, అతౌత్స్వ, అతౌత్స్మ. ఆత్మనేపదము:- అతుత్త. అతుత్సాతామ్. అతుత్సత; అతుత్థాః; అతుత్సాథామ్, అతుద్ధ్వమ్; అతుత్సి, అతుత్స్వహి, అతుత్స్మహి. ల్ఋఙ్ :- అతోత్స్యత్; అతోత్స్యత.

ణుద ప్రేరణే. 2. నుదతి; నుదతే, నునోద. నోత్తా,

ణుద ధాతువునకు ప్రేరేపించుట అని అర్థము. ఉభయపది. అనిట్. ఎ రూపములు తుదధాతు రూపములవలె నుండును.

భస్జ పాకే. 3. 'గ్రహిజ్యా-' ఇతి సమ్ప్రసారణమ్. సస్య
శః. శస్య జ_శ్త్వేన జః-భృజ్జతి; భృజ్జతే.

స్జ్ ధాతువునకు వండుట అని అర్థము. శనగలు మొదలగు వాటిని
అను నర్థమున ప్రయోగింపబడుచున్నది. అనిట్. ఉభయపది. 'శ'
ము కిత్ గాన అది పరముగ నున్నపుడు "గ్రహిజ్యా-" ఇత్యాది
చే (637) రేఫకు సంప్రసారణము (ఋకారము). పూర్వరూపము-
అని యుండగా సకారమునకు శ్చుత్వముచే శకారము. దానికి "ఝలాం
' అను సూత్రముచే (19) జ_శ్త్వము చేయగా జకారము. లట్ :-
భృజ్జతః, భృజ్జన్తి' మొ. 'భృజ్జతే, భృజ్జేతే, భృజ్జన్తే' మొ.

. భ్రస్జో రోపధయో రమన్యా తరస్యామ్. 6.4.47

భ్రస్జే రేఫస్యో పధాయాశ్చ స్థానే 'రమ్' ఆగమో వా స్యాత్,
కే. మి_త్త్వాద_న్త్యాదచః పరః. స్థానషష్ఠీనిర్దేశాత్ రోపధయో
ః, బభర్జ, బభర్జతుః, బభర్జిథ-బభర్ష్ఠ, బభ్రజ్జ, బభ్రజ్జతుః;
'స్కోః-' ఇతి సలోపః, 'వ్రశ్చ' ఇతి షః, బభ్రష్ఠ, బభర్జే
ర్ష్టా-భ్రష్టా. భర్క్ష్యతి, భ్రక్ష్యతి.

ర్ధధాతుకే' అధికారము. అర్ధధాతుకము పర మగునపుడు భ్రస్జ్
షోపధల స్థానమున 'రమ్' ఆగమము వికల్పముగ వచ్చును.
మ్'లోని అకారమకారములు ఇత్సంజ్ఞకములు. 'ణల్' పర మగు
భస్జ్ అ' అని యుండగా ఈ సూత్రముచే రమ్ ఆగమము. మిత్తు
అకారమునకు పరముగ వచ్చును. ఈ సూత్రమున 'రోపధయోః'
షష్ఠి ఉపయోగింపబడినది. ఈ స్థానషష్ఠీ ప్రయోగ సామర్థ్యముచే
మునది ఆదేశము కాకున్నను రేఫోపధలు నివర్తించును. అనగా ఇచట
దేశము (ర్) 'భ్ర' అనుదానిలోని అకారమునకు పరముగ వచ్చినది;
ముగ నున్న రేఫయు, ఉపధాక్షర మగు సకారమును, లోపించినవి-
అని యున్నది. ద్విత్వాభ్యాస కార్యాదులచే 'బభర్జ' అను రూపము
. బభర్జతుః- 'భ్రస్జ్అతుస్' అని యుండగా పైవిధముగనే ప్రక్రియ
.
ల్'కు భారద్వాజ నియమముచే ఇడాగమ వికల్పము. ఇడాగమము

భ్రస్జ పాకే. 3. 'గ్రహిజ్యా-' ఇతి సమ్ప్రసారణమ్. సస్య శ్చుత్వేన శః. శస్య జశ్త్వేన జః-భృజ్జతి; భృజ్జతే.

భ్రస్జ్ ధాతువునకు వండుట అని అర్థము. శనగలు మొదలగు వాటిని వేయించుట అను నర్థమున ప్రయోగింపబడుచున్నది. అనిట్. ఉభయపది. 'శ' ప్రత్యయము కిత్ గాన అది పరముగ నున్నపుడు "గ్రహిజ్యా-" ఇత్యాది సూత్రముచే (637) రేఫకు సంప్రసారణము (ఋకారము). పూర్వరూపము- 'భృస్జ్ అ' అని యుండగా సకారమునకు శ్చుత్వముచే శకారము. దానికి "ఝలాం జశ్ ఝశి" అను సూత్రముచే (19) జశ్త్వము చేయగా జకారము. లట్ :- 'భృజ్జతి, భృజ్జతః, భృజ్జన్తి' మొ. 'భృజ్జతే, భృజ్జేతే, భృజ్జన్తే' మొ.

655. భ్రస్జో రోపధయో రమన్యతరస్యామ్. 6.4.47

భ్రస్జే రేఫస్యోపధాయాశ్చ స్థానే 'రమ్' ఆగమో వా స్యాత్, ఆర్ధధాతుకే. మిత్త్వాదన్త్యాదచః పరః. స్థానషష్ఠీనిర్దేశాత్ రోపధయోర్నివృత్తిః, బభర్జ, బభర్జతుః, బభర్జిథ-బభర్ష్ఠ, బభ్రజ్జ, బభ్రజ్జతుః; బభ్రజ్జిథ, 'స్కోః-' ఇతి సలోపః, 'వ్రశ్చ' ఇతి షః, బభ్రష్ఠ, బభర్జే బభ్రజ్జే. భర్ష్టా-భ్రష్టా. భర్క్ష్యతి, భ్రక్ష్యతి.

'ఆర్ధధాతుకే' అధికారము. అర్ధధాతుకము పర మగునపుడు భ్రస్జ్ ధాతువు రేఫోపధల స్థానమున 'రమ్' ఆగమము వికల్పముగ వచ్చును.

'రమ్'లోని అకారమకారములు ఇత్సంజ్ఞకములు. 'ణల్' పర మగునపుడు 'భ్రస్జ్ అ' అని యుండగా ఈ సూత్రముచే రమ్ ఆగమము. మిత్తు గాన ఇది అకారమునకు పరముగ వచ్చును. ఈ సూత్రమున 'రోపధయోః' అని స్థానషష్ఠి ఉపయోగింపబడినది. ఈ స్థానషష్ఠీ ప్రయోగ సామర్థ్యముచే 'రమ్' అనునది ఆదేశము కాకున్నను రేఫోపధలు నివర్తించును. అనగా ఇచట 'రమ్' ఆదేశము (ర్) 'భ్ర' అనుదానిలోని అకారమునకు పరముగ వచ్చినది; స్వతస్సిద్ధముగ నున్న రేఫయు, ఉపధాక్షర మగు సకారమును, లోపించినవి 'భర్జ్ అ' అని యున్నది. ద్విత్వాభ్యాస కార్యాదులచే 'బభర్జ' అను రూపము సిద్ధించును. బభర్జతుః- 'భ్రస్జ్ అతుస్' అని యుండగా పైవిధముగనే ప్రక్రియ యుండును.

'థల్'కు భారద్వాజ నియమముచే ఇడాగమ వికల్పము. ఇడాగమము

వచ్చిన పక్షమున 'బభర్జిథ' అను రూప మగును. తదభావ పక్షమున 'బభర్జ్థ' అని యుండగా జకారమునకు "వ్రశ్చ-" సూత్రముచే (308) షకారము. థకారమునకు ష్టుత్వముచే ఠకారము- 'బభర్ష్ఠ' ఇచట లిట్ సంయోగముకంటె పర మగుటచే అపిత్ లిట్టుకు కూడ 'అసంయోగాల్లిట్ కిత్' అని (451) కిత్త్వము వచ్చుటకు అవకాశము లేదు. అందుచే "గ్రహిజ్యా-" ఇత్యాది సూత్రముచే (637) సంప్రసారణ ప్రసక్తి లేదు.

ఈ విధముగ 'రమ్' ఆదేశపక్షమున బభర్జ, బభర్జతుః, బభర్జుః; బభర్జిథ-బభర్ష్ఠ, బభర్జథుః, బభర్జ; బభర్జ, బభర్జివ, బభర్జిమ" అను రూపము లగును.

'రమ్' రాని పక్షమున 'భ్రస్జ' అనుదానికి ద్విత్వాభ్యాస కార్యాదులు చేసిన పిమ్మట 'బభ్రస్జ్ అ' అని యుండగా సకారమునకు శ్చుత్వముచే జకారము; దానికి జశ్త్వముచే జకారము వచ్చి 'బభ్రజ్జ' అను రూపము అగును. బభ్రజ్జతుః :- పైన చూపిన విధముగ ప్రక్రియ యుండును. బభ్రజ్జిథ :- భారద్వాజ నియమముచే వైకల్పిక ఇడాగమ పక్షమున ఈ రూపము సిద్ధించును. ఇడభావ పక్షమున 'బభ్రస్జ్థ' అని యుండగా - "స్కోస్సంయోగాద్యోరన్తే చ" అను సూత్రముచే (310) సకారలోపము. జకారమునకు వ్రశ్చేత్యాది సూత్రముచే (308) షకారము. థకారమునకు ష్టుత్వముచే ఠకారము. 'బభ్రష్ఠ' అను రూపము సిద్ధించును. బభ్రజ్జథుః, బభ్రజ్జ; బభ్రజ్జ, బభ్రజ్జివ, బభ్రజ్జిమ.

ఆత్మనేపదమునందు కూడ రమ్వికల్పముచే "బభర్జే; బభర్జాతే, బభర్జిరే'', "బభ్రజ్జే, బభ్రజ్జాతే, బభ్రజ్జిరే'' ఇత్యాది ద్వివిధరూపము లగును.

భర్ష్టా :- లుట్నందు 'తాస్' ప్రత్యయ ఆదేశాదులు చేసిన పిమ్మట 'భస్జ్ తా' అని యుండగా 'రమ్' ఆదేశ రేఫోపధాలోపములు - భర్జ్తా. జకారమునకు వ్రశ్చేత్యాది సూత్రముచే (308) షత్వము. తకారమునకు ష్టుత్వముచే టకారము. 'భర్ష్టా' అను రూపము సిద్ధించును. ఇట్లే 'భర్ష్టారౌ, భర్ష్టారః' ఇత్యాది రూపములు కూడ సిద్ధించును'

భ్రష్టా :- 'రమ్' రాని పక్షమున 'భ్రస్జ్తా' అని యుండగా సకారమునకు లోపము (సూ. 310). జకార తకారములకు షత్వష్టుత్వములు. "భ్రష్టారౌ, భ్రష్టారః" ఇత్యాది రూపములు కూడ ఈ విధముగనే సిద్ధించును. భర్క్ష్యతి :- లృట్టునందు 'స్య' ప్రత్యయము చేసిన పిమ్మట 'భ్రస్జ్

స్యతి' అని యుండగా 'రమ్' ఆగమము - 'భర్ జ్ స్యతి' జకారమునకుషత్వము, మొదటి షకారమునకు "షఢోః కః సి" అను సూత్రముచే (551) కకారము, సకారమునకు మూర్ధన్యాదేశము - "భర్క్ష్యతి" అను రూపము సిద్ధించును. ఇట్లే "భర్క్ష్యతః, భర్క్ష్యన్తి" ఇత్యాది రూపములు సిద్ధించును.

భ్రక్ష్యతి :- 'రమ్' రాని పక్షమున 'భ్రస్ జ్ స్యతి' అని యుండగా సకారమునకు సంయోగాది లోపము (సూ.310) జకారమునకు షత్వకత్వములు. సకారమునకు షత్వము. 'భ్రక్ష్యతి' అను రూపము సిద్ధించును. 'భ్రక్ష్యతః', 'భ్రక్ష్యన్తి' ఇత్యాది రూపముల సిద్ధి కూడ ఇట్లే ఉండును. ఆత్మనేపదము నందు గూడ ఈ విధముగనే 'భర్క్ష్యతే' 'భ్రక్ష్యతే' ఇత్యాది ద్వివిధరూపము లుండును.

లోట్ మొదలగు సార్వధాతుక లకారములు పర మగునపుడు సంప్రసారణము వచ్చును. లోట్ :- భృజ్జతు, భృజ్జతామ్, లఙ్ :- అభృజ్జత్; అభృజ్జత విధిలిఙ్ ;- భృజ్జేత్. భృజ్జేత.

*వా. క్ఙితి రమాగమం బాధిత్వా సమ్ప్రసారణం పూర్వవిప్రతిషేధేన.*

భృజ్యాత్, భృజ్యాస్తామ్, భృజ్యాసుః. భర్ష్టి-భ్రష్టి. అభార్క్షీత్-అభ్రాక్షీత్, అభర్ష్ట-అభ్రష్ట.

కిత్తు గాని ఙిత్తు గాని అయిన ఆర్ధధాతుక ప్రత్యయము పరమగునపుడు పూర్వవిప్రతిషేధముచే రమ్ ఆగమమును బాధించి సంప్రసారణము వచ్చును.

భృజ్యాత్ :- ఆశీర్లిఙ్ నందు "భ్రస్జ్ యాస్ త్" అని యుండగా "కిదాశిషి" అను సూత్రముచే (434) యాసుట్ కిత్తు గాన 'గ్రహిజ్యా-' అను సూత్రముచే (637) సంప్రసారణము రావలసి యున్నది. 'లిఙ్ ఆశిష్' అను సూత్రముచే (433) ఆశీర్లిఙ్ స్థానమున వచ్చిన 'తిఙ్'లు ఆర్ధధాతుకములు గాన 'రమ్' ఆగమము రావలసి యున్నది (సూ. 655). ఈ రెండు శాస్త్రములలో 'రమ్' విధాయక శాస్త్రము పరమైనది. అందుచే "విప్రతిషేధే పరం కార్యమ్" (113) అను నియమము ననుసరించి రమ్ ఆగమమే రావలసి యుండగా 'విప్రతిషేధే అపరం' అను పదచ్ఛేదమును అనుసరించి ఇచట అపర కార్య (పూర్వకార్య) మగు సంప్రసారణమే చేయవలె నని ఈ వార్తికము చెప్పు

చున్నది. ఈ విధముగ సంప్రసారణము చేసిన పిమ్మట "భృస్జ్యాత్" అని యుండగా సకారమునకు శ్చుత్వజశ్త్వములు - "భృజ్జ్యాత్" అను రూపము సిద్ధించును. ఈ విధముగనే "భృజ్జ్యాస్తామ్, భృజ్యాసుః," ఇత్యాది రూప సిద్ధి యుండును. ఇట్లు పరస్మైపదమున ఆశీర్లిఙ్గనందు 'రమ్' ఆగమయుక్త రూపము లుండవు. భర్క్షీష్ట-భ్రక్షీష్ట. ఆత్మనేపదమున (ఆశీర్లిఙ్గనందు) సీయుడాగమము చేసిన పిమ్మట 'రమ్' ఆగమము చేసిన పక్షమున 'భర్క్షీష్ట' ఇత్యాది రూపములును, 'రమ్' రాని పక్షమున 'భ్రక్షీష్ట' ఇత్యాది రూపములునుఅగును. ప్రక్రియ 'భర్క్ష్యతి' 'భ్రక్ష్యతి' ఇత్యాదులందు వలె నుండును.

అభార్క్షీత్ :- లుఙ్నందు పరస్మైపదమున 'రమ్' వచ్చిన పక్షమున 'అభర్జ్ స్ త్' అని యుండగా 'వదవ్రజహలన్తస్యాచః' అను సూత్రముచే (467) వృద్ధి. జకారమునకు షకారము, షకారమునకు కకారము. సిజవయవ సకారమునకు షకారము; అపృక్త తకారమునకు ఈడాగమము - 'అభార్క్షీత్' సిద్ధించును. అభార్క్షీత్, అభార్ష్టామ్, అభార్క్షుః; అభార్క్షీః, అభార్ష్టమ్, అభార్ష్ట, అభార్క్షమ్, అభార్క్ష్వ, అభార్క్ష్మ.

అభ్రాక్షీత్ :- 'రమ్' రాని పక్షమున 'అభ్రస్జ్సత్' అని యుండగా సకారమునకు సంయోగాది లోపము. పైవలె వృద్ధ్యాదులు వచ్చి 'అభ్రాక్షీత్' సిద్ధించును. అభ్రాక్షీత్, అభ్రాష్టామ్, అభ్రాక్షుః; అభ్రాక్షీః, అభ్రాష్టమ్, అభ్రాష్ట; అభ్రాక్షమ్, అభ్రాక్ష్వ, అభ్రాక్ష్మ.

అభర్ష్ట :- లుఙ్నందు ఆత్మనేపదమున 'అభ్రస్జ్సత' అని యుండగా రమ్ ఆగమము. రేఫ ఉపధల లోపము-'అభర్జ్సత' - 'ఝలోఝలి' అని (480) సకారమునకు లోపము. జకారమునకు షత్వము; తకారమునకు ష్టుత్వముచే టకారము. 'అభర్ష్ట' సిద్ధించును. అభర్ష్ట, అభర్క్షాతామ్, అభర్క్షత; అభర్ష్ఠాః, అభర్క్షాథామ్, అభర్ధ్వమ్, అభర్క్షి, అభర్క్ష్వహి, అభర్క్ష్మహి.

అభ్రష్ట:- రమభావ పక్షమున 'అభ్రస్జ్సత' అని యుండగా సకారమునకు సంయోగాది లోపము. రెండవ సకారమునకు లోపము (సూ. 480)

జకారమునకు షకారము, తకారమునకు ష్టుత్వముచే టకారము - 'అభ్రష్ట' సిద్ధించినది. అభ్రష్ట, అభ్రక్షాతామ్, అభ్రక్షత; అభ్రష్ఠాః, అభ్రక్షాథామ్, అభ్రగ్ధ్వమ్, అభ్రక్షి, అభ్రక్ష్వహి, అభ్రక్ష్మహి. లృఙ్ :- అభర్క్ష్యత్-అభ్రక్ష్యత్, అభర్క్ష్యత, అభ్రక్ష్యత.

కృష విలేఖనే. 4. కృషతి; కృషతే. చకర్ష; చకృషే.

కృష్ ధాతువునకు నాగలితో వ్రాయుట (దున్నుట), లాగుట అని యర్థములు. ఉభయపది. అనిట్. లట్ :- కృషతి, కృషతే, చకర్ష :- పరస్మైపదమున లిట్టునందు తిప్, ణల్, ద్విత్వము, అభ్యాస ఋకారమునకు అత్వము. అభ్యాసకార్యము; రెండవ ఋకారమునకు గుణముచే 'అర్'-'చకర్ష' అను రూపము సిద్ధించినది. చకర్ష, చకృషతుః, చకృషుః, చకర్షిథ, చకృషథుః, చకృష; చకర్ష, చకృషివ, చకృషిమ. క్రాదినియమముచే వలాది ప్రత్యయములకు ఇడాగమము నిత్యముగ వచ్చినది.

చకృషే :- 'ఋదుపధేభ్యో లిటః కిత్త్వం గుణాత్ పూర్వవిప్రతిషేధేన' అను నియమముచే కిత్వము ముందుగ వచ్చును గాన గుణము లేదు. చకృషే, చకృషాతే, చకృషిరే, చకృషిషే, చకృషాథే, చకృషిధ్వే; చకృషే, చకృషివహే, చకృషిమహే.

656. అనుదాత్తస్య చర్దుపధస్యాన్యతరస్యామ్ 6.1.59

ఉపదేశేఽనుదాత్తో య ఋదుపధః, తస్య 'అమ్'వా స్యాద్ ఝలాదౌ అకితి. క్రష్టా. కర్ష్టా. కృక్షీష్ట.

అనుదాత్తస్య, చ, ఋదుపధస్య, అన్యతరస్యామ్- "సృజిదృశోర్ఝల్యమకితి" "ఆదేచ ఉపదేశేఽశితి" అను సూత్రములనుండి 'ఝలి' 'అమ్' 'అకితి' 'ఉపదేశే' అనువర్తించును. ఉపదేశమునందు అనుదాత్తమును హ్రస్వ ఋకారము ఉపధగా కలదియు నగు ధాతువునకు ఝలాదియు, కిద్భిన్నమును అగు ప్రత్యయము పర మగునపుడు 'అమ్' ఆగమము వికల్పముగ వచ్చును.

క్రష్టా :- లుట్‌నందు 'కృష్ తా' అని యుండగా 'కృష్' అనునది ఉపదేశమునందు అనుదాత్తము ఋదుపధము నగు ధాతువు గాన దీనికి 'తా' అను ఝలాది ప్రత్యయము పరముగ నుండుటచే ('తా' కిత్తు కాదు) ఈ సూత్ర

ముచే 'అమ్' ఆగమము వచ్చును. మిత్తు గాన ఋకారమునకు పరముగ వచ్చును. 'కృఅష్‌తా' అని యుండగా యణాదేశము (ర్)- 'క్రష్‌తా'. ష్టుత్వము - 'క్రష్టా' అను రూపము సిద్ధించును. ఇట్లే 'క్రష్టారౌ', 'క్రష్టారః' ఇత్యాది రూపములు సిద్ధించును.

'అమ్' రాని పక్షమున 'కృష్ తా' అని యుండగా గుణము (సూ. 453) 'కర్ష్‌తా'. ష్టుత్వము - 'కర్ష్టా-కర్ష్టారౌ, కర్ష్టారః' ఇత్యాది రూపములగును.

లృట్‌నందు కూడ అమాగమము వచ్చి నపుడు "క్రక్ష్యతి; క్రక్ష్యతే" ఇత్యాది రూపములును, తదభావపక్షమున 'కర్క్ష్యతి, కర్క్ష్యతే' ఇత్యాది రూపములును అగును. "షఢోః కస్సి" అను సూత్రముచే (551) కకారము. లోట్; కృషతు, కృషతామ్. లఙ్ :- అకృషత్; అకృషత. విధిలిఙ్ :- కృషేత్, కృషేత. ఆశీర్లిఙ్ :- "కృష్యాత్, కృష్యాస్తామ్" మొ. ఆత్మనేపదమున : కృక్షీష్ట. ఇచట 'కృష్ సీ స్ త' అని యుండగా షకారమునకు కకారము. రెండు సకారములకును షత్వము. తకారమునకు ష్టుత్వముచే టకారము'కృక్షీష్ట' సిద్ధించినది. ఆశీర్లిఙ్ కిత్తుగాన (సూ. 592) అమ్ (సూ. 656), గుణాదులు రాలేదు. కృక్షీష్ట, కృక్షీయాస్తామ్, కృక్షీరన్; కృక్షీష్ఠాః, కృక్షీయాస్థామ్ కృక్షీధ్వమ్; కృక్షీయ, కృక్షీవహి, కృక్షీమహి.

వా. స్పృశ మృశ కృష తృప దృపాంచ్లేః సిజ్వా వాచ్యః.

అక్రాక్షీత్-అకార్క్షీత్-అకృక్షత్. అకృష్ట, అకృక్షాతామ్, అకృక్షత. కృపక్షే-అకృక్షత, అకృక్షాతామ్, అకృక్షన్త.

స్పృశ్, మృశ్, కృష్, తృప్, దృప్ ధాతువుల 'చ్లి'కి సిచ్ వికల్పముగ చెప్పతగినది.

కృష్ ధాతువు ఇగుపధమును శలన్తమును అగు అనిడ్ధాతువు గాన "శల ఇగుపధాదనిటః క్సః" అను సూత్రముచే (593) 'క్స' ప్రత్యయము రావలసియుండ ఈ వార్తికముచే 'సిచ్' వికల్పముగ విధింపబడుచున్నది. 'సిచ్'వచ్చెడి పక్షమున అమాగమము వికల్పముగ వచ్చును గాన 'అమ్' వచ్చినచో 'అక్రాక్షీత్, అక్రాష్టామ్, అక్రాక్షుః' ఇత్యాది రూపము లగును. 'అమ్' రానిచో "అకార్క్షీత్, అకార్ష్టామ్, అకార్క్షుః" ఇత్యాది రూపములు అగును. "వదవ్రజ హలన్తస్యాచః' అను సూత్రముచే (467) వృద్ధి. 'సిచ్' రాని పక్షమున 'క్స'

ప్రత్యయము వచ్చును. 'క్స' కిత్తు గాన 'అమ్' రాదు. "అకృక్షత్, అకృక్ష తామ్, అకృక్షన్" ఇత్యాది రూపము లగును.

అకృష్ట :- ఆత్మనేపదమున సిచ్ వచ్చిన పక్షమున 'అకృష్స్త' అని యుండగా 'ఝలోఝలి' అని (480) సకార లోపము. తకారమునకు ష్టుత్వము. 'సిచ్' కిత్తు గాన (సూ. 592) అమ్ గుణాదులు రావు. అకృష్ట, అకృక్షాతామ్, అకృక్షత; అకృష్ఠాః, అకృక్షాథామ్, అకృడ్ఢ్వమ్, అకృక్షి, అకృక్ష్వహి, అకృక్ష్మహి' 'సిచ్' రాని పక్షమున 'క్స' ప్రత్యయమువచ్చును. అకృక్షత, అకృక్షాతామ్, అకృక్షన్త; అకృక్షథాః, అకృక్షాథామ్, అకృడ్ఢ్వమ్, అకృక్షి, అకృక్షావహి, అకృక్షామహి. 'సిచ్' 'క్స' ప్రత్యయములు చేసినపుడు కొన్ని రూపములు ఒకేవిధముగ నున్నను ప్రక్రియలో భేదమున్నది.

లృఙ్ :- అమ్ పక్షమున - 'అక్రక్ష్యత్. అక్రక్ష్యత' అమభావపక్ష మున :- అకర్క్ష్యత్, అకర్క్ష్యత.

మిల సఙ్గమే. 5. మిలతి, మిలతే, మిమేల, మేలితా, అమేలీత్. ముచ్లృ మోచనే. 6.

మిల ధాతువునకు కలియుట అని అర్థము. సేట్. ఉభయపది. ఇందు విశేషకార్యము లేవియు లేవు. మిలతి; మిలతే, మిమేల; మిమిలే. మేలితా మిలిష్యతి, మిలిష్యతే, మిలతు; మిలతామ్, అమిలత్, అమిలత. మిలేత్ మిలేత, మిల్యాత్; మిలిషీష్ట. అమేలీత్; అమేలిష్ట. అమేలిష్యత్; అమేలిష్యత.

6. ముచ్లృ ధాతువునకు విడచుట అని అర్థము. అనిట్. ఉభయపది.

657. శే ముచాదీనామ్ 7.1.59

ముచ్-లిప్-విద్-లుప్-సిఞ్-కృత్-ఖిద్-పిశాం నుమ్ స్యాత్ శే పరే. ముఞ్చతి, ముఞ్చతే. మోక్తా. ముక్షీష్ట. అముచత్; అముక్త, అముక్షాతామ్.

'ఇదితో నుమ్ ధాతోః' నుండి 'నుమ్' అనువర్తించును. 'ముచ్' మొదలగు ఎనిమిది ధాతువులకును 'శ' పర మగునపుడు నుమాగమము వచ్చును.

'నుమ్'లోని ఉకారమకారములు ఇత్సంజ్ఞకము. మిత్తు గాన అంత్యాచ్చునకు పరముగ వచ్చును.

ముఞ్చతి, ముఞ్చతే :- లట్టునందు 'ముచ్ అతి' 'ముచ్ అ త' అని యుండగా ఈ సూత్రముచే నుమాగమము. "మున్చ్ అ" అని యుండగా నకారమునకు అనుస్వారము (సూ. 78): దానికి పర సవర్ణమగు ఞకారము (సూ. 79) - 'ముఞ్చతి, ముఞ్చతే' అను రూపము లగును. లిట్ :- ముమోచ, ముముచే; లుట్ :- మోక్తా లృట్ :- మోక్ష్యతి, మోక్ష్యతే. లోట్ :- ముఞ్చతు; ముఞ్చతామ్. లఙ్ :- అముఞ్చత్, అముఞ్చత. విధిలిఙ్ :- ముఞ్చేత్, ముఞ్చేత. ఆశీర్లిఙ్ :- ముచ్యాత్, ముచ్యాస్తామ్ ముచ్యాసుః' మొ.

ముక్షీష్ట :- ఆత్మనేపదమున 'సీయుట్' కిత్తుగాన (సూ. 592) గుణము రాదు. చకారమునకు కుత్వముచే (సూ. 307) కకారము. సకారమునకు షత్వము. "ముక్షీష్ట, ముక్షీయాస్తామ్, ముక్షీరన్" మొ. ఈధాతువు ఇదిత్ గాన లుఙ్నందు పరస్మైపదమున "పుషాదిద్యుతా ద్యదితః పరస్మైపదేషు" అను సూత్రముచే (510) 'అఙ్' ఆదేశము వచ్చును. "అముచత్, అముచతామ్, అముచన్" మొదలగు రూపము లగును. అముక్త :- 'అముచ్‌స్‌త' అని యుండగా 'సిచ్'కు 'ఝలో ఝలి' అను సూత్రముచే (480) లోపము. చకారమునకు కుత్వము. అముక్త, అముక్షాతామ్, అముక్షత; అముక్థాః, అముక్షాథామ్, అముగ్ధ్వమ్; అముక్షి, అముక్ష్వహి, . అముక్ష్మహి. లృఙ్ :- అమోక్ష్యమ్; అమోక్ష్యత.

లుప్లృ ఛేదనే. 7. లుమ్పతి; లుమ్పతే. లోప్తా. అలుపత్;అలుప్త.

లుప్లృ ధాతువునకు ఛేదించుట అని అర్థము. అనిట్. ఉభయపది ఇది ముచాదులలో చేరుటచే 'శ' పర మగునపుడు నుమాగమము వచ్చును. అది అనుస్వారమై పరసవర్ణముచే మకారముగ మారును ఇదిత్ గాన లుఙ్నందు అఙాదేశము కూడ వచ్చును. ఈవిధముగ దీని ప్రక్రియ యంతయు ముచ్‌ధాతు ప్రక్రియవలె నుండును.

విద్లృ లాభే. 8. విన్దతి; విన్దతే, వివేద; వివిదే, వ్యాఘ్రభూతి మతే సేట్, వేదితా, భాష్యమతే అనిట్ - పరివేత్తా. షిచక్షరణే 9, సిఞ్చతే.

విదధాతువునకు పొందుట అని అర్థము. ఇది కూడ ముచాదులలో చేరిన దగుటచే నుమాగమము; 'ఇదిత్' అగుటచే అజాదేశము వచ్చును. ప్రక్రియ యంతయు ముచ్‌ధాతు ప్రక్రియ వలె నుండును. కాని ఈ ధాతువు అనిట్ అని భాష్యకారాదుల మతము. వ్యాఘ్రభూత్యాదులగు కొందరు ప్రాచీనవైయాకరణులు దీనిని సేట్ అని అంగీకరించిరి. ఈ విధముగ మతభేదముచే వలాద్యార్ధధాతు కములందు రెండేసి రూపము లుండును. లిట్ :– (పర) వివేదిథ – వివేత్థ. వివిదివ – వివిద్వ; వివిదిమ – వివిద్మ. (ఆత్మ) వివిదిషే – వివిత్సే. వివిదిధ్వే – వివిద్ధ్వే మొ.

లుట్ :- వేదితా – వేత్తా. లృట్ :- వేదిష్యతి – వేదిష్యతే, వేత్స్యతి–వేత్స్యతే, ఆశీర్లిఙ్ :- (పర) విద్యాత్ (ఆత్మనే) వేదిషీష్ట–విత్సీష్ట. లుఙ్ :- (పర) 'అఙ్' వచ్చుటచే 'అవిదత్' మొ. ఆత్మ అవేదిష్ట అవిత్త. లృఙ్ :- అవేదిష్యత్–అవేత్స్యత్, అవేదిష్యత–అవేత్స్యత.

పరివేత్తా :- ఇది తృజంతరూపము. భాష్యకారమతమున వలాద్యార్ధధాతు కమునకు ఇడాగమము రాదు అను దానికి ప్రమాణముగ ఈ భాష్యకారప్రయోగము చూపబడినది. జ్యేష్ఠసోదరునికంటె ముందుగ వివాహమాడినవాడు పరివేత్త.

9. షిచ ధాతువునకు తడుపుట అని యర్థము. అనిట్. ఉభయపది. 'ధాత్వాదేః షః సః' అను సూత్రముచే (255) షకారమునకు సకారమువచ్చును. అందుచే ఇణ్‌కంటె పరమైనపుడెల్ల 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రముచే (150) షకారము వచ్చుచుండును. ఇది ముచాది ధాతువులలో చేరినది గాన నుమ్ వచ్చును. అనుస్వార పరసవర్ణములచే నకారము ఞకారమగును. దాని ప్రక్రియ యంతయు ముచ్‌ధాతువునందువలె నుండును. లుఙ్‌నందు మాత్రము విశేష కార్యము చెప్పబడుచున్నది.

658. లిపిసిచి హ్వాశ్చ 3.1.53

ఏభ్యశ్చ్లే రఙ్ స్యాత్, అసిచత్.

'చ్లే స్సిచ్' "అస్యతి వక్తి ఖ్యాతిభ్యోఽఙ్" అను సూత్రములనుండి 'చ్లేః' 'అఙ్' అనువర్తించును. లిప్, సిచ్, హ్వా (ఞ్) ధాతువులకంటె పరమైన 'చ్లి'కి అఙ్ ఆదేశము వచ్చును.

ఈ సూత్రముచే అజ్ చేయగా లుఙ్లనందు, (పరస్మైపదమున) 'అసిచత్, అసిచతామ్, అసిచన్' ఇత్యాది రూపము లుండును.

659. ఆత్మనేపదేష్వన్యతరస్యామ్ 3.1.54

లిపిసిచిహ్వః పరస్య చ్లేరఙ్ వా తి జే. అసిచత—అసిక్త.

పై సూత్రము అనువృత్తపదములతో అనువర్తించును, ఆత్మనేపద ప్రత్యయములు పర మగునపుడు లిప్, సిచ్, హ్వే ధాతువులకంటె పర మైన 'చ్లి'కి అఙాదేశము వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే అఙాదేశము వచ్చిన పక్షమున- అసిచత, అసిచేతామ్ అసిచన్త ఇత్యాది రూపము లగును. అఙాదేశము రాని పక్షమున "అసిక్త, అసిక్షాతామ్, అ సిక్షత; అసిక్థాః, అసిక్షాథామ్, అసిగ్ధ్వమ్; అసిక్షి, అసిక్ష్వహి, అసిక్ష్మహి." 'త్' మొదలగు ఝల్ పర మగునపుడు 'సిచ్'కు లోపము (సూ. 480) వచ్చి 'అసిక్త' 'అసిక్థాః' ఇత్యాది రూపములైనవి. ఇతర స్థలములలో చకారమునకు కుత్వముచే కకారము, దానికంటె పర మగుటచే సకారమునకు షకారము వచ్చినది.

లిప ఉపదేహే. ఉపదేహో వృద్ధిః. లిమ్పతి; లిమ్పతే. లేప్తా. అలిపత్; అలిపత-అలిప్త. ఇతి ఉభయపదినః.

లిప్ ధాతువునకు ఉపదేహము అని యర్థము. ఉపదేహ మనగా వృద్ధి పొందుట. అనగా ఈ ధాతువునకు మెత్తుట అని యర్థము. గోడ మొదలగు వాటిని మెత్తినచో వృద్ధి కలుగును కదా. అనిట్. ఉభయపది. దీని ప్రక్రియ యంతయు 'సిచ్' ధాతు ప్రక్రియ వలె నుండును.

కృతీ ఛేదనే. 11. కృన్తతి. చకర్త.కర్తితా.కర్తిష్యతి-కర్త్స్యతి. అకర్తీత్, ఖిద పరిఘాతే. 12. ఖిన్దతి. చిఖేద. ఖేత్తా. పిశ అవయవే, 13. పింశతి. పేశితా.

కృతీ ధాతువునకు ఛేదించుట అని యర్థము. ఈకారము ఇత్సంజ్ఞకము. పరస్మైపది సేట్. ఇది ముచాదులలో చేరుటచే 'నుమ్' వచ్చును. లట్:- కృన్తతి. లిట్:- "చకర్త, చకృతతుః, చకృతుః; చకర్తిథ" మొ లుట్: కర్తితా. ల్నట్:- ఇడ్వికల్పము (సూ-633) కర్తిష్యతి-కర్త్స్యతి, లోట్:-

కృన్తతు. లఙ్:- అకృన్తత్, విధిలిఙ్:- కృన్తేత్. ఆశీర్లిఙ్- కృత్యాత్. లుఙ్:- అకర్తీత్. లృఙ్:- అకర్తిష్యత్-అకర్త్స్యత్.

12. ఖిద్ధాతువునకు ఖేదపెట్టుట అని యర్థము. అనిట్. పరస్మైపది. ముచాదులలోనిది గాన నుమ్ వచ్చును. విశేషకార్యము లేవియు లేవు.

పిశ్ధాతువునకు పిసుకుట-నొక్కుట అని అర్థము. సేట్. పరస్మైపది. ముచాదులలోనిది గాన 'శ'పర మగునపుడు నుమాగమము వచ్చును. పింశతి. పిపేశ. పేశితా. పేశిష్యతి. పింశతు. అపింశత్. పింశేత్. పిశ్యాత్. అపేశీత్. అపేశిష్యత్,

ఓవ్రశ్చూచ్ఛేదనే. 14. వృశ్చతి. వవ్రశ్చ; వవ్రశ్చిథ-వవ్రష్ఠ. వ్రశ్చితా — వ్రష్టా. వ్రశ్చిష్యతి - వ్రక్ష్యతి. వృశ్చ్యాత్. అవ్రశ్చీత్-అవ్రాక్షీత్.

ఓవ్రశ్చూ (వ్రశ్చ్) ధాతువునకు ఖండించుట అని అర్థము. పరస్మైపది. ఇది ఊదిత్ గాన 'స్వరతిసూతిసూయతిధూఞూదితోవా' అను సూత్రముచే (478) వేట్కము.

వృశ్చతి:- లట్నందు 'వ్రశ్చ్ అ తి' అని యుండగా 'శ'కు జిద్వద్భావమున్నది గాన "గ్రహిజ్యా—" ఇత్యాదిసూత్రముచే (637) సంప్రసారణము, పిమ్మట పూర్వరూపము, లట్టునందు ఇతరరూపము లీ విధముగనే యుండును. లోట్, లఙ్, విధిలిఙ్లందు కూడ సంప్రసారణపూర్వరూపములచే 'వృశ్చతు; అవృశ్చత్; వృశ్చేత్' ఇత్యాదిరూపము లగును.

వవ్రశ్చ:- లిట్ ప్రథమపురుషైకవచనమున 'వ్రశ్చ్ అ'అని యుండగా ద్విత్వము- 'వ్రశ్చ్ వ్రశ్చ్ అ' అభ్యాసమునందలి రేఫకు సంప్రసారణము (సూ-549) (ఋకారము). పూర్వరూపము(సూ-258) 'వృశ్చ్వ్రశ్చ్అ'.'ఉరత్' (సూ-475) 'వర్శ్చ్వ్రశ్చ్అ' 'హలాదిః శేషః' (సూ-398)- 'వవ్రశ్చ'. ద్వివచనాదులందు 'వవ్రశ్చతుః' ఇత్యాదిరూపములుండును. 'అతుస్' మొదలగునవి 'శ్చ' అనెడు సంయోగముకంటె పరముగనున్నవిగాన వాటికి కిత్త్వము (సూ-454) రాదు. అందుచే 'గ్రహిజ్యా-'సూత్రముచే (637) సంప్రసారణము రాదు. వవ్రష్ఠ- థల్‌కు ఇడాగమము రాని పక్షమున 'వవ్రశ్చ్థ'అని యుండగా

'స్కోః సంయోగాద్యోరన్తేచ' అను సూత్రముచే (310) 1. స(శ)కారమునకు లోపము. చకారమునకు షకారము (సూ-308). థకారమునకు ష్టుత్వముచే ఠకారము- 'వవ్రష్ఠ'. ఇడాగమపక్షమున 'వవ్రశ్చిథ' అను రూప మగును. వ, మ,లు పర మగునపుడు వైకల్పికేడాగమమును (సూ-478) బాధించి క్రాదినియమముచే నిత్యముగ ఇడాగమము వచ్చుటచే 'వవ్రశ్చివ' 'వవ్రశ్చిమ' అను రూపము లగును.

లుట్ :- వ్రశ్చితా-వ్రష్టా. లృట్ :- వ్రశ్చిష్యతి-వ్రక్ష్యతి. ఇడాగమము రాని పక్షమున 'వ్రశ్చ్స్యతి' అని యుండగా సకారలోపము; చకారమునకు షకారము. దానికి కకారము (సూ-551). స్యయందలి సకారమునకు షకారము.

ఆశీర్లిఙ్నందు యాసుట్ కిత్తు గాన (సూ-434) సంప్రసారణము వచ్చి (సూ-637) 'వృశ్చ్యాత్' ఇత్యాదిరూపము లగును. లుఙ్నందు ఇడాగమము వచ్చిన పక్షమున "అవ్రశ్చీత్, అవ్రశ్చిష్టామ్, అవ్రశ్చిషుః, అవ్రశ్చీః, అవ్రశ్చిష్టమ్, అవ్రశ్చిష్ట; అవ్రశ్చిషమ్, అవ్రశ్చిష్వ, అవ్రశ్చిష్మ" అను రూపము లగును. ఇచట "నేటి" (479) అని నిషేధింపబడుటచే వృద్ధి (సూ-467) రాలేదు. ఇడభావపక్షమున వృద్ధి వచ్చి "అవ్రాక్షీత్, అవ్రాష్టామ్ అవ్రాక్షుః; అవ్రాక్షీః, అవ్రాష్టమ్, అవ్రాష్ట, అవ్రాక్షమ్, అవ్రాక్ష్వ, అవ్రాక్ష్మ" అను రూపములు సిద్ధించును. లృఙ్ :- అవ్రశ్చిష్యత్, అవ్రక్ష్యత్.

వ్యచవ్యాజీకరణే, 15. విచతి. వివ్యాచ, వివిచతుః. వ్యచితా. వ్యచిష్యతి. విచ్యాత్. అవ్యాచీత్-అవ్యచీత్. 'వ్యచేః కుటాదిత్వమనసి' ఇతి తు నేహ ప్రవర్తతే. అనసీతి పర్యుదాసేన కృన్మాత్రవిషయత్వాత్.

15. వ్యచ్ ధాతువునకు మోసగించుట అని అర్థము. సేట్. పరస్మైపది.

విచతి:- లట్టునందు 'వ్యచ్ అతి' అని యుండగా 'శ' ప్రత్యయము ఙిద్వత్ గాన సంప్రసారణము (సూ-637); పూర్వరూపము- 'విచతి'. లోట్, లఙ్, విధిలిఙ్లందు కూడ ఈవిధముగనే సంప్రసారణము వచ్చి 'విచతు', 'అవిచత్' 'విచేత్' ఇత్యాదిరూపము లగును.

---

1. 'వ్రశ్చూ' ధాతువులో స్వతఃసిద్ధముగ నుండునది సకారము. శ్చుత్వముచే దానికి శకారము చేసి ధాతుపాఠమున 'వ్రశ్చూ' అని పఠింపబడినది. ఆ శ్చుత్వము అసిద్ధము గాన సకారము లోపించును.

వివ్యాచ;- లిట్ ప్రథమపురుషైకవచనము. ద్విత్వాభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట 'వ్యవ్యచ్ అ' అని యుండగా అభ్యాసయకారమునకు సంప్రసారణము (సూ-549) చేయగా పై రూపము సిద్ధించును. 'అతుస్' మొదలగు కిత్ప్రత్యయములు పర మగునపుడు ద్విత్వముకంటెపూర్వ మే "సంప్రసారణం తదాశ్రితం చ కార్యం బలవత్" అను న్యాయమునను సరించి సంప్రసారణము, (సూ-637); పూర్వరూపము. 'విచ్' అని యుండగా ద్విత్వాభ్యాసకార్యాదులచే 'వివిచతుః 'వివిచుః' ఇత్యాదిరూపము లగును. వివ్యచిథ, వివిచథుః, వివిచ; వివ్యాచ, వివ్యచ, వివిచివ, వివిచిమ.

లుట్:- వ్యచితా. లృట్:- వ్యచిష్యతి. ఆశీర్లిఙ్:- 'యాసుట్' కిత్తు గాన (సూ-434) సంప్రసారణము (సూ-637) వచ్చి 'విచ్యాత్' ఇత్యాదిరూపము లగును. లుఙ్ఙునందు 'అతో హలాదేర్లఘోః' అను సూత్రముచే (459) వైకల్పికవృద్ధి వచ్చి 'అవ్యాచీత్-అవ్యచీత్' ఇత్యాదిద్వివిధరూపము లుండును. 'వదవ్రజ' అను (467) వృద్ధి 'నేటి' (479) అని నిషిద్ధము.

"అస్ భిన్నము లగు ప్రత్యయములు పర మగునపుడు వ్యచ్ధాతువును కుటాదిగణములో చేరినదానినిగ గ్రహింపవలెను" అను వార్తికము ననుసరించి ఇచటసిచ్ప్రత్యయము అస్ప్రత్యయభిన్నప్రత్యయము గాన ఈధాతువునకు కుటాదిగతత్వము నంగీకరింపవలసి యున్నదికదా, యని ఆశంకింప రాదు. ఏల యన- ఈవార్తికమున 'అనసి' అని పర్యుదాసార్థక మగు నఞ్ ఉపయోగింపబడినది. 'నఞివయుక్తమన్యసదృశే తథాహ్యర్థగతిః' అనగా- 'నఞ్', 'ఇవ' అను అవ్యయములతో కూడినపదము తద్భిన్నము, తత్సదృశము అనునర్థమును బోధించును; వీటి అర్థ విధానము ఈవిధముగనే యుండును" అను న్యాయము ననుసరించి "అబ్రాహ్మణమానయ"ఇత్యాదిప్రయోగములలో బ్రాహ్మణభిన్నుడును బ్రాహ్మణసదృశుడును అగు వానిని తీసికొని రమ్ము అను భావార్థము గ్రహింపబడును. అంతే కాని ఏదియో యొక జాయివంటిదానిని తీసికొని రమ్మ అని అర్థముకాదు. అట్లే ప్రకృతమున 'అనసి' అనగా 'అస్ భిన్నము, అస్సదృశము నగు ప్రత్యయము పరమగునపుడు'అని అర్థము చెప్పవలెను గాన అస్ సదృశము లగు కృత్ప్రియములు పర మగునపుడు మాత్రమే ఈ కార్యము ప్రవర్తించును. కృద్భిన్నము లగు 'సిచ్'మొదలగునవి పర మగునపుడు ప్రవర్తించదు. ఈ వార్తికము ప్రవర్తించి యున్నచో 'సిచ్'మొదలగు వాటికి కూడ "గాఙ్కుటాది

భ్యోఞ్ణిన్ జిత్" అను సూత్రముచే (590) జిత్త్వము వచ్చుటచే వృద్ధి చేయుటకు అవకాశ ముండెడిది కాదు. అట్లే 'తా' 'స్య' మొదలగునవి పర మగునపుడు కూడ సంప్రసారణము (సూ-637) వచ్చి యుండెడిది.

పర్యుదాసము, ప్రసజ్యప్రతిషేధము అని నఞర్థము రెండు విధములు. నఞర్థము సమాసమునందలి ఉత్తరపదముతో సంబంధించినచో పర్యుదాస మని పేరు; క్రియతో అన్వయించినచో ప్రసజ్యప్రతిషేధ మని పేరు. "పర్యుదాసస్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్. ప్రసజ్య ప్రతిషేధోఽయం క్రియయా సహ యత్ర నఞ్" (నిర్ణయసాగర ముద్రాలయ ప్రకాశితమగు మీమాంసా న్యాయ ప్రకాశమున ఈ శ్లోకము మరియొక విధముగ పఠితమై వ్యాఖ్యానింపబడినది). "అబ్రాహ్మణం ఆనయ"-ఇత్యాద్యుదాహరణములందు నఞ్‌కు 'బ్రాహ్మణ' అను ఉత్తరపదముతో అన్వయమును అంగీకరించినచో 'బ్రాహ్మణ భిన్నుడగు వానిని' అను అర్థము వచ్చును. ఇది పర్యుదాసము. దీనిని అసమర్థసమాసముగ అంగీకరించి ఈ నఞర్థమును 'ఆనయ' అను క్రియతో అన్వయించినచో 'బ్రాహ్మణునిని తీసికొని రావలదు' అను అర్థము వచ్చును. దీనికి ప్రసజ్యప్రతిషేధ మనియు, నిషేధ మనియు పేర్లు. ప్రస్తుతమున 'అనసి' అనునపుడు పర్యుదాస మంగీకరింపబడినది.

ఉఛి ఉఞ్ఛే. 16. ఉఞ్ఛతి. "ఉఞ్ఛః కణశ ఆదానం కణిశాద్యర్జనం శిలమ్" ఇతి యాదవః.

16. ఉఛి ధాతువునకు ఉంఛవృత్తి చేయుట అని అర్థము. ధాన్యాదులను గింజగింజచొప్పున ఏరికొనుట ఉంఛము; వెన్నులను సంగ్రహించుట శిలము. పేట్. పరస్మైపది. ఇది ఇదిత్ గాన నుమాగమము వచ్చును (సూ-465). అనుస్వార, పరసవర్ణములచే 'ఉఞ్ఛ్' అని యగును. లట్ :- ఉఞ్ఛతి లిట్టునందు నుమాగమము చేసిన పిమ్మట 'ఉఞ్ఛ్' అని యుండునపుడు 'ఉ' గురు వగును గాన "ఇజాదేశ్చ —" అను సూత్రముచే (514) ఆమాగమము. పిమ్మట కృ, భూ, అస్ ధాతువులు అనుప్రయుక్తములగును (సూ-474). 'ఉఞ్ఛాఞ్చకార', 'ఉఞ్ఛాම్బభూవ', 'ఉఞ్ఛామాస' ఇత్యాది రూపము లగును. లుట్ :- ఉఞ్ఛితా లృట్ :- ఉఞ్ఛిష్యతి. లోట్ :- ఉఞ్ఛతు. లఙ్ :- ఔఞ్ఛత్. విధిలిఙ్ :- ఉఞ్ఛేత్. ఆశీర్లిఙ్ :- ఉఞ్ఛ్యాత్. ఇది 'ఇదిత్' గాన 'నుమ్'కు లోపము (సూ-335) రాలేదు. లుఙ్ :- ఔఞ్ఛీత్. లృఙ్ :- ఔఞ్ఛిష్యత్.

ఋచ్ఛ గతీన్ద్రియప్రలయ మూర్తి భావేషు. 17. ఋచ్ఛతి. ఋచ్ఛత్యౄతామితి గుణః; ద్విహల్గ్రహణస్యా నేక హలుపలక్షణత్వా న్నుట్. ఆనర్ఛ, ఆనర్ఛతుః, ఋచ్ఛితా.

17. ఋచ్ఛధాతువునకు వెళ్ళుట, ఇంద్రియములు నశించుట, కొయ్య బారుట అని అర్థములు. సేట్. పరస్మైపది. లట్ : ఋచ్ఛతి. లిట్ - ప్రథమ పురుషైకవచనమున 'ఋచ్ఛ్ అ' అని యుండగా ద్విత్వము - 'ఋచ్ఛ్ ఋచ్ఛ్ అ'. 'ఉరత్' (475) "అర్చ్ఛ్ఋచ్ఛ్అ" "హలాది శ్శేషః" (398) 'అ ఋచ్ఛ్ అ. 'ఋచ్ఛత్యౄతామ్' అని (617) గుణము - "అఅర్చ్ఛ్అ" అభ్యాస అకారమునకు దీర్ఘము (సూ-445). 'ఆ అర్ఛ్ అ' అని యుండగా 'నుట్' ఆగమము (సూ-466) 'ఆనర్చ్ఛ' అను రూపము సిద్ధించును. 'తస్మా న్నుడ్ద్విహలః' అను సూత్రమునందలి (466) 'ద్విహలః' అను దానికి "ఒకటికంటె అధికమైన హల్లులుకల" అని యర్థమే వివక్షితముగాని "రెండు హల్లులు మాత్రమే కలది" అని అర్థము కాదు. అందుచే ఇచట ('ర్చ్ఛ') మూడు హల్లులున్నను నుడాగమము వచ్చినది. 'ఆనర్చ్ఛ, ఆనర్చ్ఛతుః, ఆనర్చ్ఛుః' మొ. 'అనృచ్ఛః' అని నిషేధింపబడుటచే "ఇజాదేశ్చ-" అను సూత్రముచే (514) ఆమ్ రాలేదు.

లుట్ :- ఋచ్ఛితా. లృట్ :- ఋచ్ఛిష్యతి, లోట్ :- ఋచ్ఛతు లఙ్ :- ఆర్ఛత్ విధిలిఙ్ :- ఋచ్ఛేత్ ఆశీర్లిఙ్ :- ఋచ్ఛ్యాత్ లుఙ్ :- "ఆర్చ్ఛీత్, ఆర్చ్ఛిష్టామ్‌, ఆర్చ్ఛిషుః" మొ. లృఙ్ :- ఆర్చ్ఛిష్యత్.

ఉజ్ఝ ఉత్సర్గే. 18. ఉజ్ఝతి. లుభవిమోహనే, 19. లుభతి.

18. ఉజ్ఝ ధాతువునకు విడచుట అని యర్థము. సేట్. పరస్మైపది. ఉజ్ఝతి, ఉజ్ఝాఞ్చకార-ఉజ్ఝామ్బభూవ- ఉజ్ఝామాస. ఉజ్ఝితా. ఉజ్ఝిష్యతి. ఉజ్ఝతు. ఔజ్ఝత్, ఉజ్ఝేత్‌, ఉజ్ఝ్యాత్, ఔజ్ఝీత్, ఔజ్ఝిష్యత్. 19. లుభ్ ధాతువునకు ఆశపడుట అని యర్థము. సేట్. పరస్మైపది. లట్: లుభతి. లిట్ :- లులోభ.

660. *తీష సహలుభరుషరిషః* 7.2.48

ఇచ్ఛత్యాదేః పరస్య తాదేరార్ధధాతుకాస్యేడ్వా స్యాత్ లోభితా లోబ్ధా, లోభిష్యతి.

'తి ఇష-' అని పదచ్ఛేదము, 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' నుండి 'ఆర్ధ ధాతుకస్య' 'వలాదే'; "స్వరతి సూతి సూయతి ధూ ఞూరితోవా" నుండి 'వా' అనువర్తించును. ఇష్, సహ్, లుభ్, రుష్, రిష్ ధాతువులకంటె పరమైన తకారాద్యార్ధ ధాతుకమునకు ఇడాగమము వికల్పముగ వచ్చును.

లుట్‌నందు 'తా' అను ఆర్ధధాతుకమునకు ఈ సూత్రముచే ఇడాగమము వికల్పముగ వచ్చును. ఇడాగమపక్షమున 'లోభితా' అనియు, అభావపక్షమున 'లుభ్‌తా' అని యుండగా తకారమునకు ధకారము (సూ-552), భకారమునకు జశ్త్వముచే బకారము, గుణము చేయగా 'లోబ్ధా'అను రూపమును సిద్ధించును. ఇట్లు లుట్టునందు రెండేసి రూపము లుండును. లృట్ :- లోభిష్యతి లోట్:- లుభతు. లఙ్ :- అలుభత్. విధిలిఙ్ :- లుభేత్. ఆశీర్లిఙ్:- లుభ్యాత్. లుఙ్:- అలోభీత్. లృఙ్ :- అలోభిష్యత్.

తృప తృమ్ఫ తృప్తౌ. 20. 21. తృపతి, తతర్ప, తర్పితా, అతర్పీత్. తృమ్ఫతి.

20. 21. తృప్, తృమ్ఫ ధాతువులకు తృప్తి చెందుట అని అర్థము. సేట్ పరస్మైపదులు. 'తృమ్ఫ్' అను ధాతువునందు సహజముగ నకారముండెడిది. దానికి అనుస్వార పరసవర్ణములు (సూ-78, 79) చేసి 'తృమ్ఫ' అని పఠింపబడినది. తృప్ ధాతువునందు విశేషకార్యము లేవియు లేవు. తృపతి, తతర్ప, తర్పితా, ఇత్యాది రూపము లగును.

'తృమ్ఫ'ధాతువునకు లట్ ప్రథమపురుషైకవచనమున 'తృమ్ఫ్‌అతి' అని యుండగా 'శ'ఙిత్తు గాన 'అనిదితాం' అను సూత్రముచే (335) నకారము(మ్) లోపించును. 'తృఫ్‌అతి' అని యుండగా:-

వా. శేతృమ్ఫాదీనాంనుమ్వాచ్యః.

ఆదిశబ్దః ప్రకారే; తేన యేఽత్ర నకారానుషక్తాస్తే తృమ్ఫాదయః. తతృమ్ఫ, తృఫ్యాత్.

'శ'పర మగునపుడు తృంఫాదులకు 'నుమ్' చెప్పదగినది. ఇచట తృమ్ఫాదులు అనగా తృమ్ఫ ధాతువుకు సమానమైనవి- అనగా తృమ్ఫ ధాతువు వలె నకారసంబంధము కలవి- అని అర్థము. ఈ వార్తికము ననుసరించి నుమ్ చేయగా దానికి అనుస్వారపరసవర్ణములు వచ్చి 'తృమ్ఫతి' అను రూపము

సిద్ధించును. సార్వధాతుకలకారములందు ఈవిధముగనే నకారలోపనుమాగమ ములు వచ్చి రూపములు సిద్ధించును.

లిట్టునందు- 'తతృమ్ఫ, తతృమ్ఫతుః, తతృమ్ఫుః' ఇత్యాదిరూపము లగును. 'తృమ్ఫ' అనునపుడు 'మ్ఫ' అనునది సంయోగము గాన అతుసాదు లకు కిత్త్వము (సూ-454) లేదు. అందుచే నకారలోపము (సూ-335) రాదు.

లుట్ :- తృమ్ఫితా. లృట్ :- తృమ్ఫిష్యతి. ఆశీర్లిఙ్ :- యాసుట్ కిత్తు గాన "అనిదితాం-"అని (335) నకారలోపము వచ్చి తృఫ్యాత్'ఇత్యాదిరూపము లగును. లుఙ్ :- అతృమ్ఫీత్. లృఙ్ :- అతృమ్ఫిష్యత్.

మృడ, పృడ సుఖనే, 22, 23. మృడతి. పృడతి. శునగతౌ. 24. శునతి. ఇషు ఇచ్ఛాయామ్. 25. ఇచ్ఛతి. ఏషితా-ఏష్టా. ఏషిష్యతి. ఇష్యాత్. ఐషీత్.

22, 23. మృడ, పృడధాతువులకు సుఖపెట్టుట అని యర్థము. సేట్ పరస్మైపదములు. లట్ :-మృడతి. లిట్-మమర్డ, మమృడతుః, మమృడుః. లుట్ :- మర్డితా, లృట్- మర్డిష్యతి, లోట్- మృడతు, లఙ్- అమృడత్, విధిలిఙ్- మృడేత్, ఆశీర్లిఙ్- మృడ్యాత్, లుఙ్- అమర్డీత్. లృఙ్-అమ ర్డిష్యత్. పృడధాతురూపములు కూడ ఇట్లే యుండును.

24. శున్ధాతువునకు నడచుట అని అర్థము. సేట్. పరస్మైపది. శునతి, శుశోన, శోనితా, శోనిష్యతి, శునతు, అశునత్. శునేత్, శున్యాత్, అశోనీత్, అశోనిష్యత్.

25. ఇష్ధాతువునకు ఇచ్ఛయించుట అని అర్థము. సేట్. పరస్మైపది. లట్ మొదలగు సార్వధాతుకలకారములందు 'శ' చేరును గాన "ఇషుగమియ మాంఛః" అను సూత్రముచే (507) షకారమునకు ఛకారము. 'ఇఛ్అ' అని యుండగా 'ఛేచ' అను సూత్రముచే (101) తుగాగమము. దానికి శ్చుత్వముచే చకారము- 'ఇచ్ఛ'అని యగును. ఈవిధముగ లట్- ఇచ్ఛతి, లోట్- ఇచ్ఛతు. లఙ్- ఐచ్ఛత్, (విధిలిఙ్) ఇచ్ఛేత్ ఇత్యాదిరూపములు సిద్ధించును.

లిట్ప్రథమపురుషైకవచనమున "ఇష్అ" అని యుండగా ద్విత్వాభ్యాస కార్యములు. 'ఇఇష్అ'. రెండవఇకారమునకు లఘూపధగుణము. 'ఇఏష్అ'. "అభ్యాసస్యాసవర్ణే" అను సూత్రముచే (582) ఇయఙాదేశము- 'ఇయేష'

అను రూపము సిద్ధించును అతుస్ మొదలగు 'కిత్' ప్రత్యయములు పర మగు నపుడు గుణము రాదు. అందుచే అసవర్ణ మగు అచ్చు పరముగ లేకుండుటచే ఇయజాదేశము రాదు. సవర్ణదీర్ఘముచే 'ఈషతుః' 'ఈషుః' "ఇయేషిథ" ఇత్యాదిరూపము లగును.

లుట్టునందు "తీషసహ-" ఇత్యాది సూత్రముచే (660) ఇడ్వికల్పము. "ఏషితా, ఏష్టా" ఇత్యాదిరూపము లుండును. ఆశీర్లిఙ్- ఇష్యాత్. లుఙ్- "ఐషీత్, ఐషిష్టామ్, ఐషిషుః" మొ. లృఙ్:-ఐషిష్యత్.

కుటకౌటిల్యే. 26. గాఙ్కుటాదీతి ఙిత్త్వమ్. చుకుటిథ. చుకుట. కుటితా. పుట సంశ్లేషణే. 27. పుటతి. పుటితా. స్ఫుటవికసనే. 28. స్ఫుటతి. స్ఫుటితా. స్ఫుర, స్ఫుల సంచలనే. 29. 30. స్ఫురతి. స్ఫులతి.

కుటధాతువునకు కౌటిల్యమును చేయుట అని అర్థము. సేట్ పరస్మైపది. లట్:- "కుటతి" మొ. లిట్:- "చుకోట, చుకుటతుః, చుకుటుః; చుకుటిథ" మొ. ఞిత్, ణిత్ భిన్నములగు ప్రత్యయములు "గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ఙిత్" అను సూత్రముచే (590) ఙిత్తు లగును గాన 'థల్' ఙిత్తైనది. అందుచే గుణము రాలేదు. లుట్, లృట్టులందు 'తా' 'స్య' ప్రత్యయములు గాఙ్కుటాది సూత్రముచే (590) ఙిత్తులు గాన గుణము రాదు. 'కుటితా' 'కుటిష్యతి' ఇత్యాదిరూపము లగును. లోట్:- కుటతు. లఙ్:- అకుటత్. విధిలిఙ్:- కుటేత్. ఆశీర్లిఙ్:- కుట్యాత్. లుఙ్:- అకుటీత్. లృఙ్:- అకుటిష్యత్. లుఙ్లృఙ్లలయందు 'సిచ్' 'స్య'లకు ఙిత్త్వముండుటచే గుణము రాలేదు.

27. పుట ధాతువునకు కలియుట అని యర్థము. సేట్. పరస్మైపది. 28. స్ఫుటధాతువునకు వికసించుట అని యర్థము. సేట్. పరస్మైపది. 29. 30. స్ఫుర, స్ఫులధాతువులకు చలించుట అని యర్థము సేట్. పరస్మైపద ధాతువులు. ఇవి యన్నియు కుటాదులలో చేరినవి గాన "గాఙ్కుటాదిభ్యో ఞ్ణిన్ఙిత్" సూత్రము (590) వాటి విషయమున గూడ ప్రవర్తించును. అందుచే వీటి ప్రక్రియ కుట ధాతు ప్రక్రియ వలె నుండును.

661. స్ఫురతిస్ఫులత్యోర్నిర్నివిభ్యః 8.3.76

షత్వం వా స్యాత్. నిష్ఫురతి. నిష్ఫులతి.

'అపదాన్తస్య మూర్ధన్యః' అధికారము. 'సివాదీనాంవా' నుండి 'వా' అనువర్తించును. ని, నిర్, వి, ల కంటె పరము లగు స్ఫుర్ స్ఫుల్ ధాతువులకు షత్వము వికల్పముగ వచ్చును.

షత్వమున 'నిష్ఫురతి' ఇత్యాదిరూపములు, అభావపక్షమున ''నిస్ఫురతి'' ఇత్యాదిరూపములును అగును.

ణూ స్తవనే. 31. "పరిణూతగుణోదయః". నువతి. నువితా.

31. ణూధాతువునకు స్తుతించుట అని అర్థము. సేట్. పరస్మైపది. నువతి:- లట్ ప్రథమపురుషైకవచనమున "నూ అఅ" అని యుండగా 'శ'కు జిద్వద్భావ ముండుటచే గుణము రాదు. ఉవఙాదేశము (సూ-199) వచ్చి 'నువతి' అను రూపము సిద్ధించినది, ఆర్ధధాతుకలకారములందు ఈ విధముగ 'ఉవఙ్' వచ్చి రూపములు సిద్ధించును. లోట్:- నువతు. లఙ్- అనువత్. విధిలిఙ్- నువేత్.

లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వము చేసిన పిమ్మట 'నునుఅ' అని యుండగా వృద్ధి (సూ-182) ఆవాదేశము- 'నునావ' అను రూపము సిద్ధించును. 'అతుస్' మొదలగుకిత్ ప్రత్యయములందు 'ఉవఙ్' వచ్చి 'నునువతుః' 'నునువుః' ఇత్యాదిరూపము లగును. థల్:- 'నునువిథ' ఉత్తమపురుషైకవచనము— 'నునావ' 'నునవ'

ఈ ధాతువు కుటాదిగణములో చేరినది గాన లుట్, లృట్టులందు 'తా' 'స్య ప్రత్యయములు గాఙ్కుటాది సూత్రముచే (590) ఙిత్తులు. అందుచే గుణము రాదు. ఉవఙాదేశముచే 'నువితా' 'నువిష్యతి' ఇత్యాదిరూపము లగును. ఆశీర్లిఙ్:- నూయాత్. లుఙ్- "సిచి వృద్ధిః పరస్మైపదేషు" అను సూత్రముచే (486) వృద్ధి; ఆవాదేశము- ''అనావీత్, అనావిష్టామ్, అనావిషుః'' మొ. లృఙ్:- అనువిష్యత్:

పైన చూపబడిన ప్రక్రియ చూడగా ఈ'నూ'ధాతువునందలి ఊకారమునకు కొన్ని స్థలములందు ఉవఙాదేశము, కొన్ని స్థలములందు గుణవృద్ధులు వచ్చినవి. ఈ విధముగ ఊకారమెచ్చటను వినబడు అవకాశమే లేదు: అట్టి పరిస్థితులలో ఊకారాంత మగు 'నూ'ధాతువునకు బదులుగ ఉకారాంత మగు 'ను'ధాతువును పఠించినను ఉవఙ్ గుణవృద్ధ్యాదులువచ్చుటలో ఎట్టి భేదమును ఉండదు గాన ఉకారాంతధాతువునే ఏల పఠింపలేదు అను ప్రశ్న ఉదయింప

వచ్చును. . తన్నివారణమునకై "పరిణూతగుణోదయః" అను నీశ్లోక పాదము చూపబడినగి. అనగా క్తప్రత్యయాంతరూపమునందు ఊకారశ్రవణము నకై దీర్ఘాంతధాతువు పఠింపబడిన దని అర్థము. కావుననే 'పరిణూత' అను రూపము సిద్ధించినది, హ్రస్వాంతమైనచో 'పరిణుత' అను రూపము సిద్ధించెడిది. 'పరిణూత' అనునపుడు 'శ్ర్యుకః కితి' అను సూత్రముచే (653) ఇడాగమము విషేధింపబడినది. అట్లుకానిచో ఇచట కూడ ఇడాగమము వచ్చి పిదప ఉవజా దేశము చేయగా 'పరిణువిత' అను రూపము సిద్ధించెడిది.

టుమస్జోశుద్ధౌ.32. మజ్జతి. మమజ్జ. మస్జి నశోరితి నుమ్.

32. టు మస్జో (మస్జ్)ధాతువునకు శుద్ధ మగుట-స్నానము చేయుట అని అర్థము. అనిట్. పరస్మైపది.

మజ్జతి:- లట్ ప్రథమపురుషైకవచనమున 'మస్జ్ అతి' అని యుండగా శ్చుత్వముచే సకారమునకు శకారము. దానికి జశ్త్వముచేయగా (సూ-19) జకారము. 'మజ్జతి' అను రూపము సిద్ధించును. లోట్, లఙ్, విధిలిఙ్లలందు కూడ రూపములు ఈవిధముగ సిద్ధించును మజ్జతు. అమజ్జత్. మజ్జేత్. లిట్:- మమజ్జ, మమజ్జతుః, మమజ్జుః. ఇది అనిడ్ ధాతువు గాన థల్‌నందు భారద్వాజనియమముచే ఇడాగమము వికల్పముగ వచ్చును. ఇడాగమము రాని పక్షమున 'మమస్జ్థ' అని యుండగా "మస్జినశోర్ఝలి" అని (639) నుమాగమము. ఈ నుమాగమము మిత్‌గాన మకారముపైనున్న అకారమునకుపరముగ (సూ-240) (మమన్స్జ్) రావలసి యుండగా:-

వా. మస్జేరన్త్యాత్ పూర్వో నుమ్ వాచ్యః.

సంయోగాదిలోపః.: మమఙ్క్థ, మమజ్జిథ. మఙ్క్తా. మఙ్క్ష్యతి. అమాఙ్క్షీత్, అమాఙ్క్తామ్, అమాఙ్క్షుః.

మస్జ్‌ధాతువునకు వచ్చు 'నుమ్' అంత్యవర్ణమునకు పూర్వముగ వచ్చునని చెప్పవలెను.

•ఈవార్తికము ననుసరించి నుమాగమము అంత్యవర్ణ మగు జకారమునకు పూర్వముగ వచ్చును. 'మమస్న్జ్థ' అని యుండును. సకారమునకులోపము. (సూ-310) జకారమునకు కుత్వముచే (సూ-307) గకారము. దానికి చర్త్వముచే కకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములు (సూ-78, 79)

(జకారము)- 'మమజ్క్థ' అను రూపము సిద్ధించును. ఇడభావపక్షము 'మమజ్జిథ'. మఙ్క్తా;- లుట్ ప్రథమపురుషైకవచనమున 'మస్జ్‌తా' అని యుండగా నుమాగమము- 'మస్న్జ్‌తా', పైచలెసలోప, అనుస్వార, పరసవర్ణములు—— 'మఙ్క్తా' అను రూపము. "మఙ్క్తారౌ, మఙ్క్తారః" మొ. మఙ్క్ష్యతి:- 'మస్జ్‌స్యతి'అనియుండగా నుమాగమము.'మస్న్జ్‌స్యతి'సకారమునకులోపము. జకారమునకు కుత్వముచే కకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములు 'మఙ్క్‌స్యతి'. సకారమునకు షత్వము- 'మఙ్క్ష్యతి, మఙ్క్ష్యతః మఙ్క్ష్యన్తి' మొ. ఆశీర్లిఙ్- యాసుట్‌లోని యకారము ఝల్ కాదు గాన నుమాగమమురాదు. 'మజ్జ్యాత్, మజ్జ్యాస్తామ్, మజ్జ్యాసుః' ఇత్యాదిరూపము లగును.

అమాఙ్క్షీత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున సిచ్, నుమ్, సకారలోపము, వృద్ధి (సూ-467) కుత్వ, చర్త్వ, షత్వ, అనుస్వారపరసవర్ణములు- 'అమాఙ్క్షీత్'అను రూపము సిద్ధించినది. ఇతరరూపములందు గూడ ప్రక్రియ ఇట్లే. తామ్, తమ్, ధ్వమ్,లు పర మగునపుడు మాత్రము సిచ్‌కు లోపము వచ్చును. అమాఙ్క్షీత్, అమాఙ్క్తామ్, అమాఙ్క్షుః; అమాఙ్క్షీః, అమాఙ్క్తమ్, అమాఙ్క్త; అమాఙ్క్ష్వమ్, అమాఙ్క్ష్వ, అమాఙ్క్ష్మ. లృఙ్:— అమఙ్క్ష్యత్.

రుజో భఙ్గే. 33. రుజతి. రోక్తా. రోక్ష్యతి. అరౌక్షీత్. భుజో కౌటిల్యే. 34. రుజివత్. విశ ప్రవేశనే. 35. విశతి.

33. రుజ్‌ధాతువునకు భంగము చేయుట (కష్టము కలిగించుట) అని అర్థము. అనిట్. పరస్మైపది. లట్- రుజతి. లిట్- రురోజ. లుట్- రోక్తా. జకారమునకు కుత్వముచే గకారము, గకారమునకు చర్త్వముచే కకారము. లృట్- 'రోక్ష్యతి' కుత్వాదులు చేసిన పిమ్మట సకారమునకు షకారము. లోట్- రుజతు. లఙ్- అరుజత్. విధిలిఙ్- రుజేత్. ఆశీర్లిఙ్- రుజ్యాత్. లుఙ్- వృద్ధి (సూ-467) అరౌక్షీత్, అరౌక్తామ్, అరౌక్షుః, మొ.

34. భుజ్‌ధాతువునకు వంకర యగుట అని అర్థము. దీని రూపములు రుజ్‌ధాతురూపముల వలె నుండును.

35. విశ్ ధాతువునకు ప్రవేశించుట అని అర్థము. అనిట్. పరస్మైపది. లట్- విశతి.లిట్- వివేశ.లుట్- వేష్టా.లృట్- వేక్ష్యతి, లోట్- విశతు.

లఙ్- అవిశత్. విధిలిఙ్- విశేత్. ఆశీర్లిఙ్ - విశ్యాత్. లుఙ్- అవిక్షత్. 'చ్లి'కి క్స ఆదేశము (సూ-593). 'క్స' కిత్తుగాన గుణము రాదు. శకారమునకు వ్రశ్చాదిసూత్రముచే (308) షకారము, దానికి కకారము (సూ-551) దానికంటె పర మగు సకారమునకు షకారము. 'అవిక్షత్' ఇత్యాదిరూపములు సిద్ధించును. లృఙ్- 'అవేక్ష్యత్'

మృశ ఆమర్శే. 36. ఆమర్శనం స్పర్శః. "అనుదాత్తస్యచర్దుపధస్యాన్యతరస్యామ్-" అమ్రాక్షీత్-అమార్క్షీత్-అమృక్షత్. షద్లృవిశరణగత్యవసాదనేషు. 37. సీదతి. ఇత్యాది. శద్లృశాతనే. 38.

36. మృశ్‌ధాతువునకు స్పృశించుట అని అర్థము. అనిట్. పరస్మైపది. లట్- మృశతి. లిట్- మమర్శ, మమృశతుః, మె. 'తా' 'స్య' మొదలగు ఝలాదిఅకిత్‌ప్రత్యయములు పర మగునపుడు "అనుదాత్తస్యచర్దుపధస్యాన్యతరస్యామ్"అను సూత్రముచే (656) అమ్ వికల్పముగా వచ్చును. లుట్- అమ్ వచ్చిన పక్షమున యణాదేశముచే 'మ్రష్టా' ఇత్యాదిరూపములును, అమ్ రాని పక్షమున గుణముచే 'మర్ష్టా' ఇత్యాదిరూపములును అగును. లృట్- మ్రక్ష్యతి-మర్‌క్ష్యతి. లోట్- మృశతు. లఙ్- అమృశత్. విధిలిఙ్- మృశేత్. ఆశీర్లిఙ్- మృశ్యాత్. లుఙ్- వికల్పముగ అమాదేశము. "స్పృశ మృశ, కృష, తృప, దృపాంచ్లేస్సిజ్వావాచ్యః" అను వార్తికముచే (సూ-656) సిజ్వికల్పము. సిజభావపక్షమున 'క్స'ఆదేశము (సూ-593) కావున అమ్రాక్షీత్-అమార్‌క్షీత్-అమృక్షత్ ఇత్యాదిత్రివిధరూపము లగును. ప్రక్రియ కృషధాతు లుఙ్ పరస్మైపదరూపములందు వలె నుండును. లృఙ్- అమ్రక్ష్యత్-అమర్క్ష్యత్.

37. షద్‌ధాతువునకు బద్దలగుట, వెళ్ళుట నశించుట అని అర్థములు. అనిట్. పరస్మైపది. 'పాఘ్రాధ్మా'- ఇత్యాదిసూత్రముచే (490) 'శ'పర మగునపుడు 'సీద్'అనునాదేశము వచ్చును. లట్- సీదతి. లోట్- సీదతు. లఙ్- అసీదత్. విధిలిఙ్- సీదేత్. లిట్- ససాద, సేదతుః, సేదుః. సేదిథ-ససత్థ" లుట్- సత్తా. లృట్- సత్స్యతి. ఆశీర్లిఙ్- సద్యాత్. లుఙ్- అసదత్. "పుషాది" సూత్రముచే (410) 'చ్లి'కి 'చఙ్'ఆదేశము. లృఙ్- 'అసత్స్యత్'. 'శద్లృ'ధాతువునకు నశించుట అని అర్థము. అనిట్.

### 662. శదేశ్శితః 1.3.60

శిద్భావినోఽస్మాత్తజానౌ స్తః. శీయతే. శీయతామ్. అశీయత. శీయేత శశాద. శత్తా. శత్స్యతి అశదత్. అశత్స్యత్. కౄ విక్షేపే. 39.

'అనుదాత్తజితఆత్మనేపదమ్' నుండి 'ఆత్మనేపదమ్' అనువర్తించును. 'తఙానావాత్మనేపదమ్' (సూ-379). శిత్ అగు ప్రత్యయము (శ, శప్) ప్రత్యయము చేర్చవలసియున్న శద్ ధాతువునకు (ఆత్మనేపదములు) తఙ్, ఆన ప్రత్యయములు వచ్చును.

కావునఈ ధాతువు 'శ' ప్రత్యయముచేర్చుటకు తగిన లట్, లోట్, లఙ్, విధిలిఙ్ లందు ఆత్మనేపదియై యుండును. "పాఘ్రా-" ఇత్యాదిసూత్రముచే (490) 'శీయ్' ఆదేశము వచ్చుటచే లట్- శీయతే; లోట్-శీయతామ్, లఙ్-అశీయత; విధిలిఙ్- శీయేత, ఇత్యాదిరూపము లగును. ఆర్ధధాతుకలకారము లందు ప్రక్రియ 'సద్ ధాతుప్రక్రియ వలె నుండును.

కౄధాతువునకు చిమ్ముట, విసిరివేయుట అని అర్థము. సేట్. పరస్మైపది.

### 663. ౠత ఇద్ధాతోః 7.1.100

ౠదన్తస్య ధాతోరఙ్గస్య ఇత్ స్యాత్. కిరతి. చకార, చకరతుః, చకరుః, కరీతా-కరితా. కీర్యాత్.

'అఙ్గస్య' అధికారము. ౠకారాన్తధాతువు అంగమునకు హ్రస్వ మగు ఇకారము ఆదేశముగ వచ్చును.

కిరతి:- లట్ ప్రథమపురుషైకవచనమున 'కౄ అతి' అని యుండగా పై సూత్రముచే, అలోన్త్యపరిభాష ననుసరించి, ౠకారమునకు రపరమగు ఇకారాదేశము- 'కిరతి' అను రూపము సిద్ధించును.

చకార - లిట్ ప్రథమపురుషైకవచనమున 'కౄఅ' అని యుండగా ద్విత్వము, అభ్యాసకార్యము, అభ్యాసౠకారమునకు అకారము, "ౠచ్ఛత్యౄతామ్" అను సూత్రముచే (617). రెండవౠకారమునకు గుణము, వృద్ధి(సూ-457) వచ్చి 'చకార' అను రూపము సిద్ధించినది. 'ౠచ్ఛత్యౄతామ్' అను గుణము కిత్ ప్రత్యయములు పర మగునపుడు కూడ ప్రవర్తించుటచే 'చకరతుః'

'చకరుః' ఇత్యాదిరూపము లగును కరీతా-కరితా:- లుట్ ప్రథమపురుషైకవచనమున ఋకారమునకు గుణముచే అర్. 'తా'కు ఇడాగమము. ఆఇకారమునకు "వృతోవా" అను సూత్రముచే (618) వైకల్పికదీర్ఘము. ఈవిధముగ లుట్టునందు రెండేసి రూపము లుండును. లృట్టునందు కూడ దీర్ఘవికల్పముచే 'కరీష్యతి-కరిష్యతి' ఇత్యాదిద్వివిధరూపము లుండును లోట్:- కిరతు. లఙ్:- అకిరత్. విధిలిఙ్:- కిరేత్. ఆశీర్లిఙ్:- కీర్యాత్. యాసుట్ కిత్తు గాన ఋకారమునకు 'ఇర్' ఆదేశము. (సూ-663). 'హలి చ' అను సూత్రముచే (616) ఇకారమునకు దీర్ఘము. లుఙ్:- 'అకారీత్, అకారిష్టామ్, అకారిషుః' మొ. "సిచివృద్ధిః పరస్మైపదేషు" అను సూత్రముచే (486) వృద్ధి.

664. కిరతౌలవనే 6.1.140

ఉపాత్ కిరతేః సుట్ ఛేదనే. ఉపస్కిరతి.

'ఉపాత్ప్రతియత్నే' 'సుట్కాత్పూర్వః'నుండి 'ఉపాత్' 'సుట్' అను వర్తించును. 'ఉప'కంటె పర మగు కౄధాతువునకు ఛేదనార్థమున 'సుట్' వచ్చును. ఈ సూత్రముచే సుడాగమము కౄధాతువునకు ఆద్యవయవముగ వచ్చుటచే 'ఉపస్కిరతి' అను రూపము సిద్ధించినది. 'ఛేదించుచున్నాడు' అని అర్థము.

వా. అడభ్యాసవ్యవాయేఽపి సుట్ కాత్పూర్వ ఇతి వక్తవ్యమ్.

ఉపాస్కిరత్. ఉపచస్కార.

'అట్' అభ్యాసములతో వ్యవధాన మున్నను ఈ సుడాగమము కకారమునకు పూర్వమున వచ్చును.

ఉపాస్కిరత్:- 'ఉపఅకిరత్' అని యుండగా 'ఉప' అను దానికిని 'కిరత్' అను దానికిని అడాగమరూపమగు అకారముతో వ్యవధానమున్నది. ఐనను ఈ సూత్రముచే కకారమునకు వెనుక సుడాగమము వచ్చి "ఉపాస్కిరత్" అను రూపము సిద్ధించును. ఉపచస్కార:- ఇచట 'చ' అను అభ్యాసముతో వ్యవధాన మున్నను ఈ వార్తికముచే సుడాగమము వచ్చినది.

665. హింసాయాం ప్రతేశ్చ 6.1.141

ఉపాత్ ప్రతేశ్చ కిరతేః సుట్ స్యాత్ హింసాయామ్. ఉపస్కిరతి. ప్రతిస్కిరతి. గౄనిగరణే. 40.

వెనుకటి సూత్రమునందు వలె 'ఉప' 'సుట్' అనుపదములును, వెనుకటి సూత్రమునుండి 'కిరతౌ' అనువర్తించును. 'ఉప'కంటెను, ప్రతికంటెను పరమగు కిరధాతువునకు హింసార్థమునందు సుడాగమము వచ్చును.

ఇట్లు సుడాగమము చేయగా 'ఉపస్కిరతి' 'ప్రతిస్కిరతి' అను రూపములు సిద్ధించినవి. హింసించుచున్నాడు అని యర్థము.

గౄధాతువునకు మ్రింగుట యని యర్థము. సేట్. పరస్మైపది.

666. అచి విభాషా 8.2.21

గిరతే రేఫస్య లోఽజాదౌ ప్రత్యయే. గిలతి-గిరతి. జగాల-జగార జగలిథ-జగరిథ. గలీతా-గలితా-గరీతా-గరితా.

'గ్రోయఙి' 'కృపో రోలః'నుండి 'గ్రః''రః''లః' అనువర్తించును. అజాదిప్రత్యయములు పర మగునపుడు గౄధాతువు రేఫకు లకారము వికల్పముగ వచ్చును.

గిలతి-గిరతి:- ప్రథమపురుషైకవచనమున 'గౄఅతి' అని యుండగా 'ఋత ఇద్ధాతోః' అను సూత్రముచే (663) ఋకారమునకు 'ఇర్' ఆదేశము. ఈ రేఫకు అకారము పరముగ నున్నది గాన వికల్పముగల లకారము వచ్చి 'గిలతి-గిరతి' అను ద్వివిధరూపము లగును. ఇట్లు సార్వధాతుకలకారము లందన్నిటియందును రెండేసి రూపము లుండును ఆర్ధధాతుకలకారములలో ఒక్క ఆశీర్లిఙ్ఙునందు తక్క మిగిలిన అన్నిటియందును ఇడాగమములు వచ్చి అజాది ప్రత్యయము లభ్యమగునుగాన 'ల'వికల్పముచే రెండేసి రూపము లగును. లుట్, లృట్లందు 'వౄతో వా' అను సూత్రముచే (618) వికల్పముగ దీర్ఘము వచ్చి 'గలీతా-గలితా, గరీతా-గరితా' ''గలీష్యతి-గలిష్యతి, గరీష్యతి-గరిష్యతి'' మొదలగు నాలుగేసి రూపము లుండును. ఆశీర్లిఙ్:- గీర్యాత్. యకారము పరముగ నున్నది గాన లకారము రాదు.

ప్రచ్ఛ జ్ఞీప్సాయామ్. 41. ''గ్రహిజ్యా-''ఇతి సమ్ప్రసారణమ్-పృచ్ఛతి. పప్రచ్ఛ, పప్రచ్ఛతుః, పప్రచ్ఛుః. ప్రష్టా, ప్రక్ష్యతి. అప్రాక్షీత్. మృఙ్ ప్రాణత్యాగే. 42.

ప్రచ్ఛధాతువునకు తెలిసికొనుటకు అభిలషించుట—ప్రశ్నించుట అని అర్థము. అనిట్. పరస్మైపది.

పృచ్ఛతి:- లట్ ప్రథమపురుషైకవచనమున 'ప్రచ్ఛతి' అని యుండగా 'గ్రహిజ్యా' సూత్రముచే (637) సంప్రసారణము (ఋ); పూర్వరూపము— 'పృచ్ఛతి' అను రూపము సిద్ధించును. లిట్ - పప్రచ్ఛ. పప్రచ్ఛతుః, పప్రచ్ఛుః మొ. లుట్ ప్రథమపురుషైకవచనమున 'ప్రచ్ఛ్తా' అని యుండగా "వ్రశ్చ-" ఇత్యాదిసూత్రముచే (308) 'చ్ఛ'కు షత్వము; తకారమునకుష్టుత్వము 'ప్రష్టా'. 'ప్రక్ష్యతి':- లృట్ ప్రథమపురుషైకవచనమున 'ప్రచ్ఛ్స్యతి' అని యుండగా షత్వము. దానికి కత్వము. (సూ-557) 'స్య'యందలి సకారమునకు షత్వము. 'ప్రక్ష్యతి' అను రూపము సిద్ధించును. లోట్:- పృచ్ఛతు. లఙ్:- అపృచ్ఛత్. విధిలిఙ్:- పృచ్ఛేత్. ఆశీర్లిఙ్:- పృచ్ఛ్యాత్. లుఙ్:- అప్రాక్షీత్, అప్రాష్టామ్, అప్రాక్షుః" మొ. వృద్ధి (సూ-467) షత్వములు (సూ-308). 'తామ్' 'త'లు పర మగునపుడు సిచ్ సకారమునకు 'ఝలో ఝలి' అని (480). లోపము. లృఙ్ - అప్రక్ష్యత్.

42. మృఙ్ధాతువునకు మరణించుట అని యర్థము. అనిట్. ఇది ఙిత్తు గాన అన్నిలకారములందును ఆత్మనేపదప్రత్యయములు రావలసి యుండగా ఈ సూత్రము చెప్పబడుచున్నది.

667. ప్రియతేర్లుఙ్లిఙోశ్చ 1.3.61

లుఙ్లిఙోఃశితశ్చ ప్రకృతిభూతాన్మృఙ స్తఙ్ నాన్యత్ర. రిఙ్; ఇయఙ్-మ్రియతే. మమార. మర్తా. మరిష్యతి. మృషీష్ట. అమృత.

"అనుదాత్తఙిత ఆత్మనేపదమ్" నుండి 'ఆత్మనేపదమ్' అనువర్తించును. 'శదేఃశితః' నుండి 'శితః' చకారబలముచే అనుకర్షింపబడును. 'ప్రకృతిభూతాత్" అని అధ్యాహారము. లుఙ్లిఙ్లకును, శిత్ప్రత్యయమునకును ప్రకృతి యగు 'మృ'ధాతువునకు పరముగ తఙ్ప్రత్యయములు వచ్చును. ఇతరప్రత్యయ లకారములకు ప్రకృతియైనచో రావు.

ఈ సూత్రము ననుసరించి లిట్, లుట్, లృట్, లృఙ్లలో ఈ ధాతువునకు పరస్మైపదప్రత్యయములు వచ్చు నని అర్థము. ఇతరలకారములందు ఆత్మనేపదప్రత్యయములు వచ్చును.

మ్రియతే:- లట్ ప్రథమపురుషైకవచనమున 'మృఅతే'అని యుండగా "రిఙ్శయగ్లిఙ్క్షు" అను సూత్రముచే (546) ఋకారమునకు రిఙాదేశము.

'మ్రిఅతే'అని యుండగా ఇయజాదేశము (సూ-199)- 'మ్రియతే'అను రూపము సిద్ధించినది.

లిట్:- మమార, మమ్రతుః, మమ్రుః, మమర్థ ("ఋతోభారద్వాజస్య"- 484) మమ్రథుః, మమ్ర మమార-మమర, మమ్రివ. మమ్రిమ. లుట్:- మర్తా; మర్తాసి. లృట్ - మరిష్యతి. "ఋద్ధనోః స్యే" (500) అని ఇడాగమము. లోట్:- మ్రియతామ్. లఙ్:- అమ్రియత. విధిలిఙ్:- మ్రియేత. ఆశీర్లిఙ్:- "మృషీష్ట, మృషీయాస్తామ్, మృషీరన్" మొ. 'ఉశ్చ' అని (517) సీయుట్ కిత్ గాన గుణము రాదు.

అమృత:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'హ్రస్వాదఙ్గాత్' అను సూత్రముచే (548) 'సిచ్'కు లోపము. థామ్, ధ్వమ్‌లు పర మగునపుడు గూడ 'సిచ్'లోపించును. అమృత, అమృషాతామ్, అమృషత; అమృథాః, అమృషాథామ్, అమృడ్ఢ్వమ్; అమృషి, అమృష్వహి, అమృష్మహి. లృఙ్:- అమరిష్యత్.

పృఙ్ వ్యాయామే. 43. ప్రాయేణాయం వ్యాఙ్పూర్వః. వ్యాపప్రే, వ్యాపప్రాతే, వ్యాపరిష్యతే. వ్యాపృత, వ్యాపృషాతామ్. జుషీ ప్రీతిసేవనయోః. 44, జుషతే, జుజుషే. ఓవిజీ భయచలనయోః 45. ప్రాయేణాయముత్పూర్వః. ఉద్విజతే.

43. పృఙ్ధాతువునకు చేష్ట చేయుట అని యర్థము. అనిట్. ఙిత్తుగాన ఆత్మనేపది. సాధారణముగ ఇది 'వ్యాఙ్' (వి + ఆఙ్)అను ఉపసర్గద్వయముతో కలిసియే ప్రయోగింపబడుచుండును లట్, లోట్, లఙ్, విధిలిఙ్, లుఙ్‌లందు దాని రూపములు మృధాతురూపముల వలె నుండును. లిట్:- "వ్యాపప్రే, వ్యాపప్రాతే, వ్యాపప్రిరే; వ్యాపప్రిషే" మొ. క్రాదినియముచే ఇడాగమము. లృట్:- వ్యాపరిష్యతే. ("ఋద్ధనోః స్యే" 500). లృఙ్:- వ్యాపరిష్యత్. లఙ్, లుఙ్, లృఙ్లలందు వచ్చెడు అడాగమము 'వ్యా'అను ఉపసర్గలకును ధాతువునకును నడుమ చేరును. సవర్ణదీర్ఘము వచ్చును.

44 జుష్‌ధాతువునకు ప్రీతి కలిగి యుండుట, సేవించుట అని అర్థములు. సేట్. ఆత్మనేపది. లట్ - జుషతే. లిట్:- జుజుషే. లుట్:- జోషితా,

లృట్ :- జోషిష్యతే. లోట్ :- జుషతామ్. లఙ్ :- అజుషత. విధిలిఙ్ :- జుషేత. ఆశీర్లిఙ్. జోషిషీష్ట. లుఙ్ :- అజోషిష్ట. లృఙ్ :- అజోషిష్యత,

45. విజ్ ధాతువునకు భయపడుట, చలించుట అని యర్థము. సేట్. ఆత్మనేపది. సాధారణముగ ఈ ధాతువు 'ఉద్' అను ఉపసర్గతోడనే ప్రయోగింప బడుచుండును. లట్ :- ఉద్విజతే. లిట్ :- ఉద్వివిజే.

668. విజఇట్ 1.2.2

విజఃపరఇడాదిప్రత్యయో ఙిద్వత్. ఉద్విజితా. ఇతి తుదాదయః.

'గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ ఙిత్' నుండి 'ఙిత్' అనుపదము అనువర్తించును. విజ్ ధాతువుకంటె పర మగు ఇడాదిప్రత్యయము ఙిత్ వంటి దగును

ఉద్విజితా:, లుట్ ప్రథమపురుషైకవచనమున ఇకారమునకు గుణము (సూ-453) రావలసి యుండ ఈ సూత్రముచే ఙిద్వద్భావము వచ్చినది గాన నిషిద్ధము. లృట్ :- ఉద్విజిష్యతే. లోట్ :- ఉద్విజతామ్. లఙ్ :- ఉదవిజత. విధిలిఙ్ :- ఉద్విజేత. ఆశీర్లిఙ్ :- ఉద్విజిషీష్ట. లుఙ్ - ఉదవిజిష్ట. లృఙ్ :- ఉదవిజిష్యత.

తుదాదిగణము సమాప్తము.

# అథ రుధాదయః

రుధిర్ ఆవరణే.

669. రుధాదిభ్యః శ్నమ్ 3.1.78

శపోఽపవాదః. రుణద్ధి. శ్నసోరల్లోపః—రున్ద్ధః, రున్ధన్తి; ణత్వ్సి, రున్ద్ధః, రున్ద్ధ; రుణధ్మి, రున్ధ్వః, రున్ధ్మః. రున్ద్ధే, రున్ధాతే. రురోధ, రురుధే. రోద్ధా. రోత్స్యతి; రోత్స్యతే. రుణద్ధు-, రున్ద్ధాత్, రున్ద్ధామ్, రున్ధన్తు; రున్ద్ధి, రుణధాని, రుణధావ, రుణధామ. రున్ద్ధామ్, రున్ధాతామ్, రున్ధతామ్; రున్త్స్వ; రుణధై, రుణధావహై, రుణధామహై. అరుణత్-అరుణద్, అరున్ద్ధామ్, అరున్ధన్; అరుణత్-అరుణః. అరున్ద్ధ,

అరున్ధాతామ్, అరున్ధత; అరున్ధాః. రున్ధ్యాత్. రున్ధీత. రుధ్యాత్; రుత్సీష్ట. అరుధత్-అరౌత్సీత్-అరుద్ధ, అరుత్సాతామ్, అరుత్సత. అరోత్స్యత్; అరోత్స్యత.

రుధిర్ ధాతువునకు అడ్డుపెట్టుట అని అర్థము. 'ఇర్' ఇత్సంజ్ఞకము. అనిట్. ఇది మొదలు 'ఉత్తృదిర్'ధాతువువరకును గల తొమ్మిది ధాతువులును ఉభయపదులు. ఇరిత్తులు. 'చ్లి'కి వైకల్పికచజాదేశము ('ఇరితోవా'631) ఇరిత్త్వప్రయోజనము.

రుధాదిలకంటె కర్త్రర్థసార్వధాతుకమున శ్నమ్ ప్రత్యయము వచ్చును. ఇది 'శప్'కు అపవాదము. శకారమకారములు ఇత్సంజ్ఞకములు. ఇది శిత్ అగుటచే సార్వధాతుకము. అపిత్సార్వధాతుక మగుటచే ఙిద్వద్భావము వచ్చును. అందుచే ఇది పర మగునపుడు గుణము రాదు.

రుణద్ధి:- 'రుధ్ తి' అని యుండగా శ్నమ్ మిత్ గాన అంత్యాచ్చునకు (రేఫోత్తరవర్తియగు ఉకారమునకు) పరముగ వచ్చును. -'రునధ్ తి', 'ఝషస్తథోర్ధోఽధః' అను సూత్రముచే (552) తకారమునకు ధకారము. మొదటి ధకారమునకు జశ్త్వముచే దకారము. నకారమునకు ణత్వము- 'రుణద్ధి'. రున్ధః;- 'రునధ్ తః'అని యుండగా 'తః' అనునది ఙిత్సార్వధాతుకము గాన నకారముపై నున్న అకారమునకు "శ్నసోరల్లోపః" అను సూత్రముచే (577) లోపము. తకారమునకు ధకారము, మొదటి ధకారమునకు "ఝలో ఝలిసవర్ణే" అను సూత్రముచే (?) వికల్పముగ లోపము. 'రున్ధః' అని యుండగా ణత్వము అసిద్ధ మగుటచే నకారమునకు అనుస్వారపరసవర్ణములు (సూ-78, 79) పరసవర్ణ మసిద్ధ మగుటచే ణత్వప్రసక్తి లేదు. "రున్ధః." ధకారలోపము రాని పక్షమున దానికి జశ్త్వముచే దకారమువచ్చి 'రున్ద్ధః' అను రూపము. రున్ధన్తి:- 'ఝి'కి అన్తాదేశము చేసిన పిమ్మట నకారముపై నున్న అకారమునకు లోపము- 'రున్ధన్తి'. రుణత్సి:- 'రుణధ్ సి' అని యుండగా (చర్త్వముచే) ధకారమునకు తకారము. "రున్ధః, రున్ధ; రుణధ్మి, రున్ధ్వః; రున్ధ్మః". ప్రక్రియ పైన చూపిన విధమున నుండును.

ఆత్మనేపదమున అన్ని ప్రత్యయములును అపిత్సార్వధాతుకములు గాన ఙిద్వద్భావ ముండును. అందుచే అకారలోపము వచ్చి— (సూ-577) "రున్ధే,

రున్ధాతే, రున్ధతే; రున్త్సే, రున్ధాథే, రున్ధ్వే; రున్ధే, రున్ధ్వహే, రున్ధ్మహే" అను రూపము లగును.

లిట్: (పర)- "రురోధ, రురుధతుః, రురుధుః" మొ. (ఆత్మ) "రురుధే, రురుధాతే, రురుధిరే" మొ. లిట్‌నందు క్రాదినియమముచే వలాద్యార్ధధాతుకము లన్నిటికిని ఇడాగమము వచ్చును.

లుట్టునందు 'రుధ్ తా'అని యుండగా తకారమునకు ధకారము (సూ-552) మొదటిధకారమునకు జశ్త్వముచే దకారము. లఘూపధగుణము. -"రోద్ధా, రోద్ధారౌ, రోద్ధారః; రోద్ధాసి, రోద్ధాసే" ఇత్యాదిరూపము లగును.

లృట్:- రోత్స్యతి; రోత్స్యతే.

రున్ధి:- లోట్‌మధ్యమపురుషైకవచనమున 'హి'కి 'ధి' ఆదేశము. (సూ-559). ఇతరప్రక్రియ యంతయు 'రున్ధః' యందు వలె నుండును. ఉత్తమ పురుషప్రత్యయములకు వచ్చిన ఆడాగమము (సూ-420) పిత్‌గాన జిద్వద్భావము లేకుండుటచే అల్లోపము లేదు. "రుణధాని, రుణధావ, రుణధామ" అను రూపము లగును. ప్రథమమధ్యమపురుషరూపముల ప్రక్రియ చాలవరకు లట్టునందు వలె నుండును. ఆత్మనేపదమున:- రున్ధామ్, రున్ధాతామ్, రున్ధతామ్; రున్త్స్వ, రున్ధాథామ్, రున్ధ్వమ్; రుణధై, రుణధావహై, రుణధామహై. ఇచట గూడ ఉత్తమపురుషమున ఆడాగమము పిత్ గాన, జిద్వద్భావము లేకుండుటచే, అల్లోపము రాలేదు. అరుణత్-అరుణద్:- లఙ్ (పర.) ప్రథమపురుషైకవచనమునందు 'అరుణధ్ త్' అని యుండగా తకారమునకు "హల్‌ఙ్యాది-" సూత్రముచే (179) లోపము. ధకారమునకు చర్త్వవికల్పము (సూ-146). 'అరుణత్-అరుణద్' అను రూపద్వయ మగును. ద్వి. వ. అరున్ధామ్ (బ.వ) అరున్ధన్ మధ్యమపురుషైకవచనమున 'అరుణధ్ స్' అని యుండగా ధకారమునకు జశ్త్వముచే దకారము. సకారమునకు లోపము (సూ-179). దకారమునకు చర్త్వవికల్పము (సూ-146). చర్త్వపక్షమున 'అరుణత్' అను రూప మగును. చర్త్వము రాని పక్షమున దకారమునకు "దశ్చ" అను సూత్రముచే (576) రుత్వము: దానికి విసర్గ చేయ 'అరుణః' అను రెండవ రూపము సిద్ధించును. అరుణత్-అరుణః, అరున్ధమ్, అరున్ధ; అరుణధమ్, అరున్ధ్వ, అరున్ధ్మ. ఆత్మనేపదమున:- "అరున్ధ, అరున్ధాతామ్, అరున్ధత"మొ. విధిలిఙ్:- (ప)

రున్ధ్యాత్. (ఆ) రున్ధీత, ఆశీర్లిఙ్:- (ప.) రుధ్యాత్. (ఆ) రుత్సీష్ట. సీయుట్ కిత్తుగాన (సూ-592) గుణమురాలేదు. లుఙ్:-(పర)వికల్పముగ అఙ్ వచ్చిన పక్షమున (సూ-631) "అరుధత్, అరుధతామ్, అరుధన్" ఇత్యాదిరూపములును, అఙ్ రాని పక్షమున వృద్ధి (సూ-467) వచ్చి "అరౌత్సీత్, అరౌత్తామ్, అరౌత్సుః" ఇత్యాదిరూపములును అగును. ఆత్మనేపదమున "అరుద్ధ, అరుత్సాతామ్, అరుత్సత" ఇత్యాదిరూపము లగును. లృఙ్:- అరోత్స్యత్, అరోత్స్యత.

భిదిర్ విదారణే. 2. ఛిదిర్ ద్వైధీకరణే. 3. యుజిర్ యోగే. 4. రిచిర్ విరేచనే. 5. (ణక్తి; రిఙ్క్తే. రిరేచ. రేక్తా. రేక్ష్యతి. అరిణక్. అరిచత్, అరైక్షీత్, అరిక్త.

2. భిద్ధాతువునకు చీల్చుట యని అర్థము. అనిట్. 3. ఛిద్ ధాతువునకు రెండుగ చేయుట (ఛేదించుట) అని అర్థము. అనిట్. వీటి ప్రక్రియ రుధ ధాతుప్రక్రియ వలె నుండును.

లట్:- భినత్తి, భిన్తే. లిట్:- బిభేద-బిభిదే. లుట్:- భేత్తా. లృట్:- భేత్స్యతి, భేత్స్యతే లోట్:- భినత్తు: భిన్తామ్. లఙ్:- అభినత్. అభిన్త. వి. లి:- భిన్ద్యాత్; భిన్దీత. ఆశీర్లిఙ్:- భిద్యాత్; భిత్సీష్ట. లుఙ్:- అభిదత్-అభైత్సీత్; అభిత్త. లృఙ్:- అభేత్స్యత్. అభేత్స్యత.

ఛిద్ ధాతురూపములు కూడ పై విధముగనే ఉండును. "చిచ్ఛేద" మొదలగు స్థలములందు హ్రస్వము కంటె ఛకారముపరమగునపుడు తుగాగమము (సూ-101). దానికి శ్చుత్వముచే చకారము వచ్చుట విశేషము.

4. యుజ్ధాతువునకు కలియుట అని అర్థము. అనిట్. లట్:-యునక్తి; యుఙ్క్తే. 'యున్జ్ తే' అని యుండగా తకారము (ఝల్) పరముగ నున్నది గాన జకారమునకు కుత్వము (307)- గకారము. దానికి చర్త్వముచే కకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములు- 'యుఙ్క్తే'. కుత్వము రాని స్థలములందు అనుస్వారమునకు పరసవర్ణముగు ఞకారము వచ్చుచుండును.

లిట్:- యుయోజ; యుయుజే. లుట్:- యోక్తా, లృట్:- యోక్ష్యతి-యోక్ష్యతే. లోట్:- యునక్తు; యుఙ్క్తామ్. లఙ్:- అయు

నక్; అయుఙ్క్త. విధిలిఙ్:- యుఞ్జ్యాత్; యుఞ్జీత. ఆశీర్లిఙ్:- యుజ్యాత్; యుక్షీష్ట. లుఙ్:- అయుజత్-అయౌక్షీత్; అయుక్త. లృఙ్:- అయోక్ష్యత్; అయోక్ష్యత. కుత్వచర్త్వములచే వచ్చిన కకారముకంటె పరమగు సకారమునకు షకారము వచ్చి 'క్ష్'లభించుచుండును.

5. రిచిర్ ధాతువునకు రిక్తము చేయుట అని యర్థము. అనిట్. దీని ప్రక్రియ యంతయు యుజధాతుప్రక్రియవలెనే యుండును. ధాతువునందు రేఫ ఉండుటచే నకారమునకు ణకారము వచ్చుచుండుట విశేషము.

విచిర్ పృథగ్భావే. 6. వినక్తి; విఙ్క్తే. క్షుదిర్ సమ్పేషణే. 7. క్షుణత్తి; క్షున్త్తే. క్షోత్తా. అక్షుదత్-అక్షౌత్సీత్; అక్షుత్త.

6. విచిర్ ధాతువునకు వేరుచేయుట అని యర్థము. అనిట్. క్షుదిర్ధాతువునకు పిండి చేయుట అని అర్థము. అనిట్. వీటి ప్రక్రియ కూడ పైధాతువుల ప్రక్రియవలె ఉండును.

ఉచ్ఛృదిర్ దీప్తిదేవనయోః 8. ఛృణత్తి, ఛృన్త్తే. చచ్ఛర్ద. సేసిచీతి వేట్- చచ్ఛృదిషే-చచ్ఛృత్సే. ఛర్దితా ఛర్దిష్యతి-ఛర్త్స్యతి. అచ్ఛృదత్-అచ్ఛర్దీత్; అచ్ఛర్దిష్ట.

'ఛృద్'ధాతువునకు ప్రకాశించుట, జూదమాడుట అని అర్థములు. సేట్. లట్:- ఛృణత్తి; ఛృన్త్తే. ఒకతకారమునకు వికల్పముగ లోపము, (సూ-73) లోపము లేనిచో 'ఛృన్త్తే' అని రెండుతకారము లుండును లిట్:— చచ్ఛర్ద; చచ్ఛృదే. సకారాదిప్రత్యయములు పర మగునపుడు "సేఽసిచికృతచృతఛృదతృదనృతః" అను సూత్రముచే (633) ఇడ్వికల్పము- చచ్ఛృదిషే చచ్ఛృత్సే. లుట్:- ఛర్దితా. లృట్:- ఇడ్వికల్పము (సూ-633)- ఛర్దిష్యతి-ఛర్త్స్యతి; ఛర్దిష్యతే-ఛర్త్స్యతే. లోట్:- ఛృణత్తు, ఛృన్త్తామ్. లఙ్:- అఛృణత్; అఛృన్త్త. విధిలిఙ్:- ఛృన్ద్యాత్; ఛృన్దీత. ఆశీర్లిఙ్:- ఛర్ద్యాత్; ఛర్దిషీష్ట-ఛృత్సీష్ట. లుఙ్:- అచ్ఛృదత్-అచ్ఛర్దీత్; అచ్ఛర్దిష్ట. లృఙ్:- అచ్ఛర్దిష్యత్-అచ్ఛర్త్స్యత్; అచ్ఛర్దిష్యత-అచ్ఛర్త్స్యత. "అసిచి" అని నిషేధించుటచే లుఙ్నందు ఇడాగమవికల్పము లేదు.

ఉతృదిర్ హింసానాదరయోః. 9. తృణత్తి; తృన్త్తే. కృతీ వేష్టనే. 10. కృణత్తి, 'తృహ' 'హిసి' హింసాయామ్. 11, 12.

9. తృద్ ధాతువునకు హింసించుట, అనాదరము చేయుట అని అర్థములు. సేట్. దాని ప్రక్రియ యంతయు ఛృద ధాతుప్రక్రియవలె నుండును.

10. 'కృత్'ధాతువునకు చుట్టుకొనుట అని అర్థము. సేట్. పరస్మైపది. సకారాదిప్రత్యయములు పర మగునపుడు దీనికి కూడ "సేసిచి–"ఇత్యాది సూత్ర ముచే (633) ఇడ్వికల్పము వచ్చును. దీని ప్రక్రియ ఛృద్ధాతుపరస్మైపద ప్రక్రియవలె నుండును. ఇది ఇరిదిత్తు కాదు గాన 'చ్లి'కి అఙ్వికల్పము లేదు. ఇదియే విశేషము.

11-12. 'తృహ్' 'హిసి'ధాతువులకు హింసించుట అని యర్థము. సేట్. పరస్మైపదులు.

670. తృణహ ఇమ్ 7.3.92

తృహః శ్నమి కృతే 'ఇమ్' ఆగమో హలాదౌ పితి. తృణేఢి. తృణ్ఢః, తతర్హ. తర్హితా. అతృణేట్.

"నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే" . "ఉతో వృద్ధిర్లుకి హలి" నుండి 'పితి' 'హలి' అనువర్తించును. తృహ్ ధాతువునకు శ్నమ్ ప్రత్యయము చేర్చిన పిమ్మట 'తృణహ్' అని యుండగా దానికి, హలాది యగు పిత్ ప్రత్యయము పర మగునపుడు 'ఇమ్' అను ఆగమము వచ్చును.

తృణేఢి:– ప్రథమపురుషైకవచనమున 'తృహ్ తి' అని యుండగా, శ్నమ్ప్రత్యయము– 'తృనహ్తి'. 'ఋవర్ణాన్నస్యణత్వంవాచ్యం–' 'తృణహ్తి' ఇపుడు ఈ సూత్రముచే 'ఇమ్'ఆగమము. మిత్తు గాన అచ్చులలో అంత్య మగు ణకారముపై నున్న అకారమునకు పరముగ వచ్చును. 'తృణఇహ్తి'– గుణము. 'తృణేహ్తి'. 'హోఢః' (సూ–251)– 'తృణేఢ్తి'. 'ఝష స్తథోర్ధోఽధః'– (552)—'తృణేఢ్ధి'. ష్టుత్వము — 'తృణేఢ్ఢి'. 'ఢోఢేలోపః' (553)— 'తృణేఢి' అను రూపము సిద్ధించినది. తృణ్ఢః:– 'తస్' ఙిత్ప్రత్యయముగాన అకారలోపము (సూ–577). ఇది పిత్ ప్రత్యయము కాదు గాన 'ఇమ్' రాదు. ఇతరప్రక్రియ పైవలెనే ఉండును. బహువచనమున 'తృనహ్ అన్తి' అని యుండగా అల్లోపము. 'తృన్హ్ అన్తి', 'నశ్చాపదాన్తస్యఝలి' (78) "తృంహన్తి". తృణేక్షి– ఇమ్ఢత్వాదులు చేసిన పిమ్మట 'తృణేఢ్సి' అని యుండగా ఢకారమునకుకకారము (సూ–551). సకారమునకు షత్వము (సూ–150); "తృణేక్షి, తృణ్ఢః, తృణ్ఢ; తృణేహ్మి, తృంహ్వః, తృంహ్మః."

లిట్:- 'తతర్హ, తతృహతుః, తతృహుః' మొ. లుట్:- తర్హితా. లృట్:- తర్హిష్యతి. లోట్:- తృణేఢు-తృణ్ఢాత్, తృణ్ఢామ్, తృంహన్తు; తృణ్ఢి-తృణ్ఢాత్, తృణ్ఢమ్, తృణ్ఢ; తృణహాని, తృణహావ, తృణహామ.

అతృణేట్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున 'అతృణేఢ్ త్' అని యుండగా హల్‌జ్యాదిలోపము (సూ-179), ఢకారమునకు జశ్త్వచర్త్వములు- అతృణేట్, అతృణ్ఢామ్, అతృంహన్; అతృణేట్, అతృణ్ఢమ్, అతృణ్ఢ; అతృణహమ్, అతృంహ్వ, అతృంహ్మ. విధిలిఙ్:- ''తృంహ్యాత్, తృంహ్యాతామ్'' మొ.ఆశీర్లిఙ్:- ''తృహ్యాత్, తృహ్యాస్తామ్''మొ. లుఙ్:- ''అతర్హీత్, అతర్హిష్టామ్, అతర్హిషుః'' మొ. లృఙ్:- అతర్హిష్యత్.

671. శ్నాన్నలోపః 6.4.23

శ్నషః పరస్య నస్యలోపః స్యాత్. హినస్తి. జిహింస. హింసితా.

శ్నమ్‌ప్రత్యయముకంటె పరమైన నకారమునకు లోపము వచ్చును.

హిసిధాతువు ఇదిత్ గాన నుమాగమము (సూ-465). ప్రథమపురుషైకవచనమున 'హిన్‌స్‌తి' అని యుండగా శ్నప్రత్యయము- 'హినన్‌స్‌తి'. ఇపు డీ సూత్రముచే నకారలోపము- 'హినస్తి'. 'తస్' మొదలగు ఙిత్‌ప్రత్యయములు పర మగునపుడు అల్లోపము వచ్చుచుండును. అపుడు నకారమునకు అనుస్వార పరసవర్ణములు హినస్తి. హింస్తః, హింసన్తి; హినస్సి, హింస్థః, హింస్థ; హినస్మి, హింస్వః, హింస్మః. లిట్:- ''జిహింస, జిహింసతుః, జిహింసుః'' మొ. లుట్:- హింసితా. లృట్:- హింసిష్యతి. లోట్:- హినస్తు, హింస్తామ్, హిసంన్తు; హిన్‌ధి-హింస్తాత్, హింస్తమ్, హింస్త; హినసాని, హినసావ, హినసామ. మధ్యమపురుషైకవచనమున "హినన్‌స్‌హి" అని యుండగా నకారలోపము (671) 'హినస్‌హి' హి అపిత్ గాన ఙిద్వద్భావముండుటచే (సూ-577) అల్లోపము. 'హిన్‌స్‌హి'. "హుఝల్భ్యోహేర్ధిః" (559)—'హిన్‌స్‌ధి'. 'ధిచ' అను సూత్రముచే (518) సకారమునకు లోపము 'హిన్ధి' అను రూపము సిద్ధించును.

లఙ్ ప్రథమపురుషైకవచనమున "అహినస్త్" అని యుండగా తకారమునకు లోపము (సూ-179). 'అహినస్' అని యుండగా:-

672. తిప్యనస్తేః 8.2.73

పదాన్తస్య సస్య దః స్యాత్తిపి న త్వస్తేః. "ససజుషోరుః" ఇత్యస్యాపవాదః. అహినత్-అహినద్, అహింస్తామ్, అహింసన్.

'పదస్య' అధికారము. "ఝలాంజశోఽన్తే" నుండి 'అన్తే', 'ససజుషోరుః' నుండి 'స', 'వసుస్రంసుధ్వంస్వనడుహాందః' నుండి 'దః' అనువర్తించును. పదాంతమునం దున్న సకారమునకు తిప్ పర మగునపుడు దకారాదేశము వచ్చును; అస్ధాతువునకు మాత్రము రాదు.

ఈ సూత్రము 'ససజుషోరుః' అను సూత్రమునకు (105) అపవాదము గాన రుత్వమును బాధించి సకారమునకు దకారాదేశము. చర్త్వవికల్పము (సూ-146)- "అహినత్-అహినద్" అను రూపము లగును. అహింస్తామ్, అహింసన్. మధ్యమపురుషైకవచనమున 'అహినస్స్' అని యుండగా రెండవ సకారమునకు లోపము (179). 'అహినస్' అని యుండగా:-

673. సిపి ధాతోరుర్వా 8.2.74

పదాన్తస్య ధాతోః సస్య రుః స్యాద్ వా. పక్షే "ఝలాం జశోఽన్తే" ఇతి జశ్త్వమ్ -- అహినః-అహినత్-అహినద్-

'పదస్య' అధికారము. "ఝలాంజశోఽన్తే" "ససజుషోరుః" నుండి 'అన్తే', 'స' అను పదములు అనువర్తించును. సిప్ పర మగునపుడు పదాన్తమునం దున్న ధాత్వవయవసకారమునకు రు వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే రుత్వము వచ్చిన పక్షమున 'అహినః' అను రూప మగును. రుత్వాభావపక్షమున 'స'కారమునకు జశ్త్వము (సూ-67)- దకారము. దానికి చర్త్వవికల్పము (సూ-146)- 'అహినత్-అహినద్' అను రూపద్వయము సిద్ధించును. అహింస్తమ్, అహింస్త; అహినసమ్, అహినస్వ, అహినస్మ. విధిలిఙ్:- "హింస్యాత్, హింస్యాతామ్," మొ. ఆశీర్లిఙ్:- 'హింస్యాత్, హింస్యాస్తామ్' మొ. లుఙ్:- అహింసీత్. లృఙ్:-అహింసిష్యత్.

ఉన్దీ క్లేదనే. 13. ఉనత్తి, ఉన్తః, ఉన్దన్తి. ఉన్దాఞ్చకార. ఔనత్. ఔన్తామ్, ఔన్దన్; ఔనః-ఔనత్; ఔనదమ్.

13 ఉన్దీధాతువునకు నెమ్మకొనచేయుట (తడిగలదిగ చేయుట) అని అర్థము. సేట్. పరస్మైపదము. ఈకారము ఇత్సంజ్ఞకము.

ఉనత్తి:- లట్ ప్రథమపురుషైకవచనమున శ్నమ్ చేసిన పిమ్మట "ఉనన్దతి" అని యుండగా నకారమునకులోపము (సూ-671) 'ఉనద్‌తి'. చర్త్వము (సూ-74)- 'ఉనత్తి' ఉన్తః:- ద్వివచనమున 'ఉనన్‌ద్‌తస్' అని యుండగా నలోప అల్లోపములు- 'ఉన్‌ద్‌తస్'. దకారలోపపక్షమున (సూ-73) 'ఉన్తః' అనియు, లోపాభావపక్షమున 'ఉన్త్తః' అనియు రూపద్వయ ముండును, "ఉనత్తి, ఉన్తః, ఉన్దన్తి; ఉనత్సి, ఉన్థః, ఉన్థ; ఉనద్మి, ఉన్ద్వః ఉన్ద్మః" లిట్టునందు (సూ-514) ఆమాదేశము వచ్చుటచే "ఉన్దాఞ్చకార, ఉన్దామ్బభూవ, ఉన్దామాస" మొదలగు త్రివిధరూపము లుండును. లుట్:-ఉన్దితా. లృట్ :- ఉన్దిష్యతి.

ఔనత్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున ఆడాగమము, వృద్ధి, శ్నమ్ కంటె పర మగు నకారమునకు లోపము, 'త్'కు హల్ఙ్యాది సూత్రముచే (179) లోపము, దకారమునకు చర్త్వవికల్పము (సూ-146) 'ఔనత్-ఔనద్' అను రూపము లగును. ఔన్తామ్:- 'ఉనన్‌ద్‌తామ్' అని యుండ, ఆడాగమ, వృద్ధి, నకారలోప, అల్లోపములు. దకారమునకు లోపపక్షమున (సూ-73) ఏకతకార మగు 'ఔన్తామ్' అను రూపము. లోపాభావపక్షమున" ఔన్త్తామ్"అను ద్వితకారరూపమును అగును. ఔనః-ఔనత్:- మధ్యమపురుషైకవచనమున 'సిప్' సకారమునకు హల్ఙ్యాదిలోపము (179) చేసిన పిమ్మట 'ఔనద్' అని యుండగా దకారమునకు 'దశ్చ' అను సూత్రముచే (576) రుత్వవికల్పము. 'ఔనః-ఔనత్' అను రూపద్వయము సిద్ధించును. ఔనదమ్:- ఉత్తమపురుషైకవచనమున జిత్ ప్రత్యయము కాదు గాన అల్లోపము రాలేదు. విధిలిఙ్:- ఉన్ద్యాత్. ఆశీర్లిఙ్:- ఉద్యాత్. నకారలోపము సూ-(335). లుఙ్:- ఔన్దీత్. లృఙ్:- ఔన్దిష్యత్.

అఞ్జూ వ్యక్తిమ్రక్షణకాన్తిగతిషు. 14. అనక్తి, అఙ్క్తః, అఞ్జన్తి అనఞ్జ; ఆనఞ్జిథ-ఆనఙ్క్థ. అఞ్జితా-అఙ్క్తా. అఙ్‌గ్ధి. అనజాని. ఆనక్.

అఞ్జ్ ధాతువునకు స్పష్టమగుట, శుభ్రమగుట, ఇచ్ఛయించుట, వెళ్లుట అని అర్థములు. ఊదిత్ గాన వేట్ (సూ-478). ఇందలి ఇకారము స్వతసిద్ధముగ నకారము దానికి శ్చుత్వమునే ఇకారము చేసి అఞ్జూ'అని పఠింపబడినది.

అనక్తి:- లట్ ప్రథమపురుషైకవచనమున 'శ్నమ్' చేర్చిన పిమ్మట 'అనన్జ్తి' అని యుండగా- 'శ్నాన్నలోపః' (సూ-671)- 'అనజ్తి' జకారమునకు కుత్వముచే గకారము. దానికి చర్త్వముచే కకారము- 'అనక్తి'. అఙ్క్తః, నలోపాదులు చేసిన పిమ్మట 'అనజ్తస్' అని యుండగా అల్లోపము (సూ-577)- 'అన్జ్తస్'. జకారమునకు కుత్వచర్త్వములు-'అన్క్తస్' -అనుస్వారపరసవర్ణములు (సూ-78, 79) ''అఙ్క్తః''. అఞ్జన్తి:- లట్ ప్రథమపురుషబహువచనమున శ్నమ్, నకారలోప, అనుస్వారపరసవర్ణములచే సిద్ధించినది. అనక్షి, అఙ్క్థః, అఙ్క్థ; అనజ్మి, అఞ్జ్వః, అఞ్జ్మః.

ఆనఞ్జ:- లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట 'అఆఞ్జ' అని యుండగా 'అత ఆదేః' అను సూత్రముచే (445) అభ్యాస అకారమునకు దీర్ఘము- 'ఆఅఞ్జ్ అ'- 'తస్మాన్నుడ్ద్విహలః' అను సూత్రముచే (466) నుడాగమము- 'ఆనఞ్జ'. ఆనఞ్జతుః. ఆనఞ్జుః, ఆనఞ్జిథ -ఆనఙ్క్త:- ఇడ్వికల్పముగాన (సూ-478) రెండు రూపములు. ఇట్లే 'వ' 'మ'లు పరమగునపుడు ఆనఞ్జివ-ఆనఞ్జ్వ, ఆనఞ్జిమ, ఆనఞ్జ్మ. లుట్:- అఞ్జితా-అఙ్క్తా. లృట్:- అఞ్జిష్యతి-అఙ్క్ష్యతి. లోట్:- అనక్తు-అఙ్క్తాత్, అఙ్క్తామ్, 'అఞ్జన్తు', అఙ్గ్ధి-అఙ్క్తాత్, అఙ్క్తమ్, అఙ్క్త; అనజాని, అనజావ, అనజామ.

అఙ్గ్ధి:- మధ్యమపురుషైకవచనమున 'హి'కి ధిఆదేశము (సూ-559) శ్నమ్‌కంటె పరమైన నకారమునకు లోపము (సూ-671). హికి ఙిద్వద్భావమున్నదిగాన శ్నమ్‌లోని అకారమునకు లోపము. జకారమునకు కుత్వముచే గకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములు. ఉత్తమపురుషమున ఆడాగమము పిత్ గాన అల్లోపము (సూ-577) రాలేదు.

ఆనక్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున ఆడాగమము, వృద్ధి, శ్నమ్, ధాత్వవయవనకారమునకు లోపము; హల్ఙ్యాదిసూత్రముచే (179) తకారమునకు లోపము; జకారమునకు కుత్వము; చర్త్వము. ఆనక్, ఆఙ్క్తామ్, ఆఞ్జన్; ఆనక్, ఆఙ్క్తమ్, ఆఙ్క్త; ఆనజమ్, ఆనజ్వ, ఆనజ్మ. విధిలిఙ్:— అఞ్జ్యాత్, అఞ్జ్యాతామ్. మొ. ఆశీర్లిఙ్:-'' అజ్యాత్, అజ్యాస్తామ్ ''మొ.

674. అఞ్జేఃసిచి 7.2.71

అఞ్జేః సిచో నిత్యమిట్ స్యాత్. ఆఞ్జీత్.

'ఇడత్యర్తివ్యయతీనామ్'నుండి 'ఇట్' అనువర్తించును. "స్వరతిసూతి-" ఇత్యాదిసూత్రముచేతనే (478) ఇడాగమము (వికల్పముగ) వచ్చుచుండ ఈ సూత్రము నియమార్థము. అఞ్జ్ధాతువుకంటె పరమైన సిచ్ కు ఇడాగమము నిత్యముగ వచ్చును.

ఆఞ్జీత్:- లుజ్ ప్రథమపురుషైకవచనమున ఆట్, వృద్ధి, చ్లి, సిచ్, 'తిప్'లోనిఇకారమునకు లోపము. తకారమునకు ఈడాగమము, సిచ్కు ఈ సూత్రముచే ఇడాగమము, సిచ్కు లోపము, ఇకారఈకారములకు సవర్ణదీర్ఘము "ఆఞ్జీత్, ఆఞ్జిష్టామ్, ఆఞ్జిషుః; ఆఞ్జీః, ఆఞ్జిష్టమ్, ఆఞ్జిష్ట; ఆఞ్జిషమ్, ఆఞ్జిష్వ, ఆఞ్జిష్మ. లృఙ్:- ఆఞ్జిష్యత్-ఆఙ్క్ష్యత్.

తఞ్చూ సంకోచనే. 15. తనక్తి. తఙ్క్తా-తఞ్చితా.

15. తఞ్చ్ధాతువునకు సంకోచింపచేయుట అని అర్థము. ఊదిత్గాన వేట్ (478). పరస్మైపది. దీని రూపము లన్నియు 'అఞ్జూ'ధాతురూపముల వలె నుండును

ఓవిజీ భయచలనయోః. 16. వినక్తి. "విజఇడ్" ఇతిఙిత్త్వమ్ -వివిజిథ. విజితా. అవినక్. అవిజీత్.

విజ్ధాతువునకు భయపడుట, చలించుట అని అర్థములు. సేట్. పరస్మైపది. సార్వధాతుకములందు దాని రూపములు 'అఞ్జ్' మొదలగు ధాతువుల రూపముల వలె నుండును. ఆర్ధధాతుకములందు 'విజఇట్' అను సూత్రముచే (668) దీనికంటె పరమగు ఇడాగమము ఙిత్తు గాన గుణము రాదు. అందుచే ఆర్ధధాతుకరూపములు తుదాదులలోని విజధాతురూపముల వలె నుండును.

శిష్ల విశేషణే. 17. శినష్టి, శింష్టః, శింషన్తి; శినక్షి. శిశేష, శిశేషిథ. శేష్టా. శేక్ష్యతి. హేర్ధిః- శిణ్ఢి; శినషాణి. అశినట్. శింష్యాత్. శిష్యాత్. అశిషత్. ఏవం పిష్ల సంచూర్ణనే. 18.

శిష్లధాతువునకు విశేషమును కలిగించుట అని అర్థము. శినష్టి:- శ్నమ్ చేర్చిన పిమ్మట 'శినష్తి' అని యుండగా ష్టుత్వముచే తకారమునకు టకారము.

శింష్టః:- ద్వివచనప్రత్యయమగు 'తస్' అపిత్సార్వధాతుకమగుటచే జిద్వత్ గాన 'శ్నమ్'లోని అకారమునకు లోపము (సూ-577). నకారమునకు అనుస్వారము (సూ-78). తకారమునకుష్టుత్వము. శినక్షి:- లట్ మధ్యమపురుషైకవచనమున 'శినష్సి' అని యుండగా షకారమునకు కకారము (సూ-551); సకారమునకు షకారము (సూ-150). శినష్టి, శింష్టః, శింషన్తి; శినక్షి, శింష్ఠః, శింష్ఠ; శినష్మి, శింష్వః, శింష్మః. లిట్:- శిశేష, శిశిషతుః, శిశిషుః; శిశేషిథ, శిశిషథుః, శిశిష; శిశేష, శిశిషివ, శిశిషిమ. లుట్:- శేష్టా. లృట్:- శేక్ష్యతి. లోట్:- శినష్టు-శింష్టాత్, శింష్టామ్, శింషన్తు; శిణ్ఢి-శింష్టాత్, శింష్టమ్, శింష్ట; శినషాణి, శినషావ, శినషామ.

శిణ్ఢి:- మధ్యమపురుషైకవచనమున 'శినష్హి' అని యుండగా 'హి'కి 'ధి' ఆదేశము (సూ-559). 'హి' జిత్తు గాన అల్లోపము 'శిన్ష్ధి'. షకారమునకు జశ్త్వముచే డకారము. ధకారమునకు ష్టుత్వముచే ఢకారము- 'శిన్డ్ఢి'. ఢకారమునకులోపము (సూ-73). నకారమునకు అనుస్వారపరసవర్ణములచే ణకారము - 'శిణ్ఢి'. ఉత్తమపురుషమున ఆడాగమము పిత్‌గాన అల్లోపము రాదు. 'శినషాణి' ఇత్యాదిరూపము లగును అశినట్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున 'అశినష్ త్' అని యుండగా తకారమునకు హల్ఙ్యాదిసూత్రముచే (179) లోపము. షకారమునకు జశ్త్వముచే డకారము. దానికి చర్త్వముచే టకారము వికల్పముగ వచ్చి 'అశినట్-అశినడ్' అను రూపద్వయ మగును. అశినట్-అశినడ్, అశింష్టామ్, అశింషన్; అశినట్-అశినడ్, అశింష్టమ్, అశింష్ట; అశినషమ్, అశింష్వ, అశింష్మ.

విధిలిఙ్:- శింష్యాత్. యాసుట్ జిత్తుగాన అల్లోపము, నకారమునకు అనుస్వారము (సూ-78). ఆశీర్లిఙ్:- "శిష్యాత్, శిష్యాస్తామ్, శిష్యాసుః" మొ.

ఈధాతువు ఇదిత్‌గాన లుఙ్లునందు చ్లికి అఙ్‌వచ్చి (సూ-510) 'అశిషత్' ఇత్యాదిరూపము లగును. లృఙ్:- 'అశేక్ష్యత్'

18 పిష్లధాతువునకు చూర్ణము చేయుట అని యర్థము. అనిట్. దాని రూపములు గూడ శిష్లధాతురూపముల వలె నుండును.

భఞ్జో ఆమర్దనే. 19. శ్నాన్నలోపః- భనక్తి. బభఞ్జిథ-బభఙ్క్థ. భఙ్క్తా. భఙ్ధి. అభాఙ్క్షీత్,

19. భఞ్జ్ధాతువునకు విరచుట అని యర్థము. అనిట్. అఞ్జ్ధాత్వాదుల వలె 'భఞ్జ్' ధాతువునందు గూడ సహజసిద్ధమగు నకారము ఞకారమైనది. లట్టుమొదలగు సార్వధాతుకలకారములందు శ్న చేర్చిన పిమ్మట "శ్నాన్నలోపః" అను సూత్రముచే (67) ధాత్వవయవనకారము లోపించును.

లట్:-'భనక్తి, భఙ్క్తః, భఞ్జన్తి'. లిట్:- బభఞ్జ, బభఞ్జతుః, బభఞ్జుః; బభఞ్జిథ బభఙ్క్థ'' మొ. థల్‌నందు భారద్వాజనియమముచే వికల్పముగ ఇడాగమము. ఇడాగమపక్షమున- 'బభఞ్జిథ' అను రూపము. తదభావపక్షమున 'బభన్జ్థ' అని యుండగా జకారమునకు కుత్వముచే గకారము; దానికి చర్త్వముచే కకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములు- 'బభఙ్క్థ' అను రూపము సిద్ధించును. లుట్:- భఙ్క్తా. లృట్:- భఙ్క్ష్యతి, లోట్టునందు రూపములు 'అఞ్చ్' ధాతువునందువలె నుండును. లఙ్:- అభనక్. విధిలిఙ్:- భఞ్జ్యాత్. ఆశీర్లిఙ్:- భజ్యాత్. అభాఙ్క్షీత్:- లుఙ్ప్రథమపురుషైకవచనమున 'అభన్జ్స్త్' అని యుండగా తకారమునకు ఈడాగమము. వృద్ధి (సూ-467). 'అభాన్జ్స్ఈత్'. జకారమునకు కుత్వచర్త్వములచే కకారము. నకారమునకు అనుస్వారపరసవర్ణములచే ఙకారము. సకారమునకు షత్వము- 'అభాఙ్క్షీత్'. 'అభాఙ్క్షీత్, అభాఙ్క్తామ్, అభాఙ్క్షుః; అభాఙ్క్షీః, అభాఙ్క్తమ్, అభాఙ్క్త; అభాఙ్క్షమ్, అభాఙ్క్ష్వ, అభాఙ్క్ష్మ. లృఙ్:- అభఙ్క్ష్యత్.

భుజ పాలనాభ్యవహారయోః. 20. భునక్తి. భోక్తా. భోక్ష్యతి.

20. భుజ్ ధాతువునకు పాలించుట, భుజించుట అని అర్థము. అనిట్. రాబోవుసూత్రము (675) ననుసరించి ఇది పాలించుట అను నర్థమున పరస్మైపది. భుజించుట అను నర్థమున ఆత్మనేపది.

లట్:- భునక్తి. లిట్:- ''బుభోజ, బుభుజతుః, బుభుజుః'' మొ. లుట్:- భోక్తా. లృట్:- భోక్ష్యతి. లోట్:- భునక్తు-భుఙ్క్తాత్, భుఙ్క్తామ్, భుఞ్జన్తు, భుఙ్గ్ధి-భుఙ్క్తాత్, భుఙ్క్త-భుఙ్క్తమ్, భునజాని, భునజావ, భునజామ. లఙ్:- ''అభునక్-అభునగ్, అభుఙ్క్తమ్, అభుఞ్జన్'' మొ. విధిలిఙ్:- భుఞ్జ్యాత్, ఆశీర్లిఙ్:- భుజ్యాత్, లుఙ్:- అభోక్షీత్. లృఙ్:- అభోక్ష్యత్.

## 675. భుజోఽనవనే 1.3.66

తఙానౌ స్తః. ఓదనం భుఙ్క్తే. అనవనే కిమ్-మహీంభునక్తి.

'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' నుండి 'ఆత్మనేపదమ్' అనువర్తించును. భుజ్ధాతువునకు పాలనభిన్నమగు అర్థమున ఆత్మనేపదము- అనగా తఙ్ప్రత్యయ ఆనప్రత్యయములు- వచ్చును.

'ఓదనంభుఙ్క్తే' అను ఉదాహరణమునందు భుజ్ ధాతువు తినుట అను నర్థమునందు ప్రయోగింపబడినది గాన ఆత్మనేపదప్రత్యయము వచ్చినది. 'పాలించుట' అనునర్థముకంటె భిన్నమగు 'అర్థమునందు' అని చెప్పుటచే పాల నార్థమున ఆత్మనేపదము రాదు. 'మహీం భునక్తి' అను నపుడు పాలించు చున్నాడు అను నర్థమున పరస్మైపదిగ ప్రయోగింపబడినది.

దీనిఆత్మనేపదరూపములు:- లట్:- భుఙ్క్తే. లిట్:- బుభుజే. లుట్:- భోక్తా, లృట్:- భోక్ష్యతే. లోట్:- భుఙ్క్తామ్, భుఞ్జాతామ్, భుఞ్జతామ్, భుఙ్క్ష్వ, భుఞ్జాథామ్, భుఙ్ధ్వమ్; భునజై, భునజావహై, భునజా మహై. లఙ్:- అభుఙ్క్త, అభుఞ్జాతామ్, అభుఞ్జత. మొ. విధిలిఙ్:- భుఞ్జీత ఆశీర్లిఙ్:- భుక్షీష్ట. లుఙ్:- "అభుక్త. అభుక్షాతామ్, అభుక్షత" మొ లృఙ్:- అభోక్ష్యత.

ఞిఇన్ధీదీప్తౌ. 21. ఇన్ధే. ఇన్ధాతే, ఇన్ధతే; ఇన్త్సే; ఇన్ధ్వే. ఇన్ధా ఞ్చక్రే. ఇన్ధితా. ఇన్ధామ్, ఇన్ధాతామ్. ఇనధై. ఐన్ధ, ఐన్ధాతామ్, ఐన్ధాః. విద విచారణే. 22. విన్త్తే-వేత్తా.

ఇతి రుధాదయః

21. ఇన్ధీధాతువునకు ప్రకాశించుట అని అర్థము. సేట్. ఆత్మనేపది.

ఇన్ధే:- లట్ప్రథమపురుషైకవచనమున శ్నమ్ చేర్చిన పిమ్మట 'ఇనన్ ధ్ త' అని యుండగా 'శ్నాన్నలోపః' అను సూత్రముచే (671) ధాతునకారము నకు లోపము. ఙిద్వద్భావము గల అపిత్సార్వధాతుకము పరముగ నున్నది గాన అల్లోపము (సూ-577). తకారమునకు ధకారము (సూ-552). పూర్వధకారము నకు లోపము (సూ-73)వచ్చు పక్షమున 'ఇన్ధే'అను ఏకధకారరూపము, లోపము రాని పక్షమున దానికి (పూర్వధకారమునకు) జశ్త్వముచే దకారము వచ్చి 'ఇన్ద్ధే'అను రూపమును సిద్ధించును. ఇన్ధతే:- బహువచనమున ఝకుఅత్

ఆదేశమువచ్చినది (సూ-527). ఇన్త్సే:- 'ఇన్ధ్ సే' అని యుండగా ధకారము నకు జశ్త్వచర్త్వములు. ఉ.పు:- ఇన్ధే, ఇన్ధ్వహే, ఇన్ధ్మహే.

లిట్టునందు 'ఆమ్' వచ్చుటచే (సూ.514) ఇన్ధాఞ్చక్రే, ఇన్ధామ్బభూవ, ఇన్ధామాస, ఇత్యాదిరూపము లగును. లుట్:- ఇన్ధితా. ఌట్:- ఇన్ధిష్యతే. లోట్:- ఇన్ధామ్, ఇన్ధాతామ్, ఇన్ధతామ్; ఇన్త్స్వ, ఇన్ధాథామ్, ఇన్ధ్వమ్, ఇనధై, ఇనధావహై, ఇనధామహై. ఉత్తమపురుమున ఆడాగమము పిత్ గాన అల్లోపము రాలేదు.

ఐన్ధ:- లఙ్ ప్రథమపురుషైకవచనమున ఆడాగమము, వృద్ధి, శ్నమ్, ధాతునకారమునకులోపము, అల్లోపము, తకారమునకుధకారము, మొదటిధకారము నకు లోపవికల్పము- ఐన్ధ, ఐన్ధాతామ్, ఐన్ధత; ఐన్ధాః, ఐన్ధాథామ్, ఐన్ధ్వమ్; ఐన్ధి, ఐన్ధ్వహి, ఐన్ధ్మహి. విధిలిఙ్:- 'ఇన్ధీత, ఇన్ధీయాతామ్, ఇన్ధీరన్' మొ. ఆశీర్లిఙ్:- ''ఇన్ధిషీష్ట, ఇన్ధిషీయాస్తామ్, ఇన్ధిషీరన్'' మొ. లుఙ్:- ఐన్ధిష్ట. ఌఙ్:- ఐన్ధిష్యత.

22. విదధాతువునకు విచారణము చేయుట అని అర్థము. అనిట్. ఆత్మనేపది.

లట్:- 'విన్త్తే, విన్దాతే, విన్దతే' మొ. లిట్:- వివిదే. లుట్:- వేత్తా. ఌట్:- వేత్స్యతే. లోట్:- విన్త్తామ్, విన్దాతామ్, విన్దతామ్; విన్త్స్వ, విన్దాథామ్, విన్ద్వమ్, వినదై, వినదావహై, వినదామహై.

లఙ్:- 'అవిన్త్త, అవిన్దాతామ్. అవిన్దత' మొ. విధిలిఙ్:- ''విన్దీత, విన్దీయాతామ్, విన్దీరన్'' మొ. ఆశీర్లిఙ్:- విత్సీష్ట. లుఙ్:- అవిత్త, అవిత్సాతామ్, అవిత్సత; అవిత్థాః, అవిత్సాథామ్, అవిద్ధ్వమ్: అవిత్సి, అవిత్స్వహి, అవిత్స్మహి. ఌఙ్:- అవేత్స్యత.

రుధాదిగణము.

సమాప్తము.

# అథ తనాదయః

తను విస్తారే. 1.

676. తనాదికృఞ్భ్య ఉః 3.1.79

శపోఽపవాదః. తనోతి, తనుతే. తతాన, తేనే. తనితాసి. తనితాసే, తనిష్యతి, తనిష్యతే. తనోతు. తనుతామ్. అతనోత్. అతనుత. తనుయాత్; తన్వీత. తన్యాత్; తనిషీష్ట. అతానీత్-అతనీత్,

తనుధాతువునకు విస్తరించుట అని అర్థము. సేట్. ఉభయపది. ఉకారము ఇత్సంజ్ఞకము. నిష్ఠ పర మగునపుడు ఇడాగమము రాకుండుట దాని ప్రయోజనము. ఉదా:- తతమ్; తతవాన్.

తనాదులకంటెను, కృఞ్ధాతువుకంటెను (కర్త్రర్థకసార్వధాతుకము పర మగునపుడు) 'ఉ' ప్రత్యయము వచ్చును.

ఇది 'శప్' ప్రత్యయమునకు అపవాదము. లట్టునందు దీని రూపములు (రెండు పదములందును) స్వాదులలోని 'షుఞ్' ధాతురూపముల వలె నుండును.

లిట్టునందు కిత్, జిత్ ప్రత్యయములు పర మగునపుడు ఏత్వాభ్యాసలోపములు (సూ-462, 463) వచ్చును. పరస్మైపదమున "తతాన, తేనతుః, తేనుః; తేనిథ" ఇత్యాదిరూపములును, ఆత్మనేపదమున "తేనే, తేనాతే, తేనిరే" ఇత్యాదిరూపములును అగును. లుట్:- తనితా. ఌట్:- తనిష్యతి; తనిష్యతే. లోట్, లఙ్, విధిలిఙ్గులందు గూడ దాని రూపములు 'షుఞ్'ధాతు రూపముల వలె నుండును.

ఆశీర్లిఙ్:- (పర.) "తన్యాత్, తన్యాస్తామ్, తన్యాసుః" మొ. (ఆత్మ.) "తనిషీష్ట, తనిషీయాస్తామ్, తనిషీరన్" మొ. లుఙ్గునందు, పరస్మైపదమున, "అతో హలాదేర్లఘోః" అను సూత్రముచే (459) వృద్ధి వికల్పము. "అతానీత్-అతనీత్, అతానిష్టామ్-అతనిష్టామ్" ఇత్యాది ద్వివిధ రూపము లగును. ఆత్మనేపదమున "అతనిష్ట అతనిషాతామ్, అతనిషత; అతనిష్ఠాః" ఇత్యాదిరూపము లగును.

677. తనాదిభ్యస్తథాసోః 2.4.79

తనాదేః సిచో వా లుక్ స్యాత్ తథాసోః. అతత—అతనిష్ట, అతథాః—అతనిష్ఠాః. అతనిష్యత్; అతనిష్యత.

"గాతిస్థాఘుపాభూభ్యః సిచః పరస్మైపదేషు" "ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః" "విభాషాఘ్రాధేట్శాచ్ఛాసః" అను సూత్రములనుండి 'సిచః' 'లుక్', 'విభాషా' అనువర్తించును. తనాదిధాతువులకంటె పర మగు సిచ్‌కు 'త' 'థాస్' ప్రత్యయములు పర మగునపుడు, లోపము వికల్పముగ వచ్చును.

అతత:— 'అతన్ స్ త' అని యుండగా ఈ సూత్రముచే సిచ్ కు లోపము—'అతన్త', అనుదాత్తోపదేశ—"ఇత్యాదిసూత్రముచే (562) నకార లోపము. 'అతత' అను వైకల్పిక రూపము సిద్ధించును. ఇట్లే 'థాస్' పర మగునపుడు సిచ్ నకారములకు లోపము వచ్చుటచే 'అతథాః' అను రూపము సిద్ధించును. సిజ్‌లోపము రాని పక్షమున— 'అతనిష్ట' 'అతనిష్ఠాః' అను రూపములు సిద్ధించును. ల్భట్ :— అతనిష్యత్, అతనిష్యత.

షణుదానే. 2. సనోతి; సనుతే.

షణు ధాతువునకు ఇచ్చుట అని అర్థము. సేట్. ఉభయపది. షకారమునకు సకారము (సూ—255). షకారము పోయినతోడనే తన్నిమిత్తక మగు ణకారము కూడ పోయి నకారమే ఉండును. దీని రూపము లన్నియు చాలవరకు తనుధాతురూపముల వలె నుండును.

678. యే విభాషా 6.4.43

జనసనఖనామాత్వం వా యాదౌ క్ఙితి, సాయాత్—సన్యాత్. అసాసీత్—అసనీత్.

'జనసనఖనాంసఞ్ఝలోః' 'విడ్వనోరనునాసికస్యాత్' అను సూత్రముల నుండి 'జనసనఖనాం' 'ఆత్' అనువర్తించును. "అనుదాత్తోపదేశవనతితనోత్యాదీనామనునాసికలోపోఝలిక్ఙితి" నుండి 'క్ఙితి' అనువర్తించును. యకారాది యగు కిత్ ఙిత్ ప్రత్యయము పర మగునపుడు జన్. సన్, ఖన్ ధాతువులకు ఆదాగమము వికల్పముగ వచ్చును.

ఆశీర్లిఙినందు (పరస్మైపదమున) యాసుట్ కిత్తు గాన అది పర మగునపుడు ఈ సూత్రముచే వికల్పముగ అలోన్త్యపరిభాషచే (సూ—21) నకారస్థాన

క్షమున ఆకారము వచ్చును. ఆకారపక్షమున 'సాయాత్, సాయాస్తామ్'ఇత్యాది రూపములును, తదభావపక్షమున 'సన్యాత్, సన్యాస్తామ్' ఇత్యాదిరూపములును అగును. విధిలిఙ్ఙనందలి యాసుట్‌కును ధాతువునకును మధ్య 'ఉ'ప్రత్యయ ముండుటచే ఈ సూత్రము ప్రవర్తింపదు.

లుఙ్, ఆత్మనేపదమునందు, 'త' 'థాస్'లు పరమగునపుడు 'అసన్‌స్త' 'అసన్‌స్థాస్' అని యుండగా 'తనాదిభ్యస్తథాసోః' అను సూత్రముచే (677) సిచ్‌కు లోపము 'అసన్‌త' 'అసన్‌థాస్' అని యుండగా:-

679. జనసనఖనాం సఞ్ ఝలోః 6.4.42

ఏషామాకారోన్తాదేశః స్యాత్ సని ఝలాదౌ క్ఙితి. అసాత. అసనిష్ట. అసాథాః. అసనిష్ఠాః.

పై సూత్రమునందు వలె 'క్ఙితి' అను పదము అనువర్తించును. సన్ ప్రత్యయము, ఝలాది యగు కిత్ గాని ఙిత్ గాని యైన ప్రత్యయము పర మగు నపుడు జన, సన, ఖనధాతువులకు ఆకారము అన్తాదేశముగ వచ్చును.

ఈసూత్రముచే నకారమునకు ఆకారాదేశముచేయగా 'అసాత' 'అసాథాః' అను రూపము లగును. సిజ్‌లోపము లేని పక్షమున సిచ్‌కు ఇడాగమము వచ్చుటచే ఝలాదిప్రత్యయము పరముగ లేదు గాన ఈ సూత్రము ప్రవర్తింపదు. త, థాస్ ప్రత్యయములు లిఙ్ స్థానమున వచ్చినవి గాన ఙిత్తులు.

క్షణుహింసాయామ్ 2. క్షణోతి; క్షణుతే. హ్మ్యన్తేతి న వృద్ధిః- అక్షణీత్, అక్షత, అక్షణిష్ట. అక్షథాః-అక్షణిష్ఠాః.

క్షణ్ ధాతువునకు హింసించుట అని యర్థము. సేట్. ఉదిత్. ఉభయపది. దీనిరూపములు చాల వరకు తనుధాతురూపముల వలె నుండును.

పరస్మైపదిలుఙ్ఙనందు 'అతోహలాదేర్లఘోః'అను సూత్రముచే (459) ప్రాప్తమగు వైకల్పికవృద్ధి ''హ్మ్యన్త-క్షణ-శ్వస-జాగృ-ణిశ్వ్యేదితామ్'' అను సూత్రముచే (468) నిషేధింపబడినది గాన 'అక్షణీత్' మొదలగు ఏకవిధ రూపములు మాత్రమే యుండును. ఆత్మనేపదమున త. థాస్ లు పర మగు నపుడు సిజ్‌లోపవికల్పముచే (సూ-677) తనుధాతువునందువలె, అక్షత-అక్షణిష్ట, 'అక్షథాః, అక్షణిష్ఠాః' అను రెండేసి రూపము లగును.

క్షిణుచ. 4. ఉప్రత్యయే లఘూపధస్య గుణో వా. క్షేణోతి, క్షిణోతి. క్షేణితా. అక్షేణీత్. అక్షిత-అక్షేణిష్ట.

4. క్షిణు ధాతువునకు కూడ హింసించుట అని అర్థము. సేట్-ఉదిత్. ఉభయపది. లట్ మొదలగు సార్వధాతుకలకారములందు ఉప్రత్యయము చేర్చిన పిదప ఇకారమునకు గుణము (సూ-153) రావలసి యున్నది. ఈ గుణము 'ఉపధ' అను సంజ్ఞపై ఆధారపడి యున్నది. అందుచే "సంజ్ఞాపూర్వకో విధి రనిత్యః" అను పరిభాషననుసరించి ఈ కార్యము (గుణము) అనిత్యము కాన ఇచట రాదని ఆత్రేయాదుల మతము. వచ్చునని ఇతరుల మతము. అందుచే వికల్ప మని సిద్ధించినది. కావున గుణము వచ్చిన పక్షమున 'క్షేణోతి' ఇత్యాది రూపములును, తదభావపక్షమున 'క్షిణోతి' ఇత్యాదిరూపములును అగును.

ఉప్రత్యయనిమిత్తక మగు గుణవిషయముననే మతభేద ముండుటచే ఈ గుణవికల్పము ఉప్రత్యయము వచ్చెడు సార్వధాతుకలకారములందు మాత్రమే ప్రవర్తించును. 'తా', 'స్య' మొదలగు ప్రత్యయములు నిమిత్తముగాగల ఉపధా గుణము నిత్యముగ వచ్చి 'క్షేణితా' ఇత్యాదిరూపములు మాత్రమే యుండును.

తృణు అదనే. 5. తర్ణోతి, తృణోతి, తర్ణుతే; తృణుతే. డు కృఞ్ కరణే. 6. కరోతి.

తృణు ధాతువునకు తినుట అని అర్థము. సేట్. ఉభయపది. ఉదిత్.

లడాదిసార్వధాతుకలకారములందు "సంజ్ఞాపూర్వకో విధిరనిత్యః" అను మతము ననుసరించి లఘూపధగుణము చేయని పక్షమున 'తృణోతి' ఇత్యాది రూపములును, గుణము చేసిన పక్షమున 'తర్ణోతి' ఇత్యాదిరూపములును సిద్ధించును. ఆత్మనేపదమున. "తృణుతే, తృణ్వాతే, తృణ్వతే" మొ. 'తర్ణుతే, తర్ణ్వాతే, తర్ణ్వతే' మొ. లిట్. (ప.) తతర్ణ, తతృణతుః, తతృణుః మొ.(ఆ.) తతృణే. లుట్:- తర్ణితా. లృట్:- తర్ణిష్యతి; తర్ణిష్యతే. లోట్:- (ప.) "తర్ణోతు-తర్ణుతాత్, తర్ణుతామ్, తర్ణ్వన్తు" మొ. తృణోతు. (ఆ.) తర్ణుతామ్; తృణుతామ్. లఙ్:- ప. అతర్ణోత్; అతృణోత్. (ఆత్మ.) తర్ణ్వీత; తృణువీత, విధిలిఙ్:- తృణుయాత్;తృణ్వీత ఆశీర్లిఙ్:- (ప.) తృణ్యాత్. (ఆత్మ.) తర్ణిషీష్ట. లుఙ్:- (ప) అతర్ణీత్.

(ఆత్మ.) అతర్ణిష్ట, అ త్తర. (సూ-677) అతర్ణ్ణిష్ఠాః - అతర్ధాః. లృఙ్:- (ప) అతర్ణిష్యత్. (ఆ) అతర్ణిష్యత.

'డుకృఞ్'ధాతువునకు చేయుట అని యర్థము. అనిట్. ఞిత్తు గాన ఉభయపది. 'డు' ఇత్సంజ్ఞకము. డ్విత్తు గాన ఈధాతువునకు 'డ్వితః క్త్రిః' అను సూత్రముచే (860)'క్త్రి'ప్రత్యయము వచ్చి 'కృత్రిమమ్' మొదలగు రూపములు సిద్ధించుటకు వీలగును.

కరోతి- లట్ ప్రథమపురుషైకవచనమున 'కృ ఉ తి' అని యుండగా ఋకారమునకు 'ఉ'ప్రత్యయనిమిత్తక మగు (సూ-390)గుణము-'కరుతి'. ఉకారమునకు'తి'ప్రత్యయనిమిత్తక మగు గుణము.'కరోతి' అను రూపము సిద్ధించును. ద్వివచనమున ఉప్రత్యయగుణములు చేసిన పిమ్మట "కరుతస్"అని యుండగా-

680. అత ఉత్ సార్వధాతుకే 6.4.110

ఉప్రత్యయాన్తకృఞోఽకారస్య ఉత్ స్యాత్ సార్వధాతుకే క్ఙితి. కురుతః.

'ఉతశ్చప్రత్యయాత్', "నిత్యంకరోతేః" "గమహనజనఖనఘసాంలోపః క్ఙిత్యనఙి" అను సూత్రములనుండి 'ఉతః' 'ప్రత్యయాత్' 'కరోతేః' 'క్ఙితి' అనువర్తించును. కిత్తుగాని ఙిత్తుగాని యగు సార్వధాతుకము పర మగునపుడు ఉప్రత్యయాంత మగు కృఞ్ధాతువు యొక్క అకారమునకు హ్రస్వ మగు ఉకారము ఆదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే ఇతట కకారముపై నున్న అకారమునకు ఉకారము వచ్చి "కురుతః" అను రూపము సిద్ధించినది. 'తాస్' ఙిత్తుగాన ఉకారమునకు గుణము రాలేదు. బహువచనమున 'కృ ఉ అన్తి' అని యుండగా ఋకారమునకు గుణము- 'కర్ ఉ అన్తి'- అకారమునకు ఉకారము (సూ-680)- 'కుర్ ఉ అన్తి'. ఇపుడు 'హలిచ' అను సూత్రముచే (616) ఉకారమునకు దీర్ఘము రావలసి యుండగా:-

681. న భకుర్ఛురామ్ 8.2 79

భస్య కుర్ఛురోరుపధాయా న దీర్ఘః. కుర్వన్తి,

'ర్వోరుపధాయాదీర్ఘ ఇకః' నుండి 'ఉపధాయాః' 'దీర్ఘః' అనువర్తించును. భసంజ్ఞకములయొక్కయు, 'కుర్' 'ఛుర్'ల యొక్కయు ఉపధకు దీర్ఘము రాదు.

ఈ సూత్రముచే దీర్ఘము నిషిద్ధ మైనది గాన 'కురు అన్తి' అనునపుడు యణాదేశముచే 'కుర్వన్తి' అను రూపము సిద్ధించినది. కరోషి, కురుథః, కురుథ; కరోమి. ఉత్తమపురుషద్వివచనబహువచనప్రత్యయము లగు 'వస్' 'మస్'లు పర మగునపుడు 'కురువస్' 'కురుమస్' అని యుండగా 'లోపశ్చాస్యాన్యతరస్యాంమ్వోః' అను సూత్రముచే(505) ఉకారలోపము వికల్పముగ రావసి యుండ:-

### 682. నిత్యం కరోతేః 6.4.108

కరోతేః ప్రత్యయోకారస్య నిత్యం లోపో మ్వోః పరయోః. కుర్వః, కుర్మః. కురుతే. చకార; చక్రే. కర్తా. కరిష్యతి; కరిష్యతే. కరోతు; కురుతామ్. అకరోత్. అకురుత.

'ఉతశ్చప్రత్యయాత్' అను సూత్రము, "లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః" నుండి 'లోపః' 'మ్వోః' అనువర్తించును. మకారవకారములు పర మగునపుడు కృఞ్ ధాతువుకంటె పరమైన ప్రత్యయమునకు సంబంధించిన ఉకారమునకు లోపము నిత్యముగ వచ్చును.

ఈ సూత్రముచే ఉకారము లోపింపగా 'కుర్వః' 'కుర్మః' అను రూపములు సిద్ధించును. లట్. (ఆత్మ.)- కురుతే, కుర్వాతే, కుర్వతే; కురుషే, కుర్వాథే, కురుధ్వే; కుర్వే, కుర్వహే, కుర్మహే. లిట్. (ప.) చకార, చక్రతుః, చక్రుః; చకర్థ, చక్రథుః, చక్ర; చకార-చకర, చకృవ, చకృమ. (ఆత్మ.)"చక్రే, చక్రాతే, చక్రిరే" మొ. లుట్:- కర్తా. ౡట్:- 'ఋద్ధనోః స్యే' (500) కరిష్యతి; కరిష్యతే. లోట్, లఙ్లలందుకూడ దీని రూపములు తనుధాతురూపముల వలెనే యుండును. 'వ' 'మ' 'వహి' 'మహి'లు పరమగునపుడు మాత్రము (లఙ్నందు) ఉకారలోపము నిత్యముగ వచ్చును. (సూ-682).

### 683. యే చ 6.4.109

కృఞ ఉలోపో యాదౌ ప్రత్యయే పరే. కుర్యాత్; కుర్వీత. క్రియాత్; కృషీష్ట. అకార్షీత్; అకృత. అకరిష్యత్; అకరిష్యత.

'లోపశ్చాస్యాన్యతరస్యాంమ్వోః'నుండి'అస్య' 'లోపః' అనువర్తించును.

"నిత్యంకరోతేః" నుండి 'కరోతేః' అనువర్తించును. పూర్వసూత్రమునందు ఉకారము చెప్పబడియుండుటచే 'అస్య' అనుదానికి 'ఉకారమునకు' అని అర్థము. యకారాదిప్రత్యయము పర మగునపుడు గూడ కృఞ్ధాతువుకంటె పరమైన ఉకారమునకు లోపము వచ్చును.

విధిలిఙ్నందు పరస్మైపదమున గుణోత్వాదులు చేసిన పిమ్మట 'కురుయా' అని యుండగా ఈ సూత్రముచే ఉకారమునకు లోపము వచ్చి 'కుర్యాత్, కుర్యాతామ్, కుర్యుః' ఇత్యాదిరూపము లగును. (ఆత్మ.) 'కుర్వీత, కుర్వీయాతామ్, కుర్వీరన్' మొ. ఆశీర్లిఙ్:- (పరస్మైపది)- 'రిఙ్శయగ్లిఙ్క్షు' అను సూత్రముచే (546) ఋకారమునకు 'రిఙ్' ఆదేశము చేయుటచే 'క్రియాత్, క్రియాస్తామ్, క్రియాసుః' ఇత్యాదిరూపము లగును. (ఆత్మ.) 'కృషీష్ట' మొ. 'ఉశ్చ' అను సూత్రముచే (547) సీయుట్ కిత్తు గాన గుణము రాలేదు. లుఙ్ (పరస్మైపది) - వృద్ధివచ్చి (సూ-486) అకార్షీత్, అకార్ష్టామ్, అకార్షుః మొ. అకృత:- లుఙ్(ఆత్మనేపది) ప్రథమపురుషైకవచనమున 'హ్రస్వాదఙ్గాత్' అను సూత్రముచే (548) 'సిచ్'కు లోపము. 'థాస్' పర మగునపుడు కూడ ఇట్లే లోపము వచ్చును. 'అకృత, అకృషాతామ్, అకృషత' మొ. లృఙ్:- అకరిష్యత్, అకరిష్యత 'ఋద్ధనోః స్యే' అని (500) ఇడాగమము.

684 సమ్పరిభ్యాం కరోతౌ భూషణే 6.1.137

685. సమవాయేచ 6 1 13

సమ్పరిపూర్వస్య కరోతేః సుట్ స్యాత్ భూషణే సఙ్ఘాతే చార్థే. సంస్కరోతి-అలఙ్కరోతీత్యర్థః. సంస్కుర్వన్తి- సఙ్ఘీభవన్తీత్యర్థః. సమ్పూర్వస్య క్వచిదభూషణేఽపి సుట్. ''సంస్కృతం భక్షాః'' ఇతి జ్ఞాపకాత్.

'సుట్కాత్పూర్వః' నుండి 'సుట్', 'నిత్యంకరోతేః' నుండి 'కరోతేః' అనువర్తించును. అలంకరించుట, సంఘముగ నేర్పడుట అను నర్థములందు, 'సమ్', 'పరి' అను ఉపసర్గలు పూర్వమునందు గల కృఞ్ ధాతువునకు 'సుట్' ఆగమము వచ్చును.

సంస్కరోతి:- ఇచట 'సమ్'పూర్వక మగు కృధాతు వున్నది. దానికి

అలంకరించుచున్నాడు అని యర్థము. అందుచే సుట్(స్) ఆగమము టిత్తుగాన కృఞ్ధాతువునకు ఆద్యవయవముగ వచ్చినది. 'మోనుస్వారః'అను సూత్రముచే (77) మకారమునకు అనుస్వారము. ఇట్లే 'సంఘముగ నేర్పడు చున్నారు' అను నర్థమున సుడాగమము వచ్చి 'సంస్కుర్వన్తి' అని యేర్పడినది. కాని పాణిని "సంస్కృతం భక్షాః" అని ప్రయోగించి అలంకరించుట అను నర్థము లేనపుడు కూడ సమ్పూర్వక మగు కృఞ్ ధాతువునకు సుడాగమము చేసి యున్నాడు. దానిచే అలంకరించుట అను నర్థముకంటె భిన్న మగు అర్థమునందు కూడ 'సమ్' పూర్వకకృఞ్ధాతువునకు సుడాగమము వచ్చు నని సూచింపబడినది. అందుచే "అన్నం సంస్కరోతి" ఇత్యాదిప్రయోగములలో కూడ సుడాగమము రావచ్చును. ఈవిధముగ 'పరిష్కరోతి' ఇత్యాద్యుదాహరణములూహ్యములు.

686. ఉపాత్ప్రతియత్న-వైకృత-వాక్యాధ్యాహారేషు చ 6.1.139

ఉపాత్ కృఞః సుట్ స్యాదేష్వర్థేషు; చాత్ ప్రాగుక్తయోరర్థయోః. ప్రతియత్నో గుణాధానమ్. వికృతమేవ వైకృతమ్- వికారః, వాక్యాధ్యాహారః- ఆకాఙ్క్షితైకదేశపూరణమ్ ఉపస్కృతా కన్యా. ఉపస్కృతాః బ్రాహ్మణాః. ఏధోదకస్యోపస్కురుతే. ఉపస్కృతం భుఙ్క్తే. ఉపస్కృతం బ్రూతే.

'కరోతేః' 'సుట్' అనుపదములు పై సూత్రములందు వలె అనువర్తించును. ఉపకంటె పర మగు కృఞ్ ధాతువునకు ప్రతియత్నము, వైకృతము. వాక్యాధ్యాహారము అనునర్థములందును, 'చ' అనుటచే పై సూత్రములలో చెప్పిన భూషణసంఘాతార్థములందును సుడాగమము వచ్చును.

ప్రతియత్న మనగా క్రొత్తగుణమును సంపాదించుట. వైకృత మనగా వికారము. వాక్యాధ్యాహార మనగా ఆవశ్యక మగు ఒక భాగమును పూరించుట.

ఉపస్కృతా బ్రాహ్మణాః- ఇచట సంఘీభావార్థమున సుడాగమము వచ్చినది. ఏధోదకస్యోపస్కురుతే:- కట్టె ఉదకమును పరిష్కరించుచున్నది. ఇచట క్రొత్తగుణమును కలిగించుట అను నర్థమున ప్రయోగింప బడినది గాన పరిపూర్వక కృఞ్ధాతువునకు సుట్ వచ్చినది. ఉపస్కృతం భుఙ్క్తే:- 'వికృతమగు వస్తువును తినుచున్నాడు' అని అర్థము ఇచట ప్రతియత్నార్థమున ప్రయుక్త కృఞ్ధాతువునకు సుడాగమము వచ్చినది. ఉపస్కృతం బ్రూతే:- వాక్యమును

అధ్యాహారమును తెచ్చుకొనుచు మాటలాడుచున్నాడు. వాక్యాధ్యాహారార్థమున సుడాగమము వచ్చినది.

వను యాచనే. 7. వనుతే. వవనే. మను అవబోధనే. 8. మనుతే. మేనే. మనితా, మనిష్యతే. మనుతామ్. అమనుత. మన్వీత. మనిషీష్ట. అమనిష్ట. అమత. అమనిష్యత.

ఇతి తనాదయః.

7. వను ధాతువునకు యాచించుట అని యర్థము. సేట్. ఆత్మనేపది. దీని రూపములన్నియు తను ధాతువుయొక్క అత్మనేపదరూపములవలె నుండును. లిట్టునందు రావలసియున్న (సూ-462) ఏత్వాభ్యాసలోపములు 'న శసదదవాదిగుణానామ్' అను సూత్రముచే (544) నిషేధింపబడినవి గాన 'వవనే, వవనాతే, వవనిరే' ఇత్యాదిరూపము లగును. ఇదియే భేదము.

8. మను ధాతువునకు తెలిసికొనుట అని యర్థము. సేట్. ఆత్మనేపది. దీని రూపములు పూర్తిగ తను ధాతువు ఆత్మనేపదరూపములవలె నుండును.

తనాదిగణము సంపూర్ణము,

# అథ క్ర్యాదయః

డుక్రీఞ్ ద్రవ్యవినిమయే. 1.

687. క్ర్యాదిభ్యః శ్నా 3.1.81

శపోఽపవాదః. క్రీణాతి. ఈ హల్యఘోః- క్రీణీతః. శ్నాభ్యస్తయోరాతః- క్రీణన్తి; క్రీణాసి, క్రీణీథః, క్రీణీథ; క్రీణామి, క్రీణీవః, క్రీణీమః. క్రీణీతే, క్రీణాతే, క్రీణతే; క్రీణీషే, క్రీణాథే, క్రీణీధ్వే; క్రీణే, క్రీణీవహే, క్రీణీమహే.

చిక్రాయ, చిక్రియతుః, చిక్రియుః; చిక్రేథ-చిక్రయిథ. చిక్రియే. క్రేతా. క్రేష్యతి, క్రేష్యతే. క్రీణాతు, క్రీణీతాత్, క్రీణీతామ్. అక్రీణాత్; అక్రీణీత, క్రీణీయాత్; క్రీణీత. క్రేయాత్, క్రేషీష్ట. అక్రైషీత్. అక్రేష్ట. అక్రేష్యత్; అక్రేష్యత.

ప్రీఞ్ తర్పణే కాన్తౌ చ. 2. ప్రీణాతి; ప్రీణీతే. శ్రీఞ్ పాకే 3. శ్రీణాతి: శ్రీణీతే. మీఞ్ హింసాయామ్. 4.

ప్రీఞ్ ధాతువునకు సంతసింపచేయుట అని అర్థము. అనిట్ ఉభయపది. 3. శ్రీఞ్ ధాతువునకు వండుట అని అర్థము. అనిట్. ఉభపది. వీటి రూపములు క్రీధాతురూపములవలె నుండును.

4. మీఞ్ ధాతువునకు హింసించుట యని అర్థము. అనిట్. ఉభయపది. లట్‌నందు దాని రూపములు క్రీధాతురూపములవలె నుండును.

688. హిను మీనా 8.4.15

ఉపసర్గస్థాత్ నిమిత్తాత్ పరస్యైతయోర్నస్య ణః స్యాత్. ప్రమీణాతి; ప్రమీణీతే, 'మీనాతి-' ఇత్యాత్వమ్. మమౌ. మిమ్యతుః, మమిథ—మమాథ. మిమ్యే. మాతా. మాస్యతి, మీయాత్. మాసీష్ట, అమాసీత్-అమాసిష్టామ్. అమాస్త.

'రషాభ్యాంనోణః సమానపదే' అనుసూత్రము 'ఉపసర్గాదసమాసేఽపి' నుండి 'ఉపసర్గాత్' అనువర్తించును. ఉపసర్గయందున్న నిమిత్తముకంటె (రేఫషకారములకంటె) పరమైన 'హు' (స్వాదిగణము) 'మీ' (క్ర్యాదిగణము) ధాతువుల నకారమునకు ణకారము వచ్చును.

ప్రమీణాతి, ప్రమీణీతే:- ఇచట మీధాతువు ఉపసర్గస్థ మగు రేఫరూప నిమిత్తకంటె పరముగ నున్నది గాన ణత్వము వచ్చినది.

మమౌ:- లిట్ ప్రథమపురుషైకవచనమున 'మీ అ'అని యుండగా వృద్ధినిమిత్త మగు శిద్భిన్న ప్రత్యయము (ణల్) పరముగా నున్నది గాన 'మీ'కి "మీనాతిమినాతిదీఙాం ల్యపి చ" అను సూత్రముచే (641) ఆకారము అంతాదేశమైనది. ణల్‌కు "ఆత ఔ ణలః' అనుసూత్రముచే (491) ఔకారము. పిమ్మట ద్విత్వము, అభ్యాసకార్యము (హ్రస్వము), వృద్ధి ''మమౌ'' మిమ్యతుః- ద్వివచనమున 'మీ అతుస్' అని యుండగా ద్విత్వాభ్యాసకార్య, యణాదేశములు.

'మినాతి-' ఇత్యాదిసూత్రము (641) గుణవృద్ధ్యాదులకు నిమిత్తము లగు ప్రత్యయములు (తిప్, సిప్, మిప్ మొ.)పర మగు నపుడుమాత్రమే ప్రవర్తించును గాన 'అతుస్' మొదలగు కిత్ప్రత్యయములు పర మగునపుడు రాదు.

థల్ పర మగునపుడు ఆకారము (సూ. 641) అంతాదేశము. ద్విత్వా భ్యాసకార్యములు భారద్వాజనియమముచే ఇడ్వికల్పము. ఇట్ పక్షమున 'మామా ఇథ'అని యుండగా 'ఆతోలోప ఇటిచ' అనుసూత్రముచే (49?) ఆకారము లోపించి 'మమిథ' అను రూపమును. ఇడభావపక్షమున 'మమాథ' అను రూపమును సిద్ధించును. మమథుః, మమ, (ఉ. పు.) మమౌ, మమివ, మమిమ. 'ఆత్మనేపదమున, ద్విత్వాభ్యాసకార్యములు, "ఏరనేకాచోఽసంయోగ పూర్వస్య" అనుసూత్రముచే యణాదేశము చేయగా 'మిమ్యే' మిమ్యాతే, మిమ్యిరే'' ఇత్యాదిరూపములగును. లుట్:- మాతా, లృట్. మాస్యతి; మాస్యతే లోట్, లఙ్, విధిలిఙ్లలందు క్రీధాతువునందువలె రూపము లుండును. ఆశీర్లిఙ్ (ప):- మీయాత్ (ఆ) మాసీష్ట (ఆత్వము సూ.641) అమాసీత్:- లుఙ్ (పరస్మైపది); ప్రథమపురుషైకవచనమున ఆత్వము; 'యమరమనమాతాం సక్చ' అనుసూత్రముచే (498) 'సక్' ఆగమము, సిచ్‌కు ఇడాగమము; సిచ్‌కు లోపము (సూ. 448) అమాసీత్; 'అమాసీత్, అమాసిష్టామ్, అమాసిషుః' మొ. (ఆత్మ.)- అమాస్త, అమాసాతామ్, అమాసత, మొ. లృఙ్:- అమాస్యత్; అమాస్యత.

షిఞ్ బన్ధనే. 5. సినాతి, సినీతే, సిషాయ; సిష్యే, సేతా. స్కుఞ్ ఆప్లవనే. 6.

5. 'షిఞ్' ధాతువునకు బంధించుట అని అర్థము. అనిట్. ఉభయ పది. షకారమునకు సకారాదేశము (సూ. 255)

సినాతి; సినీతే:- లట్టునందు క్రీధాతురూపముల వలె నుండును. సిషాయ:- లిట్టు (పర.) ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాస కార్యములు, ఇకారమునకు వృద్ధి (సూ 182) ఆయాదేశము, సకారము ఆదేశరూపమైనది గాన దానికి షత్వము.

సిష్యే:- లిట్ (ఆత్మ.) ప్రథమపురుషైకవచనమున ద్విత్వాదులు చేసిన పిమ్మట 'సిషిఏ'అని యుండగా 'ఉవఙ్'ను (సూ. 199) బాధించి "ఏరనే కాచోఽసంయోగపూర్వస్య"అను సూత్రముచే (700) యణాదేశము ఇతర లకారరూపము లన్నియు క్రీధాతురూపముల వలె నుండును.

స్కుఞ్ధాతువునకు నాలుగువైపుల గంతులు వేయుట అని అర్థము. అనిట్. ఉభయపది.

689. స్తన్భు-స్తున్భు-స్కన్భు-స్కున్భు,
స్కుఞ్భ్యః శ్నుశ్చ 3.1.82

చాత్-శ్నా. స్కునోతి, స్కునాతి. స్కునుతే, స్కునీతే. చుస్కావ; చుస్కువే. అస్కౌషీత్; అస్కోష్ట. స్తన్భ్వాదయశ్చత్వారః సౌత్రాః. సర్వే రోధనార్థాః పరస్మైపదినః.

స్తన్భు, స్తున్భు,స్కన్భు, స్కున్భు, స్కుఞ్ధాతువులకంటె పరముగ శ్ను ప్రత్యయము కూడ వచ్చుచు.. 'చ'అనుటచే శ్నాప్రత్యయము కూడ వచ్చును.

ఈ సూత్రము ననుసరించి 'శ్ను'ప్రత్యయ'శ్నా'ప్రత్యయములు రెండును వచ్చును గాన 'స్కు'ధాతురూపములు స్వాదిధాతురూపముల వలెను. క్ర్యాదిధాతు రూపములవలెను కూడ ఉండును. విశేషకార్యము లేవియు లేవు.

స్తన్భు, స్తున్భు, స్కన్భు, స్కున్భుధాతువులు సౌత్రధాతువులు. అనగా ఇవి ఈసూత్రమునందు మాత్రమే చెప్పబడినవి గాని ధాతుపాఠమున పఠింపబడ లేదు. వీటికి అడ్డగించుట అని అర్థము. పరస్మైపదులు.

'స్తన్భు'ధాతువునకు 'శ్ను' 'శ్నా'ప్రత్యయములు చేర్చినపుడు, ఈ రెండును "సార్వధాతుకమపిత్" అను సూత్రముచే (503) ఙిత్తులు గాన, అవి పరముగ నుండగా 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' అని (335) నకార లోపము వచ్చును. సార్వధాతుకలకారములందు స్వాదిక్ర్యాదిధాతువులకు వలె "స్తభ్నోతి-స్తభ్నాతి" ఇత్యాది ద్వివిధరూపము లగును.

లిట్:- తస్తమ్భ. లుట్:- స్తమ్భితా: లృట్.- స్తమ్భిష్యతి. ఆశీర్లిఙ్:- స్తభ్యాత్, లుఙ్:- అస్తమ్భీత్ లృఙ్:- అస్తమ్భిష్యత్.

లోట్మధ్యమపురుషైకవచనమున విశేషకార్యము చెప్పబడుచున్నది.

690. హలః శ్నశ్శానజ్ఝౌ 3.1.83

హలః పరస్య శ్నః 'శానచ్' ఆదేశః స్యాద్ హౌ పరే. స్తభాన.

'హి' పర మగునపుడు, హల్లుకంటె పర మగు 'శ్నా'కు 'శానచ్' అను నాదేశము వచ్చును.

'శానచ్'లోని శకారచకారములు ఇత్సంజ్ఞకములు. లోట్మధ్యమపురు షైకవచనమున 'స్తన్భ్శ్నా(నా)హి' అని యుండగా అపిత్సార్వధాతుక మగు

'శ్నా'కు జిద్వద్భావ మున్నది గాన శకారమునకు లోపము (సూ-335). 'స్తభ్ శ్నాహి' అని యుండగా ఈ సూత్రముచే 'అతో హేః' అను సూత్రముచే(418) 'హి'కి లోపము. 'స్తభాన' అను రూపము సిద్ధించును.

691. జౄ-స్తన్భు, మ్రుచు-మ్లుచు-గ్రుచు-గ్లుచు-గ్లుఞ్చుశ్విభ్యశ్చ 3.1.58

చ్లేరఙ్ వా స్యాత్.

'చ్లేః సిచ్', 'అస్యతివక్తిఖ్యాతిభ్యోఽఙ్' 'ఇరితో వా' నుండి 'చ్లేః' 'అఙ్' 'వా' అనువర్తించును. ఈధాతువులకంటె పరమైన 'చ్లి'కి అఙ్ ఆదేశము వికల్పముగ వచ్చును.

692. స్తన్భేః 8.3.67

స్తన్భేః సౌత్రస్య సస్యషః స్యాత్. వ్యష్టభత్; అస్తంభీత్.

"ఉపసర్గాత్సునోతిసువతిస్యతిస్తౌతిస్తోభతిస్థాసేనయసేధసిచసఞ్జస్వఞ్జామ్" నుండి 'ఉపసర్గాత్' అనువర్తించును. ఉపసర్గలో నున్న నిమిత్తముకంటె (ఇణ్ కవర్గములకంటె) పరమైన స్తన్భ్ ధాతుసకారమునకు షకారము ఆదేశముగ వచ్చును.

లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'అ స్తన్భ్ చ్లి త్' అని యుండగా చ్లికి 'అఙ్' ఆదేశము చేసిన పక్షమున ఇది ఙిత్తు గాన నకారలోపము (సూ-335) -'అ స్తభత్' అను రూపము సిద్ధించును. 'వి'అను ఉపసర్గ చేర్చినపుడు పై సూత్రముచే షత్వము, ష్టుత్వము వచ్చి "వ్యష్టభత్" అను రూప మగును. అఙ్ రాని పక్షమున 'అ స్తమ్భీత్' అను రూప మగును.

స్తున్భు, స్కన్భు, స్కున్భు, ధాతువులరూపములు గూడ ఈవిధము గనే యుండును. లుఙ్ఙునందు 'చ్లి'కి అఙాదేశము ఒక్క 'స్తన్భ్' ధాతువునకు మాత్రమే విధింపబడినది గాన ఈధాతువులకు అఙాదేశరూపము లుండవు. ఇదియే భేదము.

యుఞ్ బన్ధనే. 7. యునాతి; యునీతే. యోతా. క్నూఞ్ శబ్దే. 8. క్నూనాతి; క్నూనీతే. క్నవితా. దౄఞ్ హింసాయామ్. 9. దృణాతి, దృణీతే. ద్రూఞ్ హింసాయామ్. 10. ద్రుణాతి; ద్రుణీతే. పూఞ్ పవనే. 11.

7 యుఞ్ ధాతువునకు బంధించుట అని అర్థము. అనిట్. ఉభయపది. లట్:- యునాతి. యునీతే లిట్:- యుయావ, యుయువతుః మొ. యుయువే. ఈవిధముగ క్రీధాతువునందు వలె ప్రక్రియ యుండును.

8. క్నూఞ్ ధాతువునకు ధ్వనిచేయుట అని అర్థము. సేట్. ఉభయపది. లిట్:- చుక్నావ; చుక్నువే. ఆశీర్లిఙ్:- క్నూయాత్; క్నవిషీష్ట. లుఙ్:- అక్నావీత్; అక్నవిష్ట.

9. దౄఞ్ ధాతువునకు హింసించుట అని యర్థము. అనిట్. ఉభయపది. లిట్:- దదార; దదరే. లుట్:- దర్తా. ల్ఋట్:- దరిష్యతి; దరిష్యతే. లోట్:- దృణాతు; దృణీతామ్. లఙ్:- అదృణాత్; అదృణీత. విధిలిఙ్:- దృణీయాత్; దృణీత. ఆశీర్లిఙ్:- ద్రియాత్; దృషీష్ట. లుఙ్:- అదార్షీత్, అదృత. ల్ఋఙ్:- అదరిష్యత్, అదరిష్యత. 'స్య' పరమగునపుడు ఇడాగమము (సూ-500).

10. ద్రూఞ్ ధాతువునకు హింసించుట అని అర్థము సేట్. ఉభయపది. లిట్:- దుద్రావ; దుద్రువే. లుట్:- ద్రవితా. ల్ఋట్:- ద్రవిష్యతి; ద్రవిష్యతే. లుఙ్:- అద్రావీత్; అద్రవిష్ట.

పూఞ్ ధాతువునకు పవిత్రము చేయుట అని అర్థము. సేట్. ఉభయపది.

693. ప్వాదీనాం హ్రస్వః 7.3.80

పూఞ్, లూఞ్, స్తౄఞ్, కౄఞ్, వౄఞ్, ధూఞ్, శౄ, పౄ, యౄ, భౄ, మౄ, దౄ, జౄ, ఝౄ, ధౄ, నౄ, కౄ, ఋ, గ, జ్యా, రీ, లీ, వ్లీ, ప్లీనాం చతుర్వింశతేః శితి హ్రస్వః. పునాతి, పునీతే. పవితా.

'ష్ఠివుక్లముచమాం శితి' నుండి 'శితి' అనువర్తించును. 'పూఞ్' మొదలగు ఇరువదినాలుగు ధాతువులకును శిత్ పరమగునపుడు హ్రస్వము వచ్చును

లట్:- పునాతి; పునీతే. లిట్:- పుపావ; పుపువే. లుట్:- పవితా, ల్ఋట్:- పవిష్యతి; పవిష్యతే. లోట్:- పునాతు; పునీతామ్. లఙ్:- అపునాత్; అపునీత. విధిలిఙ్:- పునీయాత్. పునీత. ఆశీర్లిఙ్:- పూయాత్, పవిషీష్ట. లుఙ్:- అపావీత్, అపవిష్ట. ల్ఋఙ్:- అపవిష్యత్, అపవిష్యత.

లూఞ్ ఛేదనే. 12. లునాతి; లునీతే. స్తౄఞ్ ఆచ్ఛాదనే. 13. స్తృణాతి. 'శర్పూర్వాః ఖయః'-తస్తార, తస్తరతుః, తస్తరే. స్తరితా-స్తరీతా. స్తృణీయాత్; స్తృణీత. స్తీర్యాత్.

12. లూఞ్ ధాతువునకు ఛేదించుట అని అర్థము. సేట్. ఉభయపది. దీని రూపములు పూఞ్ధాతురూపముల వలె సిద్ధించును. 13. స్తౄఞ్ ధాతువునకు ఆచ్ఛాదించుట అని అర్థము. సేట్, ఉభయపది. సార్వధాతుకములందు దీని ప్రక్రియ పూఞ్ధాతుప్రక్రియ వలె నుండును.

తస్తార:- లిట్ (పర) ప్రథమపురుషైకవచనమున 'స్తౄఅ' అని యుండగా ద్విత్వము 'స్తౄస్తౄఅ' 'ఉరత్' (సూ-475)—'స్తర్స్తౄఅ' 'శర్పూర్వాః ఖయః' అను సూత్రముచే (651) తకారము శేషించును-'తస్తౄ అ'. 'ఋచ్ఛత్యౄతామ్' అను సూత్రముచే (617) గుణము —'తస్తర్అ' 'అతఉపధాయాః' (457)— 'తస్తార'.

తస్తరతుః:- ద్వివచనమున 'స్తౄ అతుస్' అని యుండగా ద్విత్వాభ్యాసకార్యాదులు చేసిన పిదప గుణము (సూ-617) వచ్చినది. ఆత్మనేపదమునందు గూడ ఈవిధముగనే గుణము చేయగా 'తస్తరే, తస్తరాతే, తస్తరిరే' ఇత్యాదిరూపము లుండును.

'తా' 'స్య'మొదలగునవి పర మగునపుడు 'వౄతో వా'అను సూత్రముచే (618) ఇట్‌కు దీర్ఘవికల్పము-'స్తరీతా-స్తరితా'; 'స్తరీష్యతి-స్తరిష్యతి' 'స్తరీష్యతే-స్తరిష్యతే'' 'అస్తరీష్యత్-అస్తరిష్యత్' ''అస్తరీష్యత-అస్తరిష్యత'' ఇత్యాది ద్వివిధరూపము లుండును.

స్తీర్యాత్:- ఆశీర్లిఙ్(పర.)నందు యాసుట్ పర మగునపుడు ''ౠత ఇద్ధాతోః'' అను సూత్రముచే (663) 'ఇర్' ఆదేశము; 'హలిచ' అను సూత్రముచే (616) ఇకారమునకు దీర్ఘము—'స్తీర్యాత్'

## 691. లిఙ్సిచోరాత్మనేపదేషు 7.2.42

వృఙ్వృఞ్భ్యాం ౠదన్తాచ్చ పరయోర్లిఙ్సిచోరిడ్వా స్యాత్ తఙి.

'ఇట్ సనివా' 'వృతో వా' నుండి 'ఇట్', 'వా' 'వౄతః' అనువర్తించును. 'వౄతః' అనుదానికి 'వృఙ్, వృఞ్, ౠకారాన్తధాతువులు' అని

అర్థము. ఆత్మనేపదప్రత్యయములు పర మగునపుడు వృఙ్, వృఞ్, ధాతువుల కంటెను, ౠకారాంతధాతువులకంటెను పర మగు లిఙ్, సిచ్, లకు ఇడాగ మము వికల్పముగ వచ్చును.

695. నలిఙి 7.2.39

వౄతః ఇటో లిఙి న దీర్ఘః. స్తరిషీష్ట. 'ఉశ్చ' ఇత్యనేన కిత్త్వమ్. స్తీర్షీష్ట. 'సిచి చ పరస్మైపదేషు'- అస్తారీత్, అస్తారిష్టామ్, అస్తారిషుః. అస్తరీష్ట-అస్తరిష్ట-అస్తీర్ష్ట.

'వౄతో వా', 'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' 'గ్రహోఽలిటిదీర్ఘః' అనుసూత్ర ములనుండి 'వౄతః' 'ఇట్' 'దీర్ఘః'అనువర్తించును. వృఙ్, వృఞ్, ౠకా రాంతధాతువులకంటె పరమైన 'ఇట్'కు లిఙ్ పర మగునపుడు దీర్ఘము రాదు.

స్తరిషీష్ట:- ఆశీర్లిఙ్ (ఆత్మ.) ప్రథమపురుషైకవచనము సీయుట్సుడా గమాదులు చేసిన పిమ్మట 'స్తౄసీస్త' అని యుండగా ఇడ్వికల్పము (సూ-694)- 'స్తౄఇసీస్త'. ౠకారమునకు గుణము- 'స్తర్ఇసీస్త'- రెండు సకారములకును షత్వము; ష్టుత్వము 'స్తరిషీష్ట'. ఇచట 'వౄతోవా' అను సూత్రముచే (618) 'ఇట్'(ఇ)కు రావలసి యున్న వైకల్పిక దీర్ఘము ఈ సూత్రముచే నిషేధింపబడినది. ఈ విధముగ ఇడాగమపక్షమున 'స్తరిషీష్ట, స్తరిషీయాస్తామ్, స్తరిషీరన్' ఇత్యాదిరూపము లగును. ఇడాగమము రాని పక్షమున సీయుట్ 'ఉశ్చ' అను సూత్రముచే (547) కిత్తుగాన ౠకారమునకు గుణము రాదు. 'ఇర్' ఆదేశము (సూ-663), ఇకారమునకు దీర్ఘమును (సూ-616) వచ్చి 'స్తీర్షీష్ట, స్తీర్షీయాస్తామ్, స్తీర్షీరన్' ఇత్యాదిరూపము లగును.

అస్తారీత్:- లుఙ్(పర.) ప్రథమపురుషైకవచనమున సిచ్, ఇడాగమ, ఈడాగమ, వృద్ధి (సూ-486) సిచ్ లోపములు (సూ-448)- 'అస్తార్ ఇ ఈత్' అని యుండగా 'వౄతోవా' అను సూత్రముచే (618) ఇకారమునకు వికల్పముగ రావలసి యున్న దీర్ఘము "సిచిచపరస్మైపదేషు"అను సూత్రముచే (619) నిషేధింపబడినది. ఇకారఈకారములకు సవర్ణదీర్ఘము 'అస్తారీత్'. ఈడాగమము వచ్చెడు స్థలములందు సవర్ణదీర్ఘము వచ్చుటచే ఈకారము వచ్చె నను, ఈడాగమప్రసక్తి లేని ద్వివచనప్రత్యయాదులు పర మగునపుడు ఈసూత్ర

ముచే (619) దీర్ఘము నిషేధింపబడినది గాన 'అస్తారిష్టామ్' ఇత్యాది దీర్ఘ రహితరూపములు మాత్రమే ఉండును. అనగా దీర్ఘనిషేధప్రయోజనము ద్వివచనాదులందు స్పష్టముగ తెలియును.

ఆత్మనేపదమున ఇడాగమము వికల్పముగ వచ్చును గాన(సూ-694) ఇడాగమపక్షమున దీర్ఘము వికల్పముగ(సూ-618)వచ్చుటచే'అస్తరీష్ట-అస్తరిష్ట' మొదలగు ద్వివిధరూపము లగును. ఇడభావపక్షమున 'సిచ్' కిత్తుగాన (సూ-547) గుణము రాదు. 'ఇర్' దీర్ఘములు (సూ-663, 616) వచ్చి 'అస్తీర్ష్ట' ఇత్యాదిరూపము లగును. ఈవిధముగ మూడువిధము లగు రూపము లుండును.

కౄఞ్ హింసాయామ్. 14. కృణాతి; కృణీతే. చకార; చకరే. వౄఞ్ వరణే, 15. వృణాతి; వృణీతే. వవార; వవరే. వరీతా-వరితా. 'ఉదోష్ఠ్య-' ఇత్యుత్వమ్- వూర్యాత్. వరిషీష్ట-వూర్షీష్ట. అవారీత్, అవారిష్టామ్, అవరీష్ట-అవరిష్ట; అవూర్ష్ట,

14. 'కౄఞ్'ధాతువునకు హింసించుట అని యర్థము. సేట్ ఉభయపది. దానిరూపములు 'స్తౄఞ్'ధాతురూపముల వలె ఉండును. 15. 'వౄఞ్' ధాతువునకు వరించుట అని అర్థము. సేట్. ఉభయపది. దీనిరూపములు కూడ చాలవరకు స్తౄఞ్ధాతురూపములను పోలి యుండును.

వూర్యాత్:- ఆశీర్లిఙ్ (పర.) ప్రథమపురుషైకవచనమున, యాసుట్ కిత్తుగాన గుణము రాదు. 'ఉదోష్ఠ్యపూర్వస్య' అను సూత్రముచే (614) ఋకారస్థానమున రేఫపరకమగు ఉకారము, దానికి 'హలిచ' అను సూత్రముచే(616) దీర్ఘము వచ్చుటచే 'వూర్యాత్' అను రూపము సిద్ధించినది. 'వూర్యాత్, వూర్యాస్తామ్, వూర్యాసుః' మొ. వరిషీష్ట:- ఆత్మనేపది ఆశీర్లిఙ్ ఏకవచనమున సీయుట్ సుడాగమములు చేసిన పిమ్మట "లిఙ్సిచోరాత్మనేపదేషు" (694)అను సూత్రముచే ఇడాగమము వికల్పముగ వచ్చును. అపుడు ఋకారమునకు గుణము. 'వరిషీష్ట' అను రూపము సిద్ధించును. 'నలిఙి' అను సూత్రముచే (695) నిషేధింపబడుటచే వైకల్పికదీర్ఘము (సూ-618) రాదు. ఇడాగమము రాని పక్షమున 'ఉశ్చ' అను సూత్రముచే (347) సీయుట్ కిత్ అగును గాన ఋకారమునకు గుణము రాదు. 'ఉర్' ఆదేశము (సూ-614). ఉకారమునకు

దీర్ఘము (సూ-616)చేయ 'ఫూర్షీష్ట' మొదలగు రూపము లగును. లుజ్‌నందు స్తృధాతువునందు వలె రూపములు సిద్ధించును.

ధూఞ్ కమ్పనే. 16. ధునాతి, ధునీతే. ధోతా-ధవితా. అధావీత్; అధవిష్ట, అధోష్ట.

16. ధూఞ్ ధాతువునకు కదల్చుట అని అర్థము. ఉభయపది. "స్వరతి సూతిసూయతిధూఞూదితోవా"అను సూత్రముచే (478) ఇడాగమము వైకల్పికము. అందుచే లుట్, ల్ఋట్ మొదలగు లకారములందు 'ధోతా-ధవితా'ఇత్యాది ద్వివిధరూపము లగును. పరస్మైపది లుఙ్నందు మాత్రము "స్తుసుధూఞ్భ్యః పరస్మైపదేషు" అను సూత్రముచే (649) ఇడాగమముగ వచ్చి "అధావీత్" మొదలగు ఇడాగమసహితరూపములు మాత్రమే ఉండును.

గ్రహఉపాదానే. 17. గృహ్ణాతి; గృహ్ణీతే. జగ్రాహ, జగృహే.

'గ్రహ్'ధాతువునకు తీసికొనుట అని యర్థము. స్వరితేత్తుగాన ఉభయపది. సేట్. సార్వధాతుకలకారములందన్నిటియందును శ్నాప్రత్యయము వచ్చును గాన దానికి ఙిద్వద్భావముండుటచే (సూ-503) "గ్రహిజ్యా—" ఇత్యాది సూత్రముచే (637) సంప్రసారణము వచ్చును.

లట్ :- గృహ్ణాతి, గృహ్ణీతే. లిట్:-(ప). జగ్రాహ, జగృహతుః, జగృహుః' మొ. (ఆ) ''జగృహే, జగృహాతే, జగృహిరే'' మొ,

696. గ్రహోఽలిటి దీర్ఘః 7.2.37

ఏకాచో గ్రహేర్విహితస్యేటో దీర్ఘో న తు లిటి. గ్రహీతా. గృహ్ణాతు. "హలః శ్నః శానజ్ఝౌ"- గృహాణ. గృహ్యాత్. గ్రహీషీష్ట. హ్మ్యన్తేతి న వృద్ధిః- అగ్రహీత్-అగ్రహీష్టామ్, అగ్రహీష్ట, అగ్రహీషాతామ్.

'ఆర్ధధాతుకస్యేడ్వలాదేః' నుండి 'ఇట్', "ఏకాచఉపదేశేఽనుదాత్తాత్" నుండి "ఏకాచః"అనువర్తించును. ఏకాచ్కమగు గ్రహ్‌ధాతువుకంటె విహితమగు ఇట్‌కు దీర్ఘము వచ్చును, లిట్టు పరముగా నున్నపుడు మాత్రము రాదు. లుట్, ల్ఋడాదులందు ఈ సూత్రముచే ఇట్‌కు దీర్ఘము వచ్చును. లుట్:- గ్రహీతా. ల్ఋట్:- గ్రహీష్యతి, గ్రహీష్యతే. లోట :- గృహ్ణాతు-గృహ్ణీతాత్, గృహ్ణీతామ్, గృహ్ణన్తు; గృహాణ-గృహ్ణీతాత్, గృహ్ణీతమ్,

; గృహ్ణాని, గృహ్ణావ, గృహ్ణామ. మధ్యమపురుషైకవచనమున "హలశ్శానజ్ఝౌ" అను సూత్రముచే (690) శానజాదేశము, 'హి'కి "అతో అను సూత్రముచే (418) లోపము- 'గృహాణ' అను రూపము ను.

లఙ్:-అగృహ్ణాత్; అగృహ్ణీత. విధిలిఙ్:- గృహ్ణీయాత్, గృహ్ణీత. :- గృహ్యాత్. (పర.) యాసుట్ జిత్తుగాని "గ్రహిజ్యా-" ఇత్యాది ముచే (637) సంప్రసారణము వచ్చును గ్రహీషీష్ట- ఆత్మనేపదమున , సుట్, ఇడాగమమాదులు చేసిన పిమ్మట "గ్రహోఽలిటిదీర్ఘః" అను ముచే (696) దీర్ఘము.

అగ్రహీత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున (పర.), సిచ్, ఇడాగమ ము, ఇకారదీర్ఘ (సూ-696) సిజ్లోప, సవర్ణదీర్ఘములచే 'అగ్రహీత్' రూపము సిద్ధించినది. 'నేటి' అను సూత్రముచే (479) నిషేధింపబడుటచే (సూ-467) రాదు. "అతోహలాదేర్లఘోః" అను సూత్రముచే (459) కవృద్ధి రావలసి యున్నది. అదికూడ "హ్మ్యన్తక్షణశ్వసజాగృణిశ్వ్యేదితామ్" అను సూత్రముచే (468) నిషేధింపబడినది. "అగ్రహీత్, అగ్ర ం, అగ్రహీషుః" మొ. (ఆత్మ.) "అగ్రహీష్ట, అగ్రహీషాతామ్, రాషత" మొ. లృఙ్:- అగ్రహీష్యత్; అగ్రహీష్యత.

కుషనిష్కర్షే. 18. కుష్ణాతి. కోషితా. అశభోజనే. 19. అశ్నాతి. అశితా. అశిష్యతి. అశ్నాతు. అశాన. ముష స్తేయే. 20. మోషితా. ణ. జ్ఞాఅవబోధనే. 21. జజ్ఞౌ. వృఙ్సంభక్తౌ, 22 వృణీతే. ౩, వవృద్ధ్వే వరీతా, వరితా. అవరీష్ట, అవరిష్ట, అవృత.

ఇతి క్ర్యాదయః

18. కుష్ధాతువునకు పైకి లాగుట అని అర్థము. సేట్. పరస్మైపది. శ్ ధాతువునకు భుజించుట అని అర్థము. సేట్. పరస్మైపది. 20. ధాతువునకు దొంగిలించుట అని అర్థము. ఈధాతువుల ప్రక్రియలో విశేష మను లేదు లోట్ మధ్యమపురుషైకవచనమున శానజాదేశము (సూ-690) లోపము (సూ-418) వచ్చి 'కుషాణ' 'అశాన' 'ముషాణ' అను ం లగును.

గృహ్ణీత; గృహ్ణాని, గృహ్ణావ, గృహ్ణామ. మధ్యమపురుషైకవచనమున "హలఃశ్నఃశానజ్ఝౌ" అను సూత్రముచే (690) శానజాదేశము, 'హి'కి "అతోహేః" అను సూత్రముచే (418) లోపము- 'గృహాణ' అను రూపము సిద్ధించును.

లఙ్:-అగృహ్ణాత్; అగృహ్ణీత. విధిలిఙ్:- గృహ్ణీయాత్, గృహ్ణీత. ఆశీర్లిఙ్;- గృహ్యాత్. (పర.) యాసుట్ జిత్తుగాని "గ్రహిజ్యా-" ఇత్యాది సూత్రముచే (637) సంప్రసారణము వచ్చును గ్రహీషీష్ట- ఆత్మనేపదమున సీయుట్, సుట్, ఇడాగమమాదులు చేసిన పిమ్మట "గ్రహోలిటిదీర్ఘః" అను సూత్రముచే (696) దీర్ఘము.

అగ్రహీత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున (పర.), సిచ్, ఇడాగమ ఈడాగమ, ఇకారదీర్ఘ (సూ-696) సిజ్లోప, సవర్ణదీర్ఘములచే 'అగ్రహీత్' అను రూపము సిద్ధించినది. 'నేటి' అను సూత్రముచే (479) నిషేధింపబడుటచే వృద్ధి (సూ-467) రాదు. "అతోహలాదేర్లఘోః" అను సూత్రముచే (459) వైకల్పికవృద్ధి రావలసి యున్నది. అదికూడ "హ్మ్యన్తక్షణశ్వసజాగృణిశ్వ్యేదితామ్" అను సూత్రముచే (468) నిషేధింపబడినది. "అగ్రహీత్, అగ్రహీష్టామ్, అగ్రహీషుః" మొ. (ఆత్మ.) "అగ్రహీష్ట, అగ్రహీషాతామ్, అగ్రహీషత" మొ. లృఙ్:- అగ్రహీష్యత్; అగ్రహీష్యత.

కుషనిష్కర్షే. 18. కృష్ణాతి. కోషితా. అశభోజనే. 19. అశ్నాతి. ఆశ. అశితా. అశిష్యతి. అశ్నాతు. అశాన. ముష స్తేయే. 20. మోషితా. ముషాణ. జ్ఞాఅవబోధనే. 21. జజ్ఞౌ. వృఙ్సంభక్తౌ. 22 వృణీతే. వవృషే, వవృఢ్వే వరీతా, వరితా. అవరీష్ట, అవరిష్ట, అవృత.

ఇతి క్ర్యాదయః

18. కుష్ధాతువునకు పైకి లాగుట అని అర్థము. సేట్. పరస్మైపది. 19. అశ్ ధాతువునకు భుజించుట అని అర్థము. సేట్. పరస్మైపది. 20. ముష్ ధాతువునకు దొంగిలించుట అని అర్థము. ఈధాతువుల ప్రక్రియలో విశేషమేమియును లేదు లోట్ మధ్యమపురుషైకవచనమున శానజాదేశము (సూ-690) 'హి' లోపము (సూ-418) వచ్చి 'కుషాణ' 'అశాన' 'ముషాణ' అను రూపము లగును.

కుష్ణాతి; చుకోష. కోషితా. కోషిష్యతి. కుష్ణాతు. అకుష్ణాత్. కుష్ణీయాత్. కుష్యాత్. అకోషీత్. అకోషిష్యత్. ముషధాతురూపములు కూడ ఈవిధముగనే ఉండును.

అశ్నాతి, ఆశ-ఆశతుః-ఆశుః, అశితా. అశిష్యతి, అశ్నాతు, ఆశ్నాత్. అశ్నీయాత్. అశ్యాత్. ఆశీత్. ఆశిష్యత్,

21. జ్ఞాధాతువునకు తెలిసికొనుట అని అర్థము. అనిట్. ఉభయపది. సార్వధాతుకలకారములందు "జ్ఞాజనోర్జా" అను సూత్రముచే (642) 'జా'ఆదేశము వచ్చును. లట్, లోట్, లఙ్, విధిలిఙ్లందు ప్రక్రియ క్రీధాతు ప్రక్రియ వలె నుండును.

జజ్ఞౌ:- లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాసకార్యములు చేసిన పిమ్మట "ఆత ఔణలః" అను సూత్రముచే (491) 'ణల్'కు ఔత్వము వచ్చి 'జజ్ఞౌ' అను రూపము సిద్ధించును. జజ్ఞౌ,-జజ్ఞతుః, జజ్ఞుః; జజ్ఞిథ-జజ్ఞాథ. మొ. భారద్వాజనియమముచే ఇడాగమ వికల్పము. (ఆత్మ.) జజ్ఞే మొ. లుట్:- జ్ఞాతా. ఌట్:- జ్ఞాస్యతి, జ్ఞాస్యతే, ఆశీర్లిఙ్-(పర.) జ్ఞేయాత్-జ్ఞాయాత్, "వాన్యస్యసంయోగాదేః" అను సూత్రముచే (497) ఏత్వవికల్పము. (ఆత్మ.) జ్ఞాసీష్ట, లుఙ్:- అజ్ఞాసీత్: అజ్ఞాస్త. ఌఙ్:- అజ్ఞాస్యత్; అజ్ఞాస్యత.

22. వృఙ్ ధాతువునకు ఏరికొనుట అని అర్థము. సేట్. ఆత్మనేపది. లట్:- వృణీతే, వృణాతే, వృణతే. మొ. లిట్:- వవ్రే, వవ్రాతే, వవ్రిరే. 'సే', 'ధ్వే'లు పరమగునపుడు "కృసృభృవృస్తుద్రుస్రుశ్రువోలిటి"అను సూత్రముచే (481) ఇడాగమము నిషేధింపబడినది గాన 'వవృషే' 'వవృఢ్వే' అను రూపము లగును. లుట్:- వరీతా-వరితా. 'వౄతోవా'అను సూత్రముచే (618) దీర్ఘ వికల్పము. ఌట్:- వరీష్యతే-వరిష్యతే. లోట్:- వృణీతామ్. లఙ్:- అవృణీత. విధిలిఙ్:- వృణీత, ఆశీర్లిఙ్:- ఇడాగమవికల్పముచే (సూ-694) 'వరిషీష్ట-' 'వృషీష్ట' ఇత్యాదిద్వివిధ రూపములు. 'వరిషీష్ట' అనునపుడు 'వౄతోవా'అను సూత్రముచే (618) ప్రాప్తమగు వైకల్పికదీర్ఘము 'న లిఙి' అను సూత్రముచే (695) నిషేధింపబడినది. లుఙునందు కూడ ఇడాగమము వికల్పముగ వచ్చును. (సూ-694) ఇడాగమపక్షమున దీర్ఘవికల్పము (సూ-

618) 'అవరీష్ట-' 'అవరిష్ట' మొదలగు ద్వివిధరూపము లుండును. ఇడాగమము రాని పక్షమున 'అవృత, అవృషాతామ్, అవృషత' ఇత్యాదిరూపము లగును. 'అవృత' అనునపుడు 'హ్రస్వాదఙ్గాత్' అను సూత్రముచే (548)సిచ్ లోపము. లృఙ్:- అవరీష్యత-అవరిష్యత.

క్ర్యాదిగణము సమాప్తము

# అథ చురాదయః

చుర స్తేయే 1.

697. సత్యాప-పాశ-రూప-వీణా-తూల-శ్లోక-సేనా-లోమ-త్వచ-వర్మ-వర్ణ-చూర్ణ-చురాదిభ్యో ణిచ్. 3.1.25

ఏభ్యో ణిచ్ స్యాత్. చూర్ణాన్తేభ్యః 'ప్రాతిపదికాద్ధాత్వర్థే' ఇత్యేవ సిద్ధే తేషామిహ గ్రహణం ప్రపఞ్చార్థమ్. చురాదిభ్యస్తు స్వార్థే. 'పుగన్త-'ఇతి గుణః; సనాద్యన్తా ఇతి ధాతుత్వమ్; తిప్ శబాది; గుణాఽయాదేశౌ-చోరయతి,

'సత్యాప' మొదలగు పదములకంటెను, చురాదులకంటెను 'ణిచ్' వచ్చును.

'సత్యాప' మొదలు 'చూర్ణ'వరకు నున్నవి ప్రాతిపదికములు. వాటికి "ప్రాతిపాదికాద్ధాత్వర్థే బహులమిష్ఠవచ్చ"అనెడు గణసూత్రముచేతనే 'ణిచ్' వచ్చును గాన మరల ఇచట చెప్ప బని లేదు. ఐనను స్పష్టార్థమై ఆ ప్రాతిపదికములు ఈ సూత్రమునందు కూడ గ్రహింపబడినవి. చురాదులకంటె ఈ 'ణిచ్'స్వార్థమునందు వచ్చును. అనగా ఈణిచ్ ప్రత్యయమును చేర్చుటచే చురాదిగణములోనున్న ధాతువుల అర్థమునం దేమార్పును ఉండదు.

చోరయతి:- 'చుర్' అనుదానికి ఈ సూత్రముచే 'ణిచ్'ప్రత్యయము. దానియందలి ణకారచకారములు ఇత్సంజ్ఞకములు. 'చుర్ ఇ'అని యుండగా ఉకారమునకుగుణము (సూ. 453)-'చోరి'. దీనికి "సనాద్యన్తాధాతవః"అను సూత్రముచే (470) ధాతుసంజ్ఞ. అందుచే 'తిఙ్'ప్రత్యయములు, శబాదులును చేరబడును. లట్ ప్రథమపురుషైకవచనమున 'చోరితి' అని యుండగా శప్ /

389)- 'చోరిఅతి'. ఇకారమునకుగుణము (390), అయాదేశము-'చోరయతి' అనురూపముసిద్ధించును. లట్టునందు ఇతరరూపములందు ప్రక్రియ కూడ భ్వాది ధాతువుల ప్రక్రియవలె నుండును.

## 698. ణిచశ్చ. 1.3.74

ణిజన్తాదాత్మనేపదం స్యాత్ కర్తృగామిని క్రియాఫలే. చోరయతే. చోరయామాస. చోరయితా. చోర్యాత్. చోరయిషీష్ట. ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరి చఙ్, ణౌచఙ్యుపధాయా హ్రస్వః. చఙీతిద్విత్వమ్. హలాదిః శేషః; 'దీర్ఘో లఘోః' ఇత్యాభ్యాసస్యదీర్ఘః- అచూచురత్; అచూచురత.

'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" నుండి 'ఆత్మనేపదమ్' 'కర్త్రభిప్రాయే', 'క్రియాఫలే' అనువర్తించును. క్రియాఫలము కర్తృగామి యైనపుడు ణిజన్తమగు దానికంటె కూడా ఆత్మనేపదము వచ్చును.

ఈసూత్రము ననుసరించి ణిజన్తధాతువు లన్నియు సాధారణముగ ఉభయపదులై యుండును.

ఈ విధముగ ఆత్మనేపద ప్రత్యయములు చేర్చుటచే "చోరయతే" మొదలగురూపములు సిద్ధించును.

లిట్టునందు 'కాస్యనేకాచఆమ్వక్తవ్యః' అనువార్తికము (సూ. 471)చే 'ఆమ్'ప్రత్యయము వచ్చును. ఆమన్త మగుటచే కృ, భూ, అస్‌ధాతువులు అనుప్రయుక్తములై (సూ. 474)- 'చోరయామాస', "చోరయామ్బభూవ" 'చోరయాఞ్చకార', 'చోరయాఞ్చక్రే' ఇత్యాదిరూపములగును.

ణిజన్తము లన్నియు అనేకాచ్కములు గాన, ఇడాగమ నిషేధము (సూ. 477) ప్రవర్తింపకుండుటచే సేట్కములు.

లుట్:- చోరయితా. లృట్:- చోరయిష్యతి; చోరయిష్యతే. లోట్:- చోరయతు; చోరయతామ్, లఙ్:- అచోరయత్; అచోరయత. విధిలిఙ్:- చోరయేత్; చోరయేత. ఆశీర్లిఙ్:- (పర) చోర్యాత్-'యాసుట్' వలాది కాదుగాన ఇడాగమములేదు. 'ణేరనిటి' అను సూత్రముచే (532) 'ణిచ్' లోపించినది. (ఆత్మ.) చోరయిషీష్ట.

లుఙ్గునందు ప్రథమపురుషైకవచనమున "అచోర్ ఇచ్లిత్"అని యుండగా "ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరిచఙ్"అనుసూత్రముచే (531) 'చ్లి'కి చఙ్ ఆదేశము-

'అచోరిఇఅత్'- "ణౌచఙ్యుపధాయా హ్రస్వః" అనుసూత్రముచే (533) ఉపధకు (ఓకారమునకు) హ్రస్వము. (ఉకారము)- 'అచుర్ ఇఅత్', 'చఙి' అను సూత్రముచే (535) ద్విత్వము. 'అచుర్ చుర్ ఇఅత్', 'హలాదిః శేషః' (398)-'అచు చుర్ ఇఅత్', 'సన్వల్లఘుని చఙ్ పరేఽనగ్లోపే' అనుసూత్రముచే (535) సన్వద్భావము లభించుటచే 'దీర్ఘో లఘోః' అనుసూత్రముచే (537) అభ్యాస ఉకారమునకు దీర్ఘము-'అచూచుర్ ఇఅత్' "ణేరనిటి" అనుసూత్రముచే (532) 'ణి'కిలోపము' 'అచూచురత్' అను రూపము సిద్ధించును. ఆత్మనేపదమున 'అచూచురత' ఇత్యాదిరూపములగును.

ఈవిధముగ ణిజంతధాతువుల కన్నిటికి లుఙ్ఙనందు చఙ్ వచ్చి సన్వద్భావము లభించుటచే అభ్యాసదీర్ఘము గాని, అభ్యాసమునందు హ్రస్వఅకారమున్నచో దానికి ఇత్వదీర్ఘములు గాని (సూ. 536; 537) వచ్చుచుండును.

లృఙ్ :- అచోరయిష్యత్; అచోరయిష్యత.

కథ వాక్యప్రబన్ధే. 2. అల్లోపః.

'కథ'ధాతువునకు (కథ) చెప్పుట అని యర్థము. దానికి ణిచ్ ప్రత్యయము చేర్చిన పిదప చివర నున్న అకారమునకు 'అతోలోపః' అనుసూత్రముచే (472) లోపము. "సన్వల్లఘుని చఙ్ పరేఽనగ్లోపే" అను సూత్రమున (535) 'అనగ్లోపే' అనినిషేధించుటచే సన్వద్భావము, అకారమునకు ఇత్వము, దీర్ఘము రాకుండుట దాని (అగ్లోపమునకు) ప్రయోజనము.

లట్ ప్రథమపురుషైకవచనమున "కథ్ ఇ అ తి' అని యుండగా ణిచ్ ణిత్తుగాన ఉపధావృద్ధి (సూ. 457) రావలసి యుండ.

699 అచః పరస్మిన్ పూర్వవిధౌ. 1.1.57

పరనిమిత్తోఽజాదేశః స్థానివత్ స్యాత్; స్థానిభూతాదచః పూర్వత్వేన దృష్టస్య విధౌ కర్తవ్యే. ఇతి స్థానివత్త్వాత్ న ఉపధావృద్ధిః:-కథయతి. అగ్లోపిత్వాత్ దీర్ఘసన్వద్భావౌ న-అచకథత్.

'స్థానివదాదేశోఽనల్విధౌ' నుండి 'స్థానివత్' 'ఆదేశః' అనువర్తించును. పరనిమిత్తక మగు (పరమగు దానిని నిమిత్తముగ చేసికొని వచ్చిన) అజాదేశము (అచ్ స్థానమునందు వచ్చిన ఆదేశము) స్థానియగు అచ్చుకంటె పూర్వమగుదానికి కార్యము చేయవలసి యున్నపుడు, స్థానివంటి దగును.

ఇచట 'కథణిచ్' అనునపుడు 'కథ లోని చివరి అకారమునకు 'ణిచ్'ను నిమిత్తముగ చేసికొని లోపము వచ్చినది గాన ఇది (అకారలోపము) పరనిమిత్తక మైనది. ఇపుడు ఈ అకారముకంటె పూర్వమునందున్న అకారమునకు (కకారముపై అకారము) వృద్ధిరూపకార్యము చేయనున్నాము. అందుచే ఈ సూత్రముచే అకారలోపమునకు స్థానివద్భావము వచ్చును. అనగా అకారము లోపించినను అకార మచట ఉన్నట్లే భావింపబడును. అందుచే కకారముపై నున్న అకారము ఉపధ కాదు గాన దానికి వృద్ధి రాదు. 'కథ్ ఇ అ తి' అని యుండగా గుణాయాదేశములచే 'కథయతి' అను రూప మగును.

లుఙ్లునందుపైనచూపిన విధముగ సన్వద్భావేత్వదీర్ఘాదులు రాకుండుటచే చఙ్, ద్విత్వ, అభ్యాసకార్య, చుత్వాదులు మాత్రము వచ్చి 'అచకథత్; అచకథత' ఇత్యాదిరూపములగును.

గణ సంఖ్యానే. 3. గణయతి. ఇతిచురాదయః.

గణధాతువునకు లెక్కించుట అని యర్థము. సేట్. ఉభయపది. దానికి గూడ 'ణిచ్'చేసిన పిమ్మట అల్లోపాదులు వచ్చి కథధాతువునకు వలె రూపములు సిద్ధించును. లుఙ్లునందు కథధాతువునకు వలెనే సన్వద్భావాదులు లేకుండుటచే "అజగణత్; అజగణత" ఇత్యాదిరూపములు మాత్రమే రావలసి యుండ.

700. *ఈ చ గణః* 7.3.97

గణయతేరభ్యాసస్య ఈత్ స్యాత్ చఙ్పరే ణౌ; చాదత్. అజీగణత్- అజగణత్.

'సన్వల్లఘుని చఙ్పరేఽనగ్లోపే' "అత్రలోపోభ్యాసస్య" నుండి 'చఙ్ పరే' 'ణౌ' 'అభ్యాసస్య' అనువర్తించును. 'చ' అనుటచే "అత్స్మృదృత్వరప్రథమ్రదస్తృస్పశామ్"అను పూర్వసూత్రమునుండి 'అత్' అనునది కూడ అనుకర్షింపబడును. చఙ్పరక మగు ణి పర మగునపుడు గణధాతువు అభ్యాసమునకు ఈకారము వచ్చును. 'చ' అనుటచే హ్రస్వాకారము కూడ వచ్చును.

ఈ సూత్రముచే ఈకారము చేసిన పక్షమున "అజీగణత్, అజీగణత" ఇత్యాదిరూపములును, అకారమునకు అకారమేచేసిన పక్షమున 'అజగణత్; అజగణత' ఇత్యాదిరూపములును సిద్ధించును.

చురాదిగణము సమాప్తము.

# అథ ణ్యన్తప్రక్రియా

701. స్వాతన్త్రః కర్తా 1.4.54

క్రియాయాం స్వాతన్త్ర్యేణ వివక్షితోఽర్థః కర్తా స్యాత్.

ఈసూత్రము 'కారకే' అను అధికారమునందు చెప్పబడినది. అందుచే 'స్వతంత్రః'అనుదానికి 'క్రియానిష్పత్తియందు స్వతంత్రమైన'అని యర్థము సిద్ధించినది. క్రియానిష్పత్తియందు స్వతంత్రముగ నున్నట్లు వివక్షిత మగు అర్థమునకు కర్త యని పేరు.

'రామఃగచ్ఛతి' ఇత్యాదిస్థలములందు రామునకు గమనక్రియయందు స్వతంత్రత్వ మున్నను "స్థాలీ పచతి" ఇత్యాద్యుదాహరణములందు అచేతనము లగు స్థాల్యాదులకు స్వాతంత్ర్య ముండదు గాన 'స్వతంత్రః'అనుదానికి 'స్వాతంత్ర్యేణ వివక్షితః"అను అర్థము చెప్పబడినది. "వివక్షాతః కారకాణి భవన్తి" (కారకములు వివక్షావశముచే వచ్చుచుండును) అను భాష్యకారవచనము ననుసరించి అచేతనము లగు స్థాల్యాదులను కూడ పచనాదిక్రియా స్వతంత్రములుగ వివక్షించుటచే వాటికి కర్తృత్వము లభించును. స్వాతంత్ర్య మనగా ధాత్వర్థ మగు వ్యాపారమునకు ఆశ్రయముగ నుండుట యని ఇచట అర్థము. స్వాతంత్ర్య మనగా ప్రాధాన్యమని యర్థ మని భాష్యకారులు చెప్పియున్నారు. కావున ధాత్వర్థవ్యాపారాశ్రయ మగుటచే ప్రధాన మగుదానికి కర్త యనిపేరు.

702. తత్ప్రయోజకో హేతుశ్చ. 1.4.55

కర్తుః ప్రయోజకః హేతుసంజ్ఞకః కర్తృసంజ్ఞకశ్చ స్యాత్.

ఆతనిని (కర్తను) ప్రేరేపించువానికి హేతు వనియు, కర్త యనియు కూడ పేర్లు.

'యజ్ఞదత్తః గచ్ఛతి' అనునపుడు గమనక్రియాస్వతంత్రుడు గాన-అనగా గమనక్రియాశ్రయభూతుడు గాన-యజ్ఞదత్తునకు కర్త యనిపేరు. "దేవదత్తః యజ్ఞదత్తం గమయతి" (దేవదత్తుడు యజ్ఞదత్తుని పంపుచున్నాడు) అనునపుడు గమనకర్త యగు యజ్ఞదత్తుని దేవదత్తుడు వెళ్ళునట్లు చేయుచున్నాడు గాన ఆతనికి హేతు వనియు, కర్త యనియు కూడ పేర్లు. పైవాక్యమున యజ్ఞదత్తుడు ప్రయోజ్యకర్త. దేవదత్తుడు ప్రయోజకకర్త.

703 హేతుమతి చ. 3.1.26

ప్రయోజకవ్యాపారే ప్రేషణాదౌ వాచ్యే ధాతోర్ణిచ్ స్యాత్. భవన్తం ప్రేరయతి భావయతి.

"ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్" నుండి 'ధాతోః' "సత్యాపపాశవీణా' ఇత్యాదిసూత్రమునుండి 'ణిచ్', అనువర్తించును. 'హేతుమత్' అనగా ప్రయోజకుడు ఆధారముగా కలది అని అర్థము. అనగా ప్రయోజక నిష్ఠ మగు ప్రేషణాదివ్యాపారము. ప్రయోజకుని వ్యాపార మగు ప్రేషణాదికము వాచ్య మగునపుడు ధాతువుకంటె ణిచ్ ప్రత్యయము వచ్చును.

ఉదా:- 'యజ్ఞదత్తః భవతి'- యజ్ఞదత్తుడు ఉంటున్నాడు లేక అగుచున్నాడు. 'దేవదత్తః యజ్ఞదత్తం భావయతి' దేవదత్తుడు యజ్ఞదత్తుని ఉండునట్లు. ప్రేరేపించుచున్నాడు. ఇచట 'ఉండునట్లుప్రేరేపించుట' అను క్రియ దేవదత్తునియం దున్నది. ఈ క్రియను బోధించుటకై భూధాతువునకు ఈ సూత్రముచే ణిచ్ ప్రత్యయము చేర్చబడినది.

ఈ ప్రేరణార్థకణిచ్‌ప్రత్యయము చేర్చిన ధాతువుల ప్రక్రియ స్వార్థణిజంతము లగు చురాదుల ప్రక్రియ వలె నుండును. ప్రేరణార్థ మొక్కటియే విశేషము. ఈ ప్రేరణార్థకణిజంతముల అర్థము "భవన్తం ప్రేరయతి భావయతి; కుర్వన్తం ప్రేరయతి కారయతి; పచన్తం ప్రేరయతి పాచయతి; గచ్ఛన్తం ప్రేరయతి గమయతి" ఇత్యాదివిధమున చెప్పబడును. ఫలము కర్తృగామి యగుచో ఆత్మనేపదము, పరగామి యగుచో పరస్మైపదము వచ్చును.

భావయతి:- 'భవన్తం ప్రేరయతి' అనునర్థమున "హేతుమతి చ" అను సూత్రముచే (703) భూధాతువునకు ణిచ్ ప్రత్యయము. 'భూఇ' అని యుండగా వృద్ధి (సూ. 182) ఆవాదేశము- 'భావి' అని యుండగా దానికి ధాతుసంజ్ఞ యున్నది గాన (సూ. 470) తిప్‌శబాదులు, గుణాయాదేశములు చేయగా 'భావయతి' అను రూపము సిద్ధించినది. ఇతరలకారముల ప్రక్రియ కూడ ఈ విధముగనే యుండును.

704. ఓః పుయణ్జ్యపరే 7.4.80

సని పరే యదఙ్గం, తదవయవాభ్యాసోకారస్య ఇత్ స్యాత్ పవర్గయణ్‌జకారేష్వవర్ణపరేషు పరతః. అబీభవత్.

ఓః,పుయణ్జి,అపరే. 'అజ్గస్య'అధికారము 'సన్యతః' "అత్రలోపోఽభ్యాసస్య" 'భృఞామిత్'అనుసూత్రములనుండి'సని' 'అభ్యాసస్య' 'ఇత్'అనువర్తించును. సన్ పరముగా గల అభ్యాసకు అవయవ మగు ఉకారమునకు, అవర్ణపరకము లగు పవర్గ,యణ్,జకారములు పర మగునపుడు ఇకారము ఆదేశముగ వచ్చును.

అబీభవత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చ్లి'కి చఙ్ ఆదేశము (సూ. 531) చేసిన పిమ్మట 'భూ ఇ అత్'అని యుండగా "ణిచ్యచఆదేశో న భవతి ద్విత్వే కర్తవ్యే" (ద్విత్వము చేయవలసి యున్నపుడు,ణిచ్ పరముగా నుండగా అజాదేశము రాదు) అను పరిభాష ననుసరించి ముందుగ ద్విత్వము, అభ్యాసకార్యము, భకారమునకు జశ్త్వముచే (సూ. 401) బకారము చేయగా "అబుభూ ఇ అత్"అని యుండును. ఇపుడుఊకారమునకువృద్ధిఆవాదేశములు వచ్చి 'అబుభావ్ ఇ అత్'అని యుండగా'ణౌ చఙ్యుపధాయా హ్రస్వః'అను సూత్రముచే (533) ఆకారమునకు హ్రస్వము.-'అబుభవ్ ఇ అత్', ఇపుడు "సన్వల్లఘునిచఙ్పరేఽనగ్లోపే"అను సూత్రముచే (535) సన్వద్భావము వచ్చును. గాన ప్రకృతసూత్రముచే ఉకారమునకు ఇకారము. దానికి "దీర్ఘో లఘోః"అనుసూత్రముచే (537) దీర్ఘము- "అబీభవత్" అను రూపము సిద్ధించును.

ష్ఠాగతినివృత్తౌ.

705. అర్తి-హ్రీ-వ్లీ-రీక్నూయీ-క్ష్మాయ్యాతాంపుఙ్ ణౌ. 7.3,36.

స్థాపయతి.

ష్ఠాధాతువునకు గమనమునుండి నివర్తించుట-అనగా ఆగిపోవుట-అని యర్థము. ఇది షోపదేశధాతువు. భ్వాదులలోనిది. పరస్మైపది. షకారమునకుసకారము (సూ. 255). షకారము పోవుటతో తన్నిమిత్తక మగు ఠకారము కూడ పోయి థకారము నిలచును. సార్వధాతుకలకారములందు "పాఘ్రాధ్మా-"ఇత్యాది సూత్రముచే (450) 'తిష్ఠ'ఆదేశము వచ్చి 'తిష్ఠతి'ఇత్యాదిరూపము లగును. ఇది ణిజంత మగుననపుడు ఈ సూత్రముచే విశేషకార్యము విధింపబడుచున్నది.

ఋ, హ్రీ, వ్లీ, రీ, క్నూయీ, క్ష్మాయీధాతువులకును, ఆకారాంతధాతువులకును ణిచ్ పర మగునపుడు 'పుక్'అనుఆగమము వచ్చును.

'పుక్'ఆగమమునందలి ఉకారకకారములు ఇత్సంజ్ఞకములు.కిత్ గాన అంతావయవముగ వచ్చును.

స్థాపయతి:- స్థాధాతువుఆకారాంతము గానఈసూత్రముచే పుగాగమము చేయగా 'స్థాప్ఇ(ణిచ్)-'స్థాపి'-అని యుండగా 'తిప్' 'శప్'గుణాయాదేశములు- 'స్థాపయతి'అను రూపముసిద్ధించును. ఇతరలకారములందు కూడ ఈ విధము గనే పుగాగమము వచ్చి రూపములు సిద్ధించును.

706. తిష్ఠతేరిత్. 7.4.5

ఉపధాయాః ఇదాదేశః స్యాచ్చఙ్పరే ణౌ. అతిష్ఠిపత్.

'ణౌ చఙ్యుపధాయా హ్రస్వః' నుండి 'ణౌ' 'చఙి', 'ఉపధాయాః' అనువర్తించును. 'చఙ్'పర మగు ణిచ్ పర మగునపుడు ఉపధకు హ్రస్వ మగు ఇకారము ఆదేశముగ వచ్చును. అతిష్ఠిపత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున "ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరిచఙ్"అనుసూత్రముచే (531) 'చ్లి'కి'చఙ్' చేసిన పిమ్మట 'అస్థాప్ ఇ అత్'అని యుండగా ఈసూత్రముచే ఆకారమునకు ఇకారాదేశము-'అస్థిప్ ఇ అత్', 'స్థిప్'అనుదానికిద్విత్వము. 'శర్పూర్వాః ఖయః'అను సూత్రముచే (657) అభ్యాస సకారమునకు లోపము-'అథిస్థిప్ ఇ అత్', 'అభ్యాసే చర్చ'అనుసూత్రముచే (401) థకారమునకుచర్త్వము (తకారము)-"అతిస్థిప్ ఇ అత్"-'ణేరనిటి'అనుసూత్రముచే (532) ణిచ్‌కు లోపము. సకారమునకు షత్వము, (సూ. 150) ష్టుత్వము- 'అతిష్ఠిపత్'.

ఘట చేష్టాయామ్.

707. మితాం హ్రస్వః 6.4.92

ఘటాదీనాం జ్ఞపాదీనాం చ హ్రస్వః. ఘటయతి. జ్ఞప జ్ఞానే జ్ఞాపనేచ. జ్ఞపయతి. అజిజ్ఞపత్.

ఇతిణ్యన్తప్రక్రియా.

ఘట ధాతువునకు చేష్ట చేయుట అని అర్థము. ఆత్మనేపది. 'ఘటాదయో మితః'అనుగణసూత్రముచేదానికిమిత్సంజ్ఞ.

''ఊదుపధాయా గోహః'' నుండి 'ఉపధాయాః; 'దోషోణౌ' నుండి'ణౌ' అనువర్తించును. 'ణి'పర మగునపుడు మిత్తు లగు ధాతువుల ఉపధకు హ్రస్వము వచ్చును.

ఘటాదులకును జ్ఞపాదులకును మిత్సంజ్ఞ యుండుటచే వృత్తియందు 'ఘటాదీనాం,జ్ఞపాదీనాంచ' అనిస్పష్టీకరింపబడినది.

ఘటయతి:- ఘటధాతువునకు ణిచ్ ఉపధావృద్ధులు చేసిన పిమ్మట 'ఘాటి'అని యుండగా ఈ సూత్రముచే ఆకారమునకు హ్రస్వము-ఘటి. ఇపుడు తిప్‌శబాదులు- 'ఘటయతి' అనురూపము సిద్ధించును. లుఙ్:- అజీఘటత్.

జ్ఞపధాతువునకు తెలిసికొనుట, తెలుపుట అని అర్థములు. పై సూత్ర ముచే ఉపధాహ్రస్వము వచ్చి 'జ్ఞపయతి'ఇత్యాదిరూపములగును. అజిజ్ఞపత్:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'అజ్ఞప్ ఇ అత్'అని యుండగా ద్విత్వాభ్యాస కార్యములు-'అజజ్ఞపి అత్' సన్వద్భావము. 'సన్యతః'అనుసూత్రముచే (536) అభ్యాసఅకారమునకు ఇకారము. ణిచ్‌కు లోపము- 'అజిజ్ఞపత్' అనురూపము సిద్ధించును. ఇచట ఇకారము సంయోగపరకమగుటచేగురువుగాన 'దీర్ఘోలఘోః' అను సూత్రముచే (537) దీర్ఘము రాలేదు.

ణ్యన్తప్రక్రియ సమాప్తము.

# అథ సన్నన్తప్రక్రియా

708. *ధాతోఃకర్మణఃసమానకర్తృకాదిచ్ఛాయాంవా* 3.1.7

ఇషికర్మణ ఇషిణైకకర్తృకాద్ధాతోః సన్‌ప్రత్యయోవా స్యాదిచ్ఛా యామ్. పఠ వ్యక్తాయాం వాచి.

'గుప్తిజ్కిద్భ్యః సన్' నుండి 'సన్' అనువర్తించును. సూత్రమునందు 'ఇచ్ఛాయామ్' అను పద మున్నది గాన 'కర్మణః' అనగా 'ఇచ్ఛాకర్మణః' అనియు, "సమానకర్తృకాత్" అనగా 'ఇచ్ఛాసమానకర్తృకాత్' అనియు అర్థము. ఇచ్ఛాకర్మత్వము, ఇచ్ఛాసమానకర్తృకత్వము, అనునవి ధాత్వర్థ మగు వ్యాపార మునకు సంభవించును కాని ధాతువునకు సంభవింపవు. అందుచే "ఇచ్ఛాకర్మ భూతమును, ఇచ్ఛాసమానకర్తృకమును అగు ధాతువునకు" అనగా 'ఇచ్ఛాకర్మ భూతమును, ఇచ్ఛాసమానకర్తృకమును అగు వ్యాపారమును బోధించు ధాతువు నకు' అని అర్థము.

ఇష్‌ధాతువునకు కర్మయు, ఇష్‌ధాతువుతో సమానకర్తృకమును అగు ధాతువుకంటె ఇచ్ఛార్థమున 'సన్'ప్రత్యయము వికల్పముగ వచ్చును.

'ఇష్ ధాతువుతో సమానకర్తృకము' అనగా ఇష్‌ధాతువునకు ఏది కర్తయో అదియే సన్‌ప్రత్యయము చేర్చవలసి యున్న ధాతువునకు కూడ కర్తయై యుండ వలె నని అర్థము. పఠధాతునకు స్పష్టముగ చెప్పుట - పలుకుట అని యర్థము. ఇది భ్వాదిగణములోనిది. సేట్. పరస్మైపది. దానికి 'పఠితుం ఇచ్ఛతి' అను నర్థమున, పఠనము ఇచ్ఛలో కర్మ కావునను, చదువువాడును చదువవలె నని ఇచ్ఛయించువాడును ఒక్కడే యగుటచే సమానకర్తృకత్వ ముండుటచేతను ఈ సూత్రముచే వికల్పముగ సన్ ప్రత్యయము(స్)చేర్చబడినది—'పఠస్' - 'సన్'వలాద్యార్ధధాతుకము గాన ఇడాగమము- 'పఠ్‌ఇస్' అని యుండగా:-

709. సన్యఙోః 6.1.9

సన్నన్తస్య యఙన్తస్య చ ప్రథమస్యైకాచో ద్వే స్తః, అజాదేస్తు ద్వితీయస్య. సన్యతః- పఠితుం ఇచ్ఛతి- పిపఠిషతి. కర్మణః కిమ్- గమనేనేచ్ఛతి. సమానకర్తృకాత్ కిమ్. శిష్యాః పఠన్త్వితీచ్ఛతి గురుః. వాగ్రహణాద్వాక్యమపి. లుఙ్‌సనోర్ఘస్ల్.

"ఏకాచో ద్వే ప్రథమస్య" "అజాదేర్ద్వితీయస్య" అను అధికారసూత్రములు అనువర్తించును. సన్నంతమును యఙంతమును అగు ధాతువుయొక్క మొదటి ఏకాచ్కభాగమునకును, అజాదిధాతు వైనచో ద్వితీయ మగు ఏకాచ్కభాగమునకును ద్విత్వము వచ్చును.

ఈ సూత్రముచే ద్విత్వము- 'పఠ్‌పఠ్‌ఇస్'; "హలాదిః శేషః" (398) 'పపఠిస్'. 'సన్యతః' అను సూత్రముచే (516) అభ్యాసఅకారమునకు ఇకారము —పిపఠిస్. సకారమునకు షత్వము- 'పిపఠిష్-' అని యుండగా ఈ సన్నంత రూపమునకు "సనాద్యన్తాధాతవః" అను సూత్రముచే (470) ధాతుసంజ్ఞ యున్నది గాన తిప్‌శబాదులు- 'పిపఠిషతి' ఇత్యాదిరూపము లగును.

'పూర్వవత్‌సనః' అను సూత్రమును (745) అనుసరించి మూలధాతువు పరస్మైపది యైనచో దాని సన్నంతము పరస్మైపదియై యుండును. ఆత్మనేపది యైనచో ఆత్మనేపది యగును. మూలధాతువు సేట్క మగుచో 'సన్'కు ఇడా

గమము వచ్చును. 'సన్' ఆర్ధధాతుకము గాన యథావకాశముగ వెనుక నున్న ఇక్కులకు గుణముచేయుచుండవలెను. సన్నంతరూపము లన్నియు అనేకాచ్కములే యగును గాన వాటికంటె పరమగు 'తాస్' 'స్య' మొదలగు వాటికి ఇడాగమము తప్పక వచ్చును. సన్నంతములు ప్రత్యయాంతములుగాన 'కాస్యనేకాచ ఆమ్వక్తవ్యః' అను వార్తికముచే (సూ-171) ఆమాదేశము వచ్చి, పిమ్మట కృ, భూ, అస్ధాతువులు అనుప్రయుక్తము లగును (సూ-474).

లట్ :- పిపఠిషతి. లిట్ :- పిపఠిషాఞ్చకార-పిపఠిషామ్బభూవ-పిపఠిషామాస. లుట్ :- పిపఠిషితా. లృట్ :- పిపఠిష్యతి లోట్ :- పిపఠిషతు. లఙ్ :- అపిపఠిషత్. విధిలిఙ్ :- పిపఠిషేత్. ఆశీర్లిఙ్ :- పిపఠిష్యాత్. లుఙ్ :- అపిపఠిషీత్, లృఙ్ :- అపిపఠిష్యత్.

'కర్మణః' అనుదానికి ఏమి ప్రయోజనము ? ప్రత్యుదాహరణము -'గమనేనేచ్ఛతి' వెళ్ళుటచేత ఇచ్ఛయించుచున్నాడు అని అర్థము. ఇచట గమనము ఇచ్ఛలో కరణము గాని కర్మ కాదు. అందుచే గమ్ ధాతువునకు సన్ రాదు. సమానకర్తృకమననేల ? ప్రత్యుదాహరణము- 'శిష్యాః పఠన్తు ఇతీచ్ఛతిగురుః' -శిష్యులు చదువవలె నని గురువు ఇచ్ఛయించుచున్నాడు. ఇచట ఇచ్ఛాకర్త గురువు; పఠనకర్తలు శిష్యులు. ఇట్లు పఠ్ధాతువునకును ఇష్ ధాతువునకును కర్తలు వేర్వేరు గాన పఠ్ధాతువునకు సన్ప్రత్యయము రాదు. ఈ సన్ప్రత్యయము వైకల్పికముగాన సన్ ప్రత్యయమును చేర్చుటకు బదులు 'పఠితుం ఇచ్ఛతి'' ఇత్యాదిస్వతంత్రవాక్యములను కూడ ప్రయోగింపవచ్చును.

'అత్తుంఇచ్ఛతి'అను నర్థమున అదధాతువుకంటె సన్ ప్రత్యయము చేర్చిన ''పిదప అఠస్'' అని యుండగా 'లుఙ్సనోర్ఘ్లృ్' అను సూత్రముచే (561) 'అద్'కు- ఘస్లృ' (ఘస్) ఆదేశము- 'ఘస్ స్' అని యుండగా:-

## 710. సస్యార్ధధాతుకే 7.4.49

సస్య తః స్యాత్సాదావార్ధధాతుకే. అత్తుమిచ్ఛతి-జిఘత్సతి. ఏకాచ ఇతి నేట్.

సః, ఏ, ఆర్ధధాతుకే. 'ఉపసర్గాత్తః'నుండి 'తః' అనువర్తించును. 'సి' అనునది 'ఆర్ధధాతుకే' అనుదానికి విశేషణము గాన ''యేనవిధిస్తదాదావల్గ్ర

హాణే'' అనుపరిభాషననుసరించి 'సకారాదౌ' అని అర్థము. సకారాది యగు ఆర్ధ ధాతుకము పర మగునపుడు సకారమునకు తకారాదేశము వచ్చును.

ఈ సూత్రముచే సకారమునకు తకారము- 'ఘత్స్' అని యుండగా ద్విత్వాభ్యాసకార్యజశ్త్వచుత్వాదులు– 'జిఘత్స్'. తిప్‌శబాదులు- 'జిఘత్సతి' ఇత్యాదిరూపము లగును.

'ఘస్స్' అని యున్నపుడు ''ఏకాచఉపదేశేఽనుదాత్తాత్'' అను సూత్ర ముచే (440) నిషేధింపబడుటచే ఇడాగమము రాదు.

లట్:- జిఘత్సతి. లిట్:- జిఘత్సాఞ్చకార-జిఘత్సామ్బభూవ-జిఘ త్సామాస. లుట్:- జిఘత్సితా. లృట్:- జిఘత్సిష్యతి. లోట్:- జిఘత్సతు. లఙ్:- అజిఘత్సత్. విధిలిఙ్:- జిఘత్సేత్. ఆశీర్లిఙ్:- జిఘత్స్యాత్. లుఙ్:- అజిఘత్సీత్. లృఙ్:- అజిఘత్సిష్యత్.

## 711. అజ్ఝనగమాం సని 6.4.16

అజన్తానాం, హన్తేః, అజాదేశగమేశ్చ దీర్ఘో ఝలాదౌ సని.

'అఙ్గస్య' అధికారము. 'నోపధాయాః' నుండి 'ఉపధాయాః' అనువర్తిం చును. ''ఢ్రలోపేపూర్వస్య'' నుండి 'దీర్ఘః' అనువర్తించును. ఝలాది యగు సన్ పర మగునపుడు, అజన్తధాతువునకును, హనధాతువునకును, అచ్‌కు (ఇణ్ మొదలగుధాతువులకు) ఆదేశముగ వచ్చిన 'గమ్' ధాతువునకును దీర్ఘము వచ్చును.

'ఇచట అజాదేశగమధాతువునే గ్రహింపవలెను' అను భాష్యకారవచ నముననుసరించి పై విధముగ చెప్పబడినది.

కృధాతువునకు 'కర్తుం ఇచ్ఛతి' అను నర్థమున సన్‌ప్రత్యయము— 'కృస్'. ఇడాగమము నిషిద్ధమగుటచే (సూ-440) ఇచట ఝలాది సన్ పరముగ నున్నది. అందుచే ఋకారమునకు దీర్ఘము– 'కౄస్' అని యుండగా గుణము (సూ-390) రావలసి యుండ:-

## 712 ఇకోఝల్ 1.2.9

ఇగన్తాత్ ఝలాదిః సన్ కిత్ స్యాత్. ఋూత ఇద్ధాతోః- కర్తు మిచ్ఛతి చికీర్షతి.

'రుదవిదముషగ్రహిస్వపిప్రచ్ఛఃసంశ్చ' "అసంయోగాల్లిట్కిత్" నుండి 'సన్' 'కిత్' అనువర్తించును. ఇగన్తముకంటె పర మగు ఝలాది యగు సన్, కిత్ అగును. ఈ సూత్రముచే సన్‌కు కిత్త్వము వచ్చినది గాన గుణనిషేధము (సూ-135). 'ఋూత ఇద్ధాతోః' అను సూత్రముచే (సూ-663) ఋూకారమునకు (రేఫపరక) ఇకారము- 'కిర్స్'. 'హలిచ' అను సూత్రముచే (616) ఇకారమునకు దీర్ఘము -'కీర్స్'. ద్విత్వాభ్యాసకార్యషత్వములు- చికీర్ష్. తిప్శబాదులచే 'చికీర్షతి' ఇత్యాదిరూపము లగును,

లట్:- చికీర్షతి. లిట్:-చికీర్షాఞ్చకార-చికీర్షామ్బభూవ-చికీర్షామాస. లుట్:- చికీర్షితా. లృట్:- చికీర్షిష్యతి. లోట్:- చికీర్షతు. లఙ్:- అచికీర్షత్. విధిలిఙ్:- చికీర్షేత్. ఆశీర్లిఙ్:- చికీర్ష్యాత్. లుఙ్:- అచికీర్షీత్. లృఙ్:- అచికీర్షిష్యత్.

భూధాతువునకు 'భవితు ఇచ్ఛతి' అను అర్థమున సన్ ప్రత్యయము చేర్చిన పిదప 'భూస్' అని యుండగా భూధాతువు సేట్కము గాన సన్‌కు ఇడాగమము రావలసి యుండగా-

713 సనిగ్రహగుహోశ్చ 7.2.12

గ్రహేః, గుహేః, ఉగన్తాచ్చ సన ఇట్ న స్యాత్. బుభూషతి. ఇతి సన్నన్తాః.

'నేడ్వశికృతి' నుండి 'న' 'ఇట్' అనువర్తించును. 'చ' అనుటచే "శ్ర్యుకః కితి" నుండి 'ఉకః' అనుకర్షింపబడును. గ్రహగుహధాతువులకంటెను, ఉగన్తధాతువులకంటెను పర మగు సన్ కు ఇడాగమము రాదు.

ఈ సూత్రముచే నిషిద్ధము గాన ఉగన్త మగు భూధాతువుకంటె పర మగుటచే 'సన్'కు ఇడాగమము రాదు. 'ఇకో ఝల్' అను సూత్రముచే (712) సన్ కిత్తు గాన గుణము కూడ రాదు. ద్విత్వాభ్యాసకార్యషత్వాదులచే 'బుభూషతి' ఇత్యాదిరూపము లగును.

లట్:- బుభూషతి. లిట్:- బుభూషాఞ్చకార-బుభూషామ్బభూవ-బుభూషామాస. లుట్:- బుభూషితా. లృట్:- బుభూషిష్యతి లోట్:- బుభూషతు. లఙ్:- అబుభూషత్. విధిలిఙ్:- బుభూషేత్. ఆశీర్లిఙ్:- బుభూష్యాత్. లుఙ్:- అబుభూషీత్. లృఙ్:- అబుభూషిష్యత్.

సన్నన్తప్రక్రియ సమాప్తము.

# అథ యఙన్తప్రక్రియా

714. *ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్* 3.1.22

పౌనఃపున్యే భృశార్థే చ ద్యోత్యే ధాతోరేకాచో హలాదేర్యఙ్ స్యాత్.

క్రియాసమభిహార మనగా 'మాటిమాటికి' అని గాని "చాలఎక్కువగా" అని గాని అర్థము. ఈయర్థములను సూచింపవలసి యున్నపుడు హలాదియు, ఏకాచ్కమును అగు ధాతువునకు 'యఙ్'ప్రత్యయము చేర్చబడును.

'ఏకాచఃహలాదేః'అనుటచే అనేకాచ్కమును అజాదియు నగు ధాతువునకు యఙ్ రాదు. 'యఙ్'లోని ఙకారము ఇత్సంజ్ఞకము గాన యఙన్తధాతువులు ఆత్మనేపములుగనే యుండును. యఙ్ప్రత్యయము చేర్చిన పిదప ఈయఙన్తములకుధాతుసంజ్ఞయుండునుగాన (సూ. 470) తఙ్శబాదులువచ్చును. ఇవి ప్రత్యయాంతములు గాన లిట్టునందు "కాస్య నేకాచఆమ్వక్తవ్యః" (సూ. 471) అనువార్తికముచే ఆమ్ప్రత్యయము వచ్చిపిమ్మట కృభ్వస్ధాతువులుఅను ప్రయోగింపబడును. యఙన్తధాతువులు అనేకాచ్కములుగాన అవిసేట్కములగుటచే 'తాస్' 'స్య'మొదలగువాటికి ఇడాగమము వచ్చును.

715. *గుణో యఙ్లుకోః.* 7.4.82

అభ్యాసస్య గుణో యఙి యఙ్లుకి చ పరతః. ఙిదన్తత్వాదాత్మనేపదమ్. పునఃపునరతిశయేన వా భవతిబోభూయాతే. బోభూయాఞ్చక్రే. అబోభూయిష్ట.

'అత్రలోపోభ్యాసస్య' నుండి 'అభ్యాసస్య' అనువర్తించును. యఙ్ కాని, యఙ్లుక్' గాని పర మగునపుడు అభ్యాసకు (ఇగన్తాభ్యాసకు) గుణము వచ్చును.

'పునఃపునః అతిశయేన వా భవతి'అను అర్థమున, ఏకాచ్క మగు హలాదిధాతు వగుటచే భూధాతువునకు యఙ్ప్రత్యయము-'భూయ'-'సన్యఙోః' అను సూత్రముచే (708)ద్విత్వము-'భూభూయ', 'గుణోయఙ్లుకోః' అనుసూత్రముచే (715) అభ్యాసఊకారమునకుగుణము-'భోభూయ', "అభ్యాసేచర్చ"అనుసూత్ర

ముచే (401) అభ్యాసభకారమునకు జ_శ్త్వము-'బోభూయ' అని యుండగా 'త' శబాదులు. యకారముపై నున్న అకారమునకును, శప్‌లోని అకారమునకును 'అతో గుణే'అను సూత్రము (274) చే పరరూపము- 'బోభూయతే' అను రూపము సిద్ధించును.

లట్ బోభూయతే. లిట్- బోభూయాఞ్చక్రే-బోభూయామ్బభూవ-బోభూయామాస. లుట్- బోభూయితా. లృట్- బోభూయిష్యతే. లోట్-బోభూయతామ్. లఙ్ - అబోభూయత. విధిలిఙ్ - బోభూయేత. ఆశీర్లిఙ్-బోభూయిషీష్ట. లుఙ్- అబోభూయిష్ట. లృఙ్- అబోభూయిష్యత.

716. నిత్యం కౌటిల్యే గతౌ. 3 1.23

గత్యర్థాత్ కౌటిల్యఏవయఙ్ స్యాత్;న తు క్రియాసమభిహారే.

'నిత్యం'అనుపదమునకు 'ఏవ' అని యర్థము. "ధాతోరేకాచోహలాదేః క్రియాసమభిహారేయఙ్"నుండి 'యఙ్'అనువర్తించును. గత్యర్థకధాతువునకు కౌటిల్యార్థమునందు మాత్రమే యఙ్ వచ్చును; క్రియాసమభిహారార్థమునందు రాదు.

వ్రజధాతువు గత్యర్థకము. దానికి పై సూత్రము ననుసరించి 'కుటిలం వ్రజతి'-వంకరగానడచుచున్నాడు-అను నర్థమునందు మాత్రమే-యఙ్ వచ్చును. 'వ్రజ్ య'అని యుండగా ద్విత్వాభ్యాసకార్యములు-"వవ్రజ్ య"అని యుండగా-

717. దీర్ఘోఽకితః 7.4 83

అకితోఽభ్యాసస్య దీర్ఘో యజి యఙ్లుకి చ. కుటిలం వ్రజతి వావ్రజ్యతే.

'అత్రలోపోఽభ్యాసస్య'నుండి 'అభ్యాసస్య', "గుణోయఙ్లుకోః" నుండి-'యఙ్లుకోః',అనువర్తించును. యఙ్ కాని,యఙ్లుక్ కాని పర మగు నపుడు కిత్తు కాని అభ్యాసమునకు దీర్ఘము వచ్చును.

ఈ సూత్రముచే అభ్యాసవకారముపై నున్న అకారమునకు దీర్ఘము-'వావ్రజ్ య'అని యుండగా తఙ్శబాదులచే'వావ్రజ్యతే'ఇత్యాదిరూపములు సిద్ధించును. 'వావ్రజ్యతే'అనగా వంకరగ నడచుచున్నాడు అని యర్థము. 'మాటిమాటికి'లేక'ఎక్కువగానడుచుచున్నాడు'అను నర్థము కాదు.

లిట్టునందు అమ్‌ప్రత్యయము చేర్చిన పిదప "వావ్రజ్యఆమ్"అని యుండగా-

### 718. యస్య హలః 6.4.49

యస్యేతి సంఘాతగ్రహణమ్. హలః పరస్య యశబ్దస్య లోప ఆర్ధధాతుకే, 'ఆదేః పరస్య', 'అతో లోపః'–వాव्रజాఞ్చక్రే. వావ్రజితా.

'ఆర్ధధాతుకే'అని అధికారము. 'అతోలోపః'మండి 'లోపః'అనువర్తించును. 'యస్య' అనగా అకారసహిత మగు యకారమునకు–యకారఅకారసంఘాతమునకు–అని అర్థము. ఆర్ధధాతుకము పర మగునపుడు హల్లుకంటె పరమైన 'య' అనుదానికి లోపము వచ్చును.

ఇచటఆర్ధధాతుక మగు 'ఆమ్'పరముగ నుండుటచే, 'ఆదేఃపరస్య'(72) అనుపరిభాష ననుసరించి ఈ లోపము'య్య'అనుదానిలో ఆదిమవర్ణ మగు 'య' కారమునకు వచ్చును-'వావ్రజ్ అఆమ్'.'అతో లోపః'అను సూత్రముచే (472) అకారమునకు లోపము. పిమ్మట కృధాత్వాదులు అనుప్రయుక్తములై 'వావ్రజాఞ్చక్రే'ఇత్యాదిరూపము లగును.

ఇచట అకారవిశిష్ట మగు యకారమును గ్రహించినను "ఆదేఃపరస్య" అనుపరిభాషననుసరించి, ఒక్క–యకారమునకుమాత్రమే ఈసూత్రముచే లోపము వచ్చుచున్నది.అట్టిచో 'య'సంఘాతమును గ్రహించుటలో ప్రయోజనమేమిఅను ప్రశ్న ఉదయించవచ్చును. 'ఈర్ష్యితా'. ఇత్యాదులలో ఈసూత్రముచేయకారమునకు లోపము రాకుండుటకై 'య'సంఘాతము గ్రహింపబడినది. ఇచట 'య్' ఉన్నది గాని 'య' లేదు గాన అందలి యకారమునకు లోపము రాలేదు.

వావ్రజితా:– లుట్ నందు ఆర్ధధాతుక మగు 'తాస్' పర మైనపుడు వెనుకటి వలెనే యకారఅకారములకు లోపము వచ్చినది. లృట్:– వావ్రజిష్యతే. లోట్– వావ్రజ్యతామ్. లఙ్–అవావ్రజ్యత, విధిలిఙ్– వావ్రజ్యేత. ఆశీర్లిఙ్– వావ్రజిషీష్ట. లుఙ్– అవావ్రజిష్ట. లృఙ్– అవావ్రజిష్యత.

### 719. రీగృదుపధస్య చ. 7.4.90

ఋదుపధస్య ధాతోరభ్యాసస్య 'రీక్'ఆగమో యఙి,యఙ్లుకి చ. వరీవృత్యతే, వరీవృతాఞ్చక్రే, వరీవృతితా.

'అభ్యాసస్య'అధికారము. 'గుణోయఙ్లుకోః'నుండి 'యఙ్లుకోః'అనువర్తించును. యఙ్ కాని యఙ్లుక్కాని పర మగునపుడు ఋకారోపధ మగు ధాతువు అభ్యాసకు 'రీక్' అను ఆగమము వచ్చును.

'వృత్'ధాతువునకు "పునః పునః భూయో వా వర్తతే"అను నర్థమున యజ్-'వృత్ య',ద్విత్వము-"వృత్ వృత్ య", 'ఉరత్'అనుసూత్రముచే (475) ఋకారస్థానమున (రేఫపరక) అకారము-'వర్ వృత్ య',ఈ సూత్రముచే అభ్యాసకు రీగాదేశము. ఇది కిత్తు గాన అంత్యావయవముగ (రేఫస్థానమున) వచ్చును. పిమ్మట తఙ్ శబాదులచే "వరీవృత్యతే" ఇత్యాదిరూపము లగును.

వరీవృతాఞ్చక్రే:- యజ న్తమగు'వరీవృత్య'ధాతువునకు లిట్టునందు ఆమ్ ఆదేశము. ఆమ్ ఆర్ధధాతుకము గాన అది పరముగ నున్నపుడు 'యస్య హలః' అనుసూత్రముచే (718) యకారమునకు, 'అతోలోపః' అనుసూత్రముచే (472) అకారమునకు లోపము. పిమ్మట లిడన్తకృధాతువు అనుప్రయుక్తమై 'వరీవృతాఞ్చక్రే' అను రూపము సిద్ధించినది. వరీవృతితా- ఆర్ధధాతుకమగు 'తాస్' పరమగునపుడు వెనుకటివలెయకార అకారములకు లోపము. ల్యట్- వరీవృతిష్యతే లోట్ - వరీవృత్యతామ్. లఙ్ - అవరీవృత్యత. విధిలిఙ్- వరీవృత్యేత. ఆశీర్లిఙ్- వరీవృతిషీష్ట. లుఙ్- అవరీవృతిష్ట. ల్యఙ్- అవరీవృతిష్యత.

720. క్షుభ్నాదిషు చ. 8.4.39

ణత్వం న.నరీనృత్యతే జరీగృహ్యతే. ఇతియజన్తప్రక్రియా.

"రషాభ్యాం నోణః సమానపదే" "నభాభూపూకమిగమిప్యాయీవేపామ్" నుండి'ణః' 'న'అనువర్తించును. క్షుభ్నాదిగణమున పఠితము లగు శబ్దములందు ణత్వమురాదు.

నరీనృత్యతే:- 'పునఃపునః భృశం వా నృత్యతి'అను నర్థమున యఙ్ వచ్చి 'నరీనృత్యతే' అను రూపము సిద్ధించును. దీని ప్రక్రియ యంతయు యజన్తవృత్ధాతుప్రక్రియ వలె నుండును. ఇందలి రెండవనకారమునకు రావల సియున్నణత్వము (సూ. 138) పై సూత్రముచే నిషేధింపబడినది.

'పునః పునః అతిశయేన వా గృహ్ణాతి'అను అర్థమున గ్రహ్ధాతువునకు యఙ్, ద్విత్వాభ్యాసకార్యాదులచేవృత్నృత్ ధాతువులందువలె 'జరీగృహ్యతే' ఇత్యాదిరూపములు సిద్ధించును. గ్రహధాతువునకు "గ్రహిజ్యా"- ఇత్యాదిసూత్రముచే (637) సంప్రసారణము వచ్చుటచే (గృహ్) ఋకారోపధమైనది.

యజన్తప్రక్రియ సమాప్తము.

—:o:—

# అథ యఙ్‌లుగన్తప్రక్రియా

## 721. యఙోఽచి చ 2.4.74

యఙోఽచి ప్రత్యయే లుక్ స్యాత్; చకారాత్తం వినాఽపిక్వచిత్.' అనైమిత్తికోఽయం అన్తరఙ్గత్వాదాదౌ భవతి. తతః ప్రత్యయలక్షణేన యఙన్తత్వాద్ద్విత్వమ్; అభ్యాసకార్యమ్. ధాతుత్వాల్లడాదయః. శేషాత్కర్తరీతి పరస్మైపదమ్. చర్కరీతఞ్చ - ఇతి అదాదౌ పాఠాత్ శపో లుక్.

'ణ్యక్షత్రియార్షఞితో యూనిలుగణిఞోః'నుండి 'లుక్' అనువర్తించును. 'అచి' అనుదానికి 'యఙ్' సాహచర్య ముండుటచే అజాదిప్రత్యయ మని యర్థము. అజాదిప్రత్యయము పర మగునపుడు 'యఙ్'కు లుక్ వచ్చును. 'చ' అనుటచే కొన్ని స్థలములందు, అజాదిప్రత్యయము పరము కాకున్నను లుక్ వచ్చును.

'బహులం ఛన్దసి' నుండి 'బహులం' అను పదమును చకారబలముచే అనుకర్షించి ఈ యఙ్‌లుక్ బహులముగా వచ్చు నని సిద్ధాంతకౌముదిలో చెప్ప బడినది. ఈ విధముగ, అజాదిప్రత్యయము పర మైనను కాకున్నను యఙ్‌లుక్ వచ్చునని తేలినది.

యఙ్‌కు లుక్ వచ్చుటకై నిమిత్త మేదియు లేదు గాన ఇది (యఙ్‌లుక్) అంతరంగము. అందుచే ఇది అన్ని కార్యములకంటెను ముందుగ ప్రవర్తించును. యఙ్ లోపించిన పిమ్మట 'ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్' అను పరిభాషచే (190) యఙన్త మగును గాన ద్విత్వము అభ్యాసకార్యము వచ్చును. ఈ విధముగ భూధాతువునకు 'పునఃపునః అతిశయేన వా భవతి' అను అర్థమున యఙ్ చేర్చిన పిదప 'భూ య' అని యుండగా పై సూత్రముచే 'యఙ్'కు లోపము. ప్రత్యయలక్షణముచే యఙన్తముగాన, ద్విత్వాభ్యాసకార్యములు- 'బుా భూ' అని యుండగా 'గుణో యఙ్‌లుకోః' అను సూత్రముచే (715) అభ్యాస గుణము.-'బోభూ' అని యుండగా ఇది ధాతుసంజ్ఞకముగాన (సూ-470)లడాది లకారములు చేరును. 'శేషాత్కర్తరిపరస్మైపదమ్' అను సూత్రముచే (382) పరస్మైపదప్రత్యయములు మాత్రమే చేరును. అనగా యఙ్‌లుగన్తరూపము

ము పరస్మైపదమునందు మాత్రమే యుండును. లట్ ప్రథమపురుషైక
మున 'తిప్'ప్రత్యయము చేర్చిన పిదప శప్ ప్రత్యయము వచ్చును. అదాది
ంన 'చర్కరీతఞ్చ' అని పఠింపబడి యున్నది. యఙ్లుగ న్తమునకు
రీత మని ప్రాచీనవైయాకరణనామధేయము. ఈ విధముగ యఙ్లుగన్త
అదాదిగణాంతర్గతములని చెప్పుటచే శప్‌కు "అదిప్రభృతిభ్యశ్శపః"
సూత్రముచే (555) లుక్. 'బోభూ తి' అని యుండగా-

722. యఙో వా 7.3.94

యఙ్లుగన్తాత్పరస్య హలాదేః పితః సార్వధాతుకస్యేడ్వా
. (సిద్ధాంతకౌముదియందు యజన్తాత్ అని యున్నది).
సువోః'- ఇతి గుణనిషేధో యఙ్లుకి భాషాయాం న.
రాతు తేతిక్తే' ఇతి ఛన్దసి నిపాతనాత్. బోభవీతి- బోభోతి,
తః, అదభ్యస్తాత్. బోభువతి, బోభవాఞ్చకార- బోభవామాస.
వితా. బోభవిష్యతి. బోభవీతు-బోభోతు-బోభూతాత్, బోభూతామ్,
వతు, బోభూహి; బోభవాని, అబోభవీత్-అబోభోత్, అబోభూ
అబోభువుః; బోభూయాత్, బోభూయాతామ్, బోభూయుః.
ాయాత్, బోభూయాస్తామ్, బోభూయాసుః.

'ఉతో వృద్ధిర్లుకి హలి' "నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే" "బ్రువ
"నుండి 'హలి' 'పితి' 'సార్వధాతుకే', 'ఈట్'అనువర్తించును. యఙ్లు
ముకంటె పర మగు,హలాదియు,పిత్‌ను అగు సార్వధాతుకమునకు ఈడాగ
వికల్పముగ వచ్చును.

'ఈట్' టిత్తు గాన 'తిప్'కు ఆద్యవయవముగ వచ్చును 'భోభూ ఈ తి'
యుండగా ఊకారమునకు గుణము (సూ. 390) పిమ్మట అవాదేశము చేయ
భవీతి'అను రూప మగును.

ఇచట 'భూసువోస్తిఙి'అను గుణనిషేధ సూత్రము (442) ప్రవర్తింప
యున్నది. కాని లౌకికభాషలో యఙ్లుగన్తరూపమునందు ఈ నిషేధము
ర్తింపదు. ఏలయన "బోభూతు తేతిక్తే"అను సూత్రముఛందస్సునందు
రహిత మగు యఙ్లుగంతభూధాతురూప ముండు నని వివరించుచున్నది.
ణనిషేధము ప్రవర్తించిన యడలగుణ మెట్లైనను రాదు గాన మరల ఈ

లన్నియు పరస్మైపదమునందు మాత్రమే యుండును. లట్ ప్రథమపురుషైక వచనమున 'తిప్'ప్రత్యయము చేర్చిన పిదప శప్ ప్రత్యయము వచ్చును. అదాది గణమున 'చర్కరీతఞ్చ' అని పఠింపబడి యున్నది. యఙ్లుగన్తమునకు చర్కరీత మని ప్రాచీనవైయాకరణనామధేయము. ఈ విధముగ యఙ్లుగన్తములు అదాదిగణాంతర్గతములని చెప్పుటచే శప్‌కు "అదిప్రభృతిభ్యః శపః" అనుసూత్రముచే (555) లుక్. 'బోభూ తి' అని యుండగా-

722. యఙో వా 7.3.94

యఙ్లుగన్తాత్పరస్య హలాదేః పితః సార్వధాతుకస్యేడ్వా స్యాత్. (సిద్ధాంతకౌముదియందు య ఙ న్తా త్ అని యు న్న ది). 'భూసువోః'- ఇతి గుణనిషేధో యఙ్లుకి భాషాయాం న. 'బోభూతు తేతిక్తే' ఇతి ఛన్దసి నిపాతనాత్. బోభవీతి- బోభోతి, బోభూతః, అదభ్యస్తాత్. బోభువతి, బోభవాఞ్చకార- బోభవామాస. బోభవితా. బోభవిష్యతి. బోభవీతు-బోభోతు-బోభూతాత్, బోభూతామ్, బోభువతు, బోభూహి; బోభవాని, అబోభవీత్-అబోభోత్, అబోభూతామ్, అబోభువుః; బోభూయాత్, బోభూయాతామ్, బోభూయుః. బోభూయాత్, బోభూయాస్తామ్, బోభూయాసుః.

'ఉతో వృద్ధిర్లుకి హలి' "నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే" "బ్రువ ఈట్"నుండి 'హలి' 'పితి' 'సార్వధాతుకే', 'ఈట్'అనువర్తించును. యఙ్లుగన్తముకంటె పర మగు,హలాదియు,పిత్ను అగు సార్వధాతుకమునకు ఈడాగమము వికల్పముగ వచ్చును.

'ఈట్' టిత్తు గాన 'తిప్'కు ఆద్యవయవముగ వచ్చును 'బోభూ ఈ తి' అని యుండగా ఊకారమునకు గుణము (సూ. 390) పిమ్మట అవాదేశము చేయ 'బోభవీతి'అను రూప మగును.

ఇచట 'భూసువోస్తిఙి'అను గుణనిషేధ సూత్రము (442) ప్రవర్తింప వలసి యున్నది. కాని లౌకికభాషలో యఙ్లుగన్తరూపమునందు ఈ నిషేధము ప్రవర్తింపదు. ఏలయన "బోభూతు తేతిక్తే"అను సూత్రముఛందస్సునందు గుణరహిత మగు యఙ్లుగంతభూధాతురూప ముండు నని వివరించుచున్నది. ఈ గుణనిషేధము ప్రవర్తించిన యడలగుణ మెట్లైనను రాదు గాన మరల ఈ

విధముగ నిపతింప వలసిన పని లేదు. ఇట్లు నిపతించుటచే గుణాభావము ఛంద స్సునందే గాని లౌకికభాషలో నుండదని సూచింపబడుచున్నది. అందుచే గుణము రావచ్చును.

ఈడాగమము రాని పక్షమున 'బోభోతి' అను రూపము సిద్ధించును. ఈ విధముగ హలాదిపిత్సార్వధాతుకము లగు 'సిప్' 'మిప్'లు పర మగునపుడు గూడ ఈడాగమవికల్పముచే "బోభవీషి బోభోషి" 'బోభవీమి-బోభోమి' అను రెండేసి రూపము లుండును.

బోభూతః- 'తస్' అపిత్సార్వధాతుకము గాన దీనికి ఙిద్వద్భావ ముం డుటచే (సూ. 503) గుణము రాదు. థస్,థ,వస్,మస్‌లందు గూడ ఈ విధము గనే గుణరహితరూపము లుండును. బోభువతి:- ప్రథమపురుషబహువచన మున 'బోభూ ఝి'అని యుండగా ఝకారమునకు 'అదభ్యస్తాత్'అనుసూత్రముచే (609)'అత్' ఆదేశము, 'బోభూ అ తి'అని యుండగా ఙిద్వద్భావముచే గుణము రాదు గాన ఉవఙాదేశము (సూ. 199) వచ్చి 'బోభువతి' అను రూపము సిద్ధించినది.

యఙ్లుగన్త మగు 'బోభూ'ధాతువు ప్రత్యయాంతము గాన (అనేకాచ్క ముగాన) 'కాస్యనేకాచ ఆమ్ వక్తవ్యః'అను వార్తికముచే (సూ. 471) లిట్టు నందు ఆమాదేశము. పిమ్మట కృభ్వస్ధాతువులుఅనుప్రయుక్తములై (సూ.474) 'బోభవాఞ్చకార,బోభవామాస,బోభవామ్బభూవ' ఇత్యాదిరూపము లగును. కాని మూలధాతువు భూధాతువు గాన దానితో మరల భూధాతువును అనుప్రయో గించుట అనావశ్యక మనుఅభిప్రాయముతో కాబోలు,మూలమున కృ,అస్‌ధాతువుల రూపములు మాత్రమే చూపబడినవి. లుట్:-బోభవితా, లృట్:- బోభవిష్యతి. లోట్ ప్రథమపురుషైకవచనమున ఈడాగమ వికల్పముచే (సూ. 722) బోభ వీతు-బోభోతు అను రూపములును, 'తాతఙ్' వచ్చునపుడు అది ఙిత్తు గాన గుణము లేని 'బోభూతాత్' అను రూపమును అగును. బోభువతు:- ప్రథమ పురుషబహువచనమున ఝకారమునకు 'అత్' ఆదేశము, (సూ. 609) 'ఉవఙ్' వచ్చి 'బోభువతు' అను రూపము సిద్ధించును. బోభూహి:- 'సి'కి 'హి' చేసిన పిమ్మట సూ. (417) 'హి' అపిత్ గాన ఈడాగమగుణాదులు రావు'బోభూహి'. బోభవాని:- ఉత్తమపురుషైకవచనమున వచ్చిన ఆడాగమము పిత్ గాన దానికి ఙిత్త్వము లేదు. అందుచే గుణావాదేశములు వచ్చి 'బోభవాని' ఇత్యాది రూప

ము లగును. అబోభవీత్-అబోభోత్:- లఙ్ ప్రథమపురుషైకవచనమున లట్టునందు వలె ఈడాగవికల్పముచే రూపద్వయము సిద్ధించును. అబోభూతామ్:- తామ్(తస్)అపిత్సార్వధాతుకమగుటచేఙిద్వద్భావముగుణమురాదు.అబోభూవుః:- 'ఝి'కి 'సిజభ్యస్తవిదిభ్యశ్చ' అనుసూత్రముచే (449) 'జుస్' ఆదేశము ఊకారమునకు ఉవఙాదేశము. (మ. పు.) అబోభవీః_అబోభోః, అబోభూతమ్, అబోభూత; (ఉ.పు) అబోభవమ్, అబోభూవ, అబోభూమ.

బోభూయాత్:- విధిలిఙ్ ప్రథమపురుషైకవచనమున 'బోభుఅయాస్త్' అని యుండగా'శప్'కులుక్కు. ఇపుడు'యాసుట్'అకారముకంటెపరముగలేదుగాన 'ఇట్' ఆగమ (సూ. 430) ప్రసక్తిలేదు. 'లిఙః సలోపోఽనన్త్యస్య' అను సూత్రముచే (429) సకారలోపము. 'బోభూయాత్' అను రూపము సిద్ధించినది. ద్వివచనమునందు పై విధముగనే ప్రక్రియ యుండును. 'బోభూయాతామ్' అను రూపము సిద్ధించును. బోభూయుః- 'ఝి'కి'జుస్'ఆదేశము, (సూ. 449) "ఉస్యపదాన్తాత్"అను సూత్రముచే (495) 'యాస్'లోని 'ఆస్'కు లోపము. బోభూయాత్:- ఆశీర్లిఙ్ ప్రథమపురుషైకవచనమున "స్కోఃసంయోగాద్యోరన్తే చ" అనుసూత్రముచే (310) సకారము లోపించినది. బోభూయాస్తామ్; బోభూయాసుః:- ఆర్ధధాతుక మగుటచే ద్వివచనాదులందు సకారలోపము (సూ. 429) రాదు.

గాతిస్థేతి సిచోలుక్. 'యఙోవా'ఇతిఈట్ పక్షేగుణంబాధిత్వానిత్యత్వాత్వుక్. అబోభూవీత్ - అబోభోత్, అబోభూతామ్, అబోభూవుః, అబోభవిష్యత్. ఇతియఙ్లుగన్తాః.

లుఙ్లునందు 'చ్లి'కి సిచ్ చేసిన పిదప దానికి 'గాతిస్థాఘుపాభూభ్యస్సిచః పరస్మైపదేషు' అను సూత్రముచే (441) లోపము. 'అబోభూత్'అనియుండగా వికల్పముగ ఈడాగమము (సూ.722) 'అబోభూ ఈ త్'అని యుండగా గుణము (సూ. 390) రావలసి యున్నది. కాని నిత్యమగుటచే.అనగాగుణము చేసినను చేయకున్నను ప్రవర్తించునదగుటచే - (కృతాకృత ప్రసంగిత్వం నిత్యత్వమ్) "భువోవుగ్లుఙ్లిటోః" అను సూత్రముచే (395) వుగాగమము గుణమును బాధించి వచ్చును. ఈ విధముగ ఈడాగమపక్షమున 'అబోభూవీత్' అనియు, తదభావపక్షమున"అబోభోత్"అనియు రూపద్వయ మగును. అబోభూతామ్:-

ప్రథమపురుషద్వివచనరూపము లజ్‌నందు వలె సిద్ధించును. అబోభూవుః- బహు వచనమున లజ్ఞనందు ఉవజాదేశము రాగా ఇచట వుగాగమము వచ్చినది. రూపము సమానమే. మ. పు. అబోభూః- అబోభోః, అబోభూతమ్, అబోభూత; ఉ.పు. అబోభూవమ్, అబోభూవ, అబోభూమ. ల్ఋజ్- అబోభవిష్యత్. మొ.

యజ్‌లుగన్త ప్రకరణము సమాప్తము.

# అథ నామధాతవః

## 723. సుప ఆత్మనః క్యచ్ 3.1.8

ఇషికర్మణః ఏషితుః సంబన్ధినః సుబన్తాత్ ఇచ్ఛాయామర్థే క్యచ్ ప్రత్యయో వా స్యాత్.

''ధాతోః కర్మణః సమానకర్తృకాదిచ్ఛాయాం వా'' నుండి 'కర్మణః' 'ఇచ్ఛాయాం' 'వా' అనువర్తించును. ఇచ్ఛాయాం అనునది సమీపమున నున్నది గాన 'కర్మణః' అనగా ''ఇచ్ఛాకర్మణః'' అని యర్థము. ఇష్‌ధాతువునకు కర్మ యైనట్టియు, తనకు-అనగా ఇచ్ఛయించువానికి సంబధించిన- సుబన్తముకంటె, ఇచ్ఛార్థమున 'క్యచ్'ప్రత్యయము వికల్పముగ వచ్చును. ఇచ్ఛయించువాడు తననిమిత్తమై ఏ కర్మకారకమును ఇచ్ఛయించునో తద్వాచక మగు సుబంతము కంటె 'క్యచ్' వచ్చునని భావము.

'పుత్రం ఆత్మనః ఇచ్ఛతి'' అను అర్థమున పుత్రం (''పుత్ర అమ్'') అను నది ఇచ్ఛలో కర్మయు, ఇచ్ఛయించువానికి సంబంధించునదియు అగు 'పుత్రుని' అను నర్థమును బోధించు చున్నది గాన దానికి క్యచ్ ప్రత్యయము చేర్ప బడును. 'పరస్య పుత్రం ఇచ్ఛతి' ఇత్యాద్యర్థములందు ఇచ్ఛాకర్మభూతు డగు పుత్రుడు తనకు (ఇచ్ఛాకర్తకు) సంబంధించినవాడు కాదు గాన క్యచ్ చేయకూడదు. 'క్యచ్'లోని కకారచకారములు ఇత్సంజ్ఞకములు. 'పుత్ర అమ్ య' అని యుండగా దానికి ''సనాద్యన్తా ధాతవః'' అను సూత్రముచే (470) ధాతుసంజ్ఞ లభించును.

## 724. సుపో ధాతుప్రాతిపదికయోః 2.4.71

ఏతయోరవయవస్య సుపో లుక్.

"ణ్యక్షత్రియార్షఞితో లుక్" నుండి 'లుక్' అనువర్తించును. ధాతువునకును ప్రాతిపదికకును అవయవ మగు సుప్‌కు లుక్ వచ్చును.

ఇచట 'పుత్ర అమ్ య' అను సముదాయమే ధాతుసంజ్ఞకము గాన 'అమ్' అను సుప్ ప్రత్యయము ధాత్వవయవ మగుటచే దానికి ఈ సూత్రముచే లోపము. "పుత్ర య" అని యుండగా:-

## 725. క్యచి చ 7.4.33

అవర్ణస్య ఈః ఆత్మనః పుత్రమిచ్ఛతి పుత్రీయతి.

"అస్య చ్వౌ" "ఈఘ్రాధ్మోః" నుండి 'అస్య' 'ఈ' అనువర్తించును. క్యచ్ పర మగునపుడు కూడ అకారమునకు ఈకారము వచ్చును

ఈ సూత్రముచే అకారమునకు ఈకారము చేయగా 'పుత్రీయ' అని యగును. దానికి ధాతు సంజ్ఞ యున్నది గాన తిప్‌శబాదులు. యకారముపై నున్న అకారమునకు శప్ లోని అకారముతో 'అతోగుణే' అను సూత్రముచే (274) పరరూపము. 'పుత్రీయతి' ఇత్యాదిరూపము లగును. ఆత్మనేపదనిమిత్తమేదియు లేదు గాన "శేషాత్కర్తరిపరస్మైపదమ్" అను సూత్రముచే (382) పరస్మైపదిత్వము.

'పుత్రీయ' అనునది (నామధాతువులన్నియు) ప్రత్యయాంతములు (అనేకాచ్కములుగాన) లిట్టునందు ఆమ్‌ప్రత్యయాదులు వచ్చును. 'తాస్' మొదలగు వాటికిఇడాగమము వచ్చును. ఈ ధాతువులు 'పుత్ర' మొదలగు నామవాచకముల నుండి నిష్పన్న మైనవి గాన వాటికి నామధాతువు లని పేరు.

లట్:- పుత్రీయతి. లిట్:- పుత్రీయాఞ్చకార-పుత్రీయామ్బభూవ-పుత్రీయామాస. లుట్:- పుత్రీయితా. లృట్:- పుత్రీయిష్యతి. లోట్:- పుత్రీయతు. లఙ్:- అపుత్రీయత్. విధిలిఙ్:- పుత్రీయేత్. ఆశీర్లిఙ్:- పుత్రీయ్యాత్. లుఙ్:- అపుత్రీయీత్. లృఙ్:- అపుత్రీయిష్యత్.

## 726. నః క్యే 1.4.15

క్యచి క్యఙి చ నాన్తమేవ పదం నాన్యత్. నలోపః-రాజీయతి.

నాన్తమేవేతి కిమ్—వాచ్యతి. 'హలి చ'—గీర్యతి; పూర్యతి. ధాతో రిత్యేవ; నేహ - దివమిచ్ఛతి దివ్యతి.

'సుప్తిఙన్తం పదమ్' నుండి "సుబన్తం' 'పదమ్' అనువర్తించును. క్యచ్ క్యఙ్ ప్రత్యయములు పర మగునపుడు నకారాంత మగు సుబంతము పదసంజ్ఞకల దగును అని యర్థము. ఈపద సంజ్ఞ 'సుప్తిఙన్తం పదమ్' అనుసూత్రముచేతనే (14) సిద్ధించుచున్నది గాన మరల ఈసూత్రము నియమార్థము చెప్పబడినది. 'క్యచ్' 'క్యఙ్' ప్రత్యయములు పరమగునపుడు నకారాంత మగు సుబంతమునకు మాత్రమే పదసంజ్ఞయుండును, ఇతరమునకు ఉండదు అని ఫలితార్థము.

'రాజానం ఆత్మనః ఇచ్ఛతి' అను అర్థమున "రాజన్అమ్" అను సుబంతమునకు క్యచ్ప్రత్యయము (సూ—723). 'సుప్' ('అమ్') లోపించిన (సూ-724) పిమ్మట 'రాజన్ య' అని యుండగా ఈ సూత్రముచే 'రాజన్' అను దానికి పదసంజ్ఞ యున్నది గాన "నలోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) నకారలోపము. అకారమునకు ఈకారము (సూ-725). తిప్శబాదులు చేర్చగా 'రాజీయతి' ఇత్యాదిరూపము లగును.

నకారాంతమునకు మాత్రమే పదసంజ్ఞ యుండును అని చెప్పుటకు ప్రయోజనము 'వాచ్యతి' ఇత్యాదిరూపముల సిద్ధి. 'వాచం ఆత్మనః ఇచ్ఛతి' అను నర్థమున చకారాంత మగు వాక్ఛబ్దమునకు క్యచ్ చేర్చబడినది. 'వాచ్య' అని యుండగా ఈ నియమసూత్రముచే 'వాచ్' అనునది నకారాంతము కాదు గాన పదసంజ్ఞ నిషేధింపబడినది. అందుచే కుత్వ (సూ-307) జశ్త్వము (సూ-67)లు రావు. 'వాచ్యతి' ఇత్యాది రూపములు సిద్ధించును.

'గిరం ఆత్మనః ఇచ్ఛతి' "పురం ఆత్మనః ఇచ్ఛతి" అను నర్థములందు 'గిర్' 'పుర్'శబ్దములకు క్యచ్ ప్రత్యయము చేయగా 'గిర్ అమ్ య' 'పుర్ అమ్ య' అని యుండగా సుప్కు లుక్కు (సూ-724)- 'గిర్య' 'పుర్య'. 'హలిచ' అను సూత్రముచే (616) ఇకారఉకారములకు దీర్ఘము; తిప్శబాదులు చేర్చగా 'గీర్యతి' 'పూర్యతి' ఇత్యాదిరూపము లగును.

'హలిచ' అను (616) దీర్ఘము రేఫవకారాంతధాతువులకు మాత్రమే వచ్చును. 'గిర్' 'పుర్', అను శబ్దములు 'గౄ శబ్దే' 'పౄ పాలనపూరణయోః'

అను ధాతువులకు క్విప్ ప్రత్యయము చేర్చిన పిదప "ఋత ఇద్ధాతోః" "ఉదోష్ఠ్య పూర్వస్య" అను సూత్రములచే (సూ-663, 664) ఋకారమునకు ఇర్, 'ఉర్' లు ఆదేశముగ వచ్చుటచే నేర్పడినవి. ఈవిధముగ ఇందలి రేఫ ధాత్వవయవ మగుటచే దాని ఉపధకు దీర్ఘము వచ్చినది. కాని 'దివం ఆత్మనః ఇచ్ఛతి' అను నర్థమున 'దివ్'శబ్దమునకు క్యచ్ ప్రత్యయమును చేర్చినపుడు 'దివ్' అను దాని వకారము ధాత్వవయవము కాదు గాన 'హలి చ' (616) ప్రవర్తింపదు. 'దివ్యతి' ఇత్యాదిదీర్ఘరహిత రూపములు మాత్రమే సిద్ధించును.

## 727. క్యస్య విభాషా 6.4.50

హలః పరయోః క్యచ్క్యఙో ర్లోపో వార్ధధాతుకే. 'ఆదేః పరస్య' -'అతోలోపః'. తస్య స్థానివత్త్వాత్ లఘూపధగుణో న — సమిధితా, సమిధ్యితా.

'యస్య హలః' నుండి 'హలః' అనువర్తించును. "ఆర్ధధాతుకే" అని యధికారము 'క్యస్య' అనుదానిచే క్యచ్' 'క్యఙ్'లు రెండును గ్రహింపబడును. హల్లుకంటె పర మగు క్యచ్క్యఙ్లకు ఆర్ధధాతుకము పర మగునపుడు వికల్ప ముగ లోపము వచ్చును.

'సమిధం ఆత్మనః ఇచ్ఛతి' అను నర్థమున 'క్యచ్'ప్రత్యయము చేర్చగా లట్టునందు 'సమిధ్యతి' ఇత్యాదిరూపము లగును. 'నః క్యే' అను నియమసూత్ర ముచే (726) 'సమిధ్' అనుదానికి పదసంజ్ఞ లేదు గాన జశ్త్వము రాదు. లట్, లృడాదులందు 'తా,స్య' మొదలగునవి పర మగునపుడు "యస్యహలః" అను సూత్ర ముచే (718) నిత్యముగ యకారలోపము ప్రాప్తింపగా ఈ సూత్రము చెప్ప బడినది.

ఈ సూత్రముచే విధింపబడిన లోపము 'ఆదేఃపరస్య' అనుపరిభాష(72) ననుసరించి ఆద్యవర్ణ మగు యకారమునకు వచ్చును- 'సమిధ్ అ ఇతా' అని యుండగా "అతోలోపః" అను సూత్రముచే (472) అకారమునకు లోపము -"సమిధ్ ఇతా" అని యుండగా పుగన్తలఘూపధగుణము (సూ-453) రావలసి యున్నది. కాని "అచః పరస్మిన్ పూర్వవిధౌ" అను సూత్రముచే (693) అకార లోపమునకు స్థానివద్భావము వచ్చును గాన (అపుడు ఇకారముఉపధ కాజాలదు గాన) గుణము రాదు. ఈవిధముగ 'క్యచ్'లోపపక్షమున 'సమిధితా' 'సమిధి

ష్యతి' ఇత్యాదిరూపములును 'క్యచ్' లోపము రాని పక్షమున అకారలోపము మాత్రము (సూ-472) వచ్చి "సమిధ్యితా" "సమిధ్యిష్యతి" ఇత్యాదిరూపములును అగును.

### 728. కామ్యచ్చ 3.1.9

ఉక్తవిషయే కామ్యచ్ స్యాత్. పుత్రమాత్మన ఇచ్ఛతి పుత్రకామ్యతి. పుత్రకామ్యితా.

క్యచ్ ప్రత్యయము వచ్చుటకు అవకాశము గల స్థలములలో 'కామ్యచ్' ప్రత్యయము కూడ వచ్చును. 'కామ్యచ్'లోని చకారము ఇత్సంజ్ఞకము.

'పుత్రం ఆత్మనః ఇచ్ఛతి' అను నర్థమున కామ్యచ్ ప్రత్యయము చేయగా -'పుత్ర అమ్ కామ్య'. ధాతుసంజ్ఞ. సుబ్లుక్ (సూ-724). పిమ్మట తిప్‌శబాదులు -లట్టునందు 'పుత్రకామ్యతి' ఇత్యాదిరూపము లగును. పుత్రకామ్యితా:- లుట్ ప్రథమపురుషైకవచనమున 'పుత్రకామ్య ఇతా' అని యుండగా అకారములోపము (సూ-472).

### 729. ఉపమానాదాచారే 3.1.10

ఉపమానాత్ కర్మణః సుబన్తాత్ ఆచారేఽర్థే క్యచ్. పుత్రమివ ఆచరతి పుత్రీయతి ఛాత్రమ్. విష్ణూయతి ద్విజమ్.

"ధాతోః కర్మణః సమానకర్తృకాదిచ్ఛాయాంవా" "సుప ఆత్మనః క్యచ్" నుండి 'కర్మణః' 'సుపః' 'క్యచ్' అనువర్తించును. ఉపమానరూపమును కర్మవాచకమును అగు సుబంతముకంటె ఆచరించుట అను అర్థమున క్యచ్ ప్రత్యయము వచ్చును.

'పుత్రమివ ఆచరతి' అనగా (శిష్యుని) పుత్రుని వలె ఆచరించుచున్నాడు-చూచుచున్నాడు-అను నర్థమున 'పుత్రం' అనునది ఉపమానవాచకము. 'ఆచరతి' అనుదానిలో అది కర్మగ నున్నది. కావున ఈ సూత్రముచే క్యచ్ ప్రత్యయము చేయగా 'పుత్రీయతి' ఇత్యాదిరూపము లగును.

'క్యచ్' ప్రత్యయము "సుప ఆత్మనః క్యచ్" అను సూత్రముచే (723) వచ్చినను, 'ఉపమానాదాచారే' అను సూత్రముచే (729) వచ్చినను రూపములు ఒకేవిధము నుండును. అర్థవిగ్రహవాక్యములలో మాత్రమే భేద ముండును.

విష్ణూయతిద్విజమ్:- 'విష్ణుమివ ఆచరతి' అను నర్థమున విష్ణుశబ్దము నకు ఈ సూత్రముచే క్యచ్ ప్రత్యయము. 'విష్ణు య' అని యుండగా 'య'ఆర్ధ ధాతుకము గాన (సార్వధాతుకము కాదు గాన) 'అకృత్సార్వధాతుకయోః' అను సూత్రముచే (485) ఉకారమునకు దీర్ఘము. 'విష్ణూయతే'.

వా. సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః

అతో గుణే. కృష్ణ ఇవ ఆచరతి కృష్ణతి. స్వ ఇవ ఆచరతి-స్వతి. సస్వౌ.

అన్ని ప్రాతిపదికములకంటెను ఆచారార్థమున క్విప్ ప్రత్యయము వికల్ప ముగ వచ్చును.

'క్విప్' ప్రత్యయము సర్వలోపి. "లశక్వతద్ధితే" (128) 'హలన్త్యమ్' (1) "ఉపదేశేజనునాసికఇత్" (28) అను సూత్రములచే కకారపకారఉకారము లకు ఇత్సంజ్ఞ. వకారమునకు 'వేరపృక్తస్య' అను సూత్రముచే (304) లోపము. ఇది ప్రాతిపదికముకంటె విధింపబడినది గాని సుబన్తముకంటె విధిం పబడలేదు గాన 'రాజానతి' ఇత్యాద్యుదాహరణములందు పదాంతత్వప్రయుక్తము లగు నలోపాదులు రావు. క్విప్‌కు ప్రకృతులగు 'కృష్ణ' 'రాజన్' మొదలగునవి సుబన్తములు కాకుండుటచే పదములు కావు.

కృష్ణ ఇవ ఆచరతి (కృష్ణుడువలె వ్యవహరించుచున్నాడు) అనునర్థమున 'కృష్ణ' అను ప్రాతిపదికముకంటె ఈ వార్తికముచే 'క్విప్' ప్రత్యయము. అది పూర్తిగ లోపించిన పిమ్మట మిగిలిన 'కృష్ణ అను దానికి ధాతుసంజ్ఞ. లట్ ప్రథ మపురుషైకవచనమున 'శప్' 'తిప్'లు చేర్చిన పిదప 'కృష్ణ అ తి' అని యుండగా 'అతోగుణే' అను సూత్రముచే (274) పరరూపము— 'కృష్ణతి' లట్:- కృష్ణతి. లిట్:- కృష్ణాఞ్చకార, కృష్ణామ్బభూవ, కృష్ణామాస. లుట్:- కృష్ణితా. ల్యట్:- కృష్ణిష్యతి లోట్:- కృష్ణతు. లఙ్:- అకృష్ణత్. విధిలిఙ్:- కృష్ణేత్. ఆశీర్లిఙ్:- కృష్ణాయాత్. అతోలోపముకంటె పరము గాన 'అకృత్సార్వధాతుకయోః' అను సూత్రముచే (485) దీర్ఘము. లుఙ్:- అకృష్ణాత్. ల్యఙ్:- అకృష్ణిష్యత్.

ఈవిధముగనే 'స్వ ఇవ ఆచరతి' (ఆత్మీయుడు వలె ఆచరించుచున్నాడు) అను నర్థమున 'స్వ' అను ప్రాతిపదికముకంటె క్యచ్ ప్రత్యయము చేయగా 'స్వతి' ఇత్యాదిరూపము లగును.

సస్వౌ:- లిట్ ప్రథమపురుషైకవచనమున ద్విత్వాభ్యాసకార్యాదులు చేసిన పిమ్మట 'సస్వ ణల్' అని యుండగా వృద్ధి (సూ-182) - 'సస్వాఅ' అని యుండగా 'ఆత ఔ ణలః' అను సూత్రముచే (491) ణల్‌కు ఔకారము, వృద్ధియు చేయ 'సస్వౌ' అను రూపము సిద్ధించినది.

730. అనునాసికస్య క్విఝలోః క్ఙితి. 6.4.15

అనునాసికాన్తస్యోపధాయాః దీర్ఘః స్యాత్ క్వౌ ఝలాదౌ చ క్ఙితి. ఇదమివ ఆచరతి-ఇదామతి,

'అఙ్గస్య' అధికారము, 'నోపధాయాః' "ఢ్రలోపేపూర్వస్యదీర్ఘోణః" నుండి 'ఉపధాయాః' 'దీర్ఘః' అనువర్తించును. 'క్వి' ప్రత్యయముగాని ఝలాదియగు కిత్ ఙిత్ ప్రత్యయముగాని పర మగునపుడు అనునాసికాంత మగు ఉపధకు దీర్ఘము వచ్చును.

ఇదమివఆచరతి-ఇదివలె (దీనివలె) ప్రవర్తించుచున్నది - అనునర్థమున 'ఇదమ్'అను ప్రాతిపదికకంటెపై వార్తికముచే క్విప్ ప్రత్యయము. అది పరముగా నుండగా ఈ సూత్రముచే అనునాసికాంత మగు 'ఇదమ్'అనుదానిఉపధకు దీర్ఘము క్విప్ లోపించిన పిదప తిప్‌శబాదులచే 'ఇదీమతి' ఇత్యాదిరూపములు సిద్ధించును.

ఇట్లే రాజేవ ఆచరతి, పన్థా ఇవ ఆచరతి అను నర్థములందు 'రాజన్' 'పథిన్'అను ప్రాతిపదికములంటె క్విప్ ప్రత్యయము. ఈ సూత్రముచే ఉపధా దీర్ఘము చేయగా 'రాజానతి' 'పథీనతి' ఇత్యాదిరూపము లగును.

731. కష్టాయ క్రమణే. 3.1.14

చతుర్థ్యన్తాత్ కష్టశబ్దాత్ ఉత్సాహేఽర్థే క్యఙ్ స్యాత్. కష్టాయ క్రమతే కష్టాయతే.పాపం కర్తుముత్సహతే ఇత్యర్థః.

"కర్తుఃక్యఙ్‌సలోపశ్చ"నుండి 'క్యఙ్' అనువర్తించును. 'కష్టాయ'అను చతుర్థ్యంతకష్టశబ్దముకంటె "ఉత్సహించుట"అను నర్థమున 'క్యఙ్'ప్రత్యయము వచ్చును.

కష్టాయ క్రమతే (పాపముచేయనుత్సహించుచున్నాడు) అను అర్థమున "కష్టఙే"అనుదానికి ఈసూత్రముచేక్యఙ్ ప్రత్యయము 'కష్టఙేయ'అని యుండగా ఇది ధాతువు గాన సుప్‌కు లుక్కు (724)'కష్టయ'అని యుండగా'అకృత్సార్వధాతుకయోః'అనుసూత్రముచే (485) దీర్ఘము. 'క్యఙ్'ఙిత్తు గాన క్యఙన్తములు

ఆత్మనేపదులు. కావున తజ్ శబాదులు చేర్చుటచే 'కష్టాయతే' ఇత్యాదిరూపములగును. లట్- కష్టాయతే, లిట్- కష్టాయాఞ్చక్రే,కష్టాయామ్బభూవ, కష్టాయామాస. లుట్-కష్టాయితా. లృట్- కష్టాయిష్యతే. లోట్- కష్టాయతామ్. లఙ్-అకష్టాయత. విధిలిఙ్-కష్టాయేత. ఆశీర్లిఙ్-కష్టాయిషీష్ట.లుఙ్-అకష్టాయిష్ట. లృఙ్- అకష్టాయిష్యత.

732. *శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే. 3.1.17*

ఏభ్యః కర్మభ్యః కరోత్యర్థే క్యఙ్ స్యాత్ శబ్దం కరోతి శబ్దాయతే.

'కర్మణో రోమన్థతపోభ్యాం వర్తిచరోః' నుండి 'కర్మణః' అనువర్తించును. కర్మవాచకము లగు శబ్ద,వైర,కలహ. అభ్ర,కణ్వ (పాపము), మేఘఅను పదములకంటె చేయుట అను నర్థమున క్యఙ్ ప్రత్యయము వచ్చును.

'శబ్దం కరోతి' (శబ్దమును చేయుచున్నాడు) అనునర్థమున 'శబ్ద అమ్' అను దానికంటె ఈ సూత్రముచే క్యఙ్వచ్చి 'కష్టాయతే'నలె 'శబ్దాయతే' అను రూపము సిద్ధించును. వైరాయతే, కలహాయతే ఇత్యాది రూపములు గూడా ఈ విధముగనే సిద్ధించును.

*గ.సూ. 'తత్కరోతి తదాచష్టే'*

ఇతి ణిచ్.

*గ. సూ. ప్రాతిపదికాద్ధాత్వర్థేబహులమిష్ఠవచ్చ*

ప్రాతిపదికాత్ ధాత్వర్థే ణిచ్స్యాత్;ఇష్ఠే యథా ప్రాతిపదికస్య పుంవద్భావ, రభావ,టిలోప,విన్మతుబ్లోప-యణాదిలోప, ప్రస్థస్ఫాద్యాదేశ భసంజ్ఞాః, తద్వత్ణావపి స్యుః, ఇతిఅల్లోపః. ఘటం కరోత్యాచష్టే వా-ఘటయతి.

ఇతి నామధాతవః

ఈ రెండును 'క్రథ శైథిల్యే' అను ధాతువునకు పిమ్మట చురాదిగణము నందు పఠితము లగు గణసూత్రములు. వాస్తవమున సిద్ధాంతకౌముది ననుసరించి 'ప్రాతిపదికాత్'-ఇత్యాదిసూత్రము మొదటను, దానిపిమ్మట 'తత్కరోతి' ఇత్యాదిసూత్రమును ఉన్నవి. "ప్రాతిపదికము కంటె ధాత్వర్థమున ణిచ్ బహులముగ వచ్చును; ఇది పరముగ నున్నపుడు ఇష్ఠన్ ప్రత్యయము పరముగ నున్న

పుడు ఏకార్యములు వచ్చునో ఆకార్యములు వచ్చును" అని 'ప్రాతిపదికాత్' అను సూత్రమునకు అర్థము. ఆధాత్వర్థ మేవిధముగ నుండును అను అంశమును ప్రపంచించుటకై 'తత్కరోతి' అను సూత్రము చెప్పబడినది. అనగా "దానిని చేయుచున్నాడు; దానిని చెప్పుచున్నాడు" అను నర్థమున ప్రాతిపదికముకంటె ణిచ్ వచ్చును" అని దాని యర్థము. ఇవియే కాక ఆఖ్యానము, దర్శనము, శ్రవణము మొదలగు వాటిని కూడ ధాత్వర్థములుగ గ్రహింప వచ్చునని బాలమనోరమా కారుడు సూచించి యున్నాడు.

'ఇష్ఠన్' ప్రత్యయము పర మగునపుడు వివిధలక్ష్యములలో వివిధకార్యములు వచ్చినవి. ఉదా:-'అతిశయేన పట్వీ పటిష్ఠా' అను నపుడు 'భస్యాఢేతద్ధితే' అను సూత్రముచే పుంవద్భావము వచ్చినది. 'ద్రఢిష్ఠః' అనునపుడు "ర ఋతో హలాదేర్లఘోః" అను సూత్రముచే (1156) రభావము వచ్చినది. 'అతిశయేన సాధుః సాధిష్ఠః' అనునపుడు టిలోపము వచ్చినది. 'అతిశయేన స్రగ్వీ స్రజిష్ఠః' అనునపుడు 'విన్మతోర్లుక్' అను సూత్రముచే (1228) విన్ ప్రత్యయమునకు లుక్ వచ్చినది. 'అతిశయేన గోమాన్ గవిష్ఠః' అనునపుడు 'మతుప్'కు లుక్ వచ్చినది. 'అతిశయేన స్థూలః స్థవిష్ఠః' అనునపుడు "స్థూలదూరయువహ్రస్వక్షిప్రక్షుద్రాణాంయణాదిపరం పూర్వస్య చ గుణః" అనుసూత్రముచే యణాదిలోపము, పూర్వవర్ణమునకు గుణము వచ్చినవి. 'అతిశయేన ప్రియః ప్రేష్ఠః' ఇత్యాదులలో 'ప్రియస్థిర'-ఇత్యాదిసూత్రముచే (6.4.157) ప్రస్థ,స్ఫాద్యాదేశములు వచ్చినవి. 'అతిశయేనస్రగ్వీస్రజిష్ఠః' అనునపుడు భసంజ్ఞ యుండుటచే కుత్వము రాలేదు. ఈవిధముగ ఇష్ఠన్ ప్రత్యయప్రయుక్తకార్యము లన్నియు ఈ ణిచ్ పర మగునపుడు గూడ యథావకాశముగ వచ్చును.

ఘటంకరోతిఆచష్టేవా (ఘటమునుచేయుచున్నాడులేకచెప్పుచున్నాడు అను నర్థమున ఘటశబ్దముకంటె పై సూత్రములచే ణిచ్ ప్రత్యయము-"ఘటఅమ్ఇ" అని యుండగా సుబ్లుక్. 'ఘట ఇ' అని యుండగా ఈ ణిచ్ పరముగ నున్నపుడు పైన చెప్పిన విధముగ భసంజ్ఞయుండుటచే 'యస్యేతిచ' అనుసూత్రముచే (236) టకారోత్తరవర్తి యగు అకారమునకు లోపము. ఇపుడు 'ఘటి' అనునదిధాతువుగాన (సూ-470) తిప్‌శప్‌గుణాయాదేశాదులు చేయగా 'ఘటయతి' ఇత్యాదిరూపములు సిద్ధించును.

నామధాతు ప్రకరణము సమాప్తము.

# అథ కణ్డ్వాదయః

733. కణ్డ్వాదిభ్యో యక్. 3..1.27

ఏభ్యో ధాతుభ్యో నిత్యం యక్ స్యాత్ స్వార్థే. 'కణ్డూఞ్గాత్రవిఘర్షణే'కణ్డూయతి; కణ్డూయతే; ఇత్యాది. ఇతికణ్డ్వాదయః.

"ధాతోరేకాచోహలాదేః క్రియాసమభిహారేయఙ్" నుండి 'ధాతోః'అను వర్తించును. ధాతువులగు కణ్డ్వాదులకంటె స్వార్థమునందు, నిత్యముగ 'యక్' ప్రత్యయము వచ్చును.

కండ్వాదులు ప్రాతిపదికములుకూడ నుండుటచే వాటికి రాకుండుటకై 'ధాతోః' అనునది అనువర్తింపబడినది. 'కణ్డూఞ్'ధాతువునకు శరీరమును గోకికొనుట అని యర్థము. ఞిత్తు గాన ఉభయపది. ఈసూత్రముచే యక్ప్రత్యయము చేర్చిన పిదప 'కణ్డూయ'అనుదానికి 'సనాద్యన్తాధాతవః'అను సూత్రముచే (470)ధాతుసంజ్ఞ.'యక్' కిత్తు గాన గుణనిషేధము. తిప్శబాదులు చేర్చగా 'కణ్డూయతి, కణ్డూయతే'ఇత్యాదిరూపములు సిద్ధించును. లిట్:- కణ్డూయాఞ్చకార-ఞ్చక్రే. లుట్ - కణ్డూయితా. ౣట్- కణ్డూయిష్యతి-తే, లోట్-కణ్డూయతు - తామ్. లఙ్- అకణ్డూయత్-త. విధిలిఙ్- కణ్డూయేత్ - త. ఆశీర్లిఙ్:-కణ్డూయ్యాత్,కణ్డూయిషీష్ట.లుఙ్-అకణ్డూయీత్_యిష్ట. ౣఙ్-అకణ్డూయిష్యత్-త.

కణ్డ్వాది ప్రకరణము సమాప్తము.

# అథ ఆత్మనేపదప్రక్రియా

734. కర్తరి కర్మవ్యతిహారే 1.3.14

క్రియావినిమయే ద్యోత్యే కర్తరి ఆత్మనేపదమ్.వ్య తిలునీతే. అన్యస్య యోగ్యం లవనం కరోతీత్యర్థః.

'అనుదాత్తజితఆత్మనేపదమ్'నుండి'ఆత్మనేపదమ్,అనువర్తించును.క్రియా వినిమయము సూచింపబడునపుడు-అనగా ఒకరు చేయవలసిన పని మరియొకరు చేయుట అను నర్థమునందు, కర్త్రర్థమునందు ఆత్మనేపదము వచ్చును.

వ్యతిలునీతే:- ఒకడు చేయవలసిన ఛేదనక్రియను మరి యొకడు చేయుచున్నాడు అని అర్థము. సేవకుడు చేయవలసిన సస్యాదిలవనమును స్వామియే చేయుచున్నాడని అర్థము. 'లూఞ్'ధాతువు (క్ర్యాది) ఉభయపది యైనను ఈ యర్థమున ఆత్మనేపదిగ మాత్రమే ప్రయోగింపబడును.

ఈ విధముగ స్వభావతః ఉభయపదులు గాని,పరస్మైపదులు గాని అయిన ధాతువులు అర్థవిశేషమునందును, ఉపసర్గవిశేషముతో సంబంధించినపుడును ఆత్మనేపదు లగును. అట్టి నియమములే ఈ ప్రకరణమున చెప్పబడుచున్నవి. ఈ నియమములు వర్తించు ధాతువులు ఆత్మనేపదులుగ మాత్రమే ప్రయోగింపబడును.

735. న గతిహింసార్థేభ్యః 1.3.15

వ్యతిగచ్ఛన్తి. వ్యతిఘ్నన్తి.

గత్యర్థకధాతువులకును హింసార్థకధాతువులకును క్రియావినిమయము ద్యోత్య మగునపుడు కూడ ఆత్మనేపదము రాదు.

పై యుదాహరణములలో గమ (భ్వాది.పర.) హన (అదా. పర) ధాతువులు గతిహింసార్థకము లగుటచే ఆత్మనేపదము రాలేదు.

736. నేర్విశః 1.3.17

నివిశతే.

'ని'అను ఉపసర్గకంటె పర మగు విశ్ ధాతువునకు (తుదా-ప) ఆత్మనేపదము వచ్చును ఉదా-నివిశతే.

737. పరివ్యవేభ్యః క్రియః 1.3.18

పరిక్రీణీతే. విక్రీణీతే అవక్రీణీతే.

పరి, వి, అవ, అను ఉపసర్గలకంటె పర మగు క్రీధాతువుకంటె ఆత్మనేపదము వచ్చును.

'డుక్రీఞ్ ద్రవ్యవినిమయే' అను ధాతువు (క్ర్యాది) ఉభయపది యైనను ఈ ఉపసర్గలకంటె పర మగునపుడు ఆత్మనేపదిగమాత్రమే ప్రయోగింప బడును. ఉదా:- పరిక్రీణీతే; మొ.

738. విపరాభ్యాంజేః 1.3.19

విజయతే. పరాజయతే.

భౌవాదిక మగు జిధాతువు పరస్మైపది. ఈ జిధాతువు 'వి' 'పరా' అను ఉపసర్గలకంటె పర మగునపుడు ఆత్మనేపదము వచ్చును. ఉదా:- విజయతే. పరాజయతే.

739. సమవప్రవిభ్యః స్థః 1.3.22

సంతిష్ఠతే, అవతిష్ఠతే. ప్రతిష్ఠతే. వితిష్ఠతే.

సమ్, అవ, ప్ర, వి అను ఉపసర్గలకంటె పర మగు స్థాధాతువునకు (భ్వాది.ప.) ఆత్మనేపదము వచ్చును.

ఉదా:- సన్తిష్ఠతే- (బాగుగనిలచి యున్నాడు) ప్రతిష్ఠతే. (ప్రయాణ మగుచున్నాడు). మొ.

లట్.- సంతిష్ఠతే. లిట్:- సంతస్థే. లుట్:- సంస్థాతా. లృట్:- సంస్థాస్యతే. లోట్:- సంతిష్ఠతామ్, లఙ్:- సమతిష్ఠత.విధిలిఙ్:-సంతిష్ఠేత ఆశీర్లిఙ్:- సంస్థాసీత. లుఙ్:- సమస్థిత, సమస్థిషాతామ్, సమస్థిషత; సమస్థిథాః, సమస్థిషాథామ్, సమస్థిధ్వమ్; సమస్థిషి, సమస్థిష్వహి, సమస్థిష్మహి. లృఙ్:- సమస్థిష్యత.

లుఙ్నందు 'స్థాఘ్వోరిచ్చ' అను సూత్రముచే (627) ఆకారమునకు ఇకారము; 'త', 'థాస్' పర మగునపుడు "హ్రస్వాదఙ్గాత్" అను సూత్రముచే (548) సిచ్‌కు లోపము వచ్చినవి.

740 అపహ్నవే జ్ఞః 1.3.44

శతం అపజానీతే-అపలపతి ఇత్యర్థః.

కప్పిపుచ్చుట అను నర్థమునందు (ఉభయపదియగు) జ్ఞాధాతువుకంటె (క్ర్యాది) ఆత్మనేపదప్రత్యయములు వచ్చును. ఉదా:- శతం అపజానీతే - నూరు రూపాయలు మొదలగువాటిని కప్పిపుచ్చుచున్నాడు.

741. అకర్మకాచ్చ 1.3.45

సర్పిషో జానీతే. సర్పిషా ఉపాయేన ప్రవర్తతే ఇత్యర్థః.

అకర్మక మగు జ్ఞాధాతువుకంటె కూడ ఆత్మనేపదము వచ్చును. ఉదా:-

సర్పిషా జానీతే - అనగా (నెయ్యి అనెడు ఉపాయముచే ప్రవర్తించుచున్నాడు). ఇచట జ్ఞాధాతువు ప్రవర్తించుట అను నర్థమున ప్రయోగింపబడినది గాన అకర్మకము. అందుచే ఆత్మనేపదిగ మాత్రమే ప్రయోగింపబడును.

742. ఉదశ్చరః సకర్మకాత్ 1.3.53

ధర్మముచ్చరతే-ఉల్లఙ్ఘ్య గచ్ఛతీత్యర్థః.

'ఉద్'కంటె పర మగు సకర్మకచర్ధాతువుకంటె (పర) ఆత్మనేపదము వచ్చును.

పై ఉదాహరణమున 'ఉచ్చరతే' అను ఉత్పూర్వకచరధాతువు అతిక్రమించి నడచుచున్నాడు అను నర్థమున ప్రయోగింపబడినది. 'ధర్మం' అనునది దానికి కర్మ. అందుచే ఆత్మనేపదము వచ్చినది.

743 సమస్తృతీయాయుక్తాత్ 1.3.54

రథేన సంచరతే.

సమ్‌కంటె పరమైనదియు, తృతీయాంత మగు శబ్దముతో కూడినదియు నగు చర్ ధాతువుకంటె ఆత్మనేపదము వచ్చును.

పై యుదాహరణమున సమ్పూర్వకచరధాతువు 'రథేన' అనెడు తృతీయాంతపదముతో కూడి యుండుటచే ఆత్మనేపదము వచ్చినది.

744. దాణశ్చ సా చేత్ చతుర్థ్యర్థే 1.3.55

సమ్పూర్వాత్ దాణః తృతీయాన్తేన యుక్తాదుక్తం స్యాత్ తృతీయా చేత్ చతుర్థ్యర్థే. దాస్యా సంయచ్ఛతే కామీ.

వెనుకటి సూత్ర మంతయు అనువర్తించును. తృతీయాంతశబ్దముతో కూడిన సమ్పూర్వకదాణ్ధాతువునకు, తృతీయ చతుర్థ్యర్థమున ప్రయుక్తమైన పక్షమున, ఆత్మనేపదము వచ్చును.

దాస్యాసంయచ్ఛతేకామీ:- (కాముకుడు దాసికి ఇచ్చుచున్నాడు.) ఇచట 'అశిష్టవ్యవహారే దాణః ప్రయోగే చతుర్థ్యర్థే తృతీయా' అను వార్తికముచే చతుర్థ్యర్థమున, దాసీశబ్దముకంటె తృతీయ వచ్చినది అందుచే సమ్పూర్వక దాణ్ధాతువున కిచట ఆత్మనేపదము వచ్చినది. లట్టునందు "పాఘ్రాధ్మా" ఇత్యాది సూత్రముచే (490) యచ్ఛాదేశము

745. పూర్వవత్ సనః 1.3.62

సనఃపూర్వోయోధాతు స్తేనతుల్యం సన్నన్తాదపి ఆత్మనేపదం స్యాత్. ఏదిధిషతే.

సన్నంతముకంటె, సన్ ప్రత్యయము చేర్చుటకు పూర్వమునందున్న— అనగా సన్ ప్రత్యయమునకు ప్రకృతి యగు- ధాతువుతో సమానముగ ఆత్మనేపదము వచ్చును. సన్ ప్రత్యయము ఏధాతువునకు చేర్చబడినదో ఆధాతువు ఆత్మనేపది యైనచో సన్నంతము కూడ ఆత్మనేపది యగునని అర్థము.

ఏదిధిషతే:-ఏధధాతువు ఆత్మనేపది గాన దానికి 'ఏధితుం ఇచ్ఛతి' అను నర్థమున సన్ ప్రత్యయము చేర్చినపుడు ఆ సన్నంతధాతువు కూడ ఈ సూత్రముచే ఆత్మనేపది యైనది. ఇది అజాదిధాతువు గాన 'సన్యజోః' అను సూత్రముచే (709) 'ధి' అనెడు ద్వితీయభాగమునకు ద్విత్వము వచ్చి అభ్యాసకార్యాదులు చేయగా 'ఏదిధిషతే' అను రూపము సిద్ధించినది.

746. హలన్తాత్ చ 1.2.10

ఇక్సమీపాద్ హలః పరో ఝలాదిః సన్ కిత్. నివివిక్షతే.

'ఇకో ఝల్' అనుసూత్రము, "రుదవిదముషగ్రహిస్వపిప్రచ్ఛఃసంశ్చ" నుండి 'సన్', 'అసంయోగాల్లిట్కిత్' నుండి 'కిత్' అనువర్తించును. ఇక్సమీపమునం దున్న హల్లుకంటె పర మగు ఝలాది యగు సన్ 'కిత్' అగును.

నివివిక్షతే:- ఇది నిపూర్వకవిశ్ ధాతువు సన్నంతరూపము. 'నేర్విశః' అను సూత్రముచే (736) నిపూర్వక విశ్ధాతువునకు ఆత్మనేపదిత్వము విధింపబడినది గాన దాని సన్నంతము కూడ ఆత్మనేపది యైనది. విశ్ధాతువు అనిట్. 'నివేష్టుం ఇచ్ఛతి' అను నర్థమున సన్ప్రత్యయమును చేర్చిన పిదప 'నివివిశ్ స తే' అని యుండగా ఇచట'సన్' (ఇడాగమము రాలేదు గాన) ఝలాదిగ నున్నది. ఇక్సమీపమునం దున్న శకారరూపహల్లుకంటె పరముగ నున్నది గాన దానికి ఈ సూత్రముచే కిత్త్వము. కిత్త్వముచే గుణ నిషేధము. ద్విత్వాభ్యాస కార్యములు చేసిన పిదప 'నివివిశ్ స' అని యుండగా "వ్రశ్చ—" ఇత్యాది సూత్రముచే (308) శకారమునకుషకారము. 'షఢోఃకఃసి' అను సూత్రముచే (551) సకారమునకు కకారము. 'నివివిక్షతే' ఇత్యాదిరూపము లగును.

747 గన్ధనావక్షేపణ-సేవన-సాహసిక్య-ప్రతియత్న-
ప్రకథనోపయోగేషుకృఞః 1.3.32

గన్ధనం సూచనమ్. ఉత్కురుతే-సూచయతీత్యర్థః. అవక్షేపణం భర్త్సనమ్. శ్యేనో వర్తికాముదాకురుతే.- భర్త్సయతీత్యర్థః. హరిముపకురుతే – సేవతే ఇత్యర్థః. పరదారాన్ ప్రకురుతే - తేషు సహసా ప్రవర్తతే. ఏధోదకస్యోపస్కురుతే- గుణమాధత్తే. కథాః ప్రకురుతే- కథయతీత్యర్థః. శతం ప్రకురుతే - ధర్మార్థంవినియుఙ్క్తే. ఏషు కిమ్ - కటం కరోతి.

గన్ధనాద్యర్థములందు కృఞ్ (ఉభయపది) ధాతువుకంటె ఆత్మనేపదము వచ్చును.

గంధన మనగా సూచించుట. 'ఉత్కురుతే' అనునపుడు ఈ యర్థమున ఆత్మనేపదము వచ్చినది. అనక్షేపణ మనగా భయపెట్టుట. డేగ వర్తికను (ఒక చిన్న పక్షి) భయపెట్టుచున్నది అను నర్థమున 'ఉదాకురుతే' అనుదానికి ఆత్మనేపదము వచ్చినది, 'హరిముపకురుతే' అను నపుడు సేవార్థమున ఉపపూర్వక కృఞ్ధాతువునకు ఆత్మనేపదము వచ్చినది. సాహసిక్య మనగా సాహసము చేయుట అని అర్థము. పరభార్యలవిషయమున సాహసము చేయుచున్నాడు అను నర్థమున "పరదారాన్ ప్రకురుతే" అనునపుడు కృఞ్ధాతువునకు ఆత్మనేపదము వచ్చినది. ఉపస్కరణ మనగా గుణమును కలిగించుట. ఉదా:- "ఏధోదకస్యోపస్కురుతే". 'ఏధ' అను అకారాంతశబ్దమునకు 'ఉదక'శబ్దముతో కాని (ఏధశ్చఉదకంచ), సకారాంతమగు 'ఏధస్' శబ్దమునకు ఉదకార్థకమగు 'దక' శబ్దముతో గాని (ఏదశ్చ దకంచతయోఃసమాహారః) సమాహారద్వంద్వము. 'కట్టెలకును ఉదకమునకును (ఎండపెట్టుట మొదలగువాటిచే కట్టెలకును, గంధద్రవ్యాదులను చేర్చుటచే ఉదకమునకును) గుణాధానము చేయుచున్నాడు అని అర్థము. కొందరు "కట్టె ఉదకమునందు (రంగును కల్పించుటద్వారా) గుణాధానమును చేయుచున్నది" అని అర్థము చెప్పుదురు. కావున గుణాధానార్థమున ఇచట ఉపపూర్వకకృఞ్ధాతువునకు ఆత్మనేపదము వచ్చినది. ప్రకథన మనగా చెప్పుట అని అర్థము. "కథాః ప్రకురుతే' అనునపుడు 'చెప్పుచున్నాడు' అను నర్థమున కృఞ్ధాతువునకు ఆత్మనేపదము వచ్చినది. "శతంప్రకురుతే"___

నూరు రూపాయిలను ధర్మార్థమై వినియోగించుచున్నాడు. ఇచట ఉపయోగార్థ మున ఆత్మనేపదము వచ్చినది.

ఈ ఆత్మనేపదనియమము పై యర్థములందు-మాత్రమే వర్తించును గాన 'క్రతుం కరోతి' ఇత్యాదివాక్యములందు 'కరోతి' అనునది 'చేయుట' అనునర్థము నందు ప్రయోగింపబడుటచే అచట పరస్మైపదము కూడ వచ్చినది.

'భుజోనవనే' - ఓదనంభుఙ్క్తే. అనవనేకిమ్ - మహీంభునక్తి.

ఇత్యాత్మనేపదప్రక్రియా.

ఈ సూత్రము (675) రుధాదిగణమునందు చూపబడినది. రక్షణభిన్నార్థ మునందే భుజధాతువునకు ఆత్మనేపదము వచ్చును గాన 'మహీం భునక్తి' (భూమిని పరిపాలించుచున్నాడు) ఇత్యాది స్థలములందు పరస్మైపదమే వచ్చును.

ఆత్మనేపదప్రక్రియ సమాప్తము.

# అథ పరస్మైపదప్రక్రియా

748. అనుపరాభ్యాం కృఞః 1.3.79

కర్తృగే చ ఫలే గన్ధనాదౌ చ పరస్మైపదం స్యాత్. అనుకరోతి. పరాకరోతి.

ఫలము కర్తృగామియైనను, గంధనాద్యర్థములందు ప్రయోగింపబడినను కూడ (సూ-747) 'అను' 'పరా' అను ఉపసర్గములకంటె పర మగు కృఞ్ ధాతువునకు (తన్వాది-ఉభ) పరస్మైపదము వచ్చును. (ఆత్మనేపదము రాదు). ఉదా:- అనుకరోతి; పరాకరోతి.

749. అభిప్రత్యతిభ్యః క్షిపః 1.3.80

క్షిప ప్రేరణే. స్వరితేత్. అభిక్షిపతి.

అభి, ప్రతి, అతి అను ఉపసర్గములకంటె పర మగు క్షిపధాతువునకు పరస్మైపదము వచ్చును.

క్షిపధాతువునకు విసిరి వేయుట అని అర్థము. తౌదాదికము. స్వరితేత్తు గాన ఉభయపది. ఐనను పై ఉపసర్గలతో కూడి యున్నపుడు పరస్మైపదిగ మాత్రమే ప్రయోగింపబడును.

750. ప్రాద్వహః 1.3 81

ప్రవహతి.

భౌవాదిక మగు వహధాతువునకు మోయుట అని అర్థము. ఉభయపది. ఇది 'ప్ర' అను ఉపసర్గతో కూడినపుడు పరస్మైపదిగ మాత్రమే ప్రయోగింప బడును.

751. పరేర్మృషః 1.3 82

పరిమృషతి.

పరికంటె పర మగు మృష్ (సహించుట. తుదా. ఉభ) ధాతువునకు పరస్మైపదము వచ్చును. ఉదా:- పరిమృషతి.

752 వ్యాఙ్ పరిభ్యో రమః 1.3.83

రము క్రీడాయామ్. విరమతి.

'వి' 'ఆఙ్' 'పరి' అను ఉపసర్గములకంటె పర మగు రమ్ధాతువునకు పరస్మైపదము వచ్చును.

రమ్ ధాతువునకు క్రీడించుట అని యర్థము. భ్వాదిగణములోనిది, ఆత్మనేపది. 'వి'మొదలగు ఉపసర్గలు చేర్చునపుడు ఈ సూత్రముచే పరస్మైపదియై 'విరమతి' ఇత్యాదిరూపములు మాత్రమే యుండును.

753. ఉపాచ్చ 1.3,84

యజ్ఞదత్తముపరమతి, ఉపరమయతీత్యర్థః. అన్తర్భావితణ్యర్థోఽయమ్.

ఇతి పరస్మైపదప్రక్రియా. ఇతి పదవ్యవస్థా.

'ఉప' అను ఉపసర్గములకంటె పరమగు రమ్ధాతువుకంటె కూడ పరస్మైపదము వచ్చును.

ఉదా:- యజ్ఞదత్తం 'ఉపరమతి' అనగా యజ్ఞదత్తుని నశింప చేయుచున్నాడు అని యర్థము. 'ఉపరమతి' అనునపుడు ణిచ్ ప్రత్యయార్థము (ప్రేరణార్థము) అంతర్భావిత మై యున్నదని గ్రహించి ఈ విధముగ అర్థము చెప్పబడినది. ఇట్లు 'ఉపరమతి' అనుదానికి 'నశించుచున్నాడు' అను నర్థమును చెప్పినచో అపు డిది అకర్మక మగును. కాని "విభాషాఽకర్మకాత్" 1.3.85 అను ఉత్తరసూత్రమునందు (ఈసూత్రములఘుకౌముదిలో లేదు) అకర్మక మగు ఉప

పూర్వకరమ్‌ధాతువుకంటె వికల్పముగ పరస్మైపదము వచ్చు నని విధింపబడ నున్నది. ఆ సూత్రమును బట్టి, ఈ సూత్రముచే నిత్యముగ విధింపబడు పర స్మైపదము సకర్మక మగు ఉపపూర్వకరమ్ ధాతువుకే యని సూచింపబడినది. ఇది సకర్మకము కావలె నన్నచో అంతర్భావితణిజర్థ మని అంగీకరింపవలెను. మొత్తముపై ఈ రెండు సూత్రములను ఏక వాక్యముగ చేసి చూచినచో ఉప పూర్వకరమ్‌ధాతువు సకర్మక మైనచో పరస్మైపదిగ మాత్రమే యుండు ననియు, అకర్మకమగుచో ఉభయపది యగుననియు తేలినది.

పరస్మైపదప్రక్రియ సమాప్తము. పదవ్యవస్థ సమాప్తము.

# అథ భావకర్మప్రక్రియా

## 754. భావకర్మణోః 1.3.13

లస్యాత్మనేపదమ్.

'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' నుండి 'ఆత్మనేపదమ్'అనువర్తించును. భావార్థమునందును కర్మార్థమునందును లకారమునకు ఆత్మనేపదము వచ్చును.

## 755. సార్వధాతుకే యక్ 3.1.67

ధాతోర్యక్ భావకర్మవాచిని సార్వధాతుకే. భావః క్రియా-సా చ భావార్థకలకారేణ అనూద్యతే. యుష్మదస్మద్భ్యాం సామానాధికరణ్యా భావాత్ ప్రథమః పురుషః. తిఙ్వాచ్యక్రియాయా అద్రవ్యరూపత్వేన ద్విత్వాద్యప్రతీతేర్న ద్వివచనాది; కిన్త్వేకవచనమేవోత్సర్గతః. త్వయా మయా అన్యైశ్చ భూయతే. బభూవే.

'ధాతోరేకాచోహలాదేః క్రియాసమభిహారేయఙ్' 'చిణ్ భావకర్మణోః' నుండి 'ధాతోః' "భావకర్మణోః" అనువర్తించును. భావకర్మ వాచక మగు సార్వధాతుకము పర మగునపుడు ధాతువుకంటె 'యక్' ప్రత్యయము వచ్చును.

భావమనగా ధాత్వర్థ మగు క్రియ-అనగా ఫలోత్పత్త్యనుకూల మగు వ్యాపారము. ఈ వ్యాపారమును ధాతువు బోధించును. భావవాచ్యమునందు ఇట్టి ధాతువులకంటె పరముగ ప్రయుక్తమగు లకారము కూడ భావమునే బోధించు

ధాత్వర్థమునే అనువదించుచున్నది. 'అపదం న ప్రయుఞ్జీత 'అను న్యాయము ననుసరించి కేవలధాతువును ప్రయోగింపరాదు గాన భావవాచ్యమునందు (భావే ప్రయోగమునందు) లకారమును కూడ ప్రయోగించుట ఆవశ్యకము. ఆ లకార మునకు ఆత్మనేపదము (సూ-651) వచ్చును. ఈ లకారము ధాత్వర్థ మగు భావ మునే (వ్యాపారమును) బోధించును గాని యుష్మదర్థముతో గాని అస్మదర్థ ముతో గాని దానికి సామానాధికరణ్య ముండదు. అందుచే దానికి "యుష్మద్యుప పదేసమానాధికరణేస్థానిన్యపిమధ్యమః" (385) 'అస్మద్యుత్తమః' (386) అను సూత్రములచే మధ్యమోత్తమపురుషములలో ప్రయోగ ముండుటకు అవకాశము లేదు. అందుచే "శేషేప్రథమః" (387) అనుసూత్రము ననుసరించి కేవలము ప్రథమపురుషమునందు మాత్రమే భావవాచ్యక్రియాపదము ప్రయోగింపబడును.

'త్వం పశ్యసి' 'అహం పశ్యామి' ఇత్యాదికర్తరిప్రయోగములందు 'పశ్యసి' (చూచుచున్నావు) 'పశ్యామి' (చూచుచున్నాను) అనుపదములలోని లకారము దర్శనకర్త లగు 'త్వం' 'అహం' పదార్థములతో సంబంధించినదై వాటితో సమానాధికరణముగ నున్నదిగాన మధ్యమపురుషోత్తమపురుషములలో దానిని ప్రయోగించుటకు వీలు కలిగినది. అట్లే కర్మణిప్రయోగములగు "త్వం దృశ్యసే" "అహం దృశ్యే" ఇత్యాదులలో "దృశ్యసే' (చూడబడు చున్నావు) 'దృశ్యే' (చూడబడుచున్నాను) అనుపదములలోని లకా రము దర్శనకర్మ భూతము లగు 'త్వం' 'అహమ్' పదార్థములతో సంబంధించి తత్సమానాధికరణ మగుటచే ఇచట గూడ మధ్యమోత్తమపురుషములకు అవ కాశ మున్నది. కాని 'మయా సుప్యతే' 'త్వయా సుప్యతే' మొదలగు భావే ప్రయో గములలో 'సుప్యతే' (నిద్రించుట) అను పదమునందలి లకారము ధాత్వర్థమును మాత్రమే చెప్పుచున్నది. అస్మత్పదార్థముతో గాని యుష్మత్పదార్థముతో కాని దానికి సంబంధము లేదు. అందుచే భావార్థకలకారము లెన్నడును మధ్యమోత్తమ పురుషములలో ప్రయోగింపబడవు.

భావే ప్రయోగమున అకారస్థానమున వచ్చెడు తిఙ్ (తఙ్) ప్రత్య యము కూడ ధాత్వర్థమునే చెప్పును. ఆ ధాత్వర్థము ద్రవ్యరూపము కాదు గాన దానియందు ద్విత్వబహుత్వాదు లుండవు. అందుచే ద్వివచనబహువచనములు వచ్చుటకు అవకాశములేదు. సామాన్యసిద్ధ మగు ఏకవచనము మాత్రమే వచ్చును. ఫలితార్థ మేమనగా భావవాచ్యప్రయోగమునందు అన్నిలకారములందును ప్రథమ

పురుషైకవచనమున మాత్రమే ఉండును. ఉదా:- త్వయాభూయతే; మయాభూయతే; అన్యైః భూయతే. ఇచట కర్త ఏపురుషలోనున్నను 'భూయతే' అను క్రియ మాత్రము ప్రథమపురుషైకవచనమునందు మాత్రమే యున్నది. తెలుగు మొదలగు భాషలలో భావేప్రయోగము లేదుగాన 'త్వయాభూయతే' మొదలగు వాటిని సరిగ అనువదించుట కష్టము. 'నీచేతఅగుట'లేదా "నీవుఅగుట" ఇత్యాది విధముగ అనువదింపవలసి యుండును. మొత్తముమీద 'నీవుఅయితివి'అని యర్థము.

భూయతే:- భూ ధాతువునకు "లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః" అను సూత్రముచే (375) (ఇది అకర్మకధాతువు గాన) భావార్థమున లకారములు వచ్చును. వర్తమానార్థమున లట్- స్థానమున'భావకర్మణోః' అనుసూత్రముచే (654) ఆత్మనేపదప్రత్యయములు వచ్చును. ప్రథమపురుషైకవచనమున 'భూ త' అని యుండగా పైసూత్రముచే 'యక్' ఆగమము. "టిత ఆత్మనేపదానాంటేరే" అనుసూత్రముచే (511) ఏత్వము-'భూయతే'అను రూపముసిద్ధించినది.

లిట్టు ప్రథమపురుషైకవచనమున లకారస్థానమున ఆత్మనేపదప్రత్యయము, ద్విత్వాభ్యాసకార్యములు "లిటస్తఝయోరేశిరేచ్" అనుసూత్రముచే (516)'ఏశ్' ఆదేశము చేయగా 'బభూవే' అను రూపము సిద్ధించును.

756. స్యసిచ్ సీయుట్ తాసిషు భావకర్మణోరుపదేశేఽజ్ఝన గ్రహ దృశాం వా చిణ్వదిట్ చ. 6 4.62

ఉపదేశే యోఽచ్తదన్తానాం హనాదీనాం చ చిణీవాఙ్గకార్యం వా స్యాదిషు, భావకర్మణోర్గమ్యమానయోః, స్యాదీనామిడాగమశ్చ.

చిణ్వావపక్షేఽయమిట్; చిణ్వద్భావాద్వృద్ధిః- భావితా, భవితా, భావిష్యతే, భవిష్యతే. భూయతామ్; అభూయత. భూయేత, భావిషీష్ట, భవిషీష్ట.

ఉపదేశమునందు అజన్తములగు దాతువులకును హన్, గ్రహ్, దృశ్ధాతువులకును భావకర్మార్థములందు 'స్య' 'సీయుట్; 'తాస్',లు పర మగునపుడు 'చిణ్' పర మైనప్పుడు వలె అంగకార్యము (చిణ్వద్భావము) వికల్పముగ వచ్చును; స్యాదులకు ఇడాగమము కూడ వచ్చును.

ఈ సూత్రము రెండు కార్యములను విధించుచున్నది- మొదటిది చిణ్వ

ద్భావము, రెండవది ఇడాగమము. ఈ ఇడాగమము చిణ్వద్భావము వచ్చినపుడు మాత్రమే వచ్చును. చిణ్వద్భావము లేని పక్షమున ఇడాగమము గాదు. ధాతువు సేట్కమైనచో ఇడాగమము (సూ-403) వచ్చుటకు అడ్డులేదు.

లుట్ లృట్టులందు 'తా', 'స్య' లు పర మగునపుడు ఈ సూత్రముచే (భూధాతువు ఉపదేశమునందు అజంతము గాన) చిణ్వద్భావము వచ్చిన పక్షమున వృద్ధి (సూ-182) వచ్చును. చిణ్వద్భావపక్షమున ఈ సూత్రముచేతను, తదభావపక్షమున 'ఆర్ధధాతుక స్యేడ్వలాదేః'అనుసూత్రము (403) చేతను ఇడాగమము వచ్చును. 'భావితా-భవితా;' 'భావిష్యతే-భవిష్యతే' ఇత్యాదిరూపము లగును.

లోట్. లఙ్. విధిలిఙ్లందు కూడ ఆత్మనేపదయగాదేశములచే 'భూయాతామ్' "అభూయత", 'భూయేత' ఇత్యాదిరూపము లగును. భావిషీష్ట-భవిషీష్ట:- ఆశీర్లిఙ్నందు చిణ్వద్భావేడాగమములచే మొదటి రూపము, వలాద్యార్ధధాతుకత్వప్రయుక్త మగు ఇడాగమముచే రెండవరూపమును సిద్ధించినవి.

757. చిణ్ భావకర్మణోః. 3.1.66

చ్లేశ్చిణ్ స్యాత్ భావకర్మవాచిని తశబ్దే పరే. అభావి. అభావిష్యత-అభవిష్యత.

'చ్లేః సిచ్' 'చిణ్ తే పదః' నుండి 'చ్లేః- 'తే' అనువర్తించును. భావకర్మార్థక మగు 'త' పర మగునపుడు 'చ్లి'కి 'చిణ్' ఆదేశముగ వచ్చును.

అభావి:- భావవాచ్యలుఙ్నందు "అభూ చ్లి త" అని యుండగా ఈ సూత్రముచే 'చ్లి'కి చిణాదేశము. 'చిణో లుక్'అను సూత్రముచే (644)'త'కు లోపము. ఊకారమునకు వృద్ధి, 'ఆవాదేశము- 'అభావి' అను రూపము సిద్ధించినది. లృఙ్నందు స్య పర మగునపుడు చిణ్వద్భావవికల్పముచే 'అభావిష్యత' -'అభవిష్యత' ఇత్యాదిరూపము లగును.

అకర్మకోప్యుపసర్గవశాత్సకర్మకః- అనుభూయతే ఆనన్దశ్చైత్రేణ, త్వయా మయా చ అనుభూయేతే, అనుభూయన్తే: త్వమనుభూయసే; అహమనుభూయే, అన్వభావి. అన్వభావిషాతామ్-అన్వభవిషాతామ్.

భూధాతువు స్వభావతః అకర్మక మైనను 'అను' మొదలగు ఉపసర్గలు చేర్చినపుడు సకర్మక మగును. అందుచే దీనికి కర్మణిప్రయోగము కూడ ఉండును. కర్మణిప్రయోగమునందు లకారము కర్మను బోధించును. ఆ కర్మకు యుష్మదస్మచ్ఛబ్దములతో సామానాధికరణ్య ముండవచ్చును గాన మూడుపురుషలును ఉండును. కర్మద్రవ్యము గాన దానికి ఏకత్వద్విత్వాదులుండుటచే వచన ప్రత్యయము కూడ ఉండును. ఈ విధముగ భావేప్రయోగమునందు వలె గాక కర్మణిప్రయోగమునందు పురుషత్రయము, వచనత్రయము కూడ ఉండు ననెడు విషయమును సూచించుటకై 'అనుభూయతే, అనుభూయేతే; అనుభూయసే' ఇత్యాద్యుదాహరణములు చూపబడినవి.

లుఙ్నందుద్వివచనాదులలో చిణ్వద్భావవికల్పముచే (సూ-756) వృద్ధి పక్షమున, 'అన్వభావిషాతామ్' ఇత్యాదిరూపములును, గుణపక్షమున 'అన్వభవిషాతామ్' ఇత్యాదిరూపములును ఉండును.

ణిలోపః- భావ్యతే. భావయాఞ్చక్రే; భావయామ్బభూవే; భావయామాసే. చిణ్వదిట్- భావితా. ఆభీయత్వేనాసిద్ధత్వాత్ ణిలోపః. భావయితా. భావయిషీష్ట. అభావి. అభావిషాతామ్-అభావయిషాతామ్.

ణిజంతభూధాతువునకు కర్మార్థమునందు (కర్మణిప్రయోగమునందు) లట్ ప్రథమపురుషైకవచనమున 'యక్'ఆగమము చేసిన పిమ్మట "భావి యతే" అని యుండగా 'ణేరనిటి' అను సూత్రముచే (532) 'ణి'కి లోపము- 'భావ్యతే' అను రూపము సిద్ధించును. 'ఉండునట్లు చేయబడుచున్నాడు' అని యర్థము

భావయాఞ్చక్రే:- ణిజన్తభూధాతువునకు కర్మార్థమున లిట్టునందు 'కాస్యనేకాచఆమ్వక్తవ్యః' అను వార్తికముచే (సూ-471) ఆమాదేశము వచ్చిన పిమ్మట లిట్ పరక కృఞాదులు అనుప్రయుక్తము లగుటచే "భావయాఞ్చక్రే." 'భావయామ్బభూవే' 'భావయామాసే' ఇత్యాదిరూపము లగును. భావితా:- లుట్ ప్రథమపురుషైకవచనమున 'భావి తా' అని యుండగా చిణ్వద్భావఇడాగమములు (సూ-756). కాని ఈ ఇడాగమము 'అసిద్ధవదత్రాభాత్' అను సూత్రముచే (565) అసిద్ధము గాన 'ణి'లోపము (సూ-532)- భావ్ ఇతా- 'భావితా' అను రూపము సిద్ధించినది. చిణ్వద్భావము రాని పక్షమున వలాద్యార్ధధాతుకత్వ ప్రయుక్త మగు ఇడాగమము- 'భావిఇతా' అని యుండగా 'అనిటి' అని నిషే

ధింపబడుటచే 'ణేరనిటి' అను సూత్రముచే (532) ణిలోపము రాదు. అపుడు మొదటి ఇకారమునకు గుణాయాదేశములు వచ్చి 'భావయితా' అను రూపము సిద్ధించును. ఇట్లే 'స్య' 'సీయుట్', 'సిచ్' పర మగునపుడు గూడ చిణ్వదిడాగమము వచ్చిన పక్షమున ణిలోపము వచ్చును. వలాదిలక్షణ మగు ఇడాగమము వచ్చునపుడు మాత్రము ణిలోపము రాదు.

లృట్ :- భావిష్యతే-భావయిష్యతే. లోట్ :- భావ్యతామ్. లఙ్ :- అభావ్యత. విధిలిఙ్ :- భావ్యేత. ఆశీర్లిఙ్ :- భావిషీష్ట-భావయిషీష్ట. లుఙ్ :- అభావి, అభావిషాతామ్-అభావయిషాతామ్, అభావిషత-అభావయిష్యత, అభావిష్ఠాః-అభావయిష్ఠాః, అభావిషాథామ్-అభావయిషాథామ్, అభావిధ్వమ్-అభావయిధ్వమ్; అభావిషి-అభావయిషి. అభావిష్వహి-అభావయిష్వహి, అభావిష్మహి-అభావయిష్మహి. లృఙ్ :- అభావిష్యత-అభావయిష్యత.

బుభూష్యతే; బుభూషాఞ్చక్రే. బుభూషితా. బుభూషిష్యతే. బోభూయ్యతే. బోభూయతే.

సన్నంత మగు భూధాతువునకు భావార్థమునందు లట్ ప్రథమపురుషైకవచనమున 'బుభూషతే' అని యుండగా యగాగమము 'బుభూష యతే' అని యుండగా 'యక్' ఆర్ధధాతుకము గాన 'అతో లోపః' అను సూత్రముచే (472) సన్ప్రత్యయమునందలి అకారమునకు లోపము 'బుభూష్యతే' (ఉండుటకుఇచ్ఛయించుట).

బుభూషాఞ్చక్రే:- సన్నంతభూధాతువునకు భావారమున లిట్టునందు ప్రథమపురుషైకవచనమున ఆమ్ప్రత్యయము. లిట్పరకకృఞాదుల అనుప్రయోగము- 'బుభూషాఞ్చక్రే' మొ. బుభూషితా:- లుట్టునందు 'బుభూషఇతా'అని యుండగా అకారలోపము (సూ-472). బుభూషిష్యతే:- లృట్ ప్రథమపురుషైకవచనమున 'బుభూష ఇష్యతే' అని యుండగా అకారలోపము (సూ-472). లోట్ :- బుభూష్యతామ్. లఙ్ :- అబుభూష్యత. విధిలిఙ్ :- బుభూష్యేత. ఆశీర్లిఙ్ :- బుభూషిషీష్ట. లుఙ్ :- అబుభూషిష్ట. లృఙ్ :- అబుభూషిష్యత.

బోభూయ్యతే:- యఙన్తభూధాతువునకు భావేప్రయోగమున లట్ ప్రథమ పురుషైకవచనమునందు యగాగమము చేసిన పిమ్మట (సూ-755) 'బోభూయ యతే'అని యుండగా యఙ్‌లోని అకారమునకు లోపము (సూ-472)- 'బోభూ య్యతే' (మాటిమాటికి లేక ఎక్కువగా అగుట). లిట్:- బోభూయాఞ్చక్రే- బోభూయామ్బభూవే-బోభూయామాసే. లృట్:- బోభూయిష్యతే. లోట్:- బోభూయ్యతామ్. లఙ్:- అబోభూయ్యత. విధిలిఙ్:- బోభూయ్యేత. ఆశీర్లిఙ్:- బోభూయిషీష్ట. లుఙ్:- అబోభూయిష్ట. లృఙ్:- అబోభూ యిష్యత.

బోభూయతే:- యఙ్‌లుగన్తమగు భూధాతువుంటె భావార్థమున, లట్ ప్రథమపురుషైకవచనమునందు యగాగమము (సూ-755) చేసిన పిమ్మట 'బోభూ యతే' అను రూపము. ఈ యఙ్‌లుగంత భావవాచ్యమునందు ఆర్ధధాతుకము లలోని రూపములు యఙ్‌లుగన్తరూపములవలెనే సిద్ధించును. ఆత్మనేపదిత్వము మాత్రమే విశేషము. సార్వధాతుకములందు కూడ యఙ్‌లోపించినను 'యక్' సంబద్ధ మగు యకార ముండును గాన యఙన్తరూపముల వలెనే భావార్థకయఙ్ లుగన్తరూపములు గూడ ఉండును.

లిట్:- బోభవాఞ్చక్రే, లుట్:- బోభవితా, లృట్:- బోభవిష్యతే. లోట్:- బోభూయతామ్, లఙ్:- అబోభూయత. విధిలిఙ్:- బోభూయేత. ఆశీర్లిఙ్:- బోభవిషీష్ట. లుఙ్:- అబోభవిష్ట. లృఙ్:- అబోభవిష్యత.

ఇట్లు 'భూ'ధాతువు భావార్థమున స్వతంత్రముగ ప్రయుక్త మగునపుడును దీని ణ్యంత, సన్నంత, యఙంత, యఙ్‌లుగంతరూపములందును, భావకర్మార్థ ములందు ప్రక్రియచూపబడినది.

అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః- స్తూయతే విష్ణుః. స్తావితా-స్తోతా. స్తావిష్యతే, స్తోష్యతే. అస్తావి, అస్తావిషాతామ్-అస్తోషాతామ్.

అదాదిగణమునందలి స్తుధాతువునకు (అనిట్) స్తోత్రము చేయుట అవి అర్థము. 'స్తూయతే విష్ణుః' (విష్ణువు స్తుతింపబడుచున్నాడు) ఇత్యాదిస్థలములందు ఇది కర్మార్థమున ప్రయోగింపబడును. లట్ ప్రథమపురుషైకవచనమున యగా దేశము చేసిన పిమ్మట 'స్తు య తే' అని యుండగా "అకృత్సార్వధాతుకయో

ర్దీర్ఘః" అను సూత్రముచే (485) ఉకారమునకు దీర్ఘము- 'స్తూయతే'. లిట్:- 'తుష్టువే',

స్తావితా-స్తోతా:- లుట్ ప్రథమపురుషైకవచనమున 'స్తు తా' అని యుండగా వికల్పముగ చిణ్వద్భావేడాగమములు (సూ.756) —'స్తు ఇ తా'అని యుండగా ఉకారమునకు వృద్ధి (182), ఆవాదేశము 'స్తావితా' ఇత్యాదిరూపము లగును. చిణ్వద్భావేడాగమములు రాని పక్షమున ఆర్ధధాతుకత్వప్రయుక్తగుణము —'స్తోతా' ఇత్యాదిరూపము లగును. ఇది అనిడ్ధాతువు గాన ఇడాగమము రాలేదు.

స్తావిష్యతే-స్తోష్యతే:- ల్రుట్‌నందు గూడ పై వలె చిణ్వద్భావేడాగమ వికల్పముచే రెండేసి రూపము లగును.

లోట్-స్తూయతామ్. లఙ్-అస్తూయత. విధిలిఙ్-స్తూయేత. ఆశీర్లిఙ్-చిణ్వద్భావేడాగమవికల్పముచే 'స్తావిషీష్ట-స్తోషీష్ట' ఇత్యాది ద్వివిధరూపము లగును లుఙ్ద్వివచనాదులందుగూడ (సిచ్ లోపించదు గాన) సిచ్ పరమగు నపుడుచిణ్వద్భావేడ్వికల్పముచే రెండేసి రూపము లుండును. అస్తావి, అస్తావిషాతామ్-అస్తోషాతామ్ మొ. ల్రుఙ్-అస్తావిష్యత-అస్తోష్యత.

ఋగతౌ. గుణో ర్తీతిగుణః-అర్యతే. స్మృస్మరణే. - స్మర్యతే సస్మరే. ఉపదేశగ్రహణాచ్చిణ్వదిట్-ఆరితా-అర్తా స్మారితా-స్మర్తా. అని దితామితి నలోపః-స్రస్యతే. ఇదితస్తు- నన్ద్యతే. సమ్ప్రసారణమ్-ఇజ్యతే.

'ఋ'ధాతువునకు వెళ్ళుట అని యర్థము.జుహోత్యాదిగణములోనిది.అనిట్ దీనికర్మవాచ్యలట్ ప్రథమపురుషైకవచనమున యగాగమము చేసిన పిమ్మట 'ఋ య తే'అని యుండగా 'గుణో ర్తిసంయోగాద్యోః' అనుసూత్రముచే (501) ఋకారమునకు గుణము (అర్)-'అర్యతే.'

ఇట్లే స్మరణార్థక మగు స్మృధాతువునకు (అనిట్) కర్మవాచ్యప్రథమ పురుషైకవచనమున 'స్మృ య తే' అని యుండగా ఋకారమునకు గుణము (సూ-501)- 'స్మర్యతే' లిట్:- ఆరే. సస్మరే. ఋధాతువునకు లుట్టునందు 'ఋ తా' అని యుండగా నిత్య మగుటచే మొదట గుణము (సూ-390)- 'అర్ తా' అని యున్నది. ఇపుడు 'అర్' అనునది హలంత మైనను ఉపదేశమునందు

'ఋ'అనునది అజంతమే గాన (వ్యపదేశవద్భావముచే), 'అర్' అనుదానికి గూడ ణిజ్వద్భావము'తా'కు ఇడాగమము (సూ-756) వచ్చును. 'అచోఞ్ణితి' (182)-"ఆరితా", చిణ్వద్భావేడాగమములు రాని పక్షమున 'అర్తా'. ఇట్లే స్మృ ధాతువునకు కూడ లుట్టునందు 'స్మారితా' 'స్మర్తా' అను ద్వివిధరూపము లుండును.

లృట్- ఆరిష్యతే—అరిష్యతే, స్మారిష్యతే-స్మరిష్యతే. లోట్-అర్యతామ్, స్మర్యతామ్. లఙ్-ఆర్యత, అస్మర్యత. విధిలిఙ్-అర్యేత. స్మర్యేత. ఆశీర్లిఙ్-ఆరిషీష్ట-ఋషీష్ట, స్మారిషీష్ట స్మృషీష్ట. లుఙ్-ఆరి,ఆరిషాతామ్-ఋషాతామ్ మొ. అస్మారి,అస్మారిషాతామ్-అస్మృషాతామ్ మొ.లృఙ్-ఆరిష్యత. అస్మారిష్యత - అస్మరిష్యత. చిణ్వద్భావేడాగమములు రాని పక్షమునందు గూడ లృట్, లృఙ్లందు 'ఋద్ధనోః స్యే'అను సూత్రముచే (500) ఇడాగమము వచ్చినది

'స్రన్'ధాతువునకు జారుట అని అర్థము. దానికి భావవాచ్యలట్ ప్రథమపురుషైకవచనమున 'స్రంస్ య తే' అని యుండగా 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' అను సూత్రముచే (335) నకారలోపము- 'స్రస్యతే'. లోట్- స్రస్యతామ్. లఙ్- అస్రస్యత, విధిలిఙ్- స్రస్యేత. ఈధాతువుఆత్మనేపదిధాతువు గాన ఆర్ధధాతుకలకారములందు భావవాచ్యరూపములకును మూలరూపములకును భేద మేమియు ఉండదు. ఇది ఉపదేశమునందు అజంతము కాదు గాన చిణ్వద్భావేడాగమములు గూడ రావు.

'టునది సమృద్ధౌ'అను ధాతువు ఇదిత్ గాన దీని కర్మవాచ్యమునందు, "ఇదితోనుమ్ధాతోః"అను సూత్రముచే (465) వచ్చిన 'నుమ్'నకారమునకు "అనిదితాం" (సూ-335) అని నిషేధించుటచే లోపము రాదు. 'నన్ద్యతే' ఇత్యాదిరూపము లగును.

'యజ్'ధాతువునకు (పూజించుట. అనిట్) కర్మవాచ్యలట్ ప్రథమపురుషైకవచనమున 'యక్' చేర్చిన పిదప 'యక్' కిత్తు గాన"వచిస్వపియజాదీనాం కితి" అను సూత్రముచే (550) సంప్రసారణము-'ఇజ్యతే'.

లిట్-ఈజే. లుట్-యష్టా. లృట్-యక్ష్యతే. లోట్-ఇజ్యతామ్. లఙ్-ఐజ్యత. విధిలిఙ్-ఇజ్యేత. ఆశీర్లిఙ్- యక్షీష్ట. లుఙ్-అయాజి-అయక్షాతాం,

అయక్షత. లృఙ్ - అయక్ష్యత. లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చిణ్ భావ కర్మణోః'అను సూత్రముచే (757) చిణ్ వచ్చినది. స్రంస్, సంద్ ధాతువులకు కూడ ఈవిధముగ చిణ్ వచ్చును.

758. తనోతేర్యకి. 6.4.44

అకారోఽన్తాదేశో వా స్యాత్. తాయతే. తన్యతే.

'విడ్వనోరాత్' 'యే విభాషా' నుండి 'ఆత్' 'విభాషా' అనువర్తించును తనుధాతువునకు యక్ పర మగునపుడు వికల్పముగ ఆకారము అన్తాదేశమై వచ్చును.

తను ధాతువునకు కర్మవాచ్యలట్ ప్రథమపురుషైకవచనమున 'తన్ యతే'అని యుండగా ఈ సూత్రముచే నకారస్థానమున ఆకారాదేశము. సవర్ణదీర్ఘము-'తాయతే'.ఆకారము రాని పక్షమున 'తన్యతే'.ఈ విధముగ యగాగమము వచ్చుటకు అవకాశము గల సార్వధాతుకలకారములందు రెండేసి రూపము లుండును.

759. తపోఽనుతాపే చ. 3.1.65

తపశ్చ్లేశ్చిణ్ న స్యాత్కర్మకర్తర్యనుతాపే చ. అన్వతప్త పాపేన. ఘుమాస్థేతీత్వమ్-దాయతే, దీయతే, దదే.

'చ్లేః సిచ్' 'చిణ్ తే పదః' 'న రుధః'నుండి 'చ్లేః' 'చిణ్' 'న' అనువర్తించును. 'చ'అనుటచే 'అచఃకర్మకర్తరి'అను సూత్రమునందలి'కర్మకర్తరి' సముచ్చితమైనది. కర్మకర్త్రర్థకమును, పశ్చాత్తాపార్థకము లేదా పీడార్థకమును అగు తప్ధాతువుకంటె పర మగు 'చ్లి'కి 'చిణ్' రాదు.

ఉదా:- అన్వతప్త పాపేన. ఇచట 'పాపేన'అనుదానికి "పాపముచేత" 'పాపాత్మునిచేత'అని రెండర్థములు చెప్పవచ్చును. మొదటిఅర్థమునుగ్రహించిన పక్షమున ఇదికర్మవాచ్యమగును. 'పాపముచేత పీడింపబడినాడు'అని అర్థము. రెండవఅర్థము గ్రహించిన పక్షమున భావవాచ్య మగును. 'పాపాత్మునిచే పశ్చాత్తప్త డగుట-పాపాత్ముడు పశ్చాత్తప్తుడగుట' అని యర్థము. ఇచట అనుపూర్వకతప్ ధాతువునకు భావవాచ్యమునందు గాని కర్మవాచ్యమునందు గాని లుఙ్నందు 'చిణ్ భావకర్మణోః'అనుసూత్రముచే (757) ప్రథమపురుషైకవచనమున 'చిణ్'రావలసి యుండగా ఈ సూత్రముచే అదినిషేధింపబడినది. 'అన్వ

తప్ క్లిత'అనియుండగా ఈ సూత్రముచే'చిణ్'నిషేధింపబడినది గాన 'క్లి'కి 'సిచ్' వచ్చినది. దానికి'ఝలోఝలి'అనుసూత్రముచే (480) లోపము- 'అన్వ త ప్త'అనురూపము సిద్ధించినది.

'దా' 'ధా'ధాతువులకు కర్మవాచ్యమున లట్ప్రథమపురుషైకవచనమున యగాగమము చేసిన పిమ్మట "ఘుమాస్థాగాపాజహాతిసాంహలి"అను సూత్ర ముచే (591) ఈకారము-'దీయతే' 'ధీయతే' లిట్-దదే. దధే.

760. ఆతోయుక్ చిణ్ కృతోః. 7.3.33

ఆదన్తానాం యుగాగమః స్యాచ్చిణి ఞ్ణితి కృతి చ. దాయితా- దాతా. దీయిషీష్ట-దాసీష్ట. అదాయి, అదాయిషాతామ్. భజ్యతే.

'అఙ్గస్య'అధికారము. 'అచో ఞ్ణితి'నుండి 'ఞ్ణితి'అనువర్తించును. చిణ్ గాని, ఞిత్తును ణిత్తును అగు కృత్ప్రత్యయము గాని పర మగునపుడు ఆకా రాంత మగు అంగమునకు 'యుక్' ఆగమము వచ్చును,

దాయితా-దాతా:- దా ధాతు కర్మవాచ్యమున లుట్ప్రథమపురుషైకవచన మున'తాస్'కు 'స్యసిచ్'ఇత్యాది సూత్రముచే (756) చిణ్వద్భావేడాగమములు వచ్చుటచే ఈ సూత్రముచే యుగాగమము. 'దాయితా' అనురూపముసిద్ధించును. చిణ్వద్భావము రాని పక్షమున ఈ ధాతువు అనిట్ గాన'దాతా'. ఇట్లే చిణ్వద్భా వాది వికల్పముచే లృట్టునందు గూడ "దాయిష్యతే-దాస్యతే" ఇత్యాది ద్వివిధ రూపము లగును. లోట్ - దీయతామ్. లఙ్- అదీయత. విధిలిఙ్- దీయేత. ఆశీర్లిఙ్-సీయుట్ పర మగునపుడు గూడ చిణ్వద్భావేడాగమములు. యుగ్గాగ మము వచ్చు పక్షమున "దాయిసీష్ట" ఇత్యాదిరూపములును, తదభావపక్షమున 'దాసీష్ట' ఇత్యాదిరూపములును అగును.

అదాయి:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చిణ్'చేసిన పిమ్మట (సూ. 757) సూత్రముచే యుగాగమము, 'చిణోలుక్'అను సూత్రముచే (644) 'త'కు లోపము అదాయిషాతామ్:- లుఙ్ప్రథమపురుషద్వివచనమున 'స్యసిచ్' ఇత్యాది సూత్రముచే (756) చిణ్వద్భావేడాగమములు,యుగాగమము వచ్చిన పక్ష మున "అదాయిషాతామ్" చిణ్వద్భావాదులు రాని పక్షమున 'స్థాఘ్వోరిచ్చ'అను సూత్రముచే (627) ఇకారము వచ్చును. 'అదిషాతామ్'. ఈ విధముగ ప్రథమ

పురుషైకవచనము తక్క ఇతర స్థలములలో రెండేసి రూపము లుండును. లృఙ్:-అదాయిష్యత-అదాస్యత.ధాధాతు రూపములు గూడ ఈవిధముగనే ఉండును.

భజ్యతే:- భఞ్జ్ధాతువునకు కర్మవాచ్యమున లట్ ప్రథమపురుషైకవచనమున యగాగమము. "అనిదితాంహలఉపధాయాఃక్ఙితి" అనుసూత్రముచే (335) నకారలోపము- 'భజ్యతే' లిట్- బభఞ్జే. లుట్- భఞ్జితా. లృట్- భఞ్జిష్యతే. లోట్-భజ్యతామ్ లఙ్- అభజ్యత. విధిలిఙ్- భజ్యేత. ఆశీర్లిఙ్- భఞ్జిషీష్ట.

761. భఞ్జేశ్చ చిణి. 6.4.33

నలోపో వా స్యాత్. అభాజి. అభఞ్జి. లభ్యతే.

'శ్నాన్నలోపః' నుండి 'న', 'లోపః', 'జాన్తనశాంవిభాషా' నుండి 'విభాషా' అనువర్తించును. చిణ్ పర మగునపుడు భఞ్జ్ధాతువు నకారమునకు గూడ లోపము వికల్పముగ వచ్చును.

అభాజి-అభఞ్జి- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చ్లి'కి చిణాదేశము (సూ. 757). పిమ్మట ఈసూత్రముచే నకారలోపము. 'అభజ్ ఇ త'అని యుండగా ఉపధావృద్ధి (సూ. 457). 'త'కులుక్ (సూ. 644) 'అభాజి'. నకారలోపము రాని పక్షమున తలోపముచే 'అభఞ్జి' అనురూపము. లృఙ్- అభఞ్జిష్యత.

లభ్యతే:- లభ్ధాతువునకు కర్మవాచ్యమున లట్ ప్రథమపురుషైకవచనమున యగాగమము వచ్చి 'లభ్యతే'అను రూపము సిద్ధించును. ఆర్ధధాతుకలకారము లందు దాని రూపములు కర్తృవాచ్యరూపముల వలెనే ఉండును. లోట్- లభ్యతామ్. లఙ్- అలభ్యత. విధిలిఙ్- లభ్యేత.

762. విభాషాచిణ్ణములోః 7.1.69

లభేర్నుమాగమో వా స్యాత్. అలమ్భి. అలాభి.

ఇతి భావకర్మప్రక్రియా.

'లభేశ్చ' 'ఇదితోనుమ్ధాతోః' నుండి 'లభేః' నుమ్' అనువర్తించును. 'చిణ్'గాని 'ణముల్' గాని పర మగునపుడు లభ్ధాతువునకు వికల్పముగ నుమాగమము వచ్చును.

అలమ్భి - అలాభి:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చ్లి'కి 'చిణ్' వచ్చిన పిమ్మట ఈసూత్రముచే వికల్పముగ నుమాగమము వచ్చిన పక్షమున

'అలన్భ్ ఇ త' అని యుండగా నకారమునకు అనుస్వారము (సూ. 78) దానికి పరసవర్ణ మగుమకారము (సూ.79) వచ్చి 'అలమ్భిత' అని యుండగా 'త'కు "చిణోలుక్" అనుసూత్రముచే (644) లుక్కు వచ్చి 'అలమ్భి' అను రూపము సిద్ధించినది. నుమాగమము రాని పక్షమున వృద్ధివచ్చి (సూ.457) "అలాభి" అనురూపముసిద్ధించును. లుఙ్నందలి ఇతరరూపములు కర్తృవాచ్యరూపముల వలె నుండును. అలమ్భి - అలాభి, అలప్సాతామ్, అలప్సత; అలబ్ధాః, అలప్సాథామ్, అలబ్ధ్వమ్, అలప్సి, అలప్స్వహి, అలప్స్మహి.

భావకర్మప్రక్రియ సమాప్తము.

# అథ కర్తృకర్మ ప్రక్రియా

యదా కర్మైవ కర్తృత్వేన వివక్షితం తదా సకర్మకాణామప్యకర్మకత్వాత్ కర్తరి భావే చ లకారాః

763. *కర్మవత్ కర్మణా తుల్యక్రియః 3.1.87*

కర్మస్థయా క్రియయా తుల్యక్రియః కర్తా కర్మవత్ స్యాత్. కార్యాతిదేశోఽయమ్. తేన యగాత్మనేపదచిణ్వాదిటః స్యుః. పచ్యతే ఫలమ్. భిద్యతే కాష్ఠమ్. అపాచి. అభేది. భావే తు భిద్యతే కాష్ఠేన.

ఇతి కర్మకర్తృప్రక్రియా.

కర్మయే కర్తగ వివక్షిత మైనపుడు సకర్మకధాతువులు కూడ అకర్మక ధాతువు లగును గాన అట్టి ధాతువులకు చేర్చబడు లకారము కర్త్రర్థకముగాని భావార్థకముగాని అగును.

'స్థాల్యాం అగ్నినా అన్నం పచతి' (గిన్నెయందు అగ్నితో అన్నమును వండుచున్నాడు) ఇత్యాదివాక్యములందు స్థాలి అధికరణము; అగ్ని కరణము (సాధనము); అన్నము కర్మ. కాని పచనక్రియ ఆయా కారకములచే చాల అనాయాసముగ జరుగుచున్నదను విషయమును సూచించుటకై 'స్థాలీ పచతి' -గిన్నె వండుచున్నది; 'అగ్నిః పచతి' అగ్ని వండుచున్నది- 'అన్నం పచ్యతే' -అన్నము ఉడుకుచున్నది- ఇత్యాదివాక్యములలో అధికరణ మగు స్థాలికిని,

సాధన మగు అగ్నికని, కర్మ యగు అన్నమునకును కర్తృత్వము కల్పింపబడు చున్నది. ఇట్టి ప్రయోగములలో అధికరణాదులే కర్త లగుచున్నవి. ఈ విధ ముగ అధికరణకరణాదులకు కర్తృత్వము చెప్పినను లకారములలో విశేషకార్య మేదియు ఉండదు. కాని కర్మను కర్తగ భావించి ప్రయోగించు నపుడు లకార ములకు కొన్ని విశేషకార్యములు వచ్చును. ఆ విశేషకార్యములు కొన్ని ఈ ప్రకరణమునందు చూపబడుచున్నవి. ఈ విధముగ కర్మను కర్తగా వివక్షించి ప్రయోగించినపుడు అట్టి ప్రయోగమునకు కర్మకర్తరిప్రయోగమని పేరు. ఇట్టి స్థలములలో, ధాతువు స్వభావతః సకర్మకమే యైనను, ఆ కర్మయే కర్త యగు టచే అకర్మకముగ పరిగణింపబడును. అందుచే ఇట్టి ధాతువునకు చేర్చు లకార ములు కర్త్రర్థకములుగగాని భావార్థకములుగగాని యుండును. ఉదా:- 'ఓదనః పచ్యతే' అనునపుడు 'పచ్యతే' అనునది కర్త్రర్థకము. 'పచ్యతే ఓదనేన' అను నపుడు భావార్థకము.

కర్మవత్కర్మణా:- 'కర్తరి శప్' నుండి 'కర్తరి' అనువర్తించును. 'కర్మణా' అనుదానికి "కర్మకారకస్థయా క్రియయా" అని యర్థము.

కర్మకారకమునం దున్న క్రియతో సమాన మగు క్రియ గల కర్త కర్మ వంటి దగును. అనగా కర్మను కర్తగా వివక్షించిన స్థలములలోని ఆ కర్త కర్మవంటిదే యగునని అర్థము.

ఏదైన ఒకదానికి మరియొకదానితో తుల్యత్వమును కల్పించుటకు అతి దేశ మని పేరు. మరియొకదాని విషయమున ప్రవర్తించు శాస్త్రము ఇచటగూడ ప్రవర్తించును అని చెప్పినచో దీనికి శాస్త్రాతిదేశ మని యు, అచటవచ్చెడు కార్యము ఇచట గూడ వచ్చు నని చెప్పినచో కార్యాతిదేశ మనియు పేర్లు. శాస్త్రాతిదేశమునకు ప్రయోజనము గూడ కార్యము వచ్చుటయే గాన ఇచట కార్యా తిదేశము అంగీకరింపబడినది

పచ్యతే ఫలమ్:- పండు ముగ్గుచున్నది. ఇచట వాస్తవమున కాలము పండును ముగ్గునట్లు చేయుచున్నది గాని పండు స్వయముగముగ్గ జాలదు. అనగా "కాలః ఫలం పచతి" అని యుండవలెను. కాని ఈ ఫలము అనాయాసముగ ముగ్గుచున్నది అను విషయమును సూచించుటకై కర్మ యగు ఫలమునకు కర్తృ త్వము వివక్షిత మైనది. అనగా పచనక్రియ కాలమునం దున్న దని చెప్పుటకు బదులు ఫలమునందే ఉన్న దని చెప్పినట్లు అయినది. ఇపుడు వాస్తవమున

కర్మ యగు ఫలమునందున్న పాక్రియతో సమానమగు క్రియ (పాక్రియ) గల కర్త (ఫలము) కర్మవంటి దగు నని చెప్పబడినది గాన ఇది కర్తరి ప్రయోగమే యైనను కర్మణి ప్రయోగముగ పరిగణింపబడును. అందుచే 'సార్వధాతుకే యక్' అను సూత్రముచే (755) యక్, "భావకర్మణోః" అను సూత్రముచే (754) ఆత్మనేపదము; "చిణ్ భావకర్మణోః" అను సూత్రముచే (757) చిణ్, 'స్యసిచ్ సీయుట్—' ఇత్యాదిసూత్రముచే (756) చిణ్వద్భావేడాగమములును వచ్చును. ఈ విధముగ కర్మణిప్రయోగమునందు వలె 'పచ్యతే' అను రూపము సిద్ధించును. 'పండుచున్నది' అని యర్థము ఇట్లే "దేవదత్తః కాష్ఠం భినత్తి" అనునపుడు కర్మగ నున్న కాష్ఠము కర్తగా వివక్షిత మగుటచే "భిద్యతే కాష్ఠమ్" "కఱ్ఱ బద్ద లగుచున్నది" అను ప్రయోగము సిద్ధించినది. ఇవి కర్మకర్తరి ప్రయోగములు. భావేప్రయోగమున "పచ్యతే ఫలేన" 'భిద్యతే కాష్ఠేన' ఇత్యాది విధముల నుండును.

అపాచి, అభేది:- లుఙ్ ప్రథమపురుషైకవచనమున 'చిణ్ భావకర్మణోః' అను సూత్రముచే (757) 'చ్లి'కి చిణ్, తకారలోపము, ఉపధావృద్ధి, ఉపధాగుణము వచ్చును.

కర్మకర్తృప్రక్రియ సమాప్తము.

# అథ లకారార్థప్రకరణమ్

## 764. అభిజ్ఞావచనే లృట్ 3.2.112

స్మృతిబోధిన్యుపపదే భూతానద్యతనే ధాతోర్లృట్. లఙో౽పవాదః. వస నివాసే. స్మరసి కృష్ణ! గోకులే వత్స్యామః. ఏవం బుధ్యసే ఇత్యాదిప్రయోగే౽పి.

'భూతే' అధికారము. "అనద్యతనే లఙ్" నుండి 'అనద్యతనే' అనువర్తించును. స్మృతిబోధక మగు పదము ఉపపదముగ నున్నపుడు అనద్యతన భూతార్థమున ధాతువుకంటె లృట్ వచ్చును.

ఈ సూత్రము 'అనద్యతనేలఙ్' అను సూత్రముచే (424) విహిత

మగు లజ్జుకు అపవాదము. వసధాతువునకు నివసించుట అని యర్థము. భ్వాదికము; పరస్మైపది. అనిట్.

'స్మరసి కృష్ణ; గోకులే వత్స్యామః' అను ఉదాహరణమున 'స్మరసి' అను పదము ఉపపదముగాన (కూడా ప్రయోగింపబడిన పదముగా ఉన్నది గాన) వస్‌ధాతువునకు లఙ్‌కు బదులు ఈ సూత్రముచే ల్బట్టువచ్చినది "కృష్ణా! మనము గోకులములో నుండెడి వారము; జ్ఞాపకమున్నదా?" అని యర్థము. ఈ విధముగ స్మరణార్థకము లగు "బుధ్యసే" 'చేతయసే' ఇత్యాదిపదము లు పపదములుగ నున్నపుడు గూడ ల్బట్టు వచ్చును.

765. న యది 3.2.113

యద్యోగే ఉక్తం న. అభిజానాసి కృష్ణ! యద్వనే అభుఞ్జ్మహి.

యచ్ఛబ్దముతో సంబంధ మున్నపుడు పై సూత్రము వర్తింపదు.

"అభిజానాసి—":- కృష్ణా! గుర్తు ఉన్నదా; వనములో భుజించితిమి?" ఇచట 'యత్' అనునది కూడ ప్రయోగింపబడినది గాన పై సూత్రముచే ల్బట్టు రాలేదు. లఙ్ వచ్చినది (సూ-424).

766. లట్ స్మే 3.2.118

లిటోఽపవాదః. యజతి స్మ యుధిష్ఠిరః.

'స్మ' అనుదానితో యోగ మున్నపుడు లట్ వచ్చును.

'స్మ' అనునది భూతకాలద్యోతక మగు అవ్యయము. ఈ పదమును ప్రయోగించినపుడు లిట్టును బాధించి లట్టు వచ్చును. యుధిష్ఠిరుడు యజ్ఞము చేసెను. అనునర్థముగల పై యుదాహరణమున 'స్మ' అనునది ఉపపదముగ నున్నది గాన లట్టు వచ్చినది.

762. వర్తమానసామీప్యే వర్తమానవద్వా 3 3.131

వర్తమానే యే ప్రత్యయా ఉక్తాస్తే వర్తమానసామీప్యభూతే భవిష్యతి చ వా స్యుః. కదాఽగతోఽసి? అయమాగచ్ఛామి; అయమాగమం వా. కదాగమిష్యసి? ఏష గచ్ఛామి గమిష్యామి వా.

వర్తమానార్థము నందు విహితములగు ప్రత్యయములు వర్తమానమునకు సమీపమున నున్న భూతార్థమునందును భవిష్యదర్థమునందును గూడ వికల్పముగ వచ్చును.

కదా ఆగతోఽసి? (ఎప్పుడు వచ్చినావు?) అని ప్రశ్నింపగా అప్పుడే వచ్చి యుండుటచే "అయమాగచ్ఛామి" (ఇదిగో వచ్చుచున్నాను) అని వర్తమానార్థకలట్ ప్రయోగము చేసి ప్రత్యుత్తరము చెప్పబడినది. ఇది వర్తమాన సమీపభూతార్థమున కుదాహరణము. లట్ రాని పక్షమున సామాన్యభూతార్థకమగు లుఙ్ (ఆగమమ్) ప్రయోగింపబడినది. అట్లే "కదా గమిష్యసి" (ఎప్పుడు వెళ్ళెదవు?") అని ప్రశ్నింపగా "ఏష గచ్ఛామి" (ఇదిగో వెళ్ళుచున్నాను) అని సమీపభవిష్యదర్థమున- అనగా కొద్దిక్షణములలో వెళ్ళగలను అను నర్థమున లట్ ప్రయోగముతో ప్రత్యుత్తర మీయబడినది, లట్టు రాని పక్షమున భవిష్యత్సామాన్యార్థమున లృట్టు (గమిష్యామి) ప్రయోగింపబడును. ఇట్టి ప్రయోగములు సర్వభాషాసాధారణములు.

768. హేతుహేతుమతోర్లిఙ్ 3.3.156

వాస్యాత్. కృష్ణం నమేత్ చేత్ సుఖం యాయాత్. కృష్ణం నంస్యతి చేత్ సుఖం యాస్యతి. భవిష్యత్యేవేష్యతే. నేహ-హన్తీతి పలాయతే.

విధినిమన్త్రణేతి లిఙ్. విధిః ప్రేరణం-భృత్యాదేర్నికృష్టస్య ప్రవర్తనమ్-యజేత. నిమన్త్రణం నియోగకరణమావశ్యకే శ్రాద్ధభోజనాదౌ దౌహిత్రాదేః ప్రవర్తనమ్. ఇహ భుఞ్జీత. ఆమన్త్రణం కామచారానుజ్ఞా-ఇహాసీత. అధీష్టః సత్కారపూర్వకో వ్యాపారః. పుత్రమధ్యాపయేద్భవాన్. సంప్రశ్నః-సంప్రధారణమ్. కిం భో వేదమధీయీయ ఉత తర్కమ్. ప్రార్థనం యాచ్ఞా-భో భోజనం లభేయ. ఏవంలోట్.

ఇతి లకారార్థప్రక్రియా.

ఇతితిఙన్తప్రకరణం సమాప్తమ్.

హేతువు, హేతుమత్తును అగు క్రియలను బోధించెడు ధాతువులకంటె భవిష్యదర్థమున) వికల్పముగ లిఙ్ వచ్చును.

ఒక క్రియచే మరియొక క్రియ జరుగును, అని చెప్పునపుడు మొదటి క్రియ హేతువు: రెండవది హేతుమత్తు, 'కృష్ణుని నమస్కరించినచో సుఖమును పొందును' అనునపుడు నమస్కరించుట హేతువు, సుఖప్రాప్తిహేతుమత్తు.

కదా ఆగతోఽసి? (ఎప్పుడు వచ్చినావు?) అని ప్రశ్నింపగా అప్పుడే వచ్చి యుండుటచే "అయమాగచ్ఛామి" (ఇదిగో వచ్చుచున్నాను) అని వర్తమానార్థకలట్ ప్రయోగము చేసి ప్రత్యుత్తరము చెప్పబడినది. ఇది వర్తమాన సమీపభూతార్థమున కుదాహరణము. లట్ రాని పక్షమున సామాన్యభూతార్థక మగు లుఙ్ (అగమమ్) ప్రయోగింపబడినది. అట్లే "కదా గమిష్యసి" (ఎప్పుడు వెళ్ళెదవు?") అని ప్రశ్నింపగా "ఏష గచ్ఛామి" (ఇదిగో వెళ్ళుచున్నాను) అని సమీపభవిష్యదర్థమున- అనగా కొద్దిక్షణములలో వెళ్ళగలను అను నర్థమున లట్ ప్రయోగముతో ప్రత్యుత్తర మీయబడినది, లట్టు రాని పక్షమున భవిష్యత్సామాన్యార్థమున ఌట్టు (గమిష్యామి) ప్రయోగింపబడును. ఇట్టి ప్రయోగములు సర్వభాషాసాధారణములు.

768. హేతుహేతుమతోర్లిఙ్ 3.3.156

వాస్యాత్. కృష్ణం నమేత్ చేత్ సుఖం యాయాత్. కృష్ణం నంస్యతి చేత్ సుఖం యాస్యతి. భవిష్యత్యేవేష్యతే. నేహ-హన్తీతి పలాయతే.

విధినిమన్త్రణేతి లిఙ్.విధిః ప్రేరణం-భృత్యాదేర్నికృష్టస్యప్రవర్తనమ్-యజేత. నిమన్త్రణంనియోగకరణమావశ్యకేశ్రాద్ధభోజనాదౌ దౌహిత్రాదేః ప్రవర్తనమ్. ఇహ భుఞ్జీత. ఆమన్త్రణం కామచారానుజ్ఞా-ఇహాసీత. అధీష్టః సత్కారపూర్వకో వ్యాపారః. పుత్రమధ్యాపయేద్భవాన్.సంప్రశ్నః-సంప్రధారణమ్. కిం భో వేదమధీయీయ ఉత తర్కమ్. ప్రార్థనం యాచ్ఞా-భో భోజనం లభేయ. ఏవంలోట్.

ఇతి లకారార్థప్రక్రియా.

ఇతితిఙన్తప్రక్రరణం సమాప్తమ్.

హేతువు,హేతుమత్తును అగు క్రియలను బోధించెడు ధాతువులకంటె (భవిష్యదర్థమున) వికల్పముగలిఙ్ వచ్చును.

ఒక క్రియచే మరియొక క్రియ జరుగును. అని చెప్పునపుడు మొదటి క్రియ హేతువు: రెండవది హేతుమత్తు, 'కృష్ణుని నమస్కరించినచో సుఖమును పొందును' అనునపుడు నమస్కరించుట హేతువు, సుఖప్రాప్తిహేతుమత్తు.

అందుచే 'నమేత్' 'యాయాత్' అనునపుడు ఈ రెండు ధాతువులకును విధిలిఙ్ వచ్చినది. ఇది రాని పక్షమున భవిష్యత్సామాన్యార్థక మగు ఌృట్టు వచ్చును.

ఈ సూత్రము భవిష్యదర్థము గమ్యమగు నపుడు మాత్రమే ప్రవర్తించును. అందుచే "హన్తీతిపలాయతే" (చంపుచున్నాడనిపరువెత్తుచున్నాడు.) అనునపుడు భవిష్యదర్థము లేదు గాన లిఙ్ వైకల్పికముగ గూడ రాలేదు. లట్టు మాత్రమే వచ్చినది.

విధ్యాద్యర్థములందు లిఙ్ వచ్చును. ఈయర్థములందు లోట్టు కూడ (సూ.411) వచ్చును.

తనకంటె తక్కువవారగు భృత్యాదులను కార్యము చేయుటకు నియమించుట విధి. ఉదా:- యజేత. యజ్ఞముచేయవలెను. తప్పక చేయవగిన శ్రాద్ధభోజనాదులకై దౌహిత్రాదులను ప్రవర్తింపచేయుట నిమంత్రణము. ఉదా. 'ఇహ భుఞ్జీత'-ఇక్కడ భోజనము చేయవలెను. ఆమంత్రణరూప మగు ప్రేరణమునందు కర్తకు స్వేచ్ఛ యుండును. ఉదా:- 'ఇహాసీత'-ఇచట కూర్చుండుము, ఇష్టమైన కూర్చుండవచ్చును లేదిచో మానవచ్చును. సగౌరవముగ ప్రేరేపించుట అధీష్టము. ఉదా:- 'పుత్రమధ్యాపయేద్భవాన్'- మీరు నాకుమారునకు చదు చెప్పుడు. సందేహపూర్వక మగు ప్రశ్న సంప్రశ్న. ఉదా:- "కింభోః"మొ. వేదమును చదువుదునా లేక తర్కము చదువుదునా? ప్రార్థనమనగాయాచించుట. ఉదా:- భో భోజనం లభేయ-అయ్యాభోజనమునుపొందగలనా? (భోజనము లభించునా?)

లకారార్థప్రక్రియ సమాప్తము.

తిఙన్త ప్రకరణము సమాప్తము.

# అథ కృదన్తప్రకరణమ్

## అథ కృత్యప్రక్రియా.

### 769. ధాతోః. 3.1.91

ఆతృతీయాధ్యాయసమాప్త్యన్తం యే ప్రత్యయాః తే ధాతోః పరే స్యుః. 'కృదతిఙ్' ఇతి కృత్సంజ్ఞా.

ఇది అధికారసూత్రము. అందుచే, తృతీయాధ్యాయపరిసమాప్తివరకును విధింపబడిన ప్రత్యయములు ధాతువుకంటె పరముగ వచ్చును, అను అర్థము సిద్ధించును.

'కృదతిజ్' అను సూత్రముచే (303) తిజ్భిన్నము లగు ప్రత్యయము లన్నిటికిని కృత్సంజ్ఞ యుండును.

770. వాఽసరూపోఽస్త్రియామ్. 3.1.94

అస్మిన్ ధాత్వధికారే అసరూపోఽపవాదప్రత్యయః ఉత్సర్గస్య బాధకో వా స్యాత్ స్త్ర్యధికారోక్తం వినా.

ఇది పరిభాషాసూత్రము. ఈ ధాత్వధికారమునందు సరూపము కాని అపవాదప్రత్యయము సామాన్యశాస్త్రవిహిత మగు ప్రత్యయమునకు వికల్పముగ బాధక మగును. 'స్త్రియామ్' అనుఅధికారము క్రింద చెప్పబడిన ప్రత్యయముల విషయమున ఈ నియమము వర్తించదు.

సామాన్యశాస్త్రము నొకదానిని చెప్పి పిదప విశేషశాస్త్ర మును చెప్పినపుడు ఆ విశేషశాస్త్రము ప్రవర్తించు స్థలములందు ఇంక సామాన్యశాస్త్రమునకు ఏ మాత్రము అవకాశముండదు. ఇది ఈ శాస్త్రములో సాధారణముగ అవలంబించిన పద్ధతి. కాని ధాత్వధికారమున విహితము లగుకొన్ని కృత్ప్రత్యయముల విషయమునందు మాత్రము ఈ పద్ధతిలో కొంత మార్పు ఈ సూత్రముచే చెప్పబడుచున్నది.

'ణ్వుల్తృచౌ' అనునది (787) అన్ని ధాతువులకంటెను 'ణ్వుల్ తృచ్' ప్రత్యయములను విధించుచున్నది గాన ఇది సామాన్యశాస్త్రము. "ఇగుపధజ్ఞాప్రీకిరః కః" అనునది (790) కొన్ని ధాతువులకంటె మాత్రమే 'క' ప్రత్యయమును విధించుచున్నది గాన ఇది విశేషశాస్త్రము. సామాన్యపద్ధతి ననుసరించి ఇగుపధజ్ఞాదిధాతువుల విషయమున ఈ విశేషశాస్త్రవిహిత మగు 'క' ప్రత్యయమే కాని సామాన్యశాస్త్రవిహితము లగు ణ్వులాదులు వచ్చుటకు వీలు లేదు. ఈ సూత్రముచే విశేషశాస్త్రవిహితప్రత్యయములే కాక సామాన్యశాస్త్రవిహితప్రత్యయములు కూడ వచ్చుటకు వీలు కల్పింపబడుచున్నది. ఈ సూత్రము ననుసరించి 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' అను విశేషశాస్త్రము "ణ్వుల్తృచౌ" అను సామాన్యశాస్త్రమును వికల్పముగ మాత్రమే బాధింప గలుగును. అందుచే 'క్షిప్' అను ఇగుపధధాతువుకంటె అపవాదప్రత్యయ మగు 'క' ప్రత్యయము, ఉత్సర్గప్రత్య

యము లగు 'ణ్వుల్' 'తృచ్'లును గూడ వచ్చి 'విక్షిపః' 'విక్షేపకః' 'విక్షేప్తా' అను రూపములు సిద్ధించుటకు అవకాశము లభించినది.

ఈ పరిభాష సరూపప్రత్యయముల విషయమున ప్రవర్తించదు. 'అణ్' ప్రత్యయమునందును 'క' ప్రత్యయమునందును ఇత్వర్ణములు లోపింపగా మిగులునది 'అ'కారమేగాన ఈరెండును సరూపప్రత్యయములు. 'కర్మణ్యణ్' (793) అనునది సామాన్యశాస్త్రము. "ఆతోఽనుపసర్గేకః" అనునది (794) విశేషశాస్త్రము. ఈ ఉత్సర్గాపవాదప్రత్యయములు రెండును సరూపప్రత్యయములు గాన ఈ పరిభాష వీటి విషయమున ప్రవర్తించదు. అనగా విశేషప్రత్యయ మగు 'క' ప్రత్యయము రావలసిన 'గోదః' ఇత్యాదిస్థలములందు సామాన్యశాస్త్రవిహిత మగు అణ్ ప్రత్యయమునకు ఎప్పుడును అవకాశము లేదు.

ఇట్లే స్త్ర్యధికారవిహితము లగు ప్రత్యయముల విషయమున గూడ ఈ పరిభాష ప్రవర్తించదు. 'క్తిన్' ప్రత్యయము 'స్త్రియాం క్తిన్' అను సూత్రముచే (866) 'స్త్రియామ్' అను అధికారమున విధింపబడినది. ఇది ఉత్సర్గప్రత్యయము. 'అప్రత్యయాత్' అను సూత్రముచే (870) సన్ప్రత్యయాద్యంతముల కంటె విహిత మగు 'అ' ప్రత్యయము అపవాదప్రత్యయము. ఇది సామాన్యప్రత్యయ మగు 'క్తిన్'ను నిత్యముగన్ బాధించును. అందుచే 'చికీర్షా' ఇత్యాదులందు 'క్తిన్' ప్రత్యయమునకు అవకాశము లేదు.

### 771. కృత్యాః 7.1 95

'ణ్వుల్తృచౌ' ఇత్యతః ప్రాక్ కృత్యసంజ్ఞాః స్యుః.

'ణ్వుల్తృచౌ' అను సూత్రమునకు పూర్వము విహితము లగు ప్రత్యయములకు కృత్యప్రత్యయము లని కూడ పేరు. ఇది అధికారసూత్రము. 'కృత్' అనునది సామాన్యసంజ్ఞ: 'కృత్య' అనునది విశేషసంజ్ఞ.

### 772. కర్తరి కృత్ 3.4.67

కృత్ ప్రత్యయః కర్తరి స్యాత్. ఇతి ప్రాప్తే.

కృత్ప్రత్యయము కర్త్రర్థమున వచ్చును.

ఈ సూత్రము ననుసరించి 'తవ్యత్' మొదలగు ప్రత్యయములకు కృత్సంజ్ఞ కూడ ఉండుటచే అవి కర్త్రర్థమున రావలసి యుండగా దీనికి అపవాదము చెప్పబడుచున్నది.

773. తయోరేవ కృత్యక్తఖలర్థాః 3.4.70

ఏతే భావకర్మణోరేవ స్యుః.

"లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః" అను వెనుకటి సూత్రమునందు చెప్పబడిన భావకర్మార్థములు "తయోః" అను తచ్ఛబ్దముచే గ్రహింపబడును.

కృత్యప్రత్యయములును, క్తప్రత్యయమును, ఖలర్థకప్రత్యయములును భావకర్మార్థమునందు మాత్రమే వచ్చును.

పై ప్రత్యయములు, ధాతువు సకర్మక మగుచో కర్మార్థమునందును, అకర్మక మగుచో భావార్థమునందును వచ్చును. అందుచే ఈ ప్రత్యయములను చేర్చినపుడు కర్మభావవాచ్యములందు వలె కర్త తృతీయవిభక్త్యంతపదమునం దుండును. ఉదా:- కృత్యప్ర.- మయా పుస్తకం పఠితవ్యమ్. నాచే పుస్తకము చదువబడవలెను. క్త:- మయా పుస్తకం పఠితమ్- నాచే పుస్తకము చదువ బడినది. ఖలర్థము:- త్వయా సుకర మిదమ్- ఇది నీచే సులభముగ చేయ బడదగినది.

774 తవ్యత్తవ్యానీయరః 3.1.96.

ధాతోరేతే ప్రత్యయాః స్యుః. ఏధితవ్యం, ఏధనీయంత్వయా. భావే ఔత్సర్గికం ఏకవచనంక్లీబత్వం. చేతవ్యః, చయనీయో వా ధర్మస్త్వయా.

ధాతువుకంటె (భావకర్మార్థములందు) తవ్యత్, తవ్య, అనీయర్ అను ప్రత్యయములు వచ్చును.

'తవ్యత్'లోని తకారము ఇత్సంజ్ఞక మగుటచే "తిత్స్వరితమ్" అను సూత్రముచే స్వరితము వచ్చును. 'తవ్యత్' చేర్చినను 'తవ్య' చేర్చినను రూపములలో భేదము లేదు. 'అనీయర్'లోని రేఫ ఇత్సంజ్ఞకము.

ఏధితవ్యమ్-ఏధనీయమ్:- ఏధధాతువు అకర్మకము గాన భావార్థమున 'తవ్య' 'అనీయర్' ప్రత్యయమును చేర్చబడినవి. ధాతువుకంటె పర మగుటచే వీటికి ఆర్ధధాతుకసంజ్ఞ (సూ-406). 'తవ్య' వలాద్యార్ధధాతుక మగుటచే ఇడాగ మము (సూ-403) వచ్చి 'ఏధితవ్యమ్' అను రూపము, 'ఏధనీయమ్' అను రూపమును సిద్ధించినవి. కర్తకు, అనభిహితము గాన "కర్తృకరణయోస్తృ తీయా" అను సూత్రముచే (898) తృతీయ వచ్చినది అని సూచించుటకై 'త్వయా' అనునది కూడ చేర్చబడినది. నీవు వృద్ధి పొందవలెను' అని యర్థము.

ఈ విధముగ తవ్యదాదులను భావార్థములందు చేర్చినపుడు క్రియకే ప్రాధాన్యము గాన, భావవాచ్యక్రియకు ఔత్సర్గిక మగు. (సామాన్యసిద్ధమగు) ప్రథమ పురుషైకవచనములు వచ్చినట్లు, వీటికి నపుంసకైకవచనములు వచ్చును.

ధాతువు సకర్మక మైనపుడు ఈ ధాతువులు కర్మార్థమునందు వచ్చును. అందుచే వీటి లింగవచనాదులు కర్మలింగవచనాదుల ననుసరించి యుండును. "చేతవ్యశ్చయనీయో వా ధర్మ స్త్వయా" అను ఉదాహరణమునందు సకర్మక మగు చిఞ్ధాతువుకంటె 'తవ్య' 'అనీయ' ప్రత్యయములు కర్మార్థమున వచ్చినవి. కావున 'చేతవ్యః' ఇత్యాదుల లింగవచనాదులు కర్మ యగు 'ధర్మః' అనుదాని లింగవచనాదుల ననుసరించి వచ్చినవని. 'నీచేత ధర్మము సంపాదింపబడతగినది' అని యర్థము.

(వా) కేలిమర ఉపసంఖ్యానమ్.

పచేలిమా మాషాః- పక్తవ్యా ఇత్యర్థః. భిదేలిమాః సరలాః- భేత్తవ్యా ఇత్యర్థః. కర్మణి ప్రత్యయః.

కేలిమరప్రత్యయమును కూడ చెప్పవలెను. తవ్యదాదిప్రత్యయముల వలె 'కేలిమర్' ప్రత్యయము గూడ భావకర్మార్థమున ధాతువుకంటె పరముగ వచ్చునని అర్థము. 'కేలిమర్'లోని కకారమునకు "లశక్వతద్ధితే" అను సూత్రముచేతను (136), రేఫకు 'హలన్త్యమ్' అను సూత్రముచేతను (1) ఇత్సంజ్ఞ.

'పచేలిమా మాషాః':- పచ్ధాతువునకు కర్మార్థమున కేలిమర్ ప్రత్యయము చేర్చుటచే 'పచేలిమాః'అను రూపము సిద్ధించినది. వండబడుటకు తగిన మినుములు అని అర్థము. అట్లే భిద్ధాతువునకు 'కేలిమర్'ప్రత్యయము చేర్చగా 'భిదేలిమాః' అను రూపము సిద్ధించినది. భేదింపబడుటకు తగిన సరలవృక్షములు అని అర్థము. వృత్తికారాదులు 'కేలిమర్' ప్రత్యయము కర్మకర్త్రర్థమునందు గూడ వచ్చు నని చెప్పిరి. అపుడు 'భిదేలిమాః' అనుదానికి (అనాయాసముగ) బద్దలగునవి అను అర్థము కూడ చెప్పవచ్చును.

775. కృత్యల్యుటో బహులమ్ 3.3.113

'క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ.
విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహులకం వదన్తి'.
'స్నాన్తిఅనేన'ఇతిస్నానీయం చూర్ణమ్. 'దీయతేఽస్మై'దానీయో విప్రః.

కృత్యప్రత్యయములును ల్యుట్ ప్రత్యయమును బహులముగ వచ్చు చుండును. కొన్ని ప్రయోగ విశేషములందు ప్రవర్తించుట, కొన్నిటియందు ప్రవర్తింపకుండుట, కొన్నిటియందు వికల్పముగా ప్రవర్తించుట, కొన్నిటి యందు మరియొకకార్య మేదియో వచ్చుచుండుట, ఈ విధముగ శాస్త్రప్రవృత్తి వివిధరూపముల నుండుట చూచి బాహులకము (బహులం అని చెప్పిన శాస్త్ర ప్రవృత్తి) నాల్గువిధము లని చెప్పుదురు. అందుచే కృత్యల్యుట్ ప్రత్యయములు బహులముగ వచ్చు నని చెప్పుటచే అవి భావకర్మార్థములందే కాక ఇతరార్థము లందు కూడ వచ్చును.

స్నానీయం చూర్ణమ్:- ఈ సూత్రముచే 'స్నా'ధాతువుకంటె కరణార్థ మున అనగా 'స్నాన్తి అనేన'—దేనితో స్నానము చేయుదురో అది- అను అర్థ మున అనీయ ప్రత్యయము వచ్చి 'స్నానీయమ్'అను పదము సిద్ధించినది, అట్లే దాధాతువు కంటెసంప్రదానార్థమున అనగా 'దీయతే అస్మై'-ఎవ్వనికి దానము చేయబడునో ఆతడు-అను నర్థమున అనీయర్ప్రత్యయము వచ్చి 'దానీయః' అను రూపము సిద్ధించినది. ఈ విధముగ భావకర్మార్థములందు మాత్రమే రావల సిన అనీయర్ ప్రత్యయము 'బహుల'గ్రహణముచే పై ఉదాహరణములందు కరణసంప్రదానార్థములందు వచ్చినది.

776. అచో యత్. 3.1.97

అజన్తాద్ధాతోర్యత్ స్యాత్. చేయమ్.

అజంతమగుధాతువుకంటె (భావకర్మార్థములందు) 'యత్' ప్రత్యయము వచ్చును.

చేయమ్:- 'చి'ధాతువు అజంతము గాన ఈ సూత్రముచే 'చేతుం యోగ్యం'అను అర్థమున 'యత్' ప్రత్యయము వచ్చినది.'చియ' అని యుండగా 'సార్వధాతుకార్ధధాతుకయోః'అనుసూత్రముచే (390) గుణము- 'చేయ' అను రూపము సిద్ధించినది. 'చేయమ్' అనునది ఔత్సర్గిక మగు నపుంసకప్రథమైక వచనరూపము. కృత్తద్ధితసమాసాది ప్రకరణములందు ఈవిధముగ ప్రత్యయాం తములగు ప్రాతిపదికములను ప్రయోగింప రాదు గాన ఏదియోయొక సుప్ ప్రత్య యమును చేర్చి (సాధారణముగ ప్రథమైకవచనమున) ఉదాహరణములు చూప బడుచుండును.

777. ఈద్యతి. 6.4.65

యతి పరే ఆత ఈత్స్యాత్. దేయమ్. గ్లేయమ్.

'ఆతో లోప ఇటి చ' నుండి 'అతః' అనువర్తించును. 'యత్' పర మగు నపుడు ఆకారమునకు ఈకారము వచ్చును. దేయమ్:- 'దాతుం యోగ్యమ్' అను అర్థమున-అనగా దానము చేయబడుటకు తగినది అను కర్మార్థమునందు గాని, దానము చేయవలెను అను భావార్థమునందు గాని-ఆకారాంత మగు దాధాతువు కంటె 'యత్' ప్రత్యయము (సూ.776)-'దా య' అని యుండగా ఈ సూత్రముచే ఆకారమునకు ఈకారము పిమ్మట ఈకారమునకు "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే (390) గుణము. 'దేయమ్' అను రూపము సిద్ధించినది.

గ్లేయమ్:- 'గ్లాతుం యోగ్యమ్' అను నర్థమున గ్లై ధాతువుకంటె యత్ ప్రత్యయము, ఐకారమునకు 'ఆదేచ ఉపదేశేఽశితి' అను సూత్రముచే (496) ఆకారము. దానికి ప్రకృతసూత్రముచే ఈకారము; గుణము 'గ్లేయమ్'.

778. పోరదుపధాత్. 3.1.98

పవర్గాన్తాత్ అదుపధాత్ యత్స్యాత్. ణ్యతోఽపవాదః. శప్యమ్. లభ్యమ్.

పోః, అదుపధాత్. హ్రస్వ అకారము ఉపధగా గల పవర్గాంతధాతువు కంటె యత్ ప్రత్యయము వచ్చును.

'ఋహలోర్ణ్యత్' అను సూత్రముచే (783) హలంతధాతువులకు విధింపబడ నున్న 'ణ్యత్' ప్రత్యయమునకు ఇది అపవాదము. 'ణ్యత్' ప్రత్యయములో శేషించునది గూడ 'య' అనునదియే యైనను 'అచో ఞ్ణితి' అనుసూత్రముచే (182) వృద్ధి రాకుండుటకై పవర్గాంతధాతువులకు యత్ ప్రత్యయము విధింపబడినది. 'శప్' 'లభ్' అను ధాతువులకు ఈ సూత్రముచే 'యత్' ప్రత్యయము చేయగా 'శప్యమ్' 'లభ్యమ్' అను రూపములు సిద్ధించినవి. 'శప్తుంయోగ్యమ్' శపించుటకు తగినది (కర్మార్థము) లేక శపింపవలెను (భావార్థము); 'లబ్ధుం యోగ్యమ్-పొందుటకుతగినది (కర్మ) పొందవలెను (భావ) అని అర్థములు.

779. ఏతిస్తుశాస్వృదృజుషః క్యప్. 3 1.109

ఏభ్యః క్యప్ స్యాత్.

ఇ(ణ్), స్తు, శాస్, వృ, దృ, జుష్‌ధాతువులకంటె 'క్యప్' ప్రత్యయము వచ్చును.

'క్యప్'లోని కకారపకారములు ఇత్సంజ్ఞకములు. 'ఇ' 'స్తు'ధాతువులకు 'ఏతుం యోగ్యః' 'స్తోతుం యోగ్యః'అను అర్థములందు ఈ సూత్రముచే 'క్యప్' ప్రత్యయము చేసినపిదప 'ఇ య' 'స్తు య' అని యుండగా:-

780. హ్రస్వస్య పితి కృతి తుక్. 6.1.71

ఇత్యః. స్తుత్యః. శాసు అనుశిష్టౌ.

హ్రస్వమునకు పిత్ అగు కృత్ప్రత్యయము పర మగునపుడు 'తుక్'ఆగమము వచ్చును.

ఇచట 'క్యప్'ప్రత్యయము పిత్ అగు కృత్తు గాన అది పర మగునపుడు వెనుక నున్న ఇకారఉకారములకు 'తుక్'ఆగమము వచ్చును. 'తుక్'లోని ఉకార కకారములు ఇత్సంజ్ఞకములు. కిత్తు గాన 'ఆద్యన్తౌటకితౌ' అను పరిభాషచే (84) అంతావయవముగ వచ్చును-'ఇత్యః' 'స్తుత్యః'.

శాస్ ధాతువునకు శిక్షించుట అని యర్థము. అదాదిధాతువు. సేట్. దీనికి పై సూత్రముచే 'శాసితుం యోగ్యః' అను నర్థమున 'క్యప్'ప్రత్యయము చేసిన పిమ్మట 'శాస్ య'అని యుండగా:-

781. శాస ఇదఙ్ హలోః. 6 4.34

శాస ఉపధాయా ఇత్ స్యాదఙి హలాదౌ క్ఙితి. శిష్యః. వృత్యః. ఆదృత్యః. జుష్యః.

శాసః, ఇత్, అఙ్‌హలోః. "అనిదితాం హల ఉపధాయాః క్ఙితి"నుండి 'ఉపధాయాః' 'క్ఙితి' అనువర్తించును. 'అఙ్' కాని, కిత్తు లేక ఙిత్తు ఐన హలాదిప్రత్యయము గాని పర మైనపుడు 'శాస్'ధాతువు ఉపధకు ఇకారము వచ్చును.

ఇచట 'క్యప్' కిత్తు గాన ఇది పర మైనపుడు 'శాస్'లోని ఉపధ యగు ఆకారమునకు ఇకారము వచ్చి 'శిస్ య' అని యుండగా 'శాసివసిఘసీనాఞ్చ' అను సూత్రముచే (557) సకారమునకు మూర్ధన్యాదేశము-షకారము- 'శిష్యః'

వృత్యః:- వృధాతువునకు 'ఏతిస్తు-' ఇత్యాది సూత్రముచే (779)'క్యప్' ప్రత్యయము. 'హ్రస్వస్యపితికృతితుక్'అనుసూత్రముచే (780) తుగాగమము. ఆదృత్యః- ఆఙ్‌పూర్వకదృధాతువునకు పై సూత్రములచేక్యప్ తుగాగమములు. జుష్యః- జుష్‌ధాతువునకు 'క్యప్'ప్రత్యయము. 'క్యప్' కిత్తు గాన గుణనిషేధము (సూ.435)- 'జుష్యః'

782. మృజేర్విభాషా. 3.1.113.

మృజేః క్యబ్వా. మృజ్యః.

మృజ్ ధాతువుకంటె వికల్పముగ క్యప్ ప్రత్యయము వచ్చును.

మృజ్ (శుభ్రముచేయుట) ధాతువునకు 'ఋహలోర్ణ్యత్' అను సూత్రముచే (783) రావలసి యున్న ణ్యత్ ప్రత్యయమును బాధించి వికల్పముగ ఈ సూత్రముచే క్యప్ ప్రత్యయము. 'క్యప్' కిత్తు గాన గుణము రాదు 'మృజ్యః'. క్యప్ రాని పక్షమున ణ్యత్ ప్రత్యయము విధింపబడుచున్నది.—

783. ఋహలోర్ణ్యత్. 3.1.124

ఋవర్ణాన్తాద్ హలన్తాచ్చ ధాతోర్ణ్యత్. కార్యమ్. హార్యమ్. ధార్యమ్.

ఋవర్ణాంతధాతువుకంటెను హలంతధాతువుకంటెను 'ణ్యత్' ప్రత్యయము వచ్చును.

'ణ్యత్'లోని ణకారతకారములు ఇత్సంజ్ఞకములు. కృ, హృ, ధృధాతువులు ఋకారాంతములు. వాటికి ఈ సూత్రముచే 'ణ్యత్' ప్రత్యయము చేసిన పిమ్మట "అచో ఞ్ణితి" అను సూత్రముచే (182) వృద్ధి (ఆర్) వచ్చి 'కార్యమ్' 'హార్యమ్' 'ధార్యమ్' అను పదములు సిద్ధించినవి.

మృజ్ ధాతువునకు 'మృజేర్విభాషా' అను సూత్రముచే (782) 'క్యప్' ప్రత్యయము రాని పక్షమున ఈ సూత్రముచే 'ణ్యత్' ప్రత్యయము, 'మృజ్ య' అని యుండగా:—

784. చజోః కు ఘిణ్ణ్యతోః 7.3.52

చజోః కుత్వం స్యాత్ ఘితి, ణ్యతి చ పరే.

చజోః, కు, ఘిణ్ణ్యతోః. ('ఘిత్ణ్యతోః' అని యుండగా "యరోఽనునాసికేఽనునాసికోవా" అను సూత్రముచే (68) 'ఘిణ్ణ్యతోః' అని యైనది). ఘిత్ గాని 'ణ్యత్' గాని పర మగునపుడు చకారజకారములకు కుత్వము (కకార గకారములు) వచ్చును.

ఈ సూత్రముచే జకారమునకు గకారము వచ్చి 'మృగ్ య' అని యుండగా:—

785. మృజేర్వృద్ధిః 7.2.114

మృజేరికో వృద్ధిః సార్వధాతుకార్ధధాతుకయోః. మార్గ్యః.

'ఇకో గుణవృద్ధీ' అను పరిభాషచే 'ఇకః' అను పదము ఉపస్థితమగును. "ధాతోః స్వరూపగ్రహణే తత్ప్రత్యయే కార్యవిజ్ఞానమ్"- అనగా ఏదైన ఒక ధాతువును నిర్దేశించి కార్యమును విధించినపుడు ఆ కార్యము ఆ ధాతువుకంటె విహిత మగు ప్రత్యయము పర మగునపుడు వచ్చు నని గ్రహింపవలెను- అను పరిభాషచే "ధాతువుకంటె విహిత మగు ప్రత్యయము పర మగునపుడు" అను అర్థము సిద్ధించును. ధాతువుకంటె విహిత మగు ప్రత్యయము సార్వధాతుకార్ధ ధాతుకములలో ఏదైన ఒకటి కావలెను అందుచే 'సార్వధాతుకార్ధధాతుకయోః' అని వ్యాఖ్యానింపబడినది.

సార్వధాతుకార్ధధాతుకములు పర మగునపుడు మృజ్ధాతువు 'ఇక్'కు వృద్ధి వచ్చును. ఈ సూత్రముచే ఋకారమునకు వృద్ధి (ఆర్) రాగా 'మార్గ్యః' అను రూపము సిద్ధించినది.

786. భోజ్యం భక్ష్యే 7.3.69

భోగ్యమన్యత్.

ఇతి కృత్యప్రక్రియా.

భుజ్ధాతువునకు 'తినుట' 'అనుభవించుట'అను రెండు అర్థములు కలవు. "భోక్తుం యోగ్యమ్" అనునపుడు తినుటకు తగినది, లేక అనుభవించుటకు తగినది అను ఏ అర్థమందైనను ణ్యత్ ప్రత్యయము చేసిన పిమ్మట (సూ-783) కుత్వము రావలసి యుండగా (సూ-784) 'తినుటకు తగినది' అను నర్థమున కుత్వము రాదని ఈ సూత్రము చెప్పుచున్నది.

భక్ష్యము అను అర్థమున 'భోజ్యమ్' అనియే యగును. కుత్వమురాదు అని దీని భావము.

"అనుభవించుటకు తగినది" ఇత్యాద్యర్థములందుకుత్వము వచ్చి 'భోగ్యమ్' అను రూపము అగును.

కృత్యప్రక్రియ సమాప్తము.

# అథ పూర్వకృదన్తమ్

787. ణ్వుల్ తృచౌ 3.1.133

ధాతోరేతౌ స్తః. 'కర్తరి కృత్' ఇతి కర్త్రర్థే.

ధాతువుకంటె 'ణ్వుల్' 'తృచ్' అను ప్రత్యయములు వచ్చును. 'కర్తరి కృత్' అను సూత్రము ననుసరించి ఇవి కర్త్రర్థమున వచ్చును. 'ణ్వుల్'లోని ణకారలకారములు ఇత్సంజ్ఞకములు. ణకారమునకు 'చుటూ' అను సూత్రముచే (129) ఇత్సంజ్ఞ. 'తృచ్'లోని చకారము ఇత్సంజ్ఞకము.

కృఞ్ ధాతువునకు కర్త్రర్థమున (చేయువాడు అను నర్థమున) 'ణ్వుల్' చేర్చిన పిమ్మట 'కృ వు' అని యుండగా:-

788. యువోరనాకౌ 7.1.1

'యు' 'వు' ఏతయోః అనాకౌ స్తః. కారకః. కర్తా.

'యు' 'వు' అను వాటికి క్రమముగ 'అన' 'అక' అను ఆదేశములు వచ్చును,

ఈ సూత్రముచే అకాదేశము చేసిన పిమ్మట 'కృ అక' అని యుండగా 'అచో ఞ్ణితి'అను సూత్రముచే (182) ఋకారమునకు వృద్ధి (ఆర్)- 'కారకః' అను రూపము సిద్ధించినది.

కర్తా:- కృఞ్ధాతువునకు 'తృచ్' చేర్చిన పిదప 'కృతృ' అని యుండగా ఆర్ధధాతుకగుణము (అర్)- 'కర్తృ' అను రూపము సిద్ధించినది. ప్రథమైకవచనమున 'కర్తా' అను రూపము.

789. నన్దిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః 3.1.134

నన్ద్యాదేర్ల్యుః, గ్రహ్యాదేర్ణినిః, పచాదేరచ్ స్యాత్. నన్దయతీతి నన్దనః. జనమర్దయతీతి జనార్దనః. లవణః. గ్రాహీ. స్థాయీ. మన్త్రీ. పచాదిరాకృతిగణః.

నంద్యాదులకంటె 'ల్యు'ప్రత్యయము, గ్రహ్యాదులకంటె 'ణిని' ప్రత్యయము, పచాదులకంటె "అచ్"ప్రత్యయము వచ్చును.

'ల్యు'లో 'యు' అనునదియు, 'ణిని'లో 'ఇన్' అనునదియు 'అచ్'లోని 'అ' అనునదియు శేషించును. మిగిలిన వర్ణము లన్నియు ఇత్సంజ్ఞకములు. ఈ ప్రత్యయములు గూడ కర్త్రర్థమునందే వచ్చును.

'టునది సమృద్ధౌ' అను ధాతువుయొక్క ణ్యంతరూప మగు 'నన్ది' అను దానికంటె 'నన్దయతి-' సంతోషపెట్టువాడు- అను అర్థమున ఈ సూత్రముచే ల్యు ప్రత్యయము. 'నన్ది యు' అని యుండగా 'యువోరనాకౌ' అను సూత్ర ముచే (788) 'యు'కు అనాదేశము. 'ణేరనిటి' అను సూత్రముచే (532) ణికి లోపము-'నన్దనః'. జనార్దనః:- జనమర్దయతి అను నర్థమున చౌరాదిక మగు అర్ద్ధాతువుకంటె ల్యుప్రత్యయము. ప్రక్రియ పైవలెనే యుండును.

లవణః:- లూధాతువుకంటె ల్యుట్ ప్రత్యయము. 'యు'కు అనాదే శము. ఊకారమునకు గుణావాదేశములు- 'లవణః'. నంద్యాదిగణమున నిపతింప బడుటచే నకారమునకు ణకారము వచ్చినది. ఛేదించువాడు లేక ఛేదించునది (ఉప్పు) అని అర్థము. నంద్యాదిగణమున కొన్ని ధాతువులు ణ్యంతములును కొన్ని సహజరూపముతో నున్నవియు పఠింపబడినవి. కావుననే 'నన్ది' అనునది ణ్యంతము గ్రహింపబడినది.

గ్రాహీ:- గ్రహధాతువునకు ఈ సూత్రముచే ణిని ప్రత్యయము 'గ్రహ్ ఇన్' అని యుండగా 'అత ఉపధాయాః' అను సూత్రముచే (457) ఉపధావృద్ధి వచ్చి 'గ్రాహిన్' శబ్దము (గ్రాహీ. ప్ర. వి. ఏ. వ.) సిద్ధించినది.

స్థాయీ:- గ్రహ్యాదిగణమునకు చెందిన స్థాధాతువునకు ఈ సూత్రముచే ణిని ప్రత్యయము. ఇది ణిత్తు గాన "ఆతో యుక్చిణ్కృతోః" అను సూత్ర ముచే (760) అకారమునకు యుగాగమము వచ్చి 'స్థాయిన్'శబ్దము సిద్ధించినది. మన్త్రీ:- చౌరాదిక మగు మన్త్రిధాతువునకు ణిని ప్రత్యయము- 'మన్త్రి ఇన్'అని యుండగా 'ణేరనిటి'అను సూత్రముచే (532) ణికి లోపము-'మన్త్రిన్'.

పచాదిగణము ఆకృతిగణము. అనగా ఈ పోలికలుగల పదము లన్నిటిని ఈ గణమునందు చేర్చవలె నని యర్థము. ఈ గణమునందలి ధాతువులకు అచ్ ప్రత్యయము చేర్చగా పచతీతి 'పచః' నదతీతి 'నదః' చోరయతీతి 'చోరః' ఇత్యాదిరూపము లగును. ణిజంతధాతువుల ణిచ్చుకు 'ణేరనిటి' అను సూత్ర (532) లోపము వచ్చును.

790. ఇగుపధజ్ఞాప్రీకిరః కః 1.1.135

ఏభ్యః కః స్యాత్. బుధః. కృశః. జ్ఞః. ప్రియః. కిరః.

ఇక్ ఉపధగా గల ధాతువులకంటెను, జ్ఞా, ప్రీ, కౄధాతువుల కంటెను కర్త్రర్థమున కప్రత్యయము వచ్చును. కప్రత్యయములోని కకారము ఇత్సంజ్ఞకము. కిత్తుగాన ఇది పరముగ నున్నపుడు గుణవృద్ధులు రావు.

బుధః:- బుధ్ ధాతువునందు ఉకారరూప మగు ఇక్ ఉపధగా ఉన్నది గాన ఈ సూత్రముచే కప్రత్యయము- 'బుధ్ అ' బుధః. ఇట్లే కృశ్ ధాతువుకు కప్రత్యయము చేర్చగా 'కృశః' అను రూపము. జ్ఞః:- జ్ఞాధాతువునకు ఈ సూత్రముచే కప్రత్యయము చేయగా 'జ్ఞా అ' అని యుండగా 'ఆతో లోప ఇటి చ' అను సూత్రముచే (492) ఆకారలోపము- 'జ్ఞః'. ప్రియః:- కప్రత్యయము చేర్చిన పిదప 'ప్రీ అ' అని యుండగా ఈకారమునకు 'అచిశ్నుధాతుభ్రువాంయ్వోరియఙువఙౌ" అను సూత్రముచే (199) ఇయఙాదేశము. కిరః:- కౄధాతువుకు కప్రత్యయము చేర్చిన పిదప 'కౄ అ' అని యుండగా 'ఋత ఇద్ధాతోః' అను సూత్రముచే (663) ౠకారమునకు 'ఇర్' ఆదేశము.

791. ఆతశ్చోపసర్గే 3.1.136

ప్రజ్ఞః, సుగ్లః.

ఉపసర్గసహిత మగు ఆకారాంతధాతువునకు కర్త్రర్థమున కప్రత్యయము వచ్చును.

ప్రజ్ఞః:- (బాగుగాతెలిసికొనువాడు) ప్రపూర్వకజ్ఞాధాతువునకు ఈ సూత్రముచే కప్రత్యయము. 'ఆతోలోపఇటిచ' అను సూత్రముచే (492) ఆకారలోపము. సుగ్లః:- (బాగుగాశ్రమపడువాడు) సుపూర్వకగ్లైధాతువు ఐకారమునకు 'ఆదేచః' ఇత్యాది సూత్రముచే (496) ఆకారము వచ్చిన పిమ్మట ఈ సూత్రముచే కప్రత్యయము. ఆకారలోపము (సూ-492).

792. గేహే కః. 3.1.144

గేహే కర్తరి గ్రహేః కః స్యాత్. గృహమ్.

'విభాషా గ్రహః' నుండి 'గ్రహః' అనువర్తించును. గేహము కర్త యైనపుడు గ్రహ్ ధాతువుకంటె కప్రత్యయము వచ్చును.

గృహమ్:- గ్రహధాతువునకు 'గృహ్ణాతి ధాన్యాదికమ్-'ధాన్యాదికమును

గ్రహించునది అను నర్థమున క ప్రత్యయము-'గ్రహ్-అ'అని యుండగా 'గ్రహిజ్యా'ఇత్యాదిసూత్రముచే (586) రేఫకు సంప్రసారణముచే ఋకారము. 'గృహమ్'. ధాన్యాదికమును గ్రహించుటలో ఇల్లు కర్తగ వివక్షితమైనది.

793. కర్మణ్యణ్. 3.2.1

కర్మణ్యుపపదే ధాతోః 'అణ్' ప్రత్యయః స్యాత్. కుమ్భం కరోతీతి కుమ్భకారః,

కర్మవాచకము ఉపపదముగ నున్నపుడు ధాతువుకంటె అణ్ ప్రత్యయము వచ్చును.

ఉపపద మనగా దగ్గర నున్న పదము. 'అణ్'లోని ణకారము ఇత్సంజ్ఞకము. ఇది ణిత్తు గాన ఇది పర మగునపుడు 'అచో ఞ్ణితి'అను సూత్రముచే (182) వృద్ధి వచ్చుచుండును. కుమ్భకారః:- 'కుమ్భం కరోతి'-'కుంభమును చేయుచున్నవాడు'-అను నర్థమున 'కుమ్భ అమ్ కృ' అని యుండగా ఇచట 'కృ' ధాతువునకు 'కుమ్భ అమ్'అను కర్మవాచకము ఉపపదముగా నున్నది గాన ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము-'కుమ్భఅమ్కృ అ'వృద్ధి-'కుమ్భఅమ్కార'.ఇపుడు ఉపపద మగు 'కుమ్భ అమ్'అనుదానికి'ఉపపదమతిఙ్' అను సూత్రముచే (957) 'కార'అనుదానితో సమాసము, "కుమ్భఅమ్కార"అనునది సమాసము. దీనికి 'కృత్తద్ధితసమాసాశ్చ'అనుసూత్రముచే (117) ప్రాతిపదికసంజ్ఞ. అందుచే 'సుపో ధాతుప్రాతిపదికయోః'అను సూత్రముచే (724) ప్రాతిపదికావయవ మగు 'అమ్'కు లోపము, 'కుమ్భకార'శబ్దము సిద్ధించినది. ఇపు డిది కృదంతము గాన ప్రాతిపదికసంజ్ఞ వచ్చుటచే సుప్ప్రత్యయములు చేర్చబడును.

794. ఆతోఽనుపసర్గే కః. 3.2.3

అదన్తాత్ ధాతోరనుపసర్గాత్ కర్మణ్యుపపదే కః స్యాత్. అణోఽపవాదః. ఆతో లోపః. గోదః. ధనదః. కమ్బలదః. అనుపసర్గే కిమ్. గోసందాయః.

ఉపసర్గరహిత మగు ఆకారాంతధాతువునకు కర్మవాచకము ఉపపదముగ నున్నపుడు కప్రత్యయము వచ్చును. ఈ సూత్రము 'కర్మణ్యణ్'అనుసూత్రమునకు (793) బాధకము.

గోదః:- ఆకారాంత మగు దా ధాతువునకు 'గో అమ్'అను కర్మవాచకము ఉపపదముగ నుండగా ఈ సూత్రముచే కప్రత్యయము. 'గో అమ్ దా అ'

అని యుండగా "ఆతో లోప ఇటి చ" అనుసూత్రముచే (492) ఆకారలోపము: సమాససుబ్లోపాదులు పైన చూపిన విధముగ వచ్చి 'గోదః' అను రూపము సిద్ధించును. 'ధనదః' 'కమ్బలదః' ఇత్యాదులు గూడ ఈ విధముగనే సిద్ధించును.

'అనుపసర్గే' అనుటచే ధాతువునకు ఉపసర్గ చేర్చిన పక్షమున ఈ సూత్రము ప్రవర్తింపదు. 'గో సం దాయః' అను నపుడు 'గో అమ్ సందా' అని యుండగా 'కర్మణ్యణ్' అనుసూత్రముచే (793) 'అణ్' వచ్చినది. "గో అమ్ సం దా" అని యుండగా 'ఆతోయుక్చిణ్కృతోః' అను సూత్రముచే (760) 'యుక్' ఆగమము. సమాససుబ్లోపాదులు వెనుకటి వలె చూచుకొనవలెను-'గోసందాయః'.

వా. మూలవిభుజాదిభ్యః కః.

మూలాని విభుజతి మూలవిభుజో రథః. ఆకృతిగణోఽయమ్. మహీధ్రః, కుధ్రః.

మూలవిభుజాదిపదములకంటె క ప్రత్యయము వచ్చును. ఈ వార్తికము గూడ 'కర్మణ్యణ్'కు అపవాదము.

మూలాని విభుజతి-మొదళ్ళను వంగు నట్లు చేయునది-అను నర్థమున 'మూల శస్ విభుజ్' అని యుండగా ఈ వార్తికముచే కప్రత్యయము. ఇది ఉపపదసమాసముగాన ప్రాతిపదికసంజ్ఞా (సూ-117) సుబ్లోపాదికములు (సూ-724) పిమ్మట 'మూలవిభుజ' అనుదానికి కృదంతత్వప్రయుక్తమగు ప్రాతిపదికసంజ్ఞః సుబుత్పత్తి-"మూలవిభుజః" ఇత్యాదిరూపము లగును.

మూలవిభుజాదిగణము ఆకృతిగణము. అందుచే ఇట్టిపోలికలు గల పదములనన్నిటిని ఈ గణమునందుచేర్చి కప్రత్యయము చేర్చవచ్చును. 'మహీధ్రః' 'కుధ్రః' ఇత్యాదిపదములు ఈ విధముగనే నిష్పన్నమైనవి. "మహీంధరతి" 'కుం ధరతి' అను నర్థములందు "మహీ అమ్ ధృ" 'కు అమ్ ధృ' అని యుండగా ఈ వార్తికముచే కప్రత్యయము. ఇది కిత్తు గాన గుణము రాదు. యణాగమముచే 'మహీధ్ర' 'కుధ్ర' ఇత్యాదిరూపములుసిద్ధించినవి. 'కర్మణ్యణ్' అను సూత్రముచే (793) అణ్ వచ్చినచో వృద్ధి వచ్చి 'మహీధారః' "కుధారః" ఇత్యాదిరూపములై యుండెడిది.

795. చరేష్టః. 3.2.16

అధికరణే ఉపపదే. కురుచరః.

"అధికరణే శేతేః' నుండి 'అధికరణే' అనువర్తించును. అధికరణవాచ

కము ఉపపదముగ నున్నపుడు చరధాతువుకంటె 'ట'ప్రత్యయము వచ్చును. 'ట' లోని టకారము 'చుటూ'అనుసూత్రముచే (129) ఇత్సంజ్ఞకము. స్త్రీలింగమున 'టిడ్ఢాణఞ్'ఇత్యాదిసూత్రముచే (1250) 'జీప్'వచ్చి 'కురుచరీ'ఇత్యాదిరూపము లగుటటిత్త్వమునకు ప్రయోజనము.

కురుచరః:- (కురుదేశమునందు సంచరించువాడు) 'కురుషు చరతి'- అని లౌకికవిగ్రహవాక్యము. 'కురు సు చర్'అని యుండగా ఈ సూత్రముచే టప్రత్యయము. ఇది ఉపపదసమాసము గాన ప్రాతిపదికత్వ,సుబ్లోపాదులు.

796. భిక్షాసేనాదాయేషుచ. 3.2.17

భిక్షాచరః, సేనాచరః. ఆదాయేతిల్యబన్తమ్. ఆదాయచరః.

భిక్షా, సేనా, ఆదాయ, అను పదములుఉపపదములుగ నున్నపుడు కూడ చర ధాతువునకు టప్రత్యయము వచ్చును. భిక్షాచరః- భిక్షాంచరతి-భిక్షను సంచార పూర్వకముగ ఆర్జించుచున్నవాడు-అను నర్థమున ఈ సూత్రముచే టప్రత్యయము వచ్చినది. సేనాచరః- సేనాం చరతి-('చరతి'అనునది అంతర్భావితణ్యర్థము) సేనను పొందింపచేయువాడు-అను నర్థమున ఈ సూత్రముచే ట ప్రత్యయము. సూత్రములోని'ఆదాయ' అనునది ల్యబంతరూపము "ఆదాయ చరతి"- గ్రహించి సంచరించువాడు-అను నర్థమున ఈ సూత్రముచే టప్రత్యయము.

797. కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేషు. 3.2.20

ఏషు ద్యోత్యేషు కరోతేః టః స్యాత్.

హేతువు, తాచ్ఛీల్యము-అనగా "అది స్వభావముగా కలిగి యుండుట"- ఆనులోమ్యము-అనగా అనుకూలముగనుండుట-అను నర్థములుసూచింపబడు నపుడు కృఞ్ధాతువునకు ట ప్రత్యయము వచ్చును.

798. అతఃకృ, కమి, కంస, కుమ్భ, పాత్ర, కుశా, కర్ణీష్వనవ్యయస్య 8.3.46

ఆదుత్తరస్యానవ్యయస్య విసర్గస్య సమాసే నిత్యం సాదేశః కరోత్యాదిషు పరేషు, (న తూత్తరపదస్థస్య). యశస్కరీ విద్యా. శ్రాద్ధకరః. వచనకరః.

'విసర్జనీయస్య సః'అనుసూత్రము, 'నిత్యంసమాసేనుత్తరపదస్థస్య'అను సూత్రము అనువర్తించును. అకారముకంటె పరమైనదియు అవ్యయమునకు

సంబంధించినది కానిదియును అగు విసర్గకు సమాసమునందు, కృ, కమ్ధాతువు లును, కంస, కుమ్భ, పాత్ర, కుశా, కర్ణ శబ్దములును పర మైనపుడు నిత్యముగ సకారము వచ్చును. (ఉత్తరపదమునం దున్న విసర్గమునకు మాత్రము రాదు).

యశస్కరీవిద్యా:- విద్య యశస్సును కలిగించునది. అనగా యశస్సుకు హేతువు. 'యశస్ అమ్ కృ'అని యుండగా 'హేతువు' అను నర్థము సూచిత మగుచున్నది గాన పై సూత్రముచే ట ప్రత్యయము వచ్చినది. సమాసముగాన ప్రాతిపదికసంజ్ఞ, "సుపోధాతుప్రాతిపదికయోః"అను సూత్రముచే (724) సుప్‌కు లుక్కు. 'యశస్ కృ అ'అని యుండగా ఋకారమునకు గుణముచే'అర్'ఆదేశము 'యశస్ కర' అని యగును. సకారమునకు "ససజుషోరుః" అను సూత్రముచే (105) రుత్వము. "ఖరవసానయోర్విసర్జనీయః"అను సూత్రముచే (93) దానికి విసర్గము.-'యశఃకర'అని యుండగా 'కుప్వోః ꠸క ꠸పౌ చ' అనుసూత్రముచే (98) వికల్పముగ జిహ్వామూలీయము (꠸) రావలసి యుండ ఈ సూత్రముచే నిత్యముగ సత్వము-'యశస్కర' అని యగును. ట ప్రత్యయము టిత్తు గాన స్త్రీలింగమున "టిడ్ఢాణఞ్"-ఇత్యాది సూత్రముచే (1250) ఙీప్ వచ్చి "యశస్కరీ"అను రూపము సిద్ధించును.

శ్రాద్ధకరః:- శ్రాద్ధం కర్తుం శీలం యస్య- శ్రాద్ధమును చేయు స్వభావము కలవాడు- అను నర్థమున "శ్రాద్ధ అమ్కృ" అని యుండగా తాచ్ఛీల్యార్థమున టప్రత్యయము వచ్చి పై వలె 'శ్రాద్ధకరః' అను రూపము సిద్ధించినది. వచనకరః:- 'వచనం కరోతి' 'చెప్పిన పని చేయువాడు' అను అనుకూలత్వార్థమున "వచన అమ్ కృ" అని యుండగా టప్రత్యయము. గుణముచే ఋకారమునకు 'అర్'- 'వచనకరః' అను రూపము సిద్ధించినది.

799. ఏజేః ఖశ్ 3.2.28

ణ్యన్తాదేజేః ఖశ్ స్యాత్.

"ఏజేః" అనునది ణ్యంత మగు ఏజ్ ధాతువునకు (ఏజి) నిర్దేశము. ణ్యంత మగు ఏజ్‌ధాతువునకు ఖశ్ ప్రత్యయము వచ్చును. 'ఖశ్'లోని ఖకారమునకు 'లశక్వతద్ధితే' అను సూత్రముచే (136) ఇత్సంజ్ఞ. హలంత్యసూత్రముచే (1) శకారమునకు ఇత్సంజ్ఞ. ఇక 'అ' మిగులును.

800. అరుర్ద్విషదజన్తస్య ముమ్ 6.3.67

అరుషో ద్విషతోఽజన్తస్య చ ముమ్ ఆగమః స్యాత్. ఖిదన్తే

పరే న తు అవ్యయస్య. శిత్వాత్ శబాదిః. జనమేజయతి ఇతి జనమేజయః.

'ఖిత్యనవ్యయస్య' అను సూత్రము అనువర్తించును. 'అలుగుత్తరపదే' అని అధికారము గాన 'ఉత్తరపదే' అనునది లభ్యమగును. 'అరుస్', ద్విషత్' 'అజన్త' అను పదములషష్ఠ్యంతసమాహారద్వంద్వము. ఖిదంతము పరమైనపుడు అరుస్, ద్విషత్, శబ్దములకును, అజంతశబ్దములకును 'ముమ్' ఆగమము వచ్చును. అవ్యయమునకు మాత్రము రాదు. 'ముమ్'లోని అంత్యమకారోకారములు ఇత్సంజ్ఞకములు.

**జనమేజయః:**- జనం ఏజయతి- జనమును వణికించువాడు. ఇది పరీక్షిత్తు కుమారుని పేరు. "జన అమ్ ఏజి" (ణ్యంత మగు ఏజ్ ధాతువు) అని యుండగా పై సూత్రముచే 'ఖశ్' ప్రత్యయము. సమాసము గాన ప్రాతిపదికత్వము పిమ్మట సుప్పుకు లుక్కు. 'జన ఏజి అ' అని యుండగా 'ఖశ్' శిత్తు గాన దానికి 'తిఙ్ శిత్సార్వధాతుకమ్' అను సూత్రముచే (388) సార్వధాతుక సంజ్ఞ యుండుటచే 'కర్తరి శప్' అను సూత్రముచే (389) 'శప్' వచ్చును. 'శప్' అకారమునకు 'ఖశ్' అకారముతో "అతో గుణే"అని (274) పరరూపము. 'ఏజి'లోని ఇకారమునకు సార్వధాతుకగుణము. అయాదేశము. 'ఏజయ' అని సిద్ధించును. ఇపుడు "జన ఏజయ" అని యుండగా అజన్త మగు 'జన' అను దానికి ఖిదంతమగు (ఖకారేత్కమగు ప్రత్యయము అంతమునందు గల) 'ఏజయ' అనునది పరముగ నున్నది గాన ఈ సూత్రముచే 'ముమ్' ఆగమము 'మిదచో న్త్యాత్పరః' అను పరిభాషచే (240) అంత్యాచ్చుకంటె పరముగ వచ్చి 'జనమేజయః' అను రూపము సిద్ధించినది.

### 801. ప్రియవశే వదః ఖచ్ 3.2.38

ప్రియంవదః. వశంవదః.

'ప్రియ' 'వశ' అనునవి ఉపపదములుగ నున్నపుడు వదధాతువుకంటె 'ఖచ్' ప్రత్యయము వచ్చును. ఖకారచకారములు ఇత్సంజ్ఞకములు.

'ప్రియం వదతి' "వశే వదతి" అను నర్థమున "ప్రియ అమ్ వద్" 'వశ ఙి వద్' అని యుండగా ఈ సూత్రముచే 'ఖచ్' ప్రత్యయము. ప్రాతిపదికత్వసుబ్లోపములు. 'ప్రియవద' 'వశవద' అని యుండగా పై సూత్రముచే

(800) ముమాగమము- 'ప్రియంవదః' 'వశంవదః' అను రూపములు సిద్ధించును.

802. అన్యేభ్యోఽపి దృశ్యన్తే 3.2.75

మనిన్, క్వనిప్, వనిప్, విచ్ ఏతే ప్రత్యయాః ధాతోః స్యుః.

ఈ సూత్రము 'విజుపేఛన్దసి' "ఆతోమనిన్క్వనిబ్వనిపశ్చ" అను సూత్రముల తరువాత చెప్పబడినది. పై సూత్రములలో రెండవది ఈ ప్రత్యయము లను ఆకారాంతధాతువులకంటె విధించుచున్నది. కావున 'అన్యేభ్యః' అనగా 'ఆకారాంతభిన్నధాతువులకంటె' అని అర్థము.

మనిన్, క్వనిప్, వనిప్, విచ్ అను ప్రత్యయములు ఆకారాంతధాతువుల కంటె భిన్నము లగు ధాతువులకంటె కూడ వచ్చును. 'మనిన్'లోని 'ఇన్', 'క్వనిప్'లోని కకారము, 'ఇప్' అనునదియు, 'వనిప్'లోని 'ఇప్'అనునదియు, ఇత్సంజ్ఞకములు. 'విచ్'లోని 'ఇచ్' ఇత్సంజ్ఞకము మిగిలిన వకారమునకు 'వేరపృక్తస్య' అను సూత్రముచే (3 0) లోపము. 'క్వనిప్' 'వనిప్'లు 'పిత్'లు గాన వాటికి వెనుక నున్న హ్రస్వమునకు "హ్రస్వస్య పితి కృతి తుక్" అను సూత్రముచే (78() తుగాగమము వచ్చుచుండును.

803. నేడ్వశి కృతి 7.2.8

వశాదేః కృత ఇణ్ న స్యాత్. శౄహింసాయామ్- సుశర్మా. ప్రాతరిత్వా.

న, ఇట్, వశి, కృతి. 'వశ్' ప్రత్యాహారము. 'వశ్' ఆదియందు గల కృత్ప్రత్యయము పర మగునపుడు ఇడాగమము రాదు.

సుశర్మా:- శోభనం శృణాతి- "బాగుగ హింసించువాడు" అని యర్థము. హింసార్థక మగు సుపూర్వకశౄధాతువునకు "అన్యేభ్యోఽపి దృశ్యన్తే" అను సూత్రముచే (802) 'మనిన్' ప్రత్యయము. 'సుశౄమన్' అని యుండగా 'మనిన్' ప్రత్యయము ఆర్ధధాతుకముగాన "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః" అను సూత్రముచే (403) ఇడాగమము రావలసి యుండ ఈ సూత్రము నిషేధించు చున్నది. ౠకారమునకు "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే (390) గుణము (అర్)- 'సుశర్మా' అనునది ప్రథమైకవచనరూపము.

ప్రాతరిత్వా:- ప్రాతఃఏతి- ప్రాతఃకాలమునందువెళ్ళువాడు అనియర్థము-

ప్రాతర్' అవ్యయము పూర్వమునందు గల 'ఇ'ధాతువుకంటె పై సూత్రముచే క్వనిప్ప్రత్యయము. 'ప్రాతరివన్' అని యుండగా తుగాగమము (సూ-780) 'ప్రాతరిత్వన్' అను నకారాంతశబ్దము నిష్పన్నమైనది.

804. విడ్వనోరనునాసికస్యాత్ 6.4.41

అనునాసికస్యాఽఽత్ స్యాత్. విజాయతే ఇతి విజావా. ఓణృ అపనయనే అవావా విచ్- రుషరిషహింసాయామ్. రోట్, రేట్. సుగణ్.

విట్, వన్ ప్రత్యయములు పరముగ నున్నపుడు అనునాసికమునకు ఆకారము వచ్చును. 'క్వనిప్' 'వనిప్' ప్రత్యయములలో మిగులునది 'వన్' అనునది మాత్రమే గాన 'వన్' అనుదానిచే ఆ రెండు ప్రత్యయములును గ్రహింపబడును లిట్ప్రత్యయము వైదికశబ్దములకు మాత్రమే వచ్చును.

విజావా:- విజాయతే- వివిధరూపములలో జనించునది- అని యర్థము. విపూర్వక జన్ (జనీ ప్రాదుర్భావే) ధాతువుకంటె వనిప్ ప్రత్యయము (సూ-802). 'విజన్వన్' అని యుండగా ఈ సూత్రముచే నకారమునకు 'ఆ'కారము: దానికి పూర్వఅకారముతో సవర్ణదీర్ఘము- 'విజావన్' శబ్దము సిద్ధించును. ప్రథమైకవచనమున 'రాజన్' శబ్దమునకువలె 'విజావా' అను రూపము.

అవావా:- ఓణతీతి అవావా పాపమునుండి దూరముగ తొలగునది అని యర్థము. ఓణృ అపనయనే అను భ్వాదికధాతువుకంటె వనిప్ ప్రత్యయము. 'ఓణ్ వన్' అని యుండగా ఈ సూత్రముచే ణకారమునకు ఆకారము. 'ఓ ఆవన్'. అవాదేశము- 'అవావన్' అను నకారాంతశబ్దమునిష్పన్నమైనది. దాని రూపములు గూడ రాజన్ శబ్ద రూపములవలె నుండును.

రోట్: రేట్:- రుష, రిష ధాతువులకు హింసించుట అని యర్థము. ఈధాతువులకంటె, హింసించువాడు అను నర్థమున 'విచ్' ప్రత్యయము. విచ్ సర్వలోపి. 'రుష్' 'రిష్' అని యుండగా లఘూపధగుణము (సూ-453). 'రోష్' 'రేష్' అను పదములు సిద్ధించినవి. వాటి రూపములు ద్విట్ఛబ్దరూపములవలె నుండును.

సుగణ్:- సుపూర్వక గణధాతువుకంటె 'సుష్ఠుగణయతి— బాగుగ లెక్కించువాడు- అను నర్థమున విచ్ప్రత్యయము. అది పూర్తిగ లోపించిన పిమ్మట 'సుగణ్' అనుశబ్దము నిష్పన్నమైనది. 'సుగణ్, సుగణౌ, సుగణః' ఇత్యాదిరూపము లగును.

805. క్విప్ చ. 3.2.76

అయమపి దృశ్యతే. ఉఖాస్రత్. పర్ణధ్వత్. వాహాభ్రట్.

ధాతువుకంటె (సుబంతము ఉపపదముగ నున్నపుడు) 'క్విప్' ప్రత్యయమ్ము కూడ వచ్చును. 'క్విప్' ప్రత్యయముగూడ సర్వలోపి. కకారమునకు "లశక్వతద్ధితే" అనుసూత్రముచేతను (136) ఇకారమునకు "ఉపదేశేజనునాసిక ఇత్" అను సూత్రముచేతను (28) పకారమ్మునకు 'హలన్త్యమ్' అనుసూత్రముచేతను (1) ఇత్సంజ్ఞ. మిగిలిన వకారము 'వేరపృక్తస్య' అనుసూత్రముచే (304) లోపింపును. ఇది కిత్తు గాన ఇది పర మగునపుడు గుణవృద్ధులు రావు (సూ-435) 'పిత్' గాన వెనుకనున్న హ్రస్వమునకు తుగాగమము (సూ-780) వచ్చును.

ఉఖాస్రత్:- ఉఖాయాః స్రంసతే-పాత్రనుండి జారుచున్నది-అని యర్థము. పంచమ్యంత ఉఖాశబ్దపూర్వక మగు స్రంస్ ధాతువుకంటె ఈ సూత్రముచే 'క్విప్' ప్రత్యయము. అది పూర్తిగ లోపించిన పిమ్మట ''ఉఖాఙసిస్రంస్' అని యుండగా ఉపపదసమాసముగాన ప్రాతిపదికత్వము. సుబ్లోపము-'ఉఖాస్రంస్' అని యుండగా "అనిదితాం హల ఉపధాయాః క్ఙితి" అను సూత్రముచే (335) నకారలోపము "ఉఖాస్రస్" అను శబ్దము సిద్ధించినది. ప్రథమైకవచనమున 'వసుస్రంసుధ్వంస్వనడుహాం దః' అనుసూత్రముచే (262) దకారము. 'వావసానే' అనుసూత్రముచే (146) చర్త్వవికల్పము-'ఉఖాస్రత్ అను రూపము సిద్ధించును.

పర్ణధ్వత్:- పర్ణేభ్యో ధ్వంసతే-ఆకులనుండి జారునది-అనునర్థమున క్విప్ ప్రత్యయము చేర్చగా 'ఉఖాస్రత్' వలె 'పర్ణధ్వత్' అను రూపము సిద్ధించును.

వాహాభ్రట్:- వాహాత్ భ్రశ్యతి - వాహనమునుండి జారుచున్నవాడు- అను నర్థమున 'వాహఙసి' అనుపంచమ్యంతము ఉపపదముగ గల భ్రంశ్ ధాతువు కంటె క్విప్ ప్రత్యయము. పై ఉదాహరణములందు వలె నకారలోపము, 'వ్రశ్చభ్రస్జ-' ఇత్యాదిసూత్రముచే (285) శకారమునకు షకారము. దానికి జశ్త్వముచే (సూ-67) డకారము. దానికి చర్త్వవికల్పముచే (సూ-146) టకారము. 'వాహాభ్రట్'-'వాహాభ్రడ్' అనురూపద్వయము సిద్ధించును.

806. సుప్యజాతౌ ణినిస్తాచ్ఛీల్యే. 3.2.78

అజాత్యర్థే సుపి ధాతోర్ణినిః, తాచ్ఛీల్యే ద్యోత్యే. ఉష్ణభోజీ.

జాతివాచకము కాని సుబంతము ఉపపదముగా నుండగా,తాచ్ఛీల్యార్థము-అట్లుచేయుట వాని స్వభావము అను నర్థము-దోత్య మగునపుడు, ధాతువుకంటె ణిని ప్రత్యయము వచ్చును.

ఉష్ణభోజీ:- ఉష్ణం భుఙ్క్తే ఇతి-తచ్ఛీలః-వేడిగా నున్నదానిని తినెడు స్వభావము కలవాడు. ఇచట 'ఉష్ణ'అనునది జాతివాచకము కాదు; గుణవాచకము. కావున 'ఉష్ణ అమ్'అనెడు సుబంతము ఉపపదముగ నుండగా భుజ్ధాతువునకు ణిని (ఇన్) ప్రత్యయము చేర్చగా 'ఉష్ణ అమ్ భుజ్ ఇన్'అని యుండగా ఉపపదసమాసము గాన ప్రాతిపదికత్వసుబ్లోపములు. ఉకారమునకు గుణముచే ఓకారము. 'ఉష్ణభోజిన్'అను నకారాంతశబ్దమునకు ప్రథమైకవచనమున 'ఉష్ణభోజీ' అను రూపము సిద్ధించినది.

### 807. మనః. 3.2.82

సుపి మన్యతేర్ణినిః స్యాత్. దర్శనీయమానీ.

పైసూత్రమునుండి'సుపి' అనువర్తించును. సుబంతము ఉపపదముగా నున్నపుడు మన్ ధాతువుకంటె ణిని ప్రత్యయము వచ్చును.

దర్శనీయమానీ:- దర్శనీయం మన్యతే-చూడతగిన వానినిగా,అందమైన వానినిగా, తలచువాడు అని యర్థము. "దర్శనీయ అమ్ మన్"అని యుండగా ఈ సూత్రముచే ణిని ప్రత్యయము. ప్రాతిపదికత్వసుబ్లోపాదికము. 'దర్శనీయమన్ ఇన్' అని యుండగా ణినిప్రత్యయము ణిత్తు గాన 'అతఉపధాయాః' అను సూత్రముచే (457) ఉపధావృద్ధి-'దర్శనీయమానిన్' అను నకారాంత పదము సిద్ధించును.

### 808. ఆత్మమానేఖశ్చ. 3.2.83

స్వకర్మకే మననే వర్తమానాన్మన్యతేః సుపి ఖశ్ స్యాత్; చాత్ ణినిః, పణ్డితం ఆత్మానం మన్యతే పణ్డితంమన్యః;పణ్డితమానీ.

తాను కర్మగా గల మననమును-అనగా తన్ను తానే ఆవిధముగ భావించుకొనుట అను నర్థమును-బోధించు మనధాతువునకు,సుబంతము ఉపపదముగ నున్నపుడు ఖశ్ ప్రత్యయము వచ్చును. 'చ'అని చెప్పుటచే ఇదే అర్థమున 'ణిని' ప్రత్యయము కూడ వచ్చును.

పండితంమన్యః- పండితం ఆత్మానం మన్యతే-తన్ను తాను పండితుడనని అనుకొనువాడు. ఇచట మన్ధాత్వర్థమునందు తానే కర్మగా చెప్పబడి

యున్నాడు. కావున దీనికి 'పండిత అమ్'అను సుబంతము ఉపపదముగ మన్న పుడు ఈ సూత్రముచే 'ఖశ్'ప్రత్యయము-"పణ్డితఅమ్మన్అ". ప్రాతిపదికత్వ సుబ్లోపములు-"పండిత మన్ అ". 'ఖశ్'శిత్తు గాన సార్వధాతుకమగుటచే ధాతువుకంటె పరముగ దైవాదికవికరణప్రత్యయ మగు 'శ్యన్'వచ్చును- 'పండిత మన్ య అ'-'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపము-'పండిత మన్య', "అరుర్ద్విషదజన్తస్యముమ్"అను సూత్రముచే (800)ముమాగమము. "పండితంమన్యః"అను రూపము సిద్ధించును. 'ఖశ్' ప్రత్యయము రాని పక్షమున 'ణిని'ప్రత్యయము వచ్చి "దర్శనీయమానీ"వలె 'పండితమానీ' అను రూపమగును.

## 809. ఖిత్యనవ్యయస్య. 6.3.66

ఖిదన్తే పరే పూర్వపదస్య హ్రస్వః న త్వవ్యయస్య,తతో ముమ్. కాలింమన్యా.

'ఇకోహ్రస్వోఙ్యోగాలవస్య' నుండి 'హ్రస్వః' అనువర్తించును ఖిదంతము -అనగాఖకారేత్క- మగు ప్రత్యయము అంతమునందు గల పదము పరమగునపుడు అవ్యయభిన్న మగు పూర్వపదమునకు హ్రస్వము వచ్చును.

కాలింమన్యా:- కాలీం ఆత్మానం మన్యతే-తనను కాలినిగా లేక నల్లదానినిగా తలచుచున్నది-అను నర్థమున ద్వితీయాంతకాలీశబ్దము ఉపపదముగా నుండగా మనధాతువునకు 'ఆత్మమానే ఖశ్ చ'అను సూత్రముచే (808) 'ఖశ్' ప్రత్యయము వచ్చినది. సుబ్లోపాదికము యథాపూర్వము. 'కాలీమన్య'అని యుండగా ఈ సూత్రముచే ఈకారమునకు హ్రస్వము. పిమ్మట 'అరుర్ద్విషదజన్తస్య ముమ్,అను సూత్రముచే (800) ముమాగమము-'కాలింమన్య'అను ప్రాతిపదికము ఏర్పడినది. పిమ్మటస్త్రీత్వప్రయుక్తమగు'టాప్'ను,సుప్రత్యయమును చేర్చగా 'కాలింమన్యా'అను రూపము సిద్ధించినది.

## 810. కరణే యజః. 3.2.85

కరణేఉపపదే భూతార్థవృత్తేర్ణినిః కర్తరి. సోమేనేష్టవాన్ సోమయాజీ. అగ్నిష్టోమయజీ.

'భూతే'అధికారము. కరణవాచకము ఉపపదముగ నుండగా భూతార్థవాచక మగు యజ్ధాతువునకు కర్త్రర్థమున 'ణిని'ప్రత్యయము వచ్చును.

సోమయాజీ:- సోమేన ఇష్టవాన్-సోమలతారసముతో యాగము చేసిన వాడు అని యర్థము. 'సోమ టా యజ్'అనునపుడు కరణవాచక మగు 'సోమ టా'అనునది ఉపపదముగా నున్నది గాన ఈ సూత్రముచే యజధాతువునకు ణిని ప్రత్యయము. సుబ్లోపాదికముయథాపూర్వము. "అతఉపధాయాః"అను సూత్రముచే (457) ఉపధావృద్ధి, "సోమయాజిన్"అను నకారాంతశబ్దము సిద్ధించును. 'సోమయాజీ' అనునది దాని ప్రథమైకవచనరూపము. సోమలతాద్రవ్యక మగు యాగముచే అపూర్వమును పుట్టించినవాడు అని మీమాంసకాభిమత మగు అర్థము. ఇట్లే "అగ్నిష్టోమమనెడు యాగముచే అపూర్వమును సంపాదించినవాడు" అను నర్థమున 'అగ్నిష్టోమయాజీ'అను రూపము సిద్ధించును. ప్రక్రియ 'సోమ యాజీ'అనుదాని ప్రక్రియ వలెనుండును.

## 811. దృశేః క్వనిప్ 3.2.94

కర్మణి భూతే. పారం దృష్టవాన్ పారదృశ్వా.

'భూతే' అధికారము. 'కర్మణి హనః'నుండి 'కర్మణి' అనువర్తించును. కర్మవాచకము ఉపపదముగా నుండగా భూతార్థవాచక మగుదృశ్ధాతువునకు 'క్వనిప్' ప్రత్యయము వచ్చును.

పారదృశ్వా:- 'పార అమ్ దృశ్' అని యుండగా కర్మవాచక మగు 'పార అమ్' అనునది ఉపపదముగ నుండుటచే ఈ సూత్రముచే దృశ్ధాతువునకు క్వనిప్ ప్రత్యయము, పారదృశ్వన్- పారదృశ్వన్ అను నకారాంత శబ్దము సిద్ధించినది. 'పారదృశ్వా' దీని ప్రథమైకవచనము. 'పారమును చూచిన వాడు' అని అర్థము.

## 812. రాజని యుధి కృఞః 3.2.95

క్వనిప్ స్యాత్. యుధిరన్తర్భావితణ్యర్థః. రాజానం యోధితవాన్ రాజయుధ్వా. రాజకృత్వా.

'కర్మణి హనః' నుండి 'కర్మణి' అనువర్తించును.

కర్మవాచక మగు రాజన్ శబ్దముఉపపదముగ నున్నపుడు 'యుధ్' 'కృ' ధాతువులకు క్వనిప్ ప్రత్యయము వచ్చును. ఇచట యుధ్ ధాతువునందు ణ్యర్థము అంతర్భావితమై యున్నది. అనగా యుద్ధము చేయించువాడు అని యర్థము.

రాజయుధ్వా:- 'రాజన్ అమ్ యుధ్' అని యుండగా ఈ సూత్ర

ముచే క్వనిప్ ప్రత్యయము- "రాజన్ అమ్ యుధ్ వన్". ఉపపదసమాసము గాన ప్రాతిపదికత్వసుబ్లోపములు. 'నలోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నకారలోపము. 'రాజయుధ్వన్' అను ప్రాతిపదికము సిద్ధించినది. 'రాజయుధ్వా' దాని ప్రథమైకవచనము. రాజును యుద్ధముచేయించినవాడు (రాజానం యోధితవాన్) అని అర్థము. "రాజును చేసినవాడు" అను నర్థమున పై విధముగనే 'రాజకృత్వా' అను రూపము సిద్ధించినది. 'రాజకృ వన్' అని యుండగా 'హ్రస్వస్యపితికృతితుక్' అని (780) తుగాగము వచ్చుట ఒక్కటియే విశేషము.

## 813. సహే చ 3.2.96

కర్మణి ఇతి నివృత్తమ్. సహ యోధితవాన్ సహయుధ్వా. సహకృత్వా.

'కర్మణి హనః' నుండి పై సూత్రమువరకును అనువర్తించిన 'కర్మణి' ఇక అనువర్తింపదు. 'సహ' అనునది ఉపపదముగా నున్నపుడు గూడ భూతార్థవాచకము లగు 'యుధ్' 'కృ'ధాతువులకు క్వనిప్ ప్రత్యయము వచ్చును.

సహ యోధితవాన్- కూడా యుద్ధము చేయించినవాడు- అనునర్థమున సహ అనునది ఉపపదముగా గల యుధ్ ధాతువునకు క్వనిప్ ప్రత్యయము చేర్చగా 'సహయుధ్వా' అను పదము సిద్ధించు. ఇట్లే 'సహకృత్వా' అను పదము 'కలిసి చేసినవాడు' అను నర్థమున సిద్ధించును.

## 814. సప్తమ్యాం జనేర్డః 3.2.97

సప్తమ్యంతము ఉపపదముగా నున్నపుడు జన్ధాతువుకంటె డప్రత్యయము వచ్చును. 'డ'ప్రత్యయమునందలి డకారము 'చుటూ' అను సూత్రముచే (129) ఇత్సంజ్ఞకము. కావున ఇది పరముగ నున్నపుడు వెనుక నున్నదాని 'టి'కి 'డేః' అను సూత్రముచే (242) లోపము వచ్చుచుండును.

'సరస్ ఙి జన్' అనునపుడు 'సరస్ ఙి' అను సప్తమ్యంతపదము ఉపపదముగా నుండగా ఈ సూత్రముచే 'డ'ప్రత్యయము. "సరస్ ఙి జన్ అ" అని యుండగా 'డేః' అనుసూత్రముచే (242) 'జన్'లోని 'టి' యగు 'అన్' లోపించును. "సరస్ఙి జ" అని యుండగా ఇది ఉపపదసమాసముగుటచే ప్రాతిపదికత్వ మున్నదిగాన సుబ్లోపము రావలసి యుండగా:-

815. తత్పురుషే కృతి బహులమ్ 6.3.14

జేరలుక్. సరసిజమ్; సరోజమ్

'హలదన్తాత్ సప్తమ్యాః సంజ్ఞాయామ్'నుండి 'సప్తమ్యాః' 'సంజ్ఞాయామ్' అనువర్తించును. కృదంతము ఉత్తరపదముగా నున్నపుడు, తత్పురుష సమాసమున, (ఈసమాసము సంజ్ఞావాచక మైనపుడు) సప్తమీవిభక్తి ప్రత్యయమునకు వికల్పముగ అలుక్ వచ్చును.

ఈ సూత్రముచే 'జి' లోపింపని పక్షమున "సరస్‌జి(ఇ)జ"- 'సరసిజ' అను పదము సిద్ధించును. ఈ సూత్రముచే అలుక్ రాని పక్షమున "సుపో ధాతు ప్రాతిపదికయోః" అను సూత్రముచే (724) జి లోపించిన పిమ్మట 'సరస్‌జ' అని యుండగా సకారమునకు "ససజుషోరుః"అను సూత్రముచే (105) రుత్వము; దానికి 'హశి చ' (107) అని ఉత్వము; పిమ్మట గుణము చేయగా 'సరోజ' అను పదము సిద్ధించును. సరస్సునందు పుట్టినపద్మము అను నర్థమునందు ఉపయుక్త మైన యడలనే ఈ వైకల్పిక అలుక్ వచ్చును. పద్మభిన్నార్థమునందు అలుక్ రాదు.

816. ఉపసర్గే చ సంజ్ఞాయామ్ 3.2.99

ప్రజా స్యాత్ సన్తతౌ జనే,

ఉపసర్గ ఉపపదముగా నున్నపుడు జన్ ధాతువుకంటె, అది సంజ్ఞావాచకమగునపుడు డ ప్రత్యయము వచ్చును.

ప్రజా అనునది సంతానమునకును జనమునకును సంజ్ఞ. ఇచట ప్రపూర్వక జన్ ధాతువునకు ఈసూత్రముచే డప్రత్యయము చేర్చగా టిలోపము చేసిన పిమ్మట 'ప్రజ' అను ప్రాతిపదికము సిద్ధించినది. స్త్రీత్వమున టాప్ వచ్చి ప్రజా శబ్దము నిష్పన్న మైనది. "ప్రజా స్యాత్ సన్తతౌ జనే"అనునది నామలింగానుశాసనములోని వాక్యము.

817. క్తక్తవతూ నిష్ఠా 1.1.26

ఏతౌ నిష్ఠాసంజ్ఞౌ స్తః.

'క్త 'ప్రత్యయమునకును, 'క్తవతు' ప్రత్యయమునకును నిష్ఠ యని పేరు.

818. నిష్ఠా 3,2.102

భూతార్థవృత్తేర్ధాతోర్నిష్ఠా స్యాత్. తత్ర 'తయోరేవ–' ఇతి భావకర్మణోః క్తః, 'కర్తరి కృత్' ఇతి కర్తరి క్తవతుః. ఉకావితౌ. స్నాతం మయా, స్తుతస్త్వయా విష్ణుః. విశ్వం కృతవాన్ విష్ణుః,

'భూతే' అధికారము. భూతార్థవాచక మగు ధాతువుకంటె నిష్ఠ (క్త క్తవతు ప్రత్యయములు) వచ్చును.

'క్త'లోని కకారము, 'క్తవత్'లోని కకార ఉకారములును ఇత్సంజ్ఞకములు. 'త' 'తవత్' శేషించును. అందు క్త ప్రత్యయము 'తయోరేవ కృత్యక్తఖలర్థాః' (773) అను సూత్రము ననుసరించి అకర్మకధాతువుకంటె భావార్థమునందును సకర్మకధాతువుకంటె కర్మార్థమునందును వచ్చును. క్తవతు ప్రత్యయము 'కర్తరి కృత్' అను సామాన్యశాస్త్రము (772) ననుసరించి కర్త్రర్థమునందును వచ్చును. క్త, క్తవతులు రెండును కిత్తులు గాన ఇవి పరముగ నుండగా గుణము రాదు. ఈ రెండును వలాద్యార్ధధాతుకములు గాన సేట్ధాతువులకంటె పర మైనపుడు వీటికి ఇడాగమము వచ్చుచుండును.

స్నాతం మయా:– నాచే స్నానము చేయుట. స్నాధాతువు అకర్మకము గాన దానికంటె భావార్థమున క్త ప్రత్యయము వచ్చి 'స్నాత' అను ప్రాతిపదికము సిద్ధించినది. కృదంతముగాన "కృత్తద్ధితసమాసాశ్చ" అను సూత్రముచే (117) ప్రాతిపదికసంజ్ఞ. సామాన్యేనపుంసకము, ప్రథమైకవచనము వచ్చినవి. ఇది భావే ప్రయోగ మగుటచే క్తప్రత్యయము ధాత్వర్థమును మాత్రమే (భావమును) చెప్పుచున్నది; కర్తను చెప్పుట లేదు. ఈ విధముగ కర్త అనుక్తముగాన, కర్తృవాచక మగు అస్మచ్ఛబ్దము "కర్తృకరణయోస్తృతీయా" అను సూత్రము (898) ననుసరించి తృతీయవిభక్తియందు ఉపయోగింపబడినది.

స్తుతస్త్వయా విష్ణుః:– నీచేత విష్ణువు స్తుతింపబడినాడు. ఇచట స్తుధాతువు సకర్మకము గాన క్తప్రత్యయము కర్మార్థమున వచ్చినది. కర్మణిప్రయోగమునందువలె కర్మవాచకము ప్రథమవిభక్తియందును, కర్తృవాచకము తృతీయవిభక్తియందును ప్రయోగింపబడినవి. స్నా, స్తుధాతువులు అనిట్టులు గాన ఇడాగమము రాలేదు.

విశ్వం కృతవాన్ విష్ణుః:– విష్ణువు ప్రపంచమును సృజించెను. ఇచట కృధాతువుకంటె కర్త్రర్థమున క్తవతుప్రత్యయము వచ్చి 'కృతవత్'

అను ప్రాతిపదికము ఏర్పడినది. 'క్తవతు' ప్రత్యయము ఉగిత్తు గాన ప్రథమైక వచనమున "ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః" అను సూత్రముచే (290) నుమాగమము-(కృతవన్త్స్), తకారమునకు "సంయోగాన్తస్య లోపః" అను సూత్రముచే (20) లోపము. 'సర్వనామస్థానేచాసమ్బుద్ధౌ' అను సూత్రముచే (177) ఉపధాదీర్ఘము. సకారమునకు హల్జ్యాదిసూత్రముచే (179) లోపము. 'కృతవాన్' అను రూపము సిద్ధించును. క్తవతుప్రత్యయము కర్త్రర్థకము గాన కర్తృవాచక మగు విష్ణుశబ్దము ప్రథమవిభక్తియందును, కర్మవాచక మగు 'విశ్వ'శబ్దము ద్వితీయవిభక్తియందును ప్రయోగింపబడినవి.

819. రదాభ్యాం నిష్ఠాతో నః పూర్వస్య చ దః. 8.2.42

రదాభ్యాం పరస్య నిష్ఠాతస్య నః స్యాత్; నిష్ఠాపేక్షయా పూర్వస్య ధాతోర్దస్య చ. శౄ హింసాయామ్. ౠత ఇత్; రపరః; ణత్వమ్. శీర్ణః. భిన్నః. ఛిన్నః.

రేఫదకారములకంటె పర మైన క్త, క్తవతుప్రత్యయముల తకారమునకును, ఆ ప్రత్యయములకంటె పూర్వమునం దున్న ధాతువు దకారమునకును నకారాదేశము వచ్చును.

శీర్ణః:- శౄధాతువునకు హింసించుట అని యర్థము. దీనికంటె పరముగ కర్త్రర్థమున క్తప్రత్యయము-'శౄ త' అని యుండగా 'ౠత ఇద్ధాతోః' అను సూత్రముచే (663) ౠకారమునకు ఇకారము. ఇది 'ఉరణ్ రపరః' అను సూత్రముచే (29) రపర మై వచ్చును. 'శిర్ త' అని యుండగా 'హలిచ' అను సూత్రముచే (696) ఇకారమునకు దీర్ఘము-'శీర్ త.' ఇచట క్తప్రత్యయావయవ మగు తకారము రేఫకంటె పరముగ నున్నది గాన దానికి ఈ సూత్రముచే నకారము. పిమ్మట "రషాభ్యాం నో ణః సమానపదే" అను సూత్రముచే (262) నకారమునకు ణకారము-'శీర్ణః' అను రూపము సిద్ధించినది.

భిన్నః—ఛిన్నః.- భిద్, ఛిద్ ధాతువులకంటె క్త ప్రత్యయము-'భిద్ త' 'ఛిద్ త'. ఈ సూత్రముచే దకారముకంటె పర మగు క్తప్రత్యయతకారమునకును దానికంటె పూర్వమునం దున్న ధాతుదకారమును నకారములు వచ్చి 'భిన్నః' 'ఛిన్నః' అను రూపములు సిద్ధించినవి.

820. సంయోగాదే రాతో ధాతోర్యణ్వతః 8.2.43

నిష్ఠాతస్య నః స్యాత్. ద్రాణః. గ్లానః.

పైసూత్రమునుండి 'నిష్ఠాతః' 'నః' అను పదములు అనువర్తించును. సంయోగము ఆదియందు కలదియు,యణ్‌తో కూడినదియు, ఆకారాంతమును అగు ధాతువుకంటె పర మగు నిష్ఠాతకారమునకు నకారము వచ్చును.

ద్రాణః:- ద్రాధాతువునకు కుత్సితగతి యని అర్థము. అదాదికము. అనిట్టు,ఇది ఆకారాంతధాతువు. దీనిలో రేఫరూప మగు యణ్ గలదు. ఇది సంయోగాదికము. అందుచే దీనికంటె పరమైన క్తప్రత్యయతకారమునకు నకారము,దానికి 'అట్‌కుప్వాఙ్‌నుమ్వ్యవాయేఽపి'అను సూత్రముచే (138) ణత్వము వచ్చి 'ద్రాణః'అను రూపముసిద్ధించినది.

గ్లానః:- గ్లై ధాతువునకు వాడిపోవుట యని యర్థము. భౌవాదికము దీనికంటె క్తప్రత్యయము చేసిన పిమ్మట "ఆదేచ ఉపదేశేఽశితి"అను సూత్రముచే (496) ఐకారమునకు ఆకారాదేశము వచ్చును. ఇపు డిది ఆకారాంతము, సంయోగాదికము, యణ్సహితము నగు ధాతువు గాన ఈ సూత్రముచే క్తప్రత్యయతకారమునకు నకారాదేశము వచ్చి 'గ్లానః'అను రూపము సిద్ధించినది.

## 821, ల్వాదిభ్యః. 8.2.44

ఏకవింశతేర్లూఞాదిభ్యః ప్రాగ్వత్. లూనః. జ్యాధాతుః; 'గ్రహిజ్యా-'ఇతి సమ్ప్రసారణమ్.

లూఞ్ మొదలగు ఇరువదియొక్క ధాతువులకంటె గూడ పైన చెప్పిన కార్యము వచ్చును. అనగా ఈ ధాతువులకంటె పర మగు క్తప్రత్యయతకారమునకు నకారము వచ్చును.

లూనః:- క్ర్యాదిగణమునకు చెందిన లూఞ్ ధాతువునకు క్త ప్రత్యయము చేర్చిన పిదప ఆ తకారమునకు ఈ సూత్రముచే నకారము ఆదేశముగ వచ్చుటచే 'లూనః'అను రూపము సిద్ధించినది.

క్ర్యాదిగణమునకు చెందిన 'జ్యా'ధాతువునకు వయోహాని అని యర్థము. దానికంటె క్తప్రత్యయము-'జ్యా త'అని యుండగా "గ్రహిజ్యా-" ఇత్యాది సూత్రముచే (637) యకారమునకు సంప్రసారణము (ఇకారము)-'జ్ ఇ ఆ త'. 'సమ్ప్రసారణాచ్చ'అనుసూత్రముచే (258) ఆకారమునకు పూర్వరూపము-'జిత' అని యుండగా:-

## 822. హలః. 6.4.2

అఙ్గావయవాత్ హలః పరం యత్ సమ్ప్రసారణం తదన్తస్య దీర్ఘః- జీనః.

'అఙ్గస్య' అధికారము. 'సమ్ప్రసారణస్య' అనుసూత్రము, "ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః" నుండి 'దీర్ఘః'అనువర్తించును. అంగావయవ మగు హల్లుకంటె పర మగు సంప్రసారణము అంతమునందు గల అంగమునకు దీర్ఘము వచ్చును.

ఇచట 'జి' అనునది అంగము, జకారము అంగావయవ మగు హల్లు, దానికంటె పర మగు సంప్రసారణము ఇకారము. తదంత మగు అంగము 'జి' అనునది. దానికి దీర్ఘము వచ్చుటచే 'జీత'అని యగును. జ్యాధాతువు ల్వాదులలో చేరుటచే తకారమునకు నకారాదేశము వచ్చి 'జీన'శబ్దము నిష్పన్న మైనది.

823. ఓదితశ్చ. 8.2.45

భుజో-భుగ్నః. టుఓశ్వి-ఉచ్ఛూనః.

ఓకారము ఇత్సంజ్ఞముగా గల ధాతువుకంటె పర మైన నిష్ఠాతకారమునకు నకారాదేశము వచ్చును.

భుగ్నః- భుజోధాతువునకు కౌటిల్య మని యర్థము.తౌదాదికము.అనిట్. పరస్మైపది. ఇందలి ఓకారము ఇత్సంజ్ఞకము. ఓదిత్గాన దీనికంటె పరమగు క్తప్రత్యయతకారమునకు (భుజ్త) ఈ సూత్రముచే నకారము-'భుజ్న'అని యుండగా "చోఃకుః" అను సూత్రముచే (307) జకారమునకు కుత్వము- 'భుగ్నః'

ఉచ్ఛూనః:- భౌవాదిక మగు 'టు ఓ శ్వి' అనుధాతువునకు వృద్ధి పొందుట అని యర్థము. ఇది కూడ ఓదిత్తు గాన దీనికంటె పర మగు తకారమునకు నకారము-'శ్విన'అని యుండగా శ్విధాతువు యజాదులలో చేరినది గాన 'వచిస్వపియజాదీనాం కితి'అను సూత్రముచే (550) సంప్రసారణము. 'శ్ ఉ ఇన' అనియుండగా ఇకారమునకు పూర్వరూపము (సూ.258)-'శు న'అని యుండగా 'హలః'అను సూత్రముచే (822) ఉకారమునకు దీర్ఘము. 'శూన'. ఇది సేట్ ధాతు వైనను 'శ్వీదితో నిష్ఠాయామ్'అను సూత్రముచే ఇడాగమము నిషిద్ధము. ఈ ధాతువునకు 'ఉద్'అను ఉపసర్గను చేర్చుటచే 'ఉచ్ఛూనః'అనుపదముసిద్ధించినది. 'ఉబికినది'అని యర్థము.

824. శుషః కః. 8.1.51

నిష్ఠాతస్య కః. శుష్కః.

శుష్ధాతువుకంటె పర మగు నిష్ఠాతకారమునకు కకారము ఆదేశముగ వచ్చును.

శుష్కః- (ఎండినది)- శుష్‌ధాతువుకంటె క్తప్రత్యయము - 'శుష్‌త'. తకారమునకు ఈ సూత్రముచే కకారము-'శుష్కః'.

825. పచో వః. 8.2.52

పక్వః. క్షై హర్షక్షయే.

పచ్‌ధాతువుకంటె పర మగు నిష్ఠాతకారమునకు వకారాదేశము వచ్చును.

పక్వః:- పచ్‌ధాతువుకంటె క్తప్రత్యయము చేసిన పిమ్మట పచ్ త' అని యుండగా ఈ సూత్రముచే తకారమునకు వకారాదేశము చకారమునకు కుత్వము (సూ-307) 'పక్వః'.

భౌవాదికమగు క్షైధాతువునకు హర్షము క్షీణించుట అని యర్థము. సిద్ధాంతకౌముదిలో 'క్షై క్షయే'-అనియే ఉన్నది. పరస్మైపది. అనిట్. దీనికి క్తప్రత్యయము చేర్చిన పిదప 'క్షై త' అని యుండగా "ఆదేచఉపదేశేఽశితి" అను సూత్రముచే (496) ఐకారమునకు ఆకారము-'క్షాత'అని యుండగా-

826. క్షాయో మః 8.2.53

క్షామః.

క్షైధాతువుకంటె పర మగు నిష్ఠాతకారమునకు మకారాదేశము వచ్చును. ఈ సూత్రముచే తకారమునకు మకారాదేశము చేయగా 'క్షామ'శబ్దము సిద్ధించినది

827. నిష్ఠాయాం సేటి. 6.4.52

ణేర్లోపః, భావితః; భావితవాన్. దృహ హింసాయామ్.

"ణేరనిటి" "అతో లోప ఇటి చ"నుండి 'ణేః' 'లోపః' అనువర్తించును. సేట్ అగు నిష్ఠ పర మగునపుడు 'ణి'కి లోపము వచ్చును.

ణ్యంత మగు భూధాతువుకంటె క్త క్తవతుప్రత్యయములు చేర్చిన పిమ్మట 'భావి త' 'భావి తవత్' అని యుండగా భూధాతువు సేట్ గాన, 'త' 'వత్' ప్రత్యయములకు ఇడాగమము- 'భావి ఇత' 'భావి ఇతవత్' అని యుండగా ఈ సూత్రముచే 'ణి'కి లోపము. 'భావ్ ఇత'- 'భావిత' 'భావ్ ఇతవత్' 'భావితవత్' అను శబ్దములు సిద్ధించినవి.

దృహ ధాతువునకు హింసించుట అని యర్థము. భ్వాదులలోనిది. సేట్. సిద్ధాంతకౌముదిలో 'దృహ వృద్ధౌ' అని యున్నది. దానికి క్తప్రత్యయము చేర్చి

నపుడు 'దృహ్ త' అని యుండగా తకారమునకు ఇడాగమము వచ్చి 'దృహిత' అను రూపము మాత్రమే కావలసి యుండగా:-

828. దృఢః స్థూలబలయోః 7.2.20

స్థూలే బలవతి చ నిపాత్యతే.

స్థూలమైనవాడు బలమైనవాడు అను నర్థమున 'దృఢః' అను రూపము నిపతింపబడుచున్నది. సాధారణప్రక్రియకు లొంగని పదములను అవి ఆవిధముగ నుండునని చెప్పుటకు నిపతించుట యని పేరు. ఇచట క్తప్రత్యయమునకు 'ఇట్' రాకుండుట, తకారమునకు ఢత్వము, హకారమునకు లోపము నిపతింపబడుచున్నవి. పై యర్థములకంటె భిన్న మగు నర్థమునందు మాత్రము 'దృహిత' అను రూపమే సిద్ధించును.

829. దధాతేర్హిః 7.4.42

తాదౌ కితి. హితమ్.

'ద్యతిస్యతిమాస్థామిత్తి కితి' నుండి 'తి' 'కితి' అనువర్తించును. 'కిత్' అగు తకారాది ప్రత్యయము పర మగునపుడు ధాధాతువునకు 'హి' అను నాదేశము వచ్చును

హితమ్:- ధాధాతువునకు క్తప్రత్యయము- 'ధా త' అని యుండగా ఈ సూత్రముచే 'ధా'కు 'హి' ఆదేశము- 'హిత'.

830. దో దద్ ఘోః 7.4.46

ఘుసంజ్ఞకస్య 'దా' ఇత్యస్య దద్ స్యాత్ తాదౌ కితి. చర్త్వమ్ -దత్తః.

కిత్ అగు తకారాదిప్రత్యయము పర మగునపుడు ఘుసంజ్ఞక మగు దా ధాతువునకు 'దద్' అను నాదేశము వచ్చును.

'డుదాఞ్' 'దానే' అను ధాతువునకు 'దాధాఘ్వదాప్' అను సూత్రముచే (626) ఘుసంజ్ఞ యున్నది. దానికి క్తప్రత్యయము చేర్చిన పిదప 'దాత' అని యుండగా ఈ సూత్రముచే 'దా'కు 'దద్' ఆదేశము దకారమునకు 'ఖరి చ' అను సూత్రముచే (74) చర్త్వము- 'దత్త' శబ్దము సిద్ధించును.

831. లిటః కానజ్వా 3.2.106

832. క్వసుశ్చ 3.2.107

లిటః కానచ్, క్వసుశ్చవా స్తః. తఙానావాత్మనేపదమ్. చక్రాణః.

లిట్‌కు 'కానచ్' 'క్వసు' అను ప్రత్యయములు వికల్పముగ ఆదేశములుగ వచ్చును.

'కానచ్'లోని కకారచకారములును, 'క్వసు'లోని కకారఉకారములును ఇత్సంజ్ఞకములు. 'తఙానావాత్మనేపదమ్' అను సూత్రముచే (379) 'కానచ్' ప్రత్యయము ఆత్మనేపదసంజ్ఞకము గాన ఇది ఆత్మనేపది ధాతువులకంటె మాత్రమే వచ్చును.

చక్రాణః:- (చేసినవాడు), కృధాతువుకంటె పర మగు లిట్‌స్థానమున ఈ సూత్రముచే కానచ్ ప్రత్యయము వచ్చినది. ఇది లిట్‌స్థానమున వచ్చుటచే, ఇది పరమగునపుడు ధాతువునకు ద్విత్వాభ్యాసకార్యాదులు వచ్చి 'చకృ ఆన' అని యగును. ఇవుడు యణాదేశణత్వములచే 'చక్రాణః' అను పదము సిద్ధించును.

గమ్‌ధాతువుకంటె పర మగు లిట్టునకు 'క్వసు' ఆదేశము. ద్విత్వాభ్యాస కార్యములు చేసిన పిమ్మట 'జగమ్ వస్' అని యుండగా:-

833. మ్వోశ్చ 8.2.65

మాన్తస్య ధాతోర్నత్వం మ్వోః పరతః. జగన్వాన్.

"మోనో ధాతోః" అను సూత్రము అనువర్తించును. మకారాంత మగు ధాతువు(యొక్క మకారమునకు) మకారవకారములు పర మగునపుడు నకారము ఆదేశముగ వచ్చును.

ఈ సూత్రముచే మకారమునకు నకారాదేశము చేయగా 'జగన్వస్' అను ప్రాతిపదికము సిద్ధించును. దాని ప్రథమైకవచనమున 'విద్వాన్'వలె 'జగన్వాన్' అను రూపము సిద్ధించును.

834. లటః శతృశానచావప్రథమాసమానాధికరణే 3.2.124

అప్రథమాన్తేన సమానాధికరణే లటః ఏతౌ వా స్తః. శబాది. పచన్తం చైత్రం పశ్య.

ప్రథమాంతభిన్నముతో సమానాధికరణ మగునపుడు లట్టునకు శతృ, శానచ్‌ప్రత్యయములు వికల్పముగ ఆదేశములుగ వచ్చును.

'అప్రథమాసమానాధికరణే' అనగా శతృ. శానచ్‌ప్రత్యయములు చేర్చుటచే నేర్పడిన పదము ప్రథమాంతపదముతో సమానాధికరణము కాకూడదని యర్థము ఉదాహరణమునకు.- "పచన్తం చైత్రం పశ్య" ఇత్యాది స్థలము

లందు శతృప్రత్యయమును చేర్చుటచే ఏర్పడిన పచచ్ఛబ్దము (పచన్తమ్) 'చైత్రం' అను ద్వితీయాంతపదముతోడనే సమానాధికరణముగ నున్నది గాని ప్రథమాంతముతో కాదు. అందుచే శతృప్రత్యయము వచ్చినది. దీనిని బట్టి 'పచన్ చైత్రః' ఇత్యాదిప్రయోగములలో ప్రథమాన్తసామానాధికరణ్య మున్నది గాన ఇట్టి స్థలములలో శతృప్రత్యయము రాకూడ దని తేలినది. కాని ప్రథమాంతముతో గూడ శతృశానజంతములకు ప్రయోగములలో సామానాధికరణ్యము కానవచ్చుచున్నది. ఇట్టి ప్రయోగము లుండుటకు కారణము మూలమునందు స్పష్టము కాగలదు.

'శతృ'లోని శకారఋకారములును, 'శానచ్'లోని శకారచకారములును ఇత్సంజ్ఞకములు. 'తఙానావాత్మనేపదమ్' అను సూత్రముచే (379) 'శానచ్' ఆత్మనేపదసంజ్ఞము గాన ఇది ఆత్మనేపదిధాతువులకంటె నే వచ్చును. శతృప్రత్యయము పరస్మైపదిధాతువులకంటె వచ్చును. శతృ, శానచ్,లు రెండును శిత్తులు గాన "తిఙ్శిత్సార్వధాతుకమ్" అను సూత్రముచే (388) సార్వధాతుక సంజ్ఞములు. ఇవి పర మగునపుడు ధాతువుకంటె శబాదులు వచ్చును.

పచ్ధాతువుకంటె పర మైన లట్కు ఈ సూత్రములే 'శతృ'ప్రత్యయము- 'పచ్ అత్'. శప్ప్రత్యయము- 'పచ్ అ అత్' 'అతో గుణే'అను సూత్రముచే(274) పరరూపము- 'పచత్'అను ప్రాతిపదికము సిద్ధించును. అప్రథమాసామానాధికరణ్యమును చూపుటకై 'పచన్తం చైత్రం పశ్య' అను ద్వితీయాంతపదము ఉదాహరింపబడినది. పచ్ దాతువు ఉభయపది గాన లట్టుకు 'శానచ్' ప్రత్యయము కూడ వచ్చును- 'పచ్ ఆన' అని యుండగా; శప్ప్రత్యయము- 'పచ ఆన' అని యుండగా:-

## 835. ఆనే ముక్ 7.2.82

అదన్తాఙ్గస్య ముగాగమః స్యాత్ ఆనే పరే. పచమానం చైత్రం పశ్య. 'లట్' ఇత్యనువర్తమానే పునర్లడ్గ్రహణాత్ ప్రథమాసామానాధికరణ్యే క్వచిత్. సన్ ద్విజః.

'అఙ్గస్య' అధికారము, 'అతో యే యః' నుండి 'అతః' అనువర్తించును. 'ఆన' అనునది పర మగునపుడు అదంతమగు అంగమునకు 'ముక్' ఆగమము వచ్చును. 'ముక్'లోని ఉకారకకారములు ఇత్సంజ్ఞకములు. మకారము

మిగులును. కిత్తు గాన అంతావయవముగ వచ్చును. 'పచమాన' అను ప్రాతిపది కము సిద్ధించినది.

భ్వాదిధాతువులకు శప్, దివాదిధాతువులకు శ్యన్, తుదాదిధాతువులకు 'శ' చురాదిధాతువులకు 'అయ' చేరును గాన ఈ ధాతువులకంటె శానచ్ చేర్చినపుడు ముగాగమము వచ్చును. ఇతరధాతువులకు రాదు.

'వర్తమానేలట్' అను పూర్వసూత్రమునుండి 'లట్' అను పదమును అనువర్తింపచేసికొని దానిని షష్ఠ్యంతముగ మార్చుకొనుటకు వీలున్నను మరల ఈ సూత్రమునందు 'లటః' అని ప్రయోగించుటచే, ఇచట చెప్పబడిన దానికంటె అధికకార్యము వచ్చు నని సూచింపబడుచున్నది. అందుచే ప్రథమాసామానాధి కరణ్య మున్నపుడుగూడ శతృశానచ్ప్రత్యయములు చేర్చవచ్చును. అందుచే "సన్ ద్విజః" (మంచి ద్విజుడు) ఇత్యాదిప్రయోగములు సాధింపబడును. 'సన్' అనునది శత్రంత మగు అసధాతువు రూపము.'అస్ అత్' అని యుండగా 'శ్నసోరల్లోపః' అను సూత్రముచే (577) అకారలోపము. 'సత్' అను ప్రాతి పదిక సిద్ధించును. దాని ప్రథమైకవచనరూపము 'సన్'.

836. విదేః శతుర్వసుః 7.1.36

వేత్తేః పరస్య శతుర్వసురాదేశో వా. విద్వాన్; విదన్.

విదధాతువుకంటె పర మగు శతృప్రత్యయమునకు 'వస్'అను నాదేశము వచ్చును.

విద్వాన్; విదన్:- విద్ధాతువుకంటె పర మగు లట్కు 'శతృ'ప్రత్య యము-'విద్ అత్'అని యుండగా ఈ సూత్రముచే 'వస్'ఆదేశము-విద్వస్- 'విద్వస్'అను ప్రాతిపదిక సిద్ధించును. 'విద్వాన్' దానిప్రథమైకవచన రూపము. 'వసు'ఆదేశము రాని పక్షమున 'పచన్'వలె 'విదన్'అను రూపము సిద్ధించును.

837. తౌ సత్. 3.2.127

తౌ శతృశానచౌ సత్సంజ్ఞౌ స్తః.

శతృశానచ్ప్రత్యయములకు 'సత్' అని పేరు.

838. ల్రుటః సద్వా. 3.3.14

వ్యవస్థితవిభాషేయమ్. తేనాప్రథమాసామానాధికరణ్యే, ప్రత్య యోత్తరపదయోః, సమ్బోధనే లక్షణహేత్వోశ్చ నిత్యమ్. కరిష్యన్తం కరిష్యమాణం పశ్య.

లృట్ యొక్క స్థానమున సత్ప్రత్యయములు (శతృశానచ్ప్రత్యయములు) వికల్పముగ వచ్చును.

ఇది వ్యవస్థితవిభాష. అనగా దీనిచే విధింపబడిన కార్యము కొన్ని లక్ష్యములందు నిత్యముగ ప్రవర్తించును; కొన్ని లక్ష్యములందు ప్రవర్తింపదు. ఇట్లు వ్యవస్థితవిభాష యగుటచే, ప్రథమాన్తముతో సామానాధికరణ్యము లేనపుడును, ప్రత్యయోత్తరపదములు పర మగునపుడును, సంబోధనమునందును, లక్షణహేత్వర్థములందును ధాతువుకంటె పర మగులృట్టునకు ఈ ప్రత్యయములు నిత్యముగ ఆదేశము లై వచ్చును.

కరిష్యన్తమ్-కరిష్యమాణమ్:-కృధాతువు ఉభయపది గాన దానికంటె పర మగు లృట్ స్థానమున 'శతృ' 'శానచ్' ప్రత్యయములు ఆదేశములుగ వచ్చినవి. 'స్యతాసీల్లృలుటోః'అను సూత్రముచే (405) 'స్య' ప్రత్యయము, దానికి ఇడాగమము, సకారమునకు షకారము చేయగా 'కరిష్యత్' 'కరిష్యమాణ' అను ప్రాతిపదికములు సిద్ధించినవి. అప్రథమాసామానాధికరణ్యమును సూచించుటకై ద్వితీయాంతోదాహరణము లీయబడినవి.

సంబోధనాద్యర్థములందు లృట్టును విధించు సూత్రములు సిద్ధాంతకౌముది లకారార్థప్రకరణమునం దీయబడినవి.

839 ఆక్వేస్తచ్ఛీలతద్ధర్మతత్సాధుకారిషు. 3.2.134

క్విపమభివ్యాప్య వక్ష్యమాణాః ప్రత్యయాః తచ్ఛీలాదిషు కర్తృషు బోధ్యాః.

ఇది మొదలు క్విప్ప్రత్యయము వరకును గల ప్రత్యయములు తచ్ఛీలుడు, తద్ధర్ముడు, తత్సాధుకారి యగు కర్త అను నర్థమునందు వచ్చును.

ఇచట ఆఙ్ అభివిధ్యర్థకము. అందుచే 'ఆక్వేః' అనగా క్విప్ప్రత్యయముతోసహా అని యర్థము. తచ్ఛీలుడు అనగా అది స్వభావముగా కలవాడు, అనగా ఫలాపేక్ష లేక స్వభావతః ప్రవర్తించువాడు అని యర్థము. తద్ధర్ముడనగా అది నా ధర్మ మని ప్రవర్తించువాడు. తత్సాధుకారి యనగా ధాత్వర్థ మగు ఆ వ్యాపారమును బాగుగ చేయువాడు అని యర్థము. సోపసర్గములగు ధాతువులకంటె తాచ్ఛీలికప్రత్యయములు సాధారణముగ రావని భాష్యకారులు చెప్పియున్నారు.

### 840. తృన్. 3.2.135

కర్తా కటాన్.

పైన జెప్పిన తాచ్ఛీల్యాద్యర్థములందు ధాతువుకంటె తృన్ ప్రత్యయము వచ్చును.

కర్తాకటాన్:- కృఞ్ధాతువుకంటె ఈ సూత్రముచే 'తృన్' ప్రత్యయము- 'కృతృ'. యణాదేశము- 'కర్తృ' అను రూపము సిద్ధించును. ప్రథమైకవచనమున 'ధాతా'వలె 'కర్తా' యను రూప మగును. చాప లల్లెడు స్వభావము కలవాడు, లేదా చాపలల్లుట ధర్మముగ కలవాడు, లేక చాపలల్లుట బాగుగ చేయువాడు అని యర్థము.

### 841. జల్ప, భిక్ష, కుట్ట, లుణ్ట, వృఙః, షాకన్ 3.2.155

పై యర్థములందు జల్ప్, భిక్ష్, కుట్ట్, లుణ్ట్. వృఙ్ అను ధాతువులకంటె 'షాకన్' అను ప్రత్యయము వచ్చును.

### 842. షః ప్రత్యయస్య 1.3.6

ప్రత్యయస్యాదిః షః ఇత్సంజ్ఞః స్యాత్. జల్పాకః, భిక్షాకః; కుట్టాకః. లుణ్టాకః. వరాకః - వరాకీ.

'ఆదిర్ఞిటుడవః' 'ఉపదేశేఽజనునాసిక ఇత్' నుండి 'ఆదిః' 'ఇత్' అను వర్తించును. ప్రత్యయమునకు ఆదియం దున్న షకారము ఇత్సంజ్ఞక మగును. ఈ సూత్రముచే షకారమునకును, హలంత్యసూత్రముచే (1) నకారమునకును ఇత్సంజ్ఞ. ఇక 'ఆక' మిగులును. జల్ప మొదలగు ధాతువులకు ఈ షాకన్ ప్రత్యయము చేర్చుటచే 'జల్పాకః' ఇత్యాది రూపము లగును. జల్పాకః-వదరుబోతు. కుట్టాకః-ఛేదించెడు, లేక భయపెట్టెడు స్వభావముకలవాడు. లుణ్టాకః-దోచెడు స్వభావముకలవాడు. వరాకః- కోరెడుస్వభావము గలవాడు. దీనుడు. 'షాకన్' షిత్తుగాన స్త్రీలింగమున 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచే (1254) 'ఙీష్' వచ్చి 'వరాకీ' ఇత్యాది రూపము లగును.

### 843. సనాశంసభిక్ష ఉః 3.2.168

చికీర్షుః. ఆశంసుః. భిక్షుః.

సన్నంతధాతువులకంటెను, ఆఙ్ పూర్వకశాస్ధాతువుకంటెను, భిక్ష్ధాతువుకంటెను, పై యర్థములందు 'ఉ'ప్రత్యయము వచ్చును.

చికీర్షుః:- (చేయనిచ్ఛయించువాడు) 'చికీర్ష' అను సన్నంతధాతువు కంటె ఉప్రత్యయము- 'చికీర్ష ఉ' అని యుండగా 'అతో లోపః' అను సూత్రముచే (472) అకారమునకు లోపము- 'చికీర్షు' అను ప్రాతిపదికము సిద్ధించినది. ఇట్లే 'ఆశంసుః' (కోరెడు స్వభావముకలవాడు)'భిక్షుః' (బిచ్చ మెత్తెడు స్వభావము కలవాడు) అను రూపములు సిద్ధించును.

844. భ్రాజ, భాస, దుర్వి, ద్యుతోర్జి, పృ, జు, గ్రావస్తువః క్విప్ 3.2.177

విభ్రాట్. భాః.

భ్రాజ్, భాస్. ధుర్వి, ద్యుత్, ఊర్జి, పౄ, జు, గ్రావస్తు అను ఎనిమిది ధాతువులకంటెను, తచ్ఛీలాది కర్త్రర్థమున క్విప్ ప్రత్యయము వచ్చును.

విభ్రాట్:- విపూర్వక మగు 'భ్రాజదీప్తౌ' అను ధాతువుకంటె ఈ సూత్రముచే క్విప్ ప్రత్యయము, ఇది సర్వలోపి. 'విభ్రాజ్' అను ప్రాతిపదికము సిద్ధించినది. ప్రథమైకవచనమున "వ్రశ్చభ్రస్జ"- ఇత్యాదిసూత్రముచే(308) జకారమునకు షకారము, దానికి జశ్త్వముచే డకారము, దానికి చర్త్వవికల్పము, సుప్రత్యయమునకు హల్ఙ్యాదిసూత్రముచే (179) లోపము- 'విభ్రాట్'. భాః:- భాస్ధాతువుకంటె క్విప్ప్రత్యయము. ప్రథమైకవచనప్రత్యయమునకు (స్) హల్ఙ్యాదిలోపము. (179) సకారమునకు రుత్వవిసర్గములు- 'భాః' ధుర్వి (ధుర్వ్) ధాతువునకు క్విప్ప్రత్యయము. 'ధుర్వ్' అని యుండగా:-

845. రాల్లోపః 6.4.21

రేఫాత్ ఛ్వోర్లోపః క్వౌ, ఝలాదౌ క్ఙితి చ. ధూః. విద్యుత్. ఊర్క్. పూః. దృశిగ్రహణస్యాపకర్షాద్ జవతేర్దీర్ఘః. జూః. గ్రావస్తుత్.

'ఛ్వోఃశూడనునాసికే చ' నుండి 'ఛ్వోః', "అనునాసికస్య క్విఝలోః క్ఙితి" నుండి 'క్విఝలోః' 'క్ఙితి' అను పదములను అనువర్తించును. క్విప్ప్రత్యయము గాని, ఝలాది కిత్ ఙిత్ ప్రత్యయములుగాని పరమగునపుడు, రేఫకంటె పర మగు ఛకారవకారములకు లోపమువచ్చును.

'క్ఙితి' అను పదము ఈ సూత్రము వెనుక నున్న సూత్రములోనికి అనువర్తింప లేదు గాన దీనిలోనికి కూడ అనువర్తింప దను నుద్దేశముతో, సిద్ధాంత

కౌముదిలో 'ఛ్వోశ్శూడనునాసికే చ' అను సూత్రమునుండి 'అనునాసికే' అను పదమును అనువర్తింపచేసికొని 'క్ఙితి ప్రత్యయే' అనుటకు బదులు "అనునాసికాదౌ ప్రత్యయే" అని వ్యాఖ్యానింపబడినది. లఘుకౌముదీకారుడు మండూకప్లుతిచే 'క్ఙితి' అనుదానిని అనువర్తింపచేసికొనె ననితెలియుచున్నది.

'ధుర్వ్' అనుదానిలోని వకారమునకు ఈ సూత్రముచే లోపము- 'ధుర్' అను ప్రాతిపదికము సిద్ధించినది. దాని ప్రథమైకవచనమున 'సు'కు హల్ఙ్యాది లోపము, (179) "ర్వోరుపధాయాదీర్ఘ ఇకః" అను సూత్రముచే (352) ఉపధా దీర్ఘమునువచ్చి విసర్గము చేసిన పిమ్మట 'ధూః' అను పదము సిద్ధించినది.

విద్యుత్:- (మెరుపు). విపూర్వకద్యుత్ ధాతువుకంటె క్విప్ప్రత్యయము. దానికిలోపము. ప్రథమైకవచనమున సుకు హల్ఙ్యాదిలోపము (179) 'విద్యుత్'. ఊర్క్:- (బలవంతుడు). ఊర్జ్ధాతువుకంటె క్విప్ప్రత్యయము. ప్రథమైకవచనమున హల్ఙ్యాదిలోపము చేసిన పిమ్మట జకారమునకు కుత్వము (సూ-307). దానికి చర్త్వవికల్పము- 'ఊర్క్' 'ఊర్గ్'. 'రాత్సస్య' అను నియమసూత్రము (209) ఉండుటచే 'ఊర్జ్' అనునపుడు "సంయోగాన్తస్య లోపః" అను సూత్రముచే (20) జకారము లోపింప లేదు.

పూః:- పౄధాతువుకంటె క్విప్ప్రత్యయము. అది పూర్తిగ లోపించిన పిమ్మట 'ఉదోష్ఠ్యపూర్వస్య' అను సూత్రముచే (634) ౠకారమునకు 'ఉర్' వచ్చి 'పుర్' అను ప్రాతిపదికము సిద్ధించును. ప్రథమైకవచనమున 'ధూః' వలె 'పూః' అను రూపము సిద్ధించును.

జూః-(రోగి). జుధాతువుకంటె 'క్విప్'. అది లోపించిన పిమ్మట 'జు' అని యుండగా దీనికి దీర్ఘము వచ్చు విధానము చెప్పబడుచున్నది-

ఈ సూత్రము తరువాత "అన్యేభ్యోఽపి దృశ్యతే" 3.2.178 అను సూత్ర మున్నది. దానినుండి 'దృశ్యతే' అను పదము ఈ సూత్రములోనికి అపకర్షింపబడును. అందుచే క్విప్ప్రత్యయమే కాక కార్యాంతరము కూడ వచ్చునని యర్థము లభించును. ఈ విధముగ 'జు'లోని ఉకారమునకు దీర్ఘము వచ్చి 'జూ' అను ఊకారాంత శబ్దము లభించును. ప్రథమైకవచనమున 'జూః' అను రూపము సిద్ధించును. గ్రావస్తుత్:- గ్రావశబ్దమునకు స్తు ధాతువుతో సమాసముకూడ సూత్రమునందు నిపతింపబడినది. 'గ్రావస్తు' అను దానికంటె క్విప్ప్రత్యయము. క్విప్పుకు లోపము. తుగాగమము (సూ 780)- 'గ్రావస్తుత్'.

వా. క్విబ్వచి, ప్రచ్ఛ్యాయతస్తు, కటప్రు, జు, శ్రీణాం దీర్ఘోఽసమ్ప్రసారణఞ్చ.

వక్తి ఇతి వాక్.

వచ్ పృచ్ఛ్ధాతువులకంటెను, ఆయతపూర్వక మగు స్తుధాతువుకంటెను, 'కట'పూర్వక మగు ప్రుధాతువుకంటెను జు, శ్రీధాతువులకంటెను క్విప్ప్రత్యయమును, దీర్ఘమును వచ్చును; సంప్రసారణము రాదు. ఈ వార్తికముచే దీర్ఘము అన్ని ధాతువులకును వచ్చును. సంప్రసారణము వచ్చుటకవకాశ మున్నవి 'వచ్' ప్రచ్ఛధాతులు రెండే గాన సంప్రసారణనిషేధము వాటికి మాత్రమే వర్తించును.

వాక్:- 'వక్తి' (చెప్పునది) అను నర్థమున వచ్ధాతువుకంటె ఈ వార్తికముచే 'క్విప్'ప్రత్యయము. ధాతువునందలి అకారమునకు దీర్ఘము-'వాచ్' అను ప్రాతిపదికము సిద్ధించును. ప్రథమైకవచనమున కుత్వ, (సూ-307)సులోపములు- 'వాక్'. 'వచిస్వపియజాదీనాం కితి' అను సూత్రముచే (550) సంప్రసారణము రావలసి యుండ అది నిషేధింపబడినది.

ప్రచ్ఛధాతువుకంటె 'క్విప్'ప్రత్యయము, దీర్ఘము; "గ్రహిజ్యా" ఇత్యాది సూత్రముచే (637) రావలసి యున్న సంప్రసారణము నిషేధింపబడినది.— 'ప్రాచ్ఛ్' అని యుండగా-

846. చ్ఛ్వోః శూడనునాసికే చ 6.4.19

సతుక్కస్య ఛస్య వస్య చ క్రమాత్ 'శ' 'ఊఠ్' ఇత్యాదేశౌ స్తః అనునాసికే క్వౌ, ఝలాదౌ చ క్ఙితి. పృచ్ఛతీతి ప్రాట్. ఆయతంస్తౌతి- ఆయతస్తూః. కటం ప్రవతే కటప్రూః. జూః ఉక్తః. శ్రయతి. హరిం శ్రీః.

'అనునాసికస్య క్విఝలోః క్ఙితి'నుండి 'క్విఝలోః' 'క్ఙితి' అనువర్తించును. 'చ్ఛ్వోః'అనునపుడు ఛకారమునకు వెనుక నున్న తుగాగమరూపతకారమునకు శ్చుత్వము చేసి నిర్దేశము చేయబడినది. అనునాసికము గాని, క్విప్ప్రత్యయములు గాని పర మగునపుడు, తుగాగమసహిత మగు ఛకారమునకును, వకారమునకును క్రమముగ 'శ్' 'ఊఠ్' అనునాదేశములు వచ్చును.

ఈ సూత్రముచే 'ప్రాచ్ఛ్' లోని 'చ్ఛ' అను దానికి క్విప్ప్రత్యయము పరముగ నున్నది గాన శకారాదేశము వచ్చి 'ప్రాశ్' అను ప్రాతిపదికము సిద్ధిం

చును. శకారమునకు 'వ్రశ్చభ్రస్జ' ఇత్యాదిసూత్రముచే (308) షకారము. దానికి జశ్త్వముచే డకారము. దానికి చర్త్వవికల్పముచే, ప్రథమైకవచనమున 'ప్రాట్' 'ప్రాడ్' అను రూపద్వయము సిద్ధించును. ప్రశ్నించువాడు అని యర్థము.

ఆయతస్తూః:- ఆయతం స్తౌతి - విస్తృతముగా వర్ణించువాడు; ఈ వార్తికముచే క్విప్‌దీర్ఘములు, ప్రథమైకవచనమున 'ఆయతస్తూః' అను రూపము సిద్ధించినది. కటప్రూః:- కటం ప్రవతే- చాపలు అల్లువాడు పైవలెక్విప్‌దీర్ఘములు. 'జూః' ఎట్లు సిద్ధించునో భ్రాజభాసేత్యాది సూత్రముక్రింద చూపబడినది. అనగామరల జుధాతువును ఈ వార్తికమునందు చేర్చుట అనావశ్యక మని భావము.

శ్రీః:- శ్రయతి హరిమ్- విష్ణువును ఆశ్రయించునది- అను నర్థమున ఈ వార్తికముచే క్విప్ప్రిత్యయదీర్ఘములు. 'శ్రీ' యను ఈకారాంత ప్రాతిపదికము సిద్ధించినది. ఇందలి ఈకారము సహజముగ నున్నదే గాని జీబాదిస్త్రీప్రత్యయములను చేర్చుటచే వచ్చినది కాదు. అందుచే ప్రథమైకవచన మగు 'సు' కు హల్ఙ్యాదిసూత్రముచే (179) లోపము రాదు. రుత్వవిసర్గలు చేయగా 'శ్రీః' అను రూపము సిద్ధించినది.

847. దామ్నీ, శస, యు, యుజ, స్తు, తుద, సి, సిచ, మిహ, పత, దశ, నహః కరణే. 3.2.182

దాబాదేః ష్ట్రన్ స్యాత్ కరణేఽర్థే. దాత్యనేన దాత్రమ్, నేత్రమ్.

దాప్, నీ, శస్, యు, యుజ్, స్తు, తుద్, సి, సిచ్, మిహ్, పత్, దశ్, నహ్ అను ధాతువులకంటె కరణార్థమున 'ష్ట్రన్' ప్రత్యయము వచ్చును. 'ష్ట్రన్' లోని షకారనకారములు ఇత్సంజ్ఞకములు. షకారము లోపించుటతో తన్నిమిత్తక మగు (ష్టుత్వముచే వచ్చిన) టకారము పోయి దాని స్థానియగు తకారము వచ్చును. "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః". 'త్ర' మిగులును.

దాత్రమ్:- దాతి అనేన- దీనితో కోయును- అనగా కోయుటకు సాధనమైనది- అని యర్థము, కొడవలి. దాప్ ధాతువుకంటె ఈసూత్రముచే 'ష్ట్రన్' ప్రత్యయము చేయగా 'దాత్ర' అను ప్రాతిపదికము సిద్ధించినది.

నేత్రమ్:- నయతి అనేన అను నర్థమున నీఞ్ ధాతువుకంటె ష్ట్రన్ ప్రత్యయము. గుణము- (సూ-390). 'నేత్ర' అను ప్రాతిపదికము సిద్ధించినది. రూపాదివిషయములు దేనిని సాధనముగ చేసికొని మానవుని తమవద్దకు తీసికొని వచ్చునో అది యని యర్థము- కన్ను.

848. తి, తు, త్ర, త, థ, సి, సు, సర, క, సేషు చ 7.2.9

ఏషాం దశానాం కృత్ప్రత్యయానాం ఇణ్ న. శస్త్రమ్. యోత్రమ్. యోక్త్రమ్. స్తోత్రమ్. తోత్త్రమ్. సేత్రమ్. సేక్త్రమ్. మేఢ్రమ్, పత్త్రమ్-దంష్ట్రా-. నద్ధ్రీ.

'నేడ్వశి కృతి' అను సూత్రము అనువర్తించును. తి, తు, త్ర, త, థ, సి, సు, సర, క, స అను ఈ పది కృత్ప్రత్యయములకును ఇడాగమము రాదు.

'క్తిన్', 'క్తిచ్' ప్రత్యయములలో 'తి' అనునదియు, 'తున్' ప్రత్యయములలో 'తు' అనునదియు, 'ష్ట్రన్'లో 'త్ర' అనునదియు, 'తన్'లో 'త' అను నదియు, 'క్థన్'లో 'థ' అనునదియు, 'క్సి'లో 'సి' అనునదియు, 'కన్'లో 'క' అనునదియు, 'సరన్'లో 'సర' అనునదియు, మిగులును. ఈ ఎనిమిదియు 'స' 'సు' ప్రత్యయములును వలాద్యార్ధధాతుకములగాన ఇవి సేడ్ధాతువులకంటె పరమైనపుడు ఇడాగమము రావలసి యుండగా ఈ సూత్రముచే నిషేధింపబడినది. వీటిలో కొన్ని ఉణాదిప్రత్యయములు.

శస్త్రమ్:- 'శసన్తి అనేన' అను నర్థమున ఈ సూత్రముచే 'ష్ట్రన్' ప్రత్యయము. 'శస్త్ర' అను ప్రాతిపదికము సిద్ధించినది, హింసాసాధనమగు ఆయుధము. యోత్రమ్:- యువన్తి అనేన- దీనిచే కట్టుదురు గాన యోత్రము -త్రాడు. యుధాతువుకంటె 'ష్ట్రన్' ప్రత్యయము చేసిన పిమ్మట గుణము. యోక్త్రమ్:- యుఞ్జన్తి అనేన- త్రాడు 'యుజ్'ధాతువుకంటె 'ష్ట్రన్' ప్రత్యయము చేర్చిన పిదప గుణ (సూ-453) కుత్వచర్త్వములు. స్తోత్రమ్:- స్తువన్తి అనేన. స్తుధాతువునకు ష్ట్రన్ప్రత్యయము చేర్చిన పిదప గుణము. తోత్రమ్:- తుదన్తి అనేన. అశ్వాదులను పీడించుటకు (తోలుటకు) సాధనమైన కొరడా. తుద్ధాతువుకంటె 'ష్ట్రన్'ప్రత్యయము. లఘూపధగుణము. దకారమునకు చర్త్వముచే తకారము. దానికి "ఝలోఝలిసవర్ణే" అను సూత్రముచే (73) వైకల్పికలోపము. సేత్రమ్:- సిన్వన్తి అనేన- దీనిచే కట్టుదురు, అను నర్థమున 'షిఞ్' ధాతువుకంటె ష్ట్రన్ప్రత్యయము, గుణము- కట్టెడుత్రాడు. సేక్త్రమ్:- సిఞ్చన్తి అనేన- దీనితో తడుపుదురు- అనునర్థమున షిచ్ ధాతువుకంటె ష్ట్రన్ప్రత్యయము. ఉపధాగుణము. చకారమునకు కుత్వము- 'సేక్త్రమ్' తడిపెడు పాత్రము. మేఢ్రమ్:- 'మేహతి అనేన'- దీనితో తడుపును- అను నర్థమున 'మిహ సేచనే' అను ధాతువుకంటె 'ష్ట్రన్'ప్రత్యయము 'మిహ్త్ర'

అని యుండగా గుణము; 'హోఢః' అనుసూత్రముచే (251) 'హ' కారమునకు ఢకారము. తకారమున 'ఝష స్తథోర్ధోఽధః' అనుసూత్రముచే (552) ధత్వము. దానికి ష్టుత్వముచే ఢత్వము. 'మేఢ్ఢ్రమ్' అని యుండగా 'ఢోఢేలోపః' అను సూత్రముచే (553) మొదటిఢకారమునకు లోపము- 'మేఢ్ర' అను ప్రాతిపది కము సిద్ధించినది. పత్త్రమ్:- పత న్తి అనేన- దీనిచే పరువెత్తుదురు- అను నర్థమున పతధాతువుకంటె ష్ట్రన్ ప్రత్యయము చేర్పుటచే నేర్పడినది. వాహనము. దంష్ట్రా:- దంశ న్తి అనయా'- దీనితో కొరికెదరు- అను నర్థమున (కోర) దంశధాతువుకంటె ష్ట్రన్ ప్రత్యయము. 'దంశ్ త్ర' అని యుండగా 'వశ్చభ్రస్జ' -ఇత్యాదిసూత్రముచే (308) శకారమునకు షత్వము. ష్టుత్వముచే తకారమునకు టకారము. స్త్రీలింగమున 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) 'టాప్' వచ్చి 'దంష్ట్రా' అను రూపము సిద్ధించును. షిత్కార్యము అనిత్యమగుటచే 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచే (1254) జీష్‌రాలేదు. నద్ధ్రీ:- నహ్య న్తి అనయా- దీనితో కట్టుదురు- అను నర్థమున నహ ధాతువుకంటె ష్ట్రన్ ప్రత్య యము. 'నహో ధః' అను సూత్రముచే (360) హకారమునకును, ఝష స్తథో ర్ధోఽధః' అను సూత్రముచే (552) తకారమునకును ధకారములు. 'నధ్ ధ్ర' అని యుండగా 'ఝలాంజశ్ ఝశి' అనుసూత్రముచే (19) మొదటిధకారమునకు జ శ్త్వము. ష్ట్రప్రత్యయము షిత్తు గాన 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచే (1254) జీష్- 'నద్ధ్రీ' అను స్త్రీలింగప్రాతిపదికము సిద్ధించినది. చర్మరజ్జువు అని యర్థము,

849. అ ర్తి, లూ, ధూ, సూ, ఖన, సహ, చర ఇత్రః 3.2.184

అరిత్రమ్. లవిత్రమ్. ధవిత్రమ్. సవిత్రమ్. ఖనిత్రమ్, సహి త్రమ్. చరిత్రమ్.

'ఋ, లూ, ధూ, సూ, ఖన్, సహ్, చర్ ధాతువులకంటె కరణార్థమున 'ఇత్ర' అను ప్రత్యయము వచ్చును. అరిత్రమ్:- 'ఋచ్ఛతి-గచ్ఛతి అనేన' అను నర్థమున ఋధాతువుకంటె ఈ సూత్రముచే 'ఇత్ర' ప్రత్యయము. 'ఋఇత్ర' అని యుండగా 'ఇత్ర' అనునది ఆర్ధధాతుకము గాన "సార్వధాతుకార్ధధాతుక యోః" అను సూత్రముచే (390) ఋకారమునకు గుణము- (అర్). 'అరిత్ర' అను ప్రాతిపదికము సిద్ధించినది. ఇత్రప్రత్యయాంతములు సాధారణముగ నపుంసకలింగమున ప్రయోగింపబడును. లవిత్రమ్:- లూధాతువుకంటె 'లునాతి

అనేన' -దీనితోకోయును-అను నర్థమున ఇత్రప్రత్యయము. గుణావాదేశములు. కొడవలి. ధవిత్రమ్:- 'ధువన్తి అనేన'- 'దీనిచే విసురుకొందురు- అను నర్థమున 'ధూఞ్' ధాతువుకంటె, ఇత్రప్రత్యయ గుణావాదేశములు. విసనకఱ్ఱ. సవిత్రమ్:- 'సువన్తిఅనేన' దీనిచే ప్రేరేపింతురు- అను నర్థమున తౌదాదిక మగు షూధాతువుకంటె 'ఇత'ప్రత్యయము చేర్చగా పై వలెనే రూపము సిద్ధించును. ప్రేరణసాధనము. ఖనిత్రమ్:- 'ఖనన్తి అనేన'- 'దీనితో త్రవ్వుదురు' అను నర్థమున ఖన్ధాతువునకు ఇత్రప్రత్యయము. గునపము. సహిత్రమ్:- 'సహన్తి అనేన'- దీనితో సహింతురు- అను నర్థమున సహ్ధాతువుకంటె ఇత్ర ప్రత్యయము. ఇంటికప్పు మొదలగునది. చరిత్రమ్:- 'చరన్తి అనేన'అను నర్థమున చర్ధాతువుకంటె ఇత్ర ప్రత్యయము. నడవడిక.

850. పువః సంజ్ఞాయామ్ 3.2.185

పవిత్రమ్. ఇతి పూర్వకృదన్తమ్.

పూఞ్ధాతువుకంటె కరణార్థమున, సంజ్ఞావాచక మగునపుడు ఇత్రప్రత్యయము వచ్చును.

పవిత్రమ్:- 'పూ'ధాతువుకంటె 'పునన్తి ఆజ్యాదికం అనేన' దీనితో నేయిమొదలగువాటిని పవిత్రము చేయుదురు- అను నర్థమున ఇత్రప్రత్యయము. గుణావాదేశములు. దర్భనిర్మిత మగు ఒక వస్తువునకు పేరు. ఇది యజ్ఞాది పవిత్రకర్మలు చేయువారు అనామికయందు ధరింతురు.

పూర్వకృదంత ప్రకరణము సమాప్తము.

# అథోణాదయః

(ఉ.సూ.) కృ, వా, పా, జి, మి, స్వది, సాధ్యశూభ్యఉణ్.

కరోతీతి కాయః. వాతీతి వాయుః. పాయుః గుదమ్. జాయుః ఔషధమ్. మాయుః పిత్తమ్. స్వాదుః. సాధ్నోతి పరకార్యమితి సాధుః. ఆశు శీఘ్రమ్.

ఉణాదిసూత్రములు మొత్తము ఏడువందల నలుబది ఎనిమిది. ఇవి ఐదు పాదములలో విభజింపబడినవి. ఇవి పాణినివిరచితములు కావనియు శాకటాయనముని రచితము లనియు భాష్యకారాదుల అభిప్రాయము. ఈ విషయమును, 'ఉణాదయో బహులమ్' అను సూత్రము క్రింద నున్న "నామ చ ధాతుజమాహ నిరుక్తే వ్యాకరణే శకటస్య తోకమ్"అను వార్తికమును వ్యాఖ్యానించుచు భాష్యకారులు స్పష్టీకరించి యున్నారు. మహాభాష్య వ్యాఖ్యాత యగు కైయటుడు గూడ "శాస్త్రాంతరపఠితము లగు ఉణాదులకు సాధుత్వమును అంగీకరించుటకై 'బహులమ్' అను పదము ('ఉణాదయో బహులమ్' అను సూత్రమున) ప్రయోగింపబడినది" అని వ్రాయుచు ఈ విషయమునే సూచించి యున్నాడు.

ఉణాది ప్రత్యయములు అవ్యుత్పన్నప్రాతిపదికములే యని పాణిని యభిప్రాయము. (ప్రకృతిప్రత్యయ విభాగము చూపుటకు వీలుగ నున్నవి వ్యుత్పన్న శబ్దములు; తద్భిన్నములు అవ్యుత్పన్నములు). కావుననే 'ఆదేశప్రత్యయయోః' అను సూత్రవ్యాఖ్యానావసరమున భాష్యకారులు, ఉణాదులు అవ్యుత్పన్న ప్రాతిపదికములు కదా?, (ఉణాదయోహ్యవ్యుత్పన్నాని ప్రాతిపదికాని); అపుడు 'సర్పిషా' 'యజుషా' ఇత్యాదులలోని సకారము ప్రత్యయావయవము కాదు గాన షత్వము ఎట్లు వచ్చును? అని శంకించి బహులగ్రహణముచే వాటికి ప్రత్యయత్వము అంగీకరించి షత్వమును సాధించెను ('సర్పిస్' 'యజుస్' శబ్దములు 'ఇస్' (ఉ.సూ.265) 'ఉస్' (ఉ.సూ-274) అను ఔణాదికప్రత్యయములను చేర్చుటచే సిద్ధించినవి). దీనిని బట్టి కూడ ఉణాదిసూత్రములు పాణిని రచితములు కావనియు, ఆయనదృష్టిలో ఇవి అవ్యుత్పన్నప్రాతిపదికము లనియు సూచితమగుచున్నది. మరియు 'వాయు' శబ్దమును సాధించుటకు భాష్యకారులు 'కృవాపాజి'- ఇత్యాది ఉణాదిసూత్రమును చూపుటకు బదులు అజ్ధాతువుకంటె 'యు' ప్రత్యయమును, 'అజేర్వ్యఘఞపోః' అను సూత్రముచే ధాతువునకు 'వీ' అనునాదేశమును చేసెను. ఈవిధముగ పాణిని మతము ననుసరించి ఉణాదిప్రత్యయాంతములు అవ్యుత్పన్న ప్రాతిపదికము లైనను, వాటిని వ్యుత్పన్నప్రాతిపదికములుగ భాష్యకారులు అచటచట చూపుట శాస్త్రాంతరానుసార మని శబ్దేందుశేఖరమున స్పష్టీకరింపబడినది.

పైన చూపిన విధముగ ఉణాదులు ఐదు పాదములలో పఠింపబడినవి. ఈ పంచపాదిని ప్రాచీనవైయాకరణులు చాలమంది అంగీకరించిరి. ఇది కాక

పది పాదములు గల మరియొక ఉణాది సూత్రసముదాయము గూడ గలదు. దానిపై కూడ ప్రక్రియాసర్వస్వవ్యాఖ్యాకారు డగు విఠలుడును తదితరులును వ్యాఖ్యానము వ్రాసి యున్నారు. యుధిష్ఠిరమీమాంసకుడు తమ "సంస్కృతవ్యాకరణ శాస్త్ర కా ఇతిహాస్" అను గ్రంథము ద్వితీయభాగమున ఉణాదిపంచపాది ఆపిశలి రచిత మనియు, దశపాది పాణినిప్రోక్త మనియు మొదట సూచించి, చివరకు వాస్తవమున వీటి కర్తలు ఎవరో నిర్ణయించి చెప్పుట కష్టము అని వ్రాసి యున్నారు.

లఘుకౌముదీకారుడు ఈ ప్రకరణమున దిగ్దర్శనమునకై ఒక్క సూత్రమును మాత్రము చూపుచున్నాడు

కృ, వా, పా, జి, స్వద్, సాధ్, అశూధాతువులకంటె కర్త్రర్థమున 'ఉణ్' ప్రత్యయము వచ్చును.

'ఉణ్'లోని ణకారము ఇత్సంజ్ఞకము గాన ఇది పర మగునపుడు యథావకాశముగ 'అచోఞ్ణితి' (182). "అతఉపధాయాః" (457) అను సూత్రములచే వృద్ధి వచ్చుచుండును.

'కరోతి' అను నర్థమున కృ ధాతువుకంటె ఉణ్ ప్రత్యయము. ఋకారమునకు వృద్ధి (ఆర్)-ప్రథమైకవచనమున 'కారుః' అను రూపము సిద్ధించినది. వాయుః:- (వీచునది). వాధాతువుకంటె ఉణ్. "ఆతోయుక్చిణ్కృతోః" అను సూత్రముచే (760) యుగాగమము- 'వాయుః'. పాయుః:- పాధాతువుకంటె ఉణ్ ప్రత్యయము. పైవలె యుగాగమము- 'పాయుః'. గుదస్థానము. జాయుః- జిధాతువుకంటె 'ఉణ్' చేర్చిన పిదప, వృద్ధి, ఆయాదేశములు- 'జాయుః'. "జయతిరోగాన్"- రోగములను జయించు ఔషధము. మాయుః:- మిధాతువుకంటె ఉణ్; వృద్ధి, అయాదేశములు. 'మినోతి, ప్రక్షిపతి, ఊష్మాణం దేహే'- దేహమునందు వేడిమిని ప్రసరింప చేయునది- పిత్తము. స్వాదుః:- స్వద్ధాతువుకంటె 'ఉణ్' ప్రత్యయము; వృద్ధి, 'స్వదతేఇతి'- రుచించునది. సాధుః:— 'సాధయతి పరకార్యమ్'- ఇతరుల కార్యములను సాధించువాడు- అనునర్థమున సాధ్ ధాతువుకంటె ఉణ్ ప్రత్యయము. ఆశుః:- 'అశ్నుతే, వ్యాప్నోతి'— వ్యాపించునది- అను నర్థమున 'అశ్' దాతువుకంటె 'ఉణ్' ప్రత్యయము. 'ఆశు' అనునది 'శీఘ్రముగా' అను నర్థమున అవ్యయము. 'శీఘ్రత్వముకలది' అను నర్థమున మూడులింగములందును ఉండును.

851. ఉణాదయో బహులమ్ 3.3.1

ఏతే వర్తమానే సంజ్ఞాయాఞ్చ బహులం స్యుః. కేచిత్ అవిహితా అప్యూహ్యాః.

సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే,
కార్యాద్విద్యాదనూబన్ధం ఏతచ్ఛాస్త్రముణాదిషు
ఇత్యుణాదయః.

'వర్తమానే లట్' 'పువః సంజ్ఞాయామ్'నుండి 'వర్తమానే' 'సంజ్ఞాయామ్' అనువర్తించును. ఉణాదిప్రత్యయములు వర్తమానార్థమునందు బహులముగ వచ్చును. ఈ ప్రత్యయములను చేర్చుటచే నేర్పడిన పదములు సంజ్ఞావాచకములుగ- రూఢ పదములుగ నుండును. అనగా 'కారుః' ఇత్యాదిపదములకు 'కరోతి' ఇత్యాదివ్యుత్పత్త్యర్థములు చూపబడినను, రూఢపదములవలె 'శిల్పి' మొదలగు అర్థవిశేషములందు మాత్రమే ప్రయోగింపబడును.

'వా'అనుటకు బదులు 'బహులమ్' అనుటచే ఈ సూత్రములచే విధింపబడని ప్రత్యయము లేవైన యున్నచో వాటిని ఊహించుకొనవలె నని యర్థము. ఈ యర్థమునే భాష్యమునందలి కారిక స్పష్టీకరించుచున్నది:-

"'డిత్థః' "డవిత్థః" ఇత్యాది సంజ్ఞావాచకములలో ప్రకృతిభూతము లగు ధాతువులను, వాటికంటె పర మగు ప్రత్యయములను యథాసంభవముగ ఊహించుకొనవలెను. ఆ పదములలో కానవచ్చెడి గుణనిషేధాదికార్యములను బట్టి ఆ ప్రత్యయములలో కకారజకారాదులు ఇత్సంజ్ఞకము లనెడు విషయమును ఊహింపవలెను. ఇదియే ఉణాదిప్రత్యయముల విషయమున అనుసరింపదగిన నియమము".

ఏదైన ఒక పదమునందు పూర్వభాగము ధాతువనియు, మిగిలిన భాగము ప్రత్యయ మనియు, ఆధాతువునందు గుణాదులు రాకున్నచో ఆప్రత్యయము కిత్తుగాని, ఙిత్తుగాని అయి యుండుననియు ఊహించుకొనవలెను.

ఉణాదిప్రకరణము సమాప్తము.

# అథ ఉత్తరకృదన్తమ్

852. తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్ 3.3.10

క్రియార్థాయాం క్రియాయాం ఉపపదే భవిష్యత్యర్థే ధాతోరేతౌ స్తః. మా న్తత్వాదవ్యయత్వమ్. కృష్ణం ద్రష్టుం యాతి. కృష్ణం దర్శకో యాతి.

'భవిష్యతి గమ్యాదయః' నుండి "భవిష్యతి" అనువర్తించును. ఒక క్రియ ప్రయోజనముగా గల మరియొక క్రియను బోధించుధాతువు ఉపపదముగనున్నపుడు, ప్రయోజనభూతక్రియావాచి యగు ధాతువుకంటె, భవిష్యదర్థమున 'తుమున్' 'ణ్వుల్' ప్రత్యయములు వచ్చును.

ఉపపద మనగా సమీపమున నుండునది అని యర్థము. అది వెనుక ఉండవచ్చును, ఎదుట నుండవచ్చును- 'తుమున్'లోని ఉకారనకారములు ఇత్సంజ్ఞకములు, 'తుమ్' అను మకారాంతరూపము మిగులును గాన ఈ ప్రత్యయము చేర్చుటచే నేర్పడిన పదము 'కృన్మేజన్తః' అను సూత్రముచే (370) అవ్యయ మగును 'ణ్వుల్'లోని ణకారలకారములు ఇత్సంజ్ఞకములు.

కృష్ణం ద్రష్టుం యాతి:- కృష్ణుని చూచుటకై వెళ్ళుచున్నాడు. ఇచట గమనక్రియకు (కృష్ణ) దర్శనక్రియ ప్రయోజనము. అందుచే 'యాతి' అనునది ఉపపదముగా నున్నది గాన ప్రయోజన భూతమగు గమనానంతరము జరుగబోవు దర్శన క్రియను బోధించు 'దృశ్' ధాతువునకు ఈసూత్రముచే 'తుమన్' ప్రత్యయము- 'దృశ్ తుమ్' అని యుండగా 'సృజిదృశోర్ఝల్యమకితి'అను సూత్రముచే (647) 'అమ్' ఆగమము 'మిదచో న్త్యాత్పరః' అను సూత్రము (240) ననుసరించి అంత్యాచ్ అగు ఋకారముకంటె పరముగ వచ్చును. "దృ అశ్ తుమ్'- ఋకారమునకు యణాదేశము- "ద్రశ్ తుమ్". "వశ్చభ్రస్జ-" ఇత్యాది సూత్రముచే (308) శకారమునకు షత్వము- 'ద్రష్ తుమ్'. తకారమునకు ష్టుత్వముచే టకారము- 'ద్రష్టుమ్'అను రూపము సిద్ధించినది, ఇట్లే "కృష్ణం దర్శకోయాతి" అనునపుడు 'దృశ్ ధాతువుకంటె ఈ సూత్రముచే 'ణ్వుల్' ప్రత్యయము "యువోరనాకౌ" అను సూత్రముచే (788) అకాదేశము. 'దృశ్ అక' అని యుండగా ఋకారమునకు గుణము (సూ-453) (అర్)- "దర్శ్

అక" 'దర్శక'. దీనికి గూడ "కృష్ణుని చూచుటకై (చూడనున్నవాడై) వెళ్లు చున్నాడు అని యర్థము.

853. కాలసమయవేలాసు తుమున్ 3.3.167

కాలార్థేషూపపదేషు తుమున్. కాలః సమయో వేలా వా భోక్తుమ్.

కాల, సమయ, వేలా పదములు పర్యాయపదములు. అందుచే 'కాలవాచకము లగు పదములు ఉపపదములుగ నున్నపుడు తుమున్ ప్రత్యయము వచ్చును, అను నర్థము సిద్ధించినది.

కాలః, సమయః, వేలా వా భోక్తుమ్:- ఈ యుదాహరణమున కాలాదిశబ్దములు ఉపపదములుగ నుండుటచే 'భుజ్'ధాతువుకంటె 'తుమున్' ప్రత్యయము- "భుజ్ తుమ్" అని యుండగా ఉకారమునకు లఘూపధగుణము; జకారమునకు కుత్వముచే (సూ-208) గకారము; దానికి చర్త్వముచే కకారము- 'భోక్తుమ్'.

854. భావే 3.3.18

సిద్ధావస్థాపన్నే ధాత్వర్థే వాచ్యే ధాతోర్ఘఞ్. పాకః.

సిద్ధావస్థను పొందిన ధాత్వర్థము- అనగా వ్యాపారము- వాచ్య మగు నపుడు ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయము వచ్చును.

ధాతువు లన్నియు సామాన్యరూపమున క్రియను బోధించును. విశేషరూపమున పాకాదిక్రియలను బోధించును. ఉదాహరణమునకు- 'పచ్'ధాతువు సామాన్యరూపమున క్రియను- వ్యాపారమును-, విశేషరూపమున విక్లిత్త్యనుకూలవ్యాపారమును బోధించును. అందు క్రియాసామాన్యమునకు భావ మని పేరు. ఈ భావము రెండువిధములు- సాధ్యావస్థాపన్నము, సిద్ధావస్థాపన్నము. తిఙ్వాచ్య మగు, అనగా 'పచతి' ఇత్యాదులచే వాచ్య మగు భావము, సాధ్యావస్థాపన్నము. దానికి లింగసంఖ్యాదులతో అన్వయించుటకు యోగ్యత ఉండదు. కృత్ప్రత్యయములచే వాచ్య మగు భావము సిద్ధావస్థాపన్నము- పరిపూర్ణత్వమును పొందినది. అందుచే ఇది లింగసంఖ్యాన్వయయోగ్య మైనది. "కృదభిహితోభావో ద్రవ్యవత్ప్రకాశతే" అని భాష్యకారవచనము. కృద్వాచ్య మగు భావము ద్రవ్యము వలె భాసించును గాన దీనికి లింగసంఖ్యాదులతో అన్వయము లభించును అని దీని భావము. అట్టి సిద్ధావస్థాపన్నభావము (వంట మొ.) వాచ్య మగునపుడు 'ఘఞ్' ప్రత్యయము వచ్చు నని సూత్రార్థము.

పాకః:- పచ్‌ధాతువుకంటె ఈ సూత్రముచే భావార్థమున ఘఞ్ ప్రత్యయము. ఘకార ఞకారములు ఇత్సంజ్ఞకములు. 'పచ్ అ' అని యుండగా "అత ఉపధాయాః" అను సూత్రముచే (457) ఉపధావృద్ధి; కుత్వము-'పాకః'. ఘఞన్తములు పుంలింగములు.

855. అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్ 3.3.19

కర్తృభిన్నే కారకే ఘఞ్ స్యాత్.

కర్తృభిన్నకారకార్థమునందు, సంజ్ఞావాచక మగునపుడు, ధాతువుకంటె ఘఞ్‌ప్రత్యయము వచ్చును.

856. ఘఞి చ భావకరణయోః 6 4.27

రఞ్జేర్నలోపః స్యాత్. రాగః. అనయోః కిమ్- రజ్యత్యస్మిన్నితి రఙ్గః.

'శ్నాన్నలోపః' నుండి 'న' 'లోపః' అనుపదములు, 'రఞ్జేశ్చ' నుండి 'రఞ్జేః' అనువర్తించును. భావకరణార్థక మగు ఘఞ్‌ప్రత్యయము పర మగునపుడు 'రఞ్జ్'ధాతువునకు నలోపము వచ్చును.

రాగః:- 'రఞ్జనం'అను నర్థమున 'భావే'అను సూత్రముచే గాని (854) 'రజ్యతే అనేన'- దీనిచే రంజింపచేయబడును- అను కరణార్థమున "అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్" అను సూత్రముచే (855)గాని 'రఞ్జ్'ధాతువుకంటె 'ఘఞ్' ప్రత్యయము. 'రఞ్జ్ అ' అని యుండగా ఈ సూత్రముచే (ప్రథమమున నకారముగ నుండి శ్చుత్వముచే ఞకారముగ మారిన) నకారమునకు లోపము- 'రజ్ అ'అని యుండగా, ఉపధావృద్ధియు, (సూ-457), 'చోః కుః' అను సూత్రముచే (208) కుత్వమును (గకారము) వచ్చి 'రాగః' అను రూపము సిద్ధించినది.

'భావకరణయోః' అనుటచే ఇతరార్థములందు వచ్చిన ఘఞ్ ప్రత్యయము పరముగ నున్నను రఞ్జ్‌ధాతువునకు నలోపమురాదు. ఉదాహరణమునకు- 'రజ్యత్యస్మిన్-' దీనియందు రంజించును- అను అధికరణార్థమున రఞ్జ్‌ధాతువుకంటె ఘఞ్‌ప్రత్యయము (సూ-855)- 'రఞ్జ్ అ'అని యుండగా ఇచట అధికరణార్థకము గాన నకారలోపము లేదు. "చజోః కు ఘిణ్యతోః" అను సూత్రముచే (784) జకారమునకు గకారము, నకారమునకు అనుస్వార (సూ-78) పరసవర్ణములచే (సూ-79) ఙకారము 'రఙ్గః' అను రూపము.

857. నివాస-చితి-శరీరోపసమాధానేష్వాదేశ్చ కః 3.3.41

ఏషు చినోతేర్ఘఞ్; ఆదేశ్చ కకారః. ఉపసమాధానమ్- రాశీకరణమ్ నికాయః. కాయః, గోమయనికాయః.

'హస్తాదానే చేరస్తేయే'నుండి 'చేః', 'అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్' నుండి 'అకర్తరి' 'కారకే', 'భావే' అను సూత్రమును అనువర్తించును. నివాసము, చితి, శరీరము, ఉపసమాధానము అను నర్థములందు (కర్తృభిన్నకారకార్థమునందును, భావార్థమునందును) 'చిఞ్' ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము, ఆది వర్ణ మగు చకారమునకు కకారమును వచ్చును. చితి యనగా యజ్ఞమునందు అగ్ని నుంచెడు స్థల విశేషము. ఉపసమాధాన మనగా ప్రోవు చేయుట.

నికాయః:- ఇల్లు. నిచీయతే ధనాదికం అత్ర- ధనాదికము ఇచట సంరక్షింపబడును- అను నర్థమున ఈ సూత్రముచే నిపూర్వక 'చి'ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయము; చకారమునకు కకారము- 'ని చి అ' అని యుండగా ఇకారమునకు వృద్ధిచే ఐకారము, ఆయాదేశము- 'నికాయః'. కాయః:- (శరీరము) చీయతే అస్థ్యాదికం అస్మిన్- దీనియందు ఎముకలు మొదలగునవి ప్రోగుగ చేయబడును అను నర్థమున చి ధాతువుకంటె ఈ సూత్రముచే ఘఞ్ ప్రత్యయ కకారములు- 'కాయః'.

గోమయనికాయః:- నిచీయతే. రాశీక్రియతే- రాశిగాచేయుట అను భావార్థమున నిపూర్వకచిఞ్ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయము చేయగా రూపము సిద్ధించినది. గోమయరాశి యని యర్థము. చిత్యర్థమున 'ఆకాయం అగ్నిం చిన్వీత' అను నుదాహరణము సిద్ధాంతకౌముదిలో చూపబడినది. 'ఆచీయతే' అను కర్మార్థమున ఘఞ్ ప్రత్యయము.

858. ఏరచ్ 3.3.56

ఇవర్ణాన్తాత్ అచ్. చయః. జయః.

ఏః అచ్. 'ఇ' అనుదానికి షష్ఠ్యంతము 'ఏః'. 'భావే' 'అకర్తరి' 'కారకే' అను పదములు అనువర్తించును. ఇవర్ణాంత మగు ధాతువుకంటె భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'అచ్' ప్రత్యయము వచ్చును.

చయః:- చి ధాతువుకంటె భావార్థమునందు ఈ సూత్రముచే అచ్(అ) ప్రత్యయము. గుణాయాదేశములు- 'చయః' ఇట్లే 'జి'ధాతువునుండి 'జయః'.

859.- ఋదోరప్ 3.3.57

ఋదన్తాత్, ఉవర్ణాన్తాత్ అప్. కరః. గరః. లవః. స్తవః. పవః.

ఋకారాంతధాతువుకంటెను, ఉవర్ణాంతధాతువుకంటెను, భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'అప్' (అ) ప్రత్యయము వచ్చును.

'కౄ' 'గౄ' ధాతువులకంటె ఈ సూత్రముచే అప్ప్రత్యయము చేసిన పిమ్మట ఋకారమునకు గుణము (సూ-390) (అర్) వచ్చి 'కర' 'గర' అను ప్రాతిపదికములు సిద్ధించినవి. ఉకార ఊకారాంతము లగు యు, లూ, స్తు, పూ ధావులకు ఈ సూత్రముచే 'అప్'ప్రత్యయము, గుణావాదేశములును చేయ 'యువ' 'లవ' 'స్తవ' అను ప్రాతిపదికములు సిద్ధించినవి.

వా. ఘఞర్థే కవిధానమ్.

ప్రస్థః. విఘ్నః.

ఘఞ్ ప్రత్యయముయొక్క అర్థమునందు కప్రత్యయమును విధింపవలెను. భాష్యమున "స్థా, స్నా, పా, వ్యధి హని, యుధ్యర్థమ్" అనునది ఈ వార్తికము యొక్క శేషభాగముగ పఠింపబడినది. ఘఞ్ప్రత్యయము భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును వచ్చును గాన, ఈ యర్థములందు పై ధాతువుల కంటె కప్రత్యయము వచ్చును అనునది ఫలితార్థము.

ప్రస్థః - (కుంచము). ప్రతిష్ఠన్తే అస్మిన్ ధాన్యాని - దీనియందు ధాన్యములు ఉండును - అను నర్థమున ప్రపూర్వకస్థాధాతువుకంటె ఈ సూత్రముచే 'క' ప్రత్యయము. 'ప్రస్థాఅ' అని యుండగా "ఆతోలోప ఇటి చ" అను సూత్రముచే (492) ఆకారలోపము- 'ప్రస్థః'. విఘ్నః- 'విహన్తి అస్మిన్ మనాంసి' -మనస్సులను దీనియందు హింసించును- అనునర్థమున ఈ వార్తికముచే విపూర్వకహనధాతువుకంటె కప్రత్యయము. 'విహన్ అ' అని యుండగా "గమహన-" ఇత్యాదిసూత్రముచే (508) ఉపధాలోపము. 'హో హన్తేర్ఞిన్నేషు' అను సూత్రముచే (288) కుత్వము- 'విఘ్నః'. ఈ విధముగ "ప్రస్నాన్తి అస్యామితి ప్రస్నః", ప్రపిబన్త్యస్యామితి ప్రపా", "ఆవిధ్యన్త్యస్యామితి ఆవిధమ్" అను ఉదాహరణములు బాలమనోరమావ్యాఖ్యానమున చూపబడినవి.

860. డ్వితః క్త్రిః. 3.3.88

861. క్త్రేర్మమ్ నిత్యమ్ 4.4.20

క్త్రిప్రత్యయాన్తాత్ మప్ నిర్వృత్తేఽర్థే. పాకేన నిర్వృత్తం పక్త్రిమమ్. డువప్-ఉప్త్రిమమ్.

'డు' అనునది ఇత్సంజ్ఞకముగా గల ధాతువుకంటె భావార్థమున, 'క్త్రి' ప్రత్యయము వచ్చును.

'నిర్వృత్తేఽక్షద్యూతాదిభ్యః'నుండి 'నిర్వృత్తే' అనువర్తించును. నిర్వృత్తమైనది (సిద్ధించినది) అను నర్థమున క్త్రిప్రత్యయాంతము కంటె 'మప్' అను ప్రత్యయము వచ్చును.

పక్త్రిమమ్:- 'డుపచష్పాకే' అను ధాతువునందు 'డు' అనునది ఇత్సంజ్ఞకము గాన ఈ సూత్రముచే భావార్థమునందు క్త్రిప్రత్యయము. క్త్రి లోని కకారమునకు 'లశక్వతద్ధితే' అను సూత్రముచే (136) ఇత్సంజ్ఞ-'పచ్ త్రి' అని యుండగా చకారమునకు కుత్వము (సూ-307)-పక్త్రి అని యుండగా 'మప్' ప్రత్యయమువచ్చి 'పక్త్రిమ' అను రూపము సిద్ధించినది. 'పక్త్రి' అను దానికి పాక మని యర్థము. 'మప్' ఆదేశము సిద్ధత్వార్థమున వచ్చినది గాన 'పక్త్రిమమ్' అనుదానికి 'పాకముచే సిద్ధించినది' అని యర్థము.

ఉప్త్రిమమ్:- 'డువప్' అనుధాతువుకంటె క్త్రిప్రత్యయము వచ్చిన పిమ్మట 'వచిస్వపియజాదీనాం కితి' అనుసూత్రముచే (550) వకారమునకు సంప్రసారణము, అకారమునకు పూర్వరూపము, పిమ్మట 'మప్' ప్రత్యయము వచ్చి 'ఉప్త్రిమమ్' అను రూపము సిద్ధించినది. చల్లుటచే సిద్ధించినది అని యర్థము.

862. ట్వితోఽథుచ్. 3.3.89

టువేపృకమ్పనే. వేపథుః.

'టు' అనునది ఇత్సంజ్ఞకముగా గల ధాతువులకంటె భావార్థమునందు 'అథుచ్' ప్రత్యయము వచ్చును.

'టువేపృకమ్పనే' అను ధాతువు 'ట్విత్' గాన ఈ సూత్రముచే 'అథుచ్' ప్రత్యయము. చకారము ఇత్సంజ్ఞకము-'వేపథు' అను ప్రాతిపదికము సిద్ధించినది. ఈ విధముగ 'టుఓశ్వి' అను ధాతువునుండి 'శ్వయథుః' (వాపు). "టునది సమృద్ధౌ" అను ధాతువునండి 'నన్దథుః' (ఆనందము), 'టుఓస్ఫూర్జా' అను ధాతువునుండి 'స్ఫూర్జథుః' (ఉరుము) సిద్ధించును. అథుచ్ ప్రత్యయాంతములు పులింగములు.

863. యజ,యాచ,యత,విచ్ఛ,ప్రచ్ఛ,రక్షో నఙ్. 3.3.90

యజ్ఞః,యాచ్ఞా,యత్నః,విశ్నః,ప్రశ్నః, రక్ష్ణః.

యజ్,యాచ్,యత్,విచ్ఛ్,ప్రచ్ఛ్, రక్షధాతువులకంటె భావార్థమునఁనజ్ ప్రత్యయమువచ్చును.

యజ్ఞః:- యజ్ధాతువుకంటె ఈ సూత్రముచే 'నజ్' ప్రత్యయము. జకారము ఇత్సంజ్ఞకము. నకారమునకు శ్చుత్వముచే ఞకారము. జకారఞకారములు కలియుటచే'జ్ఞ 'ఏర్పడినది.

యాచ్ఞా:- యాచ్ ధాతువుకంటె 'నజ్' ప్రత్యయము. నకారమునకు శ్చుత్వముచేఞకారము. స్త్రీత్వవివక్షచే 'టాప్'అనుస్త్రీప్రత్యయము (సూ-1248) చేర్చగా 'యాచ్ఞా'అను రూపము సిద్ధించినది. ఈశబ్దము తక్క నజన్తశబ్దము లన్నియు పులింగములు. యత్నః అనునపుడు విశేషకార్య మేదియు లేదు.

విచ్ఛ్.ప్రచ్ఛ్,ధాతువులకంటెనజ్ప్రత్యయముచేసిన పిదప"చ్ఛ్వోఃశూడను నాసికేచ" అనుసూత్రముచే (846) 'చ్ఛ్'అనుదానికి శకారాదేశము వచ్చి 'విశ్నః' 'ప్రశ్నః' అను రూపములు సిద్ధించినవి. రక్ష్ణః:- రక్ష్ధాతువుకంటె నజ్ప్రత్యయము చేర్చిన పిదప నకారమునకు "రషాభ్యాం నో ణః సమానపదే" అను సూత్రముచే (267) ణకారము. నజ్ యొక్క జిత్త్వమునకుగుణాదినిషేధ స్వరవిశేషములు ప్రయోజనము.

## 864. స్వపో నన్. 3.3.91

స్వప్నః.

స్వప్ధాతువుకంటె భావార్థమునందు నన్ ప్రత్యయము వచ్చును. నన్ లోని నకారము ఇత్సంజ్ఞకము. దానికి ప్రయోజనము ఆద్యుదాత్తస్వరము. 'స్వప్న'అను ప్రాతిపదికము సిద్ధించినది.

## 865. ఉపసర్గే ఘోః కిః. 3.3.93

ప్రధిః. ఉపధిః.

ఉపసర్గపూర్వకము అగు ఘుసంజ్ఞకధాతువులకు భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'కి' ప్రత్యయము వచ్చును.

ప్రధిః, ఉపధిః:- ధాధాతువు "దాధాఘ్వదాప్" అనుసూత్రముచే (573) ఘుసంజ్ఞకము. దీనికి 'ప్ర', 'ఉప'అనుఉపసర్గలను చేర్చిన పిదప ఈ సూత్రముచే 'కి'ప్రత్యయము, కకారము ఇత్సంజ్ఞకము. 'ప్రధాఇ' "ఉపధాఇ"అని యుండగా 'ఇ'కిత్తు గాన "ఆతో లోప ఇటి చ"అను సూత్రముచే (492) ఆకార

మునకు లోపము. 'ప్రధిః' (చక్రాంతము)-'ఉపధిః' (డాంబికము) కిప్రత్య యాంతశబ్దములు పుంలింగములు. 'ఉపాధిః' 'వ్యాధిః' 'విధిః' 'సమాధిః', 'నిధిః' 'అభిసన్ధిః' ఇత్యాదిపదములు ఇట్లే సిద్ధించును.

### 866. స్త్రియాం క్తిన్. 3.3.94

స్త్రీలిఙ్గే భావే క్తిన్ స్యాత్. ఘఞోఽపవాదః, కృతిః, స్తుతిః.

స్త్రీలింగమునందు (స్త్రీత్వవిశిష్ట) భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును ధాతువుకంటె 'క్తిన్' ప్రత్యయము వచ్చును. ఈ క్తిన్ప్రత్యయాంత స్త్రీలింగశబ్దముల రూపములు 'మతి'శబ్దరూపముల వలె ఉండును. ఇది 'హలశ్చ'అను సూత్రముచే (878) విధింపనున్న ఘఞ్కు బాధకము. కావున స్త్రీత్వవిశిష్టభావాద్యర్థమున 'క్తిన్'ప్రత్యయము, పుంస్త్వవిశిష్టభావాద్యర్థమున ఘఞ్ప్రత్యయమును వచ్చునని తేలినది. ఇది స్త్రియామ్ అను అధికారములోనున్నది గాన 'వాసరూపోఽస్త్రియామ్' (770) అను వైకల్పికబాధకత్వము ప్రవర్తింపదు. 'కృత్యల్యుటో బహులమ్' అను సూత్రము వరకును 'స్త్రియామ్'అనునది అనువర్తించును. 'క్తిన్'లోనికకారనకారములు ఇత్సంజ్ఞకములు.

కృతిః:- కృఞ్ధాతువుకంటె ఈ సూత్రముచే 'క్తిన్' ప్రత్యయము. 'కృతి' అను ప్రాతిపదికము సిద్ధించినది. ఇది కిత్తు గాన ఋకారమునకు గుణము రాలేదు. ఇట్లే 'స్తు'ధాతువునుండి 'స్తుతిః' సిద్ధించినది.

వా. ఋూల్వాదిభ్యః క్తిన్ నిష్ఠావద్వాచ్యః.

తేన నత్వమ్. కీర్ణిః, లూనిః, ధూనిః. పూనిః.

ఋూకారాంతధాతువులకంటెను, లూ మొదలగు ధాతువులకంటెను పరమగు క్తిన్ప్రత్యయము నిష్ఠాప్రత్యయమువంటి దగు ననిచెప్పవలెను. నిష్ఠావద్భావాతిదేశముచే "రదాభ్యాం నిష్ఠాతో నః పూర్వస్య చ దః"(819)'ల్వాదిభ్యః' (821) అను సూత్రములచే విహిత మగు నత్వము 'క్తిన్'లోని తకారమునకు గూడ వచ్చును.

కీర్ణిః:- కౄధాతువుకంటె క్తిన్ ప్రత్యయము-'కౄ తి'అని యుండగా 'ఋూత ఇద్ధాతోః'అనుసూత్రముచే (663) ఋూకారమునకు 'ఇర్'ఆదేశము' 'హలి చ'అనుసూత్రముచే (616) ఇకారమునకు దీర్ఘము. ఈ వార్తికముచే తకారమునకు నకారము. దానికి ణత్వము-'కీర్ణిః' ఇట్లే 'లూ' 'ధూ' 'పూ'ధాతు

వులకంటె క్తిన్ ప్రత్యయము చేసిన పిమ్మట నిష్ఠావద్భావముచే తకారమునకు నకారము-లూనిః,ఇత్యాదిరూపములు సిద్ధించినవి.

వా. సమ్పదాదిభ్యః క్విప్

సమ్పత్, విపత్, ఆపత్, క్తిన్న పీష్యతే. సమ్పత్తిః, విపత్తిః, ఆపత్తిః.

'సమ్పత్' మొదలగువాటికంటె స్త్రీలింగమున భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'క్విప్' ప్రత్యయము వచ్చును. 'క్విప్' సర్వలోపి గాన 'సమ్పత్' 'విపత్' ఇత్యాదిరూపములు సిద్ధించినవి.

ఇది 'స్త్రియామ్' అను అధికారములో నుండుటచే వాసరూపవిధి ప్రవర్తింపదు గాన క్తిన్ ప్రత్యయము ఈ క్విప్ ప్రత్యయముచే పూర్తిగా బాధింపబడవలసి యున్నది. అట్టి పక్షమున 'ఆపత్తిః' ఇత్యాది క్తిన్నంతరూపములు సిద్ధింపవు. అందుచే సంపదాదులకంటె క్తిన్ ప్రత్యయము కూడ అంగీకార్యమే యని చెప్పుచున్నాడు. 'సమ్పత్తిః' విపత్తిః' ఇత్యాదిరూపములు గూడ సిద్ధించినవి.

867. ఊతి—యూతి-జూతి-సాతి—హేతి-కీర్తయశ్చ. 3.3.97

ఏతే నిపాత్యన్తే.

ఈ సూత్రముచే ఊతి,యూతి,జూతి,సాతి,హేతి,కీర్తి అను స్త్రీలింగ క్తిన్నంతరూపములు నిపతింపబడుచున్నవి. ఇందు కొన్ని క్తిన్ ప్రత్యయమునః ఉదాత్తస్వరము లభించుటకును, కొన్ని ఇతరకార్యములు కూడ వచ్చుటకును నిపతింపబడినవి.

ఊతిః:- అవధాతువుకంటె క్తిన్ ప్రత్యయము ఉపధావకారములకు 'జ్వరత్వర-"ఇత్యాదిసూత్రముచే (868) ఊఠ్ ఆదేశము 'ఊతిః'. ఇచట నిపతించుటకు స్వర మొక్కటియే ప్రయోజనము.

'యు' 'జు' ధాతువుల క్తిన్ ప్రత్యయాంతరూపము లగు 'యూతి' 'జూతి' శబ్దములలో ఉకారమునకు దీర్ఘము కూడ ఈ సూత్రముచే నిపతింపబడుచున్నది.

సాతిః:- "షోంతకర్మణి" అను దైవాదికధాతువుకంటె 'క్తిన్' ప్రత్యయము చేసిన పిమ్మట 'ద్యతిస్యతి' ఇత్యాదిసూత్రముచే ఇత్వము రావలసియుండ తదభావమునిపతింపపడుచున్నది,

హేతిః:- హన్ధాతువుకంటె క్తిన్ ప్రత్యయము, 'అనుదాత్తోపదేశ-'

ఇత్యాదిసూత్రముచే (562) నకారలోపము. అకారమునకు ఏకారము నిపతింప బడినది. కీర్తిః:- 'కృాత్'ధాతువు చురాదిగణములోనిది. ఇది ణ్యంతముగాన 'ణ్యాసశ్రన్థోయుచ్' అను సూత్రముచే (872) 'యుచ్' రావలసి యుండగా ఈసూత్రముచే క్తిన్ప్రత్యయ నిపాతనము. 'ఉపధాయాశ్చ' అను సూత్ర ముచే) ఋకారమునకు రేఫపరకఇకారము. ఇకారమునకు దీర్ఘము (సూ-616).

868. జ్వరత్వరస్రివ్యవిమవాముపధాయాశ్చ 6.4.20

ఏషాముపధావకారయోరూఠ్ అనునాసికే, క్వౌ, ఝలాదౌ క్ఙితి చ. అతః క్విప్. జూః. తూః. స్రూః. ఊః. మూః.

'చ్ఛ్వోః శూడనునాసికే చ' నుండి వకారగ్రహణము, ఊఠ్గ్రహణము, 'అనునాసికే'అనువర్తించును. "అనునాసికస్య క్విఝలోః క్ఙితి"నుండి 'క్విఝలోః క్ఙితి' అనువర్తించును. 'ఉపధాయాశ్చ' అను చకారముచే వకారము కూడ గ్రహింపబడును. (సిద్ధాంతకౌముది ననుసరించి ఈసూత్రములోనికి 'క్ఙితి' అను పదము అనువర్తింపదు.)

జ్వర్, త్వర్, స్రివ్, అవ్, మవ్ ధాతువుల ఉపధావకారములకు, అను నాసికము గాని, క్విప్రత్యయము గాని, ఝలాదులగు కిత్ఙిత్ప్రత్యయములు గాని పర మగునపుడు 'ఊఠ్' ఆదేశము వచ్చును.

పై ధాతువులకు ఏ సూత్రము చేతను క్విప్ప్రత్యయము విధింపబడలేదు. కాని క్విప్ప్రత్యయము పర మగునపుడు ఊఠ్వచ్చు నని ఈ సూత్రము చెప్పు చున్నది. కావున ఈ సూత్రబలముచేతనే పై ధాతువులకంటె 'క్విప్' వచ్చు నని తెలియు చున్నది.

జూః:- (రోగము) జ్వర్ధాతువుకంటె క్విప్ప్రత్యయము. దానికి సర్వ లోపము. ఈ సూత్రముచే ఉపధాభూత మైన అకారమునకును వకారమునకును (ఊఠ్, ఊ) ఆదేశము. 'జూర్' అను రేఫాంతప్రాతిపదికము సిద్ధించినది. దీనికి 'జూః-జురౌ-జురః' ఇత్యాదిరూపము లగును. తూః:- (శీఘ్రముగ చేయు వాడు) త్వర్ధాతువుకంటె క్విప్ప్రత్యయము, పిమ్మట ఉపధావకారములకు ఊఠ్ రాయగా 'జూర్'వలె 'తూర్' అను ప్రాతిపదికము సిద్ధించినది. స్రూః:- (చలించువాడు) స్రివ్ ధాతువుకంటె క్విప్. వకారఇకారములకు 'ఊఠ్'ఆదేశము స్రూ-స్రువౌ-స్రువః ఇత్యాదిరూపము లగును. ఊః:- (రక్షకుడు) అవ్ధాతువు కంటె క్విప్. పూర్తిధాతువుకు 'ఊఠ్'ఆదేశము. 'ఊః-ఉవౌ-ఉవః' ఇత్యాదిరూప

ములగును. మూః:- (బంధించువాడు) మవధాతువుకంటె క్విప్; వకారఆకార ములకు ఊఠ్ఆదేశము; 'మూః-మువౌ-మువః' ఇత్యాదిరూపము లగును.

869. ఇచ్ఛా 3.3.101

ఇషేర్నిపాతోఽయమ్,

ఇష్ధాతువుకంటె భావార్థమున ఈ సూత్రముచే శప్రత్యయము నివతింప బడుచున్నది.

శలోని శకారము ఇత్సంజ్ఞకము గాన ఇది సార్వధాతుకము. అందుచే 'సార్వధాతుకేయక్' అను సూత్రముచే (755) యగాగమము రావలసి యుండగా తదభావము కూడ నివతింపబడినది. 'ఇష్ అ' అని యుండగా 'శప్'- 'ఇష్ అ అ' అని యుండగా "అతోగుణే" అను సూత్రముచే (274) పరరూపము 'ఇషుగమియమాం ఛః' అను సూత్రముచే (507) షకారమునకు ఛకారము. 'ఛే చ' అను సూత్రముచే (101) తుగాగమము. తకారమునకు శ్చుత్వముచే చకారము. 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1247) స్త్రీత్వమున టాప్-'ఇచ్ఛా' అను ఆకారాంతరూపము సిద్ధించినది.

870. అప్రత్యయాత్ 3.3.102

ప్రత్యయాన్తేభ్యః ధాతుభ్యః స్త్రియామకారః ప్రత్యయః స్యాత్. చికీర్షా. పుత్రకామ్యా.

ప్రత్యయాంతము లగు ధాతువులకంటె స్త్రీలింగమున భావార్థమునందును, కర్తృభిన్నకారకార్థమునందును 'అ'అను ప్రత్యయము వచ్చును.

చికీర్షా:- 'చికీర్ష' అను సన్నంతకృధాతువుకంటె ఈ సూత్రముచే అప్రత్యయము. 'చికీర్ష అ' అని యుండగా 'అతో లోపః'అను సూత్రముచే (472) అకారలోపము. స్త్రీలింగమున టాప్వచ్చి 'చికీర్షా' అను ఆకారాంతరూపము సిద్ధించినది. పుత్రకామ్యా:- కామ్యచ్ప్రత్యయాంత మగు పుత్రకామ్య శబ్దము కంటె ఈ సూత్రముచే 'అ'ప్రత్యయము, పిమ్మట 'టాప్—' 'పుత్రకామ్యా'.

871. గురోశ్చహలః 3.3.103

గురుమతో హలన్తాత్ స్త్రియాం 'అ'ప్రత్యయః స్యాత్. ఈహా,

గుర్వక్షము గల హలంతధాతువుకంటె స్త్రీలింగమున (భావార్థమునందును కర్తృభిన్నకారకార్థమునందును) 'అ'ప్రత్యయము వచ్చును.

ఈహా:- ఈహ్‌ధాతువులో ఈకారము గురువు. ఇది హలంతము. కావున ఈ సూత్రముచే 'అ'ప్రత్యయము, స్త్రీలింగమున టాప్ 'ఈహా'.

87. ణ్యాసశ్రన్థోయుచ్ 3.3.107

అకారస్యాపవాదః. కారణా. హారణా.

ణ్యంతధాతువులకంటెను, ఆస్, శ్రన్థధాతువులకంటెను, భావార్థక ర్తృభిన్నకారకార్థములందు, స్త్రీలింగమున యుచ్ ప్రత్యయము వచ్చును.

ణ్యంతధాతువులకంటె 'అప్రత్యయాత్' అను సూత్రముచేతను (870), 'ఆస్' 'శ్రన్థ' ధాతువులకంటె "గురోశ్చహలః" అను సూత్రముచేతను (781) రావలసి యున్న అచ్ ప్రత్యయమునకు ఇది అపవాదము.

కారణా: హారణా:- 'కారి', 'హారి'అను ణ్యంతకృ, హృధాతువుల కంటె ఈ సూత్రముచే యుచ్ ప్రత్యయము. చకారము ఇత్సంజ్ఞకము. 'యు' కు 'యువోరనాకౌ' అను సూత్రముచే (788) 'అన' ఆదేశము. 'ణేరనిటి'అను సూత్రముచే (532) 'ణి'కి లోపము. ణత్వము- 'కారణా' (తీవ్రవేదన) హారణా' (హరించుట).

873. నపుంసకే భావే క్తః 3.3.114

874. ల్యుట్చ 3.3 115

హసితమ్. హసనమ్.

ధాతువుకంటె నపుంసకలింగమునందు, భావార్థమున 'క్త'ప్రత్యయము వచ్చును. 'ల్యుట్'ప్రత్యయము కూడ వచ్చును.

హసితమ్; హసనమ్:- హస్‌ధాతువుకంటె క్తప్రత్యయము. 'త' వలాద్యార్ధధాతుక మగుటచే ఇడాగమము-'హసితమ్'. ల్యుడాగమముచేసినపిమ్మట 'యు'కు 'అన' ఆదేశము- 'హసనమ్'. ఈ రెండును నపుంసకలింగ శబ్దములు.

875. పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ 3.3.118

పుంలింగమున, సంజ్ఞావాచక మగునపుడు కరణాధికరణార్థములందు సాధారణముగ 'ఘ'ప్రత్యయము వచ్చును.

876. ఛాదేర్ఘేఽద్వ్యుపసర్గస్య 6.4.96

ద్విప్రభృత్యుపసర్గహీనస్యఛాదేః హ్రస్వో ఘేపరే. దన్తాఃఛాద్యన్తే అనేనేతి దన్తచ్ఛదః. ఆకుర్వన్త్యస్మిన్నితి ఆకరః.

"ఖచి హ్రస్వః" "ఊధుపధాయాః" అను సూత్రములనుండి 'హ్రస్వః' 'ఉపధాయాః' అను పదములు అనువర్తించును. రెండు లేక అంతకంటె అధిక మగు ఉపసర్గలు లేనిది అగు ణ్యంతఛద్ధాతువుయొక్క ఉపధకు 'ఘ'ప్రత్యయము పర మగునపుడు హ్రస్వము వచ్చును.

దన్తచ్ఛదః:- (దంతములను కప్పునది-పెదవి). 'దన్తాః ఛాద్యన్తే అనేన' అను కరణార్థమునచౌరాదిక 'ఛద్'ధాతువుకంటె ఘప్రత్యయము. ఘకారము ఇత్సంజ్ఞకము (సూ-136). 'ఛాది అ' అని యుండగా ణికిలోపము. (సూ-532) ఈ సూత్రముచే ఉపధాహ్రస్వము- 'ఛే చ'అను సూత్రముచే(110) తుగాగమము 'దన్తచ్ఛదః'.

ఆకరః:- (గని). ఆకుర్వన్తి అస్మిన్- దీనియందు జనులందరును కలసి పని చేయుదురు- అను అధికరణార్థమున ఆఙ్పూర్వకకృఞ్ధాతువుకంటె ఘప్రత్యయము. 'ఆ కృ అ' అని యుండగా ఋకారమునకు గుణము- 'ఆకర' శబ్దము సిద్ధించినది. ఈ రెండును పుంలింగ శబ్దములు.

877 అవేతృస్త్రోర్ఘఞ్ 3.3 120

అవతారః కూపాదేః. అవస్తారో జవనికా

'అవ'అను ఉపసర్గ ఉపపదముగా నుండగా, తౄ, స్తౄధాతువులకంటె (కరణాధికరణార్థములందు) పుంలింగమున, సంజ్ఞావాచక మగునపుడు సాధారణముగ, ఘఞ్ ప్రత్యయము వచ్చును.

'ఘఞ్'లోని ఘకారఞకారములు ఇత్సంజ్ఞకములు. 'అవతారః' అవతరన్తి అత్ర- దీనియందు దిగుదురు- అను అధికరణార్థమున అవపూర్వకతౄధాతువుకంటె ఈ సూత్రముచే ఘఞ్ప్రత్యయము. ౠకారమునకువృద్ధి (సూ-182) (ఆర్)- 'అవతారః'. కూపాదులలో దిగుటకు నిర్మించిన మెట్లు మొదలగునవి. అవస్తారః:- అవస్తృణన్తి అనయా- దీనిచే ఆచ్ఛాదింతురు- అను కరణార్థమున అవపూర్వకస్తౄధాతువుకంటె ఘఞ్ ప్రత్యయము వచ్చి పై వలెనే రూపము సిద్ధించినది. 'తెర' అని యర్థము.

878. హలశ్చ 3.3.121

హలన్తాద్ ఘఞ్. ఘాపవాదః. రమన్తే యోగినోఽస్మిన్నితి- రామః. అపమృజ్యతేఽనేన వ్యాధ్యాదిరితి అపామార్గః.

హలంతధాతువులకంటె, కరణాధికరణార్థములందు, పుంలింగమున, సంజ్ఞావాచక మగునపుడు సాధారణముగ ఘఞ్ ప్రత్యయము వచ్చును. ఇది "పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ" అను సూత్రమునకు (875) అపవాదము. దీనిని బట్టి ఘప్రత్యయము సాధారణముగ అజంతధాతులవుకంటె మాత్రమే వచ్చు నని తేలినది.

రామః:- రమన్తే యోగినః అస్మిన్- ఈతనియందు యోగీశ్వరులు రమింతురు- అను అధికరణార్థమున ఈ సూత్రముచే ఘఞ్ ప్రత్యయము. ఉపధా వృద్ధి (సూ-437), 'రామః' అపామార్గః:- 'అపమృజ్యతే అనేన వ్యాధ్యాదిః' వ్యాధ్యాదికము దేనిచే తొలగింపబడునో అది. (ఉత్తరేణిమొక్క)అను నర్థమున అపపూర్వకమృజ్ధాతువుకంటె ఈసూత్రముచే ఘఞ్ ప్రత్యయము.' అపమృజ్ అ' అని యుండగా "చజోఃకుఘిణ్ణ్యతోః" అను సూత్రముచే (784) జకారము నకు కుత్వముచే గకారము. 'మృజేర్వృద్ధిః' అను సూత్రముచే (785) ఋకార మునకు వృద్ధి- 'అపమార్గ్అ'అని యుండగా "ఉపసర్గస్య ఘఞ్యమనుష్యేబహు లమ్" అను సూత్రముచే ఉపసర్గ యగు అప యందలి అంత్యఅకారమునకు దీర్ఘము. 'అపామార్గః'.

879. ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్ 3.3.126

కరణాధికరణయోరితి నివృత్తమ్. ఏషు దుఃఖసుఖార్థేషూపపదేషు ఖల్. "తయోరేవ-" ఇతి భావే కర్మణి చ. కృచ్ఛ్రం- దుష్కరః కటో భవతా. అకృచ్ఛ్రే- ఈషత్కరః. సుకరః.

ఇంతవరకును అధికారముగ వచ్చిన "కరణాధికరణయోశ్చ" అనునది దాని వెనుక సూత్రముతో నివర్తించును. అందుచే ఇది మొదలు విధింపబడు ప్రత్యయములు "తయోరేవకృత్యక్తఖలర్థాః" (773) అను సామాన్యశాస్త్రము ననుసరించి భావకర్మార్థములందు మాత్రమే వచ్చును.

సుఖము దుఃఖము అను నర్థముగల 'ఈషత్', 'దుస్', 'సు' అనునవి ఉపపదములుగా నున్నపుడు ధాతువుకంటె 'ఖల్' అను ప్రత్యయము వచ్చును. 'ఖల్'లోని ఖకారలకారములు ఇత్సంజ్ఞకములు. అకారము శేషించును.

దుష్కరః కటో భవతా:- నీచేతచాప తయారుచేయుటకు శక్యము కానిది- కష్టమైనది. ఇచట కష్టార్థక మగు 'దుస్' అనునది ఉపపదముగా గల కృఞ్ధాతువుకంటె ఖల్ ప్రత్యయము- 'దుస్కృఅ' అని యుండగా ఋకారము

నకు గుణము (సూ-390). సకారమునకు "ఇదుదుపధస్య చాప్రత్యయస్య" అను సూత్రముచే షత్వము- 'దుష్కరః'. ఇట్లే తేలికగ చేయుటకు శక్యమైనది అను నర్థమున 'ఈషత్' 'సు' అనునవి ఉపపదములుగ ఉండగా, కృఞ్ధాతువుకంటె ఖల్ ప్రత్యయము చేర్చుటచే 'ఈషత్కరః' 'సుకరః' అను రూపములు సిద్ధించినవి.

## 880. ఆతో౽యుచ్ 4.3.128

ఖలో౽పవాదః. ఈషత్పానః సోమో భవతా. దుష్పానః. సుపానః.

'ఖల్' అనునది తక్క పై సూత్ర మంత యు అనువర్తించును. కష్ట సుఖార్థము లగు ఈషత్, దు, సు, అనునవి ఉపపదములుగా గల ఆకారాంత ధాతువులకంటె, భావకర్మార్థములందు 'యుచ్' అను ప్రత్యయము వచ్చును. యుచ్లోని చకారము ఇత్సంజ్ఞకము. 'యు'కు 'యువోరనాకౌ' అను సూత్ర ముచే (788) అనాదేశము. ఈ యుచ్ప్రత్యయము పై సూత్రముచే విహిత మగు ఖల్ ప్రత్యయమునకు అపవాదము.

ఈషత్పానః సోమో భవతా:- "నీచేత సోమము అనాయాసముగ త్రాగబడుటకు శక్యమైనది అను నర్థమున ఖల్ను బాధించి ఈ సూత్రముచే 'యుచ్'ప్రత్యయము వచ్చి 'ఈషత్పానః' అను రూపము సిద్ధించినది. 'దుష్పా నః' 'సుపానః' అను రూపములు గూడ ఇట్లే సిద్ధించినవి.

## 881. అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా 3.4.18

ప్రతిషేధార్థయోః అలంఖల్వోః ఉపపదయోః క్త్వా స్యాత్. ప్రాచాం గ్రహణం పూజార్థమ్. "అమైవావ్యయేన" ఇతి నియమాత్ నోపపదసమాసః. "దో దద్ఘోః-" అలం దత్త్వా. 'ఘుమాస్థా' -ఇతీత్వమ్. పీత్వా ఖలు, అలం ఖల్వోః కిమ్.- మాకార్షీత్. ప్రతిషేధయోః కిమ్——అలఙ్కారః.

ప్రతిషేధార్థకము లగు 'అలమ్' 'ఖలు' అను అవ్యయములు ఉపపదము లుగా నుండగా, ప్రాచీనాచార్యుల [1]. మతమున, ధాతువుకంటె క్త్వాప్రత్యయము వచ్చును. ఈ క్త్వాప్రత్యయము భావార్థక మని భాష్యకారులు సూచించి యున్నారు.

---

1. 'ప్రాచాం' అనుదానికి వాస్తవమున ప్రాగ్దేశీయుల మతమున అని అర్థము చెప్పవలెను. గాంధారప్రాంతమున నివసించి అష్టాధ్యాయిని రచించిన పాణిని, దేశభేదాను సారముగ ఆనాడు ప్రచారములో నున్న రూపభేదాదులను చూపుచు 'ప్రాచాం' 'ఉదీచాం' ఇత్యాది పదములను ప్రయోగించి యున్నాడు.

ఇచట 'ప్రాచామ్' అని చెప్పుటచే ఈ క్త్వాప్రత్యయము వైకల్పిక మని ఉద్దేశ్యము కాదు, ప్రాచాం అనునది కేవలము ప్రాచీనాచార్యులవిషయమున గౌరవమును చూపుటకు మాత్రమే ప్రయోగింపబడినది, అనగా వైకల్పికము కాదని యర్థము. 'అలం రోదనేన' ఇత్యాదిప్రయోగములు బహులగ్రహణముచే సాధింపదగిన వని బాలమనోరమాకారుడు వ్రాసి యున్నాడు.

అలందత్త్వా:- "ఈయవలదు" అని యర్థము. నిషేధార్థక మగు అలం అనునది ఉపపదముగా నుండుటచే ఈ సూత్రముచే దాధాతువుకంటె క్త్వా ప్రత్యయము. 'దాత్వా' అని యుండగా 'దోదద్ఘోః' అను సూత్రముచే (730) 'దా' అనుదానికి 'దద్' అను నాదేశము. దకారమునకు చర్త్వము (సూ-74)- 'దత్త్వా'. 'క్త్వాతోసున్కసునః' అను సూత్రముచే (371) దానికి అవ్యయ సంజ్ఞ లభించును. ఇపుడు 'అలమ్' అనుదానికి 'దత్త్వా' అనుదానితో 'ఉపపద మతిఙ్' అను సూత్రముచే (947) సమాసము రావలసి యున్నది. కాని "అమైవావ్యయేన" అను సూత్రముచే అవ్యయముతో ఉపపదసమాసము చేయవలె నన్నచో అమంతావ్యయముతో మాత్రమే చేయవలె ననెడు నియమ ముండుటచే ఇచట సమాసము లేదు.

పీత్వాఖలు:- నిషేధార్థక మగు 'ఖలు'అనునది ఉపపదముగ నుండగా ఈ సూత్రముచే పాధాతువుకంటె క్త్వా ప్రత్యయము. 'పాత్వా'అని యుండగా 'ఘుమాస్థాగాపాజహాతిసాం హలి'అనుసూత్రముచే (591) ఆకారమునకు ఈకారము- 'పీత్వా'.

'మా'అనునది కూడ 'అలం' 'ఖలు'ల వలె నిషేధార్థకమే యైనను పై సూత్రమున 'అలం' 'ఖలు'అను రెండు అవ్యయములను మాత్రమే గ్రహించుటచే 'మాకార్షీత్'అను నపుడు క్త్వాప్రత్యయము రాలేదు. 'అలం' 'ఖలు' అను వాటిని గూడ ప్రతిషేధార్థమునందు ప్రయోగించి నపుడు మాత్రమే ఈ సూత్రము ప్రవర్తించును. అందుచే 'అలఙ్కారః'అనునపుడు 'అలం' అనునది ప్రయుక్తమైనను ఇది భూషణార్థకము గాన క్త్వాప్రత్యయము రాలేదు.

882. సమానకర్తృకయోః పూర్వకాలే. 3.4.21

సమానకర్తృకయోర్ధాత్వర్థయోః పూర్వ కాలే విద్యమానాత్ ధాతోః క్త్వా స్యాత్. భుక్త్వా వ్రజతి. ద్విత్వం అతన్త్రమ్-భుక్త్వా పీత్వా వ్రజతి.

సమానకర్తృకము అగు రెండు క్రియలలో పూర్వకాలసంబద్ధ మగు క్రియను బోధించు ధాతువుకంటె క్త్వా ప్రత్యయము వచ్చును.

భుక్త్వా వ్రజతి:- 'భుజించి వెళ్ళుచున్నాడు' ఇచట భోజనక్రియను బోధించు భుజ్ ధాతువు,గమనక్రియను బోధించు వ్రజధాతువు ప్రయోగింపబడి నవి. ఈ రెండు క్రియలకును కర్త ఒక్కడే. ఇందు భోజనక్రియ గమనక్రియ కంటె ముందుగ జరిగినది. అందుచేభుజ్ ధాతువుకంటె క్త్వాప్రత్యయము చేర్చగా,జకారమునకు చర్త్వము వచ్చి 'భుక్త్వా'అను రూపము సిద్ధించినది.

సూత్రమునందు 'సమానకర్తృకయోః' అని ద్వివచనమును ప్రయోగించు టచే ఈ క్త్వాప్రత్యయము రెండు ధాతువులను ప్రయోగించి నపుడు మాత్రమే వచ్చు నని భ్రాంతి కలుగ వచ్చును. తన్నివారణమునకై 'ద్వివచనమతన్త్రమ్' అనగా-ద్వివచనము వివక్షితముకాదు; రెండుకంటె ఎక్కువధాతువులు కూడ ఉం డవచ్చును-అని చెప్పబడినది. కావున 'భుక్త్వా,పీత్వా,వ్రజతి'ఇత్యాద్యుదాహరణ ములందు మూడు ధాతువు లున్నను పూర్వకాలికక్రియాబోధకము లగు "భుజ్" 'పీ'ధాతువులకు క్త్వా ప్రత్యయము వచ్చినది.

### 883. న క్త్వా సేట్. 1.2.18

సేట్ క్త్వా కిత్ న స్యాత్. శయిత్వా. సేట్ కిమ్-కృత్వా.

'అసంయోగాల్లిట్ కిత్'నుండి 'కిత్' అనువర్తించును. సేట్ అగు క్త్వాప్రత్యయము కిత్ కాదు.

శయిత్వా:- శీధాతువుకంటె పూర్వసూత్రముచే క్త్వా ప్రత్యయము. ఈ ధాతువు సేట్ గాన "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః"అనుసూత్రముచే(403) 'క్త్వా'కు ఇడాగమము చేయగా 'శీ ఇ త్వా'అని యున్నది. ఇపుడు ఈకారమునకు గుణము (సూ-390)రావలసి యున్నది. కాని 'క్ఙితి చ'అను సూత్రముచే (435)గుణము నిషేధింపబడుచున్నది గాన ఈ సూత్రము కిత్త్వాభావమును విధించుచున్నది. ఈ విధముగ ఈ సూత్రముచే సేట్ అగు ఈ క్త్వాప్రత్యయమునకు కిత్త్వము లేదు గాన గుణము పిమ్మట అయాదేశము వచ్చి 'శయిత్వా'అను రూపము సిద్ధించినది.

ఈ కిత్త్వాభావము సేట్ అగు క్త్వాప్రత్యయమునకు మాత్రమే వర్తిం చును గాన 'కృత్వా'అనునపుడు అనిట్ అగు క్త్వాప్రత్యయము కిత్ గాన గుణము రాలేదు.

884. రలో వ్యుపధాత్ హలాదేః సంశ్చ. 1.2.26

ఇవర్ణోవర్ణోపధాత్ హలాదే రలన్తాత్ పరౌ క్త్వాసనౌ సేటౌ వా కితౌ స్తః. ద్యుతిత్వా, ద్యోతిత్వా. లిఖిత్వా, లేఖిత్వా, వ్యుపధాత్కిమ్-వర్తిత్వా. రలఃకిమ్-సేవిత్వా.హలాదేఃకిమ్-ఏషిత్వా. సేట్కిమ్-భుక్త్వా.

చకారముచే "పూఙః క్త్వాచ"నుండి 'క్త్వా'అనుకర్షింపబడును. 'నక్త్వా సేట్'నుండి 'సేట్' అనువర్తించును. ఉశ్చఇశ్చవీ- తేఉపధేయస్యసఃవ్యుపధః. ఇవర్ణఉవర్ణములు ఉపధగా కలదియు,హలాదియు, రల్ అంతమునందు కలదియు నగు ధాతువుకంటె పరమైన సేట్లగు 'క్త్వా' 'సన్'ప్రత్యయములు వికల్పముగ కిత్లు అగును. రల్ అనునది ప్రత్యాహారము.

ద్యుత్ధాతువుకంటె క్త్వాప్రత్యయము:దానికి ఇడాగమము-'ద్యుత్ ఇ త్వా' అని యుండగా ఇచట ద్యుత్ ధాతువుహలాది, దీనికి ఉకారము ఉపధగ నున్నది, తకారరూప మగు రల్ అంతమునం దున్నది. అందుచే దానికంటె పరమైన క్త్వాప్రత్యయమునకు ఈ సూత్రముచే కిత్త్వవికల్పము. కిత్త్వము లేని పక్షమున గుణము వచ్చి "ద్యోతిత్వా" అనియు, కిత్త్వ పక్షమున గుణము రాదు గాన "ద్యుతిత్వా" అనియు రెండు రూపము లగును. ఇట్లే హలాదియు, ఇకారోపధమును రలంతమును అగు 'లిఖ్'ధాతువుకంటె పరమైన సేట్ క్త్వాప్రత్యయమునకు కిత్త్వవికల్పముచే 'లిఖిత్వా' 'లేఖిత్వా' అను రూపద్వయము సిద్ధించినది.

ధాతువునకు ఇకారము గాని ఉకారము గాని ఉపధగా నుండవలె నని చెప్పుటచే ఋకారోపధ మగు 'వృత్'ధాతువుకంటె పరమైన 'క్త్వా'కు కిత్త్వ వికల్పము లేదు. పై సూత్రముచే కిత్త్వము నిత్యముగ నిషేధింపబడుటచే లఘూపధగుణము వచ్చి 'వర్తిత్వా' అను ఒక్క రూపమే సిద్ధించినది.

సివ్ధాతువు హలాదియు, ఇకారోపధముఐనను రలంతము కాదు గాన, దానికంటె పర మగు క్త్వాప్రత్యయమునకు కిత్త్వవికల్పము లేదు. పూర్వసూత్రముచే కిత్త్వము నిత్యముగ నిషిద్ధమై గుణము వచ్చి 'సేవిత్వా' అను రూపము సిద్ధించినది.

ఇష్ధాతువుఇకారోపధము. రలంతము ఐనను, హలాది కాకుండుటచే ఈ సూత్రము ప్రవర్తింపదు. పూర్వసూత్రముచే కిత్వము నిషిద్ధమై గుణము వచ్చుటచే 'ఏషిత్వా' అను రూపము సిద్ధించినది.

'సేట్ అగు క్త్వాసన్‌ప్రత్యయములకు' అనుటచే అనిట్ అగు భుజ్ ధాతువుకంటె పర మగు క్త్వాప్రత్యయమునకు ఇడాగమము రాదు గాన దాని విషయమున ఈ సూత్రము ప్రవర్తింపదు. పూర్వసూత్రము కూడ ప్రవర్తింపదు. 'భుజ్ త్వా'అని యుండగా జకారమునకు కుత్వముచే కకారము వచ్చి 'భుక్త్వా'యను గుణరహిత మగు రూప మొక్కటియే సిద్ధించును.

885. ఉదితో వా. 7.2.56

ఉదితః పరస్య క్త్వ ఇడ్వా. శమిత్వా;శాన్త్వా. దేవిత్వా;ద్యూత్వా. దధాతేర్హిః-హిత్వా.

'జ్రావ్రశ్చ్యోః క్త్వి'నుండి 'క్త్వి', 'వసతిక్షుధోరిట్'నుండి 'ఇట్' అనువర్తించును. ఉదిత్ అగు ధాతువుకంటె పర మగు క్త్వాప్రత్యయమునకు ఇడాగమము వికల్పముగ వచ్చును.

శమిత్వా, శాన్త్వా: 'శముఉపశమే'అను సేట్ ధాతువు ఉదిత్‌గాన దానికంటె పర మగు త్వాప్రత్యయమునకు ఈ సూత్రముచే ఇడాగమవికల్పము. ఇడాగమపక్షమున 'శమిత్వా'అనురూపము సిద్ధించును. ఇడాగమము రాని పక్షమున "అనునాసికస్య క్విఝలోః"అను సూత్రముచే (730) ఉపధాఅకారమునకు దీర్ఘము-'శామ్‌త్వా'అని యుండగా మకారమునకు అనుస్వార పరసవర్ణములు (సూ-78,79) 'శాన్త్వా'.

దేవిత్వా; ద్యూత్వా:- ఉదిత్ అగు దివు ధాతువుకంటె (సేట్) పర మగు క్త్వాప్రత్యయమునకు ఈ సూత్రముచే ఇడ్వికల్పము. ఇడాగమపక్షమున 'దివ్ ఇ త్వా'అని యుండగా 'న క్త్వా సేట్'అను సూత్రముచే (883) కిత్త్వము నిషేధింపబడినది గాన లఘూపధగుణమువచ్చి'దేవిత్వా'అను రూపము సిద్ధించును. ఇడాగమాభావపక్షమున 'చ్ఛ్వోఃశూడనునాసికేచ'అను సూత్రముచే (846) వకారమునకు ఊఠ్‌ఆదేశము - 'దిఊఃత్వా'యణాదేశము -"ద్యూత్వా". హిత్వా:- 'ధా'ధాతువుకంటె క్త్వాప్రత్యయము. 'త్వా'అనునది తకారాది కిత్‌ప్రత్యయము గాన 'దధాతేర్హిః'అను సూత్రముచే (829) 'ధా'అనుదానికి 'హి'ఆదేశము- 'హిత్వా'.

886. జహాతేశ్చ క్త్వి. 7.4.43

హిత్వా. హాఙస్తు-హాత్వా.

ఈ సూత్రముచే ద్విత్వము. శ్రావం శ్రావమ్:- (విని విని) శ్రుధాతువుకంటె ఆభీక్ష్ణ్యార్థమున 'ణముల్' ప్రత్యయము. ఉకారమునకువృద్ధి (సూ-182) పిదప ఆవాదేశము. ప్రకృతసూత్రముచేద్విత్వము.

890. అన్యథైవం కథం ఇత్థంసు సిద్ధాప్రయోగశ్చేత్. 3.4.27

ఏషు కృఞో ణముల్ స్యాత్ సిద్ధోఽప్రయోగోఽస్య, ఏవం భూతశ్చేత్ కృఞ్, వ్యర్థత్వాత్ప్రయోగానర్హ ఇత్యర్థః .అన్యథా కారం. ఏవంకారం, ఇత్థం కారంభుఙ్క్తే. సిద్ధేతికిమ్? శిరోన్యథా కృత్వా. ఇత్యుత్తర కృదన్తమ్.

ఇతికృత్ప్రకరణమ్.

"కర్మణ్యాక్రోశే కృఞః ఖముఞ్" నుండి 'కృఞః' అనువర్తించును. 'అన్యథా', 'ఏవం', 'కథం', 'ఇత్థం' అను అవ్యయములు ఉపపదములుగా నున్నపుడు సిద్ధాప్రయోగ మగు కృఞ్ధాతువునకు 'ణముల్'ప్రత్యయము వచ్చును. దేనియొక్క అప్రయోగము సిద్ధమో అది సిద్ధాప్రయోగము. అనగా ఈ కృఞ్ధాతువును ప్రయోగింపకున్నను అర్థములో విశేషము ఏమియు లేకుండుటచే దీని ప్రయోగము వ్యర్థ మని యర్థము.

అన్యథాకారం, ఏవంకారం, ఇత్థంకారం భుఙ్క్తే:- మరియొక విధముగా, ఈవిధముగా భుజించుచున్నాడు. ఇచట 'అన్యథా'ఇత్యాదుల కే యర్థమో "అన్యథాకారం" ఇత్యాదులకు గూడ అదియే యర్థ మగుటచే కృఞ్ధాతుప్రయోగముచే విశేషార్థ మేదియు లేదు గాన ఈ సూత్రముచే కృఞ్ధాతువుకంటె ణముల్ ప్రత్యయము వచ్చి, పిదప "అచోఞ్ణితి"అను సూత్రముచే (182)వృద్ధి చేయగా 'అన్యథా కారం'ఇత్యాదిరూపము లైనవి.

'సిద్ధాప్రయోగః'అనుటచే కృఞ్ధాతువుప్రయోగముచే అర్థవిశేష మేమైన ఉన్న పక్షమున ఈ సూత్రము ప్రవర్తింపదు. అందుచే 'శిరోఽన్యథా కృత్వా' ఇత్యాదిస్థలములందు 'శిరస్సును మరియొక విధముగ నుంచి'అని కృఞ్ధాత్వర్థము కూడ బోధింపబడుచున్నది గాన 'అన్యథా'అనునది ఉపపదముగ నున్నను 'ణముల్'రాలేదు. క్త్వాప్రత్యయము మాత్రము వచ్చినది.

ఉత్తరకృదన్తప్రకరణము సమాప్తము.

కృదన్తప్రకరణము సమాప్తము.

# అథ విభక్త్యర్థప్రకరణమ్

891. *ప్రాతిపదికార్థ-లిఙ్గ-పరిమాణ-వచన-మాత్రే ప్రథమా.* 2.3.46

నియతోపస్థికః ప్రాతిపదికార్థః. **మాత్ర**శబ్దస్య ప్రత్యేకం యోగః. ప్రాతిపదికార్థమాత్రే లిఙ్గమాత్రాద్యాధిక్యే, పరిమాణమాత్రే, సంఖ్యామాత్రే చ ప్రథమా స్యాత్. ప్రాతిపదికార్థమాత్రే- ఉచ్చైః, నీచైః, కృష్ణః, శ్రీః, జ్ఞానమ్. లిఙ్గమాత్రే-తటః, తటీ, తటమ్. పరిమాణమాత్రే-ద్రోణో వ్రీహిః. వచనమ్-సంఖ్యా. ఏకః, ద్వౌ, బహవః.

ప్రాతిపదికమును ఉచ్చరించగనే స్ఫురించు అర్థము ప్రాతిపదికార్థము. ప్రాతిపదికార్థశ్చ, లింగఞ్చ, పరిమాణఞ్చ వచనం చ ప్రాతికార్థ లిఙ్గపరిమాణవచనాని, ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనాన్యేవ ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనమాత్రమ్-అని విగ్రహము. మాత్రశబ్దముద్వంద్వసమాసాంతమున నున్నదిగాన "ద్వంద్వాన్తేశ్రూయమాణం పదం ద్వంద్వఘటకపదైర్నిత్యమభిసంబధ్యతే" అను న్యాయముచే, ఈ సమాసములో నున్న పదములతో ప్రత్యేకముగ సంబంధించును. కావున ప్రాతిపదికార్థమాత్రే, లిఙ్గమాత్రే, పరిమాణమాత్రే, వచనమాత్రే అను నర్థమువచ్చును. ప్రాతిపదికార్థమాత్రమునందును, లింగపరిమాణాదిమాత్రములు అధికముగ (ప్రాతిపదికార్థముతోపాటు) బోధింపబడుచున్నపుడును, సంఖ్యామాత్రార్థమునందును ప్రథమ వచ్చును.

ప్రాతిపదికార్థము విషయమున మతభేదములు గలవు. [1]ప్రవృత్తినిమిత్తము, వ్యక్తిఅను రెండును ప్రాతిపదికార్థము లనికొందరి మతము. అనగా ప్రాతిపదికముచే గోత్వాదిరూపజాతియు, గవాదిరూపవ్యక్తియుబోధింపబడునని యర్థము. ఈ రెండే కాక లింగము కూడ బోధింపబడును గాన ప్రవృత్తినిమిత్త, వ్యక్తి,లింగము లను త్రికమును ప్రాతిపదికార్థ మని కొందరి మతము. ప్రవృత్తినిమిత్తము,వ్యక్తియు,లింగము,సంఖ్యయు అను చతుష్కము ప్రాతిపదికార్థమని

---

1. ప్రవృత్తినిమిత్త మనగా ఒక శబ్దమును ప్రయోగించుటకు కారణభూతమైనదని యర్థము. ఉదాహరణకు 'గో' అను శబ్దమును ప్రయోగించుటకు 'గోత్వము' అను జాతి నిమిత్తము గాన అది ప్రవృత్తినిమిత్తము-అనగా అర్థము.

'దధాతేర్హిః' నుండి 'హిః'అనువర్తించును. 'ఓహాక్త్యాగే'అనుధాతువు నకు గూడ క్త్వా ప్రత్యయము పర మగునపుడు 'హి'అను నాదేశము వచ్చును. హిత్వా:- 'ఓహాక్ త్యాగే'అను ధాతువుకంటె క్త్వా ప్రతయము-"హాత్వా"అని యుండగా ఈ సూత్రముచే 'హి'ఆదేశము-"హిత్వా".

ఈసూత్రముచే ఓహాక్త్యాగే అనుధాతువునకే 'హి'ఆదేశమువిధింపబడుటచే 'ఓహాఙ్ గతౌ'అనుధాతువునకు రాదు. దానికంటె క్త్వాప్రత్యయము చేర్చగా 'హాత్వా'అను రూపము సిద్ధించును.

## 887. సమాసేఽనఞ్పూర్వేక్త్వోల్యప్. 7.1.37

అవ్యయపూర్వపదేఽనఞ్సమాసే క్త్వో ల్యప్ ఆదేశః స్యాత్. తుక్-ప్రకృత్య, అనఞ్ కిమ్-అకృత్వా.

నఞ్భిన్న మగు అవ్యయము పూర్వపదముగా గల సమాసమునందు క్త్వా ప్రత్యయమునకు 'ల్యప్'అను నాదేశము వచ్చును.'ల్యప్'లోని లకారపకారములు ఇత్సంజ్ఞకములు, 'య'శేషించును. ప్రకృత్య:- క్త్వాప్రత్యయాంత మగు 'కృత్వా'అను కృదంత అవ్యయముతో 'ప్ర'అను ఉపసర్గకు 'కుగతిప్రాదయః' అనుసూత్రముచే (952) సమాసము. సమాసము చేసిన పిమ్మట ఈ సూత్రముచే 'క్త్వా'కు ల్యబాదేశము-'ప్రకృయ'అని యుండగా 'ల్యప్' పిత్ గాన 'హ్రస్వస్య పితి కృతి తుక్'అను సూత్రముచే (780) తుగాగము-'ప్రకృత్య'.

నఞ్కంటె భిన్న మగు అవ్యయము పూర్వపదముగ నుండవలె నని చెప్పుటచే, 'కృత్వా'అను కృదంతముతో 'నఞ్'అను సూత్రముచే(949)నఞ్కు సమాసము చేసిన పిమ్మట 'నలోపో నఞః'అను సూత్రముచే (950) నకారలోపము చేయగా సిద్ధించిన 'అకృత్వా' అను సమాసమునందు, 'క్త్వా'కు 'ల్యప్' రాలేదు.

## 888. ఆభీక్ష్ణ్యే ణముల్ చ. 3.4.22

ఆభీక్ష్ణ్యే ద్యోత్యే పూర్వవిషయే ణముల్ స్యాత్ క్త్వా చ.

నైరంతర్యము (ఎడతెరిపిలేకుండుట లేక మాటిమాటికి) అను నర్థము ద్యోత్య మగునపుడు క్త్వాప్రత్యయము రావలసి యున్న స్థలములందు ణముల్ ప్రత్యయము కూడ వచ్చును. 'చ' అనుటచే క్త్వాప్రత్యయమును రావచ్చును. 'ణముల్'లోని ణకార, ఉకారమకారములు ఇత్సంజ్ఞకములు. 'అమ్'మాత్రము

శేషించును. దీనిని చేర్చుటచే నిష్పన్నమైన శబ్దములు 'కృన్మేజన్తః' అను సూత్రముచే (370) అవ్యయము లగును.

889. నిత్యవీప్సయోః. 8.2.4

ఆభీక్ష్ణ్యే వీప్సాయాం చ ద్యోత్యే పదస్య ద్విత్వం స్యాత్. ఆభీక్ష్ణ్యం తిఙన్తేష్వవ్యయసంజ్ఞకేషు కృదన్తేషు. స్మారం స్మారం నమతి శివమ్. స్మృత్వా స్మృత్వా. పాయం పాయమ్. భోజం భోజమ్. శ్రావం శ్రావమ్.

'సర్వస్య ద్వే'అనుఅధికారసూత్రము అనువర్తించును. 'పదస్య'అను రాబోవు అధికారసూత్రము అపకృష్ట మగును. 'నిత్య'అనుదానికి నిత్యత్వము-అనగా పౌనఃపున్యము, ఆభీక్ష్ణ్యము-అని యర్థము. 'వీప్స'అనగా "సర్వవ్యాప్తీచ్ఛ"అని యర్థము. ప్రకృతమున సర్వవ్యాప్తి-అంతకును సంబంధించి యుండుట-అని యర్థము.

అభీక్ష్ణ్యార్థము,వీప్సార్థము ద్యోత్య మగునపుడు పదమునకు ద్విత్వము వచ్చును.

ఈనైరంతర్య మనునది తిఙంతవాచ్యక్రియల విషయమునను అవ్యయసంజ్ఞకము లగు కృదంతములచే బోధ్యములగు క్రియల విషయమునను చెప్పబడును.

'స్మారం స్మారం నమతి శివమ్':- శివుని స్మరించి స్మరించి నమస్కరించుచున్నాడు. ఇచట స్మరణక్రియ అవిచ్ఛిన్నముగ జరుగుచున్నదను విషయమును సూచించుటకై 'స్మృ'ధాతువుకంటె పూర్వసూత్రముచే 'ణముల్' ప్రత్యయము. 'ణముల్'ణిత్‌గాన వృద్ధి (సూ-182) (ఆర్)-'స్మారమ్'అను రూపము సిద్ధించును. దానికి పై సూత్రముచే ద్విత్వము-"స్మారంస్మారమ్". 'ణముల్' రాని పక్షమున క్త్వాప్రత్యయము,పై సూత్రముచే అక్త్వా ప్రత్యయాంతమునకు ద్విత్వము వచ్చి "స్మృత్వాస్మృత్వా"అను రూపము సిద్ధించును. పాయం పాయమ్:- 'పా పానే'లేక"పా రక్షణే"అను ధాతువుకంటె ఆభీక్ష్ణ్యార్థమున ణముల్‌ప్రత్యయము. "ఆతో యుక్ చిణ్‌కృతోః"అను సూత్రముచే (760) యుగాగమము. 'నిత్యవీప్సయోః'అను సూత్రముచే (889) ద్విత్వము-"పాయం పాయమ్" "త్రాగిత్రాగి"లేక "రక్షించిరక్షించి". భోజంభోజమ్:- మాటిమాటికి భుజించి, భుజ్‌ధాతువుకంటె ణముల్ ప్రత్యయము; పిమ్మట లఘూపధగుణము.

ఈ సూత్రముచే ద్విత్వము. శ్రావం శ్రావమ్:- (విని విని) శ్రుధాతువుకంటె అభీక్ష్ణ్యర్థమున 'ణముల్' ప్రత్యయము. ఉకారమునకువృద్ధి (సూ-182) పిదప అవాదేశము. ప్రకృతసూత్రముచేద్విత్వము.

890. అన్యథైవం కథం ఇత్థంసు సిద్ధాప్రయోగశ్చేత్. 3.4.27

ఏషు కృఞో ణముల్ స్యాత్ సిద్ధోఽప్రయోగోఽస్య, ఏవం భూతశ్చేత్ కృఞ్, వ్యర్థత్వాత్ప్రయోగానర్హ ఇత్యర్థః. అన్యథా కారం. ఏవంకారం, ఇత్థం కారంభుఙ్క్తే. సిద్ధేతికిమ్? శిరోఽన్యథా కృత్వా. ఇత్యుత్తర కృదన్తమ్.

ఇతికృత్ప్రకరణమ్.

"కర్మణ్యాక్రోశే కృఞః ఖముఞ్" నుండి 'కృఞః' అనువర్తించును. 'అన్యథా', 'ఏవం', 'కథం', 'ఇత్థం' అను అవ్యయములు ఉపపదములుగా నున్న పుడు సిద్ధాప్రయోగ మగు కృఞ్ధాతువునకు 'ణముల్' ప్రత్యయము వచ్చును. దేనియొక్క అప్రయోగము సిద్ధమో అది సిద్ధాప్రయోగము. అనగా ఈ కృఞ్ధాతువును ప్రయోగింపకున్నను అర్థములో విశేషము ఏమియు లేకుండు టచే దీని ప్రయోగము వ్యర్థ మని యర్థము.

అన్యథాకారం, ఏవంకారం, ఇత్థంకారం భుఙ్క్తే:- మరియొక విధముగా, ఈవిధముగా భుజించుచున్నాడు. ఇచట 'అన్యథా'ఇత్యాదుల కే యర్థమో "అన్యథాకారం" ఇత్యాదులకు గూడ అదియే యర్థ మగుటచే కృఞ్ధాతుప్రయోగముచే విశేషార్థ మేదియు లేదు గాన ఈ సూత్రముచే కృఞ్ధాతువుకంటె ణముల్ ప్రత్యయము వచ్చి, పిదప "అచోఞ్ణితి"అను సూత్రముచే (182)వృద్ధి చేయగా 'అన్యథా కారం'ఇత్యాదిరూపము లైనవి.

'సిద్ధాప్రయోగః'అనుటచే కృఞ్ధాతుప్రయోగముచే అర్థవిశేష మేమైన ఉన్న పక్షమున ఈ సూత్రము ప్రవర్తింపదు. అందుచే 'శిరోఽన్యథా కృత్వా' ఇత్యాదిస్థలములందు 'శిరస్సును మరియొక విధముగ నుంచి'అని కృఞ్ధాత్వర్థము కూడ బోధింపబడుచున్నది గాన 'అన్యథా'అనునది ఉపపదముగ నున్నను 'ణముల్'రాలేదు. క్త్వాప్రత్యయము మాత్రము వచ్చినది.

ఉత్తరకృదన్తప్రకరణము సమాప్తము.

కృదన్తప్రకరణము సమాప్తము.

# అథ విభక్త్యర్థప్రకరణమ్

891. *ప్రాతిపదికార్థ-లిఙ్గ-పరిమాణ-వచన-మాత్రే ప్రథమా.* 2.3.46

నియతోపస్థితికః ప్రాతిపదికార్థః. **మాత్ర**శబ్దస్య ప్రత్యేకం యోగః. ప్రాతిపదికార్థమాత్రే లిఙ్గమాత్రాద్యాధిక్యే, పరిమాణమాత్రే, సంఖ్యామాత్రే చ ప్రథమా స్యాత్. ప్రాతిపదికార్థమాత్రే- ఉచ్చైః, నీచైః, కృష్ణః, శ్రీః, జ్ఞానమ్. లిఙ్గమాత్రే-తటః, తటీ, తటమ్. పరి**మాణ**మాత్రే-ద్రోణో వ్రీహిః. వచనమ్-సంఖ్యా. ఏకః, ద్వౌ,బహవః.

ప్రాతిపదికమును ఉచ్చరించగనే స్ఫురించు అర్థము ప్రాతిపదికార్థము. ప్రాతిపదికార్థశ్చ, లింగఞ్చ, పరిమాణఞ్చ వచనం చ ప్రాతికార్థ లిఙ్గపరిమాణవచనాని,ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనాన్యేవ ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనమాత్రమ్-అని విగ్రహము. మాత్రశబ్దముద్వంద్వసమాసాంతమున నున్నదిగాన "ద్వంద్వాన్తేశ్రూయమాణం పదం ద్వంద్వఘటకపదైర్నిత్యమభిసంబధ్యతే" అను న్యాయముచే, ఈ సమాసములో నున్న పదములతో ప్రత్యేకముగ సంబంధించును, కావున ప్రాతిపదికార్థమాత్రే,లిఙ్గమాత్రే, పరిమాణమాత్రే, వచనమాత్రే అను నర్థమువచ్చును. ప్రాతిపదికార్థమాత్రమునందును, లింగపరిమాణాదిమాత్రములు అధికముగ (ప్రాతిపదికార్థముతోపాటు) బోధింపబడుచున్నపుడును, సంఖ్యామాత్రార్థమునందును ప్రథమ వచ్చును.

ప్రాతిపదికార్థము విషయమున మతభేదములు గలవు. [1]ప్రవృత్తినిమిత్తము, వ్యక్తిఅను రెండును ప్రాతిపదికార్థము లనికొందరి మతము. అనగా ప్రాతిపదికముచే గోత్వాదిరూపజాతియు, గవాదిరూపవ్యక్తియుబోధింపబడునని యర్థము. ఈ రెండే కాక లింగము కూడ బోధింపబడును గాన ప్రవృత్తినిమిత్త, వ్యక్తి,లింగము లను త్రికమును ప్రాతిపదికార్థ మని కొందరి మతము. ప్రవృత్తినిమిత్తము,వ్యక్తియు,లింగము,సంఖ్యయు అను చతుష్కము ప్రాతిపదికార్థమని

1. ప్రవృత్తినిమిత్త మనగా ఒక శబ్దమును ప్రయోగించుటకు కారణభూతమైనదని యర్థము. ఉదాహరణకు 'గో' అను శబ్దమును ప్రయోగించుటకు 'గోత్వము' అను జాతి నిమిత్తము గాన అది ప్రవృత్తినిమిత్తము-అనగా అర్థము.

కొందరి మతము. ప్రవృత్తినిమిత్తము, వ్యక్తి, లింగము, సంఖ్య, కారకము అను పంచకము ప్రాతిపదికార్థము అని మరి యొకమతము. ఈమతములలో త్రికాది పక్షమును అంగీకరించిన పక్షమున లింగాదులు గూడ ప్రాతిపదికార్థములే యగును గాన వాటిని గ్రహించుట వ్యర్థము. అందుచే ఇచట నియతోపస్థిక మగునదే- అనగా ప్రాతిపదికమును ఉచ్చరింపగనే ఏ యర్థము స్ఫురించునో అట్టి జాతి వ్యక్తిరూపార్థముమాత్రమే—ప్రాతిపదికార్థ మని చెప్పబడినది. తటః, తటీ, తటమ్, ఇత్యాదులందు ప్రాతిపదికశ్రవణమాత్రముచే లింగము నియతముగ స్ఫురించుట లేదు గాన ఇట్టి అనియతలింగముగల ప్రాతిపదికములలోని లింగము ప్రాతికార్థము కాజాలదు. కావున వాటిని సంగ్రహించుటకై 'లింగ'పదము గ్రహింపబడినది 'కృష్ణః' ఇత్యాదులలోని లింగము ప్రాతిపదికోచ్చారణమాత్రముచేతనే స్ఫురించుచున్నది గాన అట్టి స్థలములలోని లింగము ప్రాతిపదికార్థము. కావున 'లింగ' అనుదానికి అనియతలింగములగు 'తట' శబ్దాదులు ఉదాహరణము.

ప్రాతిపదికమును ఉచ్చరించిన వెంటనే మొదట జాతివ్యక్తిరూపము లగు దాని యర్థయలు స్ఫురించును. లింగపరిమాణములు ప్రాతిపదికార్థము స్ఫురించిన పిమ్మటనే స్ఫురించును గాని స్వతంత్రముగ స్ఫురింపజాలవు. అందుచే 'లింగమాత్రే' ఇత్యాదులకు "లింగాద్యర్థములు మాత్రము ప్రాతిపదికార్థముకంటె అధికముగ బోధింపబడినను" (లింగమాత్రాద్యాధిక్యే) అని యర్థము. అనగా ప్రాతిపదికార్థముతో పాటు లింగ, ప్రమాణములుమాత్రమే బోధితము లగునపుడు గూడ ప్రథమ వచ్చు నని యర్థము.

ఉచ్చైః, నీచైః, కృష్ణః, శ్రీః, జ్ఞానమ్:- ఈ ఐదును 'ప్రాతిపదికార్థమాత్రే' అనుదానికి ఉదాహరణము. లింగరహితము లగు అవ్యయములును, నియతలింగము లగు 'కృష్ణః' ఇత్యాదిపదములును 'ప్రాతిపదికార్థమాత్రే అను దానికి ఉదాహరణము. అవ్యయముకంటె వచ్చిన ప్రథమవిభక్తి ప్రత్యయమునకు 'అవ్యయాదాప్సుపః' అనుసూత్రముచే (373) లోపము వచ్చును. ఐనను పదత్వసంజ్ఞకై సుబుత్పత్తి ఆవశ్యకము. కృష్ణః, శ్రీః, జ్ఞానం అను పదములలో పుంస్త్వ, స్త్రీత్వనపుంసకత్వములు నియతముగ భాసించును గాన ఇచట వీటి లింగము గూడ ప్రాతిపదికార్థముగ గ్రహింపబడును. 'కృష్ణ'శబ్దమునకు 'నల్లనిది' అను నర్థము చెప్పిన పక్షమున అది అనియతలింగ మగును గాన అది 'ప్రాతిపదికార్థమాత్రే' అనుదానికి ఉదాహరణముకాదు; 'లింగమాత్రాధిక్యే' అను దానికి ఉదాహరణ మగును.

తటః, తటీ, తటమ్:- ఇది లింగమాత్రాధిక్యమునకు ఉదాహరణము, ఇచట ప్రాతిపదికార్థముతో పాటు పుంస్త్వాదిలింగములు గూడ అధికముగ బోధింపబడుచున్నవి. అందుచే ప్రథమవిభక్తిప్రత్యయ మగు 'సు'వచ్చి 'తటః' ఇత్యాదిరూపములు సిద్ధించినవి. అనగా ఈ ప్రథమవిభక్తిప్రత్యయమునకు లింగమేఅర్థము

ద్రోణో వ్రీహిః:- ఇది 'పరిమాణమాత్రాధిక్యే' అనుదానికి ఉదాహరణము. 'ద్రోణ'శబ్దమునకు ద్రోణ మనెడు పరిమాణవిశేషము అర్థము. దానికంటె పరముగ ఈ సూత్రముచే వచ్చిన ప్రథమవిభక్తికి పరిమాణసామాన్యము అర్థము. ఈ రెండింటికిని అభేదాన్వయముచే "ద్రోణాభిన్నపరిమాణము"అని యర్థము. ఈ విధముగ ప్రకృత్యర్థప్రత్యయార్థములకు అభేదసంబంధముచే అన్వయము. 'ద్రోణో వ్రీహిః'అను నపుడు ప్రత్యయార్థ మగు ప్రమాణమునకు 'వ్రీహి'శబ్దముతో పరిచ్ఛేద్యపరిచ్ఛేదకసంబంధముచే అన్వయము. పరిచ్ఛేద్యమనగా కొలవ దగినది. పరిచ్ఛేదకమనగా కొలుచునది. ఇచట ద్రోణము పరిచ్ఛేదకము; వ్రీహి పరిచ్ఛేద్యము. అందుచే ద్రోణరూప మగు పరిమాణముచే పరిచ్ఛిన్న మగు వ్రీహి అని యర్థము.

సూత్రములోని 'వచన' అనుదానికి సంఖ్య యని యర్థము. దానికి 'ఏకః, ద్వౌ, బహవః' ఇత్యాదులు ఉదాహరణము. ఇచట ఏక,ద్వి,బహుఅను ప్రాతిపదికములే ఏకత్వద్విత్వబహుత్వ సంఖ్యలను బోధించుచున్నవి గాన మరల ఏకత్వద్విత్వాది బోధకము లగు విభక్తిప్రత్యయములను చేర్చుట అనావశ్య ము గాన "ఉక్తార్థానామప్రయోగః"అనున్యాయముచే అవి వచ్చుట లేదు. అందుచే ఆ విభక్తిప్రత్యయములను చేర్చుటకై సూత్రమున 'వచన'అనునది గ్రహింపబడినది. అందుచే 'ఏక'ఇత్యాదిపదములకంటె పదత్వసంజ్ఞాప్రాప్తికై చేర్చబడిన విభక్తిప్రత్యయములు ప్రకృత్యర్థ మగు ఏకత్వాద్యర్థమును కేవలము అనువదించును.

## 892. సమ్బోధనే చ 2.3.47

ప్రథమా స్యాత్. హేరామ.

సంబోధన మనగా ఎదుట నున్నవానిని పిలచుట. ఆ అర్థమునందు గూడ ప్రాతిపదికముకంటె ప్రథమవిభక్తి వచ్చును.

ఉదా:- హేరామ:- ఇచట ఇది సంబోధన మని సూచించుటకు 'హే' అనునది గూడ చేర్చబడినది. సంబోధనార్థమున రామశబ్దముకంటె ప్రథమా విభక్తి వచ్చినది.

### 893. కర్తురీప్సితతమం కర్మ 1.4.49

కర్తుః క్రియయా ఆప్తుమిష్టతమం కారకం కర్మసంజ్ఞం స్యాత్.

'కారకే'యని అధికారము. కర్త క్రియచే దేనిని-పొందుటకై ఎక్కువ అభిలషించునో అట్టి కారకమునకు కర్మ యని పేరు.

ధాతూపాత్త మగు వ్యాపారమునకు ఆశ్రయ మగువాడు కర్త. ఆప్తుం ఇష్యమాణం ఈప్సితం. అత్యన్తం ఈప్సితం ఈప్సితతమమ్. పొందుటకై ఎక్కువగ అభిలషింపబడినది అని యర్థము. 'దేని ద్వారా పొందుట' అను ఆకాంక్ష కలిగినపుడు కర్తయందున్న 'వ్యాపారము ద్వారా' అనునది అర్థాత్ లభ్యమగును. కర్త తనయం దున్న వ్యాపారముచే ప్రయోజ్య మగు ఫలముతో దేనికి సంబంధమును ఏర్పరుచుటకై ప్రయత్నించునో అది కర్మ యని పరినిష్ఠితార్థము. ఉదాహరణమునకు- 'తణ్డులాన్ పచతి' అను నపుడు పచ్ ధాతువునకు విక్లిత్త్యనుకూల వ్యాపారము అర్థము. తణ్డులాదులు ఉడికి మెత్తగానగుటకు విక్లిత్తి యని పేరు. గిన్నె పొయ్యిపై నుంచుట, నీళ్ళు పోయుట, మంట పెట్టుట మొదలగునది విక్లిత్త్యనుకూల వ్యాపారము. ఈ వ్యాపారముచే లభ్య మగు విక్లిత్తిరూపఫలము తండులములలో నుండుటచే వాటికి కర్మత్వము.

కరోతీతి కారకమ్. క్రియను జనింప చేయునది కారకము. లేదా క్రియాన్వయిత్వం కారకత్వమ్. అనగా ప్రత్యక్షముగ గాని పరోక్షముగ గాని క్రియతో సంబంధించునది కారకము. కారకములు ఏడు. కర్త, కర్మ, కరణము, హేతువు, సంప్రదానము, అపాదానము, అధికరణము. అందు కర్తృ, కర్మ, కరణకారకములు క్రియతో ప్రత్యక్షముగ సంబంధించును. ఇతర కారకములు కర్తృకర్మాదులద్వారా సంబంధించును.

### 894. కర్మణి ద్వితీయా 2.3.2

అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్. హరిం భజతి. అభిహితే తు కర్మాదౌ ప్రథమా-హరిః సేవ్యతే. లక్ష్మ్యా సేవితః.

'అనభిహితే' అధికారము. అనభిహితమనగా అనుక్తము. కర్మ (తిఙాదులచే) చెప్పబడకున్నపుడు ప్రాతిపదికముకంటె ద్వితీయవిభక్తి వచ్చును.

హరిం భజతి:- హరిని సేవించుచున్నాడు. భజ్ధాతువునకు సంతుష్ట్యనుకూల పూజనాదివ్యాపారము అర్థము. "పూజాదివ్యాపారముచే హరిని సంతోషపెట్టుచున్నాడు" అని అర్థము. తుష్టిరూపఫలమునకు ఆశ్రయము గాన హరి కర్మ. 'భజతి' అనునపుడు 'తిఙ్' ప్రత్యయము కర్త్రర్థకము గాన కర్తను చెప్పుచున్నది గాని కర్మను చెప్పుట లేదు. అందుచే కర్మ అనభిహితము. కావున కర్మవాచకమగు హరిశబ్దమునకు ద్వితీయ వచ్చినది.

సాధారణముగ కర్మ తిఙ్, కృత్, తద్ధిత, సమాసములచే చెప్పబడుచుండును. ఉదా:- 'హరిః సేవ్యతే'- ("హరిసేవింపబడుచున్నాడు") అనునపుడు కర్మార్థక మగు తిఙ్ప్రత్యయము కర్మను బోధించుచున్నది. 'లక్ష్మ్యా సేవితః' (లక్ష్మిచే సేవింపబడినవాడు) ఇత్యాదులందు కర్మార్థక క్తప్రత్యయముచే కర్మ బోధింపబడుచున్నది. 'శతేన క్రీతః-శత్యః-' (శతముచే కొనబడినది) అనునపుడు తద్ధిత మగు యప్రత్యయము కర్మను బోధించుచున్నది. 'ప్రాప్తః ఆనందః యంసః- ప్రాప్తానన్దః' (ఎవనిని ఆనందము పొందినదో ఆతడు) అనునపుడు సమాసము కర్మను బోధించుచున్నది. ఇట్టి స్థలములందు ద్వితీయ రాదు. ప్రాతిపదికార్థమాత్రమున ప్రథమ వచ్చును.

## 895. అకథితం చ 1.4.51

అపాదానాదివిశేషైరవివక్షితం కారకం కర్మసంజ్ఞం స్యాత్.

దుహ్-యాచ్-పచ్-దణ్డ్-రుధి-ప్రచ్ఛి-చి-బ్రూ-శాసు-జి-మథ్-ముషామ్.
కర్మయుక్స్యాదకథితం తథా స్యాన్నీహృకృష్వహామ్.

గాం దోగ్ధి పయః. బలిం యాచతే వసుధామ్. తణ్డులానోదనం పచతి. గర్గాన్ శతం దణ్డయతి, వ్రజం అవరుణద్ధి గామ్. మాణవకం పన్థానం పృచ్ఛతి. వృక్షం అవచినోతి ఫలాని. మాణవకం ధర్మం బ్రూతే శాస్తి వా. శతంజయతి దేవదత్తమ్. సుధాం క్షీరనిధిం మథ్నాతి. దేవదత్తం శతం ముష్ణాతి. గ్రామం అజాం నయతి, హరతి, కర్షతి, వహతి వా. అర్థనిబన్ధనేయం సంజ్ఞా-బలిం భిక్షతే వసుధామ్. మాణవకం ధర్మం భాషతే; అభిధత్తే వక్తీత్యాది.

'అకథితం' అనుదానికి అవివక్షితము-చెప్పుటకు ఇచ్ఛయింప బడనిది— అని యర్థము. అపాదాన, సంప్రదాన, అధికరణాదులను ఆయావిశేషరూప మున చెప్పుటకు అభిలషింపనపుడు (సామాన్యసంబంధమాత్రముగ గ్రహించి నపుడు) ఆకారకములకు కర్మసంజ్ఞ వచ్చును. అపుడు ద్వితీయవిభక్తి వచ్చును. అపాదానాదులను అపాదానాదులుగనే వివక్షించునపుడు మాత్రము వాటికి కర్మ త్వము రాదు. పంచమ్యాది విభక్తులు వచ్చును.

ఏధాతువుల అపాదానాదులు అవివక్షితములగును అను విషయమును వార్తికకారాదులు చెప్పియున్నారు. తదనుసారముగ ఆ ధాతువులు పై కారికలో సంగ్రహింపబడినవి. 1. దుహ్ (పితుకుట), 2. యాచ్ (యాచించుట), 3. పచ్ (వండుట), 4. దణ్డ్ (శిక్షించుట), 5. రుధ్ (అడ్డుపెట్టుట), 6. ప్రచ్ఛ్ (అడుగుట), 7. చి (ఏరుట), 8. బ్రూ (పలుకుట), 9. శాస్ (శిక్షించుట), 10. జి (జయించుట), 11. మథ్ (మథించుట), 12. ముష్ (దొంగిలించుట), 13. నీ (తీసికొనివెళ్లుట), 14. హృ (తీసికొనివెళ్ళుట), 15. కృష్ (లాగుట), 16. వహ్ (మోసికొనిపోవుట) అను ఈ పదునారు ధాతువుల కర్మతో ఏది (ఏ అపాదానాదికము) సంబంధించునో అది అకథితకర్మ యగును.

గాం దోగ్ధి పయః:- ఈ ఉదాహరణమునందు గోవు అపాదానము. కాని దానిని అపాదానముగ వివక్షింపకుండుటచే అది అకథితకర్మ యైనది. ద్వితీయవిభక్తి వచ్చినది. ఈ గోవును అపాదానముగనే వివక్షించిన పక్షమున "గోః దోగ్ధి పయః" (గోవునుండి పాలను పితుకుచున్నాడు) అని పంచమియే వచ్చును. ఇతరోదాహరణములందు గూడ ఈ విధముగనే తెలిసికొనవలెను.

బలిం యాచతే వసుధామ్:- (బలినుండి భూమిని యాచించుచున్నాడు). ఇచట బలియందలి అపాదానత్వము అవిక్షిత మగుటచే కర్మసంజ్ఞ లభించి ద్వితీయ వచ్చినది. తండులానోదనం పచతి:- (బియ్యముతో అన్నము వండు చున్నాడు). ఇచట తండులములందలి కరణత్వము అవివక్షిత మైనది. గర్గాన్ శతం దణ్డయతి:- (గర్గులనుండి నూరు రూపాయలు శిక్షించుచున్నాడు). ఇచట గర్గుల అపాదానత్వము అవివక్షితము. వ్రజం అవరుణద్ధి గామ్:- (గోవును గొల్లపల్లెయందు అడ్డగించుచున్నాడు). వ్రజమునందలి అధికరణత్వము అవి వక్షితము. మాణవకం పన్థానం పృచ్ఛతి:- (పిల్లవానినుండి మార్గమును ప్రశ్నించుచున్నాడు). మాణవకుని యందలి అపాదానత్వము అవివక్షితము.

వృక్షం అవచినోతి ఫలాని:- (వృక్షమునుండి ఫలములను కోయుచున్నాడు). వృక్షముయొక్క అపాదానత్వముఅవివక్షితము. మాణవకంధర్మం బ్రూతేశాస్తి వా. (బాలునకు ధర్మమును చెప్పుచున్నాడు బోధించుచున్నాడు). మాణవకుని సంప్రదానత్వము అవివక్షితము. శతం జయతి దేవదత్తమ్:- (దేవదత్తునినుండి నూరు రూపాయలు జయించుచున్నాడు). దేవదత్తుని అపాదానత్వము అవివక్షితము. సురాం క్షీరనిధిం మథ్నాతి:- (క్షీరసముద్రమునుండి) సుధను మథించుచున్నారు. క్షీరసముద్రమునందలి అపాదానత్వము అవివక్షితము. దేవదత్తం శతం ముష్ణాతి:- (దేవదత్తునినుండి నూరు రూపాయలను అపహరించుచున్నాడు). దేవదత్తుని అపాదానత్వము అవివక్షితము. గ్రామం అజాం నయతి, హరతి, కర్షతి, వహతి వా. (మేకను గ్రామమునందు చేర్చుచున్నాడు.) గ్రామమునందలి అధికరణత్వము అవివక్షితము.

ఈ సూత్రముచే విహిత మగు కర్మసంజ్ఞ అర్థము నాశ్రయించుకొని యుండును. అనగా పై కారికలో పేర్కొనబడిన 'దుహ్' 'యాచ్'మొదలగు ధాతువుల అపాదానాదులకు మాత్రమే కాక ఆ ధాతువులతో సమానార్థకము లగు ఇతరధాతువులను ప్రయోగించినపుడు గూడ (అపాదానత్వాదులు అవివక్షితములైనపుడు) ఈ సూత్రముచే కర్మసంజ్ఞ రావచ్చును. కావున 'బలిం భిక్షతే వసుధామ్'ఇత్యాదులందు యాచ్ ధాత్వర్థక మగు భిక్షధాతువు, 'బ్రూ'ధాత్వర్థకము లగు భాష్‌ధాత్వాదులును ప్రయుక్తములైనపుడు గూడ ఈ సూత్రముచే కర్మసంజ్ఞ లభించినది.

## 896. స్వతన్త్రః కర్తా. 1.4.54

క్రియాయాం స్వాతన్త్ర్యేణ వివక్షితోఽర్థః కర్తా స్యాత్.

కారకాధికార మున్నది గాన 'స్వతంత్రః'అనగా క్రియానిష్పాదనమునందు స్వాతంత్ర్యము కలవాడు లేక కలది అని యర్థము. స్వాతంత్ర్య మనగా ప్రాధాన్య మని భాష్యకారులు చెప్పి యున్నారు. క్రియయందు స్వతంత్రముగ వివక్షింపబడిన అర్థమునకు కర్త యని పేరు.

"సూదః అన్నం పచతి"ఇత్యాదిస్థలములందు వంటచేయుట అను క్రియయందు వంటవానికి స్వాతంత్ర్య మున్నది గాన అతడు కర్త. కాని "స్థాలీ పచతి"ఇత్యాదిస్థలములందు గిన్నెకు పచనక్రియయందు స్వాతంత్ర్యము లేదు గాన అది కర్తకా దని చెప్పవలసి యుండును. అందుచే "స్వాతంత్ర్యేణ వివ

క్షితః"అని వ్యాఖ్యానింపబడినది. అనగా స్థాలికి వాస్తవమున పాకక్రియ విషయమున స్వాతంత్ర్యము లేకున్నను స్వాతంత్ర్య మున్నట్లు వివక్షించుటచే కర్తృత్వము సిద్ధించును. కావుననే "వివక్షితః కారకాణి భవన్తి"అని భాష్యకారవచనము అనగా వక్తయొక్క ఇచ్ఛను బట్టి ఆయా కారకములను ఉపయోగింపవచ్చును. స్వాతంత్ర్య మనగా ధాత్వర్థ మగు వ్యాపారమునకు ఆశ్రయ మగుట. పచధాత్వర్థ మగు స్థాల్యధిశ్రయణాది (గిన్నెపొయ్యిపై నుంచుట మొదలగు) వ్యాపారమునకు సూదుడు ఆశ్రయము గాన ఆతడు కర్త యగును.

897. సాధకతమం కరణమ్. 1.4.42

క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణసంజ్ఞం స్యాత్.

క్రియాసిద్ధివిషయమున ఎక్కువగ ఉపకరించుసాధనమునకు కరణ మని పేరు.

"రామేణ బాణేన హతో వాలీ"అనునపుడు హననక్రియకు బాణము ఎక్కువగ ఉపకరించినది గాన అది కరణము.

898. కర్తృకరణయో స్తృతీయా. 2.3.18

అనభిహితే కర్తరి కరణే చ తృతీయా స్యాత్. రామేణబాణేన హతో వాలీ.

'అనభిహితే'అధికారము. అనభిహిత మగు కర్తను కరణమును బోధించు శబ్దముకంటె తృతీయవిభక్తి వచ్చును.

"రామేణ బాణేన హతో వాలీ" అను ఉదాహరణమునందు హననక్రియయందు స్వతంత్రు డగుటచే రాముడు స్వతంత్రుడు. హననక్రియాసాధన మగుటచే బాణము కరణము. 'హతః'అను పదమునందలి క్తప్రత్యయము కర్మార్థకము గాన కర్మ యగు వాలిని చెప్పుచున్నది గాని కర్తృకరణములను చెప్పుటలేదు. ఈ విధముగ తిఙాద్యనభిహితము లగు కర్తృకరణములను బోధించు 'రామ' 'బాణ'శబ్దములకు తృతీయ వచ్చినది.

899. కర్మణా యమభిప్రైతి స సమ్ప్రదానమ్. 1.4.32

దానస్య కర్మణా యం అభిప్రైతి స సమ్ప్రదానసంజ్ఞః స్యాత్.

కర్త,దానక్రియలో కర్మ యగు గోవు మొదలగువాటిచే ఎవనిని శేషిగా-అనగా భోక్తనుగా-నిశ్చయించునో ఆతనికి సంప్రదాన మని పేరు.

900. చతుర్థీ సమ్ప్రదానే. 2.3.13

విప్రాయ గాం దదాతి.

సంప్రదానార్థమున (సంప్రదానసంజ్ఞ కల పదమునకు) చతుర్థి వచ్చును. 'విప్రాయ గాం దదాతి' అను ఉదాహరణమున గోవు అను కర్మ (దాన కర్మ) బ్రాహ్మణునికై ఉద్దేశింపబడినది గాన బ్రాహ్మణునకు సంప్రదానసంజ్ఞ యుండుటచే బ్రాహ్మణశబ్దమునకు చతుర్థి వచ్చినది.

901 నమః-స్వస్తి-స్వాహా-స్వధా-అలంవషడ్యోగాచ్చ 2.3.16

ఏభిర్యోగే చతుర్థీ. హరయే నమః. ప్రజాభ్యః స్వస్తి. అగ్నయే స్వాహా. పితృభ్యః స్వధా. అలమితి పర్యాప్త్యర్థగ్రహణమ్. తేన దైత్యేభ్యో హరిరలం, ప్రభుః, సమర్థః శక్త ఇత్యాది.

నమః, స్వస్తి, స్వాహా, స్వధా, అలం, వషట్ అను పదములతో సంబంధ మున్నపుడు (వాటితో సంబంధించిన శబ్దమునకు) చతుర్థి వచ్చును.

హరయే నమః- విష్ణువునకు నమస్కారము. ఇచట 'నమః' అను దానితో సంబంధించిన హరి శబ్దమునకు చతుర్థి వచ్చినది. ఇట్లే ఇతరఉదాహరణముల విషయమున గూడ చూచుకొనవలెను. 'ప్రజాభ్యఃస్వస్తి'- ప్రజలకు క్షేమ మగు గాక. "అగ్నయే స్వాహా"- అగ్నికి సమర్పించుచున్నాను. 'పితృభ్యః స్వధా'- పితృదేవతలకు సమర్పించుచున్నాను. దేవతలకు సమర్పించునపుడు 'స్వాహా' అనుపదము, పితృదేవతలకు సమర్పించునపుడు "స్వధా" అను పదమును ప్రయోగింపబడును. ఈ సూత్రములోని 'అలం' అనుదానికి 'అలమ్' అనుపదముతో సమానార్థకము లగు పదములు అని యర్థము అందుచే 'ప్రభుః' 'సమర్థః', 'శక్తః' ఇత్యాదిపదములతో సంబంధ మున్నపుడు గూడ చతుర్థివచ్చును. ఉదా:- "దైత్యేభ్యో హరిరలం, ప్రభుః, సమర్థః శక్తః" ఇత్యాదులు.. హరి దైత్యులకు చాలును-అనగా దైత్యుల నెదుర్కొనుటకు సమర్థుడు అని యర్థము.

902 ధ్రువమపాయేఽపాదానమ్. 1.4.24

అపాయో విశ్లేషః. తస్మిన్ సాధ్యే యద్ ధ్రువం అవధిభూతం కారకం తద్ అపాదానం స్యాత్.

అపాయ మనగా విడివడుట అని యర్థము. ఏదైన ఒక వస్తువు మరి యొక వస్తువునుండి విడివడుచున్న దని చెప్పినపుడు అట్లు విడిపోవుటకు అవధియై ఉండెడు వస్తువునకు అపాదాన మని పేరు.

'వృక్షాత్ పర్ణం పతతి' అనునపుడు ఆకు వృక్షమునుండి పడుచున్నది గాన విడివడు చున్న ఆకునకు వృక్షము అవధి. అందుచే ఆ వృక్షమునకు అపాదాన మని పేరు.

903. అపాదానే పఞ్చమీ 2.3.28

గ్రామాత్ ఆయాతి. ధావతోఽశ్వాత్ పతతి-ఇత్యాది.

అపాదానార్థమునందు పంచమి వచ్చును.

గ్రామాత్ ఆయాతి:- గ్రామమునుండి వచ్చుచున్నాడు. గ్రామముతో కలిసి ఉన్నవాడు గ్రామమునుండి విడివడి బయటకు వచ్చుచున్నా డని అర్థము. ఈ విశ్లేషమునకు గ్రామము అవధిగాన దానికి అపాదానసంజ్ఞ. అందుచే పంచమి వచ్చినది.

'ధ్రువమపాయేఽపాదానమ్' అను సూత్రములోని 'ధ్రువం' అను పదమునకు అవధిగా ఉన్న దని మాత్రమే యర్థము. స్థిరముగా ఉన్నదని యర్థము కాదు. అందుచే "ధావతోఽశ్వాత్ పతతి" ఇత్యాదిస్థలములందు పతనావధి యగు అశ్వము స్థిరము కాకున్నను అపాదానసంజ్ఞ లభించినది.

904 షష్ఠీ శేషే. 2.3.50

కారకప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాదిః సంబన్ధః శేషః-తత్ర షష్ఠీ. రాజ్ఞః పురుషః, కర్మాదీనాంఅపి సమ్బన్ధమాత్రవివక్షాయాం షష్ఠ్యేవ. సతాం గతమ్. సర్పిషో జానీతే. మాతుః స్మరతి. ఏధో దకస్యోపస్కురుతే. భజే శంభోశ్చరణయోః.

శేష మనగా కారకములకంటెను, ప్రాతిపదికార్థముకంటెను భిన్న మగు స్వస్వామిభావాదిసంబంధము (సొత్తు సొత్తుకలవాడు ఇట్టి సంబంధము) అని యర్థము. అట్టి సంబంధార్థమునందు షష్ఠి వచ్చును. ద్వితీయాదివిభక్తులను విధించుటకై కర్మ, కర్తృ, కరణ. సంప్రదానాపాదానాధికరణకారకములుచెప్పబడినవి. ప్రథమకై ప్రాతిపదికార్థము చెప్పబడినది. వీటికంటె భిన్న మగు స్వస్వామిభావాది సంబంధమును బోధించు నపుడు షష్ఠి వచ్చును అని భావము.

'రాజ్ఞః పురుషః' ఇత్యాదులలో రాజుయొక్క పురుషుడు అనునపుడు రాజునకు పురుషునకును మధ్య స్వస్వామిసంబంధమున్నది. రాజు స్వామి: పురుషుడు స్వము ఇట్టి సంబంధమును బోధించుటకై షష్ఠి వచ్చినది. సంబంధమనునది రెండు వస్తువులందును సమముగనే యుండును. అందుచే రాజశబ్దమునకు వలెనే పురుషశబ్దమునకు గూడ షష్ఠి రావలెను కదా యను ఆశంక కలుగవచ్చును. అందుచే షష్ఠి విశేషణపదమునకే వచ్చును గాని విశేష్యమునకు రాదని వైయాకరణులు నిర్ణయించియున్నారు. "రాజ్ఞః పురుషః" అనునపుడు రాజు, పురుషుడు, వారి సంబంధము అను మూడు విషయములు భాసించుచున్నవి. అందు 'పురుషః' అనునది ముఖ్యవిశేష్యము. సంబంధము పురుషునియందు విశేషణము. రాజు సంబంధమునకువిశేషణము. ఈవిధముగ షష్ఠి విశేషణభూతమగు రాజశబ్దమునకే వచ్చును గాని ప్రధానవిశేష్య మగు పురుషశబ్దమునకు రాదు.

సామాన్యసంబంధ మనియు, విశేషసంబంధ మనియు సంబంధము రెండు విధములు. స్వస్వామిభావసంబంధము, పితృపుత్రసంబంధము మొదలగు విశిష్టరూపమున భాసించు సంబంధము విశేషసంబంధము. అట్లుకాక స్థూలముగ సంబంధము అను రూపమున మాత్రమే భాసించు సంబంధము సామాన్య సంబంధము. స్వస్వామిభావాది సంబంధము వలె కర్మత్వకరణత్వాదిసంబంధము గూడ ఒకవిధ మగు విశేషసంబంధము. ఆ సంబంధములను ఆ విశేషరూపమున గాక సామాన్యరూపమున గ్రహించిన పక్షమున అందలి కర్మత్వాదులు భాసింపవు గాన షష్ఠి యే వచ్చును. అందుచే ఈ క్రింది ఉదాహరణములందు షష్ఠి వచ్చినది.

సతాం గతమ్.— సత్పురుషులయొక్క గమనము. ఇచట గమనక్రియయందు సత్పురుషులు కర్త గాన "కర్తృకరణయో స్తృతీయా" అను సూత్రముచే (8.8) తృతీయ రావలసి యున్నది. కాని దానిని కర్తృత్వసంబంధముగ వివక్షింపక సంబంధసామాన్యముగ వివక్షించుటచే షష్ఠి వచ్చినది. కర్తృత్వమును వివక్షించినచో "సద్భిః గతమ్" అని యగును.

సర్పిషో జానీతే:- సర్పిస్సు (నెయ్యి) అను సాధనముచే ప్రవర్తించుచున్నాడు అని యర్థము ప్రవృత్తిక్రియలో సర్పిస్సు సాధనము (కరణము) గాన తృతీయ రావలసి యున్నది. సంబంధసామాన్యవివక్షచే (సర్పిస్సునందలి కరణత్వము వివక్షింపక పోవుటచే) షష్ఠి వచ్చినది. కరణత్వమును వివక్షించినచో "సర్పిషా జానీతే" అని యగును.

మాతుఃస్మరతి:- స్మరణక్రియయందు కర్మ యగు తల్లి యొక్క కర్మత్వమును వివక్షింపక సంబంధసామాన్యమును మాత్రమే వివక్షించుటచే షష్ఠి వచ్చినది. కర్మత్వవివక్షయందు "మాతరం స్మరతి" యని ద్వితీయ వచ్చును.

ఏదోదకస్యోపస్కురుతే:- ఏధశబ్దము అకారాంతపుంలింగము. కట్టె అని యర్థము, ఏధాశ్చ ఉదకం చ తేషాం సమాహారః ఏధోదకమ్. ఏధోదకములను సంస్కరించుచున్నాడు. దేవదత్తుడు కర్త. కర్మత్వమును వివక్షింపక సంబంధసామాన్యవిక్షయందు షష్ఠి వచ్చినది. సకారాంత మగు ఏధశ్శబ్దమును గ్రహించినచో ఏధః దకస్య-ఉదకస్య- ఉపస్కురుతే- కట్టెలు ఉదకమును సంస్కరించుచున్నవి అని యర్థము. "భువనమమృతం జీవనం స్యాత్ దకంచ" అని హలాయుధకోశము. అపుడు ఏధస్సు కర్త. కర్మత్వవివక్షయందు "ఏధోదకం ఉపస్కురుతే" అని యగును.

భజే శమ్భోశ్చరణయోః:- ఈశ్వరుని పాదములను సేవించుచున్నాను. ఇచట చరణముల కర్మత్వమును వివక్షింపక సంబంధసామాన్యమును వివక్షించుటచే షష్ఠి వచ్చినది.

### 905 ఆధారోఽధికరణమ్ 1.4.45

కర్తృకర్మద్వారా తన్నిష్ఠక్రియాయా ఆధారః కారకం అధికరణం స్యాత్.

అధికృత మగు 'కారకే' అనుపదము ప్రథమాంతముగ మార్చబడును. ఆధార మగు కారకము అధికరణము అని అర్థము. క్రియతో అన్వయించునది కారకము. దేనికి ఆధారము అని ఆశంక కలిగినపుడు సమీపముననుంచుటచే క్రియకు ఆధారము అని యర్థము సిద్ధించినది. క్రియాధారత్వ మనునది ప్రత్యక్షముగ కాక కర్తృకర్మలద్వారా మాత్రమే సిద్ధించును. అనగా ఆధారమునందు క్రియ ప్రత్యక్షముగ నుండదు; కర్తయందు గాని కర్మయందు గాని ఉండును. అది ఆధారమునందు ఉండుటచే తద్ద్వారా వాటితో సంబంధించిన క్రియ గూడ ఆధారముపై నుండును. ఈ విధముగ- కర్తృకర్మలద్వారా కర్తృకర్మలయం దున్న క్రియకు ఆధార మైన కారకము అధికరణసంజ్ఞక మగును.

### 906. సప్తమ్యధికరణే 2.3.36

అధికరణే సప్తమీ స్యాత్. చకారాత్ దూరాన్తికార్థేభ్యః. ఔప-

శ్లేషికః, వైషయికః అభివ్యాపకశ్చేతి ఆధారస్త్రిధా. కటే ఆస్తే. స్థాల్యాం పచతి. మోక్షే ఇచ్ఛా అస్తి. సర్వస్మిన్నాత్మాస్తి. వనస్య దూరే అన్తికే వా.

ఇతి విభక్త్యర్థ ప్రకరణమ్.

'చ' అనుపదమును ప్రయోగించుటచే "దూరాన్తికార్థేభ్యోద్వితీయా చ" అను పూర్వసూత్రమునుండి 'దూరాన్తికార్థేభ్యః' అనువర్తించును. అధికరణార్థమునందును, దూరము అన్తికము (దగ్గర) అను నర్థము గల పదములకంటెను సప్తమి వచ్చును.

ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము అని ఆధారము మూడు విధములు. సంయోగసమవాయాది సంబంధమునకు ఉపశ్లేష మని పేరు. అట్టి సంబంధముచే సిద్ధించిన ఆధారము ఔపశ్లేషికాధారము. 'ఆసనే ఉపవిశతి' ఇత్యాదులందు ఆసనమునకును దానిపై కూర్చున్న దేవదత్తునకును సంయోగసంబంధము. "తంతుషు వస్త్రం అస్తి" ఇత్యాదిస్థలములందు తంతువులకును వాటిపైనున్న వస్త్రమునకును సమవాయసంబంధము. కావున ఆసనము, తంతువులు మొదలగునవి. ఔపశ్లేషికాధారములు. సంయోగసమవాయాతిరిక్తసంబంధముచే ఆధార మగునది వైషయికాధికరణము. ఆధేయము ఆధారమునందలి అన్ని అవయవములందును వ్యాపించి యున్నచో అది అభివ్యాపకాధారము.

కటే ఆస్తే:-ఇది కర్త ద్వారా క్రియకు ఆధార మగుటకు ఉదాహరణము. "(దేవదత్తుడు) చాపపై కూర్చున్నాడు" అనునపుడు గూర్చుండుట అను క్రియ కర్త యగు దేవదత్తుని ద్వారా కటముపై ఉన్నది కటమునకును దేవదత్తునకును సంయోగసంబంధము.

స్థాల్యాం పచతి:- ఇది కర్మద్వారా క్రియకు ఆధార మగుటకు ఉదాహరణము 'తండులాన్' అని అధ్యాహారము. "స్థాలియందు తండులములను వండుచున్నాడు" ఇచట కర్మ యగు తండులములతో సంబంధించి యున్న పాకక్రియ తద్ద్వారా స్థాలియందు జరుగుచున్నట్లు ప్రతిపాదింపబడినది. స్థాలీతండులములకు సంయోగసంబంధము. ఈ విధముగ పై రెండును ఔపశ్లేషికాధారమునకు ఉదాహరణములు.

మోక్షే ఇచ్ఛాస్తి:- మోక్షవిషయమున ఇచ్ఛ కలదు ఇచట మోక్షము వైషయికసంబంధముచే ఇచ్ఛకు ఆధారము.

సర్వస్మిన్ఆత్మా అస్తి:- ఆత్మ అంతటను ఉన్నది గాన ఆత్మకు సర్వము అభివ్యాపకాధారము.

వనస్య దూరే అన్తికే వా:- వనమునకు దూరమునందు లేక దగ్గర యందు. ఇది దూరాన్తికార్థపదములకు సప్తమి వచ్చుటకు ఉదాహరణము

(కారక) విభక్త్యర్థప్రకరణము సమాప్తము.

# అథ సమాసప్రకరణమ్

## కేవల సమాసః

సమాసః పఞ్చధా. తత్ర సమసనం సమాసః.

స చ విశేషసంజ్ఞావినిర్ముక్తః కేవలసమాసః ప్రథమః, ప్రాయేణ పూర్వపదార్థప్రధానోఽవ్యయీభావో ద్వితీయః, ప్రాయేణోత్తరపదార్థ ప్రధానస్తత్పురుషస్తృతీయః. తత్పురుషభేదః కర్మధారయః. కర్మధారయ భేదో ద్విగుః, ప్రాయేణాన్యపదార్థప్రధానో బహువ్రీహిశ్చతుర్థః, ప్రాయేణోభయపదార్థప్రధానో ద్వన్ద్వః పఞ్చమః.

సమాసము ఐదు విధములు. సమసనమునకు-అనగా అనేకపదములు కలసి ఒక్క పదముగ సంక్షిప్తము లగుటకు సమాస మని పేరు. సమాసములు ఐదు విధములు అందు విశిష్టమగు సంజ్ఞ ఏదియు లేని కేవలసమాస మనునది మొదటిది. ఉదాహరణమునకు 'భూతపూర్వః' ఇత్యాదులు కేవలసమాసములు. ఇట్టి సమాసములు 'తత్పురుషః' 'బహువ్రీహిః'ఇత్యాదిఅధికారసూత్రముల క్రింద విధింప బడక 'సహ సుపా'అను సామాన్యసూత్రముచే (909) సిద్ధించినవి.

సమాసమునందు రెండు పదము లుండును. వాటిలో మొదటి పదమునకు పూర్వపద మనియు, రెండవపదమునకు ఉత్తరపద మనియు పేర్లు. కొన్ని సమాసములందు పూర్వపదార్థము, కొన్ని సమాసములలో ఉత్తరపదార్థము, కొన్ని సమాసములలో అన్యపదార్థమును ప్రధానముగా నుండును. పూర్వపదము బోధించు అర్థము పూర్వపదార్థము. ఉత్తరపదము బోధించు అర్థము ఉత్తర పదార్థము. అవ్యయీభావమునందు సాధారణముగ పూర్వపదార్థము ప్రధానముగ

నుండును, తరువాత వచ్చు పదము బోధించు అర్థముతో ఏది సంబంధించునో అది ప్రధానము. ఉదా:- 'అధిహరి' మొదలగు అవ్యయీభావసమాసములందు పూర్వపద మగు 'అధి' అనుపదము బోధించు అర్థము (అధికరణార్థము) ప్రధానము. 'ఉన్మత్తగఙ్గమ్' (ఉన్మత్తగంగము గలదేశము) ఇత్యాద్యవ్యయీభావ సమాసములందు పూర్వపదార్థము కాక, దేశరూప మగు అన్యపదార్థము ప్రధానముగ నున్నది, అందుచే 'ప్రాయేణ' అను పదము ప్రయోగింపబడినది.

మూడవదగు తత్పురుషసమాసమునందు సాధారణముగ ఉత్తరపదార్థము ప్రధానముగ నుండును. ఉదా:- 'రాజపురుషః' (రాజుయొక్క పురుషుడు) ఇత్యాదులందు ఉత్తరపదము లగు 'పురుష' ఇత్యాదుల అర్థము ప్రధానము. "అతిమాలః" (మాలను అతిక్రమించినవాడు) మొదలగు తత్పురుష సమాసములందు గూడ పూర్వపదార్థము (అతిపదార్థము) ప్రధానముగ నుండుటచే 'ప్రాయేణ'అని చెప్పబడినది. కర్మధారయ సమాసము తత్పురుష సమాసములో ఒక అవాంతర భేదము. ద్విగుసమాసము కర్మధారయములోని అవాంతరభేదము. నాల్గవ దగు బహువ్రీహి సమాసమునందు సాధారణముగ అన్యపదార్థము ప్రధానముగ నుండును. ఉదా:- 'పీతామ్బరః' (పచ్చని వస్త్రము కలవాడు) ఇత్యాదులందు పూర్వపద మగు 'పీత' అనుదాని అర్థముగాని, ఉత్తరపద మగు 'అంబర' అనుదాని అర్థము గాని ప్రధానము కాక అట్టి వస్త్రమును ధరించిన అన్యుడు, పూర్వపదోత్తరపదవాచ్యభిన్నుడు ప్రధానముగ ప్రతిపాదింపబడుచున్నాడు. 'ద్విత్రాః' (రెండు లేక మూడు) మొదలగు కొన్ని బహువ్రీహిసమాములందు ఉభయపదార్థములు ప్రధానముగ నుండుటచే 'ప్రాయేణ' అని చెప్పబడినది.

ఐదవ దగు ద్వంద్వసమాసమునందు సాధారణముగ ఉభయపదార్థము లును ప్రధానముగ నుండును. ఉదా:- ''రామలక్ష్మణౌ'' (రామలక్ష్మణులు) మొదలగు ద్వంద్వసమాసములందు ఉభయపదార్థములును ప్రధానములు. 'దంతోష్ఠమ్' (దంతములయొక్కయు ఓష్ఠములయొక్కయు సమాహారము) మొదలగు సమాహారద్వంద్వములందు అన్యపదార్థ మగు సమాహారము ప్రధానము గాన ప్రాయేణ అని చెప్పబడినది.

ఈ ఐదు సమాసములలో బహువ్రీహిద్వంద్వసమాసములు రెండింటికంటె అధిక మగు పదములతో కూడ ఉండవచ్చును. మిగిలిన సమాసములు రెండేసి పదములతోడనే నిష్పన్నము లగును.

907. సమర్థః పదవిధిః 2.1.1

పదసమ్బన్ధీ యో విధిః స సమర్థాశ్రితో బోధ్యః.

పదములకు సంబంధించిన విధి సమర్థము లగు పదములను ఆశ్రయించి నదిగా తెలిసికొనదగినది.

ఒక సుబంతము మరి యొక సుబంతముతో కలియుటచే అది సమాస మగును. సుబంతము పదము గాన సమాసాదివిధులు (కార్యములు) పదములకు సంబంధించినవి. ఈ విధముగ పదములకు సంబంధించిన సమాసాదివిధులు సామర్థ్యము గల పదముల విషయమునందు మాత్రమే ప్రవర్తించును.

వ్యపేక్షారూప మనియు ఏకార్థీభావరూప మనియు సామర్థ్యము రెండు విధములు. వ్యపేక్షారూపసామర్థ్యము 'రాజ్ఞః పురుషః' మొదలగు వాక్యములందు మాత్రమే ఉండును. అట్టి వాక్యములలోని శబ్దములు సన్నిహితములును అన్వయయోగ్యములును అగు శబ్దములతో అన్వయించుచుండును. "రాజ్ఞః పురుషః అశ్వశ్చ; రాజ్ఞో దేవదత్తస్య చ పురుషః, ఋద్ధస్య రాజ్ఞః పురుషః" ఇత్యాది వాక్యములు ఉదాహరణము. ప్రక్రియావళయందు విభిన్నార్థములుగ వేరువేరుగ గ్రహింపబడిన పదములు సమదాయశక్తిచే ఒక విశిష్టార్థమును బోధింపగలిగి యుండును. ఇట్టి సామర్థ్యమునకు ఏకార్థీభావరూపసామర్థ్య మని పేరు. ఇది వృత్తియందు మాత్రమే యుండును. 'రాజపురుషః' ఇత్యాదులు ఉదాహరణము. ఈవిధముగ ఏకార్థీభావరూపసామర్థ్యము గల పదములు సమసించును. ఇట్లు సమసించిన పదముల అర్థములు ఒకదానితో నొకటి కలసి పోవును. కావున 'ఋద్ధస్య రాజపురుషః' ఇత్యాదివిధముగ పురుషశబ్దముతో సమసించిన రాజన్ శబ్దమునకు("ఋద్ధస్య"అను)విశేషణమును ప్రయోగింపగూడదు. 'రాజపురుషః' అను మొత్తమువదము ఏకపద మగుటచే 'రాజ' అనునది దానిలోని ఏకదేశమే గాని స్వతంత్రపదము కాదు. స్వతంత్రపదమునకే విశేషణమును చేర్పవచ్చును గాని పదైకదేశమునకు చేర్ప రాదు. అందుచేతచే "సవిశేషణానాం వృత్తిర్న; వృత్తస్య వా విశేషణయోగో న" అని వైయాకరణసిద్ధాంతము. అనగా సవిశేషణము లగు పదములకు వృత్తి ఉండదు; వృత్తి చేసిన పిదప విశేషణమును చేర్పరాదు.

కాని 'దేవదత్తస్య గురుకులమ్'- దేవదత్తుని గురువు గృహము- ఇత్యాదులందు 'గురుకులం' అను సమాసమునందు ఉపసర్జన మగు (అప్రధాన మగు)

గురుశబ్దముతో దేవదత్తశబ్దము అన్వయించుచున్నది. ఇట్టి ప్రయోగములలో గురుశబ్దాదులు నిత్యసాపేక్షములు గాన (అనగా గురువు అనగానే ఎవరి గురువు? అను ఆకాంక్షకలుగును గాన) ఆకాంక్షానివృత్తికై 'దేవదత్తస్య' ఇత్యాదిపదము లను ప్రయోగింపవలసి యున్నది. అందుచే 'దేవదత్తస్య' అనుదానికి 'గురు' పదముతో అన్వయము అగతికగతిగా అంగీకరింపబడినది. ఈ విధముగ పద ములకు సంబంధించిన విధి సామర్థ్యము గల పదముల విషయముననే ప్రవర్తిం చునని ఈ పరిభాషాసూత్రమునకు అర్థము. "పశ్య కృష్ణం; శ్రితో రామ మిత్రమ్" (కృష్ణుని చూడుము; రాముని మిత్రుని ఆశ్రయించినాడు) ఇత్యాదు లందు 'కృష్ణం'అను ద్వితీయాంతపదము శ్రితపదమునకు సమీపమునందున్నను ఈ రెండుపదములకును సామర్థ్యము లేకుండుటచే ('కృష్ణం' అనునది పశ్య అనుదానితో అన్వయించుచున్నది) 'ద్వితీయాశ్రితాతీత' ఇత్యాది సూత్రముచే (927) సమాసము రాలేదు.

### 908. ప్రాక్కడారాత్సమాసః 2.1.3

'కడారాః కర్మధారయే' అత్యతః ప్రాక్ సమాసః ఇత్యధిక్రియతే.

ద్వితీయాధ్యాయద్వితీయపాదమునందలి అంతిమసూత్రమగు "కడారాః కర్మధారయే" అను సూత్రము వరకును 'సమాసః' అనునది అధికారపదముగ అనువర్తించుచుండును.

### 909. సహ సుపా 2.1.4

సుప్ సుపా సహ వా సమస్యతే. సమాసత్వాత్ ప్రాతిపదికత్వేన సుపో లుక్,

"సుబామన్త్రితే పరాఙ్గవత్స్వరే' నుండి'సుప్' అనువర్తించును.'సమాసః' అధికారము. 'సమాసః' అనునది కర్తరిఘఞన్తముగాన 'సమస్యతే' అని అర్థము. 'సుప్' అనునది ప్రత్యయము గాన 'ప్రత్యయగ్రహణే తదన్తా గ్రాహ్యాః' అను పరిభాషచే సుబంతమని యర్థము. సమర్థపరిభాషచే 'సమర్థ మగు సుబంతముతో, అని యర్థము సిద్ధించును. సుబంతము సమర్థ మగు సుబంతముతో వికల్పముగ సమసించును.

ఈ విధముగ రెండు సుబంతములు సమసించిన పిమ్మట "కృత్తద్ధిత సమాసాశ్చ" అను సూత్రముచే (117) ప్రాతిపదికసంజ్ఞ యుండును గాన

'సుపో ధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే (724) పూర్వోత్తరపదముల సుప్ప్రత్యయములు లోపించును.

పరార్థాభిధానం వృత్తిః. కృత్తద్ధితసమాసైకశేషసనాద్యన్తధాతురూపాః పఞ్చ వృత్తయః. వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః. స చ లౌకికోఽలౌకికశ్చేతి ద్విధా, తత్ర 'పూర్వం భూతః' ఇతి లౌకికః. "పూర్వ అమ్ భూత సు" ఇత్యలౌకికః- భూతపూర్వః. "భూతపూర్వేచరట్" ఇతి నిర్దేశాత్ పూర్వనిపాతః.

వా. ఇవేన సమాసో విభక్త్యలోపశ్చ. 'వాగర్థా ఇవ' "వాగర్థావివ"

ఇతి కేవలసమాసః ప్రథమః.

ప్రత్యయముయొక్క అర్థమును గాని మరియొకపదముయొక్క అర్థమును గాని కలుపుకొని ఒక విశిష్టార్థమును (పరార్థమును) బోధించుటకు వృత్తి యని పేరు. ఉదాహరణమునకు 'రాజపురుషః' అనునది రాజపదపురుషపదముల కలయికచే లభించిన విశిష్టార్థమును (రాజసంబంధి యగు పురుషుడు అను నర్థమును) బోధించుచున్నది. అట్లే 'దాశరథిః' 'కర్తవ్యమ్' ఇత్యాదులందు 'దశరథ ఇ' అను ప్రకృతిప్రత్యయములును 'కృ తవ్య' అను ప్రకృతిప్రత్యయములును కలియుటచే నేర్పడిన విశిష్టార్థము బోధింపబడుచున్నది. కావున వీటి కన్నిటికిని వృత్తు లని పేరు.

కృద్వృత్తి, తద్ధితవృత్తి, సమాసవృత్తి, ఏకశేషవృత్తి, సనాద్యంత ధాతువృత్తి యని వృత్తులు ఐదు విధములు. కృత్ప్రత్యయములను చేర్చుటచే నేర్పడిన 'కర్తవ్యమ్' మొదలగు పదములు కృద్వృత్తులు. తద్ధితప్రత్యయములను చేర్చుటచే నేర్పడిన 'దాశరథిః' ఇత్యాదులు తద్ధితవృత్తులు. 'రాజపురుషః' ఇత్యాదులు సమాసవృత్తులు. (మాతాచపితాచ) 'పితరౌ' ఇత్యాదులు ఏకశేష వృత్తులు.

"సన్క్యచ్కామ్యచ్క్యఙ్క్యషోఽథాచారక్విబ్ణిచ్యఙ స్తథా
యగాయఈయఙ్ణిఙ్చేతిద్వాదశామీసనాదయః".

అను కారికలోచెప్పిన పండ్రెండు ప్రత్యయములను చేర్చుటచే నేర్పడిన ధాతువులు సనాద్యంతధాతు వృత్తులు.

వృత్తికి గల అర్థమును బోధించుటకై ఉపయుక్త మగు వాక్యమునకు విగ్రహ మని పేరు. అది లౌకికవిగ్రహవాక్యము (మామూలుగాభాషలో ప్రయో

గించుటకు తగినది) అలౌకిక విగ్రహవాక్యము అని రెండు విధములు. 'భూత పూర్వః' మొదలగు వృత్తుల అర్థమును బోధించుటకై ఉపయుక్తమగు "పూర్వం భూతః" ఇత్యాదివాక్యము లౌకికవిగ్రహవాక్యము. "పూర్వ అమ్ భూత సు" అను వాక్యము అలౌకికవిగ్రహవాక్యము.

భూతపూర్వః- పూర్వమునందున్నది లేక అయినది అలౌకికవిగ్రహ వాక్యమునందు 'పూర్వ అమ్భూత సు"అనియుండగా 'సహసుపా'అను సూత్రముచే (909) 'పూర్వ అమ్'అను సుబంతమునకు 'భూత సు' అను సుబంతముతో సమాసము. అనగా "పూర్వఅమ్భూతసు"అనునదిసమాస మైనది. దీనికిపుడు 'కృత్తద్ధితసమాసాశ్చ'అనుసూత్రముచే (117) ప్రాతిపదికసంజ్ఞ. "సుపో ధాతుప్రాతిపదికయోః"అను సూత్రముచే (724) ప్రాతిపదికకు అవయవములగు 'అమ్' 'సు'అను సుప్ప్రత్యయములకు లోపము. 'పూర్వభూత'అను ప్రాతిపదికము శేషించినది. ఈవిధముగ 'పూర్వం భూతః'అను విగ్రహమున 'పూర్వ భూతః'అనురూపమే సిద్ధింపవలసియున్నను 'భూతపూర్వే చరట్'అను సూత్రమునందు పాణిని భూతశబ్దమునకు పూర్వనిపాతము (పూర్వపదముగ ప్రయోగము) చేయుటచే 'పూర్వభూత'కు బదులుగ 'భూతపూర్వ'అను ప్రాతిపదికము సిద్ధించినది. దీనికి ప్రథమైకవచనమున'భూతపూర్వః'అను రూపము సిద్ధించినది.

ఈ విధముగ సమాసప్రకరణమునందు అన్ని సమాసములకును అలౌకిక విగ్రహవాక్యము చూపి, పిమ్మట ఏ సూత్రముచే సమాసము విధింపబడినదో ఆ సూత్రముచే సమాసము చేసి దానికి ప్రాతిపదికసంజ్ఞలభించును గాన సుప్ప్రత్యయ లోపముచేయుచుండవలెను. అలుక్సమాసమునందు మాత్రము సుప్లోపము రాదు. ఇట్లునిష్పన్నమగు సమాసరూపప్రాతిపదికమునకు ఆవశ్యకతానుసారముగ విభక్తి ప్రత్యయము చేర్చి వాక్యమున ప్రయోగింపవచ్చును. వ్యాకరణమునందుసాధారణముగప్రథమైకవచనప్రత్యయమగు 'సు'ను చేర్చి రూపములు చూపబడుచుండును.

సుబంతము ఇవ అను అవ్యయముతో సమసించును. కాని విభక్తిప్రత్యయమునకు "సుపోధాతుప్రతిపదికయోః" అనుసూత్రముచే (724) లోపము మాత్రము రాదు.

'సహసుపా'అను సూత్రముచేతనే (909) సమాసము వచ్చుటకు అవకాశ మున్నను విభక్తిలోపము రాకుండుటకై ఈ వార్త్తికము చెప్పబడినది.

'అపదం న ప్రయుఞ్జీత'అను నియమము ననుసరించి వాక్యమునందు పదము కానిదానిని (సుబంతతిజంతములు కాని దానిని) ప్రయోగింప రాదు. అందుచే అవ్యయములకు కూడ సుప్ ప్రత్యయములను చేర్చి'అవ్యయాదాప్సుపః' అను సూత్రముచే (373) దానికి లోపము చేసి దానిని కూడ సుబంతముగ చేసిన గాని వాక్యమునందు ప్రయోగింప రాదు.

ఏకపద మగుట,విభక్తిలోపము, సమాసస్వరము అనునవి సమాస ప్రయోజనములు. 'వాగర్థౌ ఇవ'అనుపదములకు ఈ వార్తికముచే సమాసము చేయగా విభక్తి ప్రత్యయములు లోపింపవు గాన 'వాగర్థావివ'అనుసమాసపదము కూడ వ్యస్తపదముల వలె నే యుండును. సమాసమునందు ఇవ అనుదానికి పూర్వ నిపాతము రాకుండుటకూడ ఈ వార్తికమునకు ప్రయోజనము. ఇది లేకున్నచో ఇవ అనునది 'సహసుపా' అనుసూత్రముచే (909) ఇతరసుబంతముతో సమసింపగా "ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్"అను రాబోవు సూత్రముచే (912) దానికి ఉపసర్జనత్వ ముండును గాన "ఉపసర్జనం పూర్వమ్"అనుసూత్ర ముచే (913) పూర్వనిపాతము వచ్చి 'ఇవవాగర్థౌ'ఇత్యాదిరూపములు గూడ సిద్ధించెడివి. అట్లు కాకుండుటకై ఈ వార్తికము చెప్పబడినది.

కేవలసమాసము సమాప్తము.

# అథ అవ్యయీభావః

910. అవ్యయీభావః 2.1.5

అధికారోఽయం ప్రాక్ తత్పురుషాత్.

తత్పురుషః (2,1.22) అను సూత్రము (925) వరకును'అవ్యయీభావః'అనునది అధికారసూత్రము. అనగా ఈ సూత్రముమొదట 'తత్పురుషః' అను సూత్రమువరకును గల సూత్రములచే విహిత మగు సమాసమునకు అవ్యయీభావసమాస మని పేరు.

911. అవ్యయం విభక్తి-సమీప-సమృద్ధి-వ్యృద్ధ్యర్థాభావాత్యయాసంప్రతి-శబ్దప్రాదుర్భావ-పశ్చాద్యథానుపూర్వ్య-యౌగపద్య-సాదృశ్య-సంపత్తి-సాకల్యాంతవచనేషు. 2.1.6

విభక్త్యర్థాదిషు వర్తమానమవ్యయం సుబన్తేన సహ నిత్యం సమస్యతే. ప్రాయేణావిగ్రహో నిత్యసమాసః, ప్రాయేణాస్వపదవిగ్రహో వా. విభక్తౌ-"హరి ఙి అధి"ఇతి స్థితే.

విభక్తి,సమీపము,సమృద్ధి, సమృద్ధివినాశము, అభావము, నాశము, అనుచితము, శబ్దాభివ్యక్తి, పిమ్మట, యథా (యథాశబ్దార్థములు), క్రమము, ఒక్కమారుగా, సమానము, సంపత్తి, సంపూర్ణము, అంతమువరకు, అను పదునారు అర్థములను బోధించు అవ్యయము సుబంతముతో నిత్యముగ సమసించును.

కొన్ని అవ్యయములు విభక్త్యర్థమునందును, కొన్ని అవ్యయములు సమీపార్థమునందును ఈవిధముగ ఆయా అవ్యయములు విభక్త్యర్థాద్యర్థములందు సుబంతములతో సమసించును. ఇది వైకల్పికమని చెప్పక పోవుటచే నిత్యసమాసమని అర్థాత్సిద్ధము.

నిత్యసమాసమునకు సాధారణముగ విగ్రహవాక్యము (లౌకికవిగ్రహవాక్యము) ఉండదు. లౌకికవిగ్రహవాక్యము చెప్పవలసియున్నచో అస్వపదవిగ్రహవాక్యము చెప్పవలెను. సమసించిన పదములకంటె భిన్నము లగు పదములను కూడ ప్రయోగించి చెప్పిన విగ్రహవాక్యము అస్వపదవిగ్రహ వాక్యము. కొన్నిస్థలములలో సమసించిన రెండు పదములలో ఒక్కపదమునుమాత్రమే ఉపయోగించి విగ్రహము చెప్పుదురు. అదికూడ అస్వపదవిగ్రహమే. అవ్యయీభావసమాసము కూడ నిత్యసమాసము గాన దీనికి లౌకికవిగ్రహవాక్యముండదు. అస్వపదవిగ్రహవాక్యము చెప్పవచ్చును.

అధిహరి:- (హరియందు).'అధి'అను అవ్యయమునకు హరిశబ్దముతో సప్తమీవిభక్త్యర్థమున ఈ సూత్రముచే నిత్యసమాసము. 'హరౌ' అనునది లౌకికవిగ్రహవాక్యము. "హరి ఙి అధి"అనునది అలౌకికవిగ్రహవాక్యము. అధి అనునది సప్తమ్యర్థ మగు అధికరణార్థమును బోధించును. 'హరి ఙి' అనునది సుబంతము.

ఈవిధముగ సమాసముచేసిన పిమ్మట సమసించిన రెండుపదములలో ఏ పదమును ముందు ప్రయోగింపవలెను, దేనిని ఉత్తరపదముగ ప్రయోగింపవలెను అను సందేహము వచ్చును. తన్నివారణమునకై క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

912. ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్. 1.2.43

సమాసశాస్త్రే ప్రథమానిర్దిష్టం ఉపసర్జనసంజ్ఞం స్యాత్.

సమాసవిధాయకసూత్రమునందు ప్రథమావిభక్తిచే నిర్దిష్ట మగుదానికి ఉప సర్జన మని పేరు.

'అవ్యయం విభక్తి....' "ద్వితీయా శ్రితాతీత...' మొదలగు సూత్ర ములు సమాసవిధాయకసూత్రములు. వీటిలో "అవ్యయం" 'ద్వితీయా'ఇత్యాది పదములు ప్రథమావిభక్తియందు ప్రయోగింపబడినవి. అందుచే ప్రథమావిభక్త్యంతపదనిర్దిష్టములగు అవ్యయములు,ద్వితీయాంతములు మొదలగు వాటికి ఉపస ర్జన మని పేరు. ప్రకృతమున'అవ్యయం'అను ప్రథమాంతపదముచే బోధింప బడినది 'అధి'అను అవ్యయము. అందుచే దీనికి 'ఉపసర్జనము'అని పేరు.

913. ఉపసర్జనం పూర్వమ్. 2.2.30

సమాసే ఉపసర్జనం ప్రాక్ ప్రయోజ్యమ్. ఇతి అధేః ప్రాక్ ప్రయోగః.సుపో లుక్. ఏకదేశవికృతస్యానన్యత్వాత్ ప్రాతిపదికసంజ్ఞా యాం స్వాద్యుత్పత్తిః. 'అవ్యయీభావశ్చ' ఇత్యవ్యయత్వాత్ సుపో లుక్-అధిహరి.

సమాసమునందు ఉపసర్జనసంజ్ఞ కలదానిని పూర్వము (పూర్వపదముగ) ప్రయోగింపవలెను.

ఇచట 'అధి' అనునది ఉపసర్జనసంజ్ఞకము గాన అది పూర్వపదముగ నుండుటచే 'అధిహరి ఙి'అని యుండగా 'సుపో ధాతుప్రాతిపదికయోః'అను సూత్రముచే (724) 'ఙి'కి లోపము. ఇపుడు మిగిలిన 'అధిహరి' అనుదానికంటె సుప్ప్రత్యయములు చేర్చవచ్చును. 'అధిహరి ఙి'అనునదియే సమాసము గాన 'కృత్తద్ధితసమాసాశ్చ'అను సూత్రముచే (116) 'అధిహరి ఙి' అనుమొత్తము సముదాయముచే ప్రాతిపదికసంజ్ఞ యుండును గాని. 'ఙి'లోపింపగా మిగిలిన 'అధి హరి' అనుదానికి ప్రాతిపదికసంజ్ఞ లభింపదు కదా; అపుడుప్రాతిపదికసంజ్ఞ లేని దానికంటె స్వాదులు ఎట్లు వచ్చును? అను సందేహము కలుగవచ్చును. దానికి సమాధాన మేమనగా-'ఏకదేశవికృతమనన్యవత్' (ఒకవస్తువునందలిఒక భాగ మునందు చిన్ని మార్పు వచ్చినను అది వస్త్వంతరము కాజాలదు;తోక తెగినంత మాత్రముచే కుక్క, కుక్క కాకుండునా?) అను న్యాయముచే 'అధిహరిఙి'అను

ప్రాతిపదికమునందు జీలోప మను చిన్న వికారము కలిగినను అది ప్రాతిపదికము కాకపోదు. అందుచే దీనికంటె సుప్ప్రత్యయములుచేర్చవచ్చును. 'అవ్యయీభావశ్చ'అను సూత్రముచే (372) అవ్యయీభావమునకు అవ్యయసంజ్ఞ విధింపబడినది. అందుచే దీనికి చేర్చిన సుప్ప్రత్యయములు "అవ్యయాదాప్సుపః"అను సూత్రముచే (373) లోపించును. ఈ విధముగ 'అధిహరి' అనురూపము సిద్ధించును.

అవ్యయీభావసమాసము చేసిన పిమ్మట ఏర్పడిన ప్రాతిపదికమునకు వివక్షానుసారముగ ఏసుప్ప్రత్యయము నైనను చేర్చవచ్చును. కొన్ని అవ్యయీభావ సమాసములలో ఆ సుప్ప్రత్యయము పైన చూపిన విధముగ లోపించును.కొన్నిటిలో దానికి రాబోవుసూత్రములచే అమాదేశము వచ్చును. కొన్నిటిలోఅది యథాతథముగ ఉండిపోవచ్చును. ఈవిషయము రాబోవు సూత్రములలో స్పష్టమగును.

### 914. అవ్యయీభావశ్చ. 2.4.18

అయం నపుంసకం స్యాత్. గాః పాతీతి గోపాః; తస్మిన్ ఇతి అధిగోపమ్.

'స నపుంసకమ్'నుండి 'నపుంసకమ్'అనువర్తించును. అవ్యయీభావము కూడ నపుంసక మగును.

'గోపాః'అనునది ఆకారాంతగోపాశబ్దమునకు ప్రథమైకవచనరూపము. గోవులను రక్షించువాడు అని యర్థము. అధికరణరూప మగు సప్తమ్యర్థమునందు 'అధి'అను అవ్యయము 'అవ్యయం'ఇత్యాదిసూత్రముచే 'గోపా ఙి' అను సుబంతముతో సమసించును. పైన జూపిన విధముగ అధి అనునది ఉపసర్జన సంజ్ఞము గాన దానికి పూర్వప్రయోగము. 'అధి గోపా ఙి'అని యుండగా ప్రాతిపదికత్వ విభక్తిలోపములు. 'అధిగోపా'అని యుండును. ప్రకృతసూత్రముచే 'అధిగోపా'అను అవ్యయీభావము నపుంసకలింగము గాన "హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య"అను సూత్రముచే (243) ఆకారమునకు హ్రస్వము. దీనికంటె పరముగ చేర్చబడిన 'సు'ప్రత్యయమునకు రాబోవుసూత్రముచే (915) 'అమ్' ఆదేశము. 'అమి పూర్వః'అను సూత్రముచే (135) పూర్వరూపము- 'అధిగోపమ్' అను రూపము సిద్ధించును.

915 నావ్యయీభావాదతోఽమ్త్వపఞ్చమ్యాః. 2.4.83

అదన్తాదవ్యయీభావాత్సుపో న లుక్;తస్య పఞ్చమీం వినా 'అమ్' ఆదేశః స్యాత్.

న అవ్యయీభావాత్,అతః, అమ్,తు,అపఞ్చమ్యాః. "ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః" "అవ్యయాదాప్సుపః"అనుసూత్రములనుండి 'లుక్' 'సుపః'అనువర్తించును. అదంత మగు అవ్యయీభావముకంటె పర మగు సుప్పుకు లుక్ రాదు;పంచమవిభక్తిప్రత్యయము తక్క ఆ సుప్ప్రత్యయమునకు 'అమ్'ఆదేశము వచ్చును. అనగా పంచమవిభక్తిప్రత్యయము చేర్చిన పక్షమున 'ఆత్,భ్యామ్,భ్యస్',అనునవి శ్రూయమాణములై 'అధిగోపాత్'ఇత్యాదిరూపము లుండును.

916. తృతీయాసప్తమ్యోర్బహులమ్. 2.4.84

అదన్తాదవ్యయీభావాత్ తృతీయాసప్తమ్యోర్బహులం అమ్భావః స్యాత్. ఉపకృష్ణమ్. ఉపకృష్ణేన. మద్రాణాం సమృద్ధిః సుమద్రమ్. యవనానాం వ్యృద్ధిః దుర్యవనమ్.మక్షికాణాం అభావః-నిర్మక్షికమ్.హిమస్యాత్యయః అతిహిమమ్. నిద్రాసంప్రతి న యుజ్యతే ఇతి అతినిద్రమ్, హరిశబ్దస్య ప్రకాశః ఇతిహరి. విష్ణోః పశ్చాదనువిష్ణు. యోగ్యతా-వీప్సా-పదార్థానతివృత్తి-సాదృశ్యానియథార్థాః. రూపస్య యోగ్యమనురూపమ్. అర్థమర్థం ప్రతి ప్రత్యర్థమ్. శక్తిమనతిక్రమ్యయథాశక్తి.

పూర్వసూత్రమునుండి 'అతః' 'అవ్యయీభావాత్'అనువర్తించును. అదంత మగు అవ్యయీభావముకంటె పర మగు తృతీయాసప్తములకు వికల్పముగ 'అమ్'భావము వచ్చును.

ఉపకృష్ణమ్-ఉపకృష్ణేన:- 'కృష్ణస్య సమీపమ్'అను నర్థమున 'అవ్యయం'ఇత్యాదిసూత్రముచే 'ఉప' అనుదానికి 'కృష్ణఙస్'అనుదానితో సమాసము. 'ఉపకృష్ణఙస్'అని యుండగా 'ప్రథమానిర్దిష్టం'ఇత్యాదిసూత్రముచే (912)'ఉప' అనునది ఉపసర్జనసంజ్ఞము గాన దానికి పూర్వనిపాతము. 'ఙస్'లోపము. 'ఉపకృష్ణ' అను ప్రాతిపదికమునకు తృతీయైకవచనప్రత్యయ మగు 'టా'చేర్చిన పిమ్మట "ఉపకృష్ణటా"అని యుండగా ప్రకృతసూత్రముచే వైకల్పిక మగు అమ్ ఆదేశమువచ్చినపక్షమున'ఉపకృష్ణమ్'అను రూపము అది రాని పక్షమున

'టాఙసిఙసామినాత్స్యాః' అను సూత్రముచే (140) ఇనా దేశము, గుణము వచ్చి 'ఉపకృష్ణేన' అను రూపము సిద్ధించును. ఇది సమీపార్థావ్యయము సమసించుటకు ఉదాహరణము, 'అధిహరి' 'అధిగోపమ్' అనునవి విభక్త్యర్థమునకు ఉదాహరణములు—మిగిలిన పదునాలుగు అర్థములకు గూడ క్రమముగ ఉదాహరణములు చూపబడుచున్నవి.

సుమద్రమ్:- 'మద్రాణాం సమృద్ధిః' అని లౌకికవిగ్రహవాక్యము. సమృద్ధ్యర్థమున సు అనుదానికి షష్ఠీబహువచనాంత మగు మద్రశబ్దముతో సమాసము. "సుమద్రఆమ్" అనియుండగా వెనుకటివలెనే పూర్వనిపాత, ప్రాతిపదికసంజ్ఞాసుబ్లోప, అమ్‌భావములచే 'సుమద్రమ్' అను రూపము సిద్ధించినది. దుర్యవనమ్:- 'యవనానాం వ్యృద్ధిః' "యవనుల అభివృద్ధి లేక పోవుట' అనునర్థమున దుర్ అను అవ్యయమునకు 'యవనఆమ్' అను షష్ఠ్యంతపదముతో సమాసము. నిర్మక్షికమ్:- (మక్షికలు లేకుండుట):- అభావార్థమున నిర్ అనుదానికి 'మక్షికాఆమ్' అను షష్ఠ్యంతముతో సమాసము. 'నిర్మక్షికా' అయిన పిమ్మట 'అవ్యయీభావశ్చ' అను సూత్రముచే (914) నపుంసకము గాన 'హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య' అనుసూత్రముచే (243) హ్రస్వము. ఇతరకార్యములన్నియు యథాపూర్వమే. అతిహిమమ్:- (హిమముయొక్క నాశము). అత్యయము (ధ్వంసము) అను నర్థమున అతి అను అవ్యయమునకు షష్ఠ్యంత మగు హిమశబ్దముతో సమాసము. అతినిద్రమ్:- నిద్రా అసంప్రతి—యుక్తము కాదు—అని యర్థము. అసంప్రత్యర్థమున అతి అను అవ్యయమునకు నిద్రాశబ్దముతో సమాసము. 'నిర్మక్షికమ్' అనునపుడువలె హ్రస్వము అధికకార్యము. ఇతిహరి:- హరిశబ్దస్య ప్రకాశః—హరిశబ్దముయొక్క ప్రాదుర్భావము—అని యర్థము. శబ్దప్రాదుర్భావము అను నర్థమున ఇతి అను అవ్యయమునకు హరిశబ్దముతో సమాసము. హరిశబ్దము ఇకారాంతము గాన 'సుప్' లోపించుటచే అమ్భావప్రసక్తి లేదు. అనువిష్ణు:- 'విష్ణోః పశ్చాత్'—విష్ణువునకు వెనుక. పశ్చాదర్థ మగు 'అను' అనుదానికి షష్ఠ్యంత మగు విష్ణుశబ్దముతో సమాసము.

'యథా' అను అవ్యయమునకు యోగ్యత వీప్స (మాటిమాటికి అగుట), పదార్థమును అతిక్రమింపకుండుట, సాదృశ్యము అను నాలుగర్థములు కలవు. ఈ నాలుగు అర్థములను బోధించు అవ్యయము సుబంతముతో సమసించు నని చెప్పబడినది

అనురూపమ్:- (రూపమునకు యోగ్యము). యోగ్యత్వార్థక మగు 'అను' అను అవ్యయమునకు షష్ఠ్యంత రూపశబ్దముతో సమాసము. ప్రత్యర్థమ్:- అర్థమర్థం ప్రతి-(ప్రతీవిషయమూ)-వీప్సార్థక మగు 'ప్రతి'అనుదానికి అర్థశబ్దముతో సమాసము. యథాశక్తి:- శక్తిం అనతిక్రమ్య-శక్తిని మించకుండగా-అని విగ్రహము. పదార్థానతివృత్తి అను నర్థమున యథా అను అవ్యయమునకు ద్వితీయాంత మగు శక్తిశబ్దముతో సమాసము.

సాదృశ్యార్థమున సహ అను అవ్యయమునకు షష్ఠ్యంత మగు హరిశబ్దముతో సమాసము చేసిన పిమ్మట 'సహహరి'అని యుండగా.

917, అవ్యయీభావే చాకాలే 6.3.81

సహస్య సః స్యాత్ అవ్యయీభావే, న తు కాలే. హరేః సాదృశ్యం సహరి. జ్యేష్ఠస్య అనుపూర్వ్యేణ ఇతి అనుజ్యేష్ఠమ్. చక్రేణ యుగపత్ సచక్రమ్. సదృశః సఖ్యా ససఖి. క్షత్రాణాం సమ్పత్తిః సక్షత్రమ్. తృణమప్యపరిత్యజ్య- సతృణం అత్తి. అగ్నిగ్రంథపర్యన్తం అధీతే-సాగ్ని.

'సహస్యసః సంజ్ఞాయామ్' నుండి 'సహస్య' 'సః' అనువర్తించును. అవ్యయీభావసమాసమునందు 'సహ' అనుదానికి 'స'అను నాదేశము వచ్చును, కాలార్థకపదము పర మగునపుడు మాత్రము రాదు.

ఈ సూత్రముచే 'స'ఆదేశము చేయగా 'సహరి' అను రూపము" సిద్ధించును. విష్ణువుయొక్క సాదృశ్యము అని యర్థము.

అనుజ్యేష్ఠమ్:- ఆనుపూర్వ్యార్థక మగు 'అను' అను అవ్యయమునకు షష్ఠ్యంతజ్యేష్ఠశబ్దముతో సమాసము. "పెద్దవాని క్రమమును అనుసరించి" అని యర్థము. సచక్రమ్:- 'చక్రేణ యుగపత్' (చక్రముతో ఒక్కమాటుగా) అని విగ్రహము. ఇచట యుగపదర్థక మగు 'సహ' అను అవ్యయమునకు తృతీయాంత మగు చక్రశబ్దముతో సమాసము. సహశబ్దమునకు పై సూత్రముచే 'స' ఆదేశము.

ససఖి:- సదృశార్థక మగు 'సహ' అను అవ్యయమునకు తృతీయాంత సఖిశబ్దముతో సమాసము. 'సహ'కు 'స' ఆదేశము. స్నేహితునితో సమానమైనది' అని యర్థము. 'సహరి' అను దానిలోని 'సహ'కు సాదృశ్యము అని

యర్థము. ఈ ఉదాహరణములోని 'సహ' అనుదానికి సదృశము- సాదృశ్యము కలది- అని యర్థము.

సక్షత్త్రిమ్:- సంపత్త్యర్థక మగు 'సహ' అను అవ్యయమునకు షష్ఠీబహువచనాంత మగు క్షత్త్రిశబ్దముతో సమాసము. క్షత్రియుల సంపత్తి. సతృణమ్:- సాకల్యము- పూర్తిగా- అను నర్థము గల 'సహ' అను అవ్యయమునకు తృతీయాంత మగు తృణశబ్దముతో సమాసము. తృణమపి అపరిత్యజ్య- గడ్డిపరక కూడా విడిచిపెట్టకుండా- పూర్తిగా. సాగ్ని:- అంతార్థక మగు (చివరివరకు అను నర్థము గల సహ శబ్దమునకు ద్వితీయాంత మగు అగ్నిశబ్దముతో సమాసము), 'అగ్ని' శబ్దమునకు అగ్నిచయనప్రతిపాదకమగు గ్రంథవిశేష మని యర్థము. 'సాగ్నిఅధీతే' అనగా అగ్నిగ్రంథపరిసమాప్తి వరకును అధ్యయనము చేయుచున్నాడు అని యర్థము. దీనితో 'అవ్యయం...' (911) ఇత్యాదిసూత్రోదాహరణములు పూర్తి యైనవి.

918 నదీభిశ్చ 2.1.20

నదిభిః సహ సంఖ్యా సమస్యతే.

'సంఖ్యా వంశ్యేన' నుండి 'సంఖ్యా' అనువర్తించును. సంఖ్యావాచకము నదీవాచకము లగు సుబంతములతో సమసించును.

వా. సమాహారే చాయమిష్యతే.

పఞ్చగఙ్గమ్, ద్వియమునమ్.

ఈ సమాసము సమాహారార్థమునందు వచ్చును.

పఞ్చగఙ్గమ్-ద్వియమునమ్:- 'పఞ్చానాం గఙ్గానాం సమాహారః', 'ద్వయోః యమునయోః సమాహారః'అను నర్థమున 'పఞ్చన్ ఆమ్ గఙ్గా ఆమ్' "ద్వి ఓస్ యమునా ఓస్" అను వాటికి పై సూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపములు. 'పఞ్చన్'లోని నకారమునకు "న లోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) లోపము. అవ్యయీభావశ్చ' అను సూత్రముచే (914) నపుంసకలింగము లగుటచే హ్రస్వమువచ్చి (సూ-243) 'పఞ్చగఙ్గ' 'ద్వియమున' అను ప్రాతిపదికములు సిద్ధించును. వాటికి చేర్చిన సుప్ప్రత్యయమునకు 'అమ్' భావము చేయగా 'పఞ్చగఙ్గమ్' 'ద్వియమునమ్' అను రూపములు సిద్ధించును.

ఈ సూత్రము "తద్ధితార్థోత్తరపదసమాహారే చ" అను రాబోవు సూత్రమునకు (939) అపవాదము.

919. తద్ధితాః 4.1.76

ఆపఞ్చమసమాప్తేరధికారోఽయమ్.

పంచమాధ్యాయము చివరివరకును 'తద్ధితాః' అనునది అధికారము.

920. అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః 5.4.107

శరదాదిభ్యష్టచ్ స్యాత్ సమాసాన్తోఽవ్యయీభావే. శరదః సమీపమ్ ఉపశరదమ్. ప్రతివిపాశమ్.

'రాజాహస్సఖిభ్యష్టచ్' నుండి 'టచ్' అనువర్తించును; 'సమాసాన్తాః' అధికారము. 'శరత్' మొదలగు పదములకు అవ్యయీభావసమాసమునందు టచ్ ప్రత్యయము సమాసాన్తప్రత్యయముగ వచ్చును.

ఉపశరదమ్:- శరదః సమీపే అని విగ్రహము. ఉప అను అవ్యయమునకు సమీపార్థమున షష్ఠ్యంత మగు శరత్ శబ్దముతో 'అవ్యయం' ఇత్యాది సూత్రముచే (911) సమాసము చేయగా 'ఉపశరద్' అను ప్రాతిపదికము సిద్ధించినది. ప్రకృతసూత్రముచే టచ్ ప్రత్యయము- టకారచకారములు ఇత్సంజ్ఞకములు, 'ఉపశరద' అను అకారాంతప్రాతిపదికము సిద్ధించును. పిమ్మట దానికంటె పరముగ చేర్చబడిన సుప్ప్రత్యయమునకు 'అమ్' భావము (సూ-915)

ప్రతివిపాశమ్:- 'ప్రతి'అను అవ్యయమునకు షష్ఠ్యంత మగు విపాశ్ శబ్దముతో "లక్షణేనాభిప్రతీఆభిముఖ్యే" అను సూత్రముచే (2-1-14) ఆభిముఖ్యార్థమున సమాసము. ప్రకృతసూత్రముచే టచ్ ప్రత్యయము. "విపాశః అభిముఖమ్" (విపాశానదికి ఎదురుగా) అని విగ్రహము.

గ. సూ. జరాయా జరశ్చ.

ఉపజరసమిత్యాది,

ఇది శరదాదిగణములోని గణసూత్రము.

సమాసమునందు జరాశబ్దమునకు జరస్ అను నాదేశము వచ్చును. ఉపజరసమ్:- జరాయాః సమీపమ్ (ముసలితనమునకు సమీపము) అని విగ్రహము. 'ఉప'అను అవ్యయమునకు సమీపార్థమున షష్ఠ్యంత మగు జరాశబ్ది

ముతో సమాసము. జరాశబ్దమునకు ఈ గణసూత్రముచే జరసాదేశము. ప్రకృత సూత్రముచే టచ్ప్రత్యయము- ఉపజరసమ్.

921. అనశ్చ 5.4.108

అన్నన్తాదవ్యయీభావాత్ టచ్ స్యాత్.

పూర్వ సూత్రమునుండి అనువర్తించిన 'అవ్యయీభావే' అను పదము పంచమ్యంతముగ మారును. 'రాజాహఃసఖిభ్యష్టచ్'నుండి 'టచ్' అనువర్తించును అన్ అంతమునందు గల అవ్యయీభావసమాసమునకు టచ్ ప్రత్యయము వచ్చును.

922. నస్తద్ధితే 6.4.144

నాన్తస్య భస్య టేర్లోపః తద్ధితే. ఉపరాజమ్. అధ్యాత్మమ్.

'భస్య' అధికారము 'టేః' అను సూత్రము. 'అల్లోపోనః' నుండి 'లోపః' అనువర్తించును. తద్ధితప్రత్యయము పర మగునపుడు నకారాంత మైన భసంజ్ఞక మగుదాని టికి లోపము వచ్చును.

ఉపరాజమ్:- సమీపార్థమున 'ఉప' అను అవ్యయమునకు రాజన్ శబ్దముతో సమాసము, పూర్వసూత్రముచే టచ్ప్రత్యయము- 'ఉపరాజన్అ' అని యుండగా ఈ సూత్రముచే టికి (అన్‌కు) లోపము- 'ఉపరాజ' అను ప్రాతిపదికము సిద్ధించును. 'సుప్'కు అమ్ భావము- 'ఉపరాజమ్'.

అధ్యాత్మమ్:- అధి అనునది సప్తమీవిభక్త్యర్థమున ఆత్మన్ శబ్దముతో సమసింపగా 'అధ్యాత్మన్' అని యుండును. ఇపుడు 'టచ్' టిలోపాదులు వచ్చును.

923. నపుంసకాదన్యతరస్యామ్ 5.4.109

అన్నన్తం యత్ క్లీబం తదన్తాదవ్యయీభావాత్ టజ్ వా స్యాత్. ఉపచర్మమ్:- ఉపచర్మ.

"అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః" "రాజాహస్సఖిభ్యష్టచ్" 'అనశ్చ' నుండి "అవ్యయీభావే" 'టచ్' 'అనః' అనువర్తించును.

నపుంసకలింగ మగు అన్నంతపదము అంతమునందు గల అవ్యయీభావ సమాసమునకు టచ్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

ఉపచర్మమ్-ఉపచర్మ:- (చర్మసమీపము). 'చర్మణః సమీపమ్' అని లౌకికవిగ్రహవాక్యము. 'ఉప'కు సమీపార్థమున చర్మన్‌శబ్దముతో సమాసము. ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము వచ్చిన పక్షమున టిలోపామ్‌భావాదులచే 'ఉపచర్మమ్' అను రూపము, 'టచ్' రాని పక్షమున నకారాంత మగు 'ఉపచర్మ' శబ్దమును నిష్పన్న మగును.

## 924. ఝయః 5.4.111

ఝయన్తాదవ్యయీభావాత్ టజ్వా స్యాత్. ఉపసమిధమ్ ఉపసమిత్.

ఇత్యవ్యయీభావః

'అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః' నుంచిఅనువర్తించిన 'అవ్యయీభావే' అనునది పంచమ్యంతముగ మారును. 'రాజాహస్సఖిభ్యష్టచ్' నుండి 'టచ్' పూర్వసూత్రమునుండి'అన్యతరస్యామ్'అనువర్తించును. ఝయ్ అంతమునందు గల అవ్యయీభావముకంటె టచ్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

ఉపసమిధమ్-ఉపసమిత్:- సమీపార్థమున ఉప అను అవ్యయము షష్ఠ్యంత మగు సమిధ్‌శబ్దముతో 'అవ్యయం' ఇత్యాదిసూత్రముచే (911) సమసించును. 'ఉపసమిధ్ జస్'అని యుండగా ప్రాతిపదికత్వ (సూ-117) సుబ్లోపములు (సూ-724)-'ఉపసమిధ్' అని యుండగా ఈ సూత్రముచే వైకల్పికముగ టచ్ వచ్చిన పక్షమున 'ఉపసమిధ్-ఉపసమిధ'అను ప్రాతిపదికము సిద్ధించును. ఇపు డిది అదంతము గాన దీనికంటె వచ్చిన 'సు'కు అమ్‌భావము-'ఉపసమిధమ్'అనురూపము సిద్ధించును. టచ్ రాని పక్షమున 'వావసానే'అను సూత్రముచే(146) చర్త్వవికల్పముచే 'ఉపసమిత్''ఉపసమిద్' అనుహలంత రూప మగును.

అవ్యయీభావప్రకరణము సమాప్తము.

# అథ తత్పురుషః

## 925. తత్పురుషః 2.1.22

అధికారోఽయం ప్రాగ్ బహువ్రీహేః.

"శేషో బహువ్రీహిః" 2.2.23 అను సూత్రము (967) వరకును 'తత్పురుషః' అధికారసూత్రము. అనగా ఈ సూత్రము మొదలు "శేషో బహువ్రీహిః" అను సూత్రము వరకును గల సూత్రములచే విహితములగు సమాసములకు తత్పురుష మని పేరుండును.

## 926 ద్విగుశ్చ. 2.1.23

ద్విగురపి తత్పురుషసంజ్ఞకః స్యాత్.

ద్విగుసమాసము కూడ తత్పురుషసంజ్ఞక మగును.

తత్పురుషసమాసమున రెండు పదము లుండును. మొదటిది పూర్వపదము రెండవది ఉత్తరపదము. వీటిలో ఉత్తరపదముచే బోధింపబడిన అర్థము (ఉత్తరపదార్థము)ప్రధానము. అనగా వాక్యమునందలి ఇతరపదములతో ఉత్తర పదార్థమే అన్వయించు నని యర్థము. పూర్వపదము ప్రథమ తప్ప ద్వితీయ మొద లగు ఆరువిభక్తులలో ఏదియో యొక విభక్తియం దుండును. ఉత్తర పదము, దానికి ఇతరపదములతో గల సంబంధమును బట్టి ఆవశ్యకతానుసారముగా ఏ విభక్తియందైనను ఉండవచ్చును.

ఇక ద్వితీయాంతాదిపదములకు సమాసమును విధించు సూత్రములు వరుసగ చెప్పబడుచున్నవి.

## 927. ద్వితీయా శ్రితాతీత-పతిత-గతాత్యస్త ప్రాప్తాపన్నైః.2.1.24

ద్వితీయాన్తం శ్రితాదిప్రకృతికైః సుబన్తైః సహ సమస్యతే వా, స చ తత్పురుషః.కృష్ణం శ్రితఃకృష్ణశ్రితః. ఇత్యాది.

'ద్వితీయా'అనునది ప్రత్యయము గాన "ప్రత్యయగ్రహణే తదన్తా గ్రాహ్యాః"అను పరిభాషచే 'ద్వితీయా'అనుదానికి ద్వితీయాంతము అని యర్థము. 'సహ సుపా'అనునది అనువర్తించుటచే 'సుబంతములగు శ్రితాదిశబ్దములతో'

అనగా 'శ్రితాదిశబ్దములు ప్రకృతిగా గల సుబంతముతో' అని యర్థము సిద్ధించును. ద్వితీయాంతము శ్రితాదిశబ్దములు ప్రకృతిగా గల సుబంతములతో వికల్పముగ సమసించును; అది తత్పురుషసంజ్ఞ మగును.

కృష్ణశ్రితః:- 'కృష్ణం శ్రితః' అని లౌకికవిగ్రహవాక్యము. "కృష్ణ అమ్ శ్రిత సు' అను నది అలౌకికవిగ్రహవాక్యము, "కృష్ణ అమ్" అను ద్వితీయాంతపదమునకు 'శ్రిత సు' అను సుబంతముతో ప్రకృతసూత్రముచే సమాసము, 'ద్వితీయా'-ఇత్యాదిసూత్రమున 'ద్వితీయా' అనునది ప్రథమవిభక్తియందు ఉపయుక్తమైనది. గాన తన్నిర్దిష్ట మగు 'కృష్ణ అమ్' అను దానికి ఉపసర్జనసంజ్ఞా పూర్వనిపాతములు. 'కృష్ణ అమ్ శ్రితసు' అనునది సమాసము గాన ప్రాతిపదిక సంజ్ఞా, సుబ్లోపములు. 'కృష్ణశ్రిత' అను ప్రాతిపదికము సిద్ధించినది. దానికి ప్రథమైకవచనమున 'కృష్ణశ్రితః' అను రూపము సిద్ధించినది. ఈ విధముగ దుఃఖం అతీతః-దుఃఖాతీతః, గర్తంపతితః-గర్తపతితః; గ్రామం గతః- గ్రామగతః; గ్రామం అత్యస్తః-గ్రామాత్యస్తః; గ్రామం ప్రాప్తః గ్రామప్రాప్తః; సంశయం ఆపన్నః సంశయాపన్నః ఇత్యాద్యుదాహరణములు ఊహింపదగినవి.

928 తృతీయా తత్కృతార్థేన గుణవచనేన. 2.1.30

తృతీయాన్తం తృతీయాన్తార్థకృతగుణవచనేన అర్థేన చ సహ ప్రాగ్వత్. శఙ్కులయా ఖణ్డః-శఙ్కులాఖణ్డః. ధాన్యేనార్థః ధాన్యార్థః, తత్కృతేతి కిమ్? అక్ష్ణా కాణః.

తృతీయా; తత్కృత, అర్థేన, గుణవచనేన. 'తత్కృత' అనునది లుప్తతృతీయాంతపదము. తత్ పదముచే తృతీయాంతపదము పరిగ్రహింపబడును.

తృతీయాంతము, తృతీయాంత మగు పదముయొక్క అర్థముచే కృత మగు గుణమును బోధించుపదముతోడను, అర్థశబ్దముతోడను సమసించును; దానికి తత్పురుష మని పేరు.

శఙ్కులాఖణ్డః- 'శఙ్కులయా ఖణ్డః' అని విగ్రహము. కత్తెరచే చేయబడిన ఖండము అని యర్థము. కత్తెరచే చేయబడిన ఖండము గల దేవదత్తుడు అను నర్థమ భాష్యసమ్మత మని బాలమనోరమాకారుడు వ్రాసియున్నాడు. ఇచట ఖండ మనునది గుణము. ఇది 'శంకులయా' అను తృతీయాంత పదమునకర్థమగుశంకులచే చేయబడినది గాన ఈ సూత్రముచే సమాసము.

సమాసవిధాయక మగు ఈశాస్త్రమున 'తృతీయా'అనునది ప్రథమావిభక్తిలో ఉప యుక్తమైనది. కావున ప్రథమాంతనిర్దిష్ట మగు 'శఙ్కులాటా'అనుదానికి ఉపసర్జన సంజ్ఞాపూర్వనిపాతములు. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే "శఙ్కులాఖణ్డః"అను రూపము సిద్ధించినది.

ధాన్యార్థః- ధాన్యేన అర్థః,ధాన్యముచేత ధనము లేదా ధాన్యరూప మగు ధనము అని యర్థము. 'ధాన్య టా అర్థ సు'అని యుండగా ఈ సూత్రముచే సమాసము. ఉపసర్జనత్వ, పూర్వనిపాత, ప్రాతిపదికత్వ, సుబ్లోపాదులు పైవలెనే యుండును.

'శఙ్కులాఖణ్డః'ఇత్యాదులందు శంకుల కరణము గాన 'శఙ్కులాటాఖండసు'అనుదానికి 'కర్తృకరణే కృతా బహులమ్'అను రాబోవుసూత్రముచేతనే (929) సమాసము వచ్చుటకు అవకాశ ముండగా, ఈ సూత్రముచే తత్కృత మగు గుణవచనముతో సమాసము వచ్చును అని చెప్ప నేల అని ప్రశ్న వచ్చును. దానికి సమాధాన మేమనగా గుణవాచకముతో తృతీయాంతము సమసించ వలసి యున్నచో తృతీయాంతార్థకృతగుణవాచకముతోడ మాత్రమే సమసించును అను నియమమునకై 'తత్కృతా'అనుపదము ప్రయోగింపబడినది. ఈ పదము ప్రయోగింప కున్నచో "తృతీయాంతము గుణవాచకముతో సమసించును"అనునర్థము వచ్చును. అట్లైనచో 'అక్ష్ణా కాణః'ఇత్యాదులందు 'కాణః' అను గుణవాచక శబ్దముతో గూడ 'అక్ష్ణా'అను తృతీయాంతమునకు సమాసము వచ్చుటకు అవకాశ ముండును. అదిఅనిష్టము. అందుచే 'తత్కృత' అను పదము ప్రయోగింపబడినది. ఇచట కాణత్వమునకు రోగాదికముకారణము గాని నేత్రము కాదు. అందుచే అది తృతీయాంతాక్షిశబ్దవాచ్యనేత్రకృతము గాదు గాన సమాసము రాదు.

929. *కర్తృకరణే కృతా బహులమ్.* 2.1.32

కర్తరి కరణే చ తృతీయా కృదన్తేన బహులం ప్రాగ్వత్. హరిణా త్రాతః. నఖైర్భిన్నః నఖభిన్నః.

పూర్వసూత్రమునుండి 'తృతీయా' అనువర్తించును. కర్త్రర్థకరణార్థ తృతీయాంతము కృదంతముతో బహులముగ సమసించును.

హరిత్రాతః- హరిణా త్రాతః-హరిచే రక్షింపబడినవాడు. 'హరిణా' అనునపుడు కర్తరితృతీయ. 'త్రాత'అనునది క్తప్రత్యయాంతము. "హరి టా త్రాత సు"అనునపుడు ప్రకృతసూత్రముచే సమాసము. కర్తృవాచకరణవాచక

ములు ప్రథమానిర్దిష్టములుగాన వాటికి ఉపసర్జనత్వపూర్వనిపాతములు. ప్రాతి పదికత్వ,సుబ్లోపాదులచే'హరిత్రాతః'అనురూపముసిద్ధించినది.

'నఖభిన్నః:- నఖైః భిన్నః-నఖములచే భేదింపబడినవాడు. 'నఖైః' అనునపుడు కరణే తృతీయ. భిన్న అనునది క్తప్రత్యయాంతము. ఈ సూత్ర ముచే 'నఖ భిస్ భిన్న సు'అను పదములకు సమాసము ఇతరకార్యము లన్ని యు వెనుకటివలెనే యుండును.

'భిన్నః' అనునది కృత్ప్రత్యయాంతమే యైనను 'నిర్భిన్నః' అనునది కృత్ ప్రత్యయాంతము కాదుగాన (ఇదికృత్ప్రత్యయాంతాంతము) 'నఖైః నిర్భిన్నః' ఇత్యాదిస్థలములందు ఈ సూత్రముచే సమాసము వచ్చుటకు అవకాశము లేదు గాన ఈ పరిభాష చెప్పబడుచున్నది.

ప. కృద్గ్రహణే గతికారకపూర్వస్యాపి గ్రహణమ్.
నఖనిర్భిన్నః.

"కృదంతము అని చెప్పినపుడు గతికారకములు పూర్వమునందు గల కృదంతమును గూడ గ్రహింపవలెను."

ఇచట 'నిర్' అనునది గతిసంజ్ఞకము గాన తత్పూర్వకమగు కృదంతము నకు (భిన్నశబ్దమునకు-అనగా నిర్భిన్న అనుదానికి కూడ) ఈ సూత్రముచే సమా సము చేయవచ్చును. 'నఖనిర్భిన్నః' అను రూపము సిద్ధించినది.

930. చతుర్థీ తదర్థార్థ - బలి - హిత - సుఖ - రక్షితైః 2.1.36

చతుర్థ్యన్తార్థాయ యత్ తద్వాచినా, అర్థాదిభిశ్చ చతుర్థ్యన్తం వా ప్రాగ్వత్. యూపాయ దారు - యూపదారు. తదర్థేన ప్రకృతివికృతి భావ ఏవేష్టః. తేనేహ న - రన్ధనాయ స్థాలీ.

'ప్రత్యయగ్రహణే తదన్తాగ్రాహ్యాః' అనుపరిభాషచే 'చతుర్థీ' అనుదానికి చతుర్థ్యంతము అని యర్థము. 'తదర్థ' అనుపదమునందలి తచ్ఛబ్దముచే చతు ర్థ్యంతపదము పరిగ్రహింపబడును. చతుర్థ్యంతపదముచే బోధింపబడునది ప్రయోజనముగా- నిమిత్తముగా గల దానిని బోధించు పదము అని యర్థము వచ్చును. చతుర్థ్యంతము చతుర్థ్యంతార్థము తోడను, అర్థ, బలి, హిత, సుఖ, రక్షిత అను పదములతోడను సమసించును; దానికి తత్పురుష మని పేరు

యూపదారు:- యూపాయ దారు- యుపస్తంభముకొరకు కఱ్ఱ- అని లౌకికవిగ్రహము. దారువు యూపస్తంభమునకు నిమిత్తము. యూపస్తం

భముకొఱకు ఉద్దిష్టమైనది. అనగా యూపము దారువునకు ప్రయోజనము. కావున 'యూప ఙే' అను చతుర్థ్యంతము 'దారు సు' అను పదముతో సమసించినది. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే "యూపదారు" అను ప్రథమాంతపదము సిద్ధించినది.

ఇచట 'తదర్థ' అను నపుడు కేవలము 'దానికి నిమిత్తము' (దానికొఱకైనది) అని మాత్రమే అర్థము కాదు. "దానికి ప్రకృతి యైనది" అని యర్థము. పై ఉదాహరణమున దారువు ప్రకృతి యూపము వికృతి. ఈ విధముగ ప్రకృతి వికృతిభావము లేకున్నచో ఒకవస్తువు మరి యొక వస్తువు కొఱకై ఉద్దిష్టమైనది అనునంత మాత్రమున సమాసము రాదు. ఉదాహరణమునకు "రన్ధనాయ స్థాలీ" అనునపుడు స్థాలి (గిన్నె) వంటకొఱకై ఉద్దిష్టమగుటచే తదర్థము అని చెప్ప వచ్చును. కాని స్థాలికిని రంధనమునకును ప్రకృతివికృతిభావము లేకుండుటచే ఈ సూత్రముచే సమాసము రాదు,

వా. *అర్థేన నిత్యసమాసో విశేష్యలింగతా చేతి వక్తవ్యమ్.*

ద్విజార్థః - సూపః. ద్విజార్థా యవాగూః. ద్విజార్థం పయః. భూతబలిః. గోహితమ్. గోసుఖమ్. గోరక్షితమ్.

పై సూత్రముచే అర్థశబ్దముతో విహిత మగు సమాసము నిత్యసమాస మనియు, ఈ విధముగ నిష్పన్న మైన సమస్తపదము విశేష్య మేలింగమునం దుండునో ఆ లింగమునం దుండు ననియు చెప్పవలెను.

ద్విజార్థఃసూపః:- పై వార్తికము ననుసరించి ఇది నిత్యసమాసము గాన దీనికి 'ద్విజాయ' అని మాత్రమే లౌకికవిగ్రహవాక్యము. 'ద్విజ ఙే అర్థ సు' అని అలౌకికవిగ్రహవాక్యము. పై సూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు. దీని లింగము విశేష్యము ననుసరించి యుండును గాన 'సూపః' అనునది పుంలింగ మగుటచే ఇది గూడ 'ద్విజార్థః' అని పుంలింగ మైనది. 'యవాగూః' (గంజి) 'పయః' అను పదములు విశేష్యము లైనపుడు ఇది కూడ క్రమముగ స్త్రీలింగనపుంసకలింగములయం దుపయుక్త మైనది.

భూతేభ్యో బలిః భూతబలిః. "భూత భ్యస్ బలి సు" అని అలౌకికవిగ్రహవాక్యము. గోభ్యో హితమ్ గోహితమ్- 'గో భ్యస్ హిత సు' అని అలౌకిక విగ్రహవాక్యము. గవే సుఖమ్ గోసుఖమ్. "గో ఙే సుఖ సు" అని అలౌకిక విగ్రహము. గోభ్యఃరక్షితం గోరక్షితమ్. 'గో భ్యస్ రక్షిత సు' అని అలౌకిక

విగ్రహము. వీటి అన్నిటియందును పై సూత్రముచే సమాసము ఇతరకార్య ములన్నియు వెనుకటివలెనే యుండును.

931. పఞ్చమీ భయేన 2.1.37

చోరాద్ భయమ్ - చోరభయమ్.

పంచమ్యంతము సుబంత మగు భయశబ్దముతో సమసించును.

చోరభయమ్:- 'చోర ఙసి భయ సు' అని యుండగా ఈ సూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు.

932. స్తోకాన్తికదూరార్థకృచ్ఛ్రాణి క్తేన 2.1.39

అర్థశబ్దము స్తోక, (కొంచెము) అన్తిక, (సమీపము) దూర అను పదములతో ప్రత్యేకముగ సంబంధించును పై సూత్రమునుండి 'పంచమీ' అను పదము అనువర్తించును. పంచమ్యంతము లగు స్తోకార్థక, అన్తికార్థక, దూరార్థకపదములును, కృచ్ఛ్రశబ్దమును క్తప్రత్యయాంతసుబంతముతో సమసించును.

స్తోకాన్ముక్తః:- కొంచెములో విడువబడినవాడు. "స్తోక ఙసి ముక్త సు" అని యుండగా 'ముక్త' అనునది క్తప్రత్యయాంతము గాన ఈ సూత్రముచే సమాసము. 'కృత్తద్ధితసమాసాశ్చ' అను సూత్రముచే (117) ప్రాతిపదికముగాన "సుపోధాతుప్రాతిపదికయోః" అను సూత్రముచే (724) సుప్‌కు లోపము రావలసి యుండగా:-

933. పఞ్చమ్యాః స్తోకాదిభ్యః 6.3.2

అలుక్ ఉత్తరపదే. స్తోకాన్ముక్తః. అన్తికాదాగతః. అభ్యాశాదాగతః. దూరాదాగతః. కృచ్ఛ్రాదాగతః.

'అలుగుత్తరపదే' అను అధికారసూత్రము అనువర్తించును. స్తోకాది శబ్దములకంటె పర మగు పంచమవిభక్తిప్రత్యయమునకు ఉత్తరపదము పర మగునపుడు అలుక్ వచ్చును. అనగా ఆప్రత్యయము లోపింపదు.

ఈ సూత్రముచే పంచమవిభక్తి ప్రత్యయము లోపింపకపోవుటచే 'సు' మాత్రము లోపించినది. 'ఙసి'కి "టాఙసిఙసామినాత్స్యాః" అను సూత్రముచే (140) 'ఆత్' ఆదేశము వచ్చి "స్తోకాత్ముక్త" అను ప్రాతిపదికము సిద్ధించినది. దానికి ప్రథమైకవచనమున "స్తోకాన్ముక్తః" అను రూపము. 'అన్తికాదాగతః' మొదలగు మిగిలిన నాలుగు ఉదాహరణములు కూడ ఇట్లే సిద్ధించును.

పై ఉదాహరణములందు పంచమి లోపింపకపోవుటచే వ్యస్తపదములవలె కనబడినను సమాసత్వమునకు సమాస స్వర మగు అంతోదాత్తత్వమును, తద్ధిత ప్రత్యయము చేర్చినపుడు ఆదివృద్ధి వచ్చి "స్తోకాన్ముక్తస్య అపత్యంస్తాకాన్ముక్తిః" ఇత్యాదిరూపములు సిద్ధించుటయు ప్రయోజనము.

934. షష్ఠీ 2.2.8

సుబన్తేన ప్రాగ్వత్. రాజపురుషః.

షష్ఠ్యంతము సుబంతముతో సమసించును. దానికి తత్పురుష మని పేరు.

రాజపురుషః:- 'రాజన్ ఙస్ పురుషసు' అని యుండగా ఈ సూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు-'రాజపురుషః'.

935. పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే 2.2.1

అవయవినా సహ పూర్వాదయః సమస్యన్తే; ఏకత్వసంఖ్యావిశిష్టశ్చేదవయవీ. షష్ఠీసమాసాపవాదః. పూర్వం కాయస్య పూర్వకాయః. అపరకాయః. ఏకాధికరణే కిమ్- పూర్వశ్ఛాత్రాణామ్.

ఏకదేశ మనగా అవయవము. ఏకదేశము కలది ఏకదేశి- అనగా అవయవి. అధికరణ మనగా ద్రవ్య మని యర్థము పూర్వ, అపర, అధర, ఉత్తర అను పదములు ఏకద్రవ్యరూప మగు అవయవిని బోధించు సుబంతముతో సమసించును.

పూర్వకాయః:- పూర్వం కాయస్య. శరీరముయొక్క- పూర్వ (క్రింది) భాగము. 'పూర్వ సు కాయ ఙస్' అని యుండగా కాయ అనునది ఏకత్వసంఖ్యావిశిష్టావయవివాచకము గాన ఈ సూత్రముచే 'పూర్వ సు' అను దానికి 'కాయ ఙస్' అనుషష్ఠ్యంతపదముతో సమాసము. సమాసవిధాయక మగు ఈ సూత్రమునందు 'పూర్వాపరాధరోత్తరమ్' అనునవి ప్రథమానిర్దిష్టములగుటచే, వాటికి ఉపసర్జనసంజ్ఞాపూర్వనిపాతములు. ప్రాతిపదికత్వసుబ్లోపములచే 'పూర్వకాయః' అను రూపము సిద్ధించినది.

ఈ సూత్రము షష్ఠీతత్పురుషవిధాయక మగు 'షష్ఠీ' అను సూత్రమునకు (934) అపవాదము. కావుననే పైన చూపిన విధముగ "పూర్వ" మొదలగు వానికి ఉపసర్జనత్వాదులు లభించినవి. 'షష్ఠీ' అను సూత్రముచే సమాసము

చేసినచో షష్ఠ్యంతపదము ప్రథమానిర్దిష్టము గాన దానికి ఉపసర్జనత్వాదులు వచ్చి 'కాయపూర్వమ్' ఇత్యాద్యనిష్టరూపములు సిద్ధించెడివి. 'పూర్వకాయః' వలెనే 'అపరకాయః' 'అధరకాయః' 'ఉత్తరకాయః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

అవయవివాచకము ఏకత్వసంఖ్యావిశిష్టమై యుండవలె నని చెప్పుటచే "పూర్వః ఛాత్రాణామ్" అనునపుడు 'ఛాత్రాణామ్' అనెడు అవయవివాచకము బహుత్వసంఖ్యావిశిష్టము గాన పూర్వశబ్దమునకు దానితో సమాసము రాదు. వ్యస్తముగనే ప్రయోగింపవలెను, లేదా "ఛాత్రాణాం పూర్వః ఛాత్రపూర్వః" అను షష్ఠీతత్పురుషసమాసము చేసికొనవచ్చును.

'పూర్వకాయః'అనునది తత్పురుష సమాస మైనను ఇచట పూర్వపదార్థమే ప్రధాన మైనది. ఉత్తరపదార్థము ప్రధానము కాదు. ఇది "ఉత్తరపదార్థప్రధానః తత్పురుషః" అను సామాన్యనియమమునకు అపవాదము.

### 936. అర్ధం నపుంసకమ్ 2.2.2

సమాంశవాచీ అర్ధశబ్దో నిత్యం క్లీబే; స ప్రాగ్వత్. అర్ధం పిప్పల్యాః అర్ధ పిప్పలీ,

పూర్వసూత్రమునుండి "ఏకదేశినైకాధికరణే" అనువర్తించును 'అర్ధ' శబ్దమునకు అంశము అనియు, సగము భాగము అనియు అర్థములు. మొదటి అర్థమునందు ఈ శబ్దము పుంలింగము. రెండవ అర్థమునందు నపుంసకలింగము. "వాపుంస్యర్ధోఽర్ధం సమేంశకే" అని అమరము. నపుంసకలింగమునందున్న- అనగా సమాంశవాచి యగు 'అర్ధ' శబ్దము ఏకత్వసంఖ్యావిశిష్ట మగు అవయవిని బోధించు సుబంతముతో సమసించును.

అర్ధపిప్పలీ:- "అర్ధ సు పిప్పలీ ఙస్" అని యుండగా ఈసూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు. ఈ సూత్రము కూడ 'షష్ఠీ' అనుదానికి (934) అపవాదము. అర్ధశబ్దమునకు పూర్వనిపాతము ప్రయోజనము.

### 937. సప్తమీ శౌణ్డైః 2.1.40

సప్తమ్యన్తం శౌణ్డాదిభిః ప్రాగ్వత్. అక్షేషు శౌణ్డః-అక్షశౌణ్డః ఇత్యాది. 'ద్వితీయా' 'తృతీయా' ఇత్యాదియోగవిభాగాత్ అన్యత్రాపి తృతీయాదివిభక్తీనాం ప్రయోగవశాత్ సమాసో జ్ఞేయః.

'శౌణ్డైః' అని బహువచనమును ప్రయోగించుటచే "శౌండాదిగణము" అనునర్థము లభించినది. సప్తమ్యంతము శౌండాదిపదప్రకృతికము లగు సుబంతములతో సమసించును.

అక్షశౌణ్డః:— అక్షేషు శౌణ్డః- పాచికలాడుట విషయమున నిపుణుడు అని యర్థము. 'అక్ష సుప్ శౌణ్డ సు' అని యుండగా ఈ సూత్రముచే సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు-'అక్షశౌణ్డః'.

"ద్వితీయాశ్రితాతీత . . . " "తృతీయాతత్కృత . . . " ఇత్యాదిసమాస విధాయకసూత్రములను బట్టి చూడగా ద్వితీయాంతతృతీయాంతాదులకు శ్రితాది పదములతోడ మాత్రమే సమాసము వచ్చునని తెలుచున్నది. కాని తృతీయాంతాదులకు శ్రితాదులకంటె భిన్నము లగు పదములతో గూడ సమాసములు ప్రయోగమునందు కనబడుచున్నవి. వాటి సాధుత్వమునకై ఆ సూత్రములలోని 'ద్వితీయా' 'తృతీయా' 'చతుర్థీ' 'పంచమీ' 'సప్తమీ' అనుపదములను వేరుగ విడదీసి (యోగవిభాగము చేసి) 'ద్వితీయా' ఇత్యాదులను స్వతంత్రసూత్రములుగ పరిగణించి, అనువర్తించిన 'సుపా' అనుదానితో అన్వయించి వ్యాఖ్యానించినచో "ద్వితీయాంతం సుబన్తేన సమస్యతే" తృతీయాన్తం- చతుర్థ్యన్తం- పఞ్చమ్యన్తం- సప్తమ్యన్తం సుబన్తేన సహ సమస్యతే" అను నర్థములు సామాన్యరూపమున సిద్ధించును. ఈ విధముగ ద్వితీయాంతాదులకు శ్రితాదులతోడనే గాక ప్రయోగానుసారముగ ఏ సుబంతముతోడనైనను సమాసము చేయవచ్చును.

### 938. దిక్సంఙ్ఖ్యే సంజ్ఞాయామ్ 2.1.50

పూర్వేషుకామశమీ. సప్తర్షయః. 'సంజ్ఞాయాం ఏవ' ఇతి నియమార్థం సూత్రమ్. తేనేహ న- ఉత్తరా వృక్షాః. పఞ్చ బ్రాహ్మణాః.

"పూర్వకాలైకసర్వజరత్పురాణనవకేవలాః సమానాధికరణేన" నుండి 'సమానాధికరణేన' అనువర్తించును సంజ్ఞావాచక మగునపుడు దిగ్వాచకసంఖ్యావాచకశబ్దములు సమానాధికరణ మగు పదముతో సమసించును.

'విశేషణం విశేష్యేణ బహులమ్' అను రాబోవు సూత్రముచేతనే(947) సమాసము సిద్ధించుచుండ "దిక్సంఖ్యార్థకము లగు విశేషణములు సంజ్ఞార్థమునందు మాత్రమే సమసించును" అను నియమమునకై ఈ సూత్రము చెప్పబడినది.

పూర్వేషుకామశమీ:- పూర్వాశ్చాసౌ ఇషుకామశమీ చ అని లౌకిక విగ్రహము. 'పూర్వా సు ఇషుకామశమీ సు' అని యుండగా ఈ సూత్రముచే దిగ్వాచక మగు పూర్వాశబ్దమునకు సమాసము. ప్రాతిపదికత్వ, సుబ్లోపాదులు- 'పూర్వేషుకామశమీ'. ఇది యొక దేశమునకు పేరు.

సప్తర్షయః:- సప్త చ తే ఋషయశ్చ:- సంఖ్యావాచక మగు సప్తన్ శబ్దమునకు ఋషిశబ్దముతో సమాసము. సులోపాదులు చేసిన పిమ్మట 'సప్తన్ ఋషి' అని యుండగా నకారమునకు "నలోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) లోపము- పిమ్మట గుణము- 'సప్తర్షయః'.

'సంజ్ఞాయామేవ' అను నియమముచే 'ఉత్తరాః వృక్షాః' 'పఞ్చ బ్రాహ్మణాః' ఇత్యాదులందు సమాసము సంజ్ఞావాచకము కాదు గాన దిగ్వాచకసంఖ్యావాచకము లగు ఉత్తరపఞ్చన్‌శబ్దములు సమసింపలేదు.

939. తద్ధితార్థోత్తరపదసమాహారే చ 2.1.51

తద్ధితార్థే విషయే, ఉత్తరపదే చ పరతః, సమాహారే చ వాచ్యే దిక్సంఖ్యే ప్రాగ్వత్. పూర్వస్యాం శాలాయాం భవః- పూర్వాశాలా ఇతి సమాసే జాతే-

తద్ధితార్థశ్చ, ఉత్తరపదఞ్చ, సమాహారశ్చ తేషాం సమాహారః తద్ధితార్థోత్తరపదసమాహారమ్- తస్మిన్. సమాసాంతమునందున్న సప్తమి మూడు పదములతో విషయే, పరతః, వాచ్యే అను మూడు వేర్వేరు అర్థములలో అన్వయించును. పూర్వసూత్రములనుండి 'దిక్సంఖ్యే' 'సమానాధికరణేన' అనువర్తించును. తద్ధితార్థము విషయ మగునపుడును, ఉత్తరపదము పర మగునపుడును, సమాహారము వాచ్యమగునపుడును దిగ్వాచకసంఖ్యావాచకపదములు సమానాధికరణముతో సమసించును.

దిగ్వాచకమునకు సమాహారార్థమున సమాసము వచ్చుటకు ఉదాహరణములు లేవు. తద్ధితార్థమునందును, ఉత్తరపదము పరమగునపుడు మాత్రమే ఉదాహరణములు కలవు. సంఖ్యావాచకమునకు మాత్రము మూడు విధము లగు ఉదాహరణములును లభించును.

పూర్వస్యామితి:- దిగ్వాచక మగు పూర్వాశబ్దమునకు "తత్రభవః" (అచట నుండువాడు) అను తద్ధితప్రత్యయార్థమున- అనగా రాబోవుసూత్రముచే 'తత్ర భవః' అను నర్థమున ఞప్రత్యయము చేర్చబడనున్నది గాన ఆ తద్ధిత

ప్రత్యయార్థమున- శాలా శబ్దముతో సమాసము. చివరకు నిష్పన్న మగు శబ్ద మునకు 'పూర్వస్యాం శాలాయాం భవః'—తూర్పుశాలలో ఉన్నవాడు—అని యర్థము. 'పూర్వా ఙి శాలా ఙి' అని అలౌకిక విగ్రహవాక్యము. ఈ సూత్ర ముచే సమాసము చేసిన పిమ్మట ప్రాతిపదికత్వసుబ్లోపములు వచ్చి 'పూర్వాశాలా' అని యుండగా:-

వా. సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః.

ఐదువృత్తులలో ఏ వృత్తి యైనను చేయవలసి యున్నపుడు సర్వనామ శబ్దమునకు పుంవద్భావము వచ్చును.

పూర్వాశబ్దము సర్వనామము గాన ఈ సమాసవృత్తియందు దానికి ఈ వార్తికముచే పుంవద్భావము. అనగా స్త్రీలింగశబ్ద మగు 'పూర్వా' అనునది పుంలింగ మగు 'పూర్వ'శబ్దముగ మారుట. 'పూర్వశాలా' అని యుండగా:-

940. దిక్పూర్వపదాదసంజ్ఞాయాఞ్ ఞః 4 2.107

అస్మాద్భవార్థే ఞః స్యాత్; అసంజ్ఞాయామ్.

దిగ్వాచకము పూర్వపదముగా గల సమాసముకంటె, అది సంజ్ఞావాచకము కానప్పుడు 'అచట ఉన్నది' అను నర్థమున ఞ ప్రత్యయము వచ్చును.

'పూర్వ శాలా' అను ఈ సమాసమున 'పూర్వ' అనునది దిగ్వాచకము గాన 'పూర్వశాలయందు ఉన్నది' అను నర్థమున ఞ ప్రత్యయము వచ్చినది. దీనిలోని ఞకారము ఇత్సంజ్ఞకము. 'పూర్వశాలా అ' అని యుండగా:-

941. తద్ధితేష్వచామాదేః 7.2.117

ఞితి ణితి చ తద్ధితేష్వచాం ఆదేరచో వృద్ధిః స్యాత్.

యస్యేతి చ- పౌర్వశాలః. పఞ్చ గావః ధనం యస్యేతి త్రిపదే బహువ్రీహౌ.

'అచో ఞ్ణితి' అను సూత్రము, 'మృజేర్వృద్ధిః' నుండి 'వృద్ధిః' అను వర్తించును. ఞిత్ గాని ణిత్ గాని అయిన తద్ధితప్రత్యయము పర మగునపుడు (ప్రకృతియందలి) అచ్చులలోని మొదటి అచ్చునకు వృద్ధి వచ్చును.

ఈ సూత్రముచే 'పూర్వశాలా' అను ప్రకృతియందలి మొదటి అచ్చగు ఊకారమునకు వృద్ధి- 'పౌర్వశాలా అ' అని యుండగా "యస్యేతిచ అను

సూత్రము(2.6)చే ఆకారమునకు లోపము- పౌర్వశాలః (ప్రథమైకవచనమున) అను రూపము సిద్ధించినది.

ఉత్తరపదము పర మగు నపుడు సంఖ్యావాచకము సమసించుటకు 'పఞ్చగవధనః' అనునది ఉదాహరణము. "పఞ్చ గావః ధనం యస్య సః" పఞ్చగవధనః. ఇది త్రిపదబహువ్రీహి. ఇచట మూడవ దగు ధనశబ్దము ఉత్తరపదము. అది పరముగా నుండగా 'తద్ధితార్థోత్తరపదసమాహారే చ' అను సూత్రముచే పఞ్చన్ అను సంఖ్యావాచక శబ్దము గోశబ్దముతో సమసించును. 'పఞ్చన్ జస్, గో జస్ ధన సు' అని అలౌకిక విగ్రహవాక్యము. ఇచట 'పఞ్చన్' శబ్ద 'గో'శబ్దములకు వైకల్పికసమాసమే రావలసి యుండగా:-

వా. ద్వన్ద్వతత్పురుషయోరుత్తరపదే నిత్యసమానవచనమ్.

ఉత్తరపదము పర మగునపుడు ద్వంద్వతత్పురుషసమాసములకు నిత్యసమాసత్వము చెప్పవలెను. అనగా ఉత్తరపదము పర మగునపుడు వచ్చెడు ద్వంద్వసమాసము గాని తత్పురుషసమాసము గాని నిత్యసమాస మగు నని యర్థము. ఈ వార్తికము ననుసరించి పంచన్ శబ్దగోశబ్దములకు ("తద్ధితార్థోత్తరపదసమాహారేచ" అను సూత్రముచే వచ్చిన (తత్పురుష) సమాసము నిత్యసమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపములచే "పఞ్చగో" అని యుండగా:-

942. గోరతద్ధితలుకి 5.4.92

గోన్తాత్ తత్పురుషాత్ టచ్ స్యాత్ సమాసాన్తో, న తు తద్ధితలుకి. పఞ్చగవధనః.

"తత్పురుషస్యాఙ్గులేః సంఖ్యావ్యయాదేః" "రాజాహస్సఖిభ్యష్టచ్"నుండి 'తత్పురుషస్య', 'టచ్', 'సమాసాన్తః' అను అధికృతసూత్రమును అనువర్తించును. గోశబ్దాంత మగు తత్పురుషము కంటె సమాసాన్త మగు టచ్ ప్రత్యయము వచ్చును; తద్ధితప్రత్యయము లోపించినపుడు మాత్రము రాదు.

ఈ త్రిపదబహువ్రీహిలోని గోశబ్దాంత మగు అవాంతరతత్పురుషమునకు ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము వచ్చినది. టచ్‌లోని టకారచకారములు ఇత్సంజ్ఞకములు. పంచన్‌లోని నకారమునకు "న లోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (170) లోపము. "పంచగోఅ" అని యుండగా అవాదేశముచే 'పఞ్చగవధనః' అను రూపము సిద్ధించినది.

### 943. తత్పురుషః సమానాధికరణః కర్మధారయః 2.1.42

సమానాధికరణ మగు తత్పురుషసమాసమునకు కర్మధారయ మని పేరు.

సమానం అధికరణం-వాచ్యం-యయో స్తే సమానాధికరణే. సమానమైన వాచ్యము గల పదములు అని యర్థము. సమానాధికరణే అస్య స్త ఇతి సమానాధికరణః. సమానాధికరణములగు పదములు గలది. అట్టి తత్పురుషము కర్మధారయసంజ్ఞ మగును. ఉదాహరణమునకు 'నీలోత్పలమ్' అనునపుడు 'నీల' పదము 'ఉత్పల' పదము రెండును కలువ యనెడు ఒకే వాచ్యమును బోధించుచున్నవి. గాన ఇవి సమానాధికరణములు. కావున ఇవి ఒకే విభక్తియందు ప్రయుక్తము లగును. అట్లే ప్రకృతమున 'పంచ' అనుపదము 'గో' అను పదము ఈ రెండును గోవులనే బోధించుచున్నవి. అందుచే ఇవి సమానాధికరణములు. ఇట్టి సమానాధికరణపదములతో కూడి యుండుటచే 'పంచగవ'అనునది కర్మధారయసమాసము.

### 944. సంఖ్యాపూర్వో ద్విగుః 2.1.52

తద్ధితార్థేత్యత్రోక్తః త్రివిధః సంఖ్యాపూర్వో ద్విగుసంజ్ఞః స్యాత్.

'తద్ధితార్థోత్తరపదసమాహారే చ' అను సూత్రముచే విహితమైన సంఖ్యావాచకపూర్వ మగు త్రివిధసమాసమునకు ద్విగుసమాస మని పేరు.

### 945. ద్విగురేకవచనమ్ 2.4.1

ద్విగ్వర్థః సమాహారః ఏకవత్స్యాత్.

'సమాహారగ్రహణం కర్తవ్యమ్' అను వార్తికము ననుసరించి 'సమాహారః' అను పదము లభ్య మగును.

ద్విగుసమాసార్థ మగు సమాహారము ఏకము వంటి దగును అనగా ఆ సమాహారము ఒక వస్తువుగ పరిగణింప బడును గాన ద్విగు సమాసము ఏకవచనమున నుండు నని ఫలితము.

### 946. స నపుంసకమ్ 2.4.17

సమాహారే ద్విగుర్ద్వన్ద్వశ్చ నపుంసకం స్యాత్.

పఞ్చానాం గవాం సమాహారః పఞ్చగవమ్.

'సః' అను తచ్ఛబ్దముచే "ద్విగురేకవచనమ్" "ద్వన్ద్వశ్చ ప్రాణితూర్యసేనాఙ్గానామ్" అను పూర్వసూత్రములలో చెప్పబడిన ద్విగుద్వంద్వములు పరా

మృష్టము లగును. అవి సమాహారార్థకములే గ్రాహ్యము లని వ్యాఖ్యానము. సమాహారవాచకము లగు ద్విగుద్వంద్వసమాసములు నపుంసకలింగమునం దుండును.

పఞ్చగవమ్:– 'పఞ్చానాం గవాం సమాహారః'అని లౌకికవిగ్రహము. 'పఞ్చన్ ఆమ్ గో ఆమ్' అని అలౌకిక విగ్రహము. ఇచట సంఖ్యా వాచక మగు 'పంచన్ ఆమ్'అను దానికి "తద్ధితార్థోత్తరపదసమాహారేచ" అను సూత్ర ముచే సమాహారార్థమున 'గో ఆమ్' అను సుబంతముతో సమాసము. సుబ్లో పాదులు చేసిన పిమ్మట "పఞ్చగో"అని యుండగా 'గోరతద్ధితలుకి'అను సూత్ర ముచే (942) టచ్; అవాదేశము, ప్రకృతసూత్రములచే నపుంసకత్వైకవచన ములు. ప్రథమైకవచనమున 'పఞ్చగవమ్' అను పదము సిద్ధించినది. దీనితో'తద్ధితా ర్థోత్తరపద . . .' వ్యాఖ్యానము పూర్తియైనది. దిగ్వాచకమునకు ఉత్తరపదము పర మగు నపుడును సంఖ్యావాచకమునకు తద్ధితార్థము విషయమగునపుడును. "పూర్వశాలాప్రియః" 'షాణ్మాతురః' ఇత్యాద్యుదాహరణములు సిద్ధాంత కౌముద్యాదులందు చూపబడినవి.

## 947. *విశేషణం విశేష్యేణ బహులమ్* 2.1.57

భేదకం భేద్యేన సమానాధికరణేన బహులం ప్రాగ్వత్. నీలమ్ ఉత్పలమ్–నీలోత్పలమ్. బహులగ్రహణాత్ క్వచిన్నిత్యమ్. కృష్ణసర్పః. క్వచిత్ న. రామో జామదగ్న్యః.

విశిష్యతే అనేనేతి విశేషణమ్. దేనిచేత విశేష్యము ఇతరవస్తువులనుండి వేరుగ చేయబడునో అది విశేషణము. నీలం ఉత్పలం అనునపుడు 'నీలం' అను పదము విశేష్య మగు ఉత్పలములను ఇతరములైన శుక్లరక్తోత్పలాదుల కంటె విభిన్నముగ చేయుచున్నది గాన ఇది విశేషణము. కావున దీనికి భేదక మనియు విశేష్యమునకు (విశేషణము దేనియందలి విశేషమును చెప్పుచున్నదో అది విశేష్యము) భేద్య మనియు పేర్లు. "పూర్వకాలైకసర్వజరత్పురాణనవ కేవలాః సమానాధికరణేన"నుండి 'సమానాధికరణేన' అనువర్తించును. భేదకము (విశేషణము) సమానాధికరణ మగు భేద్యము (విశేష్యము)తో బహులముగ సమసించును.

నీలోత్పలమ్:– నీలఞ్చ తత్ ఉత్పలఞ్చ నీలోత్పలమ్. అలౌకిక విగ్రహవాక్యమునందు "నీల సు ఉత్పల సు" అని యుండగా ఈ సూత్రముచే

సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే ప్రథమైకవచనమున 'నీలోత్పలం' అను పదము సిద్ధించినది. దీనికి తత్పురుషసమాసమనియు, సమానాధికరణ పదముల సమాసమగుటచే కర్మధారయసమాసమనియు కూడ పేర్లు.

బహులశబ్దమును ప్రయోగించుటచే కొన్ని లక్ష్యములందు ఈ సూత్రము నిత్యముగ ప్రవర్తించును; కొన్ని లక్ష్యములందు అసలే ప్రవర్తింపదు. అందుచే 'కృష్ణః సర్పః' అను వ్యస్త ప్రయోగము అసాధువు. 'రామః జామదగ్న్యః' అనునపుడు ''జామదగ్న్యః'' అనునది విశేషణ మైనను సమాసము రాదు.

948. ఉపమానాని సామాన్యవచనైః 2.1.55

ఘన ఇవ శ్యామః- ఘనశ్యామః.

ఉపమానవాచకపదములు సమానాధికరణము లగు సమానధర్మవిశిష్టవాచక పదములతో సమసించును.

ఘనశ్యామః:- ఘన ఇవ శ్యామః. మేఘమువలె నల్లనైన వాడు. ఇచట 'ఘనః'అనునది ఉపమానవాచకపదము. "శ్యామః"అనుదానికి శ్యామత్వము కలవాడని యర్థము. శ్యామత్వము ఉపమాన మగు ఘనమునందును, ఉపమేయ మగు శ్రీకృష్ణునియందును ఉన్నది గాన ఇది సమానధర్మము. ఉపమానవాచక మగు ఘనశబ్దమునకు సమానధర్మవిశిష్టవాచక మగు 'శ్యామ'శబ్దముతో ఈ సూత్రముచే సమాసము 'ఘనసుశ్యామ సు'అని యుండగా సమాసప్రాతిపదికత్వసుబ్లోపాదులచే ప్రథమైకవచనమున 'ఘనశ్యామః' అను పదము సిద్ధించినది. సమస్తమగు ఘనశబ్దమునకు లక్షణచే 'ఘన ఇవ' అని యర్థము.

వా శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోపస్యోపసంఖ్యానమ్.

శాకప్రియః పార్థివః శాకపార్థివః. దేవపూజకో బ్రాహ్మణః దేవబ్రాహ్మణః.

'శాకపార్థివః'మొదలగు పదములు సిద్ధించుటకై ఉత్తరపదమునకు లోపమును చెప్పవలెను.

శాకపార్థివః:- శాకః ప్రియః యస్య సః శాకప్రియః,శాకప్రియశ్చాసౌ పార్థివశ్చశాకప్రియపార్థివః.ఇచట 'శాకప్రియః'అనునది బహువ్రీహిసమాసము. 'శాకప్రియపార్థివః'అనునది బహువ్రీహిగర్భ మగు విశేషణసమాసము. ఇపుడీ వార్తికముచే 'శాకప్రియ'అను బహువ్రీహిసమాసములో ఉత్తరపద మగు 'ప్రియ'శబ్దము లోపింపగా 'శాకపార్థివః'అను రూపము సిద్ధించినది.

దేవబ్రాహ్మణః:- దేవానాం పూజకః దేవపూజకః దేవపూజకః బ్రాహ్మణః దేవబ్రాహ్మణః. ఇచట 'దేవపూజకః' అనునది షష్ఠీతత్పురుషసమాసము. "దేవపూజకబ్రాహ్మణః"అనునది షష్ఠీతత్పురుషగర్భ మగు విశేషణసమాసము. ఈ వార్తికముచే షష్ఠీతత్పురుషసమాసమునందలి ఉత్తరపద మగు 'పూజక' అనునది లుప్తమై "దేవబ్రాహ్మణః"అను పదము సిద్ధించినది.

949. నఞ్. 2 2.6

నఞ్ సుపా సహ సమస్యతే.

'సహ సుపా'నుండి'సుపా' అనువర్తించును.'నఞ్' సుబంతముతో సమసించును. నఞ్ అనునది నిషేధార్థక మగు ఒక అవ్యయము. ఞకారము ఇత్సంజ్ఞకము.

950. నలోపో నఞః 6.3.73

నఞః నస్య లోపః ఉత్తరపదే.న బ్రాహ్మణః-అబ్రాహ్మణః.

న,లోపః, నఞః. 'అలుగుత్తరపదే' నుంచి'అలుక్' అనువర్తించును. ఉత్తరపదము పర మగునపుడు 'నఞ్'లోని నకారమునకు లోపము వచ్చును.

అబ్రాహ్మణః- న బ్రాహ్మణః అబ్రాహ్మణః అని లౌకికవిగ్రహము. అలౌకికవిగ్రహవాక్యమున'న బ్రాహ్మణసు'అని యుండగా 'నఞ్'అను సూత్రముచే 'నఞ్'కు 'బ్రాహ్మణ సు'అను సుబంతముతో సమాసము;సుబ్లోపము. 'నబ్రాహ్మణ'అని యుండగా ప్రకృతసూత్రముచే నకారము లోపింప ప్రథమైకవచనమున 'అబ్రాహ్మణః'అను రూపము సిద్ధించినది.

951. తస్మాన్నుడచి 6.3.74

లుప్తనకారాద్ నఞ ఉత్తరపదస్యాజాదేః 'నుట్' ఆగమఃస్యాత్. 'అనశ్వః', 'నైకధా', ఇత్యాదౌ తు నశబ్దేన సహ "సహ సుపా"ఇతి సమాసః.

'అలుగుత్తరపదే' నుండి 'ఉత్తరపదే'అనువర్తించును. ఈ సూత్రము 'నలోపో నఞః'అను సూత్రమునకు పిమ్మట వచ్చుటచే 'తస్మాత్'అనుదానికి "లుప్తనకారాత్"అని యర్థము లోపించిన నకారము గల నఞ్కంటె పర మగు అజాది యైన ఉత్తరపదమునకు 'నుట్'అను నాగమము వచ్చును. నుట్ లోని ఉకారటకారములు ఇత్సంజ్ఞకములు.

అనశ్వః:- న అశ్వః అనశ్వః, 'న అశ్వ సు' అని యుండగా వెనుకటి వలె సమాస, నకారలోపాదులు చేసిన పిమ్మట "అఅశ్వ" అని యుండగా ఈ సూత్రముచే అజాది యగు 'అశ్వ' అను ఉత్తరపదమునకు నుడాగమము. టిత్తు గాన ఇది ఆద్యవయవముగ వచ్చును. 'అ న్ అశ్వ'-'అనశ్వ' రూపము సిద్ధించును.

'నైకధా' (అనేకవిధములుగా) ఇత్యాదిప్రయోగములందు ఇది నిషేధార్థక మగు 'న' శబ్దమునకు 'సహ సుపా' అను సూత్రముచే (909) 'ఏకధా' శబ్దముతో సమాసమే కాని నఞ్సమాసము కాదు. నఞ్సమాస మైనచో నకారలోపనుడాగ మములు వచ్చి 'అనేకధా' అని యగును.

952. కుగతిప్రాదయః 2.2.18

ఏతే సమర్థేన నిత్యం సమస్యన్తే. కుత్సితః పురుషః కుపురుషః.

'నిత్యం క్రీడాజీవికయోః' నుండి 'నిత్యం' అనువర్తించును. 'కు' అను అవ్యయము, గతిసంజ్ఞకములును, ప్రాదులును సమర్థ మగు శబ్దస్వరూపముతో నిత్యముగ సమసించును. అది తత్పురుషసంజ్ఞక మగును.

కుపురుషః:- 'కు పురుష సు' అని అలౌకికవిగ్రహవాక్యము. కు అను అవ్యయమునకు 'పురుషసు' అనుసమర్థశబ్దముతో ఈ సూత్రముచే సమాసము. నిత్యసమాస మగుటచే 'కుత్సితఃపురుషః' అను అస్వపదవిగ్రహము చూప బడినది.

953. ఊర్యాదిచ్విడాచశ్చ. 1.4.61

ఊర్యాదయః, చ్వ్యన్తాః, డాజన్తాశ్చ క్రియాయోగే గతిసంజ్ఞాః స్యుః. ఊరీకృత్య, శుక్లీకృత్య. పటపటాకృత్య. సుపురుషః.

'గతిశ్చ' అను సూత్రమునుండి 'గతిః' అను పదము అనువర్తించును. 'ఊరీ' మొదలగు పదములును, చ్వి ప్రత్యయాంతపదమును, డాచ్ ప్రత్యయాంత పదములను క్రియతో సంబంధించినపుడు గతిసంజ్ఞకము లగును.

ఊరీకృత్య:-'ఊరీ' అను అవ్యయము అంగీకారార్థకము. క్త్వాప్రత్య యాంత మగు కృధాతువుతో సంబంధించుటచే దీనికి ఈ సూత్రముచే గతిసంజ్ఞ లభించినది. 'కుగతిప్రాదయః' అనుసూత్రముచే దీనికి 'కృత్వా' అనుసమర్థపద ముతో సమాసము. 'సమాసే నఞ్పూర్వే క్త్వో ల్యప్' అనుసూత్రముచే (887) క్త్వా'కు ల్యబాదేశము-'ఊరీకృత్య'.

శుక్లీ కృత్య:- 'అశుక్లం శుక్లం కృత్వా శుక్లీకృత్య'అని లౌకికవిగ్రహ వాక్యము. 'శుక్ల కృత్వా'అని యుండగా "కృభ్వ స్తియోగే సమ్పద్యకర్తరిచ్వి:" అను సూత్రముచే (1241) శుక్లశబ్దమునకు చ్విప్రత్యయము. 'అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్'అను వార్తికముచే ఈ ప్రత్యయము అభూతతద్భావార్థమున (అట్లుకానిది అట్లైనది అను నర్థమున)చేరును. 'చ్వి'లోని చకారము 'చుటూ'అను సూత్రముచే (129) ఇత్సంజ్ఞకము.'వేరపృక్తస్య'అను సూత్రముచే (340) వకారలోపము. 'అస్య చ్వౌ'అను సూత్రముచే (1242) అకారమునకు ఈకారము. 'శుక్లీ'అను పదము సిద్ధించినది. దీనికిపుడు ఈ సూత్రముచే గతిసంజ్ఞ.పూర్వ సూత్రముచే (952) 'కృత్వా'శబ్దముతో సమాసము. "సమాసేనఞ్ పూర్వే క్త్వో ల్యప్ అనుసూత్రముచే (887) 'క్త్వా'కు ల్యబాదేశము-"శుక్లీకృత్య"

పటపటాకృత్య:- 'పటత్ పటత్ ఇతి కృత్వా'అని లౌకికవిగ్రహ వాక్యము. 'పటత్ కృత్వా'అనునపుడు అవ్యక్తధ్వన్యనుకరణశబ్ద మగు 'పటత్' అనుదానికి కృధాతువుతోసంబంధ ముండుటచే "అవ్యక్తానుకరణాద్ద్వ్యజవరార్ధాదనితౌడాచ్"అనుసూత్రముచే (1246) డాచ్ ప్రత్యయము. డాచ్లోని ఆకారముమాత్రము శేషించును. "డాచిచ ద్వే బహులమ్"అను వార్తికముచే (సూ. 1246) 'పటత్'అనుదానికి ద్విత్వము. 'పటత్ పటత్ ఆ కృత్వా'అని యుండగా 'టే:'అనుసూత్రముచే (242) టిలోపము-పటత్పటాకృత్వా", 'నిత్యమామ్రేడితే డాచి'అను సూత్రముచే తకారపకారములకు పకారము ఏకాదేశముగ వచ్చి 'పటపటా'అనునది సిద్ధించినది. డాజంత మగు ఈ శబ్దమునకు ఈ సూత్రముచే గతిసంజ్ఞ లభించుటచే,పూర్వసూత్రముచే దీనికి 'కృత్వా'శబ్దముతో సమాసము. ల్యబాదేశము. (సూ-887)-'పటపటాకృత్య'.

సుపురుష:-'శోభన: పురుష:' అని లౌకికవిగ్రహము. 'సు'అనునది ప్రాదులలోనిది గాన దీనికి 'కుగతిప్రాదయ:'అను సూత్రముచే 'పురుష సు' అనుదానితో సమాసము,

ప్రాదలు కూడ గతిసంజ్ఞకములే గాన మరల 'కుగతిప్రాదయ:'అను సూత్రమునందు ప్రాదులను చెప్పుట అనావశ్యకము కదా యని సందేహింపరాదు. ఏల నన సుపురుష: ఇత్యాద్యుదాహరణములందు 'సు'మొదలగు వాటికి ధాతువాచ్యక్రియాయోగము లేకుండుటచే గతిసంజ్ఞయుండదు గాన,అప్పుడు కూడసమాసము వచ్చుటకు అవకాశముండుటకే ప్రాదులు గ్రహింపబడినవి. సూత్రమునందు

సామాన్యరూపమున సుబంతముతో సమసించు నని చెప్పబడిన ఈ ప్రాదులు ఏయే అర్థములందు సమసించునో బోధించువార్తికములు చూపబడుచున్నవి:-

వా. ప్రాదయో గతార్యర్థే ప్రథమయా.

ప్రగత ఆచార్యః ప్రాచార్యః.

ప్ర మొదలగునవి గత మొదలగు అర్థములందు ప్రథమాంతపదముతో సమసించును.

ప్రాచార్యః:- 'గతః ఆచార్యః'అని లౌకిక మగు అస్వపదవిగ్రహ వాక్యము. మూలమునందు 'ప్రగతః'అనుదానిలోని 'గతః' అనునది 'ప్ర'అను దానికి వ్యాఖ్యానరూపమైనది. 'ప్ర'అనుదానికి 'గత'అనుదానితో 'కుగతిప్రాద యః'అను సూత్రముచే సమాసము చేయగా'ప్రాచార్యః'అను రూపము సిద్ధించినది.

వా. అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా.

'అతిక్రాన్తో మాలామ్'ఇతి విగ్రహే.

'అతి'మొదలగునవి క్రాంతము మొదలగు అర్థములందు ద్వితీయావిభక్త్యంతముతో సమసించును.

అతిమాలః - (మాలనుదాటినవాడు) 'క్రాంతః మాలామ్'అని అస్వపదలౌకికవిగ్రహవాక్యము. 'అతి మాలా అమ్'అని యుండగా 'కుగతిప్రాదయః' అను సూత్రముచే (952) సమాసము. సుబ్లోపము-'అతిమాలా'అనియుండ-

954. ఏకవిభక్తిచాపూర్వనిపాతే. 1.2.44.

విగ్రహే యత్ నియతవిభక్తికం తదుపసర్జనసంజ్ఞం స్యాత్,న తు తస్య పూర్వనిపాతః.

"ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్"నుండి 'సమాసే' 'ఉపసర్జనమ్ అనువర్తించును. "సమాసే"అనుదానికి 'విగ్రహవాక్యమునందు'అని లాక్షణికార్థము.

విగ్రహవాక్యమునందు నియతవిభక్తిక మగు పదమునకు ఉపసర్జన మని పేరు. కాని ఇట్టి ఉపసర్జన పదమునకు ("ఉపసర్జనం పూర్వమ్"అను సూత్రముచే (913) పూర్వనిపాతనము ఉండదు.

'క్రాన్తః మాలామ్'ఇత్యాదులందు 'మాలామ్'అనుదాని విభక్తి ఎల్లప్పుడును ద్వితీయగానే యుండును గాని మార్పు చెందదు గాన దానికీ సూత్రముచే ఉపసర్జనసంజ్ఞ లభించును.

## 955. గోస్త్రియోరుపసర్జనస్య. 1.2.48

ఉపసర్జనంయో గోశబ్దః స్త్రీప్రత్యయాన్తం చ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్. అతిమాలః.

'హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య'నుండి 'హ్రస్వః' 'ప్రాతిపదికస్య' అనువర్తించును. ఉపసర్జన మగు గోశబ్దము,స్త్రీప్రత్యయాతశబ్దమును అంతమునందు గల ప్రాతిపదికమునకు హ్రస్వము వచ్చును.

'అతిమాలా'అను ప్రాతిపదికమునందు ఉపసర్జనసంజ్ఞక మగు స్త్రీప్రత్యయాంతమాలాశబ్దము అంతమునం దున్నదిగాన ఈ సూత్రముచే హ్రస్వము వచ్చి పుంలింగ ప్రథమైక వచనమున 'అతిమాలః' అను రూపము సిద్ధించినది.

వా. అవాదయః క్రుష్టాద్యర్థే తృతీయయా.

అవక్రుష్టః కోకిలయా అవకోకిలః.

అవాదులు క్రుష్టాద్యర్థములందు తృతీయాంతముతో సమసించును.

అవకోకిలః– 'క్రుష్టః కోకిలయా అవకోకిలః'అని విగ్రహవాక్యము. కోకిలచే పిలుబడినవాడుఅని యర్థము. 'అవ'అనునది 'కోకిలా'శబ్దముతో సమసించిన పిమ్మట పై లక్ష్యమునందు వలె 'కోకిలా'శబ్దము ఉపసర్జనసంజ్ఞ మగుటచే హ్రస్వమువచ్చి (సూ-955) 'అవకోకిల'అను అకారాంతప్రాతిపదికము సిద్ధించును.

వా. పర్యాదయో గ్లానాద్యర్థే చతుర్థ్యా.

పరిగ్లానోऽధ్యయనాయ పర్యధ్యయనః.

'పరి'మొదలగునవి గ్లానాద్యర్థములందు చతుర్థ్యంతపదముతో సమసించును.

పర్యధ్యయనః– 'గ్లానః అధ్యయనాయ పర్యధ్యయనః'అని లౌకికమగు. అస్వపదవిగ్రహవాక్యము. అధ్యయనముకొరకై ఖేదమును పొందినవాడు అని యర్థము. 'పరి అధ్యయన ఙే'అని యుండగా 'కుగతిప్రాదయః'అను సూత్రముచే సమాసము.

వా. నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా.

నిర్ మొద లగునవి క్రాంతాద్యర్థములందు పంచమ్యంతపదములతో సమసించును.

నిష్కౌశామ్బిః- 'క్రాంతః కౌశామ్బ్యాః నిష్కౌశామ్బిః'అనిలౌకికాస్వపదవిగ్రహము. "కౌశాంబి అను పట్టణమునుండి బయల్వెడలినవాడు"అని యర్థము. "నిర్ కౌశామ్బీ ఙసి"అని యుండగా 'కుగతిప్రాదయః'అనుసూత్రముచే సమాసము. కౌశామ్బీ శబ్దమునకు ఉపసర్జనత్వ (సూ-954), హ్రస్వములు (సూ-955)వచ్చి 'నిష్కౌశామ్బి'అను ఇకారాంతపుంలింగ ప్రాతిపదికము సిద్ధించును.

956. తత్రోపపదం సప్తమీస్థమ్. 3.1.91

సప్తమ్యన్తే పదే 'కర్మణి' ఇత్యాదౌ వాచ్యత్వేన స్థితం యత్ కుమ్భాది తద్వాచకం పదం ఉపపదసంజ్ఞం స్యాత్.

ఇది 'ధాతోః' అను అధికారసూత్రమునకు పిమ్మట వచ్చిన అధికారసూత్రము. 'సప్తమీస్థమ్' అనగా 'సప్తమ్యంతపదమునందు వాచ్యవాచకసంబంధముచే నున్నది'-అనగాసప్తమ్యంతపదవాచ్య మగు అర్థము అని యర్థము. 'ధాతోః'అధికారమునందలి సప్తమ్యంతములగు'కర్మణి' మొదలగు పదములచే వాచ్య మగు కుంభము మొదలగు వాటిని బోధించు కుంభపదాదికమునకు ఉపపదమని పేరు.

'కర్మణ్యణ్'ఇత్యాదిసూత్రములందు (793) 'కర్మణి' మొదలగు సప్తమ్యంత పదములు ప్రయుక్తమైనవి. ఈ 'కర్మణి' ఇత్యాదిపదములకు కుంభము మొదలగు కర్మ యని యర్థము గాన సప్తమీస్థ మనగా అట్టి కుంభాద్యర్థమని యర్థము. కాని వ్యాకరణమున ఉపపదసంజ్ఞ పదమునకు వర్తించును గాని అర్థమునకు వర్తింపదు. అందుచే కుంభరూపార్థమును బోధించు కుంభాదిశబ్దములకు ఉపపదసంజ్ఞ యని యర్థము సిద్ధించును. "కుంభం కరోతీతి కుంభకారః"ఇత్యాద్యుదాహరణములందు 'కర్మణ్యణ్'అనుసూత్రముచే (793) 'కుంభ'రూప మగు కర్మవాచకపదము సమీపమునం దుండగా కృఞ్ ధాతువునకు 'అణ్'ప్రత్యయము విధింపబడినది. కావున 'కుంభ'పదమునకు'ఉపపదము'అని పేరు. 'తత్రోపపదం సప్తమీస్థమ్'అను సూత్రమునందు 'ఉపపదం సప్తమీస్థమ్' అను భాగమునకు

పూర్వోక్తార్థము చెప్పినపిమ్మట 'తత్ర' అనుదానికి "అట్టి ఉపపదము సమీపమున నున్నపుడు మాత్రమే ఆయా ప్రత్యయములు వచ్చును" అని యర్థము సిద్ధించును. ఈవిషయము సిద్ధాంతకౌముదీబాలమనోరమాదులందు స్పష్టీకరింపబడినది.

957. ఉపపదమతిఙ్. 2.2.19

ఉపపదంసుబన్తం సమర్థేన నిత్యం సమస్యతే; అతిఙన్తశ్చాయం సమాసః. కుమ్భం కరోతీతి కుమ్భకారః. అతిఙ్ కిమ్-మా భవాన్ భూత్. 'మాఙి లుఙ్'ఇతి సప్తమీనిర్దేశాత్ మాఙ్ ఉపపదమ్.

'సుబామన్త్రితే పరాఙ్గవత్స్వరే' 'సమర్థఃపదవిధిః' 'నిత్యంక్రీడాజీవికయోః'అనుసూత్రములనుండి 'సుప్' 'సమర్థః' 'నిత్యమ్' అనువర్తించును. ఉపపద మగు సుబంతము సమర్థ మగు పదముతో నిత్యముగ సమసించును; ఈ సమాసము తిఙంతము కాజాలదు.

కుమ్భకారః:- (కుంభమును చేయువాడు.) మొదట "కుమ్భ అమ్ కృ"అని యుండగా 'కర్మణ్యణ్'అనుసూత్రముచే (793) కృధాతువునకు అణ్ ప్రత్యయము. ఋకారమునకు 'అచోఞ్ణితి'అను సూత్రముచే (182) వృద్ధి(అర్) వచ్చి "కుమ్భ అమ్ కార"అని యున్నది. ఇది అలౌకికవిగ్రహవాక్యము, 'కర్మణ్యణ్'అను సూత్రమునందలి 'కర్మణి'అను సప్తమ్యంతపదమునకు వాచ్య మగునది ప్రకృతోదాహరణములోని 'కుమ్భ అమ్'అనునది. అందుచే దానికి "తత్రోపపదంసప్తమీస్థమ్"అను సూత్రముచే (956) ఉపపదసంజ్ఞ యున్నది గాన ఇది (కుమ్భ అమ్ అనునది) 'కార' అను అణ్ప్రత్యయాంత శబ్దముతో ఈ సూత్రముచే సమసింపగా సుబ్లోపాదులచే "కుమ్భకార"అను ప్రాతిపదికము సిద్ధించినది. దీని ప్రథమైకవచనమున 'కుమ్భకారః'అను రూపము సిద్ధించినది. ఇచట 'కార' అనుదానికి 'సుప్'ప్రత్యయము చేర్చుటకు ముందుగనే సమాసము చేయవలెను. "గతికారకోపపదానాం కృద్భిః సహ సమాసవచనం ప్రాక్ సుబుత్పత్తేః"అను పరిభాష ననుసరించి గతిసంజ్ఞకములకును, కారకములకును, ఉపపదములకును కృదంతములతో, సుప్ప్రత్యయములను చేర్చుటకు పూర్వమే సమాసము చేయవలెను. దీని ప్రయోజనము ముందు స్పష్ట మగును అందుచేతనే సూత్రవాఖ్యానమునందు 'సుబన్తేన సమస్యతే'అని కాక 'సమర్థేన సమస్యతే'అని చెప్పబడినది.

ఈ సమాసము తిఙంతముతో రాదు (అతిఙ్) అని చెప్పుటచే 'మా భవాన్ భూత్' అనునపుడు 'మా' అను దానికి 'భూత్'అను తిఙంతముతో సమా

సము రాలేదు. 'మాజి లుఙ్' అను సూత్రమునందు (437) 'మాఙి' అనునది సప్తమ్యంతము. దానిచే నిర్దేశింపబడుటచే 'మాఙ్'కు తత్రోపపదం సప్తమీస్థమ్" అను సూత్రముచే (956) ఉపపదసంజ్ఞ లభించును. "ఉపపదము సమర్థముతో సమసించును" అని మాత్రమే చెప్పినచో 'మా'అనునది కూడ ఉపపదమే గాన 'భూత్' అనుదానితో సమసించి యుండెడిది. తన్నివారణమునకై 'అతిఙ్' అను పదము చేర్చబడినది. 'భూత్' అనునది తిఙంతము గాన సమాసము రాదు. ఇచట సమాసము లేదని స్పష్టమగుటకై 'మా' "భూత్" అను పదముల మధ్య 'భవాన్' అను పదము కూడ చేర్చబడినది.

*వా. గతికారకోపపదానాం కృద్భిః సహ సమాసవచనం ప్రాక్ సుబుత్పత్తేః.*

వ్యాఘ్రీ, అశ్వక్రీతీ. కచ్ఛపీ ఇత్యాది.

గతి, కారక, ఉపపదములకు కృదంతముల తోడి సమాసము ఆ కృదంతములకు సుప్ప్రత్యయములను చేర్చుటకంటె పూర్వమే వచ్చును.

వ్యాఘ్రీ:- ఇది గతిసమాసమునకు ఉదాహరణము.వ్యాజిఘ్రతిఇతి(నలు మూలలందును బాగుగా వాసన చూచునది గాన) వ్యాఘ్రః. వ్యాఙ్పూర్వక మగు 'ఘ్రా' ధాతువుకంటె 'ఆతశ్చోపసర్గే' అను సూత్రముచే(791) క ప్రత్యయము. 'ఆతో లోప ఇటి చ' అను సూత్రముచే (492) ఆకారమునకు లోపము. ఈ విధముగ నిష్పన్న మైన ఘ్ర శబ్దముతో 'ఆ' అనుదానికి గతిసమాసము. మరల 'వి' అనుదానికి "ఆఘ్ర" అనుదానితో గతిసమాసము. ఇపుడు 'వ్యాఘ్ర' శబ్దము జాతివాచక మగును గాన 'జాతేరస్త్రీవిషయాదయోపధాత్' అను సూత్రముచే (1268) ఙీష్ ప్రత్యయము వచ్చి 'వ్యాఘ్రీ'అను రూపము సిద్ధించినది. కృదంత మగు 'ఘ్ర'శబ్దమునకు సుప్ ప్రత్యయము చేర్చిన పిమ్మటనే సమాసము చేయవలె నన్నచో ఈ రూపము సిద్ధింపదు. స్వార్థద్రవ్యలింగసంఖ్యాకారకప్రయుక్తములగు కార్యములు క్రమికము లని (ఆక్రమముననే వచ్చు ననెడు) భాష్యకార వాక్యము ననుసరించి 'ఘ్ర'అనుదానికి సుప్ప్రత్యయమును చేర్చుటకు పూర్వము లింగప్రయుక్త మగు స్త్రీప్రత్యయమును ముందు చేర్చవలసి యుండును, 'ఘ్ర' అనునది జాతివాచకము కాదుగావున దానికి పై సూత్రముచే 'ఙీష్' వచ్చుటకు అవకాశము లేదు. 'అజాద్యతష్టాప్' అను సామాన్యసూత్రముచే (1247) టాప్ వచ్చి 'ఘ్రా' అని యగును దానికి సుప్ చేర్చి 'వ్యా'అను ఉపసర్గలతో సమా

సము చేసిన పిమ్మట సిద్ధించిన 'వ్యాఘ్రా' అనునది జాతివాచకమే యైనను అదంతము కాకుండుచే జీష్ వచ్చి 'వ్యాఘ్రీ' అను అభీష్టరూపము సిద్ధించుటకు అవకాశములేదు. అందుచే సుబుత్పత్తికంటె పూర్వమే సమాసము నంగీకరించినచో అదంతమును జాతివాచకమును అగు 'వ్యాఘ్ర'శబ్దము లభించును గాన దానికి స్త్రీత్వమున 'జీష్' వచ్చి 'వ్యాఘ్రీ' అను రూపము సిద్ధించును.

అశ్వక్రీతీ:- అశ్వేన క్రీతా అశ్వక్రీతీ:- గుఱ్ఱముచే కొనబడినది. ఇచట కరణవాచక మగు 'అశ్వ టా' అను తృతీయాంతశబ్దమునకు 'క్రీత' అను క్తప్రత్యయాంతముతో సుప్ప్రత్యయము చేర్చుటకు పూర్వమే సమాసము వచ్చినది. 'అశ్వక్రీత' అను ప్రాతిపదిక మేర్పడిన పిమ్మట 'క్రీతాత్కరణపూర్వాత్' అను సూత్రముచే (1263) ('క్రీత' శబ్దమునకు కరణవాచక మగు అశ్వశబ్దము పూర్వమునందున్నది గాన) జీష్ వచ్చి 'అశ్వక్రీతీ' అను రూపము సిద్ధించినది. సుబుత్పత్తిచేసిన పిమ్మటనే సమాసము వచ్చునన్నచో, పూర్వోదాహరణమునందు చూపిన విధముగ మొదట స్త్రీప్రత్యయ మగు 'టాప్' చేర్చిన పిమ్మట సుప్ చేర్చి సమాసము చేయగా 'అశ్వక్రీతా' అను రూపమే అగును గాని "అశ్వక్రీతీ" అను రూపము సిద్ధించదు. 'క్రీత' శబ్దమున స్వతంత్రముగ (అనగా కరణవాచకపూర్వపదసహితముకాక) నున్నపుడు 'క్రీతాత్కరణపూర్వాత్' అను సూత్రము ప్రవర్తించుటకు అవకాశము లేదు. కావున కారకసమాసము కృదంతముతో సుబుత్పత్తికంటె పూర్వమే వచ్చునని చెప్పబడినది.

కచ్ఛపీ:- కచ్ఛేన కచ్ఛే వా పిబతీతి కచ్ఛపీ. ఆడ తాబేలు. కచ్ఛమనగా తీరము. 'సుపి స్థః' అను సూత్రమును యోగవిభాగము చేయగా సిద్ధించిన 'సుపి' అనుదానిచే సుబంత మగు కచ్ఛశబ్దము ఉపపదముగా నుండగా స్థాధాతువునకు కప్రత్యయము. ఆకారలోపము (సూ-492)- 'ప' అను అకారాంతశబ్దము సిద్ధించినది. ఇపుడు సుబుత్పత్తికంటె పూర్వమే 'కచ్ఛ టా' అనుదానికి 'ప'శబ్దముతో సమాసము (సూ-957). ఇపుడు 'కచ్ఛప' శబ్దము జాతివాచకము గాన "జాతేరస్త్రీవిషయాదయోపధాత్" అను సూత్రముచే (1268) 'జీష్' వచ్చి 'కచ్ఛపీ'అను రూపము సిద్ధించినది. సమాసము చేయుటకుపూర్వమే సుప్ప్రత్యయము చేర్చుటకై స్త్రీప్రత్యయము చేర్చవలెనన్నచో ('వ్యాఘ్రీ'అను ఉదాహరణమునందు చూపిన విధముగ) 'ప'శబ్దము జాతివాచకముకాదు గాన జీష్ వచ్చుటకు అవకాశ ముండదు. టాప్ మాత్రమే వచ్చి పిమ్మట సమాసము చేయగా 'కచ్ఛపా'అను రూపము సిద్ధించెడిది.

958. తత్పురుషస్యాఙ్గులేః సంఖ్యావ్యయాదేః 5.4.86

సంఖ్యావ్యయాదేరఙ్గుల్యన్తస్య సమాసాన్తోఽచ్ స్యాత్. ద్వే అఙ్గులీ ప్రమాణమస్య ద్వ్యఙ్గులమ్. నిర్గతమఙ్గులిభ్యః నిరఙ్గులమ్.

'సమాసాన్తాః' అని అధికారసూత్రము, "అచ్ప్రత్యన్వవపూర్వాత్సామలోమ్నః" నుండి 'అచ్' అనువర్తించును. సంఖ్యావాచకావ్యయములు ఆదియందు కలదియు, అంగులిశబ్దము అంతమునందు కలదియు నగు తత్పురుష సమాసమునకు సమాసాంతప్రత్యయ మగు 'అచ్' వచ్చును.

ద్వ్యఙ్గులమ్:- 'ద్వే అంగులీ ప్రమాణం అస్య'—రెండుఅంగులముల ప్రమాణము కలది. 'ద్వి ఔ అఙ్గులి ఔ' అని యుండగా 'మాత్రచ్' అను తద్ధిత ప్రత్యయమునకు వాచ్యమగు ప్రమాణార్థమున "తద్ధితార్థోత్తరపదసమాహారే చ" అను సూత్రముచే (939) సమాసము. "ప్రమాణేద్వయసజ్దఘ్నఞ్మాత్రచః" అను సూత్రముచే (1167) ప్రమాణార్థమునందు వచ్చిన 'మాత్రచ్' ప్రత్యయమునకు "ప్రమాణేలః" 'ద్విగోర్నిత్యమ్' అను వార్తికములచే లోపము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే 'ద్వ్యఙ్గులి'అను ప్రాతిపదికము సిద్ధించినది. ఇది సంఖ్యావాచకాదియు, అంగుల్యంతమును అగు తత్పురుషము గాన ఈ సూత్రముచే 'అచ్' ప్రత్యయము. 'యస్యేతిచ' అను సూత్రముచే (236) ఇకారమునకు లోపము. నపుంసకలింగప్రథమైకవచనమునందు 'ద్వ్యఙ్గులమ్' అను పదము సిద్ధించినది.

నిరఙ్గులమ్:- 'నిర్ = గతం అంగులిభ్యః' అని లౌకిక మగు అస్వపదవిగ్రహము. 'నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా' అను వార్తికముతో సహకృత మగు "కుగతిప్రాదయః" అను సూత్రముచే (952) సమాసము. సుబ్లోపాదులచే సిద్ధించిన 'నిరఙ్గులి' అను ప్రాతిపదికమునకు ఈ సూత్రముచే 'అచ్' అను సమాసాంతప్రత్యయము చేర్చగా ఇకారలోపము(సూ-236)-'నిరఙ్గులమ్'.

959. అహఃసర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః 5.4.87

ఏభ్యో రాత్రేరచ్ స్యాత్. చాత్ సంఖ్యావ్యయాదేః. అహర్గ్రహణం ద్వన్ద్వార్థమ్.

'చ'శబ్దముచే పూర్వసూత్రమునుండి సంఖ్యావ్యయాదేః' అనువర్తించును. అహన్, సర్వ, ఏకదేశవాచక (అవయవవాచక), సంఖ్యాత, పుణ్య

శబ్దములకంటె పరమగు రాత్రిశబ్దమునకును, సంఖ్యావాచకములును, అవ్యయములును పూర్వమందు గల రాత్రి శబ్దమునకు అచ్ ప్రత్యయము సమాసాంతముగ వచ్చును.

'అహ్నః రాత్రిః' లేక 'అహశ్చాసౌ రాత్రిః' ఇత్యాదిసమాసములు లేకుండుటచే అహన్‌పదపూర్వకరాత్ర్యంతతత్పురుషము అసంభావ్యము గాన ఈ సూత్రమునందలి 'అహః' అనునది తత్పురుషసమాసమునకై కాక 'అహశ్చ రాత్రిశ్చ' అను ద్వంద్వసమాసమునందు అచ్ ప్రత్యయము వచ్చుటకై గ్రహింపబడినది. ఇతరపదములకు తత్పురుషసమాసమునందు దాహరణములు లభ్యములు.

960. రాత్రాహ్నాహాః పుంసి 2.4.29

ఏతదన్తౌ ద్వన్ద్వతత్పురుషౌ పుంస్యేవ. అహశ్చ రాత్రిశ్చ అహోరాత్రః. సర్వరాత్రః. సంఖ్యాతరాత్రః.

"పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః"నుండి 'ద్వంద్వతత్పురుషయోః' అనువర్తించును. రాత్ర, అహ్న, అహ, ఈశబ్దములు అంతమునందు గల ద్వంద్వతత్పురుషములు పుంలింగమునందే యుండును.

అహోరాత్రః:- అహశ్చ రాత్రిశ్చ తయోస్సమాహారః అహోరాత్రః. ద్వంద్వసమాసము చేసిన పిమ్మట 'అహోరాత్రి' అని యుండగా ఈ సూత్రముచే అచ్ ప్రత్యయము. 'జాతిరప్రాణినామ్' అను సూత్రముచే ఈ ద్వంద్వమునకు ఏకవద్భావము. 'స నపుంసకమ్' అను సూత్రమును (946) బాధించి ఈ సూత్రముచే పుంలింగము వచ్చుటచే 'అహోరాత్రః' అను రూపము సిద్ధించినది.

సర్వరాత్రః:- సర్వా చ సా రాత్రిశ్చ సర్వరాత్రః. 'పూర్వకాలైకసర్వజరత్పురాణనవకేవలాః సమానాధికరణేన'అను సూత్రముచే సమాసము. సర్వా పదమునకు "పుంవత్కర్మధారయజాతీయదేశీయేషు" అను సూత్రముచే పుంవద్భావము వచ్చి 'సర్వ' యైనది. రాత్రిశబ్దమునకు అచ్ ప్రత్యయము. "యస్యేతి చ" అను సూత్రముచే (236) ఇకారము లోపింపగా 'సర్వరాత్ర' అను అకారాంతశబ్దము సిద్ధించినది. దానికి ప్రకృతసూత్రముచే పుంలింగము. ప్రథమైకవచనమున 'సర్వరాత్రః' అనురూపము.

ఏకదేశవాచకపదపూర్వకరాత్రిశబ్దమునకు అచ్ ప్రత్యయము చేసినచో 'పూర్వరాత్రః' 'అపరరాత్రః' ఇత్యాద్యుదాహరణములు సిద్ధించును. 'పూర్వం రాత్రేః' 'అపరం రాత్రేః' అని విగ్రహము. 'పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే' అను సూత్రముచే (935) సమాసము.

సంఖ్యాతరాత్రః:- సంఖ్యాతా చ సా రాత్రిశ్చ అని విగ్రహము, 'విశేషణం విశేష్యేణబహులమ్' అను సూత్రముచే (947) సమాసము. ఇతరకార్యములు 'సర్వరాత్రః' అను నుదాహరణమునందు వలె ఉండును.

*వా. సంఖ్యాపూర్వం రాత్రం క్లీబమ్.*

ద్విరాత్రమ్. త్రిరాత్రమ్.

సంఖ్యావాచకము పూర్వమునందు గల రాత్రిశబ్దము నపుంసకలింగమునందుండును.

ద్విరాత్రమ్:- ద్వయోః రాత్ర్యోః సమాహారః. "ద్వి ఓస్ రాత్రి ఓస్" అని యుండగా "తద్ధితార్థోత్తరపదసమాహారే చ" అను సూత్రముచే (939) సంఖ్యావాచక మగు "ద్వి ఓస్" అనుదానికి "రాత్రి ఓస్" అను సుబంతముతో సమాహారార్థమునందు సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపములచే 'ద్విరాత్రి' అని యుండగా ఇది సంఖ్యావాచకాది యగు తత్పురుషమగుటచే "తత్పురుషస్యాంగులేః సంఖ్యావ్యయాదేః" అను సూత్రముచే (958) అచ్ ప్రత్యయము. ఇకార లోపము (సూ-236). "రాత్రాహ్నాహాః పుంసి" అను సూత్రముచే (960) పుంలింగము రావలసి యుండగా దానిని బాధించి ఈ వార్తికముచే నపుంసకత్వము వచ్చినది.

త్రిరాత్రమ్:- తిసృణాం రాత్రీణాం సమాహారః. ఇది గూడ 'ద్విరాత్ర'శబ్దము వలె నిష్పన్న మగును,

961. *రాజాహస్సఖిభ్యష్టచ్* 5.4.91

ఏతదన్తాత్తత్పురుషాత్ టచ్ స్యాత్.పరమరాజః.

"తత్పురుస్యాఙ్గులేః సంఖ్యావ్యయాదేః" నుండి 'తత్పురుషస్య' అను వర్తించును. రాజన్, అహన్, సఖి అనుపదములు అంతమునందు గల తత్పురుషసమాసమునకు టచ్ అను సమాసాంత ప్రత్యయము వచ్చును.

పరమరాజః:- పరమశ్చాసౌ రాజా చ పరమరాజః." విశేషణంవిశే

ష్యేణబహులమ్" అను సూత్రముచే (947) సమాసము. ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము. 'టచ్'లోని అకారము మాత్రము శేషించును. 'పరమరాజన్ అ' అని యుండగా 'న స్తద్ధితే' అను సూత్రముచే (922) టి యగు 'అన్' లోపించి 'పరమరాజ'అను అకారాంతశబ్దము సిద్ధించును. ఈ విధముగ 'పుణ్యాహః' 'కృష్ణసఖః' ఇత్యాదులంను కూడ ఈ సూత్రముచే టచ్ప్రత్యయము వచ్చి రూపములు సిద్ధించును.

962. ఆన్మహతః సమానాధికరణజాతీయయోః 6.3.46

మహతః ఆకారోఽన్తాదేశః స్యాత్ సమానాధికరణే ఉత్తరపదే, జాతీయే చ పరే. మహారాజః. ప్రకారవచనే జాతీయర్; మహాప్రకారో-మహాజాతీయః.

మహత్ శబ్దమునకు సమానాధికరణపదము ఉత్తరపదముగ నున్నపుడును, జాతీయర్ప్రత్యయము పర మగు నపుడును, ఆకారము అంతాదేశముగ వచ్చును.

మహారాజః-మహాన్ చ అసౌ రాజా చ."విశేషణంవిశేష్యేణబహులమ్" అను సూత్రముచే (947) సమాసము, "మహత్‌రాజన్"అని యుండగా ఈ సూత్రముచే 'మహత్'అనుదానికి ఆకారము అంతాదేశముగ వచ్చి సవర్ణదీర్ఘము చేయగా 'మహారాజన్'అని యగును. పూర్వసూత్రముచే రాజన్ శబ్దముకంటె టచ్ప్రత్యయము,టిలోపము చేయగా,ప్రథమైకవచనమున 'మహారాజః' అనుపద ముసిద్ధించినది.

మహాజాతీయః- 'ప్రకారవచనేజాతీయర్'అనుసూత్రముచే 'మహత్' శబ్దముకంటె 'ఆ పద్ధతి కలవాడు'అను నర్థమున 'జాతీయర్'ప్రత్యయము. ఈ సూత్రముచే మహచ్ఛబ్దమునకు ఆకారముఅంతాదేశము,సవర్ణదీర్ఘము-'మహాజాతీయః'. గొప్పవానితో సమానుడు.

963. ద్వ్యష్టనః సంఖ్యాయామబహువ్రీహ్యశీత్యోః. 6.3.47

ఆత్ స్యాత్. ద్వౌ చ దశ చ ద్వాదశ. అష్టావింశతిః.

'ద్వి' 'అష్టన్'శబ్దములకు సంఖ్యావాచకము ఉత్తర పద మగునపుడు ఆకారము అంతాదేశముగ వచ్చును; బహువ్రీహిసమాసమునందును, అశీతి శబ్దము త్తరపదముగ నున్నపుడును మాత్రము రాదు.

ద్వాదశ:- ద్వౌ చ దశ చ అని విగ్రహము చెప్పినచో ద్వంద్వసమాసము. 'ద్వ్యధికాః దశ ద్వాదశ'అని చెప్పినచో 'శాకపార్థివః'వలె ఉత్తరపద లోపి(తత్పురుష)సమాసము. ఇచట ద్విశబ్దమునకు సంఖ్యావాచకము ఉత్తర పదముగ నుండుటచే ఈ సూత్రముచే ఆకారము అంతాదేశమై (ఇకారస్థానమున వచ్చి)"ద్వాదశ"అను రూపము సిద్ధించినది.

అష్టావింశతిః- "అష్టౌ చ వింశతిశ్చ"అని సమాహార ద్వంద్వసమాసము. కాక "అష్టాధికా వింశతిః"అని ఉత్తరపదలోపితత్పురుషసమాసము. అష్టన్ శబ్దమునకు ఈ సూత్రముచే ఆకారము అంతాదేశము. సవర్ణదీర్ఘము- 'అష్టావింశతిః'.

## 964. పరవల్లిఙ్గం ద్వంద్వతత్పురుషయోః. 2.4.26

ఏతయోః పరపదస్యేవ లిఙ్గం స్యాత్. కుక్కుటమయూర్యావిమే. మయూరీకుక్కుటావిమౌ. అర్ధపిప్పలీ.

ద్వంద్వతత్పురుషసమాసములందు ఉత్తరపదమునకు ఏ లింగమో, మొత్తము సమాసమునకు ఆ లింగ ముండును.

'కుక్కుటశ్చ మయూరీ చ'అను ద్వంద్వసమాసమునందు ఉత్తరపదమగు మయూరీశబ్దముస్త్రీలింగము గాన మొత్తము సమాసము స్త్రీలింగమున ప్రయోగింపబడును. ఇది స్త్రీలింగ మని సూచించుటకు 'ఇమే'అను స్త్రీలింగ శబ్దము కూడ ప్రయోగింపబడినది. ఇట్లే పుంలింగ మగు కుక్కుటశబ్దము ఉత్తరపద మైనపుడు సమాసము పుంలింగమునం దుండుటచే "మయూరీ చ కుక్కుటశ్చ మయూరీకుక్కుటౌ"అని యగును. ఇట్లే'అర్ధం పిప్పల్యాః'అను తత్పురుషసమాసమునందు ఉత్తరపద మగు పిప్పలీశబ్దముస్త్రీలింగము గాన అర్ధపిప్పలీ యను సమాసము స్త్రీలింగమునందుండును.

వా. *ద్విగుప్రాప్తాపన్నాలంపూర్వగతిసమాసేషు ప్రతిషేధో వాచ్యః.*

పఞ్చసు కపాలేషు సంస్కృతః పఞ్చకపాలః పురోడాశః.

ద్విగుసమాసమునందును,ప్రాప్త,ఆపన్న,అలం అనుపదములు పూర్వపదములుగా గల సమాసములందును గతిసమాసములందును ఈ పరవల్లింగత్వమునకు నిషేధము చెప్పవలెను. అనగా ఈ సమాసముల లింగము పరపదముల యొక్క లింగము ననుసరించి యుండదని యర్థము.

పఞ్చకపాలః- పంచసు కపాలేషు సంస్కృతః-ఐదు కపాలములలో సంస్కరింపబడిన (పురోడాశము) అని యర్థము. 'సంస్కృతః'అను తద్ధితార్థమున'తద్ధితార్థోత్తరపదసమాహారేచ'అనుసూత్రముచే (939) ఈ ద్విగుసమాసము సిద్ధించినది. దీనిలోని ఉత్తరపద మగు కపాలశబ్దము నపుంసకలింగ మైనను సమాసము పుంలింగములో నున్నది.

965. ప్రాప్తాపన్నే చ ద్వితీయయా 2.2.4

సమస్యేతే;అకారశ్చానయోరన్తాదేశః. ప్రాప్తో జీవికాం·ప్రాప్తజీవికః. ఆపన్నజీవికః. అలం కుమార్యై అలంకుమారిః.అత ఏవ జ్ఞాపకాత్ సమాసః. నిష్కౌశామ్బిః.

ప్రాప్త, ఆపన్నశబ్దములుద్వితీయాంతముతో సమసించును; ఈశబ్దములకు అకారము కూడ అంతాదేశముగ వచ్చును. ప్రాప్తజీవికః- ప్రాప్తః జీవికాం- జీవికను పొందినవాడు. "ప్రాప్త సు జీవికా అమ్"అని యుండగా ఈ సూత్రముచే సమాసము. 'ప్రాప్త' "ఆపన్న"శబ్దములకుఉపసర్జనసంజ్ఞయుండుటచే (సూ-912) వాటికి పూర్వనిపాతము. జీవికా శబ్దమునకు "ఏకవిభక్తిచాపూర్వనిపాతే"అను సూత్రముచే (954) ఉపసర్జనత్వ ముండుటచే "గోస్త్రియోరుపసర్జనస్య"అనుసూత్రముచే (955) హ్రస్వము వచ్చి'ప్రాప్తజీవిక'అను అకారాంత ప్రాతిపదికము సిద్ధించినది. ఇచట ఉత్తరపద మగు 'జీవికా'శబ్దము స్త్రీలింగ మైనను పై వార్తికముచే పరవల్లింగత్వము నిషేధింపబడినది గాన సమాసము పుంలింగము నందున్నది.'ఆపన్నజీవికః'అనునది కూడ ఈవిధముగనే సిద్ధించును. ఈ సూత్రముచే సమాసము రాని పక్షమున "ద్వితీయా..."ఇత్యాది సూత్రముచే (927) సమాసము చేయగా ద్వితీయాంతమునకు పూర్వనిపాతమువచ్చుటచే 'జీవికాప్రాప్తః' "జీవికాపన్నః"అను రూపములు సిద్ధించును.

'ప్రాప్తా జీవికామ్' 'ఆపన్నా జీవికామ్'ఇత్యాదులందు కూడ 'ప్రాప్తజీవికా' 'ఆపన్నజీవికా'ఇత్యాదిరూపములు సిద్ధించుటకై ప్రాప్తాపన్నశబ్దములకు అకారము అన్తాదేశముగ విధింపబడినది,

అలంకుమారిః- 'అలంకుమార్యై'-కుమారికి తగినవాడు అని యర్థము. ఇచట ఉత్తరపద మగు కుమారీశబ్దము స్త్రీలింగ మైనను ఈ వార్తికముచే పరవల్లింగత్వము నిషేధింపబడినది గాన సమాసమునకు పుంలింగమే వచ్చినది. వాస్తవమున 'అలం' శబ్దమునకు కుమార్యాదిశబ్దములతో సమాసమును విధించు

సూత్ర మేదియును లేదు. కాని "అలంపూర్వకసమాసములందు పరవల్లింగత్వము రాదు" అని ఈవార్తికమునందు చెప్పుటచేదీనిని బట్టి 'అలం' అనుదానికి సుబంతము లతో సమాసము వచ్చు ననిసూచిత మగుచున్నది. ఈ సూచనను పట్టియే ఇచట సమాసమువచ్చినది.

నిష్కౌశామ్బిః- నిర్గతః కౌశామ్బ్యాః. "నిరాదయః క్రాంతాద్యర్థేపంచమ్యా' అను వార్తికముతో సహకృత మగు "కుగతిప్రాదయః'' అను సూత్రముచే (952) సమాసము. ఉత్తరపద మగు 'కౌశాంబీ' అనునది స్త్రీలింగ మైనను ఈ వార్తికముచే పరవల్లింగము నిషిద్ధ మగుటచే సమాసము పుంలింగములో ప్రయుక్త మైనది. ఇది గతిసమాస మనివార్తికమునందు చెప్పబడినను, వాస్తవమున నిది ప్రాదిసమాసము.

966. అర్ధర్చాః పుంసి చ. 2.4.31

అర్ధర్చాదయః శబ్దాః పుంసి క్లీబే చ స్యుః. అర్ధర్చః-అర్ధర్చమ్ ఏవం ధ్వజ, తీర్థ, శరీర, మణ్డప, యూప, దేహాఙ్కుశ, పాత్రసూత్రాదయః.

'అర్ధర్చాః' అని బహువచనప్రయోగముచే అర్ధర్చాదిశబ్దము లని యర్థము. 'చ' శబ్దముచే 'అపథం నపుంసకమ్' అనుపూర్వసూత్రమునుండి 'నపుంసకమ్' అనువర్తించును. అర్ధర్చాదిశబ్దములు పుంలింగమునందును, నపుంసకలింగమునందును గూడ ఉండును.

అర్ధర్చః- 'ఋచః అర్ధం' అను నర్థమున ''అర్ధం నపుంసకమ్'' అను సూత్రముచే (936) సమాసము. పరవల్లింగముచే స్త్రీలింగము రావలసి యుండ దానిని బాధించి ఈ సూత్రముచే పుంలింగనపుంసకలింగములు విధింపబడినవి. 'అర్ధర్చః' లేక 'అర్ధర్చమ్' అనురూపము లుండును. ఈ అర్ధర్చాదిగణమునందు ధ్వజ, తీర్థమొద లగు కొన్ని అసమస్తపదములు గూడ ఉన్నవి. అవి ఈ సూత్రముచే పుంలింగనపుంసకలింగములలో నుండును.

వా. సామాన్యే నపుంసకమ్.

మృదు పచతి. ప్రాతః కమనీయమ్.

ఇతి తత్పురుషః.

విశేష్యవిశేషణములు సన్నిహితములై యుండగా, స్త్రీత్వపుంస్త్వములు అభివ్యక్తము కాని స్థలములందు సామాన్యరూపముచే నపుంసకలింగమును ప్రయోగింపవలెను.

మృదు పచతి:- మెత్తగా వండుచున్నాడు. ఇచట 'మృదు'అనునది క్రియావిశేషణము. పచ్ ధాతువునకు విక్లిత్త్యనుకూలవ్యాపార మర్థము. దీనియందలి విక్లిత్త్యంశముతో 'మృదు' అనునది అన్వయించుచున్నది. మృదువైన పాకమును చేయుచున్నాడు అని పర్యవసితార్థ మగుటచే మృదుశబ్దము ద్వితీయ విభక్తిలో నున్నది. దీనిలింగము మాత్రము స్త్రీత్వపుంస్త్వనిర్ణాయకప్రమాణ మేదియు లేదు గాన నపుంసకలింగమున నుండును.

ప్రాతఃకమనీయమ్:- ప్రాతఃకాలము రమ్యముగ నున్నది.ఇచట 'కమనీయం' అను పదము ప్రాతః అను అవ్యయమునకు విశేషణముగ ప్రయోగింపబడినది. కాని 'ప్రాతః' అనుదానికి లింగవిశేషమేదియు లేదు గాన 'కమనీయమ్' అనునది నపుంసకలింగమునప్రయుక్త మైనది.

తత్పురుష ప్రకరణము సమాప్తము.

# అథ బహువ్రీహిః

967. శేషో బహువ్రీహిః 2.2.23

అధికారోఽయం ప్రాగ్ద్వన్ద్వాత్.

"చార్థేద్వన్ద్వః" అను సూత్రము వరకును ఈ సూత్రము అధికారము.

968. అనేకమన్యపదార్థే 2.2.24

అనేకం ప్రథమాన్తం అన్యస్యపదస్యార్థే వర్తమానం వా సమస్యతే. స బహువ్రీహిః.

'శేషో బహువ్రీహిః' అను అధికారసూత్రము అనువర్తించును. ద్వితీయాశ్రితాతీత- ఇత్యాదిసూత్రములచే ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమ్యాదివిభక్త్యంతములకు సమాసము విధింపబడినది. ఒక్క ప్రథమా విభక్త్యంతమునకు మాత్రము దానిని ప్రత్యేకముగా పేర్కొని సమాసము విధింపబడి యుండలేదు. "విశేషణం విశేష్యేణ బహులం" అను (947) సమాసము ప్రథమావిభక్త్యంతములకే వచ్చును.ఐనను ఆ సూత్రమునందు ప్రథమావిభక్తిని పేర్కొని సమాసము విధింపబడలేదు. కావున 'శేషః' అనుపదమునకు ప్రథమా

విభక్త్యంతము అని యర్థము. అన్యపదార్థమును బోధించెడు అనేక ప్రథమాంతము వికల్పముగ సమసించును. అది బహువ్రీహి సంజ్ఞకము.

బహువ్రీహిసమాసమునందు సమసించు పదములు రెండును (కొన్నిస్థలములలో అంతకంటె ఎక్కువ సంఖ్యలో కూడ ఉండవచ్చును) ప్రథమాంత పదము లగుటచే సమానాధికరణములై యుండును. ఈ సమాసమున సమసించు పదముల యర్థముకంటె భిన్న మగు మరియొక అర్థము (అన్యపదార్థము) బోధింపబడును. ఈ అన్యపదార్థము ద్వితీయాదివిభక్తులలో ఏవిభక్తిలోనైనను ఉండవచ్చును.

## 969. సప్తమీవిశేషణే బహువ్రీహౌ 2.2.35

సప్తమ్యన్తం విశేషణఞ్చ బహువ్రీహౌ పూర్వం స్యాత్. అత ఏవ జ్ఞాపకాద్ వ్యధికరణో బహువ్రీహిః.

'ఉపసర్జనం పూర్వమ్' నుండి 'పూర్వం' అనువర్తించును. బహువ్రీహి సమాసమునందు సప్తమ్యంతపదమును, విశేషణమును పూర్వము ప్రయుక్తము లగును.

పూర్వసూత్రమునందు బహువ్రీహిసమాసమున ప్రథమవిభక్త్యంతపదములు మాత్రమే సమసించు నని చెప్పబడినది. కాని ఈ సూత్రమునందు సప్తమ్యంతమునకు పూర్వనిపాతము విధింపబడుచున్నది. దానిని పట్టి బహువ్రీహి సమాసమునందు సప్తమ్యంతము కూడ పూర్వపదముగ ఉండవచ్చు నని అనగా వ్యధికరణపదములు కూడ సమసింపవచ్చు నని- సూచిత మగుచున్నది అందుచే "కంఠే కాలః యస్య సః కంఠేకాలః" 'పద్మం నాభౌ యస్య సః పద్మనాభః' "శరేభ్యో జన్మ యస్య సః శరజన్మా" ఇత్యాది బహువ్రీహి సమాసములు సిద్ధించినవి.

## 970. హలదన్తాత్సప్తమ్యాః సంజ్ఞాయామ్ 6.3.9

హలన్తాత్ అదన్తాత్ సప్తమ్యా అలుక్. కణ్ఠే కాలః, ప్రాప్త ముదకం యం ప్రాప్తోదకః గ్రామః. ఊఢరథోఽనడ్వాన్. ఉపహృత పశూ రుద్రః. ఉద్ధృతౌదనా స్థాలీ. పీతామ్బరో హరిః. వీరపురుషకో గ్రామః.

'అలుగు త్తరపదే' అధికారము. హలంతముకంటెను, అదంతముకంటెన పర మగు సప్తమికి, అసమానము సంజ్ఞావాచక మగునపుడు, అలుక్ వచ్చును

కణ్ఠేకాలః:- కణ్ఠే కాలః యస్య సః అని లౌకికవిగ్రహవాక్యము. 'కణ్ఠ ఙి కాల సు' అని యుండగా "సప్తమీవిశేషణేబహువ్రీహౌ" అను సూత్రము నందు 'సప్తమీ' అనుపదమును గ్రహించుటచే సప్తమ్యంతమునకు ప్రథమాంత ముతో వ్యధికరణసమాసము. సప్తమ్యంతమునకు ఈ సూత్రముచేతనే పూర్వ నిపాతము. 'సుపోధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే (724) 'కణ్ఠ ఙి కాల సు'అను ప్రాతిపదికకు అవయవము లగు 'ఙి' 'సు'లకు రెంటికిని లోపము రావలసి యుండ, ఈ పదము శివునకు సంజ్ఞ గాన, ప్రకృతసూత్రముచే సప్త మికి అలుక్. ప్రథమైకవచనమున 'కణ్ఠేకాలః' అను రూపము సిద్ధించినది.

బహువ్రీహి అన్యపదార్థమును బోధించును. ఆ అన్యపదార్థము ద్వితీ యాది విభక్త్యంతము కావచ్చును. ప్రథమావిభక్త్యంతము మాత్రము కాజాలదు. అందుచే ద్వితీయాద్యంతార్థములందు వరుసగ ఉదాహరణములు చూపబడు చున్నవి.

ప్రాప్తోదకః గ్రామః:- ఏ గ్రామమును ఉదకము చేరినదో ఆ గ్రామము. ఇది ద్వితీయాంతాన్యపదార్థమునకు ఉదాహరణము. "ప్రాప్తం ఉదకం యం సః" అని లౌకికవిగ్రహవాక్యము. 'ప్రాప్త సు ఉదక సు' అని యుండగా 'అనేక మన్యపదార్థే' అను సూత్రముచే (968) ప్రథమాంతము లగు ఈ రెండు పదము లను సమసించును. వీటిలో "ప్రాప్తః" అనునది విశేషణము గాన 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అను సూత్రముచే (969) దానికి పూర్వనిపాతము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే ప్రథమైకవచనమున 'ప్రాప్తోదకః' అను రూపము సిద్ధించినది.

ఊఢరథః:- ఊఢః రథః యేన సః. దేనిచే రథము వహింపబడినదో అట్టి ఎద్దు. ఇచట తృతీయవిభక్త్యంతాన్యపదార్థమున 'ఊఢ సు రథ సు' అను ప్రథమాంతములకు సమాసము వచ్చినది. ఉపహృతపశుః:- ఉపహృతః పశుః యస్మై సః. ఎవనికొరకు పశువు సమర్పింపబడినదో అట్టి రుద్రుడు. చతుర్థ్యం తార్థమున సమాసము వచ్చినది. ఉద్ధృతౌదనా:- ఉద్ధృతః ఓదనః యస్యాః సా. దేనినుండి అన్నము తీయబడినదో అట్టి గిన్నె. పంచమ్యంతాన్యపదార్థము నందు సమాసము. పీతామ్బరః:- పీతం అంబరం యస్య సః- ఎవని వస్త్రము

పచ్చదైనదో అట్టి హరి. షష్ఠ్యంతాన్యపదార్థమున సమాసము. వీరపురుషకః:- వీరాః పురుషాః యస్మిన్ సః- దేనియందలి పురుషులు వీరులో ఆ గ్రామము. సప్తమ్యంతాన్యపదార్థమునందు'వీర', 'పురుష' శబ్దములకు సమాసము. శేషాద్విభాషా'' అను సూత్రముచే (984) సమాసాంత మగు కప్ ప్రత్యయము చేర్చుటచే "వీరపురుషకః" అను రూపము సిద్ధించినది.

ప్రాదిభ్యోధాతుజస్యవాచ్యోవాచోత్తరపదలోపః.

ప్రపతితపర్ణః-ప్రపర్ణః.

ప్రాదులకంటె పర మగు ధాతుజప్రథమాంతపదమునకు (ధాతువునుండి నిష్పన్న మగు పదమునకు)మరియొక ప్రథమాంతముతో బహువ్రీహి సమాసము చెప్పదగినది, ప్రాదులకంటె పర మగు ఉత్తరపదమునకు వికల్పముగ లోపము చెప్పదగినది.

ప్రపర్ణః:- ప్రపతితాని పర్ణాని యస్మాత్ సః. 'ప్రపతిత' అనునది ప్రకృష్టం పతితం అను నర్థమున 'ప్రాదయోగతాద్యర్థేప్రథమయా' అను వార్తికముచే నిష్పన్న మైన సమాసము. ఈ ప్రపతితశబ్దమునకు ఈ వార్తికముచే పర్ణశబ్దముతో సమాసము. పతితశబ్దము పత్‌ధాతువునుండి నిష్పన్న మైన క్తప్రత్యయాంతరూపము. 'ప్రపతిత' అనుదానిలోని 'పతిత' అను ఉత్తరపదమునకు లోపము వచ్చిన పక్షమున 'ప్రపర్ణః' అను రూపము, లోపాభావపక్షమున 'ప్రపతితపర్ణః' అనియు రూపద్వయ మగును.

వా. నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చోత్తరపదలోపః.

అవిద్యమానపుత్రః అపుత్రః.

నఞ్‌కంటె పర మగు 'అస్తి' (ఉన్నది) అనునర్థము గల సుబంతములకు మరియొక ప్రథమాంతశబ్దముతో సమాసము చెప్పదగినది. అస్త్యర్థక మగు ఉత్తరపదమునకు లోపము కూడ వికల్పముగ చెప్పదగినది.

అవిద్యమానపుత్రః:- న విద్యమానః అవిద్యమానః- నఞ్ తత్పురుష సమాసము. ఇచట నఞ్‌కంటె పర మగు విద్యమానార్థక మగు 'విద్యమాన' అనునది పుత్రశబ్దముతో సమసింపగా ఉత్తరపదలోపము (విద్యమాన అను ఉత్తరపదమునకు లోపము)వచ్చిన పక్షమున 'అపుత్రః' అనియు, లోపము రాని పక్షమున "అవిద్యమానపుత్రః" అనియు రూపద్వయము సిద్ధించును. అవిద్యమానః పుత్రః యస్య సః అని లౌకికవిగ్రహవాక్యము.

971. స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీప్రియాదిషు 6.3.34

ఉక్తపుంస్కాత్ అనూఙ్ – ఊఙోఽభావః అస్యా ఇతి బహువ్రీహిః, నిపాతనాత్ పఞ్చమ్యాః అలుక్, షష్ఠ్యాశ్చలుక్.

తుల్యే ప్రవృత్తినిమిత్తే యదుక్తపుంస్కం తస్మాత్ పరః ఊఙోఽభావః యత్ర తథాభూతస్య స్త్రీవాచకశబ్దస్య పుంవాచకస్యేవ రూపం స్యాత్; సమానాధికరణే స్త్రీలింగే ఉత్తరపదే న తు పూరణ్యాం ప్రియాదౌ చ పరతః. ప్రహస్వః. చిత్రగుః. రూపవద్భార్యః. అనూఙ్ కిమ్. వామోరూభార్యః.

'భాషితపుంస్కాదనూఙ్' అనునది షష్ఠ్యంతమగు ఒకే పదము. సూత్రమునందు నిపతించుటచే 'భాషితపుంస్కాత్' అనునపుడు పంచమి లుప్తము కాలేదు; 'అనూఙః' అనుటకు బదులు 'అనూఙ్' అని షష్ఠికి లోపము చేయబడినది. ప్రవృత్తినిమిత్తము (అర్థము) తుల్యముగా నుండగా పుంవాచకమగు పదమునకు భాషితపుంస్క మని పేరు. దీనియర్థముసోదాహరణముగ 249 వ సూత్రవ్యాఖ్యానమునందు వివరింపబడినది.

భాషితపుంస్కముకంటె పరమైన ఊఙ్ ప్రత్యయాభావము గల– అనగా భాషితపుంస్కమై యుండి ఊఙ్ అను స్త్రీప్రత్యయము చేర్చని స్త్రీవాచకశబ్దమునకు సమానాధికరణ మగు స్త్రీలింగశబ్దము ఉత్తరపదముగ నున్నపుడు, పుంవాచకమునకు వలె రూపము వచ్చును; స్త్రీలింగ మగు పూరణప్రత్యయాంతశబ్దము గాని, ప్రియాదులు గాని పరమైనపుడు మాత్రము రాదు.

చిత్రగుః– చిత్రాః గావః యస్య సః–చిత్రవర్ణమైన గోవులు కలవాడు. 'చిత్రా జస్ గో జస్'అను పదములకు "అనేకమన్యపదార్థే"అనుసూత్రముచే (968) సమాసముచేసి సుబ్లోపాదులుచేసినపిమ్మట 'చిత్రాగో' అను ప్రాతిపదికము సిద్ధించును. ఇచట 'చిత్రా'అనునది భాషితపుంస్కము. దీనికంటె ఊఙ్ ప్రత్యయము చేర్చబడలేదు.సమానాధికరస్త్రీలింగశబ్దమగు గోశబ్దము పరముగనున్నది. పూరణ్యంతపదము గాని ప్రియాదిపదములు గాని పరముగ లేవు, అందుచే ఈ సూత్రముచే పుంవద్భావము వచ్చి 'చిత్ర'అను అకారాంతరూపము వచ్చినది. 'చిత్రగో'అని యుండగా 'గో'శబ్దము "ఏకవిభక్తిచాపూర్వనిపాతే"అను సూత్ర

ముచే (954) ఉపసర్జనసంజ్ఞము గాన "గోస్త్రియోరుపసర్జనస్య"అను సూత్రముచే (955) ఓకారస్థానమున ఉకారరూప మగు హ్రస్వము వచ్చి ప్రథమైక వచనమునందు 'చిత్రగుః' అను రూపము సిద్ధించినది రూపవద్భార్యః- రూపవతీ భార్యా యస్య సః. ఇచటగూడ 'రూపవతీ'అను స్త్రీలింగశబ్దమునకు పుంవద్భావము, (రూపవద్),భార్యాశబ్దమునకు హ్రస్వము (సూ-955) చేయ 'రూపవద్భార్యః'అను రూపము సిద్ధించినది.

ఊఙ్ప్రత్యయము పరముగ నుండరాదు అని చెప్పుటచే 'వామోరూభార్యః'అను సమాసమునందలి 'వామోరూ'శబ్దమునకు పుంవద్భావము రాలేదు. 'వామోరూః' అనునపుడు "సంహితశఫలక్షణవామాదేశ్చ"అను సూత్రముచే (1273) ఊఙ్ అను స్త్రీప్రత్యయము వచ్చినది. వామే ఊరూ యస్యాఃసా వామోరూః-అందమైన ఊరువులు కలది. వామోరూఃభార్యా యస్య సః వామోరూభార్యః-అని విగ్రహములు.

972. అప్ పూరణీప్రమాణ్యోః. 5.4.116

పూరణార్థప్రత్యయాన్తం యత్ స్త్రీలిఙ్గం తదన్తాత్ ప్రమాణ్యన్తాచ్చ బహుమ్రీహేః అప్ స్యాత్. కల్యాణీ పఞ్చమీ యాసాం రాత్రీణాం తాః కల్యాణీపఞ్చమా రాత్రయః. స్త్రీ ప్రమాణీ యస్య సః స్త్రీప్రమాణః. అప్రియాదిషు కిమ్-కల్యాణీప్రియః ఇత్యాది.

'బహుమ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' నుండి 'బహుమ్రీహౌ' అనువర్తించును. 'పూరణీ'అనుదానికి పూరణప్రత్యయాంత మగు స్త్రీలింగశబ్దము అని యర్థము. పూరణప్రత్యయాంత మగు స్త్రీలింగశబ్దమును, ప్రమాణీశబ్దమును అంతమునందు గల బహుమ్రీహిసమాసమునకు సమాసాంత మగు 'అప్'ప్రత్యయము వచ్చును.

కల్యాణీ పంచమీ యాసాం తాః కల్యాణీపంచమాఃరాత్రయః. కల్యాణి యగు ఐదవది (ఐదవ రాత్రి) గల రాత్రులు. 'పఞ్చమీ' అనగా పఞ్చానాం పూరణీ అని యర్థము. పఞ్చన్‌శబ్దమునకు 'తస్య పూరణే డట్'అను సూత్రముచే (1174) పూరణార్థమున 'డట్'ప్రత్యయము. దానికి 'నాన్తాదసంఖ్యాదేర్మట్'అనుసూత్రముచే (1175) 'మట్' ఆగమము. టిత్త్వముచే "టిడ్ఢాణఞ్-" ఇత్యాదిసూత్రముచే (1250) ఙీప్. ఈవిధముగ 'పఞ్చమీ అనువది పూరణప్రత్యయాంత మగు స్త్రీలింగశబ్దము. 'కల్యాణీ'శబ్దమునకు ఈ'పఞ్చమీ'

శబ్దముతో బహుర్రీహిసమాసము చేసిన పిమ్మట 'కల్యాణీపంచమీ'అని యుండగా ఈ సూత్రముచే 'అప్'ప్రత్యయము. 'యస్యేతి చ'అను సూత్రముచే (236) ఈకారలోపము, 'కల్యాణీపఞ్చమ'అని యుండగా 'అజాద్యతష్టాప్'అను సూత్రముచే (1248) టాప్ వచ్చి 'కల్యాణీపఞ్చమా'అను ప్రాతిపదికము సిద్ధించినది. ఇచట 'పఞ్చమీ' అను పూరణప్రత్యయాంతపదము పర మగుటచే 'కల్యాణీ' శబ్దము భాషితపుంస్కమైనను పుంవద్భావము రాలేదు.

స్త్రీప్రమాణః- స్త్రీ ప్రమాణీ యస్య సః. స్త్రీ ప్రమాణముగా కలవాడు. ప్రమాణీ శబ్దమునకు ఈ సూత్రముచే అప్ ప్రత్యయము; ఈకారలోపము వచ్చుటచే 'స్త్రీప్రమాణః'అనురూపము సిద్ధించినది. పూర్వపద మగు స్త్రీశబ్దము భాషితపుంస్కము కాదు గాన పుంవద్భావప్రసక్తి లేదు.

ప్రియాదిశబ్దములు పర మగునపుడు మాత్రము పుంవద్భావము రాదు అని చెప్పుటచే "కల్యాణీ ప్రియా యస్య సః కల్యాణీప్రియః" (కల్యాణియగు ప్రియురాలుకలవాడు) అనునపుడు కల్యాణీశబ్దము భాషితపుంస్కమైనను ప్రియాశబ్దము పర మగుటచే దానికి పుంవద్భావము రాలేదు. ఉత్తరపదమునకు "గోస్త్రియోరుపసర్జనస్య"అను సూత్రముచే (955) హ్రస్వము వచ్చినది.

## 973. బహువ్రీహౌసక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్. 5.4.113

స్వాఙ్గవాచిసక్థ్యక్ష్యన్తాద్ బహువ్రీహేః షచ్ స్యాత్. దీర్ఘసక్థః. జలజాక్షీ. స్వాఙ్గాత్ కిమ్. దీర్ఘసక్థి శకటమ్. స్థూలాక్షా వేణుయష్టిః. 'అక్ష్ణోఽదర్శనాత్'ఇతి వక్ష్యమాణోఽచ్.

స్వాంగవాచకము లగు 'సక్థి' 'అక్షి'శబ్దములు అంతమునందు గల బహువ్రీహిసమాసమునకు 'షచ్' సమాసాంతప్రత్యయముగ వచ్చును.

దీర్ఘసక్థః- దీర్ఘే సక్థినీ యస్య సః-పొడవైన తొడలు కలవాడు. దీర్ఘశబ్దమునకును, స్వాంగవాచి యగు (శరీరావయవవాచి యగు) సక్థిశబ్దమునకును సమాసము (సూ-968) 'దీర్ఘసక్థి'అని యుండగా ఈసూత్రముచే 'షచ్'ప్రత్యయము. 'షః ప్రత్యయస్య'అనుసూత్రముచే (842) షకారము. హలన్త్యసూత్రముచే(1)చకారమును, ఇత్సంజ్ఞకములు, "యస్యేతిచ"అను సూత్రముచే(236) ఇకారలోపము-'దీర్ఘసక్థః'.జలజాక్షి-జలజే ఇవ అక్షిణీ యస్యాః సా-పద్మములవంటి కన్నులు గలది. బహువ్రీహిసమాసము చేసిన పిమ్మట "జలజాక్షి"అని

యుండగా ఈ సూత్రముచే షప్రత్యయము. 'జలజాక్ష'అను ప్రాతిపదికము సిద్ధించినది. 'ష'ప్రత్యయము షిత్తు గాన స్త్రీలింగమున 'షిద్గౌరాదిభ్యశ్చ'అనుసూత్రముచే (1254) 'జీష్'వచ్చి ప్రథమైకవచనమున 'జలజాక్షీ'అను రూపము సిద్ధించినది.

స్వాంగవాచకము లగు 'సక్థి' 'అక్షి'శబ్దములకు మాత్రమే షచ్ వచ్చునని చెప్పుటచే "దీర్ఘే సక్థినీ (నిలుపుకఱ్ఱలు) యస్య తత్ దీర్ఘసక్థి శకటమ్" అనునపుడు 'సక్థి' శబ్దము శరీరావయవవాచకము కాదు గాన షచ్ ప్రత్యయము రాలేదు. అట్లే "స్థూలాని అక్షీణి (కణుపులు) యస్యాః సా స్థూలాక్షా వేణుయష్టిః"అనునపుడు గూడ అక్షి శబ్దము స్వాంగవాచకము కాదు గాన ఈ సూత్రముచే 'షచ్'ప్రత్యయమురాలేదు. 'అక్ష్ణోఽదర్శనాత్'అను సూత్రముచే (994) అచ్ ప్రత్యయము వచ్చి ఇకారలోపటాబాదులు చేయగా 'స్థూలాక్ష'అను రూపము సిద్ధించినది. షచ్ప్రత్యయమువచ్చినచో అది షిత్తు గాన 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచే (1254) జీష్ వచ్చి 'స్థూలాక్షీ'అను రూప ముండెడిది.

## 974. ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః. 5.4.115

ఆభ్యాం మూర్ధ్నః షః స్యాత్ బహువ్రీహౌ. ద్విమూర్ధః. త్రిమూర్ధః.

ద్వి త్రిశబ్దములకంటె పరమైన మూర్ధన్ శబ్దమునకు బహువ్రీహిసమాసమున 'ష'ప్రత్యయము వచ్చును.

ద్విమూర్ధః- ద్వౌ మూర్ధానౌ యస్య సః. 'ద్విమూర్ధన్'అను ప్రాతిపదికమునకు షప్రత్యయము చేర్చిన పిదప 'నస్తద్ధితే'అను సూత్రముచే (922) 'అన్'రూప మగు టికి లోపము. త్రిమూర్ధః- త్రయః మూర్ధానః యస్య సః. షప్రత్యయటిలోపములు.

## 975. అన్తర్బహిర్భ్యాఞ్చ లోమ్నః. 5.4.117

ఆభ్యాం లోమ్నోఽప్ స్యాద్ బహువ్రీహౌ. అన్తర్లోమః. బహిర్లోమః.

'అప్పూరణీప్రమాణ్యోః' "బహువ్రీహౌసక్థ్యక్ష్ణోఃస్వాఙ్గాత్షచ్" నుండి 'అప్' 'బహువ్రీహౌ' అనువర్తించును. 'అన్తర్' 'బహిస్'శబ్దములకంటె పరమగు లోమన్శబ్దమునకు బహువ్రీహిసమాసమునందు 'అప్'ప్రత్యయము వచ్చును.

అన్తర్లోమః- అన్తః లోమాని యస్య సః. అన్తర్ లోమన్ శబ్దము లకు బహువ్రీహిసమాసము చేసిన పిమ్మట ఈ సూత్రముచే అప్ ప్రత్యయము. టిలోపము. ప్రథమైకవచనమున 'అంతర్లోమః' అనురూపము సిద్ధించినది. 'బహిర్లోమః' అనుదాని ప్రక్రియ కూడ ఈ విధముగనే యుండును.

976. పాదస్య లోపోఽహస్త్యాదిభ్యః. 5.4.138

హస్త్యాదివర్జితాదుపమానాత్పరస్య పాదశబ్దస్య లోపః స్యాద్ బహువ్రీహౌ. వ్యాఘ్రస్యేవ పాదావస్య వ్యాఘ్రపాత్. అహస్త్యాదిభ్యః కిమ్—హస్తిపాదః, కుసూలపాదః.

'ఉపమానాచ్చ' నుండి 'ఉపమానాత్' అనువర్తించును హస్త్యాదిభిన్నమగు ఉపమానముకంటె పర మగు పాదశబ్దమునకు, బహువ్రీహియందు, లోపము వచ్చును. ఈ లోపము సమాసాంతముగ విధింపబడినది గాన పాదశబ్దాంతమునకు వచ్చును.

వ్యాఘ్రపాత్:- వ్యాఘ్రపాదావివ పాదౌ యస్య సః. "సప్తమ్యుపమానపూర్వపదస్యోత్తరపదలోపశ్చ" (సప్తమ్యన్తోపమానరూపపూర్వపదమునకుపదాంతరములతో సమాసము వచ్చును; ఉత్తరపదలోపము కూడ వచ్చును) అను వార్తికముచే సమాసము. ప్రకృతసూత్రముచే అకారమునకు లోపము. ఉపమానము హస్త్యాదిభిన్నమై యుండవలె ననుటచే 'హస్తిపాదః' 'కుసూలపాదః' ఇత్యాదులందురాలేదు. 'హస్తినఃపాదావివపాదౌయస్యసః' "కుసూలస్య పాదావివ పాదౌ యస్య సః" అని విగ్రహములు.

977. సంఖ్యాసుపూర్వస్య 5.4.140

పాదస్య లోపః స్యాత్ సమాసాన్తో బహువ్రీహౌ. ద్విపాత్. సుపాత్.

సంఖ్యావాచకపదము కాని, సు కాని పూర్వమునందు గల పాదశబ్దమునకు, బహువ్రీహియందు సమాసాంతముగ లోపము వచ్చును.

'ద్వౌ పాదౌ యస్య సః ద్విపాత్; 'శోభనౌ పాదౌ యస్య సః సుపాత్' ఈ సూత్రముచే పాదశబ్దాంత్యాకారము లోపించుటచే ఈరూపములు సిద్ధించినవి.

978. ఉద్విభ్యాం కాకుదస్య 5.4.148

లోపః స్యాత్. ఉత్కాకుత్. వికాకుత్.

'ఉత్', 'వి' అను శబ్దములకంటె పర మైన కాకుదశబ్దమునకు, బహువ్రీహియందు, సమాసాంత మగు లోపము వచ్చును.

ఉత్కాకుత్:- ఉద్గతం కాకుదం యస్య సః ఉత్కాకుత్, ఉన్నతమైన చెలివి కలవాడు. 'ఉత్కాకుద' అని యుండగా ఈ సూత్రముచే అకారలోపము వచ్చి 'ఉత్కాకుత్' అను రూపము సిద్ధించినది. విగతం కాకుదం యస్య సః వికాకుత్- వికృతమైన చెలివి కలవాడు. ఇది గూడ అకారలోపము వచ్చుటచే సిద్ధించినది. ఈ రెండు స్థలములందును "ప్రాదిభ్యో ధాతుజస్య వాచ్యో వా చోత్తరపదలోపః" అను వార్తికముచే సమాసము వచ్చినది

979. పూర్ణాద్విభాషా 5.4.149

పూర్ణకాకుత్. పూర్ణకాకుదః.

పూర్ణశబ్దముకంటె పరమైన కాకుదశబ్దమునకు, బహువ్రీహియందు, వికల్పముగ, సమాసాంత మగు లోపము వచ్చును.

పూర్ణంకాకుదం యస్య సః అనునపుడు అకారలోపము వచ్చిన పక్షమున 'పూర్ణకాకుత్' అను రూపము, రాని పక్షమున "పూర్ణకాకుదః" అను రూపమును సిద్ధించును.

980. సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః 5.4.150

సుదుర్భ్యాం హృదయస్య 'హృద్'భావో నిపాత్యతే. సుహృద్ మిత్రమ్. దుర్హృద్ అమిత్రః.

బహువ్రీహిసమాసమునందు, సు, దుర్, అనువాటికంటె పర మగు 'హృదయ- శబ్దమునకు 'హృద్' అను నాదేశము నిపతింపబడుచున్నది. శోభనం హృదయం యస్య సః సుహృత్. మంచి హృదయము కలవాడు. మిత్రుడు. దుష్టం హృదయం యస్య సః దుర్హృత్. చెడ్డహృదయముకలవాడు; శత్రువు.

981. ఉరః ప్రభృతిభ్యః కప్ 5.4.151

బహువ్రీహియందు, ఉరస్ మొదలగువాటికంటె సమాసాంత మగు 'కప్' ప్రత్యయము వచ్చును. పకారము ఇత్సంజ్ఞకము.

982. కస్కాదిషు చ 8.3.48 .

ఏష్విణ ఉత్తరస్య విసర్గస్య షః; అన్యస్య తు సః. ఇతి సః- వ్యూఢోరస్కః. ప్రియసర్పిష్కః.

'ఇణః షః' అను సూత్రము, 'విసర్జనీయస్య సః' "సోపదాదౌ" నుండి 'విసర్జనీయస్య', 'సః' అనువర్తించును. కస్కాదిగణమునందు ఇణ్ కంటె పర మగు సకారమునకు షకారము ఆదేశముగ వచ్చును. ఇట్ కంటె పరము గాని సకారమునకు సకారము వచ్చును.

వ్యూఢోరస్కః:- వ్యూఢం ఉరః యస్య సః- 'వ్యూఢోరస్' అను బహువ్రీహిసమాస సిద్ధ మగు ప్రాతిపదికమునకు పూర్వసూత్రముచే కప్ ప్రత్యయము. 'వ్యూఢోరస్క్' అని యుండగా సకారమునకు రుత్వవిసర్గములు. విసర్గమునకు 'కుప్వోః ᳲక ᳲపౌ చ' అను సూత్రముచే (98) ᳲక అనునది రావలసి యుండఈసూత్రముచే సకారము- 'వ్యూఢోరస్కః' అను రూపము సిద్ధించినది.

ప్రియసర్పిష్కః:- ప్రియం సర్పిః యస్య సః. 'ప్రియసర్పిస్' అని యుండగా కప్ప్రత్యయము (సూ-981) సకారమునకు రుత్వవిసర్గలు చేసిన పిమ్మట, ఈ విసర్గము ఇణ్ కంటె పరముగ నుండుటచే ఈసూత్రముచే షత్వము వచ్చి 'ప్రియసర్పిష్క' అను పదము సిద్ధించినది.

983. నిష్ఠా 2.2.36

నిష్ఠాన్తం బహువ్రీహౌ పూర్వం స్యాత్. యుక్తయోగః.

'ఉపసర్జనం పూర్వమ్' 'సప్తమీవిశేషణే బహువ్రీహౌ'నుండి 'పూర్వమ్' 'బహువ్రీహౌ' అనువర్తించును. బహువ్రీహిసమాసమునందు నిష్ఠాంత మగు (క్త క్తవవతుప్రత్యయాంత మగు) పదము పూర్వపదముగ ప్రయోగింపదగినది.

యుక్తయోగః:- యుక్తః యోగః యస్య సః. ఇచట క్తప్రత్యయాంత మగు 'యుక్త' అనుపదమునకు పూర్వనిపాతము.

984. శేషాద్విభాషా 5.4.154

అనుక్తసమాసాన్తాద్ బహువ్రీహేః కప్ వా. మహాయశస్కః. మహాయశాః.

ఇతి బహువ్రీహిః.

ఏబహువ్రీహి సమాసములకు సమాసాంతప్రత్యయములు విధించబడినవో వాటికంటె భిన్నమైనది శేషము. అట్టి బహువ్రీహికంటె కప్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

మహాయశస్కః:- మహత్ యశః యస్య సః. 'మహత్' 'యశస్' అను ప్రథమాంతశబ్దములకు బహువ్రీహిసమాసము చేసిన పిదప "ఆన్మహతః

సమానాధికరణజాతీయయోః" అను సూత్రముచే (962) మహచ్ఛబ్దమునకు ఆకారము అంతాదేశముగ వచ్చును. పిమ్మట ఈ సూత్రముచే 'కప్'ప్రత్యయము చేసిన పక్షమున 'మహాయశస్కః' అనియు, కప్ప్రత్యయము రాని పక్షమున 'మహాయశాః' అనియు రెండు రూపము లగును.

బహువ్రీహిసమాసప్రకరణము సమాప్తము.

# అథ ద్వన్ద్వః

## 985. చార్థే ద్వన్ద్వః 2.2.29

అనేకం సుబన్తం చార్థే వర్తమానం వా సమస్యతే; స ద్వన్ద్వః. సముచ్చయాన్వాచయేతరేతరయోగసమాహారాః చార్థాః. తత్ర "ఈశ్వరం గురుఞ్చ భజస్వ" ఇతి పరస్పరనిరపేక్షస్యానేకస్యైకస్మిన్ అన్వయః-సముచ్చయః. 'భిక్షాం అట గాం చానయ' ఇతి అన్యతరస్యానుషఙ్గికత్వేన అన్వయః అన్వాచయః. అనయోరసామర్థ్యాత్ సమాసో న. 'ధవఖదిరౌ ఛిన్ధి' ఇతి మిలితానాం అన్వయః ఇతరేతరయోగః. సంజ్ఞాపరిభాషమ్ (ఇతి) సమూహః సమాహారః,

'సుబామన్త్రితే పరాఙ్గవత్స్వరే' 'అనేకమన్యపదార్థే'నుండి 'సుప్' 'అనేకమ్' అనువర్తించును. 'సమాసః' 'విభాషా' అధికృతములు. చార్థమునందున్న అనేకసుబంతములు వికల్పముగ సమసించును. అది ద్వంద్వసమాసము.

'చ'అను అవ్యయమునకు సముచ్చయము, అన్వాచయము, ఇతరేతరయోగము, సమాహారము అను నాలు గర్థములు కలవు. పరస్పరనిరపేక్షము లగు అనేకపదార్థములకు ఒక క్రియాపదమునందు అన్వయము సముచ్చయము. ఆవృత్తమగు ఒక క్రియాపదమునందు అసమస్తమగు ఒకపదము మొదట అన్వయించును; పిమ్మట మరియొక పదము అన్వయించును. అట్టి స్థలములందు చకారమునకు సముచ్చయము అర్థము. "ఈశ్వరం గురుం చ భజస్వ" అనునపుడు చకారము 'గురుం'అను పదమునకు పిమ్మట ఉండుటచే గురుపదము ఈశ్వరపదసాపేక్ష మైనది. అనగా 'గురువును కూడా' అని అనగానే ఇంకను

ఎవరిని అని ఆకాంక్ష కలుగును గాన మొదట చెప్పిన 'ఈశ్వరుని' అనునది అన్వయించును. కావున గురుపదము ఈశ్వరపదసాపేక్షము. కాని 'ఈశ్వరం' అనునది గురుపదసాపేక్షము కాదు. అది స్వతంత్రముగనే 'భజస్వ' అను క్రియా పదముతో అన్వయించును. కావుననే 'ఈశ్వరం' అను పదముతో 'చ'కారము చేర్చబడలేదు. ఈ విధముగ మొత్తముపై 'భజస్వ' అనుపదము ఆవృత్తమై "ఈశ్వరం భజస్వ, గురుం భజస్వ" అని వాక్యద్వయము చెప్పినట్లగును.

రెండింటిలో ఒకటి అనుషంగిక మైనచో అన్వాచయము. అనగా రెండు పదములలో ఒకపదము క్రియాపదముతో ఉద్దేశ్యముగ (ప్రధానప్రవృత్తివిషయముగ) అన్వయించును; రెండవది మరి యొక క్రియాపదమున అనుషంగికముగ (వీలుగనున్నచోచేయవలసినదిగ) అన్వయించును. ఇట్టి అనుషంగికత్వమును చకారముబోధించును. దీనికి అన్వాచయమని పేరు. 'భిక్షామట గాఞ్చానయ'అనునపుడు "భైక్షమును సంపాదింపుము, మార్గమధ్యమున గోవు లభించినచో దానిని కూడ తీసికొని రమ్ము; భిక్షాటనమే ప్రధానము కాని గవానయనము అంత ప్రధానవిషయము కాదు"అని భావము. ఈ అనుషంగికత్వమును చకారము బోధించుచున్నది. ఈ సముచ్చయాన్వాచయార్థములందు పదములకు పరస్పరాపేక్షారూప మగు సామర్థ్యము లేదు గాన సమాసము వచ్చుటకు అవకాశము లేదు.

'ధవఖదిరౌ ఛిన్ధి' (ధవవృక్షఖదిరవృక్షములను రెండింటిని ఛేదించుము) ఇత్యాదులందు ధవము, ఖదిరము అను ఈరెండును కలసి ఛేదనక్రియలో అన్వయించుచున్నవి గాన దీనికి ఇతరేతరయోగ మని పేరు. ఈ ఇతరేతరయోగరూపార్థము 'ధవం చ ఖదిరం చ'అనునపుడు చకారముచే బోధింపబడుచున్నది. 'సంజ్ఞా చ పరిభాషా చ తయోః సమాహారః సంజ్ఞాపరిభాషమ్'ఇత్యాదిస్థలములందు చకారము సమాహారమును బోధించుచున్నది. ఈ రెండర్థములందును సామర్థ్య మున్నది గాన సమాసము వచ్చినది. ఈ విధముగ చకారార్థము లగు నాలిగింటిలో చివరి రెండర్థములలో ద్వంద్వసమాసము వచ్చునని పర్యవసిత సూత్రార్థము.

ఈ విధముగ ఇతరేతరయోగసమాహారార్థములందు సమాసము వచ్చును గాన ఆ యర్థములు సమాసవృత్తిచే బోధిపబడును "ధవశ్చ ఖదిరశ్చ ధవఖదిరౌ-సంజ్ఞా చ పరిభాషా చ తయోః సమాహారః సంజ్ఞాపరిభాషమ్"మొదలగు

లౌకికవిగ్రహవాక్యములందు చకారము ప్రయుక్తమైనను సమాసమునందు ప్రయోగింపబడదు.

'చార్థేద్వన్ద్వః' అనుసూత్రమునందు 'అనేకమన్యపదార్థే'నుండి 'అనేకమ్' అను ప్రథమాంతపదమునుఅనువృత్తముచేసి 'అనేకం సుబన్తం సమస్యతే' అను నర్థము చెప్పబడినది. 'అనేకం' అనునది ప్రథమవిభక్తిలో నున్నది గాన ద్వంద్వమున సమసించు అన్ని పదములకును ఉపసర్జనసంజ్ఞ యుండును గాన ఏపదమున కైనను పూర్వప్రయోగము చేయవచ్చును. కాని కొన్ని నియమములు రాబోవు సూత్రములలో చెప్పబడనున్నవి. తద్భిన్నస్థలములలో నియమము లేదని గ్రహింపవచ్చును.

986. రాజదన్తాదిషు-పరమ్. 2.2.31

ఏషు పూర్వప్రయోగార్హం పరం స్యాత్. దన్తానాం రాజా రాజదన్తః,

'ఉపసర్జనంపూర్వం' అనుసూత్రము అనువర్తించును. 'రాజదన్త'మొదలగు శబ్దములందు పూర్వప్రయోగార్హమగు ఉపసర్జనసంజ్ఞమైన పదము ఉత్తరపదముగ ప్రయోగింపబడును.

రాజదన్తః- దన్తానాం రాజా రాజదన్తః, ఇచట షష్ఠ్యంతమగు దంత శబ్దమునకు 'షష్ఠీ' అనుసూత్రముచే (934) రాజన్ శబ్దముతో సమాసము వచ్చినది. షష్ఠ్యంతము ప్రథమానిర్దిష్టమగుటచే ఉపసర్జనసంజ్ఞకము. దానికి పూర్వనిపాతము చేయగా 'దన్తరాజః' అని కావలసియుండగా, ఈ సూత్రముచే పూర్వప్రయోగార్హమగు దంత శబ్దమునకు పరప్రయోగము వచ్చి 'రాజదన్తః' అను పదము సిద్ధించినది.

వా ధర్మాదిష్వనియమః. అర్థధర్మౌ; ధర్మార్థౌ ఇత్యాది.

ధర్మార్థాదిశబ్దములకు ద్వంద్వసమాసము చేసినపుడు వాటి పూర్వప్రయోగ విషయమున నియమము లేదు.

అర్థధర్మౌ; ధర్మార్థౌ- అర్థశ్చ ధర్మశ్చ అని లౌకికవిగ్రహవాక్యము. 'అర్థ సు ధర్మ సు' అని యుండ ఇతరేతరయోగార్థమున 'చార్థేద్వంద్వః' అను సూత్రముచే (985) సమాసము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులు. ఈ సూత్రముచే ఏపదమునకైనను పూర్వప్రయోగము చేయవచ్చును గాన 'అర్థధర్మౌ' లేక ధర్మార్థౌ' అను ప్రథమాద్వివచనాంతరూపములు సిద్ధించును.

987. ద్వన్ద్వే ఘి. 2.2.32

ద్వన్ద్వే ఘిసంజ్ఞం పూర్వం స్యాత్. హరిశ్చ హరశ్చ హరిహరౌ.

'ఉపసర్జనం పూర్వమ్'నుండి 'పూర్వమ్'అనువర్తించును. ద్వంద్వసమాసమునందు ఘిసంజ్ఞక మగు దానిని పూర్వము ప్రయోగింపవలెను.

హరిహరౌ– హరిహరశబ్దములకు ద్వంద్వసమాసము. హరిశబ్దము 'శేషోఘ్యసఖి'అనుసూత్రముచే (170) ఘిసంజ్ఞకము గాన ఈసూత్రముచే దానికి పూర్వనిపాతము.

988. అజాద్యదన్తమ్. 2.2.33

ఇదంద్వన్ద్వే పూర్వం స్యాత్. ఈశకృష్ణౌ.

ద్వంద్వసమాసమునందు, అజాదియు, అదంతమును అగు పదము పూర్వము ప్రయోగింపబడును.

ఈశకృష్ణౌ– ఈశకృష్ణశబ్దములకు ద్వంద్వసమాసము. ఈ రెండు శబ్దములును అదంతములే యైనను ఈశ శబ్దమునకు అజాదిత్వము గూడ ఉన్నది గాన దానికి పూర్వనిపాతము.

989 అల్పాచ్తరమ్ 2.2.34

శివకేశవౌ.

ద్వంద్వసమాసమునందు, తక్కువ అచ్చులు గల పదము పూర్వము ప్రయోగింపబడును.

శివకేశవౌ:– ఇచట శివకేశవశబ్దములు రెండును అదంతములే. కాని 'కేశవ'పదములో మూడు అచ్చు లున్నవి శివశబ్దమునందు రెండున్నవి. అందుచే అల్పాచ్క మగు శివశబ్దమునకు పూర్వనిపాతము.

990. పితా మాత్రా 1.2.70

మాత్రా సహోక్తౌ పితా వా శిష్యతే. మాతా చ పితా చ పితరౌ; మాతాపితరౌ వా.

'సరూపాణామేకశేష ఏకవిభక్తౌ' నుండి 'శేషః', "నపుంసకమనపుంసకేనైకవచ్చాస్యాన్యతరస్యామ్" నుండి 'అన్యతరస్యామ్' అనువర్తించును

మాతృశబ్దముతో కలిసి చెప్పినపుడు వికల్పముగ పితృశబ్దము మాత్రమే శేషించును.

పితరౌ:- మాతా చ పితాచ పితరౌ. ఇదిఏకశేషవృత్తి. ఇచటపితృశబ్దము మాతృశబ్దముతో చెప్పబడినది. ఈ రెండు పదములకును ద్వంద్వసమాసము. ఈ సూత్రముచే మాతృశబ్దము లోపించి పితృశబ్దము శేషించినది. "యః శిష్యతే స లుప్యమానార్థాభిధాయీ" (శేషించినది లుప్తమైనదాని అర్థమును కూడ బోధించును-) అను నియమముననుసరించి శేషించిన పితృశబ్దము మాతృశబ్దార్థమును కూడ బోధించును. అందుచే ఇది ద్వివచనమునందు ప్రయుక్తమైనది. ఏకశేషము రాని పక్షమున 'మాతా చ పితా చ' అనునపుడు ద్వంద్వము; 'పితుర్దశగుణం మాతా గౌరవేణాతిరిచ్యతే' అను స్మృతిచే తండ్రికంటె గూడ తల్లి అధికపూజ్యురాలు గాన 'అభ్యర్హితం చ' (పూజనీయవ్యక్తివాచకపదమును పూర్వము ప్రయోగింపవలెను) అను వార్తికముచే మాతృశబ్దమునకు పూర్వప్రయోగము. 'ఆనఙ్ ఋతోద్వన్ద్వే' అను సూత్రముచే పూర్వపద మగు మాతృశబ్దమునందలి ఋకారమునకు 'ఆనఙ్' ఆదేశము చేయగా 'మాతాపితరౌ' అనురూపము సిద్ధించినది.

991. ద్వన్ద్వశ్చ ప్రాణితూర్యసేనాఙ్గానామ్ 2.4.2

ఏషాం ద్వన్ద్వః ఏకవత్. పాణిపాదమ్. మార్దఙ్గికవైణవికమ్. రథికాశ్వారోహమ్.

'ద్విగురేకవచనమ్'నుండి 'ఏకవచనం' అనువర్తించును. 'సమాహారగ్రహణం కర్తవ్యమ్' అను వార్తికము ఈసూత్రముతో కూడ సంబంధించును. ప్రాణితూర్యసేనా' అనునది ద్వంద్వసమాసము గాన దాని యంతము నందున్న 'అంగ'శబ్దము ప్రాణ్యాదిపదములతో వేరువేరుగ సంబంధించును. ప్రాణ్యంగ తూర్యాంగ సేనాంగవాచకపదముల సమాహారద్వంద్వము ఏకవచనమునందుండును.

పాణిపాదమ్.- పాణీ చ పాదౌ చ తేషాం సమాహారః. పాణిపాదశబ్దములకు సమాహారార్థమునందు ద్వంద్వసమాసము. ఈ సూత్రముచే ఏకవద్భావము. 'స నపుంసకమ్' అను సూత్రముచే (946) నపుంసకలింగము. మార్దఙ్గికవైణవికమ్:- మార్దఙ్గికాశ్చ వైణవికాశ్చ తేషాం సమాహారః. ఇది తూర్యాంగవాచకముల కుదాహరణము. మృదంగవాదకులయొక్కయు వీణావాదకుల యొక్కయు సముదాయము. ఈ సూత్రముచే ఏకవద్భావము. రథికాశ్వారో

**హమ్:**-రథికాశ్చాశ్వారోహాశ్చ తేషాం సమాహారః. సేనాంగవాచకపదముల సమాసమున కుదాహరణము. పై ఉదాహరణమునందు వలె ఏకవద్భావాదులు వచ్చినవి.

992. ద్వన్ద్వాచ్చుదషహాన్తాత్ సమాహారే 5.4.106

చవర్గాన్తాత్ దషహాన్తాచ్చ ద్వన్ద్వాత్ టచ్ స్యాత్ సమాహారే. వాక్ చ త్వక్ చ వాక్త్వచమ్. త్వక్స్రజమ్. శమీదృషదమ్. వాక్త్విషమ్. ఛత్రోపానహమ్. సమాహారే కిమ్- ప్రావృట్శరదౌ.

ఇతి ద్వన్ద్వః,

'రాజాహస్సఖిభ్యష్టచ్' నుండి 'టచ్' అనువర్తించును. ఇది సమాసాన్త తద్ధితాధికారములలోనిది. చవర్గాంతమును, దకార, షకార, హకారాంతమును అగు ద్వంద్వసమాసముకంటె, సమాహారార్థమునందు, 'టచ్'అను సమాసాంత మగు తద్ధితప్రత్యయము వచ్చును.

వాక్త్వచమ్:- వాక్ చ త్వక్ చ తయోః సమాహారః. ఇది చకారాంత మగు సమాహారద్వంద్వ మగుటచే ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము. 'వాచ్' అనుదాని చకారమునకు 'చోః కుః' అను సూత్రముచే (307)కుత్వము. 'వాక్త్వచ' అను అకారాంతశబ్దము సిద్ధించినది. నపుంసకలింగము-సూ-(946).

త్వక్స్రజమ్:- త్వక్ చ స్రక్ చ తయోః సమాహారః. ఇది జకారాంత సమాహారద్వంద్వ మగుటచే టచ్ ప్రత్యయము వచ్చినది. శమీదృషదమ్:- శమీ చ దృషద్ చ తయోః సమాహారః. దకారాంతసమాహారద్వంద్వ మగుటచే టచ్ప్రత్యయము. వాక్త్విషమ్:- వాక్చ త్విట్ చ తయోః సమాహారః వాక్త్విషమ్. షకారాంతసమాహారద్వంద్వ మగుటచే టచ్ ప్రత్యయము. ఛత్రోపానహమ్:- ఛత్రం చ ఉపానత్ చ తయోః సమాహారః ఛత్రోపానహమ్. హకారాంతసమాహారద్వంద్వ మగుటచే టచ్ ప్రత్యయము. పై నాలుగు ఉదాహరణములందును "జాతిరప్రాణినామ్" (ప్రాణిభిన్నజాతివాచకములగుపదముల ద్వంద్వమునకు ఏకవద్భావము వచ్చును) అను సూత్రముచే ఏకవద్భావము వచ్చినది. 'సమాహారే' అనుటచే 'ప్రావృట్ శరదౌ' అనునది ('ప్రావృట్చశరచ్చప్రావృట్ శరదౌ') అని ఇతరేతరయోగద్వంద్వము గాన ఇది దకారాంతమైనను ఈ సూత్రముచే టచ్ ప్రత్యయము రాలేదు.

ద్వంద్వసమాస ప్రకరణము సమాప్తము.

# అథ సమాసాన్తాః

993. ఋక్పూరబ్ధూఃపథామానక్షే 5.4.74

అ అనక్ష ఇతి చ్ఛేదః. ఋగాద్యన్తస్యసమాసస్య అప్రత్యయోఽన్తావయవః, అక్షే యా ధూః తదన్తస్య తు న. అర్ధర్చః. విష్ణుపురమ్. విమలాపం సరః, రాజధురా. అక్షే తు-అక్షధూః, దృఢధూః అక్షః. సఖిపథః. రమ్యపథో దేశః.

'అ, అనక్షే' అని పదచ్ఛేదము. 'సమాసాన్తాః' అధికారము. ఋక్, పుర్, అప్, ధుర్, పథిన్ అను శబ్దములు అంతమునందు గల సమాసమునకు 'అ' అను ప్రత్యయము అంతావయవముగ వచ్చును. 'అక్షసంబంధి యగుసీల' అను నర్థముగల ధుర్ శబ్దము అంతమునందుగల సమాసమునకు మాత్రము రాదు. అక్ష మనగా ఇరుసు. 'అనక్షే' అని నిషేధము ధుర్ శబ్దమునకు మాత్రమే వర్తించును.

అర్ధర్చః:- ఋచః అర్ధమ్- 'అర్ధం నపుంసకమ్' అను సూత్రముచే (936)సమాసము. 'అర్ధర్చ్' అని యుండగా ఈ సూత్రముచే అప్రత్యయము. 'అర్ధర్చాదయః పుంసి చ' అను సూత్రముచే(966)పుంలింగమునందు కూడ ప్రయోగింపవచ్చును. ఋక్కుయొక్క సగముభాగ మని యర్థము. విష్ణుపురమ్:- విష్ణోః పూః. పుర్ శబ్దాంతషష్ఠీతత్పురుషమునకు ఈ సూత్రముచే అకారము. విమలాపంసరః:- విమలాః ఆపః యస్య తత్. బహువ్రీహిసమాసము. అప్ శబ్దాంతము గాన ఈ సూత్రముచే అప్రత్యయము. రాజధురా:- రాజ్ఞః ధూః- రాజుయొక్క భారము. షష్ఠీతత్పురుషసమాసాంతమునందున్న 'ధుర్' శబ్దమునకు ఈ సూత్రముచే 'అ'ప్రత్యయము, స్త్రీత్వవివక్షయందు 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) 'టాప్' వచ్చినది. ధూర్శబ్దమున కిచట భారార్థమున లాక్షణికప్రయోగము. ఇరుసుకు సంబంధించిన మేకు అను నర్థము గల ధుర్ శబ్దమునకు 'అనక్షే' యని నిషేధించుటచే అచ్ ప్రత్యయము రాదు. "అక్షస్య ధూః అక్షధూః" అను షష్ఠీతత్పురుషసమాసమునందును, "దృఢా ధూః యస్య సః దృఢధూః" అను బహువ్రీహిసమాసమునందును, అంతమునందున్న ధూర్శబ్దమునకు అప్రత్యయము రాలేదు.

సఖిపథః:- సఖ్యుః పన్థాః. షష్ఠీసమాసాంతమునం దున్న పథిన్ శబ్ద మునకు ఈ సూత్రముచే అప్రత్యయము. "భస్యటేర్లోపః" అను సూత్రముచే (297) 'సఖిపథిన్'అనుపదమునందలి టి యగు 'ఇన్'కు లోపము. రమ్యపథః:- రమ్యాః పన్థానః యస్య సః- బహువ్రీహిసమాసాంతమునం దున్న పథిన్శబ్దము నకు అప్రత్యయము వచ్చి వెనుకటి వలెనే- 'రమ్యపథః' అను రూపము సిద్ధించినది.

994. అక్ష్ణోఽదర్శనాత్ 5.4.76

అచక్షుఃపర్యాయాత్ అక్ష్ణోఽచ్ స్యాత్ సమాసాన్తః. గవాంఅక్షీవ గవాక్షః.

'అచ్ప్రత్యన్వవపూర్వాత్సామలోమ్నః' నుండి 'అచ్' అనువర్తించును. నేత్రార్థకము కాని అక్షిశబ్దమునకు సమాసాంత మగు అచ్ప్రత్యయము వచ్చును.

గవాక్షః:- గవాం అక్షీవ గవాక్షః- షష్ఠీతత్పురుషము. గోవులయొక్క నేత్రముల వలె నుండు (నేత్రములఆకారమునందుండు)నది. జాలకమ్. ఇచట అక్షిశబ్దము లక్షణచే నేత్రసదృశమును చెప్పుచున్నది. ముఖ్యార్థ మగు నేత్రమును బోధించుటలేదు. కావున ఈ సూత్రముచే అచ్ప్రత్యయము. 'యస్యేతిచ' అను సూత్రముచే (236) ఇకారము లోపింపగా ప్రథమైకవచనమున గవాక్షః అను రూపము సిద్ధించినది.

995. ఉపసర్గాదధ్వనః 5.4.85

ప్రగతోఽధ్వానం ప్రాధ్వఃరథః.

ఉపసర్గముకంటె పరమైన అధ్వన్శబ్దమునకు సమాసాంత మగు అచ్ ప్రత్యయము వచ్చును.

ప్రాధ్వః:- ప్రగతః అధ్వానం. "అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా" అను వార్తికముచే బోధింపబడిన అర్థమునందు 'కుగతిప్రాదయః'అను సూత్రముచే (952) సమాసము. ఈ సూత్రముచే అచ్ ప్రత్యయము. 'నస్తద్ధితే' అను సూత్రముచే (922) టిలోపము. 'ప్రాధ్వ' అను అకారాంతశబ్దము సిద్ధించినది.

996. న పూజనాత్ 5.4 69

పూజనార్థాత్ పరేభ్యః సమాసాన్తా న స్యుః.

పూజార్థకశబ్దములకంటె పర మగు శబ్దములకంటె సమాసాంతప్రత్యయములు రావు.

వా. స్వతిభ్యామేవ.

సురాజా. అతిరాజా.

ఇతి సమాసాన్తాః. ఇతి సమాసప్రకరణమ్ః

పై నిషేధము 'సు' 'అతి' అను పూజార్థక శబ్దములకంటె పర మగు శబ్దములవిషయమునందు మాత్రమే వర్తించును.

సురాజా:_ శోభనశ్చాసౌ రాజా చ సురాజా. "కుగతిప్రాదయః"అను సూత్రముచే (952) సమాసము. "రాజాహస్సఖిభ్యష్టచ్" అను సూత్రముచే (961) టచ్ ప్రత్యయము రావలసి యుండగా 'సు'అనునది ప్రశంసావాచకము గాన పై సూత్రముచే నిషేధము. 'సురాజా' అనునకారాంతశబ్దమే సిద్ధించును. అతిరాజా:- అతిక్రాంతః రాజానమ్. "అత్యాదయః క్రాంతాద్యర్థే ద్వితీయయా" అను వార్తికముతో సహకృత మగు 'కుగతిప్రాదయః'అను సూత్రముచే(952) సమాసము. 'అతి' అనునది పూజార్థకము గాన దానికంటె పర మగు 'రాజన్' శబ్దమునకు 'రాజాహస్సఖిభ్యష్టచ్' అను సూత్రముచే (961) రావలసి యున్న టచ్ ప్రత్యయము పై సూత్రముచే నిషేధింపబడినది.

సమాసప్రకరణము సమాప్తము.

# అథ తద్ధితప్రకరణమ్

## సాధారణప్రత్యయాః.

### 997. సమర్థానాం ప్రథమాద్వా 4.1.82

ఇదం పదత్రయం అధిక్రియతే; ప్రాగ్దిశః.

'ప్రాగ్దిశో విభక్తిః' అను సూత్రమువరకును "సమర్థానాం, ప్రథమాత్, వా" అను మూడుపదములును అనువర్తించును. 'సమర్థానాం' అనునపుడు నిర్ధారణార్థమున షష్ఠి. 'సమర్థము లగు పదములలో' అని యర్థము. ఇచట సామర్థ్య మనగా అర్థప్రతిపాదనశక్తి యని యర్థము. సంధికార్యాదులు చేసి పరినిష్ఠితము లైన పదములు మాత్రమే అర్థప్రతిపాదనసమర్థములుగ నుండును

గాన 'పరినిష్ఠితము లగు పదములు' అని యర్థము. ఇది అధికారసూత్రము గాన 'తస్యాపత్యమ్' ఇత్యాదు లగు ఉత్తరసూత్రములలోనికి అనువర్తించును. ఈ సూత్రములలో నున్న పరినిష్ఠితరూపము లగు శబ్దములలో మొదటిదానికంటె (అనగా ప్రథమోచ్చరితపదబోధ్యమగుదానికంటె) ఆయాప్రత్యయములు వికల్పముగ వచ్చును అని యర్థమును ప్రతిపాదించుచుండును. ఉదాహరణమునకు:- 'తస్యాపత్యమ్' అను సూత్రమునందలి పరినిష్ఠితపదములలో మొదటిది 'తస్య' అనునది. తద్వాచ్యము లగు 'దశరథస్య' ఇత్యాదిపదములకు 'ఇఞ్' మొదలగు ప్రత్యయములు వికల్పముగా చేర్చగా 'దాశరథిః' ఇత్యాదిరూపములు సిద్ధించును.

998. అశ్వపత్యాదిభ్యశ్చ 4.1.84

ఏభ్యోఽణ్ స్యాత్ ప్రాగ్దీవ్యతీయేష్వర్థేషు. అశ్వపతే రపత్యాది ఆశ్వపతమ్. గాణపతమ్.

'ప్రాగ్దీవ్యతోఽణ్' అను అధికారసూత్రము అనువర్తించును. తేన దీవ్యతి ఖనతి జయతి జితమ్' అను సూత్రము వరకును 'అణ్' అను పదమనువర్తించు నని దాని యర్థము. 'దీవ్యతి' ఇత్యాద్యర్థములకంటె పూర్వము చెప్పబడిన అర్థములకు ప్రాగ్దీవ్యతీయార్థము లని పేరు. ప్రాగ్దీవ్యతీయార్థములందు అశ్వపత్యాదులకంటె అణ్ ప్రత్యయము వచ్చును. 'అపత్యము', 'సమూహము' మొదలగు అర్థములు ప్రాగ్దీవ్యతీయార్థములు.

ఆశ్వపతమ్:- 'అశ్వపతేః అపత్యమ్' అనునది లౌకికవిగ్రహవాక్యము, 'అశ్వపతి జస్' అను షష్ఠ్యంతపదముకంటె ఈ సూత్రముచే 'అణ్' ప్రత్యయము చేర్చగా "అశ్వపతి జస్ అణ్" అని యుండగా ఇపుడిది తద్ధితప్రత్యయాంతము గాన 'కృత్తద్ధితసమాసాశ్చ' అను సూత్రముచే (117) ప్రాతిపదిక సంజ్ఞ. 'సుపోధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే (724) 'జస్'కు లోపము -'అశ్వపతి అ' అని యుండగా 'తద్ధితేష్వచామాదేః' అను సూత్రముచే (941) ఆద్యచ్చుకు వృద్ధి 'యస్యేతిచ' అను సూత్రముచే (236) ఇకారమునకులోపము. 'ఆశ్వపత' అను ప్రాతిపదికము సిద్ధించినది. నపుంసకలింగప్రథమైకవచనమున 'ఆశ్వపతమ్' అను రూపము సిద్ధించినది. గాణపతమ్:- గణపతేః అపత్యం ఇత్యాద్యర్థములందు ప్రకృతసూత్రముచే అణ్ వచ్చినది. ప్రక్రియ పైవలెనే యుండును,

999. దిత్యదిత్యాదిత్యపత్యుత్తరపదాణ్ణ్యః 4.1.85

దిత్యాదిభ్యః పత్యుత్తరపదాత్ చ ప్రాగ్దీవ్యతీయేష్వర్థేషు ణ్యః స్యాత్. అణోఽపవాదః. దితేరపత్యం దైత్యః. అదితేరాదిత్యస్య వా (అపత్యమ్)-

దితి, అదితి, ఆదిత్యశబ్దములకంటెను, పతిశబ్దము ఉత్తరపదముగా గల శబ్దముకంటెను, ప్రాగ్దీవ్యతీయార్థమునందు ణ్యప్రత్యయము వచ్చును. ఇది పూర్వసూత్రవిహిత మగు అణ్ ప్రత్యయమునకు అపవాదము.

దైత్యః:- షష్ఠ్యంతమును సమర్థమును (కృతసంధ్యాదికార్యమై పరినిష్ఠితమును) అగు దితిశబ్దముకంటె అపత్యార్థమున ఈ సూత్రముచే ణ్యప్రత్యయము. 'దితి ఙస్ ణ్య' అని యుండగా ప్రాతిపదికత్వసుబ్లోపములు; ఆదివృద్ధి (సూ-941)- ఇకారలోపము (సూ-236)- 'దైత్యః' అను రూపము (ప్రథమైకవచనమున) సిద్ధించును.

ఆదిత్యః:- 'అదితేః అపత్యమ్' 'ఆదిత్యస్య అపత్యమ్' అను నర్థము లందు 'అదితి' 'ఆదిత్య' శబ్దములకంటె ఈ సూత్రముచే ణ్యప్రత్యయము. 'అదితి'శబ్దమునకు పై వలె ఆదివృద్ధి, ఇకారలోపములు వచ్చి 'ఆదిత్యః' అను రూపము సిద్ధించును. ఆదిత్యశబ్దమునకు ణ్యప్రత్యయము చేర్చినపుడు మాత్రము 'ఆదిత్య య' అని యుండగా;-

1000 హలో యమాం యమి లోపః 8.4.64

ఇతి యలోపః. ఆదిత్యః, ప్రాజాపత్యః.

హల్లుకంటె పరము లగు 'యమ్'లకు 'యమ్'పర మగునపుడు లోపము వచ్చును..

ఈ సూత్రముచే తకారముకంటె పర మగు యకారరూప మగు 'యమ్'కు ద్వితీయయకారరూప మగు 'యమ్' పర మగుటచే లోపము-"ఆదిత్యః". ప్రాజాపత్యః:- 'ప్రజాపతేః అపత్యం పుమాన్' అను నర్థమున, పతిశబ్దాంత మగు ప్రజాపతి శబ్దముకంటె పూర్వసూత్రముచే ణ్యప్రత్యయము- ఆదివృద్ధి, ఇకార లోపములు.

వా. దేవాద్యఞఞౌ.

దైవ్యమ్, దైవమ్.

దేవశబ్దముకంటె ప్రాగ్దీవ్యతీయార్థములందు 'యఞ్' 'అణ్' ప్రత్యయములు వచ్చును.

దైవ్యమ్, దైవమ్:- 'దేవస్య అపత్యమ్' ఇత్యాద్యర్థములందు ఈ వార్తికముచే 'యఞ్' 'అఞ్' ప్రత్యయములు. ఆదివృద్ధి, ఇకారలోపములు.

వా. బహిషష్టిలోపో యఞ్ చ.

బాహ్యః.

'బహిస్' అను అవ్యయముకంటె ప్రాగ్దీవ్యతీయార్థమునందు 'యఞ్' ప్రత్యయము వచ్చును; టిలోపము కూడ వచ్చును.

బాహ్యః:- 'బహిః భవః' అనునర్థమునందు 'బహిస్' అనుదానికంటె ఈ వార్తికముచే 'యఞ్' ప్రత్యయము. టి యగు 'ఇస్' అనుదానికి లోపము. ఆదివృద్ధి- 'బాహ్యః'. 'తత్ర భవః' అను సూత్రముచే (1092) చెప్పబడిన భవార్థము గూడ ప్రాగ్దీవ్యతీయార్థము.

వా. ఈకక్ చ.

'బహిస్' శబ్దముకంటె 'ఈకక్' అను ప్రత్యయము గూడ వచ్చును. 'చ' అనుటచే పూర్వవార్తికోక్త మగు టిలోపము సముచ్చిత మగుచున్నది. 'ఈకక్' లోని అంత్యకకారము ఇత్సంజ్ఞకము. 'బహిస్ ఈకక్' అని యుండగా- టిలోపము. 'బహ్ ఈక' అని యుండగా:-

1001. కితి చ 7.2.118

కితి తద్ధితే చాచామాదేరచో వృద్ధిః స్యాత్. బాహీకః.

'తద్ధితేష్వచామాదేః' అను సూత్రము, 'మృజేర్వృద్ధిః' నుండి 'వృద్ధిః' నువర్తించును. కిత్ అగు తద్ధితము పర మగునపుడు గూడ అచ్చులలో మొదటి దగు అచ్చుకు వృద్ధి వచ్చును.

ఈ సూత్రముచే వృద్ధి చేయగా 'బాహీకః' అను రూపము సిద్ధించును.

సర్వత్ర గోరజాదిప్రసఙ్గే యత్.

గోరపత్యాదిగవ్యమ్.

'లోమ్నోపత్యేషు బహుష్వకారః' అను పూర్వవార్తికమునందు అపత్యార్థమును చెప్పుటచే ఇచట 'సర్వత్ర' అను పదమునకు 'అపత్యార్థమే కాక తద్భిన్నము లగు ప్రాగ్దీవ్యతీయార్థములందు కూడ'' అని యర్థము. 'అచ్ ఆదిః యేషాం

తే అణాదయః'- అచ్ ఆదియందు గల అణ్ మొదలగు ప్రత్యయములు అని యర్థము. గోశబ్దమునకు అణాదిప్రత్యయములు వచ్చుటకు అవకాశము గల అన్ని యర్థములందును (ఆప్రత్యయములను బాధించి) 'యత్' ప్రత్యయము వచ్చును;

గవ్యమ్:- 'గోః అపత్యమ్' ఇత్యాద్యర్థములందు "ప్రాగ్దీవ్యతోఽణ్" అను సూత్రముచే సామాన్యరూపమున అణ్ ప్రత్యయము రావలసి యుండగా దానిని బాధించి ఈ వార్తికముచే యత్ ప్రత్యయము. "గోయ"అని యుండగా 'వాన్తో యి ప్రత్యయే' అను సూత్రముచే (24) 'అవ్' ఆదేశము- 'గవ్యమ్' అను రూపము సిద్ధించినది.

1002. ఉత్సాదిభ్యోఽఞ్ 4.1.86

ఔత్సః.

ఇత్యపత్యాది వికారాన్తాః సాధారణప్రత్యయాః.

ఉత్సాదిశబ్దముకంటె ప్రాగ్దీవ్యతీయార్థములందు అఞ్ ప్రత్యయము వచ్చును.

ఔత్సః:- 'ఉత్సస్య అపత్యమ్' అను నర్థమున ఈ సూత్రముచే అఞ్ ప్రత్యయము. 'తద్ధితేష్వచామాదేః' (941) ''యస్యేతిచ'' (236) అను సూత్రములచే ఆదివృద్ధి అకారలోపములు- 'ఔత్సః'.

అపత్యాది వికారాంతసాధారణప్రత్యయ ప్రకరణము సమాప్తము.

# అథ అపత్యాధికారః

1003. స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్ 4.1.87

'ధాన్యానాం భవనే' ఇత్యతః ప్రాగర్థేషు స్త్రీపుంసాభ్యాం క్రమాత్ నఞ్స్నఞౌ స్తః. స్త్రైణః. పౌంస్నః.

'ప్రాగ్దీవ్యతోఽణ్'నుండి 'ప్రాక్' అనువర్తించును. 'ధాన్యానాం భవనే క్షేత్రే ఖఞ్'అను సూత్రముకంటె పూర్వముచెప్పబడిన అర్థములందు 'స్త్రీ' 'పుంస్'అను శబ్దములకంటె'నఞ్' 'స్నఞ్' అను ప్రత్యయములు వచ్చును.

స్త్రైణః- "స్త్రియాః అపత్యమ్", "స్త్రీషు భవః", "స్త్రీణాం సమూహః"ఇత్యాద్యర్థములందు షష్ఠ్యంతము లేక సప్తమ్యంతము అగు స్త్రీశబ్దము

కంటె ఈ సూత్రముచే 'నఞ్'ప్రత్యయము,ఆదివృద్ధి నకారమునకు "అట్కు ప్వాఙ్నుమ్వ్యవాయేపి"అను సూత్రముచే (138) ణకారము- 'స్త్రైణః'అను ప్రథమైకవచన రూపము సిద్ధించును.

పౌంస్నః- "పుంసః అపత్యమ్,పుంసు భవః,పుంసాం సమూహః" ఇత్యాద్యర్థములందు షష్ఠ్యంతము లేక సప్తమ్యంత మగు పుంస్ శబ్దముకంటె ఈ సూత్రముచే 'స్నఞ్'ప్రత్యయమము. 'పుంస్స్న'అని యుండగా 'స్న'అను నది హలాదిప్రత్యయ మగుటచే దానికంటె పూర్వ మగు 'పుంస్'అనుదానికి "స్వాదిష్వసర్వనామస్థానే"అను సూత్రముచే (164) పదసంజ్ఞ యుండుటచే 'సంయోగాన్తస్య లోపః'అనుసూత్రముచే (20) సకారమునకు లోపము. ఆది వృద్ధి-'పౌంస్నః'.

## 1004. తస్యాపత్యమ్. 4.1.92

షష్ఠ్యన్తాత్ కృతసన్ధేః సమర్థాత్ అపత్యేఽర్థే ఉక్తా వక్ష్యమాణాశ్చ ప్రత్యయాః స్యుః.

'తద్ధితాః', 'ప్రత్యయః' 'పరశ్చ',అనుఅధికారసూత్రములు అనువర్తించును. తచ్ఛబ్దము బుద్ధిస్థపరామర్శకము గాన 'తస్య'అనుదానిచే షష్ఠ్యంత మగు ఉపగ్వాదిశబ్దములు పరిగ్రహింపబడును. ఉపగ్వాదుల అపత్యము అను నర్థమునందు తద్ధితప్రత్యయములు వచ్చు నని చెప్పగా వేటికంటె పరముగ వచ్చును, అను ఆకాంక్షయందు 'సమర్థానాం ప్రథమాద్వా'అను నధికారసూత్రముచే(997) ప్రథమోచ్చరిత మగు సమర్థము (కృతసంధ్యాదికార్యశబ్దము) కంటె అను నర్థము సిద్ధించును.

కృతసంధి యగు (సమర్థ మగు) షష్ఠ్యంతశబ్దముకంటె,అపత్యార్థమునందు (వాని అపత్యము అను నర్థమునందు) పూర్వోక్తము లగు ప్రత్యయములును, చెప్పబోవు ప్రత్యయములును వచ్చును.

## 1005. ఓర్గుణః. 5.4.146

ఉవర్ణాన్తస్య భస్య గుణస్తద్ధితే. ఉపగోరపత్యం ఔపగవః. ఆశ్వపతః.దైత్యః. ఔత్సః. స్త్రైణః. పౌంస్నః.

'భస్య'అధికారము. 'నస్తద్ధితే'నుండి 'తద్ధితే' అనువర్తించును. భసం

జ్ఞక మగు ఉవర్ణాంతశబ్దమునకు తద్ధితప్రత్యయము పర మగునపుడు గుణము వచ్చును.

ఔపగవః– ఉపగోః అపత్యం అను నర్థమున షష్ఠ్యంత మగు ఉపగు శబ్దముకంటె "తస్యాపత్యమ్"అను సూత్రముచే (1004) అణ్ ప్రత్యయము. 'తస్యాపత్యమ్'అను ప్రత్యయవిధాయకసూత్రమునందు ప్రథమమునందు నిర్దిష్ట మగునది షష్ఠ్యంతపదము గాన దానికంటె పరముగ ప్రత్యయము వచ్చినది. "ఉపగుఅ"అని యుండగా 'తద్ధితేష్వచామాదేః'అను సూత్రముచే (941) ఆది వృద్ధి. ప్రకృతసూత్రముచే ఉకారమునకు గుణము, అవాదేశము-'ఔపగవః'. 'ఆశ్వపతః'ఇత్యాదిశబ్దముల ప్రక్రియ వెనుక చూపబడినది.

1006. *అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్.* 4.1.162

అపత్యత్వేన వివక్షితం పౌత్రాది గోత్రసంజ్ఞం స్యాత్.

అపత్యముగా వివక్షితలగు పౌత్రాదులకు (అనగా మూడవ లేక అంత కంటె తరువాత వచ్చు తరమునకు చెందిన వారికి) గోత్రము (గోత్రాపత్యము) అని పేరు.

1007. *ఏకో గోత్రే.* 4.1.93

గోత్రే ఏక ఏవాపత్యప్రత్యయః స్యాత్. ఉపగోర్గోత్రాపత్యం ఔపగవః.

గోత్రమునందు ఒక్క అపత్యప్రత్యయము మాత్రమే వచ్చును. ఉపగోః అపత్యమ్ అను నర్థమునందు పైన చూపిన విధముగ అణ్ ప్రత్యయము వచ్చి 'ఔపగవః'అను పదము సిద్ధించును. ఉపగవుని కుమారుడు అని యర్థము. ఉప గవుని మనుమడు, లేక మునిమనుమడు మొదలగు అర్థములందు కూడ "తస్యా పత్యమ్"అనుసూత్రముచే అణ్ ప్రత్యయమువచ్చి "ఔపగవ"శబ్దము సిద్ధించును. మనుమడు అను నర్థమునందు ఒక ప్రత్యయము, మునిమనుమడు అను నర్థ మున మరల మరియొక ప్రత్యయము చేర్చవలెననెడు సందేహము కలుగ వచ్చును. ఆ సందేహమును తొలగించుటకై ఈ సూత్రము చెప్పబడినది. గోత్రాపత్యమును చెప్పవలసి యున్నపుడు ఒక్క ప్రత్యయము మాత్రమే వచ్చును అని యర్థము. అణ్ ప్రత్యయము చేర్చుటచే సిద్ధించిన 'ఔపగవః' అను పదమునకే ప్రకరణానుసారముగ ఉపగవుని మనుమడు లేక మునిమను

మడు మొదలగు అర్థములు చెప్పవచ్చు నని భావము. పౌత్రుని చెప్పుటకు ఒక గోత్రప్రత్యయము, ప్రపౌత్రుని చెప్పుటకు మరియొకగోత్రప్రత్యయము చేర్చ బనిలేదు.

1008. *గర్గాదిభ్యో యఞ్*. 4.1.105

గోత్రాపత్యే. గర్గస్య గోత్రాపత్యమ్-గార్గ్యః.వాత్స్యః.

'గోత్రే కుఞ్జాదిభ్యః చ్ఫఞ్' నుండి 'గోత్రే'అగువర్తించును. గర్గాదిశబ్దములకంటె గోత్రాపత్యార్థము నందు 'యఞ్'అనుప్రత్యయము వచ్చును.

గార్గ్యః, వాత్స్యః- 'గర్గస్య గోత్రాపత్యమ్', 'వత్సస్య గోత్రాపత్యమ్'అను నర్థములందు ఈ సూత్రముచే 'గర్గ' 'వత్స'శబ్దములకంటె 'యఞ్' ప్రత్యయము. ఆదివృద్ధి (సూ-941) అకారలోపము (సూ-236)- 'గార్గ్యః' 'వాత్స్యః'.

1009. *యఞఞోశ్చ*. 2.4.64

గోత్రే యద్ యఞన్తం అఞన్తం చ తదవయవయోరేతయో ర్లుక్స్యాత్; తత్కృతే బహుత్వే,న తు స్త్రియామ్. గర్గాః,వత్సాః.

'తద్రాజస్య బహుషు తేనైవాస్త్రియామ్' నుండి 'బహుషు', 'తేనైవ', 'అస్త్రియామ్', "ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః" నుండి 'లుక్' 'యస్కాదిభ్యోగోత్రే'నుండి 'గోత్రే'అనువర్తించును. గోత్రాపత్యార్థమునందు చేర్చిన 'యఞ్', 'అఞ్' ప్రత్యయములు అంతమునందు గల శబ్దముల అంతావయవము లగు 'యఞ్' 'అఞ్' ప్రత్యయములకు, ఆప్రత్యయములచే ప్రతిపాద్య మగు గోత్రమునకు బహుత్వము చెప్పవలసి యున్నపుడు,లోపము వచ్చును; స్త్రీలింగమునందు మాత్రము రాదు.

గర్గాః- 'గర్గస్య గోత్రాపత్యాని'అను నర్థమునందు గర్గశబ్దమునకు పూర్వసూత్రముచే యఞ్ ప్రత్యయము. ఇచట యఞ్ప్రత్యయవాచ్య మగు గోత్రాపత్యములకు బహుత్వ మున్నది. అనగా గర్గుని అనేకగోత్రాపత్యములు అని యర్థములు వివక్షిత మైనది. అందుచే ఈ సూత్రముచే 'యఞ్' లోపింపగా ప్రథమాబహువచనమునందు 'గర్గాః'అను రూపము సిద్ధించినది. ఇట్లే 'వత్సాః'. ఈ విధముగ "గార్గ్యః-గార్గ్యౌ-గర్గాః" 'వాత్స్యః- వాత్స్యౌ-వత్సాః'. గార్గ్యమ్-గార్గ్యౌ-గర్గాన్' "వాత్స్యమ్-వాత్స్యౌ-వత్సాన్" ఇత్యాదిరూపము లగును.

1010. జీవతి తు వంశ్యే యువా. 4.1.163

వంశ్యే పిత్రాదౌ జీవతి పౌత్రాదేర్యదపత్యం చతుర్థాది తత్ యువసంజ్ఞమేవ స్యాత్.

'అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్'నుండి అనువర్తించిన 'పౌత్రప్రభృతి' అనునది షష్ఠ్యంతముగ మార్చబడును. "తస్యాపత్యమ్"నుండి 'అపత్యమ్' అనువర్తించును. వంశమునకు చెందిన తండ్రి మొదలగు వారు జీవించి యున్నపుడు, పౌత్రాదుల యపత్యములగు చతుర్థాదులకు (నాలుగు లేక అంతకంటె పై నున్న తరము వారికి) యువాపత్య మనియే పేరు. (వారికి గోత్రాపత్య సంజ్ఞ యుండదు).

1011. గోత్రాద్యూన్యస్త్రియామ్ 4.1.94

యూని అపత్యే గోత్రప్రత్యయాన్తాదేవ ప్రత్యయః స్యాత్; స్త్రియాం తు న యువసంజ్ఞా.

యువాపత్యమును చెప్పవలసి వచ్చినపుడు, అపత్యప్రత్యయము గోత్రప్రత్యయాంతమునకే చేర్చబడును; స్త్రీకి యువాపత్యసంజ్ఞ లేదు.

'గర్గస్య గోత్రాపత్యం' అను నర్థమునందు గర్గశబ్దమునకు 'యఞ్'ప్రత్యయముచేర్చగా (సూ-1008) 'గార్గ్యః'అను రూపము సిద్ధించినది. గర్గునిపౌత్రుడు -గర్గునకు మూడవ తరమువాడు- అని యర్థము. మరల "గార్గ్యస్య తృతీయాపత్యమ్" (ఆ గార్గ్యుని పౌత్రుడు) అను నర్థమునందు అగార్గ్య పౌత్రుడు గర్గునకు ఐదవ తరమువా డగు యువాపత్య మగునపుడు ('గర్గస్య' 'యువాపత్యమ్ 'అని యర్థమున) రాబోవు సూత్రముచే విధింప నున్న 'ఫక్'ప్రత్యయము, ఈ సూత్రము ననుసరించి గోత్రప్రత్యయాంత మగు 'గార్గ్య'శబ్దమునకంటె పరముగ వచ్చును.

1012. యఞిఞోశ్చ 4.1.101

గోత్రే యౌ యఞిఞౌ తదన్తాత్ ఫక్ స్యాత్.

'గోత్రే కుఞ్జాదిభ్యః చ్ఫఞ్' 'నడాదిభ్యః ఫక్' నుండి 'గోత్రే' 'ఫక్' అనువర్తించును. గోత్రాపత్యార్థము లగు యఞ్ ఇఞ్ ప్రత్యయములు అంతమునందు గల ప్రాతిపదికమునకంటె ఫక్ ప్రత్యయము వచ్చును.

'ఏకో గోత్రే' (1007)అను నిషేధముచే గోత్రప్రత్యయమునకంటె గోత్రప్రత్యయము రాదు గాన, ఈ ఫక్ప్రత్యయము యువాపత్యార్థక మని అర్థాత్సిద్ధ

మగుచున్నది. 'గార్గ్య' అను యఞ్రూపగోత్రప్రత్యయాంత మగు ప్రాతిపది కము కంటె ఈ సూత్రముచే ఫక్ప్రత్యయము- 'గార్గ్యఫ' అని యుండగా:-

1013. ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్ 7.1.2

ప్రత్యయాదేః ఫస్య ఆయన్, ఢస్య ఏయ్, ఖస్య ఈన్, ఛస్య ఈయ్, ఘస్య ఇయ్ స్యుః. గర్గస్య యువాపత్యం గార్గ్యాయణః. దాక్షా యణః.

ప్రత్యయాదియందున్న ఫకారమునకు 'ఆయన్' ఆదేశము, ఢకారమునకు 'ఏయ్' ఆదేశము 'ఖ'కారమునకు 'ఈయన్' ఆదేశము, ఛకారమునకు 'ఈయ్' ఆదేశము, ఘకారమునకు 'ఇయ్' ఆదేశము వచ్చును.

ఈ సూత్రముచే 'ఫ'లోని ఫకారమునకు 'ఆయన్' ఆదేశము చేసిన పిమ్మట 'గార్గ్యఆయన్అ' అని యుండగా సవర్ణ దీర్ఘ ణత్వములచే 'గార్గ్యాయణ' అను రూపము సిద్ధించినది. గర్గుని యువాపత్య మని యర్థము, అనగా గర్గుని పౌత్రుడు అనునర్థమున మొదట గర్గశబ్దముకంటె గోత్ర ప్రత్యయ మగు యఞ్ ప్రత్యయముచేసి ఆవిధముగ నిష్పన్నమగు గార్గ్యశబ్దముకంటె "గర్గస్యయువా పత్యమ్" గర్గుని యువాపత్యము, అనగా గార్గ్యుని పౌత్రుడు అను నర్థమున 'గోత్రాద్యూన్యస్త్రియామ్' అను నియమమును (సూ-1011) అనుసరించి గోత్ర ప్రత్యయాంతమగు గార్గ్య శబ్దముకంటె ప్రకృతసూత్రముచే ఫక్ప్రత్యయము చేయగా ఈశబ్దము నిష్పన్నమైనది. ఈ గార్గ్యాయణుడు గర్గునకు ఐదవతరము వాడు. మనుమని మనుమడు. ఈతని తండ్రియో, తాతయో, ముత్తాతయో 'వించి యుండుటచే ఈతడు యువాపత్య మైనాడు. కావుననే యువాపత్యార్థమున క్ వచ్చినది. వీరిలో ఏ ఒక్కరును జీవించి యుండక పోయినచో అపుడీతడు ాడ గోత్రాపత్యమే యగును గాన యఞ్ ప్రత్యయము మాత్రమే వచ్చి 'గార్గ్యః' అను రూపమే యగును.

దాక్షాయణః:- 'దక్షస్య గోత్రాపత్యమ్' అను నర్థమున మొదట 'అత ఇఞ్' అను సూత్రముచే (1014) ఇఞ్ప్రత్యయము చేయగా ఆదివృద్ధిచే 'దాక్షి' అను రూపము సిద్ధించినది. 'దక్షస్య యువాపత్యమ్' అను నర్థమున గోత్రా ద్యూన్యస్త్రియామ్' (1011) అను నియమమును అనుసరించి, 'యఞిఞోశ్చ'అను సూత్రముచే (1012) గోత్రప్రత్యయాంత దాక్షిశబ్దముకంటె, ఫక్ ప్రత్యయము.

ఫకారమునకు పై సూత్రముచే 'ఆయన్' ఆదేశము చేయగా 'దాక్షాయణః' అను రూపము సిద్ధించినది.

1014. అత ఇఞ్ 4.1.95

అపత్యేఽర్థే. దాక్షిః.

'ప్రాతిపదికాత్' 'సమర్థానాం ప్రథమాద్వా' ''తస్యాపత్యమ్'' అనునవి అనువర్తించును. షష్ఠ్యంత మగు అదంత ప్రాతిపదికముకంటె అపత్యసామాన్యార్థమున 'ఇఞ్' అను ప్రత్యయము వచ్చును.

దాక్షిః:- 'దక్షఙస్' అను షష్ఠ్యంతమునకు ఈ సూత్రముచే 'ఇఞ్' ప్రత్యయము. ప్రాతిపదికత్వ, సుబ్లోప, అకారలోప, ఆదివృద్ధ్యాదులచే 'దాక్షిః' అను రూపము సిద్ధించినది.

1015. బాహ్వాదిభ్యశ్చ 4.1.45

బాహవిః. ఔడులోమిః.

బాహ్వాదులకంటె గూడ అపత్యార్థమునందు ఇఞ్ ప్రత్యయము వచ్చును.

బాహవిః:- 'బాహోః అపత్యం పుమాన్' అను నర్థమున 'బాహు' శబ్దముకంటె ఈ సూత్రముచే ఇఞ్ ప్రత్యయము. 'ఓర్గుణః' అను సూత్రముచే (1005) గుణము, అవాదేశము—'బాహవిః'.

ఔడులోమిః:- ఉడూనీవ లోమాని యస్య సః ఉడులోమా. నక్షత్రములవంటి రోమములు కలవాడు. ఉడులోమ్నః అపత్యం పుమాన్ అను నర్థమున ఈ సూత్రముచే ఇఞ్ ప్రత్యయము. ఆదివృద్ధి; 'నస్తద్ధితే' అను సూత్రముచే (922) అన్‌కు లోపము -'ఔడులోమిః'.

వా. లోమ్నోఽపత్యేషు బహుష్వకారో వక్తవ్యః.

ఉడులోమాః, ఆకృతిగణోఽయమ్.

బహ్వపత్యయములు అను అర్థమును చెప్పవలసి యున్నపుడు లోమన్ శబ్దముకంటె 'అ'అను అపత్యప్రత్యయము చెప్పదగినది.

ఉడులోమాః:- ఉడులోమ్నః అపత్యాని అను నర్థమున, అపత్యబహుత్వము వివక్షితము గాన ఈ వార్తికముచే ఇఞ్ ప్రత్యయమును బాధించి 'అ' ప్రత్యయము వచ్చినది. 'ఉడులోమన్ అ' అని యుండగా 'అన్'కు లోపము (సూ-922). 'అ' ప్రత్యయమున ఞిత్త్వణిత్త్వకిత్త్వములు లేవు గాన ఆదివృద్ధి

రాదు- 'ఉడులోమాః'- (ప్ర బ వ.) ఈ విధముగ ఔడులోమిశబ్దమునకు ఏకవచన ద్వివచనములందు ఇకారాంత రూపములును, బహువచనములందు అకారాంతరూపములును ఉండును. "ఔడులోమిః- ఔడులోమీ- ఉడులోమాః, ఔడులోమిం- ఔడులోమీ- ఉడులోమాన్" మొ. బాహ్వాదిగణము ఆకృతిగణము.

1016. అన్నృష్యానన్తర్యే బిదాదిభ్యోఽఞ్ 4.1.104

యేత్వత్రానృషయః తేభ్యోఽపత్యే, అన్యత్ర తు గోత్రే.

అనృషి, ఆనంతర్యే అని పదచ్ఛేదము. బిదాదులకంటె గోత్రాపత్యార్థమునందు అఞ్ ప్రత్యయము వచ్చును. ఈ బిదాదులలోని ఋషిభిన్నవాచకములకు మాత్రము ఆనంతర మగు అపత్యము- అనగా పుత్రుడు, పుత్రి అను నర్థమునందు వచ్చును.

బిద అనునది ఋషివాచకము. అందుచే దానికంటె గోత్రాపత్యము అను నర్థమునందు అఞ్ ప్రత్యయము. ఆదివృద్ధి, అకారలోపములచే ప్రథమైకవచనమున 'బైదః' అను పదము సిద్ధించినది.. బహుత్వవివక్షయందు గోత్రాపత్యార్థ మగు యఞ్ప్రత్యయమునకు "యఞఞోశ్చ"అను సూత్రముచే (1009) లోపము రాగా బిదాః, బిదాన్, బిదైః ఇత్యాది రూపము లగును.

ఈ బిదాదిగణములో చేరిన 'పుత్ర' 'దుహితృ' మొదలగు శబ్దములు ఋషివాచకములు కావు గాన అపత్యార్థమునందే వాటికంటె ఈ సూత్రముచే అఞ్ ప్రత్యయము వచ్చును. 'పుత్ర' శబ్దముకంటె అఞ్ప్రత్యయము; ఆదివృద్ధి, అకారలోపములు- 'పౌత్రః'. దుహితృశబ్దమునకు 'దుహితుః అపత్యమ్' అను నర్థమున అఞ్ ప్రత్యయము. 'దుహితృ అ' అని యుండగా ఆదివృద్ధి; ఋకారమునకు యణాదేశము- 'దౌహిత్రః' పుత్ర దుహిత్రాది శబ్దములకంటె వచ్చిన ఈ 'అఞ్'ప్రత్యయము అపత్యార్థమే కాని గోత్రాపత్యార్థకము కాదు. అందుచే బహువచనమున దానికి "యఞఞోశ్చ" అను సూత్రముచే (1009) లోపప్రసంగము లేదు గాన 'పౌత్రాః' 'దౌహిత్రాః' ఇత్యాదిరూపములే యగును.

1017. శివాదిభ్యోఽణ్ 4.1.112

అపత్యే. శైవః. గాఙ్గః.

శివాదులకంటె అపత్యార్థమునందు అణ్ ప్రత్యయము వచ్చును.

'శివస్యాపత్యమ్' 'గఙ్గాయాః అపత్యమ్'- అను నర్థములందు ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి, అంత్యాకారలోపములు- 'శైవః' 'గాఙ్గః'.

## 1018. ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ 4 1.114

ఋషిభ్యః- వాసిష్ఠః, వైశ్వామిత్రః. అన్ధకేభ్యః- శ్వాఫల్కః. వృష్ణిభ్యః- వాసుదేవః. గురుభ్యః. నాకులః, సాహదేవః.

ఋషివిశేషవాచకశబ్దములకంటెను, అంధక, వృష్టికురువంశీయులను బోధించు శబ్దములకంటెను అపత్యార్థమునందు అణ్ ప్రత్యయము వచ్చును.

ఋషులు మంత్రద్రష్టలు. 'ప్రలీనాః వేదాః తపోబలవశాత్ యాన్ అర్షన్తి ప్రాప్నువన్తి తే ఋషయః.' ప్రలీనము లగు వేదములు తపోబలముచే ఎవ్వరిని పొందినవో (అనగా ఎవరికి ప్రత్యక్షమైనవో) వారు ఋషులు. "అజాన్హవై పృశ్నీంస్తపస్యమానాన్ బ్రహ్మ స్వయంభ్వానర్షత్. త ఋషయోఽభవన్; తదృషీణామృషిత్వమ్." అని తైత్తిరీయశ్రుతి. "సర్గాదిసమయేవేదాన్ సేతిహాసాన్ మహర్షయః, లేభిరేతపసా పూర్వం అనుజ్ఞాతాః స్వయంభువా" అని పురాణ వచనము.

వాసిష్ఠః, వైశ్వామిత్రః:- ఋషివిశేషవాచకము లగువసిష్ఠ,విశ్వామిత్రశబ్దములకంటె అపత్యార్థమున ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి అకారలోపములు. శ్వాఫల్కః:- శ్వఫల్కస్య అపత్యమ్. శ్వఫల్కుడు. అంధకవంశమునకు చెందినవాడు. ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. వాసుదేవః- 'వసుదేవస్య అపత్యమ్' వసుదేవుడు వృష్ణివంశమునకు చెందినవాడు. ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. నాకులః, సాహదేవః- "నకులస్య అపత్యం పుమాన్; సహదేవస్య అపత్యం పుమాన్" నకులసహదేవులు కురువంశమునకు చెందినవారు. ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము.

## 1019. మాతురుత్ సంఖ్యాసంభద్రపూర్వాయాః. 4.1.115

సంఖ్యాదిపూర్వస్య మాతృశబ్దస్య ఉద్ ఆదేశః స్యాత్; అణ్ ప్రత్యయశ్చ. ద్వైమాతురః. షాణ్మాతురః. సాంమాతురః. భాద్రమాతురః.

సంఖ్యావాచకపదము, 'సమ్' 'భద్ర' అనునవియు పూర్వమునందు గల మాతృశబ్దమునకు 'ఉత్' ఆదేశముగ వచ్చును; అపత్యార్థమున అణ్ ప్రత్యయము గూడ వచ్చును.

ద్వైమాతురః- ద్వయోః మాత్రోః అపత్యం పుమాన్ అని విగ్రహము, ద్విశబ్దమాతృశబ్దములకు "తద్ధితార్థోత్తరపదసమాహారే చ"అను సూత్రముచే (939) సమాసము. ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము;మాతృశబ్దమునకుఉదాదేశముఅలోంత్యపరిభాషచే(21)అంతాదేశముగ వచ్చును.'ఉరణ్ రపరః' అను సూత్రముచే (29) రపరత్వము. 'ద్విమాతుర్ అ'అని యుండగా ఆదివృద్ధి-'ద్వైమాతురః' షాణ్మాతురః- 'షణ్ణాం మాతౄణాం అపత్యం పుమాన్' ప్రక్రియ పైన చూపిన విధముగ నుండును. సాంమాతురః- "సమీచీనా మాతా సంమాతా;సంమాతుః అపత్యం పుమాన్' ప్రక్రియ పైవలెనే యుండును. భాద్రమాతురః- "భద్రా చ సా మాతా చ భద్రమాతా. భద్రమాతుః అపత్యం పుమాన్"అని విగ్రహము. ప్రక్రియ పూర్వోక్తవిధమున నుండును.

1020. కన్యాయాః కనీన చ. 4.1.116

చాత్ అణ్. కానీనః-వ్యాసః, కర్ణశ్చ.

కన్యాశబ్దమునకు కనీన అను నాదేశము కూడ వచ్చును. 'చ'అనుటచే అణ్ ప్రత్యయము కూడ వచ్చుననియర్థము.

కానీనః- 'కన్యాయాః అపత్యం పుమాన్'అను నర్థమున ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము,కన్యాశబ్దమునకు 'కనీన'అను నాదేశము.ఆదివృద్ధి అకారలోపములు-'కానీనః'. ఇచట 'కన్య' అనగా అవివాహితయని యర్థము. వ్యాసకర్ణులు అవివాహిత లగు సత్యవతీకుంతులకు జన్మించిరి గాన 'కానీనః' అనగా వ్యాసుడు లేక కర్ణుడు అని యర్థము.

1021. స్త్రీభ్యో ఢక్. 4.1.120

స్త్రీప్రత్యయాన్తేభ్యో ఢక్. వైనతేయః.

స్త్రీపత్యయాంతములకంటె అపత్యార్థమునందు 'ఢక్' ప్రత్యయము వచ్చును.

వైనతేయః-'వినతాయాః అపత్యం పుమాన్' 'వినతా'శబ్దము స్త్రీప్రత్యయాంతము గాన దానికంటె ఢక్ ప్రత్యయము. కకారము ఇత్సంజ్ఞకము."ఆయనేయీనీయియఃఫఢఖఛఘాంప్రత్యయాదీనామ్"అను సూత్రముచే (1013) ఢకారమునకు 'ఏయ్' ఆదేశము, 'వినతా ఏయ్ అ'అని యుండగా "కితిచ"అను

సూత్రముచే (1001) ఆది వృద్ధి చేయగా ఇకారమునకు ఐకారము. 'యస్యేతిచ' అనుసూత్రముచే (236) ఆకారలోపము-'వైనతేయః'.

1022. రాజశ్వశురాద్యత్. 4.1.137

'రాజన్' 'శ్వశుర'అను శబ్దములకంటె అపత్యార్థమునందు యత్ప్రత్యయము వచ్చును.

ఈసూత్రము ననుసరించి రాజన్శబ్దముకంటె అపత్యసామాన్యార్థమునందు యత్ప్రత్యయము రావలసి యుండగా క్రింది వార్తికము చెప్పబడుచున్నది.

వా.. రాజ్ఞో జాతావేవేతి వాచ్యమ్.

రాజన్ శబ్దముకంటె పై సూత్రముచే విహిత మగు యత్ప్రత్యయము రాజుయొక్క అపత్యము అను సామాన్యార్థమునందు గాక రాజు యొక్క అపత్యమై,ఆజాతికిచెందినవాడుఅనునర్థమునందు వచ్చునని చెప్పవలెను.

ఈ విధముగ ఈ వార్తికముచే జాత్యర్థమున 'యత్'ప్రత్యయముచేర్చిన పిదప 'రాజన్ య'అని యుండగా 'నస్తద్ధితే'అను సూత్రముచే (922)'అన్'కు లోపము రావలసియుండ:-

1023. యే చాభావకర్మణోః 6.4.168

యాదౌ తద్ధితే పరేఽన్ప్రకృత్యా స్యాత్, న తు భావకర్మణోః, రాజన్యః, శ్వశుర్యః, జాతావేవ కిమ్:-

'అన్'అను పూర్వసూత్రము, 'ప్రకృత్యైకాచ్' అనుసూత్రమునుండి 'ప్రకృత్యా' అనుపదము అనువర్తించును.అఙ్గాధికారసామర్థ్యముచే 'ప్రత్యయః' అనుపదము లభ్య మగును. యకారాది యగు తద్ధితప్రత్యయము పర మగునపుడు 'అన్'ప్రకృతిరూపముతో నుండును (లోపింపదు); భావకర్మార్థములందు మాత్రము కాదు.

ఈ సూత్రముచే 'అన్'కు లోపము నిషేధింపబడుటచే 'రాజన్య' అను ప్రాతిపదికముసిద్ధించును. రాజ (క్షత్రియ) జాతికిచెందినవాడు అనగా క్షత్రియునకు క్షత్రియస్త్రీయందు జనించినవాడు అని అర్థము.

శ్వశుర్యః- శ్వశురస్య అపత్యం పుమాన్. శ్వశురశబ్దముకంటె పూర్వసూత్రముచే యత్ ప్రత్యయము. యత్ప్రత్యయమునకు జిత్త్వము గాని,

ఞిత్త్వము గాని కిత్త్వము గాని లేకుండుటచే ఆదివృద్ధి రాలేదు. రాజన్‌శబ్దమునకు జాతివాచక మగునపుడు మాత్రమే 'యత్'ప్రత్యయము వచ్చునని చెప్పుటచే శూద్రస్త్రీమొదలగువారియందు రాజు (క్షత్రియుని) వలన జనించినవాడు అను నర్థమునందు అపత్యార్థమున అణ్‌ప్రత్యయము వచ్చి రాబోవు సూత్రముచే 'అన్'కు లోపమునిషిద్ధమగుటచే 'రాజనః' అనురూపము సిద్ధించును.

1024. అన్. 6.4.167

అన్ ప్రకృత్యా స్యాదణి పరే రాజనః.

'ఇనణ్యనపత్యే' 'ప్రకృత్యైకాచ్'నుండి 'అణి' ప్రకృత్యా'అనువర్తించును. అణ్‌ప్రత్యయము పర మగునపుడు 'అన్'ప్రకృతిభావముతో నుండును (లోపింపదు).

1025. క్షత్త్రాద్ ఘః. 4.1.138

క్షత్త్రియః. జాతౌ ఇత్యేవ. క్షాత్త్రిః అన్యత్ర.

క్షత్త్రిశబ్దముకంటె అపత్యార్థమునందు ఘప్రత్యయము వచ్చును.

క్షత్త్రియః- 'క్షత్త్రస్య అపత్యం పుమాన్' ఈసూత్రముచే ఘప్రత్యయము. 'ఆయనేయీనీయియః ఫఢఖఛఘాంప్రత్యయాదీనామ్' అనుసూత్రముచే (1013) ఘకారమునకు 'ఇయ్'ఆదేశము అకారలోపము. (సూ_236)'క్షత్త్రియ' శబ్దము నిష్పన్న మైనది. క్షత్రియస్త్రీయందు క్షత్రియుని వలన జనించిన క్షత్రియజాతీయుడు అని యర్థము.

నిష్పన్నమగు పదము జాతివాచక మగునపుడు మాత్రమే ఘప్రత్యయము వచ్చును. జాతిభిన్నార్థమునందు, అనగా క్షత్రియునివలన శూద్రాదిస్త్రీయందు జనించినవాడు అను నర్థమున'అతఇఞ్'అనుసూత్రముచే (1014) 'ఇఞ్'ప్రత్యయము వచ్చి 'క్షాత్త్రిః'అను రూపము సిద్ధించినది.

1026. రేవత్యాదిభ్యష్ఠక్. 4.1.146

'రేవతీ' మొదలగు పదములకంటె అపత్యార్థమున 'ఠక్'ప్రత్యయము వచ్చును.

1027 ఠస్యేకః 7.3 50

అఙ్గాత్ పరస్య ఠస్య 'ఇక' ఆదేశః స్యాత్. రైవతికః.

'అఙ్గస్య' అధికారము. అంగముకంటె పరమైన ఠకారమునకు 'ఇక' అను నాదేశము వచ్చును.

రైవతికః— రేవత్యాః అపత్యం పుమాన్ అని విగ్రహము. పూర్వ సూత్రముచే ఠక్ ప్రత్యయము. 'ఠక్'లోని కకారము ఇత్సంజ్ఞకము. అకారము ఉచ్చారణార్థము. 'రేవతీ ఠ్'అని యుండగా ఈ సూత్రముచే 'ఇక' ఆదేశము. 'కితి చ'అను సూత్రముచే (1001) ఆదివృద్ధి. 'యస్యేతిచ'అను సూత్రముచే (236) ఈకారలోపము 'రైవతికః'

1028. జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్ 4.1.168

జనపదక్షత్రియవాచకాద్ 'అఞ్'స్యాదపత్యే. పాఞ్చాలః.

జనపదక్షత్రియులను బోధించు శబ్దముకంటె అపత్యార్థమునందు 'అఞ్' ప్రత్యయము వచ్చును.

పాఞ్చాలః— 'పఞ్చాల'శబ్దము పంచాల మను దేశమును, ఒక క్షత్రియ జాతిని గూడ బోధించుచున్నది. కావున "పాంచాలస్య అపత్యమ్"అను నర్థము నందు ఈ సూత్రముచే అఞ్ ప్రత్యయము. ఆదివృద్ధి, అకారలోపములు— 'పాఞ్చాలః' పంచాలుడనురాజుకుమారుడు.

వా. క్షత్రియసమానశబ్దాత్ జనపదాత్ తస్య రాజన్యపత్యవత్

పఞ్చాలానాం రాజా—పాఞ్చాలః.

క్షత్రియవాచకశబ్దముతో సమాన మగు జనపదవాచకశబ్దముకంటె, 'దాని యొక్క రాజు'అను నర్థమున అపత్యార్థమునందువలె ప్రత్యయములు వచ్చును.

పైన చూపిన విధముగ పంచాలశబ్దము క్షత్రియజాతివిశేషమునకును దేశ మునకును గూడ పేరు. కావున 'పఞ్చాలానాం రాజా' అను నర్థమున ఈవార్తి కము ననుసరించి అపత్యప్రత్యయ మగు'అఞ్'—'పాఞ్చాలః'

వా. పూరోరణ్వక్తవ్యః

పౌరవః.

పూరుశబ్దముకంటె అపత్యార్థమునందు అణ్ చెప్పదగినది.

పౌరవః— 'పూరు'శబ్దము క్షత్రియవాచక మైనను జనపదవాచకము కాకుండుటచే పూర్వసూత్రముచే (1028) 'అఞ్' వచ్చుటకు అవకాశము లేదు

గాన 'ప్రాగ్దీవ్యతోఽణ్'అనుసామాన్యశాస్త్రవిహిత మగు అణ్ వచ్చుటకు అవకాశ మున్నది. ఐనను తద్రాజసంజ్ఞానిమిత్తమై ఈ ప్రకరణమున ఈ వార్తికము చెప్పబడినది. బహువచనమునందు లోపించుట తద్రాజసంజ్ఞకుప్రయోజనమని ముందు స్పష్టము కాగలదు. 'పురోః అపత్యంపుమాన్'అనివిగ్రహము. ఈ వార్తికముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి. 'ఓర్గుణః'అను సూత్రముచే(1005) గుణము,అవాదేశము-'పౌరవ'అను శబ్దము నిష్పన్న మైనది.

వా. పాణ్డోర్డ్యణ్

పాణ్డ్యః.

'జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్' అనుసూత్ర ప్రసంగమునందు చెప్పబడుటచే ఈవార్తికమునకు "జనపదక్షత్రియవాచక మగు 'పాణ్డు'శబ్దముకంటె 'డ్యణ్' ప్రత్యయము వచ్చును"అని యర్థము.

పాణ్డ్యః- 'పాణ్డోః అపత్యమ్'అని యర్థము. "క్షత్రియసమానశబ్దాత్ జనపదాత్ తస్య రాజన్యపత్యవత్" (సూ-1028) అను వార్తికము ననుసరించి 'పాణ్డూనాం రాజా'అను నర్థమునందు గూడ ఈ 'డ్యణ్'ప్రత్యయము వచ్చును. ఇందలి డకారణకారములు ఇత్సంజ్ఞకములు. 'పాణ్డుయ'అని యుండగా 'టేః' అనుసూత్రముచే (242) టిలోపము. 'పాణ్డ్య'అను అకారాంతశబ్దము సిద్ధించినది ఇచట పాణ్డుశబ్దము శ్వేతగుణవాచకము గాని, యుధిష్ఠిరాదిపితృవాచకము గాని కాదు.

## 1029. కురునాదిభ్యో ణ్యః. 4.1.172

కౌరవ్యః.నైషధ్యః.

జనపదక్షత్రియవాచకము లగు కురుశబ్దనకారాదిశబ్దములకంటె అపత్యార్థమునందును,రాజార్థమునందును ణ్యప్రత్యయము వచ్చును.

కౌరవ్యః- 'కురోః అపత్యం పుమాన్' లేక "కురూణాం రాజా"అను నర్థమున ణ్యప్రత్యయము. ఆదివృద్ధి, 'ఓర్గుణః'అనుసూత్రముచే (1005) గుణము, అవాదేశము-'కౌరవ్యః'.నైషధ్యః- నిషధశబ్దము నకారాది యగు దేశరాజవాచకశబ్దము. 'నిషధస్య అపత్యం పుమాన్'లేక "నిషధానాం రాజా" అను నర్థమున ఈ సూత్రముచే ణ్యప్రత్యయము. ఆదివృద్ధి,అంత్యాకారలోపములు 'నైషధ్యః'.

## 1030. తే తద్రాజాః. 4.1.174

అఞ్ ఆదయః తద్రాజసంజ్ఞాః స్యుః.

'తే' అను తచ్ఛబ్దము 'జనపదశబ్దాత్'ఇత్యాది సూత్రములచే విహితము లగు అఞాదిప్రత్యయములను పరామర్శించును. 'అఞ్' మొదలగు ప్రత్యయములకు 'తద్రాజములు'అని పేరు.

## 1031. తద్రాజస్య బహుషు తేనైవాస్త్రియామ్. 2.4.62

బహుష్వర్థేషు తద్రాజస్య లుక్; తదర్థకృతే బహుత్వే,న తు స్త్రియామ్. ఇక్ష్వాకవః, పఞ్చాలాః, ఇత్యాది.

"ణ్యక్షత్రియార్షఞితో యూని లుగణిఞోః"నుండి 'లుక్'అనువర్తించును. బహ్వర్థములు బోధ్యము లగునపుడు,ఆ బహుత్వము తద్రాజప్రత్యయాంత వాచ్యములకు మాత్రమే సంబంధించి యున్నపుడు, తద్రాజప్రత్యయములకు లుక్ వచ్చును, స్త్రీలింగమునందు మాత్రము రాదు.

ఇక్ష్వాకవః- 'ఇక్ష్వాకోః అపత్యాని పుమాంసః'లేక "ఇక్ష్వాకూణాం రాజానః"అనునర్థమున ఇక్ష్వాకు శబ్దముకంటె అఞ్ ప్రత్యయము (సూ-1028). ఇచట తద్రాజప్రత్యయ మగు 'అఞ్' అంతమునందు గల 'ఇక్ష్వాకుఅ' అను దానిచే బోధింపబడు "ఇక్ష్వాకుని అపత్యములు" 'ఇక్ష్వాకుదేశముయొక్క రాజులు' అనునర్థము బహుత్వమునందున్నది గాన ఈ 'అఞ్'ప్రత్యయమునకు ప్రకృత సూత్రముచేలోపము వచ్చి ప్రథమాబహువచనమున 'ఇక్ష్వాకవః' అను రూపము సిద్ధించినది. ఏకవచనద్వివచనములందు మాత్రము అఞ్ లోపము లేదు గాన ఆది వృద్ధిగుణావాదేశాదులచే "ఐక్ష్వాకవః-ఐక్ష్వాకవౌ"అను రూపము లుండును.

పఞ్చాలాః- 'పఞ్చాలస్య అపత్యాని పుమాంసః'లేక "పఞ్చాలానాం రాజానః"అను నర్థమునందు వచ్చిన 'అఞ్' ప్రత్యయమునకు పైవలెనే లోపము "పాఞ్చాలః-పాఞ్చాలౌ-పఞ్చాలాః"ఇత్యాది విధముగ బహువచనములందు అఞ్ ప్రత్యయము లోపించి రూపములు సిద్ధించుచుండును.

## 1032. కమ్బోజాల్లుక్. 4.1.175

అస్మాత్ తద్రాజస్య లుక్. కమ్బోజః. కమ్బోజౌ.

"తే తద్రాజాః"నుండి 'తద్రాజాః' అనువర్తించిషష్ఠ్యంతముగ మార్చబడును. కమ్బోజశబ్దముకంటె పరమైన తద్రాజప్రత్యయమునకు లుక్ వచ్చును.

కమ్బోజః, కమ్బోజౌ:- కంబోజశబ్దము జనపదరాజవాచకము. దాని కంటె 'కంబోజస్య అపత్యం పుమాన్' 'కమ్బోజానాం రాజా'అనునర్థమునందు "జనపదశబ్దాత్-" ఇత్యాదిసూత్రముచేతను (1028), 'క్షత్రియసమానశబ్దాత్' ఇత్యాదివార్తికముచేతను విహిత మగు అఞ్ ప్రత్యయమునకు ఈ సూత్రముచే లోపము. అర్థమునందుమాత్రముభేదముండదు.

వా. కమ్బోజాదిభ్య ఇతి వక్తవ్యమ్.

చోలః. శకః. కేరలః యవనః.

ఇత్యపత్యాధికారః.

ఒక్క కంబోజశబ్దముకంటె యనియే కాక, కంబోజమొదలగు శబ్దముల కంటె పర మగు తద్రాజప్రత్యయములకు లుక్ వచ్చు నని చెప్పవలెను.

చోల, శక, కేరల, యవనశబ్దములు దేశరాజోభయవాచకములు. అందు 'చోల' 'శక'శబ్దములుద్వ్యచ్కములుగాన "ద్వ్యఞ్మగధకలిఙ్గసూరమసాదణ్" అను సూత్రముచే (4.1.168) (లఘుసిద్ధాంతకౌముదిలోలేదు) అపత్యము లేక రాజు అను నర్థమునందు అణ్ వచ్చును; 'కేరల' 'యవన'శబ్దములకు 'అఞ్' ప్రత్యయము (సూ-1028) వచ్చును. వాటికి ఈ వార్తికముచే లోపమువచ్చి 'చోలః,శకః, కేరలః,యవనః'అను రూపము లగును. అర్థమునందు మాత్రము మార్పు లేదు.

అపత్యాధికారప్రకరణము సమాప్తము.

# అథ రక్తాద్యర్థకాః

## 1033. తేన రక్తం రాగాత్. 4.2.1

అణ్ స్యాత్.రజ్యతే అనేనేతి రాగః. కషాయేణ రక్తం వస్త్రమ్- కాషాయమ్.

'ప్రాగ్దీవ్యతోఽణ్'నుండి 'అణ్'అనువర్తించును, 'దానిచేత రంగు కల దిగా చేయబడినది'అను నర్థమున తృతీయాంత మగు రాగ(వర్ణ)వాచకశబ్దము కంటె అణ్ ప్రత్యయము వచ్చును.

సూత్రమునందలి 'రాగ'శబ్దమునకు 'రజ్యతే అనేన' అను వ్యుత్పత్తిచే దేనిచేత (వస్త్రాదికము) రంగుగలదిగ చేయబడునో అట్టివర్ణము అని యర్థము.

కాషాయమ్:- కషాయేణ రక్తం వస్త్రం కాషాయమ్. ఇచట సమర్థమును, రాగవాచకమును,తృతీయాంతమును అగు కషాయశబ్దముకంటె ఈ సూత్రముచే "ఆ రంగుచే రంగుకలదిగ చేయబడినది"అను నర్థమున అణ్ ప్రత్యయము. 'కషాయ టా అ'అని యుండగా తద్ధితాంతమగుటచే 'కృత్తద్ధిత సమాసాశ్చ'అను సూత్రముచే (116) ప్రాతిపదికత్వము. "సుపో ధాతుప్రాతిపదికయోః"అనుసూత్రముచే (724) సుప్‌కు లోపము. 'కషాయ అ'అని యుండగా "తద్ధితేష్వచామాదేః"అను సూత్రముచే (941) ఆదివృద్ధి. 'యస్యేతి చ' అనుసూత్రముచే (236) అకారలోపము. వస్త్రశబ్దము నపుంసకలింగము గాన దానికి విశేషణముగ నపుంసకలింగప్రథమైకవచనమున 'కాషాయం'అని ప్రయోగింపబడినది

1034. నక్షత్రేణ యుక్తః కాలః. 4.2.3

అణ్ స్యాత్.

'నక్షత్రముతో కూడిన కాలము,అను నర్థమున అణ్ ప్రత్యయము వచ్చును. అణ్ విధాయక మగు ఈ సూత్రమునందు 'నక్షత్రేణ'అనునది మొదటి పదము గాన 'సమర్థానాం ప్రథమాద్వా' అను అధికారసూత్రము (997) ననుసరించి ఈప్రత్యయము నక్షత్రవాచకశబ్దముకంటె వచ్చును. 'నక్షత్రేణ' అనుపదమునకు నక్షత్రయుక్తచంద్రుడు అని యర్థము.

"పుష్యేణ యుక్తం అహః" అనుర్థమునందు నక్షత్రవాచక మగు పుష్యశబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ప్రత్యయము. ఆదివృద్ధి-'పౌష్య అ' అని యుండగా-

వా. తిష్యపుష్యయోర్నక్షత్రాణి యలోప ఇతి వాచ్యమ్

పుష్యేణ యుక్తం పౌషం అహః.

నక్షత్రాణ్-అనగా 'నక్షత్రేణ యుక్తః కాలః,అనుసూత్రముచే చేయబడిన అణ్-పర మగునపుడు 'తిష్య' 'పుష్య'శబ్దములందలి యకారమునకు లోపము వచ్చునని చెప్పవలెను. ఈవార్తికముచే యకారలోపము; 'యస్యేతి చ'

అను సూత్రముచే (236) అకారలోపము-ప్రథమైకవచనమున 'పౌషమ్' అను పదము సిద్ధించినది. పుష్యనక్షత్రముతోఁగూడిన చంద్రుడుగలది అని యర్థము

1035. లుబవిశేషే. 4.2.4

పూర్వేణ విహితస్య లుప్ స్యాత్;షష్టిదణ్డాత్మకస్య కాలస్యా వాన్తరవిశేషశ్చేత్ న గమ్యతే. అద్య పుష్యః.

లుప్,అవిశేషే.అవిశేష మనగా అరువదిగడియల కాలమునందు పగలు రాత్రి అనుఅవాంతరవిశేషవివక్ష లేకుండుట యని యర్థము. అవాంతరవిశేషము అవివక్షిత మగునపుడు, పూర్వసూత్రవిహిత మగు అణ్‌కు లోపము వచ్చును.

అద్యపుష్యః- కాలమును అరువది గడియల చొప్పున విభజింపగా ఆషష్టిఘటికాత్మక మగుఒక్కొక్కకాలమున చంద్రుడు ఒక్కొక్క నక్షత్రముతో సంబంధించి యుండు నని జ్యోతిషసిద్ధాంతము. ఆషష్టిఘటికాపరిమిత కాలము పగలా రాత్రియా యను విశేషవివక్ష లేక ఇచట 'అద్య'అని సామాన్యరూపమున చెప్పబడినది. అహోరాత్రవాచక మగు అద్య అను అవ్యయము అధికరణశక్తిప్రధానము. ఇచట ఆ అధికరణశక్తిని పరిత్యజించి అహోరాత్రకాలమాత్రార్థమున ప్రయోగింపబడినది. 'పుష్య'శబ్దముకంటె వచ్చిన అణ్ ప్రత్యయమునకు ఈ సూత్రముచే లోపము వచ్చినది. ఈ అహోరాత్రము పుష్యనక్షత్రయుక్తచంద్రయుక్త మైనది అని యర్థము.

1036. దృష్టం సామ. 4.2.7

తేన ఇత్యేవ. వసిష్ఠేన దృష్టమ్-వాసిష్ఠమ్ సామ.

'తేన రక్తం రాగాత్'నుండి 'తేన'అనువర్తించును. 'అతనిచే చూడబడిన సామ'అను నర్థమున తృతీయాంతపదముకంటె 'అణ్'మొదలగు ప్రత్యయములు వచ్చును.

వాసిష్ఠమ్:- 'వసిష్ఠేన దృష్టమ్ సామ'అనునర్థమునతృతీయాంత మగు వసిష్ఠశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి,అంత్యాకారలోపములచే 'వాసిష్ఠ' శబ్దము నిష్పన్నమైనది. 'వసిష్ఠునిచే చూడబడిన సామము.'

1037. వామదేవాడ్డ్యడ్డ్యౌ. 4.2.9

వామదేవేన దృష్టం సామ వామదేవ్యమ్.

'తేన దృష్టం సామ'అను నర్థమునందు వామదేవశబ్దముకంటె 'డ్యత్' 'డ్య'అను ప్రత్యయములు వచ్చును. 'డ్యత్' 'డ్య'ప్రత్యయములలో చివరకు 'య'మాత్రమే శేషించును. మొదటి దానియందు తిత్స్వరార్థమై తకారము చేర్చబడినది.

వామదేవ్యమ్:- 'వామదేవేన దృష్టం సామ'అని యర్థము. తృతీయాంత మగు వామదేవశబ్దముకంటె 'డ్యత్'లేక'డ్య'ప్రత్యయము చేయగా 'వామదేవ య'అని యుండగా టిలోపము-(సూ-242) "వామదేవ్యమ్."

1038. పరివృతో రథః. 4.2.10

అస్మిన్నర్థే అణ్ ప్రత్యయో భవతి. వస్త్రేణ పరివృతః- వాస్త్రోరథః.

'తేన రక్తం రాగాత్'అను సూత్రమునుండి 'తేన' అను పదము అనువర్తించును. 'దానిచే చుట్టబడిన రథము'అను నర్థమునందు తృతీయాంతశబ్దముల కంటె అణ్ ప్రత్యయము వచ్చును.

వాస్త్రః రథః- 'వస్త్రేణ పరివృతః'అను నర్థమున తృతీయాంత మగు వస్త్రశబ్దముకంటె ఈసూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి అకారలోపములు-'వాస్త్రః'.

1039. తత్రోద్ధృతమమత్రేభ్యః 4.2.14

శరావే ఉద్ధృతః-శారావ ఓదనః.

'తీసి దానియందు ఉంచబడినది' అనునర్థమునందు సప్తమ్యంతములగు పాత్రవాచకశబ్దములకంటె అణ్ ప్రత్యయము వచ్చును.

శారావఃఓదనః- శరావే ఉద్ధృతః-తీసి మూకుడుయందుంచబడిన (అన్నము) అనునర్థమునందు పాత్రవిశేషవాచక మగు 'శరావ'శబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధిఅకారలోపములు- 'శారావః'. 'మూకుడులోనికి తీసి ఉంచబడిన అన్నము.'

1040. సంస్కృతం భక్షాః 4.2.16

సప్తమ్యన్తాత్ అణ్ స్యాత్ సంస్కృతేఽర్థే, యత్ సంస్కృతం భక్షాశ్చేత్స్యుః. భ్రాష్ట్రేషు సంస్కృతాః భ్రాష్ట్రాః యవాః.

పూర్వసూత్రమునుండి 'తత్ర' అనువర్తించును. దానియందు సంస్కరింపబడినది (తత్ర సంస్కృతమ్) అను నర్థమునందు, అట్టి సంస్కృతపదార్థము భక్ష్య మైనచో, ఆసప్తమ్యంత శబ్దముకంటె అణ్ ప్రత్యయము వచ్చును.

భ్రాష్ట్రాః యవాః- భ్రాష్ట్రేషు సంస్కృతాః (మంగలములో వేచుట ద్వారా సంస్కరింపబడినవి) అను నర్థమున సప్తమ్యంత మగు భ్రాష్ట్రశబ్దము కంటె అణ్ ప్రత్యయము వచ్చినది. ఆదివృద్ధి అంత్యాకారలోపములు- 'భ్రాష్ట్రాః' (ప్ర. బ. వ.). 'భ్రాష్ట్ర' ఇత్యాదిస్థలములందు స్వతస్సిద్ధముగ ఆకార మున్నను 'పర్జన్యవల్లక్షణప్రవృత్తిః' (మేఘము ఆవశ్యకత గల పొలములందును, ఆవశ్యకత లేని సముద్రాదులందును గూడ సమముగనే వర్షించును; ఆ విధముగనే అవకాశమున్నచో లక్షణము ఆవశ్యకత యున్నను లేకున్నను ప్రవర్తించును) అను న్యాయమును పురస్కరించు కొని ఆదివృద్ధ్యాదులు చేయుట సంప్రదాయము.

### 1041 సాస్య దేవతా. 4.2.24

ఇన్ద్రో దేవతా అస్య ఐన్ద్రం-హవిః, పాశుపతమ్. బార్హస్పతమ్.

'అది దాని దేవత' అను నర్థమునందు అణ్ ప్రత్యయము వచ్చును. ఈ సూత్రమునందు మొదటి పదము 'సా' అనునదిగాన 'సమర్థానాం ప్రథమాద్వా' అను సూత్రము (997) ననుసరించి 'సా' పదార్థ మగు ప్రథమాంతపదముకంటె ప్రత్యయము వచ్చును.

ఐన్ద్రం హవిః- 'ఇంద్రః దేవతా అస్య'-దీనికి ఇంద్రుడు దేవత-అను నర్థమునందు ప్రథమాంత మగు ఇంద్రశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆది వృద్ధి అకారలోకములు-'ఐన్ద్రమ్' ఇట్లే 'పశుపతిః దేవతా అస్య' "బృహస్పతిః దేవతా అస్య" అను నర్థములందు పశుపతి బృహస్పతి శబ్దములకంటె అణ్ ప్రత్యయము; ఆదివృద్ధి, ఇకారలోపములు- 'పాశుపతమ్', 'బార్హస్పతమ్'.

### 1042. శుక్రాద్ఘన్. 4.2 26

శుక్రియమ్.

'సాస్యదేవతా' అను నర్థమున శుక్రశబ్దముకంటె ఘన్ ప్రత్యయము వచ్చును.

శుక్రియమ్:- 'శుక్రః దేవతా అస్య' అను నర్థమున ప్రథమాంత మగు శుక్రశబ్దముకంటె ఘన్ ప్రత్యయము. "ఆయనీయా..." ఇత్యాదిసూత్రముచే

(1013) ఘకారమునకు 'ఇయ్'ఆదేశము. ఇపుడు 'ఇయ్'అను అజాదిప్రత్యయము పరముగా నున్నది గాన 'శుక్ర'లోని అకారమునకు లోపము-'శుక్రియమ్'.

### 1043. సోమాట్ట్యణ్. 4.2.30

సౌమ్యమ్.

'సాస్య దేవతా'అను నర్థమున ప్రథమాంతసోమశబ్దముకంటె 'ట్యణ్'అను ప్రత్యయమువచ్చును. 'ట్యణ్'లో 'య'మాత్రము శేషించును. "సోమః దేవతా అస్య హవిషః"అను నర్థమునందు సోమశబ్దముకంటె ఈ సూత్రముచే ట్యణ్ ప్రత్యయము. ఆదివృద్ధి,అకారలోపములు-'సౌమ్యమ్'.

### 1044. వాయ్వృతుపిత్రుషసో యత్. 4.2.31

వాయవ్యమ్. ఋతవ్యమ్.

వాయు,ఋతు,పితృ,ఉషస్అను శబ్దములకంటె 'సాస్య దేవతా'అను నర్థమున యత్ప్రత్యయము వచ్చును.

వాయవ్యమ్:- 'వాయుః దేవతా అస్య'అను నర్థమున ప్రథమాంతమగు 'వాయు'శబ్దముకంటె ఈ సూత్రముచే 'యత్'ప్రత్యయము. 'వాయు య' అని యుండగా 'ఓర్గుణః'అనుసూత్రముచే (1005) గుణము. "వాన్తో యి ప్రత్యయే"అను సూత్రముచే (24) అవాదేశము-'వాయవ్యమ్'. ఇట్లే ఋతుశబ్దముకంటె పై యర్థమున యత్ ప్రత్యయము చేయగా 'ఋతవ్యమ్' సిద్ధించినది.

'పితరః దేవతా అస్య'అను నర్థమునందు పితృశబ్దముకంటె ఈ సూత్రముచే యత్ ప్రత్యయము-'పితృ య'అని యుండగా:-

### 1045. రీఙ్ ఋతః. 7.4.27

అకృద్యకారే అసార్వధాతుకే యకారే చ్వౌ చ పరే ఋదన్తాంగస్య 'రీఙ్'ఆదేశః,యస్యేతి చ. పిత్ర్యమ్. ఉషస్యమ్.

'అఙ్గస్య'అధికారము. "అయఙ్ యి క్ఙితి"నుండి 'యి', "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః'నుండి 'అకృత్సార్వధాతుకయోః; 'చ్వౌ చ'అను సూత్రము అనువర్తించును. కృద్భిన్న మగు యకారము గాని, సార్వధాతుకభిన్న మగు యకారము గాని, చ్విప్రత్యయము గాని పర మగునపుడు ఋదంత మగు అంగమునకు 'రీఙ్'అను నాదేశము వచ్చును.

పూర్వసూత్రమునుండి 'తత్ర' అనువర్తించును. దానియందు సంస్కరింపబడినది (తత్ర సంస్కృతమ్) అను నర్థమునందు, అట్టి సంస్కృతపదార్థము భక్ష్య మైనచో, ఆసప్తమ్యంత శబ్దముకంటె అణ్ ప్రత్యయము వచ్చును.

భ్రాష్ట్రాః యవాః- భ్రాష్ట్రేషు సంస్కృతాః (మంగలములో వేచుట ద్వారా సంస్కరింపబడినవి) అను నర్థమున సప్తమ్యంత మగు భ్రాష్ట్రశబ్దము కంటె అణ్ ప్రత్యయము వచ్చినది. ఆదివృద్ధి అంత్యాకారలోపములు- 'భ్రాష్ట్రాః' (ప్ర. బ. వ.). 'భ్రాష్ట్ర' ఇత్యాదిస్థలములందు స్వతస్సిద్ధముగ ఆకార మున్నను 'పర్జన్యవల్లక్షణప్రవృత్తిః' (మేఘము ఆవశ్యకత గల పొలములందును, ఆవశ్యకత లేని సముద్రాదులందును గూడ సమముగనే వర్షించును; ఆ విధముగనే అవకాశమున్నచో లక్షణము ఆవశ్యకత యున్నను లేకున్నను ప్రవర్తించును) అను న్యాయమును పురస్కరించు కొని ఆదివృద్ధ్యాదులు చేయుట సంప్రదాయము.

## 1041 సాస్య దేవతా. 4.2.24

ఇన్ద్రో దేవతా అస్య ఐన్ద్రం-హవిః, పాశుపతమ్. బార్హస్పతమ్.

'అది దాని దేవత' అను నర్థమునందు అణ్ ప్రత్యయము వచ్చును. ఈ సూత్రమునందు మొదటి పదము 'సా' అనునదిగాన 'సమర్థానాం ప్రథమాద్వా' అను సూత్రము (997) ననుసరించి 'సా' పదార్థ మగు ప్రథమాంతపదముకంటె ప్రత్యయము వచ్చును.

ఐన్ద్రం హవిః- 'ఇంద్రః దేవతా అస్య'-దీనికి ఇంద్రుడు దేవత-అను నర్థమునందు ప్రథమాంత మగు ఇంద్రశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి అకారలోకములు-'ఐన్ద్రమ్' ఇట్లే 'పశుపతిః దేవతా అస్య' "బృహస్పతిః దేవతా అస్య" అను నర్థములందు పశుపతి బృహస్పతి శబ్దములకంటె అణ్ ప్రత్యయము; ఆదివృద్ధి, ఇకారలోపములు- 'పాశుపతమ్', 'బార్హస్పతమ్'.

## 1042. శుక్రాద్ఘన్. 4.2 26

శుక్రియమ్.

'సాస్యదేవతా' అను నర్థమున శుక్రశబ్దముకంటె ఘన్ ప్రత్యయము వచ్చును.

శుక్రియమ్:- 'శుక్రః దేవతా అస్య' అను నర్థమున ప్రథమాంత మగు శుక్రశబ్దముకంటె ఘన్ ప్రత్యయము. "ఆయనేయీ..." ఇత్యాదిసూత్రముచే

(1013) షకారమునకు 'ఇయ్'ఆదేశము. ఇపుడు 'ఇయ్'అను అజాదిప్రత్యయము పరముగా నున్నది గాన 'శుక్ర'లోని అకారమునకు లోపము- 'శుక్రియమ్'.

### 1043. సోమాట్ట్యణ్. 4.2.30

సౌమ్యమ్..

'సాస్య దేవతా'అమనర్థమునప్రథమాంతసోమశబ్దముకంటె 'ట్యణ్'అను ప్రత్యయమువచ్చును. 'ట్యణ్'లో 'య'మాత్రము శేషించును. "సోమః దేవతా అస్య హవిషః"అను నర్థమునందు సోమశబ్దముకంటె ఈ సూత్రముచే ట్యణ్ ప్రత్యయము. ఆదివృద్ధి,అకారలోపములు-'సౌమ్యమ్'.

### 1044. వాయ్వృతుపిత్రుషసో యత్. 4.2.31

వాయవ్యమ్. ఋతవ్యమ్.

వాయు,ఋతు,పితృ,ఉషస్అను శబ్దములకంటె 'సాస్య దేవతా'అను నర్థమున యత్ప్రత్యయము వచ్చును.

వాయవ్యమ్:- 'వాయుః దేవతా అస్య'అను నర్థమున ప్రథమాంతమగు 'వాయు'శబ్దముకంటె ఈ సూత్రముచే 'యత్'ప్రత్యయము. 'వాయు య' అని యుండగా 'ఓర్గుణః'అనుసూత్రముచే (1005) గుణము. "వాన్తో యి ప్రత్యయే"అను సూత్రముచే (24) అవాదేశము-'వాయవ్యమ్'. ఇట్లే ఋతుశబ్దముకంటె పై యర్థమున యత్ ప్రత్యయము చేయగా 'ఋతవ్యమ్' సిద్ధించినది.

'పితరః దేవతా అస్య'అను నర్థమునందు పితృశబ్దముకంటె ఈ సూత్రముచే యత్ ప్రత్యయము-'పితృ య'అని యుండగా:-

### 1045. రీఙ్ ఋతః. 7.4.27

అకృద్యకారే అసార్వధాతుకే యకారే చ్వౌ చ పరే ఋదన్తాంగస్య 'రీఙ్'ఆదేశః,యస్యేతి చ. పిత్ర్యమ్. ఉషస్యమ్.

'అఙ్గస్య'అధికారము. "అయఙ్ యి క్ఙితి"నుండి 'యి', "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః"నుండి 'అకృత్సార్వధాతుకయోః; 'చ్వౌ చ'అను సూత్రము అనువర్తించును. కృద్భిన్న మగు యకారము గాని, సార్వధాతుకభిన్న మగు యకారము గాని, చ్విప్రత్యయము గాని పర మగునపుడు ఋదంత మగు అంగమునకు 'రీఙ్'అను నాదేశము వచ్చును.

ఈ సూత్రముచే పితృశబ్దమునకు రీజాదేశము. జిత్తుగాన అంతావయవముగ వచ్చును.–'పిత్రీ య'అని యుండగా 'యస్యేతి చ'అను సూత్రముచే (236) ఈకారమునకు లోపము–'పిత్ర్యమ్.' 'ఉషః దేవతా అస్య'అను నర్థమున 'ఉషస్'శబ్దమునకు పూర్వసూత్రముచే 'యత్'ప్రత్యయము–'ఉషస్యమ్'.

1046. పితృవ్య–మాతుల–మాతామహ–పితామహాః 4.2.36

ఏతే నిపాత్యన్తే. పితుర్భ్రాతా పితృవ్యః, మాతుర్భ్రాతా మాతులః. మాతుః పితా మాతామహః, పితుః పితా పితామహః.

పితృవ్య,మాతుల,మాతామహ,పితామహ శబ్దములు నిపతింపబడుచున్నవి. అనగా వాటి ప్రకృతిప్రత్యయాదిపరిశీలనము అనావశ్యక మని పాణిని యభిప్రాయము. కాని వార్తికకారుడు పిత్రాదిశబ్దములకు ఏయే యర్థములందు ఏయే ప్రత్యయములను చేర్చుటచే 'పితృవ్య'ఇత్యాదిరూపములు సిద్ధించినవో తెలుపుచు 'పితుర్భ్రాతరి వ్యత్'–(పితృశబ్దముకంటె,తండ్రియొక్క సోదరుడు అనునర్థమున 'వ్యత్'ప్రత్యయము వచ్చును). 'మాతుర్డులచ్' (మాతృశబ్దముకంటె సోదరుడు అను నర్థమున డులచ్ప్రత్యయము వచ్చును), "మాతృపితృభ్యాం పితరి డామహచ్"మాతృపితృశబ్దములకంటె వారి తండ్రి యను నర్థమున డామహచ్ ప్రత్యయము వచ్చును అను వార్తికములను చెప్పియున్నాడు.

పితృవ్యః– తండ్రిసోదరుడు. పైన చూపిన వార్తికముచే పితృశబ్దముకంటె వ్యత్ప్రత్యయము. మాతులః– తల్లి సోదరుడు:– మాతృశబ్దముకంటె 'డులచ్'ప్రత్యయము. 'టేః'అనుసూత్రముచేటిలోపము.

మాతామహః,పితామహః:– క్రమముగ 'తల్లితండ్రి' 'తండ్రితండ్రి' అని యర్థము,మాతృపితృశబ్దములకంటె 'డామహచ్'ప్రత్యయము. 'టేః'అను సూత్రముచే (242) టిలోపము.

1047. తస్య సమూహః. 4.2.37

కాకానాం సమూహః కాకమ్.

'తస్య సమూహః'అను నర్థమునందు ప్రథమోచ్చరిత మగు షష్ఠ్యంత శబ్దముకంటె యథాసంభవముగ ప్రాగ్దీవ్యతీయము లగు అణాదిప్రత్యయములు వచ్చును.

కాకమ్:– 'కాకానాం సమూహః'అను నర్థమున షష్ఠ్యంతమగు కాక

శబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి అకారలోపములు- 'కాకమ్' సమూహార్థకప్రత్యయాంత పదములు నపుంసకలింగములు.

1048. భిక్షాదిభ్యోఽణ్. 4.2.38

భిక్షాణాం సమూహః భైక్షమ్. గర్భిణీనాం సమూహః గార్భిణమ్. ఇహ.

వా. భస్యాఢే తద్ధితే.

ఇతి పుంవద్భావే కృతే-

'తస్య సమూహః'అను నర్థమునందు భిక్షాదిపదములకంటెఅణ్ ప్రత్యయము వచ్చును.

భైక్షమ్:- 'భిక్షాణాం సమూహః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు భిక్షాశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధిఆకారలోపములు. 'గర్భిణీనాం సమూహః'అను నర్థమునందుగర్భిణీశబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ప్రత్యయము. 'గర్భిణీ అ'అని యుండగా-

ఢప్రత్యయభిన్న మగు తద్ధితప్రత్యయము పర మగునపుడు భసంజ్ఞక మగు స్త్రీలింగశబ్దమునకు పుంవద్భావము వచ్చును. ఈ వార్తికముచే 'గర్భిణీ' శబ్దమునకు పుంవద్భావము చేయుటచే 'గర్భిన్ అ'అని యుండగా 'నస్తద్ధితే' అను సూత్రముచే (921) 'ఇన్'కు లోపము రావలసి యుండ క్రింది సూత్రము చెప్పబడుచున్నది.

1049. ఇనణ్యనపత్యే. 6.4.164

అనపత్యార్థేఽణి'ఇన్'ప్రకృత్యా స్యాత్. తేన 'నస్తద్ధితే' ఇతి టిలోపో న. యువతీనాం సమూహః యౌవనమ్.

ఇన్,అణి,అనపత్యే. 'ప్రకృత్యైకాచ్'నుండి 'ప్రకృత్యా' అనువర్తించును. అపత్యార్థకము కాని అణ్ ప్రత్యయము పర మగునపుడు 'ఇన్'ప్రకృతిభావముతో నుండును (లోపింపదు). ఈ సూత్రముచే 'ఇన్'కు లోపము నిషేధింపబడినది గాన ఆదివృద్ధిణత్వాదులచే ప్రథమైకవచనమునందు 'గార్భిణమ్' అను రూపము సిద్ధించినది.

'యువతీనాం సమూహః'అను నర్థమున పూర్వసూత్రముచే షష్ఠ్యంతయువతిశబ్దముకంటె అణ్ ప్రత్యయము. యువతి శబ్దము యువన్శబ్దమునకు

'యూన స్తిః'అనుసూత్రము (1275)చే 'తి' అను స్త్రీప్రత్యయము చేర్చుటచే సిద్ధించినది. 'యువతి అ' అని యుండగా 'భస్యాఽఢేత ద్ధితే'అను వార్తికముచే పుంవద్భావము-'యువన్ అ'అని యుండగా "న స్తద్ధితే"అను సూత్రముచే(922) 'అన్'కు లోపము రావలసి యున్నది.కాని 'అన్'అనుసూత్రముచే (1024)అన్ ప్రకృతిభావముతోనుండును. ఆదివృద్ధిచే ప్రథమైకవచనమునందు 'యౌవనమ్' అను రూపము సిద్ధించును.

1050. *గ్రామజనబన్ధుభ్య స్తల్* 4.2.43

(లిం)తల న్తం స్త్రియామ్. గ్రామతా,జనతా,బన్ధుతా.

'తస్య సమూహః'అను నర్థమున గ్రామ,జన,బంధు అనుపదములకంటె 'తల్'ప్రత్యయము వచ్చును. తల్ప్రత్యయాంతములు స్త్రీలింగములోనుండును.

గ్రామతా:- 'గ్రామాణాం సమూహః'అను నర్థమునందు ఈ సూత్రముచే 'తల్'ప్రత్యయము చేయగా 'గ్రామతా'అను రూపము సిద్ధించును.'జనతా' 'బన్ధుతా'ఇట్లే సిద్ధించును.

వా. *గజసహాయాభ్యాం చేతి వక్తవ్యమ్.*

గజతా. సహాయతా.

'తస్య సమూహః'అనునర్థమునందు 'గజ' 'సమూహ'శబ్దములకంటె గూడ తల్ప్రత్యయము వచ్చు నని చెప్పవలెను. గజానాం సమూహః గజతా, సహాయానాం సమూహః సహాయతా.

వా. *అహ్నః ఖః క్రతౌ.*

అహీనః.

క్రత్వర్థక మగు అహన్శబ్దముకంటె సమూహార్థమునందు ఖప్రత్యయము వచ్చును.

అహీనః- 'అహ్నాం సమూహః'అని యర్థము. ఇచట అహన్శబ్దమునకుసౌత్యాహస్సు లని పేరు. అహన్శబ్దముకంటె ఖప్రత్యయము. 'అహన్ ఖ' అని యుండగా ఖకారమునకు'ఈన్'ఆదేశము (సూ-1013) "అహ్నష్టఖోరేవ" అనుసూత్రముచేటిలోపము-'అహీనః'.

1051. అచిత్తహస్తిధేనోష్ఠక్. 4.2.47

అప్రాణివాచకశబ్దములకంటెను, హస్తి, ధేనుశబ్దములకంటెను 'తస్య సమూహః' అనునర్థమునందు 'ఠక్' ప్రత్యయము వచ్చును.

1052. ఇసుసుక్తాన్తాత్కః 7.3.51

ఇస్,ఉస్,ఉక్తాన్తాత్ పరస్య ఠస్య కః. సాక్తుకమ్, హాస్తికమ్. ధైనుకమ్.

'ఠస్యేకః' నుండి 'ఠస్య' అనువర్తించును. ఇస్,ఉస్,ఉక్,త,అనునవి అంతమునందు గల అంగముకంటె పర మగు ఠకారమునకు 'క' అను నాదేశము వచ్చును.

సాక్తుకమ్:- "సక్తూనాం సమూహః" అనునర్థమున సక్తుశబ్దము అచేతనవాచకము గాన దానికంటె పూర్వసూత్రముచే 'ఠక్' ప్రత్యయము. 'ఠక్' లోని కకారము ఇత్సంజ్ఞకము. అకారముఉచ్చారణార్థము. 'సక్తు' అనునది ఉగంతము గాన దానికంటె పర మగు ఠకారమునకు, 'ఠస్యేకః' అను సూత్రమును బాధించి ఈసూత్రముచే 'క' ఆదేశము. 'కితి చ' అను సూత్రముచే (1001) ఆదివృద్ధి- 'సాక్తుకమ్.'

హాస్తికమ్:- 'హస్తినాం సమూహః' అనునర్థమున 'హస్తిన్' శబ్దముకంటె ఠక్ ప్రత్యయము ఠకారమునకు 'ఠస్యేకః' అను సూత్రముచే (1027) ఇకాదేశము. 'నస్తద్ధితే' అనుసూత్రము (922) చే 'ఇన్' కు లోపము. ఆదివృద్ధి- 'హాస్తికమ్' ధైనుకమ్:- 'ధేనూనాం సమూహః' ధేనుశబ్దముకంటె ఠక్ప్రత్యయము. ఠకారమునకు ప్రకృతసూత్రముచే కాదేశము ఆదివృద్ధి-'ధైనుకమ్.'

1053. తదధీతేతద్వేద. 4.2.59

దానిని చదువుచున్నాడు. దానిని తెలిసికొనుచున్నాడు అనునర్థములందు సమర్థము లగు ద్వితీయాంతపదములకంటె అణ్ ప్రత్యయాదులు వచ్చును. గురుముఖతః అక్షరానుపూర్వీగ్రహణమునకు అధ్యయన మని పేరు. అర్థావగతికి వేదన మని పేరు.

'వ్యాకరణం అధీతే వేద వా' అనునర్థమునందు ద్వితీయాంత "వ్యాకరణ' శబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. "వ్యాకరణ అ" అని యుండగా ఆదివృద్ధి రావలసి యుండ:-

1054. న య్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్. 7.3.3

పదాన్తాభ్యాం యకారవకారాభ్యాం పరస్య న వృద్ధిః, కిన్తుతాభ్యాం పూర్వౌ క్రమాదేచావాగమౌ స్తః. వ్యాకరణం అధీతే వేద వా వైయాకరణః.

'మృజేర్వృద్ధిః'నుండి 'వృద్ధిః'అనువర్తించును. పదాంతమునందున్న యకారవకారములకంటె పర మగు వర్ణమునకు వృద్ధి రాదు;కాని ఆ యకారవకారములకు పూర్వమునందు క్రమముగ ఐకార (యకారమునకుపూర్వము) ఔకారములు (వకారమునకుపూర్వము) ఆగమములుగ వచ్చును.

'వ్యాకరణ'శబ్దమునందు 'వి'అను ఉపసర్గయందలి'ఇ'కారమునకు 'ఇకో యణచి'అనుసూత్రముచే (15) యణాదేశముచే యకారము వచ్చినది. ఇకారము పదాంత్యము గాన దాని స్థానమునందు వచ్చిన యకారము గూడ పదాంత్యమే. కావున ఈ సూత్రముచే ఆకారమునకు వృద్ధినిషేధము; యకారమునకు వెనుక ఐకారాదేశము వచ్చి 'వైయాకరణ అ'అని యుండగా అంత్యాకారలోపముచే 'వైయాకరణః' అనురూపము సిద్ధించినది.

1055 క్రమాదిభ్యో వున్. 4 2.61

క్రమకః,పదకః,శిక్షకః,మీమాంసకః. ఇతిరక్తాద్యర్థాః,

'తదధీతే తద్వేద'అను నర్థమునందు క్రమాదులకంటె వున్ప్రత్యయము వచ్చును.

క్రమకః- 'క్రమం అధీతే వేద వా.'ఈ సూత్రముచే ద్వితీయాంతక్రమశబ్దముకంటె వున్ ప్రత్యయము. 'యువోరనాకౌ'అనుసూత్రముచే (788) 'వు'కు 'అక' ఆదేశము. "యస్యేతి చ"అను సూత్రముచే (236) అకారలోపము- 'క్రమకః'.పదం అధీతే వేత్తి వా 'పదకః', శిక్షాం అధీతే వేత్తి వా 'శిక్షకః' మీమాంసాం అధీతే వేత్తివా 'మీమాంసకః'అను పదములు గూడ ఈ విధముగనే సిద్ధించును.

రక్తాద్యర్థకప్రకరణము సమాప్తము

# అథ చాతురర్థికాః

1056. తదస్మిన్నస్తీతి దేశే తన్నామ్ని 4.2.67

ఉదుమ్బరాః సన్త్యస్మిన్దేశే ఔదుమ్బరో దేశః.

'అది దానియందు ఉన్నది' అనునర్థమునందు, ప్రత్యయములను చేర్చగా నిష్పన్న మగు పదము దేశమునకు నామధేయమైనచో, సమర్థ మగు ప్రథమాంత పదముకంటె అణాదిప్రత్యయములు వచ్చును.

ఈ ప్రకరణమునకు చాతురర్థికప్రకరణ మని పేరు. ఇందు నాలుగర్థము లందు వచ్చు ప్రత్యయములు ప్రతిపాదింపబడుచున్నవి. (1) 'అదిదానియందున్నది' (2) 'వానిచే తయారుచేయబడినది' (3) 'వానికినివాసమైనవి'. (4) 'దానినుంచిదూరముకాదు' అను నాల్గు అర్థములందు ప్రత్యయములు విధింపబడును. ఈ విధముగ విహితము లగు ప్రత్యయములను చేర్చుటచే నిష్పన్నములగు పదములు దేశవాచకములుగ నుండును. ఈ నాల్గు అర్థములను ప్రతిపాదించుటచే ఈ ప్రకరణమునకు చాతురర్థికప్రకరణ మని పేరు.

ఔదుమ్బరః- 'ఉదుమ్బరాః సన్త్యస్మిన్ దేశే' (ఈ దేశమునందు ఉదుంబరవృక్షము లున్నవి) అను నర్థమున ప్రథమాంత మగు 'ఉదుమ్బర' శబ్దముకంటె అణ్ ప్రత్యయము-'ఉదుమ్బరజస్అ' అని యుండగా ప్రాతిపదికత్వ, సుబ్లోప, ఆదివృద్ధి, అంత్యాకారలోపాదులచే "ఔదుమ్బరః."

1057. తేన నిర్వృత్తమ్ 4.2.68

కుశామ్బేన నిర్వృత్తా నగరీ కౌశామ్బీ.

పూర్వసూత్రమునుండి "ఇతి దేశే తన్నామ్ని" అనునది అనువర్తించును. "వానిచే ఏర్పరుపబడినది" అను నర్థమున, నిష్పన్న మగు శబ్దము దేశవాచక మగునపుడు, సమర్థ మగు తృతీయాంతశబ్దముకంటె అణాదిప్రత్యయములు వచ్చును.

కౌశామ్బీ:- 'కుశామ్బేన నిర్వృత్తా నగరీ' కుశాంబునిచే ఏర్పరుపబడిన నగరము అను నర్థమున తృతీయాంత మగు కుశాంబశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధ్యాదులచే 'కౌశాంబ' అను ప్రాతిపదికము సిద్ధించినది. స్త్రీలింగ

మున ఙిత్త్వప్రయుక్త మగు 'ఙీప్' వచ్చుటచే 'కౌశామ్బీ'అను రూపము సిద్ధించును.

1058. తస్య నివాసః 4.2.69

శిబీనాం నివాసః దేశః శైబః.

'ఇతి దేశే తన్నామ్ని' అనువర్తించును. "ఆతని నివాసము"అను నర్థమునందు సమర్థములగు షష్ఠ్యంతపదములకంటె అణాదిప్రత్యయములు వచ్చును.

శైబః- "శిబీనాం నివాసః" (శిబిక్షత్రియుల నివాసమగు దేశము) అను నర్థమున షష్ఠ్యంతశబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధ్యాదులు-'శైబః'.

1059. అదూరభవశ్చ 4.2.70

విదిశాయాః అదూరభవం నగరం-వైదిశమ్.

'ఇతి దేశే తన్నామ్ని'అనువర్తించును. పూర్వసూత్రమునుండి 'తస్య' అనువర్తించును. 'దానికి సమీపమున నున్నది, అనునర్థమునందు సమర్థమగు షష్ఠ్యంతపదముకంటె అణాదిప్రత్యయములు వచ్చును.

వైదిశమ్:- 'విదిశాయాః అదూరభవం నగరం' (విదిశకు)సమీపమున నున్న నగరము అను నర్థమున అణ్ వచ్చి ఆదివృద్ధ్యాదులచే 'వైదిశమ్' సిద్ధించినది.

1060. జనపదే లుప్. 4 2 81

జనపదే వాచ్యే చాతురర్థికస్య లుప్.

జనపదము (దేశము) వాచ్య మగునపుడు చాతురర్థికప్రత్యయమునకు లోపము వచ్చును.

1061. లుపి యుక్తవద్వ్యక్తివచనే. 1.2.51

లుపి సతి ప్రకృతివల్లిఙ్గవచనే స్తః. పఞ్చాలానాం నివాసో జనపదః-పఞ్చాలాః. కురవః. అఙ్గాః, వఙ్గాః,కలిఙ్గాః.

ప్రకృతికి యుక్తమనియు, లింగమునకు వ్యక్తియనియు, సంఖ్యకు వచన మనియు పూర్వాచార్యకృతసంజ్ఞలు. ప్రత్యయము లోపించినపుడు లింగవచనములు ప్రకృతిభూతపదలింగవచనములవలెనే యుండును.

పఞ్చాలాః— 'పఞ్చాలానాం నివాసో జనపదః' (పంచాలు లనుక్షత్రియులకు నివాస మగు జనపదము) అను నర్థమున "తస్య నివాసః"అను సూత్రముచే (1058) వచ్చిన అణ్‌కు 'జనపదే లుప్' అనుసూత్రముచే (1060) లోపము. ఈ విధముగ నిష్పన్న మగు 'పఞ్చాల'శబ్దమునకు పంచాలజనపద మనియర్థము,ఈ జనపదరూపార్థము ఏకవచనమునం దున్నను ప్రకృతిభూత మగు పఞ్చాలశబ్దము (పఞ్చాలానాం అనునది) బహువచనమునం దుండుటచే ఈజన పదవాచకశబ్దము కూడ ఈసూత్రము ననుసరించి పుంలింగబహువచనములందు ప్రయోగింపబడును. ఇట్లే "కురూణాం నివాసః జనపదః" 'అఙ్గానాం నివాసో జనపదః' "వఙ్గానాం నివాసో జనపదః" "కలిఙ్గానాం నివాసో జనపదః"ఇత్యాద్యర్థములందు 'కురవః' 'అఙ్గాః' 'వఙ్గాః' 'కలిఙ్గాః'అను పదములు సిద్ధించినవి.

### 1062. వరణాదిభ్యశ్చ. 4.2.82

అజనపదార్థః ఆరమ్భః. వరణానామదూరభవం నగరమ్— వరణాః.

వరణాదిశబ్దములకంటె విహిత మగు చాతురర్థికప్రత్యయములకు లోపము వచ్చును.

వరణాః— వరణానామదూరభవం నగరం వరణాః. 'వరణా'అనునది కాశికి ఉత్తరమునందున్న నదికి పేరు. పూజార్థమునబహువచనము, 'అదూరభవశ్చ'అను సూత్రముచే వచ్చిన అణ్‌కు లోపము. 'లుపి యుక్తవద్వ్యక్తివచనే'అనుసూత్రముచే (1061) ప్రకృతిలింగ మగు స్త్రీలింగము, బహువచనము వచ్చినవి. ఇది నగరార్థకము గాన జనపదవాచకము కాకుండుటచే 'జనపదె లుప్' అను సూత్రము (1060) ప్రవర్తింపదు గాన ఈ సూత్రము చెప్పబడినది.

### 1063. కుముదనడవేతసేభ్యో డ్మతుప్. 4.2.87

కుమద, నడ, వేతసశబ్దములకంటె 'డ్మతుప్'ప్రత్యయము వచ్చును. ఈ డ్మతుప్ ప్రత్యయము మత్వర్థమునందు వచ్చు నవి భాష్యకారవచనము. 'డ్మతుప్'లో'మత్'శేషించును.

### 1064. ఝయః. 8.2.10

ఝయన్తాత్ మతోర్మస్య వః. కుముద్వాన్. నడ్వాన్.

"మాదుపధాయాశ్చమతోర్వోఽయవాదిభ్యః"నుండి 'మతోః' 'వః' అను వర్తించును. ఝయంతముకంటె పరమైన 'మత్'లోని మకారమునకు వకారాదేశము వచ్చును. 'ఆదేఃపరస్య'అను పరిభాషచే (72) 'మత్‌లోని మకారమునకు' అను అర్థము సిద్ధించినది.

కుముద్వాన్:- 'కుముదాః సన్తి అస్మిన్ దేశే'అను నర్థమునందు కుముదశబ్దముకంటె 'డ్మతుప్'ప్రత్యయము, 'టేః'అను సూత్రముచే (242) టియగు అకారమునకు లోపము. 'కుముదమత్'అని యుండగా ప్రకృతసూత్రముచే మకారమునకు వకారము-ప్రథమైకవచనమున'కుముద్వాన్'అను రూపము సిద్ధించును. నడ్వాన్- 'నడాః సన్తి అస్మిన్ దేశే'నడశబ్దము కంటె డ్మతుప్ ప్రత్యయము.పైవలెనే రూపముసిద్ధించును. 'వేతసాః సన్తి అస్మిన్ దేశే'అను నర్థమునందు పూర్వసూత్రముచే డ్మతుప్ ప్రత్యయము. టిలోపముచేసినపిమ్మట 'వేతస్ మత్'అని యుండగా-

1065. మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః. 8.2.9

మవర్ణాన్తాత్ మవర్ణావర్ణోపధాచ్చ యవాదివర్జితాత్‌పరస్యమతోర్మస్య వః. వేతస్వాన్.

మ్ చ అశ్చ తయోస్సమాహారః 'మమ్'-తస్మాత్ మాత్. మకారాకారములకంటె అని యర్థము. ఈ మాత్ అనుదానిని ఆవృత్తి చేసి 'మశ్చ అత్ చ మాత్,మాత్ ఉపధా యస్యాః సా'అని యర్థము చెప్పుటచే 'మకారాకారోపధము' అనునర్థము లభించినది. 'అత్'లోని తపరత్వము అవివక్షితము. మవర్ణావర్ణాంతమును, మకారాకారోపధమును, యవాదిభిన్నమును అగు పదముకంటె పరమైన 'మత్'లోని మకారమునకు వకారము వచ్చును. ఇచట 'వేతస్'అనునది అకారోపధము గాన దానికంటె పరమగు 'మత్'లోని మకారమునకు వకారాదేశము- 'వేతస్వాన్'.

1066. నడశాదాడ్డ్వలచ్. 4.2.88

నడ్వలః, శాద్వలః.

'తదస్మిన్నస్తి'అను నర్థమునందు 'నడ' 'శాద'శబ్దములకంటె డ్వలచ్ ప్రత్యయము వచ్చును.

నడ్వలః:- 'నడాః సన్తి అస్మిన్ దేశే'. ఈసూత్రముచే 'నడ'శబ్దము కంటె డ్వలచ్ప్రత్యయము;టిలోపము-'నడ్వలః'. ఇట్లే "శాదాః సన్తి అస్మిన్ దేశే" అనునర్థమున డ్వలచ్ప్రత్యయము-'శాద్వలః'.

1067. శిఖాయా వలచ్ 4.2.89

శిఖావలః.

ఇతిచాతురర్థికాః

'తదస్మిన్నస్తి' 'తేన నిర్వృత్తమ్'ఇత్యాద్యర్థములందు శిఖాశబ్దము కంటె వలచ్ ప్రత్యయమువచ్చును.

శిఖావలః-'శిఖాః సన్తి అస్మిన్ దేశే' లేక'శిఖయా నిర్వృత్తమ్'అను నర్థమునందు శిఖాశబ్దముకంటె ఈ సూత్రముచే వలచ్ప్రత్యయము-'శిఖావలః'.

చాతురర్థికప్రకరణము సమాప్తము.

# అథ శైషికాః

1068. శేషే 4.2.92

అపత్యాది చాతురర్థ్యన్తాద్ అన్యోఽర్థః శేషః;తత్రాణాదయః స్యుః. చక్షుషా గృహ్యతే చాక్షుషం-రూపమ్. శ్రావణః-శబ్దః.ఔపనిషదః-పురుషః. దృషది పిష్టాః దార్షదాః-సక్తవః. చతుర్భిరుహ్యతే చాతురం శకటమ్. చతుర్దశ్యాం దృశ్యతే చాతుర్దశం రక్షః. 'తస్య వికారః'ఇత్యతఃప్రాక్ శేషాధికారః.

అపత్యాద్యర్థములు మొదలు చతురర్థివరకును గల అర్థములకంటె భిన్నమగు అర్థమునకు శేష మని పేరు.ఆ యర్థమునందు 'అణ్'మొదలగు ప్రత్యయములు వచ్చును.

ఈ సూత్రముచే గ్రహణాద్యర్థములందు ప్రత్యయములు విధింపబడుచున్నవి. ఈ సూత్రము ఉత్తరసూత్రములలోనికి కూడ అనువర్తించుచుండును.

చాక్షుషమ్:- 'చక్షుషా గృహ్యతే'అను నర్థమునందు తృతీయాంతమును సమర్థమును అగు 'చక్షుష్'శబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి-'చాక్షుషమ్'. నేత్రముచే గ్రహింపబడెడు రూపము. శ్రావణః- (శబ్దము) శ్రవణేన గృహ్యతే. అణ్ ప్రత్యయము. ఔపనిషదః- 'ఉపనిషద్భిః ప్రతిపాద్యతే' (ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడుపరమాత్ముడు) అణ్ ప్రత్యయము వచ్చినది. దార్షదాః- దృషది పిష్టాః- (రాతిమీద నూరబడినవి). దృషచ్ఛబ్దము కంటె అణ్ ప్రత్యయము;ఆదివృద్ధి'దార్షదాః' (ప్ర. బ. వ). చాతురం:-'చతుర్భిః ఉహ్యతే'(నాలుగుఅశ్వాదులచే మోయబడెడుశకటము). 'చతుర్'శబ్దముకంటె అణ్ ప్రత్యయము. చాతుర్దశమ్:-'చతుర్దశ్యాం దృశ్యతే' (చతుర్దశియందుచూడ బడెడు రక్కసి). 'చతుర్దశీ'శబ్దముకంటెఅణ్ ప్రత్యయము. ఆదివృద్ధిఈకారలో పాదులచే రూపము సిద్ధించినది. కృష్ణచతుర్దశినాటి రాత్రి రాక్షసులుకనబడుదురని ఆగమములు చెప్పుచున్నవి.

ఈ 'శేషే'అను అధికారము 'తస్య వికారః'అను సూత్రము (1110) వరకును ఉండును.

1069. రాష్ట్రావారపారాద్ ఘఖౌ. 4.2.93

ఆభ్యాం క్రమాద్ఘఖౌ స్తః శేషే. రాష్ట్రే జాతాది రాష్ట్రియః. అవారపారీణః.

రాష్ట్రశబ్దముకంటెను,అవారపారశబ్దముకంటెను శేషార్థమునందు క్రమముగ 'ఘ' 'ఖ'ప్రత్యయములు వచ్చును.

రాష్ట్రియః- 'రాష్ట్రే జాతః' లేక'రాష్ట్రే భవః'అను నర్థమునందు రాష్ట్రశబ్దముకంటె ఘప్రత్యయము. ఘ కా ర ము న కు 'ఇయ'ఆదేశము (సూ-1013). అవారపారీణః- 'అవారపారం గతః' లేక 'అవారపారే భవః' అవారపారశబ్దముకంటె ఈ సూత్రముచే ఖప్రత్యయము. ఖకారమునకు 'ఈన్' ఆదేశము (సూ-1013)

వా. అవారపారాద్విగృహీతాదపి విపరీతాచ్చేతి వక్తవ్యమ్.

అవారీణః,పారీణః. పారావారీణః.

సూత్రమునందలి 'అవారపార'శబ్దము 'అవార'శబ్ద 'పార'శబ్దములకు ద్వంద్వసమాసము చేయుటచే నిష్పన్న మైనది. సమాసమును విభజింపగా వచ్చిన

'అవార' 'పార'శబ్దములకంటెను, ఈ శబ్దములను తారుమారు చేయగా నేర్పడిన 'పారావార'శబ్దముకంటెను గూడ ఈ ప్రత్యయము వచ్చు ననిచెప్పవలెను. ఈ వార్తికముచే ఖప్రత్యయము చేయగా 'అవారీణః' (ఈవలిఒడ్డుకుచెందినవాడు), 'పారీణః' (ఆవలిఒడ్డుకుచెందినవాడు), 'పారావారీణః' (సముద్రమునకుచెందిన వాడు) అను పదములు సిద్ధించినవి.

'రాష్ట్రావారపారాద్ఘఖౌ 'అనుసూత్రముమొదలు "విభాషాపూర్వాహ్ణాపరాహ్ణాభ్యామ్"అను సూత్రము వరకును గల సూత్రములచే రాష్ట్రాది ప్రకృతుల కంటె శేషార్థమునందు ప్రత్యయములు విధింపబడుచున్నవి. ఇవి ఏ అర్థము నందు వచ్చును, ప్రకృతికి ఏ విభక్తి అంతమునం దుండవలెను అను సందేహము కలుగును. ఈ సందేహమును నివర్తింపచేయుటకై మూలకారుడు వ్రాయుచున్నాడు:-

ఇహ ప్రకృతివిశేషాద్ఘాదయః ట్యుట్యులన్తాః ప్రత్యయాః ఉచ్యన్తే. తేషాం జాతాదయోఽర్థవిశేషాః సమర్థవిభక్తయశ్చ వక్ష్యన్తే.

పైన చూపిన విధముగ పైసూత్రములు అర్థవిశేషవిభక్తివిశేషసాకాంక్షములై యున్నవి. అట్లే 'తత్ర జాతః'మొదలగు రాబోవు సూత్రములందు జాతత్వాద్యర్థవిశేషములును, సప్తమ్యాదివిభక్తివిశేషములును చెప్పబడనున్నవి. ఆ సూత్రములలో విహితమగు ప్రత్యయ మేది, ప్రకృతి యేది అను సంశయము వచ్చును. ఈ విధముగ అర్థవిభక్తి సాపేక్షము లగు 'రాష్ట్రావారపారాద్ఘఖౌ' ఇత్యాదిసూత్రములకు ప్రత్యయాదిసాపేక్షము లగు 'తత్ర జాతః'ఇత్యాద్యుత్తర సూత్రములతో ఏకవాక్యత్వము సిద్ధించి "సప్తమ్యాద్యంతరాష్ట్రాదిశబ్దముల కంటె 'జాతః'ఇత్యాద్యర్థములందు ఘాదిప్రత్యయములు వచ్చును"అను నర్థము లభించును. రాష్ట్రాదిభిన్నము లగు ప్రకృతిశబ్దములకంటె జాతాద్యర్థములందు అణాదిసాధారణప్రత్యయములు వచ్చును.

## 1070. గ్రామాద్యఖఞౌ: 4.2.94

గ్రామ్యః. గామీణః.

సప్తమ్యంతసమర్థ గ్రామశబ్దముకంటె 'తత్ర భవః' 'తత్రజాతః' ఇత్యాద్యర్థములందు 'య' 'ఖఞ్'ప్రత్యయములు వచ్చును.

గ్రామ్యః- గ్రామే భవః జాతో వా. గ్రామశబ్దమునకు యప్రత్యయము

చేర్చగారూపముసిద్ధించినది. గ్రామీణః- పై యర్థములందు 'ఖఞ్'ప్రత్యయము. ఖకారమునకు 'ఈన్' ఆదేశము (సూ-1013).

1071. నద్యాదిభ్యో ఢక్ 4.2.97

నాదేయమ్. మాహేయమ్. వారాణసేయమ్,

సప్తమ్యంతసమర్థనద్యాదిశబ్దములకంటె 'తత్ర భవః'ఇత్యాద్యర్థములందు ఢక్ ప్రత్యయము వచ్చును,

నాదేయమ్:- 'నద్యాం భవం జాతం వా'. నదీశబ్దముకంటె ఢక్ ప్రత్యయము.'కితిచ'అను సూత్రముచే (1001) ఆదివృద్ధి. ఢకారమునకు 'ఏయ్' ఆదేశము (సూ-1013). ఈకారమునకు 'యస్యేతిచ' అను సూత్రముచే (236) లోపము. 'నాదేయమ్'అను ప్రథమైకవచనాంతరూపము సిద్ధించినది. ఇట్లే 'మహ్యాం భవం' 'వారాణస్యాం భవం'ఇత్యాద్యర్థములందు 'మహీ' 'వారాణసీ' శబ్దములకంటె ఢక్ చేయగా 'మాహేయమ్', 'వారాణసేయమ్' అను రూపములు సిద్ధించినవి.

1072. దక్షిణాపశ్చాత్పురసస్త్యక్ 4.2.98

దాక్షిణాత్యః, పాశ్చాత్యః, పౌరస్త్యః.

దక్షిణా,పశ్చాత్,పురస్,అను నవ్యయములకంటె 'తత్ర భవః' 'తత్ర జాతః'ఇత్యాద్యర్థములందు త్యక్ ప్రత్యయము వచ్చును.

'దక్షిణా భవః', 'పశ్చాత్ భవః', 'పురః భవః'ఇత్యాద్యర్థములందు ఈ పదములకంటె త్యక్ ప్రత్యయము చేసిన పిమ్మట ఆదివృద్ధ్యాదులచే 'దాక్షిణాత్యః' 'పాశ్చాత్త్యః' 'పౌరస్త్యః'అను రూపములు సిద్ధించినవి.

1073 ద్యుప్రాగపాగుదక్ప్రతీచో యత్. 4.2.101

దివ్యమ్.ప్రాచ్యమ్. అపాచ్యమ్. ఉదీచ్యమ్. ప్రతీచ్యమ్.

దివ్,ప్రాఞ్చ్,అపాఞ్చ్,ఉదఞ్చ్, ప్రత్యఞ్చ్శబ్దములకంటె 'తత్ర భవః' ఇత్యాద్యర్థములందు యత్ ప్రత్యయము వచ్చును.

దివ్యమ్:- 'దివి భవమ్'ఇత్యాద్యర్థములందు సప్తమ్యంత'దివ్'శబ్దముకంటె యత్ ప్రత్యయము. ప్రాచ్యమ్:- 'ప్రాచి ప్రదేశే భవం'ఇత్యాద్యర్థములందు 'ప్రాఞ్చ్'శబ్దముకంటె యత్ ప్రత్యయము చేసిన పిమ్మట సుబ్లోపానంతరము 'ప్రాఞ్చ్ య'అని యుండగా (ప్రపూర్వకఅఞ్చ్ధాతువునకుక్విన్ప్రత్యము

చేర్చియుండుటచేకిత్ (ప్రత్యయము పరముగానున్నదిగాన) 'అనిదితాం హల ఉప ధాయాః క్ఙితి'అను సూత్రముచే (335) నకారలోపము. 'ప్రఅచ్ య'అని యుండగా 'అచః'అనుసూత్రముచే (336) అకారలోపము-'ప్రచ్ య', "చౌ"అను సూత్రముచే (337) దీర్ఘము-'ప్రాచ్యమ్'. అపాచ్యమ్:- 'అపాచి భవం'ఇత్యాద్యర్థములందు "అపాఞ్చ్"శబ్దముకంటె ఈ సూత్రముచే 'యత్'ప్రత్యయము. ప్రక్రియపైవలెనే యుండును. ఉదీచ్యమ్:- 'ఉదీచి భవమ్'అను నర్థమునందు ఉదఞ్చ్శబ్దముకంటె యత్ప్రత్యయము. ప్రక్రియ పైవలెనే ఉండును. 'ఉద ఈత్'అను సూత్రముచే (338) ఈకారాదేశము వచ్చుట విశేషము. ప్రతీచ్యమ్:- 'ప్రతీచి భవం'ఇత్యాద్యర్థములందు యత్ ప్రత్యయము. ప్రక్రియ 'ప్రాచ్యమ్'అను పదమునందు వలె నుండును

1074. అవ్యయాత్త్యప్. 4.2.104

అమేహ-క్వ-తసి-త్రేభ్య ఏవ

**అమాత్యః, ఇహత్యః.క్వత్యః,తతస్త్యః,తత్రత్యః.**

'తత్ర భవః'ఇత్యాద్యర్థములందు అవ్యయముకంటె 'త్యప్'ప్రత్యయము వచ్చును. ఈ సూత్రముచే విహిత మగు త్యప్రత్యయము అమా,ఇహ,క్వ,అను అవ్యయములకంటెను, తసిప్రత్యయాంతావ్యయములకంటెను,త్రల్ ప్రత్యయాంతావ్యయములకంటెను మాత్రమే వచ్చును.

**అమాత్యః**:-సమీపార్థ మగు 'అమా' అను అవ్యయముకంటె 'తత్ర భవః' అను నర్థమునందు త్యప్రత్యయము. సమీపముననుండువాడు-సచివుడు - అని యర్థము. ఇట్లే 'ఇహ' మొదలగు అవ్యయములకంటె త్యప్రత్యయమును చేర్చుటచే 'ఇహత్యః' (ఇచటనున్నవాడు), 'క్వత్యః' (ఎచటనున్నవాడు) 'తతస్త్యః' (అచటివాడు) 'తత్రత్యః' (అచటనున్నవాడు) అను రూపములు సిద్ధించినవి. 'తతః' 'తత్ర' అనునవి తచ్ఛబ్దమునకు 'తసి' 'త్రల్' పత్యయములను చేర్చుటచే నిష్పన్నమైన అవ్యయములు.

వా: త్యప్ నేర్ధ్రువే ఇతి వక్తవ్యమ్.

నిత్యః.

స్థిరముగ నుండునది అను నర్థమునందు 'ని' అను అవ్యయముకంటె త్యప్రత్యయము వచ్చు నని చెప్పవలెను. ఈ వార్తికముచే 'ని'కిత్యప్రత్య

యము చేర్చగా 'నిత్యమ్'అను శబ్దము సిద్ధించినది. "నియతం భవం నిత్యమ్" అని భాష్యము.

1075. వృద్ధిర్యస్యాచామాది స్తద్వృద్ధమ్ 1.1.73.

యస్య సముదాయస్యాచాం మధ్యే ఆదిర్వృద్ధిః, తద్ వృద్ధ సంజ్ఞం స్యాత్.

ఏవర్ణ సముదాయమునకు (పదమునకు)చెందిన అచ్చులలో మొదటిది వృద్ధిసంజ్ఞకమో ఆవర్ణ సముదాయమునకు 'వృద్ధము' అని పేరు.

1076. త్యదాదీని చ.1.1.74.

వృద్ధసంజ్ఞాని స్యుః.

త్యదాది సర్వనామశబ్దములు గూడ 'వృద్ధ'సంజ్ఞము లగును.

1077. వృద్ధాచ్ఛః. 4.2.114.

శాలీయః. మాలీయః. తదీయః.

వృద్ధసంజ్ఞక మగు పదముకంటె 'తత్ర జాతః' ఇత్యాద్యర్థ ములందు ఛప్రత్యయము వచ్చును.

శాలీయః-'శాలా' శబ్దములలోని అచ్చులలో మొదటి దగు 'ఆ'కారము వృద్ధిరూప మైనది గాన 'శాలా'శబ్దమునకు పూర్వసూత్రముచే వృద్ధసంజ్ఞ లభించినది. ప్రకృతసూత్రముచే 'శాలాయాం భవః' లేక "శాలాయాం జాతః" ఇత్యార్థ ములందు ఛప్రత్యయము. ఛకారమునకు 'ఈయ్' ఆదేశము (1013)- 'శాలీయః'. ఇట్లే 'మాలీయః'. ఇట్లే త్యదాద్యంతర్గతమై పూర్వసూత్రముచే వృద్ధసంజ్ఞక మగు 'తద్' శబ్దముకంటె 'తస్య అయమ్' ఇత్యాద్యర్థములందు ఛప్రత్యయము చేయగా 'తదీయః' అను రూపముసిద్ధించినది. "భవదీయః" 'యదీయః' ఇత్యాదిరూపములు గూడ ఈ విధముగనే సిద్ధించును.

వా. వా నామధేయస్య వృద్ధసంజ్ఞా వక్తవ్యా.

దేవదత్తీయః. దైవదత్తః.

నామవాచకశబ్దముకుకు వృద్ధసంజ్ఞ వికల్పముగ చెప్పదగినది. దేవదత్త శబ్దము నామవాచకము గాన ఈ వార్తికముచే దానికి వృద్ధసంజ్ఞ లభించినది. 'దేవదత్తస్యాయమ్'అను నర్థమునందు 'వృద్ధాచ్ఛః'అను సూత్రముచే (1077)

ఛప్రత్యయము–'దేవదత్తీయః'. వృద్ధసంజ్ఞ లేని పక్షమున సామాన్యాణ్ ప్రత్యయముచే 'దైవదత్తః'అను రూపము సిద్ధించును. 'ఘటః' 'పటః'మొద లగు వాటిని గూడ నామధేయశబ్దములుగ గ్రహించుటచే 'ఘటీయః' 'పటీయః' ఇత్యాదిరూపములు సిద్ధించును

1078. గహాదిభ్యశ్చ. 4.2.138.

గహీయః.

గహాదిశబ్దములకంటె గూడ జాతాద్యర్థములందు ఛప్రత్యయము వచ్చును.

గహీయః–'గహే(దేశవిశేషే)భవః'అను నర్థమున ఈ సూత్రముచే ఛప్రత్యయము–'గహీయః'.

1079. యుష్మదస్మదోరన్యతరస్యాం ఖఞ్ చ.4.3.1

చాత్ ఛః. పక్షేఽణ్. యువయోర్యుష్మాకం వా అయం యుష్మదీయః, అస్మదీయః.

యుష్మదస్మచ్ఛబ్దములకంటె, జాతాద్యర్థములందు ఖఞ్ ప్రత్యయము కూడ వచ్చును. 'చ' శబ్దమును గ్రహించుటచే ఛప్రత్యయము సముచ్చిత మగు చున్నది. 'అన్యతరస్యామ్' గ్రహణముచే 'ఛ' 'ఖఞ్'ప్రత్యయములు రాని పక్షమున అణ్ వచ్చును.

యుష్మదీయః,–అస్మదీయః:–"యువయోః యుష్మాకం వా అయమ్" "ఆవయోః అస్మాకం వా అయమ్" అను నర్థమునందు 'యుష్మద్' అస్మద్' శబ్దములకంటె ఛప్రత్యయము. 'ఖఞ్' అణ్ ప్రత్యయములు చేర్చినపుడు కార్యవిశేషము చెప్పబడుచున్నది.

1080. తస్మిన్నణి చ యుష్మాకాస్మాకౌ. 4.3.2.

యుష్మద్అస్మదోరేతావాదేశౌ స్తఃఖఞి అణి చ. యౌష్మాకీణః, ఆస్మాకీనః, యౌష్మాకః, ఆస్మాకః.

ఆ ఖఞ్ప్రత్యయము, అణ్ప్రత్యయము పర మగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు 'యౌష్మాక' 'ఆస్మాక'అను నాదేశములు వచ్చును.

'యుష్మద్' 'అస్మద్' శబ్దములకంటె ఖఞ్ ప్రత్యయము చేసిన పిమ్మట ఈ సూత్రముచే క్రమముగ 'యుష్మాక' 'అస్మాక' ఆదేశములు–ఖకారమునకు

'ఈన్' ఆదేశము, ఆదివృద్ధి చేసిన పిమ్మట 'యౌష్మాకీణ' 'ఆస్మాకీన' అను పదములు సిద్ధించినది. 'ఛ' 'ఖఞ్' ప్రత్యయములు రాని పక్షమున అణ్ ప్రత్యయము. ప్రకృతసూత్రముచే 'యుష్మాక' 'అస్మాక' ఆదేశములు. ఆది వృద్ధి-"యౌష్మాకః" 'ఆస్మాకః'.

1081. తవకమమకావేకవచనే. 4.3.3.

ఏకార్థవాచినోర్యుష్మదస్మదోస్తవకమమకౌ స్తః ఖఞి, అణి చ. తావకీనః. తావకః. మామకీనః. మామకః.

ఏకార్థవాచకము లగు యుష్మదస్మచ్ఛబ్దములకు, 'ఖఞ్' 'అణ్' ప్రత్యయములు పర మగునపుడు 'తవక' 'మమక' అను నాదేశములు వచ్చును.

'తవ అయమ్', 'మమ అయమ్' అను నర్థమున 'ఖఞ్' 'అణ్' 'ఛ' ప్రత్యయములు. 'ఖఞ్' 'అణ్' ప్రత్యయములు పరమగునపుడు, ఏకవచనమునం దున్న యుష్మదస్మచ్ఛబ్దములకు 'తవక' 'మమక' ఆదేశములు-తావకీనః-తావకః; మామకీనః-మామకః.

ఛప్రత్యయము చేసినపుడు 'యుష్మద్ ఛ' 'అస్మద్ ఛ' అని యుండగా-

1082. ప్రత్యయోత్తరపదయోశ్చ. 7.2.98.

మపర్యన్తయోరేకార్థవాచినోః త్వమౌ స్తః ప్రత్యయే ఉత్తరపదే చ పరతః. త్వదీయః. మదీయః. త్వత్పుత్రః. మత్పుత్రః.

'త్వమావేకవచనే' అని యధికారము. "యుష్మదస్మదోరనాదేశే" నుండి 'యుష్మదస్మదోః', "మపర్యన్తస్య" అను అధికారసూత్రము అనువర్తించును. ప్రత్యయము లేక ఉత్తరపదము పర మగునపుడు ఏకార్థకము లగు (ఏకవచనము నందున్న) యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యంతభాగమునకు 'త్వ' 'మ' అను నాదేశములు వచ్చును.

ఈ సూత్రముచే త్వమాదేశములు వచ్చిన పిమ్మట ఛకారమునకు ఈ యాదేశము-'త్వదీయః' 'మదీయః' 'త్వత్పుత్రః' 'మత్పుత్రః' అనునవి ఉత్తరపదము పరముగ నున్నపుడు 'త్వ' 'మ' ఆదేశములు వచ్చుటకు ఉదాహరణములు.

1083. మధ్యాన్మః. 4.3.8.

మధ్యమః.

మధ్యశబ్దముకంటె భవార్థమునందు 'మ'అను ప్రత్యయము వచ్చును. మధ్యమః-'మధ్యే భవః'అను నర్థమునందు ఈ సూత్రముచే మప్రత్యయము రాగా రూపము సిద్ధించినది.

1084. కాలాట్ఠఞ్ 3.3.11.

కాలవాచిభ్యః ఠఞ్ స్యాత్. కాలికమ్. మాసికమ్. సాంవత్సరికమ్.

కాలవాచకశబ్దములకంటె, 'తత్ర భవః' 'తత్ర జాతః' ఇత్యాద్యర్థములందు, ఠఞ్ ప్రత్యయము వచ్చును.

కాలికమ్:-'కాలే భవం'అను నర్థమునందు కాలశబ్దముకంటె ఈసూత్రముచే ఠఞ్ ప్రత్యయము. 'ఠస్యేకః' అనుసూత్రముచే (1027) ఇకాదేశము. ఆదివృద్ధి. కాలికమ్. మాస సంవత్సర శబ్దములుగూడ కాలవాచకములు గాన ఈ సూత్రముచే ఠఞ్ప్రత్యయము-'మాసికమ్'; 'సాంవత్సరికమ్'.

వా. అవ్యయానాం భమాత్రే టిలోపః.

సాయంప్రాతికః. పౌనఃపునికః.

అవ్యయములకు భసంజ్ఞ లభించినంతమాత్రముననే టిలోపము వచ్చును. పరమగుప్రత్యయము 'డిత్' కావలె ననెడు నియమము వర్తింప దని యర్థము.

'సాయంప్రాతర్' 'పునఃపునర్'అను అవ్యయములు కాలవాచకములు గాన పై సూత్రముచే ఠఞ్ ప్రత్యయము. ఈ వార్తికముచే టిలోపము. 'సాయంప్రాతికః' (సాయంప్రాతర్భవః), 'పౌనఃపునికః' (పునః పునః భవః) అను రూపములు సిద్ధించును.

1085. ప్రావృష ఏణ్యః. 4.3.17.

ప్రావృషేణ్యః.

ప్రావృట్ఛబ్దముకంటె 'తత్ర భవః'అను నర్థమునందు 'ఏణ్య'అను ప్రత్యయము వచ్చును. ప్రావృషేణ్యః-ప్రావృషిభవః-వర్షకాలమునం దుండునది అని యర్థము.

1086. సాయంచిరంప్రాహ్ణేప్రగేఽవ్యయేభ్యష్ట్యుట్యులౌ తుట్ చ. 4.3.23.

సాయం ఇత్యాదిభ్యశ్చతుర్భ్యోఽవ్యయేభ్యశ్చ కాలవాచిభ్యః ట్యు, ట్యులౌ స్తః, తయో స్తుట్ చ. సాయన్తనమ్. చిరన్తనమ్. 'ప్రాహ్ణే

ప్రగే' అనయోరేదన్తత్వం నిపాత్యతే-ప్రాహ్ణేతనమ్; ప్రగేతనమ్. దోషాతనమ్.

'కాలాట్ఠఞ్'నుండి 'కాలాత్' అనువర్తించును. కాలవాచకములగు సాయం, చిరం, ప్రాహ్ణే, ప్రగేశబ్దములకంటెను, అవ్యయములకంటెను ట్యు, ట్యుల్ ప్రత్యయములు వచ్చును. ఆ ప్రత్యయములకు 'తుట్' ఆగమము కూడ వచ్చును.

'ట్యు', 'ట్యుల్' ప్రత్యయములలో 'యు' శేషించును. 'షో౽న్తకర్మణి' అను ధాతువునకు ఘఞ్ప్రత్యయముచేయుటచే నేర్పడిన 'సాయ'శబ్దమిచట గ్రహింపబడును దానికి దివసావసాన మని యర్థము. అవ్యయమగు సాయం శబ్దమునకు అవ్యయగ్రహణముచేతనే ఈ ప్రత్యయములు సిద్ధించును. అట్లే 'చిర' శబ్దము అవ్యయ మైనచో అవ్యయగ్రహణముచేతనే ఈ ప్రత్యయములు సిద్ధించు చున్నవి. కాన మరల సూత్రమునందు గ్రహించుటచే ఈశబ్దము అవ్యయము కాదనియు, దాని అవ్యయప్రకరణపాఠము ప్రామాదిక మనియు కొందరి అభి ప్రాయము. 'సాయ' 'చిర' శబ్దములకు ఏదంతత్వము నిపతింపబడుచున్నది.

సాయన్తనమ్:-'సాయే భవం'అను నర్థమునందు ఈ సూత్రముచే 'ట్యు' 'ట్యుల్' ప్రత్యయములు. 'యు'కు "యువోరనాకౌ"అను సూత్రముచే (788) అనాదేశము. పిమ్మట 'తుట్' ఆగమము. టిత్తు గాన ఆద్యవయవముగ వచ్చును. మాంతత్వనిపాతముచే 'సాయమ్‌తన'అని యుండగా అనుస్వారపరస వర్ణములు (సూ. 78, 79) చేయగా 'సాయన్తన'అనురూపము సిద్ధించినది. ఇట్లే 'చిరే భవం'అను నర్థమున పై విధముగ 'చిరన్తనం'అనురూపము సిద్ధించినది.

ప్రాహ్ణేతనమ్:- 'ప్రాహ్ణః సోఢో౽స్య' (ఎవనిచే పూర్వాహ్ణము సహింపబడినదో) అను 'తదస్య సోఢమ్' అను సూత్రముచే నిర్దిష్ట మగు అర్థమునందు 'ట్యు' 'ట్యుల్' ప్రత్యయములు వచ్చుటచే రూపము సిద్ధించినది. జాతార్థమందైనచో 'ఘకాలతనేషు కాలనామ్నః'అను సూత్రముచే సప్తమికిఅలుక్ వచ్చును గాన ఏదంతత్వమును నిపతింప బనిలేదు. ప్రగేతనమ్:- 'ప్రకృష్టం గచ్ఛతీతి ప్రగః-తస్మిన్ భవం'అను నర్థమునందు ట్యుప్రత్యయము, దానికి తుడాగమము చేయగా రూపము సిద్ధించినది. దోషాతనమ్:-దోషా-రాత్రౌ, భవం అనునర్థమున కాలవిశేషవాచక మగు 'దోషా'శబ్దముకంటె 'ట్యు'ప్రత్యయము చేయుటచే 'దోషాతనమ్'అను రూపము సిద్ధించినది.

### 1087. తత్ర జాతః 4.3.25.

సప్తమీ సమర్థాత్ 'జాతే' ఇత్యర్థే 'అణ్' ఆదయః 'ఘ' ఆదయశ్చ స్యుః. స్రుఘ్నే జాతః-స్రౌఘ్నః. ఉత్సే జాతః-ఔత్సః. రాష్ట్రే జాతః రాష్ట్రియః. అవారపారే జాతః అవారపారీణః ఇత్యాది.

ఇంతవరకును విధించిన అణాదిప్రత్యయములును ఘాదివిశేషప్రత్యయములును ఏయే అర్థములందు ఏవిభక్త్యంతములకు వచ్చును అను విషయమును సూత్రకారుడు చెప్పి యుండలేదు. ఇపుడా విషయమును చెప్పుచున్నాడు. ఈ విషయమును 'రాష్ట్రావారపారాద్ఘఖౌ' అను సూత్రమునందు కౌముదీకారుడు చెప్పియున్నాడు.

సమర్థమగు (కృతసంధికార్య మగు) సప్తమ్యంతముకంటె 'జాతః' అను నర్థమునందు 'అణ్' మొదలగు ప్రత్యయములును, 'ఘ' మొదలగు ప్రత్యయములును వచ్చును.

స్రౌఘ్నః:-'స్రుఘ్నే జాతః' అను నర్థమునందు సప్తమ్యంత స్రుఘ్న శబ్దముకంటె శైషిక మగు అణ్ప్రత్యయము. ఆదివృద్ధ్యాదులు-'స్రౌఘ్నః'. ఔత్సః:-'ఉత్సే జాతః' అను నర్థమునందు సప్తమ్యంత మగు ఉత్సశబ్దముకంటె 'ఉత్సాదిభ్యోఞ్' అను సూత్రము (1002)చే 'అఞ్' ప్రత్యయము.

సప్తమ్యంతము లగు 'రాష్ట్ర' 'అవారపార' శబ్దములకంటె తత్ర జాతః' అను నర్థమునందు "రాష్ట్రావారపారాద్ఘఖౌ" అను సూత్రముచే (1069) క్రమముగ 'ఘ' 'ఖ' ప్రత్యయములు వచ్చి 'రాష్ట్రియః' 'అవారపారీణః' అను రూపములు సిద్ధించినవి.

### 1088. ప్రావృషష్ఠప్ 4.3.26.

ఏణ్యాపవాదః. ప్రావృషికః.

'ప్రావృష్' శబ్దముకంటె 'తత్ర జాతః' అను నర్థమునందు 'ఠప్' ప్రత్యయము వచ్చును.

ఇది 'ప్రావృషఏణ్యః' (1085) అనుదానికి అపవాదము. అనగా ఏణ్య ప్రత్యయము 'భవః' ఇత్యాద్యర్థములందు వచ్చును; జాతార్థమునందు మాత్రము 'ఠప్' ప్రత్యయము మాత్రమే వచ్చు నని యర్థము.

ప్రావృషికః-'ప్రావృషి జాతః' అను నర్థమునందు సప్తమ్యంత మగు

ప్రావృట్ శబ్దమునకంటె ఈ సూత్రముచే 'ఠప్' ప్రత్యయము. 'ఠస్యేకః'(1027)- 'ప్రావృషికః'.

1089. ప్రాయభవః. 4.3.39.

తత్రఇత్యేవ. స్రుఘ్నే ప్రాయేణ-బాహుల్యేన భవతి స్రౌఘ్నః.

'తత్ర ప్రాయభవః' (అచట సాధారణముగా నుండెడివాడు) అను నర్థము నందు సప్తమ్యంతసమర్థశబ్దములకంటె యథాసంభవముగ అణాదిప్రత్యయము లును, ఘాదిప్రత్యయములును వచ్చును.

స్రౌఘ్నః-స్రుఘ్నే ప్రాయభవః (సాధారణముగ స్రుఘ్నదేశమునందు ఉండువాడు)అను నర్థమునందు సామాన్యసిద్ధమగు అణ్ ప్రత్యయము.

1090. సమ్భూతే. 4.3.41.

స్రుఘ్నే సమ్భవతి-స్రౌఘ్నః.

సప్తమ్యంతములగు సమర్థపదములకంటె సంభూతము-అనగా సంభావ్యము-అను నర్థమునందు అణాదిప్రత్యయములు యథావకాశముగ వచ్చును.

స్రౌఘ్నః- 'స్రుఘ్నే సమ్భవతి' (స్రుఘ్నదేశమునందు ఉండవచ్చునని సంభావ్యమైనది) అనునర్థమున శైషికాణ్ ప్రత్యయము.

1091. కోశాడ్ఢఞ్. 4.3.42.

కౌశేయమ్-వస్త్రమ్.

కోశశబ్దముకంటె వికారార్థమునందు 'ఢఞ్'ప్రత్యయము వచ్చును. కౌశేయమ్:-'కోశస్య వికారః'అను నర్థమునందు ఈ సూత్రముచే ఢఞ్ ప్రత్యయము. ఆదివృద్ధి. ఢకారమునకు 'ఏయ్'ఆదేశము (సూ. 1013) కృమికోశవికారమగు పట్టువస్త్రము. "వికారే కోశాడ్ఢఞ్"అను వార్తికమును అనుసరించి వికారార్థ మని చెప్ప బడినది.

1092. తత్ర భవః. 4.3.53.

స్రుఘ్నే భవః-స్రౌఘ్నః, ఔత్సః, రాష్ట్రియః

సప్తమ్యంత మగు సమర్థపదములకంటె 'అచట నున్నది'అను నర్థమునందు యథావకాశముగ అణాదిప్రత్యయములు వచ్చును.

స్రౌఘ్నః-'స్రుఘ్నే భవః'అను నర్థమునందు సప్తమ్యంతస్రుఘ్న శబ్దముకంటె సామాన్యవిహిత మగు అణ్ ప్రత్యయము వచ్చినది. ఇట్లే 'ఉత్సే

భవః', 'రాష్ట్రే భవః'అనునర్థమునందు "ఉత్సాదిభ్యోఽణ్" (1002) 'రాష్ట్రావారపారాద్ఘఖౌ' (1069) అను సూత్రముచే 'అణ్' 'ఘ' ప్రత్యయములు- 'ఔత్సః' 'రాష్ట్రియః'.

1093. దిగాదిభ్యో యత్. 4.3.54

దిశ్యమ్.వర్గ్యమ్.

'తత్ర భవః'అనునర్థమునందు సప్తమ్యంతము లగు'దిశ్'మొదలగుశబ్దములకంటె 'యత్' ప్రత్యయము వచ్చును.

దిశ్యమ్:- 'దిశి భవమ్'అను నర్థమునందు సప్తమ్యంతదిశ్శబ్దముకంటె 'యత్'ప్రత్యయము. వర్గ్యమ్:- 'వర్గే భవం'అను నర్థమునందు ఈ సూత్రముచే,సప్తమ్యంత'వర్గ'శబ్దముకంటె యత్ ప్రత్యయము. అకారమునకు "యస్యేతి చ"అనుసూత్రముచే (226) లోపము.

1094. శరీరావయవాచ్చ. 4.3.55

దన్త్యమ్. కణ్ఠ్యమ్.

శరీరావయవవాచకములకంటె గూడ 'తత్ర భవః'అను నర్థమునందు యత్ ప్రత్యయము వచ్చును.

'దన్తేషు భవమ్' 'కణ్ఠే భవమ్'అను నర్థములందు సప్తమ్యంతదంతకంఠ శబ్దములకంటె ఈ సూత్రముచే 'యత్'ప్రత్యయము చేయగా 'దన్త్యమ్' 'కణ్ఠ్యమ్' అను పదములు సిద్ధించినవి.

వా. అధ్యాత్మాదేష్ఠఞిష్యతే

అధ్యాత్మం భవం ఆధ్యాత్మికమ్.

'తత్ర భవః'అనునర్థమునందు అధ్యాత్మాదిశబ్దములకంటె ఠఞ్ ప్రత్యయము అంగీకరింపబడును.

ఆధ్యాత్మికమ్:- 'అధ్యాత్మం భవం'అను నర్థమున అవ్యయీభావ సమాస మగుటచే అవ్యయసంజ్ఞక మగు 'అధ్యాత్మ'శబ్దముకంటె ఠఞ్ ప్రత్యయము. ఠకారమునకు 'ఠస్యేకః'అను సూత్రముచే (1027) ఇకాదేశము. ఆదివృద్ధి-'ఆధ్యాత్మికమ్'.

1095. అనుశతికాదీనాఞ్చ. 7.3.20

ఏషాం ఉభయపదవృద్ధిర్ఞ్ణితి ణితి కితి చ. ఆధిదైవికమ్, ఆధిభౌతికమ్, ఐహలౌకికమ్. పారలౌకికమ్, ఆకృతిగణోఽయమ్.

'అచో ఞ్ణితి'నుండి 'ఞ్ణితి; 'కితిచ'నుండి 'కితి', 'మృజేర్వృద్ధిః'నుండి 'వృద్ధిః', 'ఉత్తరపదస్య' అనుసూత్రము, 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్యచ' నుండి 'పూర్వపదస్య'అనువర్తించును. అనుశతికాదిపదములకు ఞిత్, ణిత్, కిత్ లగు పదములు పర మగునపుడు పూర్వోత్తరపదములకు వృద్ధి వచ్చును.

ఆధిదైవికమ్:- 'అధిదేవం భవం' పూర్వవార్తికముచే ఠఞ్ప్రత్యయము. 'తద్ధితేష్వచామాదేః'అనుసూత్రముచే (911) ఆదివృద్ధి మాత్రమే రావలసి యుండ ఈ సూత్రముచే ఉభయపదములకును (అనగా అధి, దేవ, అను పదద్వయమునకు) వృద్ధి వచ్చినది-'ఆధిదైవికమ్', ఇట్లే "అధిభూతం భవం" 'ఇహలోకే భవం' "పరలోకే భవం"అనునర్థములందు అధిభూతాదిశబ్దములకంటె పూర్వవార్తికముచే 'ఠఞ్'ప్రత్యయము, ప్రకృతసూత్రముచే ఉభయపదవృద్ధి "ఆధిభౌతికమ్"ఇత్యాదిరూపములగును. అనుశతికాదిగణము ఆకృతిగణము. అందుచే ఈగణములోపఠితములు కాని ఉభయపదవృద్ధి వచ్చిన పదములేవైన ఉన్నచో ఈగణమునందు చేర్చుకొనవలెను.

1096. జిహ్వామూలాఙ్గులేశ్ఛః. 4.3.62

జిహ్వామూలీయమ్. అఙ్గులీయమ్.

సప్తమ్యంతసమర్థపదము లగు 'జిహ్వామూల' 'అఙ్గులి'శబ్దములకు భవార్థమునందు ఛప్రత్యయము వచ్చును. ఇది 'శరీరావయవాద్యత్'కు అపవాదము.

'జిహ్వామూలే భవమ్' 'అఙ్గుల్యాం భవమ్'అను నర్థములందు'జిహ్వామూల' 'అఙ్గులి'శబ్దములకంటె ఈ సూత్రముచే ఛప్రత్యయము. ఛకారమునకు 'ఈయ్'ఆదేశము (సూ-1013). అంత్యఅకారఇకారములకు లోపము-'జిహ్వామూలీయమ్' "అఙ్గులీయమ్".

1097. వర్గాన్తాచ్చ. 4.3.63

కవర్గీయమ్.

'వర్గ'శబ్దము అంతమునందు గల సప్తమ్యంతసమర్థపదముకంటె గూడ భవార్థమునందు ఛప్రత్యయము వచ్చును.

కవర్గీయమ్:- 'కవర్గే భవం'.ఈ సూత్రముచేఛ ప్రత్యయము. ఛకారము నకు ఈయాదేశము (సూ-1013).

1098. తత ఆగతః. 4.3.74

స్రుఘ్నాత్ ఆగతః-స్రౌఘ్నః.

అచటినుండి వచ్చినవాడు అనునర్థమునందు పంచమ్యంతసమర్థపదము కంటె అణాదిప్రత్యయములు యథావకాశముగ వచ్చును. స్రౌఘ్నః-'స్రుఘ్నాత్ ఆగతః'.ఈసూత్రముచే పంచమ్యంతస్రుఘ్నశబ్దముకంటె సామాన్యతోవిహిత మగుఅణ్ ప్రత్యయము వచ్చినది.

1099. ఠగాయస్థానేభ్యః. 4.3.75

శుల్కశాలాయాః ఆగతః-శౌల్కశాలికః.

ఆయస్థానమనగా రాబడి వచ్చెడు స్థానము. 'తతః ఆగతః'అనునర్థమున పంచమ్యంతములగు ఆయస్థానవాచకశబ్దములకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

శౌల్కశాలికః-శుల్కశాల యనగా పన్ను వసూలు చేసెడు స్థానము గాన ఇది ఆయస్థానము. 'శుల్కశాలాయాః ఆగతః'అను నర్థమునందు పంచ మ్యంత మగు శుల్కశాలాశబ్దముకంటె ఠక్ప్రత్యయము,ఆదివృద్ధి,అకారలోపము 'శౌల్కశాలికః.'

1100. విద్యాయోనిసమ్బన్ధేభ్యో వుఞ్. 4.3.77

ఔపాధ్యాయకః,పైతామహకః.

'తత ఆగతః'అను నర్థమునందు, పంచమ్యంతములగు, విద్యాసంబంధ వాచకపదములకంటెను జన్మసంబంధవాచకపదములకంటెను 'వుఞ్'ప్రత్యయము వచ్చును.

ఔపాధ్యాయకః- 'ఉపాధ్యాయాత్ ఆగతః'.విద్యాసంబంధవాచి యగు పంచమ్యంతోపాధ్యాయశబ్దముకంటె వుఞ్ప్రత్యయము. 'యువోరనాకౌ' అను సూత్రముచే (788) 'వు'కు అకాదేశము. ఆదివృద్ధి-'ఔపాధ్యాయకః'. ఇట్లే యోని సంబంధవాచక మగు పితామహశబ్దముకంటె'పితామహాదాగతః' అనునర్థమున వుఞ్ చేర్చగా "పైతామహకః"సిద్ధించినది.

1101. హేతుమనుష్యేభ్యోఽన్యతరస్యాం రూప్యః. 4.3.81

సమాత్ ఆగతం సమరూప్యమ్. పక్షే గహాదిత్వాత్ ఛః-సమీయమ్, విషమీయమ్. దేవదత్తరూప్యమ్-దైవదత్తమ్.

'తత ఆగతః'అను నర్థమునందు పంచమ్యంతము లగు హేతువాచకశబ్దములకంటెను, మనుష్యవాచకశబ్దములకంటెను వికల్పముగ రూప్యప్రత్యయము వచ్చును.

సమరూప్యమ్:- 'సమాత్ ఆగతమ్'. హేతువాచక మగు పంచమ్యంత సమశబ్దముకంటె ఈ సూత్రముచే రూప్యప్రత్యయము. రూప్యప్రత్యయము రాని పక్షమున, ఈశబ్దము గహాదిగణమునందు చేరిన దగుటచే 'గహాదిభ్యశ్చ'అను సూత్రముచే (1078) ఛప్రత్యయము వచ్చి'సమీయమ్'అను రూపము సిద్ధించును. ఇట్లే హేతువాచక మగు 'విషమ'శబ్దమునకు గూడ వైకల్పికముగ 'రూప్య'ఛప్రత్యయములను చేర్చుటచే 'విషమరూప్యమ్' 'విషమీయమ్ సిద్ధించును.

దేవదత్తరూప్యమ్:- 'దేవదత్తాత్ ఆగతమ్'అను నర్థమున మనుష్యవాచక మగు పంచమ్యంత దేవదత్తశబ్దముకంటె రూప్యప్రత్యయము-'దేవదత్తరూప్యమ్'. రూప్యప్రత్యయము రాని పక్షమున, దేవదత్తశబ్దము నామవాచకమగుటచే "వా నామధేయస్య వృద్ధసంజ్ఞా వాచ్యా"అనువార్తికముచే వైకల్పిక వృద్ధసంజ్ఞ లభించి 'వృద్ధాచ్ఛః'అను సూత్రముచే (1078) ఛప్రత్యయము రాగా 'దేవదత్తీయమ్'అనురూపము, వృద్ధసంజ్ఞాభావపక్షమున సామాన్యతో విహిత మగు అణ్ప్రత్యయముచే 'దైవదత్తమ్' అను రూపమును సిద్ధించును.

1102. మయట్ చ. 4.3.82

సమమయమ్. దేవదత్తమయమ్.

హేతుమనుష్యవాచకశబ్దములకంటె 'తత ఆగతః' అను నర్థమున 'మయట్'ప్రత్యయము కూడ వచ్చును.

సమమయమ్:- "సమాత్ ఆగతమ్"పంచమ్యంతమైన సమర్థసమశబ్దముకంటె ఈ సూత్రముచేమయ (ట్) ప్రత్యయము వచ్చినది. ఇట్లే 'దేవదత్తమయమ్.'

1103. ప్రభవతి. 4.3.83

హిమవతః ప్రభవతి హైమవతీ గఙ్గా.

'తత ఆగతః'నుండి 'తతః'అనువర్తించును. 'దానినుండి పుట్టుచున్నది' అను నర్థమునందు పంచమ్యంతమగు సమర్థపదముకంటె యథావకాశముగ అణాది ప్రత్యయములు వచ్చును.

హైమవతీ:- 'హిమవతః ప్రభవతి' (హిమవత్పర్వతమునుండి పుట్టుచున్నది) పంచమ్యంత మగు హిమవచ్ఛబ్దముకంటె అణ్ ప్రత్యయము. ఆది వృద్ధి,అకారలోపములు. స్త్రీత్వవివక్షయందు "టిడ్ఢాణఞ్-"ఇత్యాది సూత్రముచే (1250) ఙీప్ చేసిన పిమ్మట"యస్యేతిచ"అను సూత్రముచే (236) అకార లోపము ప్రథమైకవచనమున 'హైమవతీ'అను రూపము సిద్ధించినది,

1104. తద్గచ్ఛతి పథిదూతయోః. 4.3.85

స్రుఘ్నం గచ్ఛతి-స్రౌఘ్నః పన్థాః దూతో వా.

ఆ స్థానమును గూర్చి వెళ్లుచున్నాడు అను నర్థమునందు,ఆ వెళ్ళునది మార్గము గాని దూత గాని అయిన పక్షమున,ద్వితీయాంతపదముకంటె యథావకాశముగ అణాది ప్రత్యయములు వచ్చును.

స్రౌఘ్నః- 'స్రుఘ్నం గచ్ఛతి'అనునర్థమున ద్వితీయాంతశబ్దముకంటె ఈ సూత్రముచే అణ్ ప్రత్యయము-'స్రౌఘ్నః'.స్రుఘ్న దేశమునకు వెళ్ళుమార్గము లేక దూత అనియర్థము.

1105. అభినిష్క్రామతి ద్వారమ్. 4.3.86

స్రుఘ్నం అభినిష్క్రామతి స్రౌఘ్నం కాన్యకుబ్జద్వారమ్.

పై సూత్రమునుండి 'తత్' అనుపదము అనువర్తించును.దానికి అభిముఖముగ నిష్క్రమించుచున్నాడు అను నర్థమునందు,అనిష్క్రమింపబడునది ద్వారమైనచో,ద్వితీయాంత సమర్థపదముకంటె యథావకాశముగ అణాది ప్రత్యయములు వచ్చును.

స్రౌఘ్నం:- 'స్రుఘ్నం అభినిష్క్రామతి' (స్రుఘ్న దేశమును గూర్చి ఈద్వారమును దాటుచున్నాడు)అను నర్థమునందు ద్వితీయాంతమగు'స్రుఘ్న' శబ్దముకంటె అణ్ ప్రత్యయము వచ్చినది.

పూర్వము నగరముల చుట్టును పెద్ద కోట యుండెడివి. వాటికి నాలుగు మూలల ద్వారము లుండెడివి. ఏదైన మరియొక నగరమునకు పోవలె నన్నచో ఏ ద్వారముగుండా బయటకు వెళ్ళవలెనో ఆ ద్వారమునకు ఆనగరము పేరుండె

దిది. ఇచట కన్యాకుబ్జనగరపు కోటయందలి ఏద్వారమును దాటి వెళ్ళుటచే స్రుఘ్నదేశము వైపువెళ్ళవలెనో ఆద్వారమునకు స్రౌఘ్న మనిపేరు.

1106. అధికృత్య కృతే గ్రన్థే. 4.3.87

శారీరకం అధికృత్య కృతో గ్రన్థః-శారీరకీయః.

'తద్గచ్ఛతి పథిదూతయోః'నుండి 'తత్'అనువర్తించును. దానిని గూర్చి రచింపబడిన గ్రంథము అను నర్థమునందు సమర్థ మగు ద్వితీయాంత పదము కంటె యథావకాశముగ తద్ధిత ప్రత్యయములు వచ్చును.

శారీరకీయః:- శరీరస్య అయం శారీరః-శరీరమునకుసంబంధించిన జీవుడు అని యర్థము. 'తస్యేదం'అను సూత్రముచే (1109) అణ్ ప్రత్యయము చేర్చుటచే సిద్ధించినది. శారీర ఏవ శారీరకః,స్వార్థే క ప్రత్యయము. 'శారీరకం అధికృత్య కృతో గ్రంథః'-జీవుని గూర్చిరచింపబడిన గ్రంథము అను నర్థమున ఈ సూత్రముచే ద్వితీయాంత మగు 'శారీరక'శబ్దముకంటె తద్ధిత ప్రత్యయము వచ్చు నని చెప్పబడినది. 'శారీరక'శబ్దము వృద్ధసంజ్ఞకముగాన (సూ-1075) 'వృద్ధాచ్ఛః'అను సూత్రముచే (1077) ఛప్రత్యయము. ఛకారమునకు ఈయాదేశము (సూ-1013)-'శారీరకీయః'.

1107. సోఽస్య నివాసః. 4.3.89

స్రుఘ్నో నివాసోఽస్య-స్రౌఘ్నః.

'అది వీని నివాసము'అను నర్థమున ప్రథమాంతసమర్థశబ్దముకంటె యథావకాశముగ అణాదిప్రత్యయములు వచ్చును.

స్రౌఘ్నః- 'స్రుఘ్నః నివాసః అస్య'అను నర్థమున స్రుఘ్నశబ్దము కంటె అణ్ ప్రత్యయము వచ్చినది.

1108. తేన ప్రోక్తమ్. 4.3.101

పాణినినా ప్రోక్తమ్-పాణినీయమ్.

వానిచే చెప్పబడినది అను నర్థమున తృతీయాంతము లగు సమర్థశబ్దములకంటె యథావకాశముగఅణాదితద్ధిత ప్రత్యయములు వచ్చును.

పాణినీయమ్:- 'పాణినినా ప్రోక్తమ్'అను నర్థమున వృద్ధసంజ్ఞక మగు తృతీయాంతపాణినిశబ్దముకంటె'వృద్ధాచ్ఛః'అను సూత్రముచే (1077) ఛప్రత్యయము-'పాణినీయమ్'.

## 1109. తస్యేదమ్. 4.3.120

ఉపగోరిదమ్-ఔపగవమ్.

ఇతి శైషికాః.

'ఇది వానికి చెందినది'అనునర్థమునందు షష్ఠ్యంత మగు సమర్థశబ్దము కంటె యథావకాశముగ అణాదిప్రత్యయములు వచ్చును.

ఔపగవమ్:- ఉపగోః ఇదమ్-ఇది ఉపగువునకు సంబంధించినది అను నర్థమునందు శైషికఅణ్ ప్రత్యయము. 'ఓర్గుణః'అను సూత్రముచే (1005) గుణము, అవాదేశము,ఆదివృద్ధి-'ఔపగవమ్'.

పైన చూపిన విధముగ కొన్ని సూత్రములలో ప్రత్యయములు విధింపబడినవి,కొన్ని సూత్రములలో అర్థవిశేషములు చెప్పబడినవి. ఈ రెండింటికిని ఏకవాక్యత్వము చేసికొని అర్థమును చెప్పుకొనవలెను. ఉదాహరణమునకు 'తేన ప్రోక్తమ్'అనుసూత్రము (1108) వానిచేత చెప్పబడినది అను నర్థమున ప్రత్యయము వచ్చును అని చెప్పుచున్నది.ఈ యర్థమున ఏశబ్దమునకు ఏ ప్రత్యయము వచ్చునో యను విషయమును ఆశబ్దమును పట్టి నిర్ణయించుకొనవలెను. ఉదా- 'పాణినినాప్రోక్తం' (వ్యాకరణమ్) అనునర్థమున పాణినిశబ్దము వృద్ధసంజ్ఞకము గాన 'వృద్ధాచ్ఛః' అనుసూత్రముచే (1077) ఛప్రత్యయము వచ్చి 'పాణినీయమ్' అను రూపము సిద్ధించినది, 'చన్ద్రేణ కృతం'అనునర్థమునందు 'శేషే' అనుసూత్రముచే (1068) సామాన్యవిహిత మగు అణ్ ప్రత్యయము వచ్చి 'చాన్ద్రం'అను రూపము సిద్ధించినది.

కొన్ని స్థలములలో ఒకే ప్రత్యయము అనేకార్థములందు వచ్చును. ప్రకరణమును బట్టి అర్థమును చెప్పుకొనవలెను. ఉదాహరణమునకు-'స్రౌఘ్నః' అను రూపము'తత్రజాతః' (1087) "ప్రాయభవః" (1089) 'సమ్భూతే' (1090), 'తత్రభవః' (1092), 'తతఆగతః' (1098), "తద్గచ్ఛతిపథిదూతయోః" (1104) అభినిష్క్రామతిద్వారమ్ (1105) 'సోస్యనివాసః' (1107) అను ఎనిమిదిఅర్థములందు'శేషే'అను సూత్రముచే సామాన్యతో విహిత మగు అణ్ చేర్చుటచే సిద్ధించినది. ఈ విధముగ రూప మొక్కటే యైనను (1) స్రుఘ్నమునందుపుట్టినవాడు (2) సాధారణముగ స్రుఘ్నమునం దున్నవాడు (3) స్రుఘ్నమునం దుండుటకు అవకాశము కలవాడు (4) స్రుఘ్నమునందున్నవాడు

(5) స్రుఘ్నమునుండి వచ్చినవాడు (6) స్రుఘ్నమును గూర్చి వెళ్లుమార్గము లేక దూత (7) స్రుఘ్నము వైపు ద్వారమును దాటువాడు (8) స్రుఘ్నము ఈతని నివాసము అను విభిన్నార్థములువచ్చును. ఈ విధముగ ఇతరప్రత్య యార్థములను గూడ గ్రహించవలెను.

శైషికప్రకరణము సమాప్తము.

# అథ ప్రాగ్దీవ్యతీయాః

1110. తస్య వికారః. 4.3.134.

వా. అశ్మనో వికారే టిలోపో వక్తవ్యః.

అశ్మనో వికారః ఆశ్మః. భాస్మనః. మార్తికః.

దానియొక్క వికారము (వికృతి)అను నర్థమునందు షష్ఠ్యంతసమర్థ పదముకంటె అణాదిసాధారణప్రత్యయములును చెప్పబడబోవు విశేషప్రత్యయ ములును వచ్చును.

ఈ వికారాద్యర్థములు 'ప్రాగ్దీవ్యతి ఖనతి జయతి జితమ్'అను సూత్రము కంటె పూర్వమునందున్న సూత్రములలో చెప్పబడును గాన వాటికి ప్రాగ్దీవ్య తీయప్రత్యయము లని పేరు. మట్టి మొదలగునవి ఆకారాదులలో మార్పు చెంది ఘటాదిరూపమును పొందును. అట్టి మృదాదులు ప్రకృతి, ఘటాదులు వికృతి.

అశ్మన్ శబ్దముకంటె వికారార్థప్రత్యయము చేర్చినపుడు టిలోపము చెప్పవలెను.

'అశ్మనః వికారః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు అశ్మన్‌శబ్దము కంటె 'ప్రాగ్దీవ్యతో ఽణ్ అను సూత్రముచే సామాన్యతో విహిత మగు అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి-'ఆశ్మన్‌అ'అని యుండగా 'నస్తద్ధితే'అను సూత్రముచే (922) రావలసి యున్న టిలోపము 'అన్'అను సూత్రముచే (1024) నిషేధింపబడినది. అందుచే ఈ వార్తికముచే టిలోపము-'ఆశ్మః'. భాస్మనః-'భస్మనః వికారః'. అణ్‌ప్రత్యయము. 'నస్తద్ధితే'అను సూత్రముచే (922) టిలోపము రావలసియున్నను 'అన్'అను సూత్రముచే (1024) టిలో పము నిషేధింపబడుటచే 'భాస్మనః'అను రూపము సిద్ధించినది. మార్తికః-

'మృత్తికాయాః వికారః' అను నర్థమునందు షష్ఠ్యంత మగు మృత్తికాశబ్దము కంటె అణ్ ప్రత్యయము. ఆదివృద్ధి, ఆకారలోపములు (సూ. 236)-'మార్తికః'.

1111. అవయవే చ ప్రాణ్యోషధివృక్షేభ్యః 4.3.135.

చాద్వికారే. మయూరస్యావయవో వికారో వా మాయూరః. మౌర్వం కాణ్డం భస్మ వా. పైప్పలమ్.

ప్రాణి, ఓషధి, వృక్షవాచకములకంటె అవయవార్థమునందును వికారార్థమునందును అణాదిప్రత్యయములు యథాసంభవముగ వచ్చును. 'చ' అని ప్రయోగించుటచే వికారార్థమునందు గూడ వచ్చునని యర్థము లభించినది.

మాయూరః-మయూరస్య అవయవః వికారో వా అను అర్థమునందు షష్ఠ్యంత మగు ప్రాణివాచక మయూరశబ్దముకంటె సామాన్యతస్సిద్ధ మగు అణ్ ప్రత్యయము-'మాయూరః'. మౌర్వం:-మూర్వాయాః అవయవః (కాణ్డం) వికారోవా (భస్మ), మూర్వాశబ్దముకంటె అణ్ ప్రత్యయము. మూర్వాశబ్దము ఓషధి వాచకము.

పైప్పలమ్:-'పిప్పలస్య అవయవః వికారో వా'. వృక్షవాచక మగు షష్ఠ్యంతపిప్పలశబ్దముకంటె అణ్ ప్రత్యయము.

1112. మయడ్వైతయోర్భాషాయామభక్ష్యాచ్ఛాదనయోః 4.3.143.

ప్రకృతిమాత్రాత్ మయడ్వా స్యాత్ వికారావయవయోః. అశ్మమయమ్. ఆశ్మనమ్. అభక్ష్యేత్యాది కిమ్. మౌద్గః సూపః. కార్పాసం. ఆచ్ఛాదనమ్.

అవయవవికారార్థములయందు, అన్ని ప్రకృతివాచకశబ్దములకంటెను, లౌకికభాషయందు, భక్ష్యాచ్ఛాదనభిన్నార్థములందు, మయట్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

అశ్మమయమ్:-'అశ్మనః అవయవః వికారో వా'. ఈ సూత్రముచే మయట్ ప్రత్యయము. అంతర్గత మగువిభక్తి నాశ్రయించి పదత్వ ముండుటచే "న లోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) నకారలోపము-'అశ్మమయమ్' అను రూపముసిద్ధించినది. మయట్ రాని పక్షమున అణ్ ప్రత్యయము. అవయవార్థ మైనచో 'అన్' అను సూత్రముచే (1024) టిలోపము నిషేధింపబడి

నది గాన 'ఆశ్మనమ్'అను రూపము, వికారార్థమునందు "అశ్మనో వికారే టిలోపో వక్తవ్యః"అను వార్తికముచే (1110) టిలోపము వచ్చి 'ఆశ్మమ్' అను రూపము సిద్ధించును.

'అభక్ష్యాచ్ఛాదనయోః'అనుటచే భక్ష్యాచ్ఛాదనవాచకములగు 'మౌద్గః' 'కార్పాసమ్' అను పదములందు ఈ సూత్రముచే మయట్ రాలేదు. "ముద్గానాం అవయవః వికారో వా" "కర్పాస్యాః అవయవః వికారో వా"అనునర్థములందు 'ముద్గ' 'కర్పాసీ' శబ్దములకంటె 'బిల్వాదిభ్యోఽణ్'అను సూత్రముచే అణ్ ప్రత్యయము; ఆదివృద్ధి, అంత్య అకార ఈకార లోపములు (సూ. 226) 'మౌద్గః'; 'కార్పాసమ్'.

1113. *నిత్యం వృద్ధశరాదిభ్యః* 4.3.144.

ఆమ్రమయమ్. శరమయమ్.

వృద్ధసంజ్ఞకము లగు శబ్దములకంటెను, శరాదిశబ్దములకంటెను అవయవ వికారార్థములయందు నిత్యముగ మయట్ ప్రత్యయము వచ్చును.

ఆమ్రమయమ్ –ఆమ్రశబ్దమునందలి మొదటి అచ్ వృద్ధిగాన ఈ శబ్దము వృద్ధసంజ్ఞకము (సూ. 1075). అందుచే "ఆమ్రస్య అవయవః వికారో వా"అనునర్థమునందు ఈ సూత్రముచే నిత్యముగ 'మయట్'ప్రత్యయము- 'ఆమ్రమయమ్'. 'శరమయమ్':–ఈ సూత్రముచే మయట్ ప్రత్యయము.

1114. *గోశ్చ పురీషే.* 4.3.145.

గోః పురీషం గోమయమ్.

షష్ఠ్యంత మగు గోశబ్దముకంటె పురీషము అను నర్థమున మయట్ ప్రత్యయము వచ్చును.

ఈ సూత్రముచే షష్ఠ్యంతగోశబ్దముకంటె మయట్ ప్రత్యయము- 'గోమయం'.

1115. *గోపయసోర్యత్.* 4.3.160.

గవ్యమ్. పయస్యమ్.

ఇతి ప్రాగ్దీవ్యతీయాః.

షష్ఠ్యంతములగు గోశబ్దపయశ్శబ్దములకంటె అవయవవికారార్థములందు యత్ ప్రత్యయము వచ్చును.

గవ్యమ్:-'గోర్వికారః అవయవో వా'. షష్ఠ్యంతగోశబ్దముకంటె ఈ సూత్రముచే 'యత్' ప్రత్యయము. "వాన్తోయిప్రత్యయే" అను సూత్రముచే (24) 'అవ్' ఆదేశము-'గవ్యమ్'. ఇట్లే 'పయసః వికారః' అను నర్థమునందు 'పయస్' శబ్దముకంటె 'యత్' ప్రత్యయము చేర్చగా 'పయస్యమ్'.

ప్రాగ్దీవ్యతీయప్రకరణము సమాప్తము.

# అథ ఠగధికారః

1116. ప్రాగ్వహతేష్ఠక్: 4:4.1.

'తద్వహతి-' ఇత్యతః ప్రాక్ 'ఠక్' అధిక్రియతే.

'తద్వహతి రథయుగప్రాసఙ్గమ్' అను సూత్రమువరకును 'ఠక్' అనునది అనువర్తించుచుండును.

1117. తేన దీవ్యతి. ఖనతి, జయతి, జితమ్. 4.4.2.

అక్షైర్దీవ్యతి, ఖనతి, జయతి, జితం వా ఆక్షికః.

"దానితో ఆడుచున్నాడు, త్రవ్వుచున్నాడు, జయించుచున్నాడు, జయింపబడినది" అను అర్థములందు తృతీయాంతసమర్థపదముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

ఆక్షికః(కం):-"అక్షైః దీవ్యతి, ఖనతి, జయతి, జితమ్" అను నర్థమునందు తృతీయాంత మగు అక్షశబ్దముకంటె 'ఠక్' ప్రత్యయము. 'ఠస్యేకః' (1017). 'కితి చ' అను సూత్రముచే (1001) ఆదివృద్ధి-ఆక్షికః(కం). 'అక్షైః ఖనతి' అనుదానికి 'పాచికలచే ధనమును త్రవ్వి తీయుచున్నాడు' అని గౌణార్థము చెప్పవలెను.

ఖననార్థమునందు 'కుద్దాలేన ఖనతి కౌద్దాలికః' ఇత్యాద్యుదాహరణాంతరముల నీయవచ్చును.

1118. సంస్కృతమ్. 4.4.3.

దధ్నా సంస్కృతం దాధికమ్, మారీచికమ్,

'దానితో సంస్కరింపబడినది'అను నర్థమునందు తృతీయాంతసమర్థ పదముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

దాధికమ్:-'దధ్నా సంస్కృతమ్' తృతీయాంతమగు దధిశబ్దముకంటె ఠక్ప్రత్యయము. మారీచికమ్:-'మరీచికాభిః (మిరియములతో) సంస్కృతః', మరీచికాశబ్దముకంటె ఠక్ప్రత్యయము.

1119. తరతి. 4.4.5.

తేన ఇత్యేవ, ఉడుపేన తరతి. ఔడుపికః.

'దానితో దాటుచున్నాడు' అనునర్థమునందు తృతీయాంతసమర్థశబ్దము కంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

ఔడుపికః-'ఉడుపేన తరతి'-(తెప్పతో దాటుచున్నాడు). ఉడుపశబ్దము కంటె ఠక్ప్రత్యయము, ఆదివృద్ధిఇకాదేశములు.

1120. చరతి. 4.4 8

తృతీయాన్తాత్ గచ్ఛతి, భక్షయతి ఇత్యర్థయోః ఠక్స్యాత్. హస్తినా చరతి-హాస్తికః, దధ్నా చరతి-దాధికః.

చరధాతువునకు సంచరించుట భుజించుట అను రెండర్థములు గలవు. ఆ రెండర్థములను ఇచట గ్రహింపబడును. 'దానితో సంచరించుచున్నాడు' (వెళ్లు చున్నాడు); "దానితోభుజించుచున్నాడు"అను నర్థములందు తృతీయాంతములగు కరణవాచకశబ్దములకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

హాస్తికః- 'హస్తినా చరతి'(ఏనుగుపై తిరుగువాడు) అను నర్థమున 'హస్తిన్'శబ్దముకంటె ఠక్ప్రత్యయము. ఇకాదేశఆదివృద్ధులు. 'నస్తద్ధితే'అను సూత్రముచే (922) 'ఇన్'కు లోపము. దాధికః- 'దధ్నా చరతి' (పెరుగుతో భుజించుచున్నాడు) అనునర్థమునందు ఠక్ప్రత్యయము వచ్చినది

1121. సంసృష్టే. 4.4.22

దధ్నా సంసృష్టం-దాధికమ్.

'దానితో కలుపబడినది'అనునర్థమునందు తృతీయాంతసమర్థశబ్దము కంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

దాధికమ్:- 'దధ్నా సంసృష్టం' (పెరుగుతో కలుపబడినది) అనునర్థ మునఠక్ ప్రత్యయము వచ్చినది.

## 1122. ఉఞ్ఛతి. 4.4.32

బదరాణ్యుఞ్ఛతి-బాదరికః.

'తత్ప్రత్యనుపూర్వమీపలోమకూలమ్' నుండి 'తత్' అనువర్తించును. 'తత్ ఉఞ్ఛతి' (దానిని ఏరుచున్నాడు) అను నర్థమునందు ద్వితీయాంతసమర్థ పదముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

బాదరికః-'బదరాణి ఉఞ్ఛతి' (రేగుపండ్లను ఏరుచుండువాడు). ద్వితీయాంత బదరశబ్దముకంటె ఠక్ ప్రత్యయము.

## 1123. రక్షతి. 4.4.33

సమాజం రక్షతి-సామాజికః.

'దానిని రక్షించుచున్నాడు'అను నర్థమునందు ద్వితీయాంత మగు సమర్థ శబ్దముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును. సామాజికః- 'సమాజం రక్షతి'. ద్వితీయాంతసమాజశబ్దముకంటె ఠక్ ప్రత్యయమువచ్చినది.

## 1124. శబ్దదర్దురం కరోతి. 4.4.34

శబ్దం కరోతి శాబ్దికః, దర్దురం కరోతి దార్దురికః.

శబ్దమును,దర్దురమును (పెద్దదగు మృత్పాత్ర) చేయుచున్నాడు అను నర్థమునందు,ద్వితీయాంతము లగు 'శబ్ద' 'దర్దుర'పదములకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

'శబ్దం కరోతి' 'దర్దురం కరోతి'అను నర్థములందుఈ సూత్రముచే'ఠక్' ప్రత్యయము-'శాబ్దికః' 'దార్దురికః'. 'శబ్దం కరోతి'అనుదానికి ప్రకృతిప్రత్యయ విభాగపూర్వకజ్ఞానమును చూపుచున్నాడు అని యర్థము. ఈ యర్థమునందే ఠక్ ప్రత్యయము వచ్చును. అందుచే 'శబ్దం కరోతి ఖరః'ఇత్యాదులందు ఈప్రత్యయము రాదు.

## 1125. ధర్మం చరతి. 4.4.41

ధర్మం చరతి-ధార్మికః.

'ధర్మమును ఆచరించుచున్నాడు'అను నర్థమునందు ద్వితీయాంతధర్మ శబ్దముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

ధార్మికః- 'ధర్మం చరతి'. 'ఠక్'వచ్చినది.

వా. అధర్మాచ్చేతి వక్తవ్యమ్. ఆధర్మికః

'చరతి'అను నర్థమునందు ద్వితీయాంత'అధర్మ'శబ్దముకంటె గూడ ఠక్ ప్రత్యయము చెప్పదగినది.

ఆధర్మికః- 'అధర్మం చరతి', ఈ వార్తికముచే ఠక్ ప్రత్యయము.

1126. శిల్పమ్. 4.4.55

మృదఙ్గవాదనం శిల్పమస్య మార్దఙ్గికః.

'తదస్య పణ్యమ్'నుండి 'తత్', 'అస్య'అనువర్తించును. 'తత్ అస్య శిల్పమ్' 'అది వాని శిల్పము' అను నర్థమునందు ప్రథమాంతసమర్థశబ్దముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

మార్దఙ్గికః- 'మృదఙ్గం శిల్పం అస్య'. మృదఙ్గశబ్దముకంటె ఠక్ప్రత్యయము. ఆదివృద్ధిఇకారదేశములు. మృదంగశబ్దమునకు లక్షణచే మృదంగ వాదన మని యర్థము. శిల్ప మనగా క్రియాకౌశలము.

1127. ప్రహరణమ్. 4.4.57

తదస్యేత్యేవ. అసిః ప్రహరణం అస్య ఆసికః, ధానుష్కః.

'తత్ అస్య ప్రహరణమ్' (అది వీని ఆయుధము) అను నర్థమునందు ఆయుధవాచక మగు ప్రథమాంతశబ్దముకంటె ఠక్ప్రత్యయము వచ్చును.

'అసిః ప్రహరణం అస్య' "ధనుః ప్రహరణం అస్య"అను నర్థములందు 'అసి' 'ధనుష్'శబ్దముకంటె ఠక్ ప్రత్యయము-'ఆసికః', 'ధానుష్కః'. 'ధానుష్కః' అనునపుడు 'ఠస్యేకః' అనుసూత్రమును (1027) బాధించి 'ఇసుసుక్తాన్తాత్కః'అనుసూత్రముచే (1052) ఠకారమునకు 'క'ఆదేశమువచ్చినది. సకారమునకురుత్వవిసర్గములు. 'ఇణః షః'అను సూత్రముచేవిసర్గకు షకారము వచ్చినది.

1128. శీలమ్. 4.4.61

అపూపభక్షణం శీలం అస్య ఆపూపికః.

'తదస్య శీలమ్' (అది వీని స్వభావము) అను నర్థమున ప్రథమాంత మగు సమర్థశబ్దముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

ఆపూపికః- 'అపూపాః శీలం అస్య'. ఠక్ప్రత్యయము. ఇచట అపూప

శబ్దమునకు లక్షణచే అపూపభక్షణమని యర్థము. అప్పములను భక్షించుస్వభావముకలవాఁడు అని యర్థము.

1129. నికటే వసతి. 4.4.73

నైకటికో భిక్షుః. ఇతి ఠగధికారః.

'సమీపమునందు నివసించుచున్నాడు' అను నర్థమునందు సప్తమ్యంత మగు నికటశబ్దముకంటె ఠక్ ప్రత్యయము వచ్చును.

నైకటికః- 'నికటేవసతి' (గ్రామ సమీపమున నివసించువాడు) అను నర్థమునందు ఈ నికటశబ్దముకంటె ఠక్ ప్రత్యయము.

ఠగధికారము సమాప్తము.

# అథ యదధికారః

1130. ప్రాగ్ఘితాద్యత్. 4.4.75

'తస్మై హితం' ఇత్యతః ప్రాక్ 'యత్' అధిక్రియతే.

'తస్మై హితమ్' అను సూత్రము వరకును 'యత్' అనునది అనువర్తించును.

1131. తద్వహతి రథయుగప్రాసఙ్గమ్. 4.4.76

రథం వహతి రథ్యః, యుగ్యః, ప్రాసఙ్గ్యః.

రథమును, యుగమును, ప్రాసంగమును మోయుచున్నది అను నర్థమునందు ద్వితీయాంతము లగు రథ, యుగ, ప్రాసంగశబ్దములకంటె 'యత్' ప్రత్యయము వచ్చును.

రథ్యః- 'రథం వహతి' ద్వితీయాంత రథశబ్దముకంటె యత్ ప్రత్యయము. ఇట్లే 'యుగం వహతి యుగ్యః', 'ప్రాసంగం వహతి ప్రాసఙ్గ్యః' అను రూపములు సిద్ధించినవి. యుగమనగా కాడి యని యర్థము. నేర్పు గల గుఱ్ఱములను రథమునందలి కాడికి కట్టి క్రొత్త గుఱ్ఱములకు అలవాటుచేయుటకై కట్టుటకు ఆకాడికి కట్టిన మరి యొక కాడికి ప్రాసంగ మని పేరు.

1132. ధురో యడ్ఢకౌ. 4.4.77

'హలి చ'ఇతి దీర్ఘే ప్రాప్తే.

'తద్ వహతి'అను నర్థమునందు ద్వితీయాంత మగు ధుర్‌శబ్దముకంటె 'యత్' 'ఢక్'ప్రత్యయములు వచ్చును.

'ధురం వహతి'అను నర్థమునందు ధుర్‌శబ్దముకంటె ఈ సూత్రముచే యత్ ప్రత్యయము చేసిన పిమ్మట 'ధుర్ య'అని యున్నపుడు "హలి చ"అను సూత్రముచే (615) ఉపధా ఉకారమునకు దీర్ఘము రావలసియుండగా :-

1133. న భకుర్ఛురామ్. 8 2.79.

భస్య కుర్‌ఛురోశ్చ ఉపధాయా దీర్ఘో న స్యాత్. ధుర్యః, ధౌరేయః.

'ర్వోరుపధాయాదీర్ఘ ఇకః' నుండి'దీర్ఘః' అనువర్తించును.భసంజ్ఞకము యొక్కయు 'కుర్' 'ఛుర్'అనువాటియొక్కయు ఉపధకు దీర్ఘము రాదు

ఇచట 'ధుర్' అనునది భసంజ్ఞకము గాన ఈ సూత్రముచే దీర్ఘము నిషేధింపబడినది. 'ధుర్యః'అను రూపము సిద్ధించినది. ఢక్ ప్రత్యయము చేసిన పక్షమున ఆదివృద్ధి, ఢకారమునకు 'ఏయ్'ఆదేశము (సూ. 1013)-'ధౌరేయః',

1134. నౌవయోధర్మ విషమూలమూల సీతాతులాభ్యః తార్యతుల్య ప్రాప్యవధ్యానామ్య సమసమిత సంమితేషు. 4.4.91.

నావా తార్యమ్-నావ్యమ్. వయసా తుల్యః-వయస్యః. ధర్మేణ ప్రాప్యమ్-ధర్మ్యమ్. విషేణ వధ్యః విష్యః. మూలేన ఆనామ్యం మూల్యమ్. మూలేన సమఃమూల్యః. సీతయా సమితమ్-సీత్యం క్షేత్రమ్. తులయా సంమితం తుల్యమ్.

నౌ, వయస్, ధర్మ, విష, మూల, మూల, సీతా, తులాఅను ఎనిమిది తృతీయాంతశబ్దములకంటె తార్య (దాటతగినది), తుల్య (సమానమైనది), ప్రాప్య (పొందదగినది), వధ్య (చంపదగినది) ఆనామ్య (సంపాదింపదగినది), సమ (సమానమైనది) సమిత (కూర్చబడినది), సంమిత (సరితూగునది), అను ఎనిమిది అర్థములందు 'యత్'ప్రత్యయము వచ్చును.

నావ్యమ్:-'నావాతార్యమ్'. నౌశబ్దముకంటె ఈ సూత్రముచే యత్ ప్రత్యయము. 'వాన్తోయిప్రత్యయే'అను సూత్రముచే (24) ఆవాదేశము-

'నావ్యమ్'. వయస్యః- వయసా తుల్యః. వయస్సుచే సమానమైనవాడు. ధర్మ్యమ్:-ధర్మేణ ప్రాప్యమ్. ధర్మముచేత పొందతగినది. విష్యః-విషేణ వధ్యః-విషముచేత చంపదగినవాడు. మూల్యమ్:-మూలేన ఆనామ్యమ్. వస్త్రాదిది నిర్మాణమునకై వెచ్చించిన ధనమునకు మూల మనిపేరు. వస్త్రనిర్మాత ఈ విధముగ నిర్మించిన వస్త్రాదికమును కొనువానికిచ్చి వానివద్దనుండి తాను వెచ్చించిన మూలధనముకంటె అధికమగు ధనమును తీసికొనును. ఆ అధిక ధనమునకు (లాభమునకు) మూల్య మని పేరు. కాని ఇపుడు కొనువానివద్దనుండి అమ్మెడు వానికి లభించెడు ధనమున కంతకును మూల్య మను వ్యవహారము రూఢ మైనది.

మూల్యః-మూలేన సమః. మూలముతో సమానమైనది. సీత్యమ్:-సీతయా సమితమ్-నాగటి చాలుతో కూర్చబడినది. తుల్యమ్:-తులయా సంమితం. త్రాసుచే సరితూగునట్లు చేయబడినది.

1135. తత్ర సాధుః 4.4 98.

అగ్రే సాధుఃఅగ్ర్య. సామసు సాధుః సామన్యః. "యే చాభావ కర్మణోః" ఇతి ప్రకృతిభావః. కర్మణ్యః. శరణ్యః.

'దానియందు సాధువు అనగా ప్రవీణుడు'-అనునర్థమునందు సప్తమ్యంత పదముకంటె యత్ప్రత్యయము వచ్చును.

అగ్ర్యః: అగ్రే సాధుః (ముందుఉండుటయందు సమర్థుడు). అగ్ర శబ్దముకంటె యత్ప్రత్యయము 'యస్యేతిచ'అను సూత్రముచే (236) అకార లోపము-'అగ్ర్యః.సామన్యః-'సామసు సాధుః' (సామయందు ప్రవీణుడు). సప్తమ్యంతసామన్ శబ్దముకంటె యప్రత్యయము. సుబ్లోపానంతరము 'సామన్ య'అని యుండగా 'నస్తద్ధితే'అను సూత్రముచే (922) టిలోపము రావలసి యుండ 'యేచాభావకర్మణోః'అను సూత్రముచే (1023) ప్రకృతిభావము-'సామన్యః'. కర్మణ్యః-కర్మణి సాధుః-కర్మయందు ప్రవీణుడు. 'సామన్యః' వలెనే రూపము సిద్ధించును. శరణ్యః-శరణే సాధుః-శరణమునందు ప్రవీణుడు-సప్తమ్యంతశరణశబ్దముకంటె యత్ ప్రత్యయము.

1136. సభాయా యః. 4.4.105.

సభ్యః.

ఇతి యతోఽవధిః.

'అచట సాధువు' అనునర్థమునందు సభాశబ్దముకంటె య ప్రత్యయము వచ్చును.

సభ్యః. 'సభాయాం సాధుః' (సభయందుప్రవీణుడు). సప్తమ్యంత సభాశబ్దముకంటె యప్రత్యయము. "యస్యేతిచ" అను సూత్రముచే (236) ఆకారములోపము. 'య' 'యత్' ప్రత్యయములలో స్వరమునకు భేదము.

యత్ప్రత్యయాధికారప్రకరణము సమాప్తము.

# అథ ఛయతోరధికారః

### 1137. ప్రాక్ క్రీతాచ్ఛః 5.1.1.

'తేన క్రీతమ్' ఇత్యతః ప్రాక్ ఛోఽధిక్రియతే.

'తేన క్రీతమ్' అను సూత్రముకంటె పూర్వము 'ఛః' అనునది అనువర్తించును.

### 1138. ఉగవాదిభ్యో యత్ 5.1.2.

ప్రాక్క్రీతాదిత్యేవ. ఉవర్ణాన్తాత్ గవాదిభ్యశ్చ యత్ స్యాత్. ఛస్యాపవాదః. శఙ్కవే హితమ్.–శఙ్కవ్యమ్దారు. గవ్యమ్.

'తేన క్రీతమ్' అను సూత్రముకంటె (1144) పూర్వము ప్రతిపాదితము లగు అర్థములందు, ఉవర్ణాంతశబ్దములకంటెను, గో మొదలగు శబ్దముల కంటెను యత్ ప్రత్యయము వచ్చును.

ఇది ఛప్రత్యయమునకు అపవాదము. అనగా 'తేన క్రీతమ్' అను సూత్రము కంటె పూర్వము చెప్పబడిన అర్థములందు ఉకారాంతశబ్దగోశబ్దాదులకంటె యత్ప్రత్యయమే వచ్చును గాని ఛప్రత్యయము రాదు. ఇతరశబ్దములకంటె 'ప్రాక్క్రీతాచ్ఛః' అను సూత్రముచే (1337) ఛప్రత్యయము వచ్చును.

శఙ్కవ్యందారు:–'శఙ్కవే హితం' (శంకువుతయారుచేయుటకు తగినది) అనునర్థమునందు 'తస్మై హితం' అను సూత్రముచే (1139) శంకుశబ్దము కంటె ఈ సూత్రముచే అధికృత మగు (ఈశబ్దము ఉకారాంతము గాన) యత్ ప్రత్యయము వచ్చినది. 'శఙ్కు య' అని యుండగా 'ఓర్గుణః' అను సూత్రముచే (1005) ఉకారమునకు గుణము. 'వాన్తో యి ప్రత్యయే' అను సూత్రముచే (24)

అవాదేశము-'శఙ్కవ్యమ్'. గవ్యమ్:- 'గవే హితమ్'. పై వలె యత్ ప్రత్యయము,

వా. నాభి నభఞ్చ.

నభ్యః అక్షః. నభ్యంఅఞ్జనమ్.

'తస్మై హితం'అనునర్థమునందు నాభిశబ్దముకంటె 'యత్' ప్రత్యయము, 'నాభి'కి 'నభ'అను నాదేశము కూడ వచ్చును.

నభ్యః అక్షః-'నాభయే హితః'. నాభిశబ్దముకంటె ఈవార్తికముచే యత్ ప్రత్యయము, నాభిశబ్దమునకు 'నభ' ఆదేశము. 'నభ్యః'. ఇచట రథచక్ర మధ్యరంధ్రవాచక మగు నాభిశబ్దమే గ్రహింపబడును శరీరావయవవాచినాభిశబ్దము నకు 'శరీరావయవాద్యత్'అను రాబోవుసూత్రముచే (1140) యత్ ప్రత్యయము వచ్చును; నభాదేశము రాదు. రథనాభియందు అమర్చుటకు తగిన ఇరుసు అని యర్థము.

నభ్యమఞ్జనమ్ : అంజన మనగా చక్రముసులభముగ దొర్లుటకై ఇరుసువద్ద వేసెడు ఆముదము మొదలగుమసృణపదార్థము, రథనాభికి ఉపయుక్త మగు అంజనమని యర్థము.

1139. తస్మై హితమ్. 5.1.5.

వత్సేభ్యో హితః వత్సీయః, గోధుక్.

'దానికొరకు హిత మైనది'అను నర్థమునందు చతుర్థ్యంతసమర్థశబ్దము కంటె ఛప్రత్యయము వచ్చును.

వత్సీయః-'వత్సేభ్యః హితః'-లేగదూడలకు హితకరుడైనవాడు (పాలు పిదుకువాడు)-అనునర్థమున చతుర్థ్యంతవత్సశబ్దముకంటె ఛప్రత్యయము. ఛ కారమునకు ఈయ్ ఆదేశము (1013); అంత్యాకారమునకు 'యస్యేతిచ' అను సూత్రముచే (236) లోపము.

1140. శరీరావయవాద్యత్ 5.1.6

దన్త్యమ్. కణ్ఠ్యమ్. నస్యమ్.

'తస్మై హితం'అను నర్థమునందు శరీరావయవవాచక మగు చతుర్థ్యంత సమర్థపదముకంటె యత్ ప్రత్యయము వచ్చును.

దన్త్యమ్:- 'దన్తేభ్యో హితం'. ఈసూత్రముచేయత్ప్రత్యయము. ఇట్లే 'కణ్ఠాయ హితమ్-కణ్ఠ్యమ్'అను రూపము సిద్ధించినది. నస్యమ్:- 'నాసికాయై హితం'. యత్ప్రత్యయము. 'పద్దన్నోమాస్....'ఇత్యాదిసూత్రముచే (6.1.63) నాసికాశబ్దమునకు 'నస్'ఆదేశము-'నస్యమ్'. ఈ దన్తాదిశబ్దముల కంటె 'శరీరావయవాచ్చ'అను సూత్రముచే (1094) 'తత్ర భవః'అనునర్థము నందు కూడ యత్ప్రత్యయము విధింపబడి యున్నది. అపుడు కూడ 'దన్త్యం' ఇత్యాదిరూపములు సిద్ధించును. అర్థమునందు మాత్రము భేదముండును.

1141. ఆత్మన్విశ్వజనభోగోత్తరపదాత్ ఖః 5.1.9

'తస్మై హితమ్'అనునర్థమునందు చతుర్థ్యంతములగుఆత్మ. విశ్వజన శబ్దములకంటెను, భోగశబ్దముఉత్తరపదముగా గల 'మాతృభోగ'మొదలగు శబ్దములకంటెను ఖప్రత్యయము వచ్చును.

'ఆత్మనే హితం'అనునర్థమునందు ఆత్మన్శబ్దముకంటె ఈ సూత్రముచే ఖప్రత్యయము. ఖకారమునకు'ఈన్'ఆదేశము (సూ-1013)- 'ఆత్మన్ఈన' అనియుండగా 'నస్తద్ధితే'అనుసూత్రముచే (922) టిలోపము రావలసి యుండగా:-

1142. ఆత్మాధ్వానౌ ఖే. 6.4.169

ఏతౌ ఖే ప్రకృత్యా స్తః. ఆత్మనే హితం ఆత్మనీనమ్. విశ్వజనీనమ్. 'మాతృభోగీణః'.

ఇతి ఛయతోః పూర్ణోఽవధిః.

'ప్రకృత్యైకాచ్'మండి 'ప్రకృత్యా'అమవర్తించును. ఖప్రత్యయము పరమగునపుడు 'ఆత్మన్'అధ్వన్'శబ్దములు ప్రకృతిభావముతో నుండును.

ఈ సూత్రముచే టిలోపము నిషిద్ధము గాన 'ఆత్మనీనమ్'అను రూపము సిద్ధించినది. విశ్వజనీనమ్:- 'విశ్వజనాయ హితం', ఈ సూత్రముచే ఖప్రత్యయము. మాతృభోగీణః- 'మాతృభోగాయ హితః', భోగోత్తరపద మగు 'మాతృభోగ'శబ్దముకంటె ఖప్రత్యయము, 'కుమతిచ' 8.4.13 అను సూత్రముచే ణత్వము.

ఛయదధికారము సమాప్తము.

# అథ ఠఞధికారః

## 1143. ప్రాగ్వతేష్ఠఞ్. 5.1.18

'తేన తుల్యం'ఇతి వతిం వక్ష్యతి,తతః ప్రాక్ 'ఠఞ్'అధిక్రియతే.

'తేన తుల్యం క్రియాచేద్వతిః'అను సూత్రమువరకును 'ఠఞ్'అనునది అనువర్తించును.

## 1144. తేన క్రీతమ్. 5.1.37

సప్తత్యా క్రీతం సాప్తతికమ్. ప్రాస్థికమ్.

'దానిచేత కొనబడినది' అను నర్థమునందు తృతీయాంత మగు సమర్థ పదముకంటె ఠఞ్ ప్రత్యయము వచ్చును.

సాప్తతికమ్:- 'సప్తత్యా క్రీతం' (డెబ్బదిచే కొనబడినది) అను నర్థమునందు తృతీయాంత మగు సప్తతిశబ్దముకంటె ఠఞ్ ప్రత్యయము. 'ఠస్యేకః' (1027), ఆదివృద్ధి, ఇకారలోపము (సూ-236)-'సాప్తతికమ్'.ఇట్లేప్రస్థేన (కుంచెడుధాన్యముచే.) క్రీతమ్ 'ప్రాస్థికమ్'అను రూపము సిద్ధించినది.

## 1145. తస్యేశ్వరః. 5.1.42

సర్వభూమిపృథివీభ్యాం అణఞౌ స్తః.

'సర్వభూమిపృథివీభ్యామణఞౌ'అను సూత్రమనువర్తించును. 'తస్య ఈశ్వరః' (దానికి ప్రభువు)అను నర్థమునందు 'సర్వభూమి' 'పృథివీ'శబ్దముల కంటె క్రమముగ 'అణ్' 'అఞ్' ప్రత్యయములు వచ్చును.

'సర్వభూమేః ఈశ్వరః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు 'సర్వభూమి' శబ్దముకంటె ఈ సూత్రముచే 'అణ్'ప్రత్యయము - 'సర్వభూమి అ'అని యుండగా:-

## 1146. అనుశతికాదీనాఞ్చ. 7.3.20

ఏషాం ఉభయపదవృద్ధిః ఞితి,ణితి,కితి చ తద్ధితే. సర్వభూమే రీశ్వరః-సార్వభౌమః,పార్థివః.

ఈ సూత్రము శైషికప్రకరణమునందువ్యాఖ్యానింపబడినది.(సూ-1095). ఈ సూత్రముచే ఉభయపదవృద్ధి చేయగా 'సార్వభౌమః'అను రూపము సిద్ధిం

చినది. పార్థివః- 'పృథివ్యాః ఈశ్వరః'అనునర్థమున ఈ సూత్రముచే అఞ్ ప్రత్యయము, 'అణ్' 'అఞ్'లకు స్వరభేదము ప్రయోజనము.

1147. పఙ్క్తి,వింశతి,త్రింశచ్చత్వారింశత్,పఞ్చాశత్,
షష్టి, సప్తత్యశీతి,నవతి,శతమ్. 5.1.59

ఏతే రూఢిశబ్దా నిపాత్యన్తే.

'తదస్య పరిమాణం' (అది దీని ప్రమాణము) అనునర్థమునందు 'పఙ్క్తి'మొదలగు రూఢార్థకములగు శబ్దములు నిపతింపబడుచున్నవి.

పఙ్క్తిః- "పఞ్చ పాదాః ప్రమాణం అస్య (ఛందసః)"అను నర్థమునందు పఞ్చన్‌శబ్దము కంటె 'తి'ప్రత్యయము. టిలోపము;చకారమునకు కుత్వము,అనుస్వారపరసవర్ణములు-'పఙ్క్తిః'. ఐదుపాదములుగల ఛందోవిశేషమునందు రూఢము.

వింశతిః- దశానాం వర్గః దశత్- పదింటియొక్క సముదాయము. 'పఞ్చద్దశతౌ వర్గే వా'అను సూత్రముచే వర్గార్థమునందు'దశత్'ఆదేశము. 'ద్వౌ దశతౌ పరిమాణమస్య సంఘస్యేతి వింశతిః.'ద్విదశత్'శబ్దముకంటె పరిమాణార్థమునందు 'శతిచ్'ప్రత్యయము, 'ద్విదశత్'అను ప్రకృతికి'విన్'ఆదేశము;నకారమునకు అనుస్వారము-'వింశతిః'అను రూపము సిద్ధించును.'రెండు పదుల ప్రమాణము గల సంఘము'అని యర్థము. ఈ పదములు సంఘాతార్థములగుటచే 'గవాం వింశతిః' 'మనుష్యాణాం త్రింశతిః'ఇత్యాదివిధముగ ప్రయోగింపవలెను. సంఘసంఘులకు అభేదము వివక్ష చేసిన పక్షమున 'వింశతిః గావః' 'త్రింశతిః మనుష్యాః'ఇత్యాదివిధముగ గూడ ప్రయోగింపవచ్చును. వింశత్యాదిశబ్దములు స్త్రీలింగైకవచనమున ప్రయోగింపబడును.

త్రింశత్:- త్రయో దశతః ప్రమాణమస్య సంఘస్య త్రింశత్. 'శత్' ప్రత్యయము,ప్రకృతికి త్రిన్ భావము.

చత్వారింశత్:- చత్వారః దశతః ప్రమాణం అస్య సంఘస్య చత్వారింశత్. శత్ప్రత్యయము, ప్రకృతికి'చత్వారిన్'భావము.

పఞ్చాశత్:- పఞ్చ దశతః ప్రమాణమస్య సంఘస్య పఞ్చాశత్. శత్ ప్రత్యయము,ప్రకృతికి పఞ్చాదేశము.

షష్టిః- షట్ దశతః ప్రమాణం అస్య సంఘస్య షష్టిః.'తి'ప్రత్యయము, ప్రకృతికి 'షష్' భావము,జ.శ్త్వాభావము నిపతింపబడినవి.

సప్తతిః- సప్త దశతః ప్రమాణమస్య సంఘస్య సప్తతిః.'తి'ప్రత్యయము,ప్రకృతికి సప్తాదేశము.

అశీతిః- అష్టౌ దశతః ప్రమాణమస్య సంఘస్య అశీతిః. 'తి'ప్రత్యయము, ప్రకృతికి 'అశీ'భావము.

నవతిః- నవ దశతః ప్రమాణమస్య సంఘస్య నవతిః, తిప్రత్యయము, ప్రకృతికి నవాదేశము.

శతమ్:- దశ దశతః పరిమాణమస్య శతమ్. 'త'ప్రత్యయము,ప్రకృతికి శాదేశము. భాష్యకారు లీ విధముగవ్యుత్పత్తి చూపి చివరకు ఈపదము లన్నియు అవ్యుత్పన్నము లని చెప్పి యున్నారు.

## 1148. తదర్హతి. 5.1.63

'లబ్ధుం యోగ్యో భవతి' ఇత్యర్థే ద్వితీయాన్తాత్ ఠఞాదయః స్యుః. శ్వేతచ్ఛత్రం అర్హతి శ్వైతచ్ఛత్రికః.

'దానిని పొందుటకు యోగ్యుడై యున్నాడు'అను నర్థమునందు ద్వితీయాంతసమర్థపదములకంటె ఠఞ్ మొదలగు ప్రత్యయములు వచ్చును.

శ్వైతచ్ఛత్రికః- 'శ్వేతచ్ఛత్రం అర్హతి' (శ్వేతచ్ఛత్రమునుపొందుటకు అర్హుడై యున్నాడు)అను నర్థమునందు ఠఞ్ ప్రత్యయము ఆదివృద్ధి, ఇకాదేశ,అకారలోపములు.

## 1149. దణ్డాదిభ్యో యత్. 5.1.66

ద్వితీయాంతేభ్య ఏభ్యోయత్ స్యాత్. దణ్డం అర్హతి దణ్డ్యః, అర్ఘ్యః,వధ్యః.

దండాదిశబ్దములకంటె, 'తదర్హతి'అను నర్థమునందు యత్ ప్రత్యయము వచ్చును.

'దండం అర్హతి' "అర్ఘం (పూజాం మూల్యం వా) అర్హతి" "వధం అర్హతి"అనునర్థములందు ద్వితీయాంతదండాదిశబ్దములకంటె యత్ ప్రత్యయము వచ్చి రూపములు సిద్ధించినవి. శిక్షకు తగినవాడు, పూజకు తగినవాడు, వధకు తగినవాడు అని యర్థములు.

1150. తేన నిర్వృత్తమ్. 5.1.79

అహ్నా నిర్వృత్తమ్-ఆహ్నికమ్.

ఇతి ఠఞోఽవధిః.

'కాలాత్'అని అధికారము. "దానిచే నిర్వృత్త మైనది (సిద్ధించినది)" అను నర్థమునందు కరణతృతీయాంతకాలవాచకశబ్దముకంటె 'ఠఞ్' ప్రత్యయము వచ్చును.

ఆహ్నికమ్:- 'అహ్నా నిర్వృత్తం'-ఒక రోజుచేజరిగిన (పని)-అను నర్థమునందు తృతీయాంతఅహన్ శబ్దముకంటె ఠఞ్ ప్రత్యయము. 'ఠస్యేకః' (1027). సుబ్లుక్ చేసిన పిమ్మట "అహన్ ఇక"అని యుండగా 'అల్లోపోఽనః' అను సూత్రముచే (212) 'అన్'లోనిఅకారమునకు లోపము. ఆదివృద్ధి-'ఆహ్నికమ్'- 'న స్తద్ధితే'అను సూత్రముచే (922) టిలోపము రావలసి యుండెను గాని 'అహ్నష్టఖోరేవ'అను నియమసూత్రముచే రాలేదు.

ఠఞధికారము సమాప్తము.

# అథ భావకర్మార్థాః.

1151. తేన తుల్యం క్రియాచేద్వతిః. 5.1.115.

బ్రాహ్మణేన తుల్యం-బ్రాహ్మణవత్ అధీతే. క్రియాచేదితికిమ్-గుణతుల్యే మా భూత్. పుత్రేణ తుల్యః స్థూలః.

దానితో సమానమైనది అను నర్థమునందు, ఆ తుల్యమైనది క్రియ యైన పక్షమున, తృతీయాంతసమర్థశబ్దముకంటె 'వతి'ప్రత్యయము వచ్చును. 'వతి' లోని ఇకారము ఇత్సంజ్ఞకము.

బ్రాహ్మణవత్:-'బ్రాహ్మణేన తుల్యం' (బ్రాహ్మణునితో సమానముగా) (చదువుచున్నాడు) అను నర్థమునందు తృతీయాంత మగు బ్రాహ్మణ శబ్దముకంటె వతి ప్రత్యయము. ఇచట అధ్యయనక్రియ యందు తుల్యత్వము చెప్పబడినది గాన వతి ప్రత్యయము వచ్చినది.

తుల్య మైనది క్రియ యై ఉండవలె నని చెప్పుటచే "పుత్రేణ తుల్యః స్థూలః" ఇత్యాదిప్రయోగములందు తుల్యత్వము స్థూలత్వరూప మగు గుణము విషయమునందు చెప్పఁబడినది గాన 'పుత్రేణ'అను తృతీయాంతముకంటె వతి ప్రత్యయము రాలేదు.

1152. తత్ర తస్యేవ. 5.1.116.

మథురాయామివ-మథురావత్స్రుఘ్నే ప్రాకారః. చైత్రస్యేవ చైత్రవత్ మైత్రస్య గావః.

'తత్ర ఇవ' (అచట వలె) 'తస్య' ఇవ' (దానికి సంబంధించినదాని వలె)అనునర్థములందు సప్తమ్యంత, షష్ఠ్యంతసమర్థపదములకంటె వతిప్రత్యయము వచ్చును.

మథురావత్:-'మథురాయాం ఇవ' (మథురయందు వలె). సప్తమ్యంత మథురాశబ్దముకంటె వతిప్రత్యయము. 'స్రుఘ్నమునందలి ప్రాకారము మథుర యందు వలె నున్నది'అని వాక్యమున కర్థము.

చైత్రవత్:-'చైత్రస్య ఇవ' (చైత్రునియొక్క వలె). షష్ఠ్యంతచైత్ర శబ్దముకంటె వతిప్రత్యయము. 'మైత్రుని గోవులు చైత్రుని గోవుల వలె నున్నవి'అని వాక్యమున కర్థము.

1153. తస్య భావ స్త్వతలౌ. 5.1.119.

ప్రకృతిజన్యబోధే ప్రకారో భావః. గోర్భావః గోత్వమ్; గోతా. (లిం. సూ,) త్వాన్తం క్లీబమ్. (లిం. సూ). తలన్తం స్త్రియామ్.

'తస్య భావః'వాని యొక్క భావము (ధర్మము) అను నర్థమునందు షష్ఠ్యంతశబ్దముకంటె 'త్వ' 'తల్'ప్రత్యయములు వచ్చును.

ప్రత్యయములు ఏశబ్దములకు చేర్చబడునో ఆ శబ్దములకు 'ప్రకృతి' యని పేరు. ఇచట 'త్వ', 'తల్', ప్రత్యయములు గోశబ్దాదులకు చేర్చబడు చున్నవి గాన ఆ శబ్దములు ప్రకృతిశబ్దములు. 'గో'శబ్దము గోత్వజాతివిశిష్ట మగు గోవ్యక్తిని బోధించును. అట్లే 'ఘట'శబ్దము ఘటత్వజాతివిశిష్ట మగు ఘటమును బోధించును. ఈ విధముగ గోరూపవ్యక్తియందు గోత్వము, ఘట రూపవ్యక్తియందు ఘటత్వము, విశేషణముగ భాసించుచుండు నని శాస్త్ర ప్రక్రియ. ఈ విశేషణమునకే ప్రకార మని నామాంతరము. ఈ విధముగ గోప

దాదిజన్యగవాదివ్యక్తిబోధమునందు ప్రకార మగు గోత్వాదు.కు భావ మని పేరు.
ఈ భావార్థమునందు 'త్వ' 'తల్' ప్రత్యయములు వచ్చు నని యర్థము.

గోత్వమ్:-'గోః భావః'అను నర్థమునందు షష్ఠ్యంతగోశబ్దముకంటె 'త్వ'ప్రత్యయము-'గోత్వమ్'. 'త్వ'ప్రత్యయాంతము నపుంసకలింగమునం దుండును. ఈనియమము ననుసరించి 'గోత్వ'శబ్దము నపుంసకలింగము.

గోతా:-పై యర్థమున 'తల్'ప్రత్యయము చేయగా 'గోత'అను ప్రాతిపదికము సిద్ధించినది. "తల్ప్రత్యయాంతము స్త్రీలింగమునం దుండును"అను నియమము ననుసరించి ఈ శబ్దము స్త్రీలింగము గాన 'టాప్'అను స్త్రీప్రత్యయము చేర్చగా 'గోతా'అను రూపము సిద్ధించినది.

## 1154. ఆ చ త్వాత్. 5.1.120.

'బ్రహ్మణ స్త్వః' ఇత్యతః ప్రాక్ త్వతలౌ అధిక్రియేతే. అపవాదైస్సహ సమావేశార్థమిదమ్. చకారః నఞ్స్నఞ్భ్యామపి సమావేశార్థః. స్త్రియాః భావః-స్త్రైణమ్; స్త్రీత్వమ్; స్త్రీతా. పౌంస్నమ్. పుంస్త్వమ్. పుంస్తా.

'బ్రహ్మణ స్త్వః'అను సూత్రమువరకును 'త్వ' 'తల్'ప్రత్యయములు అనువర్తించును.

పూర్వసూత్రమునుండియే 'త్వ' 'తల్'ప్రత్యయములు ఉత్తరసూత్రములోనికి అనువర్తించుచున్నవి. ఐనను, "పృథ్వాదిభ్య ఇమనిజ్వా" ఇత్యాది అపవాదసూత్రములచే విహితము లగు ప్రత్యయములతో పాటు ఈ ప్రత్యయములు గూడ వచ్చుటకై ఈ సూత్రము చెప్పబడినది. అనగా ఆ అపవాదప్రత్యయములు ఐనను, ఈత్వతల్ప్రత్యయములును గూడ భావార్థమునందు వచ్చు నని యర్థము. ఈ సూత్రమునందలి చకారముచే 'స్త్రీ', 'పుంస్'శబ్దములకంటె "స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్"అను సూత్రముచే(1003)విహితము లగు 'నఞ్' 'స్నఞ్' ప్రత్యయములుభావార్థమునందు కూడ వచ్చు నని సూచిత మగుచున్నది. ఈ విధముగ స్త్రీశబ్దముకంటె భావార్థమునందు'నఞ్''త్వ' 'తల్'ప్రత్యయములు వచ్చుటచే 'స్త్రైణమ్' 'స్త్రీత్వమ్' 'స్త్రీతా'అను రూపములు సిద్ధించును. 'పుంస్'శబ్దముకంటె భావార్థమునందు 'స్నఞ్' 'త్వ' 'తల్'ప్రత్యయములు చేయుటచే 'పౌంస్నమ్' పుంస్త్వమ్' 'పుంస్తా'అను రూపములు సిద్ధించును.

1155. పృథ్వాదిభ్య ఇమనిజ్వా. 5.1.122.

వా వచనం అణాది సమావేశార్థమ్.

పృథ్వాదిశబ్దములకంటె భావార్థమునందు 'ఇమనిచ్' ప్రత్యయము వికల్పముగ వచ్చును.

'వా' అని చెప్పుటచే 'ఇమనిచ్' రాని పక్షమున 'అణ్' మొద లగు ప్రత్యయములు వచ్చుటకు అవకాశము చూపబడినది.

1156. ర ఋతో హలాదేర్లఘోః. 6.4.161.

హలాదేర్లఘోః ఋకారస్య రః స్యాత్ ఇష్ఠేమేయస్సు పరతః.

'తురిష్ఠేమేయస్సు' నుండి 'ఇష్ఠేమేయస్సు' అనువర్తించును. హలాద్యంగమునకు సంబంధించిన ఋకారమునకు, ఇష్ఠన్, ఇమన్, 'ఈయస్' ప్రత్యయములు పరమగునపుడు 'ర' అనునది ఆదేశముగ వచ్చును. 'ఇమనిచ్'లో 'ఇమన్' శేషించును. 'పృథు ఇమన్' అని యుండగా ఈ సూత్రముచే ఋకారమునకు 'ర' ఆదేశము 'ప్రథు ఇమన్' అని యుండగా :-

1157. టేః. 6.4.155.

భస్య టేర్లోపః ఇష్ఠేమేయస్సు.

'తురిష్ఠేమేయస్సు' నుండి 'ఇష్ఠేమేయస్సు', 'అల్లోపోఽనః' నుండి 'లోపః' అనువర్తించును.

'ఇష్ఠన్' 'ఇమన్' 'ఈయస్' అను ప్రత్యయములు పర మగునపుడు భసంజ్ఞక మగుదాని టికి లోపము వచ్చును.

ఈ సూత్రముచే 'ప్రథు' అను దానిలోని ఉకారమునకు లోపము. 'ప్రథిమన్' అను ప్రాతిపదికము సిద్ధించినది. 'ప్రథిమా' అను నది ప్రథమైక వచనరూపము.

వా. పృథు, మృదు, భృశ, కృశ, దృఢ, పరివృఢానామేవ రత్వమ్.

పృథోర్భావః ప్రథిమా-పార్థవమ్. మ్రదిమా, మార్దవమ్.

పూర్వసూత్రముచే (1156) విహిత మగు రత్వము పృథు, మృదు, భృశ, కృశ, దృఢ, పరివృఢశబ్దములకు మాత్రమే వచ్చును.

పార్థవమ్:- పృథుశబ్దముకంటె భావార్థమునందు ఇమనిచ్ ప్రత్యయము రాని పక్షమున 'ఇగన్తాచ్చలఘుపూర్వాత్' అను సూత్రముచే అణ్ ప్రత్యయము.

ఆదివృద్ధి, 'ఓర్గుణః'అను సూత్రముచే (1005) ఉకారమునకు గుణమువాదేశము-'పార్థవమ్'. ఈ విధముగనే 'మృదోః భావః'అనునర్థమున 'మ్రదిమా' 'మార్దవమ్'అను రూపములు సిద్ధించినవి. 'ఆ చ త్వాత్'అను సూత్రము (1154) ననుసరించి సామాన్యతో విహితము లగు 'త్వ' 'తల్'ప్రత్యయములు వచ్చి 'పృథుత్వం' 'పృథుతా' 'మృదుత్వమ్' 'మృదుతా'అను రూపములు కూడ సిద్ధించును.

1158. *వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ చ.* 5.1.123

చాత్ ఇమనిచ్ శౌక్ల్యమ్-శుక్లిమా. దార్ఢ్యమ్-ద్రఢిమా.

షష్ఠ్యంతము లగు వర్ణవాచకశబ్దములకంటెను, దృఢాదిశబ్దములకంటెను 'ష్యఞ్'ప్రత్యయము కూడ వచ్చును. 'చ' అనుటచే 'ఇమనిచ్' కూడ వచ్చును.

శౌక్ల్యమ్-శుక్లిమా:- 'శుక్లస్య భావః'.వర్ణవాచక మగు షష్ఠ్యంత శుక్లశబ్దముకంటె ష్యఞ్ (య) ప్రత్యయము. ఆదివృద్ధి, అంత్యాకారలోపములు. 'ష్యఞ్' రాని పక్షమున 'ఇమనిచ్'ప్రత్యయమువచ్చి'శుక్లిమా'అను రూపము సిద్ధించినది. దార్ఢ్యమ్-ద్రఢిమా:- 'దృఢస్య భావః'ష్యఞ్ ప్రత్యయము వచ్చిన పక్షమున 'దార్ఢ్యమ్'అను రూపము, 'ష్యఞ్ రాని పక్షమున 'ఇమనిచ్'ప్రత్యయము చేయగా ఋకారమునకు రత్వము వచ్చి (సూ-1156) 'ద్రఢిమా'అను రూపమును సిద్ధించును.

1159. *గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చ.* 5.1.127

చాద్ భావే.జడస్య భావః కర్మ వా జాడ్యమ్. మూఢస్య భావః కర్మ వా మౌఢ్యమ్. బ్రాహ్మణ్యమ్. ఆకృతిగణోఽయమ్.

షష్ఠ్యంత ములగు గుణవాచకశబ్దములకంటెను, బ్రాహ్మణాదిశబ్దములకంటెను. కర్మయనునర్థమందును భావార్థమందును గూడ'ష్యఞ్' ప్రత్యయము వచ్చును. 'భావార్థమునందు'అనునది 'చ' అను పదమును ప్రయోగించుటచే లభించినది.

జాడ్యమ్:- గుణవాచక మగు షష్ఠ్యంతజడశబ్దముకంటె "జడస్య కర్మ భావో వా"అను నర్థమునందు ఈ సూత్రముచే 'ష్యఞ్'ప్రత్యయము వచ్చి రూపము సిద్ధించినది, ఇట్లే 'మూఢస్య కర్మ భావో వా మౌఢ్యమ్' "బ్రాహ్మ

ణస్య కర్మ భావో వా బ్రాహ్మణ్యమ్''అను రూపములు సిద్ధించినవి. బ్రాహ్మణా దిగణము ఆకృతిగణము.

1160. సఖ్యుర్యః 5.1.126

సఖ్యుర్భావః కర్మ వా సఖ్యమ్.

షష్ఠ్యంత మగు సమర్థ'సఖి'శబ్దముకంటె 'కర్మ' లేక 'భావము' అను నర్థమునందు యప్రత్యయము వచ్చును,

సఖ్యమ్:- 'సఖి'శబ్దముకంటె 'య'ప్రత్యయము చేసిన పిమ్మట 'యస్యేతి చ'అను సూత్రముచే (236) ఇకారమునకు లోపము వచ్చి రూపము సిద్ధించినది.

కపిజ్ఞాత్యోర్ఢక్. 5.1.127

కాపేయమ్, జ్ఞాతేయమ్.

షష్ఠ్యంతము అగు 'కపి' 'జ్ఞాతి'శబ్దములకు, 'కర్మ'లేక 'భావము'అను నర్థమునందు 'ఢక్'ప్రత్యయము వచ్చును.

కాపేయమ్:- 'కపేః కర్మ భావో వా'.'కపి'శబ్దముకంటె 'ఢక్'ప్రత్యయము. ఆదివృద్ధి;ఢకారమునకు"ఏయ్" ఆదేశము (సూ-1013) ఇకారలోపము (సూ-236) 'కాపేయమ్' ఇట్లే 'జ్ఞాతేః కర్మ భావో వా జ్ఞాతేయమ్'అను రూపము సిద్ధించినది.

1162. పత్యన్తపురోహితాదిభ్యో యక్. 5.1.128

సైనాపత్యమ్. పౌరోహిత్యమ్.

ఇతి భావకర్మార్థాః

పతిశబ్దము అంతమునందు గల షష్ఠ్యంతశబ్దములకంటెను, షష్ఠ్యంత పురోహితాదిశబ్దములకంటెను భావార్థమునందు గాని కర్మార్థమునందు గాని 'యక్' ప్రత్యయము వచ్చును.

సైనాపత్యమ్:- 'సేనాపతేః భావః కర్మ వా'. పతిశబ్దాంత మగు'సేనాపతి'శబ్దముకంటె"యక్"ప్రత్యయము. ఆదివృద్ధి,ఆకారలోపము-'సైనాపత్యమ్'. ఇట్లే 'పురోహితస్య కర్మ భావో వా'అను నర్థమునందు 'పురోహిత'శబ్దముకంటె యక్ప్రత్యయము చేయగా 'పౌరోహిత్యమ్'అను రూపము సిద్ధించును.

భావకర్మార్థ ప్రకరణము సమాప్తము.

# అథ భవనాద్యర్థకాః

1163 ధాన్యానాం భవనే క్షేత్రే ఖఞ్ 5 2.1

'భవతి అస్మిన్'ఇతి భవనమ్. ముద్గానాం భవనం క్షేత్రం-మౌద్గీనమ్.

'భవతి అస్మిన్' (దీనియందు పుట్టును) అను నర్థమునందు భూధాతువు నకు'ల్యుట్'ప్రత్యయము చేర్చగా 'భవనమ్'అనురూపము సిద్ధించినది. 'ఉత్పత్తి స్థానము'అని యర్థము. ధాన్యవాచకము లగు షష్ఠ్యంతశబ్దములకంటె ఉత్పత్తి స్థాన మగు క్షేత్రము అను నర్థమునందు 'ఖఞ్'ప్రత్యయము వచ్చును.

మౌద్గీనమ్.- 'ముద్గానాం భవనం క్షేత్రమ్' (పెసలకు ఉత్పత్తిస్థాన మగు క్షేత్రము). షష్ఠ్యంత మగు ముద్గశబ్దముకంటె ఈ సూత్రముచే 'ఖఞ్' ప్రత్యయము. ఆదివృద్ధి,ఖకారమునకు 'ఇన్'ఆదేశము (సూ-1013) 'యస్యేతిచ' అనుసూత్రముచే (236) అకారలోపము-'మౌద్గీనమ్'.

1164. వ్రీహిశాల్యోర్ఢక్. 5.2 2

వ్రైహేయమ్. శాలేయమ్.

భవనక్షేత్రార్థమునందు 'వ్రీహి' 'శాలి'శబ్దములకంటె 'ఢక్'ప్రత్యయము వచ్చును. ఇది ధాన్యవాచకశబ్దములకంటె సామాన్యతో విహిత మగు'ఖఞ్'ప్రత్యయమునకు అపవాదము.

'వ్రీహీణాం భవనం క్షేత్రం' "శాలీనాం భవనం క్షేత్రమ్'అనునర్థమునందు షష్ఠ్యంతము లగు 'వ్రీహి' 'శాలి'శబ్దములకంటె ఈసూత్రముచే ఢక్ ప్రత్యయము. ఢకారమునకు 'ఏయ్'ఆదేశము (సూ-1013). ఇకారలోపము (సూ-236)-'వ్రైహేయమ్' 'శాలేయమ్'.

1165. హైయఙ్గవీనం సంజ్ఞాయామ్. 5.2 23

హ్యోగోదోహశబ్దస్య హియఙ్గురాదేశః వికారేఽర్థే ఖఞ్ చ నిపాత్యతే. దుహ్యతే ఇతి దోహః- క్షీరమ్,హ్యోగోదోహస్య వికారః:- హైయఙ్గవీనమ్,నవనీతమ్.

షష్ఠ్యంత మగు హ్యోగోదోహశబ్దముకంటె వికారార్థమునందు 'ఖఞ్' ప్రత్యయము,ప్రకృతికి 'హియఙ్గు'అను నాదేశమును, సంజ్ఞయందు నిపతింపబడు చున్నది.

దుహ్యతే ఇతి దోహః.పితుకబడును గాన క్షీరమునకు దోహ మని పేరు. గోః దోహః గోదోహః-ఆవుపాలు. హ్యః గోదోహః హ్యో గోదోహః-నిన్నటి ఆవుపాలు. హ్యోగోదోహస్య వికారఃఅను నర్థమునందు ఈ సూత్ర ముచే 'ఖఞ్'ప్రత్యయము, 'హియఙ్గు'ఆదేశము నిపతింపబడినవి. ఖకారమునకు 'ఈన్'ఆదేశము. ఆదివృద్ధి;ఉకారలోపము-'హైయఙ్గవీనమ్' అను ప్రథమైక వచనాంతరూపముసిద్ధించినది. నిన్నటి పాలను మధించి తీసిన వెన్న యని యర్థము.

1166. తదస్య సఞ్జాతం తారకాదిభ్య ఇతచ్. 5.2.36

తారకాః సంజాతా అస్య తారకితం నభః, పణ్డితః,ఆకృతి గణోయమ్.

'తత్ అస్య సంజాతమ్'-అది దీనికి సంభవించినది. అను నర్థమునందు ప్రథమాంతము లగు తారకాదిశబ్దములకంటె 'ఇతచ్'ప్రత్యయము వచ్చును.

తారకితం నభః- తారకాః అస్య సంజాతాః- దీనికి నక్షత్రములు వచ్చినవి-అను నర్థమునందు ప్రథమాంతతారకా శబ్దముకంటె ఈ సూత్రముచే 'ఇతచ్'ప్రత్యయము. ఆకారమునకు లోపము (సూ-236) - 'తారకితమ్'.

పణ్డితః-'పణ్డా అస్య సంజాతా'అను నర్థమునందు ప్రథమాంతపండా శబ్దముకంటె ఈ సూత్రముచే ఇతచ్ప్రత్యయము. సదసద్వివేకమునకు 'పండ' యని పేరు. తారకాదిగణము ఆకృతిగణము.

1167. ప్రమాణే ద్వయసజ్దఘ్నఞ్మాత్రచః. 5.2.37.

తదస్య ఇత్యనువర్తతే. ఊరూ ప్రమాణం అస్య ఊరుద్వయ సమ్, ఊరుదఘ్నమ్, ఊరుమాత్రమ్.

పూర్వసూత్రమునుండి 'తత్' 'అస్య' అనువర్తించును. అది దానికి ప్రమాణము అను నర్థమునందు ప్రమాణవాచక మగు ప్రథమాంతశబ్దముకంటె 'ద్వయసచ్' 'దఘ్నచ్' 'మాత్రచ్'అను ప్రత్యయములు వచ్చును. ఈ ప్రత్య యములలోని అంత్యచకారములు ఇత్సంజ్ఞకములు.

'ఊరూ ప్రమాణం అస్య'అను నర్థమునందు ప్రథమాంతమగు ఊరు శబ్దముకంటె పై ప్రత్యయములు చేర్చగా 'ఊరుద్వయసమ్' 'ఊరుదఘ్నమ్' 'ఊరుమాత్రమ్'అను రూపములు సిద్ధించినవి తొడలోతైన నీరుమొదలగునది.

1168. *యత్తదేతేభ్యః పరిమాణే వతుప్.* 5.2.39.

యత్ పరిమాణం అస్య యావాన్. తావాన్. ఏతావాన్.

ప్రథమాంతము లగు యత్, తత్, ఏతద్ శబ్దములకంటె పరిమాణార్థము నందు 'వతుప్' ప్రత్యయము వచ్చును.

యావాన్:-'యత్ పరిమాణం అస్య'అను నర్థమునందు 'యత్'శబ్దముకంటె ఈ సూత్రముచే 'వతుప్'ప్రత్యయము. 'యత్ తత్'అని యుండగా 'ఆ సర్వ నామ్నః' అను సూత్రముచే (343) 'యత్'శబ్దమునకు ఆకారము అంతాదేశముగ వచ్చుటచే 'యావత్'అను ప్రాతిపదికము సిద్ధించును. పుంలింగప్రథమైకవచనమున 'ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః'అను సూత్రముచే (290) నుమాగమము, 'అత్వసన్తస్యచాధాతోః'అను సూత్రముచే (344) ఉపధాదీర్ఘము వచ్చి 'యావాన్'అను రూపము సిద్ధించును. 'తత్' 'ఏతత్'శబ్దములకంటె గూడ ఈ విధముగనే వతుప్రత్యయము చేయగా పుంలింగప్రథమైకవచనమున 'తావాన్' 'ఏతావాన్'అను రూపములు సిద్ధించును.

1169. *కిమిదంభ్యాం వో ఘః.* 5.2.40.

ఆభ్యాం వతుప్, వకారస్య ఘశ్చ.

ప్రథమాంతము లగు 'కిమ్' 'ఇదమ్'శబ్దములకంటె ప్రమాణార్థమునందు 'వతుప్'ప్రత్యయము వచ్చును;'వతుప్'లోని వకారమునకు ఘకారాదేశమువచ్చును.

'కిమ్ ప్రమాణం అస్య' "ఇదమ్ ప్రమాణం అస్య"అనునర్థములందు 'కిమ్' 'ఇదమ్'శబ్దములకంటె ఈ సూత్రముచే 'వతుప్' ప్రత్యయము. 'కిమ్ వత్' 'ఇదమ్ వత్'అని యుండగా వకారమునకు ఘకారాదేశము ఆ ఘకారమునకు 'ఇయ్'ఆదేశము (సూ. 1013). 'కిమ్ ఇయత్' 'ఇదమ్ ఇయత్'అని యుండగా-

1170. *ఇదంకిమోరీశ్కీ.* 6.3.90.

దృగ్, దృశ్, వతుషు ఇదమః 'ఈశ్', కిమః 'కీ'స్యాత్. కియాన్, ఇయాన్.

'దృగ్దృశవతుషు'అను పూర్వసూత్రము అనువర్తించును. కృదంతము లగు 'దృక్' 'దృశ'అను శబ్దములును, 'వతుప్'ప్రత్యయమును పర మగునపుడు 'ఇదమ్' 'కిమ్'అను శబ్దములకు క్రమముగా 'ఈశ్' 'కీ' అను ఆదేశములు వచ్చును. 'ఈశ్' శిత్తు అగుటచే 'కిమ్'కు సర్వాదేశముగ వచ్చును. 'కీ' 'అనేకాల్' అగుటచే 'కిమ్'కు సర్వాదేశముగ వచ్చును.

ఈ ఆదేశములు చేసిన పిమ్మట "కీ ఇయత్" 'ఈ ఇయత్'అని యుండగా 'యస్యేతిచ'అను సూత్రముచే (236) 'కీ'యందలి ఈ కారమునకును ఇదమ్శబ్దస్థానీయ మగు ఈకారమునకును లోపము. పుంలింగప్రథమైకవచనమున 'కియాన్' 'ఇయాన్'అను రూపములు సిద్ధించును. 'ఇయాన్' అనునది, ప్రకృతిభాగమంతయు పూర్తిగ లోపించి, పరిశిష్ట మగు ప్రత్యయభాగముతో సిద్ధించిన రూపము.

1171. సంఖ్యాయా అవయవే తయప్. 5.2.42.

పఞ్చ అవయవా అస్య పఞ్చతయమ్.

"తదస్య సఞ్జాతం తారకాదిభ్య ఇతచ్"నుండి 'తద్ అస్య', అనువర్తించును 'దీనియొక్క అవయవము' అను నర్థమునందు ప్రథమాంత మగు సంఖ్యావాచకశబ్దముకంటె 'తయప్'ప్రత్యయము వచ్చును.

పఞ్చయమ్:-'పఞ్చ అవయవాః అస్య'అను నర్థమునందు 'పఞ్చన్' శబ్దముకంటె 'తయప్'ప్రత్యయము. "నలోపః ప్రాతిపదికాన్తస్య"అను సూత్రముచే (180) నకారలోపము- 'పఞ్చతయం'. "ఐదు అవయవములుగల సముదాయము".

1172. ద్విత్రిభ్యాం తయస్యాయజ్వా. 5.2.43.

ద్వయమ్, ద్వితయమ్. త్రయమ్, త్రితయమ్.

'ద్వి' 'త్రి' శబ్దములకంటె పర మైన 'తయప్'ప్రత్యయమునకు 'అయచ్'ప్రత్యయము వికల్పముగ వచ్చును.

'ద్వౌ అవయవౌ అస్య' "త్రయః అవయవాః అస్య"అనునర్థములందు ప్రథమాంతము లగు 'ద్వి' 'త్రి'శబ్దములకంటె పూర్వసూత్రముచే 'తయప్'కు వైకల్పిక మగు అయజాదేశము వచ్చిన పక్షమున'యస్యేతిచ'అను సూత్రముచే (236) ఇకారము లోపించి "ద్వయమ్" 'త్రయమ్'అను రూపములును,

అయజాదేశము రాని పక్షమున 'ద్వితయమ్' 'త్రితయమ్'అను రూపములను సిద్ధించును.

1173. ఉభాదుదాత్తో నిత్యమ్. 5.2.44.

ఉభశబ్దాత్ తయపోఽయచ్ స్యాత్; స చాద్యుదాత్తః. ఉభయమ్.

ఉభయశబ్దముకంటె పరమైన తయప్ప్రత్యయమునకు నిత్యముగ 'అయచ్'ప్రత్యయము వచ్చును; అది ఆద్యుదాత్తముగ నుండును.

ఉభయమ్:-'ఉభౌ అవయవౌ అస్య'అను నర్థమునందు ప్రథమాంత మగు ఉభశబ్దముకంటె "సంఖ్యాయా అవయవే తయప్"అను సూత్రముచే (1171) తయప్ప్రత్యయము. దానికి ప్రకృతసూత్రముచే అయజాదేశము. అంత్యాకారము లోపించిన పిదప 'ఉభయమ్'అను రూపము సిద్ధించినది.

1174. తస్య పూరణే డట్. 5.2.48.

ఏకాదశానాం పూరణః ఏకాదశః.

"సఙ్ఖ్యాయా గుణస్య నిమానే మయట్"నుండి 'సఙ్ఖ్యాయాః' అను వర్తించును. సంఖ్యేయార్థకసంఖ్యావాచక మగు షష్ఠ్యంతశబ్దముకంటె ప్రవృత్తి నిమిత్త మగు సంఖ్యకు పూరకమగు అవయవము వాచ్య మగునపుడు 'డట్' ప్రత్యయము వచ్చును.

ఏకాదశః-ఏకాదశానాం పూరణః (ఏకాదశత్వసంఖ్యను పూరించు నది) అను నర్థమునందు ఏకాదశన్‌శబ్దముకంటె డట్ప్రత్యయము. 'టేః'అను సూత్రముచే (242) టిలోపము. 'ఏకాదశః'అను రూపము సిద్ధించినది. ఏకాదశసంఖ్యాకములగు వస్తువులందలి ఏకాదశత్వమును పూర్తిచేయు, వాటి యొక్క అవయవము-అనగా దేనిని చేర్చనిచో ఆవస్తువుల మొత్తము పదునొకండు కాదో అది యని యర్థము.

1175. నాన్తాదసఙ్ఖ్యాదేర్మట్. 5.2.49.

డటో మట్ ఆగమః.పఞ్చానాం పూరణః పఞ్చమః.నాన్తాత్ కిమ్-

సంఖ్యావాచకము ఆదియందు లేని నకారాంతసంఖ్యావాచకముకంటె పర మగు డట్ప్రత్యయమునకు 'మట్'అను నాగమము వచ్చును.మట్‌లోని టకారము ఇత్సంజ్ఞకము. అకారము ఉచ్చారణార్థము ఔత్తుగాన, డట్‌కు ఆద్యవయవముగ వచ్చును.

పఞ్చమః:-'పఞ్చానాం పూరణః'అను నర్థమునందు పూర్వసూత్రముచే షష్ఠ్యంత మగు 'పఞ్చన్'శబ్దముకంటె 'డట్'ప్రత్యయము. ప్రకృతసూత్రముచే మడాగమము.-'పఞ్చమః'.

నాంత మగు సంఖ్యావాచకమునకే మడాగమము విధింపబడినది గాన 'వింశతి'మొదలగు నకారాంతభిన్నములగు సంఖ్యావాచకములవిషయమున ఈ సూత్రము ప్రవర్తింపదు. ఈ విషయము ఉత్తరసూత్రమునందు స్పష్టీకరింపబడుచున్నది.

1176. *తి వింశతేర్డితి*. 6.4.142.

వింశతేర్భస్య తిశబ్దస్య లోపో డితి పరే. వింశః. అసంఖ్యాదేః కిమ్. ఏకాదశః.

'భస్య' అధికారము. 'అల్లోపోఽనః'నుండి 'లోపః' అనువర్తించును. డిత్ అగు ప్రత్యయము పర మగునపుడు భసంజ్ఞక మగు వింశతిశబ్దమునందలి 'తి'కి లోపము వచ్చును.

వింశః-'వింశతేః పూరణః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు 'వింశతి' శబ్దముకంటె "తస్య పూరణే డట్"అను సూత్రముచే (1174) డట్ప్రత్యయము. ప్రకృతసూత్రముచే తిలోపము. 'వింశఅ'అని యుండగా 'అతో గుణే'అను సూత్రముచే (274) పరరూపము-'వింశః'.

పూర్వసూత్రమునందు సంఖ్యావాచకము ఆదియందులేని నకారాంతసంఖ్యావాచకముకంటె పర మగు డట్కు మడాగమము వచ్చు నని చెప్పుటచే 'ఏకాదశః'అనుదానియందు "ఏకాదశన్"అనునది నకారాంతసంఖ్యావాచకమే యైనను, దాని ఆదియందు 'ఏక'అను సంఖ్యావాచకపద ముండుటచే మడాగమము రాదు.

1177. *షట్-కతి-కతిపయ-చతురాం థుక్*. 5.2.51.

ఏషాం థుక్ ఆగమః స్యాత్ డటి. షణ్ణాం పూరణః-షష్ఠః, కతిథః, కతిపయశబ్దస్యాఽసంఖ్యాత్వేఽప్యత ఏవ జ్ఞాపకాద్ డట్. కతిపయథః. చతుర్థః.

'తస్య పూరణే డట్'నుండి 'డట్'అనువర్తించును. షష్, కతి, కతిపయ, చతుర్ శబ్దములకు డట్ ప్రత్యయము పర మగునపుడు 'థుక్'ఆగమము

వచ్చును. 'థుక్'లోని కకారము ఇత్సంజ్ఞకము. ఉకారము ఉచ్చారణార్థము. థకారము శేషించును. కిత్తు గాన అంత్యావయవముగ వచ్చును.

షష్ఠః:-'షణ్ణాం పూరణః' అనునర్థమున షష్ఠ్యంత మగు షష్శబ్దము కంటె డట్ ప్రత్యయము (సూ. 1174). 'షష్అ'అని యుండగా ఈ సూత్ర ముచే థుగాగమము-'షష్థ్అ'అని యుండగా థకారమునకు ష్టుత్వముచే ఠకా రము-'షష్ఠః'. కతిథః-(ఎన్నవది) 'కతీనాం పూరణః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు కతిశబ్దముకంటె డట్ప్రత్యయము (సూ. 1174), కతి శబ్దము నకు ప్రకృతసూత్రముచే థుగాగమము-'కతిథః'.

కతిపయథః-'కతిపయానాం పూరణః' అనునర్థమునందు, డట్ ప్రత్య యము. వాస్తవమునందు కతిపయశబ్దము సంఖ్యావాచకము కాదు గాన డట్ ప్రత్యయమువచ్చుటకు అవకాశము లేదు. ఐనను "డట్ పర మగునపుడు కతి పయ శబ్దమునకు థుగాగమము వచ్చును"అని ఈసూత్రము చెప్పుచున్నది గాన ఏతద్విధానబలముచే, 'కతిపయ'శబ్దముకంటె డట్ వచ్చు ననితెలియుచున్నది. ఈవిధముగ డట్ప్రత్యయము చేసిన పిదప ఈ సూత్రముచే థుగాగమము వచ్చి 'కతిపయథః'అను రూపము సిద్ధించినది. 'ఎన్నవది'అని యర్థము. చతుర్థః- 'చతుర్ణాం పూరణః' అను నర్థమునందు షష్ఠ్యంతచతుర్శబ్దముకంటె డట్ప్రత్య యము (సూ. 1174); ప్రకృతిసూత్రముచే థుగాగమము-'చతుర్థః'.

1178. ద్వేస్తీయః. 5 2 54.

డటోఽపవాదః. ద్వయోః పూరణో ద్వితీయః.

'తస్య పూరణే డట్'నుండి 'పూరణే' అనువర్తించును. షష్ఠ్యంత ద్విశబ్దముకంటె పూరణార్థమునందు తీయప్రత్యయము వచ్చును.

ద్వితీయః-'ద్వయోః పూరణః'అను నర్థమునందు షష్ఠ్యంత మగు ద్విశబ్దముకంటె 'తస్య పూరణే డట్'అను సూత్రముచే (1174) రావలసిన 'డట్'ను బాధించి ఈ సూత్రముచే 'తీయ'ప్రత్యయము-'ద్వితీయః'.

1179. త్రేః సంప్రసారణం చ. 5.2.55.

తృతీయః:

షష్ఠ్యంతత్రిశబ్దముకంటె, పూరణార్థమునందు 'తీయ'ప్రత్యయము, 'త్రి'శబ్దమునకు సంప్రసారణమును వచ్చును.

తృతీయః-'త్రయాణాం పూరణః'అను నర్థమున 'త్రి'శబ్దముకంటె తీయప్రత్యయము. 'త్రి'యందలి రేఫస్థానమున ఋకారరూప మగు సంప్రసారణము 'తృతీయః'.

1180. శ్రోత్రియంశ్ఛన్దోధీతే. 5.2.84.

శ్రోత్రియః. వా ఇత్యనువృత్తేః 'ఛాన్దసః'.

'ఛన్దః అధీతే'అను నర్థమునందు 'శ్రోత్రియన్'అను ప్రాతిపదికము సిద్ధించును. అనగా ద్వితీయాంతఛందశ్శబ్దముకంటె 'ఘన్'ప్రత్యయము, ప్రకృతికి 'శ్రోత్ర'ఆదేశము నిపతింపబడుచున్నవి. 'ఘన్'లోని నకారము ఇత్సంజ్ఞకము. అకారము ఉచ్చారణార్థము. ఘకారమునకు ఇయాదేశము (సూ. 1013)-'శ్రోత్రియః'.

'తావతిథంగ్రహణమితిలుగ్వా'నుండి మండూకప్లుతిచే 'వా'అనుపదము అనువర్తించుటచే ఈ ఘన్ప్రత్యయశ్రోత్రాదేశములు వైకల్పికములు. ఇవి రాని పక్షమున 'తదధీతే తద్వేద'అను సూత్రముచే (1053) అణ్ ప్రత్యయము-'ఛాందసః'.

1181. పూర్వాదినిః. 5.2.86.

పూర్వం కృతమనేన-పూర్వీ.

"శ్రాద్ధమనేన భుక్తమినిఠనౌ"నుండి కర్త్రర్థతృతీయాంత మగు 'అనేన' అనువర్తించును. ఏ క్రియకు కర్త యను ఆకాంక్ష కలుగునపుడు కృఞ్దాత్వర్థ మగు క్రియాసామాన్యము ఉపస్థిత మగును. 'వీనిచే పూర్వము చేయబడినది' అను నర్థమునందు క్రియావిశేషణ మగు ద్వితీయాంతపూర్వశబ్దముకంటె 'ఇని' ప్రత్యయము వచ్చును. 'ఇని'లోని నకారోత్తరవర్తి యగు ఇకారము ఉచ్చారణార్థము. పూర్వీ:-'పూర్వం కృతం అనేన'అను నర్థమునందు పూర్వశబ్దము కంటె 'ఇన్'ప్రత్యయము-'పూర్వ ఇన్'అని యుండగా "యస్యేతిచ"అను సూత్రముచే (236) అకారలోపము. 'పూర్విన్' అను నకారాంత ప్రాతిపదికము సిద్ధించును.

1182. సపూర్వాచ్చ. 5.2.87.

కృతపూర్వీ.

సపూర్వ మనగా పూర్వమునందు ఏదైన ఒకపదము కలది యని

యర్థము. అట్టి పూర్వశబ్దముకంటె కూడ "వీనిచే పూర్వము చేయబడినది" అను నర్థమునందు ఇని ప్రత్యయము వచ్చును.

కృతపూర్వీ:-'(కటః) కృతః పూర్వం అనేన'అను నర్థమునందు 'కృత'శబ్దపూర్వక మగు పూర్వశబ్దముకంటె ఈ సూత్రముచే ఇని ప్రత్యయము వచ్చి 'కృతపూర్వీ'అను రూపము సిద్ధించినది. 'కృతపూర్వీ కటమ్'అనగా 'పూర్వము చాపను అల్లినవాడు'అని యర్థము. ఈప్రయోగమునకు సంబంధించిన కొన్ని విశేషములు 'కర్తృకర్మణోః కృతి'అను సూత్రవ్యాఖ్యానమునందు బాల మనోరమలో స్పష్టీకరింపబడినవి.

1183. ఇష్టాదిభ్యశ్చ. 5.2.88.

ఇష్టమనేన ఇష్టీ. అధీతీ.

ఇతిభవనాద్యర్థకాః.

ప్రథమాంతము లగు ఇష్టాదిశబ్దములకంటె 'అనేన'-అనగా ఇష్టాదులకు ఈతడు కర్త-అను నర్థమున ఇని ప్రత్యయము వచ్చును.

ఇష్టీ:-'ఇష్టం అనేన' 'ఈతనిచే యాగము చేయబడినది'అను నర్థము నందు ఇని ప్రత్యయము. 'యస్యేతి చ'అను సూత్రముచే (236) అకార లోపము. 'ఇష్టీ'అను ప్రథమైకవచనాంతరూపము సిద్ధించినది. యాగము చేసిన వాడు (చేయబడిన యాగము కలవాడు) అని యర్థము. అధీతీ:-'అధీతం అనేన' అను నర్థమున ఈ సూత్రముచే ఇనిప్రత్యయము వచ్చి పైవలెనే రూపము సిద్ధించినది.

భవనాద్యర్థకప్రత్యయప్రకరణము సమాప్తము.

# అథ మత్వర్థీయాః

1184. తదస్యాస్త్యస్మిన్నితి మతుప్. 5.2.94

గావః అస్యసన్తి గోమాన్.

'తత్ అస్య అస్తి'లేక "తత్ అస్మిన్ అస్తి"అను విగ్రహమునందు, అస్తి సమానాధికరణ మగు ప్రథమాంశబ్దముకంటె 'అస్య' 'అస్మిన్'అను నర్థములందు మతుప్ ప్రత్యయము వచ్చును.

'మతుప్'లోని ఉకారపకారములు ఇత్సంజ్ఞకములు. సూత్రమునందలి 'ఇతి' శబ్దము, అస్త్యర్థవివక్షయందు వచ్చు మతుబాదులు విశేషవిషయములందు వచ్చు నని సూచించును. ఆవిషయవిశేషములు ఈ క్రింది శ్లోకరూపవార్తికము నందు సంగ్రహింపబడినవి:—

> భూమనిందాప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే
> సంసర్గేఽస్తివివక్షాయాం భవన్తి మతుబాదయః.

భూమ యనగా బహుత్వము. ఉదా:— గోమాన్; యవవాన్ మొ. అధిక మగు గోవులు,యవలు కలవాడు. నిందకు ఉదా:— 'కకుదావర్తినీ కన్యా'కకుదము నందు సుడి గల కన్య. కకుదమనగాకంఠమూలమునకువెనుకటి భాగము. ఆస్థానమునందు సుడి యుండుట నింద్య మగు లక్షణము. ప్రశంసకు ఉదా:—'రూపవాన్' ప్రశస్త మగు రూపము కలవాడు. నిత్యయోగమునకు ఉదా:— 'క్షీరిణో వృక్షాః'. ఎల్లపుడును క్షీరము గల వృక్షములు. ఇని ప్రత్యయము నిత్యసంసర్గమును బోధించుచున్నది. అతిశాయనమునకు ఉదాహరణము:-ఉదరిణీ కన్యా:-పెద్ద పొట్ట గల కన్య. సంసర్గమునకు ఉదాహరణము:—'దణ్డీ' మొ. దండ సంబంధము కలవాడు.గోమాన్:—'గావః అస్య సన్తి'అనునర్థమునందు'సన్తి'సమానాధికరణ మగు ప్రథమాంతగోశబ్దముకంటె 'అస్య' అను నర్థమునందు ప్రకృత సూత్రముచే మతుప్ప్రత్యయము చేయగా 'గోమాన్'అనునది (ప్ర.ఏ.వ.) నిష్పన్న మైనది.

### 1185. తసౌ మత్వర్థే. 1.4.19

తాన్తసాన్తౌ భసంజ్ఞౌ స్తః,మత్వర్థే ప్రత్యయే పరే. గరుత్మాన్, 'వసోః సంప్రసారణమ్'-విదుష్మాన్.

'యచి భమ్'నుండి 'భమ్'అనువర్తించును. మత్వర్థప్రత్యయము పర మగునపుడు తకారసకారాంతశబ్దములు భసంజ్ఞకము లగును.

గరుత్మాన్:— 'గరుతః అస్య సన్తి' 'గరుత్'శబ్దముకంటె మతుప్ ప్రత్యయము 'గరుత్'శబ్దముతకారాంతగుటచేఈసూత్రముచేభసంజ్ఞ.అందుచేపద సంజ్ఞలేదుగాన తకారమునకు 'ఝలాం జశోన్తే'అను సూత్రముచే(67) జశ్త్వము, "ప్రత్యయే భాషాయాం నిత్యమ్"అనువార్తికముచే (సూ. 68) అనునాసికము రాలేదు.

విదుష్మాన్:—'విద్వాంసః అస్మిన్ సన్తి'. ప్రథమాంతవిద్వస్‌శబ్దము కంటె మతుప్‌ప్రత్యయము. 'విద్వస్'శబ్దము సకారాంత మగుటచే ప్రకృతసూత్రముచే భసంజ్ఞ.అందుచే "వసోఃసంప్రసారణమ్" (354) అను సూత్రముచే సంప్రసారణము. 'విద్ ఉ అస్'అని యుండగా 'సంప్రసారణాచ్చ'అను సూత్రముచే (258) అకారమునకు పూర్వరూపము వచ్చి 'విదుస్ మత్'అని యుండగా "ఆదేశప్రత్యయయోః"అనుసూత్రముచే (150) సకారమునకు షత్వము-"విదుష్మాన్"

వా. *గుణవచనేభ్యో మతుపో లుగిష్టః.*

శుక్లో గుణోఽస్యాస్తీతి శుక్లః పటః. కృష్ణః.

గుణవాచకశబ్దములకంటె పర మగు మతుప్‌ప్రత్యయమునకు లోపము అంగీకరింపబడినది. ఇచట '**గుణవచనేభ్యః**'అను పదముచే గుణగుణవద్వాచకములుగ ప్రసిద్ధము లగు శుక్లాదిశబ్దములు మాత్రమే గ్రహింపబడును. 'రూప' మొదలగు శబ్దములు గ్రహింపబడవు.అందుచే 'రూపము గల వస్త్రము'అను నర్థమున "రూపం వస్త్రం"ఇత్యాదిప్రయోగములు చేయరాదు.

శుక్లః- 'శుక్లః అస్య అస్తి'అను నర్థమునందు శుక్లశబ్దముకంటె మతుప్ ప్రత్యయము. దానికి ఈ వార్తికముచే **లోపము** 'శుక్లః'. "యః శిష్యతే స లుప్యమానార్థాభిధాయీ"అను న్యాయముచే శిష్ట మగు 'శుక్ల'అనుదానికి 'శుక్లగుణవాన్'అని యర్థము ఇట్లే 'కృష్ణః'అను రూపము గూడ సిద్ధించినది. ఈ విధముగ 'శుక్లః'ఇత్యాదిశబ్దములకు ప్రకరణానుసారముగ 'తెలుపు' "తెలుపు గలది"అను అర్థద్వయమును చెప్పవచ్చును.

1186 *ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్.* 5.2.96

చూడాలః- చూడావాన్, ప్రాణిస్థాత్ కిమ్-శిఖావాన్ దీపః.

వా. *ప్రాణ్యంగాదేవ.*

నేహ. మేధావాన్.

ప్రాణియం దున్న వస్తువును బోధించు అకారాంతశబ్దముకంటె మత్వర్థమునందు, లచ్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

**చూడాలః**- 'చూడా అస్య అస్తి'అను నర్థమునందు ఆకారాంతమగు చూడాశబ్దముకంటె ఈ సూత్రముచే 'లచ్'ప్రత్యయము-"చూడాలః". 'లచ్' రాని పక్షమున 'మతుప్'ప్రత్యయము వచ్చి 'చూడామత్'అని యుండగా "మాదుపధా

యాశ్చ మతో ర్వోఽయవాదిభ్యః" అను సూత్రముచే (1062) మకారమునకు వకారము-'చూడావాన్. కేశాగ్రము, కుక్కుటాదిశీర్షశిఖ మొదలగు వాటికి చూడ యనిపేరు.

ప్రాణిస్థవాచక మగు ఆకారాంతశబ్దమునకు లచ్ ప్రత్యయము వచ్చు నని చెప్పుటచే 'శిఖావాన్ దీపః' అనునపుడు 'శిఖా' శబ్దము ఆకారాంత మైనను ప్రాణిస్థవస్తువాచకము కాదు గాన ఈ ప్రత్యయము రాలేదు. సామాన్యతఃసిద్ధ మగు 'మతుప్' ప్రత్యయము వచ్చి 'శిఖావాన్' అను రూపము ('చూడావాన్' వలె) సిద్ధించినది.

అప్రాణిస్థ మగు వస్తువు గూడ ప్రాణ్యంగమై యుండవలెను; ప్రాణిస్థ మైనంత మాత్రమున చాలదు. అందుచే 'మేధావాన్' అనునపుడు మేధ ప్రాణిస్థమే యైనను ప్రాణ్యవయవము కాదుగాన, తద్వాచక మగు ఆకారాంత మేధాశబ్దముకంటె లచ్ ప్రత్యయము రాలేదు. మతుప్ప్రత్యయము మాత్రమే వచ్చినది.

1187. లోమాదిపామాదిపిచ్ఛాదిభ్యః శనేలచః. 5.2.100

**లోమాదిభ్యః శః-లోమశః; లోమవాన్, రోమశః,- రోమవాన్. పామాదిభ్యోనః-పామనః.**

లోమాది, పామాది, పిచ్ఛాదిగణములందలి శబ్దములకంటె క్రమముగ 'శ' 'న' 'ఇలచ్' ప్రత్యయములు వికల్పముగ వచ్చును.

లోమశః- 'లోమాని అస్య సన్తి'. నకారాంత మగు ప్రథమాంతలోమన్‌శబ్దముకంటె 'శ' ప్రత్యయము. "న లోపః ప్రాతిపదికాన్తస్య" అను సూత్రముచే (180) నకారలోపము-'లోమశః' శప్రత్యయము రాని పక్షమున మతుప్ ప్రత్యయము వచ్చి 'లోమవాన్' అను రూపము సిద్ధించును. 'రోమశః'- 'రోమవాన్' అనురూపములుగూడ పైవలెనే సిద్ధించును.

పామనః- 'పామా అస్య అస్తి'. నకారాంతపామన్ శబ్దముకంటె నప్రత్యయము. నకారలోపము. చిడుము కలవాడు అని యర్థము. 'న' ప్రత్యయము రాని పక్షమున మతుప్ ప్రత్యయము వచ్చి 'పామవాన్' అను రూపము సిద్ధించును.

(గ.సూ) అఙ్గాత్ కల్యాణే.- అఙ్గనా. (గ.సూ.) లక్ష్మ్యా అత్ చ- లక్ష్మణః. పిచ్ఛాదిభ్య ఇలచ్. పిచ్ఛిలః- పిచ్ఛవాన్.

కల్యాణశబ్దము విశేషణముగా గల అంగశబ్దముకంటె మత్వర్థమునందు నప్రత్యయము వచ్చును అని గణసూత్రమునకర్థము.

అఙ్గనా:- 'కల్యాణాని అఙ్గాని అస్యాః'అని విగ్రహము. ఈ అర్థమునందు అఙ్గశబ్దముకంటె నప్రత్యయము. స్త్రీత్వవివక్షయందు 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) 'టాప్'చేయగా 'అఙ్గనా'అను రూపము సిద్ధించినది. ఇచట న ప్రత్యయము కల్యాణత్వమును గూడ సూచించుచున్న దని భావము.

లక్ష్మీశబ్దమునకు మత్వర్థమునందు న ప్రత్యయము వచ్చును. ప్రకృతికి అకారము కూడ అంతాదేశముగ వచ్చును అని గణసూత్రమున కర్థము.

లక్ష్మణః:- 'లక్ష్మీః అస్య అస్తి'అను విగ్రహమునందు లక్ష్మీశబ్దముకంటె నప్రత్యయము. ఈకారస్థానమున అకారముఆదేశముగ వచ్చినది. 'లక్ష్మణః'. పిచ్ఛిలః- 'పిచ్ఛం అస్య అస్తి' 'పిచ్ఛ'శబ్దముకంటె ఇలచ్ ప్రత్యయము. 'యస్యేతిచ'అనుసూత్రముచే (236) అకారలోపము.-'పిచ్ఛిలః'. ఇలచ్ రాని పక్షమున మతుప్ ప్రత్యయము-"పిచ్ఛవాన్."

1188. దన్త ఉన్నత ఉరచ్. 5.2.106

ఉన్నతాః దన్తాః సన్తి అస్య-దన్తురః.

ఉన్నతశబ్దము విశేషణముగా గల దంతశబ్దముకంటె మత్వర్థమునందు 'ఉరచ్'ప్రత్యయము వచ్చును.

దన్తురః- (ఎత్తైన దంతములు కలవాడు) 'ఉన్నతాః దన్తాః అస్య'అని విగ్రహము. ఈ సూత్రముచే ప్రథమాంతదంతశబ్దముకంటె ఉరచ్ప్రత్యయము. అకారలోపము (236) 'దన్తురః'.ఇచట ఉరచ్ప్రత్యయము ఉన్నతత్వమును గూడ సూచించును.

1189. కేశాద్వోఽన్యతరస్యామ్. 5.2.109

కేశవః, కేశీ; కేశికః; కేశవాన్.

ప్రథమాంత మగు కేశశబ్దముకంటె మత్వర్థమునందు వికల్పముగ వప్రత్యయము వచ్చును.

కేశవః- 'కేశాః అస్య సన్తి'అని విగ్రహము. ఈ సూత్రముచే'వ' ప్రత్యయము,

'ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్'నుండి "అన్యతరస్యామ్"ఈ సూత్రములోనికి అనువర్తించుటచే 'వ'ప్రత్యయము రాని పక్షమున 'మతుప్'ప్రత్యయమువచ్చుటకు అవకాశములభించుచున్నను మరల ఈ సూత్రమునందు'అన్యతరస్యామ్'అని ప్రయోగించుటచే 'అత ఇనిఠనౌ'అను రాబోవు సూత్రముచే విధీయమానము లగు 'ఇని' 'ఠన్'ప్రత్యయములు గూడ రావచ్చు నని సూచింపబడుచున్నది. అందుచే వప్రత్యయము రాని పక్షమున 'కేశీ' (ఇనిప్రత్యయము) 'కేశికః' (ఠన్ప్రత్యయము) కేశవాన్ (మతుప్ప్రత్యయము) అను రూపములు గూడ సిద్ధించును.

వా. అన్యేభ్యోఽపి దృశ్యతే. మణివః.

వా. అర్ణసో లోపశ్చ అర్ణవః.

కేశశబ్దముకంటె భిన్నము లగు శబ్దములకంటె గూడ మత్వర్థమునందు వప్రత్యయము చూడబడుచున్నది.

మణివః- 'మణిః అస్యాస్తి'అని విగ్రహము. ఈ వార్తికముచే మణిశబ్దముకంటె వప్రత్యయము వచ్చినది. సర్పవిశేషమునకు పేరు.

ప్రథమాంత మగు 'అర్ణస్'శబ్దమునకు మత్వర్థమునందు వప్రత్యయము ప్రకృతియందలి సకారమునకు లోపము గూడ వచ్చును.

అర్ణవః- (సముద్రము). 'అర్ణః అస్య అస్తి'అని విగ్రహము. ఈ వార్తికముచే వప్రత్యయసకారలోపములు.

1190. అత ఇనిఠనౌ. 5.2.115

దణ్డీ,దణ్డికః.

ప్రథమాంత మగు అకారాంతశబ్దముకంటె మత్వర్థమునందు 'ఇని' 'ఠన్' ప్రత్యయములు వచ్చును.

దణ్డీ:- 'దణ్డః అస్య అస్తి' 'దణ్డ'శబ్దముకంటె ఈ సూత్రముచే ఇని ప్రత్యయము. 'యస్యేతిచ'అనుసూత్రముచే (236) అకారలోపము-'దణ్డీ' (ప్ర.ఏ.వ). దణ్డికః—పై యర్థమున 'ఠన్'ప్రత్యయము. 'ఠస్యేకః' (1027). అకారలోపము, (సూ-236)-'దణ్డికః'.

1191. వ్రీహ్యాదిభ్యశ్చ. 5.2.116

వ్రీహీ.వ్రీహికః.

వ్రీహ్యాదిశబ్దములకంటె గూడ మత్వర్థమునందు 'ఇని' 'ఠన్' ప్రత్యయములు వచ్చును.

వ్రీహీ;వ్రీహికః- 'వ్రీహయః అస్య స న్తి'. ఈ సూత్రముచే 'ఇని' 'ఠన్' ప్రత్యయములు. ఇకారలోపము (సూ-236)-'వ్రీహీ' 'వ్రీహికః'.

1192. అస్ మాయామేధాస్రజో వినిః. 5.2.121

యశస్వీ-యశస్వాన్. మాయావీ. మేధావీ, స్రగ్వీ.

ప్రథమాంతము లగు అసంతశబ్దములకంటెను,మాయా, మేధా స్రజ్ శబ్దములకంటెను మత్వర్థమునందు 'విని' ప్రత్యయము వచ్చును.

యశస్వీ:- 'అస్' అంతమునందు గల 'యశస్'శబ్దముకంటె'యశః అస్య అ స్తి'అను నర్థమునందు ఈ సూత్రముచే 'విని'(విన్)ప్రత్యయము-'యశస్విన్' (ప్ర.ఏ.వ.) యశస్వాన్:- 'కేశాద్వోఽన్యతరస్యామ్'నుండి "అన్యతరస్యామ్"పదము మండూకప్లుతిచే అనువర్తించుటచే'విని'ప్రత్యయము రాని పక్షమున మతుప్ ప్రత్యయము వచ్చి"మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః" అను సూత్రముచే (1065) మకారమునకు వకారాదేశము-'యశస్వాన్'. పై రెండు రూపములందును 'తసౌ మత్వర్థే'అను సూత్రముచే (1185) భసంజ్ఞ వచ్చుటచే పదసంజ్ఞ లేదు గాన సకారమునకు రుత్వము (సూ-105) రాలేదు. ఇట్లే 'మాయా' 'మేధా' 'స్రజ్ శబ్దములకంటె గూడ వినిప్రత్యయము వచ్చి 'మాయావీ' 'మేధావీ' 'స్రగ్వీ' అను రూపములు సిద్ధించును. 'స్రజ్'శబ్దమునందలి జకారమునకు 'చోః కుః'అనుసూత్రముచే (307)కుత్వము వచ్చినది. విని ప్రత్యయము రాని పక్షమున మతుప్ ప్రత్యయము వచ్చును-'మాయావాన్' 'మేధావాన్', 'స్రగ్వాన్'.

1193. వాచో గ్మినిః. 5 2.124

వాగ్గ్మీ.

వాచ్ శబ్దముకంటె మత్వర్థమునందు 'గ్మిని' ప్రత్యయము వచ్చును. వాగ్గ్మీ:- 'వాక్ అస్య అ స్తి'వాచ్ శబ్దముకంటె 'గ్మిని' (గ్మిన్) ప్రత్యయము-'వాచ్గ్మిన్'. చకారమునకు జ శ్త్వముచే జకారము. దానికి కు త్వముచే గకారము 'వాగ్గ్మీ'. 'లశక్వతద్ధితే' (136) అను సూత్రమునందు "అతద్ధితే" అని నిషేధించుటచే 'గ్మిన్'లోని గకారమునకు ఇత్సంజ్ఞ లేదు.

1194. అర్శఆదిభ్యోఽచ్. 5.2.127

అర్శోఽస్య విద్యతే అర్శసః, ఆకృతిగణోఽయమ్.

'అర్శస్' మొదలగు శబ్దములకంటె మత్వర్థమునందు 'అచ్'ప్రత్యయము వచ్చును.

అర్శసః- 'అర్శః అస్య అస్తి' అచ్ ప్రత్యయము-'అర్శసః'. మూలశంఖరోగముగలవాడు. అర్శాదిగణము ఆకృతిగణ మగుటచే 'పాపం అస్యాస్తీతి పాపః'ఇత్యాదిరూపములు సిద్ధించును.

1195. అహం శుభమోర్యుస్. 5.2.140

అహంయుః-అహంకారవాన్. శుభంయుః-శుభాన్వితః.

ఇతి మత్వర్థీయాః.

'అహమ్' 'శుభమ్'అను 'మకారాంతావ్యయము'లకంటె మత్వర్థమునందు 'యుస్'ప్రత్యయము వచ్చును.

'యుస్'లోని సకారము ఇత్సంజ్ఞకము. ఇది 'సిత్' గాన 'సితి' 'చ'అను వార్తికముచే ప్రకృతికి పదసంజ్ఞ లభించి 'మోనుస్వారః'అను సూత్రముచే(77) మకారమునకు అనుస్వారము,దానికి పరసవర్ణము (సూ-79)-వచ్చును.

అహంయుః- "అహమ్ అస్య అస్తి"అను నర్థమున యుస్ ప్రత్యయము-'అహంయుః'. ఇట్లే'శుభంయుః'.'అహమ్' 'శుభమ్'అనునవి అహంకార శుభార్థకము లగు మకారాంతావ్యయములు.

మత్వర్థీయప్రకరణము సమాప్తము.

# అథ ప్రాగ్దిశీయాః

1196. ప్రాగ్దిశో విభక్తిః. 5.3.1.

దిక్శబ్దేభ్యః ఇత్యతః ప్రాగ్వక్ష్యమాణాః ప్రత్యయాః విభక్తిసంజ్ఞాః స్యుః.

'దిక్శబ్దేభ్యః' అనుసూత్రముకంటె పూర్వము విధీయమానము లగు ప్రత్యయములు విభక్తిసంజ్ఞకము లగును.

'న విభక్తౌ తుస్మాః'అను సూత్రముచే నిషేధము, 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) అత్వము, మొదలగునవి విభక్తిసంజ్ఞకు ప్రయోజనములు.

1197. కింసర్వనామబహుభ్యోఽద్వ్యాదిభ్యః. 5.3.2.

"కిమః, సర్వనామ్నో, బహుశబ్దాచ్చ" ఇతి ప్రాగ్దిశోఽధిక్రియతే.

'దిక్శబ్దేభ్యః'అను సూత్రమునకు పూర్వము, "కిమ్‌శబ్దముకంటెను, ద్వి శబ్దాదిభిన్నము లగు సర్వనామశబ్దములకంటెను, బహుశబ్దముకంటెను"అను నవి అధికృతము లగును. 'కిమ్'శబ్దము గూడ సర్వనామశబ్దమే యైనను, అది ద్వ్యాదిశబ్దములలో చేరుటచే 'అద్వ్యాదిభ్యః'అని నిషేధమున్నది గాన మరల గ్రహింపబడినది. 'సమర్థానాం ప్రథమాత్'అనునది ఇక పైన అనువర్తింపదు. 'వా'అనునది మాత్రము అనువర్తించును. ఇట్లు చెప్పుటకు వ్యాఖ్యానమే ఆధారము.

1198. పఞ్చమ్యాస్తసిల్ 5.3.7.

పఞ్చమ్యన్తేభ్యః కిమాదిభ్యస్తసిల్ వా స్యాత్.

పంచమ్యంతము లగు కిమాదిశబ్దములకంటె 'తసిల్'ప్రత్యయము వికల్పముగ వచ్చును.

అర్థవిశేషనిర్దేశము లేకుండుటచే ఈ తసిలాదులు స్వార్థమునందే (ప్రకృత్యర్థమునందు వచ్చును). 'తసిల్'లోని 'ఇల్' ఇత్సంజ్ఞకము 'తస్' శేషించును.

1199. కు తిహోః. 7.2.104.

కిమః కుః స్యాత్ తాదౌ హాదౌ చ విభక్తౌ పరతః. కుతః. కస్మాత్.

'కిమః కః' 'అష్టన ఆ విభక్తౌ'.నుండి'కిమః' 'విభక్తౌ' అనువర్తించును. తకారహకారాదివిభక్తి పర మగు నపుడు 'కిమ్'శబ్దమునకు 'కు' అను నాదేశము వచ్చును.

కుతః-పంచమ్యంతకిమ్‌శబ్దముకంటె తసిల్ ప్రత్యయము "కిమ్ ఙసి తస్"అని యుండగా ప్రాతిపదికత్వ(సూ-117) సుబ్లోపములు (సూ. 724).'కిమ్ తస్'అని యుండగా'ప్రాగ్దిశో విభక్తిః'అను సూత్రముచే(1196)'తస్'కు విభక్తి

సంజ్ఞ యున్నదిగాన తకారాది యగు అవిభక్తిప్రత్యయము పరముగ నుండగా ఈ సూత్రముచే 'కిమ్'కు 'కు' ఆదేశము-'కుతః'. తసిల్ రాని పక్షమున 'కస్మాత్' అను పంచమ్యంతరూపము ప్రయుక్త మగును. 'తద్ధితశ్చాసర్వవిభక్తిః' అను సూత్రముచే (369) తసిలాద్యంతశబ్దములకు అవ్యయత్వము.

## 1200. ఇదమ ఇశ్. 5.3.3.

ప్రాగ్దిశీయే పరే. ఇతః.

ప్రాగ్దిశీయప్రత్యయము పర మగు నపుడు 'ఇదమ్'శబ్దమునకు 'ఇశ్' అను నాదేశము వచ్చును.

ఇతః-'ఇదమ్ ఙసి' అను పంచమ్యంత ఇదమ్‌శబ్దముకంటె తసిల్ ప్రత్యయము. ప్రాతిపదికత్వసుబ్లోపములు. ప్రకృతిభూత మగు "ఇదమ్" అనుదానికి ఈ సూత్రముచే 'ఇశ్' ఆదేశము శిత్ అగుటచే సర్వాదేశముగ వచ్చును-'ఇతః'.

## 1201. అన్. 5.3.5.

ఏతదః ప్రాగ్దిశీయే. అనేకాల్త్వాత్సర్వాదేశః. అతః. అముతః. యతః. బహుతః. ద్వ్యాదేస్తు-ద్వాభ్యామ్.

'ఏతదోఽన్' అను ఒక సూత్రమును 'ఏతదః' 'అన్' అను రెండు సూత్రములుగ యోగవిభాగము చేసి ఇచట 'అన్' అనునది వ్యాఖ్యానింప బడుచున్నది. 'ఏతదః' అనునది పిమ్మట వ్యాఖ్యానింపబడును. ఏతచ్ఛబ్దమునకు ప్రాగ్దిశీయప్రత్యయము పర మగునపుడు 'అన్' అను నాదేశము వచ్చును.

'అన్' అనేకాల్ గాన సర్వాదేశముగ (సూ. 45) వచ్చును. 'న లోపః ప్రాతిపదికాన్తస్య' అను సూత్రముచే (180) నకారము లోపింపగా 'అ' మాత్రము శేషించును.

అతః-సుబ్లోపానంతరము 'ఏతద్ తస్' అని యుండగా ఈ సూత్రముచే 'అన్' ఆదేశము వచ్చినది. అముతః:-పంచమ్యంత మగు 'అదస్' శబ్దముకంటె తసిల్ ప్రత్యయము. ప్రాతిపదికత్వసుబ్లోపాదులచే 'అదస్ తస్' అని యుండగా తస్ విభక్తిసంజ్ఞకముగాన అది పరముగా నుండగా 'త్యదాదీనామః' అను సూత్రముచే (193) సకారమునకు అకారాదేశము. 'అతో గుణే' అను సూత్రముచే (274) పరరూపము-'అదతస్' అని యుండగా "అదసోఽసేర్దాదుదోమః" అను

సూత్రముచే (255) ఉత్వమత్వములు–'అముతః'. యత్రః-పంచమ్యంత యచ్ఛ బ్దమునకు తసిల్ ప్రత్యయము. సుబ్లోపత్యదాద్యత్వాదులు – 'యతః'.

బహుతః-పంచమ్యంతబహుశబ్దముకంటె తసిల్ ప్రత్యయము.

'ద్వి'మొదలగు శబ్దములు సర్వనామము లైనను 'అద్వ్యాదిభ్యః'అను నిషేధ ముండుటచే (సూ. 1197) తసిలాదులు రావు. 'ద్వాభ్యామ్' ఇత్యాదిపంచ మ్యంత రూపములు మాత్రమే ఉండును.

1202. పర్యభిభ్యాం చ. 5.3 9.

ఆభ్యాం తసిల్ స్యాత్. పరితః-సర్వత ఇత్యర్థః. అభితః-ఉభ యత ఇత్యర్థః.

'పరి' 'అభి'అను అవ్యయములకంటె 'తసిల్'ప్రత్యయము వచ్చును. 'సర్వోభయార్థాభ్యామేవ'అను వార్తికము ననుసరించి 'అంతటను' 'రెండువైపు లందును'అను నర్థములందే వచ్చును.

ఈ సూత్రముచే పై యర్థములందు తసిల్ ప్రత్యయము–'పరితః' 'అభితః'.

1203. సప్తమ్యాస్త్రల్. 5.3.10.

కుత్ర. యత్ర. తత్ర. బహుత్ర.

సప్తమ్యంతము లగు కిమాదులకంటె 'త్రల్' ప్రత్యయము వచ్చును.

కుత్ర:–సప్తమ్యంతకిమ్శబ్దముకంటె ఈ సూత్రముచే త్రల్ (త్ర) ప్రత్య యము, ప్రాతిపదికత్వ సుబ్లోపాదులు. 'కుతిహోః'అను సూత్రముచే (1199) కిమ్'కు 'కు'ఆదేశము–'కుత్ర'. ఇట్లే యత్తచ్ఛబ్దములకును బహుశబ్దమునకును త్రల్ప్రత్యయము చేర్చగా 'యత్ర', 'తత్ర', 'బహుత్ర' సిద్ధించినవి. యత్త చ్ఛబ్దములకు త్యదాద్యత్వపరరూపములు గూడ వచ్చినవి.

1204. ఇదమో హః. 5.3.11.

త్రలోఽపవాదః. ఇహ.

సప్తమ్యంత మగు 'ఇదమ్'శబ్దముకంటె 'హ'అను ప్రత్యయము వచ్చును. ఇది త్రల్ప్రత్యయమునకు అపవాదము.

ఇహ:–సప్తమ్యంత మగు 'ఇదమ్ ఙి'అనుదానికంటె 'హ'ప్రత్యయము.

ప్రాతిపదికత్వసుబ్లోపములు. 'ఇదమ్ హ'అని యుండగా 'ఇదమ ఇశ్'అను సూత్రముచే (1200) 'ఇదమ్'కు 'ఇశ్'ఆదేశము-'ఇహ'.

1205. కిమోఽత్. 5.3.12.

వాగ్రహణమపకృష్యతే. సప్తమ్యన్తాత్ కిమః 'అత్'వా స్యాత్; పక్షే త్రల్.

'వా హ చ ఛన్దసి'అను ఉత్తరసూత్రమునుండి 'వా' అపకర్షింపబడును. సప్తమ్యంత మగు 'కిమ్'శబ్దముకంటె 'అత్' ప్రత్యయము వికల్పముగ వచ్చును. 'అత్' లోని తకారము ఇత్సంజ్ఞకము. ఈ సూత్రముచే అత్ప్రత్యయము చేర్చిన పిదప ప్రాతిపదికత్వసుబ్లోపాద్యనంతరము 'కిమ్ అ' అని యుండగా-

1206. క్వాఽతి. 7.2.105.

కిమః క్వాదేశః స్యాదతి. క్వ. కుత్ర.

అత్ ప్రత్యయము పర మగునపుడు 'కిమ్'శబ్దమునకు 'క్వ'అను ఆదేశము వచ్చును. ఈ సూత్రముచే 'క్వ' ఆదేశముచేసినపిమ్మట 'క్వ అ'అని యుండగా "అతోగుణే"అను సూత్రముచే (274) పరరూపము 'క్వ'.

అత్ ప్రత్యయము రాని పక్షమున 'త్రల్'ప్రత్యయము, 'కిమ్'కు 'కు' ఆదేశము (సూ. 1199)-'కుత్ర'.

1207. ఇతరాభ్యోఽపి దృశ్యన్తే. 5.3.14.

పఞ్చమీసప్తమీతరవిభక్త్యన్తాదపి తసిలాదయో దృశ్యన్తే.

వా. దృశిగ్రహణాద్ భవదాదియోగ ఏవ.

స భవాన్-తతో భవాన్, తత్ర భవాన్. తం భవన్తమ్-తతో భవన్తమ్,తత్ర భవన్తమ్. ఏవం దీర్ఘాయుః, దేవానాం ప్రియః, ఆయుష్మాన్.

పంచమీసప్తమీభిన్నవిభక్త్యంతము లగు కిమాదులకంటె గూడ తసిల్ మొదలగు ప్రత్యయములు చూడబడుచున్నవి.

'దృశ్యన్తే'అనుటచే భవచ్ఛబ్దాదులతో సంబంధ మున్నపుడు మాత్రమే ఈ సూత్రము ప్రవర్తించు నని వార్తికకారుడు చెప్పుచున్నాడు. అనగా భవదాది శబ్దములు అనుప్రయుక్తము లైనపుడు మాత్రమే కిమాదిశబ్దములతో తసిలాదుల ప్రయోగము కానవచ్చుచున్న దని భావము.

'సః భవాన్'అను నపుడు భవచ్ఛబ్దముతో కలసి యున్న తచ్ఛబ్దము ప్రథమాంత మైయున్నది. అట్టి తచ్ఛబ్దమునకు తసిల్,త్రల్ ప్రత్యయములుచేర్చి 'తతో భవాన్' 'తత్ర భవాన్'అని కూడ ప్రయోగించ వచ్చును. వీటికి కూడ 'స భవాన్'అనియే యర్థము అట్లే 'తం భవన్తం'ఇత్యాదులందు ద్వితీయాంత మగు తచ్ఛబ్దమునకు 'తసిల్' 'త్రల్' ప్రత్యయములు చేర్చి 'తం భవన్తం' "తత్ర భవన్తం"ఇత్యాదిప్రయోగములను చేయవచ్చును. అర్థము మాత్రము "తం భవన్తం"అనుదానియందు వలె నుండును.

ఇట్లే 'స దీర్ఘాయుః'అనుటకు బదులు 'తతో దీర్ఘాయుః' "తత్ర దీర్ఘాయుః"అనియు, 'స దేవానాంప్రియః'అనుటకు "తతో దేవానాం ప్రియః" 'తత్ర దేవానాం ప్రియః'అని యు, 'సః ఆయుష్మాన్' అనుటకు బదులు 'తత ఆయుష్మాన్' 'తత్రఆయుష్మాన్' అనియు ప్రయోగి.పవచ్చును.

1208. సర్వైకాన్యకింయత్తదః కాలే దా. 5.3.15

సప్తమ్యన్తేభ్యః కాలార్థేభ్యః స్వార్థే దా స్యాత్.

సప్తమ్యంతము లగు సర్వ,ఏక,అన్య,కిమ్,యద్,తద్అను శబ్దముల కంటె కాలము వాచ్య మగునపుడు స్వార్థమునందు దా,అను ప్రత్యయము వచ్చును.

సప్తమ్యంత మగు సర్వశబ్దముకంటె 'సర్వస్మిన్ కాలే'అను నర్థము నందు ఈ సూత్రముచే 'దా'ప్రత్యయము-'సర్వదా'అని యుండగా-

1209 సర్వస్య సోఽన్యతరస్యాం ది. 5 3 6

దాదౌ ప్రాగ్దిశీయే సర్వస్య సః వా స్యాత్. సర్వస్మిన్ కాలే- సదా,సర్వదా. ఏకదా. అన్యదా. కదా. యదా, తదా. కాలే కిమ్- సర్వత్ర దేశే.

దకారాది యగు ప్రాగ్దిశీయప్రత్యయము పర మగునపుడు సర్వశబ్దమునకు 'స' అను నాదేశము వికల్పముగ వచ్చును.

ఈ సూత్రముచే సకారాదేశము వచ్చిన పక్షమున 'సదా' అను రూపము, రాని పక్షమున 'సర్వదా' అను రూపమును సిద్ధించును. ఇట్లే 'ఏకస్మిన్ కాలే' 'అన్యస్మిన్ కాలే'అను నర్థములందు సప్తమ్యంతము లగు 'ఏక' 'అన్య'శబ్దముల కంటె దాప్రత్యయము 'ఏకదా' 'అన్యదా'. కదా:- 'కస్మిన్ కాలే'అను నర్థము

నందు సప్తమ్యంత'కిమ్'శబ్దముకంటె స్వార్థమునందు దా ప్రత్యయము. దీనికి విభక్తి సంజ్ఞ కూడ ఉన్నది గాన ఇది పరముగ నున్నపుడు 'కిమః కః'అను సూత్రముచే (271) కాదేశము-'కదా'. ఇట్లే సప్తమ్యంతము లగు 'యద్'తద్' శబ్దములకంటె "యస్మిన్ కాలే" "తస్మిన్ కాలే"అను నర్థములందు దాప్రత్యయము. 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) అత్త్వము-'యదా' 'తదా'.

'కాలే' అని చెప్పుటచే సప్తమ్యంతము లగు ఈ సర్వాదిశబ్దములు దేశవాచకములుగ నుపయుక్తము లైనపుడు ఈ దాప్రత్యయము రాదు. 'త్రల్' ప్రత్యయము వచ్చి 'సర్వత్ర'అను రూపము సిద్ధించును. 'అంత దేశమునందును' అని యర్థము.

1210. ఇదమో ర్హిల్. 5.3.16

సప్తమ్యన్తాత్.కాలే ఇత్యేవ.

కాలార్థమునందు ఉపయుక్తమును,సప్తమ్యంతమును అగు 'ఇదమ్'శబ్దముకంటె 'ర్హిల్'ప్రత్యయము వచ్చును.

'అస్మిన్ కాలే'అను నర్థమునందు సప్తమ్యంత మగు 'ఇదమ్'శబ్దము కంటె ఈ సూత్రముచే 'ర్హిల్'ప్రత్యయము-'ఇదమ్ ర్హి'అని యుండగా-

1211. ఏతేతౌ రథోః. 5.3.4

ఇదమ్ శబ్దస్య 'ఏత' 'ఇత్'ఇత్యాదేశౌ స్తః రేఫాదౌ,-థకారాదౌ చ ప్రాగ్దిశీయే పరే. అస్మిన్ కాలే-ఏతర్హి.కాలేకిమ్-ఇహ దేశే.

రేఫాదియు,థకారాదియు నగు ప్రాగ్దిశీయప్రత్యయము పర మగునపుడు ఇదమ్ శబ్దమునకు,క్రమముగ 'ఏత' 'ఇత్'అను ఆదేశములు వచ్చును.

ఏతర్హి:- 'అస్మిన్ కాలే'అను నర్థమునందు సప్తమ్యంత మగు 'ఇదమ్' శబ్దముకంటె'ర్హి(ల్)'ప్రత్యయము (సూ-1210). 'ర్హి'అనునది రేఫాదిప్రత్యయము గాన 'ఇదమ్'శబ్దమునకు ప్రకృతసూత్రముచే 'ఏత'ఆదేశము-'ఏతర్హి'. కాలార్థమునందు ఉపయుక్త మగు ఇదమ్ శబ్దముకంటె 'ర్హిల్'ప్రత్యయము వచ్చు నని చెప్పుటచే "అస్మిన్ దేశే"అను నర్థమునందు ప్రయుక్త మగుసప్తమ్యంతేదంశబ్దముకంటె 'ఇదమో హః'అను సూత్రముచే (1204) హప్రత్యయము వచ్చిన పిమ్మట 'ఇదమ ఇశ్'అనుసూత్రముచే (1200) 'ఇ'ఆదేశము చేయగా 'ఇహ'సిద్ధించినది.

## 1212. అనద్యతనే ర్హిలన్యతరస్యామ్. 5.3.21

కర్హి,కదా.యర్హి,యదా. తర్హి,తదా.

అనద్యతనకాలార్థమునందు ప్రయుక్తము లగు సప్తమ్యంతము లైన కిమాదిశబ్దములకంటె వికల్పముగ ర్హిల్ ప్రత్యయము వచ్చును.

కర్హి - సప్తమ్యంత మగు కిమ్ శబ్దముకంటె ఈ సూత్రముచే 'ర్హిల్'ప్రత్యయము. 'కిమః కః'అను సూత్రముచే (271) 'కిమ్'కు 'క'ఆదేశము-'కర్హి'. ర్హిల్ప్రత్యయము రాని పక్షమున 'దా'ప్రత్యయము వచ్చును. (సూ-1208)-'కదా'. ఇట్లే సప్తమ్యంతము లగు యద్,తద్,శబ్దములకంటె 'ర్హిల్'ప్రత్యయము చేసిన పక్షమున 'త్యదాదీనామః'అను సూత్రముచే (193) అత్వము వచ్చి 'యర్హి' 'తర్హి'అను రూపములును, ర్హిల్' రాని పక్షమున 'దా'ప్రత్యయము వచ్చి 'యదా' 'తదా'అను రూపములను సిద్ధించును.

## 1213. ఏతదః. 5.3.5

'ఏత' 'ఇత'ఏతౌ స్తః రేఫాదౌ థాదౌ చ ప్రాగ్దిశీయే, ఏతస్మిన్ కాలే-ఏతర్హి.

ఇది 'ఏతదోఽన్'అను సూత్రమును రెండు సూత్రములుగ యోగవిభాగము చేయుటచే సిద్ధించిన మొదటి సూత్రము. 'ఏతేతౌరథోః'అను సూత్రము అనువర్తించును. రేఫాదియు,థకారాదియు నగు ప్రాగ్దిశీయప్రత్యయము పరమగునపుడు ఏతచ్ఛబ్దమునకు 'ఏత' 'ఇత్'అను నాదేశములు వచ్చును.

ఏతర్హి:- 'ఏతస్మిన్ కాలే'అను నర్థమునందు పూర్వసూత్రముచే (1212)ర్హిల్ప్రత్యయము. ఈ సూత్రముచే 'ఏతద్'కు'ఏత'ఆదేశము-'ఏతర్హి' ను రూపము సిద్ధించును. ఈ విధముగ 'ఏతర్హి'అనునది 'ఇదమ్'శబ్దమునందు ఏతచ్ఛబ్దమునుండయు గూడ నిష్పన్న మగును. అర్థము గూడ మానము.

## 1214. ప్రకారవచనే థాల్. 5.3.23

ప్రకారవృత్తిభ్యః కిమాదిభ్యః 'థాల్' స్యాత్ స్వార్థే.తేన ప్రకారేణ-తథా.యథా.

ప్రకారమును (రీతిని) బోధించు కిమాదిశబ్దములకంటె స్వార్థమునందు 'థాల్' ప్రత్యయము వచ్చును.

తథా:- 'తేన ప్రకారేణ'అను నర్థమునందు 'తద్'శబ్దముకంటెథాల్ ప్రత్యయము. 'త్యదాదీనామః' అనుసూత్రముచే (193) అత్వము-'తథా'. ఇట్లే 'యద్'శబ్దముకంటె థాల్' ప్రత్యయము-'యథా'.

1215. ఇదమః థముః. 5.3 24

థాలోఽపవాదః.

వా. ఏతదోఽపివాచ్యః.

అనేన ఏతేన వా ప్రకారేణ'ఇత్థమ్'.

ప్రకారవాచక మగు ఇదమ్ శబ్దముకంటె 'థము' ప్రత్యయము వచ్చును. 'థము'లోని ఉకారము ఉచ్చారణార్థము. ఇది పూర్వసూత్రముచే విహిత మగు 'థాల్'కు అపవాదము ఏతద్శబ్దముకంటె గూడ 'థము' ప్రత్యయము వచ్చును అని వార్తికమునకు అర్థము.

'అనేన ఏతేన వా ప్రకారేణ'అను నర్థమునందు 'ఇదమ్'శబ్దముకంటె ప్రకృతసూత్రముచేతను, 'ఏతద్'శబ్దముకంటె వార్తికముచేతను 'థము' ప్రత్యయము. 'ఏతేతౌ రథోః'అను సూత్రముచే (1211) 'ఇదమ్'శబ్దమునకు ఇ, 'ఏతదః'అను సూత్రముచే (1213) 'ఏతద్'శబ్దమునకు 'ఇత్'అనునాదేశము వచ్చి 'ఇత్థమ్'అనురూపము సిద్ధించును. ఈవిధముగ 'ఇత్థమ్'అనునది 'ఇదమ్' శబ్దమునుండియు, ఏతచ్ఛబ్దమునుండియు నిష్పన్నమైనది.

1216. కిమశ్చ. 5.3.25.

కేన ప్రకారేణ-కథమ్. ఇతి ప్రాగ్దిశీయాః.

ప్రకారార్థవాచక మగు 'కిమ్'శబ్దముకంటె గూడ 'థము' ప్రత్యయము వచ్చును.

కథమ్:-'కిమ్'శబ్దముకంటె "కేన ప్రకారేణ"అను నర్థమునందు థము ప్రత్యయము. 'కిమః కః'అను సూత్రముచే (271) 'క'ఆదేశము-'కథమ్'.

ప్రాగ్దిశీయప్రకరణము సమాప్తము.

# అథ ప్రాగివీయాః.

## 1217. అతిశాయనే తమబిష్ఠనౌ. 5.3.55.

అతిశయవిశిష్టార్థవృత్తేః స్వార్థే ఏతౌ స్తః. అయం ఏషాం అతిశయేనాఢ్యః ఆఢ్యతమః. లఘుతమః. లఘిష్ఠః.

అతిశయముతో (ఆధిక్యముతో) కూడినది అను నర్థమునుబోధించు పదముకంటె 'తమప్' 'ఇష్ఠన్' అను ప్రత్యయములు, స్వార్థమునందు వచ్చును. ఈప్రత్యయములలోని పకారనకారములు ఇత్సంజ్ఞకములు. రెండింటిలో ఒకదానికి ఆధిక్యము చెప్పవలసి యున్నపుడు "ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ"అను సూత్రముచే (1221) 'తరప్' "ఈయసున్"అను ప్రత్యయములు విధింపబడనున్నవిగాన, ఈ ప్రత్యయములు బహుసంఖ్యాకము లగు వస్తువులలో నొకదానికి ఆధిక్యము చెప్పవలసి యున్నప్పుడు వచ్చును.

ఆఢ్యతమః-'అయం ఏషాం అతిశయేన ఆఢ్యః'-ఈతడు వీరిలో ఎక్కువ ధనికుడు-అను నర్థమునందు ఆఢ్యత్వగుణముద్వారా ఇతరులకంటె ఆధిక్యమును సూచించు ప్రథమాంత 'ఆఢ్య'శబ్దముకంటె స్వార్థమునందు ఈ సూత్రముచే 'తమప్'ప్రత్యయము. లఘుతమః:-'అయమేషాం అతిశయేన లఘుః'. ప్రథమాంతలఘుశబ్దముకంటె ఈసూత్రముచే 'తమప్' ప్రత్యయము.

లఘిష్ఠః:-పైయర్థమునందు 'ఇష్ఠన్' ప్రత్యయము-'లఘు ఇష్ఠ'అనియుండగా ఇచట 'ఇష్ఠన్'ప్రత్యయము పరముగా నున్నది గాన 'టేః'అను సూత్రముచే (1157) టిలోపము 'లఘిష్ఠః'.

## 1218. తిఙశ్చ. 5.3.56.

'తిఙన్తాత్ అతిశయే ద్యోత్యే తమప్ స్యాత్.

అతిశయార్థము ద్యోత్య మగునపుడు తిఙన్తముకంటె గూడ తమప్ ప్రత్యయము వచ్చును.

'అజాదీ గుణవచనాదేవ'-'ఇష్ఠన్' 'ఈయసున్' ప్రత్యయములు గుణవాచకముకంటె మాత్రమే వచ్చును-అను నియమమును అనుసరించి తిఙంతము

కంటె 'ఇష్ఠన్' ప్రత్యయము వచ్చుటకు అవకాశము లేదు గాన 'తమప్' అను నది మాత్రమే ఈ సూత్రములోనికి అనువర్తించినది.

1219. తరప్తమపౌ ఘః. 1.1.22.

ఏతౌ ఘసంజ్ఞౌ స్తః,

'తరప్' 'తమప్'ప్రత్యయములు ఘసంజ్ఞకము లగును.

1220 కిమేత్తిఙవ్యయఘాదామ్వద్రవ్యప్రకర్షే. 5.4.11.

కిమః, ఏదన్తాత్, తిఙః, అవ్యయాచ్చ యో ఘః తదన్తాత్ 'ఆము' స్యాత్ న తు ద్రవ్యప్రకర్షే. కిన్తమామ్. ప్రాహ్ణేతమామ్. పచతితమామ్. ఉచ్చైస్తమామ్. ద్రవ్యప్రకర్షే తు-ఉచ్చైస్తమః, ఉచ్చైస్తరః.

కిమ్‌శబ్దము, ఎకారాంతరములు, తిఙంతములు, అవ్యయములు వీటికంటె పరమైన ఘసంజ్ఞకప్రత్యయములకంటె, ద్రవ్యప్రకర్షము వాచ్యము కానపుడు 'ఆము'ప్రత్యయము వచ్చును. 'ఆము'లోని ఉకారము ఉచ్చారణార్థము.

కిన్తమామ్:-ఇచట కిమ్‌శబ్దముకంటె కేవలస్వార్థమునందు 'తమప్' వచ్చినది. 'ఏతేషాం అతిశయేన ఆఢ్యః'అని చెప్పినట్లు 'ఏతేషాం అతిశయేన కః'అని అర్థము చెప్పుటకు అవకాశము లేదు గాన 'కిమ్'శబ్దముకంటె అతిశాయనార్థమునందు 'తమప్'వచ్చెడుప్రసక్తి లేదు. ఇపుడు 'కిమ్'ప్రకృతికతమప్ ప్రత్యయముకంటె ఈ సూత్రముచే 'ఆము'ప్రత్యయముచేయగా అకారములోపించి (సూ. 236) 'కిన్తమామ్'అను రూపము సిద్ధించినది.

ప్రాహ్ణేతమామ్:-'ప్రాహ్ణ'మనగా పూర్వాహ్ణము. 'అతిశయితే ప్రాహ్ణే'అనునర్థమునందు ప్రాహ్ణశబ్దముకంటె 'తమప్'ప్రత్యయము. 'ఘకాలతనేషుకాలనామ్నః'అను సూత్రముచే సప్తమికి అలుక్. ఇపుడుఏదంతముకంటె పరమైన 'తమప్'ప్రత్యయము ఉన్నది గాన దానికంటె ఈసూత్రముచే 'ఆము' ప్రత్యయము చేయగా 'ప్రాహ్ణేతమామ్' అను రూపము సిద్ధించినది పచతితమామ్:-'అతిశయేనపచతి'. తిఙంతమగు 'పచతి'కంటె 'తిఙశ్చ'అను సూత్రముచే (1218) తమప్ప్రత్యయము. ఈ తమప్ప్రత్యయముకంటె ప్రకృతసూత్రముచే 'ఆమ్'ప్రత్యయము- "పచతితమామ్". ఉచ్చైస్తమామ్:-

'ఆశంసతి'అని అధ్యాహారము. ఆశంసనక్రియయందలి ఉచ్చైస్త్వముయొక్క అతిశయమును సూచించుటకై 'ఉచ్చైస్'అను అవ్యయముకంటె 'తమప్' ప్రత్యయము. ఆ 'తమప్'ప్రత్యయముకంటె ఈ సూత్రముచే 'ఆమ్' ప్రత్యయము-'ఉచ్చైస్తమామ్'.

'అద్రవ్యప్రకర్షే'అని చెప్పుటచే 'ఉచ్చైస్తరః తరుః' 'ఉచ్చైస్తమః తరుః' ఇత్యాదులందు ఘప్రత్యయములు తరురూపపదార్థములందలి ఉచ్చైస్త్వాతిశయమును సూచించుచున్నవి గాన వాటికంటె 'ఆము'ప్రత్యయము రాదు. 'ఉచ్చైస్తరః' "ఉచ్చైస్తమః"అను రూపములు మాత్రమే ఉండును.

1221. ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ. 5.3.57.

ద్వయోరేకస్యాతిశయే, విభక్తవ్యే చోపపదే సుప్తిఙన్తాదేతౌ స్తః. పూర్వయోరపవాదః. అయం అనయోః అతిశయేనలఘుః-లఘుతరః, లఘీయాన్-ఉదీచ్యాః ప్రాచ్యేభ్యః పటుతరాః, పటీయాంసః.

ద్వివచన మనగా రెండు వస్తువులను బోధించునది అని యర్థము. వస్తుద్వయమును బోధించు పదము ఉపపదముగా నున్నపుడును-అనగా రెండింటిలో నొకదాని అతిశయమును చెప్పవలసి యున్నపుడు అట్టి వస్తుద్వయవాచకము పపదముగ నున్నపుడును, విభక్తవ్యమును బోధించు పదము ఉపపదముగానుండగను-సుబంతతిఙంతములకంటె (అట్టి అతిశయముతో కూడిన స్వార్థమును బోధించు పదముకంటెను, అట్టి విభాగమునకు హేతు వగుధర్మమును బోధించు శబ్దముకంటెను)-'తరప్' 'ఈయసున్'అను ప్రత్యయములు వచ్చును. ఇవి తమబిష్ఠన్ప్రత్యయములకు అపవాదములు.

'ద్వివచనవిభజ్యోపపదే'అను పదమునకు-ఉచ్యతే అనేనేతివచనమ్ (చెప్పునది); ద్వయోరర్థయోర్వచనం ద్వివచనమ్. విభక్తవ్యంవిభజ్యమ్ (వేరు చేయదగినది). ద్వివచనఞ్చ విభజ్యఞ్చ తయోః సమాహారః ద్వివచనవిభజ్యమ్. ద్వివచనవిభజ్యఞ్చ తదుపపదఞ్చ ద్వివచనవిభజ్యోపపదమ్-అని-విగ్రహమును చెప్పుటచే పై యర్థము లభించినది.

లఘుతరః-లఘీయాన్:-ఇది ద్వివచనోపపదమున కుదాహరణము. 'అయమనయోః అతిశయేన లఘుః- ఈ రెండిటిలో ఇది మిక్కిలి తేలిక యైనది. అని విగ్రహము. ఇచట వస్తుద్వయవాచక మగు 'అనయోః' అనునది ఉప

ఎదముగ నున్నది గాన అతిశయవిశిష్టస్వార్థవృత్తి యగు లఘుపదముకంటె 'తర' ప్రత్యయము వచ్చిన పక్షమున 'లఘుతరః' అనియు, 'ఈయసున్' (ఈయస్) ప్రత్యయము వచ్చిన పక్షమున 'టేః' అను సూత్రముచే (1157) టిలోపము వచ్చి 'లఘీయాన్' అను రూపమును సిద్ధించును. "ఈయసున్" లోని నకారము ఇత్సంజ్ఞకము. ఉకారము ఉచ్చారణార్థము. ప్రథమైకవచనమున ఉగిత్త్వప్రయుక్త మగు నుమ్ (సూ. 290). "సాన్తమహతః సంయోగస్య" అను సూత్రముచే (343) దీర్ఘము. హల్ఙ్యాదిసంయోగాన్తలోపములును వచ్చి 'లఘీయాన్' అను రూపము సిద్ధించును.

'ఉదీచ్యాః ప్రాచ్యేభ్యః పటుతరాః-పటీయాంసః' అనునది విభజ్యోపపదమునకు ఉదాహరణము. ఇచట విభజ్యవాచకమగు 'ప్రాచ్యేభ్యః' అను నది ఉపపదముగా నున్నది గాన విభాగప్రయోజకీభూతధర్మవాచక మగు 'పటు' శబ్దముకంటె తరబీయసున్ ప్రత్యయములు వచ్చి 'పటుతరాః' 'పటీయాంసః' అనురూపములు సిద్ధించినవి.

## 1222. ప్రశస్యస్య శ్రః. 5.3.60

అస్య 'శ్ర' ఆదేశః స్యాత్ అజాద్యోః పరతః.

'అజాదీగుణవచనాదేవ' నుండి 'అజాదీ' అనువర్తించిషష్ఠ్యంతముగ పరివర్తిత మగును. అజాదిప్రత్యయములు ('ఇష్ఠ' 'ఈయసున్') పర మగునపుడు 'ప్రశస్య' శబ్దమునకు 'శ్ర' అను నాదేశము వచ్చును.

'అయమేషాం అతిశయేన ప్రశస్యః' "అయమనయోః అతిశయేన ప్రశస్యః" అను విగ్రహములందు క్రమముగ ప్రశస్యశబ్దముకంటె 'ఇష్ఠన్' 'ఈయస్' ప్రత్యయములు చేర్చిన పిదప ప్రకృతసూత్రముచే ప్రకృతికి 'శ్ర' ఆదేశము, 'శ్ర ఇష్ఠ' 'శ్ర ఈయస్' అని యుండగా 'టేః' అనుసూత్రముచే (1157) రావలసి యున్న టిలోపమునకునిషేధము చెప్పబడుచున్నది.

## 1223. ప్రకృత్యైకాచ్. 6.4.163

ఇష్ఠాదిష్వేకాచ్ ప్రకృత్యా స్యాత్. శ్రేష్ఠః, శ్రేయాన్.

'తురిష్ఠేమేయస్సు' నుండి 'ఇష్ఠేమేయస్సు' అనువర్తించును. 'ఇష్ఠ' 'ఇమన్' 'ఈయస్' ప్రత్యయములు పర మగునపుడు ఏకాచ్కమగు శబ్దము ప్రకృతిభావముతో నుండును.

ఈసూత్రముచే టిలోపము నిషేధింపబడినది గాన గుణము వచ్చి 'శ్రేష్ఠః' 'శ్రేయాన్' అను రూపములు సిద్ధించును.

1224. జ్య చ. 5.3.61

ప్రశస్యస్య 'జ్య' ఆదేశః స్యాత్ ఇష్ఠేయసోః. జ్యేష్ఠః.

'ఇష్ఠేయస్'ప్రత్యయములు పర మగునపుడు 'ప్రశస్య'శబ్దమునకు 'జ్య' అను నాదేశము కూడ వచ్చును.

జ్యేష్ఠః- 'అయమేషాం అతిశయేన ప్రశస్యః' అనువిగ్రహమునందు ప్రశస్యశబ్దముకంటె 'ఇష్ఠన్'ప్రత్యయము. ఈసూత్రముచే ప్రకృతికి 'జ్య'ఆదేశము. పూర్వసూత్రముచే ప్రకృతిభావము;గుణము వచ్చి'జ్యేష్ఠః'. 'అయమనయోః అతిశయేన ప్రశస్యః'అను విగ్రహమున ప్రశస్యశబ్దముకంటె 'ఈయసున్'ప్రత్యయము చేసిన పిమ్మట ప్రకృతికి ఈసూత్రముచే 'జ్య'ఆదేశము-'జ్య ఈయస్'అని యుండగా-

1225. జ్యాదాదీయసః. 6.4.160

'ఆదేః పరస్య'-జ్యాయాన్.

'జ్య'కంటె పర మగు 'ఈయస్'ప్రత్యయమునకు ఆకారము ఆదేశముగ వచ్చును.

'ఆదేః పరస్య'అను పరిభాషచే(72)ఈ ఆదేశము పర మగు 'ఈయస్'కు ఆద్యవయవముగ వచ్చును.'జ్యఆయస్'అని యుండగా సవర్ణదీర్ఘసంధి-'జ్యాయాన్' (ప్ర.ఏ.వ.).

1226. బహోర్లోపో భూ చ బహోః. 6.4.158

బహోః పరయోరిమేయసోః లోపః స్యాత్ బహోశ్చ భూరాదేశః. భూమా. భూయాన్.

'తురిష్ఠేమేయస్సు'నుండి 'ఇమేయస్సు'అనువర్తించి'ఇమేయసోః' అని విపరిణత మగును. 'ఇష్ఠన్'ప్రత్యయమునకు ఉత్తరసూత్రమునందు కార్యాంతరము విధింపబడ నున్నది గాన అది అనువర్తింపదు. 'బహు'శబ్దముకంటె పరము లగు 'ఇమన్' 'ఈయస్'ప్రత్యయములకు లోపము వచ్చును; 'బహు'కు 'భూ' అను నాదేశము కూడ వచ్చును.

భూమా:- 'బహోః భావః' అను విగ్రహమున షష్ఠ్యంత 'బహు' శబ్దముకంటె 'పృథ్వాదిభ్య ఇమనిచ్'అను సూత్రముచే (1155) 'ఇమనిచ్' ప్రత్యయము. ప్రకృతసూత్రముచే 'ఇమనిచ్'కు లోపము. ఈ లోపము 'ఆదేః పరస్య' అను పరిభాషచే (72) ఆద్య మగు ఇవర్ణవిషయమున ప్రవర్తించును. 'బహుమన్'అని యుండగా 'బహు'కు 'భూ'ఆదేశము – 'భూమా' (ప్ర. ఏ. వ.)

భూయాన్:- బహుశబ్దముకంటె, "అయమనయోః అతిశయేన బహుః" అను నర్థమున ఈయసున్ ప్రత్యయము. పైన చూపిన విధముగ ఈకార లోపము. 'బహు'కు 'భూ'ఆదేశము-'భూయాన్' (ప్ర.ఏ.వ).

## 1227. ఇష్ఠస్య యిట్ చ. 6 4.159

బహోః పరస్య ఇష్ఠస్య లోపః స్యాద్ యిడాగమశ్చ.-భూయిష్ఠః,

'బహు'కంటె పర మైన ఇష్ఠన్ ప్రత్యయమునకు లోపము. 'యిట్'ఆగమము కూడ వచ్చును.

భూయిష్ఠః- 'అయమేషాం అతిశయేన బహుః'అను విగ్రహమున 'బహు'శబ్దముకంటె 'ఇష్ఠన్' ప్రత్యయము. ఈసూత్రముచే విహితమగు లోపము 'ఆదేః పరస్య'అనుపరిభాషచే (7?) ఆద్యాక్షర మగు 'ఇ'కారమువిషయమున ప్రవర్తించును. 'బహు'కు 'భూ'ఆదేశము- 'భూష్ఠ' అని యుండగా 'యిట్'ఆగమము.ఇది టిత్తు గాన 'ష్ఠ'కుఆద్యవయవముగ వచ్చును-'భూయిష్ఠః'.

## 1228. విన్మతోర్లుక్. 5.3.65

వినో మతోశ్చ లుక్ స్యాదిష్ఠేయసోః, అతిశయేన స్రగ్వీ స్రజిష్ఠః; స్రజీయాన్, అతిశయేన త్వగ్వాన్ త్వచిష్ఠః;త్వచీయాన్.

'అజాదీగుణవచనాదేవ'నుండి అనువృత్తమగు'అజాదీ'అనునదిషష్ఠ్యంతముగ విపరిణత మగును. 'ఇష్ఠన్' 'ఈయసున్' ప్రత్యయములు పర మగునప్పుడు 'విన్' 'మతుప్' ప్రత్యయములకు లుక్ వచ్చును.

స్రజిష్ఠః- 'అయం ఏషాం అతిశయేన స్రగ్వీ' 'స్రజ్'శబ్దముకంటె మత్వర్థమునందు "అస్మాయామేధాస్రజోవినిః"అను సూత్రముచే (1193) విని ప్రత్యయము వచ్చిన పిమ్మట'చోః కుః'అను సూత్రముచే (307) కుత్వము చేయగా 'స్రగ్వి'అను రూపముసిద్ధించినది. దీనికంటె 'ఇష్ఠన్' ప్రత్యయము. అది పరముగా నుండగా ఈసూత్రముచే 'విని'ప్రత్యయమునకు లోపము. 'విని'ప్రత్య

యము లోపింపగనే, దానిని నిమిత్తముగ గొని 'స్వాదిష్వసర్వనామస్థానే'అను సూత్రముచే (164) లభించిన పదత్వముపోవుటచే, 'నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః'అను నియమము ననుసరించి కుత్వము కూడ పోయి'స్రజ్'అను నది శేషించుటచే'స్రజిష్ఠః'అను రూపము సిద్ధించును. ఈవిధముగనే ఈయసున్ ప్రత్యయము పర మగునపుడు వినిప్రత్యయము లోపించగా 'స్రజీయాన్' అను రూపము సిద్ధించినది. "అయమనయోః అతిశయేన స్రగ్వీ"అని విగ్రహము.

త్వచిష్ఠః- 'అయమేషాం అతిశయేన త్వగ్వాన్' 'మతుప్'ప్రత్యయాంత మగు త్వగ్వచ్ఛబ్దముకంటె 'ఇష్ఠన్'ప్రత్యయము. అది పరముగా నుండగా 'మతుప్'కు లోపము,అది లోపించిన పిమ్మట-తన్నిమిత్తక మగు కుత్వము కూడ పోయి 'త్వచిష్ఠః'అను రూపము సిద్ధించినది. త్వచీయాన్:- 'అయమనయోః అతిశయేన త్వగ్వాన్' త్వగ్వచ్ఛబ్దముకంటె 'ఈయసున్'ప్రత్యయము. అది పరముగా నుండగా 'మతుప్'ప్రత్యయము లోపించినది-'త్వచీయాన్'.

1229. ఈషదసమాప్తౌ కల్పప్-దేశ్య-దేశీయరః. 5-3-67

ఈషదూనో విద్వాన్ విద్వత్కల్పః. విద్వద్దేశీయః. పచతి కల్పమ్.

ఈషదసమాప్తివిశిష్టార్థమును బోధించు సుబంతతిజంతములకంటె స్వార్థమునందు 'కల్పప్' 'దేశ్య' 'దేశీయర్'అను ప్రత్యయములు వచ్చును.

'ఈషదసమాప్తి'యనగా కొంచెము తక్కువ అని యర్థము. విద్వత్కల్పః- 'ఈషదూనో విద్వాన్'అను విగ్రహమున విద్వచ్ఛబ్దముకంటె 'కల్పప్'ప్రత్యయము. కొంచెము తక్కువగ పండితుడుఅని యర్థము. ఇట్లే 'దేశ్య' 'దేశీయర్' (దేశీయ) ప్రత్యయములు చేయగా 'విద్వద్దేశ్యః' 'విద్వద్దేశీయః'అను రూపములగును. పచతికల్పమ్:- 'తిఙశ్చ' అను సూత్రమును అనువర్తింప చేసికొని తిజంతముకంటె గూడ ఈప్రత్యయములు వచ్చునని చెప్పుటచే "ఈషదసమాప్తం పచతి"అను విగ్రహమునందు 'కల్పప్'ప్రత్యయమును చేర్చగా 'పచతికల్పమ్'అను రూపము సిద్ధించినది.

ఈఘట్టమునందలి ఉదాహరణము లన్నిటియందును "స్వార్థికాః ప్రకృతితో లిఙ్గవచనాన్యనువర్తన్తే"అను నియమమును అనుసరించి కల్పబాద్యంతపదముల లింగము వాటి ప్రకృతిలింగమును బట్టి యుండును 'పచతి కల్పమ్' ఇత్యాదుల

మాత్రము నపుంసకప్రథమైకవచనమున ప్రయుక్తము లగును. "క్రియాప్రధాన మాఖ్యాతం; ద్రవ్యప్రధానం నామ"అను భాష్యకారసిద్ధాంతము ననుసరించి 'పచతి కల్పమ్'అనుపదమునకు "ఈషదసమాప్తమగు పాకక్రియ"అని యర్థము. 'పచతః కల్పమ్'. 'పచన్తి రూపమ్' ఇత్యాదులందుగూడ ద్విత్వబహుత్వములు తిఙ్చేతనే అభిహితములై యుండుటచే ఇవికూడ "ఏకవచనముత్సర్గతః కరిష్యే" (సామాన్యనియముననుసరించి ఏ వచనముచేయుదును). "నపుంసకత్వంతులోకాత్"అను భాష్యకారవచనముచే నపుంసకలింగైకవచనమున ప్రయోగింపబడును.

1230. విభాషా సుపో బహుచ్ పురస్తాత్తు. 5.3.68.

ఈషదసమాప్తివిశిష్టేఽర్థే సుబన్తాత్ బహుచ్ వా స్యాత్; స చ ప్రాగేవ; న తు పరతః. ఈషదూనః పటుః బహుపటుః, పటుకల్పః. సుపః కిమ్-యజతికల్పమ్.

ఈషదసమాప్తివిశిష్టార్థమును బోధించు సుబంతము కంటె పూర్వమున 'బహుచ్' ప్రత్యయము వచ్చును; ఇది పూర్వమునందే వచ్చును గాని పరమునరాదు.

బహుపటుః:-'ఈషదూనః పటుః'అను విగ్రహమున ప్రథమైకవచనాంతపటుశబ్దముకంటె పూర్వము ఈ సూత్రముచే 'బహు(చ్)'ప్రత్యయము- 'బహుపటు సు'అని యుండగా ఇది తద్ధితాంతము కాకుండుటచే "కృత్తద్ధిత సమాసాశ్చ"అను సూత్రముచే (117) ప్రాతిపదికత్వము లభింపకున్నను 'అర్థవదధాతురప్రత్యయఃప్రాతిపదికమ్" అను సూత్రముచే (116) లభించును. 'పటు సు'అనునది ప్రత్యయాంత మైనను 'బహుపటు సు'అను సముదాయము ప్రత్యయాంతము కాకుండుటచే 'అప్రత్యయః'అను నిషేధము ప్రవర్తింపదు. "ప్రత్యయగ్రహణే యస్మాత్సవిహితస్తదాదేస్తస్య గ్రహణమ్ -దేనికంటె పరముగ ప్రత్యయము వచ్చినదో దానితో ప్రారంభమగుదానిని మాత్రమే ప్రత్యయాంత మని చెప్పినపుడు గ్రహింపవలెను-అను న్యాయమును అనుసరించి 'పటు'శబ్దము కంటెనే 'సు'ప్రత్యయము వచ్చినది గాన ప్రత్యయాంత మనగా 'పటు సు'అనునదియే యగును గాని తద్ధితప్రత్యయము చేర్చిన పిదప లభించిన 'బహుపటు సు'అనునది కాదు ఈ విధముగ 'బహుపటు సు'అనునది ప్రాతిపదికమగుటచే సుబ్లోపము (సూ. 724). ఇపుడు 'బహుపటు' అను ప్రాతిపదికముకంటె

ప్రథమైకవచనమునందు 'సు'ప్రత్యయము చేర్చగా 'బహుపటుః'అను రూపము సిద్ధించినది. బహుచ్ ప్రత్యయము వైకల్పికము గాన ఇది రాని పక్షమున కల్ప బాది ప్రత్యయములు వచ్చి 'పటుకల్పః'ఇత్యాదిరూపములు సిద్ధించును.

సుబంతముకంటెనే బహుచ్ ప్రత్యయము వచ్చు నని చెప్పుటచే 'యజతి' అను తిజంతముకంటె పూర్వసూత్రముచే 'కల్పప్'ప్రత్యయము వచ్చి 'యజతి కల్పమ్'అను రూపము సిద్ధించినది. బహుచ్ప్రత్యయము రాలేదు.

1231. ప్రాగివాత్కః. 5.3.70.

'ఇవే ప్రతికృతౌ'ఇత్యతః ప్రాక్ కాధికారః.

'ఇవే ప్రతికృతౌ'అను సూత్రముకంటె పూర్వము 'కః' అనునది అధికృత మగును.

1232. అవ్యయసర్వనామ్నామకచ్ ప్రాక్ టేః. 5.3.71.

కాపవాదః. తిఙశ్చేత్యనువర్తతే.

అవ్యయములయొక్కయు, సర్వనామశబ్దములయొక్కయు, టికి పూర్వము 'అకచ్' ప్రత్యయము వచ్చును. కకారముపై అకారము ఉచ్చారణార్థము; చకారము ఇత్సంజ్ఞకము. 'అక్'శేషించును.

ఈ 'అకచ్'ప్రత్యయము 'క'ప్రత్యయమునకు అపవాదము. 'తిఙశ్చ' అనునది అనువర్తించుటచే తిఙంతముల 'టి'కి పూర్వము గూడ 'అకచ్'ప్రత్యయము వచ్చు నను నర్థము సిద్ధించును.

ఈ సూత్రమునందు అవ్యయసర్వనామాదుల 'టి'కి పూర్వమునందు అకచ్ ప్రత్యయము వచ్చు నని సామాన్యరూపమున చెప్పబడి యుండగా వార్తికకారుడు ఇచట నియమమును విధించుచున్నాడు-

వా. ఓకారసకారభకారాదౌ సుపి సర్వనామ్నష్టేః ప్రాగకచ్, అన్యత్ర తు సుబన్తస్య టేః ప్రాగకచ్.

ఓకారాదియు, సకారాదియు, భకారాదియు నగు 'సుప్'ప్రత్యయము పర మగునపుడు సర్వనామశబ్దముయొక్క టికి పూర్వమునందు 'అకచ్'ప్రత్యయము వచ్చును; తద్భిన్నసుప్ప్రత్యయములు పర మగునపుడుమాత్రము, సుబంత మగు సర్వనామముయొక్క టికి పూర్వమునందు 'అకచ్'ప్రత్యయము వచ్చును.

ఈ వార్తికము యుష్మదస్మచ్ఛబ్దముల విషయమున మాత్రమే వర్తించు ననియు, ఇతర సర్వనామములయందు, ప్రాతిపదికయొక్క 'టి'కి పూర్వమే 'అకచ్' వచ్చు ననియు భాష్యకారులు చెప్పి యున్నారు.

1233. అజ్ఞాతే. 5.3.73.

కస్యాయమశ్వః-అశ్వకః. ఉచ్చకైః. నీచకైః. సర్వకే. యువకయోః. ఆవకయోః. యుష్మకాసు. అస్మకాసు. యుష్మకాభిః. అస్మకాభిః. త్వయకా. మయకా.

అజ్ఞాతము అను నర్థమును బోధించు సుబంతముకంటె స్వార్థమునందు క ప్రత్యయము వచ్చును, అవ్యయసర్వనామతిజంతముల టికి పూర్వము 'అకచ్' వచ్చును.

అశ్వకః-'అజ్ఞాతః అశ్వః'అని విగ్రహము. అనగా "కస్యాయ మశ్వః -ఇది ఎవరి అశ్వమో తెలియదని యర్థము. ఈ విగ్రహమున 'అశ్వ' శబ్దముకంటె క ప్రత్యయము. ఉచ్చకైః, నీచకైః-'ఉచ్చైః' 'నీచైః'అను అవ్యయములకు పూర్వసూత్రముచే టికి పూర్వము అకచ్ ప్రత్యయము.

సర్వకే:-ప్రథమాబహువచనమున 'సర్వ జస్'అని యుండగా పూర్వ సూత్రముచే 'సర్వ'శబ్దముయొక్క 'టి'కి 'అకచ్'ప్రత్యయము-'సర్వ్ అక్ అ జస్' సర్వకజస్ అని యుండగా 'జస్'కు-'శీ'ఆదేశము వచ్చి (సూ. 122) 'సర్వకే'అను రూపము సిద్ధించినది. ఇక వార్తికమునకు ఉదాహరణములు చూప బడుచున్నవి.

యువకయోః-ఆవకయోః-'యుష్మద్' 'అస్మద్'శబ్దములకు 'ఓస్' పరమగునపుడు, ఓకారాది సుప్ప్రత్యయము పరముగా నున్నది. గాన పై వార్తి కముచే 'టి'యగు 'అద్'కు పూర్వము 'అకచ్'ప్రత్యయము-'యుష్మ్అక్అద్ ఓస్' 'అస్మ్అక్అద్ఓస్'అని యుండగా మపర్యంతభాగమునకు 'యువావౌ ద్వివచనే'అను సూత్రముచే (315) 'యువ' 'ఆవ'ఆదేశములు-'యువఅకద్ ఓస్' 'ఆవఅకద్ఓస్'అని యుండగా 'అతో గుణే'అను సూత్రముచే (275) పర రూపము 'యోఽచి'అను సూత్రముచే (321) దకారమునకు యకారాదేశము-'యువకయోః', 'ఆవకయోః'. యుష్మకాసు, అస్మకాసు:-సకారాది ప్రత్యయ మగు 'సు'పర మగుటచే యుష్మదస్మచ్ఛబ్దముల 'టి'కంటె పూర్వము పై వార్తిక

ముచే 'అకచ్'ప్రత్యయము-'యుష్మకద్ సు' 'అస్మకద్ సు'అని యుండగా 'యుష్మదస్మదోరనాదేశే'అను సూత్రముచే (322) దకారమునకు ఆకారము- 'యుష్మకాసు' 'అస్మకాసు'. యుష్మకాభిః, అస్మకాభిః:-భకారాది ప్రత్యయ మగు 'భిస్' పరమగుటచే యుష్మదస్మచ్ఛబ్దముల 'టి'కి పూర్వము అకచ్ ప్రత్యయము. దకారమునకు ఆకారాదేశము (సూ. 322)-'యుష్మకాభిః' 'అస్మకాభిః'. 'త్వయకా, మయకా:-యుష్మదస్మచ్ఛబ్దముల తృతీయైకవచనము నందు, 'త్వయా' 'మయా'అను రూపములు సిద్ధించిన పిమ్మట ఆవిధముగ సిద్ధించిన సుబంతముల 'టి'కి పూర్వము 'అకచ్'ప్రత్యయము చేర్పగా 'త్వయకా' 'మయకా'అను రూపములు సిద్ధించినవి. 'టా'(ఆ)అనెడు తృతీయైక వచనసుప్ప్రత్యయము ఓకారాది గాని, సకారాది గాని, భకారాది గాని కాకుండు టచే, అకచ్ప్రత్యయము, ప్రకృతియొక్క 'టి'కి పూర్వము రాక, సుబంత మగు 'త్వయా' 'మయా'అనువాటి 'టి'కి పూర్వమే వచ్చినది. ప్రకృతియొక్క 'టి'కి పూర్వము వచ్చి యున్నచో 'త్వకయా' "మకయా"అను అనిష్టరూపములు సిద్ధించెడివి.

1234. కుత్సితే. 5.3.74.

కుత్సితోఽశ్వః-అశ్వకః.

కుత్సితత్వార్థవిశిష్ట మగు సుబంతముకంటె స్వార్థమునందు కప్రత్యయము వచ్చును.

అశ్వకః-'కుత్సితః అశ్వః'అను విగ్రహమునందు అశ్వశబ్దముకంటె కప్రత్యయము.

1235. *కింయత్తదోనిర్ధారణేద్వయోరేకస్య డతరచ్.* 5.3.92

అనయోః కతరో వైష్ణవః,యతరః,తతరః.

రెండింటిలో నొకదానిని నిర్ధారణ చేయునపుడు నిర్ధార్యమాణవాచకము లగు ప్రయుక్తము లగు 'కిమ్' 'యద్' 'తద్'శబ్దములకంటె 'డతరచ్'ప్రత్యయము వచ్చును.

అనయోః కతరో వైష్ణవః- ఈఇరువురిలో ఎవ్వడు వైష్ణవుడు? ఇచట ఇరువురిలో ఒకనిని గూర్చి నిర్ధారణ చేయబడుచున్నది. అందుచే 'కిమ్' శబ్దముకంటె 'డతరచ్'ప్రత్యయము. డకారచకారములు ఇత్సంజ్ఞకములు. 'కిమ్

అతర'అని యుండగా'టేః'అను సూత్రముచే (242) 'కిమ్'యొక్క 'టి'కి ('ఇమ్'కు) లోపము. ఈ విధముగనే 'అనయోః యః' 'అనయోః సః'అనునర్థములందు యత్తచ్ఛబ్దములకంటె 'డతరచ్'ప్రత్యయము వచ్చిన పిమ్మట టిలోపము చేయగా 'యతరః' 'తతరః' అను రూపములు సిద్ధించినవి. మహావిభాషచే 'డతరచ్'ప్రత్యయము రాని పక్షమున '-ః' 'యః' 'సః'అను రూపములు సిద్ధించును

1236. వా బహూనాం జాతిపరిప్రశ్నే డతమచ్. 5.3.93

బహూనాం మధ్యే ఏకస్య నిర్ధారణే డతమచ్ స్యాత్ ''జాతిపరిప్రశ్నే''ఇతి ప్రత్యాఖ్యాతమాకరే,కతమో భవతాం కఠః. యతమః. తతమః వాగ్రహణం అకజర్థమ్-యకః,సకః.

ఇతి ప్రాగివీయాః.

పూర్వసూత్రమునుండి 'కింయత్తదః' 'నిర్ధారణే' 'ఏకస్య'అనువర్తించును. రెండుకంటె అధిక మగు సంఖ్య గల వ్యక్తులలో ఒక వ్యక్తియొక్క నిర్ధారణము చేయవలసి యున్నపుడు, జాతిని గూర్చిన ప్రశ్న సూచింపబడుచుండగా,నిర్ధార్యమాణవాచకము లగు 'కిమ్' 'యద్' 'తద్'శబ్దములకంటె 'డతమచ్' ప్రత్యయము వచ్చును. భాష్యకారులు ఈ సూత్రమునందలి 'జాతిపరిప్రశ్నే'అనునది అనావశ్యక మని నిరాకరించి, జాతిప్రశ్నము ద్యోత్యము కాకున్నను 'డతమచ్'ప్రత్యయము రావచ్చు నని సూచించి యున్నారు.

కతమో భవతాం కఠః- మీలో ఎవరు కఠశాఖకు చెందినవాడు? కఠశాఖీయు లందరును ఒక జాతికి చెందినవారుగాన ఇది జాతివిషయకప్రశ్నము. అందుచే 'కిమ్'శబ్దముకంటె 'డతమచ్'ప్రత్యయము. డకారచకారములు ఇత్సంజ్ఞకములు, టిలోపము (సూ-242)-'కతమః'. ఇట్లే యత్తచ్ఛబ్దములకంటె డతమచ్ప్రత్యయము చేయగా 'యతమః' 'తతమః' అను రూపములు సిద్ధించినవి.

సూత్రమునందు 'వా' అను పదమును ప్రయోగించుటచే డతమచ్ప్రత్యయము రాని పక్షమున "అకచ్"ప్రత్యయము వచ్చి'యకః' 'సకః'అను రూపములు సిద్ధించును.

ప్రాగివీయప్రకరణము సమాప్తము.

# అథ స్వార్థికాః

## 1237. ఇవే ప్రతికృతౌ. 5.3.96

కన్ స్యాత్. అశ్వ ఇవ ప్రతికృతిః-అశ్వకః.

'అవక్షేపణే కన్'నుండి 'కన్'అనువర్తించును. 'ఇవ'శబ్దమునకు ఉపమానత్వము అర్థము. ఉపమానత్వవిశిష్టార్థవాచక మగు ప్రాతిపదికముకంటె ఉపమేయము ప్రతికృతియైనచో,'కన్'ప్రత్యయము వచ్చును. మట్టి మొదలగువాటితో నిర్మితమగు ప్రతిమకు ప్రతికృతి యని పేరు. 'అశ్వకః- 'అశ్వమువలె నున్న ప్రతికృతి'యను నర్థమునందు ఉపమానవాచక మగు అశ్వశబ్దముకంటె 'కన్' ప్రత్యయము 'అశ్వకః' .ప్రతికృతిశబ్దము స్త్రీలింగమైనను "స్వార్థికాః ప్రకృతితో లిఙ్గవచనాన్యనువర్తన్తే"అను నియమము ననుసరించి 'అశ్వకః'అను కన్ ప్రత్యయాంతము ప్రకృతియగు అశ్వశబ్దముయొక్క లింగమునందు ప్రయోగింపబడినది.

వా. సర్వప్రాతిపదికేభ్యః స్వార్థే కన్.

అశ్వకః,

అన్ని ప్రాతిపదికములకంటెను స్వార్థమునందు 'కన్' ప్రత్యయము వచ్చును.

అశ్వకః- 'అశ్వ ఏవ అశ్వకః'అని విగ్రహము. ఇచ్చట 'అశ్వ'శబ్దముకంటె స్వార్థమునందు 'కన్'ప్రత్యయము వచ్చినది.

## 1238. తత్ప్రకృతవచనే మయట్. 5.4.21

ప్రాచుర్యేణ ప్రస్తుతం ప్రకృతమ్,తస్య వచనమ్-ప్రతిపాదనమ్. భావే అధికరణే వా ల్యుట్.ఆద్యే-ప్రకృతమన్నమ్-అన్నమయమ్.అపూపమయమ్.ద్వితీయే తు-అన్నమయో యజ్ఞః,అపూపమయం పర్వ.

'తత్'అనునది ప్రథమాంతమును నిర్దేశించుచున్నది. 'ప్రకృత'శబ్దమునకు అధికరూపమున ప్రస్తుత మైనది అని యర్థము. 'వచన'శబ్దమును'ఉచ్యతే ఇతి వచనమ్'అనుభావార్థకల్యుడంతముగను, 'ఉచ్యతే అత్ర' అను అధికరణార్థక ల్యుడంతముగను గ్రహించుటచే 'ప్రతిపాదించుట','దేని యందుప్రతిపాదింపబడుచున్నదో అది'అను అర్థద్వయము లభించును. ఇచట ఈ అర్థద్వయము

కూడ వివక్షితము. భావార్థమును గ్రహించిన పక్షమున ప్రాచుర్యవిశేషణక మగు (ప్రాచుర్యవిశిష్ట మగు) వస్తువును బోధించు ప్రథమాంతముకంటె స్వార్థము నందు 'మయట్' వచ్చుననుఅర్థము లభించును. ఇచట ప్రకృతి ప్రాచుర్యవిశిష్టా ర్థమును బోధించును;ప్రత్యయము ఆయర్థమును సూచించును.

అధికరణార్థకల్యుడంతముగ గ్రహించిన పక్షమున ప్రాచుర్యవిశిష్ట మగు ఏ వస్తువు ఏ అధికరణమునందు ఉన్న దని చెప్పబడుచున్నదో,ఆ అధికరణము వాచ్య మగునపుడు, అట్టి వస్తువాచకమగు శబ్దముకంటె మయట్ప్రత్యయము వచ్చునను అర్థము లభించును. ఈ పక్షమునందు, ప్రకృతి ప్రాచుర్యవిశిష్టవస్తు వును బోధించును. దాని అధికరణమును ప్రత్యయము బోధించును.

అన్నమయమ్:- ఇది మొదటి యర్థమున కుదాహరణము. 'ప్రకృతం- ప్రచుర మైన,అన్నం'అను నర్థమున ప్రచురాన్నవాచక మగుప్రథమాంతఅన్నశబ్ద ముకంటె 'మయట్'ప్రత్యయము వచ్చి'అన్నమయం'అను రూపము సిద్ధించినది. స్వార్థికప్రత్యయ మగుటచే 'అన్న'శబ్దలింగమగు నపుసంకలింగము వచ్చినది. ప్రచుర మైన అన్నముఅని యర్థము. ఇట్లే 'ప్రకృతం అపూపం'అను నర్థమున 'అపూపమయమ్'అను రూపము సిద్ధించినది.

అన్నమయో యజ్ఞః-ఇది భావార్థకల్యుట్పక్షమునందు ఉదాహరణము. 'ప్రకృతం అన్నం యస్మిన్ యజ్ఞే'అనునర్థమునందు ప్రాచుర్యవిశిష్టాన్న వాచక మగు అన్నశబ్దముకంటె,అధికరణార్థమునందు 'మయట్'ప్రత్యయము చేర్చగా 'అన్నమయః'అను రూపము సిద్ధించినది. 'ప్రచుర మైన అన్నము గలది'. ఇచట మయట్ అధికరణార్థము గాన, (స్వార్థికము కాదు గాన), ప్రకృతిలిం గము కాక విశేష్యలింగము వచ్చినది. ఇట్లే 'ప్రకృతాని అపూపాని యస్మిన్ తత్'అను నర్థమున అపూపశబ్దముకంటె మయట్ప్రత్యయము వచ్చి విశేష్య నిఘ్న మగు'అపూపమయమ్' (పర్వ)అను రూపము సిద్ధించినది.

### 1239. ప్రజ్ఞాదిభ్యశ్చ. 5.4 38

అణ్ స్యాత్. ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః. ప్రాజ్ఞీ స్త్రీ. దైవతః. బాన్ధవః.

'తద్యుక్తాత్కర్మణోఽణ్'నుండి 'అణ్'అనువర్తించును. ప్రజ్ఞాదిశబ్ద ములకంటె స్వార్థమునందు 'అణ్'ప్రత్యయము వచ్చును.

ప్రాజ్ఞః-(ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః). 'ప్రజ్ఞ'శబ్దముకంటె స్వార్థమునందు 'అణ్'ప్రత్యయము.ఆదివృద్ధి-. 'ప్రాజ్ఞః'. 'ప్రాజ్ఞశబ్దముఅణంతమగుటచేస్త్రీలిం

గము'టిడ్ఢాణఞ్'-ఇత్యాది సూత్రముచే (1250) జీప్వచ్చి అకారములోపింపగా (సూ-236) 'ప్రాజ్ఞీ'అను రూపము సిద్ధించును. దైవతః- 'దేవతా'శబ్దము కంటె స్వార్థమునందు అణ్ ప్రత్యయము;ఆదివృద్ధి;ఆకారలోపము-'దైవతః'ఇది పుంనపుంసకశబ్దము. బాన్ధవః- (బన్ధురేవ బాన్ధవః)-బన్ధుశబ్దముకంటె స్వార్థమునందు అణ్ ప్రత్యయము. 'అచోఞ్ణితి'అనుసూత్రముచే (182) ఆదివృద్ధి, 'ఓర్గుణః'అను సూత్రముచే (1005) అంత్యోకారమునకు గుణము; అవాదేశము-'బాన్ధవః'.

1240. బహ్వల్పార్థాత్ శస్ కారకాదన్యతరస్యామ్. 5 4·42

బహూని దదాతి-బహుశః. అల్పశః.

బహ్వర్థము కాని అల్పార్థము కాని యై కారకవాచక మగు శబ్దముకంటె స్వార్థమునందు శస్ ప్రత్యయము వికల్పముగ వచ్చును.

బహుశః- 'బహూని దదాతి'అనునపుడు దానక్రియయందు కర్మకారకముగా నున్న బహ్వర్థక'బహు'శబ్దముకంటె 'శస్'ప్రత్యయము. సకారమునకు రుత్వవిసర్గములు-'బహుశః'. ఈ విధముగ శస్ ప్రత్యయము వచ్చిన పక్షమున 'బహుశః దదాతి'అనియు,రాని పక్షమున "బహూన్ దదాతి"అనియు ప్రయోగింపవచ్చును. 'అల్పశః' ఇది కూడ పైవిధముగ నిష్పన్న మగును. బహ్వల్పార్థశబ్దములకుశస్ప్రత్యయమువచ్చునవిచెప్పుటచే'భూరిశః'దదాతి' 'స్తోకశః దదాతి" ఇత్యాదిస్థలములందుగూడ శస్ప్రత్యయము వచ్చును.

వా. ఆద్యాదిభ్య స్తసేరుపసంఖ్యానమ్.

ఆదౌ-ఆదితః. మధ్యతః. అన్తతః. పార్శ్వతః. ఆకృతిగణోఽయమ్. స్వరేణ-స్వరతః. వర్ణతః.

ఆద్యాదిశబ్దములకంటె, సర్వవిభక్తుల అర్థమునందును తసిప్రత్యయము చెప్పదగిది. ఈ 'తసి'ప్రత్యయము అన్ని విభక్తులయొక్కయు అర్థమునందు విధింపబడినది గాన దీనికి 'సార్వవిభక్తికతసి'అని పేరు.

'ఆదితః', 'మధ్యతః', 'అన్తతః', 'పార్శ్వతః', ఈ ఉదాహరణములందు 'ఆది'మొదలగు శబ్దములకంటె ఆదౌ, మధ్యే, అన్తే, పార్శ్వేఅను సప్తమ్యంతార్థములందు తసి(తస్)ప్రత్యయము వచ్చినది.

ఆద్యాదిగణము ఆకృతిగణమగుటచే 'స్వరేణ' 'వర్ణేన'అను తృతీయాం

తార్థమునందు స్వర, వర్ణ శబ్దములకంటె 'తసి' ప్రత్యయము వచ్చి 'స్వరతః' 'వర్ణతః' అను రూపములు సిద్ధించును. 'శస్' 'తసి' ప్రత్యయాంతములు 'తద్ధితశ్చాసర్వవిభక్తిః' అను సూత్రముచే (369) అవ్యయము లగును.

1241. కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః. 5.4.50.
వా. అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్.

వికారాత్మతాం ప్రాప్నువత్యాం ప్రకృతౌ వర్తమానాద్వికారశబ్దాత్ స్వార్థే చ్విర్వా స్యాత్ కరోత్యాదిభిర్యోగే.

సంపద్యస్య కర్తా-సంపద్యకర్తా. సంపద్యశబ్దమునకు సంపదనము-అనగా సంపన్న మగుట అని యర్థము. 'సంపద్యకర్త' యనగా సంపన్నమగునది అని యర్థము. ఏది, ఏదిగా సంపన్నముకావలెను అను నాకాంక్ష కలుగగా వార్తికకారుడు "అభూతతద్భావఇతి కర్తవ్యమ్" అని వ్రాయుచు ఏ వస్తువు, మొదట ఏ రూపమున లేదో ఆ వస్తువు ఆ రూపమును పొందుట" అను నర్థమును స్పష్టీకరించి యున్నాడు.

వికారాత్మత్వమును పొందిన ప్రకృతిని (గౌణవృత్తిచే) బోధించు వికారవాచకశబ్దముకంటె, కృ, భూ, అస్ ధాతువులతో సంబంధ మున్నపుడు 'చ్వి' ప్రత్యయము వికల్పముగ వచ్చును.

'సువర్ణం కుండలీకరోతి' (బంగారమును కుండలముగా చేయుచున్నాడు) ఇత్యాదులందు ప్రకృతి సువర్ణము; అది కుండలాత్మత్వమును పొందుచున్నది. వికృతివాచక మగు కుండలశబ్దము గౌణవృత్తిచే సువర్ణమును బోధించుచున్నది. ఈ సూత్రముచే విహిత మగు చ్విప్రత్యయము వికృతివాచకశబ్దముకంటెనే వచ్చును, ప్రకృతివాచకముకంటె రాదు. ఇందు వ్యాఖ్యానమే ప్రమాణము. ఇచట అన్ని ఉదాహరణములందును మృద్ఘటాదులకును, సువర్ణకుండలాదులకును గల ప్రకృతివికృతిభావము ఉండవలసిన పని లేదు. "మొదట ఆ రూపమున లేనిది ఆరూపమును చెందుట" అనునది ఉన్న చాలును.

1242. అస్య చ్వౌ. 7.4.32.

అవర్ణస్య ఈత్ స్యాత్ చ్వౌ. వేర్లోపః. చ్వ్యన్తత్వాదవ్యయత్వమ్. అకృష్ణః కృష్ణః సంపద్యతే, తం కృష్ణం కరోతి కృష్ణీకరోతి. బ్రహ్మీభవతి. గఙ్గీస్యాత్.

వా. అవ్యయస్య చ్వావీత్వం నేతి వాచ్యమ్. దోషాభూతమ్ అహః. దివాభూతా రాత్రిః.

'ఈఘ్రాధ్మోః'నుండి 'ఈ'అనువర్తించును. 'చ్వి'ప్రత్యయము పర మగునపుడు ఈకారము ఆదేశముగ వచ్చును. 'చ్వి'లోని చకారము ఇత్సంజ్ఞకము; ఇకారము ఉచ్చారణార్థము. 'వేరపృక్తస్య'అను సూత్రముచే (304) వకారమునకు లోపము. ఈవిధముగ 'చ్విప్రత్యయము 'క్విప్'వలె సర్వలోపి. 'చ్వి'ప్రత్యయాంతములు 'ఊర్యాదిచ్విడాచశ్చ'అను సూత్రముచే (953) నిపాతసంజ్ఞములు గాన 'స్వరాదినిపాతమవ్యయమ్'అను సూత్రముచే (368) వాటికి అవ్యయత్వము.

కృష్ణీకరోతి:–ఇది కృఞ్ధాతుయోగమునందు చ్విప్రత్యయము వచ్చుటకు ఉదాహరణము. కృష్ణుడు కాని నటుడు కృష్ణుడుగా అగుచున్నాడు. ఇట్లు కృష్ణుడుగా సంపన్ను డగుటలో ప్రకృతిభూతు డగు ఆ నటుడు కర్త గాన అతనికి సంపద్యకర్తృత్వ మున్నది. అట్టి కృష్ణుడు కాని నటుని కృష్ణుడుగా అగునట్లు చేయుచున్నాడు అను నర్థమున (అకృష్ణం కృష్ణరూపేణ సంపద్యమానం కరోతి) అభేదసంబంధముచే నటుని తెలుపుచున్న వికారభూతకృష్ణవాచకశబ్దముకంటె ఈ సూత్రముచే 'చ్వి'ప్రత్యయము. 'కృష్ణ'శబ్దమునందలి అకారమునకు ప్రకృతసూత్రముచే ఈకారము–'కృష్ణీకరోతి',

బ్రహ్మీభవతి:–'అబ్రహ్మ బ్రహ్మ సంపద్యమానం భవతి'అను నర్థమునందు భూధాతుసంబంధము గల వికారవాచకబ్రహ్మశబ్దముకంటె చ్విప్రత్యయము. దానికి లోపము. "సుపోధాతుప్రాతిపదికయోః"అను సూత్రముచే (724) లుప్త మగు 'సుప్'ను ఆధారముగ గొని పదత్వ మున్నది గాని 'బ్రహ్మన్'లోని నకారమునకు "నలోపః ప్రాతిపదికాన్తస్య"అను సూత్రముచే (180) లోపము. అకారమునకు ఈత్వము–'బహ్మీభవతి'. గఙ్గీస్యాత్:–'అగంగా గంగా సంపద్యమానా స్యాత్'అను నర్థమునందు 'అస'ధాతుయోగమున గంగాశబ్దముకంటె చ్విప్రత్యయము. అకారమునకు ఈకారము–'గంగీస్యాత్'.

చ్విప్రత్యయము పర మగునపుడు అవ్యయమునకు ఈత్వము రాదని చెప్పవలెను, అని వార్తికమున కర్థము,

దోషాభూతం అహః:–"అదోషా దోషా సంపద్యమానం భూతం" అను నర్థమునందు 'దోషా'అను అవ్యయముకంటె చ్విప్రత్యయము. ఇపుడు

'అస్య చ్వౌ'అను సూత్రముచే (122) ఈత్వము రావలసి యుండగా అది ఈ వార్తికముచే నిషిద్ధమైనది.-"దోషాభూతమ్". 'దోషా'అను అవ్యయమునకు 'రాత్రియందు' అని యర్థము. ఇచట రాత్రి యని మాత్రమే యర్థము మేఘాదులచే పగలు రాత్రిగా నైనట్లు వర్ణించుటకై చేసిన ప్రయోగము.

దివాభూతా రాత్రిః-'దివా'అను అవ్యయమునకు 'పగటియందు' అని యర్థము. ఇచట 'పగలు'అనియే అర్థము. దీపకాంత్యాద్యతిశయముచే రాత్రి కూడ పగటివలె కనబడుచున్నదని వర్ణించునపుడు "అదివా దివా సంపద్యమానా భూతా"అను నర్థమున చ్విప్రత్యయము, ఈత్వనిషేధము.

1243. విభాషా సాతి కార్త్స్న్యే 5.4,52.

చ్వివిషయే సాతిర్వా స్యాత్ సాకల్యే.

"కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః"అనునది, "అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్"అను వార్తికముతో సహితముగ అనువర్తించును. సాకల్యార్థమును బోధింప వలసి యున్నపుడు, చ్విప్రత్యయము వచ్చుటకు అవకాశము గల స్థలములలో-అనగా అభూతతద్భావార్థమునందు, కృ, భూ, అస్ ధాతువులతో సంబంధ మున్నపుడు, సంపద్యకర్త్రర్థమున-సాతిప్రత్యయము వికల్పముగ వచ్చును.

1244. సాత్ పదాద్యోః. 8.3 111

సస్య షత్వం న స్యాత్. దధి సిఞ్చతి. కృత్స్నం శస్త్రం అగ్నిః సంపద్యతే-అగ్నిసాద్ భవతి.

'నరపర సృపి సృజి స్పృశి స్పృహి సవనాదీనామ్' "అపదాన్తస్య మూర్ధన్యః"అను సూత్రములనుండి 'న' 'మూర్ధన్యః' అనువర్తించును. సాతి ప్రత్యయావయవసకారమునకును, పదాదిసకారమునకును షత్వము రాదు.

దధి సిఞ్చతి:-ఇది పదాదిసకారమునకు ఉదాహరణము. 'షిచి'ధాతు షకారమునకు 'ధాత్వాదేః షస్సః'అను సూత్రముచే (255) సత్వము. ఆస కారమునగు ఇచట 'ఆదేశప్రత్యయయోః'అను సూత్రముచే (150) షత్వము రావలసి యుండ ఈ సూత్రము నిషేధించుచున్నది.

అగ్నిసాద్ భవతి:-'కృత్స్నం శస్త్రం అగ్నిః సంపద్యమానః భవతి' ఆయుధమంతయు అగ్నిగా అగుచున్నది అను అభూతతద్భావార్థమున భూధాతు

సంబంధ మున్నది గాన అగ్నిశబ్దముకంటె 'సాతి' (సాత్) ప్రత్యయము చేయగా 'అగ్నిసాత్'అను రూపము సిద్ధించినది. సాతి ప్రత్యయము రాని పక్షమున అగ్ని శబ్దముకంటె 'చ్వి'ప్రత్యయము. దానికి సర్వలోపము-'అగ్ని భవతి'అని యుండగా:—

1245. చ్వౌ చ. 7.4.26

చ్వౌ చ పరే పూర్వస్య దీర్ఘః స్యాత్. అగ్నీభవతి.

'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః'నుండి 'దీర్ఘః'అనువర్తించును. 'చ్వి' ప్రత్యయము పర మగునపుడు పూర్వాచ్‌కు దీర్ఘము వచ్చును. ఈ సూత్రముచే ఇకారమునకు దీర్ఘము చేయగా "అగ్నీభవతి" అను రూపము సిద్ధించును.

1246. అవ్యక్తానుకరణాద్ ద్వ్యజవరార్ధాదనితౌ డాచ్. 5.4.57

ద్వ్యజేవావరం న్యూనం,న తు తతో న్యూనం,అనేకాచ్ ఇతి యావత్; తాదృశం అర్ధం యస్య, తస్మాద్ డాచ్ స్యాత్కృభ్వస్తి భిర్యోగే.

'కృభ్వస్తియోగే సంపద్యకర్తరిచ్విః'నుండి 'కృభ్వస్తియోగే'అనువర్తించును. 'ద్వ్యజవరం'అనగా రెండు అచ్చులు న్యూనము కలది-అనగా రెండుకంటె తక్కువ కాని అచ్చులు కలది-కనీసమురెండచ్చులుకలది అని యర్థము. అట్టి అర్ధభాగము గల అస్పష్టానుకరణరూప మగు శబ్దముకంటె కృ, భూ,అస్ ధాతువులతో సంబంధ మున్నపుడు 'ఇతి'శబ్దము పరముగ లేనప్పుడు డాచ్ప్రత్యయము వచ్చును. 'డాచ్'లోని డకారచకారములు ఇత్సంజ్ఞకములు.

వా. డాచి చ ద్వే బహులమ్.

ఇతి డాచి వివక్షితే ద్విత్వమ్.

డాచ్ప్రత్యయము చేయుటకు ఉద్దిష్టమై యుండగా వికల్పముగ ద్విత్వము వచ్చును.

'పటత్ పటత్ కరోతి' అనునది పూర్వసూత్రమున కుదాహరణము. ఇచట 'పటత్'అనుదానికి ద్విత్వము చేయుటకు పూర్వము ఇది అనేకాచ్కార్ధము కాదు గాన-అనగా'పటత్'లోని సగభాగమునందు అనేకాచ్చులు లేవు గాన-ఈ సూత్రముచే 'డాచ్'వచ్చుటకు అవకాశము లేదు. పైవార్తికమునకు 'డాచ్ప్రత్యయము పర మగునపుడు ద్విత్వము వచ్చును'అని అర్థము చెప్పినచో పైన

చూపిన విధముగ 'పటత్కరోతి'అను నపుడు 'పటత్'శబ్దముకంటె 'డాచ్'చేయు టకు అవకాశము లేదు గాన డాచ్పరకత్వము లేకుండుటచే ద్విత్వము వచ్చుటకు అవకాశ ముండదు. అందుచే వార్తికమునందలి 'డాచి'అనుపదమునకు 'డాచ్ చేయవలసి యుండగా' అను నర్థము చెప్పబడినది. ఇపుడు "పటత్ రోతి"అను నపుడు డాచ్ ప్రత్యయముచేయ నున్నాము గాన ఈ వార్తికముచే 'పటత్'అను దానికి ద్విత్వము. ఇపుడు'పటత్పటత్'అను దానిలో అర్ధమగు 'పటత్'అను శబ్దమునందు రెండచ్చులున్నవి;ఇది అవ్యక్తధ్వన్యనుకరణశబ్దము; దానికి 'ఇతి' అనునదిపరముగా లేదు. అందుచే పూర్వసూత్రముచే 'డాచ్'ప్రత్యయము చేయగా 'పటత్ పటత్ ఆ'అని యుండగా'టేః'అను సూత్రముచే (242) టిలో పము-'పటత్పటాకరోతి'అని యుండగా:-

వా. నిత్యమామ్రేడితే డాచీతి వక్తవ్యమ్.

డాచ్పరం యదామ్రేడితం తస్మిన్ పరే పూర్వపరయోర్వర్ణయోః పరరూపం స్యాత్. ఇతి తకారపకారయోః పకారః-పటపటాకరోతి. అవ్యక్తానుకరణాత్ కిమ్-'ఈషత్కరోతి' ద్వ్యజవరార్ధాత్ కిమ్-శ్రత్ కరోతి, అపరేతి కిమ్,'ఖరటఖరటాకరోతి. అనితౌ కిమ్? పటితి కరోతి.

ఇతి స్వార్థికాః. ఇతి తద్ధిత ప్రకరణమ్.

ఈ వార్తికము 'ఏకః పూర్వపరయోః'అను నధికారమున,పరరూపప్రక రణమునందు, 'నామ్రేడితస్యాన్త్యస్య తు వా'అను సూత్రమునందలిభాష్యము నందు పఠింపబడినది.

డాచ్ పరమునందు గల ఆమ్రేడితము పర మగునపుడు పూర్వపరవర్ణము లకు పరరూపము ఏకాదేశముగ వచ్చును. ఈ వార్తికముచే తకారపకారములకు పకారము ఏకాదేశముగ వచ్చుటచే 'పటపటాకరోతి'అనురూపము సిద్ధించినది.

అవ్యక్తధ్వన్యనుకరణరూప మగు శబ్దముకంటె డాచ్ప్రత్యయము వచ్చు నని చెప్పుటచే 'ఈషత్ కరోతి'అనునపుడు 'ఈషత్'అనునది అవ్యక్తానుకరణ శబ్దము కాదు గాన దీనికి కృఞ్ధాతుసంబంధమున్నను,అనేకాచ్కమైనను డాచ్ రాలేదు. డాచ్ వచ్చుటకు అవకాశము లేకుండుటచే ద్విత్వము రాలేదు

'ద్వ్యజవరార్ధాత్'అనుటచే 'శ్రత్ కరోతి'అనునపుడు 'శ్రత్'అనునది అవ్యక్తానుకరణరూపశబ్దమే యైనను ఇది ఏకాచ్కము గాన 'డాచ్'గాని డాజ్వి

వక్షిప్రయుక్త మగు ద్విత్వము గాని రాలేదు. 'ద్వ్యజర్ధాత్' అని కాక 'ద్వ్యజవ రార్ధాత్' అని అవరపదమును ప్రయోగించుటచే రెండు అచ్చులకంటె తక్కువ ఉండరాదు గాని ఎక్కువ ఉండవచ్చు నని సూచింపబడినది. అందుచే 'ఖరటత్ కరోతి'అనునపుడు 'ఖరటత్'అనునది త్ర్యచ్క మైనను దానికి డాచ్ వచ్చుటకు అవకాశము లభించినది. 'డాచ్'వివక్షిత మగునపుడు ద్విత్వము వచ్చి 'పటపటా కరోతి'వలె "ఖరటఖరటాకరోతి"అను రూపము సిద్ధించినది. 'ఇతి'శబ్దము పర మగునపుడు డాచ్ రాదని చెప్పుటచే 'పట్ ఇతి కరోతి'అనునపుడు అవ్యక్తాను కరణశబ్ద మగు 'పట్'కు ఇతి పరమగుటచే డాచ్,ద్విత్వాలు రాలేదు.

స్వార్థికప్రత్యయ ప్రకరణము సమాప్తము.

తద్ధితప్రకరణము సమాప్తము.

# అథ స్త్రీప్రత్యయాః

## 1247. స్త్రియామ్. 4.1.3

అధికారోఽయం "సమర్థానామ్-"ఇతియావత్.

ఈప్రకరణమునందు స్త్రీత్వద్యోతకము లగు ప్రత్యయములుచెప్పబడు చున్నవి. 'సమర్థానాం ప్రథమాద్వా'అను సూత్రము వరకును"స్త్రియామ్"అను నది అధికృత మగును.

"స్వార్థ,ద్రవ్య,లింగ,సంఖ్యాకారకాణి పంచకం ప్రాతిపదికార్థః"అను సిద్ధాంతము ననుసరించి లింగము కూడ ప్రాతిపదికార్థమే యగుటచే ప్రాతిపదిక మునం దున్న స్త్రీత్వమును 'టాప్'మొదలగు ప్రత్యయములు సూచించును.

## 1248. అజాద్యతష్టాప్. 4.1.4

అజాదీనాం, అకారాన్తస్య చ వాచ్యం యత్ స్త్రీత్వం,తత్ర ద్యోత్యేటాప్ స్యాత్, అజా,ఏడకా, అశ్వా, చటకా, మూషికా,బాలా, వత్సా,హోడా,మన్దా,విలాతా-ఇత్యాదిః అజాదిగణః.సర్వా.

'స్త్రియామ్-' 'ప్రత్యయః' 'పరశ్చ'అను అధికారసూత్రములు అనువర్తిం చును 'జ్యాప్ప్రాతిపదికాత్'నుండి 'ప్రాతిపదికాత్'అనువర్తించును. అజాదిశబ్ద

ములయొక్కయు, అకారాంత ప్రాతిపదికములయొక్కయు వాచ్య మగు స్త్రీత్వము ద్యోత్య మగునపుడు-అనగా అజాదిశబ్దముల యందలి స్త్రీత్వమును సూచింపవలసి యున్నపుడు-వాటికంటె పరమై టాప్ ప్రత్యయము వచ్చును

అజా:- 'అజ' అనునది అజాదిగణములోని మొదటి శబ్దము. దీనియందలి స్త్రీత్వమును సూచించుటకై-అనగా 'ఆడమేక' అనునర్థమును స్పష్టీకరించుటకై-ఈ సూత్రముచే 'టాప్' ప్రత్యయము. 'టాప్'లోని టకారపకారములు ఇత్సంజ్ఞకములు. 'అజఆ' అని యుండగా సవర్ణదీర్ఘముచే అజా అను ఆకారాంత శబ్దము సిద్ధించినది ఇపుడిది ఆబంతము గాన "ఙ్యాప్ప్రాతిపదికాత్" అను సూత్రముచే (119) సుప్ప్రత్యయములు వచ్చును. ప్రథమైకవచనమున హల్ఙ్యాదిలోపముచే (సూ-179) 'అజా' అను రూపము సిద్ధించును.

అజాదిగణమునందు ఏడక, అశ్వ మొదలగు అకారాంతశబ్దములే పఠింపబడినవి. వీటికి అనంతత్వముచేతనే టాప్ లభించును. కాని ఈ టాప్‌ను బాధించి "జాతేరస్త్రీవిషయాదయోపధాత్" (1268) 'వయసి ప్రథమే' (1255) అను ఉత్తరసూత్రములచే 'ఙీష్' 'ఙీప్'లు రావలసి యున్నవి. వాటిని బాధించుటకై అజాదిగణము గూడ సూత్రమునందు గ్రహింపబడినది. ఈవిధముగ అజాదిగణమునందలి ఇతరపదములకు టాప్ చేర్చుటచే ఏడకా (గొఱ్ఱె), అశ్వా (గుఱ్ఱము), చటకా (పక్షివిశేషము) మూషికా (ఎలుక) బాలా, వత్సా, హోడా, మందా, విలాతా (ఈఐదునుబాలార్థకములు) అను శబ్దములు సిద్ధించినవి. సర్వా:- ఇది అదంత ప్రాతిపదికముకంటె 'టాప్' వచ్చుటకు ఉదాహరణము.

### 1249. *ఉగితశ్చ*. 4.1.6

ఉగిదన్తాత్ ప్రాతిపదికాత్ స్త్రియాం ఙీప్ స్యాత్. భవన్తీ, పచన్తీ, దీవ్యన్తీ.

'ఋన్నేభ్యో ఙీప్' 'ఙ్యాప్ప్రాతిపదికాత్' అను సూత్రములనుండి 'ఙీప్' 'ప్రాతిపదికాత్', 'స్త్రియామ్' అను అధికారసూత్రమును అనువర్తించును. 'ఉక్' అనునది ప్రత్యాహారము. ఉక్ ఇత్సంజ్ఞకముగా గల ప్రత్యయము ఉగిత్. అట్టి ఉగిత్ప్రత్యయము అంతమునందు గల ప్రాతిపదికముకంటె, స్త్రీత్వము ద్యోత్య మగునపుడు 'ఙీప్' ప్రత్యయము వచ్చును. 'ఙీప్'లోని ఙకారపకారములు ఇత్సంజ్ఞకములు. ఈకారము శేషించును.

'శతృ' ప్రత్యయమునందలి ఋకారము, 'ఈయసున్' ప్రత్యయమునందలి

ఉకారమును ఇత్సంజ్ఞకము లగు 'ఉక్'లు కావున అట్టి ప్రత్యయములు చేర్చగ నేర్పడిన శబ్దములు ఉగిదంతములు. కావున శతృప్రత్యయాద్యంతశబ్దముల కంటె స్త్రీత్వమున ఈ సూత్రముచే జీప్ వచ్చి ఈకారాంత స్త్రీలింగశబ్దములు సిద్ధించును.

భవన్తీ :–'భూ'ధాతువునకు 'శతృ'ప్రత్యయము చేర్చుటచే 'భవత్' శబ్దము నిష్పన్న మైనది. ఇది ఉగిదంతము. కావున స్త్రీత్వమునందు ఈ సూత్రముచే 'జీప్' చేయగా 'భవత్ ఈ' అని యుండగా "శప్శ్యనోర్నిత్యమ్" అను సూత్రముచే (367) నుమాగమము. 'భవన్తీ' ఉండునది అని యర్థము. 'భాతేర్డవతుః'అను ఉణాదిసూత్రముచే 'భా'ధాతువుకంటె 'డవతు'ప్రత్యయమును చేర్చగా సిద్ధించిన 'భవత్'శబ్దము గూడ 'ఉగిత్' కావున ఈ సూత్రముచే 'జీప్' వచ్చి 'భవతీ'అను రూపము సిద్ధించును. ఇది శతృప్రత్యయాంతము కాదు గాన నుమాగమము రాదు.

శతృప్రత్యయాంతము లగు 'పచత్' 'దీవ్యత్' శబ్దములకు గూడ జీప్ చేర్చగా 'భవన్తీ'వలె 'పచన్తీ' 'దీవ్యన్తీ' అను రూపములు సిద్ధించును.

1250. టిడ్ఢాణఞ్-ద్వయసజ్-దఘ్నఞ్-మాత్రచ్-తయప్-ఠక్-ఠఞ్-కఞ్-క్వరపః. 4.1.15.

అనుపసర్జనం యత్ టిదాది, తదన్తం యత్ అదన్తం ప్రాతిపదికం, తతః స్త్రియాం జీప్ స్యాత్. కురుచరీ. నదట్-నదీ. దేవట్-దేవీ. సౌపర్ణేయీ. ఐన్ద్రీ. ఔత్సీ. ఊరుద్వయసీ. ఊరుదఘ్నీ. ఊరుమాత్రీ. పఞ్చతయీ. ఆక్షికీ. ప్రాస్థికీ. లావణికీ. యాదృశీ. ఇత్వరీ.

'అనుపసర్జనాత్' 'స్త్రియామ్'అను అధికారసూత్రములు అనువర్తించును. 'అజాద్యతష్టాప్ నుండి 'అతః' అనువర్తించును. అనుపసర్జనము లగు (అప్రధానములు కాని) యే టిత్ప్రత్యయము, ఢ, అణ్, అఞ్, ద్వయసచ్, దఘ్నఞ్ మాత్రచ్; తయప్, ఠక్, ఠఞ్, కఞ్, క్వరప్ ప్రత్యయములును, కలవో అవి అంతమునందు కలవియు, అకారాంతములును అగు ప్రాతిపదికములకంటె, స్త్రీత్వము ద్యోత్య మగునపుడు 'జీప్' వచ్చును.

'టిత్' అనగా టకారము ఇత్సంజ్ఞకముగా కలది. ఈ టిత్తు ప్రత్యయము,

ప్రాతిపదికము. ధాతువు అను రూపములలో మూడు విధములుగ నున్నది. ఈ మూడును ఈ సూత్రమునందలి 'టిత్' అను పదముచే గ్రహింపబడును.

కురుచరీ:-ఇది మొదటి 'టిత్'కు ఉదాహరణము "కురుషు చరతి" అనునపుడు అధికరణము ఉపపదముగ నుండగా "చరేష్టః" అను సూత్రముచే (795) టప్రత్యయము. టకారము ఇత్సంజ్ఞకము. పిమ్మట ఉపపదసమాసము (సూ. 957). ఇపుడిది టిత్ప్రత్యయాంతము గాన ఙీప్ వచ్చినది. 'కురుచర ఈ' అని యుండగా 'యస్యేతిచ' అను సూత్రముచే (236) అకారలోపము-'కురుచరీ' అను ప్రథమైకవచనాంత రూపము సిద్ధించినది

నదీ:- ఇది రెండవ 'టిత్'కు ఉదాహరణము. పచాదిగణమునందు 'నదట్' 'దేవట్' మొదలగు కొన్ని టిత్తు లగు ప్రాతిపదికములు పఠింపబడినవి. ఇవి టిత్తులు గాన ఈ సూత్రముచే 'ఙీప్' వచ్చి 'నదీ' 'దేవీ' అను రూపములు సిద్ధించినవి. దీనిని బట్టి సూత్రమునందలి 'టిత్' అనుదానికి టిత్ప్రత్యయాంతము లనియు, టిత్తులనియు అర్థము చేసికొనవలెను.

సౌపర్ణేయీ:-'సుపర్ణ్యాః అపత్యం కన్యా' అను నర్థమున 'సుపర్ణీ' శబ్దముకంటె 'స్త్రీభ్యో ఢక్' అను సూత్రముచే (1021) ఢక్ ప్రత్యయము. ఢకారమునకు ఏయాదేశము (సూ. 1013); ఆదివృద్ధి. ఈకారమునకు లోపము (సూ. 236) 'సౌపర్ణేయ' అని యుండగా ఈ ఢక్ ప్రత్యయాంత ప్రాతిపదికమునకు ఈ సూత్రముచే 'ఙీప్ వచ్చి 'సౌపర్ణేయీ' సిద్ధించినది. ఐన్ద్రీ:-'ఇన్ద్రో దేవతా అస్యా ఆమిక్షాయాః' అను నర్థమున ఇన్ద్రశబ్దముకంటె 'సాస్య దేవతా' అను సూత్రముచే (1041) 'అణ్' ప్రత్యయము. ఆదివృద్ధి (సూ. 941) అకారలోపము (సూ. 236)-'ఐన్ద్ర'. ఈ అణ్ప్రత్యయాంతముకంటె 'ఙీప్'-'ఐన్ద్రీ'.

ఔత్సీ:-'ఉత్సస్య ఇయం' అను నర్థమున 'ఉత్స'శబ్దముకంటె 'ఉత్సాదిభ్యోఞ్' అను సూత్రముచే (1102) అఞ్ప్రత్యయము. ఆదివృద్ధ్యాదులచే 'ఔత్స' అను రూపముసిద్ధించిన పిమ్మట ఈ అఞంతశబ్దముకంటె 'ఙీప్'-'ఔత్సీ'.

ఊరుద్వయసీ, ఊరుదఘ్నీ, ఊరుమాత్రీ:- "ఊరూ ప్రమాణం అస్యాః" అను నర్థమున ఊరుశబ్దముకంటె "ప్రమాణే ద్వయసజ్దఘ్నఞ్ మాత్రచః" అను సూత్రముచే (1167) 'దఘ్నచ్' 'ద్వయసచ్' 'మాత్రచ్' ప్రత్యయములు చేర్చగా 'ఊరుద్వయస' 'ఊరుదఘ్న' 'ఊరుమాత్ర' అను

శబ్దములు సిద్ధించినవి. ఈ ద్వయసజాద్యంత ప్రాతిపదికములకంటె 'జీప్'–'ఊరు ద్వయసీ', 'ఊరుదఘ్నీ'; 'ఊరుమాత్రీ'.

పఞ్చతయీ:–'పఞ్చ అవయవాః అస్యాః'అను విగ్రహమున 'పఞ్చన్' శబ్దముకంటె "సంఖ్యాయా అవయవేతయప్" అను సూత్రముచే (1171) 'తయప్'ప్రత్యయము, నలోపము చేసిన పిమ్మట ఈ "పఞ్చతయ"శబ్దముకంటె జీప్ప్రత్యయము. ఆక్షికీ:–'అక్షైర్దీవ్యతి'అను నర్థమున "తేనదీవ్యతి ఖనతి జయతి జితమ్"అను సూత్రముచే (1117) ఠక్ప్రత్యయము. 'ఠస్యేకః' (1027). ఆదివృద్ధి (సూ. 941). ఈ ఆక్షికశబ్దముకంటె ఈసూత్రముచే 'జీప్'; అకారలోపము (సూ. 236). ప్రాస్థికీ:–'ప్రస్థేన క్రీతా' అను నర్థమునందు 'తేన క్రీతం'అను సూత్రముచే (1144) ప్రస్థశబ్దముకంటె 'ఠఞ్'ప్రత్యయము. ఇకాదేశము, ఆదివృద్ధి. ఈ ఠఞంత 'ప్రాస్థిక'శబ్దముకంటె 'జీప్'ప్రత్యయము. లావణికీ–'లవణం పణ్యమస్యాః' అనువిగ్రహమున లవణశబ్దముకంటె 'లవణాట్ఠఞ్'అను సూత్రముచే ఠఞ్ప్రత్యయము 'ఠస్యేకః' (1023); ఆదివృద్ధి (సూ. 941); 'యస్యేతిచ' (236)–'లావణిక'శబ్దముకంటె జీప్. 'యస్యేతిచ'. (236)యాదృశీ:–యచ్ఛబ్దోపపదక మగు'దృశ్'ధాతువుకంటె'త్యదాదిషుదృశోఽనాలోచనే కఞ్ చ'అను సూత్రముచే (348) 'కఞ్' ప్రత్యయము. 'ఆసర్వనామ్నః'అను సూత్రముచే (349). 'యత్'శబ్దమునకు ఆకారాంతాదేశము. సవర్ణదీర్ఘము. ఇపు డీకఞన్త 'యాదృశ'శబ్దముకంటె జీప్;–'యాదృశీ'. ఇత్వరీ:–'ఇణ్ గతౌ'అను ధాతువుకంటె "ఇణ్నశజిస ర్తిభ్యఃక్వరప్"అను సూత్రముచే క్వరప్ ప్రత్యయము, "హ్రస్వస్య పితికృతి తుక్"అను సూత్రముచే (780) తుగాగమము, క్వరప్ప్రత్యయాంత మగు ఈ 'ఇత్వర'శబ్దముకంటె జీప్. "యస్యేతిచ" (236)–'ఇత్వరీ' (కులట).

వా. నఞ్స్నఞీకక్ఖ్యుంస్తరుణతలునానాముపసంఖ్యానమ్.

స్త్రైణీ. పౌంస్నీ. శాక్తీకీ. ఆఢ్యఙ్కరణీ. తరుణీ. తలునీ.

ఈ జీబ్విధియందు, నఞ్, స్నఞ్, ఈకక్, ఖ్యున్ ప్రత్యయాంతములకును 'తరుణ' 'తలున'శబ్దములకును వచనముచేయదగినది.

స్త్రైణీ, పౌంస్నీ:–'స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్' (1003) అను సూత్రముచే 'స్త్రీ' 'పుంస్'శబ్దములకంటె క్రమముగ 'నఞ్' 'స్నఞ్' ప్రత్యయములు; ఆదివృద్ధ్యాదులచే 'స్త్రైణ' 'పౌంస్న' అని సిద్ధించిన పిమ్మట

'ఙీప్', 'యస్యేతిచ' (236)-'స్త్రైణీ' 'పౌంస్నీ'. శాక్తీకీ:-'శక్తిః ప్రహరణం అస్యాః' అనునర్థమున 'శక్తి'శబ్దముకంటె 'శక్తియష్ట్యోరీకక్' అను సూత్రముచే 'ఈకక్'ప్రత్యయము; ఆదివృద్ధి; 'యస్యేతిచ' (236); ప్రకృతవార్తికముచే ఈ 'శాక్తీక'శబ్దముకంటె ఙీప్,-'శాక్తీకీ'. ఆఢ్యఙ్కరణీ:-'అనాఢ్యః ఆఢ్యః క్రియతే అనయా'అని విగ్రహము. "ఆఢ్యసుభగస్థూలపలితనగ్నాన్ధప్రియేషుచ్వ్యర్థేష్వచ్వౌ కృఞః కరణే ఖ్యున్" అను సూత్రముచే ఆఢ్యశబ్దోపపద మగు 'కృఞ్'ధాతువుకంటె 'ఖ్యున్' ప్రత్యయము. ఖకారనకారములిత్సంజ్ఞకములు. 'యు'కు 'యువోరనాకౌ'అను సూత్రముచే (788) 'అన'ఆదేశము. 'అరుర్ద్విషదజన్తస్యముమ్'అను సూత్రముచే (800) ముమాగమము. నకారమునకు ణకారము. ఈవిధముగ నిష్పన్న మగు 'ఆఢ్యఙ్కరణ' శబ్దమునకు ఈ వార్తికముచే 'ఙీప్'-'ఆఢ్యఙ్కరణీ.' ధనవంతుడు కానివానిని ధనవంతునిగ చేయునది. తరుణీ. తలునీ:-(యువతి). 'తరుణ' 'తలున' శబ్దములకంటె ప్రకృతవార్తికముచే ఙీప్ వచ్చినది.

## 1251. యఞశ్చ. 4.1.16

యఞన్తాత్ స్త్రియాం 'ఙీప్'స్యాత్. అకారలోపే కృతే:-

యఞ్ప్రత్యయాంత మగు ప్రాతిపదికముకంటె స్త్రీత్వమునందు'ఙీప్' ప్రత్యయము వచ్చును.

గార్గీ:- 'గర్గస్యాపత్యం స్త్రీ'అనునర్థమున 'గర్గ'శబ్దముకంటె 'గర్గాదిభ్యో యఞ్'అను సూత్రముచే (1008) 'యఞ్' ప్రత్యయము. ఆదివృద్ధి. అకారలోపము (సూ-236); 'గార్గ్య'అని యుండగా స్త్రీత్వమున ఈ సూత్రముచే'ఙీప్'-'గార్గ్య ఈ'అని యుండగా అకారలోపము చేసిన పిమ్మట'గార్గ్యఈ'అని యుండగా:-

## 1252. హలస్తద్ధితస్య. 6.4.150

హలః పరస్య తద్ధితయకారస్యోపధాభూతస్య లోప ఈకారే పరే. గార్గీ.

'యస్యేతిచ'నుండి 'ఈతి', 'సూర్యతిష్యాగస్త్యమత్స్యానాం య ఉపధాయాః'నుంచి 'య' 'ఉపధాయాః', 'ఢేలోపోఽకద్ర్వాః'నుండి'లోపః'అను వర్తించును. హల్లుకంటె పరమును,ఉపధారూపమును అగు తద్ధితయకారమునకు ఈకారము పర మగునపుడు లోపము వచ్చును. ఈ సూత్రముచే యకారము లోపింపగా 'గార్గీ'అను రూపము సిద్ధించినది.

1253. ప్రాచాం ష్ఫ తద్ధితః. 4.1.17

యఞన్తాత్ ష్ఫో వా స్యాత్ స్త్రియాం, స చ తద్ధితః.

'యఞశ్చ'నుండి'యఞః; 'స్త్రియాం'అను అధికారసూత్రము అనువర్తించును. యఞ్ప్రత్యయాంతముకంటె స్త్రీత్వమునందు,ప్రాచ్యుల మతమున వికల్పముగా 'ష్ఫ'ప్రత్యయము వచ్చును; ఈ ష్ఫప్రత్యయము తద్ధితసంజ్ఞక మగును. 'ష్ఫ'లోని షకారమునకు 'షః ప్రత్యయస్య'అను సూత్రముచే (842) ఇత్సంజ్ఞ. ఫకారమునకు "ఆయనేయీనీయియః."ఇత్యాదిసూత్రముచే (1013) 'ఆయన్' ఆదేశమువచ్చును.

యఞ్ప్రత్యయాంత మగు 'గార్గ్య'శబ్దముకంటె ఈ సూత్రముచే ష్ఫప్రత్యయము చేసిన పిమ్మట'గార్గ్యాయణ'శబ్దముసిద్ధించినది. ష్ఫప్రత్యయమునకు తద్ధితసంజ్ఞ కూడ విహిత మగుటచే'కృత్తద్ధితసమాసాశ్చ అను సూత్రముచే (117) 'గార్గ్యాయణ'శబ్దమునకు ప్రాతిపదికత్వము లభించినది.

1254. షిద్గౌరాదిభ్యశ్చ. 4.1.41.

షిద్భ్యోగౌరాదిభ్యశ్చ జీష్ స్యాత్. గార్గ్యాయణీ. నర్తకీ. గౌరీ.

'అన్యతో జీష్'అనువర్తించును. 'షిత్'అనగా షకారము ఇత్సంజ్ఞకముగా గల దని యర్థము. షిత్‌లకంటెను, గౌరాదిశబ్దములకంటెను స్త్రీత్వమునందు 'జీష్'ప్రత్యయము వచ్చును.

'జీష్'నందు కూడ జకారషకారములు ఇత్సంజ్ఞకము లగుటచే 'జీప్' నందువలె ఈకారము మాత్రమే శేషించును. 'జీప్' 'పిత్' గాన దాని ఈకారము అనుదాత్త మగును. 'జీష్'లోని ఈకారము ఉదాత్తము. 'షిత్'అగు 'గార్గ్యాయణ' శబ్దముకంటె ఈసూత్రముచే జీష్' ప్రత్యయము; 'గార్గ్యాయణీ'.

నర్తకీ:-'నృత్' ధాతువు కంటె 'శిల్పిని ష్వున్'అను సూత్రముచే 'ష్వున్' ప్రత్యయము చేర్చుటచే సిద్ధించిన 'నర్తక'శబ్దము షిత్తు గాన స్త్రీత్వమునందు ప్రకృతసూత్రముచే 'జీష్'-'నర్తకీ'. గౌరీ:- (తెల్లనిది) ఇది గౌరాదిగణమునందలి మొదటి పదము. ప్రకృతసూత్రముచే జీష్ వచ్చినది.

వా. ఆమనడుహః స్త్రియాం వా.

అనడ్వాహీ, అనడుహీ. ఆకృతిగణోఽయమ్,

'అనడుహ్'శబ్దమునకు స్త్రీలింగమునందు 'ఆమ్' వికల్పముగ వచ్చును.

అనడ్వాహీ, అనడుహీ:-(ఆవు). 'అనడుహ్'శబ్దము గౌరాదిగణము లోనిది గాన స్త్రీత్వమునందు 'ఙీష్'ప్రత్యయము. "అనడుహ్ ఈ"అని యుండగా ప్రకృతవార్తికముచే వైకల్పికముగ 'ఆమ్'ఆగమము. 'ఆమ్'మిత్తు గాన 'మిద చోఽన్త్యాత్పరః'అను పరిభాషచే (240) 'అనడుహ్'లోని అంత్యాచ్ అగు ఉకారముకంటె పరముగ వచ్చును. 'అనడు ఆ హ్ ఈ'-యణాదేశము-అన డ్వాహీ'. ఆమ్ రాని పక్షమున-అనడుహ్ఈ-'అనడుహీ'. గౌరాదిగణము ఆకృతిగణము.

## 1255. వయసి ప్రథమే. 4.1.20.

ప్రథమవయోవాచినోఽదన్తాత్ స్త్రియాం ఙీప్ స్యాత్. కుమారీ.

'అజాద్యతష్టాప్'నుండి 'అతః', 'ఋన్నేభ్యోఙీప్'నుండి 'ఙీప్', 'స్త్రియామ్'అను అధికారసూత్రము, 'ఙ్యాప్ప్రాతిపదికాత్'నుండి 'ప్రాతిపది కాత్' అనువర్తించును. ప్రథమవయోవాచక మగు అకారాంతప్రాతిపదికము కంటె స్త్రీత్వమునందు 'ఙీప్'వచ్చును.

కుమారీ:-'కుమార'శబ్దము అదంత మగు బాల్యవాచకశబ్దము గాన దానికంటె స్త్రీత్వమునందు ఙీప్ వచ్చినది.

## 1256. ద్విగోః. 4.1.21.

అదన్తాత్ ద్విగోః 'ఙీప్' స్యాత్. త్రిలోకీ. అజాదిత్వాత్- త్రిఫలా. త్ర్యనీకా సేనా.

పూర్వసూత్రమునందు వలె, 'స్త్రియామ్' 'అతః' 'ఙీప్'అను పదములు అనువర్తించును. అదంత మగు ద్విగుసమాసముకంటె స్త్రీత్వమునందు 'ఙీప్' వచ్చును.

త్రిలోకీ:-'త్రయాణాం లోకానాం సమాహారః'అని విగ్రహము. 'తద్ధి తార్థోత్తరపదసమాహారేచ'అను సూత్రముచే (939) సమాసము. 'సంఖ్యా పూర్వో ద్విగుః'అను సూత్రముచే (944) ద్విగుసంజ్ఞ. ఇందలి ఉత్తరపదము అకారాంతము గాన "అకారాంతోత్తరపదో ద్విగుఃస్త్రియామిష్టః"అను వార్తి కముచే స్త్రీత్వము. ప్రకృతసూత్రముచే 'ఙీప్' ప్రత్యయము - 'త్రిలోకీ'. 'త్రయాణాం ఫలానాం సమాహారః' "త్రయాణాం అనీకానాం సమాహారః"అను నర్థములందు 'త్రిలోకీ'యందు వలె సమాసము, ద్విగుత్వము, స్త్రీత్వము లభిం

చిన పిదప ప్రకృతసూత్రముచే 'ఙీప్' రావలసి యున్నది. కాని ఈ శబ్దములను అజాదిగణమునందు పఠించుటచే 'ఙీప్'ను బాధించి 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) 'టాప్' వచ్చి 'త్రిఫలా' 'త్ర్యనీకా'అను రూపములు సిద్ధించినవి.

1257. వర్ణాదనుదాత్తాత్తోపధాత్తో నః. 4.1.39.

వర్ణవాచీ యోఽనుదాత్తాన్తస్తోపధః, తదన్తాత్ అనుపసర్జనాత్ ప్రాతిపదికాత్ వా ఙీప్, తకారస్య నకారాదేశశ్చ. ఏనీ ఏతా, రోహిణీ, రోహితా.

'మనో రౌ వా'నుండి 'వా', 'ఋన్నేభ్యో ఙీప్'నుండి 'ఙీప్', "అనుపసర్జనాత్" "స్త్రియామ్" అను అధికారసూత్రములు, 'ఙ్యాప్ప్రాతిపదికాత్'నుండి 'ప్రాతిపదికాత్' అనువర్తించును. అనుదాత్తాంతము, తకారోపధమును అగు వర్ణవాచకశబ్దము అంతమునందు గల అనుపసర్జన మగు ప్రాతిపదికముకంటె స్త్రీత్వమునందు, వికల్పముగ 'ఙీప్' వచ్చును, తకారమునకు నకారాదేశము కూడ వచ్చును.

ఏనీ, ఏతా:—ఏతశబ్దము శ్వేతవర్ణవాచకము. "వర్ణానాం తణతినితాన్తానామ్"అను ఫిట్సూత్రముచే తకారాంతవర్ణవాచకశబ్దముల ఆద్యచ్చు ఉదాత్తము; పరిశేషన్యాయముచే అంత్యాకారము అనుదాత్తము. ఈ శబ్దమునందు తకారము ఉపధగ నున్నది. కావున ప్రకృతసూత్రముచే 'ఙీప్' తకారమునకు నకారాదేశము వచ్చి 'ఏనీ'అను రూపము. 'ఙీప్' రాని పక్షమున "సన్నియోగ శిష్టానాం సహ వా ప్రవృత్తిః సహ వా నివృత్తిః"అను న్యాయముచే నత్వము కూడ రాదు, 'టాప్' వచ్చును-(సూ. 1248) 'ఏతా'. ఇట్లే 'రోహిత'శబ్దమునకు 'ఙీప్' నత్వములు వచ్చిన పక్షమున 'రోహిణీ'అను రూపము. అవి రాని పక్షమున 'టాప్' వచ్చి 'రోహితా'అను రూపమును సిద్ధించును.

1258. వోతో గుణవచనాత్. 4.1.44.

ఉదన్తాద్గుణవాచినో వా ఙీప్ స్యాత్. మృద్వీ, మృదుః.

ఉదంత మగు గుణవాచకశబ్దముకంటె వికల్పముగ 'ఙీప్' వచ్చును. 'గుణవచనాత్ ఙీబాద్యుదాత్తః'అను వార్తికము ననుసరించి' 'అన్యతో ఙీష్'అను సూత్రమునుండి 'ఙీష్'ను అనువర్తింపచేయక 'ఙీప్'అని చెప్పబడినది.

మృద్వీ, మృదుః:-గుణవాచక మగు ఉకారాంతమృదుశబ్దముకంటె స్త్రీత్వమునందు, ఈ సూత్రముచే 'జీప్' చేసిన పక్షమున యణాదేశము వచ్చి 'మృద్వీ'అనియు, 'జీప్' రాని పక్షమున 'మృదుః'అను రూపమును సిద్ధించును.

1259. బహ్వాదిభ్యశ్చ. 4.1.45.

(గ. సూ.) కృదికారాద క్తినః

రాత్రిః, రాత్రీ.

(గ. సూ.) సర్వతోఽ క్తిన్నర్థాదిత్యేకే.

శకటీ, శకటిః.

'అన్యతో జీష్' 'వోతో గుణవచనాత్'నుండి 'జీష్' 'వా' అనువర్తించును. బహ్వాదిశబ్దములకంటె, స్త్రీత్వమునందు 'జీష్' వికల్పముగ వచ్చును.

బహ్వీ:-బహుశబ్దముకంటె ఈసూత్రముచే జీష్ వచ్చిన పక్షమున యణాదేశము వచ్చి 'బహ్వీ'అనియు, 'జీష్' రాని పక్షమున 'బహుః'అనియు రూపములు.

(గ. సూ.) కృదికారాత్:-కృత్ప్రత్యయమునకు సంబంధించిన ఇకారము అంతమునందు గల ప్రాతిపదికముకంటె వికల్పముగ జీష్ వచ్చును: క్తిన్ ప్రత్యయముకంటె మాత్రము రాదు.

రాత్రీ, రాత్రిః:-'రా ధాతువుకంటె 'రాశదిభ్యాం త్రిప్'అను ఔణాదిక సూత్రముచే 'త్రిప్'ప్రత్యయమును చేయుటచే 'రాత్రి'శబ్దము సిద్ధించినది. ఇది కృదికారాంతము గాన వికల్పముగ 'జీష్'వచ్చిన పక్షమున 'రాత్రీ'అనియు, రాని పక్షమున 'రాత్రిః'అనియు రూపములు సిద్ధించును.

(గ. సూ.) సర్వతః:-కృదికారాంతము లైనను, కృద్భిన్నేకారాంతము లైనను అన్ని (ఇకారాంత)శబ్దములకంటెను స్త్రీత్వమున 'జీష్' వికల్పముగ వచ్చును; క్తిన్ప్రత్యయార్థకప్రత్యయము అంతమునందు గల ప్రాతిపదికము కంటె మాత్రము రాదు,

శకటీ, శకటిః:-శకటిశబ్దము అవ్యుత్పన్నప్రాతిపదికము గాన పూర్వ గణసూత్రముచే జీష్ రాకుండుటచే ఈ గణసూత్రము చెప్పబడినది. ఇది ఇకారాంతము గాన ఈ సూత్రముచే 'జీష్'వచ్చిన పక్షమున 'శకటీ'అనియు, రాని పక్షమున 'శకటిః'అనియు రూపము లగును,

1260. పుంయోగాదాఖ్యాయామ్. 4.1.48.

యా పుమాఖ్యా పుంయోగాత్ స్త్రియాం వర్తతే, **తతో ఙీష్.** గోపస్య స్త్రీ గోపీ.

పురుషవాచకమై, పురుషసంబంధము ద్వారా స్త్రీవాచక మగు శబ్దముకంటె 'ఙీష్' ప్రత్యయము వచ్చును.

గోపీ:-గోపశబ్దమునకు గోవులను పాలించు గొల్లవాడు అని యర్థము. గోపుని స్త్రీ యగుటచే ఆతని భార్య కూడ 'గోప'శబ్దముచే చెప్పబడును. అపుడు ఈ సూత్రముచే 'ఙీష్'వచ్చి 'గోపీ'యను రూపము సిద్ధించినది. ఇచట ఆ స్త్రీ గోవులను పాలింపకున్నను గోవులను పాలించు వాని భార్య యగుటచే 'గోపీ' యని చెప్పబడును.

వా. పాలకాన్తాన్న.

గోపాలికా, అశ్వపాలికా.

'పాలక'శబ్దము అంతమునందు గల శబ్దముకంటె అది పురుషసంబంధముచే స్త్రీవాచకముగ నుపయుక్తమైనను, 'ఙీష్'రాదు.

'గోపాలకస్య స్త్రీ', "అశ్వపాలకస్య స్త్రీ"అను నర్థమున పూర్వసూత్రముచే రావలసి యున్న 'ఙీష్' ఈ వార్తికముచే నిషేధింపబడినది గాన 'టాప్' చేసిన (సూ. 1248) పిమ్మట, ఉత్తరసూత్రముచే కకారముకంటె వెనుక నున్న అకారమునకు ఇకారాదేశము వచ్చి 'గోపాలికా' 'అశ్వపాలికా' అను రూపములు సిద్ధించినవి.

1261. ప్రత్యయస్థాత్ కాత్ పూర్వస్యాఽత ఇదాప్యసుపః 7.3.44.

ప్రత్యయస్థాత్ కాత్ పూర్వస్యాకారస్యేకారః స్యాదాపి, స ఆప్ సుపః పరో న చేత్. సర్వికా. కారికా. అతః కిమ్-నౌకా. ప్రత్యయస్థాత్ కిమ్-శక్నోతీతి శకా. అసుపః కిమ్-బహుపరివ్రాజకా నగరీ.

ప్రత్యయమునందున్న కకారముకంటె పూర్వమునందున్న అకారమునకు, సుప్‌కంటె పరము కాని 'ఆప్'పర మగునపుడు, ఇకారము ఆదేశముగ వచ్చును. ఇచట 'ఆప్'అనుటచే 'టాప్' 'చాప్' 'డాప్'లు గ్రహింపబడును.

సర్వికా:-'సర్వ'శబ్దముకంటె "అవ్యయసర్వనామ్నామకచ్ ప్రాక్ టేః"అను సూత్రముచే (1232) స్వార్థమునందు 'అకచ్'ప్రత్యయము చేయగా

'సర్వక'శబ్దము సిద్ధించినది. స్త్రీత్వవివక్షయందు 'అజాద్యతష్టాప్' అను సూత్రముచే (1248) 'టాప్' చేసిన పిమ్మట 'సర్వకా'అని యుండగా, ఇచట ఆప్ పరముగా గల ప్రత్యయస్థకకారముకంటె పూర్వమున నున్న అకారమునకు ఈ సూత్రముచే ఇకారము వచ్చి-'సర్వికా'.

కారికా:-కృఞ్ధాతువుకంటె 'ణ్వుల్తృచౌ'అను సూత్రముచే (787) కర్త్రర్థమునందు ణ్వుల్ ప్రత్యయము. "యువోరనాకౌ"అను సూత్రముచే (788) 'వు'కు అకాదేశము. 'కారక'శబ్దము సిద్ధించినది. దానికంటె స్త్రీత్వ వివక్షయందు 'టాప్'ప్రత్యయము చేర్చగా 'కారకా'అని యున్నది. ఇపుడు ఈ సూత్రముచే కకారముకంటె పూర్వమునందున్న అకారమునకు ఇకారాదేశము-'కారికా'.

అకారమునకే ఇకారము వచ్చు నని చెప్పుటచే 'నౌకా' అనుశబ్దమునందు కకారముకంటె పూర్వమునందున్న ఔకారమునకు ఇకారము రాలేదు. 'నౌకా' అనునది 'నౌ'శబ్దముకంటె స్వార్థికప్రత్యయము చేసిన పిమ్మట టాప్ చేయగా నేర్పడిన రూపము. ప్రత్యయమునందలి కకారముకంటె పూర్వమునందున్న అకార మని చెప్పుటచే 'శకా'అను దానియందలి కకారము ప్రత్యయస్థము కాదు గాన దాని వెనుక నున్న అకారమునకు ఇకారము రాలేదు. 'శకా'అనునది శక ధాతువునకు "నందిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః" అను సూత్రముచే (789) 'అచ్' ప్రత్యయము చేర్చిన పిదప స్త్రీత్వమున టాప్ చేయగా నేర్పడిన రూప మగుటచే ఇందలి కకారము ప్రత్యయావయవము కాదు.

'ఆప్' 'సుప్'కంటె పరము కాకూడదు అని చెప్పుటచే "బహుపరి వ్రాజికా"అను నపుడు కకారముకంటె పూర్వమునందున్న అకారమునకు ఇకారము రాలేదు. పరిపూర్వకవ్రజధాతువునకు 'ణ్వుల్'ప్రత్యయము చేర్చుటచే 'పరి వ్రాజక'శబ్దము సిద్ధించినది. "బహవః పరివ్రాజకాః యస్యాం సా"అను విగ్రహమున "బహు జస్ పరివ్రాజక జస్"అను శబ్దములకు బహువ్రీహి సమాసము (సూ. 968). సుప్ప్రత్యయలోపము (సూ. 724)-'బహుపరివ్రాజక'. స్త్రీత్వవివక్షయందు 'టాప్'-'బహుపరివ్రాజకా'. ఇచట 'ఆప్'లుప్తమైన 'సుప్' కంటె పర మగుటచే కకారముకంటె పూర్వమునందున్న అకారమునకు ఇత్వము రాలేదు.

వా. సూర్యాద్దేవతాయాం చాప్ వాచ్యః.

సూర్యస్య స్త్రీ దేవతా సూర్యా. దేవతాయాం కిమ్:-

పుంయోగముచే దేవత యగు స్త్రీని బోధించు 'సూర్య'శబ్దముకంటె 'చాప్'ప్రత్యయము చెప్పదగినది. 'చాప్'లోని చకారపకారములు ఇత్సంజ్ఞకములు.

సూర్యా:-సూర్యస్య స్త్రీ దేవతా-'సూర్యుని స్త్రీయగు దేవత'అను నర్థమునందు చాప్ ప్రత్యయము. 'యస్యేతిచ'-(236)-'సూర్యా'. దేవతయగు స్త్రీ అను నర్థమునందు మాత్రమే 'చాప్' వచ్చునని చెప్పుటచే సూర్యుని స్త్రీ యగు కుంతిమొదలగు మనుష్యస్త్రీ యను నర్థమునందు 'సూర్య'శబ్దముకంటె 'పుంయోగాదాఖ్యాయాం'అను సూత్రముచే (1260) సామాన్యతోవిహిత మగు 'ఙీష్' ప్రత్యయము, అకారలోపము (సూ. 236) 'సూర్య్ ఈ'అని యుండగా-

సూర్యాగస్త్యయోశ్ఛే చ ఙ్యాఞ్చ. యలోపః.సూరీకున్తీ. మానుషీయమ్.

'ఙీ' కాని, ఛప్రత్యయము గాని పరమగునపుడు 'సూర్య' 'అగస్త్య' శబ్దముల యకారమునకు లోపము వచ్చును. ఈ వార్తికముచే యకారలోపము-'సూరీ'.

1262. ఇన్ద్ర. వరుణ, భవ, శర్వ. రుద్ర, మృడ, హిమారణ్య, యవ, యవన, మాతులాచార్యాణామానుక్. 4.1.49.

ఏషాం ఆనుగాగమః స్యాత్ 'ఙీష్' చ. ఇన్ద్రస్య స్త్రీ ఇన్ద్రాణీ. వరుణానీ, భవానీ, శర్వాణీ. రుద్రాణీ. మృడానీ,

'అన్యతో ఙీష్'నుండి 'ఙీష్' అనువర్తించును. ఇన్ద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, హిమ, అరణ్య, యవ, యవన, మాతుల, ఆచార్య శబ్దములకంటె 'ఙీష్'ప్రత్యయము, 'ఆనుక్'ఆగమము వచ్చును. ఇంద్రాది శబ్దషట్కమునకును, మాతులాచార్యశబ్దములకును 'పుంయోగాదాఖ్యాయామ్'అను సూత్రముచేతనే (1260) 'ఙీష్' వచ్చుచున్నది గాన ఇచట వాటివిషయమున ఆనుక్ మాత్రమే క్రొత్తగ విధింపబడుచున్నది, మిగిలిన నాల్గు శబ్దములకు 'ఙీష్' 'ఆనుక్'లు రెండును విధింపబడుచున్నవి.

ఇన్ద్రాణీ:-'ఇంద్రస్య స్త్రీ'అను నర్థమున 'ఇంద్ర'శబ్దముకంటె 'ఙీష్'-'ఇంద్ర ఈ'అని యుండగా ఆనుగాగమము కిత్తు గాన ఇంద్రశబ్దమునకు అంతావ

యవముగ వచ్చును—'ఇంద్రఆన్ ఈ'-సవర్ణదీర్ఘణత్వములు—'ఇంద్రాణీ'. ఇట్లే 'వరుణస్యస్త్రీ వరుణానీ', 'భవస్యస్త్రీ భవానీ' "శర్వస్యస్త్రీ శర్వాణీ" 'రుద్రస్య స్త్రీ రుద్రాణీ', 'మృడస్యస్త్రీ మృడానీ'.

వా. హిమారణ్యయోర్మహత్త్వే.

మహద్ధిమం-హిమానీ. మహదరణ్యమ్-అరణ్యానీ.

'హిమ' 'అరణ్య'శబ్దములకంటె విహితము లగు 'ఙీష్'ఆనుగాదేశములు మహత్త్వార్థమునందు వచ్చును.

'మహత్ హిమమ్' 'మహత్ అరణ్యమ్' అనునర్థములందు 'హిమ' 'అరణ్య'శబ్దములకంటె పై సూత్రవార్తికములచే 'ఙీష్' ఆనుగాగమములు వచ్చి 'హిమానీ' 'అరణ్యానీ'అను రూపములు సిద్ధించినవి.

వా. యవాద్దోషే.

దుష్టో యవో యవానీ.

యవశబ్దముకంటె, దోషయుక్త మైనది అను నర్థమున 'ఙీష్'ఆనుగాగమములు వచ్చును.

యవానీ:-'దుష్టః యవః'అను నర్థమున 'యవ'శబ్దముకంటె పై సూత్రవార్తికములచే 'ఙీష్' ఆనుగాగమములు- 'యవానీ'.

వా. యవనాల్లిప్యామ్.

యవనానాం లిపిః యవనానీ.

యవనశబ్దముకంటె యవనుల లిపి అను నర్థమునందు 'ఙీష్'ఆనుగాగమములు వచ్చును.

యవనానీ:-'యవనానాం లిపిః'అనునర్థమున 'యవన'శబ్దముకంటె పై సూత్రవార్తికములచే, 'ఙీష్'ఆనుగామములు- 'యవనానీ'.

వా. మాతులోపాధ్యాయయోరానుగ్వా.

మాతులానీ, మాతులీ. ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయీ,

'మాతుల' 'ఉపాధ్యాయ'శబ్దములకంటె 'ఆనుక్' వికల్పముగ వచ్చును. మాతులశబ్దమునకు పూర్వసూత్రముచేతనే ఆనుగాగమము వచ్చుచున్నది. దీనిచే దానికి వైకల్పిత్వము చెప్పబడుచున్నది. 'ఉపాధ్యాయ' శబ్దవిషయమున క్రొత్తగ విధింపబడుచున్నది. కావున ఇది ప్రాప్తాప్రాప్తవిభాష.

మాతులానీ, మాతులీ:-'మాతులస్య స్త్రీ'అను నర్థమున మాతుల శబ్దముకంటె 'పుంయోగాదాఖ్యాయామ్'అను సూత్రముచే (1260) 'ఙీష్'. "ఇంద్ర వరుణ-"ఇత్యాదిసూత్రముచే ఆనుగాగమము నిత్యముగ రావలసి యుండ ఈవార్తికముచే నది వికల్పముగ వచ్చు నని చెప్పుటచే 'ఆనుక్'వచ్చెడు పక్షమున 'మాతులానీ'అనియు 'ఆనుక్' రాని పక్షమున "మాతులీ"అనియు రూపములు సిద్ధించును.

ఇట్లే 'ఉపాధ్యాయస్య స్త్రీ'అనునర్థమున 'ఉపాధ్యాయ'శబ్దముకంటె 'ఆనుక్'వచ్చిన పక్షమున "ఉపాధ్యాయానీ"అనియు, ఆనుక్ రాని పక్షమున, 'ఙీష్'మాత్రము వచ్చి ఉపాధ్యాయీ అను రూపము సిద్ధించినది.

వా. ఆచార్యాదణత్వం చ.

ఆచార్యస్య స్త్రీ-ఆచార్యానీ.

'ఆచార్య'శబ్దముకంటె, పుంయోగమునందు 'ఙీష్', ఆనుగాగమము, నకారమునకు ణత్వాభావము కూడ వచ్చును.

ఆచార్యానీ:-'ఆచార్యస్య స్త్రీ'అను నర్థమునందు "ఆచార్య"శబ్దముకంటె ఈ వార్తికముచే 'ఙీష్', 'ఆనుక్' ఆగమములు- 'ఆచార్యానీ'. "అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి"అను సూత్రముచే (138) రావలసి యున్న ణత్వము గూడ నిషేధింపబడినది. తానే ఆచార్యురాలుగా నున్నపుడు 'ఆచార్య'శబ్దముకంటె అదంతలక్షణ మగు 'టాప్' వచ్చి "ఆచార్యా"అను రూపము సిద్ధించును.

వా. అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే.

అర్యాణీ, అర్యా. క్షత్రియాణీ, క్షత్రియా.

'అర్య' 'క్షత్రియ'శబ్దములకంటె స్వార్థమునందు 'ఙీష్'ఆనుగాగమములు వికల్పముగ వచ్చును.

అర్యాణీ, అర్యా:-అర్య (వైశ్య) జాతిస్త్రీ అను నర్థమునందు ఈ వార్తికముచే వైకల్పికములగు "ఙీష్"ఆనుగాగమములు వచ్చిన పక్షమున 'అర్యాణీ'అనియు, రాని పక్షమున 'అర్యా'అనియు రూపద్వయము సిద్ధించును. 'అర్యస్య స్త్రీ'అనునర్థమునందు మాత్రము 'పుంయోగాదాఖ్యాయామ్'అను సూత్రముచే (1260) 'ఙీష్'వచ్చి 'అర్యీ'అను రూపము సిద్ధించును.

ఇట్లే క్షత్రియజాతిస్త్రీ అను నర్థమునందు "క్షత్రియాణీ" 'క్షత్రియా'అను రూపద్వయము సిద్ధించును. "క్షత్రియస్య స్త్రీ"అను నర్థమునందు మాత్రము 'ఙీష్' వచ్చి "క్షత్రియీ"అను రూపము సిద్ధించును.

1263. క్రీతాత్కరణపూర్వాత్. 4.1.50.

క్రీతాన్తాదదన్తాత్ కరణాదేః స్త్రియాం ఙీష్ స్యాత్. వస్త్రక్రీతీ. క్వచిత్ న-ధనక్రీతా.

"అజాద్యతష్టాప్"నుండి 'అతః'అనువర్తించును. 'క్రీత'శబ్దము అంతమునందు కలదియు, కరణవాచకము పూర్వమునందు కలదియు, అదంతమును అగు ప్రాతిపదికముకంటె స్త్రీత్వమునందు 'ఙీష్' వచ్చును.

వస్త్రక్రీతీ:-'వస్త్రేణ క్రీతా'అని లౌకికవిగ్రహవాక్యము. "వస్త్రటా క్రీత"అను అలౌకికవిగ్రహవాక్యమునందు "గతికారకోపపదానాం కృద్భిః సహ సమాసవచనం ప్రాక్ సుబుత్పత్తేః" (సూ. 947) అను పరిభాష ననుసరించి, సుబుత్పత్తికంటె పూర్వమునందే కృదంత మగు 'క్రీత'శబ్దముతో 'కర్తృకరణే కృతాబహులమ్'అను సూత్రముచే (929) సమాసము. సమాసత్వముచే ప్రాతిపదికత్వము. ప్రాతిపదికత్వముచే సుబ్లుక్. 'వస్త్రక్రీత'అను అకారాంత ప్రాతిపదికము సిద్ధించును. ఇపుడు ఈ సూత్రముచే 'ఙీష్'ప్రత్యయము 'వస్త్రక్రీతీ'.

కాని 'కర్తృకరణే కృతా బహులమ్'అను సూత్రమునందు (929) 'బహుల'గ్రహణముచే పై పరిభాష అనిత్యమని సూచింపబడుటచే కరణవాచకమునకు కృదంతప్రకృతికమగు సుబంతముతో సమాసము వచ్చెడు పక్షమున 'సుప్' వచ్చుటకు పూర్వమే, అంతరంగ మగుటచే అదంతత్వప్రయుక్త మగు 'టాప్'చేసిన పిమ్మట 'క్రీతా సు'ఇత్యాదులతో 'ధన టా'మొదలగు కరణవాచకములకు సమాసము చేసిన పక్షమున 'ధనక్రీతా'ఇత్యాదిప్రాతిపదికములు సిద్ధించును; ఇపుడివి ఆకారాంతము లగుటచే ఈ సూత్రముచే 'ఙీష్'వచ్చుటకు అవకాశము లేదు గాన 'ధనక్రీతా'అను టాబంతరూపములేయుండును. ఈ విధముగ పూర్వోక్త మగు పరిభాష కొన్ని స్థలములందు ప్రవర్తించుటచే 'వస్త్రక్రీతీ ఇత్యాదిరూపములును, కొన్ని స్థలములందు ప్రవర్తింపకుండుటచే "ధనక్రీతా ఇత్యాది రూపములును సిద్ధించును.

1264. స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్. 4.1 54.

అసంయోగోపధం ఉపసర్జనం యత్ స్వాఙ్గం తదన్తాద్ అదన్తాత్ ఙీష్ వా స్యాత్. కేశాన్ అతిక్రాన్తా అతికేశీ, అతికేశా. చన్ద్రముఖీ, చన్ద్రముఖా. అసంయోగోపధాత్కిమ్-సుగుల్ఫా. ఉపసర్జనాత్ కిమ్-సుశిఖా.

సంయోగోపధము కానిదియు, ఉపసర్జనమును అగు స్వాంగవాచకము అంతమునందు గల అకారాంతశబ్దముకంటె 'ఙీష్' వికల్పముగ వచ్చును

ఇచట 'స్వాంగ'పదమునకు 'తనయొక్క అవయవము'అనునర్థమును గాక-

"అద్రవం మూర్తిమత్స్వాఙ్గం ప్రాణిస్థమవికారజమ్-
అతత్స్థం తత్ర దృష్టం చ తేన చేత్తత్తథా యుతమ్"

అని భాష్యమునందు నిరుక్తములగు మూడువిధములైన పారిభాషికార్థములను గ్రహింపవలెను.

అద్రవం-ద్రవములేనిదియు, మూర్తిమత్-అవయవసంయోగము కలదియు, ప్రాణిస్థం-ప్రాణియందున్నదియు, అవికారజం-పిత్తాదివికారజన్యము కానిదియు అగునది మొదటి స్వాంగము. అతత్స్థం-అప్రాణియందున్నదై, తత్ర-అచట (ప్రాణియందు), దృష్టం చ-చూడబడినదియు అగునది రెండవ స్వాంగము. తత్-అచేతన మగు ప్రతిమాదికము, తథా-ప్రాణివలె, తేన-అస్తనాదికాకృతిగల అవయవవిశేషముతో యుతం చేత్-కూడినదైతే (ఇచట భాష్యమునందు "స్వాంగమప్రాణినోఽపి"అను పూరకవాక్యము చేర్చబడినది) తత్ = అది, అప్రాణినోఽపి = అప్రాణికికూడ, స్వాంగం = స్వాంగము. ఇట్టి త్రివిధస్వాంగవాచకముకంటె 'ఙీష్'వచ్చు నని యర్థము.

అతికేశీ-అతికేశాః-కేశాన్ అతిక్రాన్తా అని విగ్రహమున "అత్యాదయః క్రాన్తాద్యర్థేద్వితీయయా"అను వార్తికముచే నిర్ణీత మగు అర్థమునందు 'కుగతిప్రాదయః'అను సూత్రముచే (952) సమాసము చేయగా 'అతికేశ'అను అకారాంత ప్రాతిపదికము సిద్ధించినది. ఇచట ఉపసర్జన మగు 'కేశ'శబ్దము అసంయోగోపధ మై యున్నది గాన ప్రకృతసూత్రముచే వైకల్పిక మగు 'ఙీష్'చేసిన పక్షమున 'సుకేశీ అనియు, 'ఙీష్' రాని పక్షమున 'సుకేశా'అనియు రూపములు

సిద్ధించును. చన్ద్రముఖీ-చన్ద్రముఖా:-"చంద్ర ఇవ ముఖం యస్యాః సా" అను విగ్రహమున బహువ్రీహి సమాసము. ఇచట 'ముఖ'శబ్దము అసంయోగోపధము; ఉపసర్జనము నగు స్వాంగవాచకము గాన 'జీష్'వికల్పము- 'చంద్రముఖీ', 'చంద్రముఖా'.

స్వాంగవాచకశబ్దము సంయోగోపధము కాకూడదని చెప్పుటచే "శోభనౌ గుల్ఫౌ యాస్యాః సా" అనునర్థమునందు బహువ్రీహిసమాసమున స్వాంగవాచకమగు గుల్ఫశబ్దము స్వాంగవాచకమే యైనను, ఇది సంయోగోపధము గాన జీష్ రాదు.

అస్వాంగవాచకము ఉపసర్జనమై యుండవలెనని చెప్పుటచే "శోభనా చ సా శిఖా చ సుశిఖా"అనునపుడు 'శిఖా'శబ్దము స్వాంగవాచకమే యైనను ఉపసర్జనము కాదు గాన ఈ సూత్రము ప్రవర్తింపదు.

వాస్తవమున బాలమనోరమయందు చూపిన విధముగ ఇచట 'శిఖా'అను దానినే ప్రత్యుదాహరణముగా ఈయవలెను. 'సుశిఖా'అనునపుడు 'సు'అనుదానికి 'శిఖా'అను టాబంతశబ్దముతో సమాసముచేసినపిమ్మట, ఈ శబ్దము (సుశిఖా) అదంతము కాదు గాన ఈ సూత్రమునకు ప్రసక్తియే లేదు. అందుచే 'శిఖా' అనుదానినే ప్రత్యుదాహరణముగ ఈయవలెను. 'ఉపసర్జనాత్' అనునది లేకున్నచో అదంతత్వప్రయుక్త మగు 'టాప్'ను బాధించి ఈ సూత్రముచే జీష్ వచ్చియుండెడి దని అభిప్రాయము.

స్వాంగశబ్దమును నిర్వచించిన పై కారికయందు-'అద్రవం'అనుటచే 'సుస్వేదా'అనునపుడు స్వేదము ద్రవము గాన 'జీష్' రాదు. 'మూర్తిమత్' అనుటచే 'సుజ్ఞానా'అనునపుడు జ్ఞానము మూర్తము కాదు గాన జీష్ రాదు. 'ప్రాణిస్థం'అనుటచే 'సుముఖా శాలా'అనునపుడు ముఖము అప్రాణియగు శాలకు సంబంధించినది గాన-ప్రాణిస్థముకాదు గాన, 'జీష్' రాదు. 'అవికారజం' అనుటచే 'సుశోఫా' అను నపుడు శోఫ (శోభి) పిత్తాదివికారజన్యము గాన 'జీష్' రాదు.

'అతత్స్థం తత్ర దృష్టం చ'అనుటచే (సుకేశీ-సుకేశా వా రథ్యా) అనునపుడు కేశములు ఇపుడు అప్రాణి యగు రథ్యయందు ఉన్నను, ఒకప్పుడు అవి ప్రాణియందే ఉండెడి వగుటచే ఈ కేశములకు స్వాంగత్వ మున్నది గాన ఈ సూత్రము ప్రవర్తించి రూపద్వయము సిద్ధించును.

'తేన చేత్తత్తథా యుతం'అనుటచే "సుస్తనీ సుస్తనా వా ప్రతిమా" అను నపుడు స్తనములు ప్రాణియందు వలె ప్రాణిసదృశ మగు ప్రతిమయందు చూడబడుటచే స్తనశబ్దము స్వాంగవాచకమైనది. అందుచే ఈ సూత్రము ప్రవర్తించి రూపద్వయము సిద్ధించినది.

1265. న క్రోడాదిబహ్వచః. 4.1.56.

క్రోడాదేః, బహ్వచశ్చ స్వాఙ్గాత్ న ఙీష్. కల్యాణక్రోడా. ఆకృతిగణోఽయమ్. సుజఘనా.

క్రోడాదిశబ్దములకంటెను, బహ్వచ్కము లగు స్వాంగవాచకముల కంటెను 'ఙీష్' రాదు.

కల్యాణక్రోడా:-'కల్యాణీక్రోడా యస్యాః సా'అని విగ్రహము. "స్త్రియాః పుంవత్" ఇత్యాదిసూత్రముచే (971) కల్యాణీశబ్దమునకు పుంవద్భావము. ఇచట స్వాంగవాచక మగు క్రోడాశబ్దముకంటె, రావలసి యున్న 'ఙీష్' ఈ సూత్రముచే నిషేధింపబడినది. క్రోడాదిగణము ఆకృతిగణము. సుజఘనా:- 'జఘన'శబ్దము అదంతాసంయోగోపధస్వాంగవాచక మైనను బహ్వచ్క మగుటచే ఈ సూత్రముచే 'ఙీష్' నిషేధింపబడినది.

1266. నఖముఖాత్ సంజ్ఞాయామ్. 4.1.58.

న ఙీష్.

సంజ్ఞావాచకము లగునపుడు 'నఖ' 'ముఖ'శబ్దములకంటె 'స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్'అను సూత్రముచే విహిత మగు 'ఙీష్' రాదు.

శూర్పణఖా:-'శూర్పాణీవ నఖాని యస్యాః సా'అను విగ్రహమున నఖశబ్దముకంటె రావలసి యున్న 'ఙీష్' ఈ సూత్రముచే నిషేధింపబడినది. అదంతత్వప్రయుక్త మగు 'టాప్' వచ్చి 'శూర్పనఖా' అని యుండగా :

1267. పూర్వపదాత్సంజ్ఞాయామగః. 8.4.3.

పూర్వపదస్థాత్ నిమిత్తాత్ పరస్య నస్య ణః స్యాత్ సంజ్ఞాయామ్; న తు గకారవ్యవధానే. శూర్పణఖా. గౌరముఖా. సంజ్ఞాయాం కిమ్_తామ్రముఖీ_కన్యా.

'రషాభ్యాం నో ణః సమానపదే'నుండి 'రషాభ్యాం', 'నః', 'ణః' 'అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేపి'అను సూత్రము అనువర్తించును. పూర్వ

పదమునం దున్న రేఫషకారములకంటె పరమైన నకారమునకు, (అట్, కుప్వాఙ్, నుమ్‌లతో వ్యవధాన మున్నను) ఆ పదము సంజ్ఞారూప మగునపుడు, ణత్వము వచ్చును; గకారముతో వ్యవధాన మున్నపుడు మాత్రము రాదు. ఈ సూత్రముచే నకారమునకు ణత్వము 'శూర్పణఖా'. గౌరముఖా:—'గౌరం ముఖం యస్యాః సా'అని విగ్రహము. ఒక స్త్రీకి నామధేయము. ఇచట గూడ "స్వాంగాచ్చోప సర్జనాదసంయోగోపధాత్"అను సూత్రముచే (1264) రావలసి యున్న 'ఙీష్' నిషిద్ధ మగుటచే 'గౌరముఖా' అను రూపము మాత్రము సిద్ధించినది.

ఆ పదము సంజ్ఞారూపమై యుండవలె నని చెప్పుటచే 'తామ్రం ముఖం యస్యాః సా తామ్రముఖీ కన్యా'అనునపుడు ఈ 'తామ్రముఖీ'శబ్దము నామవాచకముకాదు గాన నిషేధము ప్రవర్తింపదు. ఙీష్వికల్పముచే 'తామ్రముఖీ' 'తామ్రముఖా'అను రూపద్వయము సిద్ధించును.

1268. జాతేరస్త్రీవిషయాదయోపధాత్. 4-1-63.

జాతివాచి యత్ న చ స్త్రియాం నియతం అయోపధం, తతః స్త్రియాం 'ఙీష్' స్యాత్. తటీ. వృషలీ. కఠీ. బహ్వృచీ. జాతేః కిమ్-ముణ్డా. అస్త్రీవిషయాత్ కిమ్-బలాకా. అయోపధాత్ కిమ్-క్షత్రియా

నిత్యస్త్రీలింగము కానిదియు, యకారోపధము కానిదియు అగు జాతివాచక శబ్దముకంటె స్త్రీత్వమునందు 'ఙీష్'వచ్చును. ఇచట 'జాతి' శబ్దముచే—

"'ఆకృతిగ్రహణా జాతిః' 'లింగానాం చ న సర్వభాక్,
'సకృదాఖ్యాతనిర్గ్రాహ్యా' 'గోత్రం చ చరణైః సహ'"

అను కారికయందు భాష్యకారునిచే సంగృహీత మగు త్రివిధజాతి గ్రహింపబడును.

ఆకృతి—అనగా అవయవసన్నివేశము—, గ్రహణసాధనముగా కలది—అనగా అవయవసన్నివేశముచే గ్రహింపవగినది, మొదటివిధమైన జాతి. అనేక ఘటాదివ్యక్తులయందు వాటి ఆకారవిశేషముచే గ్రహింపదగిన ఘటత్వాదిజాతి ఇందుల కుదాహరణము. 'తటీ' అనునది ఈ జాతికి ఉదాహరణము. తట మనగా జలసమీపమున నున్న ఆకృతివిశేషము. అందుచే తటత్వము. ఆకృతి విశేషవ్యంగ్యము గాన జాతి యైనది. 'తట'శబ్దము అట్టిజాతిని బోధించు

అనియతస్త్రీలింగ మగు. యకారోపధము కాని శబ్దముగాన ఈ సూత్రముచే, స్త్రీత్వమునందు 'ఙీష్'వచ్చి 'తటీ'అను రూపము సిద్ధించినది.

లింగానాం–లింగములలో. న సర్వభాక్–అన్నింటిని పొందునదికానిదియు, అనగా లింగత్రయము కలది కానిదియు సకృదాఖ్యాతనిర్గ్రాహ్యా–ఒక్కమారు చెప్పుటచే, ఇతరులందు గూడ గ్రహింప శక్య మైనది రెండవవిధ మగు జాతి. 'వృషలీ'అనునది ఇందులకు ఉదాహరణము. శూద్రస్త్రీయని యర్థము. వృషల శబ్దము నపుంసకమునందు ప్రయుక్తము కాదు గాన మూడులింగములు కలది కాదు. ఒకనిని చూపి ఈతడు శూద్రుడు అని చెప్పినచో అతని పుత్రపౌత్రాదు లందు గూడ శూద్రత్వము గ్రహింపబడును. అందుచే వృషలత్వము జాతి. అట్టి జాతివాచక మగు వృషలశబ్దముకంటె స్త్రీత్వమునందు ఈ సూత్రముచేత 'ఙీష్' వచ్చి 'వృషలీ'అను రూపము సిద్ధించినది. వృషలశబ్దము పుంలింగము నందు గూడ ప్రయుక్త మగును గాన అస్త్రీవిషయము; ఇది యోపదము కూడ కాదు.

చరణైః సహ–వేదశాఖాధ్యేతలతో కూడ, గోత్రం చ అపత్యము కూడ, అనగా వేదశాఖాధ్యేతృవాచకము, అపత్యవాచకము గూడ–జాతివాచకము. గోత్రమునకు 'ఔపగవీ'ఇత్యాదులు ఉదాహరణము. 'ఉపగోః అపత్యం స్త్రీ'అను నర్థమునందు 'తస్యాపత్యమ్'అను సూత్రముచే అణ్ ప్రత్యయము. ఆదివృద్ధ్యాదు లచే సిద్ధించిన 'ఔపగవ'శబ్దముకంటె 'టిడ్ఢాణఞ్'అను సూత్రముచే (1004) రావలసి యున్న 'ఙీప్'ను, బాధించి, పర మగుటచే, 'ఙీష్' వచ్చును. కఠీ:– 'కఠేన ప్రోక్తం అధీయానా' కఠశాఖాధ్యయనము చేయునది–అను నర్థమునందు 'కలాపివైశంపాయనాన్తేవాసిభ్యశ్చ'అను సూత్రముచే 'ణిని' ప్రత్యయము. దానికి 'కఠచరకాల్లుక్'అను సూత్రముచే లుక్–'కఠ'శబ్దము సిద్ధించినది. ఇపు డిది చరణవాచకము గాన ప్రకృతసూత్రముచే స్త్రీత్వవివక్షయందు 'ఙీష్'వచ్చి 'కఠీ' అను రూపము సిద్ధించినది.

బహ్వృచీ:–ఇది చరణవాచకమునకు మరి యొక యుదాహరణము. 'బహవః ఋచః అధ్యేయాః యస్యాః'అని విగ్రహము. "ఋక్పూరబ్ధూః పథా మానక్షే"అను సూత్రముచే (993) సమాసాన్తముగ అకారము. ప్రకృత సూత్రముచే 'ఙీష్'ప్రత్యయము.

"పురా కల్పే తు నారీణాం మౌంజీబంధనమిష్యతే
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా"

అను యమాదిస్మృతిచే పూర్వము స్త్రీలకు కూడ ఉపనయన, గాయత్ర్యుపదేశ వేదాధ్యయనము లుండెడి వని తెలియుచున్నది.

జాతివాచకశబ్దమునకు 'ఙీష్' వచ్చు నని చెప్పుటచే 'ముండా'అనునది జాతివాచకము కాదు గాన 'ఙీష్'రాలేదు. అదంతత్వప్రయుక్తమగు 'టాప్' వచ్చినది-ముండా. ముండితశిరస్కురాలు.

బలాకా:-పక్షివిశేషవాచక మగు బలాకాశబ్దము నిత్యస్త్రీలింగము గాన "అస్త్రీవిషయాత్"అని చెప్పుటచే ఇచట 'ఙీష్'రాలేదు. క్షత్రియా:-ఇది జాతివాచక మైనను యకారోపధ మగుటచే 'అయోపధాత్' అను నిషేధముచే 'ఙీష్'రాలేదు.

'అయోపధాత్' అను నిషేధము యకారము ఉపధగా గల అన్ని శబ్దముల విషయమునను ప్రవర్తించుచుండ కొన్ని శబ్దముల విషయమున ఏతన్నిషేధవ్యావృత్తికై వార్తికము చెప్పబడుచున్నది :-

వా యోపధప్రతిషేధే హయగవయముకయమనుష్య
మత్స్యానామప్రతిషేధః.

హయీ. గవయీ. ముకయీ. 'హలస్తద్ధితస్య'-మనుషీ.

యోపధప్రతిషేధసందర్భమునందు హయ, గవయ, ముకయ, మనుష్య శబ్దములకు నిషేధాభావము చెప్పదగినది. అనగా హయాదిశబ్దములు యకారోపధము లైనను 'ఙీష్'వచ్చు నని యర్థము. ఈ వార్తికముచే పశుజాతివిశేష వాచకము లగు హయాదిశబ్దములకు 'ఙీష్' వచ్చి 'హయీ' 'గవయీ' 'ముకయీ'అను రూపములు సిద్ధించినవి.

మనుషీ:-మనుష్యశబ్దముకంటె ఈ వార్తికముచే ఙీష్ ప్రత్యయము. 'మనుష్య ఈ'అని యుండగా 'యస్యేతిచ'అను సూత్రముచే (236) అంత్యాకారమునకు లోపము. 'హలస్తద్ధితస్య'అను సూత్రముచే (1252) యకారమునకు లోపము-'మనుషీ'అను రూపము సిద్ధించినది. 'మనుష్య'శబ్దమునందలి యకారము "మనోర్జాతావఞ్ యతౌ షుక్ చ"అను సూత్రముచే విహితమగు 'యత్' రూపతద్ధితావయవము.

వా. మత్స్యస్య ఙ్యామ్.

యలోపః. మత్సీ.

'మత్స్య'శబ్దావయవ మగు యకారమునకు, 'ఙీ' పరమగునపుడు లోపము వచ్చును.

మత్సీ:-'మత్స్య'శబ్దముకంటె పూర్వవార్తికముచే 'ఙీష్' ప్రత్యయము చేసిన పిమ్మట 'మత్స్య ఈ'అని యుండగా అంత్యాకారమునకు లోపము- 'మత్స్య ఈ'అని యుండగా ప్రకృతవార్తికముచే యకారము లోపించి 'మత్సీ' అను రూపము సిద్ధించినది.

1269. ఇతో మనుష్యజాతేః. 4.1.65.

ఙీష్. దాక్షీ.

మనుష్యజాతివాచక మగు ఇదన్తశబ్దముకంటె, స్త్రీత్వమునందు 'ఙీష్' వచ్చును.

స్త్రీప్రత్యయవిధాయకసూత్రము లన్నిటియందును 'అజాద్యతష్టాప్'నుండి 'అతః' అనువర్తించును గాన 'జాతేరస్త్రీవిషయాదయోపధాత్'అను సూత్రము ఇదంతశబ్దములవిషయమున ప్రవర్తింపదు. అందుచే ఈః సూత్రము చెప్ప బడినది.

దాక్షీ:-'దక్షస్య అపత్యం స్త్రీ'అను నర్థమున 'దక్ష'శబ్దముకంటె 'అత ఇఞ్'అను సూత్రముచే (1014) ఇఞ్ ప్రత్యయము. 'యస్యేతిచ'అను సూత్రముచే (236) అకారలోపము; ఆదివృద్ధి. 'దాక్షి'అని యుండగా స్త్రీత్వమున ఈ సూత్రముచే 'ఙీష్'. ఇకారలోపము (సూ. 216)-'దాక్షీ'.

1270. ఊఙుతః. 4.1.66.

ఉదన్తాదయోపధాత్ మనుష్యజాతివాచినః స్త్రియాం ఊఙ్ స్యాత్. కురూః. అయోపధాత్ కిమ్—అధ్వర్యుః-బ్రాహ్మణీ.

పూర్వసూత్రమునుండి 'మనుష్యజాతేః'అనుపదము, 'జాతేరస్త్రీవిషయాదయోపధాత్'నుండి "అయోపధాత్", 'స్త్రియామ్'అను అధికారసూత్రము అనువర్తించును. మనుష్యజాతివాచకమును, యకారోపధము కానిదియు నగు, ఉదంత శబ్దముకంటె స్త్రీత్వమునందు ఊఙ్ వచ్చును.

కురూః-"కురుక్షేత్రస్య రాజా కురుః; తస్యాపత్యం స్త్రీ"అను నర్థము

నందు 'కురునాదిభ్యో ణ్యః' అను సూత్రముచే కురుశబ్దముకంటె 'ణ్య' ప్రత్యయము. దానికి "స్త్రియామవన్తికున్తికురుభ్యశ్చ" అను సూత్రముచే లుక్. ఈ 'కురు' శబ్దము 'గోత్రం చ చరణైః సహ' అను కారికాంశముచే జాతివాచకము గాన ఈ సూత్రముచే 'ఊఙ్' ప్రత్యయము. సవర్ణదీర్ఘము-'కురూః' అను ప్రథమైకవచన రూపము సిద్ధించును.

'అయోపధాత్' అనుటచే యకారోప మగు 'అధ్వర్యు' శబ్దముకంటె 'ఊఙ్' రాదు. 'అధ్వర్యు' శబ్దమునకు అధ్వర్యుశాఖాధ్యయనము చేయు స్త్రీ యని యర్థము. "గోత్రం చ చరణైః సహ" అను వాక్యముచే, ఇది చరణవాచకము గాన జాతివాచక మైనది.

1271. పఙ్గోశ్చ. 4-1-68.

పఙ్గూః.

ఉకారాంత మగు 'పఙ్గు' శబ్దముకంటె కూడ స్త్రీత్వమునందు 'ఊఙ్' వచ్చును. ఇది జాతివాచకము కాకుండుటచే పూర్వసూత్రము ప్రవర్తింపదు గాన ఈ సూత్రము చెప్పబడినది.

పఙ్గూః (కుంటిది)- 'పంగు' శబ్దముకంటె ఈ సూత్రముచే 'ఊఙ్' ప్రత్యయము; సవర్ణదీర్ఘము.

వా. శ్వశురస్యోకారాకారలోపశ్చ.

శ్వశురశబ్దముకంటె 'ఊఙ్' ప్రత్యయము, రేఫోత్తరవర్తి యగు అకారమునకును, ఉకారమునకును లోపము గూడ వచ్చును.

శ్వశ్రూః:-'శ్వశురస్య స్త్రీ' అను నర్థమునందు 'శ్వశుర' శబ్దముకంటె 'పుంయోగాదాఖ్యాయామ్' అను సూత్రముచే (1260) 'ఙీష్' రావలసి యుండగా దానిని బాధించి ఈ వార్తికముచే 'ఊఙ్' ప్రత్యయము; అకార, ఉకారములకు లోపము 'శ్వశ్రూః'.

1272. ఊరూత్తరపదాదౌపమ్యే. 4.1.69.

ఉపమానవాచి పూర్వపదం ఊరూత్తరపదం యత్ ప్రాతిపదికం తస్మాత్ 'ఊఙ్ స్యాత్'. కరభోరూః,

'ఉపమీయతే అనేన' అను వ్యుత్పత్తిచే 'ఉపమా' శబ్దమునకు ఉపమానము అని యర్థము. ఉపమైవ ఔపమ్యమ్. గుణవచనేత్యాది సూత్రముక్రిం

(5.1.124) పఠితమగు 'చతుర్వర్ణాదీనాం స్వార్థేఉపసంఖ్యానమ్' అనువార్తికముచే స్వార్థమునందు 'ష్యఞ్'ప్రత్యయము. ఉత్తరపద మనుటచే పూర్వపద మనునది ఆక్షిప్త మైనది. ఆ'పూర్వపద'ముతో "ఔపమ్య" అనునది అన్వయించును: ఉపమానవాచకము పూర్వపదముగను, ఊరుశబ్దము ఉత్తరపదము గను గల ప్రాతిపదికముకంటె, స్త్రీత్వార్థమునందు 'ఊఙ్'వచ్చును.

కరభోరూః-'కరభావివ ఊరూ యస్యాః సా'అని విగ్రహము. ఇచట ఉపమానవాచక మగు కరభశబ్దము పూర్వపదముగను, ఊరుశబ్దము ఉత్తర పదముగను గల 'కరభోరు'అను ప్రాతిపదికముకంటె ఈ సూత్రముచే ఊఙ్- 'కరభోరూః'. ముంజేయి మొదలు చిటికిన వ్రేలి మూలమువరకును గల అరచేతికి వెలుపల నున్న భాగమునకు కరభ మనిపేరు. దానివలె పైనుండి క్రిందకు క్రమముగ కుదించుకొనుచు వచ్చిన ఊరువులు గలది అని యర్థము.

1273. సంహితశఫలక్షణవామాదేశ్చ. 4.1.170.

అనౌపమ్యార్థం సూత్రమ్. సంహితోరూః, శఫోరూః. లక్షణోరూః, వామోరూః.

సంహిత, శఫ, లక్షణ, వామశబ్దములు ఆదియందు గల ఊరుశబ్దము కంటె గూడ స్త్రీత్వమునందు ఊఙ్ వచ్చును. సంహితాదిశబ్దములు ఉపమాన వాచకములు కాకుండుటచే పూర్వసూత్రము ప్రవర్తింపదు గాన ఈ సూత్రము చెప్పబడినది.

సంహితోరూః-'సంహితౌ ఊరూ యస్యాః సా' 'సంహితోరు'శబ్దము కంటె ప్రకృతసూత్రముచే 'ఊఙ్'. కలసిన ఊరువులు కలదని యర్థము. శఫోరూః:-'శఫౌ ఊరూ యస్యాః' అనునర్థమున 'శఫోరు'శబ్దముకంటె ఈ సూత్రముచే ఊఙ్. డెక్కలవలె దగ్గరగ కలసి యుండుటచే శఫశబ్దము ఊరువుల విషయమున గౌణార్థమునందు ప్రయోగింపబడినది. లక్షణోరూః:- 'లక్షణౌ ఊరూ యస్యాః'. 'లక్షణ'శబ్దముకంటె 'అర్శఆదిభ్యోచ్'అను సూత్రముచే (1 94) 'అచ్ ప్రత్యయము చేయుటచే మంచి లక్షణములు కలవి అని యర్థము 'లక్షణోరు'శబ్దముకంటె ప్రకృతసూత్రముచే 'ఊఙ్'. వామోరూః- 'వామౌ-సున్దరౌ, ఊరూ యస్యాః'. వామోరుశబ్దముకంటె ఊఙ్ప్రత్యయము.

1274. శార్ఙ్గరవాద్యఞో ఙీన్. 4.1.73.

శార్ఙ్గరవాదేః, అఞో యోఽకారః, తదన్తాత్ జాతివాచినః ఙీన్ స్యాత్. శార్ఙ్గరవీ. బైదీ. బ్రాహ్మణీ.

'అజాద్యతష్టాప్' 'జాతేరస్త్రీవిషయాదయోపధాత్'నుండి 'అతః' 'జాతేః' అనువర్తించును. శార్ఙ్గరవాదిశబ్దములకంటెను, అఞ్ప్రత్యయసంబంధి యగు అకారము అంతమునందు గల జాతివాచకములకంటెను 'ఙీన్'ప్రత్యయము వచ్చును.

శార్ఙ్గరవీ:-'శృంగరోః అపత్యం స్త్రీ'అను నర్థమునందు అణ్ ప్రత్యయము; ఆదివృద్ధి; 'ఓర్గుణః' (1005), అవాదేశము. "గోత్రం చ చరణైః సహ"అను వాక్యము ననుసరించి జాతిత్వ మున్నది గాన జాతిలక్షణ 'ఙీష్' రావలసి యుండగా ఈ సూత్రముచే ఙీన్ప్రత్యయము. స్వరమునందు విశేషము. బైదీ:-'బిదస్య అపత్యం స్త్రీ'అను నర్థమునందు "అనృష్యానన్తర్యే బిదాదిభ్యోఽఞ్"అను సూత్రముచే (1016) 'అఞ్'ప్రత్యయము. ఆదివృద్ధి. పైవలె జాతిలక్షణ 'ఙీష్'రావలసి యుండ ఈ సూత్రముచే ఙీన్. బ్రాహ్మణీ:-'బ్రాహ్మణస్య అపత్యం స్త్రీ'అను నర్థమున అణ్ప్రత్యయము. జాతిలక్షణఙీష్ను బాధించి ఈ సూత్రముచే ఙీన్. 'బ్రాహ్మణ'శబ్దము శార్ఙ్గరవాదిగణములోనిది.

గ. సూ. నృనరయోర్వృద్ధిశ్చ.

నారీ.

'నృ' 'నర'శబ్దములకంటె స్త్రీత్వమునందు 'ఙీన్' ప్రత్యయము వృద్ధియు వచ్చును 'నృ'శబ్దము ఋకారాంత మగుటచే 'ఋన్నేభ్యో ఙీప్'అను సూత్రముచే (32) 'ఙీప్' రావలసి యున్నది. నరశబ్దముకంటె జాతిలక్షణ మగు 'ఙీష్' రావలసి యున్నది. వాటిని బాధించి ఈ గణసూత్రముచే 'ఙీన్' వచ్చును. నారీ:-నృశబ్దముకంటె ఙీన్ ప్రత్యయము. ఋకారమునకు వృద్ధి 'నారీ'. నారీ:-నరశబ్దముకంటె 'ఙీన్' ప్రత్యయము. 'నర ఈ'అని యుండగా 'యస్యేతిచ'అను సూత్రముచే (236) అకారలోపము. నకారోత్తరవర్తి యగు అకారమునకు వృద్ధి-'నారీ'.

1275. యూన స్తిః. 4.1.77.

యువన్‌శబ్దాత్ స్త్రియాం 'తి'ప్రత్యయః స్యాత్. **యువతిః.**

ఇతి స్త్రీప్రత్యయాః.

యువన్‌శబ్దముకంటె స్త్రీత్వమునందు 'తి' ప్రత్యయము వచ్చును.

యువతిః-'యువన్'శబ్దముకంటె స్త్రీత్వమునందు ప్రకృతసూత్రముచే 'తి'-ప్రత్యయము. 'యువన్ తి'అని యుండగా "స్వాదిష్వసర్వనామస్థానే"అను సూత్రముచే (164) పదసంజ్ఞ యున్నది గాన "న లోపః ప్రాతిపదికాన్తస్య" సూత్రముచే (180) నకారము లోపించి 'యువతి'శబ్దము సిద్ధించినది. ఈకారాంత మగు 'యువతీ'శబ్దము "యుమిశ్రణామిశ్రణయోః"అను ధాతువుకంటె శతృప్రత్యయము చేయుటచే సిద్ధించిన 'యువత్'శబ్దముకంటె 'ఉగితశ్చ'అను సూత్రముచే (1249) జీష్ చేయగా సిద్ధించినది.

శాస్త్రాన్తరే ప్రవిష్టానాం బాలానాం చోపకారికా
కృతా వరదరాజేన లఘుసిద్ధాన్తకౌముదీ.

ఇతి శ్రీవిద్వద్వరవరదరాజకృతా
లఘుసిద్ధాన్తకౌముదీ
సమాప్తా.

న్యాయాదిశాస్త్రాంతరవ్యాసంగముచేయువారికిని, వ్యాకరణాధ్యయనమున ప్రారంభదశలో నుండువారికిని ఉపకరించెడు లఘుసిద్ధాంతకౌముది వరదరాజ పండితునిచే రచింపబడినది.

వరదరాజవిద్వద్వరునిచే రచిత మగు లఘుసిద్ధాంతకౌముది
సమాప్తము.

పరీక్షామున్తితీర్షూణాం ఆంధ్రభాషావిదాం ముదే
కృతా శ్రీరామచంద్రేణ వ్యాఖ్యేయం పితురాశిషా.
యత్కృపాలేశ సంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే. 18.1.1951.

శుభం భూయాత్
శ్రీః శ్రీః శ్రీః

# సూత్రసూచీ

ఖ



గ

శ

## హ

# వార్తికసూచీ

# ధాతుసూచీ

| ధాతువు | పుట |
|---|---|

ఇ తి శ మ్